(దణ్డ+అథకః) అనుచోట సవర్ణదీర్ఘము సిద్ధమగును. ప్రక్రియయందును సంవృతమే యయినచో, అకారాకారములు ప్రయత్నభేదముచే సవర్ణములుగానందున నిచట సవర్ణదీర్ఘము రాకపోవును.

* 12. అఅ ఇతి. 8-4-68 అ, అ, ఇతి.

వివృతమనూద్య సంవృతోఽనేన విధీయతే। అస్య చాష్టాధ్యాయీం సంపూర్ణాం ప్రత్యసిద్ధత్వాచ్ఛాస్త్రదృష్ట్యా వివృతత్వమస్త్యేవ। తథా చ సూత్రమ్॥

12. సూత్రమున మొదటి అకారము వివృతము, రెండవది సంవృతము. అ, అ అను నీరెండును లుప్తవిభక్తికములు. మొదటిది షష్ఠ్యన్తము. రెండవది ప్రథమాన్తము. వివృతాకారస్థానమందు సంవృతాకార మీసూత్రముచే విధింపబడుచున్నదని యర్థము. ఇతి శబ్దము శాస్త్రముయొక్క సమాప్తిని సూచించును. ఈసూత్రమష్టాధ్యాయియొక్క తుదినున్నది. కావున సంపూర్ణశాస్త్రదృష్టిచే నీ సూత్రము "పూర్వత్రాసిద్ధ" మను సూత్రమువలన నసిద్ధమగును. కావున నేదేని శాస్త్రీయకార్యము చేయునపుడు హ్రస్వాకారము వివృతమే యగును. కార్యము ప్రవృత్తమయినపిదప సంవృతముగనే యుండును. పూర్వశాస్త్రము ప్రవర్తించునపుడు పరశాస్త్రమున కసిద్ధత్వమును ప్రతిపాదించు సూత్రమున కిచటనే వ్యాఖ్యానము చేయబడును.

* 13. పూర్వత్రాసిద్ధమ్ 8-2-1. పూర్వత్ర, అసిద్ధమ్.

అధికారోఽయమ్। తేన సపాదసప్తాధ్యాయీం ప్రతి త్రిపాద్యసిద్ధా। త్రిపాద్యామపి పూర్వం ప్రతిపరం శాస్త్రమసిద్ధమ్। బాహ్యప్రయత్నస్త్వేకాదశధా। వివారస్సంవారశ్శ్వాసో నాదో ఘోషోఽఘోషోఽల్పప్రాణో మహాప్రాణ ఉదాత్తోఽనుదాత్తస్స్వరితశ్చేతి॥ శ్లో॥ ఖయాం యమాః ఖయః ≍క ≍పౌ విసర్గశ్శర ఏవ చ। ఏతే శ్వాసానుప్రదానా అఘోషాశ్చ వివృణ్వతే। కణ్ఠమన్యే తు ఘోషాస్స్యుస్సంవృతా నాదభాగినః। అయుగ్మా వర్గయమగా యణశ్చాల్పాసవస్స్మృతాః॥ వర్గేష్వాద్యానాం చతుర్ణాం పఞ్చమే పరే మధ్యే యమో నామ పూర్వసదృశో వర్ణః ప్రాతిశాఖ్యే ప్రసిద్ధః। పలిక్క్నీ। చఖ్ఖ్నతుః। అగ్గ్నిః। ఘ్ఘ్నన్తీత్యత్ర క్రమేణ కఖగఘేభ్యః పరే

తత్సదృశా ఏవ యమాః। తత్ర వర్గాణాం ప్రథమద్వితీయాః ఖయస్తథా తేషామేవ యమాః। జిహ్వామూలీయోపధ్మానీయౌ, విసర్గశ్శషసాశ్చేత్యేతేషాం వివారశ్శ్వాసోఽఘోషశ్చ। అన్యేషాం సంవారో నాదో ఘోషశ్చ। వర్గాణాం ప్రథమతృతీయపఞ్చమాః ప్రథమతృతీయయమౌ, యరలవాశ్చాల్పప్రాణాః। అన్యే మహాప్రాణా ఇత్యర్థః। బాహ్యప్రయత్నాశ్చ యద్యపి సవర్ణసంజ్ఞాయామనుపయుక్తాస్తథాప్యాన్తరతమ్యపరీక్షాయాముపయోక్ష్యన్త ఇతి బోధ్యమ్। కాదయో మావసానాః స్పర్శాః। యరలవా అన్తస్థాః। శషసహా ఊష్మాణః। అచః స్వరాః। ≍క ≍ప ఇతి కపాభ్యాం ప్రాగర్ధవిసర్గసదృశౌ జిహ్వామూలీయోపధ్మానీయౌ, అం, అః, ఇత్యచః పరావనుస్వారవిసర్గౌ। ఇతి స్థానప్రయత్నవివేకః॥ వా॥ ఋౣవర్ణయోర్మిథస్సావర్ణ్యం వాచ్యమ్। అకారహకారయోః ఇకారశకారయోః ఋకారషకారయోః ఌకారసకారయోశ్చ సావర్ణ్యే ప్రాప్తే॥

13. ఇది అధికారసూత్రము. (లక్ష్యమును సంస్కరించువాక్యార్థమును స్వస్థలమున బోధింపక, తనకు తరువాతనుండు విధిసూత్రములతో గలసి యర్థము బోధించునది.) కావుననే, సపాదసప్తాధ్యాయిని (ఏడధ్యాయములు, ఎనిమిదవయధ్యాయములోని ప్రథమపాదము) గురించి త్రిపాదిన్ని (ఎనిమిదవయధ్యాయమున ద్వితీయాదిపాదములు మూడు) త్రిపాదిలోగూడ పూర్వశాస్త్రమునుగురించి పరశాస్త్రము అసిద్ధమగుట సంభవించును.

బాహ్యప్రయత్నము పదునొకండు విధములు : 1. వివారము, 2. సంవారము, 3. శ్వాసము, 4. నాదము, 5. అఘోషము, 6. ఘోషము, 7. అల్పప్రాణము, 8. మహాప్రాణము, 9. ఉదాత్తము, 10. అనుదాత్తము, 11. స్వరితము. "ఖయాంయమాః" అను శ్లోకమున శ్వాసానుప్రదానాః అనుచోట అనుప్రదాన మను బాహ్యప్రయత్నము, శ్వాస మను బాహ్యప్రయత్నము గలవని యర్థము. ద్వితీయశ్లోకమున "కణ్ఠ" మనునది ప్రథమశ్లోకములోని "వివృణ్వతే" యను క్రియతో నన్వయించును. కణ్ఠము (గళవివరము) ను వికసింపజేయును, అనగా వివారప్రయత్నము గలవనియర్థము. శ్లోకములకు గ్రన్థకారకృతవివరణము

ననుసరించి యర్థము వ్రాయబడును. స్పర్శవర్ణము లయిదువర్గములుగ విభజింపబడెను. కవర్గ చవర్గ టవర్గ తవర్గ పవర్గములు—వర్గమున కయిదు వర్ణములు. మాతృకాపాఠము ననుసరించి కకారము మొదలు వరుసగ వీనిని గ్రహించునది. క ఖ గ ఘ ఙ—ఈ వర్గములయొక్క మొదటి నాలువర్ణముల కయిదవవర్ణము పరమగునపుడు మధ్యను పూర్వవర్ణముతో సదృశమగువర్ణము ప్రాతిశాఖ్యయందు ప్రసిద్ధమయియున్నది. దీనికి యామ మని పేరు. ఉదా: పలిక్‌క్నీః। చఖ్‌ఖ్నతుః। అగ్‌గ్నిః। ఘ్ఘ్నన్తి. ఇచట క్రమముగ క, ఖ, గ, ఘ లకంటె పరములయి, పూర్వసదృశములగునవియే యమలు. వర్గముల ప్రథమ ద్వితీయ తృతీయ వర్ణములు ఖయ్యులనబడును. ఖయ్యులు, వీనియొక్క యమలు, జిహ్వామూలీయోపధ్మానీయములు, విసర్గము, శషసలు వీనికి వివారశ్వాసాఘోషములు. మిగిలినవర్ణములకనగా హశ్ప్రత్యాహారములోని వర్ణములు, వీని యమలు, అనుస్వారము వీనికి సంవారనాదఘోషములు. వర్గములయొక్క ప్రథమతృతీయపఞ్చమవర్ణములు, ప్రథమతృతీయముల యమలు, యరలవలు ఇవి యల్పప్రాణప్రయత్నము గలవి. వర్గముల ద్వితీయ చతుర్థవర్ణములు, వీని యమలు, శషసహలు మహాప్రాణప్రయత్నము గలవి. మూలమున "ఆస్యేషా" మనుచోట నస్యశబ్దమునకు అచ్చులుగూడ నర్థము. "యరలవాశ్చ" యనుచోట చ శబ్దమున కచ్చు లర్థము. కావున నచ్చులకు సంవారనాదఘోషాల్పప్రాణప్రయత్నములు సిద్ధించును. అచ్చులకు నీ ప్రయత్నము లున్నవనుటలో భాష్యమే మానము. సవర్ణసంజ్ఞావిధాయకసూత్రమున నాభ్యన్తరప్రయత్నములకే గ్రహణమనుటచే నీ బాహ్యప్రయత్నములు సవర్ణసంజ్ఞయం దుపయోగింపవు. కాని ఆన్తరతమ్యపరీక్షయందుపయోగింపగలవు. ఒక వర్ణముయొక్క స్థానమందు, సమానమైనస్థానము అభ్యన్తరప్రయత్నముగల నాలుగైదువర్ణములు ప్రసక్తములైనపు డేది మిక్కిలి సదృశమైన దను విచారణ, ఆన్తరతమ్యపరీక్ష యగును. 'ఘోషవతో నాదవతో మహాప్రాణస్య సంవృతకణ్ఠస్యహాస్యతాదృశో వర్గచతుర్థ ఏవాదేశః'. ఈరీతిగ నచటచట మూలముననే ఆన్తరతమ్యపరీక్ష స్ఫుటముగా గలదు. లోకప్రసిద్ధమగు మాతృకాపాఠమున, కకారమాదియందు, మకారమన్తమందు గల వర్ణములు(అయిదువర్గములు) స్పర్శములనబడును. యరలవలన్తస్థలు. శషసహలు ఊష్మలు. అచ్చులు స్వరములనబడును. (ఉదాత్తాదులచే స్వయముగ ప్రకాశించునవి) కఖలకు పూర్వమర్ధవిసర్గముతో సదృశమగు వర్ణమునకు జిహ్వామూలీయమనియు (ᳵక ᳵఖ), ప ఫ లకు పూర్వమందున్న నట్టివర్ణమునకు నుపధ్మానీయ మనియు (ᳶప ᳶఫ) ను పేరు. వీని కర్ధవిసర్గసాదృశ్య ముచ్చారణమందు, వ్రాతయందును తెలియనగును. అచ్చుకంటె పరమగు పూర్ణబిన్దువు (ం) అనుస్వారము. బిన్దుద్వయము (ః) విసర్గము నగును. ఉదా. అం, అః, ఇం, ఇః. ఇది స్థాన ప్రయత్నవివేకము.

బాహ్యాభ్యన్తరప్రయత్నములుగల వర్ణములను తెలుపు పట్టిక

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| అ-ప్ర. | స్పృష్టము | | ఈషత్ స్పృష్టము | వివృతము | | సంవృతము |
| | స్పర్శలు | | అన్తస్థలు | ఊష్మలు — స్వరములు | | హ్రస్వాకారము |
| | క......ఖ<br>చ......ఛ<br>ట......ఠ<br>త......థ<br>ప......ఫ | గ ఙ ... ఘ<br>జ ఞ ... ఝ<br>డ ణ ... ఢ<br>ద న ... ధ<br>బ మ ... భ | య<br>ర<br>ల<br>వ | శ ...<br>ష ...<br>స ...<br>హ ... | అచ్చులు<br>...<br>...<br>... | ప్రయోగమందలి<br>అకారము<br>— అ — |
| | అ-ప్రా. \| మ. ప్రా. | అ-ప్రా. \| మ-ప్రా. | అ- ప్రా. | మ- ప్రా. | అ- ప్రా. | అ- ప్రా. |
| బా. ప్ర. | వివారము<br>శ్వాసము<br>అఘోషము | సంవారము<br>నాదము<br>ఘోషము | సంవారము<br>నాదము<br>ఘోషము | వివారము<br>శ్వాసము<br>అఘోషము | సంవారము<br>నాదము<br>ఘోషము | సంవారాదులు<br>— |

వా॥ ఋకార ఌకారములకు పరస్పరము సవర్ణసంజ్ఞ చెప్పవలయును. లేనిచో నీ రెండును స్థానభేదముగలవగుటచే "తుల్యాస్య" 11 సూ. చే, వీనికి సంజ్ఞ ప్రాప్తింపకపోవును. "తుల్యాస్య" సూ.చే అకార హకారములకు, ఇకార శవర్ణములకు, ఋకార షకారములకు, ఌకార సకారములకు స్థానప్రయత్న సామ్య ముండుటచే పరస్పరము సవర్ణసంజ్ఞ ప్రాప్తమగుచుండ నా సంజ్ఞను నిషేధించు సూత్రమును (నాజ్ఝలౌ) వ్యాఖ్యానము చేయుచున్నాడు.

వివరణము : అధికారముగాక స్వతన్త్రమగు విధిశాస్త్ర మనినచో సపాద సప్తాధ్యాయినిగురించి త్రిపాది యసిద్ధమగునుగాని త్రిపాదిలో బూర్వమును గురించి పర మసిద్ధము గాకపోవును. ప్రశాన్ అనుచోట ప్రవర్తించిన 'మోనో ధాతోః' 342 అను నత్వవిధాయకశాస్త్రము 'నలోపః ప్రాతిపదికాన్తస్య' 237, అను నలోపవిధాయకశాస్త్రమునుగురించి యసిద్ధము గానందున ప్రశాన్ శబ్దములోని నకారమునకు లోపము ప్రసక్తమగును. అధికారమనిన నలోపశాస్త్రమునుగురించి నత్వశాస్త్ర మసిద్ధమగుటచే లోపము వారింపబడును.

అసిద్ధమ్=అనిష్పన్నము. ప్రవర్తింపనిదానివలెనుండునదని యర్థము. సిద్ధమయినదానియందు కార్యార్థమై యసిద్ధత్వ మారోపితమగును. బాహ్య ప్రయత్నములన నాస్యమునకు బహిర్భూతమగు ప్రదేశమందు అనగా కాకలకము (కొండనాలుక) నకు దిగువనున్న గళవివరముయొక్క వికాసము మొదలగు కార్యములను జేయునవని యర్థము. వివారము=గళవివరమునకు వికాసమును జేయు యత్నము. సంవారము=గళవివరమునకు సఙ్కోచము (ముడుచుకొనుట) ను జేయునది. శ్వాసము=నిట్టూర్పులను గలుగజేయునది. నాదము=ధ్వనివిశేషము జేయునది. ఘోషము=నాదవిశేషమును జేయునది. అఘోషము=అల్పమైన ఘోషమును జేయునది. అల్పప్రాణము=ప్రాణముల కల్పత్వమును జేయునది. అనగా నల్పమగు నాయాసమును జేయునది. మహాప్రాణము=ప్రాణములకు మహత్త్వము ననగా నధికమగు నాయాసమును జేయునది. కకారాది మకారాన్త వర్ణములు, జిహ్వకు తాల్వాదిస్థానములకును సంపూర్ణస్పర్శ కలిగినపిదప నుత్పత్తిగలవగుటవలన స్పర్శ లను వ్యవహారము గలవి యగును. మాతృకాపాఠమున స్పర్శలకును నూష్మలకును మధ్యనుండుటచే యరలవ లన్తస్థ లనబడును. వాయుప్రధానములగుటచే శషసహలు ఊష్మ లనబడును.

* 14. నాజ్ఝలౌ. 1-1-10. న, అజ్ఝలౌ (సవర్ణమ్)

ఆకారసహితోఽచ్ ఆచ్, స చ, హల్ చేత్యేతౌ
మిథస్సవర్ణౌ న స్తః। తేన దధీత్యస్య హరతి,
శీతలమ్, షష్ఠమ్, సాన్ద్రమ్, ఇత్యేతేషు పరేషు

యణాదికం న। అన్యథా దీర్ఘాదీనామివ హాకారా
దీనామపి గ్రహణకశాస్త్రబలా దచ్త్వం స్యాత్।
తథాహి ॥

14. అఝలౌ అనునది మధ్యమపదలోపిసమాసగర్భితమగు ద్వన్ద్వము (ఆకారసహితోఽచ్ అచ్, అచ్చ హల్చ, అఝలౌ) ఆకారముతో గూడిన యచ్చులు, హల్లులును, పరస్పరము సవర్ణములు గావు. ఈ నిషేధమువలన దధి+హరతి అనుచోట యణాదేశము, దధి+శీతల మనుచోట సవర్ణదీర్ఘము, దధి+షష్ఠ మనుచోట యణాదేశము, దధి+సాన్ద్ర మనుచోట యణాదేశమును వారితము లగును. ఈ నిషేధము లేనియెడల గ్రహణకశాస్త్రముచే (అణు దిత్సవర్ణస్యచాప్రత్యయః 15) హ్రస్వములకు సవర్ణములైన దీర్ఘములకువలె అకారాదులకు, సవర్ణములైన హాకారాదులకు నచ్త్వము ప్రసక్తమగును. అప్రత్యాహారమున జేరకుండినను, అచ్ ప్రత్యాహారములోని వర్ణములకు సవర్ణము లగుటవలన దీర్ఘములచ్చులయినటుల, అచ్చులకు హాకారాదులు సవర్ణము లనిన హాకారాదులు నచ్చులు గావలసివచ్చునని భావము. గ్రహణకశాస్త్రము నిచట వ్యాఖ్యానము చేయుచున్నాడు.

* 15. అణుదిత్సవర్ణస్య చాప్రత్యయః. 1-1-69
అణ్, ఉదిత్, సవర్ణస్య, చ, అప్రత్యయః।

ప్రతీయతే విధీయత ఇతి ప్రత్యయః। అవిధీయ
మానోఽణ్ ఉదిచ్చ సవర్ణస్య సంజ్ఞా స్యాత్। అత్రాణ్ప
రేణ ణకారేణ। కుచుటుతుపు ఏతే ఉదితః। తదేవం,
అ, ఇత్యష్టాదశానాం సంజ్ఞా। తథేకారోకారౌ। ఋకా
రస్త్రింశతః। ఏవం ఌకారోపి। ఏచో ద్వాదశానామ్।
ఏదైతో రోదౌతోశ్చ న మిథస్సావర్ణ్యమ్, ఐఔజితి
సూత్రారమ్భసామర్థ్యాత్। తేనైచ శ్చతుర్వింశతే
స్సంజ్ఞాస్స్యురితి నాపాదనీయమ్। నాజ్ఝలావితి నిషేధో
యద్యప్యాక్షరసమామ్నాయికానామేవ, తథాపి హాకా
రస్యాకారేణ సవర్ణః, తత్రాకారస్యాపి ప్రశ్లిష్టత్వాత్।
తేన విశ్వపాభిరిత్యత్ర హోఢఇతి ఢత్వం న భవతి। అను
నాసికాననునాసికభేదేన యవలా ద్విధా। తేనానను
నాసికాస్తే ద్వయోర్ద్వయోస్సంజ్ఞా॥

15. ప్రత్యయశబ్దము శాస్త్రముచే విధింపబడు నాదేశాదులను బోధించును. (ప్రతీయతే విధీయత ఇతి ప్రత్యయః) శాస్త్రముచే విధింపబడని అణ్ణులు, ఉదిత్తులును, తమ తమ సవర్ణములకు బోధకము లగునని యర్థము. "బోధకః" అను పదమున కధ్యాహారము, అణ్ ప్రత్యాహార మీసూత్రము

కనే పరణకారముతో జేయబడినది. వ్యాకరణశాస్త్రమున నుదిత్తులుగ వ్యవహరింపబడిన "కుచుటుతుపు" అను నీ యైదు నీశాస్త్రమునగూడ నుదిత్పదమున కర్థములు. కు ఇత్యాదిసముదాయమునకు సవర్ణము లప్రసిద్ధములైనను, తదవయవములగు కకారాదులకు సవర్ణములే సముదాయసవర్ణము లగును. అణ్ణులు స్వసవర్ణబోధకము లగుననుటవలన అ, ఇ, ఉ, ఈమూడును స్వసవర్ణములగు పదునెనిమిది భేదములకు బోధకములు. ఋకార ౡకారములు సవర్ణములగుటచే ఋకారము తన పదునెనిమిదిభేదములకేగాక ౡకారముయొక్క పండ్రెండు భేదములకు ననగా ముప్పదిభేదములకు బోధకము. ఇట్లే ౡకారమును ముప్పది భేదములకు బోధకమగును. ఏ, ఐ, ఓ, ఔ లు ప్రత్యేకము పండ్రెండు భేదములకుమాత్రమే బోధకము. ఏకారైకారములుగాని, ఓకారౌకారములుగాని సమానస్థానప్రయత్నకములైనను పరస్పరము సవర్ణములు గావు. సవర్ణములైనచో అకారము, స్వసవర్ణమగు దీర్ఘాదులను గ్రహించునటుల, ఏకారమైకారమును, ఓకార మౌకారమును గ్రహించును గావున నక్షరసమామ్నాయమున "ఏఓఙ్" సూత్రముచే గతార్థమగుటవలన వేరుగా "ఐఔచ్" సూత్రము వ్యర్థము గావలసివచ్చును. కావున ఏఐఓఔలు ప్రత్యేకమిరువదినాల్గుభేదములకు బోధకము లని చెప్పదగదు. "నాజ్ఝలౌ" (14) సూ. చే సవర్ణసంజ్ఞానిషేధ మక్షరసమామ్నాయములోని యచ్చులకును, హల్లులకేగాని తత్సవర్ణములగువానికి గాదు. నాజ్ఝలౌ సూత్రములోని అచ్పదము విషయమై గ్రాహకశాస్త్రము ప్రవర్తింపకుండుటయే యిందులకు గారణము. ఈవిషయము "అకస్సవర్ణే దీర్ఘః" (86) సూత్రమువద్ద మూలమున స్పష్టముగ తెలుపబడును. నాజ్ఝలౌ సూత్రమున ఆకారప్రశ్లేషము చేయుటచే ఆకార హకారములకు మాత్రము సవర్ణసంజ్ఞ లేదు. కావున విశ్వపాభిః (విశ్వపా + భిస్) అనుచోట నాకారమునకు "హోఢః" 325 సూ. చే హకారస్థానమున విధింపబడు ఢకారము నివృత్తమగును. ఈరెండును సవర్ణములైనచో హకారముచే నాకారము గ్రహింపబడునుగాన ఢత్వము ప్రసక్తమగును. యకార వకార లకారములు ప్రత్యేక మనునాసికము, నిరనునాసిక మను రెండుభేదములు గలవి. కావున విధీయమానములుగానట్టి నిరనునాసిక యవలలు ప్రత్యేక మాభేదములకు బోధకము అగును.

వివరణము: సూత్రమున "అప్రత్యయః" అనునది అణ్ణులకే విశేషణము. సూత్రములోని చకారము భిన్నక్రమమై యుదిత్తులతో సమ్బన్ధించును. కావున నుదిత్తులును సవర్ణగ్రాహకము లగునను నర్థము భిన్నవాక్యముచే జెప్పవలయును. వాక్యభేదము చేయుటవలననే రెండవవాక్యమున అప్రత్యయః అనుదానికి సమ్బన్ధములేదు. కావుననే "చోఃకుః" 380 మొదలగు సూత్రములందు విధీయమానములగు నుదిత్తులుగూడ సవర్ణగ్రాహకము లగును. ఆకారప్రశ్లేషమున

"కాల సమయ వేలాసు తుమున్" 3-3-167 సూ. లోని "వేలాసు" అను నిర్దేశము మానము. ఆకార హాకారములు సవర్ణములైనచో ఇణ్ ప్రత్యాహారములోని హాకార మాకారమును గ్రహించును. ఆకారము ఇణ్ణయినచో "ఇణ్ కోః", 212 సూ. చే నాకారముకంటె పరమగు సకారమునకు షత్వము చేయవలసియుండును.

* 16. తపరస్తత్కాలస్య. 1-1-70. తపరః, తత్కాలస్య।
తః పరో యస్మాత్సచ, తాత్పరశ్చోచ్చార్యమాణ
సమకాలస్యైవ సంజ్ఞా స్యాత్। తేన అత్,
ఇత్, ఉత్, ఇత్యాదయ ష్షణ్ణాం షణ్ణాం సంజ్ఞా।
ఋదితి ద్వాదశానామ్॥

16. తపరపదమున కావృత్తిజేసి యర్థద్వయమును జెప్పవలయును. అందొకటి బహువ్రీహిసమాసము. (తః పరో యస్మాత్) రెండవది పఞ్చమీ తత్పురుషము (తాత్ పరః) తత్కాలస్య అనుదానికి తదుచ్చారణకాలసమ కాలమునకని యర్థము. తకారము పరముగాగల వర్ణము, తకారముకంటె పరమగు వర్ణము, స్వోచ్చారణకాలసమకాలములగు సవర్ణములకుమాత్రమే బోధక మగును. తపరము హ్రస్వమైనచో తద్భేదములగు నాఱింటిని, దీర్ఘమైనచో తద్భేదములగు నాఱింటిని బోధించునని భావము. కావున అత్, ఇత్, ఉత్ మొదలగునవి హ్రస్వముయొక్క యాఱు భేదములకుమాత్రమే బోధకములు. ఋత్ అనునది ఋకార ౠకారముల హ్రస్వములగు పండ్రెండింటికిని బోధకము.

వివరణము: ఈ సూత్రములోనికి అణ్ పద మనువర్తింపదు. అణ్ణయినను గాకపోయినను తపరమైన వర్ణము స్వసమకాలములగు భేదములకు బోధక మగును. అనునాసిక్యము, ఉదాత్తత్వము మొదలగు గుణములు భేదకములు గావున నుదాత్తమగు వర్ణ మనుదాత్తమునకు, అనుదాత్తమగు వర్ణ ముదాత్తమునకును బోధకము గాకపోవుచుండ, తపరవర్ణము స్వసమకాలములగు భేదములకు గ్రాహక మగునని యీ సూత్రము విధించును. ఈరీతిగ నిది వ్యక్తిపక్షమున విధాయకమేగాని "అణుది" త్సూత్రముచే అణ్ణు నిఖిలసవర్ణబోధక మగుచుండ నిది యుచ్చార్యమాణసమకాలములగు భేదములకుమాత్రము బోధక మగునని చెప్పి యీ సూత్రము నియామక మన వలనుపడదు. అణుదిత్సూత్రమునకు విషయ మణ్ణు. ఈ సూత్రమున కణ్ణు తదితరమును, విషయము గాన విషయభేద మిందు గారణము. కాముదిలోని "సమకాలస్యైవ" అనుచోట నేవకారము న్యాయప్రాప్తబాధ్యబాధకభావమువలన సిద్ధమైనదే. అనగా "అతోభిస ఐస్" (204) సూత్రములోని "అతః" అనుచోట ప్రాప్తమగు అణుదిత్సూత్రమునకు పరమగు నీసూత్రము బాధకమగును గాన నిచటి ఆకారము

హ్రస్వభేదముల నాఱింటికేగాని, సవర్ణములగు పదునెనిమిది భేదములకు బోధకము గాదు. ఇట్టిదే న్యాయప్రాప్తబాధ్యబాధకభావమని తెలియునది.

* 17. వృద్ధిరాదైచ్. 1-1-1. వృద్ధిః, ఆత్, ఐచ్.

ఆదైచ్చ వృద్ధిసంజ్ఞః స్యాత్ ॥

17. "ఆదైచ్" అనుచోట తపరకరణము, అకారము విషయమై ఆకార మున్నదా లేదా యను సంశయమును నివర్తింపజేయుటకును, "ఐచ్" విషయమై ప్లుతముల నివర్తింపజేయుటకు నని గ్రహించునది. దీర్ఘాకారము, దీర్ఘములగు ఐకారౌకారములు వృద్ధిసంజ్ఞగలవగును. (వృద్ధిపదమున కర్థము) అని సూత్రార్థము.

వివరణము: ఆదైచ్పదము సమస్తము గాదుగాన సమాసాన్తప్రత్యయము మొదలగు కార్యములు వచ్చునను శఙ్కకవకాశము లేదు. ప్లుతములగు ఐకారౌకారములకు వృద్ధిసంజ్ఞ లేనందున, కృష్ణౌత్కణ్ఠ్యమ్ (కృష్ణ+ఔత్కణ్ఠ్యమ్) అనుచోట పూర్వ పర స్థానులు రెండును త్రిమాత్రికములైనను ప్లుతౌకారము గాక దీర్ఘౌకారమే ఏకాదేశమగును. ప్లుతములకును వృద్ధిసంజ్ఞ యున్నయెడల స్థానిసదృశమగు ప్లుతమే ఆదేశము రావలసియుండును. ఉద్దేశ్యమునకు పూర్వపాఠము, విధేయమునకు పరపాఠము న్యాయ్యము. ఇచట వృద్ధిశబ్దము విధేయబోధకమైనను శాస్త్రారమ్భమున మఙ్గళార్థము పూర్వపాఠము చేయబడెను.

* 18. అదేఙ్ గుణః. 1-1-2. అత్, ఏఙ్, గుణః.

అదేఙ్ చ గుణసంజ్ఞః స్యాత్ ॥

18. ఈసూత్రములోని తపరకరణము పూర్వపరములవిషయమై భిన్నకాలికవ్యావృత్తికొఱకగును. కాన హ్రస్వాకారము, దీర్ఘములగు ఏకారౌకారములు గుణసంజ్ఞకము లగును.

* 19. భూవాదయో ధాతవః. 1-3-1. భూవాదయః, ధాతవః।

క్రియావాచినో భ్వాదయో ధాతుసంజ్ఞాః స్యుః।

19. క్రియను బోధించునవియు, భూ (సత్తాయామ్) ఆదిగాగలవియును, అనగా పాణినిచే పఠింపఁబడిన దశగణిలో చేరినవి, ధాతువు లనబడును. ఏధ, కృష్, గమ్, ఇత్యాదు లుదాహరణము.

వివరణము: భూవాదయః = భూశ్చ, వాశ్చ, భూవౌ, ఆదిశ్చ, ఆదిశ్చ, ఆదీ (ఏకశేషము) ప్రథమాదిశబ్దమునకు మొదటిది యని యర్థము. (ప్రభృత్యర్థకము) ద్వితీయాదిశబ్దమునకు సదృశమని యర్థము. (ప్రకారార్థము) భూవౌ ఆదీ యేషాం తే। భూప్రభృతులు, వాసదృశములు నని యర్థము. ధాతుపాఠమందు పఠింపబడిన, వా (గతిగన్ధనయోః) అనునది క్రియావాచకమగుటచే తత్సదృశములన క్రియావాచకము లను నర్థము లభించును.

* 20. ప్రాగ్రీశ్వరాన్నిపాతాః. 1-4-56 ప్రాక్, రీశ్వరాత్, నిపాతాః।

ఇత్యధికృత్య॥

20. ఇది అధికారసూత్రము. రీశ్వర పదముగలసూత్రము (అధిరీశ్వరే 1-4-97) వఱకు, ప్రాక్, నిపాతాః అనుపదము లధికృతము లగును. పూర్వము నిపాతసంజ్ఞ గలవగుచు, పిదప గత్యాదిసంజ్ఞ గలవగునను నర్థము లభించును. ఇట్లు చెప్పుటవలన నిపాతసంజ్ఞకు గత్యాదిసంజ్ఞలకు నొకచోట సమావేశము గల్గును.

* 21. చాదయోఽసత్త్వే. 1-4-57. చాదయః, అసత్త్వే।

అద్రవ్యార్థా శ్చాదయో నిపాతసంజ్ఞాః స్యుః॥

21. ద్రవ్యవాచకములుగానట్టి చాదులు (స్వరాదిగణమున 1-1-37 అ న్తర్గణము) నిపాతము లనబడును.

వివరణము : సత్త్వశబ్దము ద్రవ్యబోధకము. ద్రవ్యమన లిఙ్గము, సంఖ్య వీనితో సమ్బన్ధముగలది. "అసత్త్వే" యను నిషేధ ముండుటవలన, "పశు" అనునది చాదిగణమున బఠింపబడినను జంతుబోధక మగునపుడు నిపాతము గాదు. "లోధంనయ న్తిపశుమన్యమానాః" ఇచటి పశుశబ్దము ద్రవ్యవాకము గాదుగాన (లెస్సగా నని యర్థము) నిపాతమగును.

* 22. ప్రాదయః. 1-4-58. (అసత్త్వే)

అద్రవ్యార్థాః ప్రాదయ స్తథా॥

22. ద్రవ్యవాచకములుగానట్టి ప్రాదులు నిపాతసంజ్ఞ కలవగును.

* 23. ఉపసర్గాః క్రియాయోగే. 1-4-59.

ఉపసర్గాః, క్రియాయోగే.

* 24. గతిశ్చ. 1-4-60.

ప్రాదయః క్రియాయోగే ఉపసర్గసంజ్ఞా గతిసంజ్ఞాశ్చ స్యుః। ప్ర, పరా, అప, సమ్, అను, అవ, నిస్, నిర్, దుస్, దుర్, వి, ఆఙ్, ని, అధి, అపి, అతి, సు, ఉత్, అభి, ప్రతి, పరి, ఉప. ఏతే ప్రాదయః॥

23, 24. ప్రాదు లిరువదిరెండు. ఇవి క్రియతో సమ్బన్ధముగలవై నపుడు ఉపసర్గములనియు, గతులనియును వ్యవహరింపబడును.

వివరణము : "గతిశ్చ" సూ. లోని, చకారము గత్యుపసర్గసంజ్ఞల కొక చోట సమావేశమును జేయును. చకారము లేనియెడల నీ సంజ్ఞ లేక సంజ్ఞాధి కారమున జేరినందున (ఆకడారాదేకాసంజ్ఞా 288) పరమగు గతిసంజ్ఞ ఉప సర్గసంజ్ఞకు బాధకము గావలసివచ్చును.

* 25. నవేతి విభాషా. 1-1-44. న, వా, ఇతి, విభాషా।
నిషేధ వికల్పయో ర్విభాషాసంజ్ఞా స్యాత్॥

25. నిషేధ వికల్పములు విభాషాపదమున కర్థము.

వివరణము : 1. ఇతిశబ్దము అర్థపరమైనదానిని శబ్దపరముగను, శబ్దపరముగనున్నదాని నర్థపరముగను జేయును. ఇది నవాశబ్దములతో సమ్బన్ధించును. (నేతి, వేతి) స్వంరూపసూత్రముచే ప్రకృతమున నవాశబ్దములు శబ్దపరములగుటచే నితి శబ్దము వాని నర్థపరములనుగ జేయును. నిషేధము, వికల్పము యీ రెండును విభాషాపదార్థము లని సూత్రార్థము ఫలితమగును.

2. ప్రాప్తవిభాష, అప్రాప్తవిభాష, ప్రాప్తాప్రాప్తవిభాష (ఉభయత్ర విభాష) అని విభాషలు మూడువిధములు. "వాపదాన్తస్య" (126) "ఝయోహోన్యతరస్యామ్" (120) "హృక్రోరన్యతరస్యామ్" (544) ఇవి వరుసగ నుదాహరణములు. వీనిలో పక్షమందు నిషేధమునుమాత్రము విధించు ప్రాప్తవిభాషలలోగాని, అప్రాప్తమగు కార్యమునకు విధానముమాత్రము చేయు నప్రాప్తవిభాషలలోగాని భావాభావాంశములను బోధించు నీ సంజ్ఞాసూత్రమున కుపయోగము లేదు. కాన ప్రాప్తాప్రాప్తవిభాషలందే యీ సూత్ర ముపయోగించును. ఈ విభాషలు ప్రాప్తవిషయమున మొదట నిషేధమును జేసి, పిదప ప్రాప్తాప్రాప్త విషయములందు కార్యమును వికల్పముగ విధించును.

* 26. స్వం రూపం శబ్దస్యాశబ్దసంజ్ఞా. 1-1-68.
స్వమ్, రూపమ్, శబ్దస్య, అశబ్దసంజ్ఞా.
శబ్దస్య స్వం రూపం సంజ్ఞి శబ్దశాస్త్రే యా
సంజ్ఞా తాం వినా॥

26. శబ్దమునకు అర్థముతోగూడిన ఆనుపూర్వి ( వర్ణసమూహము ) బోధ్యము. శబ్దశాస్త్రములోని సంజ్ఞాశబ్దములుమాత్ర మానుపూర్విని బోధింపవు.

వివరణము : ఆత్మీయవాచకమగు స్వశబ్దముచే నర్థమును, రూపశబ్దముచే శబ్దస్వరూపమును, (ఆనుపూర్వి) గ్రహింపవలయును. శబ్దమునకు, శబ్దార్థముల రెండింటియందు శక్తి యఙ్గీకరింపబడెను. లోకమున, శబ్దము విశేషణము, అర్థము విశేష్యము. శాస్త్రమునగూడ నట్లు భావించినచో "అగ్నేర్ఢక్" 4-2-33. "రాజశ్వశురాద్యత్" 4-1-137 ఇత్యాది సూత్రములం దగ్ని రాజాదిశబ్దములచే అఙ్గారము, రాజు మొదలగు నర్థములు ప్రధానములై యుపస్థితము లగును. అఙ్గారాదులకంటె పరముగ ప్రత్యయములను విధించుట యసమ్భవముగాన అగ్న్యాదిశబ్దములు తత్పర్యాయములను బోధింపవలసి వచ్చును. సూత్రోపాత్తమగు శబ్దముకంటె ప్రత్యయవిధాన మిష్టముగాని తత్పర్యాయములన్నింటికంటె ప్రత్యయవిధాన మిష్టముగాదుగాన సూత్రో

పాత్తమగు నానుపూర్వికే గ్రహణముగాని, తత్పర్యాయములకు గ్రహణము గలుగగూడదని నియమించుటకీ సూత్ర మారమ్భింపబడెను. సూత్రమున "అశబ్దసంజ్ఞా" అనుచోట శబ్దపదమునకు శబ్దశాస్త్రమర్థము. శబ్దశాస్త్రీయ సంజ్ఞలలో నీసూత్రము ప్రవర్తించదనుటచే "ఘరూపకల్ప" 6-3-43 సూత్రములోని ఘశబ్దము ఘ యను నానుపూర్విని బోధింపక, "తరప్తమపౌఘః" 1-1-22 అను సంజ్ఞాసూత్రముచే బోధితములగు తరప్, తమప్ ప్రత్యయములను బోధించును.

* 27. యేన విధిస్తదన్తస్య 1-1-72 యేన, విధిః, తదన్తస్య (స్వమ్)
విశేషణం తదన్తస్య సంజ్ఞాస్యాత్ స్వస్య చ
రూపస్య। వా। సమాసప్రత్యయవిధౌ ప్రతిషేధః। వా।
ఉగిద్వర్ణగ్రహణవర్జమ్॥

27. విశేషణము తదన్తశబ్దమునకు, తనకును బోధకమగును. వా। సమాసవిధాయకశాస్త్రమందును, ప్రత్యయవిధాయకశాస్త్రమందును తదన్తవిధికి నిషేధము జెప్పవలయును. వా। ప్రత్యయవిధాయకములైనను, ఉగిత్తను పదము గల సూత్రములందును, వర్ణగ్రహణము గల సూత్రములలోను తదన్తవిధి నిషేధమునకు ప్రతిషేధమును జెప్పవలయును. అచట తదన్తవిధి గల్గునని యర్థము ఫలితమగును.

వివరణము : 1. "యేన" అను పదమువలన "విశేషణ" మను నర్థము లభించినది. యేన అనునది కరణార్థకతృతీయాన్తము. కరణము నియతముగ వ్యాపారముగల దగును. ప్రకృతమున వ్యాపార మితరవ్యావృత్తికరణరూపము. కాన విశేషణ మను నర్థము లభించినది. అనువృత్తమగు స్వశబ్దమువలన "స్వస్యచ రూపస్య" అని లభించినది. ఉదా. "ఏరచ్" 3-2-56 సూత్రమున, ఇకారము విశేషణము, ధాతువు విశేష్యము, గాన నికారము ఇకారాన్తమగు ధాతువును, ఇకారరూపమైన ధాతువునుగూడ బోధించును. చి (ఞ్) ధాతువుకంటెను, ఇ (ణ్) ధాతువుకంటెను, అచ్ ప్రత్యయము సిద్ధమగును. చయః, అయః, వరుసగ నుదాహరణములు.

2. సమాసవిధాయకశాస్త్రమున విశేషణము తదన్తబోధకముగానందున, "ద్వితీయాశ్రితాతీత" 2-1-24. సూత్రమున సుబన్తవిశేషణమగు శ్రితశబ్దము శ్రితాన్తమును బోధింపదు. కాన కృష్ణమ్+ఉపాశ్రితః అనుచోట సమాసము ప్రవర్తింపదు. ప్రత్యయవిధాయకసూత్రమున తదన్తవిధి లేనందున "నడాదిభ్యః ఫక్" 4-1-99. సూ. చే, నడశబ్దాన్తమగు సూత్ర నడశబ్దముకంటె ఫక్ ప్రత్యయము ప్రవర్తింపదు.

3. ఉగిద్గ్రహణమున తదన్తవిధినిషేధము లేదనుటవలన "ఉగితశ్చ" 458 సూత్రమున నుగిత్తను విశేషణము తదన్తబోధక మగును. అతిమహతీ (మహాతీ మతిక్రాన్తా) యనుచోట జీప్ ప్రత్యయము సిద్ధమగును. వర్ణగ్రహణమున తదన్తవిధి యుండుననుటవలన "అత ఇఞ్" 4-1-95 సూత్రమున అతః అనునది అకారాన్తబోధకమగును. దక్షశబ్దమునకు ఇఞ్ ప్రత్యయము సిద్ధమగును. దాక్షిః (దక్షస్యాపత్యమ్)॥

* 28. విరామోఽవసానమ్. 1-4-110. విరామః, అవసానమ్.

వర్ణానామభావోఽవసానసంజ్ఞః స్యాత్॥

28. వర్ణములయొక్క యుచ్చారణాభావము అవసానసంజ్ఞక మగును.

వివరణము: శబ్దానుశాసనప్రస్తావమువలన "వర్ణానామ్" అని లభించినది. కొన్ని వర్ణముల నుచ్చరించినపిదప నుండు నభావమునే వర్ణాభావముగ గ్రహింపవలయును. అభావమునకును బుద్ధిపరికల్పితమగు పౌర్వాపర్యవ్యవహారము సంభవించునుగాన "ఖరవసానయోర్విసర్జనీయః" (77) సూత్రమున అవసానే పరే అని యర్థము చెప్పదగును.

* 29. పరస్సన్నికర్షస్సంహితా. 1-4-109. పరః, సన్నికర్షః, సంహితా।

వర్ణానామతిశయితస్సన్నిధి స్సంహితాసంజ్ఞః స్యాత్॥

29. వర్ణములకు స్వభావసిద్ధమగు నర్ధమాత్రాకాలముతో వ్యవధాన రూపమగు సాన్నిధ్యము సంహిత యనంబడును.

వివరణము: వర్ణోచ్చారణమునకు, వర్ణోచ్చారణమునకును మధ్యన అర్ధమాత్రాకాలవ్యవధానమావశ్యకము. ఇట్టి వ్యవధానముగల వర్ణములయొక్క సామీప్యము సంహిత యనబడును. ఇట్టిచోటనే "సంహితాయాం" 6-1-72. అను నధికారమున విధింపబడుకార్యములు ప్రవర్తించును. ఇపుడు దధిశబ్దము నుచ్చరించి, కాలాన్తరమున అత్ర యను దాని నుచ్చరించినచో నికారాకారములకు స్వభావసిద్ధమగు నర్ధమాత్రాకాలముకంటె నధికకాలముతో వ్యవధానముండుటచే సంహిత యుండదుగాన సంహితాధికారమున విహిత మగు యణాదేశ మచట ప్రవర్తింపదు.

* 30. సుప్తిఙన్తం పదమ్. 1-4-14. సుప్తిఙన్తమ్, పదమ్।

సుబన్తం, తిఙన్తం చ, పదసంజ్ఞం స్యాత్॥

30. సుప్ప్రత్యయము లన్తమందు గలవి, (రామః ఇత్యాదులు) తిఙ్ ప్రత్యయము లన్తమందు గలవి (భవతీత్యాదులు) పదసంజ్ఞ గలవగును.

వివరణము: సుప్పులు, తిఙ్లు, ప్రత్యయములగుటచే "ప్రత్యయగ్రహణే యస్మాత్సవిహితస్తదాదేస్తదన్తస్య గ్రహణమ్ (ప్రత్యయమును గ్రహించినప్పుడది

యేప్రకృతికంటె విధింపబడునో ఆప్రకృతి యాదిగాను, ఆప్రత్యయమన్తముగాను గలశబ్దమునకు గ్రాహక మగును.) అను పరిభాషచే సుబన్తము, తిఙన్తమనునర్థము సిద్ధమగుచుండ సూత్రములోని అన్తగ్రహణము వ్యర్థమగుచు, "సంజ్ఞావిధౌ ప్రత్యయగ్రహణే తదన్తగ్రహణం నాస్తి" (సంజ్ఞాసూత్రములందు గృహీత మగు ప్రత్యయము తదన్తబోధకము గాదు.) అనుపరిభాషలో జ్ఞాపక మగును. ఈపరిభాషకు "తరప్తమపౌ ఘః" 1-1-22 సూ.చే, తరబన్త తమబన్తములకు ఘ సంజ్ఞ లేకపోవుట ఫలము.

* 31. హలోఽనన్తరాస్సంయోగః 1-1-7 హలః, అనన్తరాః, సంయోగః.

అజ్భిరవ్యవహితా హల స్సంయోగసంజ్ఞాః స్యుః.

31. అచ్చులతో వ్యవధానశూన్యములగు హల్లులు సంయోగసంజ్ఞ కలవగును.

వివరణము : "అనన్తరాః" అనుదానికవ్యవహితములని యర్థము. వ్యవధాన మనునది, విజాతీయవస్తువుతోనేగాని సజాతీయముతో నుండదు. హల్లులకు విజాతీయములగు నచ్చులే వ్యవధాయకము లగునుగాని సజాతీయములగు హల్లులుగానేరవు. ఇందువలన సిద్ధమైనదే మూలమున "అజ్భిః" అనునది. "హలః" అనునది ఏకశేషము (హలౌ చ, హలశ్చ) గాన రెండుహల్లులకును సంజ్ఞ సిద్ధ మగును.

* 32. హ్రస్వం లఘు. 1-4-10 హ్రస్వమ్, లఘు.

32. హ్రస్వము లఘుసంజ్ఞక మగును.

* 33. సంయోగే గురు. 1-4-11 సంయోగే, గురు.

సంయోగే పరే హ్రస్వం గురుసంజ్ఞం స్యాత్.

33. సంయోగము పరమగునపుడు హ్రస్వము గురుసంజ్ఞక మగును.

* 34. దీర్ఘం చ. 1-4-12.

ఇతి సంజ్ఞాప్రకరణమ్.

34. దీర్ఘముగూడ గురుసంజ్ఞక మగును.

వివరణము : ఇచట సంజ్ఞాపదము సన్ధికార్యములలో నుపయోగించెడి ప్రథమాధ్యాయములోని సంజ్ఞలనుమాత్రము బోధించును. కావున "ఆమ్రేడితమ్" (8-1-2) "ప్రగృహ్యమ్", (1-1-11) మొదలగు సంజ్ఞల నీప్రకరణమున నుపన్యసింపకపోవుట దోషముగాదు. ఈ ప్రకరణమున "అత్ర" మొదలగు సూత్రముల వ్యాఖ్యానము ప్రాసఙ్గికము. ఇతి శబ్దము సమాప్తిసూచకము.

ఇది సంజ్ఞాప్రకరణము.

## 2. పరిభాషాప్రకరణము

* 35. ఇకో గుణవృద్ధీ. 1-1-3. ఇకః, గుణవృద్ధీ,
గుణవృద్ధి శబ్దాభ్యాం యత్ర గుణవృద్ధీ విధీయేతే
తత్రేక ఇతి షష్ఠ్యన్తం పద ముపతిష్ఠతే.

35. గుణశబ్దముచే గుణమునుగాని, వృద్ధిశబ్దముచే వృద్ధినిగాని విధించు సూత్రములందు "ఇకః" అను షష్ఠ్యన్త ముపస్థితమగును.

వివరణము : 1. పూర్వసూత్రములనుండి గుణవృద్ధిపదముల ననువృత్తి చేయుటచే నిట్టి యర్థము లభించినది. "త్యదాదీనామః" "దివఔత్" సూత్రములచే క్రమముగ గుణము (అ) వృద్ధి (ఔ) విహితమైనను గుణవృద్ధిశబ్దములచే విధింపబడనందున నాసూత్రములం దీ పరిభాష ప్రవర్తింపదు.

2. పరిభాష యన తనను ప్రవర్తింపజేయు లిఙ్గముగల విధిసూత్రము యొక్క యర్థములోని సంశయమును నివర్తింపజేసి, విధిశాస్త్రమున కుపకారము చేయునది. గుణవృద్ధులను విధించెడి గుణః, వృద్ధిః, అను పదము లీ పరిభాషను ప్రవర్తింపజేయు లిఙ్గము. ఇట్లు చెప్పుటచే "మిదేర్గుణః" (7-3-82) "మృజేర్వృద్ధిః" (7-2-114) మొదలగు సూత్రములందే ప్రవర్తించునుగాని "అతో గుణే" (192) "వృద్ధిర్యస్యాచామాదిస్తద్వృద్ధమ్" (1-1-73) ఇత్యాదులలో ప్రవర్తింపదు.

36. అచశ్చ 1-2-28. (అచ్, హ్రస్వదీర్ఘప్లుతః)
హ్రస్వదీర్ఘప్లుతశబ్దైర్యత్రాజ్విధీయతే తత్రా
చ ఇతి షష్ఠ్యన్తం పద ముపతిష్ఠతే.

36. అనువృత్తమగు "హ్రస్వదీర్ఘప్లుతః" అనునది తృతీయాన్తముగ పరిణమించును. హ్రస్వశబ్దముచేగాని, దీర్ఘశబ్దముచేగాని, ప్లుతశబ్దముచేగాని అచ్చును విధించెడి సూత్రమందు "అచః"అను షష్ఠ్యన్తమగు పద ముపస్థితమగును.

వివరణము : అచ్చును విధించెడి హ్రస్వదీర్ఘప్లుతశబ్దము లీ పరిభాషాప్రవర్తకములు. కావున నీపరిభాష "హ్రస్వో నపుంసకే ప్రాతిపదికస్య" (319) ఇత్యాదులందే ప్రవర్తించునుగాని "అష్టన ఆ విభక్తౌ" (373) ఇత్యాదులలో ప్రవర్తింపదు.

* 37. ఆద్యన్తౌ టకితౌ 1-1-46. ఆద్యన్తౌ, టకితౌ.
టిత్కితౌ యస్యోక్తౌ తస్య క్రమాదాద్యన్తా
వయవౌ స్తః.

37. ఆద్యన్తశబ్దములాద్యవయవాన్తావయవ బోధకము లగుటచే సముదాయాక్షేపకము లగును. టకితౌ అనునది బహువ్రీహి, (టశ్చ కశ్చ టకౌ, తౌ ఇతౌ

యయోః) టిత్, కిత్, అను నర్థము ఫలిత మగును. టిత్తు (ఇత్సంజ్ఞక టకారముగల యాగమము) కిత్తు (ఇత్సంజ్ఞక కకారముగల యాగమము) ఏసముదాయమునకు విధింపబడునో ఆసముదాయమున కవి క్రమముగ నాద్యవయవముగ, నన్తావయవముగ నగును.

వివరణము : టిత్తులు=ఢుట్, జుమట్ మొదలగునవి. కిత్తులు=తుక్, టుక్ మొదలగునవి. పూర్వమందు జెప్పబడిన యపవాదశాస్త్రములు తమ కవ్యవహితపరముగ నున్న శాస్త్రములనే బాధించును గాని వ్యవహితములను బాధింప వను న్యాయముచే (పురస్తాదపవాదా అనన్తరాన్ విధీన్ బాధన్తే నోత్తరాన్) నిది "షష్ఠీస్థానే యోగా" యనుదానికే బాధక మగును గాని "ప్రత్యయః పరశ్చ" యనువానికి గాదు. కావున టిత్తు ప్రత్యయమైనపుడు ఆద్యవయవముగ రాక పరముగనే వచ్చును. "చరేష్టః (3-2-16) సూ. చే విహితమగు "టః" మొదలగునవి టిత్తులగు ప్రత్యయములు.

* 38. మిదచోన్త్యాత్పరః 1-1-17 మిత్, అచః, అన్త్యాత్, పరః.
అచ ఇతి నిర్ధారణే షష్ఠీ. అచాం మధ్యే యోన్త్య
స్తస్మాత్పర స్తస్యైవాన్తావయవో మిత్స్యాత్.

38. "అచః అనునది, యతశ్చనిర్ధారణమ్, (641) సూ. చే విహితమగు షష్ఠ్యన్తముగాన నచ్చులలో నని యర్థము. మిత్తు (మకారేత్సంజ్ఞకము) ఏసముదాయమునకు విధింపబడునో యట్టిసముదాయమందు గల యచ్చులలో చివరనుండు యచ్చునకు పరమై సముదాయమున కన్తావయవ మగుచు వచ్చును.

వివరణము : నుమ్, ముమ్, ఇమ్ మొదలగునవి మిత్తులు. బాధకశాస్త్రము స్వవిషయమున ప్రాప్తించు శాస్త్రముల నన్నిటిని బాధించు నను బాధ్య సామాన్యపక్షముచే నీ పరిభాష "షష్ఠీ స్థానే యోగా" యనుదానికి, "పరశ్చ" యనుదానికిని బాధక మగును. కాన మిత్తు ఆదేశమైనను, ప్రత్యయమైనను సముదాయమున కన్తావయవమై యగును.

* 39. షష్ఠీస్థానే యోగా 1-1-49 షష్ఠీ, స్థానే, యోగా.
అనిర్ధారితసమ్బన్ధవిశేషా షష్ఠీ స్థానే యోగా
బోధ్యా, స్థానం చ ప్రసఙ్గః.

39. స్థానే యోగా యనునది బహువ్రీహి (స్థానేన యోగో యస్యాః) స్థానశబ్దమున కేత్వము నిపాతముచే కలిగినది. నిర్ధారితము గానట్టి సమ్బన్ధవిశేషము (అవయవావయవిభావము, జన్యజనకభావము, వెం॥) గల షష్ఠీవిభక్తికి స్థానపదార్థనిరూపితమగు సమ్బన్ధ మర్థమని గ్రహింపవలయును. అనగా నేసూత్రమున సమ్బన్ధవిశేషమును ప్రతిపాదించు పదములను విడచి షష్ఠ్యన్తముమాత్రముచ్చరింపబడునో యచట స్థానపదాధ్యాహారమును చేయవలయునని యాశయము. స్థానమన ప్రసఙ్గము.

వివరణము : 1. ఇకోయణచి (48) మొదలగు సూత్రములం దీపరిభాష ప్రవర్తించును. ఇకః అనుచోట షష్ఠ్యర్థమగు సమ్బన్ధము స్థానపదార్థ నిరూపితము గాన ఇక్కుయొక్క స్థానమందే యణాదేశ మగునని యర్థమగును. "ఊదుపధాయా గోహః" (6-4-89) సూత్రమున నుపధా పదముచే, "గోహః", అనుచోట షష్ఠ్యర్థ మవయవావయవి భావమని నిశ్చితమగును. కావున నిట్టిసూత్రములం దీపరిభాష ప్రవర్తించదు. గుహ ధాతువున కవయవమైన నుపధకు ఊకార మాదేశమగుననియే యర్థము.

2. స్థానశబ్దమునకు ప్రసఙ్గ మనునర్థము "దర్భాణాం స్థానే శరైః ప్రస్తరితవ్యమ్" (దర్భలయొక్క ప్రసఙ్గమందు శరములచే ప్రస్తారమును చేయదగును) ఈ మొదలగు స్థలములందు సుప్రసిద్ధమై యున్నది. ఈ పరిభాష, "ఇకోయణచి" సూత్రమున ప్రవర్తించును. స్థానశబ్దార్థము ప్రసఙ్గమనుటచే నిచ్పరకమగు నిగుచ్చారణము ప్రసక్తమైనపుడు యణ్ణునే యుచ్చరింపవలెనని యర్థము లభించును. శబ్దముల కనిత్యత్వము ప్రసక్తమగునుగాన ఇక్కునుచ్చరించి దానిస్థానమున యణ్ణు నుచ్చరింపవలె నని యర్థము చేయ వలనుపడదు.

* 40. స్థానేఽన్తరతమః, 1-1-50 స్థానే, అన్తరతమః.
ప్రసఙ్గే సతి సదృశతమః ఆదేశః స్యాత్.
(ప) యత్రానేకవిధమాన్తర్యం తత్ర స్థానత ఆన్తర్యం బలీయః.

40. అనేకాదేశములు ప్రసక్తము లగునపుడు ప్రాప్తములగువానిలో నేది స్థానికి మిక్కిలిసదృశమగునో నదియే యాదేశమగును. (ప) ఎచ్చోట ననేకవిధమగు (స్థానకృతము, అర్థకృతము, గుణకృతము, ప్రమాణకృతము) సాదృశ్యము సంభవించునో యచట స్థానకృతసాదృశ్యమే ప్రబలమైనది.

వివరణము : "ఇకోయణచి" ఇత్యాదులం దీ పరిభాష ప్రవర్తించును గాన నికారమునకు స్థానాదులచే సదృశతమమగు యకారమే యాదేశ మగును గాని వకారాదులు గావు. 1 స్థానము=తాల్వాదులు. 2 అర్థము=శబ్దార్థము. 3 గుణము = స్థానార్థప్రమాణములకంటె నితరములగు బాహ్యప్రయత్నము మొదలగునవి. 4 ప్రమాణము=ఏకమాత్రాదికాలము (హ్రస్వాదులు) వరుసగ నుదాహరణములు. (1) సుధీ+ఉపాస్యః ఇచట స్థానముచే నీకారమునకు యకారము సదృశమైనది. (2) క్రోష్టా. ఇచట క్రోష్టుశబ్దమున నర్థముచే సదృశమైన క్రోష్టృయనునదే వచ్చునుగాని భిన్నార్థకమైన వక్తృయనునది రాదు. (3) వాగ్ఘరిః (వాక్+హరిః) హకార ఘకారములకు బాహ్యప్రయత్నసామ్యమువలన హకారస్థానమున హకారసవర్ణమగు ఘకారమే యగును. (4) అమూ. "అదసోసేః" (422) సూ. చే విహితమగు ఉకారము హ్రస్వస్థానమున హ్రస్వమై, దీర్ఘస్థానమున దీర్ఘమై వచ్చును. స్తోతా, ఇచట స్తుధాతువునకు గుణము విధింపబడినది, ఉకారమునకు స్థానసాదృశ్యముచే

నోకారము, ప్రమాణసాదృశ్యముచే అకారము ప్రాప్తమగుచుండ, స్థానసాదృశ్యము ప్రబలమగుటవలన నోకారమే వచ్చును. ఇది పరిభాషవ ఫలము.

* 41. తస్మిన్నితి నిర్దిష్టే పూర్వస్య 1-1-66 తస్మిన్, ఇతి, నిర్దిష్టే, పూర్వస్య.

సప్తమీనిర్దేశేన విధీయమానం కార్యం
వర్ణాంతరేణావ్యవహితస్య పూర్వస్య బోధ్యమ్.

41. తస్మిన్నితి యనుచోట ఇతి శబ్దమువలన తస్మిన్ననునది నిఖిల సప్తమ్యంతములను బోధించును. నిర్దిష్టపదమున కవ్యవహితోచ్చారితంబని యర్థము. సప్తమీనిర్దేశముచే విధింపబడు కార్యము,సప్తమ్యర్థము (నిమిత్తము)న కితరవర్ణముతో వ్యవధానరహితమగు పూర్వమునకే యగునని యర్థము.

వివరణము: సప్తమ్యంతపదశ్రుతి యీ పరిభాషకు లింగము. ఇకో యణచి సూత్రమున, అచి, యను సప్తమీనిర్దేశముచే విధింపబడు యణాదేశము సప్తమ్యర్థమగు నచ్చున కవ్యవహితపూర్వమగు నిక్కునకే వచ్చును. ఉదా. దధ్యత్ర (దధి+అత్ర) ఇట్లు నియమముచేయుటవలన వర్ణాంతరముచే వ్యవహితమగు పూర్వమునకుగాని, పరమునకుగాని రాకుండును.

* 42. తస్మాదిత్యుత్తరస్య. 1-1-67. తస్మాత్, ఇతి, ఉత్తరస్య. (నిర్దిష్టే).

పఞ్చమీనిర్దేశేన క్రియమాణం కార్యం వర్ణాన్తరేణావ్యవహితస్య పరస్య బోధ్యమ్.

42. అనువృత్తమగు నిర్దిష్టే అనుపదము పఞ్చమ్యంతముగా మారును. తస్మాత్తనునది ఇతిశబ్దసహాయముచే నిఖిలపఞ్చమ్యంతములను బోధించును. పఞ్చమీనిర్దేశముచే విధింపబడు కార్యము పఞ్చమ్యర్థమున కితరముతో నవ్యవహితమగు పరమునకే యగును.

వివరణము: ఈపరిభాషకు పఞ్చమ్యంతపదశ్రుతి లింగము. "ఉదః స్థాస్తమ్భోః పూర్వస్య" (119) అనుచోట ఉదః అనునది పఞ్చమ్యంతముగాన ఉద్ అనుదాని కవ్యవహితపరములగు స్థా స్తమ్భులకు పూర్వసవర్ణమగును. కావున ఉత్థానమ్ (ఉద్ + స్థానమ్) అనుచోటనే వచ్చునుగాని, ఉద్ + సంస్థాన మనుచోట ప్రవర్తింపదు.

* 43. అలోఽన్త్యస్య. 1-1-52. అల, అన్త్యస్య,

షష్ఠీనిర్దిష్టాన్త్యస్యాదేశః స్యాత్.

43. స్థానషష్ఠీనిర్దేశముచే విధింపబడు నాదేశము, స్థానషష్ఠ్యర్థమగు వర్ణసముదాయముయొక్క తుదివర్ణమున కగును.

వివరణము: వర్ణసముదాయమును బోధించుపదము పైనున్న స్థానషష్ఠీశ్రుతి దీనికి లింగము. ఉదా. "త్యదాదీనామః", (266) ఇత్యాదులలో నిది ప్రవర్తించును. కాన త్యదాదుల తుదివర్ణమునకే అకార మాదేశ మగును.

* 44. ఙిచ్చ. 1-1-53. ఙిత్, చ.

అయమప్యన్త్యస్యైవ స్యాత్. సర్వస్యేత్యస్యాపవాదః.

44. ఙిత్తు (ఙకారేత్సంజ్ఞకమగునాదేశము) గూడ స్థానషష్ఠ్యన్తార్థమగు వర్ణసముదాయముయొక్క యన్త్యమునకే వచ్చును. "అనేకాల్శిత్సర్వస్య" (46) అనుదానికిది యపవాదము. కావున సఖిశబ్దమునకు "అనఙ్ సౌ" (249) సూ. చే విహితమగు అనఙాదేశము సఖిశబ్దముయొక్క ఇకారస్థానమున ప్రవర్తించును.

* 45. ఆదేః పరస్య. 1-1-54. ఆదేః, పరస్య.

పరస్య యద్విహితం తత్తస్యాదేర్బోధ్యమ్ అలోన్త్యస్యేత్యస్యాపవాదః.

45. పరమునకు విధింపబడుకార్యము దానియొక్క యాదివర్ణమునకు వచ్చును. అలోన్త్యస్య అనుదానికిది యపవాదము.

వివరణము : ఇచట "అలః", అను పదము ననువృత్తిచేసి ఆదిభూతమగు వర్ణమునకే యగునని చెప్పవలెను. కావుననే "ద్వ్యన్తరుపసర్గేభ్యోప ఈత్" (946) సూ. చే విధింపబడు నీత్త్వము ద్వీపమ్, (ద్వి + అపమ్) అనుచోట నప్శబ్దములోని అకారమునకే యగునుగాని పూర్ణసముదాయమునకు రాదు.

* 46. అనేకాల్శిత్సర్వస్య 1-1-55. అనేకాల్, శిత్, సర్వస్య.

స్పష్టమ్, అలోన్త్యసూత్రాపవాదః, అష్టాభ్య ఔశిత్యాదౌ, ఆదేః పరస్యేత్యేతదపి పరత్వాదనేన బాధ్యతే.

46. అనేకవర్ణములుగల యాదేశము, శిత్తు (శవర్ణేత్సంజ్ఞకము) యీరెండును, స్థానషష్ఠీనిర్దిష్టమగు సర్వముయొక్క స్థానమందు ప్రవర్తించును. "అలోన్త్యస్య, అను సూత్రమునకిది యపవాదము. అష్టాభ్యఔశ్ (374) సూ. చే ఔశాదేశము అష్టన్శబ్దముకంటె పరమగు జస్ శస్సులకు విధింపబడెను. కాన నాదేః పరస్య యను పరిభాషచే జశ్శస్సుల యాదివర్ణమున కాదేశము ప్రాప్తమగుచున్నది. ఆదేశము శిత్తగుటవలన నీ పరిభాషచే జశ్శస్సుల సముదాయమునకు ప్రాప్తమగుచున్నది. ఇట్లీ పరిభాషాద్వయమునకు విరోధము ప్రసక్తమగుచుండ, "విప్రతిషేధే పరంకార్యమ్ (176) అను సూ. చే పరమగు నీపరిభాష, ఆదేః పరస్య, యనుదానికిని (అలోన్త్యసూత్రమునకేగాక) బాధకమగును. కావున ఔశ్, సర్వాదేశమేయగును.

వివరణము : అనేకాల్లున కుదాహరణము. బభూవ. "అస్తేర్భూః" (2-4-52) సూ. చే విధింపబడిన, భూ, ఆదేశము అస్ ధాతువంతకు నగును. శిత్తున కుదాహరణము. అష్టౌ, ఇచట ఔశాదేశము జస్సునకంతకు నగును.

* 47. స్వరితేనాధికారః 1-3-11. స్వరితేన, అధికారః.

1. స్వరితత్వయుక్తం శబ్దస్వరూపమధికృతం బోధ్యమ్. ప. 2. పరనిత్యాన్తరఙ్గాపవాదానా ముత్తరోత్తరం బలీయః. 3. అసిద్ధం బహిరఙ్గమన్తరఙ్గే. 4. అకృతవ్యూహాః పాణినీయాః. నిమిత్తం వినాశోన్ముఖం దృష్ట్వా తత్ప్రయుక్తం కార్యం న కుర్వన్తీత్యర్థః.

ఇతి పరిభాషాప్రకరణమ్॥

47. 1. స్వరితత్వమనుదోషముతోఁగూడిన శబ్దము త్తరసూత్రములం దను వర్తించును. 2. పూర్వశాస్త్రముకంటె పరశాస్త్రము ప్రబలము. పరశాస్త్రముకంటె నిత్యము, అన్తరఙ్గము, అపవాదము, ఇవి ప్రబలములు. నిత్యముకంటె అన్తరఙ్గాపవాదములు ప్రబలములు. అన్తరఙ్గముకంటె యపవాదము ప్రబలము. 3. అన్తరఙ్గము చేయబోవునపు డంతకుమున్న ప్రవర్తించినదియు, అన్తరఙ్గము ప్రవర్తించుసమయముననే ప్రవర్తించునదియు నగు బహిరఙ్గమసిద్ధము (ప్రవృత్తముకానిదివలె) అగును. 4. పాణినీయులు (పాణినీయవ్యాకరణము తెలిసినవారు) నిమిత్తము (ఆయాకార్యములందు) వినాశమున కున్ముఖమయినదిగ తెలిసికొని యట్టినిమిత్తముగల కార్యమును చేయరు.

వివరణము : (1) స్వరితత్వము అచ్చునందు, హల్లునందుగూడ నుండును. అధికారమన (వినియోగము) తెలచుగ నుత్తరసూత్రములం దుపస్థితి యని యర్థము. స్వరితత్వముగలది కొన్నిచోట్ల పూర్వసూత్రములందు నుపస్థిత మగును. దీని కపకర్షమని వ్యవహారము. ఈ యుపస్థితి పదమునకైనచో నీ స్వరితత్వము పదమున కాదివర్ణమునందును, సూత్రమునకైనచో నా సూత్రముయొక్క యాదివర్ణము నందు నుండును. స్వరితత్వమోనునాసిక్యమువలె ప్రతిజ్ఞచేతనే తెలియదగినది. పదమునకు గాని, సూత్రమునకు గాని యెంతవరకధికార మను విషయము వ్యాఖ్యానముచేతనే నిర్ణయింపదగును.

(2) పూర్వశాస్త్రముకంటె పరశాస్త్రము ప్రబలమనుట కుదాహరణము : రామేభ్యః (రామ+భ్యస్) ఇచట "సుపిచ" (203) సూత్రవిహిత దీర్ఘమును "బహువచనే ఝల్యేత్" (206) సూత్రవిహితమగు నేత్వము బాధించును. పరముకంటె నిత్యము ప్రబలమనుటకు ఉదాహరణము : తుదతి (తుద్+అ+తి) పరమగు "పుగన్తలఘూపధస్య" (7-3-86) సూత్రముచే విహితమగు లఘూపధగుణమును, నిత్యమైన "తుదాదిభ్యశ్శః" (3-1-77) సూ. చే విహితమగు శప్రత్యయము బాధించును. పరశాస్త్రము ప్రవర్తించుటకు పూర్వము, తరువాతనుగూడ ప్రసక్తిగలది నిత్యశాస్త్రము. ఇచట లఘూపధగుణమునకు ముందు, వెనుకగూడ శప్రత్యయము ప్రసక్తమగుటచే, తుదాదిభ్యశ్శః అనునది నిత్యశాస్త్ర మగును. శప్రత్యయము (జిత్తువంటిది) ప్రవర్తించినపిదప

"క్ఙితిచ" (1-1-5) యను నిషేధమువలన గుణమునకు ప్రసక్తి లేనందున గుణమనిత్యము. పరముకంటె నన్తరఙ్గము ప్రబలమనుటకు ఉదా॥ ఉభరో(ఉభ+జస్) స్వల్పమగు నిమిత్తముగలదిగాని, శీఘ్రోపస్థితికలదిగాని అన్తరఙ్గము. ఇచట "ప్రథమ చరమతయాల్పార్ధకతిపయనేమాశ్చ" (227) సూ. చే విధింపబడు వికల్పసర్వనామసంజ్ఞను, శీఘ్రోపస్థితికలదగుటచే యన్తరఙ్గమగు నిత్యసర్వనామసంజ్ఞయే "సర్వాదీని సర్వనామాని" (211) సూత్రముచే ప్రవర్తించును. పరముకంటె నపవాదము ప్రబలమనుటకు ఉదా॥ దధ్నా (దధి+టా) ఉత్సర్గశాస్త్రము (పరము, నిత్యము, అన్తరఙ్గము) చే నాక్రాన్తము కానట్టి విషయమందు ప్రవృత్తిలేనిది యపవాద మనబడును. తన కెచటను చారితార్థ్యము లేకపోవుటయే యుత్సర్గమును బాధించుటలో బీజము. ఇచట "అస్థి దధి" (321) సూ. చే విహితమగు ననఙాదేశ మనేకాల్లగుటచే సర్వాదేశము కావలసియుండగ "అనేకాల్" సూత్రమున కపవాదమగు "ఙిచ్చ" సూత్రముచే నన్త్యాదేశమే యగును. నిత్యముకంటె నన్తరఙ్గము ప్రబలమనుటకు ఉదా॥ గ్రామణినీ (గ్రామణీ + ఔ) కులే. ఇచట నిత్యమగు నుమాగమము (ఇకోఽచి విభక్తౌ 321 సూత్రవిహితము) అన్తరఙ్గమగు హ్రస్వముచే (హ్రస్వో నపుంసకే ప్రాతిపదికస్య 319 సూత్రవిహితము) బాధింపబడును. అన్తరఙ్గముకంటె నపవాదము ప్రబలమనుటకు ఉదా॥ దైత్యారిః (దైత్య+అరిః) ఇచట నన్తరఙ్గమగు గుణమును (అద్గుణః 70 సూ) అపవాదమగు సవర్ణదీర్ఘము (అకస్సవర్ణే దీర్ఘః 86 సూ.) బాధించును.

(3) బహిరఙ్గశాస్త్రముగ నఙ్గీకరింపబడుదానియొక్క నిమిత్తములలో నన్తర్భూతములగు నిమిత్తములుగలది యన్తరఙ్గశాస్త్రము. అన్తరఙ్గమున కభిమతమగు శాస్త్రమునందలి నిమిత్తములకు బహిర్భూతమగు నిమిత్తముగలది బహిరఙ్గము. అన్తరఙ్గ బహిరఙ్గ శబ్దార్థముల విషయమై ప్రాచీనులకు, నవీనులకు నభిప్రాయభేదము గలదు. పరిభాషకు ఫలము. పచావేదమ్ (పచావ + ఇదమ్) ఇచట గుణముచే నిష్పన్నమగు నేకారము (బహిరఙ్గము) అన్తరఙ్గమగు నైత్వము (ఏత ఐ. 3-4-93) చేయునపు డసిద్ధమగును గావున నైత్వము రాదు.

(4) అకృతవ్యూహపరిభాషకు ఫలము. సేదుషః (సద్ క్వ + శస్) సద్ధాతువునకు వస్ (క్వసు) ప్రత్యయము చేసినచో సేద్వస్ అగును. క్వసువనది అర్ధధాతుక మగుటచే "అర్ధధాతుకస్యేడ్వలాదేః" (7-2-35) సూ. చే ఇడాగమము ప్రసక్తమగుచున్నను ఇడాగమనిమిత్తమగు వకారము శస్ ప్రత్యయము పరమగునపుడు విధింపబడు సంప్రసారణముచే (వసోస్సంప్రసారణమ్ 438) నాశనముబొందనున్నదగుటవలన నట్టి వకారము నిమిత్తముగాగల ఇడాగమము పూర్వము ప్రవర్తించదు. సన్ధికార్యోపయుక్తములై ప్రథమాధ్యాయస్థములగు పరిభాషలయొక్క ప్రకరణము సమాప్తినొందెను.

ఇది పరిభాషాప్రకరణము.

# 3. స్వరసన్ధి ప్రకరణము

*48. ఇకో యణచి 6-1-77. ఇకః, యణ్, అచి, (సంహితాయామ్).
ఇకస్స్థానే యణ్ స్యాదచి సంహితాయాం
విషయే. సుధీ, ఉపాస్య ఇతి స్థితే స్థానత ఆన్తర్యా
దీకారస్య యకారః. సుధ్ య్ ఉపాస్య ఇతి జాతే॥

48. "షష్ఠీస్థానే యోగా", "తస్మిన్నితి" పరిభాష లిం దుపస్థితములగును. వర్ణములకు గల యత్యన్త సాన్నిధ్యము సంహిత యని చెప్పబడెను. సంహిత వివక్షితమైనపు డచ్చునకవ్యవహితపూర్వమందున్న నిక్కుల స్థానమందు (ఇ, ఉ, ఋ, ఌ, వీని సవర్ణములు) యణ్ణులు (య్, వ్, ర్, ల్) ఆదేశము లగును. ఇచట నుద్దేశ్యమగు నిక్కునకు, నిమిత్తమగు నచ్చునకు సంహితయపేక్షితము. సుధీ+ఉపాస్యః (సుధీభిరుపాస్యః) అనుచోట నీకారమునకు స్థానే నరతమపరిభాషచే, తాలుస్థానకృతసాదృశ్యముగల యకార మాదేశ మగును. కావున సుధ్ య్ ఉపాస్యః (సుధ్యుపాస్యః) అని అయినది.

* 49. అనచి చ. 8-4-47, అనచి, చ, (అచః, యరః ద్వే, వా).
అచః పరస్య యరో ద్వే వా స్తో న త్వచి.
ఇతి ధకారస్య ద్విత్వమ్॥

49. అచ్చుకంటె పరమగు యర్ ప్రత్యాహారవర్ణమునకు ద్విత్వము వికల్పముగా వచ్చును. అచ్చు పరమగునపుడు రాదు. సుధ్ య్-ఉపాస్యః అనుచోట ధకారమున కీ సూత్రముచే ద్విత్వమగును. సుధ్ ధ్ య్ ఉపాస్యః అని యగును.

వివరణము: ఇచట ద్విత్వమన యర్ వర్ణమును రెండుమారు లుచ్చరించుట యని యర్థము. "అనచి" (న అచ్ అనచ్, తస్మిన్) యనుచోట ప్రసజ్యప్రతిషేధముగాని పర్యుదాసముగాదు. నఞ్ సమాసమున, నఞర్థము (నిషేధము) తరపదార్థముతోగాక క్రియతో నన్వయించుచోట ప్రసజ్య ప్రతిషేధమనియు, నఞర్థము తరపదార్థముతో నన్వయించునపుడు పర్యుదాసమనియును గ్రహించునది. అనచి యనునది ప్రసజ్యప్రతిషేధము (అచి పరే న భవతి) గాన నచ్చు పరమగునపుడు ద్విత్వనిషేధమని యర్థము. హల్లు పరముగనున్నపుడుగాని, యవసానమందు (ఏవర్ణము పరముగా లేనపుడు) గాని ద్విత్వము ప్రవర్తించును. సుధ్ య్ ఉపాస్యః అనుచోట యక్రారునకు హల్లు పరముగనున్నది. ప్రసజ్యప్రతిషేధ మనుటచేతనే వాక్ యనుచోట నవసానమందలి కకారమునకును ద్విత్వము సిద్ధమగును. అనచి యనునది పర్యుదాసమనిన, నచ్చుకంటె భిన్నము, నచ్చుతో సదృశము నగు వర్ణ మనగా హల్లు పరముగనున్నప్పుడే ద్విత్వమని యర్థము గావలయును. వాక్ ఇత్యాదులలో నవసానమందలి యక్రారునకిష్టమగు ద్విత్వము సిద్ధముగాకుండును. ప్రసజ్య

ప్రతిషేధమే సూత్రకృదభిప్రేతమని గ్రహింపదగును. లేనిచో లఘుభూతమగు "హలి చ" అను సూత్రమునే రచియించియుండును.

* 50. స్థానివదాదేశోఽనల్విధౌ. 1-1-56. స్థానివత్, ఆదేశః, అనల్విధౌ.

ఆదేశస్స్థానివత్స్యాన్నతు స్థాన్యలాశ్రయవిధౌ. అనేనేహ యకారస్య స్థానివద్భావేనాచ్త్వ మాశ్రిత్య, అనచిచేతి ద్విత్వ నిషేధో న శఙ్క్యః, ఽనల్విధావితి తన్నిషేధాత్.

50. ఆదేశము స్థానిసదృశమగును, అనగా నాదేశముచే స్థాని యపహృతమయినను, స్థాని యున్నపుడు వచ్చెడి కార్యమాదేశము ప్రవర్తించినపుడును వచ్చును. స్థానిరూపముగాని, స్థానికవయవముగాని యగు నల్లను (వర్ణము) ఆశ్రయించి వచ్చెడి, కార్యము చేయునపు డీ యతిదేశము (స్థానివద్భావము) ప్రవర్తింపదని యర్థము. ఇట్లు స్థాన్యలాశ్రయవిధిలో, స్థానివద్భావనిషేధము చెప్పబడినందున, సుధ్ధ్యుపాస్యః యనుచోట యకారమునకు స్థానివద్భావముచే నచ్త్వమునాశ్రయించి, "అనచిచ" అనుద్విత్వ నిషేధము శఙ్కింపవలనుపడదు. ప్రకృతమున యకారమునకు స్థానియగు నచ్చునాశ్రయించి ప్రవర్తించునదగుటవలన ద్విత్వనిషేధము స్థాన్యలాశ్రయవిధి యగునని తెలియనగును.

వివరణము: స్థానివద్భావమునకుదాహరణము: రామాయ (రామ+ఙే) ఇచట ఙేర్యః (205) సూ. చే, ఙేప్రత్యయమునకు యాదేశము విధింపబడెను. రామ+య. స్థాని సుప్పగాన దానియందలి సుప్త్వమాదేశమం దతిదేశింపబడును. కావుననే, సుపిచ (203) సూ. చే దీర్ఘము ప్రవర్తించును. స్థాన్యాదేశములు పరస్పరము భిన్నములగుటచేతను, ఈ శాస్త్రమున "స్వంరూపం" సూత్రమునుండుటచే శబ్దమున కరముతో గూడిన యానుపూర్వియే (శబ్దమే) యర్థము గాన సుప్పులనిన సు, ఔ, జస్, ఙే, భ్యామ్ మొదలగుశబ్దములే యగుచుగును. కాన "సుపిచ" సూ. చే దీర్ఘము, రామాభ్యామనుచోట (రామ+భ్యామ్) ప్రవర్తించును గాని, రామాయ అనుచోట యాదేశముచే సుప్పగు ఙేప్రత్యయ మపహరింపబడుటవలన యాదేశము సుప్పగాకపోవుటచేత నీ స్థానివత్సూత్రములేనిచో ప్రకృతమున దీర్ఘము రాకపోవును.

* 51. అచః పరస్మిన్ పూర్వవిధౌ. 1-1-57. అచః, పరస్మిన్, పూర్వవిధౌ.

అల్విధ్యర్థమిదమ్ । పరనిమిత్తోఽజాదేశః స్థానివత్స్యాత్ స్థానిభూతాదచః పూర్వత్వేన దృష్టస్య విధౌ కర్తవ్యే । ఇతి స్థానివద్భావే ప్రాప్తేః

5. స్థాన్యలాశ్రయవిధి జేయునపుడు స్థానివద్భావముకొఱకీ సూత్ర మారమ్భింపబడెను. పరనిమిత్తకము, అజ్మాత్రస్థానికము నగు (అచ్చుయందే విధింప

బడు) నాదేశము, స్థానియగు నచ్చునకు బూర్వమందున్న వర్ణమున కేదైన గార్యము చేయునపుడు స్థానివంటిదగును. సుధ్ యు్ ఉపాస్యః అనుచోట "అనచి చ" (49) సూ. చే ధకారమునకు ద్విత్వనిషేధము చేయునపుడు పరమగు యకారము నిమిత్తముగల్గి, ఇకారమునకు వచ్చిన యణాదేశమున కీ సూత్రముచే స్థానివద్భావము ప్రాప్తమగుచున్నది.

వివరణము : అస్విధ్యర్థమగు నీసూత్రమునకు, వవ్రశ్చ యనుచోట ప్రథమ వకారమునకు సంప్రసారణనివృత్తి ఫలము. వవ్రశ్చ యనునది, వ్రస్చూ (ఛేదనే) ధాతువునకు లిట్ ప్రథమైకవచనము. వ్రశ్చ ధాతువునకు ద్విత్వము, సంప్రసారణము మొదలగునవి ప్రవర్తించినచో వవ్రశ్చ అని సిద్ధమగును. ఇచట సంప్రసారణమువలన యభ్యాసమున బ్రవర్తించిన ఋకారమునకు (వృవ్రశ్చ) ఉరత్ (7-4-66) సూ. చే అకారము వచ్చుటచే, వవ్రశ్చ అని యగును. అభ్యాస వకారమునకు "లిట్యభ్యాసస్యోభయేషామ్" (6-1-17) సూ. చే సంప్రసారణము తిరుగ బ్రాప్తమగుచుండ, నీసూత్రముచే స్థానివద్భావము ప్రవర్తించును. "నసంప్రసారణే సంప్రసారణమ్" (3-5) సూ. చే సంప్రసారణము నిషిద్ధమగును. ఇచట సంప్రసారణనిషేధము స్థాన్యల్లగు ఋకారము నాశ్రయించిన దనుటవలన నల్విధియగును.

(2) ఇచట పూర్వత్వ మితరవర్ణముతో వ్యవధానరహితమైనదే గాక వర్ణాన్తరముతో వ్యవధానసహితమైనదియును గ్రహింపదగును. స్వరము చేయునపుడు నపదాన్త సూత్రముచే స్థానివద్భావనిషేధ మీవిషయమున ప్రమాణము. చికీర్షకః అనుచోట "లితి" (6-1-193) సూ. చే నీకారమున కుదాత్తము చేయునపుడు షకారముపై నకారమునకు వచ్చిన లోపమునకు స్థానివద్భావము నిషేధింపబడెను. ఈ సూత్రమున నవ్యవహితపూర్వత్వమునే గ్రహించినచో లోపస్థానియగు నకారమునకు నీకారము వ్యవహితపూర్వమైనందున నిషేధము వ్యర్థమగును.

(3) పూర్వవిధౌ అనుచోట పూర్వస్య విధిః, పూర్వస్మాద్విధిః, అని ద్వివిధమగు విగ్రహమును గ్రహింపవలయును. షష్ఠీసమాసమునకు ఫలము వవ్రశ్చ అనునది. పఞ్చమీసమాసమునకు ఫలము ముందు ప్రదర్శింపబడును.

* 52. న పదాన్తద్విర్వచనపరే యలోపస్వరసవర్ణానుస్వార
దీర్ఘజశ్చర్విధిషు. 1-1-58. న, పదాన్త...విధిషు, (స్థానివత్)

పదస్యచరమావయవే ద్విర్వచనాదౌ చ
కర్తవ్యే పరనిమిత్తోఽజాదేశో న స్థానివత్.
ఇతి స్థానివద్భావనిషేధః.

52. పదాన్తశబ్దము మొదలు చర్శబ్దాన్తమువఱకు గల శబ్దములకు ద్వన్ద్వము. దీనికి విధిశబ్దముతో తత్పురుషము. (1) పదమునకు చరమావయవము (చివరభాగము) (2) ద్విత్వము (3) వరచ్ ప్రత్యయము పరముగ నున్నపుడు

ప్రవర్తించు నజాదేశము (4) యకారమునకు లోపము (5) స్వరము (ఉదాత్తాదులు) (6) సవర్ణము (7) అనుస్వారము (8) దీర్ఘము (9) జశ్త్వము (10) చర్త్వము, ఇవి చేయునపుడు పరనిమిత్తకమగు నజాదేశము స్థానివద్భావము నొందదు. పూర్వసూత్రమున కిది నిషేధము. సుధ్ ధ్ య్ ఉపాస్యః అనుచోట ధకారమునకు ద్విత్వము చేయునపు డీసూత్రముచే స్థానివద్భావనిషేధము ప్రవర్తించును గావున ద్విత్వము నిశ్శఙ్కముగ ప్రవర్తించును.

వివ:—సూత్రమునకు క్రమముగ నుదాహరణములు (1) కాని + సన్తి, (2) సుధ్ధ్యుపాస్యః, (3) యాయావరః, (4) యాతిః, (5) చికీర్షకః (6, 7) శిణ్ఢి, (8) ప్రతిదీవ్నః, (9) సగ్ధిశ్చమే, (10) జక్షతుః. గ్రన్థవిస్తరభీతిచే నుదాహరణస్వరూపముమాత్రము నిర్దేశింపబడెను.

* 53. ఝలాం జశ్ ఝశి. 8-4-53. ఝలాం, జశ్, ఝశి.
స్పష్టమ్. ఇతి ధకారస్య దకారః.

53. ఝల్ వర్ణములకు ఝశ్ వర్ణములు పరమగునపుడు, జశ్శులాదేశము లగును. సుధ్ ధ్ య్ ఉపాస్యః, ఇచట ప్రథమధకారమున కాన్తరతమపరిభాషచే దకారము వచ్చును.

* 54. అదర్శనం లోపః 1-1-60. అదర్శనమ్, లోపః.
ప్రసక్తస్యాదర్శనం లోపసంజ్ఞం స్యాత్.

54. శాస్త్రమువలనగాని, అర్థమువలనగాని ప్రసక్తములగు ప్రత్యయాదులయొక్క యుచ్చారణాభావము లోపమనబడును.

వివ:—లిట్ అనుచోట, "స్వౌజసమౌట్" (184) శాస్త్రముచే ప్రసక్తిగల సుప్రత్యయముయొక్క యుచ్చారణాభావము లోపమగును. (హల్ఙ్యాదిసూత్రముచే సులోపము) ప్రాసాదాత్ప్రేక్షతే (ప్రాసాదమధిరుహ్య ప్రేక్షతే) ఇచట నర్థమువలన ప్రసక్తమగు ల్యప్ ప్రత్యయముయొక్క యుచ్చారణాభావము లోపమగును. కావున "ల్యబ్లోపే పఞ్చమీ" అను వచనముచే ప్రాసాదశబ్దమునకు పఞ్చమీవిభక్తి వచ్చినది.

* 55. సంయోగాన్తస్య లోపః. 8-2-23. సంయోగాన్తస్య, లోపః.
సంయోగాన్తం యత్పదం తదన్తస్య లోపస్స్యాత్.
ఇతి యలోపే ప్రాప్తే. (వా) యణః ప్రతిషేధో వాచ్యః (వా) యణో మయో ద్వే వాచ్యే. మయ ఇతి పఞ్చమీ, యణ ఇతి షష్ఠీతిపక్షే యకారస్యాపి ద్విత్వమ్. తదిహ ధకార యకారయోర్ద్విత్వ వికల్పాత్ చత్వారి రూపాణి. ఏకధమేకయమ్. ద్విధమ్ ద్వియమ్. ద్విధమేకయమ్. ఏకధం ద్వియమ్. సుద్ధ్యుపాస్యః. మధ్వరిః. ధాత్రంశః. లాకృతిః

55. సంయోగాన్తమందుగల పదముయొక్క తుదిహల్లు లోపించును. సుద్ ధ్ య్ ఉపాస్యః అనుచోట సుద్ ధ్ య్ అనునది సంయోగాన్తము, పద సంజ్ఞకము నగుటవలన యకారలోపము ప్రసక్తమగుచున్నది. (వా) యణ్ణులకు సంయోగాన్తలోపనిషేధను చెప్పదగును. ప్రకృతమున నీవార్తికముచే యలోపము వారితమగును. (వా) యణ్ణులకంటె పరములగు మయ్వర్ణములకు, మయ్యులకంటె పరములగు యణ్ణులకును ద్విత్వము వచ్చును. "యణోమయోర్ద్వే వాచ్యే" అను వార్తికమునకు పైరీతిగ వ్యాఖ్యాద్వయము భాష్యకారునిచే చేయబడెను. ఇందు ప్రథమవ్యాఖ్యానమున "సుధ్ధ్యుపాస్యః" అనుచోట యకారమునకు ద్విత్వము రాదు. ద్వితీయవ్యాఖ్యానమున యకారమునకు ద్విత్వము వచ్చును గాన ద్విత్వ వికల్పము ఫలితమగును. ధకారమునకు "అనచిచ" (49) సూ. చే ద్విత్వ వికల్పము. ఇట్లు ధకార యకారములకు ద్విత్వవికల్పమువలన * సుద్ధ్యుపాస్యః అనుచోట ప్రదర్శింపబోవురీతిని నాల్గురూపములు సాధువులగును. (1) ధకార యకారములకు ద్విత్వము ప్రవర్తించనపుడు సుధ్యుపాస్యః. (2) ధకార యకారములకు ద్విత్వముచేయునపుడు సుద్ ధ్ య్యుపాస్యః. (3) ధకారమునకే ద్విత్వము, సుద్ ధ్యుపాస్యః. (4) యకారమునకే ద్విత్వము, సుధ్ య్యుపాస్యః. ఉకారమునకు యణాదేశోదాహరణము మధ్వరిః (మధు+అరిః). ఋకారమునకు ధాత్రంశః. (ధాతృ+అంశః), ౡకారమునకు లాకృతిః (ౡ + ఆకృతిః).

వివ :—*సుధీ శబ్దము సుపూర్వక ధ్యై(చిన్తాయామ్) ధాతువునకు క్విప్ సంప్రసారణమువలన సిద్ధమగును. సంప్రసారణమగు నీకారమున కచ్చుపరమగు నపుడు "సంప్రసారణాచ్చ" (331) సూ. చే పూర్వరూపము ప్రసక్తమగుటచే సుధ్యుపాస్యః అనుచోట యణాదేశము దుర్లభమనుశఙ్కకు సమాధాన మిది. సంప్రసారణము, అచ్చు, సమానాఙ్గములోనివైనపుడే పూర్వరూపము వచ్చునను నర్థముగల వార్తికము (సంప్రసారణపూర్వత్వే సమానాఙ్గగ్రహణం కర్తవ్యమ్) గలదు. ప్రకృతమున నీకారోకారములు విభిన్నాఙ్గస్థములగుటచే పూర్వరూపము నివారితమగును. మఱియు నీకారము సంప్రసారణస్థానమున వచ్చినదగుటచేతను, "అనల్విధౌ" యను నిషేధముచే స్థానివద్భావము ప్రవర్తింపకపోవుటవలనను, సంప్రసారణమే గానందున పూర్వరూపప్రసక్తియే లేదు. "నభూసుధియోః" (274) అను యణ్ణిషేధకసూత్ర మఙ్గాధికారములోనిదగుటచే ప్రత్యయము పరమగు నపుడే యణాదేశమును నిషేధించును. ప్రకృతమున సుధీశబ్దమునకు ప్రత్యయము పరముగ లేనందున నా నిషేధశఙ్కయును నివృత్తమగును.

* 56. నాదిన్యాక్రోశే పుత్రస్య 8-4-48 న, ఆదినీ, ఆక్రోశే, పుత్రస్య. (ద్వే)

పుత్రశబ్దస్య న ద్వే స్త ఆదినీశబ్దే పరే, ఆక్రోశే గమ్యమానే, పుత్రాదినీ త్వమసి పాపే. ఆక్రోశే కిమ్. తత్త్వకథనే ద్విర్వచనం భవత్యేవ. పుత్త్రాదినీ సర్పిణీ. (వా) తత్పరే చ, పుత్ర

పుత్రాదినీ త్వమసి పాపే. (వా) వా హతజగ్ధయోః.
పుత్రహతీ, పుత్త్రహతీ. పుత్రజగ్ధీ, పుత్త్రజగ్ధీ.

56. పుత్రశబ్దమున కవయవమగు యర్ణమునకు (త్) ఆదినీశబ్దము పరమై, సముదాయముచే నింద గమ్యమానమైనపుడు ద్విత్వము ప్రవర్తించదు. పుత్రాదినీ. పుత్రులను బాధించునదనియర్థముగాన నింద ప్రతీయమానమగుచున్నది. ఇచట తకారమునకు "అనచి చ" సూ. చే ప్రాప్తమగు ద్విత్వము నిషేధింపబడెను. నింద గాక, పుత్రులను తినునదనియర్థమును చెప్పునపుడీ నిషేధము ప్రవర్తించదు. పుత్త్రాదినీ సర్పిణీ. ఆడపాము తన పిల్లలను తినునదగుటచే నింద గానందున నిషేధము ప్రవర్తించదుగాన ద్విత్వము వచ్చును. (వా) ఆదినీశబ్దము పరమందుగల పుత్రశబ్దము పరముగునపుడును పుత్రశబ్దావయవ తకారమునకు నింద గమ్యమానమైనపుడు ద్విత్వము ప్రవర్తించదు. పుత్రపుత్రాదినీ త్వమసి పాపే. (వా) హత, జగ్ధశబ్దములు పరములుగ నున్నపుడు నింద గమ్యమానమైనపుడు పుత్రశబ్దావయవ తకారమునకు ద్విత్వనిషేధము వికల్పముగ నగును. పుత్రహతీ, పుత్త్రహతీ. పుత్రజగ్ధీ, పుత్త్రజగ్ధీ. పుత్రులను పీడించునదనియే యర్థముగాన నింద ప్రతీయమానమగును.

వివరణము : సూత్రములోని "ఆదినీ" అనునది లుప్తసప్తమిగల జీబన్తము. పుత్రులను తినుచున్నావనునింద సహజముగ స్త్రీవిషయకమురే యుండునుగాన నిట్లుచెప్పటయే యుచితముగాని, ఆదిని అని విభాగముచేసి ఆదిన్ శబ్దమునకు సప్తమ్యన్తమనుట యుచితముగాదు.

* 57. త్రిప్రభృతిషు శాకటాయనస్య 8-4-50. త్రిప్రభృతిషు, శాకటాయనస్య. (న, ద్వే)

త్ర్యాదిషు వర్ణేషు సంయుక్తేషు వా ద్విత్వమ్.
ఇన్ద్రః, ఇన్ద్ద్రః, రాష్ట్రమ్. రాష్ట్ట్రమ్.

57. త్రిప్రభృతిషు అనునది నిర్ధారణసప్తమ్యన్తము. మూడు మొదలుగాగల సంయుక్తవర్ణములందు దచ్చుకంటె పరమగు యర్ణమునకు ద్విత్వనిషేధము శాకటాయనమహర్షి మతమున నగును. అన్యమతమందు ద్విత్వము ప్రవర్తించుటచే వికల్పము ఫలితమగును. ఇన్ద్రః, ఇన్ద్ద్రః, రాష్ట్రమ్, రాష్ట్ట్రమ్.

వివరణము : మూడుమొదలుగాగల వర్ణము లనుచోట వర్ణశబ్దము పరస్వరసాహచర్యముచే సజాతీయములను బోధించును. మూడచ్చులు కలియుట యసంభవముగాన నట్టివి హల్లులే యగును. ఇట్లు సిద్ధమైనదే మూలమున సంయుక్తేషు అనునది.

* 58. సర్వత్ర శాకల్యస్య. 8-4-51. సర్వత్ర, శాకల్యస్య. (న, ద్వే)
ద్విత్వం న. అర్కః, బ్రహ్మా.

58. శాకల్యునిమతమున నెచటను ద్విత్వము రాదు. అర్కః, బ్రహ్మ. వీనిలో క్రమముగ కకార మకారములకు "అచోరహాభ్యామ్" (60) సూ. చే ప్రాప్తమగు ద్విత్వమునకీ సూత్రముచే నిషేధమని గ్రహింపదగును.

* 59. దీర్ఘాదాచార్యాణామ్. 8-4-52. దీర్ఘాత్, ఆచార్యాణామ్. (న, ద్వే)

ద్విత్వం న. దాత్రమ్, పాత్రమ్.

59. కొందరి వైయాకరణుల మతమున దీర్ఘముకంటె పరమగు యర్వర్ణమునకు ద్విత్వము ప్రవర్తించదు. దాత్రమ్, పాత్రమ్.

* 60. అచో రహాభ్యాం ద్వే. 8-4-53. అచః, రహాభ్యామ్, ద్వే. (వా)

అచః పరాభ్యాం రేఫహకారాభ్యాం పరస్య యరో ద్వే వా స్తః. హర్య్యనుభవః. నహ్య్యస్తి.

60. అచ్చుకంటె పరములగు రేఫ హకారములకంటె పరమయిన యర్వర్ణమునకు ద్విత్వము వికల్పముగ నగును. హర్య్యనుభవః. నహ్య్యస్తి.

* 61. హలో యమాం యమి లోపః. 8-4-64. హలః, యమాం, యమి, లోపః. (వా)

హలః పరస్య యమో లోపస్స్యాద్వా యమి. ఇతి లోపపక్షే ద్విత్వాభావపక్షే చ ఏకయం రూపం తుల్యమ్. లోపారమ్భఫలం తు, ఆదిత్యో దేవతాస్యేత్యాదిత్యం హవిరిత్యాదౌ. యమాం యమీతి యథాసంఖ్యవిజ్ఞానాన్నేహ. మాహాత్మ్యమ్.

61. హల్లుకంటె పరములగు యమ్ వర్ణములకు, యమ్ వర్ణములు పరమైనపుడు లోపము వికల్పముగ నగును. హర్య్యనుభవః ఇత్యాదులలో యకారమునకు "అచోరహాభ్యామ్" సూ. చే ద్విత్వము వచ్చినపిదప నీ సూత్రముచే ప్రథమ యకారమునకు లోపమగును. యలోపము ప్రవర్తించినపక్షమందు, ద్విత్వము రానపుడు నొక యకారముగల రూపము (హర్యనుభవః) సమానమే గాన నీ లోపశాస్త్రారమ్భమునకు "ఆదిత్యమ్" (హవిః) అనుచోట యలోపము ఫలమగును. ఆదిత్యుడు దేవతగాగల హవిస్సను నర్థమున ఆదిత్యశబ్దముకంటె ణ్య (య) ప్రత్యయము చేసిన నాదిత్య్యమ్మనురూపము సిద్ధమగును. ఇచట ద్విత్వము ప్రవర్తింపకున్నను, ప్రకృతిప్రత్యయములకు సమ్బన్ధించిన యకారద్వయ మున్నందున నీ సూత్రముచే నొకయకారమునకు లోపము ప్రవర్తింపనిచో నిష్టమగు నేకయకారముగల నాదిత్యశబ్దము సిద్ధింపదు. ఈ సూత్రమున "యథాసంఖ్య" (129) సూత్రసహాయముచే యమ్ములకు యమ్ములు క్రమముగ పరమగునపుడే లోపము (యకారమునకు యకారము పరమగునపుడు, ఈ రీతిని) అని వ్యాఖ్యానము చేయవలయును. కావుననే మాహాత్మ్యమనుచోట మకారమునకు మకారము పరముగ లేనందున లోపము ప్రవర్తించదు,

* 62. ఏచోఽయవాయావః 6-1-78 ఏచః, అయవాయావః. (అచి)
ఏచః క్రమాత్ అయ్, అవ్, ఆయ్, ఆవ్, ఏతే స్యురచి.

62. ఏ, ఓ, ఐ, ఔ, ల కచ్చుపరమగునపుడు క్రమముగ అయ్, అవ్, ఆయ్, ఆవ్, ఆదేశములగును.

* 63. తస్య లోపః 1-3-6 తస్య, లోపః.
తస్యేతో లోపస్స్యాత్, ఇతి యవయోర్లోపో న. ఉచ్చారణ సామర్థ్యాత్. ఏవంచేత్సంజ్ఞాపీహ న భవతి. హరయే. విష్ణవే. నాయకః. పావకః.

63. ఇత్సంజ్ఞగలవర్ణమునకు లోపమగును. అయాద్యాదేశములలోని యకార వకారముల కుచ్చారణసామర్థ్యమువలన నీ సూత్రముచే లోపము రాదు. లోపమురానపు డావర్ణములకు హలన్త్యసూత్రముచే నిత్సంజ్ఞయును రాదు. ఏచోయవాయావః అనుసూత్రమునకు క్రమముగ నుదాహరణములు : హరయే (హరే+ఏ), విష్ణవే (విష్ణో+ఏ), నాయకః (నై+అకః), పావకః (పౌ+అకః).

* 64. వాన్తోయిప్రత్యయే. 6-1-76. వాన్తః, యి, ప్రత్యయే.
యకారాదౌ ప్రత్యయే పరే ఓదౌతోరవ్, ఆవ్, ఏతౌ స్తః. గోర్వికారో గవ్యమ్, "గోపయసో ర్యదితియత్". నావాతార్యం నావ్యమ్. నౌవయో ధర్మేత్యాదినా యత్. వా। గోర్యూతౌ ఛన్దస్యుపసంఖ్యానమ్. వా। అధ్వపరిమాణే చ. గవ్యూతిః. ఊతియూతీత్యాదినా యూతిశబ్దో నిపాతితః. వాన్త ఇత్యత్ర వకారా ద్దో ర్యూతావిత్యత్ర ఛకారాద్వా పూర్వ భాగే, "లోపోవ్యోర్వలీ"తి లోపేన వకారః ప్రశ్లిష్యతే. తేన శ్రూయమాణ వకారాన్త ఆదేశస్స్యాత్. వకారో న లుప్యత ఇతి యావత్.

64. యకారమాదియందుగల ప్రత్యయము పరమగునపుడు ఓకారమునకు అవ్, ఔకారమునకు ఆవ్, ఆదేశమగును. గవ్యమ్ (గో+య) గోశబ్దమునకు వికారార్థమందు "గోపయసోర్యత్" (4-3-160) సూ.చే యత్ ప్రత్యయమగును. ఓకారమున కవాదేశము. నావ్యమ్ (నౌ+య) నౌశబ్దముకంటె నావచేత దాట దగినదనుయర్థమందు "నౌవయోధర్మ" (4-4-91) సూ. చే యత్ప్రత్యయము. ఔకారమున కావాదేశము. వా। గోశబ్దమునకు యూతిశబ్దము పరముగనున్నపుడు ఛన్దస్సునం దవాదేశమగును. "ఆనోమిత్రావరుణౌ ఘృతైర్గవ్యూతిముక్షతమ్". వేదములోనిదని స్పష్టముగ తెలియుటకై వాక్య ముదాహరింపబడెను. "ఊతి యూతిజూతిసాతిహేతికీర్తయశ్చ" (3-3-97) సూ. చే యూతిశబ్దము నిపాతించబడెను. యూతిశబ్దము ప్రత్యయముగానందున సూత్రముచే నాదేశ మప్రాప్తమగుచుండ నీ వచనమారమ్భింపబడెను. వా। గోశబ్దమునకు యూతిశబ్దము పరముగనున్నపుడు, సముదాయముచే మార్గముయొక్క పరిమితి గమ్యమాన

మైనపుడును, అవాదేశము వచ్చును. లౌకికభాషయందును గవ్యూతి (క్రోశయుగము) శబ్దము సాధువనుటకీ వార్తికమారమ్భింపబడినది. గవ్యూతిః అనుచోట "లోపశ్శాకల్యస్య" (68) సూ. చే ప్రసక్తమగు లోపమును వారించుట కుపాయమేమన, "వాన్తోయి" సూత్రమున వాన్తః అనుచోట వకారమునకు పూర్వమునగాని "గోర్యూతౌ" అను వార్తికమున ఛకారమునకు పూర్వమునగాని వకారప్రశ్లేషము జేసి "లోపోవ్యోర్వలి" (6-1-76) సూ.చే వలోపము చేయవలెను. వకారాన్తమగు నవాదేశమగునని యర్థము లభించును. సహజముగా వాన్తమగు నవాదేశమునకు వాన్తముగావలయుననువిశేషణమువలన వకారమెపుడును లోపించదని ఫలితమగును.

వివరణము : యేన విధిసూత్రమున కపవాదమైన "యస్మిన్విధిస్తదాదావల్గ్రహణే" (వర్ణబోధకము, సప్తమ్యన్తము నగు విశేషణ మావర్ణ మాదియందుగలదానికి (తదాది) బోధకమగును) అను వార్తికకారునిచే పఠింపబడిన పరిభాషచే, యి, అనుదానికి యకారాదౌ అను నర్థము లభించినది.

* 65. ధాతోస్తన్నిమిత్తస్యైవ. 6-1-80. ధాతోః, తన్నిమిత్తస్య, ఏవ, (వాన్తో యిప్రత్యయే).

యాదౌ ప్రత్యయే పరే ధాతోరేచశ్చేద్వాన్తాదేశస్తర్హి తన్నిమిత్తస్యైవ, నాన్యస్య. లవ్యమ్. అవశ్యలావ్యమ్. తన్నిమిత్తస్యేతి కిమ్. ఓయతే. ఔయత.

65. యకారాది ప్రత్యయము పరమైనపుడు ధాతుసమ్బన్ధులగు ఓకారౌకారములకు వాన్తాదేశమైనచో, యకారాదిప్రత్యయనిమిత్తకములగు ఓకారౌకారములకే వచ్చునుగాని తదితరములకు రాదు. లవ్యమ్ (లో+య) లూఞ్ (ఛేదనే) ధాతువునకు యత్ ప్రత్యయము. దీనిని నిమిత్తముగ జేసికొని ఊకారమునకు గుణాదేశము (ఓ) వచ్చును. అవశ్యలావ్యమ్ (అవశ్యలౌ+య) అవశ్యంభావము ద్యోత్యమగునపుడు లూ ధాతువునకు ణ్యత్ (య) ప్రత్యయము వచ్చును. ఈ ప్రత్యయమును నిమిత్తముగ జేసికొని వృద్ధి (ఔ) వచ్చును. అవశ్యశబ్దమునకు లావ్యశబ్దముతో "మయూరవ్యంసకాదయశ్చ" (758) సూ. చే సమాసము. లవ్యమ్, అవశ్యలావ్యమ్ మొదలగువానిలో వాన్తాదేశము "వాన్తోయి" సూత్రముచేతనే సిద్ధమగుచుండ నీసూత్రము నియమార్థమగును. ధాతుసమ్బన్ధియగు ఏచ్చునకు వాన్తాదేశమైనచో యాదిప్రత్యయనిమిత్తమగు ఏచ్చునకే యగునని నియమస్వరూపము. ఓయతే, ఔయత, అనుచోట "వాన్తోయి" సూ. చే ప్రాప్తమగు వాన్తాదేశమును వారించుటయే నియమమునకు ఫలము. ఓయతే. ఆఙ్ పూర్వక వేఞ్ ధాతువునకు కర్మార్థక లట్ ప్రథమైకవచనము. ఇచట ఆకారమునకు, వేధాతువునకు సంప్రసారణాదులవలన సిద్ధమగు ఊకారమునకును, గుణమువలన ఓకారమేర్పడియెను గాని యాదిప్రత్యయనిమిత్తకము గాదు. ఓకారము "అన్తాదివచ్చ" (76) సూ.

వలన పరాదివద్భావముచే ధాతుసమ్బన్ధియగు ఏచ్చుమాత్రమగును. ఔయత. వేఞ్ ధాతువునకు కర్మార్థక లఙ్ ప్రథమైకవచనము. ఇచట ధాతువునకు పూర్వమాడాగమము (ఆ) వచ్చును. దీనికిని, ధాతువునకు సంప్రసారణాదులవలన నేర్పడిన ఉకారమునకును "ఆటశ్చ" (270) సూ. చే వృద్ధిచేయుటవలన ఔకారము సిద్ధమాయెను. ఔకారము యకారాది ప్రత్యయనిమిత్తకము గానందున నావాదేశము వారింపబడును.

వివరణము: ఈ సూత్రమున నేవకారము లేకపోయినను "వాన్తోయి" సూత్రముచే విధింపబడిన వాన్తాదేశ మీ సూత్రలక్ష్యములందును ప్రవర్తించుచుండ తిరుగ వాన్తాదేశవిధాయకమగు నీ సూత్రమునకు నియామకత్వము సిద్ధించును. అయినను ప్రసక్తమగు విపరీతనియమమును వారించుటకై ఏవకారాగ మావశ్యకమగును. యకారాది ప్రత్యయనిమిత్తకమగు నేచ్చునకు వాన్తాదేశమైనచో ధాతుసమ్బన్ధియగు నేచ్చునకే వచ్చునని విపరీతనియమాకారము. ఇట్టినియమము ప్రసక్తమైనచో ప్రాతిపదికముయొక్క ఏచ్చు యాదిప్రత్యయనిమిత్తకమైనపుడు బాభ్రవ్యాదులలో నిష్టమగు వాన్తాదేశము సిద్ధింపకపోవును. బభ్రుశబ్దమునకపత్యార్థమందు యఞ్ (య) ప్రత్యయము, తన్నిమిత్తకమగు గుణము (బాభ్రో+య) "వాన్తోయి" సూ. చే నవాదేశమును వచ్చినచో బాభ్రవ్యః అని యగును. ఏవకారమున్నయెడల నది తన్నిమిత్తస్య, అను పదముతోనే సమ్బన్ధము గలదగుటవలన మూలోక్తమగు నభీష్టనియమము లభించుటవలన దోషము వారితమగును.

* 66. క్షయ్యజయ్యౌ శక్యార్థే. 6-1-81. క్షయ్యజయ్యౌ, శక్యార్థే.
యాన్తాదేశనిపాతనార్థమిదమ్. క్షేతుం శక్యం క్షయ్యం.
జేతుంశక్యం జయ్యమ్. శక్యార్థే కిమ్. క్షేతుం, జేతుం,
యోగ్యం. క్షేయం పాపం, జేయం మనః.

66. క్షేతుం శక్యం (నశించుటకు శక్యమైనది), జేతుం శక్యం (జయించుటకు శక్యమైనది) అను నర్థమందు క్రమముగ క్షయ్యం, జయ్యమ్మను రూపములలో నయాదేశమును నిపతించుట కీసూత్రము. ఈ నిపాతనము లేనిచో నీ రూపములలో నేచ్చున కచ్చుపరముగానందున "ఏచోఽయవా" సూ. చే నయాదేశము రాకపోవును. శక్యార్థమందే యీనిపాతనమనుటచే యోగ్యార్థమందు క్షేయమ్ (క్షేతుం యోగ్యం=నశింపజేయుట కర్హమైనది. పాపము). జేయమ్ (జేతుం యోగ్యం= జయించుట కర్హమైనది. మనస్సు). అనుచోటుల నయాదేశము వారితమగును.

* 67. క్రయ్యస్తదర్థే 6-1-82 క్రయ్యః, తదర్థే.
తస్మై ప్రకృత్యర్థాయేదం తదర్థమ్. క్రేతారః
క్రీణీయురితి బుద్ధ్యా ఆపణే ప్రసారితం క్రయ్యమ్.
క్రేయమన్యత్. క్రయణార్హమిత్యర్థః.

67. సూత్రమున తదర్థశబ్దము ప్రకృత్యర్థముకొఱకు గుడా నిని బోధించును. క్రయ్యమ్ అనుచోట ప్రకృతి క్రీఞ్ ధాతువు. తదర్థము క్రయణము. (ద్రవ్య వినిమయము) క్రయార్థమగువస్తువునందు క్రయ్యమ్ అని నిపతింపబడును. అనగా అంగడియందునమ్ముటకై సిద్ధముగ నుంచబడినవస్తువు (ధాన్యము మున్నగునది) క్రయ్యమగును. ఈ యర్థమందు క్రయ్య మనుచోట (క్రే+య) అయాదేశమును నిపతించుట కీసూత్రము. విక్రయింపయోగ్యతగలదైనను విక్రయింపనఙ్గీకరింప బడని యిండ్లలో నుండు వస్తువును బోధించునపుడు క్రేయ మను రూపమే యగును (క్రేతుం యోగ్యమ్).

వివరణము: ధాన్యమునిచ్చి మూల్యమును గ్రహించువానికి ధాన్యము క్రయ్యమగును. కొనువానికా ధాన్యమే క్రేయమగును. భాష్యపర్యాలోచనము చేయ నిట్లు ధాన్యాదులకే క్రయ్యమని, క్రేయమనియు వ్యవహారముగాని ద్రవ్యమున కా ద్వివిధవ్యవహారము లేదని కొందఱి యాశయము.

* 68. లోపశ్శాకల్యస్య. 8-3-16. లోపః, శాకల్యస్య. (అపూర్వస్య, అశి, వ్యోః).

అవర్ణపూర్వయోః పదాన్తయో ర్యవయో ర్వా లోపోఽశి పరే. పూర్వత్రాసిద్ధమితి లోపశాస్త్రస్యాసిద్ధత్వా న్న స్వరసన్ధిః. హర ఏహి, హరయేహి. విష్ణ ఇహ, విష్ణవిహ. శ్రియా ఉద్యతః, శ్రియాయుద్యతః. గురా ఉత్కః, గురావుత్కః. కాని సన్తి, కా స్తః; ఇత్యత్రాన్తరఙ్గల్లోపస్య స్థానివత్త్వేన యణావాదేశౌ ప్రాప్తౌ, న పదాన్తేతి సూత్రేణ పదాన్తవిధౌ తన్నిషేధా న్న స్తః.

68. అవర్ణము పూర్వమందుగల్గి పదాన్తములగు యకార వకారములు, అశ్ వర్ణము పరమగునపుడు శాకల్యునిమతమున లోపించును. మతాంతరమున లోపించవు. హరే+ఏహి. ఇచట ఏకారమున కయాదేశము వచ్చినందున హరయ్ అని యగును. యకారమున కీసూత్రముచే లోపము. హర ఏహి, లోపము రానపుడు హరయేహి. ఇట్లే (విష్ణో+ఇహ) విష్ణఇహ,విష్ణవిహ. (శ్రియై+ఉద్యతః) శ్రియా ఉద్యతః, శ్రియాయుద్యతః. (గురౌ+ఉత్కః) గురా ఉత్కః, గురావుత్కః అనునవియును. యకార వకారలోపముగల హరఏహి మొదలగు రూపములందు పరరూప, గుణములు చేయునపుడు "పూర్వత్రాసిద్ధ" సూత్రముచే యలోప వలోపము లసిద్ధములగుటవలన పరరూపాది సన్ధికార్యములు ప్రవర్తించవు. హర+ఏహి అనుచోట "ఓమాఙోశ్చ" (81) సూ. చే పరరూపము, మిగిలిన చోటులందు గుణము ప్రాప్తించుచున్నదని యూహింపదగును. 'కాని సన్తి' ఇచట సన్తి అనునది అస్ ధాతువునకు లట్ ప్రథమ బహువచనము, ధాతువు

యొక్క అకారము లోపించినది. "కాస్తః" అనుచోట "స్తః" అనునది అస్ ధాతువునకు లట్ ప్రథమ ద్వివచనము. ఇచటను ధాత్వకారము లోపించినది. కాని సన్తి, కౌస్తః, అనుచోటుల అకారలోపమునకు "అచః పరస్మిన్" అను సూ. చే స్థానివద్భావమువలన క్రమముగ యణాదేశావాదేశములు ప్రాప్తములగుచున్నవిగాని యీ యాదేశములు పదాన్తవిధులగుటవలన "నపదాన్త" సూత్రముచే స్థానివద్భావము నిషేధింపబడునుగాన నీ యాదేశములు రావు.

* 69. ఏకః పూర్వపరయోః. 6-1-84. ఏక, పూర్వపరయోః ఇత్యధికృత్య.

69. ఈ సూత్ర ముత్తరసూత్రములలోని కధికృత మగును.

వివరణము : పూర్వపరశబ్దములు "అద్గుణః (70) ఇత్యాది సూత్రములలో నిర్దేశింపబడు పూర్వపరస్థానులను బోధించును. పూర్వస్థాని కొక యాదేశము, పరస్థాని కొక యాదేశము. ఇట్లు రెండాదేశములు ప్రసక్తమగుచుండ స్థానిద్వయమందు నొకే యాదేశము వచ్చుననుట కీసూత్ర ముపయోగించును. ఈ యధికారముతో సమ్బన్ధము గల సూత్రములచే విధింపబడునవి యేకాదేశములని వ్యవహరింపబడును.

* 70. అద్గుణః 6-1-87 అత్, గుణః. (అచి)

అవర్ణా దచిపరే పూర్వపరయో రేకో గుణాదేశస్స్యాత్ సంహితాయామ్. ఉపేన్ద్రః. రమేశః. గఙ్గోదకమ్.

70. అవర్ణముకంటె నచ్చు పరమగునపుడు పూర్వపరస్థానులం దొక గుణ మాదేశమగును, సంహిత వివక్షిత మైనపుడు. ఉపేన్ద్రః (ఉప+ఇన్ద్రః) హ్రస్వాకారమున కచ్చుపర మైనపు డుదాహరణ మిది. సూత్రమున "అత్" అనునది అ శబ్దమునకు పఞ్చమ్యేకవచనముగాని తపరకరణము గాదు. కాన పదునెనిమిది విధములగు అకారములను గ్రహించునని సూచించుటకై "రమేశః" (రమా+ఈశః) అను నాకారమునకు నుదాహరణము చూపబడెను. ఈ రెండుచోటు లందును స్థానిసదృశమగు నేకార మాదేశ మైనది. ఓకారరూపమగు గుణాదేశమునకుదాహరణము : గఙ్గోదకమ్ (గఙ్గా+ఉదకమ్) ఇచట స్థానిసదృశమగు గుణ మోకారము.

* 71. ఉరణ్ రపరః. 1-1-51. ఉః, అణ్, రపరః.

ఋఇతి త్రింశతస్సంజ్ఞేత్యుక్తమ్. తత్స్థానే యోఽణ్ స రపరస్సన్నేవ ప్రవర్తతే. తత్రాన్తరతమ్యాత్ కృష్ణర్ద్ధి రిత్యత్రార్. తవల్కార ఇత్యత్రాల్. అచో రహాభ్యా మితి పక్షే ద్విత్వమ్.

71. ఋవర్ణము ముప్పదివిధములకు బోధకమని వెనుక చెప్పబడెను. అట్టి ఋకారముయొక్క స్థానమున విధింపబడు అణు (అఇఉ) రపరమయే

ప్రవర్తించును. సూత్రమున, ర అనునది ప్రత్యాహారమగుటచే రేఫ లకారములను బోధించును. కృష్ణ+ఋద్ధిః. ఇచట గుణము స్థానిసదృశమగు రేఫపరకాకారము (అర్) వచ్చును. కృష్ణర్ద్ధిః. తవ+ఌకారః. ఇచట లపరమగు అకారము (అల్) వచ్చును. కృష్ణర్ద్ధిః. అనుచోట ధకారమునకు "అచోరహాభ్యామ్" (60) సూ. చే వైకల్పికద్విత్వము వచ్చును. కృష్ణర్ద్ధిః.

వివరణము : 'రపరః' అనునది రశబ్దమునకు అవయవబోధక పరశబ్దముతో బహుప్రీహి. కాన రేఫలకారము లణ్ణుకు పరావయవము లగును. ఈ సూత్రమున 'స్థానే' అను పద మనువృత్తమగును. లక్షణచే నిది ప్రసఙ్గావసయందను నరమును బోధించును. కావున నాదేశము ప్రసక్తమగు సమయమున నే రేఫ లకారము లవయవములగునుగాని ఆదేశము వచ్చినపిదప నీసూత్రము ప్రవర్తించదు. కావుననే ఋకారమున కా న్తరతమ్యమువలన గుణవృద్ధులు క్రమముగ అర్, ఆర్, లే యగునను భాష్యకారోక్తనియమము సఙ్గతమగును. నాగేశుడు శబ్దేన్దుశేఖరమున, రప్రత్యాహారము లేదనియెను. ఈ పక్షమం దీసూత్రమున లకారమునుగూడ జెప్పవలయును.

* 72. ఝరో ఝరి సవర్ణే. 8-4-65. ఝరః, ఝరి, సవర్ణే. (హలః, లోపః, వా)

హలః పరస్య ఝరో లోపో వా స్యాత్సవర్ణే ఝరి. ద్విత్వాభావే లోపే సత్యేకధమ్. అసతి లోపే, ద్విత్వలోపయోర్వా ద్విధమ్. సతి ద్విత్వేలోపే చాసతి త్రిధమ్. కృష్ణర్ధిః. కృష్ణర్ద్ధిః. కృష్ణర్ద్ద్ధిః. యణ ఇతి పఞ్చమీ మయ ఇతి షష్ఠీతి పక్షే కకారస్యాపి ద్విత్వమ్. లస్య త్వనచి చేతి. తేన తవల్కార ఇత్యత్ర రూపచతుష్టయమ్॥ ద్విత్వంలస్యైవ కస్యైవ నోభయోరుభయోరపి. తవల్కారాదిషు బుధైర్బోధ్యం రూపచతుష్టయమ్॥

72. హల్లుకంటె పరమైన ఝర్ వర్ణమునకు సవర్ణమగు ఝర్ వర్ణము పరమగునపుడు లోపము వికల్పముగ నగును. కృష్ణర్ద్ధిః యనుచోట సహజముగా రెండు ధకారము లుండుటచే, ద్విత్వము చేయక నీసూత్రముచే లోపము చేయునపు డొకధకారము గలదగును. కృష్ణర్ధిః. లోపముచేయనపుడును, ద్విత్వము చేసి లోపము చేయునపుడును, ధకారద్వయము గలదగును. కృష్ణర్ద్ధిః. ద్విత్వముచేసి, లోపముచేయనపుడు ధకారత్రయము గలదగును. కృష్ణర్ద్ద్ధిః. "యణో మయో ద్వే వాచ్యే" అను వార్తికము యణ్ణుకంటె పరమగు మయ్యునకు ద్విత్వమును విధించునను వ్యాఖ్యానమున "తవల్కారః" అనుచోట కకారమునకును ద్విత్వమగును. లకారమునకు "అనచి చ" సూ. చే ద్విత్వము. ఇందువలన తవల్కారః అనుచోట నాల్గురూపములు సిద్ధించును. (1) లకారమునకే

ద్విత్వముగలది, (2) కకారమునకే ద్విత్వముగలది, (3) లకార కకారములు రెంటికిని ద్విత్వము లేకుండునది, (4) లకార కకారములు రెంటికిని ద్విత్వముగలది.

* 73. వృద్ధిరేచి. 6-1-88. వృద్ధిః, ఏచి. (ఆత్)

ఆదేచి పరే వృద్ధిరేకాదేశస్స్యాత్. గుణాపవాదః.

కృష్ణైకత్వమ్. గఙ్గౌఘః. దేవైశ్వర్యమ్. కృష్ణౌత్కణ్ఠ్యమ్.

73. అవర్ణమునకు ఏచ్చు పరమగునపుడు పూర్వపరస్థానులందు వృద్ధి యేకాదేశమగును. "ఆద్గుణః" సూత్రమున కిది యపవాదము. ఏ, ఓ, ఐ, ఔ, లు పరమగునపుడు క్రమముగ నుదాహరణములు: కృష్ణైకత్వమ్. (కృష్ణ+ఏకత్వమ్) గఙ్గౌఘః (గఙ్గా+ఓఘః) దేవైశ్వర్యమ్ (దేవ+ఐశ్వర్యమ్) కృష్ణౌత్కణ్ఠ్యమ్ (కృష్ణ+ఔత్కణ్ఠ్యమ్).

* 74. ఏత్యేధత్యూఠ్సు. 6-1-89. (ఆత్, వృద్ధిః, ఏచి)

అవర్ణాదేజాద్యోరేత్యేధత్యోరూఠి చ పరే వృద్ధిరేకాదేశః స్యాత్. పరరూపగుణాపవాదః. ఉపైతి. ఉపైధతే. ప్రష్ఠౌహః. ఏజాద్యోః కిమ్. ఉపేతః. మా భవాన్ ప్రేదిధత్. పురస్తాదపవాదన్యాయేనేయం వృద్ధిరేచి పరరూపమిత్యస్యైవ బాధికా. న త్వోమాఙోశ్చేత్యస్య. తేనావైహీతి వృద్ధిరసాధురేవ. వా। అక్షాదూహిన్యాముపసంఖ్యానమ్. అక్షౌహిణీ సేనా. వా।స్వాదీరేరిణోః. స్వైరః. స్వేనేరితుం శీలమస్యేతి స్వైరీ, స్వైరిణీ. వా। ప్రాదూహోఢోఢ్యేషైష్యేషు. ప్రౌహః. ప్రౌఢః. ప। అర్థవద్గ్రహణే నానర్థకస్య గ్రహణమ్. వక్ష్యతి సూత్రే రాజ్ఞః పృథక్ ధ్రాజి గ్రహణాద్ జ్ఞాపకాత్. తేన ఊఢగ్రహణేన క్తాన్తమేవ గృహ్యతే. నతు క్తవత్వన్తస్యైకదేశః. ప్రౌఢవాన్. ప్రౌఢిః. ఇష ఇచ్ఛాయాం తుదాదిః. ఇష గతౌ, దివాదిః. ఇష ఆభీక్ష్ణ్యే, క్ర్యాదిః. ఏషాం ఘఞి ణ్యతి చ, ఏష, ఏష్య ఇతి రూపే. తత్ర పరరూపే ప్రాప్తే౽నేన వృద్ధిః. ప్రైషః, ప్రైష్యః. యస్తు ఈష ఉఞ్ఛే, యశ్చ ఈష గతిహింసాదర్శనేషు. తయోర్దీర్ఘోపధత్వాత్ ఈషః, ఈష్యః. తత్రాద్గుణేన ప్రేషః, ప్రేష్యః. వా। ఋతే చ తృతీయాసమాసే. సుఖేన ఋతః సుఖార్తః. తృతీయేతి కిమ్. పరమర్తః. వా। ప్రవత్సతరకమ్బలవసనార్ణదశానామృణే. ప్రార్ణమ్. వత్సతరార్ణమిత్యాది. ఋణస్య అపనయనాయ యదన్యదృణం క్రియతే తదృణార్ణమ్. దశార్ణో దేశః. నదీ చ దశార్ణా. ఋణశబ్దో దుర్గభూమౌ జలే చ.

74. ఏత్యేధత్యూఠ్సు=ఏతి, ఏధతి, ఊఠ్ పదములకు ద్వన్ద్వము. అవర్ణముకంటె ఏచ్చులాదియందుగల ఇణ్ (గతౌ) ధాతువు, ఏధ (వృద్ధౌ) ధాతువులుగాని, ఊఠ్ (ఆదేశము) గాని పరమగునపుడు పూర్వపరవర్ణముల స్థానమందు వృద్ధి ఏకాదేశ మగును. అనువృత్తమగు ఏచి, అనునది ఇణ్ ధాత్వేధధాతువులకే విశేషణ మగును. ఊఠున కేజాదిత్వము సంభవింప నందున దీనికి విశేషణము గాదు. ఈ వృద్ధి ఇణ్ ధాత్వేధధాతువులు పరముగ నున్నపుడు ప్రాప్తమగు పరరూపమునకు, ఊఠ్ పరమగునపుడు ప్రాప్తమగు గుణమునకు నపవాదము. ఉపైతి (ఉప+ఏతి) ఏతి, అనునది ఇణ్ ధాతువు నకు లట్ ప్రథమైకవచనము. ఉపైధతే. (ఉప+ఏధతే) ఏధతే అనునది ఏధ ధాతువునకు లట్ ప్రథమైకవచనము. ప్రష్ఠౌహః (ప్రష్ఠ+ఊహః) ప్రష్ఠవాహ్ శబ్దమునకు ద్వితీయా బహువచనము. ఇచట ఊకారము వాహ్ శబ్దములోని వకారస్థానమందు "వాహఊఠ్" (330) సూ॥చే విధింపబడిన ఊకాదేశసమ్బన్ధి యని తెలియనగును. ఈ సూత్రములోనికి "ఏచి" యను పదము ననువృత్తి చేయనిచో ఇణ్ ధాత్వేధధాతువులు పరమగునపుడు వృద్ధి యని యర్థమగును. ఇట్లు చెప్పినచో ఉపేతః, (ఉప+ఇతః) మా భవాన్ ప్రేదిధత్ (ప్ర+ఇదిధత్) ఇత్యాదులలో వృద్ధి ప్రసక్తమగును. ఇతః, అను నది ఇణ్ ధాతువునకు లట్ ప్రథమ ద్వివచనము. ఇదిధత్, అనునది ణిజన్త మైన ఏధధాతువునకు, లుఙ్ ప్రథమైకవచనము. మాఙ్ (మా) యోగమం దడాగమము నిషేధింపబడినందున నిట్టి రూపమేర్పడెను. "ఏచి" యనుదాని కనువృత్తి జేసినచో నివి ఏజాదులు గానందున వృద్ధి వారితమగును. పూర్వమున జెప్పబడిన యపవాదశాస్త్రములు, తమ కవ్యవహితపరములగు శాస్త్రములనే బాధించును గాని, వ్యవహితములగువానిని బాధింపవు. (పురస్తాదపవాదాః అనన్తరాన్ విధీన్ బాధన్తే నోత్తరాన్) ఈ న్యాయముచే నీవృద్ధి "ఏఙిపర రూపమ్" (79) అనుదానికే బాధకమగును గాని "ఓమాఙోశ్చ (81) అను సూత్రమునకు బాధకము గాదు. కావున అవైహి (అవ+ఏహి) అనుచోట వృద్ధి యసాధువే యగును. ఏహి, అనునది ఆఙ్ పూర్వకమగు ఇణ్ ధాతువు నకు లోణ్మధ్యమైకవచనము. ఆ+ఇహి అనుచోట గుణము ప్రవర్తించినచో ఏహి అని యగును. పూర్వాన్తవద్భావమువలన అవ, అనుదానికి ఆఙ్ పర్యన్తము సంభవించును గాన "ఓమాఙోశ్చ" (81) సూ. చే పరరూపము ప్రవర్తించును. అవేహి యనురూపమే సాధువగును. వా॥ అక్ష శబ్దావయవ మగు అకారముకంటె ఊహినీ శబ్దావయవమగు నూకారము పరమైనపుడు పూర్వపరస్థానులందు వృద్ధి ఏకాదేశ మగును. గుణమున కపవాదము. అక్షౌహిణీ. (అక్ష+ఊహినీ) వా॥ స్వశబ్దావయవమగు అకారమునకు, ఈర, ఈరిన్ శబ్దముల ఈకారము పరమగునపుడు వృద్ధి ఏకాదేశ మగును. స్వైరః (స్వ+ఈరః)

స్వైరీ (స్వ+ఈరీ) స్వేచ్ఛగ సంచరించు స్వభావముగలవా డనునర్థమందు, స్వశబ్దపూర్వకమగు ఈర (గతౌ) ధాతువునకు ఇన్ ప్రత్యయమువలన నీరూపము సిద్ధమగును. స్వైరిణీ, అను స్త్రీలింగమునగూడ, జీప్ ప్రత్యయమునకు ప్రకృతి యగు ఈరిన్ శబ్దమును గైకొని వృద్ధి ప్రవర్తించును. ఇచట "లింగవిశిష్టపరిభాషయా" స్వైరిణీ అను పాఠము చాలపుస్తకములలో దృష్టమగుచున్నది. "ప్రాతిపదికగ్రహణే లింగవిశిష్టస్యాపి గ్రహణమ్" (ప్రాతిపదికమును బోధించు శబ్దము గ్రహింపబడినపుడు లింగబోధకప్రత్యయములతో (టాప్, జీప్ మొదలగునవి) గూడిన శబ్దములకును గ్రహణముగలుగును) ఈ పరిభాషవలన వార్తికములోని "ఈరిన్" యను ప్రాతిపదికముచే "ఈరిణీ" యను జీబన్తమునకును గ్రహణము కలుగుటవలన స్వైరిణీ యనుచోట వృద్ధి వచ్చునని యాశయము. స్వైరిణీ యనుచోట పైరీతిని వృద్ధి సిద్ధమగును గాన నిచట లింగవిశిష్టపరిభాషాప్రవృత్తి నిష్ఫలమని తన ప్రౌఢమనోరమాగ్రన్థమున గ్రన్థకర్త దూషించుటచే నీ పాఠ మపపాఠమని గ్రహింపదగును. వా। ప్రశబ్దావయవమగు అకారమునకు ఊహ, ఊఢ, ఊఢి, ఏష, ఏష్య, వీని యచ్చు పరమైనపుడు వృద్ధి యేకాదేశ మగును. ప్రౌహః (ప్ర+ఊహః), ప్రౌఢః (ప్ర+ఊఢః). ఊఢ యనునది వహ ధాతువునకు క్తప్రత్యయాన్తము. ప్రోఢవాన్ (ప్ర+ఊఢవాన్) ఇచట ఊఢ శబ్దము పరమగుటచే ప్రసక్తమగు వృద్ధి నివారించుట కుపాయము ప్రదర్శింపబడుచున్నది. "అర్థవద్గ్రహణే నానర్థకస్య గ్రహణమ్" (అర్థముగలశబ్దమునకు గ్రహణము సంభవించునపు డర్థశూన్యమగుదానికి గ్రహణము గలుగదు). అర్థపదముచే లోకప్రసిద్ధార్థమే గాక శాస్త్రకారులచే కల్పితమగు నర్థముగూడ గ్రహింపదగును. "వ్రశ్చ భ్రశ్చ" (295) సూత్రమున రాజ ధాతువుకంటె వేరుగా భ్రాజ ధాతువును గ్రహించుటయే యీ పరిభాషకు జ్ఞాపకము. కానిచో రాజధాతువునకు విహితమైన షత్వము భ్రాజ్ ధాతువులోని రాజ్ నకును సిద్ధమగుచుండ భ్రాజ్ గ్రహణము వ్యర్థమగును. పరిభాష జ్ఞాపితమైనపిదప భ్రాజ్ లోని రాజ్ నిరర్థకమగుటచే షత్వ మప్రాప్తమగుచుండ తిరుగ భ్రాజ్ గ్రహణ మావశ్యకమగును. ప్రోఢవాన్ యనుచోట వృద్ధ్యభావము పరిభాషకు ఫలము. ఊఢవాన్ అనునది వహ ధాతువునకు క్తవతుప్రత్యయాన్తము. కాన ఊఢవత్తను సముదాయమే యర్థవత్తుగాని దానిలో నేకదేశమగు నూఢ అనునది యర్థవత్తు గాదు. వార్తికమున అర్థవత్తగు స్థానమైన నూఢశబ్దమునకే గ్రహణము గాని యర్థశూన్యమగు నూఢశబ్దమునకు గ్రహణము లేదు. ప్రౌఢిః (ప్ర+ఊఢిః), ప్రైషః (ప్ర+ఏషః), ప్రైష్యః (ప్ర+ఏష్యః) తుదాదిగణమున నిచ్ఛార్థకమగు "ఇష" ధాతువునకుగాని, దివాదిగణమున గత్యర్థకమగు "ఇష" ధాతువునకుగాని, క్ర్యాదిగణమున పౌనఃపున్యార్థకమగు "ఇష" ధాతువునకుగాని ఘఞ్ (అ) ప్రత్యయమైనను, ణ్యత్ (య) ప్రత్యయమైనను, చేసినయెడల క్రమ

ముగ "ఏషః, ఏష్యః" అను రూపము లేర్పడును. ఈ ధాతువులు లఘూపధములగుటచే "పుగన్త లఘూపధస్య చ" (7-3-86) సూ. చే గుణము ప్రవర్తించుటవలన నిట్టిరూపము లగునని గ్రహించునది. ప్రశబ్దమునకు ఏషః, ఏష్యః అనునవి పరమైనపుడు "ఏఙిపరరూపమ్" సూ. చే పరరూపము ప్రాప్తమగుచుండ నీ వృద్ధి విధింపబడెను. ఇఛ్ఛార్థకమగు ఈష ధాతువు, గతి హింసాదర్శనార్థకమగు ఈష ధాతువును, దీర్ఘోపధము లగుటచే పూర్వోక్తమగు గుణము ప్రవర్తించనందున వీనికి ఘఙ్, ణ్యత్, ప్రత్యయములు చేసినపుడు ఈషః, ఈష్యః, అని యగును. ప్రశబ్దమున కివి పరమగునపుడు "ఆద్గుణః" సూ. చే గుణమువలన ప్రేషః, ప్రేష్యః, అను రూపము లగును. వా। అవర్ణమునకు ఋతశబ్దము పరముగనున్నపుడు తృతీయాసమాసమందు వృద్ధి యేకాదేశ మగును. సుఖార్తః. సుఖేన + ఋతః. (సుఖ+ఋతః) వృద్ధి, తృతీయాసమాసమందు విధింపబడుటవలన పరమర్తః "(పరమ+ఋతః. పరమశ్చాసౌఋతశ్చ) మొదలగు సమాసములందు వృద్ధి వారితమగును. వా। ప్ర, వత్సతర, కమ్బల, వసన, ఋణ, దశ, వీనియొక్క అకారమునకు ఋణశబ్దముయొక్క యచ్చు పరమగునపుడు వృద్ధి యేకాదేశ మగును. ప్రార్ణమ్. వత్సతరార్ణమ్. కమ్బలార్ణమ్, వసనార్ణమ్. ఋణార్ణమ్. ఒక ఋణమును తీర్చుటకై చేయబడు వేరొక ఋణము, ఋణార్ణ మనబడును. దశార్ణః, ఇదొక దేశవిశేషమునకు సంజ్ఞ. పది దుర్గభూములు గలదని యర్థము. దశార్ణా, నదీ విశేషము. ఋణశబ్దము దుర్గభూమిని, జలమును బోధించును.

* 75. ఉపసర్గాదృతి ధాతౌ. 6-1-61. ఉపసర్గాత్, ఋతి, ధాతౌ. (ఆత్, వృద్ధిః)

అవర్ణాన్తాదుపసర్గాదృకారాదౌ ధాతౌ పరే వృద్ధిరేకాదేశః స్యాత్. ప్రార్ఛతి. ఉపార్ఛతి.

75. అవర్ణాన్తమగు నుపసర్గమునకు హ్రస్వఋకారమాదియందుగల ధాతువు పరమగునపుడు వృద్ధి యేకాదేశ మగును. ప్రార్ఛతి. (ప్ర+ఋచ్ఛతి), ఉపార్ఛతి (ఉప+ఋచ్ఛతి). ఋకారస్థానమున వృద్ధి స్థానసాదృశ్యమువలన ఆర్ అనునది యగును.

* 76. అన్తాదివచ్చ. 6-1-85. అన్తాదివత్, చ. (ఏకః పూర్వపరయోః)

యోఽయమేకాదేశస్సపూర్వస్యాన్తవత్పరస్యాదివత్స్యాత్. ఇతి రేఫస్య పదాన్తత్వే.

76. అన్తాదివత్ = అన్తాదిశబ్దములకు ద్వన్ద్వము జేసి అన్తాదిభ్యామ్ తుల్యమనునర్థమున వతిప్రత్యయముచే నిది సిద్ధమగును. పూర్వపరస్థానులందు క్రమ్ముత

మగు నేకాదేశము (ఏకః పూర్వపరయోః అను నధికారమున విహితమగు గుణాదికము) పూర్వస్థానితో గూడిన పూర్వసముదాయమున కన్తమువంటిదియు, పరస్థానితో గూడిన పరసముదాయమునకు ఆదివంటిదియు నగును. అనగా ఏకాదేశము ప్రవర్తింపకపూర్వము పూర్వ పర సముదాయములందు గల ప్రాతిపదికత్వము, పదత్వము మొదలగునవి ఏకాదేశముతో గూడినదానియందు నీ యతిదేశమువలన లభించునని భావము. ప్రార్చ్ఛతి అనుచోట ప్ర అను నుపసర్గయందు గల పదత్వము ప్రార్ అనుదానియం దతిదేశలభ్య మగును. కాన ప్రారనుచోట రేఫము పదాన్త మగును.

వివరణము : ఏకః పూర్వపరయోః, సూత్రములోని పూర్వశబ్ద మేకాదేశ పూర్వస్థానితో గూడిన పూర్వసముదాయమును, పరశబ్ద మేకాదేశ పరస్థానితో గూడిన పరసముదాయమును బోధించును. ఈ సూత్రములోని అన్తశబ్దము ఏకాదేశపూర్వస్థానిని, ఆదిశబ్ద మేకాదేశపరస్థానిని బోధించును. ఇట్లు మూలోకారము సిద్ధమగును.

* 77. ఖరవసానయోర్విసర్జనీయః. 8-3-15. ఖరవసానయోః, విసర్జనీయః (రః, పదస్య, అన్తే)

ఖరి అవసానే చ పరే రేఫస్య విసర్జనీయ స్స్యాత్పదాన్తే. ఇతి విసర్గే ప్రాప్తే. అన్తవద్భావే న పదాన్త రేఫస్య న విసర్గః. ఉభయథర్క్షు, కర్తరిచర్షి దేవతయోః, ఇత్యాది నిర్దేశాత్. ఉపసర్గేణైవ ధాతో రాక్షేపే సిద్ధే ధాతావితి యోగవిభాగేన పునర్వృద్ధి విధానార్థమ్. తేన ఋత్యక ఇతి పాక్షికో౽పి ప్రకృతి భావో౽త్ర న భవతి.

77. ఖర్ వర్ణము పరమగునపుడు నవసానమందును పదాన్తమగు రేఫకు విసర్గము వచ్చును. ఈ సూత్రముచే ప్రార్చ్ఛతి, అనుచోట రేఫకు విసర్గము ప్రాప్తమగుచున్నది. "ఉభయథర్క్షు" (8-3-8) "కర్తరిచర్షిదేవతయోః" (3-2-186) మొదలగు పాణినిప్రయోగములవలన నన్తవద్భావముచే పదాన్తమగు రేఫకు విసర్గము రాదని జ్ఞాపనము చేయుటవలన ప్రకృతమున విసర్గము నివృత్తమగును. ప్రార్చ్ఛతి అనుచోట రేఫము, పూర్వాన్తవద్భావాతిదేశమువలననే పదాన్తమైనది. ఉభయథర్క్షు (ఉభయథా+ఋక్షు) అనుచోట, "కర్తరిచర్షిదేవతయోః" (కర్తరిచ+ఋషిదేవతయోః) అనుచోట గుణ మేకాదేశమైనది. పూర్వోక్తాతిదేశమువలన నిచటి రేఫము పదాన్తమైనను పాణిని విసర్గమును చేయనందున నీ నిర్దేశములు పూర్వోక్తార్థములకు ప్రమాణము లగును. ప్రార్చ్ఛతి,అనుచోట "ఋత్యకః" (93) సూ. చే ప్రాప్తమగు వైకల్పికప్రకృతిభావమును వారించు

టకై యుపాయము ప్రదర్శింపబడుచున్నది. "ఉపసర్గాదృతి ధాతౌ" (75) సూత్రమున ధాతుపదము లేకున్నను, ప్రాదుల కుపసర్గసంజ్ఞ క్రియతో సమ్బన్ధమున్నపుడే విహితమైనందున నుపసర్గపదమే క్రియావాచకమగు ధాతువు నాక్షేపించును. ఏకారణము లేనపు డేకార్యమున కసంభవమో యట్టికార్య మాకారణమును గల్పించుట యాక్షేప మనబడును. ఎట్లన, దేవదత్తుడనువాడు బలసియున్నాడు; పగః భోజనము చేయడు; అనుచోట భోజనము లేనిచో బల మసంభవము గాన, బలము, తనకు గారణమగు రాత్రి భోజనమును గల్పించును. (ఆక్షేపించును). ఇట్లీ సూత్రమున ధాతు వాక్షేపలబ్ధమగుచుండ, ధాతుగ్రహ ణము వాక్యభేదముచే నవర్ణాన్తోపసర్గమునకు ఋకారాదిధాతువు పరమగునపుడు తిరుగ వృద్ధిని విధించును. ఇందువలన వృద్ధికి విషయమగుచోట వృద్ధియేగాని, ప్రకృతిభావాదు లేవియు రావని ఫలితమగును. ప్రార్ఛతి అనుచోట పూర్వోక్త ప్రకృతిభావ మీరీతిగ వారితమగును.

* 78. వా సుప్యాపిశలేః. 6-1-92. వా, సుపి, ఆపిశలేః.
(ఆత్, వృద్ధిః, ఉపసర్గాదృతిధాతౌ)

అవర్ణాన్తాదుపసర్గాదృకారాదౌ సుబ్ధాతౌ పరే వృద్ధిర్వా స్యాత్. ఆపిశలిగ్రహణం పూజార్థమ్. ప్రార్షభీయతి. ప్రర్షభీయతి. సావర్ణ్యాత్ ౡవర్ణస్య గ్రహణమ్. ప్రాల్కారీయతి. ప్రల్కారీయతి. తపరత్వాద్దీర్ఘే న. ఉపౠకారీయతి. ఉపర్కారీయతి.

78. అవర్ణాన్తమగు నుపసర్గముకంటె హ్రస్వ ఋకార మాదియందు గల సుబ్ధాతువు పరమగునపుడు, వృద్ధి, (ఏకాదేశము) వికల్పముగ నగును. వాశబ్దము వికల్పమును బోధించునుగాన ఆపిశలిమహర్షి ప్రతిపాదకమగు నాపిశలిపదము పూజార్థ మనగా ఋషినామోచ్చారణమువలన గలుగు ప్రయోజనముకొరకే యని యర్థము. ప్రార్షభీయతి (ప్ర+ఋషభీయతి) ఋషభీయతి, అనునది ఋషభమును తన కిచ్ఛయించుచున్నాడను నర్థమున, ఋషభశబ్దము (సుబన్తము) ప్రకృతిగాగల క్యచ్ప్రత్యయాన్తధాతువునకు (ఋషభీయ) లట్ ప్రథమైకవచనము. వృద్ధ్యభావపక్షమున గుణము. ప్రర్షభీయతి. ఋ, ౡ వర్ణములు సవర్ణము లగుటవలన సూత్రములోని ఋకారము ౡకారమునకు గ్రాహకమగును. కాన ౡకారాది సుబ్ధాతువు పరమగునపుడును వృద్ధి యగును. ప్రాల్కారీయతి (ప్ర+ౡకారీయతి). వృద్ధ్యభావపక్షమందు గుణము. ప్రల్కారీయతి. "ఋతి" అనుచోట తపరకరణముచే దీర్ఘమగు ౠకారమునకు గ్రహణము లేదు. కావున ఉప+ౠకారీయతి అనుచోట వృద్ధి ప్రవర్తింపక గుణమే ప్రవర్తించును. "ఉపర్కారీయతి" అని యగును.

వివరణము: సుప్పదమునకు సుబన్తమగు మనిన నిది ధాతువునకు విశేషణ మనవలనుపడదు. కావున సుప్పదము సుబన్త ప్రకృతికమును బోధించునని చెప్పవలయును. సుబ్ధాతువన సుబన్తము ప్రకృతిగా గల ధాతువని యర్థము. "సుప ఆత్మనః క్యచ్" (3-1-8) ఇత్యాది సూత్రములచే క్యజాది ప్రత్యయములు పుత్రాది సుబన్తములకంటె విహితము లగుటచేతను, క్యజాది ప్రత్యయాన్తములకు ధాతుసంజ్ఞ విధింపబడుటవలనను, పుత్రీయ (తి), ఋషభీయ (తి) మొదలగునవి సుబ్ధాతువు లగును. ఈ సూత్రమునందును ధాతుపదమున కనువృత్తిజేసి "ఉపసర్గాదృతిధాతౌ" సూత్రమందుగల వాక్యభేదముచే తిరుగ వృద్ధిని విధింపవలయును. కావుననే యీ సూత్రముయొక్క యుదాహరణములందును "ఋత్యకః" సూ. చే వైకల్పిక ప్రకృతిభావము ప్రవర్తించదు.

79. ఏఙి పరరూపమ్. 6-1-94. ఏఙి, పరరూపమ్,
(ఆత్, ఉపసర్గాత్, ధాతౌ)

ఆదుపసర్గాదేఙాదౌ ధాతౌ పరే పరరూప మేకాదేశః స్యాత్. ప్రేజతే. ఉపోషతి. ఇహ వా సుపీత్యనువర్త్య వాక్యభేదేన వ్యాఖ్యేయమ్. తేన ఏఙాదౌ సుబ్ధాతౌ వా। ఉపేడకీయతి. ఉపైడకీయతి. ప్రోఘీయతి. ప్రౌఘీయతి. వా। ఏవేచాని యోగే. నియోగోఽవధారణమ్. క్వేవ భోక్ష్యసే. అనియోగే కిమ్. తవైవ.

79. అవర్ణాన్తమగు నుపసర్గముకంటె ఏకారముగాని, ఓకారముగాని యాదియందుగల ధాతువు పరమగునపుడు పరరూపము (పరస్థానియొక్క రూపము) పూర్వపరస్థానులకు ఏకాదేశ మగును. ప్రేజతే. (ప్ర+ఏజతే) అకారైకారముల స్థానమం దేకారము వచ్చినది. ఉపోషతి (ఉప+ఓషతి) ఇచట పరరూపమోకారము. ఈ సూత్రములోనికి "వా, సుపి" అను పదముల ననువృత్తిజేసి, భిన్నవాక్యముచే నవర్ణాన్తోపసర్గమునకు ఏఙాదియగు సుబన్త ప్రకృతిక ధాతువు పరమగునపుడు పరరూపము వికల్పముగ నగునని చెప్పవలయును. ఉపేడకీయతి (ఉప+ఏడకీయతి) పరరూపాభావపక్షమందు వృద్ధియగును. ఉపైడకీయతి. ప్రోఘీయతి. (ప్ర+ఓఘీయతి) ప్రౌఘీయతి. వా। * అనియమము (అసంభవము) నకు, ద్యోతకమగు నేవకార మవర్ణాన్తముకంటె పరమగునపుడు పరరూపమేకాదేశమగును. క్వేవ (క్వ+ఏవ) భోక్ష్యసే. స్థలము సంకీర్ణమగుటవలన నీయొక్క భోజనమునకు సంభవము లేదని యర్థము. నియమము (నిర్ధారణము) ను ద్యోతనచేయునట్టి ఏవకారము పరమగునపుడు వృద్ధియే వచ్చును. తవైవ (తవ+ఏవ) ఇచటి ఏవకారమువలన నీకేగాని యితరులకుగాదను నిర్ధారణము ద్యోత్యమగుచున్నది.

వివరణము: *"ఏవేచానియోగే" అను వార్తికమున నియోగశబ్దమునకు నియోజనమనగా వ్యాపార మర్థమనియు, వ్యాపారభిన్నార్థద్యోతకమగు నేవ శబ్దము పరమగునపుడు పరరూపమగుననియును గొందఱు వ్యాఖ్యానము జేసిరి. "మమైవజన్మాన్తరపాతకానామ్" అను ప్రయోగమునను, "లఙః శాకటాయనస్యైవ" (3-4-111) అను సూత్రస్థప్రయోగమునను, పరరూపము ప్రసక్తమగుటచే ప్రయోగవిరోధము సంభవించును గాన నీ వ్యాఖ్యాన మయుక్తమని గ్రహించునది.

* 80. అచోఽన్త్యాది టి. 1-1-64. అచః, అన్త్యాది, టి.

అచాం మధ్యే యోఽన్త్యస్స ఆదిర్యస్య తట్టిసంజ్ఞం స్యాత్. వా। శకన్ధ్వాదిషు పరరూపం వాచ్యమ్. తచ్చ టేః. శకన్ధుః. కర్కన్ధుః. కులటా. సీమన్తః కేశవేశే. సీమాన్తోఽన్యః. మనీషా. హలీషా. లాఙ్గలీషా. పతఞ్జలిః. సారఙ్గః పశుపక్షిణోః. సారాఙ్గోఽన్యః. ఆకృతిగణోఽయమ్. మార్తణ్డః. వా। ఓత్వోష్ఠయోస్సమాసే వా। స్థూలోతుః। స్థూలౌతుః। బిమ్బోష్ఠః। బిమ్బౌష్ఠః। సమాసే కిమ్। తవౌష్ఠః॥

80. అచః అనునది నిర్ధారణషష్ఠ్యన్తము. అన్త్యాది=అన్త్యః ఆదిర్యస్య తత్. అచ్చులలో నన్త్యమైనయచ్చు ఆద్యవయవముగ గల భాగము టిసంజ్ఞక మగును. మరుత్ శబ్దమున ఉత్ అనునది టిసంజ్ఞకము. దధి అనుచోట నికారము టిసంజ్ఞకము. వా। శకన్ధు శబ్దము మొదలగు శకన్ధ్వాదిగణములోని శబ్దములు సిద్ధించుటకై యనుగుణమైన పరరూపమును చెప్పవలయును. గణములోని శబ్దములయొక్క టిసంజ్ఞగల భాగమునకు పరరూపము వచ్చినపుడే యిష్టరూపములు సిద్ధములగును గాన నీ పరరూపమునకు పూర్వస్థాని టిసంజ్ఞకమే యగునని తెలియదగును. శకన్ధుః (శక+అన్ధుః) శకదేశములయొక్క కూపము. కర్కన్ధుః (కర్క+అన్ధుః) కర్కులను రాజులయొక్క కూపము. కులటా (కుల+అటా) వ్యభిచారిణి. సీమన్తః (సీమన్+అన్తః) కేశవేశమ్ (ముడి) అను నర్థమందే పరరూపము. పొలిమేర యనునర్థమందు సీమాన్తః అనియే యగును. మనీషా (మనస్+ఈషా) జ్ఞానము. హలీషా (హల+ఈషా) లాఙ్గలదణ్డము (ఏటికఱ్ఱ). లాఙ్గలీషా (లాఙ్గల+ఈషా) లాఙ్గలదణ్డము. 1 పతఞ్జలిః (పతన్+అఞ్జలిః) నమస్కారార్హుడగు పతఞ్జలిముని. సారఙ్గః. (సార+అఙ్గః) ఈ శబ్దముచే వ్యవహరింపబడు మృగముగాని, పక్షిగాని యర్థము. సారాఙ్గః (సార+అఙ్గః) బలమైన యవయవములుగలది, పశుపక్షులకంటె వేఱైనది. శకన్ధ్వాదిగణ మాకృతిగణమనగా శకన్ధ్వాది సదృశములగు మరికొన్నిటి నిందు జేర్పదగునని యాశయము.

2 మార్తాణ్డః. (మృత+అణ్డః) మృతాణ్డశబ్దములకు పరరూపము వచ్చినపిదప మృతాణ్డునివలన పుట్టినవాడను నర్థమున మృతాణ్డశబ్దముకంటె నణ్ ప్రత్యయము చేసినయెడల మార్తాణ్డః అని యగును. వా। అవర్ణమునకు ఓతు, ఓష్ఠ, వీని యొక్క ఓకారము పరమగునపుడు, 3 సమాసమందు పరరూపము వికల్పముగ నగును. స్థూలోతుః. (స్థూల+ఓతుః), బిమ్బోష్ఠః(బిమ్బ+ఓష్ఠః). పరరూపా భావపక్షమందు వృద్ధి. స్థూలౌతుః, బిమ్బౌష్ఠః. సమాసమందనుటచే, తవౌష్ఠః (తవ+ఓష్ఠః) ఇత్యాదివాక్యములందు పరరూపము రాదు.

వివరణము : 1. పతఞ్జలిముని, గోనర్దదేశము దొక మహర్షి యొక్క దోసిలినుండి సంధ్యావందనసమయమున పడినవాడను నైతిహ్యము ననుసరించి అఞ్జలేః పతితః, అను విగ్రహమును జెప్పి, పతఞ్జలి శబ్దము, పతితాఞ్జలి శబ్దముల వలన నేర్పడినదనుట యుచితముగాన పతఞ్జలిశబ్దమును మయూరవ్యంసకాదిగణ మున నుంచి "మయూరవ్యంసకాదయశ్చ" (758) సూ. చే పతితాఞ్జలి శబ్దములకు సమాసమును, ఆ గణమందు నిపాతనమువలన నితశబ్దమునకు లోపమును చేసినందున పతఞ్జలిశబ్దము సిద్ధమగునని చెప్పవలయును. కావున శకన్ధ్వాదిగణ మున పతఞ్జలి శబ్దపాఠ మౌచిత్యదూరమైనదని నాగేశాదుల యాశయము.

2. మార్తాణ్డుడన సూర్యుడు. బుధునిశాపవశమున నదితియొక్క యుదరమున నున్నపుడే గర్భ మచేతనమైనదనియు, నా గర్భము బయటికి వచ్చిన పిదప సచేతనమైనదనియును భారతమున జెప్పబడినది. లోకమున మృతాణ్డ భవుడనునర్థమున పరరూపమే సాధువనియును. పరామార్తాణ్డమాస్థత్, పున ర్మార్తాణ్డమాభరత్ మొదలగు వైదికప్రయోగములలోని దీర్ఘము ఛాన్దసమని యును ప్రామాణికుల యాశయము.

3. అవర్ణమునకు ఓత్వోష్ఠశబ్దములకు నొకేసమాసమందు స్థితి సంభ వించునపుడే పరరూపమని వ్యాఖ్యానము చేయవలయును. ఇందువలన వృష లసుత, ఓష్ఠప్రణస్తే ఇత్యాదులందు భిన్నసమాసములలోని ఓత్వోష్ఠశబ్దములు పరమగునపు డనిష్టమగు పరరూపము నివృత్తమగును.

* 81. ఓమాఙోశ్చ. 6-1-95. (ఆత్, పరరూపమ్)
ఓమి, ఆఙి చాత్పరే పరరూపమేకాదేశః

స్యాత్। శివాయోంనమః। శివ ఏహి। శివేహి॥

81. అవర్ణముకంటె ఓమ్, ఆఙ్ (ఆ) ఇవి పరమగునపుడు పరరూప మేకాదేశమగును. శివాయోం నమః (శివాయ+ఓమ్) శివేహి (శివ+ఏహి) ఏహి అనునది ఆఙ్పూర్వకమగు ఇణ్ధాతువునకు లోణ్మధ్యమైకవచనము. కావున పూర్వాన్తవద్భావముచే నాఙ్ పరత్వము సంభవించును.

* 82. అవ్యక్తానుకరణస్యాత ఇతౌ. 6-1-98.
అవ్యక్తానుకరణస్య, అతః, ఇతౌ. (పరరూపం)
ధ్వనేరనుకరణస్య యోఽచ్ఛబ్దస్తస్మాదితౌ
పరే పరరూపమేకాదేశస్స్యాత్. పటత్ ఇతి.
పటితి. వా॥ ఏకాచో న. శ్రదితి.

82. అపరిస్ఫుటాఽకారాదివర్ణములుగల శబ్దము ధ్వని యనబడును. ధ్వనికనుకరణమైన, అనగా పరిస్ఫుటాకారాదివర్ణములుగల శబ్దముయొక్క అత్ శబ్దమున కితిశబ్దము పరమగునపుడు పరరూపమేకాదేశమగును. అచ్ఛబ్దమనర్థకమగుటవలన, అనర్థకసముదాయము విషయమున “నానర్థకేఽలోఽన్త్యవిధిరనభ్యాసవికారే” (అలోఽన్త్యపరిభాష యనర్థకమందు ప్రవర్తించదు. అభ్యాసకార్యములవిషయమై యనర్థకమందుగూడ పరిభాష ప్రవర్తించును) అను పరిభాషచే అలోఽన్త్యపరిభాష నిషేధింపబడుటవలనను, అత్ అను సముదాయమే పరరూపమునకు పూర్వస్థాని యగును. పటితి (పటత్+ఇతి) వా॥ అనుకరణమేకాచ్కమైనపుడు దానిలోని అత్ శబ్దమునకు పరరూపము రాదు. శ్రదితి. (శ్రత్+ఇతి)

* 83. నామ్రేడితస్యాన్త్యస్య తు వా. 6-1-99.
న, ఆమ్రేడితస్య, అన్త్యస్య, తు, వా, (పరరూపం)
ఆమ్రేడితస్య, ప్రాగుక్తం న స్యాత్. అన్త్యస్య
తు తకారమాత్రస్య వా స్యాత్. డాచి బహుళం
ద్వే భవత ఇతి బహుళవచనాద్ద్విత్వమ్.

83. ఆమ్రేడితమునకు (ద్విరుక్తమైనదానియొక్క పరమగు శబ్దరూపము) అవయవమైన అత్ శబ్దమునకు పరరూపము రాదు. తుదినున్న తకారమునకు మాత్రము పరరూపము వికల్పముగ నగును. “డాచి బహుళం ద్వే భవతః” (డాచ్ ప్రత్యయము వివక్షితమైనపుడు ధ్వనియొక్క యనుకరణశబ్దమునకు బహుళముగా ద్విత్వమగును) అను వార్తికమందలి బహుళగ్రహణమువలన పటత్ ఇతి, అనుచోట డాచ్ ప్రత్యయము లేకపోయినను ద్విత్వము వచ్చును. పటత్ పటత్+ఇతి. బహుళపదమున కనేకార్థములను గ్రహించునదని యర్థముగాన బహుళపదముగల వాక్యముచే విధింపబడు కార్యము చెప్పబడిన నిమిత్తాదులు లేనపుడును ప్రవర్తించును. కొన్నిచోట్ల నిమిత్తాదులున్నను ప్రవర్తింపదు. కొన్నిప్రయోగములలో నిత్యముగను, మరికొన్నిటియందు వికల్పముగను ప్రవర్తించునని గ్రహించునది.

* 84. తస్య పరమామ్రేడితమ్. 8-1-2. తస్య, పరమ్, ఆమ్రేడితమ్.
ద్విరుక్తస్య పరం రూపమామ్రేడితసంజ్ఞం స్యాత్।
పటత్ పటేతి.

84. ద్విరుక్తమైనదానియొక్క పరమగు శబ్దస్వరూప మామ్రేడిత మనబడును. పటత్ అను అనుకరణశబ్దమున కితిశబ్దము పరమైనప్పుడు పూర్వోక్తరీతిని బహుళవచనముచే ద్విత్వము. పటత్ పటత్ ఇతి. ఇచట పరమగు పటత్ అనునది యామ్రేడితమగుటచేత నిచట అత్ శబ్దమునకు పరరూపము రాక, తకారమునకుమాత్రము పరరూపము ప్రవర్తించినపక్షమందు "ఆద్గుణః" (70) సూ. చే, గుణమును ప్రవర్తించును. పటత్పటేతి. పరరూపాభావపక్షమందు పటత్ పటత్+ఇతి, అని యుండగా.

* 85. ఝలాంజశోఽన్తే. 8-2-39. ఝలాం, జశః, అన్తే, (పదస్య)
పదాన్తే ఝలాం జశః స్యుః. పటత్పటదితి.

85. పదముయొక్క తుదనున్న ఝల్ వర్ణములకు జశ్ వర్ణము లాదేశము లగును. పటత్ పటత్+ఇతి, అనుచోట చివరనుండు తకారమునకీసూత్రముచే జశ్త్వము (దకారము) వచ్చును. పటత్పటదితి.

* 86. అకస్సవర్ణే దీర్ఘః. 6-1-101. అకః, సవర్ణే, దీర్ఘః, (అచి)
అకః సవర్ణేఽచి పరే దీర్ఘ ఏకాదేశః స్యాత్। దైత్యారిః। శ్రీశః। విష్ణూదయః। అచి కిమ్। కుమారీ శేతే। నాజ్ఝలావితి సావర్ణ్యనిషేధస్తు న దీర్ఘశకారయోః, గ్రహణకశాస్త్రస్య సావర్ణ్యవిధినిషేధాభ్యాం ప్రాగ నిష్పత్తేః। అకః కిమ్। హరయే। అకోఽకి దీర్ఘ ఇత్యేవ సువచమ్। వా। ఋతి సవర్ణే ఋ వా। హోతౄకారః। హోతృకారః। వా। ఌతి సవర్ణే ఌ వా। హోతౢకారః పక్షే ఋకారస్సావర్ణ్యాత్। హోతృకారః। ఋతి ఋ వా, ఌతి ఌ వేత్యుభయత్రాపి విధేయం వర్ణద్వయం ద్విమాత్రమ్। ఆద్యస్య మధ్యే ద్వౌ రేఫౌ, తయో రేకా మాత్రా। అభితోఽజ్భక్తేరపరా। ద్వితీయస్య తు మధ్యే ద్వౌ లకారౌ। శేషం ప్రాగ్వత్। ఇహోభయత్రాపి ఋత్యక ఇతి పాక్షికః ప్రకృతిభావో వక్ష్యతే॥

86. అక్ ప్రత్యాహారవర్ణములకు సవర్ణమగు నచ్చు పరమగునపుడు దీర్ఘమేకాదేశమగును. దైత్యారిః, (దైత్య+అరిః), శ్రీశః (శ్రీ+ఈశః) విష్ణూదయః (విష్ణు+ఉదయః). అచ్చులకు హల్లులకును, పరస్పరము సవర్ణసంజ్ఞానిషేధము చెప్పబడినందున నక్కులకు సవర్ణము లచ్చులే యగుచుండ నచ్చనువృత్తి కేమిఫలమను శఙ్క కిది సమాధానము:— నాజ్ఝలౌ సూత్రమునకు విషయము నిర్ణీతమైనపిదప ననగా నాసూత్రమున కర్థబోధ గలిగినతరువాత నాసూత్రమునకు విషయములగు వర్ణములను విడచి మిగిలినవానికి తుల్యాస్య

సూత్రము సవర్ణసంజ్ఞను విధించును. పిమ్మట ననగా "తుల్యాస్య" సూత్రమున కర్థబోధ గల్గినపిదప 1. "అణుదిత్సూత్రము, అణ్ణులు తమ సవర్ణములను గ్రహించునని బోధించును, గాన నాజ్ఝలౌ సూత్రమునకు బోధగల్గుసమయమున నచ్చులు తమ సవర్ణములను గ్రహించునని అణుదిత్సూత్రము బోధింప వీలు లేనందున, నాజ్ఝలౌ సూత్రములోని యచ్పద మక్షరసమామ్నాయమందు పఠింపబడిన యచ్చులనేగాని తత్సవర్ణములను గ్రహింపదు. కావున హ్రస్వేకార శవర్ణములకు సవర్ణసంజ్ఞానిషేధ ముండును గాని, దీర్ఘేకార శవర్ణములకు సవర్ణసంజ్ఞానిషేధము లేనందున కుమారీ శేతే అనుచోట నచ్చునకు సవర్ణమైన హల్లు పరముగ నుండుటవలన నిచట దీర్ఘమును వారించుటకై యచ్పదానువృత్తి యావశ్యక మని, సూత్రమున అకః అనుపదము లేనిచో సవర్ణమగు నచ్చు పరమగునపుడు దీర్ఘమగు నను నర్థము సంభవించును. హరయే (హరే+ఏ) అనుచోట నేకారమునకు సవర్ణాచ్పరత్వముండుటచే దీర్ఘము ప్రసక్తమగును. దీనిని వారించుటకై అకః అనునది యావశ్యకము. "అకస్సవర్ణే దీర్ఘః" అను సూత్రస్థానమున "అకోఽకి దీర్ఘః" అనుసూత్రమే చెప్పదగును. "యథాసంఖ్యమనుదేశస్సమానామ్" (129) సూత్రము ప్రవర్తించుటవలన దధ్యత్ర (దధి+అత్ర) ఇత్యాదులందు దీర్ఘప్రసక్తి లేనందున సవర్ణపద మనావశ్యకమగును. కుమారీ శేతే అనుచోట నచ్చు పరముగ లేనందున దీర్ఘము ప్రసక్తము గాదుగాన నచ్పదానువృత్తి యావశ్యకము గాదు. కావున నీ న్యాసము లఘువగును. 2. వా। సవర్ణము హ్రస్వము నగు ఋకారము పరమగునపుడు ఋ అను ఏకాదేశము వికల్పముగ నగును. సవర్ణపదమువలన పూర్వస్థానియును ఋకారమే గావలయునని ఫలిత మగును. హోతృకారః (హోతృ+ఋకారః) పక్షమందు సవర్ణదీర్ఘమగును. హోతౄకారః. వా। సవర్ణము, హ్రస్వము నగు ఌకారము పరమగునపుడు ఌకారము వికల్పముగ నేకాదేశమగును. హోతౢకారః (హోతౢ+ఌకారః) ఋకార ఌకారములకు సవర్ణసంజ్ఞ విధింపబడినందున నిచట ఋకారమునకు ఌకారము సవర్ణమగును. పక్షమందు ఌకారమునకు సవర్ణమగుటచేతను, త్రిమాత్రికమగు ఌకారము లేకపోవుటచేతను "అకస్సవర్ణే" సూ. చే, ౠకారమే యాదేశమగును. హోతౄకారః. ఈ రెండువార్తికములచే విధింపబడిన వర్ణద్వయము (ఋ, ఌ) ప్రత్యేకము రెండు మాత్రలు గలవి (ద్విమాత్రికము). మొదటిదానియొక్క మధ్యను రెండు రేఫ లున్నవి. వీని కొకమాత్ర. ఈ రేఫములను చుట్టువారుకొనియున్న నజ్భాగమున కొకమాత్ర. రెండవదానియొక్క మధ్యను రెండు లకారములున్నవి. వీని కొకమాత్ర. ఈ లకారములకు జుట్టునున్న నజ్భాగమున కొక్క మాత్ర. ఈ వార్తికద్వయముయొక్క యుదాహరణములందును ఋత్యకః సూ. చే వైకల్పికప్రకృతిభావము ముందు చెప్పబడును.

వి:_ (1) అక్షరసమామ్నాయమున వర్ణముల ఉపదేశము, పిమ్మట వానికి (కకార చకారాదులకు) ఇత్సంజ్ఞ, తరువాత "ఆదిరన్త్యేన" సూ. చే ప్రత్యాహారము, పిదప సవర్ణసంజ్ఞ, పిమ్మట "అణుదిత్సూత్రమను, వాక్యాపరిసమాప్తిన్యాయమువలన అణుదిత్సూత్రముచే నితర సూత్రములందలి అణ్ణు స్వసవర్ణగ్రాహకమగునుగాని నాజ్ఝలౌసూత్రమందలి యచ్చుగాని, అణుదిత్సూత్రమందలి అణ్ణుగాని సవర్ణగ్రాహకములు గావు. అనగా ప్రత్యాహారసిద్ధి అయినపిదప, నాజ్ఝలౌసూత్రమునకు వాక్యార్థబోధ కలుగగానే నిషేధమునకు (అపవాదమునకు) విషయమగు వర్ణములను విడచి "తుల్యాస్య" సూత్రము సవర్ణపదమునకు బోధ్యము లివియని నిశ్చయముగ బోధించును. అపు డణుదిత్సూత్రముచే నాసవర్ణములకు గ్రహణమును బోధింపదగును. సవర్ణసంజ్ఞాసూత్రమునకుపూర్వమే నాజ్ఝలౌసూత్రమునకు బోధ కలుగును గాన నచట నణుదిత్సూత్రము ప్రవర్తింపదు. తుల్యాస్యసూత్రమునకు బాధకమగు నాజ్ఝలౌసూత్రమునకు ముందుగా వాక్యార్థబోధ కలుగని యెడల బాధకసంభావనచే తుల్యాస్యసూత్రమువలన గలుగు సవర్ణపదము యొక్క శక్తిజ్ఞానము ప్రమాణమగునా, కాదా, యను సంశయముచే సవర్ణపదముయొక్క యర్థమే నిశ్చితముగానందున సవర్ణపదముతోగూడిన అణుదిత్సూత్రమునకు బోధయే కలుగకపోవునని భావము.

(2) "అకస్సవర్ణే దీర్ఘః" సూత్రముచేత నే హోతౄకారః, హోతౄ్కారః అను రూపములు సిద్ధములగునని చెప్పి యీవార్తికద్వయమును ప్రత్యాఖ్యానము చేయుట తుల్యాస్యసూత్ర భాష్యము వార్తికద్వయవిహితములు ద్విమాత్రికము లనుటయందు, మొదటిది రేఫద్వయముకలదని, రెండవది లకారద్వయము కలదనియు చెప్పుటయందును ప్రమాణము. రేఫ లకారములచుట్టు నజ్భాగమున్నదనుటలో ఏఓఙ్, హయవరట్ సూత్రముల భాష్యము ప్రమాణము.

* 87. ఏఙః పదాన్తాదతి. 6-1-106. ఏఙః, పదాన్తాత్, అతి.

(పూర్వరూపమ్)

పదాన్తాదేఙోతి పరే పూర్వరూపమేకాదేశస్స్యాత్।

హరేఽవ। విష్ణోఽవ॥

87. పదమునకు తుదినున్న ఏ, ఓ లకు హ్రస్వాకారము పరమగునపుడు పూర్వస్థానియొక్క రూప మేకాదేశమగును. హరేఽవ (హరే+అవ) విష్ణోఽవ (విష్ణో+అవ).

* 88. సర్వత్ర విభాషా గోః. 6-1-122. సర్వత్ర, విభాషా, గోః। (ఏఙః, పదాన్తాత్, అతి: ప్రకృత్యా)

లోకే వేదే చైఙన్తస్య గోరతి వా ప్రకృతిభావస్స్యాత్పదాన్తే। గోఅగ్రమ్, గోఽగ్రమ్। ఏఙన్తస్య కిమ్। చిత్రగ్వగ్రమ్। పదాన్తే కిమ్। గోః॥

88. లౌకికభాషయందును, వేదమందును, ఓకారాన్తమైన గోశబ్దమునకు పదాన్తమందు హ్రస్వాకారము పరమగునపుడు ప్రకృతిభావము (ఏటిసన్ధికార్యములను బొందక స్వభావముచే నుండుట) వికల్పముగ నగును. గోఅగ్రమ్ (గో+అగ్రమ్). ఇచట పూర్వరూపము ప్రవర్తింపలేదు. పక్షమందు పూర్వరూపము. గోఽగ్రమ్. గోశబ్ద మేజన్తమేగాన 'నేచ్' పదానువృత్తికి 'చిత్రగుః' అను బహువ్రీహిసమాసమున, గోశబ్దమునకు హ్రస్వము ప్రవర్తించుట వలన గోశబ్దము ఉకారాన్తమగుటచే నిట్టిగోశబ్దమున కకారము పరమగునపుడు చిత్రగ్వగ్రమ్ (చిత్రగు+అగ్రమ్) ఇత్యాదులలో ప్రకృతిభావము నివర్తించుట ఫలమని తెలియనగును. గోః (గో+అస్). ఇచట ప్రకృతిభావమును వారించుటకై పదాన్తమందు ప్రకృతిభావమును విధించవలయును. ఇచట గోశబ్దమున కజాది సుబ్విభక్తి పరమగుటచే గోశబ్దము భసంజ్ఞకమగును గాని పదసంజ్ఞకము గాదు.

వివ:- "ప్రకృత్యాన్తఃపాదమవ్యపరే" (6-1-115.) సూత్రమునుండి 'ప్రకృత్యా' అను పద మనువర్తించును. "దుస్త్యజా ప్రకృతిః" ఇత్యాదులలో ప్రకృతిశబ్దము స్వభావార్థకముగ గాన్పించుటచే నిచట ప్రకృతిశబ్దము స్వభావబోధకము. ప్రకృత్యా భావః=(స్వభావేనావస్థానమ్) ప్రకృతిభావః, సన్ధికార్యము లెవ్వియును బొందకుండుట యని యర్థము. కావున గో అగ్రమ్ అనుచోట సన్నిహితమగు పూర్వరూపము, వ్యవహితమగు నవాదేశముగూడ నివృత్తమగును.

* 89. అవఙ్ స్ఫోటాయనస్య[1]. 6-1-123.

అవఙ్, స్ఫోటాయనస్య। (అచి, గోః, వా, పదాన్తే)
అతీతి నివృత్తమ్। అచి పరే పదాన్తే
గోరవఙ్ వా స్యాత్। గవాగ్రమ్। పదాన్తే కిమ్।
గవి। వ్యవస్థితవిభాషయా గవాక్షః॥

89. అతి[2], అను పద మీసూత్రములోని కనువర్తించదు. అచి, అను పద మనువర్తించును. ఓకారాన్తమగు గోశబ్దమునకచ్చు పరమగునపుడు పదాన్తమందవఙాదేశము (అవ) వికల్పముగ నగును. గవాగ్రమ్ (గో+అగ్రమ్.) ఆదేశము ఙిత్తగుటవలన ఙిచ్చ, అను పరిభాషచే నోకారస్థానమున వచ్చును. గవి (గో+ఙి) అనుచోట అవఙాదేశమును వారించుటకై పదాన్తమందు విధింపవలయును. ఇచట గోశబ్దము భసంజ్ఞకముగాని పదముగాదు. అవఙాదేశ వికల్పము, వ్యవస్థిత[3]మగుటచే గవాక్షః అనుచోట నవఙాదేశము నిత్యముగనే ప్రవర్తించును. గవామక్షీవ, అని విగ్రహము. కిటికీ యనునర్థమందు రూఢము.

వివ:- (1) విభాషాపదానువృత్తివలన వికల్పము సిద్ధమగును గాన స్ఫోటాయనగ్రహణము పూజార్థ మనగా నా ఋషినామస్మరణమువలన గలుగు శ్రేయముకొఱకని యర్థము.

(2) అతి, అనునది నిష్ప్రయోజనముగనుక నే "ఇన్ద్రే చ" (6-1-124) సూత్ర మారంభసామర్థ్యమువలన నిత్యమని భాష్యాదులందు జెప్పబడినది సమంజసమగును. అనిత్యమగునెడల "గవేన్ద్రః" (గో+ఇన్ద్రః) అనుచోట అవఙ్ స్ఫోటాయనస్య సూత్రమునకు ప్రసక్తి యుండదుగాన భాష్యోక్తికి కసాంగత్యము వాటిల్లును.

(3) వ్యవస్థితవిభాషయన, నియతమగువికల్పమని యర్థము. అనగా నితర విభాషలవలె నొకప్రయోగమందే కార్యముయొక్క ప్రవృత్త్యప్రవృత్తులను (భావాభావములను) బోధింపక నొకప్రయోగమునందు కార్యముయొక్క ప్రవృత్తిని మాత్రమునే, వేరుప్రయోగమునందు కార్యాప్రవృత్తిని మాత్రమునే బోధించును. ఈ విభాషలనుగుఱించి "శాచ్ఛోరన్యతరస్యామ్" (7-4-41) సూత్రభాష్యమున నిట్లు చెప్పబడెను: శ్లో॥ దేవత్రాతో, గలో, గ్రాహ, ఇతియోగే చ సద్విధిః। మిథస్తే న విభాష్యన్తే గవాక్షస్సంశితవ్రతః" అని. దేవత్రాతః. (ఈపేరుగల రాజు) ఇచట "నుదవిదోన్దత్రా" (8-2-56) సూ. చే విహితమగు నత్వము ప్రవర్తించలేదు. గలః (కణ్ఠము) ఇచట "అచివిభాషా" (8-2-31) సూ. చే విధింపబడిన లత్వము నిత్యముగ ప్రవర్తించినది. గ్రాహః (మొసలి) ఇచట "విభాషా గ్రహః (3-1-143) సూ. చే విధింపబడిన ణప్రత్యయము నిత్యముగ ప్రవర్తించినది. హన్తీతి పలాయతే (చంపునను కారణముచే పాఱిపోవుచున్నాడు) ఇచట "లక్షణహేత్వోః క్రియాయాః" (3-2-126) సూ. చే విహితమగు శతృప్రత్యయము హన ధాతువునకు ప్రవర్తించలేదు. గవాక్షః, సంశితమ్, ఇచట "శాచ్ఛోరన్యతరస్యామ్" (7-4-41) సూ. చే విధింపబడిన నిత్వము నిత్యముగ ప్రవర్తించినది. ఈ యాఱుసూత్రములు వ్యవస్థితవిభాషలని యర్థము.

* 90. ఇన్ద్రే చ. 6-1-124. (గోః, అవఙ్)

గోరవఙ్ స్యాదిన్ద్రే। గవేన్ద్రః.

90. గోశబ్దమునకు ఇన్ద్రశబ్దము పరమగునపు డవఙాదేశము నిత్యముగ వచ్చును. గవేన్ద్రః (గో+ఇన్ద్రః)

వివ:- ఈసూత్రము నిత్యమనుటకు గారణము పైసూత్రమందు (89) వ్రాయబడినది. కావున ఇన్ద్రే చ నిత్యమ్మని, నిత్యపదముతోఁగలసిన పాఠము పేక్షింపదగును.

అథ ప్రకృతిభావః

ఇటుపైని ప్రకృతిభావసన్ధి వ్యాఖ్యానము చేయబడును.

వివ:- "ప్రకృత్యాన్తః పాదమవ్యపరే" (6-1-115) సూత్రము న సాన్తః పాదమవ్యపరే అను పాఠము గలదు. ప్రకృత్యా అనుదాని

స్వభావముచే నవస్థానమని యర్థము. న, అనుదానికి ప్రాప్తమగు కార్యములకు నిషేధమని యర్థము. ప్రకృత్యా అనుపాఠమందే ప్లుతప్రగృహ్యా అచి, (91) అను వక్ష్యమాణసూత్రము ననుప్రసక్తమగునని సూచించుటకై ప్లుతప్రగృహ్యా అను సూత్రమున కవ్యవహితపూర్వమందు అథ ప్రకృతిభావః అనువాక్యము వ్రాయబడినది. కావున ప్రకృతిభావమును విధించెడి "సర్వత్ర విభాషా గోః" సూత్ర మింతకుమున్నె వ్యాఖ్యాతమగుటవలన నిచట నీవాక్యము వ్రాయుట యసఙ్గత మను వాదము సరికాదు. ప్రకృతిభావసని యింతటినుండియే వ్యాఖ్యానము చేయబడుననియు, ప్రకృతిభావ బహిర్భూతమగు నవఙాదేశమును విధించు "అవఙ్ స్ఫోటాయనస్య" (89) "ఇన్ద్రేచ" (90) సూత్రములలోనికి గోశబ్దానువృత్తిని దెల్పుటకై యింతకుపూర్వము "సర్వత్ర విభాషా గోః" సూత్రము వ్యాఖ్యానము చేయబడెననియును గ్రహింపదగును.

* 91. ప్లుతప్రగృహ్యా అచి నిత్యమ్. 6-1-125.
ప్లుతప్రగృహ్యాః, అచి, నిత్యమ్. (ప్రకృత్యా)

ప్లుతాః ప్రగృహ్యాశ్చ వక్ష్యన్తే, తేఽచి నిత్యం
ప్రకృత్యా స్యుః. ఏహి కృష్ణ 3, అత్ర గౌశ్చరతి।
హరీ ఏతౌ। నిత్యమితి కిమ్। హరీ ఏతావిత్యాదా
వయమేవ ప్రకృతిభావో యథా స్యాదికోఽవర్ణ
ఇతి హ్రస్వసముచ్చితో మాభూత్॥

91. ప్లుతసంజ్ఞకములు, ప్రగృహ్యసంజ్ఞకములు చెప్పబడును. అవి అచ్చుపరమగునపుడు ప్రకృతిభావమును నిత్యముగ బొందును. ఏహి కృష్ణ 3, అత్ర గౌశ్చరతి, కృష్ణశబ్దములోని అకారము "దూరాద్ధూతే చ" (96) సూ. చే ప్లుతమైనది. ప్రకృతిభావమువలన "అత్ర" శబ్దములోని అకారముతో ప్రసక్తమగు సవర్ణదీర్ఘము నివృత్తమగును. హరీ ఏతౌ. ఇచట నీకారము "ఈదూదేద్ద్వివచనం ప్రగృహ్యమ్" (101) సూ. చే ప్రగృహ్యసంజ్ఞకమైనది. యణాదేశము నివర్తించును. వికల్పబోధకమగు వాశబ్దమునకు నివృత్తివలననే నిత్యమను నర్థము లభించునుగాన సూత్రములోని నిత్యపదమున కేమిప్రయోజనమను ప్రశ్నమున కుత్తరము:- నిత్యగ్రహణసామర్థ్యమువలన నీసూత్రమున మరియొకమారు ప్లుతము విధింపబడును. ఈసూత్రమునకు బాధకమగు సూత్రముయొక్క విషయమందు (ఈసూత్రమునకు ప్రాప్తియున్న చోటున) నీసూత్రముచే విహితమగు ప్రకృతిభావమే ప్రవర్తించును. ఎట్లన, హరి ఈశౌ, అనుచోట ప్రకృతిభావవిధానమువలన నీసూత్రము సావకాశమైనది. చక్రి అత్ర, (చక్రి+అత్ర) అనుచోట హ్రస్వప్రకృతిభావముల విధానముచే, "ఇకోఽసవర్ణే" (92) సూత్రము సావకాశమైనది. 'హరీ ఏతౌ' అనుచోట నీప్రకృతిభావమును బాధించి పరమగు "ఇకోఽసవర్ణే" -

సూ. చే హ్రస్వసముచ్చిత ప్రకృతిభావము ప్రసక్తమగుచున్నది. దీనిని బాధించి యీసూత్రముచే విధింపబడు ప్రకృతిభావమే ప్రవర్తించును. ఈసూత్రమునకు ప్రాప్తియున్న చోటున నీసూత్రమేగాని వేరొకసూత్రము ప్రవర్తించ దను నర్థము ఫలితమగును.

వివరణము:- ప్లుత ప్రగృహ్యపదముల యర్థజ్ఞానమునకై యింతకుమున్న ప్లుత ప్రగృహ్యసంజ్ఞలను విధించు సూత్రములను వ్యాఖ్యానముచేయుట యుచిత మైనను, "ఇద్రేచ" సూత్రమున ప్రాచీనులచే పఠింపబడిన "నిత్య" పదము ప్రామాణికము గాదని సూచించుటకు "ఇద్రేచ" సూత్రమున కవ్యవహిత పరముగ, నిత్యపదముతోఁగూడిన యీసూత్రము ప్రథమమున వ్యాఖ్యానము చేయబడెను. ఈసూత్రములోని నిత్యపద మావశ్యకమని నిరూపింపబడెను. "ఇద్రేచ" సూత్రములో నిత్యగ్రహణ మావశ్యకము గాదని చెప్పబడినది. "ఇద్రేచ" సూత్రమున నిత్యపదము ప్రామాణికమైనచో నీసూత్రమందు తిరుగ నిత్యపదమును చెప్పుట యనుచితమగును గదా !

* 92. ఇకోఽసవర్ణే శాకల్యస్య హ్రస్వశ్చ. 6-1-127.

ఇకః, అసవర్ణే, శాకల్యస్య, హ్రస్వః, చ. (ప్రకృత్యా)

పదాన్తా ఇకోఽసవర్ణేఽచి పరే ప్రకృత్యా స్యుః, హ్రస్వశ్చ వా। అత్ర హ్రస్వవిధిసామర్థ్యాదేవ ప్రకృతిభావే సిద్ధే, తదనుకర్షణార్థశ్చకారో న కర్తవ్య ఇతి భాష్యే స్థితమ్। చక్రి అత్ర। చక్ర్యత్ర। పదాన్తా ఇతి కిమ్। గౌర్యౌ ॥వా॥ న సమాసే। వాప్యశ్వః।వా। సితి చ, పార్శ్వమ్.

92. పదాన్తములైన యిక్కు లసవర్ణమగు నచ్చు పరమగునపుడు, శాకల్యుని మతమున ప్రకృతిభావమును, హ్రస్వమును జెందును. ఈసూత్ర మున చకారము ప్రకృత్యా, అను పదము నాకర్షించుటకు చేయబడెను. ప్రకృతిభావవిధానము లేనపుడు యణాదేశాదులు దీర్ఘమునకు ప్రవర్తించినను, హ్రస్వమునకు ప్రవర్తించినను, విశేషము లేదుగాన కేవలహ్రస్వవిధానము వ్యర్థమగును. ఇందువలననే ప్రకృతిభావము సిద్ధమగును. చకారమువలన ప్రకృతిభావపద మనువర్తించు ననినచో "చానుకృష్టం నోత్తరత్ర" (చకార మునచే యనువృత్తమగునది యుత్తరసూత్రములోనికి సమ్బంధించదు) అను నిషే ధముచే "ఋత్యకః" (93) సూత్రములోనికి ప్రకృతిభావ పదసమ్బన్ధము లేకపోవును. హ్రస్వవిధానసామర్థ్యముచే ప్రకృతిభావము సిద్ధమగుననినచో "ఋత్యకః" సూత్రములోనికిని ప్రకృతిభావసమ్బన్ధము సిద్ధమగునుగాన హ్రస్వ విధానమునకు సామర్థ్యకల్పన మావశ్యకము. ఇట్లు చకార మీ సూత్ర మున నావశ్యకముగాదని యీసూత్రముయొక్క భాష్యమందు జెప్పబడెను.

చక్రి అత్ర, (చక్రిన్+అత్ర) హ్రస్వప్రకృతిభావముల ప్రవృత్తివలన యణాదేశము నివృత్తమైనది. పక్షాంతరమున చక్ర్యత్ర. ఇక్కులకు పదాన్తములను విశేషణముచేసినచో గౌర్యౌ (గౌరీ+ఔ) అనుచోట ప్రకృతిభావము ప్రసక్తమగును. ఇచట గౌరీ అనునది పదసంజ్ఞకము గానందున నీకారము పదాన్తముగాదు. కావున ప్రకృతిభావము రాదు. వాప్యశ్వః. (వాప్యామశ్వః, వాపీ+అశ్వః) ... ఇత్సంజ్ఞకసకారముగల ప్రత్యయము పరమగునప్పుడు ప్రకృతిభావము రాదు. పార్శ్వమ్ ( పార్శూ+అమ్ ) పర్శ్వాశబ్దముకంటె అణ్ (అ) ప్రత్యయము. ఇది పరమైనపుడు పర్శ్వాశబ్దమునకు పదసంజ్ఞను భసంజ్ఞ బాధించును. ఇచట ప్రసక్తమగు ప్రకృతిభావమునకీ నిషేధము.

*93. ఋత్యకః, 6-1-128. ఋతి, అకః।
(ప్రకృత్యా, పదాన్తాః)

ఋతి పరే అకః ప్రాగ్వత్। బ్రహ్మఋషిః।
బ్రహ్మర్షిః। పదాన్తా ఇత్యేవ। ఆర్ఛత్। సమాసే
ప్యయం ప్రకృతిభావః। సప్తఋషీణామ్॥ సప్తర్షీణామ్॥

93. పదాన్తములైన యక్కులకు హ్రస్వఋకారము పరమగునపుడు వికల్పముగ ప్రకృతిభావము నొందును. బ్రహ్మఋషిః (బ్రహ్మ+ఋషిః) పక్షమందు గుణము. బ్రహ్మర్షిః. ఆర్ఛత్ (ఆ+ఋచ్ఛత్.) ఋచ్ఛ (గత్యాదిషు) ధాతువునకు లఙ్ ప్రథమైకవచనము. ఇచట నాకారము ధాతువునకు పూర్వమైన యాగమమగుటచే పదాన్తముగాదు. ఇచట ప్రకృతిభావనివృత్తికై అక్కులు పదాన్తములు గావలయునని చెప్పవలయును. లక్ష్యానుసారివ్యాఖ్యానమువలన నీసూత్రము సమాసమందును ప్రవర్తించును. సప్త ఋషీణామ్. (సప్త చ తే ఋషయః, తేషామ్) పక్షమందు. సప్తర్షీణామ్॥

*94. వాక్యస్య టేః ప్లుత ఉదాత్తః, 8-2-82. వాక్యస్య, టేః, ప్లుతః, ఉదాత్తః॥ ఇత్యధికృత్య ॥

94. ఇది యధికారసూత్రము. అష్టమాధ్యాయ ద్వితీయపాదాన్తమువరకధికృతమగును.

* 95. ప్రత్యభివాదేఽశూద్రే. 8-2-83.
ప్రత్యభివాదే, అశూద్రే।

అశూద్రవిషయే ప్రత్యభివాదే యద్వాక్యం తస్య టేః
ప్లుతస్స్యాత్, స చోదాత్తః। అభివాదయే దేవ
దత్తోఽహమ్। భో ఆయుష్మానేధి దేవదత్త3। స్త్రియాం న।
అభివాదయే గార్గ్యహమ్। భో ఆయుష్మతీ భవ గార్గి।

నామ గోత్రం వా యత్ర ప్రత్యభివాద వాక్యాన్తే
ప్రయుజ్యతే తత్రైవ ప్లుతః స్యాత్। నేహ। ఆయుష్మానేధి।
భో రాజన్య విశాం వేతి వాచ్యమ్। ఆయుష్మానేధి భో3ః॥
ఆయుష్మానేధీన్ద్రవర్మ3న్। ఆయుష్మానేధీన్ద్రపాలిత3॥

95. ఆశీర్వాదము నపేక్షించి, శిష్యాదులచే నమస్కరింపబడిన గుర్వాదులచే చేయబడు ప్రతిసంభాషణము ప్రత్యభివాద మనబడును. ఆశీర్వచనము మాత్రమే ప్రత్యభివాదమనినచో, శూద్రునివిషయమై కుశలప్రశ్న చేయుటయేగాని యాశీర్వచనము స్మృతులలో నిషేధింపబడినందున "అశూద్రే" అను నిషేధము వ్యర్థము గావలసివచ్చును. శూద్రునికంటె నితరమగు వానివిషయమగు ప్రత్యభివాదవాక్యముయొక్క టిసంజ్ఞకమునకు ప్లుతము వచ్చును. అదియు నుదాత్తమగును. భో ఆయుష్మానేధి దేవదత్త3॥ దేవదత్తుడనగు నే నాశీర్వాదమునకై నమస్కరించుచున్నానని (అభివాదయే దేవదత్తోఽహమ్) శిష్యుడు చెప్పినపిదప గురువుయొక్క ప్రతిసంభాషణ వాక్యమిది. ఇచట తకారముపైనున్న అకారము ప్లుతమగును. కుశల్యసి తుషజక. ఇది శూద్రవిషయకమగు ప్రత్యభివాదవాక్యము. "అశూద్రే" అని చెప్పుటవలన నిచట ప్లుతము నివర్తించును. వా। ప్రత్యభివాద వాక్య మాడుదానివిషయమైనపుడు ప్లుతము రాదు. ఆడుదానికిగూడ నామముచే నభివాదప్రత్యభివాదములు భాష్యసమ్మతము లగుటవలన ప్రాప్తమగు ప్లుతమున కిది నిషేధము. భో ఆయుష్మతీ భవ గార్గి. ఈప్రత్యభివాదవాక్యము స్త్రీవిషయకమగుటచే నిచట ప్లుతమురాదు. "అభివాదయే గార్గ్యహం" మనున దభివాదవాక్యము. ఏప్రత్యభివాదవాక్యముయొక్క తుదిని శిష్యాదుల పేరును గాని గోత్రమును గాని బోధించు పదము ప్రయోగింపబడునో యట్టివాక్యమునకే ప్లుతమిష్టము. ఆయుష్మానేధి. ఈవాక్యముయొక్క తుదిని యట్టిపదము (నామ గోత్రం వా) లేనందున ప్లుతము రాదు. వా। వాక్యాన్తములగు భోశ్శబ్దము, నామ ధేయములగు రాజన్యశ్రేష్ఠ వైశ్యబోధకశబ్దములు, వీనియొక్క టిసంజ్ఞకమునకు ప్లుతము వికల్పముగనగును. భోశ్శబ్దమునకు ప్రాప్తమగుచుండ నితరములకు ప్రాప్త మగుచుండ మూడింటికి వికల్పమనుటవలన నిది యుభయత్రవిభాష. క్రమముగ నుదాహరణములు : ఆయుష్మానేధిభో3ః. ఆయుష్మానేధీన్ద్రవర్మ3న్. ఆయుష్మానేధీన్ద్రపాలిత3. పక్షమందు వీనికి ప్లుతము ప్రవర్తించదు.

* 96. దూరాద్ధూతే చ 8-2-84। దూరాత్, హూతే, చ.

దూరాత్సమ్బోధనే యద్వాక్యం తస్య టేః
ప్లుతస్స్యాత్। సక్తూన్ పిబ దేవదత్త3.

96. దూరదేశమునుండి యొకవిషయమును బోధింప బ్రయుక్తంబగు వాక్యమందలి తుదినుండు, పిలువబడువానిని బోధించెడి పదముయొక్క టిసంజ్ఞకమునకు ప్లుత మగును. సక్తూన్ పిబ దేవదత్త3.

వివరణము : ఎంతదూరమునుండి స్వాభావసిద్ధమగు ప్రయత్నముచే నుచ్చరింపబడు వాక్యమును పిలువబడువాడు వినలేడో, వినబడుటకై యధికయత్నమపేక్షింపబడునో, అంతదూర మిచటి దూరశబ్దమున కర్థము.

హూత మన నాహ్వానము. ఇది బోధనసామాన్యమును బోధించును గాని, సంబోధనప్రథమావిభక్తి వచ్చుట కావశ్యకమగు తన కెదురుగ లేనివాని నెదురుగ చేసికొని బోధించుట యను సంబోధనమాత్రమునే బోధింపదు. ఈవిషయమున, "ఆకడారాదేకాసంజ్ఞా" సూత్రములోని భాష్యము మానము. కావుననే సంబోధనము లేనట్టి, "సక్తూన్ పిబ దేవదత్త3" ఇత్యాదులందును, ప్లుతము సిద్ధమగును. సంబోధనమాత్రమే యర్థమనిన, "ఆగచ్ఛ భో మాణవక దేవదత్త3" ఇత్యాదులందే ప్లుతము ప్రవర్తించును.

* 97. హైహేప్రయోగే హైహయోః 8-2-85

హైహే ప్రయోగే, హైహయోః (దూరాద్ధూతే)

ఏతయోః ప్రయోగే దూరాద్ధూతే యద్వాక్యం తత్ర హైహయోరేవ ప్లుతస్స్యాత్। హే3 రామ। రామ హై3.

97. దూరమునుండి యేదేని విషయమును బోధించుటకై ప్రయుక్తంబగు వాక్యమున హై, హే అను శబ్దములు ప్రయోగింపబడినచో హై, హే శబ్దములకే ప్లుతము వచ్చును. హే3 రామ, రామ హై3.

వివరణము : హై హే శబ్దములు సంబోధనమునకు ద్యోతకములుగ నుండుటచేతను, కేవలములగు వీనిచే సంబోధన మగపడుటవలన నీపదములు పిలువబడువారిని బోధింపగలవగుటచే, వీనికి "గురోరనృతః" (98) అను సూ. చే ప్లుతము సిద్ధమగుచుండ, నీసూత్రము హై హే శబ్దములకేగాని యితరములకు ప్లుతము రాదను నియమముకొఱ కగును. వాక్యమునన్త్యములైనవానికే ప్లుతమిష్టమైనచో "హై హేఽన్త్యే" అనిన సరిపోవుచుండ ప్రయోగగ్రహణ మనన్త్యములగువానికిని ప్లుతమును బోధించును. ఈవిషయమును సూచించుటకే, హేరామ, అని యుదాహరించెను.

* 98. గురోరనృతోఽనన్త్యస్యాప్యేకైకస్య ప్రాచామ్. 8-2-86.

గురోః, అనృతః, అనన్త్యస్య, అపి, ఏకైకస్య, ప్రాచామ్, (దూరాద్ధూతే)

దూరాద్ధూతే యద్వాక్యం తస్య ఋద్భిన్నస్యానన్త్యస్యాపి గురోర్వా ప్లుతస్స్యాత్। దే3వదత్త। దేవద3త్త। దేవదత్త3। గురోః కిమ్। వకారాత్పరస్యాకారస్య మాభూత్। అనృతః కిమ్। కృష్ణ3। ఏకైకగ్రహణం పర్యాయార్థమ్। ఇహ ప్రాచామితియోగో విభజ్యతే। తేన సర్వః ప్లుతో వికల్ప్యతే॥

98. దూరమునుండి యొకని పిలుచుటను బోధింప ప్రయుక్తమగు వాక్యమందు పిలువబడువానిని బోధించుపదమున, ప్రాంత్యఋకారముకంటె భిన్నము నన న్త్యమగు గురువర్ణమునకు, ఒకొక్కప్పుడు లఘువునకైనను, కాక పోయినను, టిసంజ్ఞకమునకును, ప్లుతము వికల్పముగ నగును. దేవదత్త, దేవద3త్త, దేవదత్త3. వాక్యమునకుగల వీనికిముందు "ఏహి" అను పదమును జేర్పవలయును. దేవదత్తపదములోని తకారముపైనున్న లఘ్వకారమునకు ప్లుతనివృత్తికై గురువునకే ప్లుతమగును. కృష్ణ3, ఇచట ఋకారమునకు ప్లుతవారణమునకై ఋకారభిన్నమైన గురువునకే ప్లుతమును విధింపవలయును. ఏకైకస్య, అనుటచే నొకపదమున నొకవర్ణమున కొకమారు, మరియొకమారు మరొకవర్ణమునకు నిట్లు పర్యాయముగా ప్లుతము వచ్చుననియు, నొకమారు రెండువర్ణములకు రాదనియును తెలియదగును. సూత్రమున "ప్రాచామ్" అను పదమును విభజించి ప్రాచీనులమతమున ప్లుతమగునని చెప్పవలయును. మతాన్తరమందు ప్లుతాభావము సిద్ధమగును. యోగవిభాగముచేసి యిట్లు వ్యాఖ్యానము చేయుటవలన, సర్వసూత్రములచే విధింపబడు ప్లుతమునకు,1 వికల్పము ఫలితమగును.

వివరణము:_1 కావున "ద్వైపాయనో విరహాకాతర ఆజుహావ పుత్రేతి" అను భాగవతప్రయోగము 'పుత్రేతి' అనుచోట ప్లుతము ప్రవర్తింపనందున సాధువగును. ప్లుతమున్నను ప్లుతనిమిత్తక ప్రకృతిభావము చాంద్రవర్మణమతమందు లేదని భాష్యకారులు చెప్పుటచే ప్రకృతిభావము లేనందువలనను, సాధువగును. ప్రకృతిభావమున్నచో 'పుత్ర3ఇతి' (పుత్ర+ఇతి) అనుచోట గుణము దుష్టము గావలయును. ఇట్టి ప్రయోగమునకు సాధుత్వము సిద్ధమగుచుండ భాగవతవ్యాఖ్యాతయగు శ్రీధరాచార్యుడు, ఋషిప్రోక్తమగుటచేతనే సాధువగుననుట గ్రాహ్యము కానేరదు.

* 99. అప్లుతవదుపస్థితే. 6_1_129. అప్లుతవత్, ఉపస్థితే॥

ఉపస్థితోఽనార్ష ఇతి శబ్దః। తస్మిన్ పరే ప్లుతోఽప్లుతవద్భవతి। అప్లుతకార్యం యణాదికం కరోతీత్యర్థః। సుశ్లోక3ఇతి। సుశ్లోకేతి। వత్ కిమ్। అప్లుత ఇత్యుక్తేఽప్లుత ఏవ విధీయేత। ప్లుతశ్చ నిషిధ్యేత। తథా చ ప్రగృహ్యాశ్రయే ప్రకృతిభావే ప్లుతస్య శ్రవణం న స్యాత్। అగ్నీ3ఇతి॥

99. అప్లుతవత్=(నప్లుతో అప్లుతః) అప్లుత ఇవ. ఉపస్థితమన వేదములోనిదిగానట్టి ఇతిశబ్దము (లౌకికేతిశబ్దము). ఇది పరమగునపుడు ప్లుతమప్లుతమువంటిదగును. ప్లుతమునకు ప్రకృతిభావము రాక ప్లుతభిన్నమునకు వచ్చెడి యణాదేశాదికార్యములు ప్రవర్తించునని యర్థము. సుశ్లోకేతి, కకారముపై అకారము ప్లుతమైనను గుణము ప్రవర్తించినది. సుశ్లోక3 ఇతి. దీనివలన కకారముపై అకారము ప్లుతమని తెలియును. "అప్లుతవత్" అనుచోట వత్సువది

లేనిచో ప్లుతస్థానమందు ప్లుతనిషేధమే విధింపబడును. సాదృశ్యార్థకవత్ కరణమువలన ప్లుతకార్యమగు ప్రకృతిభావమునకు నిషేధము ఫలితమగును. కాని ప్లుతనిషేధము విహితముకాదు. కావుననే ప్లుతప్రగృహ్యసంజ్ఞలు రెండును గలిగిన యొకవర్ణము, ఇతిశబ్దము పరమైనపుడు ప్రగృహ్యసంజ్ఞను నిమిత్తముగజేసి ప్రకృతిభావము గలుగుచుండ దానియందు ప్లుతశ్రవణము సంభవించును. ప్లుతమే నిషేధింపబడినచో నిట్టిచోట ప్లుతశ్రవణము లేకపోవును. అగ్నీ3 ఇతి. ఈకారము "దూరాద్ధూతేచ" సూత్రముచే ప్లుతము. "ఈదూదేత్" (101) సూ. చే ప్రగృహ్యమగును. ప్రగృహ్యము వలన ప్రకృతిభావము ప్రవర్తించినది. ప్లుతనిషేధము లేనందున ప్లుతము శ్రుత మగుచున్నది.

* 100. ఈ చాక్రవర్మణస్య. 6-1-130. ఈ, చాక్రవర్మణస్య, (అప్లుతవత్, అచి)

ఈ ప్లుతోఽచి పరేఽప్లుతవద్వా స్యాత్। చినుహి3 ఇతి। చినుహీతి। చినుహి3 ఇదమ్। చినుహీదమ్। ఉభయత్ర విభాషేయమ్.

100. ఈకారరూపమగు ప్లుతము (త్రిమాత్రికమగు ఇకారము) అచ్చు పరమగునపుడు చాక్రవర్మణుని మతమున నప్లుతమువంటి దగును. వికల్పము ఫలిత మగును. చినుహీతి. (చినుహి3 ఇతి) హి యను నవ్యయములోని ఇకారము "అనన్త్యస్యాపి ప్రశ్నాఖ్యానయోః" (8-2-105) సూ. చే ప్లుత మగును. అప్లుతవద్భావమువలన (ప్రకృతిభావనిషేధమువలన) సవర్ణదీర్ఘ మగును. పక్షమందు చినుహి3 ఇతి. చినుహీదమ్ (చినుహి3 ఇదమ్) హి యనునది "విభాషా పృష్టప్రతివచనే హేః" (8-2-93) సూ. చే ప్లుత మగును. అప్లుతవద్భావమువలన సవర్ణదీర్ఘము. పక్షమందు చినుహి3 ఇదమ్. ఉపస్థితము పరమగునపుడు అప్లుతవద్భావము నిత్యముగా ప్రాప్తమగుచుండ, ననుపస్థితము పరమగునపు డప్రాప్తమగుచుండ నీసూత్రము నారంభించుటచే నిది యుభయత్ర విభాష యగును.

వివరణము : "వశా3 ఇయమ్" ఇత్యాదులందును చాక్రవర్మణమతమున నప్లుతవద్భావ మిష్టమని చెప్పి సూత్రములోని యీకారమును భాష్యకారుడు ప్రత్యాఖ్యానము చేసె నని తెలియునది.

* 101. ఈదూదేద్ద్వివచనం ప్రగృహ్యమ్ 1-1-11.
ఈదూదేత్, ద్వివచనం, ప్రగృహ్యమ్.

ఈదూదేదన్తం ద్వివచనం ప్రగృహ్యసంజ్ఞం స్యాత్। హరీ ఏతౌ। విష్ణూ ఇమౌ। గఙ్గే అమూ। పచేతే ఇమౌ। "మణీవోష్ట్రస్య" ఇతి తు ఇవార్థే వశబ్దో వాశబ్దో వా బోధ్యః.

101. ఈదూదేత్, అనునది ద్వివచనమునకు విశేషణమగుటచే తదన్త బోధకమగును. ఈ, ఊ, ఏ ఇవి యన్తమందుగల ద్వివచనములు ప్రగృహ్య సంజ్ఞకలవగును. హరీ ఏతౌ. విష్ణూ ఇమౌ. పచేతే ఇమౌ। ఇవి వరుసగ నుదాహరణములు. ప్రకృతిభావమువలన యణాదికార్యములు నివృత్తము లగును. హరి, విష్ణు శబ్దములకు ద్వివచనమగు, ఔకారప్రత్యయము చేసి "ప్రథమయోః పూర్వసవర్ణః" (165) సూ. చే పూర్వసవర్ణదీర్ఘము చేయుటవలన హరీ, విష్ణూ మొదలగు రూపములైనవి. ఇచట పరాదివద్భావమువలన ఈకారోకారములు ద్వివచనము లగును. "వ్యపదేశివదేకస్మిన్" (అసహాయమందు ముఖ్యవ్యవహారము గలదానియందువలె కార్యములను చేయదగును) అను న్యాయముచే. ప్రకృతమున ఈకారాన్తోకారాన్తములకు జెప్పబడిన కార్యము కేవలేకారోకారములకును వచ్చును. పచేతే ఇమౌ. పచేతే అనునది పచధాతువునకు లట్ ప్రథమ ద్వివచనము. (పచ్+అ+ఆతే) ఆతే అనునదియే ద్వివచనము. ఇట్టివానికి సంజ్ఞ రాకే "ఈదూదేత్" అనుచోట తదన్తవిధి యఙ్గీకరింపబడెను. ఈకారోకారైకారరూపమగు ద్వివచన మని నచో నిచట సంజ్ఞ రాకపోవును. "మణీవోష్ట్రస్య లమ్బేతే ప్రియౌ వత్సతరౌ మమ" అను భారతశ్లోకమున మణీ, అనుచోట ఈకారము ద్వివచనమగుటచే ప్రగృహ్యము గావలయును. దీనికి ఇవశబ్దము పరమగునపుడు ప్రకృతిభావము ప్రాప్తమగుచున్నది. కాన మణీవ, అనుచోట సవర్ణదీర్ఘము సాధువగునా? యను ప్రశ్నకు నచ్చోట నివశబ్దార్థమును (సాదృశ్యమును) బోధించు వ శబ్దముగాని, వా శబ్దముగాని పరముగ నున్నది, ఇవశబ్దము పరముగ లేదుగాన సాధువే యని సమాధానము.

వివరణము:- వ, వా, యథా, తథా, సామ్యే. అమరకోశము. "వం ప్రచేతసి జానీయా దివార్థే చ తదవ్యయమ్." మేదినీకోశము. "కాదమ్బఖణ్డిత దళాని వ పఙ్కజాని." మహాకవిప్రయోగము. వ, వా శబ్దము లివార్థకము లనుట కివి యాధారము.

* 102 అదసో మాత్. 1-1-12. అదసః, మాత్.

(ఈదూతౌ ప్రగృహ్యమ్)

అస్మాత్పరావీదూతౌ ప్రగృహ్యౌ స్తః। అమీ ఈశాః।
రామకృష్ణావమూ ఆసాతే। మాత్కిమ్। అముకేఽత్ర।
అసతి మాద్గ్రహణే ఏకారోప్యనువర్తేత॥

102. అదశ్శబ్దమునకు సమ్బంధించిన మకారమున కవ్యవహితపరము లగు ఈకారోకారములు ప్రగృహ్యసంజ్ఞకము లగును. అమీ ఈశాః. రామకృష్ణావమూ ఆసాతే. అమూ అనునది ఊకారోదాహరణము. రామకృష్ణౌ అనునది విశేషణము. "మాత్" అను పదము లేనపుడు అదశ్శబ్దసంబన్ధి వర్ణమునకంటె పరములగు ఈకారాదులకు ప్రగృహ్యసంజ్ఞ యని యర్థము

లభించును. అముకేఽత్ర. అముకే, అనునది అదశ్శబ్దమునకు ప్రథమా ద్వివచనాన్తము. అదశ్శబ్దము సర్వనామ మగుటచే దీనిమధ్య నకచ్ ప్రత్యయము వచ్చినది. "తన్మధ్యపతిత స్తద్గ్రహణేన గృహ్యతే" (ఏశబ్దముయొక్క మధ్య నేదేనికార్యము ప్రవర్తించినపు డాకార్యముతో గలసినదాని కాశబ్దవ్యవహారము కలుగును) పరిభాషచే నకచ్చుతో గూడిన నదశ్శబ్దమే యగును. అదశ్శబ్దసమ్బన్ధివర్ణము కకారము. దీనికి పరముగ నేకారముగూడ సంభవించును గాన పూర్వసూత్రమునుండి యేకారముగూడ ననువృత్తమగును. అముకేఽత్ర అనుచోటను ప్రగృహ్యసంజ్ఞ ప్రసక్తమగును. మాత్పరమున్నయెడల మకారమున కవ్యవహితపరములగు నీకారాదులకు సంజ్ఞ యని యర్థమగును. ఇట్టిది యేకారము సంభవింపదు, గాన నేకారమున కనువృత్తిలేదని తెలియును. కావున అముకేఽత్ర అనుచోట ప్రగృహ్యము నివారితమగును.

వివరణము:— ఈసూత్రమున మాకారానువృత్తి చేయుటకు, పుంలిఙ్గమందే ప్రయోజనము. అమూ అనుదానికి యీసూత్రముచే సంజ్ఞ చేయునపుడు "అదసో సేః" (422) సూ. చే అదస్శబ్దమునకు విహితమైన మాత్వ మసిద్ధమగుటచే అదౌ అని యుండును. ఇచట పూర్వసూత్రమునకు ప్రాప్తిలేదు గాన నీసూత్ర మావశ్యకము. సూత్రారమ్భసామర్థ్యమువలన మూత్వము సిద్ధమగును గాన దీనిచే సంజ్ఞ సిద్ధమగును. పుంలిఙ్గమందే ఫలమని సూచించుటకే రామకృష్ణౌ అను విశేషణము. స్త్రీ నపుంసకలిఙ్గములందు మాత్వ మసిద్ధమగుటచే నేకారాన్తమే (అదే) యుండును గాన పూర్వసూత్రముచేత నే సంజ్ఞ సిద్ధమగునని యూహింపనగు.

* 103. శే 1-1-113. (ప్రగృహ్యమ్)

అయం ప్రగృహ్యః స్యాత్। అస్మే ఇన్ద్రాబృహస్పతీ.

103. శే అను ప్రత్యయము ప్రగృహ్యమగును. "అస్మే ఇన్ద్రాబృహస్పతీ" అస్మే అనునది అస్మచ్ఛబ్దమునకు చతుర్థీ బహువచనాన్తము. (అస్మభ్యమ్) భ్యస్ ప్రత్యయమునకు "సుపాం సులుక్" (7-1-39.) సూ. చే శే, (ఏ) అను నాదేశము వేదమున విధింపబడెను. కావున వేదమందే ప్రకృతసూత్రమునకు ప్రయోజనము.

* 104. నిపాత ఏకాజనాఙ్. 1-1-14. నిపాతః, ఏకాచ్, అనాఙ్, (ప్రగృహ్యమ్)

ఏకోఽజ్నిపాత ఆఙ్వర్జః ప్రగృహ్యః స్యాత్। ఇ విస్మయే। ఇ ఇన్ద్రః। ఉ వితర్కే। ఉ ఉమేశః। అనాఙితి క్యుక్తేరఙిదాకారః ప్రగృహ్య ఏవ। ఆ ఏవం నుమన్యసే। ఆ ఏవం కిల తత్। ఙిత్తు న ప్రగృహ్యః। ఈషదుష్ణం ఓష్ణమ్। శ్లో॥ "ఈషదర్థే క్రియాయోగే మర్యాదాభి విధౌ చ యః। ఏతమాతం ఙితం విద్యాద్వాక్యస్మరణయోరఙిత్" ।

104. ఙకార మిత్సంజ్ఞగ గల యాకారముకంటె భిన్నమై నిపాత సంజ్ఞగల అచ్చు ప్రగృహ్యసంజ్ఞగలదగును. ఇ ఇన్ద్రః. మొదటి యికారము విస్మయార్థకమగు నిపాతము. ప్రకృతిభావమువలన సవర్ణదీర్ఘము ప్రవర్తించదు. ఉ ఉమేశః. మొదటి యుకారము వితర్కార్థకమగు నిపాతము. ఙిత్తగు నాకారమునకే (అనాఙ్) పర్యుదాసము చేయుటవలన ఙిత్తుకానట్టి యాకారము ప్రగృహ్యమే యగును. ఆ ఏవం ను మన్యసే. ఆకారము వాక్యార్థమందలి యనభిమతత్వమును (అనిష్టమును) ద్యోతన చేయును. అనగా పూర్వ మిట్లు తలంచలేదుగాని యిపుడిట్లు తలంచుచున్నావని యర్థము ఫలితమగును. ఆ ఏవం కిల తత్. ఆకారము స్మరణద్యోతకము. పై రెండర్థములను ద్యోతనచేయు నాకారము ఙిత్తుకాదనుటచే ప్రగృహ్యమగును. ఙిత్తగునాకారము ప్రగృహ్యముగాదు. ఓష్ణమ్. (ఆ+ఉష్ణమ్) ఈషదర్థకమగు నాకారము ఙిత్తనుటచే సంజ్ఞానిషేధము ప్రవర్తించును. ఙకారము ప్రయోగమునగానరాదుగాన, ఏ యాకారము ఙిత్తగునో, ఏది కాదో యని తెలిసికొనుట సులభముగాదని తలంచి భాష్యమందు చెప్పబడిన లక్షణము చూపబడెను. "ఈషదర్థే...... రఙిత్" అర్థము :- అల్పార్థమందు, (ఆ+ఉష్ణః=ఓష్ణః) క్రియాయోగమందు, (క్రియావిశేషమును ద్యోతనచేయునట్టి యాకారము ప్రాదులలో పఠితము) (ఆ+ఇతః=ఏతః) మర్యాదయందు, (మర్యాదయన కార్యముతో సంబంధములేనట్టి యవధి. (ఆ+ఉదకాన్తాత్=ఓదకాన్తాత్.) అభివిధియందును, (అభివిధి యన కార్యముతో సమ్బన్ధముగల యవధి. (ఆ+అహిచ్ఛత్రాత్=ఆహిచ్ఛత్రాత్) ఆకారము ఙిత్తగును. వాక్యశబ్దమునకు వాక్యార్థమందున్న యనభిమతత్వమర్థము, ఈ యర్థమునందు, స్మరణరూపార్థమందు నాకారము ఙిత్తు కాదు. వీని కుదాహరణములు చూపబడెను. ఇట్టర్థమునుబట్టియే ఙిదఙిద్వివేకమును గ్రహింపవలెనని యాశయము.

* 105. ఓత్. 1-1-15. (నిపాతః, ప్రగృహ్యమ్)

ఓదన్తో నిపాతః ప్రగృహ్యః స్యాత్। అహో ఈశాః॥

105. ఓకారమన్తమందుగల నిపాతము ప్రగృహ్యమగును. అహో ఈశాః। అహో అనునది ప్రగృహ్యమగుటచే నవాదేశము నివృత్తమయినది.

* 106. సంబుద్ధౌ శాకల్యస్యేతావనార్షే. 1-1-16. సంబుద్ధౌ, శాకల్యస్య, ఇతౌ, అనార్షే। (ఓత్, ప్రగృహ్యమ్)

సంబుద్ధినిమిత్తక ఓకారో వా ప్రగృహ్యోఽవైదికే
ఇతౌ పరే। విష్ణో ఇతి। విష్ణ ఇతి। విష్ణవితి।
అనార్ష ఇతి కిమ్। బ్రహ్మబన్ధవిత్యబ్రవీత్॥

106. అనార్షమన వేదములోనిదని యర్థము. సంబుద్ధినిమిత్తముగ కలిగిన ప్రవృత్తమగు నోకారము, వేదములోనిది గానట్టి ఇతిశబ్దము

పరమగునపుడు శాకల్యునిమతమున ప్రగృహ్యమగును. శాకల్యగ్రహణము వలన వికల్పము ఫలితమగును. విష్ణో ఇతి। మతాన్తరమున విష్ణవితి. విష్ణో అనునది విష్ణుశబ్దమునకు సంబుద్ధ్యన్తము, సంబోధనమందు ప్రథమైకవచనము (సు) సంబుద్ధి యనబడును. విష్ణు+సు, అనునది విష్ణో అని యగును. ఇచట ఓకారము సంబుద్ధినిమిత్తకము. "ఏతా గా బ్రహ్మబన్ధవిత్యబ్రవీత్" (బ్రహ్మబన్ధో ఇత్యబ్రవీత్) వేదవాక్య మిది. ఇచట ప్రగృహ్యమును వారించుటకై ఇతిశబ్దమునకు "అనార్షే" అను విశేషణ మావశ్యకము.

వివరణము:— ఈరూపము[1] కొన్నిపుస్తకములలో నగబడుచున్నది. ప్రగృహ్యసంజ్ఞలేనిపక్షమం దవాదేశముచేసి "లోపశ్శాకల్యస్య" (68) సూ. చే వలోపముచేసిన విష్ణ ఇతి అనిసిద్ధమగునని యభిప్రాయము గావలయును. కాని శాకల్యునిమతమందే ప్రగృహ్యసంజ్ఞ విహితమైనందున నామతమునందే ప్రగృహ్యసంజ్ఞ లేదనుట సరిగాదు గాన నట్టిరూపము ప్రామాణికము గాదు.

* 107. ఉఞః. 1-1-17. (ఇతౌ, శాకల్యస్య, అనార్షే, ప్రగృహ్యమ్)

ఉఞ ఇతౌ వా ప్రాగుక్తమ్। ఉ ఇతి। వితి॥

107. ఉ (ఞ్) అనునిపాతము, వైదికముగానట్టి ఇతిశబ్దము పరమగునపుడు శాకల్యునిమతమున ప్రగృహ్యమగును. ఉ ఇతి. మతాన్తరమున. వితి.

* 108. ఊँ. 1-1-18. (ఉఞః, శాకల్యస్య, అనార్షే, ఇతౌ)

ఉఞ ఇతౌ, దీర్ఘోఽనునాసికః ప్రగృహ్యశ్చ ఊँ ఇత్యయమాదేశో వా స్యాత్। ఊँ ఇతి.

108. ఉ(ఞ్) అనునిపాతమునకు, వైదికముగానట్టి ఇతిశబ్దము పరమగునపుడు, దీర్ఘము, అనునాసికము, ప్రగృహ్యసంజ్ఞకమునగు, ఊँ అను నాదేశము శాకల్యమతమున నగును.

వివరణము:— "ఉఞ ఊँ" అను సూత్రము విభాగముచేసి వ్యాఖ్యానము చేయబడెను. శాకల్యమతమందే ఉ ఇతి. ఊँ ఇతి, అను రూపములు సిద్ధమగును. ఇతరమతమందు వితి అని యగును. యోగవిభాగములేనిచో, శాకల్యమతమున ఊँ ఇతి, అను నొకరూపమే సాధువగును. కావున ఉ ఇతి, అనురూపము యోగవిభాగమునకు ఫలము.

*109. మయ ఉఞో వో వా. 8-3-33. మయః ఉఞః, వః, వా.(అచి)

మయః పరస్య ఉఞో వో వా స్యాదచి। కిము ఉక్తమ్ కిమ్వుక్తమ్। వత్వస్యాసిద్ధత్వాన్నానుస్వారః.

109. మయ్‌ప్రత్యాహారవర్ణముకంటె పరమగు ఉఞ్ (ఉ) యొక్క స్థానమందచ్చు పరమగునపుడు వకారాదేశము వికల్పముగనగును. కిమ్వుక్తమ్. (కిమ్ ఉ ఉక్తమ్) ఇచట మకారమునకు "మోనుస్వారః" (123) సూ. చే ననుస్వారము చేయునపు డీవకారాదేశమసిద్ధమగునుగాన హల్లు పరముగ లేదు. అనుస్వారము రాదు. పక్షమందు కిము ఉక్తమ్. ఉకారము, "నిపాత ఏకాచ్" (104) సూ. చే ప్రగృహ్యముగాన సవర్ణదీర్ఘము రాదు.

* 110. ఈదూతౌ చ సప్తమ్యర్థే. 1-1-19. ఈదూతౌ, చ, సప్తమ్యర్థే. (ప్రగృహ్యమ్)

సప్తమ్యర్థే పర్యవసన్న మీదూదన్తం ప్రగృహ్యం స్యాత్। సోమో గౌరీ అధిశ్రితః। మామకీ తనూఇతి। సుపాంసులుగితిసప్తమ్యా లుక్। అర్థగ్రహణం కిమ్। వృత్తావర్థాన్తరోపసంక్రాన్తే మాభూత్। వాప్యామశ్వో వాప్యశ్వః।

110. సప్తమ్యర్థమాత్రమందు వర్తమానమైన ఈకారాన్తముగాని, ఊకారాన్తముగాని, ప్రగృహ్యమగును. సోమో గౌరీ అధిశ్రితః. మామకీ తనూ ఇతి. ఇవి వేదవాక్యములు. వీనిలో గౌరీ, తనూ శబ్దములకంటె పరమగు సప్తమీవిభక్తికి "సుపాం సులుక్ (7-1-39) సూ. చే లుక్కు వచ్చుటచే గౌరీతనూశబ్దములు సప్తమ్యర్థమందు పర్యవసన్నములైనవి. అర్థగ్రహణమునువిడచి "ఈదూతౌ చ సప్తమీ" అనినను, యేన విధిసూత్ర ప్రత్యయగ్రహణపరిభాషలచే నీదూదన్తమగు సప్తమ్యన్త మని యర్థము లభించును. గౌరీతనూశబ్దము లిట్టివే యగును. కావున నర్థగ్రహణఫలమే మనిన, "వాప్యశ్వః" అను సమాసములోని వాపీశబ్దముగూడ నీదన్తమగు సప్తమ్యన్తమేగాన నిచటప్రవర్తమగు సంజ్ఞను వారించుట ఫలమని గ్రహించదగును. అర్థగ్రహణసామర్థ్యమువలన సప్తమ్యర్థమాత్రమునే బోధింపవలయు నని లభించును. సమాసమందలివాపీశబ్దము వ్యస్తప్రయోగమునందువలె వాపి యందనునర్థము నేగాక వాపియందున్నవానిని (అశ్వాదులను) గూడ బోధించును. అనగా సప్తమ్యర్థము నేగాక అతిరిక్తార్థమునుగూడ బోధించుటచే వాపీశబ్దము సప్తమ్యర్థమాత్రమున వర్తమానముగాదని యాశయము.

*111. అణోఽప్రగృహ్యస్యానునాసికః. 8-4-57. అణః, అప్రగృహ్యస్య, అనునాసికః.

అప్రగృహ్యస్యాణోఽవసానే అనునాసికో వాస్యాత్।

దధిఁ, దధి। అప్రగృహ్యస్య కిమ్। అగ్నీ।ఇత్యచ్సన్ధిః।

111. ప్రగృహ్యములుకానట్టి యవసానమందలి అణ్ణుల కనునాసికము వికల్పముగవచ్చును. దధిఁ. పక్షమందు, దధి. అగ్నీ. ఇచట నీకారము

“ఈదూదేత్సూ” త్రముచే, ప్రగృహ్యము. దీని కనునాసికమును వారించుటకై “అప్రగృహ్యస్య” అను విశేషణ మావశ్యకము. 1 అచ్సన్ధి సమాప్తినొందెను.

వివరణము:- 1 “అల్పాచ్తరమ్” (సూత్రము) “సిద్ధమనచ్త్వాత్”, (వార్తికము) “కథమనచ్త్వమ్”, (భాష్యము) ఈ ప్రయోగములవలన సమాసము మొదలగు వృత్తులలోనుండు అచ్పదమందు పదాన్తకార్యముగాని (షత్వాదులు) శ్చుత్వముగాని ప్రవర్తించదని తెలిసికొనదగును. కావున అచ్ సన్ధిః, అనుచోట షత్వాదు లేల ప్రవర్తించవను శఙ్క నిరాకృతమగును. ఇట్టి శంకకే యవకాశము గలుగదుగాన స్వరసన్ధిః అనుట సమంజసముగ నుండును.

స్వరసన్ధిప్రకరణము సమాప్తము.



# 4. హల్సన్ధిప్రకరణము

* 112. స్తోః శ్చునా శ్చుః. 8-4-40. స్తోః, శ్చునా, శ్చుః.
సకారతవర్గయోశ్శకారచవర్గాభ్యాం యోగే శకారచవర్గౌ స్తః। హరిశ్శేతే। రామశ్చినోతి। సచ్చిత్। శార్ఙ్గిఞ్జయ॥

112. సకారతవర్గములకు శవర్ణచవర్గములతో సంయోగమున్నపుడు క్రమముగ శవర్ణ చవర్గము లాదేశములగును. హరిశ్శేతే (హరిస్+శేతే) రామశ్చినోతి (రామస్+చినోతి) సచ్చిత్ (సత్+చిత్) శార్ఙ్గిఞ్జయ (శార్ఙ్గిన్+జయ)॥

వివరణము:- సూత్రమున స్తుశ్చుశబ్దములు, ఉత్తరసూత్రమున ష్టుశబ్దము సమాహారద్వన్ద్వములు. (స్ చ, తుశ్చ, అనయోస్సమాహారః స్తుః, ఈరీతిని సమాసము నెరుగునది.) నపుంసకలిఙ్గమునకు బదులు పుంలిఙ్గము సూత్రమందు సాధువగును. అధ్యాహారలబ్ధమగు యోగశబ్దమునకు సంయోగ మర్థము. ఇతరవర్ణముతో వ్యవధానమున్నపుడు సంయోగముండదుగాన, చిత, మిత్యాదులలో శ్చుత్వము రాదు. స్థానులకు ఆదేశములకును యథాసంఖ్యము గాని స్థానులకు నిమిత్తములకును లేదు. ఇట్లు చెప్పుటలో విశ్నః ఇత్యాదులందు శ్చుత్వనిషేధమునకై విరచితమగు “శాత్” (113) అనుసూత్రము జ్ఞాపకము. శవర్ణమునకు తవర్గముతో సంయోగమున్నపుడు శ్చుత్వప్రాప్తియే లేనందున నిషేధము వ్యర్థమయి జ్ఞాపకమగును.

* 113. శాత్. 8-4-44. (తోః, శ్చుః, న)

శాత్పరస్య తవర్గస్య శ్చుత్వం న స్యాత్।

విశ్నః। ప్రశ్నః॥

113. శవర్ణముకంటె పరమగు తవర్గమునకు శ్చుత్వము రాదు. ఉదా॥ విశ్నః, ప్రశ్నః॥

* 114. ష్టునా ష్టుః. 8-4-41. ష్టునా, ష్టుః, (స్తోః)

స్తోః ష్టునా యోగే ష్టుస్స్యాత్ । రామష్షష్ఠః। రామష్టీకతే। పేష్టా। తట్టీకా। చక్రిణ్ఢౌకసే॥

114. సకారతవర్గములకు షకారటవర్గములతో సంయోగమున్నపుడు క్రమముగ షకారటవర్గము లాదేశములగును. రామష్షష్ఠః. (రామస్+షష్ఠః) రామష్టీకతే. (రామస్+టీకతే) పేష్టా. (పేష్+తా) చక్రిణ్ఢౌకసే. (చక్రిన్+ఢౌకసే)॥

వివరణము:- ఈసూత్రమునగూడ స్థానాన్యాదేశములకే యథాసంఖ్యముగాని, స్థానులకు నిమిత్తములకును లేదు. తవర్గమునకు షకారము పరమైనపుడు ష్టుత్వనిషేధమును విధించు "తోఃషి" (116) అను సూత్రమే యిందు ప్రమాణము.

* 115. న పదాన్తాట్టోరనామ్. 8-4-42. న, పదాన్తాత్, టోః, అనామ్. (స్తోః, ష్టుః)

అనామితి లుప్తషష్ఠీకం పదమ్। పదాన్తాట్టవర్గాత్పరస్యానామస్స్తోః ష్టుర్నస్యాత్। షట్సన్తః। షట్తే। పదాన్తాత్కిమ్। ఈట్టే। టోః కిమ్। సర్పిష్టమమ్॥వా॥ అనామ్నవతి నగరీణామితి వాచ్యమ్। షణ్ణామ్। షణ్ణవతిః। షణ్ణగర్యః॥

115. అనామ్, అనునది లుప్తషష్ఠ్యన్తము. (అనామః) పదాన్తమయిన టవర్గముకంటె పరములైన నామ్, కంటె భిన్నములగు సకారతవర్గములకు ష్టుత్వము ప్రవర్తించదు. షట్సన్తః. షట్, అనునది పదమగుటచే టకారము పదాన్తమైనందున సకారమునకు ష్టుత్వము రాదు. షట్ తే, ఇచటను టకారము పదాన్తమే గాన ష్టుత్వము రాదు. ఈట్టే. (ఈట్+తే) ఈడధాతువునకు లట్ ప్రథమైకవచనము. టకారము పదాన్తముగాదు. ఇచట ష్టుత్వనిషేధమును వారించుటకై టవర్గము పదాన్తముగావలయుననవలయును. సర్పిష్టమమ్. (సర్పిష్+తమమ్) ఇచట ష్టుత్వనిషేధమును వారించుటకై, టవర్గముకంటె పరమైన తవర్గమునకే నిషేధమనవలెను. సర్పిష్, అనుచోట షకారమునకు జశ్త్వమువలన డకారము వచ్చునుగాన నిచటను ష్టుత్వనిషేధమగుననుటకు వీలుపడదు. "హ్రస్వాత్తాదౌ" (8-3-10) సూ. చే సర్పిష్ శబ్దములోని సకారమునకు ప్రవృత్తమైన షత్వము, జశ్త్వముచేయునపుడసిద్ధ

మగుటచే, జశ్త్వము రాదు గాన షకారమే యుండును. వా। నామ్ (ప్రత్యయము)నవతి నగరీ శబ్దములలోని నకారమునకు ష్టుత్వనిషేధము లేదని చెప్పవలెను. షణ్ణామ్ ( షట్+నామ్ ) షణ్ణవతిః ( షట్+నవతిః ) షణ్ణగర్యః ( షట్+నగర్యః ).

* 116. తోః షి. 8-4-43. తోః, షి. ( ష్టుః, న. )

తవర్గస్య షకారే పరే ష్టుత్వం న। సన్ షష్ఠః.

116. తవర్గమునకు షకారము పరమగునపుడు ష్టుత్వము రాదు. ఉదా॥ సన్ షష్ఠః.

ఝలాం జశోఽన్తే. 8-2-39.

వాగీశః। చిద్రూపమ్.

ఈసూత్రము స్వరసంధిప్రకరణమున ( సూ. 85. ) వ్యాఖ్యాతమైనను, సందర్భశుద్ధికై తిరుగ నిచట చూపబడెను. వాగీశః. ( వాక్+ఈశః ) చిద్రూపమ్ ( చిత్+రూపమ్ ).

* 117. యరోఽనునాసికేఽనునాసికో వా. 8-4-45 యరః, అనునాసికే, అనునాసికః, వా। ( పదస్య, అన్తే )

యరః పదాన్తస్యానునాసికే పరేఽనునాసికో వా స్యాత్। ఏతన్మురారిః। ఏతద్మురారిః। స్థానప్రయత్నాభ్యామన్తరతమే స్పర్శే చరితార్థో విధిరయం రేఫే న ప్రవర్తతే। చతుర్ముఖః। వా। ప్రత్యయే భాషాయాం నిత్యమ్। తన్మాత్రమ్। చిన్మయమ్। కథం తర్హి "మదోదగ్రాః కకుద్మన్తః" ఇతి। యవాదిగణే దకారనిపాతనాత్.

117. పదాన్తమందలి యర్ వర్ణములకనునాసికము పరమగునపుడనునాసికము వికల్పముగ నగును. ఏతన్మురారిః (ఏతద్+మురారిః) పక్షమందు, ఏతద్మురారిః. అష్టాధ్యాయియందు "స్థానేఽన్తరతమ ఉరణ్ రపరః" అని సంహితాపాఠము గలదు. అచట "స్థానే న్తరతమే", అని ఛేదముచేసి యాదేశములు స్థానప్రయత్నములచే నత్యన్తము సదృశములగు స్థానులందే వచ్చునుగాని విసదృశస్థానులందు రావని వ్యాఖ్యానము చేయబడెను. షణ్ముఖః (షడ్+ముఖః) అనుచోట డకారము (స్థాని) స్థానప్రయత్నములచే నాదేశసదృశమగుటవలన నద్దానికి ణకార మాదేశమగును. ఈసూత్రమిట్టి ప్రయోగములలోని స్పర్శవర్ణములందు చరితార్థమైనదిగాన నాదేశమునకు (ణకారాదులకు) విసదృశమగు స్థానులందు (రేఫాదులు) ప్రవర్తించదు. కావున చతుర్ముఖః, అనుచోట రేఫమునకనునాసికము గాదు, ణకారరేఫములకు స్థానసామ్యమున్నను ప్రయత్నసామ్యము లేనందున, రేఫము, ణకారమునకు సదృశతమము గాదు, వా। అనునాసికమాదియందుగల ప్రత్యయము పరమగునపుడు,

పదాన్తమందున్న యర్ వర్ణమునకు, భాషయందు (లౌకికభాషయందు) అనునాసికాదేశము నిత్యముగ నగును. తన్మాత్రమ్ (తద్+మాత్రమ్) మాత్ర (చ్) ప్రత్యయము. చిన్మయమ్ (చిద్+మయమ్) మయ (ట్) ప్రత్యయము. "మదోదగ్రాః కకుద్మన్తః" అనునది రఘువంశములోని ప్రయోగము. "కకుద్మన్తః" అనునది మతుప్ప్రత్యయాన్తము. (కకుద్+మత్) ఇచట నీవార్తికముచే విధింపబడిన యనునాసికమును చేయనందున నీప్రయోగము సాధువగునా? అను ప్రశ్నకు సమాధానము:- యవాదిగణమున పాణిని "కకుద్మాన్" అని దకారముతో గూడిన రూపమునుచ్చరించెను. కాన నీనిపాతనమనునాసికమును బాధించును. అనునాసికమిష్టమైనచో లాఘవము నపేక్షించి "కకున్మా" ననియే యుచ్చరించును గాన "కకుద్మన్తః" అను ప్రయోగము సాధువే యని గ్రహించునది.

వివరణము:- "ఇకో యణచి" సూ. చే, విహితములగు యణ్ణులు స్వసదృశములగు హ్రస్వేకారాదులందే ప్రవర్తించునుగాని, విసదృశములగు దీర్ఘములందు (సుధీ+ఉపాస్యః) ప్రవర్తింపక పోవునని "స్థానేన్తరతమే" అనుసప్తమ్యన్తపాఠము భాష్యమున దూషితమగుటవలన నీపాఠముననుసరించి 'చతుర్ముఖః" అనుచోట ననునాసికవారణమనుచితమని నాగేశుడు పాఠాన్తరమును జెప్పెను:- "అనుస్వారస్య యయి పరసవర్ణః" (126) అను సూత్రమునుండి సవర్ణపదమునకీ సూత్రములోనికపకర్షముచేసి యర్ వర్ణమునకు సవర్ణమగు ననునాసికమాదేశమగునని వ్యాఖ్యానముచేయవలయును. రేఫమునకు, ఊష్మలకును సవర్ణములు లేవని (రేఫేऽననునాసికపరసవర్ణయోః ప్రతిషేధో వక్తవ్యః, న వక్తవ్యః, రేఫోష్మణామ్ సవర్ణా న సన్తి.) భాష్యమందు చెప్పబడుటచే రేఫమునకనునాసికము నివృత్తమగును, అని॥

* 118. తోర్లి. 8-4-60. తోః, లి. (పరసవర్ణః) తవర్గస్య
లకారే పరే పరసవర్ణః స్యాత్। తల్లయః। విద్వాల్లిఖతి।
నకారస్యానునాసికో లకారః॥

118. తవర్గమునకు లకారము పరమగునపుడు, పరసవర్ణము (లకారసవర్ణము) ఆదేశమగును. తల్లయః. (తద్+లయః) విద్వాల్లిఖతి (విద్వాన్+లిఖతి) అనునాసికాననునాసికభేదములచే లకారము రెండువిధములని యిదివరకు చెప్పబడియెను. అనునాసికమగు నకారమునకు సదృశమైన యనునాసికలకారమే యాదేశమగును.

* 119. ఉదఃస్థాస్తమ్భోః పూర్వస్య. 8-4-61. ఉదః, స్థాస్తమ్భోః, పూర్వస్య. (సవర్ణః)
ఉదఃపరయోః స్థాస్తమ్భోః పూర్వసవర్ణః స్యాత్।
ఆదేఃపరస్య। ఉత్థానమ్। ఉత్తమ్భనమ్। అత్రాఘోషస్య

మహాప్రాణస్య సస్య తాదృశఏవ థకారః, తస్య ఝరో ఝరీతిపాక్షికోలోపః। లోపాభావపక్షే తు థకారస్యైవ శ్రవణమ్। న తు ఖరిచే తిచర్త్వమ్ । చర్త్వం ప్రతిథకార స్యాసిద్ధత్వాత్।

119. ఉద్ అనుపసర్గముకంటె నవ్యవహితపరములగు స్థా, స్తమ్భు అనువానికి పూర్వసవర్ణమాదేశమగును. "ఆదేః పరస్య" (45) అను పరిభాషచే, స్థా, స్తమ్భులయాదివర్ణమగు సకారమునకే దకార సవర్ణమాదేశమగును. ఉత్థానమ్ (ఉద్+స్థానమ్) ఉత్తమ్భనమ్ (ఉద్+స్తమ్భనమ్) ఇచట నఘోషము మహాప్రాణమునగు సకారమునకట్టి థకారమే యాదేశమగును. (ఉత్ థ్ థానమ్) ఉత్ థ్ తమ్భనమ్) దీనికి "ఝరో ఝరి" (72) సూ. చే, వైకల్పికమగు లోపమగును. ఉత్థానమ్, ఉత్తమ్భనమ్. లోపము ప్రవర్తింపని పక్షమందు థకారమే శ్రుతమగునుగాని "ఖరిచ" సూ. చే చర్త్వమురాదు. చర్త్వము చేయునపుడు పూర్వసవర్ణము (థకారము) అసిద్ధమగుటయే ఇందులకు గారణము.

* 120. ఝయో హోన్యతరస్యామ్ 8-4-62. ఝయః, హః, అన్యతరస్యామ్. (పూర్వస్య, సవర్ణః)

ఝయః పరస్య హస్య పూర్వసవర్ణో వా స్యాత్। ఘోషవతో నాదవతో మహాప్రాణస్య సంవృతకణ్ఠస్య హస్యతాదృశో వర్గచతుర్థ ఏవాదేశః। వాగ్ఘరిః। వాగ్ హరిః॥

120. ఝయ్వర్ణముకంటె పరమగు హకారమునకు పూర్వసవర్ణాదేశము వికల్పముగనగును. ఘోష, నాద, సంవార, మహాప్రాణ ప్రయత్నములుగల హకారమునకట్టి వర్గచతుర్థవర్ణమే (ఘకారాదులు) ఆదేశమగును. వాగ్ఘరిః (వాగ్+హరిః) పక్షమందు వాగ్ హరిః. బాహ్యప్రయత్నములకిట్టిచోటు లందే యుపయోగమని యీవరలో జెప్పబడెను.

* 121. శశ్ఛోటి. 8-4-63. శః, ఛః, అటి. (ఝయః, అన్యతరస్యామ్, పదస్య, అన్తే)

పదాన్తాత్ ఝయః పరస్య శస్య ఛో వాస్యాదటి। దస్య శ్చుత్వేన జకారే కృతే॥

121. పదాన్తమైన ఝయ్యుకంటె పరమగు శవర్ణమునకు అట్ ప్రత్యాహారవర్ణము పరమగునపుడు ఛకారాదేశము వికల్పముగనగును. తద్+శివః, అనుచోట శవర్ణమునకు ఛకారము వచ్చును. తద్ + ఛివః. దకారమునకు శ్చుత్వమువలన జకారమగును. తద్+ఛివః. ఇట్లుండ.

* 122. ఖరి చ. 8-4-55. ఖరి, చ (ఝలామ్, చరః) ఖరి పరే ఝలాం చరః స్యుః ఇతి జకారస్య చకారః।

తచ్ఛివః। తచ్ శివః। వా॥ ఛత్వమమీతి వాచ్యమ్ తచ్ఛ్లో
కేన। తచ్ శ్లోకేన। అమి కిమ్। వాక్ శ్చ్యోతతి॥

122. ఝల్ వర్ణములకు ఖర్వర్ణములు పరమగునపుడు చర్వర్ణములాదేశములగును. తజ్+ఛివః। అనుచోట నీసూత్రముచే జకారమునకు చకారమాదేశమగును. తచ్ఛివః. ఛత్వాభావపక్షమందు, తచ్ శివః అని యగును. వా॥ శశ్ఛోటి, సూత్రమున "అటి" అను పదముయొక్క స్థానమున "అమి" అని చెప్పవలయును. అనగా అమ్‌వర్ణము పరమగునపుడు శవర్ణమునకు ఛకారమాదేశమగునని యర్థమగును. తచ్ఛ్లోకేన. (తద్+శ్లోకేన) పక్షమందు తచ్ శ్లోకేన. వాక్ శ్చ్యోతతి. ఇచట శకారమునకు అమ్‌ప్రత్యాహారమున చేరనట్టి చకారము పరముగనున్నది గాన నిట్టిచోటులందు ఛత్వమును వారించుటకై అమ్‌వర్ణము నిమిత్తమనవలయును.

*123. మోఽనుస్వారః. 8-3-23. మః, అనుస్వారః. (పదస్య, హలి)

మాన్తస్య పదస్యాఽనుస్వారస్స్యాద్ధలి। అలోన్త్యస్య। హరిం వన్దే। పదస్యేతి కిమ్। గమ్యతే॥

123. మకారమంతమందుగల పదమునకు హల్లు పరమైనపుడనుస్వారమాదేశమగును. "అలోన్త్యస్య" (43) పరిభాషచే, పదము తుదినున్న మకారమునకే యనుస్వారము వచ్చును. హరిం వన్దే. (హరిమ్+వన్దే,) గమ్యతే. గమ్, అనునది ధాతువగుటచే పదము గాదు. ఇచట ననుస్వారమును వారించుటకై మాన్తమగు పదమునకే యనుస్వారమును విధింపవలయును.

* 124. నశ్చాపదాన్తస్య ఝలి. 8-3-24. నః, చ, అపదాన్తస్య, ఝలి. (మః, అనుస్వారః.)

నస్య మస్య చాపదాన్తస్య ఝల్యనుస్వారస్స్యాత్। యశాంసి। ఆక్రంస్యతే। ఝలి కిమ్। మన్యతే॥

124. పదాన్తములుగానటువంటి, నకారమకారములకు, ఝల్లు పరమగునపుడనుస్వారమాదేశమగును. యశాంసి. (యశాన్స్+ఇ) ఆక్రంస్యతే (ఆక్రమ్+స్యతే) వీనిలో నకారమకారములు పదమధ్యస్థములుగాని పదాన్తములు గావు. మన్యతే. ఇచట నకారమునకనుస్వారనివృత్తికై ఝల్లు నిమిత్తమనవలయును.

* 125. అనుస్వారస్య యయి పరసవర్ణః. 8-4-58. అనుస్వారస్య, యయి, పరసవర్ణః।

స్పష్టమ్। అఙ్కితః। అఞ్చితః, కుణ్ఠితః। శాన్తః। గుమ్ఫితః। కుర్వన్తీత్యత్ర ణత్వే ప్రాప్తే తస్యాసిద్ధత్వాదనుస్వారే పరసవర్ణే చ కృతే, తస్యాసిద్ధత్వాన్నణత్వమ్।

125. అనుస్వారమునకు యయ్ ప్రత్యాహారవర్ణము పరమైనపుడు పరసవర్ణ మాదేశమగును. అఙ్కితః॥ (అంకితః) అనుస్వారస్థానమున సదృశములగు నాయావర్గ పఞ్చమములే యాదేశములగును. అఞ్చితః। (అంచితః) కుణ్ఠితః (కుంఠితః) శాన్తః (శాంతః) గుమ్ఫితః (గుంఫితః) కుర్వన్తి అనునది (కురు + అన్తి) కృఞ్ ధాతువునకు లట్ ప్రథమపురుష బహువచనాన్తము. ఇచట ప్రత్యయమున స్వాభావికమగు నకారమునకు "అట్కుప్వాఙ్", సూ. చే, ణత్వము, "నశ్చాపదాన్తస్య" సూ. చే, ననుస్వారమును ప్రాప్తములగుచున్నవి. ణత్వమసిద్ధమగుటవలన మొదట ననుస్వారము పిదప పరసవర్ణము ప్రవర్తించును. (కుర్వంతి। కుర్వన్తి) ఇపుడు తిరుగ ప్రాప్తమగుచున్న ణత్వము పరసవర్ణమసిద్ధమగుటవలన (నకారములేదుగాన) ప్రవర్తించుట కవకాశములేదు.

* 126. వా పదాన్తస్య. 8-4-59. వా, పదాన్తస్య (అనుస్వారస్య యయి పరసవర్ణః.)
పదాన్తస్యానుస్వారస్య యయి పరే పరసవర్ణో వా స్యాత్। త్వఙ్కరోషి। త్వంకరోషి। సయ్ఁయన్తా। సంయన్తా। సవ్ఁవత్సరః। సంవత్సరః। యల్ఁలోకమ్। యం లోకమ్। అత్రానుస్వారస్య పక్షే ఽనునాసికా యవలాః॥

126. పదాన్తమగు ననుస్వారమునకు యయ్ప్రత్యాహారవర్ణము పరమగునపుడు పరసవర్ణాదేశము వికల్పముగనగును। త్వఙ్కరోషి। పక్షమందు। త్వం కరోషి। సయ్ఁయన్తా। సంయన్తా। సవ్ఁవత్సరః। సంవత్సరః। యల్ఁలోకమ్। యం లోకమ్। సయ్ఁయన్తా మొదలగు నుదాహరణములలో ననునాసికములగు, యవలలు క్రమముగ పరసవర్ణాదేశములగును.

* 127. మో రాజి సమః క్వౌ. 8-4-25. మః, రాజి, సమః, క్వౌ। క్విబన్తే రాజతౌ పరే సమో మస్య మ ఏవ స్యాత్। సమ్రాట్।

127. క్విప్ ప్రత్యయాన్తమగు రాజధాతువు పరమగునపుడు సమ్ (ఉపసర్గము) యొక్క మకారమునకు మకారమే యాదేశమగును. సమ్రాట్. రాట్టనునది రాజధాతువునకు క్విబన్తము. మకారమునకు మకారవిధాన మనుస్వారబాధనార్థము.

* 128. హే మపరే వా. 8-3-26. హే, మపరే, వా। (మస్య, మః)

మపరే హకారే పరే మస్య మఏవ స్యా
ద్వా । హ్మల హ్వల చలనే । కిమ్ హ్మలయతి । కిం
హ్మలయతి । వా । యవలపరే యవలా వేతివక్తవ్యమ్ ॥

128. మకారము పరమందుగల హకారము పరమగునపుడు, మకారమునకు మకారాదేశము వికల్పముగనగును. కిమ్ హ్మలయతి. పక్షమందు కిం హ్మలయతి. హ్మలయతి అనునది చలనార్థకమగు హ్మలధాతువునకు ణిజన్తరూపము॥ వా॥ యకార, వకార, లకారములు పరమందుగల హకారము పరమైనపుడు, మకారమునకు యకార, వకార, లకారాదేశములు వికల్పముగనగును.

* 129. యథాసంఖ్యమనుదేశస్సమానామ్, 1-3-12. యథా సంఖ్యమ్, అనుదేశః, సమానామ్ ।

సమసమ్బన్ధీ విధిర్యథాసంఖ్యం స్యాత్ । కియ్ హ్యః । కింహ్యః । కివ్ హ్వలయతి। కింహ్వలయతి । కిల్ హ్లాదయతి । కింహ్లాదయతి ।

129. సమాన సంఖ్యగలవానితో[1] సమ్బన్ధముగల కార్యముపస్థితక్రమము నతిక్రమింపక ప్రవర్తించును. "యవలపరే యవలా వేతి వక్తవ్య" మను వార్తికముచే, యవల విధానమాదేశములతో సమానమగు సంఖ్యగల యవలలతో సమ్బన్ధము గలదగుటవలన క్రమము ననుసరించును. 2. అనగా యకారపరకమగు హకారము పరమగునపుడు యకారాదేశమే యగును. ఇట్లే వకారలకారములు పరమందు గల్గునపుడు నూహింపునది. 3. కియ్హ్యః, (కిమ్ + హ్యః) పక్షమందు, కిం హ్యః । కివ్ హ్వలయతి. (కిమ్ + హ్వలయతి) పక్షమందు, కిం హ్వలయతి । కిల్ హ్లాదయతి । (కిమ్ + హ్లాదయతి) పక్షమందు కిం హ్లాదయతి ॥

వివ :—(1) ఇట్లు చెప్పుటచే, ఉద్దేశ్యవిధేయములు సమసంఖ్యాకములైనపుడేగాక నుద్దేశ్యములు దీని విశేషణములు సమసంఖ్యాకములయినపుడు నీ సూత్రము ప్రవర్తించును. "సమూలాకృతజీవేషు హన్ కృఞ్ గ్రహః" (3-4-36) సూత్రముచే, హఞ్, కృఞ్, గ్రహ, ధాతువులకు సమూలా కృత జీవ శబ్దములుపపదములుగా నున్నపుడు ణముల్ ప్రత్యయము విధింపబడెను. ఇచటగూడ నుద్దేశ్యములకు తద్విశేషణములకును, గ్రమాన్వయము సిద్ధమగును.

(2) ఈ సూత్రములేకున్నను, "శత్రుం మిత్రం విపత్తిం చ జయ రఞ్జయ భఞ్జయ". (శత్రువును జయించుము, మిత్రుని సంతోషపెట్టుము. ఆపదను తొలగింపుము) అను లోకన్యాయమువలననే "యవలపరే యవలా వేతి వక్తవ్యమ్" మొదలగు వార్తికములలోను, "పాఘ్రాధ్మా" (7-3-78)

మొదలగు సూత్రములలోను క్రమాన్వయము సిద్ధమగును. కాని "పరస్మైపదానాం ణలతుసుసలథుసణల్వమాః" (3-4-82) మొదలగు సూత్రములందితరసూత్రమందున్న క్రమమును స్వీకరించియు క్రమాన్వయమును దెల్పుటకై యీ సూత్రమావశ్యకము. "పరస్మైపదానామ్" అనుసూత్రమున విధేయములనేగాని యుద్దేశ్యములను విశేషముగ జెప్పలేదు. పరస్మైపదశబ్దముచే "తిప్ తస్ ఝి, (3-4-78) సూత్రమందు జెప్పబడిన తిబాదులదొమ్మిదింటిని గ్రహించి, వీనికి క్రమముగ ణలాదిప్రత్యయములను విధింపవలెను. వేనికి క్రమాన్వయమిష్టమో యవి సమసంఖ్యాకములుగ నొకచోట నుచ్చారితములైనపుడే లోకన్యాయము ప్రవర్తించునని గ్రహింపనగును.

(3) ఈ సూత్రోదాహరణములందు మకారస్థానమున నాన్తరతమ్యమువలన ననునాసికములగు యకారాదులే యాదేశములగును. "భావ్యమానేన సవర్ణానాం గ్రహణం న" (విధీయమానమగు అణుచే సవర్ణములకు గ్రహణము కలుగదు) అను పరిభాష యిచట బ్రవర్తింపదు. ఈ పరిభాష "అణుదిత్" సూత్రములోని యవిధీయమానమనునర్థముగల "అప్రత్యయః" అనుదానివలన సిద్ధమయినదేగాని యతిరిక్తము గాదు. కాన, "అణుదిత్" సూత్రముచే ప్రాప్తములగు సవర్ణములకే నిషేధమును దెల్పును. ప్రకృతమున "గుణాఅభేదకాః" (ఉదాత్తత్వము, అనునాసికత్వము, మొదలగు గుణములు భేదకములు గావు. అనగా ఉదాత్తమునకు జేయుకార్యముల నుదాత్తమునకును ప్రవర్తించును) అనుపరిభాషవలన యవలపరే యవలా వా, అను వార్తికముచే విధింపబడు యవలలు స్వసవర్ణములగు ననునాసికములను గ్రహింపగలవు. ఈ పరిభాషచే ప్రాప్తములగు సవర్ణములకు, భావ్యమాన పరిభాష నిషేధకము గానేరదని గ్రన్థకర్త్రాశయము. అణుదిత్సూత్రములోని అప్రత్యయపదమునకు అవిధీయమానమనునర్థమప్రసిద్ధమనియు, భావ్యమానపరిభాష సూత్రప్రాప్తములగు సవర్ణములకువలె గుణాఅభేదకాః, అను పరిభాషచే ప్రాప్తములగు సవర్ణములకును నిషేధమును బోధించుననియు "యవలపరే" అను వార్తికముచే విధీయమానములగు యవలలు స్వసవర్ణములగు ననునాసికములను గ్రహింపనేరవనియు, గాన కియ్ హ్యః, మొదలగు రూపములలో మకారస్థానమందును నిరనునాసికయకారాదులే యాదేశములగుననియును నాగేశసిద్ధాన్తము.

* 130. నపరే నః 8-3-27. నపరే, నః. (హే, మస్య, వా)
నపరే హకారే పరే మస్య నః స్యాద్వా.
కిన్ హ్నుతే । కింహ్నుతే.

130. నకారపరకమగు హకారము పరమగునపుడు మకారమునకు నకారాదేశము వికల్పముగనగును. కిన్ హ్నుతే (కిమ్ + హ్నుతే) పక్షమందనుస్వారమగును. కిం హ్నుతే.

* 131. ఙ్ణోః కుక్ టుక్ శరి, 8-3-28. ఙ్ణోః, కుక్, టుక్, శరి. (వా)

ఙకారణకారయోః కుక్టుకావాగమౌవా
స్తశ్శరి । కుక్టుకోరసిద్ధత్వాత్ జశ్త్వం న । వా ।
చయో ద్వితీయాశ్శరిపౌష్కరసాదేరితి వాచ్యమ్.
ప్రాఙ్ఖ్ షష్ఠః । ప్రాఙ్క్షష్ఠః । ప్రాఙ్ షష్ఠః । సుగ
ణ్ఠ్ షష్ఠః । సుగణ్ట్ షష్ఠః । సుగణ్ షష్ఠః ॥

131. ఙకార ణకారములకు, శర్వర్ణము పరమగునపుడు, క్రమముగ కుక్, టుక్, అను నాగమములు వికల్పముగ వచ్చును. ఉకారకకారములిత్సంజ్ఞకములు. క్, ట్, అను వర్ణము లాగమములు. కిత్తులగుటచే, ఙకార ణకారములకన్త్యావయవములుగ నగును. ఇవి జశ్త్వముచేయునపు డసిద్ధములగును గాన వీనికి జశ్త్వము రాదు. వా॥ పౌష్కరసాదిమతమందు, చయ్వర్ణములకు (క, చ, ట, త, ప,) శర్వర్ణము పరమగునపుడు, క్రమముగ, ఖ, ఛ, ఠ, థ, ఫ, వర్ణములాదేశము లగును. ప్రాఙ్ఖ్ షష్ఠః. (ప్రాఙ్ + షష్ఠః) కుగాగమద్వితీయవర్ణాదేశములు వచ్చినవి. ద్వితీయవర్ణము రానపుడు, ప్రాఙ్క్షష్ఠః. కకారషకారముల సంయోగమందు "క్ష" అగును. కుగాగమము రానపుడు ప్రాఙ్ షష్ఠః. ఇట్లే సుగణ్ఠ్ షష్ఠః. సుగణ్ట్ షష్ఠః. సుగణ్ షష్ఠ, అనురూపములందును, టుగాగమాదు లూహ్యంబులు.

* 132. డస్సిధుట్. 8_3_29. డః, సి, ధుట్, (వా)
డాత్పరస్య సస్యధుడ్వా స్యాత్ । షట్త్సన్తః ।
షట్సన్తః

132. డకారముకంటె పరమగు సకారమునకు ధుడాగమము (ధ్) వికల్పముగ నగును. షట్త్సన్తః. (షడ్+సన్తః) ధుడాగమము టిత్తగుటచే సకారమున కాద్యవయవముగ నగును. షడ్ధ్సన్తః. డకారధకారములకు "ఖరిచ" సూత్రముచే, చర్త్వము. ధుడాగమము రానపుడు షట్సన్తః మొదలగు రూపములందు చర్త్వమసిద్ధమగుటచే తకార టకారములకు ద్వితీయ వర్ణాదేశము ప్రవర్తింపదు.

వివ:—"డః" అనునది పఞ్చమ్యన్తమగుటవలన తస్మాదితి, పరిభాషచే సకారమునకు ధుడాగమమనియు, సి, అనునది సప్తమ్యన్తమగుటవలన 'తస్మిన్నితి' పరిభాషచే డకారమునకు ధుడాగమమనియు నర్థము లభించుచున్నది. ఇట్లు వీనికి విరోధము సంభవింప పరమగు తస్మాదితి, పరిభాషయే ప్రవర్తించును. ఇట్లు సిద్ధమైనదే "ఉభయనిర్దేశే పఞ్చమీనిర్దేశో బలీయాన్" అను పరిభాష. (పఞ్చమ్యన్త సప్తమ్యన్తములు రెండును సూత్రమున నిర్దిష్టములైనపుడు పరమగుటచే ప్రబలమగు తస్మాదితి, పరిభాష విధ్యుపకారకమగును.) ఈ పరిభాషచే సూత్రమున సి, అనునది షష్ఠ్యన్తముగా మారును.

* 133. నశ్చ. 8_3_30. నః, చ. (సి, ధుట్, పదాత్)
నకారాన్తాత్సస్య ధుడ్వా । సన్త్సః । సన్సః ॥

133. నకారాన్తమగు పదముకంటె పరమగు సకారమునకు ధుడాగమము వికల్పముగనగును. సన్త్సః । (సన్ + సః) ధుడాగమచర్త్వములు. ఆగమము రానపుడు సన్ సః । సూత్రమున నః, అనునది పంచమ్యన్తమగుటచే ననువృత్తమగు సి, యనునది పూర్వసూత్రోక్తరీతిని షష్ఠ్యన్తమగును.

* 134. శి తుక్. 8-3-31. శి, తుక్, (నః, పదస్య, వా)
నస్య పదాన్తస్య శే పరే తుగ్వా స్యాత్ ।
శశ్ఛోటీతి ఛత్వవికల్పః । పక్షే ఝరోఝరీతి చలోపః। సఞ్ఛమ్భుః। సఞ్చ్ ఛమ్భుః। సఞ్చ్ శమ్భుః ।
సఞ్ శమ్భుః॥ శ్లో॥ ఞఛౌ ఞచఛా, ఞచశా, ఞశావితి చతుష్టయమ్ । రూపాణామిహ తుక్ ఛత్వ చలోపానాం వికల్పనాత్.

134. ఇచట శి, అను సప్తమ్యన్తము నిరవకాశమగుటచే షష్ఠ్యన్తముగా మార్పుచెందదు. తస్మిన్నితి, పరిభాషయే ప్రవర్తించును. పదాన్తమగు నకారమునకు శవర్ణము పరమగునపుడు, తుగాగమము (త్) వికల్పముగనగును. ఇది కిత్తగుటచే నకారమున కన్తావయవముగనగును. సన్త్ శంభుః । శశ్ఛోటి (121) సూ. చే, శవర్ణమునకు ఛత్వము వికల్పముగనగును. సన్త్ ఛమ్భుః. నకారతకారములకు శ్చుత్వమువలన సఞ్చ్ఛమ్భుః । "ఝరోఝరి" (72) సూ. చే, చకారము వికల్పముగ లోపించును. సఞ్ ఛమ్భుః । చలోపము రానపుడు, సఞ్ చ్ఛమ్భుః. ఛత్వము రానపుడు సఞ్చ్ శమ్భుః. తుగాగమాభావపక్షమందు సఞ్ శమ్భుః. ఈ విషయమును సంగ్రహముగ బోధించు శ్లోకమిది. శ్లో॥ ఞఛౌ, ఞచఛా ఞచశా, ఞశావితిచతుష్టయమ్. రూపాణామిహ తుక్ ఛత్వచలోపానాం వికల్పనాత్॥ సన్ + శమ్భుః, ఇత్యాదులలో తుగాగమము, ఛత్వము, చలోపము, వీనియొక్క వికల్పమువలన పైని చూపబడిన రీతిని నాల్గు రూపములు సాధువులగునని శ్లోకార్థము.

* 135. ఙమో హ్రస్వాదచి ఙముణ్నిత్యమ్. 8-3-32. ఙమః, హ్రస్వాత్, అచి, ఙముట్, నిత్యమ్. (పదస్య)
హ్రస్వాత్పరో యోఙమ్, తదన్తం యత్పదమ్, తస్మాత్పరస్యాచో నిత్యం ఙముడాగమస్స్యాత్ ।
ప్రత్యఙ్ఙాత్మా । సుగణ్ణీశః । సన్నచ్యుతః ॥

135. ఙముట్టనుచోట టిత్త్వము ప్రత్యాహారములోని ఙకారాదులతో ప్రత్యేకముగ సంబంధించును. హ్రస్వముకంటె పరమగు ఙమ్ (ఙ, ణ, న) ప్రత్యాహారవర్ణమన్తమందుగల పదముకంటె పరమైనయచ్చునకు ఙముడాగమము (ఙుట్, ణుట్, నుట్) నిత్యముగ వచ్చును. ఙకారాన్తపదముకంటె పరమగు నచ్చునకు ఙుట్ (ఙ్) ణకారాన్తపదముకంటె పరమైనయచ్చునకు ణుట్ (ణ్) నాన్త పదముకంటె పరమగు నచ్చునకు నుట్ (న్) వచ్చును. క్రమముగ నుదాహరణములు :—ప్రత్యఙ్ఙాత్మా. (ప్రత్యఙ్ + ఆత్మా) సుగణ్ణీశః. సన్న

చ్యుతః. ఈ సూత్రమున యథాసంఖ్యసూత్ర ప్రవృత్తివలన జ్ఞానపదముకంటె పరమగు నచ్చునకు జుడాగమమనురీతిని యర్థము చేయవలెను.

వివ:—అచ్చునకు జునుడాగమమనినచో, పరమదణ్డినౌ (పరమదణ్డిన్ + ఔ) ఇత్యాదులందౌకారాదులకు జముట్ప్రసక్తియుండును గాన నిట్టిచోటులం దాగమమును వారించుటకై జాదిపదమునకే ఆగమమును విధింపవలయునని నాగేశాదుల యాశయము.

* 136. సమస్సుటి. 8-3-5. సమః, సుటి. (రుః)

సమో రుస్స్యాత్సుటి । అలోన్త్యస్య.

136. సమ్‌అనుదానికి సుడాగమము పరమగునపుడు, రు, అనునది (ర్) యాదేశమగును. ఈ రుత్వమలోన్త్యపరిభాషచే మకారస్థానమున ప్రవర్తించును. సమ్‌పూర్వకమగు కృఞ్ ధాతువునకు తృచ్ ప్రత్యయము చేసినచో సమ్ కర్తా అని యగును. "సమ్పరిభ్యాం కరోతౌ భూషణే" (6-1-137) సూ. చే, కకారమునకు సుడాగమము (స్) ప్రవర్తించును. సమ్ + స్కర్తా. ఈ సూత్రముచే మకారమునకు రుత్వమగును. సర్ + స్కర్తా. ఇట్లుండ.

* 137. అత్రానునాసికః పూర్వస్య తు వా. 8-3-2. అత్ర, అనునాసికః, పూర్వస్య, తు, వా.

అత్ర రుప్రకరణే రోః పూర్వస్యానునాసికో వా స్యాత్ ॥

137. మతువసోరుసంబుద్ధౌ ఛన్దసి. (8-3-1) సూత్రము నారమ్భించి, కొన్నిసూత్రములచే రుత్వము విధింపబడెను. అది రుప్రకరణమనబడును. రుప్రకరణమున రుత్వమునకు పూర్వమందున్నయచ్చు అనునాసికము వికల్పముగనగును. సఀర్ స్కర్తా. ఇచట సకారముపై అకారమనునాసికమగును.

వివ:— ఇది విధిసూత్రమనియు, నధికారసూత్రమనియును రెండు పక్షములను విమర్శించి యధికారసూత్రమేయని సిద్ధాన్తీకరింపబడినది. కావున నీ సూత్రము త్తరసూత్రములందే ప్రవర్తించునుగాని వీనికి పూర్వమగు "మతువసోరు" (8-3-1) సూత్రమునందుగాని, యా సూత్రములోని వార్తికములందుగాని ప్రవర్తించదు.

* 138. అనునాసికాత్పరోఽనుస్వారః. 8-3-4. అనునాసికాత్, పరః, అనుస్వారః.

అనునాసికం విహాయ రోః పూర్వస్మాత్పరోఽనుస్వారాగమస్స్యాత్ । ఖరవసానయోర్విసర్జనీయః ॥

138. అనునాసికాత్తనుచోట పఞ్చమి, ల్యబ్లోపేపఞ్చమీ, అనువార్తికముచే విధింపఁబడినది. కావున అనునాసికాత్తనుపదమున కనునాసికమునువిడిచి, (అనునాసికం విహాయ) యని యర్థము. అనునాసికము వికల్పముగాన తదభావ పక్షమందు రుత్వమునకు బూర్వమగు వర్ణముకంటె పరమగుచు ననుస్వారమాగమ మగును. సంర్ స్కర్తా "ఖరవసానయోర్విసర్జనీయః" (77) సూ. చే, రేఫకు విసర్జనీయమగును. సంఃస్కర్తా.

* 139. విసర్జనీయస్య సః. 8-3-34. విసర్జనీయస్య, సః (ఖరి) ఖరి విసర్జనీయస్య సస్స్యాత్ । ఏతదపవాదే వాశరీతిపాక్షికే విసర్గే ప్రాప్తే । వా । సంపుంకానాం సో వక్తవ్యః॥ సంస్ స్కర్తా। సఁస్ స్కర్తా। సమో వా లోపమేక ఇతిభాష్యమ్ । లోపస్యాపి రుప్రకరణస్థత్వాదనునాసికానుస్వారాభ్యామేకసకారం రూపద్వయమ్ । ద్విసకారం తూక్తమేవ । తత్రానచిచేతి సకారస్య ద్విత్వపక్షే త్రిసకారమపి రూపద్వయమ్ । అనుస్వార విసర్గజిహ్వామూలీయోపధ్మానీయయమానామకారోపరి శర్షు చ పాఠస్యోపసంఖ్యాతత్వేనానుస్వారస్యాప్యచ్త్వాత్ । అనునాసికవతాం త్రయాణాం "శరః ఖయః" ఇతి కద్విత్వే షట్ । అనుస్వారవతామనుస్వారస్యాపి ద్విత్వే ద్వాదశ । ఏషామష్టాదశానాం తకారస్య ద్విత్వే, వచనాన్తరేణ పునర్ద్విత్వే చ, ఏకతం ద్వితం త్రితమితి చతుష్పఞ్చాశత్ । అణోనునాసికత్వేఽష్టోత్తరశతమ్.

139. విసర్గమునకు ఖర్ వర్ణము పరమగునపుడు సకారమాదేశమగును. సంః స్కర్తా. ఇచట నీ సూత్రముచే ప్రాప్తమగు సత్వమును బాధించి దీనికపవాదమగు వాశరి (152) సూ. చే, పాక్షికమగు విసర్గము ప్రాప్తమగుచుండ. వా । "సంపుంకానాం సో వక్తవ్యః." సమ్, పుమ్, కాన్, వీనియొక్క విసర్గమునకు సకారమాదేశమగునని యర్థముగల వార్తికమువలన వాశరి, అను సూత్రమిచట ప్రవర్తింపదు, కాన నీ వార్తికముచే సకారమే యగును. సంస్ స్కర్తా. సఁస్ స్కర్తా. ఈ రెండును సకారద్వయముగల రూపములు. (మొదటి సకారమును లెక్కింపవలదు). వా । సమ్ అనుదానియొక్క మకారమునకు సుడాగమము పరమైనపుడు లోపమును గొందరు వైయాకరణులు చెప్పిరని భాష్యమునన్నది. ఈ లోపముగూడ రుప్రకరణములోనిదగుటవలన లోపమందును, రుత్వము ప్రవర్తించునపుడు రాదగిన యనుస్వారానునాసికములు ప్రవర్తించును. కావున నొక సకారముగలవి రెండు రూపములగును. సకారద్వయముగలవి రెండు నిదివరలో జెప్పబడెను, అనుస్వారము, విసర్గము, జిహ్వామూలీయము,

ఉపధ్మానీయము, యమలు, వీనికి, "అఇఉణ్" సూత్రములోని అకారము తరువాతను "శషసర్" సూత్రమందును పాఠము చెప్పబడుటచే నివి యచ్చులు, శర్వర్ణములుగూడనగును. సకారద్వయముగల రెండురూపములందు, ననుస్వారమునకు, ననునాసికమునకును, పరమగు సకారమునకు "అనచిచ" (49) సూ. చే, ద్విత్వము ప్రవర్తించినయెడల మూడు సకారములుగలవి రెండురూపములగును. ఇట్లనుస్వారముగలవి మూడును ననునాసికముగలవి మూడును, మొత్తమాఱగును. వీనిలో ననునాసికముగల రూపత్రయమందు కకారమునకు "శరః ఖయః" (శర్వర్ణముకంటె పరమగు ఖయ్వర్ణమునకు వికల్పముగ ద్విత్వమగును). అనువార్తికముచే ద్విత్వము ప్రవర్తించిన నారురూపములగును. అనుస్వారముగలవైన మూడురూపములందు "శరః ఖయః" వార్తికముచే, కకారమునకు ద్విత్వము ప్రవర్తించుటవలన నారురూపములగును. (ద్విత్వముగలవి మూడు, ద్విత్వములేనివి మూడు) ఈ యారురూపములందనుస్వారమునకు "అనచిచ" సూ. చే, ద్విత్వము ప్రవర్తించినచో పండ్రెండు రూపములగును. వీనితో ననునాసికముగలవానిని గలపిన పదునెనిమిది రూపములగును. వీనిలో తకారమునకు, "అచో రహాభ్యామ్" (60) సూ. చే, ద్విత్వమగును. తిరుగ తకారమునకే "యణో మయో ద్వేవాచ్యే" వార్తికముచే ద్విత్వమగును. ఈ ద్విత్వములు వికల్పములుగాన, రెండును ప్రవర్తించినపుడు మూడుతకారములుగలవి పదునెనిమిది, ఒకేద్విత్వము ప్రవర్తించినపుడు రెండుతకారములుగలవి పదునెనిమిది; ఏ ద్విత్వము రానపుడొక తకారముగలవి పదునెనిమిది. మొత్తమేబదినాలుగు రూపములగును. వీని తుదినున్న ఆకారమునకు "అణోఽప్రగృహ్యస్య" (III) సూ. చే, అనునాసికమైనచో ననునాసికముగలవి యేబదినాలుగు, అనునాసిక రహితము లేబదినాలుగునగును. మొత్తము నూటయెనిమిది రూపములగును.

* 140. పుమః ఖయ్యమ్పరే. 8-3-6. పుమః, ఖయి, అమ్పరే। (రుః)

అమ్పరే ఖయి పుమ్శబ్దస్య రుః స్యాత్। వ్యుత్పత్తిపక్షే ఽప్రత్యయస్యేతి షత్వపర్యుదాసాత్ ౙకౙపయోః ప్రాప్తౌ। అవ్యుత్పత్తిపక్షే తు షత్వప్రాప్తౌ। సంపుంకానామితిసః। పుఁస్కోకిలః। పుంస్కోకిలః। పుఁస్పుత్రః। పుంస్పుత్రః। అమ్పరే కిమ్। పుంక్షీరం। ఖయి కిమ్। పుందాసః। ఖ్యాఞాదేశే న। పుంఖ్యానమ్॥

140. అమ్ ప్రత్యాహారవర్ణము పరమందుగల ఖయ్ ప్రత్యాహారవర్ణము పరమగునపుడు పుమ్శబ్దములోని మకారమునకు రుత్వము వచ్చును. పుమ్ + కోకిలః। మకారమునకు రుత్వవిసర్గములు, అనునాసికానుస్వారములు ప్రవర్తింప, పుఁఃకోకిలః। పుంఃకోకిలః। అనియగును. ఇతర వ్యాకరణములందుణాదిప్రత్య

యాంతములుగ నంగీకరింపబడిన ప్రాతిపదికములు ప్రకృతిప్రత్యయ విభాగసహితములనునది వ్యుత్పత్తి పక్షమగును. ఈ పక్షమందుణాద్యంతమగు పుమస్‌శబ్దములోని మకారము ప్రత్యయావయవమగుటవలన దీనియొక్క స్థానమందు వచ్చిన రుత్వవిసర్గములును ప్రత్యయావయవములగును. "ఇదుదుపధస్య చాప్రత్యయస్య" (156) అను షత్వవిధాయకసూత్రమున అప్రత్యయస్య, అను పర్యుదాసమువలన ప్రత్యయావయవమునకు షత్వము నిషేధింపబడినది. ఇచట విసర్గము ప్రత్యయావయవమగుటచే షత్వము ప్రాప్తముగాదుగాన "కుప్వోఃకఃపౌచ" (143) సూ. చే, విధింపబడిన జిహ్వామూలీయోపధ్మానీయములు, అనగా కోకిలశబ్దము పరమగునపుడు జిహ్వామూలీయము, పుత్రశబ్దము పరమగునపుడు పధ్మానీయము ప్రాప్తములగుచున్నవి. ఉణాద్యంతప్రాతిపదికములు ప్రకృతి ప్రత్యయవిభాగరహితములనునది అవ్యుత్పత్తిపక్షము. ఈ పక్షమందిచటి విసర్గము ప్రత్యయావయవము గానందున ననునాసికముతోగూడిన రూపములందు విసర్గమునకు షత్వము ప్రాప్తమగుచున్నది. అనుస్వారముతోగూడిన రూపమునందనుస్వారము వ్యవధాయకమగుటచే విసర్గమిదుపధముగానందున షత్వము ప్రాప్తముగాదని గ్రహింపదగును. ఈ జిహ్వామూలీయోపధ్మానీయములను, షత్వమును బాధించి "సంపుంకానాం సః" అనువచనముచే విసర్గమునకు సకారాదేశమగును. పుँస్కోకిలః. పుంస్కోకిలః పుँస్పుత్రః. పుంస్పుత్రః. పుంక్షీరమ్. ఇచట రుత్వమును వారించుటకై అమ్పరకమగు ఖయ్యు పరమగునపుడే రుత్వమనవలెను. పుందాసః. ఇచట రుత్వమును వారించుటకై ఖయ్యు పరమగునపుడే రుత్వమనవలెను. వా। (1) ఖ్యాఞ్ అనునాదేశము పరమగునపుడు పుమ్‌శబ్దములోని మకారమునకు రుత్వనిషేధమును చెప్పవలయును. పుంఖ్యానమ్. చక్షిఙ్ ధాతువునకు ల్యుట్ప్రత్యయము (అన) పరమగునపుడు "చక్షిఙః ఖ్యాఞ్" (2-4-54) సూ. చే, ఖ్యాఞాదేశము చేయగా, ఖ్యానమనునది సిద్ధమగును.

వివ:—(1) ఇది యపూర్వమగు నిషేధవచనము గాదు. "చక్షిఙః ఖ్యాఞ్", సూత్రముచే ఖ్యాదేశమే విధింపబడుననియు, నసిద్ధకాండమందు (త్రిపాదియందు) పఠింపబడిన "శస్య యో వా" అను వార్తికముచే శవర్ణమునకు యకారాదేశము వలన ఖ్యాఅని యగుననియును, భాష్యమందు జెప్పబడెను. కావున పుంఖ్యానమనుచోట రుత్వము చేయునపుడు యత్వమసిద్ధమగుటచే, ఖయ్యు, అమ్పరకముగానందున రుత్వప్రసక్తి వారితమగును. ఇట్లు సిద్ధమైన యర్థమే ఖ్యాఞాదేశేన, అనువాక్యముచే చెప్పబడెనని తెలియనగును.

* **141.** నశ్ఛవ్యప్రశాన్. 8-3-7. నః, ఛవి, అప్రశాన్. (అమ్పరే, రుః)

అమ్పరే ఛవి నకారాన్తస్య పదస్య రుస్స్యాత్, న తు ప్రశాన్‌శబ్దస్య । విసర్గః । సత్వం । శ్చుత్వ

మ్। శార్ఙ్గిఁశ్ఛిన్ధి । శార్ఙ్గింశ్ఛిన్ధి । చక్రిఁస్త్రాయస్వ । చక్రింస్త్రాయస్వ। పదస్య కిమ్। హన్తి। అమ్పరే కిమ్। సన్త్సరుః ఖడ్గముష్టిః । అప్రశాన్ కిమ్ । ప్రశాన్తనోతి॥

141. నకారాన్తమందుగల పదమునకు అమ్పరకమగు ఛవ్ ప్రత్యాహార వర్ణము పరమగునపుడు రుత్వము వచ్చును, ప్రశాన్ శబ్దమునకు మాత్రము రాదు. అలోన్త్యపరిభాషచే నకారమునకు రుత్వమగును. శార్ఙ్గిన్ + ఛిన్ధి. నకారమునకు రుత్వవిసర్గములు. "విసర్జనీయస్యసః" (139) సూ. చే, సత్వము. శ్చుత్వముచే సకారమునకు శవర్ణము. రుత్వమునకు పూర్వమునను్నదాని కనునాసికము.

శార్ఙ్గిఁశ్ఛిన్ధి. అనుస్వారపక్షమందు శార్ఙ్గింశ్ఛిన్ధి. చక్రిన్ + త్రాయస్వ. ఇచట శ్చుత్వమును విడిచి పూర్వోక్తమగు ప్రక్రియ సమానము. చక్రిఁస్త్రాయస్వ. చక్రింస్త్రాయస్వ. హన్తి. (హన్ + తి) ఇచట నాన్తము ధాతువగుటచే పదము గాదు. ఇచట రుత్వమును వారించుటకై పదమునకు రుత్వమును విధింపవలెను. సన్త్సరుః. (త్సరుశబ్దమునకు ఖడ్గముయొక్క పిడి యర్థము). ఇచట రుత్వవారణార్థమమ్పరకమగు ఛవ్వర్ణము పరమగునపుడు రుత్వమని చెప్పవలెను. ప్రశాన్తనోతి. ప్రశాన్శబ్దమునకు రుత్వనివృత్తికై (అప్రశాన్) అను పర్యుదాసమావశ్యకము.

* 142. నౄన్పే. 8-3-10. నౄన్, పే. (రుః, వా)
నౄనిత్యస్య రుస్స్యాద్వా పకారే పరే ।

142. "నౄన్" అనునది నృశబ్దముయొక్క ద్వితీయాబహువచనాన్తమైన కనుకరణము. నౄన్ అనుదానియొక్క నకారమునకు, పకారము పరమగునపుడు, రుత్వము వికల్పముగానగును. సూత్రమున పకారముపై అకారముచ్చారణార్థముగాన నౄన్ + పునాతి, అనుచోటునందును రుత్వమగును. నౄర్ + పాహి. విసర్గము. ఇట్లుండ.

* 143. కుప్వోః ≍క≍పౌ చ। 8-3-37. కుప్వోః, ≍క≍పౌ, చ.
కవర్గే పవర్గే చ పరే విసర్జనీయస్య జిహ్వామూలీయోపధ్మానీయౌ స్తః । చాద్విసర్గః । యేననాప్రాప్తన్యాయేన విసర్జనీయస్యస ఇత్యస్యాపవాదోయమ్। న తు శర్పరేవిసర్జనీయఇత్యస్య । తేన వాసః క్షౌమమిత్యాదౌ విసర్గ ఏవ । నౄఁ≍పాహి । నౄం≍పాహి । నౄఁఃపాహి । నౄంఃపాహి । నౄన్పాహి ॥

143. విసర్గమునకు, క, ఖ, లు పరమగునపుడు, జిహ్వామూలీయము, ప ఫ లు పరమగునపుడు ఉపధ్మానీయము ఆదేశమగును. చకారమువలన పక్షమందు

విసర్గమునకు విసర్గమాదేశమగును. "యేన నా ప్రాప్తే యో విధిరారభ్యతే స తస్య బాధకో భవతి" (ఏ సూత్రమవశ్యము ప్రాప్తమగుచుండ, నే సూత్రమారంభింపబడునో యది దానికి బాధకమగును.) అవశ్యప్రాప్తిగలదానికి (సామాన్యశాస్త్రమునకు) ఉత్సర్గమనియు, తరువాత నారంభింపబడినదానికి (విశేషశాస్త్రమునకు) అపవాదమనియు వ్యవహారము. లోకమున "సర్వేభ్యో బ్రాహ్మణేభ్యోదధి దీయతాం తక్రం కౌణ్డిన్యాయ" (బ్రాహ్మణులందరకు పెరుగు నీయవలెను, కౌణ్డిన్యునకు మాత్రము మజ్జిగ నీయవలెను) అని చెప్పినపుడు బ్రాహ్మణుడగుటచే కౌణ్డిన్యునకుగూడ దధిదానము ప్రాప్తమగుచుండ, విశేషముగ తక్రదానము విధింపబడినందున కౌణ్డిన్యునకు తక్రమునే యిచ్చెదరు గాని దధినివ్వరు. అనగా తక్రదానము దధిదానమునకు బాధకమగును. ఈలోకన్యాయసిద్ధమైనదే శాస్త్రమున, యేననాప్రాప్తన్యాయము. కావున నీ న్యాయముచే బాధ చెప్పబడిన స్థలమందు తక్రదానము చేసినపిదప నవకాశమున్నను, దధిదానము లేనట్లు, అపవాదశాస్త్రము ప్రవర్తించినపిదప తిరుగ నుత్సర్గశాస్త్రము ప్రవర్తించుటకు వలనుపడదు. ఈ న్యాయముచే కుప్వోః≍క≍పౌచ, సూత్రము స్వవిషయముననవశ్యము ప్రాప్తమగు "విసర్జనీయస్య సః" సూత్రమునకే బాధకమగునుగాని, తనప్రవృత్తికి విషయమగు స్థలములన్నిటిలోను, ప్రవృత్తిలేనట్టి, అనగా నవశ్యప్రాప్తి లేనట్టి, శర్పరే విసర్జనీయః" (151) సూత్రముయొక్క లక్ష్యములందు ప్రవర్తించదని భావము. కావున వాసః క్షౌమమనుచోట విసర్గమునకు విసర్గమే వచ్చును. ఈ సూత్రమున కుదాహరణము. నౄన్ + పాహి. పూర్వసూత్రముచే రుత్వము. అనునాసికానుస్వారములు. విసర్గము. ఈ సూత్రముచే నుపధ్మానీయము. నౄఁ≍పాహి. నౄం≍పాహి. విసర్గపక్షమందు. నౄఁఃపాహి. నౄంః పాహి. రుత్వాభావపక్షమందు. నౄన్పాహి. ఐదు రూపములగును,

144. కానామ్రేడితే. 8-3-12. కాన్, ఆమ్రేడితే (రుః)
కాన్నకారస్య రుస్స్యాదామ్రేడితే పరే।
సంపుంకానామితి సః। యద్వా।

144. సూత్రమున కాన్, అనునది కిమ్శబ్దముయొక్క ద్వితీయాబహువచనాన్తమున కనుకరణము. కాన్ యొక్క నకారమునకామ్రేడితము పరమగునపుడు రుత్వము వచ్చును. కాన్ కాన్. ఇచట మొదటి నకారమునకు రుత్వవిసర్గములు, నకారమునకు పూర్వమందున్నదాని కనునాసికానుస్వారములు ప్రవర్తించనపిదప, విసర్గమునకు ప్రాప్తమగు జిహ్వామూలీయమును బాధించి, సంపుంకానామను వచనముచే సకారాదేశము వచ్చును. కాఁస్కాన్. కాంస్కాన్. సంపుంకానా

మనువచనమున కాన్ గ్రహణమనావశ్యకమని బోధించుటకై ఇచట సకారము వచ్చుటకుపాయాన్తరము "యద్వా" అనుదానిచే చూపబడుచున్నది.

* 145. కస్కాదిషు చ. 8-3-48. (ఇణః, షః, సః, విసర్జనీయస్య, కుప్వోః,)

ఏష్విణ ఉత్తరస్య విసర్గస్య షస్స్యాదన్యత్ర తు సః। ౹౹క౹౹పయోరపవాదః। ఇతిసః। కాస్కాన్। కాంస్కాన్। కస్కః। కౌతస్కుతః। సర్పిష్కుణ్డికా। ధనుష్కపాలమ్ । ఆకృతిగణోఽయమ్ ॥

145. కస్కాదిగణపఠితములకు కస్క మొదలగువానిలో ఇణ్ ప్రత్యాహారవర్ణముకంటె పరమగు విసర్గమునకు షత్వము, ఇణ్ణుకంటె పరముగానట్టి విసర్గమునకు సత్వమును వచ్చును. కవర్గపవర్గములు పరమైనపుడు గణమందు కృతసత్వములను, కృతషత్వములను పఠించుటవలన నిట్లు వ్యాఖ్యానము చేయబడెను. "కుప్వోః" అనుసూత్రముచే విహితములగు ౹౹క౹౹ పలకు, విసర్గమునకునీ సత్వషత్వములపవాదములు. కాస్కాన్, కాంస్కాన్, అనుచోట విసర్గమునకీ సూత్రముచేతనే సత్వము సిద్ధమగును. కస్కః. కౌతస్కుతః. కుతఃకుతః ఆగతః, అనునర్థమున కుతఃకుతశ్శబ్దమునకు గణపాఠసామర్థ్యమువలన, అణ్ ప్రత్యయమగును. సర్పిష్కుణ్డికా. ధనుష్కపాలమ్. ఇచటి విసర్గమిణ్ణుకంటె పరమగుటచే షత్వమునొందును. కస్కాదిగణమాకృతిగణమనగా గణమందు పఠింపబడినవానికంటె నితరములను, గణపఠితములతో సదృశమగువాని నిందు జేర్పదగునని యర్థము.

వివ:—కస్కాదిగణమాకృతిగణమనుటవలన సంస్కర్తా యను రూపము నీగణమున జేర్చినచో సత్వము సిద్ధమగునుగాన సంపుంకానామనువచనమున సమ్ గ్రహణముగూడ ననావశ్యకమగును. పుంస్కోకిలః, ఇత్యాదులందు విసర్గమిణ్ణుకంటె పరమగుటవలన నీసూత్రముచే ప్రాప్తమగు షత్వమును బాధించుటకై పూర్వోక్తవార్తికమున పుమ్గ్రహణముమాత్రమావశ్యకమని గ్రహింపవలయును.

* 146. సంహితాయామ్. 6-1-72.

ఇత్యధికృత్య ।

146. ఇది అధికారసూత్రము. "అనుదాత్తం పదమేకవర్జమ్" (6-1-158) సూత్రమువరకధికృతమగును.

వివ :—"ఇకో యణచి" మొదలగు సూత్రము లీయధికారమున జేరినవగుటచే "ఇకో యణచి" సూత్రమునకు ముందీసూత్రమును వ్యాఖ్యానము చేయుట యుచితమే గాని, సూత్రక్రమమునననుసరించి "ఛే చ" మొదలగున వ్యవహితపరములగు సూత్రములకు పూర్వము వ్యాఖ్యానముచేయబడెను. ఆవశ్యక

మగు నర్ధమాత్రాకాలవ్యవధానముతో వర్ణముల యుచ్చారణము సంహితయన బడును. ఇంతకధికమగు మాత్రాకాలాదివ్యవధానముతో వర్ణములనుచ్చరించునపుడీ యధికారమున విధింపబడు కార్యముల వారింప నీ యధికారమావశ్యకమని గ్రహించునది.

* 147. ఛే చ. 6_1_73. ఛే, చ, (హ్రస్వస్య, తుక్)
హ్రస్వస్య ఛే పరే తుగాగమస్స్యాత్సంహితాయామ్ । శ్చుత్వస్యాసిద్ధత్వాజ్జశ్త్వేన దః । తతశ్చర్త్వస్యాసిద్ధత్వాత్పూర్వం శ్చుత్వేన జః । తస్య చర్త్వేన చః । శ్చుత్వస్యాసిద్ధత్వాచ్చోః కురితి కత్వం న । స్వచ్ఛాయా । శివచ్ఛాయా ।

147. హ్రస్వమునకు ఛకారము పరమగునపుడు సంహితయందు తుగాగము (త్) వచ్చును. స్వ + ఛాయా, అనుచోట తుగాగమమువలన స్వత్ + ఛాయా అనియగును. శ్చుత్వమసిద్ధమగుటవలన జశ్త్వముచే తకారమునకు దకారమగును స్వద్ + ఛాయా. చర్త్వమసిద్ధమగుటవలన శ్చుత్వముచే దకారమునకు జకారమగును. స్వజ్ + ఛాయా. జకారమునకు చర్త్వముచే చకారము. స్వచ్ఛాయా. "చోః కుః" (380) సూత్రముచే చకారమునకు కత్వము చేయునపుడు శ్చుత్వమసిద్ధమగుటవలన దకారమే యుండునుగాన కత్వము రాదు. శివ + ఛాయా, అనుచోటను పై కార్యములన్నియును ప్రవర్తించునుగావున, శివచ్ఛాయాఽని యగును.

వివ:—సూత్రమున ఛకారముపై అకారముచ్చారణార్థమగుటచే అచ్ఛిన్నమ్ (అ + ఛిన్నమ్) అనుచోటను తుగాగమము సిద్ధించును.

* 148. ఆఙ్మాఙోశ్చ 6_1_74 ఆఙ్మాఙోః, చ, (ఛే, తుక్)
ఏతయోశ్ఛే పరే తుక్ స్యాత్ । పదాన్తాద్వేతివికల్పాపవాదః । ఆచ్ఛాదయతి । మాచ్ఛిదత్ ॥

148. ఆఙ్ (ఆ) మాఙ్ (మా) వీనికి ఛకారము పరమగునపుడు తుగాగమమగును. "పదాన్తాద్వా", (151) సూ. చే, విధింపబోవు తుగ్వికల్పమునకిది యపవాదము. ఆఙ్మాఙులు పదములగుటచే ప్రాప్తమగు వికల్పమును బాధించుటకీసూత్రమని యాశయము. ఆచ్ఛాదయతి (ఆ + ఛాదయతి) మాచ్ఛిదత్ (మా + ఛిదత్) స్వచ్ఛాయా అనురూపమందువలె జశ్త్వాదుల నూహింపదగును.

* 149. దీర్ఘాత్. 6_1_75. (ఛే, తుక్)
దీర్ఘాచ్ఛేపరే తుక్ స్యాత్ । దీర్ఘస్యాయం తుక్ నతు ఛస్య । సేనాసురాచ్ఛాయేతి జ్ఞాపకాత్ । చేచ్ఛిద్యతే.

149. చెప్పబోవు జ్ఞాపకమువలన, సూత్రమునఁ "దీర్ఘాత్" అనుచోట పఞ్చమ్యర్థమందు పఞ్చమి. దీర్ఘమునకు ఛకారము పరమగునపుడు తుగాగమము వచ్చును. దీర్ఘమునకే తుగాగమముగాని ఛకారమునకు గాదు. ఇట్లు చెప్పుటలో "విభాషా సేనాసురాచ్ఛాయా" (832) సూత్రమున "చ్ఛాయా" అనెడి చకారాన న్తరమున ఛకారముగల నిర్దేశము జ్ఞాపకము. ఛకారమునకే తుగాగమమనినచో తకారము శ్చుత్వమువలన చకారమగును. ఇది పరమగునపుడు ఛకారము గూడ "ఖరిచ" (122) సూ. చే, చర్త్వమువలన చకారమగును. "ఛాయా" అనుచోట చకారద్వయము శ్రుతముగావలయును. ప। సన్నిపాతలక్షణో విధిర నిమిత్తం తద్విఘాతస్య. (తాను ప్రవర్తించుటకు నిమిత్తమగు సమ్బన్ధమును నివర్తింపచేయు వేరొకశాస్త్రమునకు తాను (ప్రవృత్తమగు శాస్త్రము) నిమిత్తము గాదు) ఈ పరిభాషచే ఛకార నిమిత్తకమగు తుగాగమము (చకారము) ఛకారనివర్తకమగు చర్త్వశాస్త్రమునుగురించి నిమిత్తము గానందున చర్త్వము ప్రవర్తింపకపోయినను, ఛకారముతరువాత చకారము శ్రుతమయ్యెడిని. కావున నీ నిర్దేశము దీర్ఘమునకే తుగాగమమనుటలో ప్రమాణమగును. సూత్రమున కుదాహరణము. చేచ్ఛిద్యతే. ఏకారమునకు తుగాగమము. మిగిలిన ప్రక్రియ స్వచ్ఛాయా అనురూపమందువలె నూహ్యము.

* 150. పదాన్తాద్వా 6-1-76 పదాన్తాత్, వా। (దీర్ఘాత్. ఛే, తుక్)

దీర్ఘాత్పదాన్తాచ్ఛేపరే తుగ్వా స్యాత్ । లక్ష్మీచ్ఛాయా లక్ష్మీఛాయా ॥ ఇతి హల్సన్ధిః ॥

150. పదాన్తమగు దీర్ఘమునకు ఛకారము పరమగునపుడు తుగాగమము వికల్పముగనగును. లక్ష్మీచ్ఛాయా. తుగాగమము రానపుడు లక్ష్మీఛాయా.

హల్సన్ధిప్రకరణము ముగిసెను.

---

## 5. విసర్గసన్ధి ప్రకరణము

విసర్జనీయస్య సః. 8-3-34. విష్ణుస్త్రాతా ॥

ఈ సూత్రమిదివరలో వ్యాఖ్యానము చేయబడినను, ప్రకరణశుద్ధికొఱకు నుత్తరసూత్రములలోనికి విసర్జనీయపదమున కనువృత్తిని చూపుటకు నిచట తిరుగ స్మరింపబడెను. విష్ణుస్త్రాతా. (విష్ణుః + త్రాతా) విష్ణుశబ్దముకంటె సుప్రత్యయము. రుత్వవిసర్గములు. ఈ సూత్రముచే విసర్గమునకు సకారమాదేశమగును.

* 151. శర్పరే విసర్జనీయః. 8-3-35. శర్పరే, విసర్జనీయః. (ఖరి, విసర్జనీయస్య)

శర్పరే ఖరి విసర్జనీయస్య విసర్జనీయో న త్వన్యత్ । కఃత్సరుః । ఘనాఘనఃక్షోభణః । ఇహ యథాయథం సత్వం జిహ్వామూలీయశ్చ న ॥

151. విసర్గమునకు, శర్వర్ణము పరమందుగల ఖర్వర్ణము పరమగునపుడు విసర్గమే యాదేశమగును. ఇతరములగు సత్వాదులు నివర్తించుట విసర్గమునకు విసర్గవిధానమునకు ఫలము. కఃత్సరుః. ఘనాఘనఃక్షోభణః. వీనిలో విసర్గమునకు క్రమముగ సత్వ, జిహ్వామూలీయములు నివృత్తములగును.

* 152. వా శరి. 8-3-36. వా, శరి. (విసర్జనీయస్య, విసర్జనీయః)

శరి పరే విసర్జనీయస్య విసర్జనీయ ఏవ వా స్యాత్ । హరిః శేతే, హరిశ్శేతే । వా॥ ఖర్పరే శరి వా విసర్గలోపో వక్తవ్యః। రామస్థాతా । హరిస్ఫురతి। పక్షే విసర్గే సత్వే చ త్రైరూప్యమ్ । కుప్వోః ≍క≍పౌ చ। క≍కరోతి। కఃకరోతి, క≍ఖనతి। కఃఖనతి । క≍పచతి । కఃపచతి । క≍ఫలతి । కఃఫలతి ॥

152. విసర్గమునకు శర్వర్ణము పరమగునపుడు విసర్గమే వికల్పముగనగును. హరిః శేతే. పక్షమందు, సత్వశ్చుత్వములు ప్రవర్తించిన హరిశ్శేతే అనియగును. వా॥ ఖర్పరకమగు శర్వర్ణము పరమగునపుడు విసర్గము వికల్పముగ లోపించును. రామస్థాతా. (రామఃస్థాతా.) హరిస్ఫురతి. (హరిఃస్ఫురతి) లోపాభావపక్షమందు "వాశరి" సూ. చే, విసర్గము. రామఃస్థాతా. హరిఃస్ఫురతి. పక్షమందు "విసర్జనీయస్యసః" సూ. చే సత్వము. రామస్స్థాతా. హరిస్స్ఫురతి. లోప విసర్గములు వికల్పమగుటచే నిట్లు మూడురూపములు సాధువులగును. "కుప్వోః ≍క≍పౌ చ, (143) సూత్రమీదివరలో ప్రసఙ్గవశమున హల్సన్ధిప్రకరణమున వ్యాఖ్యాతమయినను; విసర్గమునకు కార్యమును విధించునదగుటచే నిచట తిరుగ నా సూత్రము స్మరింపబడి యుదాహరణములు చూపబడినవి. క≍కరోతి, కఃకరోతి..................కఃఫలతి.

* 153. సోఽపదాదౌ. 8-3-38. సః, అపదాదౌ. (విసర్జనీయస్య, కుప్వోః)

విసర్జనీయస్య సః స్యాదపదాద్యోః కుప్వోః పరయోః, వా॥ పాశకల్పకకామ్యేష్వితి వాచ్యమ్ । పయస్పాశమ్ । యశస్కల్పమ్ । యశస్కమ్ । యశస్కామ్యతి। అనవ్యయస్యేతివాచ్యమ్। ప్రాతఃకల్పమ్, కామ్యే రోరేవేతి వాచ్యమ్, నేహ, గీఃకామ్యతి॥

153. పదమునకాద్యవయవములుగానట్టి కవర్గ పవర్గములు పరమగునపుడు విసర్గమునకు సత్వము వచ్చును. వచనము॥ పాశ, కల్ప, క, కామ్య, ప్రత్యయములు పరమగునపుడీసూత్రముచే విధింపబడు సత్వము ప్రవర్తించునని చెప్పవలయును. ఈ వచనము కాశికావృత్తిలోనిది. మిగిలినచోట్ల సంభవములేదు గాన నీవచనము సంభవప్రదర్శనముమాత్ర మగును గాని పరిగణనమున వీలులేదు. పయస్పాశమ్ (పయః + పాశమ్) పయశ్శబ్దముకంటె "యాప్యే పాశప్" (5-3-47) సూ. చే, పాశప్రత్యయము. (నిన్దితమగు క్షీరమనియర్థము) యశస్కల్పమ్ "ఈషదసమాప్తౌ కల్పప్ దేశ్య దేశీయరః". (5-3-67) సూ. చే, యశశ్శబ్దమునకు కల్పప్రత్యయము. (స్వల్పముచే నసంపూర్ణమగు కీర్తియని యర్థము) యశస్కమ్ "కుత్సితే" (5-3-74) సూ. చే, యశశ్శబ్దముకంటె కప్రత్యయము. (అపయశస్సని యర్థము) యశస్కామ్యతి. "కామ్యచ్చ" (3-1-9) సూ. చే, యశశ్శబ్దమునకు కామ్యప్రత్యయము. (తనకు యశస్సును కోరుచున్నాడని యర్థము). వా॥ అవ్యయసంబంధియగు విసర్గమునకు సత్వము రాదు. ప్రాతఃకల్పమ్. ఇచట విసర్గము ప్రాతర్, అనునవ్యయమునకు సమ్బన్ధించినదగుటచే సత్వము రాదు. వా॥ కామ్యచ్ ప్రత్యయము పరమగునపుడిత్సంజ్ఞకోకారముగల రేఫముయొక్క (రు) స్థానమందైన విసర్గమునకే సత్వము వచ్చును. గీఃకామ్యతి. ఇచట విసర్గము కేవల రేఫస్థానికమగుటవలన సత్వము రాదు. యశస్కామ్యతి, అనుచోట విసర్గము రుస్థానికముగాన సత్వము ప్రవర్తించును.

* 154. ఇణః షః. 8-3-39. ఇణః, షః (విసర్గస్య)
ఇణః పరస్య విసర్గస్య షకారస్స్యాత్పూర్వ విషయే। సర్పిష్పాశమ్। సర్పిష్కల్పమ్। సర్పిష్కమ్। సర్పిష్కామ్యతి॥

154. (1) పూర్వసూత్రమునకు విషయమగుచోటున. ఇణ్ణుకంటె పరమగు విసర్గమునకు షకారమాదేశమగును. సర్పిష్పాశమ్. సర్పిష్కల్పమ్। సర్పిష్కమ్। సర్పిష్కామ్యతి ॥

వివ:—(1) ఇట్లు చెప్పుటవలన, పూర్వసూత్రమున జెప్పబడిన పాశాది ప్రత్యయములు పరమగునపుడు షత్వమనియు, అవ్యయసమ్బన్ధి విసర్గమునకు రాదనియు, కామ్యచ్ప్రత్యయము పరమగునపుడు రుస్థానికవిసర్గమునకే షత్వమనియును, ఫలితమగును. వచనత్రయ సంబంధమువలన క్రమముగ దోఃపాశ్య, ఉచ్చైఃకల్పమ్, గీఃకామ్యతి, వీనిలో షత్వము వారింపబడును.

* 155. నమస్పురసోర్గత్యోః. 8-3-40. నమస్పురసోః, గత్యోః।
గతిసంజ్ఞయోరనయోర్విసర్గస్య సః కుప్వోః పరయోః। నమస్కరోతి। సాక్షాత్ప్రభృతిత్వాత్కృఞో యోగే విభాషా గతిసంజ్ఞా। తదభావే నమః కరోతి। పురోఽవ్యయమితి నిత్యంగతిసంజ్ఞా। పురస్కరోతి। అగతిత్వాన్నేహ। పూః, పురౌ, పురః ప్రవేష్టవ్యాః॥

155. గతిసంజ్ఞకములగు నమస్, పురస్, వీనియొక్క విసర్గమునకు కవర్గపవర్గములు పరములగునపుడు సత్వము వచ్చును. నమస్కరోతి (నమః + కరోతి) నమస్ అనునది సాక్షాత్ప్రభృతిగణమున నున్నందున దీనికి "సాక్షాత్ప్రభృతీని చ" (1-4-74) సూ. చే, కృఞ్ ధాతువుతో సంబంధమున్నపుడు వికల్పముగ గతిసంజ్ఞ విధింపబడెను. గతిసంజ్ఞ లేనపుడు నమఃకరోతి. అని యగును. పురస్కరోతి (పురః + కరోతి) పురస్ అను నవ్యయమునకు "పురోఽవ్యయమ్" (1-4-67) సూ. చే, నిత్యముగ గతిసంజ్ఞ విధింపబడెను. (పూః పురౌ,) పురః + ప్రవేష్టవ్యాః । ఇచట పురః, అనునది రేఫాన్త స్త్రీలిఙ్గమగు పూర్ శబ్దమునకు ప్రథమా బహువచనాన్తము. ఇది యవ్యయముగానందున గతిసంజ్ఞకము గాదు. అందువలన సత్వ మిచట రాదు ఇచట పురః, అనునది బహువచనాన్తమని సూచించుట కేకవచన ద్వివచనములు ప్రదర్శింపబడినవి.

* 156. ఇదుదుపధస్య చాప్రత్యయస్య. 8-3-41. ఇదుదుపధస్య, చ, అప్రత్యయస్య, (షః)

ఇకారోకారోపధస్యాప్రత్యయస్య విసర్గస్య షస్స్యాత్కుప్వోః । నిష్ప్రత్యూహమ్ । ఆవిష్కృతమ్ । దుష్కృతమ్ । అప్రత్యయస్య కిమ్। అగ్నిఃకరోతి। వాయుఃకరోతి। ఏకాదేశశాస్త్రనిమిత్తకస్య న షత్వమ్ । కస్కాదిషు భ్రాతుష్పుత్రశబ్దస్య పాఠాత్ । తేనేహ న। మాతుఃకృపా । వా । ముహుసః ప్రతిషేధః । ముహుఃకామా ॥

156. హ్రస్వేకారముగాని, హ్రస్వోకారముగాని, ఉపధగాగల సముదాయమున కవయవమగుచు ప్రత్యయముగానటువంటి విసర్గమునకు, కవర్గపవర్గములు పరమగునపుడు, షత్వము వచ్చును. నిష్ప్రత్యూహమ్. (నిః + ప్రత్యూహమ్) ఆవిష్కృతమ్. దుష్కృతమ్. ఇవి యుదాహరణములు. అగ్నిఃకరోతి, వాయుఃకరోతి, ఇత్యాదులందు విసర్గము, సుప్రత్యయస్థానికమగుటచే స్థానివద్భావమువలన ప్రత్యయమగును. దీనికి షత్వమును వారింప, ప్రత్యయమగు విసర్గమునకు షత్వము రాదనవలెను. భ్రాతుష్పుత్రశబ్దము, షత్వముకొఱకు కస్కాది గణమున పఠింపబడెను. ఇందువలననే ఏకాదేశశాస్త్రము నిమిత్తముగగల విసర్గమున కీసూత్రముచే షత్వము రాదని తెలిసికొనదగును, లేనిచో నీ సూత్రముచే షత్వము సిద్ధమగునుగాన గణమందు భ్రాతుష్పుత్ర శబ్దపాఠము వ్యర్థమగును. మాతుఃకృపా. ఇచట విసర్గమేకాదేశశాస్త్ర నిమిత్తకమగుటచే షత్వము రాదు. మాతృ + ఙస్. ఇచట "ఋతఉత్" (280) సూత్రమువలన ఉకారమేకాదేశమగును. ఉకారము రపరమై ప్రవర్తించును. మాతుర్ స్, అని యగును. సకారమునకు లోపము. రేఫకు విసర్గము. ఏకాదేశశాస్త్రము రేఫకు, రేఫ

విసర్గమునకు, నిమిత్తమగుచున్నదిగాన నేకాదేశశాస్త్రము, పరమ్పరగా విసర్గమునకు నిమిత్తమగును. వా। ముహుః అనుదానియొక్క విసర్గమునకు షత్వనిషేధము చెప్పవలెను. ముహుః కామా.

వివ :—భాష్యమందు, "ఏకాదేశశాస్త్రనిమిత్తాద్విసర్గస్య న షత్వమ్" అని యున్నది. ఏకాదేశశాస్త్రము నిమిత్తముగాగల దానికంటె పరమగు విసర్గమునకు షత్వము రాదని యర్థము. మాతుఃకృపా, అనుచోట నుకారమేకాదేశశాస్త్ర నిమిత్తకమగుటచే దీనికంటె పరమగు విసర్గమునకు షత్వము ప్రవర్తించదు.

* 157. తిరసోఽన్యతరస్యామ్. 8-3-42. తిరసః, అన్యతరస్యామ్. (సః)

తిరసస్సోవా స్యాత్కుప్వోః। తిరస్కర్తా। తిరఃకర్తా॥

157. తిరస్ శబ్దముయొక్క విసర్గమునకు, కవర్గపవర్గములు పరమగునపుడు సకారాదేశము వికల్పముగనగును. తిరస్కర్తా. తిరఃకర్తా.

* 158. ద్విస్త్రిశ్చతురితి కృత్వోఽర్థే. 8-3-43. ద్విస్త్రిశ్చతుః, ఇతి, కృత్వోఽర్థే. (విసర్గస్య, షః, వా)

కృత్వోఽర్థే వర్తమానానామేషాం విసర్గస్య షకారోవా స్యాత్కుప్వోః। ద్విష్కరోతి। ద్విఃకరోతీత్యాది। కృత్వోఽర్థే కిమ్। చతుష్కపాలః.

158. కృత్వసుచ్ ప్రత్యయార్థమునందు వర్తమానములగు ననగా, క్రియల యుత్పత్తిని లెక్కించుటయను నర్థమును బోధించెడి, ద్విః, త్రిః, చతుః, అను వీనియొక్క విసర్గమునకు, కవర్గపవర్గములు పరమగునపుడు, షకారాదేశము వికల్పముగనగును. ద్విష్కరోతి (రెండుమారులు చేయుచున్నాడు) ఇట్లే త్రిష్కరోతి, చతుష్కరోతి, అనునవియును. పక్షమందు, ద్విఃకరోతి, మొదలగు రూపములగును. చతుష్కపాలః. (చతుర్షు కపాలేషు సంస్కృతః పురోడాశః) నాల్గు పాత్రలందు సంస్కరింపబడిన పురోడాశమనగా హోమద్రవ్యమని యర్థము. ఇచట చతుశ్శబ్దము కృత్వసుజర్థబోధకము గాదు. ఇచట నీ వికల్పషత్వమును వారించుటకై, సూత్రమున, "కృత్వోఽర్థే" అనునది యావశ్యకము. "ఇదుదుపధస్య" (156) సూ. చే. నిచట నిత్యషత్వము ప్రవర్తించుటయే యిష్టము.

వివ :—"క్రియాభ్యావృత్తిగణనే కృత్వసుచ్". (5-4-17) సూ. చే, క్రియలయొక్క యుత్పత్తిని లెక్కించుటయను నర్థమును బోధించు సంఖ్యావాచకములకు, స్వార్థమందు (ప్రకృత్యర్థమందు), కృత్వసుచ్ (కృత్వః) ప్రత్యయము విధింపబడెను, ఉదా :—పఞ్చకృత్వః. ఈ ప్రత్యయమున కర్థాధ

ముగ పూర్వోక్తార్థమందే "ద్విత్రిచతుర్భ్యస్సుచ్" (5-4-18) సూ. చే ద్వి, త్రి, చతుర్, శబ్దములకంటె సుచ్ (స్) ప్రత్యయము విహితమగుచున్నను కావున ద్విః, త్రిః, చతుః, ఇవి కృత్వసుజర్థ ప్రతిపాదకములగును.

* 159. ఇసుసోస్సామర్థ్యే 8-3-44 ఇసుసోః, సామర్థ్యే. (షః)
ఏతయోర్విసర్గస్య షస్స్యాద్వా కుప్వోః। సర్పిష్కరోతి। సర్పిఃకరోతి। ధనుష్కరోతి। ధనుఃకరోతి। సామర్థ్యమిహ వ్యపేక్షా। సామర్థ్యే కిమ్। తిష్ఠతు సర్పిః। పిబ త్వముదకమ్।

159. ఇస్, ఉస్, అనునవి యన్తమందుగల పదమున కవయవమగు విసర్గమునకు, కవర్గపవర్గములు పరమగునపుడు, వ్యపేక్షారూప సామర్థ్యమందు షకారాదేశము వికల్పముగ నగును. సర్పిష్కరోతి (సర్పిః + కరోతి) షత్వము రానపుడు, సర్పిఃకరోతి. ధనుష్కరోతి. ధనుఃకరోతి. వ్యపేక్షయనియు, ఏకార్థీభావమనియును, సామర్థ్యము ద్వివిధము. ఈ సూత్రమున సామర్థ్యము వ్యపేక్షారూపమే. ఏకవాక్యమున నున్నటువంటి, స్వార్థమును మాత్రము బోధించునట్టి పదములకు కాంక్షవలన గలుగు పరస్పర సమ్బన్ధము వ్యపేక్ష యనబడును. సర్పిష్కరోతి, అనుచోట కారకము (సర్పిస్సు) నకు క్రియాకాంక్షయు, (అనగా సర్పిః, అనునపుడు 'చేయుచున్నాడు, మొదలగు నేదో క్రియను' చెప్పవలయును) క్రియకు కారకాకాంక్షయు, (అనగా చేయుచున్నాడనునపుడు దేనినో చెప్పవలయును) నుండుటచే సర్పిః, కరోతి, అనునవి పరస్పర సమ్బన్ధముగల పదములగును. సర్పిస్సునకు, కరోతి పదమున కర్థమగు క్రియలోనికే కర్మగనన్వయమని భావము. తిష్ఠతు సర్పిః, పిబ త్వముదకమను చోట "నేయి యుండుగాక నీవు నీరును త్రాగుమని" యర్థము. కాన నివి రెండును భిన్నవాక్యములు. సర్పిస్సునకు, తిష్ఠతుపదమున కర్థమగు క్రియలోనికి కర్తగా నన్వయము. ఇట్లు సర్పిః, అనుచోట గలుగు క్రియాకాంక్ష శాన్తమగుటచే, పిబ, అనుదానికర్థమైన క్రియలోనికి సమ్బన్ధములేదు. కావున, సర్పిః, పిబ అను వీనికి వ్యపేక్షారూపసామర్థ్యము లేదు. ఇచట షత్వవారణమునకే సామర్థ్యమందే, షత్వమును విధించుట యావశ్యకము.

* 160. నిత్యం సమాసేఽనుత్తరపదస్థస్య 8-3-45 నిత్యమ్, సమాసే, అనుత్తరపదస్థస్య (ఇసుసోః)
ఇసుసోర్విసర్గస్యానుత్తరపదస్థస్య సమాసే నిత్యం షస్స్యాత్కుప్వోః పరయోః। సర్పిష్కుణ్డికా। అనుత్తరపదస్థస్యేతి కిమ్। పరమసర్పిఃకుణ్డికా। కస్కాదిషు సర్పిష్కుణ్డికాశబ్దోఽసమాసే వ్యపేక్షావిరహేఽపి షత్వార్థః। వ్యపేక్షాయాం నిత్యార్థశ్చ॥

160. ఇస్, ఉస్, ఇవి యన్తమందుగల పదమున కవయవమై, ఉత్తర పదములోనిదిగానట్టి విసర్గమునకు, కవర్గపవర్గములు పరమగునపుడు, సమాసమున షత్వము నిత్యముగ వచ్చును. సర్పిష్కుణ్డికా (సర్పిషః కుణ్డికా) పరమసర్పిః కుణ్డికా. (పరమంచ తత్ సర్పిః = పరమసర్పిః, తస్య కుణ్డికా) ఇచట సమాస మగుటచేతను, ప్రాప్తమగు షత్వమును వారింప నుత్తరపదములోని విసర్గమునకు షత్వము రాదనవలయును. ఉత్తరపదమనగా సమాసముయొక్క తుదియవయవము. పరమసర్పిఃకుణ్డికా అనునది కర్మధారయగర్భిత తత్పురుషముగాన "సర్పిః" అనునది కర్మధారయమున నుత్తరపదమగుచున్నది. సమాసముగానపుడు, (వాక్యమందు) వ్యపేక్షారూపసామర్థ్యము లేకున్నను, "అనయా సర్పిః, కుణ్డికా తిష్ఠతి, ఇత్యాదులందు షత్వముకాకును, వ్యపేక్షాసామర్థ్యమున్నడు "ఇదం సర్పిష్కుణ్డికాయాః" ఇత్యాదులందు నిత్యషత్వముకాకును, కస్కాది గణమున సర్పిష్కుణ్డికాశబ్దపాఠము చేయబడెనని గ్రహింపదగును.

* 161. అతఃకృకమికంసకుమ్భపాత్రకుశాకర్ణీష్వనవ్యయస్య. 8-3-46. అతః, కృకమి......షు, అనవ్యయస్య। (సః సమాసే, విసర్గస్య)

అకారాదుత్తరస్యానవ్యయస్య విసర్గస్య సమాసే నిత్యం సకారాదేశస్స్యాత్కరోత్యాదిషు పరేషు, న తూత్తరపదస్థస్య। అయస్కారః। అయస్కామః। అయస్కంసః। అయస్కుమ్భః। అయస్పాత్రమ్। అయస్సహితాకుశా అయస్కుశా। అయస్కర్ణీ। అతః కిమ్। గీఃకారః। అనవ్యయస్య కిమ్। స్వఃకామః। సమాసే కిమ్। యశః కరోతి। అనుత్తరపదస్థస్య కిమ్। పరమయశఃకారః॥

161. హ్రస్వాకారముకంటె పరమై, ఉత్తరపదములోనిదిగాని, యవ్యయ సమ్బన్ధిగాని గానట్టి విసర్గమునకు కృఞ్, కమ్, ధాతువులవలన సిద్ధములగు కార, కామ, మొదలగు రూపములు, కంస, కుమ్భ, పాత్ర, కుశా, కర్ణీ, శబ్దములును పరమగునపుడు, సమాసమందు సకారాదేశము నిత్యముగనగును. అయస్కారః, అయస్కామః. అయస్కంసః. అయస్కుంభః. అయస్పాత్రమ్. అయస్కుశా. అయస్సహితాకుశా, అని మధ్యపదలోపి సమాసము (అయసః, కుశా, అయస్కుశా, అనినచో "జానపదకుణ్డగోణ" (513) సూ. చే, ఙీషు ప్రసక్తమగును) అయస్కర్ణీ. గీఃకారః. ఇచట సత్వనివృత్తికై విసర్జనీయ మకారముకంటె పరముగావలయుననవలెను. స్వః కామః. ఇచట విసర్గము స్వర్గార్థకమగు నవ్యయము (స్వర్) నకు సమ్బంధించినదగుటచే సత్వము రాదు. యశః కరోతి, అను వాక్యమునందు సత్వవ్యావృత్తికై సమాసమందు సత్వమును విధింపవలెను. పరమయశఃకారః. ఇచట సత్వవారణమునకై ఉత్తరపదములోని విసర్గమునకు విశేషణము చెప్పదగును. (పరమం చ తద్యశః తస్య కారః).

వివ :— ఈ సూత్రములోనికి సమాసపదమనువర్తించును. దీనిచే నుత్తరపదమాక్షిప్తమగును. దీనికి సూత్రములోని కృ, కమ్, అను ధాతువులు విశేషణములు. విశేషణమగుధాతువదియాదియందుగల శబ్దమును గ్రహించును. ఈ విషయమున "విష్వగ్దేవయోశ్చ" (421) సూత్రమందలి వప్రత్యయగ్రహణము జ్ఞాపకము. జ్ఞాపనప్రకార మచటనే చూపబడును. ఇందువలన కృ, కమ్, ధాతువులు క్రమముగ కార, కామ, మొదలగువానికి బోధకములగును.

* 162. అధశ్శిరసీ పదే. 8-3-47. అధః, శిరసీ, పదే, (సః)
ఏతయోర్విసర్గస్య సాదేశస్స్యాత్పదశబ్దే పరే।
అధస్పదమ్। శిరస్పదమ్। సమాస ఇత్యేవ। అధఃపదమ్।
శిరఃపదమ్। అనుత్తరపదస్థస్యేత్యేవ। పరమశిరఃపదమ్।
కస్కాదిషు చ। భాస్కరః॥

162. సూత్రమందలి "అధశ్శిరసీ" అనుచోట ప్రథమావిభక్తి, షష్ఠ్యర్థకము. ఉత్తరపదస్థముగానటువంటి అధః, శిరః, వీనియొక్క విసర్గమునకు పదశబ్దము పరమగునపుడు, సమాసమందు సకారమాదేశమగును. అధస్పదమ్ (పాదస్యాధః = అధస్పదమ్ = పాదముయొక్క అధోభాగము) శిరస్పదమ్. (శిరసః పదమ్) అధఃపదమను వాక్యమందు సత్వమును వారించుటకై సమాసమందే సత్వమనవలయును. పరమశిరః పద మనుచోట సత్వనివృత్తికై, యుత్తరపదస్థమగు విసర్గమునకు సత్వనిషేధము చెప్పవలెను. భాస్కరః (భాః, కరః) ఇచట విసర్గము ప్రాస్వాకారముకంటె పరముగానందున "అతఃకృకమి" సూ. చే, సత్వము రాదుగాన నిచట సత్వముకొఱకు కస్కాది గణమందీశబ్దము పఠింపబడెను.

విసర్గసన్ధి ప్రకరణము సమాప్తము.

---

## 6. స్వాదిసన్ధిప్రకరణము

స్వౌజసమౌడితి సుప్రత్యయే శివస్ అర్చ్య ఇతి స్థితే॥

* 163. ససజుషోరుః 8-2-66 ససజుషోః, రుః. (పదస్య, అన్తే)
పదాన్తస్య సస్య, సజుష్శబ్దస్య చ, రుః
స్యాత్। జశ్త్వాపవాదః॥

163. శివశబ్దముకంటె "స్వౌజసమౌట్" (184) సూ. చే, సుప్రత్యయమగును. అర్చ్యః అను పదమును కలపినపుడు, శివస్ + అర్చ్యః అని యుండును. ఇట్లుండ. సకారమన్తమందుగల పదమునకు, సజుష్ శబ్దమన్తమందుగల పదమునకును, రు (ర్) ఆదేశమగును. ఈ రుత్వములోన్త్య పరిభాషచే నన్త్యములగు సకారషకారములకగును. శివస్ అనుచోట సకారము పదాన్త

మగుటచే, రుత్వము ప్రవర్తించిన శివర్ అనియగును. ఈ రుత్వము "ఝలాం జశోఽన్తే" (85) సూ. చే, విహితమగు జశ్త్వమున కపవాదము.

* 164. అతో రోరప్లుతాదప్లుతే. 6-1-113. అతః, రోః, అప్లుతాత్, అప్లుతే, (అతి, ఉత్)

అప్లుతాదతః పరస్య రోరుస్స్యాదప్లుతేఽతి। భోభగోఅఘో, ఇతి ప్రాప్తస్య యత్వస్యాపవాదః। ఉత్వం ప్రతి రుత్వస్యాసిద్ధత్వంతు న భవతి। రుత్వమనూద్య ఉత్వవిధేస్సామర్థ్యాత్ ॥

164. ప్లుతభిన్నమగు హ్రస్వాకారముకంటె పరమగు రుత్వము (ర్) నకు, ప్లుతభిన్నమగు హ్రస్వాకారము పరమగునపుడు ఉకారమాదేశమగును. ఇది, భోభగోఅఘో (168) సూ. చే, ప్రాప్తమగు యత్వమున కపవాదము. (అనగా నీ యుత్వమును విధింపనిచో, యత్వము ప్రాప్తించుచున్నదనియు నుత్వము విధింపబడునపుడు, యత్వమసిద్ధమగుటచే నుత్వమే ప్రవర్తించునుగాన యత్వమునకు ప్రాప్తియే లేదనియును భావము) రుత్వము నుద్దేశించియే, ఉత్వమును విధించుటవలన, నుత్వము చేయునపుడు రుత్వమసిద్ధమగుననుటకు వలనుపడదు. శివఉ + అర్చ్యః।

* 165. ప్రథమయోః పూర్వసవర్ణః. 6-1-102. ప్రథమయోః, పూర్వసవర్ణః. (అకః, అచి, దీర్ఘః)

అకః ప్రథమాద్వితీయయోరచి పరే పూర్వసవర్ణదీర్ఘ ఏకాదేశస్స్యాత్ । ఇతి ప్రాప్తే ॥

165. అక్కులకు ప్రథమాద్వితీయావిభక్తుల యచ్చు పరమగునప్పుడు పూర్వసవర్ణదీర్ఘము (అక్కులకు సవర్ణమగు దీర్ఘము) ఏకాదేశమగును. శివ + ఉ, అనుచోట వకారముపైనున్న అకారమక్కు, దీనికి ప్రథమైకవచనమగు ఉకారము పరమైనందున నీ దీర్ఘము ప్రాప్తమగుచున్నది.

వి: —శిష్టులచే చేయబడు వ్యాఖ్యానమువలన, సూత్రములోని "ప్రథమయోః" అనుదానిచే ప్రథమాద్వితీయారూపములగు విభక్తులకు గ్రహణముకల్గును. కావున నిట్టియర్థము సంభవించినది.

* 166. నాదిచి. 6-1-10. న, ఆత్, ఇచి. (పూర్వసవర్ణదీర్ఘః)

ఆవర్ణాదిచి పరే న పూర్వసవర్ణదీర్ఘః। అద్గుణః। ఏఙః పదాన్తాదతి। శివోఽర్చ్యః। ఆత్ ఇతి తపరః కిమ్। కేశా అత్ర। అతీతి తపరః కిమ్। శ్వ ఆగన్తా। అప్లుతాత్కిమ్। ఏహి సుస్రోత౩ అత్ర స్నాహి। ప్లుతస్యాసిద్ధత్వాదతః పరోఽయమ్। అప్లుతాదితి విశేషణే తు తత్సామర్థ్యాన్నాసిద్ధత్వమ్। తపరకర

ణస్య తు న సామర్థ్యమ్। దీర్ఘనివృత్త్యా చరితార్థత్వాత్। అప్లుతే ఇతికిమ్। తిష్ఠతు పయ అ3గ్నిదత్త। గురోరనృత ఇతి ప్లుతః.

166. అవర్ణముకంటె ఇచ్ ప్రత్యాహారవర్ణము పరమగునపుడు, పూర్వసవర్ణదీర్ఘము రాదు. శివ + ఈ - అర్చ్యః. ఇచట నీ నిషేధముచే పూర్వసవర్ణదీర్ఘము ప్రవర్తించదు. "ఆద్గుణః" (70) సూ. చే, గుణము. శివో + అర్చ్యః. "ఏఙః పదాన్తాదతి" (87) సూ. చే, పూర్వరూపము. శివోఽర్చ్యః. "అతో రోరప్లుతాదప్లుతే" అను సూత్రములోని పదములకు "అత ఇతి తపరః కిమ్" ఇత్యాదిగ్రన్థముచే ప్రయోజనము చూపబడుచున్నది. దేవాః + అత్ర అనుచోట సిద్ధరూపము దేవా అత్ర, అనునది. దేవాస్ + అత్ర, అనియుండ రుత్వమగును. "భోభగో" అను వక్ష్యమాణ సూత్రముచే రుత్వమునకు యత్వము (య్) "లోపశ్శాకల్యస్య" (63) సూ. చే, యలోపము ప్రవర్తించును. ఇచట (దేవార్ అత్ర) దీర్ఘముకంటె పరమగు రుత్వమునకుత్వము వారించుటకై "అతః" అనుచోట తపరకరణమావశ్యకము. శ్వః + ఆగన్తా, అనుచోట దేవా అత్ర, అను చోటునందువలె రుత్వాదికార్యములు ప్రవర్తించిన, శ్వ ఆగన్తా, అను సిద్ధరూపమగును. ఇచట దీర్ఘము పరమగునపుడుత్వవారణమునకై "అతి" అనుచోట తపరకరణమావశ్యకము. ప్లుతముకంటె పరమైనపుడు "అతః" అనుచోటనున్న తపరకరణమువలననే ఉత్వము వారింపబడునుగాన అతః, అనుదానికి (అకారమునకు) "అప్లుతాత్" (ప్లుతముకంటె భిన్నమైన) అను విశేషణమునకు ఫలమేమను ప్రశ్నకు సమాధానము. ఏహి సుస్రోత3 అత్ర స్నాహి. ఇచట ప్లుతముకంటె పరమైన రుత్వమునకు, (సుస్రోత3ర్) ఉత్వనివృత్తికై విశేషణమావశ్యకము. సుస్రోతాః అనునది యొకనికి పేరు. "దూరాద్ధూతే చ" సూ. చే, తకారముపైనున్న అకారము ప్లుతమగును. సుస్రోత3స్. సుస్రోత3ర్. యత్వయలోపములు ప్రవర్తించును. ఉత్వము చేయునపుడు ప్లుతమసిద్ధమగుటచే, రుత్వము, హ్రస్వాకారముకంటె పరమేయగును గాన, అతః, అనుచోటనుండు తపరకరణముత్వనివారకము గానేరదు. "అప్లుతాత్" అను విశేషణమున్నపుడు విశేషణసామర్థ్యముచే ప్లుతమసిద్ధము గానేరదు. దీర్ఘముకంటె పరమగు రుత్వమునకుత్వము వారించుటకై (దేవా అత్ర) తపరకరణము చరితార్థమగుటచే, నిది ప్లుతమసిద్ధము గాకుండ జేయు సమర్థమైనది గాదు, అని. తిష్ఠతు పయ అ3గ్నిదత్త. ఇచట అకారము "గురోరనృతః" (98) సూ. చే, ప్లుతము. యకారముపైనున్న అకారముకంటె పరమగు రుత్వమునకు యత్వయలోపములు వచ్చినవి. ఇచట ప్లుతపరకమగు రుత్వమునకుత్వమును వారించుటకై "అప్లుతే" అను అకారవిశేషణమావశ్యకము. అప్లుతాత్కిమను ప్రశ్నమునకు, దాని సమాధానమునకువలె నిచటి ప్రశ్నోత్తరములకు సామ్యమూహ్యంబు.

* 167. హశి చ. 6-1-114. హశి, చ. (అప్లుతాత్, అతః, రోః, ఉః)

అప్లుతాదతః పరస్య రోరుస్స్యాద్ధశి. శివో వన్ద్యః । రోరిత్యుకారానుబన్ధగ్రహణాన్నేహ । ప్రాతరత్ర । భ్రాతర్గచ్ఛ । దేవాస్ + ఇహ । ఇతి స్థితే । రుత్వమ్ ।

167. ప్లుతభిన్నమగు హ్రస్వాకారముకంటె పరమగు రుత్వమునకు హశ్ ప్రత్యాహారములోని వర్ణము పరమగునప్పుడుకారమాదేశమగును. శివర్ + వన్ద్యః. ఉత్వము. గుణము. శివోవన్ద్యః. ఉత్వవిధాయకమగు నీ సూత్రద్వయమందును ఉకారేత్సంజ్ఞకమగు రేఫమునే రుపదముచే గ్రహించుటవలన కేవల రేఫమున కుత్వమురాదు. ఉదా. ప్రాతరత్ర (ప్రాతర్ + అత్ర) భ్రాతర్గచ్ఛ (భ్రాతర్ + గచ్ఛ) దేవాస్ + ఇహ, రుత్వము. దేవార్ + ఇహ. ఇట్లుండ.

* 168. భో భగో అఘో అపూర్వస్య యోఽశి. 8-3-17. భో......స్య, యః, అశి, (రోః)

ఏతత్పూర్వస్య రోర్యాదేశస్స్యాదశిపరే । అసన్ధిస్సౌత్రః । లోపశ్శాకల్యస్య । దేవా ఇహ । దేవాయిహ । అశి కిమ్ । దేవాస్సన్తి । యద్యపీహ యత్వస్యాసిద్ధత్వాద్విసర్గో లభ్యతే । తథాపి విసర్గస్య స్థానివద్భావేన రుత్వాద్యత్వం స్యాత్ । నహ్యాయమల్విధిః । రోరితి సముదాయ రూపాశ్రయణాత్ । భోస్, భగోస్, అఘోస్, ఇతి సకారాన్తా నిపాతాః । తేషాం రోర్యత్వే కృతే.

168. భో, భగో, అఘో, అకారము, ఇవి పూర్వమందుగల రుత్వమునకు, అశ్ ప్రత్యాహారవర్ణము పరమగునపుడు యకారమాదేశమగును. సూత్రమున భగో అఘో, అనుచోటను, అఘో అపూర్వస్య అనుచోటను ఓకారమున్న కకారముతో ప్రాప్తమగు పూర్వరూపముయొక్క అభావము సూత్రికృతము. సూత్రములు ఛన్దస్సువంటివగుటచే కార్యములు ప్రవర్తింపకున్నను దోషములేదని భావము. దేవార్ ఇహ. ఇచట రుత్వమవర్ణపూర్వకమగుటచే యత్వమగును. "లోపశ్శాకల్యస్య" (68) సూ. చే, యకారలోపము. దేవాఇహ. యలోపము రానపుడు దేవాయిహ. దేవాస్సన్తి. ఇచట యత్వమును వారించుటకై, అశ్ వర్ణము యత్వమునకు నిమిత్తమనవలయును. ఆలోచింప నిచట యత్వమసిద్ధమగుటవలన రుత్వమునకు విసర్గమే వచ్చును, గాన అశ్ను నిమిత్తమనకపోయినను దోషములేదు. కాని స్థానివద్భావముచే విసర్గము రుత్వమగుటవలన యత్వము ప్రసక్తమగును. ఇచట స్థానివద్భావముచే నతిదేశింపనిష్టమగు ధర్మము రుత్వము. ఇది రేఫోకారసముదాయమందుండునదగుటచేనల్మాత్రమందుండునది గానందున

నిచట "అనల్విధౌ" అను నిషేధమును శఙ్కింపఁగూడదు. భోస్, భగోస్, అఘోస్, ఇవి సకారాన్తములగు[1] నిపాతములు. వీని సకారమునకు రుత్వము. దీనికి ప్రకృత సూత్రముచే యకారాదేశము ప్రవర్తింప, భోయ్, భగోయ్, అఘోయ్. అని యగును. ఇట్లుండ.

వివ:—(1) ఈ మూఁడిటికి ఆకృతిగణమగు చాదిగణమందు పాఠము నూహింపఁదగును. ఇవి నిపాతములనుటవలన, "విభాషా భవద్భగవదఘవతామోచ్చావస్య" (సంబుద్ధి పరమగునపుడు, భవత్, భగవత్, అఘవత్, శబ్దముల యొక్క తకారమునకు రుత్వము, "అవ" కు ఓకారము నాదేశములగును.) అను వార్తికముచే నిష్పన్నములగు, భో, భగో, అఘో శబ్దములనావశ్యకములు. నిపాతముల నఙ్గీకరింపనిచో, వార్తిక నిష్పన్నమగు "భో" అనునది పుంలిఙ్గమగు భవచ్ఛబ్దమునకు సమ్బోధనైక వచనమగుటచే, భోహరే, అను చోటనే భో శబ్దప్రయోగము సాధువగును, భోవిద్వద్బృన్దా, భోహరిహరౌ, ఇత్యాదులందసాధువు గావలసివచ్చును. నిపాతములైనచో స్త్రీ నపుంసకలిఙ్గములందు, ద్వివచన బహువచనములందును, భోభగో అఘో శబ్దములకు సాధుత్వము సిద్ధమగునని యాశయము. వార్తిక మనావశ్యకమను వృత్తికారుఁడు, హరదత్తుఁడు, మొదలగు పరమప్రాచీనుల యభిప్రాయము ననుసరించి ఇట్లు వ్రాయఁబడెను. కాని స్వమతమున, హేభవన్, అనుదానియొక్క అర్థమందు. హేభోః, అను ప్రయోగము, అత్రభవన్ అనుదానియొక్క అర్థమందు, అత్రభోః, అను ప్రయోగము నిష్టమగుటచే వార్తిక మావశ్యకమే. భోహరిహరౌ మొదలగు ప్రయోగముల సాధుత్వమునకై భోశ్శబ్దము నిపాతముగూడ నంగీకరింపఁబడెను. మూలమున "తేషాం రోర్యత్వే కృతే" అనుదానికి వార్తిక నిష్పన్నముల రుత్వమునకును నిపాతముల రుత్వమునకును యత్వము చేయఁబడఁగాదని యర్థము.

* 169. వ్యోర్లఘుప్రయత్నతరశ్శాకటాయనస్య. 8–3–18.
వ్యోః, లఘుప్రయత్నతరః, శాకటాయనస్య। (అశి)
పదాన్తయో ర్వకారయకారయోర్లఘూచ్చారణౌ వయౌ వాస్తోఽశి పరే। యస్యోచ్చారణే జిహ్వాగ్రోపాగ్రమధ్యమూలానాం శైథిల్యం జాయతే స లఘూచ్చారణః।

169. పదాన్తములగు (భో, భగో, అఘో అవర్ణములకు పరములయిన) వకారయకారములకు, అశ్ ప్రత్యాహారవర్ణము పరమగునపుడు క్రమముగ లఘు వకార లఘు యకారములు, శాకటాయన మతమందాదేశములగును. లఘువులన లఘూచ్చారణములు. ఏ వర్ణముయొక్క యుచ్చారణమందు జిహ్వా (నాలుక) యొక్క మూలము, మధ్యము, అగ్రము, ఉపాగ్రము, (చివరకు సమీపపు భాగము) వీనికి కంపముగల్గునో యది లఘూచ్చారణమగును.

వివ:—సూత్రమున కుదాహరణములు:—భోయత్ర - (భోయ్ + అత్ర) భగోయత్ర. అఘోయత్ర. కయాస్తే. (కయ్ + ఆస్తే) అసావాదిత్యః. అన్యమతమందు వీనిలోని యకారవకారములు, అలఘూచ్చారణములు. ఓకారముకంటె పరమగు అలఘుయకారము, "ఓతోగార్గ్యస్య" (170) సూ. చే, నిత్యముగ లోపించును. భోఅత్ర. అవర్ణముకంటె పరములగు అలఘు వకారయకారములు "లోపశ్శాకల్యస్య" (68) సూ. చే, వికల్పముగ లోపించును. కఆస్తే. కయాస్తే. అసాఆదిత్యః. అసావాదిత్యః।

* 170. ఓతో గార్గ్యస్య. 8-3-20. ఓతః, గార్గ్యస్య, (యస్య, లోపః)

ఓకారాత్పరస్య పదాన్తస్యాలఘుప్రయత్నస్య యకారస్య నిత్యం లోపస్స్యాత్। గార్గ్యగ్రహణం పూజార్థమ్। భోఅచ్యుత। లఘుప్రయత్నపక్షే భోయచ్యుత। పదాన్తస్య కిమ్। తోయమ్॥

170. ఓకారముకంటె పరమగు అలఘు[1] యకారము నిత్యముగ లోపించును. ఇచట గార్గ్యగ్రహణము "లోపశ్శాకల్యస్య" సూత్రమున శాకల్యగ్రహణమువలె వికల్పబోధనార్థముగాక పూజార్థమగును. ఇందు వ్యాఖ్యానమే మానము. ఉదా:—భోఅచ్యుత. యకారము లఘువైనపుడు, భోయచ్యుత. తోయమ్. పదమధ్యస్థమగు నిచటి యకారమునకు లోపవారణమునకై యకారమునకు "పదాన్తస్య" అను విశేషణ మావశ్యకము.

వివ:—1 లఘు యకారమునకు నిత్యముగ లోపము విధింపబడినచో ఓకారముకంటె పరమగు యకారమునకు లఘు యకారవిధానము వ్యర్థమగుట చేతను, ఓకారముకంటె పరమగు యకారమువంటి పదాన్త వకారమునకు సంభవము లేకపోవుటచేత నిట్లు చెప్పబడెను.

* 171. ఉఞి చ పదే. 8-3-21. ఉఞి, చ, పదే. (యవయోః, లోపః)

అవర్ణపూర్వయోః పదాన్తయోర్యవయోః లోప ఉఞి పదే। స ఉ ఏకాగ్నిః। పదే కిమ్। తన్త్రయుతమ్। వేఞస్సంప్రసారణే రూపమ్। యది తు ప్రతిపదోక్తో నిపాత ఉఞితి గ్రహీష్యతే తర్హ్యుత్తరార్థం పదగ్రహణమ్॥

171. అవర్ణము పూర్వమందుగల్గి పదాన్తములగు[1] యకారవకారములకు, పదసంజ్ఞకమగు, ఉ (ఞ్) పరమగునపుడు[2] లోపమగును. స ఉ ఏకాగ్నిః. (సయ్ + ఉ) తన్త్రయుతమ్ (తన్త్రియ్ + ఉతమ్) ఉతమనుచోట, ఉ

అనునది, వేఞ్ (తన్తుసన్తానే) ధాతువునకు సంప్రసారణమువలన సిద్ధమగుటచే పదముగానందున నివి పరమగునపుడు యలోపమును వారించుటకై, ఊఞ్ అనునది పదముగావలయు ననవలయును. నిపాతమగు, ఉ (ఞ్) అనునది ప్రతిపదోక్తము. (స్వరూప నిష్పత్తిలో శాస్త్రాన్తరముల యపేక్షలేనిది) వేఞ్ ధాతువువలన సిద్ధమైన ఉ (తమ్) అనునది లాక్షణికము (స్వరూప నిష్పత్తిలో సంప్రసారణాది శాస్త్రముల యపేక్షగలది.) ప॥ లక్షణ ప్రతిపదోక్తయోః ప్రతిపదోక్తస్యైవగ్రహణమ్," ప్రతిపదోక్తలాక్షణికములు సంభవించునపుడు ప్రతిపదోక్తమునకే (గ్రహణము గలుగును) అను పరిభాషచే నీ సూత్రమున నిపాతమే గ్రహింపబడుననిన "తన్త్రియుతమ" నుచోట యలోపము ప్రసక్తముగానందున నీ సూత్రములోని పదగ్రహణ ముత్తరసూత్రమందు (ఙమోహ్రస్వాదచి) అను వృత్తికొఱకే యగును.

వివ :_1. భో భగో అఘో పూర్వకమగు యకారమునకు పూర్వసూత్రముచే లోపము వచ్చునుగాన నిట్లు చెప్పబడెను.

2. ఈ లోపవిధానముగూడ నిత్యమగుటచే లఘు యకారవకారములకు లోపమనుటకు వీలులేదు. కావున అలఘువులకే లోపమని యూహింపదగును. వకారము లోపోదాహరణము. అసాఉవీకాగ్నిః.

* 172. హలి సర్వేషామ్. 8_3_22. హలి, సర్వేషామ్।
(భో...స్య, యస్య, లోపః)
భోభగోఅఘో అపూర్వస్య లఘ్వలఘూచ్చారణస్య యకారస్య లోపస్స్యాద్ధలి సర్వేషాం మతేన। భో దేవాః। భో లక్ష్మి। భో విద్వద్బృన్ద। భగో నమస్తే। అఘో యాహి। దేవా నమ్యాః। దేవా యాన్తి। హలి కిమ్। దేవాయిహ॥

172. భో, భగో, అఘో, అకారము, ఇవి పూర్వమందుగల్గి పదాన్తములగు లఘుయకారాలఘు యకారములు హల్లు పరమగునపుడు వైయాకరణులందరి మతమున లోపించును. 2 భో దేవాః. భో లక్ష్మి. భో విద్వద్బృన్ద. భగో నమస్తే. అఘో యాహి. 3 దేవా నమ్యాః. దేవా యాన్తి. దేవా యిహ. (దేవాయ్ + ఇహ) ఇచట యలోపమును వారించుటకై హల్లు లోపనిమిత్తమనవలయును.

వివ :_1. ఇట్లు చెప్పుటచే శాకటాయనుని మతమందును యకారమునకు లోపమే వచ్చునుగాన యకార సామాన్యమునకు లోపము సిద్ధమగును.

2. "భోభగో" అను సూత్రమున "భో" అనునది పూర్వప్రదర్శిత వార్తిక నిష్పన్నమనినచో నది పుంలిఙ్గమున సంబుద్ధి పరమగునపుడే ("భోదేవః" అనునట్టిదే) సాధువగునుగాని యద్దానికి బహువచనము, స్త్రీ నపుంసక లింగ

ములు, వీనితో ప్రయోగ మసాధువుగావలయును. భో దేవాః, భో లక్ష్మి, మొదలగు ప్రయోగను లిష్టములుగాన భో, అనునది నిపాతమునుగూడ నంగీకరింపవలయునని సూచించుటకై భో పూర్వమగు యకారమునకు లోపోదాహరణములు మూడు చూపబడెనని గ్రహించునది.

3. దేవా నమ్యాః. ఇచట "లోపో వ్యోర్వలి," (878) సూత్రముచే, లోపము చేయునపుడు యకారమసిద్ధమగుటచేతను, దేవా యాన్తి అనుచోట, వల్లు పరముగానందువలనను, ఇట్టి స్థలములందు "లోపోవ్యోర్వలి" సూత్రముచే యలోపము సిద్ధముగానందున, వీనిలో యలోపముకొఱకై యీ సూత్రముచే అకారపూర్వక యకారమునకు లోపవిధాన మావశ్యకమనుటకే యుదాహరణ ద్వయము చూపబడెను.

* 173. రోఽసుపి. 8-2-69. రః, అసుపి (అహ్నః)

అహ్నో రేఫాదేశస్స్యాన్నతు సుపి। రోరపవాదః। అహరహః। అహర్గణః। అసుపి కిమ్। అహోభ్యామ్। అత్రాహన్నితి రుత్వమ్, వా॥ రూపరాత్రిరథంతరేషు రుత్వం వాచ్యమ్। అహోరూపమ్। గతమహోరాత్రిరేషా। ఏకదేశ వికృతస్యా నన్యత్వాదహోరాత్రః। అహోరథన్తరమ్। వా॥ అహరాదీనాం పత్యాదిషు వా రేఫః। విసర్గాపవాదః। అహర్పతిః। గీర్పతిః। ధూర్పతిః। పక్షే విసర్గోపధ్మానీయౌ॥

173. అహన్ శబ్దముయొక్క నకారమునకు రేఫాదేశమగును. సుప్ ప్రత్యయము పరమగునపుడు రాదు. ఈ రేఫాదేశము "అహన్" (446) సూ. చే, విహితమగు రుత్వమున కపవాదము. ఉదా॥ అహరహః (ప్రతి దివసమందు) అహన్ శబ్దమునకు వీప్సారూపార్థమందు ద్విత్వము (అహన్ అహన్) రెండిటియొక్క నకారమునకు రేఫాదేశము. అహర్గణః. (అహన్ + గణః) దివసముల సమూహము. సుప్పు పరమగునపుడు రాదనుటచే అహోభ్యామ్ (అహన్ + భ్యామ్) ఇత్యాదులందు రేఫాదేశమురాక "అహన్" సూ. చే, రుత్వము ప్రవర్తించును. వా॥ రూప, రాత్రి, రథన్తర శబ్దములు పరమగునపుడహన్ శబ్దమునకు (నకారమునకు) రుత్వము (రు) చెప్పవలయును. ఇది రేఫాదేశాపవాదము. అహోరూపమ్. (అహన్ + రూపమ్) పగటియొక్క స్వరూపము, రుత్వము ప్రవర్తించినపిదప నుత్వగుణములు ప్రవర్తించును. గత మహోరాత్రిరేషా. (పగలు గతించెను, ఇది రాత్రి) సమాసమున నహన్ శబ్దమునకు రాత్రిశబ్దము పరముగనుండుట యసంభవమగుటచే వాక్యము నుదాహరించెను. అహోరాత్రః. (అహశ్చరాత్రిశ్చ = రాత్రింబవళ్లు) అహన్‌శబ్ద రాత్రిశబ్దములకు ద్వన్ద్వము. దీనికంటె సమాసాన్తమగు అకారప్రత్యయమురాగా రాత్రి శబ్దములోని ఇకారము లోపించును. ఇచట రాత్రిశబ్దము పరముగ లేనందున రుత్వమప్రాప్తమగుచున్నను (ప) "ఏకదేశవికృత మనన్యవత్" పరిభాషచే

ప్రవర్తించును. పరిభాషార్థము :—ఏదేని యొక వస్తువు స్వల్పభాగముచే వికారముగలదయ్యెను, నది యావస్తువేయగును గాని యన్యము గాదు. శునకము తోకదెగినదైనను శునకము గనే లోకమున వ్యవహరింపబడును. ఈ లోకన్యాయముచే సిద్ధమైనదే పై పరిభాష. దీనివలన రాత్రిశబ్దమున నికారము లోపించినను రాత్రిశబ్దమే యగును గాన రుత్వము ప్రవర్తించును. అహో రథన్తరమ్. (అహశ్చ రథన్తరంచ) పగలు, రథన్తరమనుసామయును, అని యర్థము. వా॥ 1. అహరాదులకు పత్యాదులు పరమగునపుడు రేఫాదేశము వికల్పముగ నగును. వార్తికమున నహరాదులకనుటచే, కృతరేఫములయినవాని కనునర్థము లభించును. విసర్గమున కపవాదముగ రేఫమునకు రేఫాదేశము విధింపబడుటచే రేఫమునకు రేఫవిధానము వ్యర్థమనదగదు. ఉదా॥ అహర్పతిః. గీర్పతిః. ధూర్పతిః. పక్షమందు "కుప్వోః (143) సూ. చే, విసర్గోపధ్మానీయములగును. అహఃపతిః ఇత్యాదులగును.

విశ :—(1) వార్తికమందలి యాదిశబ్దములు రెండును సాదృశ్యార్థకములు. అహన్ శబ్దసదృశములకు పతిశబ్దసదృశములు పరమగునపుడు రేఫాదేశమని ఫలితమగును. కాన స్వర్చక్షుః. స్వర్చనాః. ఇట్టి చోటులందును రేఫాదేశము సిద్ధమగును.

* 174. రోరి 8-3-14. రః, రి. (లోపః)

రేఫస్య రేఫే పరే లోపః స్యాత్.

174. రేఫమునకు రేఫము పరమగునపుడు లోపమగును.

* 175. ఢ్రలోపే పూర్వస్య దీర్ఘోఽణః. 6-3-111. ఢ్రలోపే, పూర్వస్య, దీర్ఘః, అణః.

ఢరేఫౌ లోపయతీతి ఢ్రః। తస్మిన్వర్ణేఽర్థాత్ ఢకారరేఫాత్మకే పరే పూర్వస్యాణో దీర్ఘః స్యాత్। పునా రమతే। హరీ రమ్యః। శమ్భూ రాజతే। అణః కిమ్। తృఢః, వృఢః। తృహూ హింసాయామ్। వృహూ ఉద్యమనే। పూర్వగ్రహణమనుత్తరపదేఽపి పూర్వమాత్రస్య దీర్ఘార్థమ్। అజర్ఘాః। లీఢః। మనస్రథ ఇత్యత్ర రుత్వే కృతే, హశి చేత్యుత్వే, రోరీతి లోపే చ ప్రాప్తే॥

175. ఢకారరేఫముల లోపమునకు నిమిత్తములగు వర్ణములనగా ఢకారరేఫములు పరమగునపుడు పూర్వములగు అణ్ణులకు దీర్ఘమగును. పునారమతే, (పునర్ + రమతే) హరీరమ్యః (హరిర్ + రమ్యః) శమ్భూరాజతే (శమ్భుః (ర్) రాజతే) అణ్ణులకు రేఫము పరమగునపుడు క్రమముగ నుదాహరణములు చూపబడెను. వీనిలో "రోరి" సూ. చే, రేఫకు లోపము ప్రవర్తించెను. తృహూ

(హింసాయామ్) ధాతువునకు క్త ప్రత్యయాన్తము తృఢః, అనియు వృహూ (ఉద్యమనే) ధాతువునకు క్త ప్రత్యయాన్తము వృఢః, అనియు నగును. వీనిలో "ఢో ఢే లోపః" (8-3-13) సూ. చే, ఢలోపము వచ్చినది. ఇచట ఋకారమునకు దీర్ఘ వారణమునకై అణ్ణులకే దీర్ఘ మగవలయును. కావుననే "అనశ్చ" (36) పరిభాషవలన నచ్చులకు దీర్ఘ మను నర్థము సిద్ధమగుచుండ, అణ్ గ్రహణ మేలయని శంకింపగూడదు. ఈ సూత్రము తరిగనాధికారములోనిదగుటచేను త్తరపదస్థములగు ఢకార రేఫములు పరమగునప్పుడే పూర్వపదములోని అణ్ణునకు దీర్ఘ మనునర్థము లభించును. పునారమతే ఇత్యాదులందే ప్రవర్తించునుగాని అజర్ఘాః. లీఢః. ఇత్యాదులందు ప్రవర్తింపకపోవును. అజర్ఘాః అనునది గృధ ధాతువునకు యఙ్ లుగన్తమున లఙ్ మధ్యమైకవచనము. లీఢః అనునది లిహ ధాతువునకు క్త ప్రత్యయాన్తము. వీనిలో దీర్ఘము ప్రవర్తింపవలయును. ఇట్టి చోట్ల ఢకార రేఫములను లోపింపజేయు ఢకార రేఫము లాదియందుగల యుత్తర పదము పరముగ లేనందున దీర్ఘము ప్రవర్తింపకపోవును. వీనిలోగూడ దీర్ఘ సిద్ధి కొఱకు సూత్రమున పూర్వగ్రహణ మావశ్యకము. పూర్వగ్రహణమున్నచో ఢకార రేఫముల లోపమందు నిమిత్తములగు ఢకార రేఫములకు పూర్వమందున్న అణ్ణునకు దీర్ఘ మను నర్థము సిద్ధమగును. తత్సామర్థ్యమున ను త్తరపదమున కాక్షేపము గలుగిదని యాశయము. కావున "తస్మిన్నితి" పరిభాషవలననే "పూర్వస్య" అనునది లభించునుగాన నిది యేలయని ప్రశ్నింపగూడదు. మనస్ + రథః అనుచోట రుత్వము ప్రవర్తించిన మనర్ + రథః అని యగును. ఇట్లుండ "హశిచ" (167) సూ. చే, ఉత్వము, "రోరి" (174) సూ. చే, లోపమును ప్రాప్తములగుచున్నవి.

* 176. విప్రతిషేధే పరం కార్యమ్. 1-4-2. విప్రతిషేధే, పరమ్, కార్యమ్ ।

తుల్యబలవిరోధే పరం కార్యం స్యాత్ । ఇతి లోపే ప్రాప్తే । పూర్వత్రాసిద్ధమితి రోరిత్యస్యాసిద్ధత్వాదుత్వమేవ । మనోరథః ।

176. సమానబలముగల రెండుకార్యములకొక లక్ష్యమందు ప్రవర్తించుటలో, 1 విరోధము గల్గినపుడు పరశాస్త్రవిహితమగు కార్యమే ప్రవర్తించును. ఈ సూత్రముచే మనర్ + రథః అనుచోట పరమగు 'రోరి" (174) సూత్ర విహితమగు లోపము ప్రాప్తమగుచుండ "పూర్వత్రాసిద్ధమ్" సూ. చే, సాపాదికమగు నుత్వశాస్త్రమును గుఱించి త్రిపాదిస్థమగు లోపశాస్త్ర మసిద్ధమగుట వలన నీ రెండును తుల్యబలకములుకావు గాన (సిద్ధశాస్త్రము ప్రబలము అసిద్ధ శాస్త్ర మల్పబలము) నీ సూత్రమునకు ప్రవృత్తిలేనందున నిశ్శఙ్కముగ నుత్వమే ప్రవర్తించును. మనోరథః అనురూపము సిద్ధించును.

వివ:—(1) విప్రతిషేధశబ్దమునకు పరస్పరవిరోధమని యర్థము. ఆ విరోధము, సమానబలముగలవియనగా, వేరువేరు ప్రయోగములందు చరితార్థములగు రెండు శాస్త్రములకొక ప్రయోగము నన్నేకకాలమందు సంభవముకానట్టి స్వకార్యసమర్పణము. తెలుచుగా నొకదానికి కార్యద్వయ సమ్బన్ధమువలన గల్గెడి యసంభవమందే ఈ సూత్రము ప్రవర్తించును. ఎట్లన "వృక్షాభ్యాం" మను చోట చరితార్థమైన "సుపిచ" (203) సూత్ర విహితమగు దీర్ఘమునకు వృక్షేషు, అనుచోట చరితార్థమైన "బహువచనే ఝల్యేత్" (206) సూ. చే, విధింపబడు నేత్వమునకును, వృక్షేభ్యః (వృక్ష + భ్యస్) అనుచోట అకారమందు సంభవము కలుగదుగాన నిచట పరశాస్త్రవిహితమగు నేత్వమే ప్రవర్తించును. ఇచట దీర్ఘైత్వము లొకమారు ప్రవర్తించినచో, తమతమ నిమిత్తములతో నానత్వర్య మసంభవమగునని గ్రహించునది. సమాన బలకములగువానికి పరస్పర విరోధమే విప్రతిషేధమనుటచే, న్యూనాధికబలముగల నుత్సర్గాపవాద శాస్త్రములందు, నిత్యానిత్య శాస్త్రములందు, అన్తరఙ్గ బహిరఙ్గ శాస్త్రములందు నీ సూత్రము ప్రవర్తింపదు.

* 177. ఏతత్తదోస్సులోపోఽకోరనఞ్సమాసేహలి. 6-1-132.

ఏతత్తదోః, సు, లోపః, అకోః, అనఞ్సమాసే, హలి.

అకకారయోరేతత్తదోర్యస్సుః తస్య లోపస్స్యాద్ధలి, నతు నఞ్సమాసే। ఏష విష్ణుః। సశమ్భుః। అకోః కిమ్। ఏషకోరుద్రః। అనఞ్సమాసే కిమ్, అసః శివః। హలి కిమ్। ఏషోఽత్ర॥

177. సూత్రమున, సు అనునది లుప్తషష్ఠ్యన్తము. అకచ్ ప్రత్యయ రహితములగు, ఏతచ్ఛబ్దతచ్ఛబ్దముల కవ్యవహితపరమగు సుప్రత్యయమునకు (ప్రథమైకవచనము) హల్లు పరమగునపుడు లోపమగును, నఞ్ సమాసమందీలోపము రాదు. ఏషవిష్ణుః. (ఏషస్ + విష్ణుః) సశమ్భుః (సస్ + శమ్భుః) ఏతచ్ఛబ్దతచ్ఛబ్దములు కకార సహితములైనచో అనగా, అకచ్ ప్రత్యయముతో గూడిన, నవి యన్యములే యగునుగాన వానికంటె పరమగునపుడు లోపప్రసక్తి లేనందున, అకోః, అను విశేషణమున కేమిఫలమను ప్రశ్నకు సమాధానమిది. అకోః అనునది, తన్మధ్యపతితస్తద్గ్రహణేన గృహ్యతే, అను పరిభాషలో జ్ఞాపకమగును. పరిభాషార్థము:—ఒక వస్తువుయొక్క మధ్యభాగమున ప్రవేశింపబడునది యావస్తువుగనే గ్రహింపబడును. గఙ్గానదిలో ప్రవిష్టమగు యమునకు గఙ్గయను వ్యవహారమే గల్గునను లోకన్యాయసిద్ధమగు నర్థము నీ శాస్త్రమందు గ్రహించుటలో, అకోః, అనునదే ప్రమాణమగును. ఈ పరిభాషచే నకచ్ ప్రత్యయము (అక్) మధ్యనుగల, ఏషకః అనునదియు నేతచ్ఛబ్దమే యగుటచే నిచట ప్రసక్తమగు లోపమును వారించుటకు, అకోః అనునది యావశ్యకమని. అసః శివః (నసః = అసః) ఇది నఞ్ తత్పురుషము. ఇచట

సులోపవారణమునకై "అనఞ్ సమాసే" అనునది యుండవలెను. ఏషోఽత్ర (ఏషస్ + అత్ర) ఇచట లోపనివృత్తికై హల్లు పరమగుచోటనే లోపమన వలయును.

* 178. సోఽచి లోపే చేత్పాదపూరణమ్. 6-1-134. సస్, అచి, లోపే, చేత్, పాదపూరణమ్.

సస్, ఇత్యేతస్య సోర్లోపస్స్యాదచి పాదశ్చే ల్లోపే సత్యేవ పూర్యేత । సేమామవిడ్ఢిప్రభృతిం య ఈశిషే । ఇహ ఋక్పాద ఏవ గృహ్యత ఇతి వామనః । అవిశేషాచ్ఛ్లోకపాదోఽపీత్యపరే । సైష దాశరథీ రామః । లోపే చేదితి కిమ్ । స ఇత్ క్షేతి । స ఏవము క్త్వా । సత్యేవేత్యవధారణన్తు "స్యశ్ఛన్దసిబహుళ" మితిసూత్రాద్బహులగ్రహణానువృత్త్యా లభ్యతే । తేనేహ న । సోఽహమాజన్మ శుద్ధానామ్ ।

178. సూత్రమున సస్ అనునది తచ్ఛబ్దముయొక్క ప్రథమైకవచనాన్తము (సః) నకనుకరణము. లుప్తషష్ఠీకము. సస్ అనుచోటనుండు సు ప్రత్యయమున కచ్చు పరమగునపుడు లోపమగును, లోపముచేతనే పాదము (ఋక్పాదము, శ్లోకపాదము) పూర్తిచెందునో యచ్చోటనే యీ లోపము వచ్చును. సేమామవిడ్ఢి ప్రభృతింయ ఈశిషే. (సస్ + ఇమాం) వేదవాక్యము. ఇది పండ్రెండక్షరములు పాదమందుగల జగతీచ్ఛన్దస్సు. ఇచట సులోపము ప్రవర్తించుటవలననే పాద పూర్తియగుటచే నిది యుదాహరణమగును. సులోపము ప్రవర్తింపనిచో గుణము ప్రవర్తింపకుండును. ఇందుచే నొక యక్షర మధికమగునని యూహించునది. ఈ సూత్రములోనికి "ఛన్దసి" అనుపద మనువర్తించుటచే నిచటి పాదశబ్దముచే ఋక్కు (వేదము) లోని పాదమునే (ఏకదేశము) గ్రహింపవలయునని వామనుడు (కాశికావృత్తిరచయిత) చెప్పెను. ఛన్దోగ్రహణానువృత్తిలో సరియగు ప్రమాణము లేనందున శ్లోకపాదమునకును గ్రహణము చేయదగునని కొందఱనిరి. కావున, శ్లో॥ సైష దాశరథీరామో సైష భీమో మహాబలః. సైష కర్ణో మహాత్యాగీ సైష రాజా యుధిష్ఠిరః. ఇట్టి శ్లోకపాదములు నుదాహరణములగును. సఇత్ క్షేతి. (వేదము) సఏవముక్త్వా విరరామరామః. (శ్లోకపాదము) వీనిలో లోపము ప్రవర్తించినయెడల పాద పూర్తిగాదుగాన నిచట లోపమును వారించుటకై లోపముచేత పాద పూర్తియైనచోటనే లోపమనవలయును. మూలములోని లోపేసత్యేవ, (లోపము ప్రవర్తించినపుడే) అనుచోట పెద్దలచే వ్యాఖ్యాతమగు నవధారణము (నియమము) "స్యశ్ఛన్దసి బహుళ" మను పూర్వసూత్రమునుండి బహుళపదానువృత్తివలన లబ్ధమగును. ఇట్టి వ్యాఖ్యానమువలన లోపము ప్రవర్తించినను లేకున్నను పాదపూర్తియగు, "సోఽహమాజన్మ శుద్ధానామ్", మొదలగు చోటులం దీసూత్రము ప్రవర్తింపదు.

వివ :—(1) బహులపదము, బహూనర్థాన్ లాతి = గృహ్ణాతి అను వ్యుత్పత్తివలన ననేకార్థములకు సంగ్రాహకమగును. ఇట్టి బహుళగ్రహణాను వృత్తివలన లోపము ప్రవర్తింపకపోయినను, పాదపూర్తియగు, "సాస్మా అరమ్" (సః + అస్మై) ఇత్యాదులందు లోపము ప్రవర్తించును. అనగా ప్రవర్తింపవలసిన స్థలములందు ప్రవర్తింపకపోవుటయు, ప్రవర్తింప వీలుపడని స్థలములందు ప్రవర్తించుటయు, మొదలగు లాభములు బహుళగ్రహణమువలన సిద్ధములగును. ఇందువలననే "సోహమాజన్మ శుద్ధానామ్" ఇత్యాదులలో లోపము ప్రవర్తింపదనియును జెప్పవచ్చునుగాన నిందులకై యవధారణపరముగ వ్యాఖ్యానముచేయుట నిష్ప్రయోజనము. ఈ విషయము, మూలమున "అవధారణంతు" అనుచోటనుండు తు శబ్దముచే, సూచితమగునని ప్రాజ్ఞులూహింపదగును.

స్వాదిసన్ధి ప్రకరణము సమాప్తము.

శ్రీః శ్రీః శ్రీః

---

# 7. అజన్త పుంలిఙ్గ ప్రకరణము

* 179. అర్థవదధాతురప్రత్యయః ప్రాతిపదికమ్. 1-2-45.
అర్థవత్, అధాతుః, అప్రత్యయః, ప్రాతిపదికమ్.
(శబ్దస్వరూపమ్.)

ధాతుం ప్రత్యయం ప్రత్యయాన్తం చ వర్జయిత్వా ఽర్థవచ్ఛబ్దస్వరూపం ప్రాతిపదిక సంజ్ఞం స్యాత్ ॥

179. సూత్రమందలి ప్రత్యయపదమునావృత్తిచేసి యందొకదానికి "ప్రత్యయగ్రహణ" పరిభాషచే ప్రత్యయాన్తమని యర్థము చెప్పవలయును. 1 ధాతువు, 2 ప్రత్యయము, 3 ప్రత్యయాంతము వీనిని విడిచి యేదేని యొక 4 ప్రశస్తార్థమును బోధించు శబ్దము ప్రాతిపదికమనబడును.

వివ :—(1) అహన్ (హన్ ధాతువునకు లఙ్ ప్రథమ పురుషైకవచనము) ఇచట ప్రాతిపదిక సంజ్ఞానిషేధమునకు ధాతుపర్యుదాస మావశ్యకము. లేనిచో నిచట ప్రాతిపదికసంజ్ఞ ప్రసక్తమగును. అట్లైన నలోపః ప్రాతిపదికాన్తస్య (237) సూత్రముచే నలోపము ప్రసక్తమగును.

(2) ప్రత్యయపర్యుదాసము లేనిచో హరిషు, ఇత్యాదులలో సుప్ప్రత్యయమునకుగూడ ప్రాతిపదికసంజ్ఞ ప్రసక్తమగును. ప్రాతిపదికసంజ్ఞ వచ్చినయెడల తత్సామర్థ్యముచే నౌత్సర్గికైకవచనము ప్రసక్తమగును. అపుడు

సుప్ప్రత్యయాది సకారము పదాదియగుటచే “సాత్పదాద్యోః. (8-3-111) సూత్రముచే షత్వనిషేధము ప్రసక్తమగును.

(3) ప్రత్యయాన్తపర్యుదాసము లేనియెడల హరిషు, మొదలగు స్థలములందు సముదాయమునకు ప్రాతిపదికసంజ్ఞ వచ్చును. అట్లయిన ఔత్సర్గికైకవచనముకూడ వచ్చును. అపుడు “సుపోధాతు ప్రాతిపదికయోః” (2-4-71) సూత్రముచే సుప్పులకు లుక్కు ప్రసక్తమగును.

(4) అర్థవత్ అను పదము లోకమున ప్రశస్తమైన యర్థమును బోధించు శబ్దమునకు గ్రాహకమగును. ఈ విశేషణము లేనియెడల ధనవనాది శబ్దములలోని యనర్థకములగు ప్రతివర్ణమునకును ప్రాతిపదికసంజ్ఞ ప్రసక్తమగును. అపుడౌత్సర్గికైక వచనము వచ్చినచో నలోపాదులు ప్రవర్తించెడివి. అవ్యుత్పత్తి పక్షమునందు, రామశబ్దమున కీ సూత్రముచేతనే ప్రాతిపదికసంజ్ఞ సిద్ధమగును.

* 180. కృత్తద్ధితసమాసాశ్చ. 1-2-46. కృత్తద్ధితసమాసాః, చ. (అర్థవత్, ప్రాతిపదికమ్)

కృత్తద్ధితాన్తౌ సమాసాశ్చ ప్రాతిపదిక సంజ్ఞాః స్యుః। పూర్వసూత్రేణైవ సిద్ధే సమాసగ్రహణం నియమార్థమ్। యత్ర సంఘాతే పూర్వో భాగః పదం తస్య చేద్భవతి తర్హి సమాసస్యైవ, తేన వాక్యస్య న॥

180. కృత్తద్ధితపదములు ప్రత్యయగ్రహణ పరిభాషచే తదన్త బోధకములు. కృత్ప్రత్యయాంతము, తద్ధితప్రత్యయాంతము, సమాసము, ఇవి ప్రాతిపదిక సంజ్ఞకములగును. “రాజపురుషః” ఇత్యాదులు సమాసములు. శాస్త్రీయ కార్యములు ప్రవర్తించుటకై శాస్త్రకారులచే కల్పింపబడువాక్య మలౌకిక విగ్రహ వాక్యము. రాజపురుషః అనుదాని కలౌకికవిగ్రహవాక్యము “రాజస్ + ఙస్, పురుష + సు” అనునది. ఇట్టి వాక్యముననే సమాససంజ్ఞ మొదలగు కార్యములు ప్రవర్తించును. ఇట్టి సమాసము ధాతుభిన్నము, ప్రత్యయభిన్నము, ప్రత్యయాంతభిన్నము నగుటచే పూర్వసూత్రముచేతనే ప్రాతిపదికసంజ్ఞ సిద్ధించుచున్నది. సుప్రత్యయము చివరనుండుటచే ప్రత్యయాన్తమని భ్రమపడరాదు. “పత్యయగ్రహణ పరిభాషచే పురుషః.” అనునదే ప్రత్యయాన్తమగును గాని “రాజపురుషః” అను సముదాయము ప్రత్యయాన్తముగాదు. కాన సమాసమునకు పూర్వసూత్రముచేతనే ప్రాతిపదికసంజ్ఞ సిద్ధమగుచుండ నీ సూత్రమున సమాస గ్రహణము నియమార్థమగును. శాస్త్రమున నెక్కడనైన నొక సూత్రముచే నేదేనియొక కార్యము సిద్ధించుచుండ తిరుగ మరియొక సూత్రముచే నాకార్యము విధింపబడినయెడల నా రెండవసూత్రము నియమమునకొఱకగును. దీనినే శాస్త్రజ్ఞులు “సిద్ధే సత్యారభ్యమాణో విధిర్నియమాయ భవతి” అను వాక్యముచే వ్యవహరింతురు. నియమస్వరూపము :—ఏ శబ్దసంఘాతమున పూర్వభాగము

పదమగునో యట్టి సంఘాతమునకు ప్రాతిపదికసంజ్ఞ వచ్చినచో సమాసమునకే వచ్చును. సమాసమున నెల్లపుడు పూర్వభాగము పదమగుటచే సాజాత్యము ననుసరించి ఈరీతి నియమము చెప్పబడెను. నియమము నఙ్గీకరించుటచే, రాజ్ఞః పురుషః మొదలగు వాక్యములకర్థవత్సూత్రముచే ప్రాప్తమగు ప్రాతిపదికసంజ్ఞ నివృత్తమగును. ఇదియే నియమఫలము.

వివ:—ఈ సూత్రములోని కర్థవద్గ్రహణానువృత్తి చేయుటవలన శాస్త్రీయార్థ ప్రతిపాదకములగు కేవల కృత్ప్రత్యయములకుగాని కేవల తద్ధిత ప్రత్యయములకుగాని లోకమున ప్రయోగార్హమగు నర్థములేనందున తదంతములను గ్రహింపవలయును. పాచకః. (కృదన్తము) దాశరథిః. (తద్ధితాన్తము) పీతాంబరః. (సమాసము) అనునవి వరుసగ నుదాహరణములు.

* 181. ప్రత్యయః 3-1-1.

ఆపఞ్చమపరిసమాప్తే రధికారోఽయమ్.

181. ఐదవ యధ్యాయము చివరవఱకీసూత్ర మధికృతమగును.

వివ:—అధికారమగుటచే నుత్తరసూత్రములందు ప్రవర్తించి తత్సూత్ర విహితములకు బ్రత్యయసంజ్ఞను బోధించును. స్వకీయమగు నర్థమును బోధించునది ప్రత్యయమను మహాసంజ్ఞవలన నాగమాదేశాదులకు స్వకీయమగు నర్థము లేమిని వానికి ప్రత్యయసంజ్ఞ ప్రవర్తించదు.

* 182. పరశ్చ 3-1-2 పరః, చ.

అయమపి తథా ॥

182. ఈసూత్రముగూడ నైదవ యధ్యాయము చివరవఱ కధికృతమగును.

వివ:—ప్రత్యయ విధాయకసూత్రములందు షష్ఠ్యంశరహితమగు "తస్మాదిత్యుత్తరస్య" (42) అను పరిభాషాప్రవృత్తిచేతనే ప్రత్యయమునకు ప్రకృతి కంటె పరముగావచ్చుట సిద్ధించుచుండ నీ సూత్ర మెందుకనిన "ఎపుడును ప్రత్యయము ప్రకృతిని, ప్రకృతి ప్రత్యయమును, విడిచియుండదను నియమము కొఱకగును." ఇట్లు చెప్పుటచే "న కేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యా, నాపి కేవలః ప్రత్యయః", అనునర్థము సిద్ధమగును.

* 183. ఙ్యాప్ ప్రాతిపదికాత్. 4-1-1,

ఙ్యన్తాదాబన్తాత్ప్రాతిపదికాచ్చేత్యా పఞ్చమపరిసమాప్తే రధికారః । ప్రాతిపదికగ్రహణే లిఙ్గవిశిష్టస్యాపీత్యేవ సిద్ధే ఙ్యాబ్ గ్రహణం ఙ్యాబన్తాత్తద్ధితోత్పత్తిర్యథాస్యాత్ ఙ్యాబ్భ్యాం ప్రాఙ్మాభూదిత్యేవమర్థమ్ ॥

183. ఙ్యాప్ ప్రాతిపదికాత్, అనునది సమాహారద్వన్ద్వము. (ఙీచ, ఆప్ చ, ప్రాతిపదికంచ.) ఙీ అనునది ఙీప్, ఙీష్, ఙీన్ అను మూడు ప్రత్యయములకు, ఆప్ అనునది టాప్, డాప్, చాప్ అను మూడు ప్రత్యయములకు సామాన్యగ్రహణము. ఇవి ప్రత్యయము లగుటవలన "ప్రత్యయగ్రహణ పరిభాషచే తదన్తవిధి కలుగును. ఙ్యన్తాత్, ఆబన్తాత్, ప్రాతిపదికాత్, అనునవి యైదవ యధ్యాయము చివఱవరకు నధికృతములగును. ప్రాతిపదికమును గ్రహించినపుడు లిఙ్గబోధకములగు ఙీప్, ఙీష్ మొదలగు ప్రత్యయము లంతమందుగల వానికిని గ్రహణము కలుగుననునర్థముగల "ప్రాతిపదికగ్రహణే లిఙ్గవిశిష్టస్యాపి గ్రహణమను" పరిభాషచే 'ప్రాతిపదికాత్' అనుదానిచేతనే ఙ్యాబన్తములకును గ్రహణము సిద్ధించునుగాన వక్ష్యమాణప్రత్యయములకు ఙ్యన్తాబన్త ప్రాతిపదికములు ప్రకృతులగుట సిద్ధమగును. కాన నీ సూత్రములోని ఙ్యాప్ గ్రహణ మనావశ్యక మగుచున్నది. కాని ఙ్యాబ్ గ్రహణ సామర్థ్యమువలన నన్తరఙ్గములు పరములునగు తద్ధితప్రత్యయములు సైతము ఙ్యాబన్తములకంటె పరముగనే రావలయునుగాని ఙ్యాప్పులకు పూర్వము రాగూడదను నర్థమును బోధించుటకై[1] ఙ్యాబ్ గ్రహణమావశ్యకమగును.

వివ:—1. ఇట్లు చెప్పుటవలన లోహినికా, ఆర్యకా మొదలగు రూపములు సిద్ధించును. లేనిచో లోహితశబ్దముకంటె లోహితాన్మణౌ (5-4-30) సూత్రవిహితమగు కన్ ప్రత్యయమన్తరఙ్గ మగుటవలన వర్ణాదనుదాత్తాత్తోపధాత్తోనః (4-1-39) సూత్రవిహితమగు ఙీ ప్రత్యయమునకు పూర్వము ప్రవర్తించెడిని. కన్ప్రియాన్తముకంటె టాబాదులు వచ్చినచో "లోహితికా" అనునొక రూపమే సిద్ధించును. ఙ్యాబన్తముకంటె తద్ధితోత్పత్తియని చెప్పినయెడల లోహితశబ్దముకంటె తద్ధితోత్పత్తికి పూర్వము "వర్ణాదనుదాత్తాదను సూత్రముచే ఙీప్ నకారాదేశములు ప్రవర్తించినతరువాతనే కన్ ప్రత్యయమువచ్చును. లోహినికా" అనియగును. ఙీప్ నకారాదేశములు రానిపక్షమున లోహితికా, అనియగును. ఇట్లే టాబన్తముకంటె తద్ధితోత్పత్తియని చెప్పినచో, ఆర్యకా, ఆర్యికా, అనునిష్టములగు రెండురూపములు సిద్ధించునని యూహించునది.

* 184. స్వౌజసమౌట్ఛష్టాభ్యాంభిస్ఙేభ్యాంభ్యస్ఙసిభ్యాం
భ్యస్ఙసోసాంఙ్యోస్సుప్. 4-1-2.

ఙ్యన్తాదాబన్తాత్ప్రాతిపదికాచ్చ పరే స్వాదయః ప్రత్యయాస్స్యుః । సుజస్యోరుకారేకారా, ఙశటజపాశ్చేతః ।

184. సూత్రమున స్వాదులకు సమాహారద్వంద్వము. (సు, ఔ, జస్ । అమ్, ఔట్, శస్ । టా, భ్యామ్, భిస్ । ఙే, భ్యామ్, భ్యస్ । ఙసి, భ్యామ్, భ్యస్ । ఙస్, ఓస్, ఆమ్ । ఙి, ఓస్, సుప్) ఙ్యన్తము, ఆబన్తము, ప్రాతిపదికము, వీనికంటె పరములై ప్రత్యయసంజ్ఞ కలవగు స్వాదులు వచ్చును.

సుప్రత్యయమున నుకారము జసిలో నికారము స్వాదిప్రత్యయములలోని జ, శ, ట, ఙ, ప, వర్ణములు నిత్సంజ్ఞకములగును.

* 185. విభక్తిశ్చ 1-4-104 విభక్తిః, చ, (సుపః, తిఙః)

సుప్తిఙౌ విభక్తి సంజ్ఞౌ స్తః । తత్ర సు, ఔ, జస్, ఇత్యాదీనాం సప్తానాం త్రికాణాం ప్రథమాదయస్సప్తమ్యన్తాః ప్రాచాం సంజ్ఞాస్తాభిరిహాపి వ్యవహారః ।

185. సుప్ ప్రత్యయములు, తిఙ్ ప్రత్యయములు, విభక్తులనబడును. సుప్ ప్రత్యయములందు, సు, ఔ, జస్ = ప్రథమా, అమ్, ఔట్, శస్ = ద్వితీయా, టా, భ్యామ్, భిస్ = తృతీయా, ఙే, భ్యామ్, భ్యస్ = చతుర్థీ, ఙసి, భ్యామ్, భ్యస్ = పఞ్చమీ, ఙస్, ఓస్, ఆమ్ = షష్ఠీ, ఙి, ఓస్, సుప్ = సప్తమీ, అనురీతిని ప్రాచీన వ్యాకరణములందు వీనికి సంజ్ఞలు చేయబడినవి. ఆ సంజ్ఞలచేతనే ఈ పాణినీయ వ్యాకరణమునందును వ్యవహారమని తెలియునగును.

వివ :— సుప్తిఙులకు విభక్తిసంజ్ఞవలన "న విభక్తౌ తుస్మాః (191) సూత్రముచే వానిలోని తకారాదివర్ణముల కిత్సంజ్ఞానిషేధము సిద్ధమగును.

* 186. సుపః. 1-4-103 (త్రీణిత్రీణి, తాన్యేకవచన ద్వివచన బహువచనాన్యేకశః)

సుపస్త్రీణిత్రీణి వచనాన్యేకవచన ద్వివచన బహువచనసంజ్ఞాని స్యుః.

186. సుపః అనునది సుప్ప్రత్యాహారమునకు షష్ఠ్యన్తము, సుప్పులలో మూడేసి, మూడేసి వచనములనగా సు, ఔ, జస్ ఇత్యాదులు త్రికములనబడును. ప్రతి త్రికమందు మొదటిది ఏకవచనము రెండవది ద్వివచనము మూడవది బహువచనమని యునదగును.

* 187. ద్వ్యేకయోర్ద్వివచనైకవచనే 1-4-22 ద్వ్యేకయోః, ద్వివచనైకవచనే.

ద్విత్వైకత్వయోరేతే స్తః.

187. ద్విత్వసంఖ్య వివక్షింపబడునపుడు ద్వివచనము, ఏకత్వ సంఖ్య వివక్షింపబడునపు డేకవచనము వచ్చును.

* 188. బహుషు బహువచనమ్ 1-4-21 బహుషు, బహువచనమ్.

బహుత్వే ఏతత్స్యాత్ । రుత్వవిసర్గౌ రామాః ॥

188. బహుత్వ సంఖ్య వివక్షించునపుడు బహువచనము వచ్చును. సూత్రమున 'బహుషు' అనునది బహుత్వసంఖ్యను బోధించును. రామశబ్దమునకు "రమన్తే యోగినోఽస్మిన్, అనురీతిని వ్యుత్పత్తిపక్షమునందు కృత్తద్ధిత సమాసాశ్చ (182) సూత్రముచే ప్రాతిపదిక సంజ్ఞ. (రామశబ్దము, గము (క్రీడాయాం) ధాతువుకంటె ఘఞ్ ప్రత్యయముచే సిద్ధమగునుగాన కృదన్తమగును.) రామశబ్దముకంటె ప్రథమైకవచన సంజ్ఞకల సుప్ ప్రత్యయము వచ్చును. రుత్వము (ససజుషోరుః (163) విసర్గము (ఖరవసానయోర్విసర్జనీయః. (77) ప్రవర్తించినచో 'రామః' అను రూపము సిద్ధమగును.

వివ:—బహుత్వమున మూడు మొదలు పరార్ధమువఱకుగల సంఖ్యలందున్న ధర్మ విశేషము. సంఖ్యాశ్రయములందలి నానాత్వమును ధర్మమందారోపముచే సూత్రములోని బహు శబ్దముకంటె బహువచనమయ్యెను.

* 189. సరూపాణామేకశేష ఏకవిభక్తౌ. 1-2-64. సరూపాణామ్, ఏక, శేషః, ఏకవిభక్తౌ. (ఏవ)

ఏకవిభక్తౌ యాని సరూపాణ్యేవ దృష్టాని తేషామేక ఏవ శిష్యతే। ప్రథమయోః పూర్వసవర్ణః, నాదిచి, వృద్ధిరేచి, రామౌ॥

189. ఏ ప్రాతిపదికములు విభక్తులన్నిటిలోను సమానానుపూర్వికలవయే లౌకిక ప్రయోగములందు చూడబడునో వానిలోనొక ప్రాతిపదికమే మిగులును. తక్కినవి లోపించునని ఫలితార్థము. ఇద్దరు రాములను బోధించుటకు రెండు రామశబ్దములను ప్రయోగింపవలయును. ఇది యున్ని విభక్తులలోను సమానానుపూర్వి గలదగుటచే వీనిలో నొకటి శేషించును, మిగిలినది లోపించినవాని యొక్క యర్థమును బోధించును. రామశబ్దముకంటె ద్విత్వబోధ యగునపుడు ద్వివచనము వచ్చును. రామ+ఔ. ప్రథమయోః పూర్వసవర్ణః (165) సూత్రముచే విహితమగు పూర్వసవర్ణ దీర్ఘము, "నాదిచి (166) సూత్రముచే నిషిద్ధమగునుగాన, వృద్ధిరేచి (73) సూత్రముచే వృద్ధి యేకాదేశమగును. రామౌ అని యగును.

వివ:—సరూపాణాం అనుదానికి (సమానం రూపం = ఆనుపూర్వీ యేషాం) సమానమగు నానుపూర్వి గలవానికనియర్థము. ఈ పదము లేనిచో ఘటపటౌ ఇత్యాదులందు నేకశేషము ప్రసక్తమయ్యెడిని. సూత్రమున ఏక అనునది లుప్తషష్ఠ్యన్తము ఒకదానికేయని యర్థము. శేషపదమున కితర నివృత్తిపూర్వకస్యావస్థానము (ఇతరములకు లోపము తనకు స్థితి) అర్థము. ఏకవిభక్తౌ అనుదానికి ఒక విభక్తిలోను విరూపములు కాగూడదని తాత్పర్యము. కావున ధాన్యాదుల గొలచువానిని బోధించు మాతృశబ్దమునకు, జననీవాచకమగు మాతృశబ్దమునకు నేకశేషము బాధితమగును. వీనిలో రెండవవానికి ప్రథమా

ద్వివచనమున మాతారౌ అనియు, రెండవదాని కచటనే మాతరౌ, అనియు నగుటచే నానుపూర్వి సమానముగాదు.

* 190. చుటూ 1-3-7 (ఇత్, ఆదిః, ప్రత్యయస్య)

ప్రత్యయాద్యౌ చుటూ ఇతౌ స్తః ॥

190. ప్రత్యయమున కాద్యవయవములగు చవర్గటవర్గము లిత్సంజ్ఞగల వగును. ఈ సూత్రముచే జస్ ప్రత్యయమున జకారమున కిత్సంజ్ఞయగును.

* 191. న విభక్తౌ తుస్మాః 1-3-4 న, విభక్తౌ, తుస్మాః,

విభక్తిస్థాః తవర్గసకారమకారా ఇతో న స్యుః ।
ఇతి సకారస్యనేత్త్వమ్ ॥

191. తుస్మాః అనునది యితరేతరయోగద్వన్ద్వము. (తుశ్చ సశ్చ మశ్చ) విభక్తియందలి తవర్గసకారమకారము లిత్సంజ్ఞగలవిగావు. ఈ నిషేధముచే జస్సులోని సకారమునకు హలన్త్యమ్ (3) సూత్రముచే ప్రాప్తమగు నిత్సంజ్ఞ వారింపబడును.

వివ:— ఈ సూత్రము హలన్త్యసూత్రమునకు నిషేధము. తవర్గమున కుదాహరణము, రామాత్. సకారమునకు, రామాస్. (రామాః) మకారమునకు, రామమ్.

* 192. అతో గుణే 6-1-97 అతః, గుణే, (అపదాంతాత్, పరరూపమ్)

అపదాన్తాదకారాద్గుణే పరతః పరరూపమేకాదేశస్స్యాత్ । ఇతి ప్రాప్తే । పరత్వాత్పూర్వసవర్ణదీర్ఘః । అతోగుణే ఇతిహి పురస్తాదపవాదా అన్తరాన్విధీన్బాధన్తే నోత్తరానితి న్యాయేన అకఃసవర్ణే దీర్ఘ ఇత్యస్యైవాపవాదః నతు ప్రథమయోరిత్యస్యాపి । రామాః ॥

192. పదాంతముగానట్టి అకారముకంటె, గుణము (అ, ఎ, ఓ) పరమగునపుడు పరరూపమనగా పరస్థానియొక్క రూపమేకాదేశమగును. రామ+అస్ అనుచోట నీ సూత్రముచే పరరూపము ప్రాప్తమగుచుండ, పరమగుటచే దీనిని బాధించి ప్రథమయోః పూర్వసవర్ణః (165) సూత్రముచే పూర్వసవర్ణదీర్ఘము ప్రవర్తించును. "అతోగుణే" అను సూత్రము పురస్తాదపవాదన్యాయముచే నవ్యవహితమగు "అకస్సవర్ణే" (86) సూత్రమునకే యపవాదమగునుగాని వ్యవహితమగు "ప్రథమయోః" సూత్రమున కపవాదముగాదు. రుత్వము, విసర్గము, ప్రవర్తించిన రామాః అని సిద్ధమగును.

* 193. ఏకవచనం, సంబుద్ధిః 2-3-49 ఏకవచనమ్, సంబుద్ధిః,
(సంబోధనే, ప్రథమా)

సంబోధనే ప్రథమాయా ఏకవచనం సంబుద్ధిసంజ్ఞం స్యాత్ ॥

193. సంబోధనమందు విహితమగు ప్రథమావిభక్తియొక్క ఏకవచనము సంబుద్ధిసంజ్ఞ గలదగును.

వివ :—సంబోధనమనగా ననభిముఖుడుగనున్నవాని నభిముఖునిగ జేయుట. ఇది ప్రకృత్యర్థమునకు విశేష్యము, క్రియను గురించి విశేషణమునగును. "హే రామ మాంపాహి, ఇత్యాదులందు రామసంబంధి సంబోధన విషయము మత్కర్తృకరక్షణమని బోధ కలుగును.

* 194. ఏఙ్హ్రస్వాత్సంబుద్ధేః. 6-1-69. ఏఙ్హ్రస్వాత్, సంబుద్ధేః (హల్ లోపః)

ఏఙన్తాద్ధ్రస్వాన్తాచ్చాఙ్గాద్ధల్లుప్యతే; సంబుద్ధిశ్చేత్ । సంబుద్ధ్యాక్షిప్తస్యాఙ్గస్యైఙ్హ్రస్వాభ్యాం విశేషణాన్నేహ। హేకతరత్కులేతి। హేరామ। హే రామౌ। హేరామాః। ఏఙ్గ్రహణం కిమ్? హే హరే, హే విష్ణో । అత్రహి పరత్వాన్నిత్యత్వాచ్చ సంబుద్ధిగుణేకృతే హ్రస్వాత్పరత్వం నాస్తి॥

194. ఏఙన్తముగాని హ్రస్వాన్తముగాని యగు నఙ్గముకంటె పరమగు హల్లు సంబుద్ధ్యవయవమయినచో లోపించును. సంబుద్ధి ప్రత్యయమగుటచే ప్రకృతిని విడిచియుండదుగాన ప్రకృతిని (అఙ్గమును) ఆక్షేపించును. ఆక్షిప్తమగు నఙ్గమునకు ఏఙ్హ్రస్వములను విశేషణముగ జేయుటవలన హేకతరత్, కుల, అనుచోట దోషము వారితమగును. ఏఙ్హ్రస్వముల కఙ్గము విశేష్యమగుటవలన తదన్తవిధి కలుగును. అనువృత్తమగు హల్లున కఙ్గము విశేషణము, సంబుద్ధేః అనునదియును హల్లునకే విశేషణము. మూలమున చెప్పబడినయర్థ మిట్లు లభించెను. 'హేకతరత్, అనునది కతరశబ్దమునకు (నపుంసక లింగము) సంబోధన ప్రథమైకవచనము. కతర + స్, అనియుండ "అడ్డతరాదిభ్యః పఞ్చభ్యః (316) సూత్రముచే సుప్రత్యయమునకు అడ్డాదేశము. ఇది డిత్తగుటవలన "టేః (317) సూ. చే, టిలోపము. కతర్ + అత్ = కతరత్ అని యగును. ఇచట నఙ్గము (కతర్) హ్రస్వాంతము కాదు. హ్రస్వాన్తమయినది (కతర) అఙ్గముకాదు. కాన హల్లు (త్) హ్రస్వాన్తాఙ్గముకంటె పరమయినదిగానందున లోపము ప్రవర్తించదు. ఈ సూత్రమున సంబుద్ధిచే నుపస్థితమగు నఙ్గమునకు సంబుద్ధిలోనికే యన్వయము న్యాయ్యము. అపుడీయర్థము సూత్రమునకు లభించును. "అఙ్గముకంటె పరమగు సంబుద్ధి కవయవమై, ఏఙ్హ్రస్వములకంటె

పరమగు హల్లునకు లోపమగునని.'' అట్లయిన 'హేకతరత్' అనుచోట సంబుద్ధ్యవయవమగు తకారము హ్రస్వముకంటె పరమగుటచే లోపము ప్రసక్తమగును. ఇచటను దోషమును వారించుటకై ఏజన్తముగాని, హ్రస్వాన్తముగాని యగు నఙ్గముకంటె పరమగు సంబుద్ధియొక్క హల్లునకు లోపమగునని యర్థము చెప్పినచో 'హేకుల' అనుచోట మకారమునకు లోపము రాకపోవును. కుల + అమ్, అనియుండగా సంబుద్ధి లోపమునకు పూర్వము, పరమగు పూర్వరూపము ప్రవర్తించుటచే హ్రస్వాన్తాఙ్గముకంటె పరముగ, సంబుద్ధి (అమ్) లేకపోవుట వలన మకారమునకు లోపము సిద్ధించకపోవునని యాశయము. కాన పైనచూపిన అవ్యాప్త్యతివ్యాప్తులను లక్షణదోషములను వారించుటకై పూర్వము ప్రదర్శింపబడిన న్యాయ్యమగు నన్వయమును విడిచి మూలోక్తమగు అర్థము స్వీకరింపబడెను.

ఈ విషయమును సూచించుటకే మూలమున 'కుల' అనునదియు నుదాహరింపబడెను. కావున 'కతరత్' అనుచోట అద్డాదేశమువలననే నపుంసకలిఙ్గమని తెలియుచుండ దానికి నపుంసకత్వమును బోధించుటకై కుల, అను విశేషణము వ్యర్థమగునను వాదము సరిగాదు. "సంబుద్ధ్యాక్షిప్తస్యాఙ్గస్యైఙ్ హ్రస్వాభ్యాం విశేషణాన్నేహ" అను మూలమున కాశయమిట్లు వర్ణింపబడినదని గ్రహించునది.

హేరామ, ఇచట హ్రస్వాన్తాఙ్గముకంటె పరమగు సంబుద్ధ్యవయవమగు హల్లునకీసూత్రముచే లోపము సిద్ధమగును. హేరామౌ, హేరామాః, ఇవి సంబోధన ప్రథమాద్వివచన బహువచనములు.

హేహరే, ఇత్యాదులలో హేహరి + సు, అనుచోట హ్రస్వస్యగుణః (243) సూ. చే, విధింపబడు సంబుద్ధిగుణముకంటె పూర్వమే సంబుద్ధిలోపము ప్రవర్తించినచో ప్రత్యయలక్షణముచే గుణము ప్రవర్తించునుగాన హేహరే, అను నభీష్టరూపము సిద్ధించును. కావున సూత్రమున హ్రస్వగ్రహణమున్న చాలును, ఏఙ్ గ్రహణమనావశ్యకమని మాత్రము తలంపరాదు. హేహరే ఇత్యాదులలో సంబుద్ధిగుణము పరము, లోపముచేసినను చేయకపోయినను ప్రవర్తించునదగుటచే నిత్యమునగును, గావున సంబుద్ధిలోపముకంటె పూర్వము ప్రవర్తించును. కాన సంబుద్ధి, హ్రస్వముకంటె పరమయినదిగానందున లోపము సిద్ధింపకపోవును. కావున నిట్టిచోటులందు లోపసిద్ధికై ఏఙ్ గ్రహణ మావశ్యకమగును.

* 195. అమి పూర్వః 6-1-107. అమి, పూర్వః (అకః, అచి.)
అకోఽమ్యచి పరతః పూర్వరూపమేకాదేశః స్యాత్ ।

195. అక్కులకు అమ్ప్రత్యయముయొక్క అచ్చు పరమగునపుడు పూర్వరూపమేకాదేశమగును. అచి యనుపదము ననువృత్తిచేసి ఇట్లర్థము చెప్పుటచే

మకారసహితమునకు పూర్వరూపము వారిపమగును. రామమ్. (రామ + అమ్) రామౌ. ప్రథమాద్వివచనమునకువలెనే ప్రక్రియ నూహించునది.

* 196. లశక్వతద్ధితే. 1-3-88. లశకు, అతద్ధితే, (ఆదిః, ప్రత్యయస్య, ఇత్)

తద్ధితవర్జప్రత్యయాద్యా లశకవర్గా ఇతః స్యుః ।
ఇతి శసః శస్యేత్సంజ్ఞా ।

196. లశకు అనుచోట లకారశవర్ణకుపదములకు సమాహార ద్వంద్వము. తద్ధితప్రత్యయభిన్నములగు ప్రత్యయముల కాద్యవయవములయిన ల, శ, కవర్గము లిత్సంజ్ఞకములగును. రామ + శస్ అనుచోట నీ సూత్రముచే శస్ ప్రత్యయము లోని శవర్ణమునకిత్సంజ్ఞయగును.

* 197. తస్మాచ్ఛసో నః పుంసి. 6-1-103. తస్మాత్, శసః, నః, పుంసి ।

పూర్వసవర్ణదీర్ఘాత్పరో యః శసః సకారస్త
స్య నః స్యాత్ పుంసి ॥

197. తచ్ఛబ్దముచే (తస్మాత్) సమీపముననున్న పూర్వసవర్ణదీర్ఘము గ్రహింపబడును. శసః అను నదవయవషష్ఠ్యన్తము. పూర్వసవర్ణ దీర్ఘముకంటె పరమగు శస్ ప్రత్యయావయవసకారమునకు పుంలిఙ్గమున నకారాదేశమగును. రామాన్ (రామ + శస్)

* 198. అట్కుప్వాఙ్నుమ్వ్యవాయేపి. 8-4-2. అట్కుప్వాఙ్నుమ్వ్యవాయే, అపి (రషాభ్యాం నోణస్సమానపదే)

అట్, కవర్గ, పవర్గ, ఆఙ్, నుమ్, ఏతైర్వ్యస్తైర్యథాసంభవం మిలితైశ్చ వ్యవధానేపి రషాభ్యాం పరస్య నస్య ణః స్యాత్సమానపదే । పదవ్యవాయేపీతి నిషేధం బాధితుమాఙ్గ్రహణమ్, నుమ్గ్రహణమనుస్వారోప లక్షణార్థమ్, తచ్చాకర్తుం శక్యమ్ । అయోగవాహానామట్సూపదేశస్యోక్తత్వాత్ । ఇతి ణత్వే ప్రాప్తే,

198. అట్కుప్వాఙ్నుమ్. ఇది ద్వన్ద్వము. దీనికి వ్యవాయ శబ్దముతో తృతీయా తత్పురుషము. అట్, కవర్గము, పవర్గము, ఆఙ్, నుమ్, వీనిలో నొక్కొక వర్ణముతోగాని సంభవించినన్ని వర్ణములతోగాని వ్యవధానమున్నను ఏకపదమందు రేఫ షకారములకంటె పరమగు నకారమునకు ణకార మాదేశ మగును. ఆఙ్, అను నుపసర్గమందలి యాకార మట్ ప్రత్యాహారమున చేరిన

దయినను పదసంజ్ఞకమగుటవలన పదవ్యవాయేపి 8-4-38 సూ. చే, ప్రాప్త మగు ణత్వనిషేధమును బాధించుట కీ సూత్రమున నాఙ్ గ్రహణ మావశ్యకము. నుమ్‌గ్రహణము నుమాగమస్థానికము, తద్భిన్న నకారస్థానికము (స్వాభావికము) నగు ననుస్వారమాత్రమునకు బోధకము. కావున నుమాగమములోని నకారముతో వ్యవధానమున్నపుడు ణత్వము రాదు (ప్రేన్వనమ్) అయోగవాహములకు (అనుస్వారవిసర్గ జిహ్వామూలీయోపధ్మానీయయమలు) అట్ ప్రత్యాహారవర్ణములలో అకారము తరువాత నుపదేశము చెప్పబడినందున ననుస్వారగ్రహణమునకై సూత్రమున ప్రత్యేకముగా నుమ్‌గ్రహణ మావశ్యకము గాదని చెప్పవచ్చును. రామాన్, అనుచోట రేఫ నకారముల కట్ పవర్గములతో వ్యవధానమున్న నీ సూత్రముచే నకారమునకు ణత్వము ప్రాప్తమగుచున్నది.

వివ :— సూత్రమున కుదాహరణములు. అట్, హరణమ్, గిరిణా. కవర్గము, గర్గేణ, అర్కేణ. పవర్గము, దర్పేణ, చర్మణా. ఆఙ్, పర్యాణద్ధమ్. నుమ్, తృంహణమ్. ఇత్యాదులు.

* 199. పదాన్తస్య 8-4-37 (నః, ణః)
పదాన్తస్య నస్య ణత్వం నస్యాత్.

199. పదముయొక్క తుదినుండు నకారమునకు ణత్వము రాదు. రామాన్ అనుచోట నీ నిషేధమువలన పూర్వసూత్రముచే ప్రసక్తమగు ణత్వము వారింపబడును.

* 200. యస్మాత్ప్రత్యయవిధిస్తదాది ప్రత్యయేఙ్గమ్. 1-4-13
యస్మాత్, ప్రత్యయవిధిః, తదాది, ప్రత్యయే, అఙ్గమ్, (శబ్దస్వరూపమ్)

యః ప్రత్యయో యస్మాత్క్రియతే, తదాది శబ్దస్వరూపం తస్మిన్ ప్రత్యయే పరేఽఙ్గసంజ్ఞం స్యాత్। భవామి భవిష్యామీత్యాదౌ వికరణవిశిష్టస్యాఙ్గసంజ్ఞార్థం తదాదిగ్రహణమ్। విధిరితి కిమ్। స్త్రీ ఇయతీ। ప్రత్యయే కిమ్। ప్రత్యయ విశిష్టస్యతతో ప్యధికస్య వామాభూత్ ॥

200. ఏ ప్రత్యయ మే ప్రకృతికంటె విధింపబడునో యా ప్రకృతి యాది గాగల శబ్దస్వరూప మాప్రత్యయమే పరమగునపు డఙ్గమనబడును. రామాయ. ఇచట రామశబ్దముకంటె యప్రత్యయము విధింపబడినది. కాన యప్రత్యయము పరమగునపుడు రామ అనునది యఙ్గసంజ్ఞకము. తదాది అనునది బహువ్రీహి. (తత్ = ప్రకృతిరూప మాదిర్యస్య) భవామి = భూ ధాతువునకు ఉత్తమ పురుషైకవచనము. ఇచట ప్రకృతి భూ అనునది. మి, ప్రత్యయము. ఈ రెండిటికి మధ్యను శప్ (అ) వికరణప్రత్యయము వచ్చినది. మిప్రత్యయము, శబన్తము

(భవ) కంటె విధింపబడనందున ప్రత్యయవిధానావధి యఙ్గమనినచో భవ, అనునది అఙ్గము కాకపోవును. అఙ్గసంజ్ఞ లేనిచో "అతోదీర్ఘో యఞి" (7-3-101) సూ. చే, దీర్ఘము రాకపోవును. తదాది శబ్దస్వరూపమఙ్గమనిన భవ అనునదట్టిదగును గాన నఙ్గసంజ్ఞ సిద్ధించును. ఇట్లే భవిష్యామి (భూ ధాతువునకు ల్భ్డు త్తమ పురుషైకవచనము) అనుచోటను భవిష్య అను వికరణ విశిష్టమునకు నఙ్గసంజ్ఞ తదాదిగ్రహణమునకు ప్రయోజనమని యూహించునది. విధిగ్రహణములేనిచో ప్రత్యయము పరమగునపుడు పూర్వమున కఙ్గసంజ్ఞ యనునర్థము లభించును. స్త్రీ ఇయఙ్. ఇచట స్త్రీ శబ్దముకంటె ఇయఙ్ప్రత్యయము పరమగుటచే స్త్రీ శబ్దమున కఙ్గసంజ్ఞ ప్రసక్తమగును. అట్లయిన, యస్యేతిచ (312) సూ. చే, నికారలోపము ప్రసక్తమగును. విధిగ్రహణమున్నపుడు స్త్రీ శబ్దము కంటె ఇయఙ్ప్రత్యయము విధింపబడనందున దోషము వారించును, 'ఇయఙ్' అనునది ఇదంశబ్ద ప్రకృతికమగు వతుబంతము. ప్రకృతియగు నిదంశబ్దము లోపించుటచే ఇయఙ్యనునది ప్రత్యయమాయెను. ప్రత్యయే అనునది లేనపుడు దేనికంటె ప్రత్యయము విధింపబడునో యది యాదిగాగల శబ్దస్వరూపమఙ్గమను నర్థము లభించును. అపుడు ప్రత్యయాన్తమునకు నంతకధికమగు శబ్దమునకును సంజ్ఞ ప్రసక్తమగును.

* 201. అఙ్గస్య. 6-4-1.

ఇత్యధికృత్య ॥

201. ఏడవ యధ్యాయము చివరవఱకీసూత్ర మధికృతమగును.

వివ:—అధికారమగుటచే నుత్తరసూత్రములందు ప్రవర్తించి అఙ్గస్య కార్యంభవతి, (అఙ్గమునకు కార్యమగును). అనునర్థమును బోధించును.

* 202. టాఙసిఙసామినాత్స్యాః. 7-1-12 టాఙసిఙసామ్, ఇనాత్స్యాః. (అతః)

అకారాన్తాదఙ్గాట్టాదీనాం క్రమాదినాదయ ఆదేశాః స్యుః ॥

202. టాఙసిఙసామ్, ఇనాత్స్యాః, ఈ రెండు నితరేతరయోగద్వంద్వములు. అఙ్గస్య అనునది పఞ్చమ్యర్థమునగ మారును. అఙ్గస్య అనుదానికి అతః అనునది విశేషణమగుటచే తదన్తవిధి కలుగును. హ్రస్వాకార మన్తమందుగల నఙ్గముకంటె పరములగు టా ఙసి ఙస్ ప్రత్యయములకు వరుసగ ఇన, ఆత్, స్య, అనునవి యాదేశములగును. రామ + టా। ఈ సూత్రముచే నినాదేశము "ఆద్గుణః" సూ. చే, గుణము. అట్కుప్వాఙ్ (198) సూ. చే. ణత్వము, రామేణ.

* 203. సుపిచ. 7-3-102. సుపి, చ, (అతోదీర్ఘోయఞి)

యఞాదౌ సుపి పరే అతోఽఙ్గస్య దీర్ఘః స్యాత్। రామాభ్యామ్।

203. యఞి అనునది అల్భోధక సప్తమ్యన్తమగుటచే "యస్మిన్ విధిః" పరిభాషవలన తదాదివిధి కలుగును. యఞ్ ప్రత్యాహారవర్ణమాదినిగల సుప్పు పరమగునపుడు హ్రస్వాకారమన్తమందుగల యఙమునకు దీర్ఘమాదేశమగును. రామ + భ్యామ్. ఈ సూత్రముచే నిచట దీర్ఘము ప్రవర్తించును. రామాభ్యామ్.

* 204. అతో భిస ఐస్. 7-1-9. అతః, భిసః, ఐస్.

అకారాన్తాదఙ్గాద్భిస ఐస్ స్యాత్, అనేకాల్

త్వాత్సర్వాదేశః, రామైః,

204. అదన్తమగు నఙ్గముకంటె పరమగు భిస్ ప్రత్యయమునకు ఐస్, ఆదేశమగును. రామ + భిస్. ఈ సూత్రముచే నిచట ఐసాదేశము ప్రవర్తించును. ఐసనునదనేకాల్లగుటచే "అనేకాల్శిత్సర్వస్య" పరిభాషచే సర్వాదేశముగ ప్రవర్తించును, (వృద్ధిరేచి) సూ. చే, వృద్ధి. రామైః.

వివ:—ఏసాదేశమును విధించినను వృద్ధిచే రామైః అను రూపము సిద్ధమగును. ఏకారవిధాన సామర్థ్యమువలన పరరూపప్రసక్తియును వారింపబడును. అయినను ఏకారైకారములలో మాత్రాభేదము లేనందున నిట్లు చెప్పబడెను. ఇపుడు పరరూపశఙ్కకూడ జనింపదు.

* 205. ఙేర్యః 7-1-13 ఙేః, యః. (అతః).

అతోఙ్గాత్పరస్య ఙే ఇత్యస్య యాదేశః స్యాత్,
రామాయ। ఇహ స్థానివద్భావేన యాదేశస్య సుప్త్వా
త్సుపిచేతి దీర్ఘః। సన్నిపాతలక్షణో విధిరనిమిత్తం తద్వి
ఘాతస్యేతి పరిభాషాతు నేహ ప్రవర్తతే, కష్టాయ
క్రమణేఇతి నిర్దేశాత్తస్యా అనిత్యత్వజ్ఞాపనాత్ ।. రా
మాభ్యామ్॥

205. అదన్తాఙ్గముకంటె పరమగు ఙే ప్రత్యయమునకు యాదేశమగును. రామాయ (రామ + ఙే) యాదేశమునకు స్థానివద్భావముచే సుప్త్వముండుటచే సుపిచ (205) సూ. చే, దీర్ఘము ప్రవర్తించును. ప॥ సన్నిపాతలక్షణో విధిరనిమిత్తం తద్విఘాతస్య (సన్నిపాతః=ద్వయోస్సంబన్ధః, లక్షణమ్=నిమిత్తమ్, యస్య విధేః, సః సన్నిపాతలక్షణవిధిః. తద్విఘాతస్య తం = సన్నిపాతం, విహంతీతి = తద్విఘాతః, తస్య - అనిమిత్తం = నిమిత్తం నభవతి) రెండిటియొక్క సంబంధమును నిమిత్తముగ చేకొని ప్రవర్తించు కార్యమాసంబంధమునకు హానికలుగజేయు కార్యమును గుఱించి కారణము కాదని పరిభాషార్థము. "రక్షించినవానిని భక్షించుట యనుచితమను లోకన్యాయమువలన నీ పరిభాష సిద్ధమయినది. దీనిచే రామ + య అనుచోట నదన్తాఙ్గ ఙే ప్రత్యయముల సంబంధము కారణముగగల యాదేశము అఙ్గమునకుగల నదన్తత్వమునకు హానికలుగ

జేయు "సుపిచసూత్రముచే విహితమగు దీర్ఘమునకు నిమిత్తముగానందున రామాయ అనురూపము సిద్ధింపకున్నది, కాని కష్టాయ క్రమణే (3-1-14) సూత్రమున కష్టాయ అను దీర్ఘయు క్తమగు పాణిని నిర్దేశముచే సన్నిపాత పరిభాష యనిత్యమని బోధితమయినందున "సుపిచ సూ. చే, విహితమగు దీర్ఘము విషయమున నీ పరిభాష ప్రవర్తించదు. అందుచే రామాయ అను నిష్టరూపము సిద్ధించును. రామాభ్యామ్. రామ + భ్యామ్. సుపిచ, సూ. చే, దీర్ఘము.

* 206. బహువచనే ఝల్యేత్ 7-3-103 బహువచనే, ఝలి, ఏత్. (సుపి, అతః)

ఝలాదౌ బహువచనే సుపి పరే అతో ఽఙ్గస్యైకారః స్యాత్ । రామేభ్యః । బహువచనే కిమ్ । రామః । రామస్య । ఝలి కిమ్ । రామాణామ్ । సుపి కిమ్ । పచధ్వమ్ । జశ్త్వమ్ ॥

206. అదన్తాఙ్గమునకు, ఝల్వర్ణమాదియందుగల బహువచనమగు సుప్పు పరమగునపుడేకార మాదేశమగును. రామేభ్యః. రామ + భ్యస్. రామః అను చోట రుత్వవిసర్గము లసిద్ధమగును గాన నేత్వము ప్రసక్తమగుచున్నది. తద్వారణార్థము బహువచనే అనునది యావశ్యకము. ఇట్లే రామస్య (రామ + ఙస్) అనుచోట స్యాదేశము ప్రవర్తించినపిదప నేత్వవారణార్థము బహువచనే, అనునది యావశ్యకము. సన్నిపాత పరిభాషచే నిచట నేత్వమును వారింపవచ్చును గాని "అదస్సర్వేషామ్ (7-3-100) సూత్రమున సర్వేషామను నిర్దేశమువలన నేత్వము విషయమున నీ పరిభాష ప్రవర్తింపదని చెప్పుటచే నిదియు ప్రత్యుదాహరణమగును. ఝలి కిమ్? ఊతోవృద్ధిర్లుకిహలి (7-3-89) సూత్రమునుండి హల్గ్రహణమను వృత్తమగును. రామాణామనుచోట, సన్నిపాత పరిభాషచే నేత్వమురాదని ప్రశ్నాశయము. రామాణామ్. సర్వేషామను నిర్దేశమువలన నేత్వవిషయమున సన్నిపాత పరిభాష ప్రవర్తింపదనుటచే రామాణామనుచోట దోషము సంభవించును గాన ఝల్గ్రహణ మావశ్యకమని యుత్తరాశయము. సుపి కిమ్. పచధ్వమ్ (పచ + ధ్వమ్) సుపి అనునది లేనిచో తిఙ్ పరమగునపుడు నేత్వము ప్రసక్తమగును. పచధ్వమనునది పచ ధాతువునకు లోణ్మధ్యమపురుష బహువచనము. రామాత్ (రామ + ఙసి) టాఙసిఙసామ్ (202) సూ. చే, ఆదాదేశము. "అకస్సవర్ణే" సూ. చే, దీర్ఘము. ఇచ్చోట తకారమునకు ఝలాం జశోఽన్తే సూ. చే, జశ్త్వము ప్రాప్తమగుచున్నది. పదాంతజశ్త్వమునకు వావసానే (209) సూ. చే, విహితమగు చర్త్వము బాధకముగాన జశ్త్వము ప్రవర్తించదు. కనుక మూలమున జశ్త్వమనుచోట బాధిత్వా, (బాధించి) అను పదము నధ్యాహారము చేయవలయును.

* 207. వావసానే 8-4-56 వా, అవసానే. (ఝలాం, చరః)

అవసానే ఝలాం చరో వా స్యుః। రామాత్, రామాద్। ద్విత్వే రూపచతుష్టయమ్। రామాభ్యామ్। రామేభ్యః। రామస్య। సస్య ద్విత్వపక్షే ఖరిచేతి చర్త్వేఽప్యాన్తరతమ్యాత్సస్య స ఏవ, నతు తకారః। అల్పప్రాణతయా ప్రయత్నభేదాత్। అతఏవ సస్సీతి తాదేశ ఆరభ్యతే॥

207. అవసానమందలి ఝల్వర్ణములకు చర్వర్ణములు వికల్పముగ నాదేశములగును. రామాత్, పక్షమందు జశ్త్వము, రామాద్. 'అనచిచ, సూత్రమున అనచి అనునది ప్రసజ్యప్రతిషేధమని పూర్వము చెప్పబడినదిగావున నిట్టిచోటులందు ద్విత్వము ప్రవర్తించునుగాన నిచట నాల్గురూపములగును. రామాభ్యామ్ (రామ + భ్యామ్) సుపిచ సూ. చే, దీర్ఘము. రామేభ్యః (రామ + భ్యస్) చతుర్థీ బహువచనమునకువలె ప్రక్రియను గమనింపవలయును. రామస్య (రామ + ఙస్) టాఙసిఙసామ్, సూ. చే, ఙస్సునకు స్యాదేశము. ఇచట సకారమునకు "అనచిచ" సూ. చే, ద్విత్వము. ద్విత్వపక్షమందు "ఖరిచ" సూ. చే, చర్త్వమగును. ఇది, ప్రయత్నసామ్యమువలన సకారమునకు సకారమే వచ్చును గాని మహాప్రాణ ప్రయత్నముగల సకారమున కల్పప్రాణ ప్రయత్నముగలదగుటచే విసదృశమగు తకారము రాదు. కావుననే వత్స్యతి (వసధాతువునకు ల్ఱట్ ప్రథమైకవచనము) అనుచోట సస్యార్ధధాతుకే (7-4-49) సూ. చే, సకారమునకు తకారవిధానము సార్థకమగును. సకారమునకు చర్త్వముచే తకారమాదేశమగుననిన చో వత్స్యతి అనుచోట చర్త్వముచేతనే తకారము సిద్ధమగుచుండ వేరుగ తకారవిధానము వ్యర్థము కావలయును.

* 208. ఓసి చ. 7-3-104. ఓసి, చ, (అతః, ఏత్)

ఓసి పరే అతోఽఙ్గస్యైకారః స్యాత్। రామయోః॥

208. ఓస్ (షష్ఠీసప్తముల ద్వివచనము) ప్రత్యయము పరమగునపుడు అదన్తాఙ్గమున కకారాదేశమగును. రామయోః (రామ + ఓస్) ఏత్వము, అయాదేశము.

* 209. హ్రస్వనద్యాపోనుట్. 7-1-54. హ్రస్వనద్యాపః, నుట్ (ఆమి)

హ్రస్వాన్తాన్నద్యన్తాదాబన్తాచ్చాఙ్గాత్పరస్యామో నుడాగమః స్యాత్।

209. అనువృత్తమయిన ఆమి అనునది షష్ఠ్యన్తముగ విపరిణతమగును. హ్రస్వాన్తము, నద్యన్తము, ఆబన్తమునగు నఙ్గముకంటె పరమగు ఆమ్ ప్రత్యయమునకు నుడాగమమగును. (న్)

* 210. నామి. 6-4-3 (దీర్ఘః)

అజన్తాఙ్గస్య దీర్ఘః స్యాత్, రామాణామ్। సుపిచేతి దీర్ఘో యద్యపి పరస్తథాపీహ నప్రవర్తతే। సన్నిపాతపరిభాషావిరోధాత్। నామీత్యనేనత్వారమ్భసామర్థ్యాత్పరిభాషా బాధ్యతే। రామే. రామయోః. సుపి ఏత్వే కృతే॥

210. అజన్తాఙ్గమునకు నామ్ (నుడాగమముగల ఆమ్ ప్రత్యయము) పరమగునప్పుడు దీర్ఘము వచ్చును. రామాణామ్ (రామ + ఆమ్) ఇచట హ్రస్వ సూత్రముచే నుడాగమము, ఈ సూత్రముచే దీర్ఘము, అట్ కుప్వ్, సూ. చే, ణత్వమునగును. ఈ సూత్రముకంటె పరమగునదైనను "సుపిచ" సూత్రము, సన్నిపాత పరిభాషావిరోధమువలన నిచట ప్రవర్తించదు. ఆరంభ సామర్థ్యము వలన నీ సూత్రముచే నా పరిభాష బాధింపబడును. (రామే రామ + ఙి) "ఆద్గుణః సూ. చే, గుణము. రామయోః. షష్ఠీద్వివచనమందువలె ప్రక్రియ నూహించునది. రామ + సు. ఇచట "బహువచనే ఝల్యేత్ సూ. చే, ఏత్వము ప్రవర్తించును. రామే + సు. ఇట్లుండ.

* 211. అపదాన్తస్య మూర్ధన్యః. 8-3-55 అపదాన్తస్య, మూర్ధన్యః॥

ఆపాదపరిసమాప్తే రధికారోऽయమ్॥

211. ఎనిమిదవ యధ్యాయమందలి మూడవపాదము చివరవఱకు నీ సూత్ర మధికృతమగును.

వివ: — ఈ యధికారముననున్న 'ఆదేశప్రత్యయయోః' మొదలగు సూత్రములు షత్వవిధాయకములే యగుటచే నీ సూత్రమున లఘుభూతమగు ష గ్రహణమును విడిచి మూర్ధన్యగ్రహణము చేయుటకు, "ఇణః షీధ్వం (8-3-78) సూ. చే, ఢకారవిధానము ఫలము. (చకృఢ్వే)

* 212. ఇణ్కోః. 8-3-57.

ఇత్యధికృత్య॥

212. ఇది యధికారసూత్రము.

* 213. ఆదేశప్రత్యయయోః. 8-3-59.

సహేః సాడస్స ఇతిసూత్రాత్ స ఇతి షష్ఠ్యన్తం పదమనువర్తతే। ఇణ్ కవర్గాభ్యాం పరస్య అపదాన్తస్యాదేశః ప్రత్యయావయవశ్చ యః సకారః తస్య మూర్ధన్యాదేశః స్యాత్, వివృతాఘోషస్య సస్య తాదృశఏవ షః। రామేషు। ఇణ్కోః కిమ్।

రామస్య। ఆదేశప్రత్యయయోః కిమ్। సుపీః। సుపిసౌ। సుపిసః। అపదాన్తస్య కిమ్। హరిస్త్రత। ఏవం కృష్ణ ముకున్దాదయః॥

213. సహేః సాడః సః (336) సూత్రమునుండి షష్ట్యన్తమగు సః అనునది యనువర్తించును. ఇణ్ కోః, అపదాన్తస్య మూర్ధన్యః, అను సూత్రము లధికృతములగును. ఇణ్ ప్రత్యాహారవర్ణము, కవర్గము, వీనికంటె పరమయి, పదాన్తముకానట్టి ఆదేశరూపముగాని, ప్రత్యయావయవముగాని, అగు సకారమునకు మూర్ధన్యాదేశమగును. వివృతమనెడి యాభ్యన్తర ప్రయత్నము, అఘోషమనెడి బాహ్యప్రయత్నముగల సకారమునకు సదృశమగు మూర్ధన్యము, షకారమేయగును. రామేసు, ఈ సూత్రముచే నిచట షత్వము ప్రవర్తించును. రామేషు. ఇణ్ కోః అనునదనువృత్తముగానిచో రామస్య అనుచోటను సకారమునకు షత్వము ప్రసక్తమగును. సుపీః, సుపిసౌ, సుపిసః, ఇత్యాదులలో ధాతు సకారమునకు షత్వవారణమునకై 'ఆదేశప్రత్యయయోః' అను సకార విశేషణ మావశ్యకము. 'హరిస్త్రత' ఇత్యాదులందు పదాన్తమగు సకారమునకు షత్వము రాకుండుటకై 'అపదాన్తస్య' అను విశేషణ మావశ్యకము. కృష్ణః, ముకున్దః, మొదలగు నదన్త పుంలిఙ్గశబ్దముల ప్రక్రియ నిట్లే యూహింపదగును.

వివ :— 'ఆదేశప్రత్యయయోః' అనుచోట నాకేపష్ఠి విషయభేదముచే రెండు విధములగును, (స్థానషష్ఠి, అవయవషష్ఠి), ఈ రెండును సకార విశేషణములు. ప్రత్యయపదము ప్రత్యయావయవ బోధకము. ఆదేశరూపము ప్రత్యయావయవము అని యర్థము లభించును.

* 214. సర్వాదీని సర్వనామాని 1-1-27 సర్వాదీని, సర్వనామాని. (శబ్దస్వరూపమ్)

సర్వాదీని శబ్దస్వరూపాణి సర్వనామ సంజ్ఞాని స్యుః। తదన్తస్యాపీయం సంజ్ఞా। ద్వంద్వేచేతి జ్ఞాపకాత్। తేన పరమసర్వత్రేత్యత్ర త్రల్, పరమ భవకానిత్యత్రాకచ్చ సిధ్యతి॥

214. [1] సర్వశబ్దము మొదలగు ముప్పదియైదు శబ్దములు సర్వనామము లనబడును. ద్వంద్వసమాసమునకు సర్వనామ సంజ్ఞానిషేధకమగు ద్వంద్వేచ (225) సూత్రము సర్వాద్యన్తములును సర్వనామములనుటలో జ్ఞాపకము. శబ్దస్వరూపాణి అనుదాని కధ్యాహారముచేసి తదన్తవిధి చెప్పవలయును. కానిచో 'వర్ణాశ్రమేతరాణామ్, ఇత్యాదులందు, ఇతరాన్తాది సముదాయమునకు సర్వనామ సంజ్ఞను నిషేధించు ద్వంద్వేచ అను సూత్రము వ్యర్థముగావలయును. సర్వాద్యన్తములకును సర్వనామసంజ్ఞ యుండుటవలననే. 2 'పరమసర్వత్ర' అను

చోట త్రల్ ప్రత్యయము, 'పరమభవకాన్' అనుచోట అవ్యయ సర్వనామ్నా మకచ్ప్రాక్ టేః, సూత్రముచే నకచ్ ప్రత్యయమును సిద్ధములగును.

వివ :—1 సర్వాదీని, అనునది తద్గుణసంవిజ్ఞాన బహువ్రీహి. (తస్య = అన్యపదార్థస్య, గుణాః = వర్ణపదార్థరూపాణి విశేషణాని, తేషాం, కార్యాన్వయితయా సంవిజ్ఞానం, యత్ర స తద్గుణసంవిజ్ఞానః) ఏ బహువ్రీహియొక్క విశేషణముల కన్యపదార్థముతోఁబాటు కార్య సంబంధముండునో యది తద్గుణ సంవిజ్ఞానమనబడును. తెలుగుగ నన్యపదార్థము సంయోగ సమవాయాన్యతర సంబంధముచే నే బహువ్రీహియందు సంబంధియగునో యది తద్గుణ సంవిజ్ఞానము. దీనికంటె భిన్నములగునవి యతద్గుణ సంవిజ్ఞానములు. "లమ్బకర్ణమానయ" ఇత్యాదులలోని లమ్బకర్ణాదులు తద్గుణ సంవిజ్ఞాన బహువ్రీహులు. ఇచట నన్య పదార్థమగు పురుషునివలె విశేషణమగు కర్ణముకూడ నానయనక్రియలో కర్మగ నన్వయించుచున్నది. ప్రకృతమున సర్వాదీని అనునది తద్గుణ సంవిజ్ఞానము గావున సర్వశబ్దమునకును సంజ్ఞ సిద్ధమగును.

2. తదన్తసంజ్ఞకు పరమ సర్వస్మై, ఇత్యాదులందు స్మాయాద్యాదేశములు ఫలమనక త్రలాదులు ఫలమనుట కాశయమిది:—సర్వనామ సంజ్ఞాసూత్రమున తదన్తవిధి లేకున్నను 'సర్వనామ్నః స్మై, ఇత్యాది సూత్రము లఙ్గాధికారస్థము లగుటచే నచట తదన్త విధిగల్గును గాన, 'పరమసర్వస్మై, ఇత్యాదులు సిద్ధము లగును. త్రలాది విధాయక సూత్రములు ప్రత్యయ విధాయకములగుటవలన "సమాస ప్రత్యయవిధౌ ప్రతిషేధః, అను నిషేధముచే తదన్తవిధి నిషేధింప బడినందున నీ సూత్రముచే తదన్తములకు సంజ్ఞ విహితముకానిచో త్రలాదులు సర్వాద్యన్తములకు సిద్ధింపకుండునని.

* 215. జసః శీ. 7-1-17. జసః, శీ, (అతః, సర్వనామ్నః)
అదన్తాత్సర్వనామ్నః పరస్య జసః శీ స్యాత్ ।
అనేకాల్త్వాత్సర్వాదేశః । నచార్వణస్తృ ఇత్యాదావి
వ నానుబన్ధకృతమనేకాల్త్వమితి వాచ్యమ్ । సర్వా
దేశత్వాత్ప్రాగిత్సంజ్ఞాయా ఏవాభావాత్ । సర్వే ।

215. అదన్తమగు సర్వనామముకంటె పరమగు జస్ ప్రత్యయమునకు శీ ఆదేశమగును. శీ అనునది యనేకాల్లగుటవలన అనేకాల్ శిత్సర్వస్య, అను పరిభాషచే సర్వమునకాదేశమగును. అర్వణస్త్రసావనఞః (366) సూత్రముచే విహితమగు 'తృ, అనునాదేశ మనేకవర్ణములు కలదైనను ఋకార మిత్సంజ్ఞక మగుటవలన, ప॥ నానుబన్ధకృతమనేకాల్త్వమ్, (అనుబన్ధమన నిత్సంజ్ఞకము. ఇది తనను విడిచి యనేకాల్లుగానట్టి యాదేశమునకు తనతో ననేకాల్లను వ్యవ హారమును సంపాదింపదు అనగానే యాదేశ మిత్సంజ్ఞకవర్ణముతో గలసియే యనేకాల్లగునో యది సర్వమున కాదేశముగాదు) అను నిషేధముచే అర్వన్

శబ్దమంతకును రాక, నకారమునకు మాత్రమే వచ్చినది. (అర్వన్తౌ అని యగును.) ఇక్లైశీ భావమున శవర్ణ మిత్సంజ్ఞకమగుటవలన ననేకాల్లు గానందున నిదియు సర్వాదేశము గాదేమోయని శంకించరాదు. ప్రత్యాదేశమున నుపదేశకాలమందే ఇత్సంజ్ఞ వచ్చుటచే నానుబంధ పరిభాష ప్రవర్తించును. శీ అనునది స్థానియందు ప్రవర్తించినపిదప స్థానివద్భావముచే ప్రత్యయమయినగాని లశక్వతద్ధితే (196) సూత్రముచే శవర్ణ మిత్సంజ్ఞకముగాదు. కావున నాదేశమునకు పూర్వము శవర్ణ మనుబన్ధముగానందున నానుబన్ధ పరిభాష ప్రవర్తించదు. కాన శీ అనునది సర్వాదేశమే యగును. సర్వే (సర్వ + జస్)

* 216. సర్వనామ్నః స్మై. 7-1-14. సర్వనామ్నః, స్మై (అతః, ఙేః.)

అతస్సర్వనామ్నో ఙేఇత్యస్య స్మై స్యాత్ । సర్వస్మై ।

216. అదన్తమగు సర్వనామముకంటె పరమగు 'ఙే' అనుదానికి స్మై ఆదేశమగును. సర్వస్మై. (సర్వ + ఙే)

* 217. ఙసిఙ్యోః స్మాత్స్మినౌ. 7-1-15. ఙసిఙ్యోః, స్మాత్స్మినౌ. (అతః, సర్వనామ్నః)

అతస్సర్వనామ్నో ఙసిఙ్యోరేతౌ స్తః । సర్వస్మాత్ ।

217. అదన్తమగు సర్వనామముకంటె పరమగు ఙసి, ఙి, వీనికి క్రమముగ స్మాత్, స్మిన్ ఆదేశములగును. సర్వస్మాత్. (సర్వ + ఙసి)

* 218. ఆమి సర్వనామ్నస్సుట్ 7-1-52 ఆమి, సర్వనామ్నః, సుట్, (అతః)

అవర్ణాన్తాత్పరస్య, సర్వనామ్నో విహిత స్యామః సుడాగమః స్యాత్ । ఏత్వషత్వే । సర్వేషామ్ । సర్వస్మిన్ । శేషం రామవత్ । ఏవం విశ్వాదయోఽప్యదన్తాః । సర్వాదయశ్చ పఞ్చత్రింశత్ । సర్వ, విశ్వ, ఉభ, ఉభయ, డతర, డతమ, అన్య, అన్యతర, ఇతర, త్వత్, త్వ, నేమ, సమ, సిమ, పూర్వపరావర దక్షిణోత్తరాపరాధరాణి వ్యవస్థాయామ సంజ్ఞాయామ్ । స్వమజ్ఞాతి ధనాఖ్యాయామ్ । అన్తరం బహిర్యోగోపసంవ్యానయోః । త్యద్, తద్, యద్, ఏతద్, ఇదమ్, అదస్, ఏక, ద్వి, యుష్మద్, అస్మద్, భవతు, కిమ్ । ఇతి । ఉభశబ్దోద్విత్వ విశిష్టస్య వాచకః । అతఏవ నిత్యం ద్వివచనాన్తః । తస్యేనా

పాఠస్తూభకావిత్యకజర్థః। నచ కప్రత్యయే నేష్టసిద్ధిః। ద్వివచనపరత్వాభావేన ఉభయతః, ఉభయత్రేత్యాదావయచ్ప్రసఙ్గాత్। తదుక్తం 'ఉభయోఽన్యత్రేతి'। అన్యత్రేతి, ద్వివచనపరత్వాభావే। ఉభయశబ్దస్య ద్వివచనం నాస్తీతి కైయటః। అస్తీతి హరదత్తః। తస్మాజ్జస్య యజాదేశస్య స్థానివద్భావేన తయప్ప్రత్యయాన్తతయా ప్రథమచరమేతి వికల్పే ప్రాప్తే, విభక్తినిరపేక్షత్వే నాన్తరఙ్గత్వాన్నిత్యైవ సంజ్ఞా భవతి। ఉభయే। డతరడతమౌ ప్రత్యయౌ। యద్యపి సంజ్ఞావిధౌ ప్రత్యయగ్రహణే తదన్తగ్రహణం నాస్తి। సుప్తిఙన్తమితి జ్ఞాపకాత్। తథాపీహ తదన్తగ్రహణమ్। కేవలయోస్సంజ్ఞాయాః ప్రయోజనాభావాత్। అన్యతరాన్యతమశబ్దావవ్యుత్పన్నౌ స్వభావాద్ద్విబహువిషయే నిర్ధారణే వర్తేతే। తత్రాన్యతమశబ్దస్య గణే పాఠాభావాన్న సంజ్ఞా। త్వత్వౌ ఇతి ద్వావప్యదన్తావన్యపర్యాయౌ। ఏక ఉదాత్తోఽపరోఽనుదాత్త ఇత్యేకే। ఏకస్త్వన్త ఇత్యపరే। నేమ ఇత్యర్ధే। సమస్సర్వపరాయః। తుల్యపర్యాయస్తు నేహ గృహ్యతే। యథాసంఖ్యమనుదేశస్సమానామితి జ్ఞాపకాత్। అన్తరం బహిర్యోగేతి గణసూత్రేఽపురీతి వక్తవ్యమ్। అన్తరాయాం పురి॥

218. అవర్ణాన్తమగు సర్వనామముకంటె విహితమగు ఆమ్ ప్రత్యయము నకు, సుడాగమమగును. సర్వ + ఆమ్. ఇచట నామ్ ప్రత్యయమునకు సుడాగమము. అఙ్గమున కేత్వము. సకారమునకు షత్వము. సర్వేషామ్. సర్వస్మిన్ (సర్వ + ఙి) సర్వే, మొదలగు చూపబడిన వచనములకంటె మిగిలిన వచనము లందు రామశబ్దమువలె సర్వశబ్దముండును. సర్వనామములం దదన్తములగు విశ్వ, మొదలగు శబ్దములకు సర్వశబ్దమునకువలె ప్రక్రియ నూహించునది. సర్వశబ్దము మొదలు కింశబ్దాన్తమువఱకు మూలమున పరిగణింపబడిన సర్వాదులు ముప్పది యైదు. ఉభశబ్దము, ద్విత్వసంఖ్యతో సహితమగు వస్తువునకు బోధకముగాన నిది నిత్య ద్వివచనాన్తము. సర్వనామ సంజ్ఞాప్రయుక్తములగు విభక్తి కార్యములు (శీ భావాదులు) ఏకవచన బహువచనములకే చెప్పబడినవి. ఉభశబ్దమున కేక వచన బహువచనములు లేవు గనుక ఉభశబ్దమునకు సర్వనామసంజ్ఞా ప్రయోజన మేమనిన, అవ్యయ సర్వనామ్నామకచ్ ప్రాక్ టేః (5-8-71) సూ. చే నకచ్ ప్రత్యయము వచ్చుటయే ప్రయోజనము. ఉభకౌ. కప్రత్యయమువలన నీ రూపము సిద్ధముకాదు. కప్రత్యయము చేసినచో నుభశబ్దమునకు ద్వివచనము

పరముగ లేనందున ఉభయతః ఉభయత్ర, మొదలగు రూపములందువలె నయచ్ ప్రత్యయము ప్రసక్తమగును. అయజ్వ్యవధాయకవచన మిట్లు చెప్పబడినది. ఉభయోన్యత్ర - అన్యత్ర అనుదానికి ద్వివచనపరత్వము లేనపుడని యర్థము. ద్వివచనము పరముగ లేనపుడు 'ఉభయః' అనుస్వార్థికాయజన్తము ప్రయోగింపబడునని వార్తికార్థము. అకచ్ ప్రత్యయము ప్రకృతిమధ్య పతితమగుటచే ప్రకృతిప్రత్యయములకు వ్యవధాయకము గానందున ద్వివచనపరత్వమే యుండును. కాన నయచ్ ప్రత్యయముయొక్క ప్రసక్తి వారింపబడును. అందుచే నుభకౌ, అను రూపసిద్ధికొఱకై సర్వాదిగణమున నుభశబ్దపాఠ మావశ్యకము. కైయటుడుభయశబ్దమునకు ద్వివచనము లేదనెను. హరదత్తుడు (కాశికావృత్తి వివరణమగు పదమంజరికి వ్యాఖ్యాత) ఉభయశబ్దమునకు ద్వివచనము కలదనెను. ఉభశబ్దముకంటె తయపు, దీనికయజాదేశముచేసిన నుభయశబ్దము సిద్ధమగును. ఇది స్థానివద్భావముచే తయబన్తమగును. దీనికంటె జస్ ప్రత్యయము పరమగునపుడు 'ప్రథమచరమ' (227) సూ. చే, విహితమగు వికల్ప సర్వనామసంజ్ఞ ప్రాప్తమగుచున్నది. కాని విభక్తియొక్క యపేక్ష గలదగుటవలన (విలంబోపస్థితికమగుటవలన) బహిరఙ్గమగు వికల్ప సర్వనామసంజ్ఞ విభక్తి నిరపేక్షమగుటచే నన్తరఙ్గమగు సర్వాది సూత్రవిహిత నిత్యసంజ్ఞనుగుఱించి యన్తరఙ్గ పరిభాషచే నసిద్ధమగుటవలన నిచట నిత్యసంజ్ఞయే వచ్చును. ఉభయే, డతర, డతమ, ఇవి ప్రత్యయములు. (ప) సంజ్ఞావిధౌ ప్రత్యయగ్రహణే తదన్తగ్రహణం నాస్తి (సంజ్ఞను విధించు శాస్త్రమున ప్రత్యయము తదన్తబోధకము గాదు) అను పరిభాష, ప్రత్యయ గ్రహణపరిభాషాప్రాప్తమగు తదన్తవిధిని నిషేధించును. సుప్తిఙన్తంపదం (30) సూ. లోని అన్తగ్రహణ మీ పరిభాషలో జ్ఞాపకమగును. సంజ్ఞాశాస్త్రమందును ప్రత్యయగ్రహణ పరిభాషచే ప్రత్యయము తదన్తబోధకమగుచో సుప్తిఙ్ పదమనినంతనే తదన్తగ్రహణము సిద్ధమగునుగాన నన్తగ్రహణము వ్యర్థమగును. అయినను కేవల ప్రత్యయములకు సర్వనామసంజ్ఞవలన ప్రయోజనము లేనందున నీ నిషేధమిచట ప్రవర్తించదు. కాన ప్రత్యయగ్రహణ పరిభాషచే డతర, డతమ, ప్రత్యయాన్తములకు (కతర, కతమ) సర్వనామసంజ్ఞ సిద్ధించును. అన్యతరాన్యతమ శబ్దములు ప్రకృతి ప్రత్యయవిభాగ శూన్యములు. కిమ్, యద్, తద్, శబ్దములకంటె డతర, డతను ప్రత్యయములు విధింపబడినవి. కాని యన్యశబ్దముకంటె విధింపబడలేదు గావున నన్యతరశబ్దపాఠము వ్యర్థము గాదని యాశయము. శబ్దశక్తిస్వభావముచే నన్యతరశబ్దము రెండు వస్తువులలో నొకదానిని, అన్యతమశబ్దము మూడు మొదలగు వస్తువులలో నొకదానిని బోధించును. కావున నివి డతర డతమ ప్రత్యయాన్తములు కాకున్నను దోషములేదని యాశయము. వీనిలో నన్యతమ శబ్దమునకు సర్వాదిగణమున పాఠము లేనందున సర్వనామసంజ్ఞ లేదు. త్వ త్వ ఈ రెండు నదంతములు, అన్యశబ్ద సమానార్థకములు. వీనిలో నొకటి యుదాత్తస్వరకము, రెండవది యనుదాత్తస్వరకమని

కొందఱు (కాశికాకారాదులు) అనిరి. మొదటిది తకారాన్తము రెండవది యదన్తమని మఱికొందఱనిరి. సేమశబ్దము సగమను నర్థమును బోధించును. సమ శబ్దము సర్వశబ్ద సమానార్థకము. తుల్యార్థక సమశబ్దమున కీగణమున గ్రహణము లేదు. యథాసంఖ్య మనుదేశస్సమానామ్ (129) సూత్రమున సమానామను నిర్దేశమిందు ప్రమాణము. తుల్యార్థకమగు సమశబ్దమునకు నీగణమున గ్రహణ మున్నచో సుడాగనుమువలన, సమేషామని గావలయును.

1. పూర్వ పరావరదక్షిణోత్తరాపరాధరాణి వ్యవస్థాయామ సంజ్ఞా యామ్. 2. స్వమజ్ఞాతి ధనాఖ్యాయామ్. 3. అన్తరం బహిర్యోగోప సంవ్యా నయోః. ఈ మూడును గణసూత్రములు. పూర్వాదిశబ్దములు తొమ్మిదియును సర్వనామసంజ్ఞ కలవని యర్థము. వ్యవస్థాది శబ్దార్థములు ముందు (ఏతత్సదృశము లగు నష్టాధ్యాయీసూత్ర వ్యాఖ్యాన సందర్భమున) చూపబడును. మూడవ సూత్రమున 'అపురి' అని చెప్పవలయును. పూర్వశబ్దార్థము విశేష్యమగునప్పుడు సంజ్ఞ లేదని యర్థము. అన్తరాయాం పురి (ప్రాకారమునకు వెలుపలనున్నదిగాని లోపలనున్నదిగాని యర్థము).

వివ :—ప్రకృత సూత్రమున నవర్ణాన్తాఙ్గముకంటె పరమయి సర్వనామము కంటె విహితమగు నామ్మునకని యర్థమును చెప్పవలయును. కావుననే యేషామ్, కేషాం, ఇత్యాదులందు సుడాగమము సిద్ధించును. అట్లుకానిచో యద్, కిమ్, ఇత్యాదులదన్తములు గానందున సుడాగమము రాకపోవును. విహిత విశేషణ మును విడిచి సర్వనామము కంటె పరమగు నామ్మునకు సుడాగమమని వ్యాఖ్యా నము చేసినయెడల వర్ణాశ్రమేతరాణాం అనుచోట నాగమము ప్రసక్తమగును. ద్వంద్వేచ (225) సూ. చే, సముదాయమునకు నిషేధముగాని యవయవమునకు లేనందున నామ్ ప్రత్యయము సర్వనామమగు నితరశబ్దముకంటె పరమగుచున్నది.

* 219. పూర్వపరావరదక్షిణోత్తరాపరాధరాణి వ్యవస్థాయామసంజ్ఞాయామ్ 1-1-34 పూర్వపరావరదక్షిణోత్తరాపరాధరాణి, వ్యవస్థాయామ్, అసంజ్ఞాయామ్. (విభాషా, జసి)

ఏతేషాం వ్యవస్థాయామసంజ్ఞాయాం సర్వనామసంజ్ఞా గణపాఠాత్సర్వత్ర యా ప్రాప్తా సా జసి వా స్యాత్ । పూర్వే । పూర్వాః । స్వాభిధేయాపేక్షావధినియమో వ్యవస్థా । వ్యవస్థాయాం కిమ్ । దక్షిణా గాథకాః । కుశలా ఇత్యర్థః । అసంజ్ఞాయాం కిమ్ । ఉత్తరాః కురవః ॥

219. వ్యవస్థావిషయములయి సంజ్ఞావాచకములు గానటువంటి పూర్వ, పర, అవర, దక్షిణ, ఉత్తర, అపర, అధర, ఈ యేడుశబ్దములకు 'పూర్వ

పరావర...యామ్, అనుసర్వాది గణసూత్రముచే నన్నివచనములలో నిత్యముగ ప్రాప్తించెడి సర్వనామసంజ్ఞ జస్ స్థానిక శీ భావవిషయమున వికల్పముగనగును. పూర్వే. పక్షమందు పూర్వాః. స్వాభిధే ..వ్యవస్థా (స్వస్య = పూర్వాది శబ్దముయొక్క, అభిధేయేన = అర్థముచే, అపేక్షస్య = అపేక్షింపబడు, అవధేః = అవధియొక్క, నియమః = నియమము) నియతముగ నవధ్యపేక్షగల యర్థమును బోధించు పూర్వాదులకని యర్థము. దక్షిణా గాథకాః. కుశలులగు గాయకులని యర్థము. ఇచట దక్షిణశబ్దము వ్యవస్థావిషయము గానందున దీనికి సర్వనామసంజ్ఞను వారించుటకు వ్యవస్థాయామనునది యావశ్యకము. ఈ గాయకులు కొందఱికంటె నేర్పరులను నవధ్యపేక్షయము సంభవించిన నది నియతము గానందున నిది యుదాహరణముగాదని యాశయము. అసంజ్ఞాయా మనుదానికి ఉత్తరాః కురవః, అనుచోట నుత్తరశబ్దమునకు సర్వనామసంజ్ఞానివృత్తి ఫలము. సంజయనవాధునిక సంకేతము. సుమేరుపర్వతమున కుత్తరదిశనున్న దేశముల కుత్తరకురువులని యాధునికులు సంకేతమును చేసిరి. కాన నిచట వ్యవస్థయున్నదని స్పష్టమగును. ఇచట నాధునిక సంకేతమే సంజ్ఞయనుటచే చిరంతన సంకేతితములగు దిగ్వాచకములకు విశ్వేషాం దేవానామిత్యాదులందు వేదప్రసిద్ధములగు విశ్వాదులకును, సర్వనామసంజ్ఞ నిశ్శంకముగ ప్రవర్తించును. కురుభూములందుత్తరసంజ్ఞ యాధునికమని, దిగ్వాచకములకు పూర్వాదిసంజ్ఞ చిరంతనమని చెప్పుటలో వ్యాఖ్యాతల వచనములే ప్రమాణము.

* 220. స్వమజ్ఞాతిధనాఖ్యాయామ్ 1-1-35 స్వమ్, అజ్ఞాతిధనాఖ్యాయామ్. (విభాషా, జసి)

జ్ఞాతిధనాన్యవాచినః, స్వశబ్దస్య యా ప్రాప్తా సంజ్ఞా సా జసి వా స్యాత్ । స్వే స్వాః । ఆత్మీయా ఇత్యర్థః । ఆత్మాన ఇతివా । జ్ఞాతిధనవాచినస్తు స్వాః । జ్ఞాతయోఽర్థా వా ॥

220. జ్ఞాతి, ధనము వీనికంటె నితరమగు నర్థమును (ఆత్మీయము, ఆత్మ) బోధించెడి స్వశబ్దమునకు స్వమజ్ఞాతి ధనాఖ్యాయామను గణసూత్రముచే నంతటను నిత్యముగ ప్రాప్తమగు సర్వనామసంజ్ఞ జసాధారమగు శీభావము విషయమై వికల్పముగనగును. స్వే. పక్షమందు స్వాః. తనవారులేక తామని యర్థము. జ్ఞాతి ధనవాచకమగు స్వశబ్దమునకు మాత్రము 'స్వాః' అనియే యగును. జ్ఞాతులు లేక ధనములని యర్థము.

వివ :—అమరము : - స్వో జ్ఞాతావాత్మని స్వం త్రిష్వాత్మీయేస్వో స్త్రియాం ధనే. జ్ఞాతి, ఆత్మ, ఈ యర్థములందు స్వశబ్దము పుంలిఙ్గము. ఆత్మీయుని బోధించు స్వశబ్దము త్రిలిఙ్గము. ధనవాచకమగు స్వశబ్దము పున్నపుంసకము. 'స్వః స్యాత్ పుంస్యాత్మని జ్ఞాతౌ', అని మేదినీకోశము. పై యమరమున కీరీతి నర్థము చెప్పుటలో నీ మేదినీకోశము మొదలగు నిఘంటువులాధారములు. ఇట్లు

స్వశబ్ద మాత్మరూపార్థమున పుంలింగమగుటచే స్వే, స్వాః, అనుదానికి దీక్షితకృతమగు 'ఆత్మానః' అను వివరణము సమఞ్జసముగనే యున్నది. ఇట్లుండ స్వశబ్ద మాత్మరూపార్థమునందు నపుంసకమని చెప్పి ఇందుకుపై యమరమునే ప్రమాణముగ జూపి అందున్న స్వమనుదానికి ఆత్మని అనుదానిలోని కన్వయమును చెప్పి దీక్షితోక్తమగు వివరణ మసంగతమని కొందఱనిరి. కోశాన్తరముల జూడక జేయబడిన యమరసమన్వయ మప్రమాణమగుటవలన వారివాద మెంతమాత్రము గ్రాహ్యముకాదు.

* 221. అన్తరం బహిర్యోగోపసంవ్యానయోః 1-1-36 అన్తరమ్, బహిర్యోగోపసంవ్యానయోః. (విభాషా, జసి)

బాహ్యే పరిధానీయే చార్థే అన్తరశబ్దస్య యా ప్రాప్తా సంజ్ఞా సా జసి వా స్యాత్ । అన్తరే అన్తరా వా గృహాః । బాహ్యా ఇత్యర్థః । అన్తరే అన్తరా వా శాటకాః । పరిధానీయా ఇత్యర్థః ॥

221. బహిశ్శబ్దమున కావరణశూన్యమగు ప్రదేశము, అట్టి ప్రదేశమున నున్న వస్తువు (అనగా బాహ్యము) ఈ రెండర్థములు భాష్యమందు చెప్పబడినవి. వీనితో సంబంధముగల వస్తువును, ఉత్తరీయమును (భుజములపై ధరించు వస్త్రమును) బోధించు నన్తరశబ్దమునకు 'అన్తరం...యోః' అను గణసూత్రముచే నిత్యముగ ప్రాప్తమగు సర్వనామసంజ్ఞ జసాధారమగు శీ భావము విషయమై వికల్పముగనగును. అన్తరే. పక్షమందు అన్తరాః. బాహ్యములని యర్థము. అనావృత ప్రదేశములతో సంబంధియను మొదటి యర్థమును స్వీకరించి యీ యుదాహరణము చెప్పబడెను. రెండవ యర్థమందు 'అన్తరే అన్తరాః' అను దానికి అభ్యంతరములని యర్థము. అభ్యంతరము బాహ్యముతో సంబంధము గలదగును. ఉత్తరీయమను నర్థమం దుదాహరణము:—అన్తరే, అన్తరా వాశాటకాః.

* 222. పూర్వాదిభ్యో నవభ్యో వా 7-1-16 పూర్వాదిభ్యః, నవభ్యః, వా. (ఙసిఙ్యోః, స్మాత్స్మినౌ)

ఏభ్యో ఙసిఙ్యోః స్మాత్స్మినౌ వా స్తః । పూర్వస్మాత్ । పూర్వాత్ । పూర్వస్మిన్ । పూర్వే । ఏవం పరాదీనామపి । శేషం సర్వవత్ । ఏకశబ్దః సంఖ్యాయాం నిత్యైకవచనాన్తః ॥

222. 'పూర్వపర' మొదలగు సూత్రత్రయమందు గ్రహింపబడిన తొమ్మిది శబ్దములకంటె పరమగు ఙసి, ఙి, వీనికి క్రమముగ స్మాత్, స్మిన్ ఆదేశములు వికల్పముగనగును. పూర్వస్మాత్ పక్షమందు పూర్వాత్. పూర్వస్మిన్ పక్షమందు పూర్వే. ఇట్లే పరాదులకును. మిగిలినచోట నివి సర్వశబ్ద సదృశములు.

సంఖ్యావాచకమగు నేకశబ్దము నిత్యైకవచనాన్తము (ద్వివచన బహువచనాంతముగాదు)

వివ:—శ్లో॥ ఏకోఽన్యార్థే ప్రధానేచ ప్రథమే కేవలే తథా. సాధారణే సమానేఽల్పే సంఖ్యాయాంచ ప్రయుజ్యతే. ఏకశబ్దమునకు అన్యము, ప్రధానము, ప్రథమము, కేవలము, సాధారణము, సమానము, అల్పము, సంఖ్య, ఈ ఎనిమిది యర్థములు గలవు. సంఖ్యారూపార్థమందే ఏకవచనాన్తమనుటచే మిగిలిన యర్థములందు ద్వివచన బహువచనాంతమునగును. ఏకే, ఏకేషామ్ ఇత్యాదులు.

* 223. న బహువ్రీహౌ 1-1-29. న, బహువ్రీహౌ. (సర్వనామాని)

బహువ్రీహౌ చికీర్షితే సర్వనామసంజ్ఞా న స్యాత్। త్వకం పితా యస్యసత్వత్కపితృకః। అహకం పితా యస్యసమత్కపితృకః। ఇహ సమాసాత్ప్రాగేవ ప్రక్రియావాక్యే సర్వనామసంజ్ఞా నిషిధ్యతే। అన్యథా లౌకికే విగ్రహవాక్య ఇవ తత్రాప్యకచ్ ప్రవర్తేత। సచ సమాసేపి శ్రూయేత। అతిక్రాన్తో భవకన్తమతిభవకానితివత్। భాష్యకారస్తు త్వకత్పితృకో మకత్పితృకఇతి రూపే ఇష్టాపత్తిం కృత్వైతత్సూత్రం ప్రత్యాచఖ్యౌ। యథోత్తరం మునీనాం ప్రామాణ్యమ్। సంజ్ఞోపసర్జనీభూతాస్తు నసర్వాదయః। మహాసంజ్ఞాకరణేన తదనుగుణానామేవ గణే సన్నివేశాత్। అతస్సంజ్ఞా కార్యమన్తర్గణ కార్యంచ తేషాం న భవతి। సర్వోనామకశ్చిత్తస్మై సర్వాయ దేహి। అతిక్రాంత స్సర్వమతిసర్వస్తస్మై అతిసర్వాయదేహి। అతికతరం కులమ్। అతితత్।

223. బహువ్రీహి సమాసముచేయుట కిష్టమయినపుడు సమాసప్రవృత్తికొఱకు శాస్త్రకారులచే గల్పితమగు వాక్యమందుండు సర్వాదులకు సర్వనామసంజ్ఞ రాదు. త్వకం, పితా యస్యస, త్వత్కపితృకః. అహకం పితా యస్య స, మత్కపితృకః. ఇచట సమాసమునకు పూర్వమే అలౌకిక విగ్రహ వాక్యమునందు (యుష్మద్ + సు, పితా + సు) సర్వనామసంజ్ఞ నిషేధింపబడును. (సమాసార్థమును వివరించు వాక్యము విగ్రహమనబడును. లౌకికమనియు నలౌకికమనియు నది రెండు విధములు. లోకమున ప్రయోగార్హము లౌకికము (రాజ్ఞః పురుషః) శాస్త్రప్రక్రియా నిర్వాహార్థము శాస్త్రకారులచే కల్పింపబడినదిగాన లోకమున బ్రయోగార్హముగానిది యలౌకికము (రాజన్ + ఙస్, పురుష + సు) కావున యుష్మదస్మచ్ఛబ్దములకు సర్వనామ సంజ్ఞాప్రయుక్తమగు నకచ్ ప్రత్య

యమురాక కప్రత్యయమే వచ్చును. అలౌకికవిగ్రహ వాక్యమునందే నిషేధము చేయబడనిచో లౌకికవిగ్రహ వాక్యమందు (త్వకంపితాయస్య) వలె నిచటను అకచ్ ప్రత్యయము ప్రసక్తమగును. అని (అకచ్) బహువ్రీహి సమాసమునందును వినబడవలసి వచ్చును. 'అతిక్రాన్తో భవకస్స మతిభవకాన్' ఇచట లౌకికవిగ్రహ వాక్యమునందు ప్రవర్తించిన యకచ్చు సమాసమందు నెట్లు వినబడుచున్నదో, యట్లే పూర్వము చెప్పిన యలౌకికవిగ్రహమందు దకచ్చు ప్రవర్తించినచో సమాసమందును వినబడవలసివచ్చునని యాశయము. పాణిని మతమునకు విరుద్ధముగ భాష్యకారు డకచ్ సహితములగు త్వకత్పితృకః, మకత్పితృకః, అను రూపము లిష్టమని యీ సూత్రమును ప్రత్యాఖ్యానము చేసెను. ఋషిద్వయ సమ్మతములగు వీనిలో నేది గ్రాహ్యమనిన "యథోత్తరం మునీనాం ప్రామాణ్య" మనువచనముచే భాష్యసమ్మతమగునదే గ్రాహ్యమని యెఱుంగునది. పాణిని కాత్యాయన పతంజలుల యుత్తరము నతిక్రమింపకయే ప్రామాణ్యమని మీదివచనమున కర్థము. పాణినివచనములు కాత్యాయన పతంజలుల వచనములతో విరుద్ధములుగానపుడు ప్రమాణములగును. ఇట్లే కాత్యాయన వచనములును పతంజలి వచనములతో విరుద్ధములుగానపుడు ప్రమాణములు. భాష్యకార వచనములతో విరోధమున్నపుడు పాణినికాత్యాయనుల వాక్యములకు ప్రామాణ్యము లేదని ఫలితము. కాన ప్రకృతమున భాష్యకారోక్తిచేతనే వ్యవస్థచేయుట యుచితము గావున త్వత్కపితృకః అను రూపము సాధువుగాదనియే చెప్పవలయును. కాని స్మృతిద్వయ ప్రామాణ్యమున వికల్పమునదగును. (వా) సంజ్ఞలు, అప్రాధాన్యముగ నర్థబోధకములైనను, సర్వాదులు సర్వనామసంజ్ఞకలవి కావు. "సర్వనామ (సర్వేషాంనామ) అను మహాసంజ్ఞను చేయుటవలన ప్రధానముగ సర్వాద్యర్థోపస్థాపకములగు సర్వాదులకే గణమందనుకరణ మావశ్యకమగుటచే నితరములకు సంజ్ఞ లేదని యాశయము. మహాసంజ్ఞవలన సిద్ధమగు నర్థమునే యీ వార్తికము బోధించును. ఇందువలన సర్వనామ సంజ్ఞాప్రయుక్తములగు స్మాయాదులు, అవర్ణకార్యములు (త్యదాదీనామః 266 మొదలగు సూత్రములచే విహితములగు అత్వము మొదలగునవి) సంజ్ఞోపసర్జనములగు సర్వాదులకు ప్రవర్తింపవు. సంజ్ఞావాచకమగు సర్వశబ్దమునకు చతుర్థ్యేకవచనము సర్వాయ అని యగును గాని సర్వస్మై అనికాదు. అతిక్రాన్తస్సర్వ మతిసర్వః, (సర్వము నతిక్రమించినవాడు) ఇచట సర్వశబ్దార్థ మప్రధానమగుటవలన సర్వశబ్ద ముపసర్జనమయినది. కాన నతి సర్వశబ్దమునకును 'అతిసర్వాయ' మొదలగు రూపములగును. అతికతరం కులమ్. (అతిక్రాన్తంకతరమ్) ఇచట అద్డ్డతరాదిభ్యః పఞ్చభ్యః (316) సూ. చే, నద్ డాదేశము రాదు. అతితత్ (తమతిక్రాన్తః) ఇచట తదోస్సఃసా వనంత్యయోః (383) సూ. చే, సత్వము, అత్వమును ప్రవర్తింపవు.

* 224. తృతీయాసమాసే 1-1-30 (సర్వనామాని).

అత్ర సర్వనామతా న స్యాత్। మాసపూర్వాయ। తృతీయా సమాసార్థవాక్యేపి న। మాసేన పూర్వాయ॥

224. తృతీయా సమాసమునకు సర్వనామసంజ్ఞ లేదు. మాసపూర్వాయ (మాసేనపూర్వః తస్మై) విభాషా దిక్సమాసే బహువ్రీహౌ (1-1-28) సూత్రము నుండి సమాసే అనునది యనువృత్తమగుచుండ తిరుగ నీసూత్రమున సమాస గ్రహణము చేయుటవలన తృతీయా సమాసముకొఱకగు వాక్యమందును సర్వ నామ సంజ్ఞానిషేధమగునను నర్థము లభించును. మాసేన పూర్వాయ.

* 225. ద్వంద్వే చ 1-1-31 ద్వంద్వే, చ (న, సర్వనామాని).

ద్వంద్వే ఉక్తా సంజ్ఞా న। వర్ణాశ్రమేతరాణామ్। సముదాయస్యాయం నిషేధో, నత్వవయవానామ్। నచైవం తదన్తవిధినా సుట్ ప్రసఙ్గః। సర్వనామ్నో విహితస్యామః సుడితి వ్యాఖ్యాతత్వాత్ ॥

225. ద్వంద్వసమాసమునకు సర్వనామసంజ్ఞ లేదు. వర్ణాశ్రమేతరాణామ్. ఇచట సర్వనామసంజ్ఞ లేనందున ఆమి సర్వనామ్నః (218) సూ. చే, విహిత మగు సుడాగమము ప్రవర్తించదు. ఈ నిషేధము సముదాయమునకేగాని యవ యవమునకు గాదు, 'ఆమి సర్వనామ్నస్సుట్', అను సూత్రమునకు సర్వనామము కంటె విహితమగు ఆమ్ ప్రత్యయమునకు సుడాగమమని వ్యాఖ్యానము చేయుట వలన, నవయవమునకు నిషేధము లేనందున తదంతవిధిచే 'వర్ణాశ్రమేతరాణామ్' అనుచోట సుడాగమమునాశంకింపరాదు. ఇచట నామ్ ప్రత్యయము సము దాయముకంటె విహితమయినది. అవయవము సర్వనామమైనను సముదాయము సర్వనామము గాదు.

వివ :—త్వకత్పితృకః ఇత్యాదులందు సమాసాదులకంటె పూర్వ మన్తరఙ్గ ములగు నకచ్ స్వరములు ప్రవర్తించునని భాష్యకారుడు చెప్పుటచే 'నబహు వ్రీహౌ' సూత్రమందలి సప్తమీ నిర్దేశము ప్రథమార్థకమని చెప్పి బహువ్రీహికే నిషేధమనవలయును. 'ద్వంద్వేచ' అను సూత్ర మీ ప్రకరణమున నుండుటచే నిచటను సప్తమీనిర్దేశము ప్రథమార్థకమేయనుట యుచితము. కావున ద్వంద్వ సమాసమునకే సంజ్ఞానిషేధముగాని ద్వంద్వావయవములకుగాదని లభించును.

* 226. విభాషా జసి 1-1-32. విభాషా, జసి, (ద్వంద్వే, సర్వనామాని).

జసాధారం యత్కార్యం శీభావాఖ్యం తత్ర కర్తవ్యే ద్వన్ద్వే ఉక్తా సంజ్ఞా వా స్యాత్। వర్ణాశ్రమేతరే, వర్ణాశ్రమేతరాః। శీభావం ప్రత్యేవ విభాషేత్యుక్తమతో నాకచ్। కింతు కప్రత్యయ ఏవ। వర్ణాశ్రమేతరకాః ॥

226. జస్[1] ప్రత్యయ మాధారముగాఁగల శీభావమనెడి కార్యము జేయు నప్పుడు ద్వంద్వసమాసమునకు సర్వనామసంజ్ఞ వికల్పముగ నగును. వర్ణాశ్రమేతరే (సంజ్ఞయున్నపుడు శీభావము వచ్చును) పక్షమందు వర్ణాశ్రమేతరాః (సంజ్ఞ లేనపుడు శీభావమురాదు) శీభావమును చేయునప్పుడు మాత్రము సంజ్ఞావికల్ప మగునని చెప్పుటవలన సముదాయమందలి[2] కుత్సను (నిందను) బోధించునప్పు డకచ్ ప్రత్యయమురాదు గాన కప్రత్యయమే వచ్చును. "వర్ణాశ్రమేతరకాః."

వివ:—జసి[1] అనునది యాధార సప్తమ్యన్తము. శీభావముచే జస్సుపహృతమయిన నౌపచారికమగు నాధారమును గ్రహింపవలయును. లేక, జసః ఇః = జసిః తస్మిన్, జసి. ఇచట సప్తమికి లుక్కు వచ్చెను. జస్స్థానికమగు నీకారము చేయునపుడని యర్థము. ఇకారముచే నీకారము బోధింపబడును. ఇట్లు మూలోక్తమగు జసాధారమనునర్థము లభించెను. 'కుత్సిత[2] ఇతరః = ఇతరకః' అని యకచ్ ప్రత్యయము చేసినపిదప ద్వంద్వసమాసమనినచో సంజ్ఞావికల్పమున వర్ణాశ్రమేతరకే వర్ణాశ్రమేతరకాః అను రూపద్వయము సాధువగును. ఇతర శబ్దముతో ద్వంద్వము చేసి 'కుత్సితా వర్ణాశ్రమేతరాః' అను సముదాయగతమగు నిందను వివక్షించునపుడు మాత్రము సముదాయమునకు సంజ్ఞ నిషిద్ధమయినందున అకచ్చు ప్రవర్తించదు గాన కప్రత్యయముచే 'వర్ణాశ్రమేతరకాః' అను నొకరూపమే సాధువగునని భావము.

*** 227. ప్రథమచరమతయాల్పార్ధకతిపయనేమాశ్చ 1-1-33.**
ప్రథమ... నేమాః, చ. (విభాషా. జసి, సర్వనామాని)

ఏతే జసః కార్యం ప్రత్యుక్తసంజ్ఞా వా స్యుః । ప్రథమే, ప్రథమాః । శేషం రామవత్ । తయః ప్రత్యయః । తత స్తదన్తా గ్రాహ్యాః । ద్వితయే । ద్వితయాః । శేషం రామవత్ । నేమే । నేమాః । శేషం సర్వవత్ । వా॰ । విభాషాప్రకరణే తీయస్య జిత్సూపసంఖ్యానమ్ । ద్వితీయస్మై, ద్వితీయాయ । ఏవం తృతీయః । అర్థవద్గ్రహణాన్నేహ । పటుజాతీయాయ । నిర్జరః ॥

227. ప్రథమ, చరమ, తయప్రత్యయము, అల్ప, అర్ధ, కతిపయ, నేమ, ఇవి జసాధారమగు శీభావమును చేయుచున్నపుడు వికల్పముగ సర్వనామ సంజ్ఞ కలవగును. ప్రథమే (సంజ్ఞ యున్నపుడు) ప్రథమాః (సంజ్ఞ లేనపుడు) మిగిలినచోటులం దిది రామశబ్ద సదృశమే. తయ అనునది ప్రత్యయముగావున తదన్తములం గ్రహింపదగినవి. ద్వితయే, ద్వితయాః. ద్విశబ్దముకంటె "సంఖ్యాయా అవయవే తయప్ (5-2-42) సూ. చే, తయపు విహితమయినది. శేషము

రామశబ్ద సదృశము. నేమే, నేమాః. శేషము సర్వశబ్దమువలెనే. నేమశబ్దమునకు సర్వనామసంజ్ఞ నిత్యముగా ప్రాప్తమగుచుండ నితరముల కప్రాప్తమగుచుండ నీ సూత్రము నారంభించుటచే నిది యుభయత్ర విభాషయగును. (వా) 'విభాషా...సంఖ్యానమ్ = తీయప్రత్యయాన్తమునకు ఙకారేత్సంజ్ఞకప్రత్యయములు పరమగునపుడు వికల్పముగ సర్వనామసంజ్ఞను చెప్పవలయును. ద్వితీయస్మై. పక్షమందు ద్వితీయాయ. ఇట్లే మిగిలిన ఙిత్తులందును. తృతీయశబ్దమునకు నిట్లే యూహింపదగును. అర్థవత్తయిన తీయప్రత్యయమన్తమందు గలదానికని వ్యాఖ్యానము చేయుటవలన పటుజాతీయాయ, అనుచోట సంజ్ఞ వారింపబడును. పటుజాతీయ అనునది పటుశబ్దముకంటె జాతీయర్ ప్రత్యయాన్తము గావున ప్రత్యయైకదేశమగు తీయ, అనునది యనర్థకము.

నిర్జరః. (న విద్యతే జరా యస్య. గోస్త్రియోరుపసర్జనస్య 1-2-48 సూ. చే, హ్రస్వము ప్రవర్తించిన, నిర్జర అనియగును. సుప్రత్యయము, రుత్వ విసర్గములు)

* 228. జరాయా జరసన్యతరస్యామ్. 7-2-101. జరాయాః, జరస్, అన్యతరస్యామ్ (అచి, విభక్తౌ)

జరాశబ్దస్య జరస్ వా స్యాదజాదౌ విభక్తౌ। పదాఙ్గాధికారే తస్య చ తదన్తస్య చ। అనేకాల్ త్వాత్సర్వాదేశే ప్రాప్తే। నిర్దిశ్యమానస్యాదేశాభవన్తి। ఏకదేశవికృతస్యానన్యత్వాత్ జరశబ్దస్య జరస్। నిర్జరసౌ। నిర్జరసః। ఇనాదీన్ బాధిత్వా పరత్వాజ్జరస్। నిర్జరసా, నిర్జరసే, నిర్జరసః, పక్షే హలాదౌ చ రామవత్। వృత్తికృతాతు పూర్వవిప్రతిషేధేన, ఇనాత్యోః కృతయోః సన్నిపాత పరిభాషాయా అనిత్యత్వమాశ్రిత్య జరసి కృతే నిర్జరసిన, నిర్జరసాత్ ఇతిరూపే, నతు నిర్జరసా, నిర్జరసఇతి కేచిదిత్యుక్తమ్। తథా భిసి నిర్జరసైరితిరూపాన్తరముక్తం। తదనుసారిభిశ్చ మష్ఠ్యేకవచనే నిర్జరస్యేత్యేవ రూపం స్వీకృతమ్। ఏతచ్చ భాష్యవిరుద్ధమ్॥

228. జరాశబ్దమున కజాదివిభక్తి పరమగునపుడు జరసాదేశము వికల్పముగనగును. పదస్య, అఙ్గస్య, అను నధికారములలోని సూత్రములందు పదము, అఙ్గము, విశేష్యమగును. సూత్రగృహీతమగునది విశేషణమగుటవలన 'యేనవిధిస్తదన్తస్య, సూ. చే, తదన్తవిధి కలుగునని యర్థము. కాన ఈ పరిభాష, యేనవిధిః, అను సూత్రమునకు ప్రపఞ్చభూతముగాని యపూర్వముగాదు. ఈ సూత్ర మఙ్గాధికారములోనిదగుటచే జరాశబ్దమన్తమందుగల అఙ్గమునకు అజాది విభక్తి పరమగునపుడు జరసాదేశమగునను నర్థము సూత్రమునకు లభించును.

జరసాదేశ మనేకాల్లగుటవలన (అనేకాల్ శిత్సర్వస్య) అను పరిభాషచే నిర్జర అను సముదాయమునకు (అజ్గమునకు) ఆదేశము ప్రసక్తమగుచున్నది కాని, (పరి) నిర్దిశ్యమానస్యాదేశా భవన్తి (నిర్దిశ్యమానమనగా నాదేశవిధాయక సూత్రమున నేపదము శ్రుతమయి యుద్దేశ్యబోధకమగునో యాపదముయొక్క యుచ్చారణచే నియతముగ నుపస్థితమగునది. ఇట్టి నిర్దిశ్యమానమునకే యాదేశములు వచ్చును. (ప్రతీయమానమునకు రావు) అను పరిభాషచే నిర్దిశ్యమానమునకే యాదేశము వచ్చును. ప్రకృతమున జరసాదేశవిధాయక సూత్రమునలో శ్రుతము, ఉద్దేశ్యబోధకమునగునది, జరాయాః అను పదమగుటచే దానిచే లక్ష్యమున నియతముగ నుపస్థితమగునది జరాశబ్దమే కనుక నిర్జరశబ్దములోని జరాశబ్దమునకే యాదేశమగును, గాని తదన్తమునకు రాదని యాశయము. నిర్జరశబ్దములోని జరశబ్దము హ్రస్వాన్తము. సూత్రమున నిర్దిశ్యమానము టాబన్తజరాశబ్దము, కాన నిచట యాదేశము ప్రవర్తింపకున్నది. కాని (పరి) ఏకదేశవికృత మనన్యవత్ అను పరిభాషచే జరాశబ్దమం దాకారమునకు హ్రస్వము ప్రవర్తించినంతమాత్రమున జరాశబ్దముకంటె జరశబ్ద మన్యముకాదు. కావున జరశబ్దమునకు నాదేశము ప్రవర్తించును. నిర్జర + ఔ = నిర్జరసౌ, నిర్జర + జస్ = నిర్జరసః. నిర్జర + టా = నిర్జరసా, నిర్జరసే (నిర్జర + ఙే) నిర్జరసః (నిర్జర + ఙసి) నిర్జరసః (నిర్జర + జస్) 'నిర్జరసా' ఇత్యాదులందు క్రమముగ, ఇన, ఆత్, స్య, అను విభక్త్యాదేశములు వచ్చుచున్నవి గాని వానిని బాధించి పరమగు జరసాదేశమే ప్రవర్తించును. అజాది విభక్తులు పరమగునపుడు, జరసాదేశము రానిపక్షమందును, హలాది విభక్తులు పరమగునపుడును, రామశబ్దమునకువలె నిర్జరశబ్దమునకు ప్రక్రియ నూహించునది.

విప్రతిషేధే పరం కార్యమ్ (176). అను సూత్రమున 'అపరమ్' అని ఛేదము చేయుటవలన సమానమగు బలముగల రెండు శాస్త్రము లొకలక్ష్యమందు ప్రసక్తములగునపుడు పూర్వశాస్త్రమే ప్రవర్తించునని యర్థము లభించును. దీనినే పూర్వవిప్రతిషేధ మందురు. (ప్రమాణమున్నయెడల దీని నంగీకరింతురు) ప్రకృతమున పూర్వవిప్రతిషేధముచే, నిర్జర + టా, ఇత్యాదులందు జరసాదేశమును బాధించి క్రమముగ ఇన, మొదలగు నాదేశములు ప్రథమమున ప్రవర్తించును. పిదప సన్నిపాత పరిభాషచే (అదన్తాజటాది సన్నిపాతముచే వచ్చిన ఇనాదు లుపజీవ్యమయిన యదన్తత్వమునకు విఘాతుకములగువానికి నిమిత్తము కావు) జరసాదేశ మప్రాప్తమగుచుండ నా పరిభాషక నిత్యత్వము నాశ్రయించి జరసాదేశముచేసిన, నిర్జరసిన, నిర్జరసాదిత్యాదులగును. కాని 'నిర్జరసా నిర్జరసః, అనిగావని కొందరు చెప్పిరని కాశికావృత్తికారుడు చెప్పెను.

ఇనాద్యాదేశముల విషయమై పూర్వవిప్రతిషేధమును, సన్నిపాతక పరిభాషక నిత్యత్వము నాశ్రయించుటలో ఇనాదేశమున నికారోచ్చారణము, ఆదాదేశమున దీర్ఘోచ్చారణమును ప్రమాణము. రామేణ, రామాత్, అను రూపములు ఇనాదేశమున నికారము ఆదాదేశమున దీర్ఘోచ్చారణము లేకపోయినను సిద్ధము

లగును. ఎట్లన, ఆజీచాపః (290) సూత్రమున 'ఆజీచ' అని విభాగముచేసి, ఆజ్ (టా అనుదానికి ఆజని వ్యవహారము) పరమగునపు డదన్తాఙ్గమున కేత్వమని యర్థము చెప్పినచో, రామ + న, అనుచోట స్థానివద్భావముచే నేత్వము ప్రవర్తించిన, రామేణ, అని సిద్ధమగును. 'రామ + అత్' ఇచట సవర్ణదీర్ఘము చేసిన 'రామాత్' అని యగును. అకారోచ్చారణ సామర్థ్యమువలన పరరూపము ప్రవర్తించదు. కావున నికార దీర్ఘోచ్చారణములు వ్యర్థములయి పూర్వవిప్రతిషేధమందును, సన్నిపాత పరిభాషా నిత్యత్వమందును జ్ఞాపకములగుననియు 'నిర్జరసిన' నిర్జరసాత్, అనుచోట శ్రవణార్థమే ఇకార దీర్ఘోచ్చారణములనియును కేచిత్కారుల యాశయము. నిర్జర + భిస్, ఇచటను పూర్వోక్త రీతి ననుసరించి 'నిర్జరసైః' అని యగునని చెప్పిరి. 'అతో భిస ఐస్' అను సూత్రముచే ఏసాదేశమును విధించినను 'రామైః' ఇత్యాదులందు 'వృద్ధిరేచి' సూ. చే, వృద్ధి ప్రవర్తించిన నభీష్టరూపసిద్ధి యగుచుండ నైకారోచ్చారణము కూడ వ్యర్థమై పూర్వవిప్రతిషేధమందు సన్నిపాత పరిభాషా నిత్యత్వమందును ప్రమాణమగుననియును కేచిత్కారుల యాశయము.

"టాజసి" అను సూత్రమున ఇనాదేశాదుల విషయమున పూర్వ విప్రతిషేధము నాశ్రయించిన కేచిత్కారుల ననుసరించి మరికొంద రా సూత్రమున స్యాదేశమందును పూర్వవిప్రతిషేధము నాశ్రయించి 'నిర్జర + అస్' అనుచోట బూర్వము స్యాదేశము ప్రవర్తించుననియు, పిదప నజాదివిభక్తి పరముగ లేనందున జరసాదేశము రానందున 'నిర్జరస్య' అను నొకేరూపమగుననియును చెప్పిరి. పై చూపిన కేచిత్కారమతము, తదనుసారుల మతముగూడ, భాష్యవిరుద్ధము. 'ఆజీచాపః' సూత్రమున కేచిత్కారులు చెప్పినట్లే యోగవిభాగము మొదలగు వానిని జెప్పి ఇకారము దీర్ఘోచ్చారణము భాష్యమున ప్రత్యాఖ్యాతము లగుట చేతను 'నిర్జరైః' అనియే కావలయునను భాష్యోక్తిచేతను పూర్వవిప్రతిషేధమును సన్నిపాత పరిభాషానిత్యత్వము నాశ్రయించుట భాష్యవిరుద్ధమగునని దీక్షితాశయము.

* 229. పద్దన్నోమాస్హృన్నిశసన్యూషన్దోషన్యకఞ్ఛకన్నుదన్నాసఞ్ఛస్ప్రభృతిషు. 6_1_63 (అన్యతరస్యామ్)

పాద, దన్త, నాసికా, మాస, హృదయ, నిశా, అసృజ్, యూష, దోష, యకృత్, శకృత్, ఉదక, ఆస్య, ఏషాం పదాదయ ఆదేశా స్యుః, శసాదౌ వా। యత్తు ఆసనశబ్దస్య ఆసన్నాదేశ ఇతి కాశికాయాముక్తం, తత్ప్రామాదికమ్। పాదః, పాదౌ, పాదాః, పాదం, పాదౌ। పదః, పాదాన్। పదా। పాదేన, ఇత్యాది॥

229. [1] పాదశబ్దము మొదలు పదమూడు శబ్దములకు శస్ ప్రత్యయ సదృశములు పరమగునపుడు పదాద్యాదేశములు [2] వికల్పముగ నగును. [1] పాద (పద్) [1] దన్త (దత్) [3] నాసికా (నస్) [4] మాస (మాస్) [5] హృదయ (హృద్) [6] నిశా (నిశ్) [7] అసృజ్ (అసన్) [8] యూష (యూషన్) [9] దోష (దోషన్) [10] యకృత్ (యకన్) [11] శకృత్ (శకన్) [12] ఉదక (ఉదన్) [13] ఆస్య (ఆసన్) ఆసనశబ్దమున కాసన్నాదేశమని కాశికావృత్తియందు చెప్పబడెను. అది పారపాఠము. పాదః (పాద + సు) పాదౌ. పాదాః. పాదమ్. పాదౌ. పదః (పాద + శస్) పదాదేశము. పక్షమందు, పాదాన్. పదా (పాద + టా) ఆదేశాభావ పక్షమందు. పాదేన. ఇట్లే తక్కిన విభక్తులందును కార్యముల నూహించునది.

వివ :—1. పదాద్యాదేశములకు నిమిత్తములుగ స్వీకరింపబడిన శస్ ప్రభృతులచే పదాద్యాదేశములకు సదృశములగు (స్వార్థబోధన సమర్థములు స్వసదృశవర్ణములుగలవి) పాదదన్తాది స్థానులు (ప్రకృతులు) ఆక్షిప్తములగునని యాశయము.

2. ఈ సూత్రములోనికి అనుదాత్తస్య చర్దుపధస్యా చాన్యతరస్యాం (6-1-59) సూత్రమునుండి అన్యతరస్యామనునది యనువర్తించును. కనుకనే (వికల్పముగ నాదేశములగుటచే) "ఆస్యే తుల్యః, పాదేనోపహతమ్, ఇత్యాది భాష్యప్రయోగములు సాధువులగును. 'హృదయస్య ప్రియః' అను సౌత్ర ప్రయోగముగూడ నుపపన్నమగును.

3. 'హవ్యా జుహ్వాన ఆసని' "ఆసన్యం ప్రాణమూచుః, ఇత్యాది స్థలములందు 'ఆసన్' అనుదానికి ముఖమను నర్థము చెప్పకతప్పదు. వేదభాష్యమునందు నిట్లే వ్యాఖ్యానము చేయబడెను. కావుననే కాశికావ్యాఖ్యాత యగు హరదత్తుడు పై కారణములజూపి వృత్తిగ్రంథమునకు ప్రామాదికత్వమును స్పష్టపరచెను.

* 230. సుడనపుంసకస్య 1-1-43 సుట్, అనపుంసకస్య.
(సర్వనామస్థానమ్)

సుట్ ప్రత్యాహారః। స్వాదిపఞ్చవచనాని
సర్వనామస్థాన సంజ్ఞాని స్యురక్లీబస్య ॥

230. 'సుట్' అనునది సుప్రత్యయమునకు ఔట్‌లోని టకారముతో ప్రత్యాహారము. స్త్రీలిఙ్గ పుంలిఙ్గములలో సు, ఔ, జస్, అమ్, ఔట్, ఈ యైదువచనములు సర్వనామస్థానసంజ్ఞ గలవగును.

* 231. స్వాదిష్వసర్వనామస్థానే 1-4-17 స్వాదిషు, అసర్వనామస్థానే. (పదమ్)

కప్ప్రత్యయావధిషు స్వాదిష్వ సర్వనామస్థానేషు పరతః పూర్వం పదసంజ్ఞం స్యాత్ ॥

231. ఉరః ప్రభృతిభ్యః కప్ (5-4-151) సూత్రవిహితమగు కప్ ప్రత్యయ మంతమందును స్వౌజసమౌట్ సూత్రవిహితమగు సుప్రత్యయ మాదియందు నుగల్గి సర్వనామస్థానభిన్నములగు ప్రత్యయములు పరమగునపుడు పూర్వము పదసంజ్ఞ గలదగును. 'స్వాదిషు' అనుచోట నాదిపదముచే శిష్టుల వ్యాఖ్యానమువలన కప్ప్రత్యయము వరకుండు ప్రత్యయములు గ్రహింపబడును. ఇట్లు లబ్ధమయినదే 'కప్ప్రత్యయావధిషు' అనునది.

* 232. యచి భమ్ 1-4-18 యచి, భమ్, (స్వాదిషు, అసర్వనామస్థానే)

యకారాదిష్వజాదిషుచ కప్ప్రత్యయావధిషు స్వాదిష్వసర్వనామస్థానేషు పరతః పూర్వం భసంజ్ఞం స్యాత్ ॥

232. 'యచి' అనునది సమాహారద్వంద్వము (యశ్చ అచ్, చ = యచ్, తస్మిన్) ఇది వర్ణబోధక సప్తమ్యన్తమగుటచేతను స్వాదిషు అనుదానికి విశేషణ మగుటచేతను "యస్మిన్ విధిః, అను పరిభాషచే తదాదిని బోధించును. యకారముగాని అచ్చుగాని ఆదియందుగలిగి కప్ప్రయావధికములును సర్వనామస్థాన భిన్నములునగు స్వాదులు పరమగునపుడు పూర్వము భసంజ్ఞకమగును.

* 233. ఆకడారాదేకా సంజ్ఞా 1-4-1 ఆకడారాత్, ఏకా, సంజ్ఞా.

ఇత ఊర్ధ్వం కడారాః కర్మధారయ ఇత్యతః ప్రాగేకస్యైకైవ సంజ్ఞా జ్ఞేయా। యా పరాఽనవకాశా చ। తేన శసాదావచి భసంజ్ఞైవ। న పదత్వమ్। అతో జశ్త్వం న। దతః, దతా। జశ్త్వమ్। దద్భ్యామిత్యాది। మాసః। మాసా। భ్యామి రుత్వే యత్వేచ యలోపః। మాభ్యాం, మాభిరిత్యాది ॥

233. ఈ సూత్రము మొదలుకొని, కడారాః కర్మధారయే (2-2-38) సూత్రమునకు పూర్వమునందుండు సూత్రములచే విధింపబడిన సంజ్ఞలలో నొకదానికొకే సంజ్ఞయగును. అట్టివి రెండుసంజ్ఞ లొకచోట ప్రవర్తించవని యభిప్రాయము. సావకాశములగు రెండు సంజ్ఞలకొకచోట ప్రసక్తియున్నపుడు పరమయినదే ప్రవర్తించును. సంజ్ఞలలో నొకటి యనవకాశమైనదగునపు డదే

ప్రవర్తించునని యూహింపదగును. ప్రకృతమున పరము ననవకాశమునగుటచే భసంజ్ఞ, పదసంజ్ఞను బాధించి ప్రవర్తించును. కనుక శస్ మొదలగు నజాది ప్రత్యయములు పరమగునపుడు భసంజ్ఞయేకాని పదసంజ్ఞ రాదు. దన్తశబ్దమునకు దతాదేశము ప్రవర్తించినపిదప, దత్ + శస్, దత్ + టా అని యుండగా పదసంజ్ఞ లేనందున జశ్త్వము రాదు. దతః, దతా. హలాదిప్రత్యయములు పరమగునపుడు పదసంజ్ఞయున్నందున జశ్త్వము ప్రవర్తించును. దద్భ్యామ్, మొదలగునవియగును. మాసశబ్దమునకు మాస్ ఆదేశమగును. మాసః (మాస్ + శస్) మాసా (మాస్ + టా) మాస్ + భ్యాం, అనియుండ. రుత్వము. (ససజుషోరుః) యత్వము, (భోభగో) యలోపము, (హలిసర్వేషామ్) ను ప్రవర్తించును. 'మాభ్యామ్' అని యగును. మాభిరిత్యాదు లిట్లేయగును.

వివ :— 'ధనుషావిధ్యతి' ఇత్యాదులందు పరమగు కరణసంజ్ఞ, పూర్వమయిన యపాదానసంజ్ఞను బాధించును. కేవల పరసంజ్ఞ, పూర్వసంజ్ఞకు బాధకమనుట కిది యుదాహరణము.

* 234. భస్య 6-4-120.

అధికారోఽయమ్ ॥

234. ఇది యధికారసూత్రము. కావున నుత్తరసూత్రములం దనువృత్తమయి, భస్య భవతి (ఈ సూత్రముచే విధింపబడినది భసంజ్ఞ కలదానికి ప్రవర్తించును) అని బోధించును. ఆరవ యధ్యాయము తుదివఱకు నిది యధికృతమగును.

* 235. అల్లోపోఽనః 6-4-134 అత్, లోపః, అనః.

(భస్య, అఙ్గమ్)

అఙ్గావయవో ఽసర్వనామస్థాన యజాదిస్వాది
పరో యోఽన్ తస్యాకారస్య లోపః స్యాత్ ।

235. సర్వనామస్థానభిన్నములగు యకారాదులు నజాదులునగు స్వాదులు పరమందుగలిగి యఙ్గమున కవయవమగు అన్ యొక్క అకారము లోపించును.

వివ :— సూత్రమున 'అత్' అనునది లుప్తషష్ఠ్యన్తమని గ్రహించునది. భస్య, అంగస్య, అనునవి యధికారలబ్ధములు. వీనిచే నుపస్థితమైనది సర్వనామస్థానభిన్న యజాదిస్వాది ప్రత్యయము. అఙ్గము ప్రత్యయవిశేషము, ఈ రెండును 'అన్' అనుదానికి విశేషణములు. అన్ అనునది అకారమునకు విశేషణము. ఇట్లు సిద్ధమైనదే మూలములోని యర్థము. పై రీతిని వ్యాఖ్యానము చేయుటవలన తక్ష్ణా (తక్షన్ + టా) అనుచోట తకారముపై అకారమునకు లోపము వారితమగును

* 236. రషాభ్యాం నో ణస్సమానపదే 8-4-1 రషాభ్యామ్, నః, ణః, సమానపదే,

ఏకపదస్థాభ్యాం రేఫ షకారాభ్యాం పరస్య నస్య ణః స్యాత్। యూష్ణః। యూష్ణా। పూర్వస్మాదపి విధౌ స్థానివద్భావ ఇతి పక్షే తు అడ్ వ్యవాయ ఇత్యేవాత్రణత్వమ్। పూర్వత్రాసిద్ధే నస్థానివదితితు ఇహ నాస్తి। తస్య దోషస్సంయోగాది లోపలత్వణత్వేష్వితి నిషేధాత్॥

236. అఖణ్డపదమందుండు[1] రేఫ షకారములకంటె నవ్యవహిత పరమగు నకారమునకు ణకార మాదేశమగును. యూష్ణః (యూషన్ + శస్, అల్లోపోనః) "అచః పరస్మిన్ (51) సూత్రమున పూర్వవిధౌ అనుదానికావృత్తిచేసి పూర్వస్మాద్విధిః పూర్వవిధిః అని సమాసము చెప్పినయెడల స్థానిభూతమయిన యచ్చునకు పూర్వమందుండు వర్ణముకంటె పరమగుదానికి కార్యము చేయునపుడు నజాదేశము స్థానివద్భావము నొందునను నర్థము లభించును. దీనినే పఞ్చమీ సమాస పక్షమందురు. ఈ పక్షమందు యూష్ణః ఇత్యాదులందల్లోపము ణత్వము చేయుచున్నపుడు స్థానివద్భావము నొందుటచే నకారమకారముతో వ్యవహిత మగుటవలన 'రషాభ్యామ్' అను సూత్రము ప్రవర్తించదు. అపుడు అట్ కుప్, (198) సూత్రముచేతనే యిచట ణత్వము వచ్చును. 'పూర్వత్రాసిద్ధీయే[2] నస్థానివత్' (త్రిపాదిలోని కార్యము చేయునపుడు అచఃపరస్మిన్ సూత్రవిహితమగు స్థానివద్భావము ప్రవర్తించదు) అను స్థానివద్భావనిషేధ వచనము. 'తస్యదోష[3]స్సంయోగాది లోపలత్వణత్వేషు' అను వచనముచే నిషేధింపబడినందున నిచట (ణత్వము విషయమై) దానికి ప్రవృత్తిలేదని భావము.

వివ :—1. సమానపదే, అనుచోట సమానగ్రహణమువలననే కపదమను నర్థము లభించెను. ఏకపదమన నఖండపదము. రేఫ షకారములతో రహితమయి నకారముగల పదముతో గూడియుండని పదము సమానపదము. ఇట్లు చెప్పుటచే రామనామ, మొదలగు సమస్తపదములందు ణత్వము వారింపబడును.

2. పూర్వత్రాసిద్ధే నస్థానివత్ (పూర్వత్రాసిద్ధమన త్రైపాదిక శాస్త్రము) అచః పరస్మిన్ననునతిదేశమును గురించి త్రిపాది యసిద్ధమగుటచే త్రిపాదియందీ యతిదేశము ప్రవర్తించదని చెప్పుటవలన సిద్ధమయినదే యీ వచనము.

3. తస్యదోష... త్వేషు, తస్య = పూర్వత్రాసిద్ధే నస్థానివత్ అను నిషేధమునకు, సంయో......ణత్వేషు = సంయోగాది లోపలత్వణత్వములు చేయునపుడు, దోషః = నిషేధము. అనగా త్రైపాదికములగు సంయోగాది లోపలత్వణత్వముల విషయమై స్థానివద్భావము ప్రవర్తించునని యాశయము.

* 237. నలోపః ప్రాతిపదికాన్తస్య 8-2-7 న, లోపః, ప్రాతిపదిక, అన్తస్య. (పదస్య)

నేతి ప్రాతిపదికేతిచ లుప్తషష్ఠీకే పదే. ప్రాతిపదికసంజ్ఞకం యత్పదం తదన్తస్య నకారస్య లోపః స్యాత్. నలోపస్యాసిద్ధత్వాత్ దీర్ఘత్వమేత్వమైస్త్వంచ న. యూషభ్యామ్. యూషభిః యూషభ్యః ఇత్యాది.

237. సూత్రమందు న, ప్రాతిపదిక, అనునవి లుప్తషష్ఠ్యన్తములు. ప్రాతిపదిక సంజ్ఞగల పదముయొక్క తుదినున్న నకారమునకు లోపమగును. యూషభ్యామ్, (యూషన్ + భ్యామ్) ఇత్యాదులు. ఈ నలోపమసిద్ధమగుటచే నకారమదన్తముగానందున యూషభ్యామ్, అనుచోట (సుపిచ) దీర్ఘము- యూషభ్యః, అనుచోట (బహువచనే ఝల్యేత్) ఏత్వము, యూషభిః అనుచోట (అతోభిస ఐస్) ఐసాదేశము, ప్రవర్తించవు.

విశే:— పదమునకు ప్రాతిపదికమను విశేషణమువలన హన్ ధాతువునకు లఙ్ ప్రథమ పురుషైకవచనమగు ‘అహన్’ అనుచోట నలోపము వారితమగును. ఇది తిఙన్తమగుటవలన పదమయినను ధాతువగుటచే ప్రాతిపదికసంజ్ఞకము గాదు.

* 238. విభాషా ఙిశ్యోః 6-4-136 విభాషా, ఙిశ్యోః, (అల్లోపోఽనః)

అఙ్గావయవోఽసర్వనామస్థాన యజాదిస్వాది పరో యోఽన్ తస్యాకారస్య లోపో వా స్యాత్ ఙిశ్యోః పరయోః। యూష్ణి, యూషణి। పక్షే రామవత్। పద్దన్నితిసూత్రే ప్రభృతిగ్రహణం ప్రకారార్థమ్। తథాచ, ఔఙః శ్యామపి దోషన్నాదేశో భాష్యే కకుద్దోషణీత్యుదాహృతః। తేన పదఙ్ఘ్రిశ్చరణోఽస్త్రియాం, స్వాన్తం హృన్మానసం మనః, ఇతిచ సంగచ్ఛతే। ఆసన్యం ప్రాణమూచురితిచ। ఆస్యే భవ ఆసన్యః। దోష్శబ్దస్య నపుంసకత్వమప్యత ఏవ భాష్యాత్। తేన దక్షిణం దోర్నిశాచర ఇతి సంగచ్ఛతే। భుజబాహూ ప్రవేష్టో దోరితి సాహచర్యాత్పుంస్త్వమపి। దోషం తస్య తథావిధస్య భజత ఇతి। ద్వయోరహ్నోర్భవః ద్వ్యహ్నః॥

238. ఙి (సప్తమ్యేకవచనము) శీ, (నపుంసకాచ్చ (311) సూత్రవిహితమగు వాదేశము.) వీనిలో నేదైన పరమగునపుడు, సర్వనామస్థాన భిన్నములగు యకారాదులు నజారాదులునగు స్వాదులు పరమందుగలిగి యఙ్గమునకవయవమగు అన్ యొక్క అకారమునకు లోపము వికల్పముగనగును. యూష్ణి (యూషన్ + ఙి) అల్లోపాభావపక్షమందు, యూషణి. యూషన్నాదేశము

రానిపక్షమందు యూష శబ్దము రామశబ్ద సదృశము. "పద్దన్నోమాస్" సూత్రమందలి ప్రభృతి గ్రహణము సాదృశ్యార్థకము. శస్ ప్రభృతిషు అనుదానికి శస్ ప్రత్యయసదృశములగు సుప్పులు పరమగునపుడని యర్థము. సుప్పులందు శస్సాదృశ్యము శస్సుయందున్న సుప్త్వమను ధర్మముచే గ్రహింపవలయును. శోకాది శబ్దములు పరమగునపుడు హృదాదేశమును విధించు "వా శోకష్యఞ్ రోగేషు (6-3-51) సూత్రమునకు వైయర్థ్యము సంభవించును గాన శస్ సాదృశ్యము శబ్దత్వమను ధర్మముచే గ్రహింప వలనుపడదు.

ప్రభృతి గ్రహణము సాదృశ్యార్థకమనుటలో 'కకుద్దోషణీ యాచతే మహాదేవః' అను భాష్యప్రయోగము ప్రమాణము. కకుద్దోషణీ అనుచోట కకుత్, దోషణీ అని ఛేదము. దోషణీ అనునది నపుంసక ద్వితీయాద్వివచనము. (దోష్ + ఔ) ప్రభృతి గ్రహణము సాదృశ్యార్థకముగానిచో నీ ప్రయోగ మసఙ్గతము కావలయును. ఇట్లు వ్యాఖ్యానము చేయుటచే "పదఙ్ఘ్రిశ్చరణో స్త్రియామ్" స్వాన్తం హృన్మానసం మనః, "ఆసన్యః ప్రాణమూచుః" ఇత్యాది ప్రయోగము లుపపన్నములగును. ఆసన్యః (ఆస్యే = ముఖమందు, భవః = జనించునది లేక యుండునది). కకుద్దోషణీ అను భాష్యప్రయోగము వలననే దోష్ శబ్దమునకు నపుంసకత్వముగూడ సిద్ధమగును. కావున "తముపాద్రవదుద్యమ్య దక్షిణం దోర్నిశాచరః" అను రఘువంశ శ్లోకమున దోష్ శబ్దమునకు నపుంసకలిఙ్గము సాధువగును. 'భుజబాహూ ప్రవేష్టోదోః' అను కోశమున పుంలిఙ్గ బాహ్వాదిశబ్దముల సాహచర్యమువలన దోష్ శబ్దము పుంలిఙ్గము నగును. కావుననే, దోషం తస్య తథావిధస్య భజతశ్చాపస్య గృహ్ణన్ గుణమ్, అను శ్రీహర్ష ప్రయోగమున పుంలిఙ్గమును సాధువగును.

'ద్వ్యహ్నః' (ద్వయోరహ్నోర్భవః) అనునది తద్ధితార్థద్విగు సమాసము. రెండు దివసములలో జరుగునదని యర్థము.

* 239. సఙ్ఖ్యావిసాయపూర్వస్యాహ్నస్యా హానన్యతరస్యాం ఙౌ । 6-3-110 సఙ్ఖ్యావిసాయపూర్వస్య, అహ్నస్య, అహన్, అన్యతరస్యామ్, ఙౌ.

సఙ్ఖ్యాదిపూర్వ స్యాహ్నస్య అహన్నాదేశో వా స్యాత్ ఙౌ । ద్వ్యహ్ని । ద్వ్యహని । ద్వ్యహ్నే । విగతమహః వ్యహ్నః । వ్యహ్ని । వ్యహని । వ్యహ్నే । అహ్నస్సాయస్సాయాహ్నః । సాయాహ్ని । సాయాహని । సాయాహ్నే । ఇత్యదన్తాః । విశ్వపాః ।

239. సఙ్ఖ్యావాచకము, వి, సాయ, ఇవి పూర్వమందుగల అహ్న శబ్దమునకు ఙి ప్రత్యయము పరమగునపుడు, 'అహన్' ఆదేశము వికల్పముగనగును. సఙ్ఖ్యావాచకము పూర్వమందుగల అహ్నశబ్దమున కుదాహరణము. ద్వ్యహ్ని (ద్వ్యహ్న + ఙి) ఇచట నీ సూత్రముచే అహన్నాదేశము. విభాషాఙిశ్యోః

(240) సూ. చే, అకారలోపము. లోపాభావపక్షమందు, ద్వ్యహాని. అహ న్నాదేశము రానిపక్షమందు ద్వ్యహ్నే. శేషము రామశబ్దసదృశము. విపూర్వ మున కుదాహరణము. వ్యహ్నః, (విగతమహః) గత దివసము, వ్యహ్నా, వ్యహాని, వ్యహ్నే, ద్వ్యహ్న శబ్దమునకువలె ప్రక్రియ నూహింపదగును. సాయపూర్వమున కుదాహరణము. సాయాహ్నః. (అహ్నస్సాయః। దినసాయంకాలము. సాయాహ్నా, సాయాహాని, సాయాహ్నే. .

అదన్తశబ్దములు ముగిసినవి.

విశ్వపాః, (విశ్వపాశబ్దమునకంటె సుప్రత్యయము రుత్వ విసర్గములు) ఇది ఆబన్తము గాకపోవుటచే హల్ఙ్యాబ్భ్యః (253) సూ. చే, సులోపము రాదు. విశ్వపా + ఔ. ఇచట పూర్వసవర్ణదీర్ఘము (ప్రథమయోః పూర్వసవర్ణః) (165) ప్రాప్తమగుచుండ.

* 240. దీర్ఘాజ్జసి చ 6_1_105. దీర్ఘాత్, జసి, చ। (ప్రథమయోః పూర్వసవర్ణః, ఇచి, న,)

దీర్ఘాజ్జసి ఇచి చ పరే ప్రథమయోః పూర్వసవర్ణదీర్ఘో నస్యాత్। వృద్ధిః। విశ్వపౌ। సవర్ణదీర్ఘః। విశ్వపాః। యద్యపీహౌజి నాదిచీత్యేవ సిద్ధం, జసితు సత్యపి పూర్వసవర్ణదీర్ఘే క్షతిర్నాస్తి, తథాపి గౌర్యౌ, గౌర్యః, ఇత్యాద్యర్థం సూత్రమిహాపి న్యాయ్యత్వా దుపన్యస్తమ్॥

240. దీర్ఘమునకు జస్ ప్రత్యయముగాని ఇచ్ ప్రత్యాహారవర్ణముగాని పరమగునపుడు పూర్వసవర్ణదీర్ఘము రాదు. విశ్వపా + ఔ అనుచోట నీ సూత్రముచే పూర్వసవర్ణ దీర్ఘము నిషేధింపబడినందున వృద్ధిరేచి సూత్రముచే వృద్ధి ప్రవర్తించును. విశ్వపౌ. విశ్వపా + జస్. ఇచట సవర్ణదీర్ఘము. విశ్వపాః. విమర్శింప విశ్వపాశబ్దమునకు ప్రథమాద్వితీయా ద్వివచనములు పరమగునపుడు, నాదిచి (166) సూ. చే, దీర్ఘనిషేధము సిద్ధమగును. జస్సు పరమగునపుడు, పూర్వసవర్ణదీర్ఘము ప్రవర్తించినను దోషములేదు. కాని గౌర్యౌ గౌర్యః మొదలగు రూపములకొఱకీ సూత్ర మావశ్యకము. దీని కిచటను ప్రవృత్తి యున్నందున నుపన్యసించుట న్యాయ్యమగును.

* 241. ఆతో ధాతోః 6_4_140. ఆతః, ధాతోః (భస్య, అజ్గస్య, లోపః)

ఆకారాన్తో యో ధాతుః తదన్తస్య భస్యాఙ్గస్య లోపః స్యాత్। అలోఽన్త్యస్య। విశ్వపః। విశ్వపా। విశ్వపాభ్యామిత్యాది। ఏవం శఙ్ఖధ్మాదయః। ధా

తోఽకిమ్। హాహాన్। టా, సవర్ణదీర్ఘః హాహా। ఙే, వృద్ధిః, హాహై। జసిజసోరీర్ఘః। హాహాః। ఓసి వృద్ధిః। హాహౌః। ఙౌ, ఆద్గుణః, హాహే। శేషం విశ్వపావత్। అత ఇతి యోగవిభాగాదధాతోరప్యాకారలోపః క్వచిత్। క్త్వః। శ్నః। ఇత్యాదన్తాః। హరిః। ప్రథమయోః పూర్వసవర్ణః। హరీ॥

241. ఆకారాన్తమగు ధాతువన్తమందుగల్గి భసంజ్ఞకమగు నఙ్గమునకు లోపమగును. ఈ లోపమంతోఽల్స్య పరిభాషచే నఙ్గముయొక్క తుదివర్ణమునకగును. విశ్వపః (విశ్వపా + శస్) విశ్వపా (విశ్వపా + టా) విశ్వపాభ్యామ్, ఈ మొదలగునవి విశ్వపా శబ్దముయొక్క రూపములు. విశ్వపా అను నఙ్గమాకారాంతమగు పా (రక్షణే) ధాతువంతమందుగలది. ఇట్లే శఙ్ఖధ్మాః. (శఙ్ఖమును పూరించువాడు) సోమపాః (సోమరసమును పానముచేయువాడు) మొదలగు నాకారాన్త శబ్దములకు ప్రక్రియ నూహింపదగును. హాహా శబ్దమునకు (గంధర్వ విశేష వాచకము, అవ్యుత్పన్న ప్రాతిపదికము) శసాదులు పరమగునపుడు లోపమును వారించుటకై 'ధాతోః' అనున దావశ్యకము. 'ధాతోః' అనునది యున్నయెడల హాహా అనునది ధాత్వన్తమగు నఙ్గముకాదు గావున లోపము వారితమగును. హాహా శబ్దమునకు ద్వితీయా బహువచనము హాహాన్. తృతీయైక వచనమందు సవర్ణదీర్ఘము. హాహా. హాహై (హాహా + ఙే) వృద్ధి. పఞ్చమీ షష్ఠ్యేకవచనములందు సవర్ణదీర్ఘము. హాహాః. షష్ఠీ సప్తమీ ద్వివచనములందు వృద్ధి. హాహౌః. సప్తమ్యేకవచనమున (హాహా + ఙి) గుణము. హాహే. శేషము విశ్వపా శబ్దసదృశము. సూత్రములోని 'అతః' అనుదానిని విభజించి దీనిచే ఆకారాన్తము భసంజ్ఞకమునగు నఙ్గమునకు లోపమును విధించుటచే ధాతు భిన్నమగు నఙ్గమునకును కొన్ని శబ్దములందు లోపము సిద్ధమగును. క్త్వా ప్రత్యయమున కిడాగమమగునను నర్థముగల 'క్త్వఇట్' అను ప్రయోగము, శ్నా ప్రత్యయములోని శవర్ణమున కిత్సంజ్ఞయగునను నర్థముగల "శ్నః శస్యేత్త్వమ్", ఇత్యాది ప్రయోగములందుండు క్త్వః, శ్నః, ఇత్యాదు లుదాహరణములు.

ఆదన్తశబ్ద ప్రకరణము ముగిసెను.

హరిః (హరి + సు) హరి + ఔ 'ప్రథమయోః పూర్వసవర్ణః' సూత్రముచే, దీర్ఘము. హరీ.

* 242. జసిచ 7-3-109 జసి; చ (అఙ్గస్య, హ్రస్వస్య, గుణః)

హ్రస్వాన్తస్యాఙ్గస్య గుణః స్యాజ్జసి పరే। హరయః।

242. హ్రస్వమంతమందుగల యఙ్గమునకు జస్సు పరమగునపుడు గుణాదేశమగును. హరి + అస్. హరే + అస్. అయాదేశము. హరయః.

* 243. హ్రస్వస్యగుణః 7-3-108 హ్రస్వస్య, గుణః. (సంబుద్ధౌ)

హ్రస్వస్య గుణః స్యాత్సంబుద్ధౌ। ఏఙ్ హ్రస్వాదితి సంబుద్ధిలోపః। హేహరే। హరిమ్। హరీ। హరీన్ ॥

243. హ్రస్వాన్తమగు శబ్దమునకు సంబుద్ధి పరమగునపుడు గుణాదేశమగును. హేహరే (హే హరి + సు) గుణ మేకారము నిచ్చెను. పిదప ఏఙ్ హ్రస్వాత్సంబుద్ధేః (194) సూ. చే, సంబుద్ధిలోపము. హరిమ్. (హరి + అమ్) పూర్వరూపము. హరీ (హరి + ఔ) పూర్వసవర్ణదీర్ఘము. హరీన్ (హరి + శస్) పూర్వసవర్ణదీర్ఘ నత్వములు.

* 244. శేషోఘ్యసఖి 1-4-7 శేషః, అసఖి, (యూ, హ్రస్వః)

అనదీసంజ్ఞౌ హ్రస్వౌ యావిదుతౌ తదన్తం సఖివర్జం ఘిసంజ్ఞం స్యాత్। శేషః కిమ్। మత్యై। ఏకసంజ్ఞాధికారాత్సిద్ధే శేషగ్రహణం స్పష్టార్థమ్। హ్రస్వౌ కిమ్। వాతప్రమ్యే। యూ కిమ్। మాత్రే ॥

244. యూస్త్ర్యాఖ్యౌనదీ, సూ. చే, నదీసంజ్ఞను విధించి, తరువాత నీసూత్రమును చెప్పెను. ఉక్తముకంటె నన్యమయినది శేషపదమున కర్థము. ఇచటి శేషపదలబ్ధార్థమే అనదీసంజ్ఞౌ అనునది. నదీసంజ్ఞా రహితములు హ్రస్వములగు నివర్ణోవర్ణము లంతమందుగలదై సఖిశబ్దభిన్నమయిన శబ్దము ఘిసంజ్ఞగలదగును. హరి, శంభు, ఇత్యాదు లుదాహరణములు. మత్యై (మతి + ఙే) ఇచట మతి శబ్దమునకు ఘిసంజ్ఞను వారించుటకు శేషగ్రహణము. మతిశబ్దమునకిత్సంజ్ఞక ఙకారాది ప్రత్యయములు పరమగునపుడు ఙితిహ్రస్వశ్చ (297) సూ. చే, వికల్పముగ నదీసంజ్ఞ విధించబడెను. నదీసంజ్ఞాపక్షమందు ఘిసంజ్ఞ ప్రసక్తమయినచో ఆణ్ నద్యాః. (269) సూ. చే, నాడాగమము, ఘేర్ఙితి (246) సూ. చే, గుణము, అయాదేశము, ప్రవర్తించును. 'మతయె' అను ననిష్టరూపమగును. మత్యై అను నిష్టరూపము సిద్ధముగాక పోవును. ఘినదీసంజ్ఞలేక సంజ్ఞాధికారసములగుటచే, 'మత్యై' అనుచోట ననవకాశమగు నదీసంజ్ఞయే ప్రవర్తించును గావున శేషగ్రహణము లేకపోయినను దోషములేదు. అపుడు శేషగ్రహణము అనువృత్తమగు నివర్ణోవర్ణములకు విశేష్యమయి స్పష్టముగ తదన్తవిధి లాభమును గలుగచేయుటకుపయోగించును. వాతప్రమ్యే (వాతప్రమీ + ఙే) ఇచట దీర్ఘాన్తమునకు ఘిసంజ్ఞను వారించుటకై, 'హ్రస్వౌ' అను విశేషణము (మాతృ + ఙే) మాత్రే, ఇచట మాతృశబ్దమునకు ఘిసంజ్ఞను వారించుటకై, యూ (ఇదుతౌ) అనున దావశ్యకము. ఉక్తస్థలములందు ఘిసంజ్ఞ యున్నచో ఘేర్ఙితి, సూ. చే, గుణము ప్రసక్తమగునని యూహించునది,

* 245. ఆఙో నాఽస్త్రియామ్. 7-3-120 ఆఙః, నా, అస్త్రియామ్ (ఘేః)

ఘేః పరస్యాఙో నా స్యాదస్త్రియామ్। ఆఙితి టాసంజ్ఞా ప్రాచామ్। హరిణా। అస్త్రియాంకిమ్। మత్యా॥

245. ఘిసంజ్ఞకముకంటె పరమగు 'ఆఙ్' నకు 'నా' అనునది ఆదేశమగును. స్త్రీలిఙ్గమున కాదు. ప్రాచీన వైయాకరణులు, తృతీయైక వచనమును ఆఙనుదానిచే వ్యవహరించిరి. ఈ శాస్త్రమందు నా వ్యవహారము స్వీకరింపబడును. హరిణా (హరి + టా) నాదేశము, ణత్వము. మత్యా. ఇచట మతి శబ్దమునకు శేషోఘ్యసఖి సూ. చే, ఘిసంజ్ఞ యుండును. ఈ సూత్రమున నస్త్రియా మనునది లేనిచో నిచటను నా భావము ప్రసక్తమయ్యెడిని.

* 246. ఘేర్ఙితి 7-3-111 ఘేః, ఙితి. (సుపి, గుణః)

ఘిసంజ్ఞకస్య ఙితి సుపి గుణః స్యాత్। హరయే। ఘేఃకిమ్। సఖ్యే। ఙితికిమ్। హరిభ్యామ్। సుపికిమ్। పట్వీ। ఘేర్ఙితీతి గుణేకృతే॥

**246.** ఘిసంజ్ఞకమునకు ఇత్సంజ్ఞక ఙకారముగల సుప్పు పరమగునపుడు గుణమాదేశమగును. హరయే (హరి + ఙే) గుణాయాదేశములు. సఖ్యే (సఖి + ఙే) ఇచట గుణమును వారించుటకై ఘేః అనునది యావశ్యకము. హరిభ్యామనుచోట గుణమును వారించుటకు ఙితి అనునది యావశ్యకము. పట్వీ (పటు + ఙీష్) ఇచట గుణనివృత్తికొఱకు సుపి అనునది యుండవలయును. ఙీషు సుప్పుగాకపోవుటచే గుణము నివర్తించును. హరి + ఙసి. 'ఘేర్ఙితి, సూ. చే. గుణము చేయగా హరే + అస్. అని యగును. ఇట్లుండ॥

* 247. ఙసిఙసోశ్చ 6-1-110 ఙసిఙసోః, చ. (ఏకః పూర్వపరయోః, ఏఙః, అతి, పూర్వరూపమ్)

ఏఙో ఙసిఙసోరతిపరే పూర్వరూప మేకాదేశః స్యాత్। హరేః। హర్యోః। హరీణామ్॥

247. ఏ, ఓ, వీనికి ఙసిఙస్సుల అకారము పరమగునపుడు పూర్వరూప మేకాదేశమగును. హరేః, (హరే + అస్) పూర్వరూపము, రుత్వ విసర్గములు. షష్ఠ్యేకవచనము నిట్లే యూహించునది. (హరేః) హర్యోః (హరి + ఓస్) యణాదేశము. హరీణామ్ (హరి + ఆమ్) నుడాగమ దీర్ఘణత్వములు.

వివ:—ఏఙులు ఙసిఙస్సులు సమసంఖ్యాకములైనను యథాసంఖ్య సూత్రమునకు స్వరితత్వమఙ్గీకరింపనందున నీ సూత్రమున క్రమాన్వయములేదు.

* 248. అచ్చ ఘేః 7-3-119 అత్, చ, ఘేః (ఇదుద్భ్యామ్, ఙేః, ఔత్)

ఇదుద్భ్యాముత్తరస్య ఙేరౌత్స్యాత్, ఘేరన్తాదేశశ్చాకారః। హరౌ। హర్యోః। హరిషు। ఏవం శ్రీపత్యగ్నిరవికవ్యాదయః॥

248. హ్రస్వములగు ఇకారోకారములకంటె పరమగు సప్తమ్యేకవచనమునకు ఔకారమాదేశమగును. ఘిసంజ్ఞకమున కకారమన్తాదేశమునగును. హరి + ఙి. హర + ఔ. వృద్ధి. హరౌ. హర్యోః. (హరి + ఓస్) హరిషు (హరి + సు) షత్వము. శ్రీపతి, అగ్ని, రవి, కవి, మొదలగు శబ్దములు హరిశబ్ద సదృశములు.

* 249. అనఙ్ సౌ 7-1-93. అనఙ్ - సౌ. (అఙ్గస్య, సఖ్యుః, అసంబుద్ధౌ)

సఖ్యురఙ్గస్యానఙాదేశః స్యాదసంబుద్ధౌ సౌ పరే। ఙిచ్చేత్యన్తాదేశః॥

249. సఖిశబ్దమన్తమందుగల యఙ్గమునకు ప్రథమైకవచనము పరమగునపుడనఙాదేశమగును. అనఙున నకారముపై యకారముచ్చారణార్థము. అనఙు, ఙిత్తగుటచే, ఙిచ్చ, పరిభాషచే, నన్తాదేశమగును. సఖి + స్। సఖన్ + స్.

* 250. అలోఽన్త్యాత్పూర్వ ఉపధా 1-1-65. అలః, అన్త్యాత్, పూర్వః, ఉపధా!

అన్త్యాదలః పూర్వో వర్ణః ఉపధాసంజ్ఞః స్యాత్॥

250. ఒక శబ్దముయొక్క తుదినున్న వర్ణమునకు పూర్వమగువర్ణము పధా సంజ్ఞ కలదగును. సఖన్. ఇచట నకారమునకు పూర్వమందుండు అకారముపధ యనబడును.

వివ:—ఇచట అల్ప్రత్యాహారము వర్ణపర్యాయము. అవధ్యవధిమత్తులు సజాతీయములయే యుండును. ప్రకృతమున నవధివర్ణముగావున నవధిమత్తును వర్ణమే యగును. ఇట్లు సిద్ధమైనదే, పూర్వోవర్ణః అనుచోట వర్ణమనునది.

* 251. సర్వనామస్థానే చాసంబుద్ధౌ 6-4-8. సర్వనామస్థానే, చ, అసంబుద్ధౌ (నోపధాయాః)

నాన్తస్యోపధాయా దీర్ఘః స్యాదసంబుద్ధౌ సర్వనామస్థానే పరే॥

251. నకారాన్తమగు నఙ్గమున కుపధకు సంబుద్ధి భిన్నమగు సర్వనామస్థానము పరమగునపుడు దీర్ఘము వచ్చును. సఖాన్ + స్.

* 252. అపృక్త ఏకాల్ ప్రత్యయః 1-2-41. అపృక్తః, ఏకాల్, ప్రత్యయః।

ఏకాల్ ప్రత్యయో యఃసోఽపృక్తసంజ్ఞః స్యాత్॥

252. ఒకేవర్ణముగల ప్రత్యయ మపృక్తసంజ్ఞ కలదగును.

వివ:— సూత్రమున అపృక్తః అనుచోట పుంలిఙ్గ మవివక్షితము. కావున అపృక్తం హల్ ఇత్యాదులు సఙ్గతములగును.

* 253. హల్ఙ్యాబ్భ్యో దీర్ఘాత్సుతిస్యపృక్తం హల్ 6-1-68 హల్ఙ్యాబ్భ్యః, దీర్ఘాత్, సుతిసి, అపృక్తం, హల్ (లోపః)

హలన్తాత్పరం, దీర్ఘౌయాఙ్యాపౌ, తదన్తాచ్చ పరం, సుతిసీత్యేతదపృక్తంహల్, లుప్యతే! హల్ఙ్యాబ్భ్యః కిమ్। గ్రామణీః। దీర్ఘాత్కిమ్। నిష్కౌశామ్బిః। అతిఖట్వః। సుతిసీతికిమ్। అభైత్సీత్। తిపాసహచరితస్య సిపోగ్రహణాత్సిచోగ్రహణంనాస్తి। అపృక్తమితికిమ్। బిభర్తి। హల్కిమ్। బిభేద। ప్రథమహల్కిమ్। రాజా। న లోపోనస్యాత్సంయోగాన్తలోపస్యాసిద్ధత్వాత్। సఖా। హేసఖే॥

253. హలన్తముకంటె పరమగునట్టిగాని దీర్ఘములగు ఙీపు, ఙీషు, ఙీను, టాపు, డాపు, చాపు, ప్రత్యయము లన్తమందుగలదానికంటె పరమగునట్టిగాని సు, తి, సి, అనువానియొక్క యపృక్తమగు హల్లు లోపించును. సు అనునది సుప్పు (ప్రథమైకవచనము). తి, సి, అనునవి, తిఙ్లు. 'హల్ఙ్యాబ్భ్యః' అను పదము లేనియెడల, దీర్ఘాన్తముకంటె పరమమగు స్వాదులకు లోపమని యర్థమగును. 'రామః' ఇత్యాదులలో, దీర్ఘాన్తము గాకపోవుటవలన దోషము లేదు. కాని గ్రామణీః, అనుచోట సులోపము ప్రసక్తమగును. కావున తద్వారణమునకై అది అవశ్యకమగును. 'దీర్ఘాత్కిమ్. ఙ్యాప్పులు దీర్ఘములే గాన నీ విశేషణ మెందుకని ప్రశ్నాశయము. నిష్కౌశామ్బిః. (కౌశాంబ్యానిర్గతః) అతిఖట్వః (ఖట్వా మతిక్రాన్తః) కౌశామ్బీ అనునది ఙీబన్తము. ఖట్వా = అబన్తము. సమాసము చేసినపిదప గోస్త్రియోరుపసర్జనస్య (1-2-48) సూ. చే, హ్రస్వము ప్రవర్తించును. సమాసములు ప్రత్యయగ్రహణ పరిభాషచే తదాది నియమమువలన ఙ్యాబన్తములు గాకున్న నుత్తరపదములు స్థానివద్భావమువలన ఙ్యాబన్తము లగుటచే వీనికంటె సుప్రత్యయము పరమగుటవలన లోపము ప్రసక్తమగును. కావున దీర్ఘాత్ అనునది యావశ్యకమని యుత్తరాశయము. సుతిసీతికిమ్.' అపృక్తమగు హల్లునకు లోపము విధింపబడుటచే, భేత్తా (భిద్ + తా, . తృచ్ ప్రత్యయాన్తము) ఇత్యాదులలో తా, అనునది యపృక్తముకాదు గనుకనే

లోపము వారించుచుండ సుతిసిగ్రహణ మెందుకని ప్రశ్నాభిప్రాయము. అభై త్సీత్ (భిద్ ధాతువునకు లుఙ్ ప్రథమపురుషైక వచనము) అభైద్ + స్ + ఈత్. ఇచట సిచ్చుయొక్క సకారమునకు (స్) లోపము ప్రసక్తమగును గాన తద్వారణార్థము, సు, తి, సి, గ్రహణ మావశ్యకమని యుత్తరాశయము. తి (ప్) ప్రత్యయ సాహచర్యమువలన సి అనుపదముచే విభక్తిసంజ్ఞకమగు సి(ప్) ప్రత్యయమున గ్రహణముకే గాని, సిచ్చు (వికరణము) నకు లేదు. కనుక పూర్వోక్తస్థలమున (అభైత్సీత్) సకారలోపము వారించును. అప్పృక్తమనునది లేనియెడల భిభర్తి (భృఞ్ ధాతువునకు లట్ ప్రథమైక వచనము) అనుచోట తి అనుదానిలోని తకారమునకు లోపము ప్రసక్తమగును. బిభేద (బిభేద్ + అ, భిద్ ధాతువునకు లిట్ ప్రథమైక వచనము) ఇచట దకారలోపమును వారించుట ద్వితీయ హల్పదమునకు ప్రయోజనము. రాజా, ఇత్యాదులలో రాజన్ + స్ అనియుండ, సంయోగాన్త లోపనలోపములు ప్రవర్తించిన రాజా ఇత్యాది రూపములు సిద్ధమగుచుండ మొదటి హల్ గ్రహణ మనావశ్యకమన కూడులేదు. సంయోగాన్తలోపముచే సుప్ ప్రత్యయము నివర్తించుననిన నలోపము చేయు నపుడు సంయోగాన్తలోప మసిద్ధమగును గనుక నలోపము రాకపోవును. కావున నక్కడ దీనిచే సులోపము వచ్చుటకు మొదటి హల్ గ్రహణ మావశ్యకము. దీనిచే సులోపమగుచో నిది నలోపమును గుఱించి యసిద్ధము గానందున నలోపము సిద్ధమగును. ఉదా = సఖా (సఖాన్ + స్) ఇచట నీ సూత్రముచే సులోపము. "నలోపః ప్రాతిపదికాన్తస్య సూ. చే, నలోపము. హేసఖే, (హేసఖి + స్) గుణము. సంబుద్ధి లోపము.

వివ:—దీర్ఘాత్కి మనునది మొదలు అసిద్ధత్వాత్తను వదన్తమొందుగల గ్రన్థము మనోరమలో నగపడుటచే నిచట నిదియపపాఠమని గ్రహించునది.

* 254. సఖ్యురసంబుద్ధౌ 7-1-92 సఖ్యుః, అసంబుద్ధౌ. (సర్వనామస్థానే, ణిత్)

సఖ్యురఙ్గాత్పరం సంబుద్ధి వర్జం సర్వనామస్థానం ణిత్కార్యకృత్ స్యాత్ ॥

254. సఖి శబ్దమన్తమందుగల యఙ్గముకంటె పరమై సంబుద్ధి భిన్నమగు సర్వనామస్థానము, ఇత్సంజ్ఞక ణకారముగల ప్రత్యయము చేయుకార్యమును చేయునదగును. ణిత్తు (ఇత్సంజ్ఞక ణకారముగలది) పరమగునపు డఙ్గమునకు 'అచోఞ్ణితి' (257) మొదలగు సూత్రములచే విధింపబడు వృద్ధి మొదలగునవి ణిత్కార్యములని తెలియనగును.

* 255. అచోఞ్ణితి 7-2-115 అచః, ఞ్ణితి, (వృద్ధిః)

ఞితి ణితి చ పరే అజన్తాఙ్గస్య వృద్ధిః స్యాత్ ।

సఖాయౌ । సఖాయః । సఖాయమ్ । సఖాయౌ ॥ ఘి

సంజ్ఞాభావాన్న తత్కార్యమ్ । సఖ్యా । సఖ్యే ॥

255. అజన్తమగు నఙ్గమునకు ఞకారేత్సంజ్ఞకముగాని ణకారేత్సంజ్ఞకముగాని యగు ప్రత్యయము పరమగునపుడు వృద్ధియగును. సఖాయౌ (సఖి + ఔ) వృద్ధి। ఆయాదేశము. సఖాయః (సఖి + జస్) సఖాయమ్ (సఖి + అమ్) సఖాయౌ (సఖి + ఔట్) ఈ స్థలములందు ణిద్వద్భావముండుటవలన వృద్ధి ప్రవర్తించును. సఖ్యా (సఖి + టా) సఖ్యే (సఖి + ఏ) ఘిసంజ్ఞా సూత్రమున అసఖి అను పర్యుదాసముచే సఖి శబ్దమునకు ఘిసంజ్ఞ లేదు గావున నిచట నా భావము మొదలగు ఘిసంజ్ఞాకార్యములు ప్రవర్తింపవు కాన యణాదేశమగును.

* 256. ఖ్యత్యాత్పరస్య 6-1-112. ఖ్యత్యాత్, పరస్య. (ఙసిఙసోః, ఉత్)

ఖితిశబ్దాభ్యాం ఖీతీశబ్దాభ్యాం కృతయణాదేశాభ్యాం పరస్య ఙసిఙసోరత ఉత్ స్యాత్। సఖ్యుః ॥

256. ఖ్యత్యాత్ గనునది సమాహారద్వంద్వమునకు పఞ్చమ్యేకవచనము. (ఖ్యశ్చత్యశ్చ అనయోస్సమాహారః = ఖ్యత్యం, తస్మాత్) ఖి, ఖీశబ్దములకు, తి, తీశబ్దములకు నుచ్చారణార్థమగు నకారముచే కృత యణాదేశములగు "ఖ్య, త్య" అనునవి ప్రయోగస్థములగు (సఖ్యుస్, పత్యుస్) వాని కనుకరణము లగుటవలన క్రమముగ నివి ఖి, ఖీ, తి, తీ, శబ్దములను సామాన్యముగ గ్రహించును. కృత యణాదేశములగు, ఖి, తి, శబ్దములకంటెను, ఖీ, తీ, శబ్దములకంటెను పరమగు ఙసి ఙస్సులయొక్క అకారమునకు ఉకారమగునని సూత్రార్థము. సఖ్యుః (సఖి + ఙసి) యణాదేశము (సఖ్యస్) ఈ సూత్రముచే నుత్వము రుత్వ విసర్గములు.

* 257. ఔత్. 7-3-118 (ఇదుద్భ్యామ్, ఙేః)

ఇదుద్భ్యాం, పరస్య ఙే రౌత్స్యాత్! ఉకారానువృత్తిరుత్తరార్థా। సఖ్యౌ। శేషం హరివత్। శోభనఃసఖా, సుసఖా। సుసఖాయౌ। సుసఖాయః। అనఙ్ ణిద్వద్భావయో రాఙ్గత్వా త్తదన్తే పి ప్రవృత్తిః। సముదాయస్య సఖిరూపత్వాభావా దసఖీతి నిషేధాప్రవృత్తే ర్ఘిసంజ్ఞా। సుసఖినా। సుసఖయే। ఙసిఙసో ర్గుణేకృతే కృత యణాదేశత్వాభావాత్ ఖ్యత్యాదిత్యుత్వంన। సుసఖేః। సుసఖౌ। ఇత్యాది। ఏవమతిశయితస్సఖా అతిసఖా। పరమఃసఖా యస్యేతి విగ్రహే పరమసఖా। పరమసఖాయావిత్యాది। గౌణత్వేప్యనఙ్ ణిత్వే ప్రవర్తేతే। సఖీ మతిక్రాన్తో౽తిసఖిః। లిఙ్గవిశిష్టపరిభాషయా అనిత్యత్వా న్నటచ్। హరివత్। ఇహా నఙ్ ణిత్వేనభవతః గోస్త్రియోరితి

హ్రస్వేన సఖిశబ్దస్య లాక్షణికత్వాత్ । లక్షణ ప్రతిపదోక్తయోః ప్రతిపదోక్తస్యైవ గ్రహణాత్ ॥

257. హ్రస్వేకారముగాని హ్రస్వోకారముగాని యన్తమందుగల యఙ్గము కంటె పరమగు సప్తమ్యేక వచనమునకు (ఙి) ఔకారాగ మాదేశమగును. సఖ్యౌ (సఖి + ఙి) ఇదుదన్తములు నదీసంజ్ఞకము లగునపుడు, ఇదుద్భ్యామ్ (298) అను సూత్రము ప్రవర్తించును. ఘిసంజ్ఞకము లయినయెడల అచ్చ ఘేః (248) సూత్రము ప్రవర్తించును. ఘినదీసంజ్ఞారహితములగునపుడీ సూత్రము ప్రవర్తించు నని యర్థము చెప్పవలయును. ఇట్టిది (ఘినదీసంజ్ఞారహితమైనది) ఇకారాన్త సఖి శబ్దము సంభవించునుగాని ఉకారాన్తము సంభవింపదు. కావున నీ సూత్రము లోని ఉకారానువృత్తికి ప్రయోజనమేమున నుత్తరమగు 'అచ్చ ఘేః' సూత్రము లోని కనువృత్తి కొఱకని యెఱుఁగవలయును. మిగిలిన సఖిశబ్దము హరిశబ్దముతో సమానము. సఖీశబ్దమునకు విధింపబడిన, అనఙ్ ణిద్వద్భావము లఙ్గాధికారగతము లగుటచే తదన్తమందును ప్రవర్తించును గాన సుసఖి శబ్దమునకును ప్రవర్తించును. కావున సుసఖిశబ్దము సర్వనామస్థానమందు సఖి శబ్దమువలె నుండును. సుసఖా। సుసఖాయౌ। సుసఖాయః। సుసఖాయమ్। సుసఖాయౌ. ఘిసంజ్ఞా సూత్రమందు 'అసఖి' అనుదానికి సఖి శబ్దభిన్నమని వ్యాఖ్యానము చేయుటచే సుసఖి అను సముదాయము సఖి శబ్దభిన్నమయినందున అసఖి అను నిషేధము ప్రవర్తింపదు. కావున నిది ఘిసంజ్ఞ కలదగును, గాన ఘిసంజ్ఞా కార్యములు వచ్చును. సుసఖినా (సుసఖి + టా) నా భావము. సుసఖయే (సుసఖి + ఙే) ఘేర్ఙితి సూ. చే, గుణము. సుసఖేః (సుసఖి + ఙసి, ఙస్) ఘేర్ఙితి" సూ. చే, గుణము ప్రవృత్త మయినపిదప పూర్వరూపమగును. యణాదేశము రానందున ఖ్యత్యాత్పరస్య (256) సూ. చే, ఉత్వము ప్రవర్తింపదు. సుసఖౌ (సుసఖి + ఙి) అచ్చ ఘేః సూ. చే, అత్త్వౌత్వములు వృద్ధియగును. ఇట్లే అతిసఖి (అతిశయితస్సఖా) శబ్దమునకును ప్రక్రియ నూహించునది. పరమసఖి (పరమఃసఖాయస్య) అను బహువ్రీహిలో సన్యపదార్థము ప్రధానమగుటవలన సఖిశబ్దము అప్రధానమైనను గౌణమున అనఙాదులు ప్రవర్తింపకుండుటకు కారణములు లేనందున నవి యిచట ప్రవర్తించును. పరమసఖా, పరమసఖాయౌ మొదలగునవి యగును. సఖీ మతి క్రాన్తోఽతిసఖిః (చెలికత్తె నతిక్రమించినవాడు) జీపన్త సఖీశబ్దమునకు "గోస్త్రియోరుపసర్జనస్య (1-2-48) సూ. చే, హ్రస్వము ప్రవర్తించినందున అతిసఖి శబ్దము నిష్పన్నమైనది. ఇచట లిఙ్గవిశిష్ట పరిభాషచే టచ్ ప్రత్యయము సమాసాన్తము ప్రాప్తమగుచున్నదిగాని యా పరిభాష యనిత్యమగుటవలన నది రాదు. కావున నీ శబ్దము హరిశబ్ద సదృశము. (శక్తిలాఙ్గలతోమరయష్టి ఘటఘటీ ధనుష్షు పసఙ్ఖ్యానమ్। అను వార్తికమున ఘట శబ్దముకంటె వేరుగ ఘటీ శబ్ద గ్రహణ మీ పరిభాష యనిత్యమనుటలో ప్రమాణము) గోస్త్రియోః, అను సూత్ర విహితమగు హ్రస్వముచే నిష్పన్నమైనది గావున అతిసఖి శబ్దము లాక్షణి కము కావున లక్షణ ప్రతిపదోక్తయోః ప్రతిపదోక్తస్యైవ గ్రహణమ్, అను

పరిభాషచే అనఙ్ ణిద్వద్భావవిధాయక సూత్రములలోని సఖి శబ్దము దీనిని గ్రహింపనందున నా కార్యము లిచట ప్రవర్తింపవు. ప్రతిపదోక్తమన స్వస్వరూప నిష్పత్తినిగుఱించి యితరశాస్త్రముల నపేక్షింపనిది. లక్షణమన ప్రతిపదోక్తము కంటె నన్యము. ఈ రెంటిలో ప్రతిపదోక్తమునకే గ్రహణము గల్గునని పరిభాషార్థము. లాక్షణికము విలమ్బముగ నుపస్థితమగును. ప్రతిపదోక్త మితరాపేక్ష లేనిదగుటవలన శీఘ్రముగ నుపస్థితమగును. ప్రతిపదోక్తమును గ్రహించుటలో శీఘ్రోపస్థితియే మూలమని గ్రహించునది.

* 258. పతిస్సమాసఏవ 1-4-8. పతిః, సమాసే, ఏవ. (ఘు)

పతిశబ్దః సమాసఏవ ఘిసంజ్ఞః స్యాత్। పత్యా, పత్యే, పత్యుః, పత్యౌ। శేషంహరివత్। సమాసేతు భూపతినా। భూపతయే। కతిశబ్దోనిత్యం బహువచనాన్తః॥

258. పతిశబ్దము సమాసమునందే ఘిసంజ్ఞకమగును. పత్యా (పతి + టా) ఘిసంజ్ఞ లేనందున నా భావమురాదు. పత్యే (పతి + ఙే) గుణము రాదు. పత్యుః (పతి + ఙసి, ఙస్) ఇచట గుణము రాకపోవుటచే యణాదేశము ప్రవర్తించినది. కావున ఖ్యత్యాత్ (256) సూ. చే, నుత్వము ప్రవర్తించును. పత్యౌ (పతి + ఙి) అత్వౌత్వములు రావు. మిగిలినది హరిశబ్ద సదృశము. సమాసమందు ఘిసంజ్ఞ యుండుటచే ఘిసంజ్ఞాకార్యములగు నా భావాదులు ప్రవర్తించును. భూపతినా, భూపతయే. బహుత్వసంఖ్యావిశిష్టమగు సంఖ్యేయము విషయముగాగల ప్రశ్నమందే డతిప్రత్యయము విహితమగుటచే డతిప్రత్యయాన్తమగు కతిశబ్ద మెప్పుడును బహువచనాన్తముగనే యుండును.

వివ:—1. సమాసమందు పతిశబ్దమే ఘిసంజ్ఞకమగునను విపరీత నియమమును వారించి యిష్టమగు మూలోక్త నియమమును సంపాదించుటకై యిచట నేవకారమని యూహించునది. విపరీతనియమము కలిగినచో సమాసమున హరి శబ్దాదులకు (పరమహరిణా) ఘిసంజ్ఞ సిద్ధము గాకుండును.

2. ఈ సూత్ర మిట్లు నియామక మగునపుడు, "సీతాయాః పతయేనమః, పతితేపతౌ" మొదలగు ప్రయోగము లెట్లుపపన్నములగునను శఙ్కకిది సమాధానము. పతి శబ్దముకంటె ఆఖ్యాతార్థమున (పతిరిత్యాఖ్యాతః పతిః) ణిచ్చు చేసి దానికంటె నౌణాదికమగు నికారప్రత్యయము చేసినందున సిద్ధమగు పతి శబ్దము లాక్షణికమగుటవలన నీ సూత్రమున గ్రహింపబడదు. పై ప్రయోగముల లోని పతిశబ్దమిట్టిదే గాన దీనికి "శేషోఘ్యసఖి" సూ. చే, ఘిసంజ్ఞ నిశ్శఙ్కముగ నగునని.

* 259. బహుగణవతుడతి సంఖ్యా 1-1-23. బహుగణవతు డతి, సంఖ్యా.

ఏతే సంఖ్యాసంజ్ఞాస్స్యుః।

259. బహుగణవతుడతి అనుసరి సమాహార ద్వంద్వము. బహుగణ శబ్దములు, వతు ప్రత్యయాన్తము, డతి ప్రత్యయాన్తము, ఇవి సంఖ్యాసంజ్ఞకల వగును.

వివ:— సంఖ్యాయతే అనయేతి సంఖ్యా, అను నన్వర్థసంజ్ఞవలన బహుగణశబ్దము లిచట సంఖ్యావాచకములే గ్రహింపబడును గాని వైపుల్యవాచకములు గ్రహింపబడవు. వతుడతి ప్రత్యయములకు సంజ్ఞవలన ప్రయోజనములేదు. గావున ప్రత్యయగ్రహణ పరిభాషచే తదన్తవిధి కలుగును. "సంజ్ఞావిధౌ" అను నిషేధ మిచట ప్రవర్తింపదని గ్రహింపదగును.

* 260. డతి చ 1-1-25. డతి, చ. (సంఖ్యా షట్)

డత్యన్తా సంఖ్యా షట్ సంజ్ఞా స్యాత్ ।

260. డతి ప్రత్యయాన్తమగు సంఖ్యావాచకము (కతి) షట్ సంజ్ఞ కలదగును.

* 261. ప్రత్యయస్య లుక్ శ్లులుపః 1-1-61. ప్రత్యయస్య, లుక్ శ్లులుపః (అదర్శనస్య)

లుక్ శ్లులుప్ శబ్దైః కృతం ప్రత్యయాదర్శనం

క్రమాత్ తత్తత్సంజ్ఞం స్యాత్ ।

261. లుక్, శ్లు, లుప్, శబ్దములచే విధింపబడు ప్రత్యయముయొక్క యదర్శనము (లోపము) క్రమముగ నాయా సంజ్ఞలు (లుక్, శ్లు, లుప్) కలదగును.

వివ: —లుక్ శబ్దముచే నగు ప్రత్యయాదర్శనమే లుక్సంజ్ఞ గలదగును. శ్లు శబ్దముచేనగు ప్రత్యయాదర్శనమే శ్లుసంజ్ఞ కలదగును, లుప్ శబ్దముచేనగు ప్రత్యయాదర్శనమే లుప్సంజ్ఞ గలదగుననియు గ్రహించునది. ఇట్లు చెప్పుటచే లుగాది సంజ్ఞలకు పరస్పరసాఙ్కర్యము వారితమగును. ఏకసంజ్ఞాధికార బహిర్భూతములగుటచే లుగాది సంజ్ఞలకు లోపసంజ్ఞతో సమావేశము కలుగును.

* 262. షడ్భ్యో లుక్. 7-1-22. షడ్భ్యః లుక్, (జశ్శసోః)

షడ్భ్యః పరయోః జశ్శసోర్లుక్ స్యాత్ ॥

262. షట్సంజ్ఞకములకంటె పరములగు జస్, శస్, ప్రత్యయములకు లుక్కు అగును. కతి. (కతి + జస్)

* 263. ప్రత్యయలోపే ప్రత్యయలక్షణమ్. 1-1-62. ప్రత్యయలోపే, ప్రత్యయలక్షణమ్.

ప్రత్యయే లుప్తేపి తదాశ్రితం కార్యం స్యాత్ ।

ఇతి జసి చేతి గుణే ప్రాప్తే॥

263. ప్రత్యయము లోపించినను ప్రత్యయ నిమిత్తకమగు కార్యము వచ్చును. కతి అనుచోట నీ సూత్రముచే జస్ ప్రత్యయము లోపించినను జస్ ప్రత్యయ నిమిత్తకమగు కార్యము (గుణము) జసిచ (242) అను సూ. చే, ప్రసక్తమగుచున్నది.

* 264. నలుమతాఙ్గస్య 1-1-63. న, లుమతా, అఙ్గస్య। లుక్, శ్లు, లుప్, ఏతే, లుమన్తః। లుమతాశబ్దేన లుప్తే తన్నిమిత్త మఙ్గకార్యం నస్యాత్। కతిః। కతి। కతిభిః। కతిభ్యః। కతిభ్యః। కతీనామ్। కతిషు। అస్మద్। యుష్మద్। షట్సంజ్ఞకాః। త్రిషు సరూపాః। త్రిశబ్దో నిత్యం బహువచనాన్తః। త్రయః, త్రీన్, త్రిభిః, త్రిభ్యః॥

264. లుక్, శ్లు, లుప్, ఈ మూడును 'లు' శబ్దముకలవి. ఈ శబ్దములచే ప్రత్యయము లోపించినపుడు ప్రత్యయనిమిత్తకమగు నంగకార్యము ప్రవర్తింపదు. ప్రత్యయలక్షణ సూత్రము ప్రవర్తింపదని యాశయము. కతి. ఇచ్చట లుక్ శబ్దముచే ప్రత్యయము లోపించినందున జస్ ప్రత్యయ నిమిత్తకమగు గుణము ప్రవర్తింపదు. అఙ్గకార్యము చేయునపుడు నిషేధమనుటచే ప్రత్యయాన్తమునకు విధింపబడు పదసంజ్ఞ, ప్రత్యయ లక్షణముచే వచ్చునని యూహింపనగును. యుష్మదస్మచ్ఛబ్దములు షట్సంజ్ఞకములును లిఙ్గత్రయమందును సమానాకృతి గలవగును. లిఙ్గభేదమువలన రూపభేదము కలుగదని యాశయము.

వివ:—యుష్మాన్ అనుచోట తస్మాచ్ఛసోనః పుంసి (197) సూ. చే, నకారాదేశమును విధించు భాష్యముచేతను, నపుంసకలిఙ్గమున విభక్త్యాదేశములగు శిశీనుమ్ములకును యుష్మదస్మదాదేశములకును (యూయ, వయ) విప్రతిషేధమును బోధించు వార్తికము (శిశీనుమ్ విధిభ్యో యుష్మదస్మదాదేశా విప్రతిషేధేన) చేతను షట్సంజ్ఞకములకగుటచె స్త్రీలిఙ్గబోధక ప్రత్యయ (ఙీప్, టాప్) నిషేధకమగు (నషట్ స్వస్రాదిభ్యః) సూత్రముచేతను యుష్మదాదులకు లిఙ్గభేదమున్నది గాని తత్ప్రయుక్తమగు రూపభేదము మాత్రము లేదని తెలియదగును. ఇందువలన వీనికి లిఙ్గము లేదని చెప్పుట యుచితముగాదని గ్రహించునది. త్రిశబ్దము మూడు మొదలు పరార్ధమువరకగు బహుత్వమునే బోధించునదగుటచే నిత్య బహువచనాన్తము. త్రయః (త్రి + జస్)

* 265. త్రేస్త్రయః 7-1-53 త్రేః, త్రయః. (ఆమి) త్రిశబ్దస్య త్రయాదేశః స్యాదామి। త్రయాణామ్। పరమత్రయాణామ్। గౌణత్వేతు నేతి కేచిత్। ప్రియత్రీణామ్। వస్తుతస్తు ప్రియత్రయాణామ్। త్రిషు। ద్విశబ్దో నిత్యం ద్వివచనాన్తః॥

265. త్రిశబ్దమున కామ్ ప్రత్యయము పరమగునపుడు 'త్రయ' అనునది యాదేశమగును. (త్రి + ఆమ్) త్రయాణామ్. పరమ త్రయాణామ్. (పరమత్రి + ఆమ్) 'పరమాస్త్రయః తేషామ్' అని విగ్రహము. త్రయాదేశ విధానాధికారస్థమగుటచే త్రిశబ్దాన్తమునకును త్రయాదేశమగును. ప్రియాస్త్రయః యేషాం (ప్రియత్రి + ఆమ్) ఇచట త్రిశబ్దము ప్రధానమగుటవలన త్రయాదేశము రాదనియు, ప్రియత్రీణామని యగుననియును కొందఱి మతము. త్రిశబ్దాన్తమగు సంఖ్యను బోధించు ఆమ్ ప్రత్యయము పరమగునపుడు త్రయాదేశమగునని యర్థము, గాన నిచట (గౌణములో) ఆదేశము ప్రవర్తించదని వారి యాశయము. కాని యిప్పుడు, "షడ్భ్యో లుక్" సూత్రమువలె నిచట త్రిశబ్దార్థమునకు ప్రాధాన్యమునప్పుడే ఆదేశమగుననుటలో ప్రమాణములగు బహువచనాదులు లేనందున నీ యాదేశము గౌణమందును ప్రవర్తించును గావున, ప్రియత్రయాణామ్, అనియే యగునని దీక్షితాశయము. ద్విశబ్దమెప్పుడును ద్విత్వసంఖ్యగలదానినే బోధించునదగుటచే నిత్య ద్వివచనాన్తమగును. ద్వి + ఔ.

* 266. త్యదాదీనామః 7-3-102. త్యదాదీనామ్, అః. (విభక్తౌ)

ఏషామకారోఽన్తాదేశః స్యాద్విభక్తౌ। ద్విపర్యన్తానామేవేష్టిః। ద్వౌ 2। ద్వాభ్యామ్ 3। ద్వయోః (2) ద్విపర్యన్తానాంకిమ్। భవాన్। భవన్తౌ। భవన్తః। సంజ్ఞాయా ముపసర్జనత్వే చనాత్వమ్। సర్వాద్యన్తర్గణకార్యత్వాత్। ద్విర్నామకశ్చిత్। ద్విః। ద్వౌ। ద్వావతిక్రాన్తోఽతిద్విః। హరివత్। ప్రాధాన్యేతు, పరమద్వౌ ఇత్యాది। ఔడులోమిః। ఔడులోమీ। ఉడులోమాః। లోమ్నోపత్యేషు బహుష్వకారో వక్తవ్యః। బాహ్వాదీఞోపవాదః। ఔడులోమిమ్। ఔడులోమీ। ఉడులోమాన్। ఇతీదన్తాః॥

266. త్యదాదులకు (సర్వాద్యన్తర్గణము) విభక్తి పరమగునపుడు అకారము అన్తాదేశమగును. త్యదాదీనామనుచోట నాదిపదముచే ద్విశబ్దము వఱకుగలవానికే గ్రహణమని భాష్యేష్టి. (త్యద్, తద్, యద్, ఏతద్, ఇదమ్, అదస్, ఏక, ద్వి) ద్వౌ (ద్వి + ఔ) అత్వము వృద్ధియునగును. ద్వాభ్యామ్, (3) ద్వయోః (2) అత్వముచేసినపిదప అకారాన్తమగుటచే రామశబ్దసదృశమగును. ద్విపర్యన్తానాం కిమ్? ద్విశబ్దము తరువాతనున్న శబ్దములలో యుష్మదస్మచ్ఛబ్దములకు విశేష విహితములగు అత్వయత్వలోపముల చేతను, కింశబ్దమునకు విశేష విహితమగు కాదేశముచేతను, అత్వము బాధితమగును గాన ద్విపర్యన్తానామనునది లేకున్న దోషమేమని ప్రశ్నాశయము. ఉత్తరము. భవాన్, భవన్తౌ, భవన్తః. భవత్ + సు, అనియుండఁగ తకారమున కత్వము ప్రవర్తించినచో అతోగుణే

(192) సూ. చే, పరరూపము, ఉగిదచామ్, (363) సూ. చే, నుమాగమము, సర్వనామస్థానే (251) సూ. చే, దీర్ఘము, సులోపనలోపములు ప్రవర్తించును. భవా అను నన్నిష్టరూపమగును. భవన్తౌ, భవన్తః, అను చోటులందును అత్వము ప్రవర్తించినచో భవానౌ, భవానః, అని యనిష్టరూపములగును. అట్టివి కాకుండుటకై ద్విపర్యన్తానామను నది యావశ్యకమని. ఈ అత్వము సర్వాద్యన్తర్గణ కార్యమగుటచే సంజ్ఞావాచకమునకు, నుపసర్జన మగునపుడును ప్రవర్తించదు. ద్విః (అను పేరుగలవాడు). సంఖ్యావాచకము గానందున దీనికి ఏకవచన ద్వివచన బహువచనములు మూడు నుండును. ద్విః, ద్వౌ, ద్వయః, ఇత్యాదులు. అతిద్విః (ద్వావతిక్రాన్తః) రెండింటి నతిక్రమించినవాడు. ఇచట ద్విశబ్ద ముపసర్జన మగుటవలన నత్వము కాదు. ఈ రెండును హరిశబ్దసదృశములు. ద్విశబ్దము ప్రధాన మగునపుడు పరమద్వౌ అనుచోట అత్వము ప్రవర్తించును. పరమద్వౌ, ద్విశబ్దసదృశము. ఉడులోమా (ఉడూనీవలోమానియస్య) నక్షత్రములవంటి రోమములు గలవాడు. వానికొడుకు ఔడులోమిః బాహ్వాదిభ్యశ్చ (4-1-96) సూ. చే, నపత్యార్థమునందు ఇఞ్ ప్రత్యయము. ఔడులోమీ (ఔడులోమి + ఔ) ఉడులోమాః (ఔడులోమి + జస్) (వార్తి) లోమ్నో పత్యేషు బహుష్వకారో వక్తవ్యః, (లోమశబ్దాన్త ప్రాతిపదికముకంటె నపత్యగత బహుత్వము వివక్షించు నపుడకార ప్రత్యయమగును.) దీనిచే అప్రత్యయము. ఇది బాహ్వాదిభ్యశ్చ, సూత్రవిహితమగు నిఞ్ ప్రత్యయమున కపవాదము. ఇట్లు బహువచనములం దకారాన్తమగుటచే నిది రామశబ్దసదృశమగును. ఔడులోమిమ్, ఔడులోమీ, ఉడులోమాన్.

ఇదన్తప్రకరణము ముగిసెను.

మూ = వాతప్రమీరిత్యుణాది సూత్రేణ మాఙ ఈ ప్రత్యయః। సచ కిత్। వాతం ప్రమిమీతే వాతప్రమీః। దీర్ఘాజ్జసి చ। వాతప్రమ్యౌ। వాతప్రమ్యః। హే వాతప్రమీః। అమి పూర్వః। వాతప్రమీమ్। వాతప్రమ్యౌ। వాతప్రమీన్। వాతప్రమ్యా। వాతప్రమీభ్యామ్। (3) వాతప్రమ్యే। వాతప్రమ్యః (2) వాతప్రమ్యోః 2। వాతప్రమ్యామ్। దీర్ఘత్వాన్న నుట్। జాతు సవర్ణదీర్ఘః। వాతప్రమీ। వాతప్రమీషు। ఏవం యయీపప్యాదయః। యాన్త్యనేనేతి యయీర్మార్గః। పాతి లోకమితి పపీస్సూర్యః। యాపోః కిద్ద్వే చేతి ఈ ప్రత్యయః। క్విబన్త వాతప్రమీశబ్దస్యతు అమి, శసి, ఙౌ, చ, విశేషః। వాతప్రమ్యమ్। వాతప్రమ్యః। వాతప్రమ్యి। ఏరనేకాచ ఇతి వక్ష్యమాణో యణ్। ప్రధీవత్। బహ్వ్యః శ్రేయస్యో

యస్య స బహుశ్రేయసీ। దీర్ఘజ్యన్తత్వాద్ధల్ జ్యా
బితి సులోపః ॥

అర్థము = 'వాతప్రమీః' అను ఉణాది సూత్రముచే వాతశబ్దము ఉపపదమగుచుండ ప్రపూర్వక మాఙ్ ధాతువుకంటె ఈ ప్రత్యయము వచ్చును. అది కకారేత్సంజ్ఞక మగుటచే ఆతోలోప ఇటిచ (6-4-64) సూ. చే, నాకారలోపము. వాతప్రమీః (వాతం ప్రమిమీతే). శృఙ్గరహితమై లేడివలెనుండు జంతు విశేషము. వాతప్రమీ + ఔ దీర్ఘాజ్జసి చ (247) సూ. చే, పూర్వసవర్ణ దీర్ఘము నిషేధింపబడినందున యణాదేశమగును. వాతప్రమ్యౌ. వాతప్రమ్యః (వాతప్రమీ + జస్) హేవాతప్రమీః. వాతప్రమీ + అమ్. అమి పూర్వః (195) సూ. చే, పూర్వరూపము. వాతప్రమీమ్. వాతప్రమ్యౌ. (వాతప్రమీ + శౌట్) యణాదేశము. వాతప్రమీన్। పూర్వసవర్ణదీర్ఘ నత్వములు. వాతప్రమ్యా (వాతప్రమీ + టా) యణాదేశము. వాతప్రమీభ్యామ్. (3) వాతప్రమ్యే (వాతప్రమీ + ఙే) యణాదేశము. పఞ్చమీ షష్ఠీ విభక్తుల యేకవచనము, వాతప్రమ్యః (వాతప్రమీ + ఙసి, ఙస్) యణాదేశము. షష్ఠీ సప్తమీ విభక్తుల ద్వివచనము, వాతప్రమ్యోః. వాతప్రమ్యామ్. (వాతప్రమీ + ఆమ్) దీర్ఘాన్తమగుటచే, హ్రస్వనద్యాపో నుట్ (209) సూ. చే, నుడాగమము రాదు. (వాతప్రమీ + ఙి) సవర్ణదీర్ఘము. వాతప్రమీ. ఇట్లే యయీ పపీ మొదలగు శబ్దముల ప్రక్రియ నూహింపదగును. యాత్యనేనేతి యయీః, మార్గము. పాతిలోకమితి పపీః, సూర్యుడు. లోకమును రక్షించువాడు. యాపోః కిద్ద్వే చ, అను నుణాది సూత్రముచే, యా, పా, ధాతువులకంటె ఈ ప్రత్యయము కిద్వద్భావము ద్విత్వము నగును. వాతప్రమీశబ్దము మీఙ్ (మానే) ధాతువుకంటె క్విప్ప్రత్యయమువలనను నిష్పన్నమగును. క్విబన్తమగుటవలన దీనికి ధాతుత్వముండును. అందుచే అమ్, శస్, ఙి, వీనియందు ఈ ప్రత్యయాన్త వాతప్రమీ శబ్దముకంటె రూపభేదము కలుగును. వాతప్రమ్యమ్. వాతప్రమ్యః, వాతప్రమ్యి. ఇచట ఏరనేకాచః, (273) అను చెప్పబోవు సూత్రముచే యణాదేశము ప్రవర్తించును. కావున నిది ప్రధీశబ్దసదృశము. (బహ్వ్యః శ్రేయస్యః యస్య) బహుశ్రేయసీ, అనేక శ్రేయములు కలవాడు. బహుశ్రేయసీ + సు, దీర్ఘజ్యన్తమగుటచే నిచట హల్ఙ్యాప్ (253) సూ. చే, సులోపమగును.

* 267. యూస్త్ర్యాఖ్యౌ నదీ 1-4-31 యూ, స్త్ర్యాఖ్యౌ, నదీ.

ఈదూదన్తౌ నిత్యస్త్రీలిఙ్గౌ నదీసంజ్ఞౌ స్తః।
(వా) ప్రథమలిఙ్గగ్రహణం చ। పూర్వంస్త్ర్యాఖ్య
స్యోపసర్జనత్వేపి నదీత్వం వక్తవ్య మిత్యర్థః॥

267. నిత్య స్త్రీలిఙ్గములగు ఈకారాన్తములు, ఊకారాన్తములు, నదీ సంజ్ఞ గలవగును. గౌరీ. వధూః. ప్రకృతమున బహుశ్రేయసీ శబ్దము నిత్య స్త్రీలిఙ్గము కానందున నదీసంజ్ఞ యప్రాప్తమగుచున్నది. కావున నిట్టి శబ్దముల వ

నదీసంజ్ఞ చెప్పబడుచున్నది. (వా) ప్రథమలిఙ్గ గ్రహణంచ. వృత్తికి (కృదన్త తద్ధితాన్త సమాసాదులకు) పూర్వమందు (అర్థాన్తరములో సంక్రమింపకముందు) గల నిత్య స్త్రీత్వముచే నర్థాన్తర సంక్రమణమందును (వృత్త్యన్తరమున) నదీసంజ్ఞ చెప్పవలయునని యర్థము. శ్రేయసీ శబ్దము వృత్తికి పూర్వము నిత్య స్త్రీలిఙ్గమగుటవలన వృత్తిలో (సమాసములో) లిఙ్గాన్తరాభిధాయకమైనను నదీసంజ్ఞ కలదగును. నద్యన్తమగుటవలన బహుశ్రేయసీ శబ్దమును నదీసంజ్ఞకమగును.

వివ:—1 ఈశ్చ, ఊశ్చ, యూ. స్త్రియమాచక్షాతే స్త్ర్యాఖ్యౌ (స్త్రీ బోధకములే అయిన) ఆఖ్యా గ్రహణముచే స్త్రీ బోధకములు మాత్రము గావలయునని చెప్పుటవలన 'నిత్య స్త్రీలిఙ్గౌ' అను నర్థము లభించును. వర్ణములకే ఘినదీసంజ్ఞలను పక్షాన్తరముగలదని తెలియనగును.

* 268. అమ్బార్థనద్యోర్హ్రస్వః. 7-3-107 అమ్బార్థనద్యోః, హ్రస్వః. (సంబుద్ధౌ)

అమ్బార్థానాం నద్యన్తానాంచ హ్రస్వః స్యాత్సంబుద్ధౌ। హే బహుశ్రేయసి। శసి బహుశ్రేయసీన్॥

268. మాతృవాచకములకు, నద్యన్తములకు సంబుద్ధి పరమగునపుడు హ్రస్వమాదేశమగును. ఇచట వర్ణసంజ్ఞాపక్షము (ఈకారోకారములకు నదీసంజ్ఞ) నాశ్రయించి నద్యన్తములకని యర్థము చెప్పబడెను. అమ్బార్థముల కుదాహరణము, హే అమ్బ, నద్యన్తముల కుదాహరణము, హే బహుశ్రేయసి. ఇచట హ్రస్వవిధాన సామర్థ్యమువలన హ్రస్వస్య గుణః (243) సూ. చే, సంబుద్ధి నిమిత్తకమగు గుణము ప్రవర్తించదు. గుణమే యిష్టమయినయెడల ప్రక్రియాలాఘవము కొఱకు "అమ్బార్థానాం హ్రస్వః" హ్రస్వనద్యోర్గుణః, అనియే సూత్రములను పాణిని రచించెను. ద్వితీయా బహువచనమున దీర్ఘనత్వములచే బహుశ్రేయసీన్, అని యగును.

* 269. ఆణ్నద్యాః 7-3-112. ఆట్, నద్యాః, (ఙితి)

నద్యన్తాత్పరేషాం ఙితామాడాగమః స్యాత్।

269. నద్యాః అనునది, పఞ్చమ్యన్తమగుటచే ననువృత్తమగు 'ఙితి' అనునది షష్ఠ్యన్తముగ మార్పుజెందును. నద్యన్తముకంటె పరమగు ఙకారేత్సంజ్ఞకములగు ప్రత్యయములకు ఆడాగమమగును. బహుశ్రేయసీ + ఙే, ఆడాగమముచే, బహుశ్రేయసీ + ఆ + ఏ అని యుండగా

* 270. ఆటశ్చ. 6-1-90. ఆటః, చ (అచి, వృద్ధిః)

ఆటోఽచి పరే వృద్ధిరేకాదేశః స్యాత్। బహుశ్రేయస్యై। బహుశ్రేయస్యాః। నద్యన్తాత్పరత్వాన్నుట్। బహుశ్రేయసీనామ్.

270. ఆడాగమమున కచ్చు పరమగునపుడు వృద్ధి యేకాదేశమగును. బహుశ్రేయసీ + ఆ + ఏ అనుచోట నీ సూత్రముచే వృద్ధియగును. యణాదేశము. బహుశ్రేయస్యై. ఇట్లే బహుశ్రేయస్యాః (బహుశ్రేయసీ + ఙసి, ఙస్) అనునది. బహుశ్రేయసీ + ఆమ్. ఇచట ఆమ్ ప్రత్యయము నద్యన్తము కంటె పరమగుటవలన హ్రస్వనద్యాపః (209) సూ. చే, నుడాగమమగును. బహుశ్రేయసీనామ్.

* 271. ఙేరామ్నద్యామ్నీభ్యః. (7-3-116) ఙేః, ఆమ్, నద్యామ్ నీభ్యః॥

నద్యన్తాదాబన్తాన్నీశబ్దాచ్చ ఙేరామ్ స్యాత్। ఇహ పరత్వాదాటా నుట్ బాధ్యతే। బహుశ్రేయస్యామ్। శేషమీప్రత్యయాన్త వాతప్రమీ శబ్దవత్। అఙ్యన్తత్వాన్న సులోపః। అతిలక్ష్మీః। శేషం బహుశ్రేయసీవత్। కుమారీ మిచ్ఛన్ కుమారీ వాచరన్ వా బ్రాహ్మణః కుమారీ। క్యజన్తానాచార క్విబన్తాద్వా కర్తరి క్విప్। హల్ఙ్యాబితి సులోపః।

271. నదీ, ఆప్, నీ, అను శబ్దములకు ద్వన్ద్వము. నద్యన్తము, ఆబన్తము, నీ శబ్దము, వీనికంటె పరమగు సప్తమ్యేకవచనమునకు 'ఆమ్' ఆదేశమగును. బహుశ్రేయసీ + ఙి ఇచట దీనిచే నామాదేశము. బహుశ్రేయసీ + ఆమ్. ఆమ్ ప్రత్యయమునకు హ్రస్వనద్యాపోనుట్ (209) సూ. చే, నుడాగమము, ఆణ్నద్యాః (26[illegible]) సూ. చే, నాడాగమము ప్రాప్తమగుచున్నవి. 'విప్రతిషేధే పరం కార్యమ్' (176) సూ. చే, పరమగు నాడాగమముచే నుడాగమము బాధింపబడును. 'సకృద్గతౌ విప్రతిషేధే యద్బాధితం తద్బాధితమేవ (పరశాస్త్రముచే బాధితమగు కార్యము, ప్రాప్తియున్నను తిరుగ ప్రవర్తించదు.) అను న్యాయముచే నాడాగమము ప్రవృత్తమయినపిదప గూడ నుడాగమము ప్రవర్తించదు. బహుశ్రేయస్యామ్. శేషమీప్రత్యయాన్త వాతప్రమీ శబ్దసదృశము. అతిలక్ష్మీః (లక్ష్మీమతిక్రాన్తః) లక్ష్మిని అతిక్రమించినవాడు. లక్ష్మీ శబ్దము ఔణాదికమగు నీ ప్రత్యయాన్తముగాని ఙ్యన్తము గాదు గాన హల్ఙ్యాప్ (2[illegible]3) సూ. చే, సులోపము రాదు. దీనికిని ప్రథమలిఙ్గ గ్రహణంచ, అను వార్తికముచే నదీసంజ్ఞ వచ్చును గావున శేషము బహుశ్రేయసీ శబ్దసదృశమగును.

కుమారీ శబ్దముకంటె కుమారీమిచ్ఛన్, కుమారీవాచరన్, వా బ్రాహ్మణః (కన్య నిచ్ఛయించువాడు, లేక కన్యవలె వ్యవహరించువాడు) అను నర్థమందు క్రమముగ 'సుప ఆత్మనః క్యచ్' (3-1-8) సూ. చే, క్యచ్ ప్రత్యయముగాని, సర్వప్రాతిపదికేభ్యః క్విప్ వా వక్తవ్యః, (3-1-11) వార్తికముచే నాచారార్థక క్విప్ ప్రత్యయముగాని, వచ్చును. కుమారీ + య, కుమారీ + క్విప్, ఇవి ధాతువులగును. వీనికంటె క్విప్ చ (3-2-76) సూ. చే, కర్త్రర్థమందు

క్విప్ ప్రత్యయమగును. ఈ క్విప్ ప్రత్యయము, ధాతుత్వ సంపాదకములగు క్యచ్ క్విప్ ప్రత్యయములును లోపించును. ఇట్లు చెప్పుటచే స్త్రీలిఙ్గమగు కుమారీ శబ్దము పురుషబోధక మగుటచే పుంలిఙ్గమగును. కుమారీ + సు. హల్ఙ్యాప్ సూ. చే, సులోపము. కుమారీ.

* 272. అచి శ్నుధాతుభ్రువాం య్వోరియఙువఙౌ 6-4-77
అచి, శ్నుధాతుభ్రువామ్, య్వోః, ఇయఙువఙౌ।

శ్నుప్రత్యయాన్తస్య ఇవర్ణోవర్ణాన్తధాతోః భ్రూ ఇత్యస్య చాఙ్గస్యేయఙువఙౌ స్తోఽజాదౌ ప్రత్యయే పరే। ఙిచ్చేత్యన్త్యాదేశః। ఆన్తరతమ్యాదేరియఙ్, ఓగు వఙ్। ఇతీయఙి ప్రాప్తే।

272. య్వోః అనునది ద్వన్ద్వసమాసము (ఇశ్చ, ఉశ్చ, యూ, తయోః) ఇది ధాతువునకే విశేషణము. శ్నుప్రత్యయాన్త భ్రూశబ్దము లెప్పుడును వర్ణాన్తములే యగుటంజేసి ఈ విశేషణ మచట నిరర్థకమగును. అఙ్గస్య, అను నధికారము వలన ప్రత్యయే అనునది యుపస్థితమగును. యస్మిన్విధిః అను పరిభాషచే తదాది విధివలన నజాదౌ ప్రత్యయే, అను నర్థము లభించును. శ్నుప్రత్యయాన్తము (ఆప్ను) ఇవర్ణో వర్ణాన్తధాతువు భ్రూశబ్దాన్తమునగు యఙ్గమున కజాది ప్రత్యయము పరమగునపుడు, ఇయఙ్, ఉవఙ్, ఆదేశములగును. "ఙిచ్చ (44) పరిభాషచే నివి యన్త్యాదేశములగును. స్థానసాదృశ్యమువలన నికారమునకి యఙు, ఉకారమునకు వఙు వచ్చును. కుమారీ + ఔ, ఇచట క్విబన్తమయిన, కుమారీ అనునది ధాతువగుటవలన నీసూత్రముచే నియఙాదేశము ప్రసక్తమగుచున్నది.

* 273. ఏరనేకాచోఽసంయోగపూర్వస్య. (6-4-82) ఏః, అనేకాచః, అసంయోగపూర్వస్య. (అచి, యణ్)

ధాత్వవయవసంయోగపూర్వో న భవతి య ఇవర్ణస్తదన్తో యో ధాతుః తదన్తస్యానేకాచోఽఙ్గస్య యణ్ స్యాదజాదౌ ప్రత్యయే పరే। ఇతి యణ్। కుమార్యౌ। కుమార్యః। హే కుమారి। అమి శసిచ। కుమార్యమ్। కుమార్యః। కుమార్యై। కుమార్యాః। 2। కుమారీణామ్। కుమార్యామ్। ప్రధీః ప్రధ్యౌ। ప్రధ్యః। ప్రధ్యమ్। ప్రధ్యః। ఉన్నయతీత్యున్నీః। ధాతునా సంయోగస్య విశేషణాదిహ స్యాదేవ యణ్। ఉన్న్యౌ। ఉన్న్యః। హే ఉన్నీః। ఉన్న్యమ్। ఙేరామ్। ఉన్న్యామ్। ఏవం గ్రామణీః। అనేకాచః కిమ్। నీః। నియౌ। నియః। అమి శసిచ పరత్వాదియఙ్। నియమ్। నియః। ఙేరామ్। నియామ్। అసంయోగపూర్వస్య కిమ్। సుశ్రియౌ।

యావక్రియా। గతికారకేతర పూర్వపదస్య యణ్ నేష్యతే। శుద్ధధియౌ। పరమధియౌ। కథం తర్హి దుర్ధియో వృశ్చికభియేత్యాది। ఉచ్యతే। దుష్టా ధీర్యేషామితి విగ్రహే దురిత్యస్య ధీశబ్దం ప్రతి గతిత్వమేవ నాస్తి। యత్క్రియాయుక్తాః ప్రాదయస్తం ప్రత్యేవ గత్యుపసర్గసంజ్ఞాః। వృశ్చిక శబ్దస్య బుద్ధికృతముపాదానత్వం నేహ వివక్షితమ్। వృశ్చిక సంబంధినీ భీరిత్యుత్తరపదలోపో వా।

273. పూర్వసూత్రమునుండి యనువర్తించు ధాతుపదము నావృత్తిచేసి సంయోగమునకు నజంతమునకును విశేషణము చేయవలయును. ధాత్వవయవ సంయోగము పూర్వమందు లేనట్టి యికారము అంతమందుగల ధాతువు అంతమందుగల్గి యనేకాచ్చగు నజంతమున కజాదిప్రత్యయము పరమగునప్పుడు యణాదేశము వచ్చును. కుమారీ + ఔ. ఇచట పూర్వసూత్ర ప్రాప్తమగు నియజాదేశమును బాధించి పరమగు నీ యణాదేశము ప్రవర్తించును. కుమార్యౌ. కుమార్యః, (కుమారీ + జస్) హే కుమారి. ఇచట నదీసంజ్ఞాప్రయుక్తమైన హ్రస్వము, కుమార్యమ్. (కుమారీ + అమ్) కుమార్యః (కుమారీ + శస్) కుమార్యై (కుమారీ + ఙే) కుమార్యాః. ఇచట నదీసంజ్ఞా ప్రయుక్తమగు కార్యము లూహించునది. (కుమారీ + ఙసి, ఙస్) కుమారీణామ్. (కుమారీ + ఆమ్) "హ్రస్వనద్యాపః" (209) సూ. చే, నదీసంజ్ఞాప్రయుక్తమగు నుడాగమము, ణత్వము. కుమార్యామ్. (కుమారీ + ఙి) నదీసంజ్ఞాప్రయుక్తమగు ఆమాదేశము మొదలగు కార్యము లగును. ప్రధీః. (ప్రకృష్టం ధ్యాయతి) లెస్సగా ధ్యానించువాడు. ప్రధ్యౌ, ప్రధ్యః, ప్రధ్యమ్. ప్రధ్యౌ, ప్రధ్యః, ఇత్యాదులు. ఇట్టి విగ్రహమున నిత్య స్త్రీలింగము గానందున నిచట నదీసంజ్ఞాకార్యములగు ఆడాగమాదులు రావు. ప్రధీః (ప్రకృష్టా ధీర్యస్య) మంచి బుద్ధికలవాడు. ఇచట ప్రథమలింగ గ్రహణంచ, అనువార్తికముచే నదీసంజ్ఞయుండును గాన ఆడాగమాదులు ప్రవర్తించును. ప్రధ్యై, ప్రధ్యాః, ఇత్యాదులు. ఉన్నీః, (ఉన్నయతి) పైకి లేవతీయువాడు. ఉన్న్యౌ, (ఉన్నీ + ఔ) ఇచట నీకారము సంయోగపూర్వకమయిన నీ సంయోగము ధాతూపసర్గములకు జెందినదగుటవలన ధాత్వవయవముగాదు గాన (సంయోగమును ధాతువునకు విశేషణము చేయుటవలన) యణాదేశము ప్రవర్తించును. ఉన్న్యః, హే ఉన్నీః, ఇచట నదీసంజ్ఞ లేమింజేసి హ్రస్వము రాదు. ఉన్న్యామ్ (ఉన్నీ + ఙి) ఇచట, ఙేరామ్ (271) సూ. చే, ఆమాదేశము. గ్రామణీః, (గ్రామం నయతి) గ్రామాధికారి, ఇది ఉన్నీ శబ్దసదృశము. నీః, నియౌ, నియః (నీ + జస్). ఇచట యణాదేశమును వారించుటకీ సూత్రమున 'అనేకాచః' అను నజవిశేషణ మావశ్యకము. నియమ్ (నీ + అమ్) నియః (నీ + శస్) ఇచట క్రమముగ పూర్వరూప పూర్వసవర్ణ దీర్ఘములకంటె పర

మగు నియణాదేశము ప్రవర్తించును. నియామ్ (నీ + ఙి) ఙేరామ్ సూ. చే నామాదేశము. సుశ్రియౌ (సుశ్రీ + ఔ) యవక్రియౌ (యవక్రీ + ఔ) ఇచట యణాదేశమును వారించుటకు, “అసంయోగ పూర్వస్య అను ఇవర్ణ విశేషణ మావశ్యకము (వా) గతికారకేతర......నేష్యతే” గతిసంజ్ఞకము కారకము వీనికంటె భిన్నమగు పూర్వపదముగల నిమిత్తాంగమునకు యణాదేశ మిష్టము కాదు. ఉదా॥ శుద్ధధియౌ (శుద్ధాధీర్యయోః) పరమధియౌ (పరమాధీర్యయోః) ఇచ్చోటు లందు శుద్ధ పరమశబ్దములు గతికారకభిన్నము లగుటవలన యణాదేశము రాదు. శుద్ధం (బ్రహ్మ) ధ్యాయతి. పరమం (బ్రహ్మ) ధ్యాయతి అని చెప్పినచో కారక పూర్వకము లగుటవలన యణాదేశము వచ్చును. శుద్ధధ్యౌ. పరమధ్యౌ. కథం, తర్హి..ఇత్యాది. దుర్ధియః. (దుష్టాధ్యాయన్తి) వృశ్చికభియః, (వృశ్చికాత్ + భీతయః) ఈ స్థలములలో మొదటిదానియందు దుర్ అనునది గతిసంజ్ఞకమగుట వలనను, రెండవ దానియందు వృశ్చికశబ్దము కారక మగుటవలనను యణాదేశ మేలరాలేదని ప్రశ్నాశయము. ఉచ్యతే = సమాధానము చెప్పబడుచున్నది. దుఃస్థితా ధీర్యేషాం, అను విగ్రహమున దుస్ అనుదానికి ధీశబ్దమును గురించి గతిసంజ్ఞయే లేదు ప్రాదులే క్రియ నన్వయించునో యా క్రియను బోధించు ధాతువును గురించియే యవి గత్యుపసర్గ సంజ్ఞకములగును. “ఉపసర్గాః క్రియాయోగే” (23) సూత్రమున క్రియయా అని తృతీయచే క్రియాయోగే అను నర్థము లభించుచుండ యోగగ్రహణమువలన నీ వచనము సిద్ధమగును. ప్రకృతమున పై జెప్పినరీతిని దుస్ అనునది స్థా ధాతువును గురించియే గతియగును గాన ధీశబ్దము గతిపూర్వకము గానందున యణాదేశప్రసక్తి లేదని యాశయము. వృశ్చిక శబ్దమునకు బుద్ధికృతమగు నపాదానత్వ మిచట వివక్షింపబడనందున సంబన్ధమాత్ర వివక్షయందు షష్ఠియే వచ్చును. (వృశ్చికస్య, భీః, వృశ్చికభీః) షష్ఠీ సమాసము. షష్ఠి కారకము గానందున వృశ్చిక శబ్దము కారకభిన్నమగుటచే యణాదేశము నిషిద్ధమగును. భయము రక్షణము నర్థముగల ధాతువులయోగమందు భయహేతువునకు బుద్ధికృతాఽపాదానత్వము నాశ్రయించి ‘భీత్రార్థానాం భయహేతుః, (591) సూత్రమును భాష్యకారుడు ప్రత్యాఖ్యానము చేయుటచే నిట్లు సమాధానము చెప్పబడెను. వృశ్చిక సంబంధిని భీః. అను విగ్రహమున సంబంధి నీ శబ్దమునకు (వా) శాకపార్థివాదీనాం అను వార్తికముచే లోపము చెప్పుటవలన వృశ్చికమునకు భయయోగము లేనందున సూత్రకారుని మతమునను (‘భీత్రార్థానాం, సూత్రముచే నపాదానత్వమును వివక్షించునపుడు) యణాదేశ ప్రసక్తి లేదని రెండవ సమాధానమున కాశయము.

* 274. న భూసుధియోః. (6-4-85) న, భూసుధియోః (యణ్, అచి, సుపి)

ఏతయోర్యణ్ నస్యాదచి సుపి। సుధియౌ। సుధియ ఇత్యాది। సఖాయమిచ్ఛతి సఖీయతి। తతః

క్విప్। అల్లోపయలోపౌ। అల్లోపస్య స్థానివత్త్వాద్యణి ప్రాప్తే। క్వౌ లుప్తం న స్థానివత్। ఏకదేశవికృతస్యానన్యత్వాదనఙ్ ణిత్త్వే। సఖా। సఖాయౌ। సఖాయః। హే సఖీః। అమి పూర్వరూపాత్ పరత్వాద్యణి ప్రాప్తే తతోఽపి పరత్వాత్సఖ్యురసంబుద్ధావితి ప్రవర్తతే। సఖాయమ్। సఖాయౌ। శసి యణ్। సఖ్యః। సహ ఖేన వర్తత ఇతి సఖః। తమిచ్ఛతీతి సఖీః। సుఖమిచ్ఛతీతి సుఖీః। సుతమిచ్ఛతీతి సుతీః। సఖ్యౌ। సుఖ్యౌ। సుత్యౌ। ఖ్యత్యాదితి దీర్ఘస్యాపి గ్రహణాదుకారః। సఖ్యుః। సుఖ్యుః। సుత్యుః। లూనమిచ్ఛతీతి లూనీః। క్షామమిచ్ఛతీతి క్షామీః। ప్రస్తీమమిచ్ఛతీతి ప్రస్తీమీః। ఏషాం జసిజసోర్యణ్। నత్వమత్వయోరసిద్ధత్వాత్ ఖ్యత్యాదిత్యుత్వమ్। లూన్యుః। క్షామ్యుః॥ ప్రస్తీమ్యుః। శుష్కీయతేః క్విప్। శుష్కీః। ఇయఙ్। శుష్కియౌ। శుష్కియః। జసిజసోశ్శుష్కియ ఇత్యాది। ఇతీవన్తాః॥

274. భూసుధీశబ్దముల కజాది సుప్పులు పరమగునపుడు యణాదేశము (ఓస్సుపి 282, ఏరనేకాచః 273) సూత్రములచే ప్రాప్తమగునది రాదు. సుధియౌ. (సుధీ + ఔ) సుధియః (సుధీ + జస్) ఇచట యణాదేశము నిషిద్ధమగుటవలన "అచిశ్ను (271) సూ. చే, నియఙాదేశము వచ్చును. అజాది ప్రత్యయములు పరమగునపు డిట్లే ప్రక్రియ నూహింపదగును. సఖు నిచ్ఛయించువాడను నర్థమున సఖి శబ్దముకంటె, క్యచ్ ప్రత్యయము (య) వచ్చును. (సఖీయ) క్యజన్తము ధాతువగుటచే దీనికంటె కర్తను బోధించు క్విప్ ప్రత్యయమగును. ఆ ప్రత్యయము లోపించును. పిదప క్యచ్ ప్రత్యయములోని అకారము, అతో లోపః, సూ. చేతను, యకారము, లోపోర్వ్యోర్వలి (878) సూ. చేతను లోపించును. అల్లోపమునకు స్థానివద్భావము (అచః పరస్మిన్), సూత్రమువలన ప్రసక్తమగు యణాదేశము, (ఏరనేకాచః) క్వౌ లుప్తం నస్థానివత్ (క్విప్ ప్రత్యయము పరమగునపుడు ప్రవర్తించిన లోపము స్థానివద్భావము నొందదు) అను వచనముచే స్థానివద్భావము నిషిద్ధమగును గాన వారితమగును. కావున సఖీ శబ్దము పుంలిఙ్గమున సిద్ధమగును. సఖి శబ్దమునకు విహితములగు అనఙ్ ణిద్వద్భావములేక దేశవికృతన్యాయముచే, (228) సఖీ శబ్దమునకును ప్రవర్తించును. సఖా, సఖాయౌ, సఖాయః. హే సఖీః. దీర్ఘాన్తమగుటచే 'హ్రస్వస్య గుణః' (243) సూ. చే, గుణము ప్రవర్తించదు. సఖీ + అమ్. ఇచట పూర్వరూపమును బాధించి పరమగు యణాదేశము ప్రాప్తమగుచుండ దీనికంటె పరమగు సఖ్యురసంబుద్ధౌ (254) సూ. చే, ణిద్వద్భావము యణాదేశమును బాధించి

ప్రవర్తించును. సఖాయమ్, అని యగును. సఖ్యుః (సఖీ + శస్) ఏరనేకాచః, అను సూ. చే, యణాదేశము. సహ ఖేనవర్తతే (అన్తరిక్షముతో గూడినవాడు) అను విగ్రహమున, సహఖ శబ్దములకు, తేనసహేతి తుల్యయోగే, (851) సూ. చే, బహువ్రీహి సమాసము. వోపసర్జనస్య (852) సూ. చే, సహశబ్దమునకు సభావమునగుటచే, సఖః అని యగును. సఖమిచ్ఛతి అను నర్థమున సఖ శబ్దముకంటె క్యచ్ ప్రత్యయము చేసిన సఖీయ, అని యగును. దానికంటె క్విప్ ప్రత్యయము. తల్లోపము. అల్లోపయలోపములు చేసిన, సఖీ శబ్దము పుంలిఙ్గమున సిద్ధమగును. ఇది లాక్షణికమగుటచే సఖి శబ్దమునకు విధింపబడు ననఙాదికార్యములు దీనికి ప్రవర్తింపవు. ఙ్యన్తము కానందున సులోపము రాదు. సఖీః. సఖీ + ఔ. ఏరనేకాచః, అని యణాదేశము. సఖ్యౌ, సఖ్యః, సఖ్యుః (ఙసి, ఙస్) ఖ్యత్యాత్పరస్య (266) సూత్రమున దీర్ఘమగు ఖీ శబ్దమును గూడ గ్రహించుటచే నిచట నుత్వమగును. సుఖము నిచ్ఛయించువాడు, సుఖీః. సుతు నిచ్ఛయించువాడు, సుతీః. క్యజన్త ప్రకృతిక క్విబన్తములగు నీ రెండును, సఖిశబ్దప్రకృతిక క్యజన్తప్రకృతిక క్విబన్తమగు సఖీ శబ్దముతో సదృశములు. లూన, క్షామ, ప్రస్తీమ, ఇవి క్రమముగ లూఞ్, క్షాయ్, ప్ర + స్త్యై ధాతువులకు, నిష్ఠాన్తములు. వీనికంటె లూనాదుల నిచ్ఛయించు వారనునర్థమున, క్యజన్తప్రకృతిక క్విబన్తములు, లూనీః, క్షామీః, ప్రస్తీమీః, అగును. వీనికి ఙసి, ఙస్సులు, పరమగునపుడు యణాదేశమగును. క్తప్రత్యయమునకు (నిష్ఠకు) విధింపబడిన నత్వమత్వము లసిద్ధములుగూర్చి యసిద్ధమగుటవలన తకారమే యుండును. (లూత్యస్, క్షాత్యస్, ప్రస్తీత్యస్) కావున ఖ్యత్యాత్, సూ. చే, నుత్వము వచ్చును. లూన్యుః, క్షామ్యుః, ప్రస్తీమ్యుః. కావున నీ మూడును సుతీ శబ్దసదృశములు. శుష్కశబ్దముకంటె క్యచ్ క్విప్ ప్రత్యయములు. శుష్కీః. (శుష్కమిచ్ఛతి) శుష్కీ + ఔ, ఇచట నికారము సంయోగపూర్వక మగుట వలన, యణాదేశము రానందున, ఇయఙాదేశము వచ్చును. శుష్కియౌ. ఙసి ఙస్సులయందు సంయోగము పూర్వమందుండుటచే యణాదేశము రాదు. కావున నిచట నిష్ఠాదేశమగు కత్వ మసిద్ధమగుటచే తి శబ్దమున్నను, ఖ్యత్యాత్, సూ. చే, నుత్వమురాదు. శుష్కియః అని యగును.

ఇది ఈదన్త ప్రకరణము.

సూ॥ శమ్భుర్హరివత్. ఏవం విష్ణు, వాయు, భాన్వాదయః. శమ్భు శబ్దము ఘిసంజ్ఞకమగుటచే హరిశబ్దసదృశము. విష్ణు, వాయు, భాను, గురు మొదలగు నుదన్త శబ్దములు శమ్భు శబ్దసదృశములగును.

* 275. తృజ్వత్క్రోష్టుః (7-1-95) తృజ్వత్, క్రోష్టుః (సర్వనామస్థానేచా సంబుద్ధౌ)

క్రోష్టుశబ్దస్తృజన్తేన తుల్యం వర్తతే, అసంబుద్ధౌ సర్వనామస్థానే పరే। క్రోష్టుశబ్దస్య స్థానే క్రోష్టృశబ్దః ప్రయోక్తవ్య ఇత్యర్థః॥

275. క్రోష్టుశబ్దము సంబుద్ధిభిన్నమగు సర్వనామస్థానము పరమగునపుడు తృజన్తముతో తుల్యమగును. ఇచట నిమిత్తాద్యతిదేశములలో ప్రధానమగుటచే రూపాతిదేశమంగీకరింపబడెను. ఉపస్థితమగుటవలన, నర్థసాదృశ్యమువలనను, క్రోష్టుశబ్దమునకు క్రుశ (క్రోదనే) ధాతు ప్రకృతిక తృజన్తరూపమతిదేశింపబడును. కాన క్రోష్టుశబ్దస్థానమందు క్రోష్టృశబ్దము ప్రయోగింపవలెనను నర్థము ఫలితమగును.

వివ:—నిమిత్త, వ్యపదేశ, తాదాత్మ్య, శాస్త్ర, కార్య, రూప విషయకమగుటచే నతిదేశ మాఱు భేదములు గలదు.

(1) చికీర్షతి, చికీర్షతే. ఇచట, "పూర్వవత్సనః (1-3-62) సూ. చే, నాత్మనేపదనిమిత్తమగు ఙిత్త్వము సన్నన్తమందతిదేశింపబడును. (2) ఔపగవః. ఇచట అణ్ ప్రత్యయమునకు, ఆద్యన్తవదేకస్మిన్ (349) సూ. చే, నాద్యుదాత్తస్వర ఫలకమగు నాదిత్వమతిదేశింపబడెను. (3) "ద్రవత్పాణీ శుభస్పతీ". ఇచట శుభశబ్దమునకు, సుబామన్త్రితే. (2-1-2) సూ. చే, పరాఙ్గవద్భావాతిదేశమువలన షష్ఠ్యన్తముపై నుకారమునకు, ఆమన్త్రితస్య (6-1-193) సూ. చే, నుదాత్తస్వరము సిద్ధమగును. (4) మాసికమనుచోట, కాలేభ్యో భవవత్ (4-2-34) సూ. చే, కాలవాచకములకు తత్రభవః అను నధికారమున విహితమగు శాస్త్రము, సాస్య దేవతా అను నర్థమందు నతిదేశింపబడును. కావున మాసికమనునది మాసోదేవతా అస్య అను నర్థమందు నగును. (5) గౌః. ఇచట, గోతో ణిత్ (285) సూ. చే ణిత్కార్యమగు వృద్ధి యతిదేశింపబడును. (6) క్రోష్టా అనునది రూపాతిదేశోదాహరణము.

* 276. ఋతో ఙి సర్వనామస్థానయోః 7-3-110 ఋతః, ఙి సర్వనామస్థానయోః, (గుణః)

ఙౌ, సర్వనామస్థానే చ పరే ఋదన్తాఙ్గస్య గుణః స్యాత్। ఇతి ప్రాప్తే॥

276. హ్రస్వ ఋకారమన్తమందుగల యఙ్గమునకు ఙిసర్వనామస్థానములు పరమగునపుడు గుణమాదేశమగును. క్రోష్టృ + సు. ఇచట నీ సూత్రముచే గుణము ప్రాప్తమగుచుండ.

* 277. ఋదుశనస్పురుదంసోఽనేహసాం చ 7-1-94 ఋదుశనస్పురుదంసోనేహసాం, చ. (అనఙ్, సర్వనామస్థానే చ అసంబుద్ధౌ)

ఋదన్తానా ముశనసాదీనాఞ్చానఙ్ స్యా
దసంబుద్ధౌ సర్వనామస్థానే పరే॥

277. హ్రస్వ ఋకారాన్త శబ్దములకును, ఉశనస్, పురుదంస్, అనేహస్. వీనికిని సంబుద్ధి భిన్నమగు సర్వనామస్థానము పరమగునపు డనఙాదేశ మగును. దీనిచే విహితమగు ననఙాదేశము పూర్వసూత్ర ప్రాప్తమగు గుణమును బాధించును. క్రోష్టన్ + స్, అని యగును.

* 278. అప్తృన్ తృచ్ స్వసృనప్తృ నేష్టృత్వష్టృక్షత్తృహోతృ పోతృ ప్రశాస్తౄణామ్. 6-4-11 (ఉపధాయాః, దీర్ఘః సర్వనామస్థానే చాసమ్బుద్ధౌ)

అబాదీనా ముపధాయా దీర్ఘస్స్యా దసం
బుద్ధౌ సర్వనామస్థానే పరే। నప్త్రాదిగ్రహణం వ్యుత్ప
త్తిపక్షే నియమార్థమ్। తేన పితృభ్రాతృ ప్రభృతీ
నాం న। ఉద్గాతృశబ్దస్య తు భవత్యేవ। సమర్థసూ
త్రే ఉద్గాతార ఇతిభాష్య ప్రయోగాత్। క్రోష్టా।
క్రోష్టారౌ। క్రోష్టారః। క్రోష్టారమ్। క్రోష్టారౌ।
క్రోష్టూన్ ॥

278. అప్ శబ్దము, తృన్తృజన్తములు. స్వసృ, నప్తృ, నేష్టృ, త్వష్టృ క్షత్తృ, హోతృ, పోతృ, ప్రశాస్తృ, వీనికి సంబుద్ధి భిన్నమగు సర్వనామస్థానము పరమగునపుడు వీనియొక్క యుపధకు దీర్ఘమగును. ఉణాది ప్రత్యయాన్తములు వ్యుత్పన్నములను పక్షమునందు నప్త్రాదులు, తృన్ తృజన్తములగుటచే వీనికి దీర్ఘము సిద్ధమగుచుండ సూత్రమునందలి నప్త్రాదిగ్రహణము నియమార్థమగును. ఉణాది వ్యుత్పన్నములగు (తృన్ తృజన్తములు) సంజ్ఞాశబ్దముల కుపధాదీర్ఘమయినచో నప్త్రాదులకే యని నియమము. కావున తృజన్తములగు పితృ భ్రాతృ మొదలగువానికి నీ దీర్ఘము వారింపబడును. "సమర్థః పదవిధిః" అను సూత్రమున నుద్గాతారః, అను భాష్యప్రయోగమువలన, నుద్గాతృ శబ్దమునకు మాత్రము దీర్ఘము వచ్చును. క్రోష్టృ + స్. ఇచట సర్వనామస్థానే చా సంబుద్ధౌ, సూత్రముకంటె పరమగుటవలన నీ సూత్రముచే నుపధాదీర్ఘము. క్రోష్టాన్ + స్. సులోపనలోపములు. క్రోష్టా. క్రోష్టారౌ. క్రోష్టారః. క్రోష్టారమ్. క్రోష్టారౌ, వీనియందు, ఋతోఙి, సూ. చే, గుణము, ఈ సూత్రముచే దీర్ఘము నగును. క్రోష్టూన్. క్రోష్టు + శస్, పూర్వసవర్ణ దీర్ఘనత్వములు.

* 279. విభాషా తృతీయాది ష్వచి. 7-1-97 విభాషా, తృతీయాదిషు, అచి, (తృజ్వత్, క్రోష్టుః)

అజాదిషు తృతీయాదిషు క్రోష్టుర్వా తృ
జ్వత్। క్రోష్ట్రా। క్రోష్ట్రే॥

279. అజాదులగు తృతీయాది విభక్తులు పరమగునపుడు క్రోష్టు శబ్దము తృజన్తరూపమును వికల్పముగ నొందును. క్రోష్ట్రా (క్రోష్టు + టా) క్రోష్ట్రే (క్రోష్టు + ఙే) ఇచట యణాదేశమగును.

* 280. ఋత ఉత్. 6-1-111 ఋతః, ఉత్. (ఙసి, ఙసోః)

ఋదన్తాత్ ఙసిఙసో రతిపరే ఉకార ఏకాదేశః స్యాత్। రపరత్వమ్.

280. హ్రస్వఋకార మంతమందు గల శబ్దముకంటె ఙసిఙస్సుల యవయవమగు అకారము పరమగునపుడు హ్రస్వోకార మేకాదేశమగును. క్రోష్టృ + ఙసి, ఙస్. ఇచట ఋకారాకారముల స్థానమున ఉకారము రేఫ పరకమై యగును. క్రోష్టుర్ + స్, అని యుండును.

* 281. రాత్సస్య. 8-2-24 రాత్-సస్య (సంయోగాన్తస్యలోపః)

రేఫాత్సంయోగాన్తస్య సస్యైవ లోపో నాన్యస్య। రేఫస్య విసర్గః। క్రోష్టుః। ఆమి పరత్వాత్ తృజ్వద్భావే ప్రాప్తే। నుమచిరతృజ్వద్భావేభ్యో నుట్ పూర్వవిప్రతిషేధేన। క్రోష్టూనామ్। క్రోష్టరి। క్రోష్ట్రోః। పక్షే హలాదౌ చ శమ్భువత్। ఇత్యుదన్తాః॥

281. సంయోగాన్తస్యలోపః (55) సూత్రమున కిది నియామకము. రేఫముకంటె పరమగునపుడు సంయోగాన్తమగు సకారమునకే లోపమగును గాని యితరవర్ణమునకు రాదు. క్రోష్టుర్ + స్ అనుచోట సకారలోపము ప్రవర్తించును. రేఫకు విసర్గము. క్రోష్టుః. క్రోష్టు + ఆమ్. ఇచట ఆమ్ ప్రత్యయమునకు హ్రస్వనద్యాప- సూత్రప్రాప్తమగు నుడాగమమును బాధించి పరమగు తృజ్వద్భావము ప్రాప్తించుచుండ (వా) నుమచిరతృజ్వద్భావేభ్యో నుట్ పూర్వవిప్రతిషేధేన' అను పూర్వవిప్రతిషేధవార్తికముచే తృజ్వద్భావమును బాధించి నుడాగమము వచ్చును. పిదప నామి (210) సూ. చే, దీర్ఘము. క్రోష్టూనామ్ "విప్రతిషేధే పరం కార్యమ్ 176 సూత్రమున నిష్పారక పరశబ్దముండుటవలన కార్యద్వయమునకు విరోధమున్నపు డిష్టమగు కార్యము ప్రవర్తించునని యర్థమగును. కొన్ని చోటులయందు పూర్వకార్యము ప్రవర్తించుట యిష్టము. ఇట్టి వ్యాఖ్యానమువలన పూర్వవిప్రతిషేధవార్తికము లన్నియు సిద్ధములగును. వార్తికార్థము పరములగు నుమాగమము, అచిరాదేశము, తృజ్వద్భావము వీనిని బాధించి పూర్వమగు నుడాగమము ప్రవర్తించును. ఉదా॥ నుమ్, వారీణామ్, (వారి + ఆమ్) ఇచట పరమగు నుమాగమమును నుట్టు బాధించును. అచిరః (అచిర ఋతః (300) సూత్రవిహిత రేఫాదేశము తిసృణామ్, (తిసృ + ఆమ్) ఇచట నుడాగమము పరమగు రేఫాదేశమును బాధించును.

తృజ్వద్భావము. క్రోష్టూనామ్. క్రోష్టరి, (క్రోష్టు + ఙి) "ఋతోఙి (276) సూ. చే, గుణము క్రోష్టోః, (క్రోష్టు + ఓస్) యణాదేశము. హలాది విభక్తులు పరమగునప్పుడును, తృజ్వద్భావము రాని పక్షమందును క్రోష్టు శబ్దము శమ్భు శబ్దముతో సమానము.

ఇది ఉదన్త ప్రకరణము.

మూ॥ హూహూః। హూహ్వౌ। హూహ్వః। హూహూమ్। హూహ్వౌ। హూహూన్। ఇత్యాది। అతిచమూ శబ్దే తు నదీకార్యం విశేషః। అతిచమ్వై। అతిచమ్వాః 2 అతిచమూనామ్। అతిచమ్వామ్।

అర్థము :—హూహూ శబ్దము గన్ధర్వ విశేషవాచకము, అవ్యుత్పన్నము. హూహూః. హూహూ + ఔ, హూహూ + జస్, ఇచట దీర్ఘాజసి చ (240) సూ. చే, పూర్వ సవర్ణదీర్ఘము నిషేధింపబడినందున ఇకోయణచి (48) సూ. చే, యణాదేశము ప్రవర్తించును. హూహ్వౌ, హూహ్వః. అతిచమూః. (చమూ మతిక్రాన్తః) సేన నతిక్రమించువాడు. ఇచట 'ప్రథమలిఙ్గగ్రహణంచ' అనుదానిచే నదీసంజ్ఞ యుండుటవలన సంబుద్ధి హ్రస్వము, ఆడాగమము, మొదలగు నదీకార్యములు ప్రవర్తించును. నదీకార్యములే హూహూ శబ్దము కంటె దీనియందుండు విశేషము, హే అతిచము, సంబుద్ధి హ్రస్వము. అతిచమ్వై, అతిచమ్వాః, ఇచట నాడాగమము అతిచమూనామ్. ఇచట హ్రస్వ నద్యాపః (269) నుడాగమము, అతిచమ్వామ్, ఇచట ఙే రామ్, (271) సూ. చే, నామాదేశము. ఖలపూః (ఖలం పునాతి) కళ్ళము నూడ్చువాడు. ఖలపూ + జౌ, అని యుండఁ.

* 282. ఓస్సుపి. 6-4-83. ఓః, సుపి (యణ్, అచి, ఇవర్ణవర్ణం ఏరనేకాచ ఇతిసూత్రమ్)

ధాత్వవయవసంయోగ పూర్వో నభవతి య ఉవర్ణస్తదన్తో యోధాతుస్తదన్తస్యా నేకాచోఙ్గస్య యణ్ స్యాదజాదౌ సుపి। గతికారకేతర పూర్వపదస్యయణ్ నేష్యతే। ఖలప్వౌ। ఖలప్వః। ఇత్యాది. ఏవం సుల్వాదయః। అనేకాచః కిమ్। లూః, లువౌ, లువః। ధాత్వవయవేతి కిమ్। ఉల్లూః. ఉల్ల్వౌ। ఉల్ల్వః। అసంయోగపూర్వస్య కిమ్। కటప్రువౌ। కటప్రువః। గతీత్యాది కిమ్। పరమలువౌ। సుపి కిమ్। లులువతుః. స్వభూ। నభూసుధియోః. స్వభువౌ। స్వభువః॥

282. అనువృత్తమగు ధాతువు "ఏరనేకాచః" సూత్రమందువలె సంయోగముతోను అఙ్గముతోను సంబంధించును. ధాత్వవయవమగు సంయోగము

పూర్వమందు లేనట్టి ఉకారము నముదుగల ధాతు వంతమందు గలిగి అనేకాచ్చగు శబ్దమున కజాది సుప్పు పరమగునపుడు యణాదేశమగును. ఈ సూత్ర 'మేగనేకాచః, సూత్రములో సమాన యోగక్షేమములు గలవగుటవలన 'గతి కారకేతర... తే అను నిషేధ మిచటను ప్రవర్తించును. ఖలప్వౌ. ఖలప్వః ఇచట కారక పూర్వపదకమగుటవలన దీనిచే యణాదేశము. (ఖలపూ + అమ్) ఖలపూ + శస్, పూర్వరూప పూర్వసవర్ణ దీర్ఘములను క్రమముగ బాధించి పరమగు యణాదేశము ప్రవర్తించును. ఖలప్వమ్. ఖలప్వః. ఖలపూశబ్దము నిత్య స్త్రీలిఙ్గము కానందున నదీసంజ్ఞ లేకపోవుటచే నాడాగమాదులు రావు. సులూః, (సుష్ఠులునాతి) బాగుగ కోయువాడు. ఈ శబ్దము గతిపూర్వపదక మగుటవలన ఖలపూ శబ్దసదృశము. లునాతీతి, లూః లువౌ, (లూ + ఔ) ఇత్యాదులలో యణాదేశమును వారించుట కనేకాచః అను నఙ్గవిశేషణ మావశ్యకము. ఉల్లూః (ఉద్ + లునాతి) ఉల్ల్వౌ (ఉల్లూ + ఔ) ఇత్యాదులందు యణాదేశము కొఱకు సంయోగమునకు 'ధాతోః, అను విశేషణము. ఇచట సంయోగము ధాతూపసర్గములవలన నేర్పడినదగుటచే కేవల ధాత్వవయవముగాదు. కటప్రూః, (కటంప్రవతే) చాప నల్లువాడు. కటప్రువౌ, (కటప్రూ + ఔ) కటప్రువః, (కటప్రూ + జస్) ఇత్యాదులందు యణ్వారణమునకై ఉకారమునకు 'అసంయోగపూర్వస్య, అను విశేషణము. పరమశ్చాసౌలూశ్చ, పరమలూః. పరమలువౌ (పరమలూ + ఔ) ఇత్యాదులందు యణాదేశమును వారించుటకై గతికారకేత్యాది వచనము. పరమ అనునది గతికారకభిన్నమగుటచే యణాదేశము నివృత్తమగును. లులువతుః. లుూ + అతుస్. లూఞ్ ఛేదనే అను ధాతువునకు లిట్ ప్రథమ ద్వివచనము. కావున అతుస్, తిఙ్ ప్రత్యయము. ఇచట యణాదేశమును వారించుటకు సుపి అనునది ప్రత్యయ విశేషణము. స్వభూః (స్వస్మాత్ భవతి) (స్వభూ + ఔ) కారకపూర్వపదకమగుటచే నిచట ప్రాప్తమగు యణాదేశము 'నభూసుధియోః, (271) సూ. చే, నిషేధింపబడినందున నువఙాదేశమగును. స్వభువౌ. స్వభువః (స్వభూ + జస్) వర్షాభూః. (వర్షా సుభవతి) మణ్డూకము. వర్షాభూ + ఔ. ఇచట ఓఃసుపి, సూ. చే, ప్రాప్తమగు యణాదేశమునకు నభూసుధియోః, అను సూ. చే, నిషేధము ప్రాప్తమగుచుండ.

* 283. వర్షాభ్వశ్చ. 6-4-84 వర్షాభ్వః, చ. (ఓః, సుపి, యణ్, అచి)

అస్యోవర్ణస్య యణ్స్యాదచి సుపి। వర్షాభ్వౌ। వర్షాభ్వః। దృమ్భతీతి। దృమ్భూః। అన్దూదృమ్భూజమ్బూకఫేలూకర్కన్ధూదిధిషూ ఇత్యుణాదిసూత్రేణ (937) వ్యుత్పాదితః। దృమ్భ్వౌ। దృమ్భ్వః। దృమ్భమ్। దృమ్భ్వా। దృమ్భాన్। శేషం హూహూవత్। దృన్నితి నాస్తే హింసార్థే

వ్యయే భువః క్విప్। దృన్భూః (వా) దృన్కరపునః పూర్వస్య భువో యణ్ వక్తవ్యః। దృన్భ్వౌ। దృన్భ్వః। దృన్భ్వం। దృన్భ్వః। ఇత్యాది। ఖలపూవత్। కరభూః। కరభ్వౌ। కరభ్వః। కరభ్వమ్। కరభ్వః। దీర్ఘపాఠేతు కరఏవ కారః। స్వార్థికః ప్రజ్ఞాద్యణ్। కారభ్వౌ। కారభ్వః। పునర్భూర్యౌగికః పుంసి। పునర్భ్వావిత్యాది। దృగ్భూకారాభూశబ్దౌ స్వయంభూవత్। ఇత్యూదన్తాః। ధాతా। హే ధాతః। ధాతారౌ। ధాతారః। ఋవర్ణాన్నస్య ణత్వం వాచ్యమ్। ధాతౄణామిత్యాది। ఏవం నప్త్రాదయః। ఉద్గాతారౌ। పితా। వ్యుత్పత్తిపక్షే నప్త్రాదిగ్రహణస్య నియమార్థత్వాన్న దీర్ఘః। పితరౌ। పితరః। పితరమ్। పితరౌ। శేషం ధాతృవత్। ఏవం జామాతృభ్రాత్రాదయః। నా। నరౌ। నరః। హే నః॥

283. వర్షాభూ శబ్దముయొక్క ఊకారమునకజాది సుప్పు పరమగునపుడు యణాదేశమగును. వర్షాభూ + ఔ, ఇత్యాదులం దీ సూత్రముచే యణాదేశము వచ్చును. వర్షాభ్వౌ. వర్షాభ్వః. దృమ్భతీతి దృమ్భూః. (గ్రన్థకర్త) అన్దూదృమ్భూ........షూః, అను నుణాది సూత్రముచే నూ ప్రత్యయాన్తముగ నీ శబ్దము నిపతింపబడెను. కావున నీ యూకారము ధాత్వవయవముగానందున నువఙాదేశముగాని, ఓస్సుపి సూ. చే, యణాదేశముగాని ప్రవర్తించదు. దృమ్భూ + ఔ, ఇత్యాదులలో "ఇకో యణచి" (48) సూ. చే, యణాదేశమగును. దృమ్భ్వౌ. దృమ్భ్వః. దృమ్భూ + అమ్, దృమ్భూ + శస్. ఇచట నీ యణాదేశమును పరములగు పూర్వరూప పూర్వసవర్ణ దీర్ఘములు క్రమముగ బాధించును. కావున దృమ్భూమ్, దృమ్భూన్, అని యగును. శేషము హూహూ శబ్దసదృశము.

'దృన్' అనునాన్తమగు హింసార్థకావ్యయము పూర్వమందుగల భూధాతువుకంటె క్విప్ ప్రత్యయమువలన దృన్భూశబ్దము సిద్ధమగును. వృత్తివిశేష మర్థము. దృన్భూః. దృన్భూ + ఔ, ఇత్యాదులందు, నభూసుధియోః అను నిషేధము ప్రాప్తమగుచుండ (వా) దృన్ కరపునః పూర్వస్య భువో యణ్ వక్తవ్యః, దృనాదిపూర్వక భూశబ్దమునకజాది సుప్పు పరమగునపుడు యణాదేశము చెప్పదగునని యర్థము. దీనిచే నిచట యణాదేశము. దృన్భ్వౌ. దృన్భ్వః, ఇత్యాదులు. దృన్ భూ + అమ్. దృన్భూ + శస్. ఇచట పరమగు నీ యణాదేశము క్రమముగ పూర్వరూప సవర్ణదీర్ఘములను బాధించును గాన, దృన్భ్వమ్. దృన్భ్వః. ఇత్యాదులగును. కావున నిది ఖలపూ శబ్దసదృశము. కరభూః (కరేభవతి) హస్తమునను్న వస్తువు. కరభ్వౌ. కరభ్వః. కరభ్వమ్,

కరభ్వః, ఈశబ్దము దృన్భూశబ్దసదృశము. దృన్కర, అనువార్తికమున కార
యను దీర్ఘపాఠము భాష్యాదులం దగపడుచున్నది. కార అనునది కర శబ్దము
కంటె "ప్రజ్ఞాదిభ్యశ్చ" (5-4-38) సూత్రవిహితమగు స్వార్థి కాణ్ ప్రత్య
యాన్తము గావున కరమనియే యర్థము. కారభూః. కారభూ + ఔ, ఇత్యా
దులలో పై వార్తికముచే యణాదేశము వచ్చును. కావున నిది దృన్భూ శబ్దస
దృశము. రూఢమగు పునర్భూశబ్దము 'పునర్భూర్దిధిషూరూఢా' అను కోశము
వలన నిత్య స్త్రీలిఙ్గమయినను యౌగికమగు, (పునఃభవతి) పునర్భూశబ్దము పుం
లిఙ్గమున నుండును. పునర్భ్వమ్, పునర్భ్వౌ, ఇత్యాదు లగును. దృగ్భూ (దృశో
భవతి) కారాభూ (కారాయాం, భవతి,) శబ్దములు స్వయంభూ శబ్దసదృశ
ములు. "నభూసుధియోః" అను సూ. చే, యణాదేశము నిషేధింపబడినందున
నువఙాదేశముచే, దృగ్భువౌ, దృగ్భువః, కారాభువౌ, కారాభువః, ఇత్యాదు
లగును.

ఇవి యూదన్తములు.

ధాతా. ధాతృ + సు, ఋదుశనస్.........సాంచ (277) సూ. చే,
అనఙ్. అప్తృన్......ణామ్ (278) సూ. చే, దీర్ఘము. సులోపనలోపములు.
హే ధాతః, అనఙ్ విధాయకమగు ఋదుశనసిత్యాది సూత్రమున 'అసంబుద్ధౌ'
అని యనుటవలన నిచట అనఙు, రాదు. ఋతో ఙిసర్వనామస్థానయోః (276)
సూ. చే, గుణము. హల్ఙ్యాది సూత్రముచే సులోపము. రేఫకు విసర్గము.
ధాతారౌ, ధాతారః, ఋతో ఙి, సూ. చే, గుణము. అప్తృన్ సూ. చే, దీర్ఘము.
ఇట్లే ధాతారమ్, ధాతారౌ, అనునవియునగును. ధాతృ + శస్. ఇచట
పూర్వసవర్ణ దీర్ఘనత్వములు. ధాతౄన్. ధాతృ + టా, ధాతృ + ఙే. ఈ
చోటులందు యణాదేశము. ధాత్రా. ధాత్రే. ధాతృ + ఙసి. ఙస్, ఉత్వ,
(ఋత, ఉత్) సలోప (రాత్సస్య) విసర్గములు. ధాతుః, 2, ధాత్రోః, 2 యణా
దేశము. ధాతృ + ఆమ్, నుడాగమ దీర్ఘములు, ధాతౄనామ్, (వా) ఋవర్ణా
న్నస్య ణత్వం వాచ్యమ్, (ఋవర్ణముకంటె పరమగు నకారమునకు ణత్వము
చెప్పవలయును) దీనిచే నిచట ణత్వము ధాతౄణామ్. ధాతృ + ఙి, ఋతోఙి,
సూ. చే, గుణము ధాతరి. నప్తృ, నేతృ, ప్రశాస్తృ, ఇత్యాది ఋదన్తములు,
ధాతృ శబ్దసదృశములు. ఉద్గాతృశబ్దము నప్త్రాదులలో నన్తర్భూతము గాకున్నను,
సమర్థః పదవిధిః అను సూత్రభాష్యమున నుద్గాతారః అను ప్రయోగమువలన నా
శబ్దమునకును దీర్ఘమగును. కావున నదియు ధాతృశబ్ద సమానమే. పితా. పితృ +
సు, అనఙ్ దీర్ఘ సులోపన లోపములు. పాతి, (రక్షించువాడు,) అను నర్థమున
పా ధాతువుకంటె తృచ్ ప్రత్యయము, దీనికి ఇడాగమము ధాతువులోని యాకా
రమునకు లోపము. ఇట్లు పితృశబ్దము సిద్ధమగును. ఇట్టి వ్యుత్పత్తి పక్షమందు
అప్తృన్ ఇత్యాది సూత్రముచే ప్రాప్తమగు దీర్ఘము సూత్రమున నప్త్రాదిగ్రహ
ణమునకు నియమార్థత్వము చెప్పబడుటవలన వారితమగును. అవ్యుత్పత్తి పక్ష

మందు పితృశబ్దము నప్త్రాదులందు చేరకుండుటన దీర్ఘ శంకయే లేదు. కావున, పితృ + ఔ. పితృ + జస్, ఇత్యాదులలో పితరౌ, పితరః, ఇత్యాదులగును. శసాదులందు పితృశబ్దము ధాతృ శబ్దసదృశము. జామాతృ భ్రాతృ మొదలగునవి పితృశబ్దసదృశములు. నా, (నృ + స్) అసర్జ్ దీర్ఘ సులోపన లోపములు. నరౌ, నరః, హేనః, నరమ్, నరౌ, ఈ చోటులందు 'ఋతోఙి' సూ. చే, గుణము. కావున పితృ శబ్దసదృశము. నృ + ఆమ్, ఇనట మాత్రము, నామి (210) సూ. చే, నిత్యముగ దీర్ఘము ప్రాప్తమగుచుండగ.

* 284. నృచ. 6-4-6. నృ। చ। (నామి, దీర్ఘః, వా)

నృ ఇత్యేతస్య నామి వా దీర్ఘః స్యాత్। నృణామ్। నౄణామ్। ఇతి ఋదన్తాః। కౄత్వా ఆనయోరనుకరణే ప్రకృతి వదనుకరణమితి వైకల్పికాతిదేశాదిత్వే రపరత్వమ్। కీః। కిరౌ। కిరః। తీః। తిరౌ। తిరః। ఇత్యాది గీర్వత్। ఇత్వాభావ పక్షేతు ఋదుశనఙతి ఋతోఙీతి చ తపరకరణాదనఙ్ గుణౌ న। కౄః। క్రౌ। క్రః। కౄమ్। క్రౌ। కౄన్। క్రా। క్రే. ఇత్యాది। ఇతిౠద న్తాః। గమ్। శక్। అనయోరనుకరణేఽనఙ్। గమా। శకా। గుణవిషయేషుతు లపరత్వమ్। గమలౌ. గమలః। గమలమ్। గమలౌ। గమ్ౄన్। గమ్లా। గమ్లే। జసిజసోస్తు। ఋత ఉదిత్యుత్వే లపరత్వే సంయోగాన్తస్య లోపః। గముల్। శకుల్ ఇత్యాది। ఇతిఌదన్తాః। సేః। సయౌ। సయః। స్మృతేః। స్మృతయౌ। స్మృతయః। ఇత్యేదన్తాః॥

284. నృ, అనునది లుప్తషష్ఠీకము. నృశబ్దమునకు నామ్, పరమగునపుడు దీర్ఘము వికల్పముగనగును. నృణామ్. నౄణామ్.

ఇవి ఋదన్తములు.

కౄ, (విక్షేపే) తౄ, (ప్లవనతరణయోః) ఈ రెండు ధాతువుల ననుకరణము చేయునపుడు కౄ శబ్దము, కౄ ధాతువును, తౄ శబ్దము, తౄ ధాతువును బోధించును. కౄ + సు, ప్రకృతి వదనుకరణమ్ (అనుకరణము అనుకార్యమువంటిది, అనుకార్యమునకు విధింపబడు కార్యము అనుకరణమునకు నగును.) వైకల్పికమగు నీ యతిదేశమువలన ౠకారాన్త ధాతువులకు విధింపబడిన ౠత ఇద్ధాతోః (7-1-100) సూ. చే, నిత్వ మనుకరణములగు నీ, కౄ, తౄ, శబ్దములకును వచ్చును. ఇత్వము రపరమై యగును. "ర్వోరుపధాయా దీర్ఘ ఇకః, (436) సూ. చే, దీర్ఘము, సులోపము, రేఫకు విసర్గము, కీః, ఒక కౄ ధాతు

వని యర్థము. కిరౌ, కిరః, కిరమ్, కిరౌ, కిరః, కిరా, కీర్భ్యాం కీర్భిః, కిరే కీర్భ్యాం, కీర్భ్యః, కిరః, కీర్భ్యాం, కీర్భ్యః, కిరః, కిరోః, కిరామ్, కిరి, కిరోః, కీర్షు, పదసంజ్ఞ యున్నచోటున దీర్ఘమగును. తౄశబ్దమున కిట్లే ప్రక్రియ నూహించునది. ఈ రెండును గిర్ శబ్దసమానములు. ప్రకృతిపదానుకరణ మను నతిదేశము వికల్పమగుటవలన నది ప్రవర్తింపని పక్షమందు కౄ అనునది ధాతువు కానందున నిత్వము రాదు. కౄ + సు, ఋదుశనస్. ఋతోఙి, అను సూత్రము లలో తపరకరణముండుటచే ఋూకారాన్తములగు వీనికి అనఙ్ గుణములు రావు. రుత్వ విసర్గములు. కౄః. క్రౌ. క్రః. కౄమ్. క్రౌ. కౄన్. క్రా. కౄభ్యామ్. కౄభిః. క్రే. కౄభ్యామ్. కౄభ్యః. ఋత ఉత్ సూత్రమున తపర కరణమువలన నీశబ్దమునకు ఙసిఙస్సులందుత్వము రానందున యణాదేశమగును. క్రః. క్రోః. కౄ + ఆమ్. దీర్ఘాంతమగుటచే నుడాగమము రాదు. క్రామ్. క్రి. కౄషు. ఇట్టి తౄశబ్దమునకును ప్రక్రియ నిట్లే యూహించునది.

ఇవి ఋూదన్తములు.

గమ్లృ, (గతౌ) శక్లృ, (శక్తౌ) ఈ ధాతువుల కనుకరణములగు, గమ్లృ శక్లృ శబ్దములకంటె సుప్రత్యయముచేసిన గమ్లృ + సు, శక్లృ + సు అని యగును. 'ఋదుశనస్' సూత్రమందలి ఋకారము స్వసవర్ణమగు ఌకారమును గ్రహించుటవలన నీ ఌకారాన్తములకు ననఙాదేశమగును. గమా. శకా. గమ్లృ + ఔ, ఇత్యాదులలో ఋతోఙి సూ. చే, గుణము లపరకమై యగును. గమలౌ. గమలః, ఇత్యాదులు. గమ్ఌ + శస్. పూర్వసవర్ణ దీర్ఘము. ఌకారమునకు దీర్ఘము లేనందున స్వసవర్ణమగు ఋూకారమే యగును. గమౄన్, గమ్ఌ + టా ఈ మొదలగు నజాది ప్రత్యయములు పరమగునపుడు యణాదేశము లకారమగును. గమ్లా. ఙసిఙస్సులం దుత్వ సంయోగాన్త లోపములచే గముల్ అని యగును. శక్ఌ శబ్దమున కిట్లే ప్రక్రియ నూహించునది.

ఌదన్తములు ముగిసెను.

సేః. (ఇనాసహితః) కామునితో కలసినవాడు. సే + ఔ, సే + జస్, అయాదేశము, సయౌ, సయః, ఇత్యాదులు. స్మృతేః (స్మృతః, ఇః, యేన) కాముని స్మరించినవాడు. స్మృతయౌ (స్మృతే + ఔ) ఇత్యాదులు.

ఇవి ఏదన్తములు.

* 285. గోతో ణిత్. 7-1-90. గోతః, ణిత్ (సర్వనామస్థానమ్॥)

గోశబ్దాత్పరం సర్వనామస్థానం ణిద్వత్స్యాత్ ।
గౌః । గావౌ । గావః ॥

285. గోశబ్దముకంటె పరమగు సర్వనామస్థానము ణకారేత్సంజ్ఞక ప్రత్యయసదృశమగును. అనగా ణిత్ప్రత్యయము పరమగునపుడు పూర్వమునకు విధింపబడు వృద్ధి మొదలగు కార్యములు వచ్చును. గో + సు, ఇత్యాదులందు స్వాదులకు ణిద్వద్భావముచే నజ్గమునకు అచోఞ్ణితి (255) సూ. చే, వృద్ధియగును. గౌః. గావౌ, (గో + ఔ) గావః (గో + జస్) అజాది ప్రత్యయములు పరమగునపు డావాదేశమగును.

* 286. ఔతోఽమ్శసోః. 6-1-93. ఆ, ఓతః, అమ్ శసోః।

ఆ ఓత ఇతి చ్ఛేదః। ఓకారాదమ్ శసోరచి పరే ఆకార ఏకాదేశః స్యాత్ । శసా సాహచర్యా త్సుబేవామ్ గృహ్యతే। నేహ అచినవమ్। అసునవమ్। గామ్। గావౌ। గావః। గవా। గవే। గోః। ఇత్యాది। ఓతో ణిదితి వాచ్యమ్। విహిత విశేషణంచ। తేన। సుద్యౌః। సుద్యావౌ।· ఓకారాన్తాద్విహితం సర్వనామస్థానమితి వ్యాఖ్యానా న్నేహ। హేభానో। హేభానవః। ఉః = శమ్భుః స్మృతః యేన సః, స్మృతౌః। స్మృతావౌ। స్మృతావః। స్మృతామ్। స్మృతావౌ। స్మృతాః। ఇత్యాది। ఇత్యోదన్తాః॥

286. ఓతః, అనుచోట ఆ, ఓతః, అని పదవిభాగము. ఓకారాన్తముకంటె అమ్శస్సుల కవయవమగు నచ్చు పరమగునపుడు ఆకార మేకాదేశమగును. 'అచి, అనుపదము ననువృత్తిచేయుటవలన శస్పదముచే సుబ్విభక్తికే గ్రహణముగాని, బహ్వల్పార్థాచ్ఛస్ కారకాదన్యతరస్యామ్ (5-4-42) సూత్ర విహితతద్ధిత ప్రత్యయమునకు గ్రహణము కలుగదు. ఇట్టి శస్సుయొక్క సాహచర్యమువలన అమ్ పదముచే సుబ్విభక్తికే గ్రహణముగాని, తిఙునకు గ్రహణములేదు. కావున అచినవమ్ (చిఞ్ ధాతువునకు లఙుత్తమ పురుషైకవచనము. అచి + నో + అమ్) ఇత్యాదులలో మిబాదేశమగు నమ్కు, పరమగునపు డీయాత్వము రాదు. సూత్రమున కుదాహరణము (గో + అమ్, గో + శస్) గామ్, గాః. గామను చోట నాత్వమపవాదమగుటచే పరమైనను వృద్ధి ప్రవర్తింపదు. గో + టా। ఇత్యాదులందావాదేశము. గవా ఇత్యాదులగును. జసిజసోశ్చ, సూత్రముచే జసిజస్సులందు పూర్వరూపము. గోః। 2 (వా) ఓతోణిదితివాచ్యమ్, విహిత వేశేషణంచ. గోతోణిత్తనుసూత్రమున గోశబ్దమునే గ్రహించినచో తపరకరణము వ్యర్థమగును గావున గకారము వివక్షితము గాదనుటచే సిద్ధమయినది యీవచనము. ఓకారాన్త శబ్దముకంటె విహితమగు సర్వనామస్థానము ణకారేత్సంజ్ఞక ప్రత్య యసదృశమగునని యర్థము. ఇట్లు చెప్పుటవలన సుద్యోశబ్దము (శోభనా ద్యౌః యస్మిన్ = ప్రకాశమానమగు నన్తరిక్షముగల దివసము) నకు వృద్ధియగును. సుద్యౌః, సుద్యావౌ, సుద్యావః. కేవలద్యోశబ్దము స్త్రీలిఙ్గమగుటచే బహువ్రీహి

యుదాహరింపబడెను. ఓకారాన్తముకంటె విహితమగు సర్వనామస్థానము ణిత్తగు నని వ్యాఖ్యానము చేయుటవలన హేభానో, హేభానవః, అనుచోట ణిద్వద్భావము వారితమగును. హేభాను + సు, హేభాను + జస్, ఇచట క్రమముగ 'హ్రస్వస్య గుణః' సూ. చే, గుణము, 'జసిచ' సూ. చే, గుణము, ప్రవర్తించిన పిమ్మట సర్వనామస్థాన మోకారాన్తముకంటె పరమయినదగుటచే ణిద్వద్భావము ప్రసక్తమగుచున్నది. విహితవిశేషణమున్నపు డిచట సర్వనామస్థానము ఓకారాన్తముకంటె విహితము గానందున దోషము వారింపబడును. స్మృతో శబ్దము సుద్యోశబ్దసదృశము. (స్మృతః, ఉః, యేనసః, శివుని స్మరించువాడు) స్మృతౌః, స్మృతావౌ, స్మృతావః, ఇత్యాదులలో వృద్ధియగును. స్మృతామ్, స్మృతాః అనుచోట నాత్వము ప్రవర్తించును.

ఓదన్తశబ్దములు సమాప్తి నొందెను.

* 287. రాయో హలి. 7-2-85 (రాయః. హలి. (ఆ, విభక్తౌ)

రైశబ్దస్యాకారోఽన్తాదేశస్స్యాద్ధలి విభక్తౌ। అచి ఆయాదేశః। రాః। రాయౌ। రాయః। రాయమ్। రాయౌ। రాయః। రాయా। రాభ్యామిత్యాది। ఇత్యైదాన్తాః। గ్లౌః। గ్లావౌ। గ్లావః। గ్లావం। గ్లావౌ। గ్లావః। ఇత్యాది। జౌతోఽమ్శసోరితీహ నప్రవర్తతే। ఐజౌజితి సూత్రేణ ఓదౌతోస్సావర్ణ్యాభావజ్ఞాపనాత్।

ఇత్యజన్తాః పుంలిఙ్గాః

287. రైశబ్దమునకు హలాదివిభక్తి పరమగునపు డాకారమన్తాదేశమగును. అజాదివిభక్తి పరమగునపుడు, ఏచోఽయవాయావః అను సూ. చే, ఆయాదేశమగును. రాః (రై + స్) రాయౌ (రై + ఔ) రాయః, రాభ్యామ్. ఇత్యాదులు.

ఐదన్తములు సమాప్తి నొందెను.

గ్లౌః (గ్లౌ + సు) చన్ద్రుడు. గ్లావౌ (గ్లౌ + ఔ) గ్లావమ్. గ్లౌభ్యామ్ ఇత్యాదులు. "ఐఔచ్, సూత్రారమ్భ సామర్థ్యమువలన నోకారౌకారములకు సవర్ణసంజ్ఞాభావము జ్ఞాపితమని సంజ్ఞాప్రకరణమున చెప్పబడియె. అందువలన నీ శబ్దమున కమ్శస్సులు పరమగునపుడు, "ఔతోఽమ్శసోః (286) సూ. చే, నాత్వము ప్రవర్తించదు.

అజన్తపుంలిఙ్గప్రకరణము ముగిసెను.

# 8. అజన్త స్త్రీలిఙ్గ ప్రకరణము

రమా (రమయతి) రము ధాతుప్రకృతిక ణిజన్తమునకుంటె నచ్ప్రత్యయము చేసిన, రమ, అను కృదన్త ప్రాతిపదికమగును. దీనికంటె స్త్రీత్వ వివక్షయందు టాప్ప్రత్యయము చేసిన, రమా, అని యగును. లిఙ్గవిశిష్ట పరిభాషచే స్వాదు లుత్పన్నములగును. రమా + స్, ఇచట సులోపము.

* 288. ఔఙ ఆపః 7-1-118. ఔఙః, ఆపః (అఙ్గస్య, శీ)
ఆబన్తాదఙ్గాత్పరస్యౌఙః శీస్యాత్। ఔఙిత్యౌకారవిభక్తేస్సంజ్ఞా। రమే। రమాః।

288. ఆబన్తమయిన (టాప్, డాప్, చాప్) అఙ్గముకంటె పరమగు ఔఙ్, నకు శీభావమగును. ప్రథమాద్వితీయా విభక్తుల ద్వివచనమగు ఔకారమునకు ఔఙ్ అని ప్రాచీన వ్యాకరణములందు వ్యవహారము. రమా + ఔ, ఇచట నీ సూత్రముచే శీభావము. ఆద్గుణః (70) సూ. చే, గుణము. రమే. రమా + జస్, సవర్ణదీర్ఘము, రమాః.

* 289. సంబుద్ధౌ చ. 7-3-106. సంబుద్ధౌ, చ (ఆపః, ఏత్)
ఆప ఏకారః స్యాత్ సంబుద్ధౌ। ఏఙ్హ్రస్వాదితి సంబుద్ధిలోపః। హే రమే। హే రమాః। రమామ్। రమే। రమాః। స్త్రీత్వాన్నత్వాఽభావః॥

289. ఆబన్తమగు నఙ్గమునకు సంబుద్ధి పరమగునపు డేకార మాదేశమగును. హే రమా + సు, పరమగు నీ యేత్వము, హల్ఙ్యాది లోపమును బాధించును. ఏత్వము వచ్చినతరువాత ఏఙ్హ్రస్వాత్ (794) సూ. చే, సంబుద్ధిలోపము, హే రమే. హే రమా + ఔ, ఔఙ ఆపః (288) సూ. చే, శీత్వము, గుణము, హే రమే. హే రమా + జస్, సవర్ణదీర్ఘము, హే రమాః. రమా + అమ్, అమి పూర్వః (195) సూ. చే, పూర్వరూపము, రమామ్. రమా + ఔట్, శీభావగుణములు, రమే. రమా + శస్, పూర్వసవర్ణ దీర్ఘము. రమాః స్త్రీలిఙ్గమగుటచే, తస్మాచ్ఛసోనః పుంసి (197) సూ. చే, నత్వము ప్రవర్తించదు.

* 290. ఆఙిచాపః. 7-3-113. ఆఙి, చ, ఆపః (ఓసి। ఏత్)
ఆఙి, ఓసిచ, పరే ఆబన్తస్యాఙ్గస్య ఏకారః స్యాత్। రమయా। రమాభ్యామ్। రమాభిః॥

290. ఆబన్తమగు నఙ్గమునకు, 'ఆఙ్' (టా) ఓస్, ఇవి పరమగునపు డేకార మాదేశమగును. రమా + టా. ఈ సూత్రముచే నేత్వము. అయాదేశము, రమయా.

* 291. యాడాపః. 7-3-113 యాట్, ఆపః (ఙితః)

ఆపః పరస్య ఙిద్వచనస్య యాడాగమః స్యాత్। వృద్ధిరేచి। రమాయై। సవర్ణదీర్ఘః। రమాయాః। రమయోః। రమాణామ్। రమాయామ్। రమయోః। రమాసు। ఏవం దుర్గాదయః॥

291. ఆబన్తముకంటె పరమగు ఙిద్వచనమునకు (ఙే, ఙసి, ఙస్, ఙి) యాట్ ఆగమమగును. రమా + ఙే. యాడాగమము టిత్తగుటవలన, ఆద్యన్తకితా ద్యవయవమగును. రమా + యా + ఏ. వృద్ధిరేచి (73) సూ. చే, వృద్ధి. రమాయై. రమా + ఙసి. రమా + యా + అస్. సవర్ణదీర్ఘము. రమాయాః. ఙస్సునయందు నిట్లే ప్రక్రియ నూహించునది. రమా + ఓస్. ఇచట ఆఙిచాపః (290) సూ. చే, నేత్వము అయాదేశము. రమయోః 2. రమా + ఆమ్. హ్రస్వనద్యాపః (209) సూ. చే, నుడాగమము. ణత్వము. రమాణామ్. రమా + ఙి. ఙేరామ్ (271) సూ. చే, ఙిప్రత్యయమునకామాదేశము. యాడాగమ సవర్ణదీర్ఘములు. రమాయామ్. ఆకారాన్త స్త్రీలిఙ్గములగు దుర్గాదిశబ్దముల ప్రక్రియ నిట్లే యూహింపదగును.

* 292. సర్వనామ్నః స్యాడ్ఢ్రస్వశ్చ. 7-3-114 సర్వనామ్నః, స్యాట్, హ్రస్వః, చ. (ఆపః, ఙితః)

ఆబన్తాత్సర్వనామ్నః, పరస్యఙితః, స్యాట్ స్యాదాపశ్చహ్రస్వః। యాటోఽపవాదః। సర్వస్యై। సర్వస్యాః 2। ఏకాదేశస్య పూర్వాన్తత్వేన గ్రహణాదామిసర్వనామ్న ఇతి సుట్। సర్వాసామ్। సర్వస్యామ్। సర్వయోః। సర్వాసు। ఏవం విశ్వాదయ ఆబన్తాః॥

292. ఆబన్తమగు సర్వనామముకంటె పరమగు ఙిత్తునకు (ఙే, ఙసి, ఙస్, ఙి) స్యాడాగమమగును, ఆబన్తమునకు హ్రస్వమునగును. ఈ యాగమము, యేననాప్రాప్త న్యాయముచే (143) యాడాపః, సూత్రవిహిత యాడాగమమునకపవాదము. సర్వా + ఙే ఇచట స్యాడాగమ హ్రస్వములు. సర్వ + స్యా + ఏ. వృద్ధి. సర్వస్యై. సర్వ + ఙసి, ఙస్. స్యాడాగమ హ్రస్వములు, సవర్ణదీర్ఘము. సర్వస్యాః, 2. ఆబన్తమునకు సర్వాదిగణమున పాఠము లేనందున, సర్వా శబ్దమునకు, సర్వనామసంజ్ఞ ప్రాప్తింపకున్నది. కాని సర్వశబ్దమునకుగల సంజ్ఞ సర్వశబ్దమునకు టాప్ ప్రత్యయముతో వచ్చిన సవర్ణదీర్ఘము (ఏకాదేశము) నకు పూర్వాన్తవద్భావము (అన్తాదివచ్చ 76) వలన, టాబన్తమందునగును. కావున, ఆమి సర్వనామ్నస్సుట్ (218) సూ. చే, సర్వా + ఆమ్, అనుచోట సుడాగమమగును. సర్వాసామ్. సర్వా + ఙి. ఙిప్రత్యయమునకామాదేశము. స్యాడా

గమ హ్రాస్వములు. సర్వస్యామ్. శేషము రమాశబ్దతుల్యము. అజన్తములగు విశ్వాది సర్వనామ శబ్దములు, సర్వాశబ్దసదృశములు.

* 293. విభాషాదిక్సమాసే బహువ్రీహౌ. 1-1-28 విభాషా, దిక్సమాసే, బహువ్రీహౌ. (సర్వనామాని)

అత్ర సర్వనామతా వాస్యాత్। ఉత్తర పూర్వస్యై। ఉత్తరపూర్వాయై। దిఙ్నామాన్యన్తరాలే, ఇతి ప్రతిపదోక్తస్య దిక్సమాసస్య గ్రహణాన్నేహ। యోత్తరా, సాపూర్వా, యస్యాః ఉన్ముగ్ధాయాస్తస్యై ఉత్తరపూర్వాయై। బహువ్రీహి గ్రహణం, స్పష్టార్థమ్। అన్తరస్యై, శాలాయై। బాహ్యాయై ఇత్యర్థః। అపురీత్యుక్తేర్నేహ। అన్తరాయై నగర్యై॥

293. దిగ్వాచకముల నుచ్చరించి విధింపబడిన, బహువ్రీహి సమాసమందు పూర్వాదులకు, సర్వనామసంజ్ఞ వికల్పముగ నగును. బహువ్రీహి సమాసమందు పూర్వాదులు గౌణము లగుటవలన నప్రాప్తమగు సర్వనామసంజ్ఞ ఈ సూత్రముచే వికల్పముగ విధింపబడెను. సర్వనామసంజ్ఞాపక్షమం దుదాహరణము. ఉత్తర పూర్వస్యై (ఉత్తరస్యాశ్చ పూర్వస్యాశ్చ దిశోర్యద న్తరాళమ్, ఉత్తర పూర్వా, తస్యై) పూర్వోత్తర దిక్కుల నడుమనున్న దిక్కునగా, ఈశాన్యము. ఇచట దిఙ్నామాన్యన్తరాలే (849) సూ. చే, బహువ్రీహి. స్యాట్ హ్రస్వములు. సర్వనామసంజ్ఞ లేనపుడు ఉత్తరపూర్వాయై అని యగును. ఇచట యాడాగమము. సూత్రమున దిక్సమాసపదముచే, దిక్శబ్దము నుచ్చరించి, సమాసమును విధించు, దిఙ్నామాన్యన్తరాలే (849) సూత్రవిహితమగు, సమాసమునే గ్రహించుటవలన అనేక మన్యపదార్థే (834) సూ. చే, విధింపబడు దిగ్వాచకముల సమాసమం దీసూత్రము ప్రవర్తించదు. ఉదా॥ ఉత్తర పూర్వాయై, (ఉత్తరా, పూర్వా, యస్యాః తస్యై) ఇచట నుత్తర పూర్వాశబ్ద మజ్ఞానమువలన తూర్పుదిక్కు నుత్తరదిక్కుగ తలంచిన స్త్రీని బోధించును. సూత్రమున దిక్సమాసపదము "దిఙ్నామాన్యన్తరాలే (849) సూత్రవిహిత సమాసమునే గ్రహించినపు డా సూత్రము బహువ్రీహ్యధికారములోని దగుటచే; నీ సూత్రములోని బహువ్రీహిపద మావశ్యకము గానందున నది స్పష్టార్థమగును. అన్తరాశబ్దమునకు జిద్వచనములలో, స్యాట్ హ్రస్వములగును. అన్తరస్యై (శాలాయై) బాహ్యమగు శాల కొఱకని యర్థము. అన్తరశబ్దమునకు, సర్వనామసంజ్ఞను, విధించు 'అన్తరం బహిర్యోగోప సంవ్యానయోః, అను సర్వాదిగణ సూత్రమున, అపురి అను, ప్రతిషేధ ముండుటవలన పూశ్శబ్దార్థము విశేష్యమగునపు డన్తర శబ్దమునకు, సర్వనామసంజ్ఞ యుండదు. అన్తరాయై (నగర్యై)

* 294. విభాషా ద్వితీయా తృతీయాభ్యామ్. 7-3-115 విభాషా, ద్వితీయా తృతీయాభ్యామ్. (ఙితః, స్యాట్, హ్రస్వః, ఆపః)

ఆభ్యాం ఙితః, స్యాట్ స్యాదాపశ్చ హ్రస్వః। ఇదం సూత్రం త్యక్తుం శక్యమ్। తీయస్య ఙిత్సూపసంఖ్యానాత్। ద్వితీయస్యై। ద్వితీయాయై। ద్వితీయస్యాః। ద్వితీయాయాః। ద్వితీయస్యామ్। ద్వితీయాయామ్। శేషం రమావత్। ఏవం తృతీయా। అమ్బార్థనద్యోర్హ్రస్వః। హే అమ్బ। హే అక్క। హే అల్ల। అసంయుక్తా యే డలకాస్తద్వతాం హ్రస్వో న। హే అమ్బాడే। హే అమ్బాలే। హే అమ్బికే। జరా। జరసౌ। శీభావాత్పరత్వాజ్జరస్। ఆమి నుటః, పరత్వాజ్జరస్। జరసామిత్యాది। పక్షే హలాదౌ చ రమావత్। ఇహ పూర్వవిప్రతిషేధేన శీభావం కృత్వా, సన్నిపాత పరిభాషయా అనిత్యతాం చాశ్రిత్య జరసీ ఇతి కేచిదాహుః। తన్నిర్మూలమ్। యద్యపి జరసాదేశస్య స్థానివత్త్వేనాబన్తతామాశ్రిత్య ఔఙఆపః, ఆఙిచాపః, యాడాపః, హ్రస్వనద్యాపః, ఙేరామ్, ఇతి పఞ్చాపి విధయః ప్రాప్తాః। ఏవం, నస్ నిశ్ పృత్సు. తథాప్యనల్విధావిత్యుక్తేర్న భవన్తి। ఆ ఆబితి ప్రశ్లిష్య ఆకారరూపస్యైవాపః సర్వత్ర గ్రహణాత్। ఏవం హాల్ జ్యాదిసూత్రేపి, ఆ + ఆప్, ఙి + ఈ. ఇతి ప్రశ్లేషాదతిఖట్వః, నిష్కౌశామ్బిరిత్యాది సిద్ధే దీర్ఘగ్రహణం ప్రత్యాఖ్యేయమ్। నచైవమప్యతిఖట్వాయేత్యత్ర, స్వాశ్రయ మాకారత్వం, స్థానివద్భావేనాప్త్వం చాశ్రిత్య యాట్ స్యాదితి వాచ్యమ్। ఆబన్తం యదఙ్గం తతః పరస్య యాడ్విధానాత్। ఉపసర్జన స్త్రీప్రత్యయే తదాది నియమాత్। పద్దన్నితి నాసికాయా నస్। నసః। నసా। నోభ్యామిత్యాది। పక్షే సుటి చ రమావత్। నిశాయా నిశ్। నిశః। నిశా॥

294. ద్వితీయా తృతీయా శబ్దములకంటె పరమగు ఙిద్వచనమునకు, స్యాడాగమము, ఆబన్తములగు వీనికి హ్రస్వమును, వికల్పముగ నగును. ద్వితీయా తృతీయా శబ్దములు తీయప్రత్యయాన్తములగుటవలన "విభాషా ప్రకరణే తీయస్య ఙిత్సూపసంఖ్యానమ్" అను వార్తికముచే తీయప్రత్యయాన్తములకు ఙిత్తులు

పరమగునపుడు విధింపబడిన వికల్ప సర్వనామసంజ్ఞవలన ద్వితీయస్యై, ద్వితీయాయై ఇత్యాది రూపములు సిద్ధములగును, గాన నీ సూత్ర మావశ్యకము గాదు. ద్వితీయస్యై. స్యాట్ హ్రస్వములు, వృద్ధి. ద్వితీయాయై. యాడాగమము వృద్ధి. ద్వితీయా తృతీయా శబ్దములు, ఙిత్తులు పరమగునపుడు స్యాడాగమ పక్షమందు సర్వాశబ్దసదృశములు, స్యాడాగమాభావ పక్షమందు ఙిత్తులకంటె నితర విభక్తులందును రమా శబ్దసదృశములు.

మాతృవాచకములగు, అమ్బా అక్కా అల్లా శబ్దములకు, సంబుద్ధి పరమగునపుడు అమ్బార్థనద్యోః (263) సూ. చే, హ్రస్వమగును. పిమ్మట సంబుద్ధి లోపము. హే అమ్బ. హే అక్క. హే అల్ల. శేషము రమాశబ్దసదృశము. సంయుక్తములు గానట్టి, డకార, లకార, కకారములు గల యమ్బార్థములకు సంబుద్ధి పరమగునపుడు, హ్రస్వము రాదనవలయును. క్రమముగ నుదాహరణములు. హే అమ్బాడే. హే అమ్బాలే. హే అమ్బికే. కావున నీ శబ్దములు సంబుద్ధి పరమగునపుడును రమాశబ్దసదృశములు. జరా. జరా + సు. హల్ఙ్యాప్ (253) సూ. చే, సులోపము. జరా + ఔ. ఇచట నౌకారమునకు, ఔఙ ఆపః. (288) సూ. చే, శీభావము, జరాశబ్దమునకు జరసాదేశమును, ప్రసక్తములగుచున్నవి. తుల్య బలముగల నీ రెండు శాస్త్రములకు, విరోధమున్నందున, "విప్రతిషేధే పరం కార్యమ్" (176) సూ. చే, పరమగు జరసాదేశము శీభావమును బాధించి ప్రవర్తించును. జరసౌ. జరా + ఆమ్. ఇచట నామ్ ప్రత్యయమునకు ప్రసక్తమగు నుడాగమమును బాధించి పరమగు జరసాదేశము జరాశబ్దమున కగును. జరసామ్. జరసాదేశాఽభావపక్షమందు, హలాదివిభక్తులు పరమగునపుడును, జరాశబ్దము రమాశబ్దసదృశము. జరా + ఔ. ఇచట పూర్వ విప్రతిషేధముచే శీభావమును చేసి సన్నిపాత పరిభాషకనిత్యత్వము నాశ్రయించి, జరసాదేశమును చేయుటవలన, జరసీ అని యగునని కొందఱనిరి. పూర్వ విప్రతిషేధాశ్రయణమందును సన్నిపాత పరిభాషక నిత్యత్వమును చెప్పుటయందును ప్రమాణము లేనందున వారిమతము నిష్ప్రమాణము. జరసౌ, జరసా, జరసే, జరసామ్, జరసి, ఈ రూపములందు జరాశబ్దమునకు (ఆబన్తమునకు) జరసాదేశము వచ్చునపుడు స్థానివద్భావముచే జరసాదేశమునం దాబన్తత్వము నాశ్రయించి క్రమముగ, ఔఙఆపః, ఆఙిచాపః, యాడాపః, హ్రస్వనద్యాపోనుట్, ఙేరామ్ నద్యామ్నీభ్యః, ఈ యైదు సూత్రములచే శీభావాదులు ప్రాప్తములగుచున్నవి. ఇట్లే నాసికా, నిశా, పృతనా శబ్దములకు, నస్, నిశ్, పృత్, ఆదేశములు ప్రవర్తించునపుడును, శీభావాదు లయిదును ప్రాప్తము లగుచున్నవి. కాన నివి కృతాకృత ప్రసఙ్గము గలవగుటవలన నిత్యములగును. ఇవి పరమగు జరసాదేశమును బాధించి ప్రవర్తించును. వీనిలో నుడ్యాడాగమములు వచ్చునపుడజాది విభక్తులు పరముగానందునను మిగిలినవి వచ్చునపుడు సన్నిపాత పరిభాష చేతను జరసాదేశము ప్రవర్తింపకుండుటచే నీ స్థలములందు 'జరసా' మొదలగు

రూపములు సిద్ధింపకున్నవి (ఇది యద్యపి, అను శఙ్కాగ్రన్థమున కాశయము) కాని 'ఔఙ ఆపః' మొదలగు నయిదు సూత్రము లందును 'ఆ ఆప్' అని ప్రశ్లేషముచేసి యాకారరూపమగు నాప్పునే గ్రహించుటవలన నాకారరూపము వర్ణధర్మమగుటవలనను 'అనల్విధౌ' అను నిషేధముచే స్థానివద్భావము ప్రవర్తించదు. కావున జరసాదేశము ప్రవర్తించినపిదప నాకారరూపమగు నాబన్తత్వము లేనందున శీభావాదులకు ప్రసక్తి లేనందున నివి నిత్యములగునను శఙ్కా నివృత్తిమగును. కావున నీ స్థలములందును జరసాదేశముగల రూపములు సిద్ధములగును. (ఇది సమాధానాశయము) ఈరీతిని హల్ఙ్యాప్ (253) సూత్రమునందును 'ఆ ఆప్' ఙీ ఈ, అని ప్రశ్లేషమును చేసిన 'అతిఖట్వః' నిష్కౌశామ్బిః, ఇత్యాదులందు సులోపప్రసక్తి లేదు గాన నచట సులోప నివృత్తికొఱకు చేయబడిన దీర్ఘగ్రహణము ప్రత్యాఖ్యానము చేయదగును. యాడాపః (291) సూ. చే, నాబన్తమగు నఙ్గముకంటె పరమగు ఙిద్వచనమునకు యాడాగమమును విధించుటవలన 'ఖట్వా మతిక్రాన్తాయ' అను నర్థముగల 'అతి ఖట్వాయ' (అతిఖట్వ · ఙే) అనుచోట యఞాది సుబ్నిమిత్తకమగు దీర్ఘము ప్రవర్తించుటచే సహజమగు నాకారమును, స్థానివద్భావముచే నాబన్తత్వము నాశ్రయించి (ఆకారరూపమగు నాబన్తము సిద్ధమగును) విభక్తికి యాడాగమమును శఙ్కింపవలదు. ఇచట నాబన్తమగు ఖట్వాశబ్ద మఙ్గముకాదు. అఙ్గసంజ్ఞగల అతిఖట్వశబ్ద మాబన్తము కాదు. ఆబన్తమన నాప్ ప్రత్యయము దేనికంటె విధింపబడునో యది యాదియందును ఆప్ ప్రత్యయ మంతమందును గల శబ్దరూపము. "ప్రత్యయగ్రహణే యస్మాత్సవిహితః తదాదేస్తదన్తస్య గ్రహణమ్" అను పరిభాషచే నీ యర్థము సిద్ధించును. ప్రత్యయమును గ్రహించునపుడా ప్రత్యయము దేనికంటె విధింపబడునో యది యాదియందును ప్రత్యయమన్తమందునుగల శబ్దరూపమునకు గ్రహణమని పరిభాషార్థము. ఖట్వ అనునది టాప్ ప్రత్యయమునకు ప్రకృతియగుటచే ఖట్వా అనునదే ఆబన్తము గాని అతి ఖట్వా అనునది గానేరదు, ఇచట అతి ఖట్వ శబ్దముకంటె ఙే ప్రత్యయము విధింపబడుటచే నతి ఖట్వా అను సముదాయమే అఙ్గమగును. కావున యాడాగమప్రసక్తి వారితమగును. (ప) స్త్రీప్రత్యయే చానుపసర్జనే న. అర్థము:— స్త్రీ ప్రత్యయము (టాబాదులు) గ్రహింపబడునపుడనుపసర్జనము (ప్రధానము) విషయమై తదాద నియమములేదు. ఈ పరిభాష ప్రత్యయగ్రహణ పరిభాషచే ప్రాప్తమగు తదాది నియమమునకు నిషేధము. స్త్రీ ప్రత్యయ పరిభాష ప్రవర్తించినచో 'అతి ఖట్వా' అను సముదాయ మాబన్తమయ్యెడిని. కాని ఉపసర్జన స్త్రీ ప్రత్యయము (అప్రధానము) విషయమై యా పరిభాష ప్రవర్తించనందున ప్రకృతమున నతి ఖట్వా అనునది యుపసర్జన స్త్రీ ప్రత్యయమగుటవలనను ప్రత్యయగ్రహణ పరిభాషచే తదాది నియమముండును. కావున నిచట యాడాగమము రాదని సమాధానాశయము. పద్దన్నోమాస్ (229) సూత్రముచే నాసికా శబ్దమునకు శసాది విభక్తులం పరములగునపుడు నసా

దేశము వికల్పముగనగును. నసః, (నాసికా + శస్) నసా, నోభ్యాం, ఇత్యాదులు. నసా దేశాభావ పక్షమందు సర్వనామస్థానమందును నాసికా శబ్దము రమా శబ్దసదృశము. పద్దన్నోమాస్ సూ. చే, నిశా శబ్దమునకు నిశాదేశమగును. నిశః, (నిశా + శస్).

* 295. వ్రశ్చ భ్రస్జ సృజమృజయజరాజ భ్రాజచ్ఛశాంషః. 8-2-36. వ్రశ్చ.....చ్ఛశామ్, షః. (ఝలి, పదస్య, అన్తే)

వ్రశ్చాదీనాం సప్తానాం ఛశాన్తయోశ్చ షకారోఽన్తాదేశః స్యాజ్ఝలి పదాన్తే చ। షస్య జశ్త్వేన డకారః। నిడ్భ్యామ్। నిడ్భిః। సుపి డస్సీతి పక్షే ధుట్। చర్త్వమ్। తస్యాసిద్ధత్వాత్ చయో ద్వితీయా ఇతి టతయోః ఠథౌ న। నపదాన్తాట్టోరితి ష్టుత్వం న। నిట్త్సు। నిట్సు॥

295. సూత్రమున వ్రశ్చాదిభ్రాజన్త ధాతువులకు ఛకార శవర్ణములకును, ద్వన్ద్వము. వ్రశ్చ, భ్రస్జ, సృజ, మృజ, యజ, రాజ, భ్రాజ, ఈ యేడు ధాతువులకును ఛవర్ణ శవర్ణాన్తములకును ఝల్ ప్రత్యాహారవర్ణము పరమగునపుడును పదాన్తమందును షకార మన్తాదేశమగును. (నిశ్ + భ్యామ్) నిశ్ శబ్దము శవర్ణాన్తమైన పదమగుటచే నిచట షత్వము నిష్ + భ్యామ్. జశ్త్వముచే షకారమునకు డకారమగును. నిడ్భ్యామ్, నిడ్భిః (నిశా + భిస్) నిశ్ + సు (ప్) నిశ్ + సు నిడ్ + సు ఇచట, డః సిధుట్ (132) సూ. చే, సకారమునకు ధుడాగమము. నిడ్ ధ్ + సు. చర్త్వముచే డకార ధకారములకు క్రమముగ టకార తకారములు వచ్చును. చర్త్వమసిద్ధమగుటవలన, టకార తకారములకు, చయో ద్వితీయాశ్శరి పౌష్కరసాదేరితి వాచ్యమ్ (131) అను వార్తికముచే విహితములగు ఠకార థకారములు రావు. "నపదాన్తాత్", అను నిషేధమువలన ష్టుత్వమును రాదు. కావున నిట్త్సు, నిట్సు అని యగును.

విశ:—రాజ ధాతువు సాహచర్యమువలన భ్రాజ్ అనుదానిచే ఫణాదులలోని భ్రాజ ధాతువునకే గ్రహణము గల్గును. కావున ఫణాదిక భ్రాజి ధాతువునకు షత్వముచే, విభ్రాట్ అనియు, ఫణాది బహిర్భూతమగు దానికి కుత్వమువలన, విభ్రాక్ అనియునగును.

* 296. షఢోః కస్సి 8-2-41. షఢోః, కః, సి.

షస్య ఢస్య చ, కః స్యాత్సకారే పరే। ఇతి తు నభవతి। జశ్త్వం ప్రత్యసిద్ధత్వాత్। కేచిత్తు వ్రశ్చాది సూత్రే దాదేర్ధాతోరితి సూత్రాద్ధాతోరిత్యనువర్తయన్తి। తన్మతే జశ్త్వేన జకారే నిజ్భ్యామ్।

నిజ్భిః। జశ్త్వం శ్చుత్వమ్। చర్త్వమ్। నిచ్ఛు। చోః కురితి, కుత్వం తు న భవతి। జశ్త్వస్యాసిద్ధత్వాత్। (వా) మాంసపృతనాసానూనాం, మాంస్పృత్స్నవో వాచ్యాః శసాదౌ వా। పృతః। పృతా। పృద్భ్యామ్' పక్షే సుటి చ రమావత్। గోపా, విశ్వపావత్। మతిః ప్రాయేణ హరివత్। స్త్రీత్వాన్నత్వాభావః। మతీః। నాత్వం న। మత్యా॥

296. షకార ఢకారములకు సకారము పరమగునపుడు కకార మాదేశమగును. నిష్ + సు, అనుచోట ఝలాంజశోఽన్తే, అను సూత్రమును గుఱించి యీ సూత్ర మసిద్ధమగుటచే జశ్త్వమే ప్రవర్తించును, గాని కాదేశము ప్రవర్తించదు. కొందఱు (పరిశిష్టకారాదులు) వ్రశ్చాది సూత్రములోనికి, దాదేర్ధాతోర్ఘః (326) సూత్రమునుండి ధాతోః అను పదము ననువృత్తిజేయుచున్నారు. వ్రశ్చాదులు ధాతువులే గావున ధాతోః, అనునది ఛకారశవర్ణములకే విశేష్యము. ఛవర్ణాన్తములు శవర్ణాన్తములు నగు ధాతువులకు షత్వమని యర్థమగును. ఈ మతము ప్రకారము నిశ్ + భ్యామ్, అనుచోట నిశ్ శబ్దము ధాతువు గానందున షత్వము రాదు. జశ్త్వముచే జకారమే వచ్చును. నిజ్భ్యామ్. నిజ్భిః. నిశ్ + సు. జశ్త్వము, నిజ్ + సు. శ్చుత్వము, నిజ్ + శు. చర్త్వము, నిచ్ + శు, అని యగును. చోః కుః (380) సూత్రమును గుఱించి జశ్త్వ మసిద్ధమగుటవలన చకారము లేనందున నిచట కుత్వము రాదు. శశ్ఛోఽటి (121) సూ. చే, ఛత్వపక్షమందు నిచ్ఛు, అని యగును. (వా) మాంస, పృతనా, సాను శబ్దములకు, శసాదులందు, క్రమముగ, మాంస్, పృత్, స్ను, అను నాదేశములు వికల్పముగ నగును. పృతః (పృతనా + శస్) పృతా (పృతనా + టా) ఆదేశాభావపక్షమందు సర్వనామస్థానమందును, పృతనాశబ్దము రమాశబ్దసదృశము. గోపా శబ్దము విశ్వపా శబ్దసదృశము. మతిశబ్ద మనేక విభక్తులందు, హరి శబ్దసదృశము. స్త్రీలిఙ్గ మగుటవలన (పుంలిఙ్గము కాకుండుటవలన) ద్వితీయా బహువచనమునందు తస్మాచ్ఛసోనః పుంసి (197) సూ. చే, నత్వము రాదు. మతీః. స్త్రీలిఙ్గ మగుటవలననే ఆఙో నాఽస్త్రియామ్ (245) సూ. చే, నా భావము రాదు. మత్యా, (మతి + టా).

* 297. ఙితి హ్రస్వశ్చ 1-4-6 ఙితి, హ్రస్వః, చ. (యూ, స్త్ర్యాఖ్యౌ నదీ, వా, అస్త్రీ, ఇయఙువఙ్స్థానౌ)

ఇయఙువఙ్స్థానౌ స్త్రీశబ్దభిన్నౌ, నిత్యస్త్రీలిఙ్గావీదూతౌ హ్రస్వౌ చ, ఇవర్ణోవర్ణౌ స్త్రియాం వా నదీసంజ్ఞౌ స్తః ఙితి పరే। ఆణ్నద్యాః। మత్యై। మతయే। మత్యాః। మతేః। నదీత్వపక్షే ఙౌదితి ఙేరౌత్వే ప్రాప్తే॥

297. హ్రస్వేకారోకారములకు నదీసంజ్ఞ యప్రాప్తమగుచుండ, దీర్ఘము లకు, నేయఙువఙ్ స్థానావస్త్రీ (304) సూ. చే, నిషేధమువలన నది యప్రాప్తమగుచుండ నీ సూత్రము నారంభించుటచే నిది యప్రాప్త విభాష యగును. ఈ సూత్రమును రెండు వాక్యములుగ చేసి వ్యాఖ్యానము జేయుచున్నాడు. మొదటిది, దీర్ఘ విషయకము రెండవది. హ్రస్వ విషయకము. ప్రథమ వాక్యమున, యూ, ఇయఙువఙ్ స్థానౌ, అస్త్రీ. స్త్ర్యాఖ్యౌ. వా, అనునవి సంబంధించును. ద్వితీయ వాక్యమందు యూ, స్త్రీలిఙ్గమాత్ర బోధకమగు స్త్ర్యాఖ్యౌ, వా, అనునవి సంబంధించును. 'ఇయఙువఙోః స్థానం ఇతిర్యయోః' అను బహువ్రీహి వలన ఇయఙువఙ్ స్థాన శబ్దమునకు ఇయఙువఙ్ ప్రాప్తి యోగ్యతగలవని యర్థము. ఇయఙువఙ్ ప్రాప్తి యోగ్యములు, స్త్రీశబ్ద భిన్నములు, నిత్య స్త్రీలిఙ్గములు నగు నీకారోకారాన్తములకు, ఙిద్వచనము (ఙే, ఙసి, ఙస్, ఙి) పరమగునపుడు నదీ సంజ్ఞ వికల్పముగ నగునని ప్రథమ వాక్యార్థము. స్త్రీలిఙ్గములగు హ్రస్వేవర్ణోవర్ణాన్తములకు ఙిద్వచనము పరమగునపుడు నదీసంజ్ఞ వికల్పముగ నగునని ద్వితీయ వాక్యార్థము. ద్విలిఙ్గకములగు, ఇషు, అశని, మొదలగు శబ్దములకు నదీసంజ్ఞ సిద్ధించుటకై ద్వితీయ వాక్యమందు ఇవర్ణోవర్ణాన్తములు నిత్య స్త్రీలిఙ్గములు గావలయుననునర్థము విడువబడినది. మతి శబ్దమునకే వికల్ప నదీసంజ్ఞ ఙిద్వచనములలో ప్రవర్తించును. మతి + ఙే, ఇచట నదీసంజ్ఞా పక్షమందు ఆణ్ నద్యాః (269) సూ. చే, నాడాగమము వచ్చును. మత్యై. మతి + ఙసి, ఙస్. నదీ సంజ్ఞా పక్షమందు, మత్యాః 2. నదిసంజ్ఞాభావ పక్షమందు హరిశబ్దముతో సమానము. మతి + ఙి. ఇచట నదీసంజ్ఞ యున్నపుడు ఙి ప్రత్యయమునకు, ఙే రామ్ (271) సూ. చే, ప్రాప్తమగు నామాదేశమును బాధించి పరమగు ఔత్ (257) సూ. చే, నౌత్వము ప్రాప్తమగుచుండ.

* 298. ఇదుద్భ్యామ్. 7-3-117. ఙేః, ఆమ్, నదీ।

నదీసంజ్ఞకాభ్యా మిదుద్భ్యాంపరస్య ఙేరామ్ స్యాత్। పక్షే, అచ్చ ఘేః। మతౌ। ఏవం శ్రుతి, స్మృత్యాదయః।

298. నదీసంజ్ఞగల హ్రస్వేకారోకారాన్తములకంటె పరమగు ఙిప్రత్యయమునకు ఆమాదేశమగును. మతి + ఙి అనుచోట నీ సూత్రముచే నామాదేశము. నదీసంజ్ఞ లేనపుడు ఘిసంజ్ఞ యుండునుగాన తత్ప్రయుక్త కార్యములు వచ్చును. కావున నిది హరిశబ్దసదృశము. శ్రుతి, స్మృతి, మొదలగు ఇకారాన్త స్త్రీలిఙ్గ శబ్దములు మతి శబ్దసదృశములు.

వివ :—నదీసంజ్ఞా రహితములగు నివర్ణోవర్ణాన్తములకంటె పరమగు ఙిప్రత్యయమునకు నీ ఆమాదేశము పరములగు అచ్చ ఘేః, ఔత్, సూత్రములచే బాధితము లగుటవలన నిది నదీసంజ్ఞగల శబ్దములందే ప్రవర్తించును. ఇట్లు మూలమున నదీసంజ్ఞకాభ్యా మనునది ఫలితమగును.

* 299. త్రిచతురోః స్త్రియాం తిసృచతసృ 7-2-99. త్రిచతురోః స్త్రియాం, తిసృచతసృ (విభక్తౌ)

స్త్రీలిఙ్గయో రేతయో రేతౌ వా దేశౌస్తో విభక్తౌ పరతః।

299. స్త్రీలిఙ్గములగు త్రి చతుర్ శబ్దములకు విభక్తి పరమగునపుడు, తిసృచతసృ అనునవి, క్రమముగ నాదేశములగును.

* 300. అచిరఋతః. 7-2-100, అచి, రః, ఋతః (తిసృచతసృ)

తిసృ చతసృ ఏతయోః ఋకారస్య రేఫాదేశః స్యాదచి। గుణదీర్ఘోత్వానా మపవాదః। తిస్రః। ఆమి నుమచిరే తినుట్ ॥

300. తిసృచతసృ శబ్దములయొక్క ఋకారమున కచ్చు పరమగునపుడు రేఫాదేశమగును. గుణము, దీర్ఘము, ఉత్వము, వీనికి నీ రేఫాదేశ మపవాదము. కావున తిస్రః 2. అని యగును. (తిసృ + జస్, శస్) తిసృ + జస్ అనుచోట, "ఋతోఙి" (276) సూ. చే, ప్రాప్తమగు గుణమునకు తిసృ + శస్. అనుచోట ప్రథమయోః పూర్వసవర్ణః (145) సూ. చే, ప్రాప్తమగు పూర్వసవర్ణ దీర్ఘమునకు ప్రియతిస్వ + జసి. ఇచట, "ఋత ఉత్ (280) సూత్ర ప్రాప్తమగు నుత్వమునకు, నపవాదమని గ్రహించునది. తిసృ + ఆమ్. ఇచట నీ రేఫాదేశమును బాధించి, నుమచిర (280) అను వార్తికముచే నుడాగమమగును. తిసృ + నామ్. నామి, (210) సూ. చే, దీర్ఘము ప్రాప్తమగుచుండ.

* 301. నతిసృచతసృ 6-4-4. న, తిసృచతసృ. (నామి దీర్ఘః)

ఏతయో ర్నామి దీర్ఘో న స్యాత్। తిసృణామ్। తిసృషు। స్త్రియా మితి త్రిచతురో ర్విశేషణా న్నేహ। ప్రియా స్త్రయః, త్రీణివా, యస్యాస్సా, ప్రియత్రిః। మతివత్। ఆమితు, ప్రియత్రయాణామితి విశేషః। ప్రియా స్తిస్రోయస్యస ఇతి విగ్రహేతు, ప్రియతిసా। ప్రియతిస్రౌ। ప్రియతిస్రః। ప్రియతిస్ర మిత్యాది। ప్రియా స్తిస్రోయస్య తత్కులం ప్రియత్రి। స్వమోర్లుకాలుప్తత్వేన ప్రత్యయలక్షణాభావాన్న తిస్రాదేశః। నలుమతేతి నిషేధస్యా నిత్యత్వాత్పక్షే ప్రియతిసృ। రాదేశాత్పూర్వ విప్రతిషేధేన నుమ్। ప్రియతిసృణీ। ప్రియతిసృణి।

తృతీయాదిషు వక్ష్యమాణ పుంవద్భావవికల్పాత్ప ర్యాయేణ నుమ్రభావౌ। ప్రియతిస్రా। ప్రియతిసృ ణా। ఇత్యాది। ద్వేరత్వే సత్యాప్। ద్వే 2। ద్వాభ్యా మ్। 3। ద్వయోః 2। గౌరీ। గౌర్యౌ। గౌర్యః। నదీకా ర్యమ్। హే గౌరి। గౌర్యై। ఇత్యాది। ఏవం వాణీన ద్యాదయః। ప్రాతిపదికగ్రహణే లిఙ్గవిశిష్టస్యాపి గ్ర హణా దనజి, ణిద్వద్భావేచ ప్రాప్తే, విభక్తౌ లిఙ్గ విశిష్టాగ్రహణమ్। సఖీ। సఖ్యౌ। సఖ్యః। ఇత్యాది గౌ రీవత్। అఙ్యన్తత్వా న్న సులోపః। లక్ష్మీః। శేషం గౌరీవత్। ఏవం తరీతన్త్ర్యాదయః। స్త్రీ। హే స్త్రి।

301. తిసృచతసృశబ్దములకు నామ్ పరమగునపుడు దీర్ఘము రాదు. నామి అను సూ. చే, విహితమగు దీర్ఘమున కిది నిషేధము. తిసృణామ్. త్రిసృషు. త్రిచతురోః అను సూత్రమున స్త్రియా మనునది సూత్రమందు శ్రుతములగు త్రిచతుర్ శబ్దములకే విశేషణము గాని యనువృత్తమగు నఙ్గమునకు గాదు. అనగా త్రిచతుర్ శబ్దములు స్త్రీలిఙ్గములై అఙ్గమన్య లిఙ్గకమైనను నీ యాదేశము లగును. త్రిచతుర్ శబ్దము లన్యలిఙ్గకములై యఙ్గము స్త్రీలిఙ్గమయిన నాదేశములు ప్రవర్తించవు. ఇట్లు చెప్పుటవలన, ప్రియా స్త్రయః ప్రియాణిత్రీణి వా యస్యా స్సా అను విగ్రహముగల ప్రియత్రి శబ్దమునకు తిస్రాదేశము నిర్వృత్తమగును. ఇచట నఙ్గము స్త్రీలిఙ్గమైనను, త్రిశబ్దము పుంనపుంసకమగుటచే, తిస్రాదేశము రాదు. కావున ప్రియత్రిః, అని యగునని యాశయము. (ముప్వురు పురుషులు గాని, మూడు ఫలములు గాని ప్రియము గాగల యాడుదని యర్థము) ఇది మతి శబ్దసదృశము. ప్రియత్రి + ఆమ్. త్రేస్త్రయః (265) సూత్ర మఙ్గాధికారము లోని దగుటవలన తదన్తమందును త్రయాదేశమగును, ప్రియత్రయాణామ్. ఇదియే మతి శబ్దముకంటె దీనికిగల భేదము. ప్రియా స్త్రిస్రోయస్యసః, అను విగ్రహము గల ప్రియత్రి శబ్దము (అఙ్గము) పుంబోధకమయినను నందలి త్రిశబ్దము స్త్రీలిఙ్గ మగుటవలన తిస్రాదేశమగును. స్త్రియా మనునది యఙ్గవిశేషణమనిన, నిచట నాదేశము రాకుండునని యాశయము. ప్రియతిసృ + సు. ఋదుశనస్ (277) సూ. చే, అనఙాదేశము. ఉపధాదీర్ఘ సులోపన లోపములు. ప్రియతిసా. ప్రియతిసృ + ఔ. ఋతోఙి (276) సూ. చే, ప్రసక్తమగు గుణమును బాధించి, అచిర (300) సూ. చే, రత్వము. ప్రియతిస్రౌ. ప్రియతిసృ + జస్. పూర్వ సవర్ణ దీర్ఘమును బాధించి రత్వము. ప్రియతిస్రః. ప్రియతిసృ + అమ్. పూర్వ రూపమును, గుణమును (ఋతోఙి) బాధించి రేఫాదేశమగును. ప్రియతిస్రమ్. ప్రియతిస్రా. ఇత్యాదుల నిట్లూహింపదగును. ప్రియా స్త్రిస్రో యస్య తత్కులమ్, అను విగ్రహముగల, ప్రియత్రి + సు, అనుచోట త్రిశబ్దము స్త్రీలిఙ్గమైనను (స్వమోర్నపుంసకాత్ (320) సూ. చే, సుప్రత్యయము పూర్వము లుప్తమగుటచే

లోపించినందున, నలుమతాఙ్గస్య (264) అను సూ. చే, ప్రత్యయ లక్షణము నిషిద్ధమగుటవలన విభక్తి పరత్వమురాదు గాన త్రిస్రాదేశము ప్రవర్తించదు. ప్రియత్రి. నలుమతాఙ్గస్య అను నిషేధ మనిత్యమను పక్షమందు, ప్రత్యయ లక్షణముచే విభక్తిపరత్వము సంభవించును, గాన త్రిస్రాదేశము ప్రవర్తించును. కావున ప్రియతిసృ, అని యగును. నలుమతాఙ్గస్య అను నిషేధ మనిత్యమనుటలో, "ఇకోఽచి విభక్తౌ, (321) సూత్రమున నజ్ గ్రహణము జ్ఞాపకము. హలాది విభక్తులు పరమగునపుడు నుమాగమవారణమునకై అచ్ గ్రహణ మనవలెను. భ్యామాదులగు హలాది విభక్తులు పరమగునపుడు, నుమాగమము వచ్చినను, నలోపః ప్రాతిపదికాన్తస్య (237) సూ. చే, నకారము లోపించును గాన దోషములేదు. సంబుద్ధి లుక్పదముచే లుప్తమైనందున ప్రత్యయ లక్షణముచే విభక్తి పరత్వము రానందున నుమాగమునకు ప్రాప్తియే లేదు గాన, నచట "నఙి సంబుద్ధ్యోః" అను సూ. చే, నలోపము నిషిద్ధమగుటచే ప్రాప్తమగు ననిష్టరూప వ్యావృత్తికొఱకు అజ్ గ్రహణ మావశ్యకమనియు ననవలనుపడదు. కావున నజ్ గ్రహణము వ్యర్థమై నలుమతాఙ్గస్య అను నిషేధ మనిత్యమని బోధించును. అనిత్యమన నిష్టస్థలమున ప్రవృత్తి గలదియు, ననిష్టస్థలమున నప్రవృత్తిగలదియు నని యర్థము. ఇట్లు నిషేధ మనిత్యము గాన ప్రత్యయ లక్షణముచే, విభక్తి పరత్వముండును గావున సంబుద్ధిలో ప్రాప్తమగు నుమాగమవారణమునకై అజ్ గ్రహణ మావశ్యకమగును. సంబుద్ధి పరమగునపుడు నుమాగమము ప్రవర్తించి నచో నఙిసంబుద్ధ్యోః (353) అను నలోప నిషేధముచే ననిష్టరూపము ప్రసక్తమయ్యెడిని. ప్రియతిసృ + ఔ. నపుంసకాచ్చ (311) సూ. చే, నౌ ప్రత్యయమునకు, శీభావము. ప్రియతిసృ + ఈ. ప్రియతిసృ + ఇ. ఇచట ఇకోఽచి విభక్తౌ (321) సూ. చే, ప్రాప్తమగు నుమాగమమును బాధించి, పరమగు రాదేశము ప్రాప్తమగుచుండ, పూర్వ విప్రతిషేధము నాశ్రయించుటవలన రాదేశమును బాధించి నుమాగమము వచ్చును. ప్రియతిసృణీ. పియతిసృణి. అని యగును. వీనిని భాష్యకారుడు ప్రయోగించుటయే, ఇచట పూర్వవిప్రతిషేధము నాశ్రయించుటలో ప్రమాణము ప్రియతిసృ + టా. ఈ మొదలగు నజాది విభక్తులు పరమగునపుడు, "తృతీయాదిషు భాషిత పుంస్కం పుంవద్గాలవస్య, (322) అను సూ. చే, విధింపబడు పుంవద్భావ వికల్పమువలన, పుంవద్భావపక్షమందు రాదేశముచే ప్రియత్రిస్రా. ప్రియత్రిస్రే ఇత్యాదులు. పుంవద్భావము లేని పక్షమందు రాదేశమును బాధించి, పూర్వ విప్రతిషేధమువలన నుమాగమముచే, ప్రియత్రిసృణా, ప్రియతిసృణే ఇత్యాదులు నగును. ద్విశబ్దమునకు త్యదాద్యత్వము ప్రవర్తించినపిదప నదన్త స్త్రీలిఙ్గమగుటవలన అజాద్యతష్టాప్ (457) సూ. చే టాప్ ప్రత్యయము వచ్చును. ద్వా + ఔ. ఔఙాపః (288) సూ. చే, ఔకార విభక్తికి శీభావము. గుణము. ద్వే. ఇది రమాశబ్దసదృశము. గౌరీ + సు. ఙ్యన్తమగుటవలన హల్ఙ్యాబ్భ్యః (253) సూ. చే, సులోపము,

గౌరీ. గౌరీ + ఔ. గౌరీ + జస్. ఇచట దీర్ఘాజ్జసిచ (240) సూ. చే, పూర్వ సవర్ణ దీర్ఘము నిషేధింపబడినందున యణాదేశమగును. గౌర్యౌ. గౌర్యః. నదీ సంజ్ఞ యుండుటచే, తత్కార్యములగును. హేగౌరి. గౌర్యై. గౌర్యాః. గౌర్యామ్. ఇత్యాదులు. వాణీ, నదీ, మొదలగునవి గౌరీశబ్ద సమానములు. సఖీశబ్దము ఙ్యన్తమగుటవలన సులోపము ప్రవర్తించును. సఖీ. ఇది గౌరీశబ్ద సదృశము. సఖి శబ్దమునకు విధింపబడిన, అనఙ్ ణిద్వద్భావములు లిఙ్గవిశిష్ట పరిభాషచే నీ సఖీశబ్దమునకును ప్రాప్తములగుచున్నవి. కాని, "విభక్తౌ లిఙ్గవిశిష్టాగ్రహణమ్" అను పరిభాషచే, విభక్తి కార్యములగు ననఙాదుల విషయమై లిఙ్గవిశిష్ట పరిభాష ప్రవర్తించదు గాన నిచట ననఙాదులు రావు. విభక్తి నిమిత్తకకార్యము విషయమై ప్రాతిపదికమును గ్రహించునపుడు, లిఙ్గబోధక ప్రత్యయాన్తమునకు గ్రహణము లేదని పై పరిభాష కర్థము. లక్ష్మీశబ్దము ఔణాది కేకార ప్రత్యయాన్తము గాని ఙ్యన్తముగాదు గావున సులోపమురాదు. లక్ష్మీః. శేషము గౌరీశబ్దసదృశము. అవీ, తన్త్రీ, తరీ, శ్రీ, ధీ, హ్రీ, శబ్దము లాటును ఙ్యన్తములు గానందున లక్ష్మీశబ్దసదృశములు. స్త్రీశబ్దము ఙీబన్తము గావున సులోపమగును. స్త్రీ. హేస్త్రీ + స్, అమ్బార్థనద్యోర్హ్రస్వః (268) సూ. చే, హ్రస్వము. సంబుద్ధిలోపము. హేస్త్రి.

వివ:—ఔణాదికేకార ప్రత్యయాన్తమగు లక్ష్మీశబ్దము, కృదన్తమగును గాన కృదికారాదక్తినః (506) వార్తికముచే, ఙీష్ప్రత్యయము వచ్చును. ఇట్లు లక్ష్మీశబ్దము ఙ్యన్తమగుటవలన, సుప్రత్యయమునకు లోపమగును. లక్ష్మీ అను రూపముగూడ సాధువగును.

* 302. స్త్రియాః. 6-4-79. (అచి, ఇయఙ్)

స్త్రీశబ్దస్య యఙ్ స్యాదజాదౌ ప్రత్యయేపరే।
స్త్రియౌ। స్త్రియః॥

302. స్త్రీశబ్దమున కజాది ప్రత్యయము పరమగునపు డియఙాదేశమగును. ఇయఙుఙిత్తగుటవలన నన్తాదేశమగును. స్త్రీ + ఔ. స్త్రియౌ. స్త్రీ + జస్. స్త్రియః.

* 303. వామ్శసోః 6-4-80. వా, అమ్శసోః. (స్త్రియాః ఇయఙ్)

అమి శసిచ స్త్రియా ఇయఙ్ వాస్యాత్।
స్త్రియమ్। స్త్రీమ్। స్త్రియౌ। స్త్రియః! స్త్రీః।
స్త్రియా। స్త్రియై। స్త్రియాః। స్త్రియోః। పరత్వా
న్నుట్। స్త్రీణామ్। స్త్రియామ్। స్త్రియోః స్త్రీషు।
స్త్రియమతిక్రాన్తోఽతిస్త్రిః। అతిస్త్రియౌ। శ్లో॥

గుణనాభావాత్వనుఙ్భిః పరత్వాత్పుంసి బాధ్యతే। క్లీబే నుమాచ స్త్రీశబ్దస్య యఙిత్యవధార్యతామ్॥

జసిచ। అతిస్త్రయః। హే అతిస్త్రే। హే అతిస్త్రియౌ। హే అతిస్త్రయః। వామ్శసోః। అతిస్త్రియమ్। అతిస్త్రీమ్। అతిస్త్రియౌ। అతిస్త్రియః। అతిస్త్రీన్। అతిస్త్రిణా। ఘేర్ఙితి। అతిస్త్రయే। అతిస్త్రేః। అతిస్త్రేః। అతిస్త్రియోః। అతిస్త్రీణామ్। అచ్చఘేః। అతిస్త్రౌ। అతిస్త్రియోః। శ్లో॥ ఓస్యాకారేచ నిత్యంస్యాదమ్శసోస్తు విభాషయా। ఇయాదేశోఽచి నాన్యత్ర స్త్రియాః పుంస్యుపసర్జనే। క్లీబేతునుమ్। అతిస్త్రి। అతిస్త్రిణీ। అతిస్త్రీణి। అతిస్త్రిణా। అతిస్త్రిణే। ఙేప్రభృతావజాదౌ వక్ష్యమాణ పుంవద్భావాత్పక్షే ప్రాగ్వద్రూపమ్, అతిస్త్రయే, అతిస్త్రిణః। 2, అతిస్త్రేః 2, అతిస్త్రిణోః 2, అతిస్త్రియో రిత్యాది। స్త్రియాంతు ప్రాయేణ పుంవత్, శసి, అతిస్త్రీః। అతిస్త్రియా ఙితిహ్రస్వశ్చేతి హ్రస్వాన్తత్వ ప్రయుక్తో వికల్పః, అస్త్రీతి తు, ఇయఙువఙ్ స్థానావిత్యస్యైవ పర్యుదాసః, తత్సంబద్ధస్యైవాఽనువృత్తేః దీర్ఘస్యాయం నిషేధో, నతుహ్రస్వస్య। అతిస్త్రియై, అతిస్త్రయే, అతిస్త్రియాః 2, అతిస్త్రేః 2, అతిస్త్రీణామ్, అతిస్త్రియామ్, అతిస్త్రౌ। శ్రీః, శ్రియౌ, శ్రియః॥

303. స్త్రీశబ్దమునకు, అమ్ శస్ ప్రత్యయములు పరమగునపు డియఙాదేశము వికల్పముగనగును. స్త్రీ + అమ్. ఇయఙ్, స్త్రియమ్. పక్షమందు పూర్వరూపము. స్త్రీమ్. స్త్రీ + ఔ. ఇయఙ్. స్త్రియౌ. స్త్రీ + శస్. ఇయఙ్ వికల్పముచే రూపద్వయమగును. స్త్రియః, స్త్రీః. ఇయఙభావపక్షమందు శస్సు పరమగునపుడు పూర్వసవర్ణదీర్ఘము. స్త్రీ + ఙే. నదీసంజ్ఞాకార్యము. ఇయఙు. స్త్రియై. స్త్రీ + ఙసి, స్త్రీ + ఙస్. ఆడాగమము. ఇయఙు, స్త్రియాః. స్త్రీ + ఆమ్ ఇచట నియఙాదేశము కంటె పరమగు నుడాగమము వచ్చును. స్త్రీణామ్. స్త్రీ + ఙి. ఆమాదేశము. ఇయఙ్. స్త్రియామ్. స్త్రియ మతిక్రాన్తః (స్త్రీ నతిక్రమించిన పురుషుడు) అను విగ్రహమున, గోస్త్రియోరుపసర్జనస్య (660) సూ. చే, హ్రస్వము ప్రవర్తించును. దీర్ఘజ్యన్తము కానందున సులోపము రాదు. రుత్వ విసర్గములచే అతిస్త్రిః అనియగును.

శ్లో॥ గుణ......త్యవధార్యతామ్. అర్థము = ఉపసర్జనము పుంలిఙ్గము నగు స్త్రీశబ్దమునకు (అతి స్త్రిః, పురుషః) "స్త్రియాః (302) సూ. చే, విధింప బడు నియఙాదేశము, పరములగు గుణము, నాభావము, ఔత్వము, నుట్, వీనిచే బాధింపబడును. ఉపసర్జనము నపుంసకమునగు స్త్రీ శబ్దమున కిఁయుఙు, పరమగు నుడాగమముచే (ఇకోఽచి విభక్తౌ) బాధింపబడును. ఉదా॥ అతి స్త్రి + జస్. "జసిచ, సూ. చే, గుణము, ఇయఙాదేశమును బాధించును. అతిస్త్రయః. హేఅతి స్త్రే సంబుద్ధి గుణము. సులోపము. అతి స్త్రి + అమ్. "వామ్శసోః (303) సూ. చే, నియఙ్ వచ్చునపుడు అతి స్త్రియమ్, ఇయఙభావ పక్షమందు పూర్వరూపముచే అతి స్త్రిమ్ అనియు నగును. అతి స్త్రి + శస్. ఇయఙు వచ్చు నపుడు, అతి స్త్రియః, ఇయఙభావ పక్షమందు, పూర్వసవర్ణ దీర్ఘ నత్వములు. అతి స్త్రీన్. అతి స్త్రి + టా, ఇచట "ఆఙోనా స్త్రియామ్ (245) సూ. చే, నాభావ మియఙును బాధించును. అతి స్త్రిణా. అతి స్త్రి + ఙే, "ఘేర్ఙితి (246) సూ. చే, విహితమగు గుణమియఙాదేశమును బాధించును. అతిస్త్రయే. అతిస్త్రీ + ఆమ్. "హ్రస్వనద్యాపః (209) సూ. చే, నుడాగమ మియఙును బాధించును. అతి స్త్రీణామ్. అతి స్త్రి + ఙి. "అచ్చఘేః (249) సూ. చే, విహితమగు ఔత్వ మియఙును బాధించును. అతిస్త్రౌ.

పూర్వశ్లోకముచే చెప్పబడిన రీతిని గుణాదులచే నియఙు బాధితముకాఁగా ఇయఙాదేశము ప్రవర్తించు స్థలములను నిర్దేశించుచున్నాడు. శ్లో॥ ఓస్యౌకా రేచ......సర్జనే. అర్థము = స్త్రీశబ్దమున శజాదివిభక్తులు పరమగునపుడు విధింపబడు నియఙాదేశము, ఉపసర్జనమై పుంలిఙ్గమగు స్త్రీశబ్దమునకు, ఓస్ (షష్ఠీ సప్తమీ ద్వివచనము) పరమగునపుడు, ఔకారము (ప్రథమా ద్వితీయా ద్వివచనము) పరమగునపుడును నిత్యముగను, అమ్శస్సులు పరమగునపుడు వికల్ప ముగ నగును. ఈ నాలుగుచోటులందు దక్క మిగిలిన చోటులందు గుణాదులచే బాధింపబడుటవలన నియఙు ప్రవర్తించదని భావము. ఉపసర్జనము నపుంసకము నగు స్త్రీశబ్దమునకు (స్త్రియ మతిక్రాంతం కులమతిస్త్రి) పరమగు నుమాగమము (ఇకోఽచి) ఇయఙాదేశమును బాధించి ప్రవర్తించును. అతి స్త్రి + సు, అమ్. "స్వమోర్నపుంసకాత్ (230) సూ. చే, స్వమ్ములకు లుక్కగును. అతి స్త్రి. అతి స్త్రి + ఔ. విభక్తికి శీభావము, అఙ్గమునకు నుమాగమము, అతి స్త్రిణీ. (2) అతి స్త్రి + జస్, శస్. జశ్శసోశ్శిః (313) సూ. చే, విభక్తులకు శిభావము, అఙ్గమునకు నుమాగమ దీర్ఘములు. అతి స్త్రీణి 2. అతి స్త్రి + టా. నుమాగమము. అతి స్త్రిణా. అతి స్త్రి + ఙే అతి స్త్రిణే. చతుర్థ్యేక వచనము మొదలగు నజాది ప్రత్యయములు పరమగునపుడు చెప్పబోవు, "తృతీయాదిషు... ...గాలవస్య (322) సూత్రవిహితమగు వికల్ప పుంవద్భావమువలన పక్షమందు పుంలిఙ్గమందువలె రూపములగును. అతిస్త్రయే. అతి స్త్రి + ఙసి, ఙస్. నుమాగమము. అతి స్త్రిణః. పుంవద్భావపక్షమందు, అతి స్త్రేః. అతి స్త్రి + ఓస్.

నుమాగమము. అతి స్త్రిణోః. (2) పుంవద్భావపక్షమున నియఙు. అతి స్త్రియోః. ఇత్యాదులు. ఉపసర్జనమై స్త్రీలిఙ్గమగు స్త్రీశబ్దమునకు (స్త్రియ మతిక్రాన్తా స్త్రీ అతి స్త్రిః) అనేక విభక్తులందు పుంలిఙ్గమందువలె రూపములగును. పుంలిఙ్గము గానందున ద్వితీయా బహువచనమున, "తస్మాచ్ఛసోనః (197) సూ. చే, విహితమగు నత్వము రాదు. అతి స్త్రీః. స్త్రీలిఙ్గముగుటచే, ఆఙో నా స్త్రియామ్ (245) సూ. చే, తృతీయైకవచనమున నాభావము రాదు. అతి స్త్రియా. అతి స్త్రి + ఙే, ఇచట "ఙితి హ్రస్వశ్చ (297) అను సూత్రమందలి హ్రస్వ ఘటిత వాక్యముచే పాక్షిక నదీసంజ్ఞ వచ్చును. నదీసంజ్ఞాపక్షమం దాడాగమము. అతి స్త్రియై. నదీసంజ్ఞాభావ పక్షమున ఘిసంజ్ఞయుండుట గాన పుంలిఙ్గమందువలె రూపమగును. అతిస్త్రయే. నేయఙువఙ్స్థానావ స్త్రీ. (304) సూత్రములోనికి యూస్త్ర్యాఖ్యౌ నదీసూత్ర మనువర్తించును. యూ పదము దీర్ఘ ఈకారోకారములనే బోధించును. ఇయఙువఙ్ ప్రాప్తియోగ్యములు స్త్రీశబ్ద భిన్నములు నగు దీర్ఘ ఈకారోకారాన్తములకు నదీసంజ్ఞ రాదని యర్థము. ఇచట న స్త్రీ అనునది ఇయఙ్ ప్రాప్తియోగ్యమగు దీర్ఘేకారాన్తమునకు ప్రాప్తమగు నిషేధమునకు పర్యుదాసము. కావున, "ఇయఙువఙ్స్థానౌ అనునదియు దీనితో నన్వయించు, అ స్త్రీ అనునదియు ననువృత్తములై ఙితిహ్రస్వశ్చ సూత్రమున దీర్ఘ విషయక వాక్యముననే సంబంధించును. కావున హ్రస్వేవర్ణోవర్ణములకు నదీసంజ్ఞను విధించు వాక్యమున న స్త్రీ అనుదానికి సంబంధము లేనందున ప్రకృతమున అతి స్త్రి శబ్దమునకు ఙితిహ్రస్వశ్చ అను సూత్రమునందలి హ్రస్వ ఘటిత వాక్యముచే నదీసంజ్ఞ నిశ్శఙ్కముగ ప్రవర్తించును. అతి స్త్రి + ఙసి, ఙస్. నదీసంజ్ఞాపక్షమం దాడాగమము. అతి స్త్రియాః. (2) నదీసంజ్ఞాభావ పక్షమందు పుంలిఙ్గమందువలె రూపము. అతి స్త్రేః (2) అతి స్త్రి + ఆమ్. నుడ్ దీర్ఘములు. అతి స్త్రీణామ్. అతి స్త్రి + ఙి. నదీసంజ్ఞా పక్షమందు, ఙేరామ్, సూ. చే, ఆమాదేశము. అతి స్త్రియామ్. నదీసంజ్ఞాభావ పక్షమందు, పుంలిఙ్గమందువలె రూపము. అతిస్త్రౌ.

శ్రీః (శ్రయన్త్యేనామ్) లోకు లీమె నాశ్రయింతురు. (లక్ష్మి) శ్రిఞ్ ధాతు ప్రకృతికక్విబన్తము. ఙ్యన్తము గానందున నిచట సులోపము రాదు. శ్రీ + ఔ. క్విబన్తము. ఙ్యన్తము ధాతువగును గాన "అచిశ్ను (272) సూ. చే, నియఙాదేశము. శ్రియౌ.

* 304. నేయఙువఙ్స్థానావ స్త్రీ 1-4-4 న, ఇయఙువఙ్స్థానా అ స్త్రీ. (యూస్త్ర్యాఖ్యౌనదీ)

ఇయఙువఙోఃస్థితిర్యయోస్తావీదూతౌ నదీసంజ్ఞౌ నస్తో, నతు స్త్రీ। హే శ్రీః। శ్రియై। శ్రియే। శ్రియాః। శ్రియః॥

304. స్థానశబ్దమధికరణ ల్యుడన్తము (తిపతో యయోరితిస్థానౌ) ఇయఙువఙోఃస్థానౌ, ఇయఙువఙ్ స్థానౌ, అని షష్ఠీసమాసము. ఇయఙువఙోః స్థితిర్యయోస్తౌ, అను మూలము ఫలితార్థ ప్రదర్శనమగును. ఇయఙువఙుల కాధారములు స్త్రీ శబ్దభిన్నములగు నీకారోకారాన్తములు నదీసంజ్ఞకములు గావు. హే శ్రీః। ఇచట నీ సూత్రముచే నదీసంజ్ఞ నిషేధింపబడినందున, నదీసంజ్ఞా నిమిత్తక హ్రస్వము రాదు. శ్రీ + ఙే. ఇచట ఙితి హ్రస్వశ్చ (297) సూత్రమందలి దీర్ఘఘటిత వాక్యముచే పాక్షిక నదీసంజ్ఞ ప్రవర్తించును. నదీసంజ్ఞా పక్షమం దాడాగమము. శ్రియై. నదీసంజ్ఞ లేనపుడు శ్రియే. శ్రీ + ఙసి, ఙస్, నదీసంజ్ఞ యున్నపుడు, ఆడాగమము. శ్రియాః. నదీసంజ్ఞ లేనపుడు. శ్రియః.

వివ:—సూత్రమున, 'ఇయఙువఙోః, అని చెప్పినను ఇయఙువఙులకు నిమిత్త భూతములగు నీకారోకారములను నర్థము సంభవించుచుండ స్థానగ్రహణమువలన, నేయాకారోకారములం దియఙువఙులు బాధక శాస్త్రముచే నబాధితములగుచు ప్రవర్తించునో యట్టివానికే సంజ్ఞా నిషేధమనియు నేయాకారోకారములం దియఙువఙు లపవాదమగు యణాదేశముచే బాధింపబడి ప్రవర్తింపవో, అట్టివానికి నిషేధము లేదనియు తెలిసికొనదగును ఇట్లు చెప్పుటచే, ప్రధీ శబ్దమునకు (ప్రకృష్టాధీః) ఇయఙును బాధించి యణాదేశము ప్రవర్తించుట వలన నీ సూత్రముచే నదీసంజ్ఞా నిషేధము ప్రవర్తింపకుండుట ఫలము. కావున, హే ప్రధి అనుచోట నదీసంజ్ఞాప్రయుక్తమగు హ్రస్వము ప్రవర్తించును.

* 305. వామి. 1-4-6. వా, ఆమి. (యూస్త్ర్యాఖ్యౌనదీ, నేయఙువఙ్...వస్త్రీ)

ఇయఙువఙ్ స్థానౌ స్త్ర్యాఖ్యౌ యూ ఆమి వా నదీసంజ్ఞౌస్తోనతు స్త్రీ। శ్రీణామ్। శ్రియామ్। శ్రియి। శ్రియామ్। ప్రధీశబ్దస్య తు వృత్తికారాదీనాం మతే లక్ష్మీవద్రూపమ్। పదాన్తరం వినాపి స్త్రియాం వర్తమానత్వం నిత్యస్త్రీత్వమితి స్వీకారాత్। లిఙ్గాన్తరా నభిధాయకత్వం తదితి కైయట మతే తు పుంవద్రూపమ్। ప్రకృష్టా ధీరితి విగ్రహేతు లక్ష్మీవత్। ఆమి శసి చ ప్రధ్యమ్। ప్రధ్యః, ఇతివిశేషః। సుష్ఠు ధీ ర్యస్యాః సుష్ఠుధ్యాయతి వేతి విగ్రహేతు వృత్తిమతే సుధీః, శ్రీవత్। మతాన్తరే పుంవత్। సుష్ఠుధీ రితి విగ్రహేతు శ్రీవదేవ। గ్రామణీః, పుంవత్। గ్రామ నయనస్యోత్సర్గతః పుంధర్మతయా పదాన్తరం వినా స్త్రియా మప్రవృత్తేః। ఏవం ఖలపవనాదే రపి పుంధర్మత్వ మౌత్సర్గికం బోధ్యమ్। ధేను ర్మతివత్॥

305. ఇయఙువఙ్ స్థానములు నిత్యస్త్రీలిఙ్గములు నగు నీకారోకారములు, ఆమ్ పరమగునపుడు వికల్ప నదీసంజ్ఞ కలవగును. స్త్రీ శబ్దమునకు మాత్రము నదీసంజ్ఞ యుండదు. శ్రీణామ్ (శ్రీ + ఆమ్) నదీసంజ్ఞా పక్షమందు నుడాగమము. నదీసంజ్ఞ లేనపు డియఙుచే శ్రియామ్ అని యగును. శ్రీ + ఙి. నదీసంజ్ఞ యున్నపు డామాదేశము. శ్రియామ్. పక్షాన్తరమం దియఙుచే శ్రియి అని యగును. కాశికావృత్తికారాదుల (వామన జయాదిత్యులు) మతమున ప్రకృష్టం ధ్యాయతి అను విగ్రహముగల ప్రధీ శబ్దము నిత్యస్త్రీలిఙ్గ మగుటవలన లక్ష్మీ శబ్దసదృశము. స్త్రీని బోధించు నితర పదప్రయోగము లేకున్న నేశబ్దము స్త్రీ బోధక మగునో యది నిత్యస్త్రీలిఙ్గమని వృత్తికారాదుల మతము. పురుషుల వలె స్త్రీలు నీశ్వరధ్యానము చేయుట కర్హులగుటవలన స్త్రీబోధక శబ్దప్రయోగము లేనపుడును ప్రధీశబ్దము లెస్సగ ధ్యానించు స్త్రీని బోధింపదగును గాన నట్టి ప్రధీశబ్దమునకు నదీసంజ్ఞ ప్రవర్తించును. (గ్రామ పరిపాలనము, కళ్ళ మూడ్చుట, మొదలగు కార్యములు పురుషులు మాత్రమే చేయదగిన వగుటచే, గ్రామణీః స్త్రీ, ఖలపూః స్త్రీ, అనిన గాని కేవల గ్రామణీ ఖలపూ శబ్దములు, స్త్రీ బోధకములు గానందున వృత్తికారాదిమతమునం దిట్టివి నిత్యస్త్రీలిఙ్గములు గా నేరవు) ఏశబ్ద మితర లిఙ్గమును బోధింపక స్త్రీలిఙ్గమును మాత్రము బోధించునో యదియే నిత్యస్త్రీలిఙ్గమని కైయటుని (భాష్య వ్యాఖ్యాత) మతము. ప్రధీశబ్దము ప్రకృష్టం ధ్యాయతి అను విగ్రహమున పుంలిఙ్గమునుగూడ బోధించును గాన కైయటుని మతమున నిత్యస్త్రీలిఙ్గము గాకుండుటచే నీ శబ్దమునకు నదీసంజ్ఞ యుండదు. కావున దీనికి పుంలిఙ్గమందువలె రూపములగును. ప్రకృష్టాధీః అను పదములుగల విగ్రహమందు అనగా కర్మధారయమందు, బహువ్రీహియందును, ప్రధీశబ్దము మతద్వయమందు లిఙ్గత్రయమందును, నిత్యస్త్రీలిఙ్గమగుటచే, లక్ష్మీ శబ్దసదృశమగును. ప్రకృష్టా ధీర్యస్య అను బహువ్రీహియందును ధీశబ్దము నదీసంజ్ఞకమగుటచే, 'ప్రథమలిఙ్గ గ్రహణంచ, అనువార్తికముచే, ప్రధీశబ్దము గూడ నదీసంజ్ఞకమై లక్ష్మీ శబ్దసదృశమగునని యాశయము. అమ్‌శస్సులు పరమగునపుడు యణాదేశమువలన, ప్రధ్యమ్, ప్రధ్యః, అని యగును. లక్ష్మీ శబ్దమునకచట లక్ష్మీమ్, లక్ష్మీః, అని యగును. లక్ష్మీ శబ్దముకంటె నిదియే దీనియందుగల భేదము. సుష్ఠుధీర్యస్యాః, సుష్ఠు ధ్యాయతి, (స్త్రీ) అను రెండు విగ్రహములందును, వృత్తికారమతమున సుధీశబ్దము శ్రీ శబ్దసదృశము. "నభూసుధియోః" అను నిషేధమువలన, సుధీ శబ్దమునకు యణాదేశమురాదు గాన సుధీశబ్దమియఙ్ స్థానమగును. కావున, నేయఙ్ (304) సూ. చే, నదీసంజ్ఞా నిషేధము శ్రీ శబ్దమునకువలె, దీనికిని ప్రవర్తించును. ఙితిహ్రస్వశ్చ (297) వామి, అను సూత్రద్వయముచే క్రమముగ ఙిత్తులు ఆమ్, ఇవి పరమగునపుడు నదీసంజ్ఞావికల్పముగూడ శ్రీ శబ్దమునకువలె దీనికి నగునని యాశయము. సుష్ఠు ధ్యాయతి (స్త్రీ) అను విగ్రహమునందు సుధీశబ్దము కైయటు మతమున నిత్యస్త్రీలిఙ్గము గానందున నదీసంజ్ఞ లేకపోవుటచే నిది పుంలిఙ్గ సుధీ శబ్దసదృశమగును. 'సుష్ఠుధీః అను పద

మాతో విగ్రహముగల స్త్రీలిఙ్గ బహువ్రీహియందు (సుధీర్వ్యస్యాః) కర్మధారయమందును, (సుష్ఠుధీః) సుధీశబ్దము మతద్వయమందును శ్రీశబ్దసదృశమగును. స్త్రీలిఙ్గ బహువ్రీహియందవయవమగు ధీశబ్దమునకు 'నేయఙ్' అను నిషేధము, ఙిత్తులు పరమగునపుడు సముదాయమునకు నదీసంజ్ఞా వికల్పమును శ్రీశబ్దమునకువలె దీనికి నగునని యాశయము. గ్రామనయనము సహజముగ పురుషధర్మమగుటచే గ్రామణీ శబ్దము స్త్రీ బోధకమగు పదాన్తరము ప్రయుక్తము గానపుడు స్త్రీ బోధకము గానందున వృత్తికార మతమందును నిత్యస్త్రీలిఙ్గము గానందున దీనికి నదీసంజ్ఞ యుండదు. కావున స్త్రీలిఙ్గ గ్రామణీ శబ్దమునకును పుంలిఙ్గమందువలె రూపములగును. ఇట్లే ఖలపవనము (కళ్లమూడ్చుట) మొదలగునవి సహజముగ పురుషధర్మములని తెలిసికొనదగును. కావున స్త్రీలిఙ్గములగు ఖలపూ మొదలగు శబ్దములు నిత్యస్త్రీలిఙ్గములు కానందున నదీసంజ్ఞకములుకావు, గాన నవి పుంలిఙ్గ సదృశములగును.

ధేను శబ్దము ఘిసంజ్ఞకమగుటచేతను ఙితి హ్రస్వశ్చ (297) సూ. చే, ఙిత్తులలో వికల్ప నదీసంజ్ఞ కలదగుటవలనను మతి శబ్దసదృశమగును.

* 306. స్త్రియాంచ. 7-1-96. స్త్రియాం, చ, (తృజ్వత్క్రోష్టుః)

స్త్రీవాచీక్రోష్టుశబ్దః తృజన్తవద్రూపం లభతే॥

306. తృజ్వత్క్రోష్టుః సూత్రమువలె నీ సూత్రమును తృజన్తరూపము నతిదేశించును. స్త్రీలిఙ్గమగు క్రోష్టు శబ్దము తృచ్ ప్రత్యయాన్తముతో సదృశమగు రూపము నొందును. స్త్రీలిఙ్గమగు క్రోష్టు శబ్దముయొక్క స్థానమందు క్రోష్టృశబ్దమును ప్రయోగింపవలయునని ఫలితమగును.

* 307. ఋన్నేభ్యోఙీప్. 4-1-5. ఋన్నేభ్యః, ఙీప్, (స్త్రియామ్)

ఋదన్తేభ్యో నాన్తేభ్యశ్చ స్త్రియాం ఙీప్ స్యాత్। క్రోష్ట్రీ। క్రోష్ట్ర్యౌ। క్రోష్ట్ర్యః। వధూర్గౌరీవత్। భ్రూః, శ్రీవత్। హేసుభ్రూః। కథం తర్హి హా పితః క్వాసి హేసుభ్రు। ఇతి భట్టిః। ప్రమాద ఏవాయమితి బహవః। ఖలపూః పుంవత్। పునర్భూః। దృన్కరేతి యణాదేశః వఙ్ బాధనాన్నేయఙితి నిషేధో న। హే పునర్భు। పునర్భ్వమ్। పునర్భ్వా। పునర్భ్వః॥

307. ఋన్నేభ్యః, అనునది ప్రాతిపదికమునకు విశేషణమగుటచే, తదన్తవిధి గల్గును. హ్రస్వ ఋకారముగాని నకారముగాని అన్తమందుగల్గి స్త్రీలిఙ్గము అగు ప్రాతిపదికములకంటె, ఙీప్ (ఈ) ప్రత్యయము వచ్చును. ఋకారాన్తమగు క్రోష్టృ శబ్దముకంటె పరముగ దీనిచే ఙీప్ ప్రత్యయమగును. యణాదేశము, క్రోష్ట్రీ, ఙ్యన్తమగుటచే సులోపము. ఇది గౌరీ శబ్దసదృశము. వధూ

శబ్దము. నిత్యస్త్రీలిఙ్గమగు నూకారాన్తమగుటవలన నదీసంజ్ఞకమగును. కావున నిది, గౌరీశబ్దసదృశమగును. భ్రూశబ్దము నువఙ్ స్థానముగుటవలన, "నేయఙ్, అను సూ. చే, విహితమగు నిషేధము వైకల్పికమగునది ప్రవర్తించును గాన శ్రీశబ్దసదృశమగును. నదీసంజ్ఞ లేనందున సంబుద్ధి హ్రస్వము రాదు. హేసుభ్రూః. ఇట్లుండ, "హాపిత క్వాసి హే సుభ్రు, అను భట్టికావ్యములోని హ్రస్వప్రయోగ మెట్లు సాధువగునని ప్రశ్న గల్గును. రావణుడు సీత నపహరించినపిదప రాముని విలాప సందర్భమున నీ శ్లోకము చెప్పబడెను. హాసితః = త్యాజితః. దైవము వలన సీతచే విడువబడిన రాముడు, 'ఓ సీతా! నీ వెచట నున్నావని' విలపించుచున్నాడని పై వాక్యమున కర్థము. కవి యిచట ప్రామాదికముచే నీ యపశబ్దమును ప్రయోగించెననియే యనేకుల యాశయము. ఖలపూ శబ్దము పుంలిఙ్గ ఖలపూ శబ్దసదృశము. పునర్భూః "దృన్కర. అను వార్తికముచే విధింపబడు యణ్ణుచే నువఙ్ బాధింపబడుటవలన నిది యువఙ్ స్థానము గాకుండుటచే నిచట, "నేయఙ్" అను నిషేధము ప్రవర్తించదు. నదీసంజ్ఞ యుండుటవలన సంబుద్ధి హ్రస్వము వచ్చును. హే పునర్భు యణాదేశముచే పునర్భ్వమ్, ఇత్యాదు లగును.

వివ:—మూలమున ప్రమాదః, అను శబ్దమునకు విరహపీడితుడగు రాముని యొక్క చిత్తమునకు స్థైర్యములేకపోవుట యని యర్థము. ఇట్టి ప్రమాదము రాముని విరహమును పోషించునదగుటచే, హే సుభ్రు అను నపశబ్దప్రయోగము కావ్యమందు గుణసంపాదకమే యగునని ప్రామాణికుల యాశయము.

* 308. ఏకాజుత్తరపదే ణః 8-4-12 ఏకాజుత్తరపదే, ణః. (ప్రాతిపదికాన్తనుమ్విభక్తిషు చ, రషాభ్యామ్, నః, పూర్వపదాత్)

ఏకాజుత్తరపదం యస్యతస్మిన్ సమాసే పూర్వపదస్థాన్నిమిత్తాత్పరస్య ప్రాతిపదికాన్తనుమ్విభక్తిస్థస్య నస్య నిత్యం ణత్వంస్యాత్। ఆరంభసామర్థ్యా న్నిత్యత్వేసిద్ధే పునర్ణగ్రహణం స్పష్టార్థమ్। యణం బాధిత్వా పరత్వాన్నుట్। పునర్భ్వాణామ్। వర్షాభూః। భేకజాతౌ నిత్యస్త్రీత్వాభావాత్। హేవర్షాభూః, కైయటమతే। మతాన్తరేతు హేవర్షాభు। పునర్న్వాయాంతు హేవర్షాభు। "భేక్యాం పునర్నవాయాం స్త్రీవర్షాభూర్దర్దురే పుమాన్" ఇతిమాధవః। వర్షాభ్వౌ। వర్షాభ్వః। స్వయంభూః పుంవత్॥

308. ఏకాజుత్తరపదమ్ అనునది (ఏకః అచ్ యస్మిన్ తత్ ఏకాచ్, ఏకాచ్ ఉత్తరపదం యస్య) బహువ్రీహి గర్భ బహువ్రీహి సమాసము. ఉత్తరపద

మన సమాసమునకు తుది యవయవము. కాన నిది సమాసము నాక్షేపించును. ఇట్లు లబ్ధమగు సమాస మేకాజుత్తరపదే అను దానికి విశేష్యమగును. ఏ సమాసమం దుత్తరపద మొకే యచ్చు కలదగునో యట్టి సమాసమున పూర్వపదమున నున్న రేఫ షకారములకంటె పరమగునదయి ప్రాతిపదికముయొక్క తుది నున్నటువంటిది గాని, నుమ్ సంబన్ధి యైనటువంటిది గాని, విభక్తియందున్నది గాని యగు నకారమునకు నిత్యము ణకార మాదేశమగును. ప్రాతిపాదికాన్త నుమ్విభక్తి షుచ (၆8၆) సూ. చే. వికల్ప ణత్వము సిద్ధమగుచుండ నీ సూత్రము నారంభించుటవలననే యీ ణత్వము నిత్యమనుట సిద్ధమగును గాన 'రషాభ్యామ్' (236) సూత్రమునుండి ణగ్రహణ మనువ్రృత్తమగుచుండ నీ సూత్రమున ణగ్రహణము నిత్యత్వమును బోధించుటకై యావశ్యకము గాదు. కాన నీ సూత్రమున ణగ్రహణము స్పష్టార్థము. పునర్భ్వాణామ్ (పునర్భ్వా + ఆమ్). ఇచట "వృన్కర" ఇత్యాది వార్తికముచే ప్రాప్తమగు యణాదేశమును బాధించి పరమగు నువాగమ మగును. "పునర్భ్వా" అను సమాసమున నుత్తరపదమగు భూ అనునది ఒకే యచ్చుగలది. పూర్వపదమగు పునర్ అను దానియందు రేఫమున్నది. దీనికంటె పరమగు నకారము విభక్తిస్థమగుటవలన నిచట నీ సూత్రముచే ణత్వమగును.

వర్షాభూః "భేక్యాం పునర్నవాయాం స్త్రీ వర్షాభూర్దర్దురే పుమాన్" అను యాదవ నిఘంటువువలన వర్షాభూ శబ్దము భేకజాతి బోధక మగును. ద్విలిఙ్గకమగు నిది పుంలిఙ్గము నగుటచే కైయట మతమందు నిత్య స్త్రీలిఙ్గము కాదు. కావున నదీసంజ్ఞ లేకపోవుటచే సంబుద్ధి హ్రస్వ మిచట ప్రవర్తించదు. హే వర్షాభూః. వృత్తికారాది మతమునం దిది నిత్యస్త్రీలిఙ్గ మగుటవలన నదీసంజ్ఞ కలదగుటచే సంబుద్ధి హ్రస్వము వచ్చును. హేవర్షాభు. వర్షాభ్వౌ. వర్షాభ్వః. నభూసుధియోః. అను నిషేధమును బాధించి "వర్షాభ్వశ్చ" (28၄) సూ. చే, నిచట యణాదేశము. స్వయంభూశబ్ద మవయవశక్తిచే చతుర్ముఖుని బోధించును. కావున నీ శబ్దము పదాన్తర సంబంధములేనిదై స్త్రీబోధకము గానందున వృత్తికార మతమందును నిత్యస్త్రీలిఙ్గము గాదు. కావున పుంలిఙ్గమునందువలె దీనికిని రూపములగును.

వివ :— 'శలీగండూపదీ భేకీ వర్షాభ్వీక మఠీధులిః' అను నమరము వలన వర్షాభ్వీ శబ్దము నిత్యజీషన్తము. ప్రదర్శితమగు యాదవ నిఘంటువుగూడ "సుతః పుత్ర స్త్రియాంత్వమీ ఆహుర్దుహితర"మను నిఘంటువువంటి దగుటవలన విరోధించదు. కాన స్త్రీలిఙ్గమున వర్షాభూ అనునది యుండదు. అమరమున శలీగణ్డూపదీ భేకీ వర్షాభూః కమఠీధులిః అను పాఠ మున్నటుల సుబోధినీకారుని వ్యాఖ్యానమువలన తెలియుచున్నది. ఈ పాఠము ననుసరించి మూలము ప్రాయికమని గ్రహించునది.

* 309. న షట్ స్వస్రాదిభ్యః. 4-1-10. న, షట్ స్వస్రాదిభ్యః, (జీప్, టాప్)

షట్సంజ్ఞకేభ్యః స్వస్రాదిభ్యశ్చ జీప్టాపౌ న స్తః॥

శ్లో॥ స్వసా, తిస్ర, శ్చతస్రశ్చ, ననాన్దా, దుహితా, తథా। యాతా, మాతేతి, సప్తైతే, స్వస్రాదయ ఉదాహృతాః। అప్తృన్నితిదీర్ఘః। స్వసా। స్వసారౌ। స్వసారః। మాతాపితృవత్। శసిమాతౄః। ద్యౌర్గోవత్। రాః పుంవత్। నౌర్గ్లౌవత్॥

309. షట్సంజ్ఞకల శబ్దములకంటె, స్వసృ మొదలగు నేడు శబ్దములకంటెను (స్వసృ, తిసృ, చతసృ, ననాన్దృ, దుహితృ, యాతృ, మాతృ) జీప్ టాప్ ప్రత్యయములు రావు. స్వస్రాదులకంటె జీప్ ప్రత్యయము, షట్సంజ్ఞకములకంటె టాప్ జీపులు ప్రాప్తములగుచుండ నీ సూత్రముచే నిషేధము చెప్పబడెను. స్వసృ + సు "ఋదుశనస్ (277) సూ. చే, అనఙ్ "అప్తృన్" (278) సూ. చే, దీర్ఘము. సులోపనలోపములు. స్వసా. గుణదీర్ఘములు, స్వసారౌ, స్వసారః. మాతృ శబ్దమునకు అప్తృన్ అను సూత్రమున చెప్పబడిన నియమమువలన నుపధాదీర్ఘము రాదు గావున నిది పితృ శబ్దసదృశమగును. స్త్రీలిఙ్గ మగుటచే ద్వితీయా బహువచనమునందు మాత్రము నత్వము రాదు. మాతౄః. ద్యో శబ్దము గో శబ్దసదృశము. రై శబ్దము పుంలిఙ్గమందువలెనుండును. నౌ శబ్దము గ్లౌ శబ్దసదృశము.

అజన్త స్త్రీలిఙ్గ ప్రకరణము ముగిసెను.

## 9. అజన్త నపుంసకలిఙ్గ ప్రకరణము

* 310. అతోऽమ్ 7-1-24 అతః, అమ్. (అఙ్గస్య, స్వమోర్నపుంసకాత్)

అతోऽఙ్గాత్ క్లీబాత్స్వమోరమ్స్యాత్। అమిపూర్వః। జ్ఞానమ్। ఏఙ్హ్రస్వాదితిహల్ మాత్రలోపః। హే జ్ఞాన॥

310. హ్రస్వాకారమన్తమందు గల్గి నపుంసక లిఙ్గమగు నఙ్గము కంటె పరములగు స్వమ్ములకు అమాదేశమగును. జ్ఞాన + సు. అమాదేశము. అమిపూర్వః (195) సూ. చే, పూర్వరూపము. జ్ఞానమ్. హే జ్ఞాన + సు, అమా

దేశము పూర్వరూపము, హేజ్ఞానమ్, ఏఙ్ హ్రస్వాత్ (194) సూ. చే, సంబుద్ధ్యవయవమగు మకారమునకుమాత్ర మిచట లోపము. హేజ్ఞాన.

వివ :—స్వమోర్న పుంసకాత్ (320) సూ. చే, విధింపబోవు స్వమ్ముల యొక్క లుక్కున కిది యపవాదము. ద్వితీయైకవచనమగు అమ్మునకమ్విధానము లుగ్బాధనార్థమని తెలియునది.

* 311. నపుంసకాచ్చ 7-1-19 నపుంసకాత్, చ. (శీ, ఔఙః)

క్లీబాత్పరస్యౌఙఃశీస్యాత్। భసంజ్ఞాయామ్॥

311. ఔఙ్ అనునది ఔకారవిభక్తికి సంజ్ఞయని పూర్వము చెప్పబడెను. నపుంసక శబ్దముకంటె పరమగు ఔకారవిభక్తికి శీ ఆదేశమగును. జ్ఞాన + ఔ. ఈ సూత్రముచే శ్యాదేశము జ్ఞాన + ఈ. సర్వనామస్థాన సంజ్ఞావిధాయకమగు 'సుడనపుంసకస్య' అను సూత్రమున అనపుంసకస్య, అను పర్యుదాసముచే నిచట యచిభమ్ (232) సూ. చే, నఙ్గము భసంజ్ఞకమగును.

* 312. యస్యేతిచ 6-4-148 యస్య, ఈతి, చ. (తద్ధితే, భస్య)

భస్యేవర్ణావర్ణయోర్లోపః స్యాదీకారేతద్ధితే
చపరే। ఇత్యకారలోపేప్రాప్తే। ఔఙఃశ్యాం ప్రతిషే
ధోవాచ్యః। జ్ఞానే॥

312. 'యస్య' అనునది ఇవర్ణావర్ణములకు సమాహార ద్వన్ద్వము (ఇశ్చ, అశ్చ, యమ్, తస్య) భసంజ్ఞకమగు నఙ్గమున కవయవములగు ఇకారాకారములకు, ఈకారముగాని తద్ధిత ప్రత్యయముగాని పరమగునపుడు లోపమగును. జ్ఞాన + ఈ. ఇచట నీ సూత్రముచే లోపము ప్రాప్తమగుచుండ, ఔకార విభక్త్యాదేశమగు శీభావము పరమగునపుడు లోపమునకు నిషేధమును బోధించు ఔఙఃశ్యామను వచనముచే నిచట లోపము నిషేధింపబడును. ఆద్గుణః (70) సూ. చే, గుణము, జ్ఞానే.

* 313. జశ్శసోశ్శిః. 7-2-20. జశ్శసోః, శిః. (నపుంసకాత్)

క్లీబాదనయోః శిః స్యాత్॥

313. నపుంసకమగు నఙ్గముకంటె పరమగు జశ్శస్సులకు శి ఆదేశమగును. (జ్ఞాన + జస్) జ్ఞాన + శి.

వివ :—జస్సు సాహచర్యము వలన నిచట శస్ పదముచే ద్వితీయా బహువచనమునకే గ్రహణముగాని తద్ధిత శస్సునకు గ్రహణముగాదని గ్రహించునది.

* 314. శిసర్వనామస్థానమ్ 1_1_42 శి. సర్వనామస్థాన.
శి ఇత్యేతదుక్త సంజ్ఞం స్యాత్ ॥

314. శి అనునది సర్వనామస్థాన సంజ్ఞ కలదగును.

* 315. నపుంసకస్య ఝలచః 7_1_72 నపుంసకస్య, ఝలచః. (నుమ్, సర్వనామస్థానే)

ఝలన్తస్యా జన్తస్యచ క్లీబస్యనుమాగమస్స్యాత్సర్వనామస్థానేపరే। ఉపధాదీర్ఘః। జ్ఞానాని। పునస్తద్వత్। శేషంరామవత్। ఏవం ధనవనఫలాదయః॥

315. ఝలచః (ఝల్, అచ్, శబ్దములకు సమాహారద్వంద్వము. దీనికి షష్ఠ్యేకవచనము) అనునది నపుంసకమగు నఙ్గమునకు విశేషణము గాన తదన్తవిధి గలుగును. ఝలన్తముగాని, అజన్తముగాని అయి నపుంసకమగు నఙ్గమునకు సర్వనామస్థానము పరమయినపుడు నుమాగమమగును. జ్ఞాన + ఇ. అఙ్గమజన్తమగుటచే నిచట నుమాగమము. జ్ఞానన్ + ఇ "సర్వనామస్థానే" (251) సూ. చే, నుపధాదీర్ఘము. జ్ఞానాని. ద్వితీయా విభక్తియు ప్రథమా విభక్తి సదృశమగును. శేషము రామశబ్ద సదృశము. ధన, వన, ఫల, మొదలగు నకారాన్త నపుంసకలిఙ్గ శబ్దములకు నిట్లే ప్రక్రియ నూహించునది.

* 316. అద్డ్డతరాదిభ్యః పఞ్చభ్యః 7_1_25 అద్డ్, డతరాదిభ్యః, పఞ్చభ్యః. (స్వమోర్నపుంసకాత్)

ఏభ్యః క్లీబేభ్యస్స్వమోరద్డాదేశః స్యాత్।

316. సర్వాదిగణమున పఠితములగు డతర, డతమ, అన్య, అన్యతర ఇతర, ఈ యైదును డతరాదులు. నపుంసకములగు వీనికంటె పరములగు స్వమ్ములకు అద్డాదేశమగును. డకార మిత్సంజ్ఞకమగుటవలన ఆదేశము డిత్తగును. ప్రత్యయములగు డతరడతమ లచే తదన్తములకు గ్రహణము.

* 317. టేః 6_4_143 (డితి, లోపః, భస్య)

డితిపరే భస్య టేర్లోపస్స్యాత్। వావసానే। కతరత్। కతరద్। కతరే। కతరాణి। భస్యేతికిమ్। పఞ్చమః। టేర్లుప్తత్వాత్ ప్రథమయోరితి పూర్వసవర్ణదీర్ఘః, ఏఙ్ హ్రస్వాదితిసంబుద్ధిలోపశ్చన భవతి। హే కతరత్। పునస్తద్వత్। శేషంపుంవత్। కతమత్। అన్యత్। అన్యతరత్। ఇతరత్। అన్యతమ శబ్దస్యత్వన్యతమమిత్యేవ। (వా) ఏకతరాత్ప్రతిషేధోవక్త

వ్యః । ఏకతరమ్ । సోరమాదేశే కృతే సన్నిపాత పరిభా షయా నజరస్ । అజరమ్ । అజరసీ, అజరే, పరత్వాజ్జ రసి కృతే ఝల న్తత్వాన్నుమ్ ॥

317. భసంజ్ఞకల యఙ్గమున కవయవమగు టిసంజ్ఞకమునకు, డిత్తు (ఇత్సంజ్ఞక డకారముగల ప్రత్యయము) పరమగునపుడు లోపమగును, కతర + అద్ (డ్) ఇచట నీ సూత్రముచే కతర శబ్దములోని యకారము లోపించును. కతరద్. వావసానే (207) సూ. చే, చర్త్వపక్షమందు కతరత్ అనియు చర్త్వాభావ పక్షమున కతరద్ అనియు నగును. (కతర + ఔ) కతరే, ఇచట శీ భావగుణములు. కతరాణి. పఞ్చన్ శబ్దముకంటె తస్యపూరణే డట్ (5-2-48) సూ. చే, డట్ ప్రత్యయము, డట్ ప్రత్యయమునకు "నాన్తాద సంఖ్యాదేర్మట్" (5-2-49) సూ. చే, మడాగమము విధింపబడెను. అందుచే నజాది ప్రత్యయము పరముగ లేనందున పఞ్చన్ అనుదానికి భసంజ్ఞయుండదు. పదసంజ్ఞయుండుటచే నలోపమువలన, పఞ్చమః అని యగును. ఇచట టిలోప మును వారించుటకు సూత్రమున భస్య అను నధికార మావశ్యకము. అద్ డా దేశమున డిత్వమునకు ఫలము చెప్పబడుచున్నది. "టేర్లుప్తత్వాత్ ... ..నభవతి" హేకతర + అద్, ఇచట టి లోపము ప్రవర్తించుటవలన "ప్రథమయోః (165) సూ. చే, ప్రాప్తమగు పూర్వసవర్ణ దీర్ఘము వారింపబడెను. పూర్వ సవర్ణదీర్ఘ నివృత్తి డాదేశమువలనను సంభవించును గాన నిది డిత్వఫలము గాదని యెంచి "ఏఙ్ హ్రస్వాత్" (194) సూ. చే, ప్రాప్తమగు సంబుద్ధ్యవయవ మునకు లోపనివృత్తి డిత్వఫలమని నిరూపించబడెను. టిలోపమువలన నఙ్గము హ్రస్వాన్తము గానందున సంబుద్ధిలోపము ప్రసక్తముగాదని యాశయము. ఇట్లే ద్వితీయా విభక్తియు నగును. శేషము పుంలిఙ్గ కతర శబ్దసదృశము. కతమాన్యా న్యతరేతర శబ్దములు కతర శబ్దసదృశములు. అన్యతమ శబ్దమునకు డతరాదులందు పాఠము లేనందున నద్ డాదేశము రాదు. అన్యతమమనియే యగును. "ఏకాచ్చ ప్రాచామ్" (5-3-94) సూ. చే, నేకశబ్దముకంటె డతరప్రత్యయము విధింప బడెను. కావున నేకతరశబ్దముకంటె పరమగు స్వమ్ములకు ప్రసక్తమగు నద్ డా దేశమును నిషేధించుచున్నాడు (వా) ఏకతరాత్ప్రతి......వక్తవ్యః. ఏకతర శబ్దముకంటె పరములగు స్వమ్ముల కద్ డాదేశము రాదని చెప్పవలయును. కనుక 'ఏకతరమ్' అని యగును. ఇది సర్వశబ్దసదృశము. అజరమ్ (అవిద్యమానా జరా యస్య తత్కులమ్) బహువ్రీహి సమాసము. విద్యమానశబ్దమునకు లోపము. జరాశబ్దమునకు "గోస్త్రియోరుపసర్జనస్య (660) సూ. చే, హ్రస్వము. అజర + సు. సుప్రత్యయమున కమాదేశము చేసినపిదప సన్నిపాత పరిభాషచే (అదన్తాఙ్గ నిమిత్తకమగు నమాదేశము అఙ్గమున కదన్తత్వమును పోగొట్టు జరసా దేశమును గుఱించి నిమిత్తము గాదు) జరసాదేశము రాదు. పూర్వరూపము. అజరమ్, అజర + ఔ. శీభావము. అజర + ఈ, జరసాదేశ పక్షమందు అజరసీ.

పక్షాన్తరమందు అజరే. అజర + జస్. ఇచట శీభావముకంటె పరమగు జరసాదేశము పూర్వము ప్రవర్తించును. పిదప శ్యాదేశమగును. అజరస్ + ఇ. అఙ్గము ఝలన్తమగుటవలన "నపుంసకస్య ఝలచః" (315) సూ. చే. నుమాగమము. అజరన్స్ + ఇ. ఇట్లుండ,

* 318. సాన్తమహతస్సంయోగస్య 6-4-10 సాన్త, మహతః, సంయోగస్య, (నోపధాయాః, సర్వనామస్థానే చాసంబుద్ధౌ)

సాన్తసంయోగస్య మహతశ్చ యో నకారస్తస్యోపధాయా దీర్ఘస్స్యాదసంబుద్ధౌ సర్వనామస్థానే పరే। అజరాంసి। అజరాణి। అమిలుకోపవాదమ్మ్భావం బాధిత్వా పరత్వాజ్జరస్। తతస్సన్నిపాతపరిభాషయానలుక్। అజరసమ్। అజరమ్। అజరసీ। అజరే। అజరాంసి। అజరాణి। శేషం పుంవత్। పద్దన్నితి హృదయోదకాస్యానాం హృత్ ఉదన్ ఆసన్। హృన్ది। హృదా, హృద్భ్యామ్। ఇత్యాది! ఉదాని। ఉద్నా। ఉదభ్యామ్। ఇత్యాది। ఆసాని। ఆస్నా। ఆసభ్యామిత్యాది। మాంసి। మాంసా। మాన్భ్యామిత్యాది। వస్తుతస్తు ప్రభృతిగ్రహణం ప్రకారార్థమిత్యుక్తమ్। అత ఏవ భాష్యే మాంస్పచన్యా ఉఖాయా ఇత్యుదాహృతమ్। అయస్మయాదిత్వేన భత్వాత్సంయోగాన్తలోపేన। పద్దన్నిత్యత్ర పిహాఛన్దసీత్యనువర్తితం వృత్తౌ, తథాప్యపోభిత్యత్ర మాసశ్ఛన్దసీతి వార్తికే ఛన్దోగ్రహణ సామర్థ్యాల్లోకేపి క్వచిదితి కైయటోక్తరీత్యా ప్రయోగమనుసృత్య పదాదయః ప్రయోక్తవ్యా ఇతి బోధ్యమ్॥

318. సూత్రమున సాన్త అనునది భిన్నపదము, లుప్తషష్ఠీకము. ఇది సంయోగస్య అను దానికి విశేషణము. సకారమన్తమందుగల సంయోగమునకు గాని మహచ్ఛబ్దమునకు గాని సంబంధించిన నకారముయొక్క యుపధకు సంబుద్ధిభిన్నమగు సర్వనామస్థానము పరమగునపుడు దీర్ఘమగును. ఇచట పారిభాషికమగు నుపధకు సంభవములేనందున నుపధాశబ్దము పూర్వమాత్రమును బోధించును. అజరన్స్ + ఇ. ఈ సూత్రముచే నిచట దీర్ఘమువలన అజరాంసి అని యగును. జరసాదేశాభావపక్షమందు అజరాణి. అజర + అమ్. లుక్కునకపవాదమగు నమాదేశమును బాధించి పరమగు జరసాదేశము వచ్చును. అజరస్ + అమ్. పిదప సన్నిపాతపరిభాషచే (అజాది ప్రత్యయ నిమిత్తకమగు జరసాదేశము

అట్టి ప్రత్యయమును నశింపచేయు లుక్కును గుఱించి నిమిత్తముగాదు) లుక్కు ప్రవర్తించదు. అజరసమ్. పక్షమందు అజరమ్. ద్వితీయా ద్వివచన బహువచనములు ప్రథమా ద్వివచన బహువచన సదృశములు. శేషము పుంలిఙ్గమగు నజరశబ్దసదృశము. హృదయోదకాస్య శబ్దములు సర్వనామస్థానమున జ్ఞానశబ్దసదృశములు. వీనికి పద్దన్న (229) సూ. చే, శసాదులు పరమగునపుడు క్రమముగ హృద్, ఉదన్, ఆసన్ ఆదేశములగును. హృదయ + శస్ ఇచట హృదాదేశము ప్రవర్తించిన నజ్ఝలు ఝలన్తమగుటవలన నుమాగమమగును గాన హృన్ది అని యగును. ఇట్లే ఉదకాస్య శబ్దములకు గూడ శసాదులలో ఉదాని (ఉదన్ + శస్) ఆసాని (ఆసన్ + శస్) మొదలగు రూపముల నూహింపవలయును. ఉద్నా ఆస్నా ఇత్యాదులలో అల్లోపోఽనః (235) సూ. చే, అకారము లోపించును. మాంస శబ్దమునకు శసాదులు పరమగునపుడు మాంసాదేశమగునని చెప్పబడియెను. సూ. (296) మాంసి (మాంస + శస్) మొదలగు రూపములగును. మాన్భ్యామ్ (మాన్స్ + భ్యామ్) ఇత్యాదులందు సంయోగాన్త లోపముచే సకారము లోపించును. సంయోగాన్తలోప మసిద్ధమగుటవలన నలోపము ప్రవర్తించదు.

"పద్దన్నోమాస్" సూత్రమున ప్రభృతి గ్రహణము సాదృశ్యార్థకమని పుంలిఙ్గ ప్రకరణమున చెప్పబడెను. మాంస్పచన్యా ఉఖాయాః, అను భాష్యోదాహరణ మీ విషయమున ప్రమాణమగును. మాంస్పచనీ (మాంసస్యపచనీ) అనునది షష్ఠీ సమాసము. ఇచట షష్ఠీ విభక్తికి లుక్కు వచ్చుటచే ప్రత్యయలక్షణము లేనందున ప్రభృతి గ్రహణము ప్రకారార్థమనినగాని మాంసశబ్దమునకు మాంసాదేశము సిద్ధముగాదు గాన భాష్యప్రయోగము సాధువు గాకపోవును. ప్రకారార్థకమనిన శసాదులు శబ్దములగుటచే తత్సదృశములను గూడ శబ్దములనే గ్రహింపదగును. కాన పచనీ శబ్దము పరమగునపుడును మాంసాదేశము సిద్ధమగును. ప్రకారార్థమనుటకు హృదయాది శబ్దములకు సర్వనామస్థానము పరమగునపుడును హృదాద్యాదేశములు వచ్చుట ఫలమగును. మాంస్ శబ్దమున యస్మయాదిగణమున జేర్చుటవలన, అయస్మయాదీని ఛన్దసి (1-4-20) సూ. చే, భ సంజ్ఞయుండును గావున మాంస్పచనీ అను ప్రయోగమున మాంస్ అనుచోట పదసంజ్ఞా నిమిత్తకమగు సంయోగాన్తలోపము ప్రవర్తించదు.

"పద్దన్న" సూత్రములోనికి "ఛందసి" అను పదము ననువృత్తిచేసి పదాద్యాదేశములు వేదముననే వచ్చునని కొందఱి యాశయమని కాశికావృత్తిలో చెప్పబడినది. అయినను "అపోభి" (445) సూత్రములోని మాసశ్ఛన్దసి అను వార్తికమున ఛన్దసి అని చెప్పుటవలన పదాద్యాదేశములు లోకమున గూడ కొన్నిచోటులందు వచ్చునని కైయటోక్తిచే ప్రయోగముల ననుసరించి పదాదులు లోకమునందును (కావ్యాదులందు) ప్రయోగింపదగినవని తెలియదగును. వేదమున మాస్ శబ్దములోని సకారమునకు భకారాది ప్రత్యయము పరమగునపుడు తకారమాదేశమగునని మాసశ్ఛన్దసి అనువార్తికమున కర్థము. మాద్భిశ్శరద్భిర్దురోదరమ్,

అని యుదాహరణము. లౌకికమున తకారాదేశము వారించుటకై ఛన్దసి అని చెప్పబడినది. పదాన్త్యాదేశములు లౌకికమున ప్రయోగాభావములే గాన పునః ఛన్దసి అనునది నిరర్థకమగును. కావున నిది పూర్వోక్తార్థమున జ్ఞాపకమగును.

* 319. హ్రస్వో నపుంసకే ప్రాతిపదికస్య 1-2-47 హ్రస్వః, నపుంసకే, ప్రాతిపదికస్య.

క్లీబే ప్రాతిపదికస్యాజన్తస్య హ్రస్వస్స్యాత్ । శ్రీపం జ్ఞానవత్ । శ్రీపాయ । అత్ర సన్నిపాత పరిభాషయా ఆతో ధాతోరిత్యాకార లోపో న ॥

319. హ్రస్వ పదశ్రవణముచేత అచః అను పరిభాష యీ సూత్రమున నుపస్థితమగును. అచః అనునది ప్రాతిపదిక విశేషణ మగుటచే తదన్తబోధక మగును. నపుంసకము అజన్తమునగు ప్రాతిపదికమునకు హ్రస్వమగును. శ్రీపా శబ్దము నపుంసకము అజన్తము నగుటచే హ్రస్వము వచ్చును. అందుచే నిది జ్ఞానశబ్దతుల్యమగును. శ్రీపా శబ్ద మాకారాన్తమైనను దానివలన కలుగు భేదము మాత్రము లేదని యాశయము. కావున జ్ఞానశబ్దమునకు ప్రథమా బహువచనాదు లందు జ్ఞానాని, మొదలగు రూపములయినను శ్రీప శబ్దమునకు ఏకాజుత్తరపదే (303) సూ. చే, ణత్వము ప్రవర్తించుటవలన శ్రీపాణి మొదలగు రూపము లయినను విరోధములేదు. శ్రీపాయ. ఇచట సుపిచ (203) సూ. చే, దీర్ఘము ప్రవర్తించుటవలన నీ రూపము సిద్ధమగును. పా అనునది ఆకారాన్త ధాతువు. దీనికి యకారాది ప్రత్యయము పరమగుటచే శ్రీపా అనునది భసంజ్ఞకమగును. కాన నిచట ఆతో ధాతోః (241) సూ. చే, ఆకారలోపము ప్రసక్తమగు చున్నది. కాని సన్నిపాత పరిభాషచే (అవర్ణము నాశ్రయించి చేయబడు యాదేశ మవర్ణలోపమున నిమిత్తముగాదు) లోపము ప్రవర్తించదు.

* 320. స్వమోర్నపుంసకాత్. 7-1-23. స్వమోః, నపుంసకాత్. (లుక్)

క్లీబాదఙ్గాత్స్వమోర్లుక్ స్యాత్ ॥

320. నపుంసకమగు నఙ్గముకంటె పరములగు స్వమ్ములకు లుక్కు వచ్చును. వారి (వారి + సు).

వివ :— ఈ లుక్కు పూర్వవిప్రతిషేధముచే త్యదాద్యత్వమునకు కిమః కః, సూ. చే, కిం శబ్దమునకు విధింపబడు కాదేశమునకును బాధకము. కావున నపుంసకతచ్ఛబ్దముయొక్క ప్రథమైక వచనమందు పరములగు త్యదాద్యత్వము మొదలగునవి ప్రవర్తింపనందున సః అని రూపముగాక తత్ అని యగును. ఇట్లే కిమ్ శబ్దమునకును కమ్, అనిగాక కిమ్ అను నిష్టరూపము సిద్ధమగును.

* 321. ఇకోఽచి విభక్తౌ 7-1-73 ఇకః, అచి, విభక్తౌ (నుమ్, నపుంసకస్య)

ఇగన్తస్యాజన్తస్య క్లీబస్య నుమాగమః స్యాదచి విభక్తౌ। వారిణీ। వారీణి। న లుమతేతి నిషేధస్యానిత్యత్వాత్పక్షే సంబుద్ధినిమిత్తో గుణః। హే వారే హే వారి। ఆఙో నా। వారిణా। ఘేర్ఙితీతి గుణే ప్రాప్తే। వృద్ధ్యౌత్వతృజ్వద్భావగుణేభ్యో నుమ్ పూర్వ విప్రతిషేధేన। వారిణే। వారిణః। వారిణోః। నుమచిరేతి నుట్। నామీతి దీర్ఘః। వారీణామ్। వారిణి। వారిణోః। హలాదౌ హరివత్॥

321. ఇక్ ప్రత్యాహారవర్ణ మన్తమందుగలిగి నపుంసకమగు నఙ్గమున కజాది విభక్తి పరమగునపుడు నుమాగమమగును. వారిణీ (వారి + ఔ) వారీణి (వారి + జస్) హే వారే హే వారి. ఈ సూత్రమున నచ్ గ్రహణమువలన "న లుమతా" అను ప్రత్యయలక్షణ నిషేధ మనిత్యమని పూర్వము చెప్పబడెను. కాన హే వారి + సు అనుచోట సు ప్రత్యయమునకు లుక్కు వచ్చినను ప్రత్యయ లక్షణముచే సంబుద్ధి పరమగుటవలన పక్షమందు సంబుద్ధి నిమిత్తక గుణము (హ్రస్వస్య గుణః) ప్రవర్తించును. వారి + టా. ఇచట ఆఙో నా (245) సూ. చే, నా భావము ప్రవర్తించును. వారిణా. వారి + ఙే. ఇచట నీ సూత్రముచే విహితమగు నుమాగమమును బాధించి పరమగు ఘేర్ఙితి (246) సూ. చే, గుణము ప్రాప్తమగుచుండ, పూర్వ విప్రతిషేధముచేత నుమాగమ ప్రవృత్తికై వార్తికమును చెప్పుచున్నాడు. వృద్ధ్యౌత్వ......న. అతి సఖీని అనుచోట సఖ్యురసంబుద్ధౌ (7-1-92) సూ. చే, ణిద్వద్భావమువలన వృద్ధి, వారిణి అనుచోట, అచ్చ ఘేః సూ. చే, ఔత్వము, ప్రియక్రోష్టూని అనుచోట తృజ్వత్ (7-1-95) సూ. చే, తృజ్వద్భావము, వారిణే, అనుచోట ఘేర్ఙితి సూ. చే, గుణము ఇవి పరములగుటచే నుమాగమమును బాధించి ప్రాప్తములగుచున్నవి. ఈ వార్తికముచే పూర్వోక్తస్థలములందు వృద్ధ్యాదులను బాధించు నుమాగమమే వచ్చును. కావున వారి + ఙే అనుచోట గుణమును బాధించి నుమాగమమగును. వారిణే. వారి + ఆమ్. ఇచట నఙ్గమునకు ప్రాప్తమగు నుమాగమమును బాధించి "నుమచిర" అనువార్తికముచే ప్రత్యయమునకు నుడాగమమగును. వారి + నామ్. నామి (210) సూ. చే, దీర్ఘమగును. వారీణామ్. హలాది విభక్తులు పరమగునపుడిది హరిశబ్దముతో సమానమగును.

* 322. తృతీయాదిషు భాషితపుంస్కం పుంవద్గాలవస్య 7-1-74. తృతీయాదిషు, భాషిత పుంస్కం, పుంవత్, గాలవస్య (ఇకః, నపుంసకస్య, అచి)

ప్రవృత్తినిమిత్తైక్యే భాషిత పుంస్కమిగన్తం క్లీబం పుంవద్వాస్యాట్టాదావచి। అనాదయే। అనాదినే। ఇత్యాది। శేషం వారివత్। పీలుర్వృక్షః తత్ఫలం పీలు। తస్మై పీలునే। అత్ర నపుంవత్। ప్రవృత్తి నివృత్తి భేదాత్ ॥

322. అనువృత్తములగు ఇకః, నపుంసకస్య అనునవి పూర్వ సూత్రమున షష్ఠ్యన్తములయిన నీ సూత్రమున ప్రథమాన్తములుగ మారును. "ప్రవృత్తి నిమిత్తైక్యభాషిత పుంస్కమ్" అనునది సూత్రస్థమగు "భాషిత పుంస్కమ్" అనుదానికి ఫలితార్థము. "భాషితః పుమాన్ యస్మిన్నర్థే" అను విగ్రహముచే భాషితపుంస్క శబ్దము ప్రవృత్తి నిమిత్తమను నర్థమును బోధించును. ఈ శబ్దము కంటె "భాషితపుంస్క మస్యాస్తి" అను నర్థమున అర్శ ఆదిభ్యోఽచ్ (5-2-127) సూ. చే, నచ్ప్రత్యయము వలన భాషితపుంస్కమని యగును. ఈ శబ్దమునకు ప్రవృత్తి నిమిత్తముగలదని యర్థము. శబ్దమే విశేషణముతో గూడినదై యర్థమును బోధించునో యా విశేషణము ప్రవృత్తి నిమిత్తమనబడును. జాతి, గుణ, క్రియా, సంజ్ఞా భేదములచే నిది నాల్గు విధములు. ఈ భేదములచే శబ్దములుగూడ నాలుగు విధములగును. ఘటపటాదులు జాతిశబ్దములు. ఇచట ఘటత్వము పటత్వమను జాతి ప్రవృత్తి నిమిత్తము. శుక్లనీలాదులు గుణశబ్దములు. ఇచట శుక్లనీలాది గుణములు ప్రవృత్తి నిమిత్తములు. ఇట్లే క్రియా శబ్దములగు పాచకాదులలోను, సంజ్ఞా శబ్దములగు దేవదత్తాదులలోను, ప్రవృత్తి నిమిత్తము నూహింపదగును. ఏ శబ్దమునకు పున్నపుంసక లిఙ్గములందు, ప్రవృత్తి నిమిత్త మొకటి యగునో యది యిచటి భాషితపుంస్క శబ్దమున కర్థము. భాషిత పుంస్కము నిగన్తమునగు నపుంసకశబ్దమునకు టా మొదలగు నజాది ప్రత్యయములు పరమగునపుడు వికల్పముగ పుంవద్భావము వచ్చునని సూత్రార్థము. నపుంసక శబ్దమునకు పుంలిఙ్గ శబ్దాతిదేశమని ఫలితార్థము. నపుంసకలిఙ్గమున విధింపబడు హ్రస్వ నుమాగమాదుల నివృత్తి యతిదేశ ఫలమగును. అనాదయే అనాదినే, ఇత్యాదు లుదాహరణములు. అనాది (నవిద్యతే ఆదిర్యస్యతత్) (సః) శబ్దమునకు పుంనపుంసక లిఙ్గములం దుత్పత్త్యభావము (గుణము) ప్రవృత్తి నిమిత్త మొకటియే. పుంవద్భావపక్షమం దిది హరిశబ్దసదృశమగును. తదభావమందు వారిశబ్దసదృశము. భాషితపుంస్క శబ్దమునకు పూర్వోక్తార్థమును విడిచి "భాషితః పుమాన్ యేనశబ్దేన" అను విగ్రహము నాశ్రయించి పున్నపుంసకములుగల శబ్దముమాత్ర మర్థమనినచో 'పీలునే' ఇత్యాదులందును పుంవద్భావము ప్రసక్తమగును. పీలు శబ్దము వృక్షమును బోధించునపుడు పుంలిఙ్గము, తత్ఫలమును బోధించునపుడు నపుంసకమునగును. "ప్రవృత్తి నిమిత్తైక్యే" అను నర్థము చెప్పినపు డిచట దోషము వారింపబడును. పుంలిఙ్గ పీలుశబ్దమునకు ప్రవృత్తి నిమిత్తము వృక్షత్వవ్యాప్యజాతి, నపుంసక పీలుశబ్దమునకు ప్రవృత్తి నిమిత్తము ఫలత్వవ్యాప్యజాతి. ప్రవృత్తినిమిత్త మొకటి గానందున నిచట పుంవద్భావము వారింపబడును.

* 323. అస్థిదధిసక్థ్యక్ష్ణామనఙుదాత్తః 7-1-75. అస్థి...... క్ష్ణామ్, అనఙ్, ఉదాత్తః (తృతీయాదిషు అచి)

ఏషామనఙ్ స్యాట్టాదావచి స చోదాత్తః। అల్లోపోऽనః. దధ్నా। దధ్నే। దధ్నః। దధ్నోః। దధ్ని। దధని। శేషం వారివత్। ఏవమస్థిసక్థ్యక్షీణి। తదన్తస్యాప్యయమనఙ్। అతిదధ్నా. సుధి। సుధినీ। సుధీని। హే సుధే। హే సుధి। సుధియా। సుధినా। ప్రధ్యా. ప్రధినా। మధు। మధునీ। మధూని। హే మధో। హే మధు। ఏవమమ్బ్వాదయః। సానుశబ్దస్య స్నుర్వా। స్నూని। సానూని। ప్రియక్రోష్టు। ప్రియక్రోష్టునీ। తృజ్వద్భావాత్పూర్వవిప్రతిషేధేన నుమ్। ప్రియక్రోష్టూని। టాదౌ పుంవత్త్వపక్షే ప్రియక్రోష్ట్రా। ప్రియక్రోష్టునా। ప్రియక్రోష్ట్రే। ప్రియక్రోష్టవే। అన్యత్ర తృజ్వద్భావాత్పూర్వవిప్రతిషేధేన నుమేవ। ప్రియక్రోష్టునా। ప్రియక్రోష్టునే। నుమచిరేతి నుట్। ప్రియక్రోష్టూనామ్। సులు। సులునీ। సులూని। పునస్తద్వత్। సుల్వా। సులునా। ధాతృ। ధాతృణీ। ధాతౄణి। హే ధాతః। హే ధాతృ। ధాత్రా। ధాతృణా। ఏవం జ్ఞాతృకర్త్రాదయః॥

323. అస్థిదధిసక్థ్యక్షి శబ్దములకు టా ప్రత్యయము మొదలగు నజాది ప్రత్యయములు పరమగునపు డుదాత్తస్వరముగల అనఙాదేశమగును. దధ్నా, దధ్నే, దధ్నః, ఇత్యాదులం దీ సూత్రముచే అనఙాదేశము, "అల్లోపోऽనః" 235 సూ. చే, అకారలోపము నగును. దధి + ఙి, దధన్ + ఙి, విభాషా ఙిశ్యోః 238 సూ. చే, వికల్పముగ అకారలోపమగును. దధ్ని, దధని. శేషము వారిశబ్దసదృశము. అస్థి సక్థ్యక్షిశబ్దముల ప్రక్రియ నిట్లే యూహింపదగును. ఈ సూత్ర మఙ్గాధికారములోనిదగుటచే అస్థ్యాదిశబ్దము లన్తమందుగలవానికి ననఙాదేశమగును. అతిదధ్నా। సుధి (సుధీ + సు) నపుంసక హ్రస్వ సులోపములు. హే సుధే, హే సుధి. "నలుమతాఙ్గస్య" అనున దనిత్యమనుటచే నీ రూపద్వయము సిద్ధించెను. సుధి + టా. సుధీశబ్దమునకు పున్నపుంసక లిఙ్గములందు శోభనజ్ఞానమను ప్రవృత్తినిమిత్త మొకటి యగుటచే పుంవద్భావము ప్రవర్తించును. పుంవద్భావ పక్షమందు నుమాగమము రాదు, గాన అచిశ్ను (272) సూ. చే, నియఙాదేశమగును. సుధియా। సుధినా। పుంవద్భావము లేనపుడు నుమాగమము. ప్రధి (ప్రధీ + సు) హ్రస్వ సులోపములు ప్రధ్యా, ప్రధినా. ప్రధి శబ్దమునకును పుంనపుంసకములందు ప్రకృష్టజ్ఞానమనెడి ప్రవృత్తినిమిత్త మొకటియే గావున పుంవద్భావము వచ్చును. పుంవద్భావపక్షమందు

"ఏరనేకాచః" (273) సూ. చే, యణాదేశము. ప్రధ్యా. తదభావమందు నుమాగమము. ప్రధినా. శేషము సుధీ శబ్దసదృశము. మధు (మధు + సు) మధు శబ్దమునకు పుంలిఙ్గమున ప్రవృత్తి నిమిత్తము వసన్తత్వము. (మధుర్వసన్తే ఇత్యాది కోశమువలన) నపుంసకమున ప్రవృత్తి నిమిత్తము మద్యత్వము. (మధు మద్యే అను కోశమువలన) కాన ప్రవృత్తి నిమిత్తభేద ముండుటచే నిది భాషిత పుంస్కము గానందున పుంవద్భావము ప్రవర్తింపదు. మధునా అని యగును. అమ్బు మొదలగు శబ్దములు మధు శబ్దసదృశములు. సాను శబ్దమునకు "మాంస పృతనాసానూనాం మాంస్ పృత్స్నవో వాచ్యాః" అను వార్తికముచే శసాదులు పరమగునపుడు స్ను ఆదేశము వికల్పముగ నగును. (స్ను + శస్) నుమాగమోపధా దీర్ఘములచే 'స్నూని' అని యగును. ఆదేశాభావ పక్షమందు సానూని మొదలగునవి, మధు శబ్దమునవలె నగును. ప్రియక్రోష్టు (ప్రియః క్రోష్టా యస్య తత్) ప్రియక్రోష్టు + శి అగియుండ, శి ప్రత్యయము సర్వనామస్థాన మగుటచే తృజ్వత్క్రోష్టుః (275) సూ. చే, తృజ్వద్భావము పరమగుటచే నుమాగమమును బాధించి ప్రాప్తమగుచుండ "వృద్ధ్యౌత్వ.....విప్రతిషేధేన" అను వార్తికముచే తృజ్వద్భావమును బాధించి నుమాగమమే వచ్చును. ప్రియక్రోష్టూని। ప్రియక్రోష్టు శబ్దమునకు పున్నపుంసకములందు ప్రియక్రోష్టుత్వము ప్రవృత్తి నిమిత్తమొకటియే యైనందున నిది భాషిత పుంస్కమగును గాన టా మొదలగు నజాది ప్రత్యయములు పరమగునపుడు పుంవద్భావము వచ్చును. కనుక పుంవద్భావమందు తృజ్వద్భావము వచ్చునపుడు ప్రియక్రోష్ట్రా అని యగును. తృజ్వద్భావమురాని పక్షమందు, పుంవద్భావమురాని పక్షమందును, నాభావ నుమాగమములవలన ప్రియక్రోష్టునా అనునొక రూపమగును. ప్రియక్రోష్టు + ఙే. పుంవద్భావము వచ్చునపుడు తృజ్వద్భావ పక్షమందు ప్రియక్రోష్ట్రే. తృజ్వద్భావము రానపుడు ప్రియక్రోష్టవే. పుంవద్భావాఽభావ పక్షమందు పూర్వవిప్రతిషేధవార్తికముచే తృజ్వద్భావమును బాధించి నుమాగమము వచ్చును. ప్రియక్రోష్టునే. ఇట్లే ఙసి మొదలగు నజాది ప్రత్యయములు పరమగునపుడు పుంవత్త్వపక్షమందు రూపద్వయమును, తదభావపక్షమం దేకరూపము నూహింపదగును. ప్రియక్రోష్టు + ఆమ్. పుంవత్త్వ పక్షమందు తృజ్వద్భావమును, పుంవత్త్వాభావ పక్షమందు నుమాగమమును, బాధించి "నుమచిర" అను పూర్వవిప్రతిషేధ వార్తికముచే నుడాగమమగును. కాన ప్రియక్రోష్టూనామ్ అని యగును. భ్యామ్ మొదలగు హలాదివిభక్తులం దిది మధు శబ్దసదృశము. సులు (సులు + సు) సులునీ. సులూని. ద్వితీయా విభక్తి, ప్రథమా విభక్తి సదృశము. సులు శబ్దము పునపుంసములందు శోభనలవలన కర్తృత్వము (బాగుగ కోయుట) అనెడి ప్రవృత్తి నిమిత్తమొకటి యగుటవలన భాషిత పుంస్కమగును. పుంవద్భావ పక్షమందు సుల్వా (సులూ + ఆ) పక్షాన్తరమందు సులునా ఇత్యాదులగును. హేధాతః "నలుమతాఙ్గస్య" అను నిషేధ మనిత్యమను పక్షమందు సమ్బుద్ధి గుణమగును. పక్షాన్తరమందు గుణమురాదు గాన హేధాతృ అని

యగును. ధాతృశబ్దమునకు పుంనపుంసక లింగములలో ధారణ కర్తృత్వమనెడి ప్రవృత్తి నిమిత్తమొకటియే యగుటచే నిది భాషితపుంస్కమగును. పుంవత్త్వ పక్షమందు ధాత్రా, పక్షాన్తరమందు ధాతృణా, ఇత్యాదులగును. ఇట్లే జ్ఞాతృ, కర్తృ మొదలగు శబ్దముల ప్రక్రియ నూహించునది.

* 324. ఏచ ఇగ్ఘ్రస్వాదేశే 1-1-43. ఏచః ఇక్, హ్రస్వాదేశే

ఆదిశ్యమానేషు హ్రస్వేషు మధ్యే ఏచ ఇగేవ స్యాత్। ప్రద్యు। ప్రద్యునీ। ప్రద్యూని। ప్రద్యునే త్యాది। ఇహ నపుంవత్। యద్యన్తం ప్రద్యు ఇతి, తస్య భాషిత పుంస్కత్వాభావాత్. ఏవమ గేపి। ప్రరి. ప్రరిణీ। ప్రరీణి. ప్రరిణా। ఇత్యాది। ఏకదేశ వికృతస్యా నన్యత్వాత్, రాయోహలీత్యాత్వమ్। ప్రరాభ్యామ్। ప్రరాభిః। నుమచిరేతినుట్యాత్వే ప్రరాణామితి మాధవః। వస్తుతస్తు సన్నిపాత పరిభాషయా నుట్యాత్వమ్ న। నామితిదీర్ఘస్త్వారమ్భసామర్థ్యాత్పరిభాషా బాధ్యత ఇత్యుక్తమ్। ప్రరీణామ్। సును। సునునీ। సునూని। సునునా। సునునే. ఇత్యాది। ఇత్యజన్తానపుంసకలిఙ్గాః॥

324. సూత్రమున నాదేశశబ్దము ఆఙ్ పూర్వక దిశధాతు ప్రకృతిక కర్మ ఘఞన్తము. (ఆదిశ్యత ఇతి) దీనికి హ్రస్వశబ్దముతో కర్మధారయ సమాసము. (హ్రస్వశ్చాసావాదేశః) హ్రస్వాదేశే అనునది నిర్ధారణ సప్తమ్యన్తము. జాత్యేకవచనము. ఇట్లు సిద్ధమగునదే ఆదిశ్యమానేషు హ్రస్వేషు మధ్యే అను నర్థము. తత్తత్సూత్రములచే విధీయమానములగు హ్రస్వములలో ఏచ్చులకు ఇక్కులే వచ్చునని సూత్రార్థము. సాదృశ్యము వలన ఏ, ఐ, ల కికారము ఓ, ఔ, ల కుకారము వచ్చును. ఏచ్చులు సంధ్యక్షరములు అనగా రెండచ్చుల సంధివలన సిద్ధములయినవి. ఏ, ఐ, లలో పూర్వభాగమవర్ణ సదృశము, ఉత్తర భాగ మికార సదృశము. ఓ, ఔ లలో పూర్వభాగమవర్ణ సమానము, ఉత్తర భాగమువర్ణ సమానము. వీనిస్థానమున విధింపబడిన హ్రస్వము ఏచ్చులలోనున్న రెండువర్ణములకు సదృశమయినదొకటి లేనందున పర్యాయముగ ఏ ఐ ల కకారేకారములును, ఓ ఔ ల కకారోకారములును ప్రాప్తములగుచుండ, ఏ ఐ ల కికారమే, ఓ ఔ ల కుకారమే యగుననురీతి నీ సూత్రము నియామకమగును. ప్రద్యోశబ్దమునకు పుం నపుంసకములందు ప్రకృష్ట స్వర్గవత్త్వము, ప్రవృత్తి నిమిత్తము సమానమగుటచేత భాషిత పుంస్కమగుటచే దీనికి పుంవద్భావము ప్రాప్తమగుచున్నది. కాని ప్రద్యోశబ్దము పుంలిఙ్గమున ఓకారాన్తము, నపుంసక లిఙ్గమున హ్రస్వమువలన నుకారాన్తమగుచున్నది. నపుంసకమగు ప్రద్యుశబ్దము భాషితపుంస్కము గానందున పుంవద్భావము రాదు. ఇట్లే, ప్రరి, (ప్రరై పుంలిఙ్గము) సును, (సునౌ పుం) శబ్దములకును పుంవద్భావము రాదు. ప్రద్యోశబ్ద

మున కీ సూత్రముచే నుకారమే హ్రస్వమగును. ప్రద్యు (ప్రద్యో + సు) ప్రరై శబ్దమునకు నపుంసకలిఙ్గమం దికారమే హ్రస్వమగును. ప్రరి (ప్రరై + స్) ప్రరాభ్యామ్. ఇచట ఏకదేశవికృత న్యాయమువలన "రాయోహలి" 287 సూ. చే, నాత్వమగును. ప్రరాభిః మొదలగు రూపము లిట్లే అని యనదగును. ప్రరి + ఆమ్ ఇచట 'నుమచిర' అనువార్తికముచే నుమాగమమును బాధించి నుడాగమమగును. ప్రరి + నామ్, రాయోహలి అను సూత్రముచే నాత్వము. 'ప్రరాణామ్' అని యగునని మాధవుని మతము. సన్నిపాత పరిభాషచే (హ్రస్వ నిమిత్తకమగు నుడాగమము హ్రస్వ విఘాతకమగు నాత్వమును గుఱించి నిమిత్తముగాదు) నుడాగమము ప్రవర్తించినపిదప నాత్వము ప్రవర్తింపదు. నామి అను సూ. చే, విహితమగు దీర్ఘమారంభ సామర్థ్యమువలన సన్నిపాత పరిభాషను బాధించునని యీవరలో చెప్పబడినది. కావున ప్రరీణామ్ అని యగునని గ్రంథకారుని యాశయము. నును (శోభనానౌర్యస్యేతి) నపుంసక హ్రస్వసులోపములు. 'ఇకోచి విభక్తౌ' (321) సూ. చే, నుమాగమము ప్రవర్తించిన సునునీ మొదలగు రూపము లగునని గ్రహించునది.

అజన్త నపుంసకలిఙ్గ ప్రకరణము సమాప్తినొందెను.

శ్రీః, శ్రీః, శ్రీః.

---

## 10. హలన్త పుంలిఙ్గ ప్రకరణము

* 325. హో ఢః 8-2-31. హః। ఢః। (ఝలి। పదస్య। అన్తే)

హస్య ఢః స్యాజ్ఝలి పదాన్తే చ। హల్ఙ్యాబితి సులోపః। పదాన్తత్వాద్ధస్య ఢః। జశ్త్వచర్త్వే। లిట్। లిడ్। లిహౌ। లిహః। లిహమ్। లిహౌ। లిహః। లిహా। లిడ్భ్యామ్। లిట్త్సు। లిట్సు॥

325. ఝల్వర్ణము పరమందుగల హకారమునకు, పదముయొక్క తుది నున్న హకారమునకును, ఢకార మాదేశమగును. వర్ణసమామ్నాయములోని హల్లుల క్రమము ననుసరించి హలన్తశబ్దముల ప్రక్రియ జూపబడినది. లిహ్ శబ్దమాస్వాదనార్థక లిహ్ ధాతువు ప్రకృతిగాగల క్విప్ ప్రత్యయాన్తము. ఆస్వాదించువాడని యర్థము. లిహ్ + సు. హల్ఙ్యాప్ (253) సూ. చే, సులోపము. లిహ్ హకారము పదాన్తమగుటచే ఢత్వమగును. లిఢ్. జశ్త్వము (ఝలాం జశోఽన్తే) లిడ్. వావసానే (207) సూ. చే, వికల్పముగ చర్త్వమగును. లిట్, లిడ్, లిహౌ (లిహ్ + ఔ) లిహ్ + భ్యామ్, ఇచట ఝల్పరకమగుటవలన హకారమునకు ఢత్వము. లిఢ్ + భ్యామ్. లిఢ్ అనునది "స్వాదిష్వసర్వనామస్థానే" (231) సూ. చే, పదసంజ్ఞకమగుటవలన, "ఝలాంజశః"

(85) సూ. చే, జశ్త్వము. లిడ్భ్యామ్. లిహ్ + సు, ఢత్వము. జశ్త్వము. లిడ్ + సు 'ఖరిచ, (122) సూ. చే, విహితమగు చర్త్వ మసిద్ధమగుటవలన 'డస్సిధుట్' (132) సూ. చే, ధుడాగమము. లిడ్ ధ్ సు. పిమ్మట 'ఖరిచ' (122) సూ. చే, డకారధకారములకు చర్త్వము. లిట్త్సు, ధుడాగమమునకు వచ్చిన చర్త్వ మసిద్ధమగుటవలన, 'చయోద్వితీయా' అనువార్తికముచే ద్వితీయ వర్ణాదేశము రాదు. 'నపదాన్తాట్టోః (115) అను సూ. చే, ష్టుత్వము నిషిద్ధ మగును. ధుడాగమాభావ పక్షమందు, లిట్సు అని యగును.

* 326. దాదేర్ధాతోర్ఘః. 8_2_32. దాదేః। ధాతోః। ఘః।
(హః। ఝలి। పదస్య। అన్తే)

ఉపదేశే దాదేర్ధాతోర్హస్య ఘః స్యాజ్ఝలి పదాన్తే చ। ఉపదేశే కిమ్? అధోగిత్యత్ర యథా స్యాత్। దామలిహమాత్మన ఇచ్ఛతి దామలిహ్యతి। తతః క్విప్। దామలిట్। అత్ర మా భూత్॥

326. సూత్రమున ధాతుపదము నావృత్తిచేసి యందొకదానికి లక్షణచే నుపదేశకాలమందని యర్థము చెప్పవలయును. 'ఉపదేశే' అనునది యిట్లు సిద్ధమయినదే. పాణిని రచించిన ధాతు పాఠమున దకారాది యగు ధాతువున కవయవమై ఝల్పరకముగాని, పదాన్తముగాని యగు హకారమునకు ఘకారమాదేశమగును. పూర్వ సూత్రముచే విహితమగు ఢత్వమున కిది యపవాదము. దుఘ (దుహ్) ఉపదేశే కిమ్? ఆవృత్తిఫలమేమని యీ ప్రశ్న కాశయము. అవ్యాప్త్యతివ్యాప్తులను లక్షణ దోషముల పరిహారము ఫలమని యుత్తరాశయము. లక్ష్యములలో గొన్నిటియందు లక్షణముయొక్క యప్రవృత్తియవ్యాప్తి యనంబడును. అలక్ష్యములందు లక్షణప్రవృత్తి యతివ్యాప్తి యగును. ఈ దోషములతో గూడిన లక్షణము దుష్టమై యప్రమాణమగును. 'అధోక్' అనుచోట నీ ఘత్వప్రవృత్తి యిష్టము. అధోక్ అనునది దుహ్ (ప్రపూరణే) ధాతువునకు లఙ్ ప్రథమైక వచనము. ధాతువునకు పూర్వ మడాగమ ప్రవృత్తిచే, అదోహ్ అని యగును. ఇపుడు ఘత్వము రావలయును. దుహ ధాతు వుపదేశమందు దకారాదియైనను, ఘత్వప్రవృత్తి సమయమున నడాగమము ప్రవృత్తమగుటచే, యదాగమ న్యాయమువలన, (యదాగమాస్తద్గుణీ భూతాస్తద్గ్రహణేన గృహ్యన్తే, దేని నుద్దేశించి యాగమములు విధింపబడునో దానిధర్మము లాయాగమవిశిష్టమందతిదేశింపబడును) అకార విశిష్టమే ధాతువగుటవలన ధాతు వకారాదియగును, గాని దకారాది గానందున ఘత్వము రాకపోవును. ధాతూపదేశమందు దకారాదియగు ధాతువు గావలయునని చెప్పినచో, ఘత్వము సిద్ధమగును. వక్ష్యమాణ కార్యజాతము (భష్భావాదికము) చే, అధోక్, అను విష్టరూపము సిద్ధమగుటవలన నవ్యాప్తి పరిహరింపబడును.

దామలిట్ అనుచోట ఘత్వమనిష్టము. దామలిహ్, (దామలేఢి = పుష్పమాల నాస్వాదించువాడు) శబ్దముకంటె నిచ్ఛార్థక క్యచ్ప్రత్యయము చేసిన క్యజన్తము ధాతువగుటచే, 'దామలిహ్యతి' అని యగును. దామలిహ్య అను ధాతువుకంటె క్విప్ ప్రత్యయము చేసినయెడల 'దామలిహ్' అను ప్రాతిపదిక మేర్పడును. ఇపుడిది దకారాది ధాతువగుటవలన ఘత్వము ప్రసక్తమగుచున్నది. సుధాతువగుటచే ధాతుపాఠమున దీనికి పాఠములేదు. ధాతూపదేశకాలమున దకారాది గానందున నతివ్యాప్తిరూప దోషము లక్షణమున నివృత్తమగును.

*327. ఏకాచో బశో భష్ ఝషన్తస్య స్ధ్వోః. 8-2-37 ఏకాచః। బశః। భష్। ఝషన్తస్య। స్ధ్వోః (ధాతోః। పదస్య। అన్తే)

ధాతోరవయవో య ఏకాచ్ ఝషన్తస్తదవయవస్య బశః స్థానే భష్ స్యాత్సకారే ధ్వశబ్దే పదాన్తే చ। ఏకాచో ధాతోరితి సామానాధికరణ్యేనాన్వయేతు ఇహ న స్యాత్। గర్దభమాచష్టే గర్దభయతి। తతః క్విప్। ణిలోపః। గర్దప్। ఝలీతి నివృత్తం। స్ధ్వోర్గ్రహణసామర్థ్యాత్। తేనేహ న। దుగ్ధమ్। దోగ్ధా। వ్యపదేశివద్భావేన ధాత్వవయవత్వాద్భష్భావః। జశ్త్వచర్త్వే। ధుక్। ధుగ్। దుహౌ। దుహః। ఘత్వచర్త్వే। ధుక్షు॥

327. ధాతువున కవయవమై ఝష్ (ఝ, భ, ఘ, ఢ, ధ) ప్రత్యాహార వర్ణమన్తమందు గలిగిన యేకాచ్కమున కవయవమయిన బశ్ (బ, గ, డ, ద) వర్ణముయొక్క స్థానమున నా యేకాచ్చునకు సకారముగాని, ధ్వశబ్దము (లిఙ్లలో నాత్మనేపద మధ్యమ బహువచనము) గాని పరమగునపుడును, పదాన్తమందును, భష్ వర్ణములు క్రమముగ నాదేశములగును. ఏకాచః, అనునది బహువ్రీహి. (ఏకః, అచ్ యస్య.) ఏకాచః, ధాతోః, అను పదముల యర్థముల కభేదసంబంధముచే నన్వయము చేయుటచే నిట్టి యర్థము లభించినది. ఈ యన్వయమున ధాతోః అనునది అవయవషష్ఠ్యన్తము. సంభవతి సామానాధికరణ్యేనాన్వయే వ్యధికరణ్యేనాన్వయోఽన్యాయ్యః పదార్థముల కభేద సంబంధముచే నన్వయము చేయుటకు వీలైనపుడు భేదసంబంధముచే నన్వయము చేయుట యుచితముగాదు. ప్రకృతమున, ఏకాచ్చయిన ధాతువని యభేద సంబంధముచే నన్వయము సంభవించుచుండ, ధాత్వవయవమగు నేకాచ్చను గురుభూతమగు భేదసంబంధము (అవయవావయవిభావము) చే నన్వయము చేయుట యనుచితమగును, ఈ న్యాయానుసార మేకాచ్కమయిన ధాతువున

కవయవమగు బశ్శులకని యర్థము చేసినచో 'గర్ధప్' అనుచోట భష్భావము రాకపోవును. గర్దభమాచష్టే (గాడిదనుగురించి చెప్పుచున్నాడు) అనునర్థమున గర్దభ అను ప్రాతిపదికముకంటె ణిచ్ప్రత్యయము. 'గర్దభి' అనునది ధాతువగును. పిమ్మట క్విప్పు, ణిలోప క్విబ్లోపములు. క్విబన్తమగుటవలన 'గర్దభ్' అనునది ప్రాతిపదికమగును. క్విబన్తమగుటచే ధాతువునగును. గర్దభ్ + స్ ఇచట సులోపము, భష్ భావము, చర్త్వము, ప్రవర్తించినయెడల 'గర్ధప్' అనునట్టి యిష్టరూపము సిద్ధమగును. ఒక యచ్చుగల ధాతువని యర్థముచేసినపుడు 'గర్దభ్' అను ధాతువేకాచ్కము గానందున భష్ భావము సిద్ధింపక పోవును. కావున నిచట లక్ష్యానుసారముగ వైయధికరణ్యాన్వయమునే స్వీకరించి ధాత్వవయవమైన యేకాచ్చని చెప్పినచో గర్దభ్ ధాతువుయొక్క యవయవము 'దభ్' అనునది యేకాచ్చు గాన నిష్టసిద్ధి సంభవించును. సూత్రమున స్థ్వోఃఅని సకార ధ్వశబ్దములను నిమిత్తముగ గ్రహించుటవలన 'ఝలి' అను పదమునకిచట ననువృత్తిలేదు. అనువృత్తి యున్నదనిన సకార ధకారములు ఝల్లులే గాన సకార ధ్వశబ్దములు పఠమగునపుడును భష్ భావము సిద్ధమగుచుండ 'స్థ్వోః' అనునది సూత్రమున వ్యర్థము గావలయును. ఝల్పదానువృత్తి లేనందున 'దుగ్ధమ్' (దుహ్ + త, దుఘ్ + త) దోగ్ధా (దుహ్ + తా (తృచ్) దోహ్ + తా, దోఘ్ + తా) అను చోటులం దనిష్టమగు భష్ భావము నివృత్తమగును. ధుక్ (ధుహ్ + సు, ధుఘ్) పితుకువాడను నర్థమున దుహ్ ధాతువుకంటె కర్త్రర్థమందు క్విప్ ప్రత్యయము. ఇచట భష్భావమిష్టము. 'దుఘ్' అను నేకాచ్చు ధాతువే (క్విబన్తము ధాతువగుటవలన) అయినదిగాని ధాత్వవయవము గానందున భష్భావము రాకున్నది. కాని 'వ్యపదేశివదేకస్మిన్' అను పరిభాషచే ధాతువుయందు ధాత్వవయవత్వమతి దేశించుటవలన 'దుఘ్' అనునది ధాత్వవయవమగును. కాన భష్ భావము సిద్ధమగును. పరిభాషార్థము—వ్యపదేశివత్ = వ్యపదేశినా తుల్యమ్ (వ్యపదేశితో సమానముగ) వ్యపదేశియన నిమిత్తములుండుటవలన ముఖ్య వ్యవహారముగలది. దీనితో సమానముగా కార్యములు, ఏకస్మిన్ = అసహాయమందును (ముఖ్య వ్యవహారమునకు గావలసిన నిమిత్తములు లేనందున నతిదేశించుట కిష్టమైన ధర్మముతో శూన్యమైనదాని యందు) ప్రవర్తించును. లోకమున నొకరికి మువ్వురు కుమారు లున్నపుడు, మొదటివానికి జ్యేష్ఠుడనియు, రెండవవానికి మధ్యముడనియు, మూడవవానికి కనిష్ఠుడనియును, ముఖ్య వ్యవహారముండును. కుమారు డొకడే యున్నపుడు (అసహాయమందు) వీనినే జ్యేష్ఠుడని మధ్యముడని కనిష్ఠుడనియును వ్యవహరింతురు. ఇట్లే గర్దభ్ (సముదాయము) ధాతువయినచోటున 'దభ్' అనునది ధాత్వవయవమగును. ఇచట ముఖ్య వ్యవహారమే యున్నది. ప్రకృతమున దుఘ్ అనుచోట ధాతువుకంటె వేరయిన తదవయవము లేనందున ధాతువేధాత్వవ

యవము నగును. ధాతువుయందే, తదవయవనిమిత్తక కార్యములు ప్రవర్తించునని యాశయము. 'దుఘ్' అనుచోట జశ్త్వచర్త్వము లసిద్ధములగుటచే మొదట భష్ భావము, 'ధుఘ్'. పిమ్మట జశ్త్వము, ధుగ్. అటుపిమ్మట వావసానే (207) సూ. చే, వికల్పముగ చర్త్వము. ధుక్, ధుగ్, ధుగ్భ్యామ్, ధుగ్భిః భ్యామాదులందు ప్రకృతి, పదసంజ్ఞకమగుటచే భష్భావజశ్త్వములు ప్రవర్తించును. దుఘ్ + సు, ధుఘ్ + సు. ఇచట చర్త్వ మసిద్ధమగుటవలన పూర్వము షత్వము, పిమ్మట చర్త్వము. ధుక్ + షు, (కషలను కలిపి యుచ్చరించునపుడు, క్ష అని యగును.) ధుక్షు.

* 328. వా ద్రుహ ముహ ష్ణుహ ష్ణిహామ్. 8-2-33. వా। ద్రుహముహష్ణుహష్ణిహామ్. (ఘః। ఝలి। పదస్య। అన్తే)

ఏషాం హస్య వా ఘః స్యాజ్ఝలి పదాన్తే చ। పక్షే ఢః। ధ్రుక్। ధ్రుగ్। ధ్రుట్। ధ్రుడ్। ద్రుహౌ। ద్రుహః। ధ్రుగ్భ్యామ్। ధ్రుడ్భ్యామ్। ధ్రుక్షు। ధ్రుట్త్సు। ధ్రుట్సు। ఏవం; ముహష్ణుహష్ణిహామ్। విశ్వవాట్। విశ్వవాడ్। విశ్వవాహౌ। విశ్వవాహః। విశ్వవాహం। విశ్వవాహౌ ॥

328. ద్రుహ (జిఘాంసాయామ్) ముహ (వైచిత్త్యే) ష్ణుహ (ఉద్గిరణే) ష్ణిహ (ప్రీతౌ) ఈ ధాతువులయొక్క (క్విబన్తములు) హకారమునకు ఝల్లు పరమగునపుడును, పదాన్తమందును, ఘకారాదేశము వికల్పముగ నగును. ద్రుహ ధాతువు దకారాది యగుటవలన 'దాదేః' (326) సూ. చే, నిత్యముగ ఘత్వము ప్రాప్తమగుచుండ, మిగిలినవాని కప్రాప్తమగుచుండ నీ సూత్రము వికల్పముగ ఘత్వమును చెప్పుటవలన నిది యుభయత్రవిభాష యగును. ద్రుహ్ + స్, ఇచట సులోప, ఘత్వ, భష్భావ. జశ్త్వ, చర్త్వములు. ధ్రుక్, ధ్రుగ్. ఘత్వాభావమందు, హోఢః (325) సూ, చే, ఢత్వము. ధ్రుట్, ధ్రుడ్. ద్రుహ్ + భ్యామ్, ఘత్వ, భష్భావ, జశ్త్వ, చర్త్వములు. ధ్రుగ్భ్యామ్. ఘత్వమురాని పక్షమందు ఢత్వము. ధ్రుడ్భ్యామ్, ధ్రుక్షు. ధుక్షు, అను రూపమునకువలె నిచట కార్యముల నూహించునది. ఢత్వ పక్షమందు లిహ్శబ్ద సప్తమీ బహువచనమునకువలె ప్రక్రియ నూహింపదగును. ఇట్లే ముహ్, ష్ణుహ్, ష్ణిహ్ శబ్దముల యొక్క ప్రక్రియ (భష్భావమును విడిచి) నూహింపవలయును.

* 329. ఇగ్యణః సంప్రసారణమ్. 1-1-45. ఇక్। యణః, సంప్రసారణమ్ ॥

యణః స్థానే ప్రయుజ్యమానో య ఇక్ స సంప్రసారణసంజ్ఞః స్యాత్ ॥

329. యణ్ణుల (య వ ర ల) స్థానమున ప్రయుక్తములగు నిక్కులు (ఇ, ఉ, ఋ, ఌ) సంప్రసారణసంజ్ఞ గలవగును.

వివ:—వసోః సంప్రసారణమ్ (433) వచిస్వపి యజాదీనాం కితి (6-1-15) ఇత్యాదులు సంప్రసారణ విధాయకములు. ఇవి సంప్రసారణ శబ్దము చేతనే యణ్ణుల కిక్కులను విధించును. యణ్ణుల స్థానమందు విధింపబడు నిక్కులకీ సూత్రముచే సంప్రసారణసంజ్ఞ విధింపబడును. సంప్రసారణ శబ్దముచే నిక్కులను విధించునవి విధి సూత్రములు. ఇట్లు విధి సూత్రములం దన్యోన్యాశ్రయ దోషము ప్రసక్తమగుచున్నది. సూత్రశాటక (అస్య సూత్రస్య శాటకం వయ) న్యాయముచే నీ దోషమును వారింపవలయును. లోకమున నీ నూలుతో నేయుమని నేతగానితో చెప్పుదురు. నేత పూర్తిఅయిన పిమ్మటగాని వస్త్రమను వ్యవహారము గలుగదు. వస్త్రమును నేయుమని చెప్పనవసరములేదు. కావున నీ నూలుతో నేసినపిదప దేనికి వస్త్రమను వ్యవహారము వచ్చునో దానిని నేయుమని యర్థము చెప్పుటవలన లోకమున నన్యోన్యాశ్రయ దోషము వారింపబడుచున్నది. ఇట్లే యణ్ణుల స్థానమందు ప్రయుక్తములగు నేయిక్కులకు సంప్రసారణసంజ్ఞ వచ్చునో యట్టి యిక్కులు వచ్చునని విధిసూత్రముల కర్థము జెప్పి యన్యోన్యాశ్రయ దోషమును పరిహరింపవలయును. మరియు నీ సంజ్ఞాసూత్రమందలి సంప్రసారణ పదమున కావృత్తిచేసి సంప్రసారణ శబ్దముచే జాతములయిన యణ్ స్థానికములగు నిక్కులకే సంప్రసారణసంజ్ఞ యగునని యర్థము చెప్పవలయును. కనుకనే ద్యుభ్యామ్ (దివ్ + భ్యామ్) అనుచోట 'దివ ఉత్' (338) సూ. చే, వకారస్థానమున విధింపబడు ఉకారమునకు సంప్రసారణసంజ్ఞ వారింపబడును. ద్యుభ్యా మనుచోట సంప్రసారణసంజ్ఞ ప్రవర్తించిన 'హలః' (6-4-2) సూ. చే, నుకారమునకు దీర్ఘము ప్రసక్తమగును.

* 330. వాహ ఊఠ్. 6-4-131. వాహః। ఊఠ్। (భస్య, సంప్రసారణమ్)

భస్య వాహః సంప్రసారణమూఠ్ స్యాత్ ॥

330. భసంజ్ఞగల 'వాహ్' అనుదానికి సంప్రసారణ సంజ్ఞక మగు ఊఠ్, ఆదేశమగును.

వివ:—సంప్రసారణమ్మనునది ఊఠ్‌నకు విశేషణము. లేనిచో 'విశ్వవాహ్' ఇత్యాదులలో నూఠ్ 'అలోఽన్త్యస్య' అను పరిభాషచే హకారమునకు ప్రసక్తమగును. విశేషణ మయినపుడు హకారస్థానమున ప్రవర్తించినచో నూఠ్, సంప్రసారణ సంజ్ఞకము గానేరదు గావున నిష్టమగు వకారస్థానమందే ప్రవర్తించును.

* 331. సంప్రసారణాచ్చ. 6-1-108. సంప్రసారణాత్। చ (పూర్వరూపమ్, అచి)

సంప్రసారణాదచి పరే పూర్వరూప మేకాదేశః స్యాత్। ఏత్యేధత్యూఠ్సు। విశ్వౌహః। విశ్వౌహేత్యాది. ఛన్దస్యేవ ణ్విరితి పక్షే ణిజన్తాద్విచ్ ॥

331. సంప్రసారణమున కచ్చు పరమగునపుడు పూర్వరూప మేకాదేశమగును. విశ్వం వహతి, అను నర్థమున విశ్వశబ్దపూర్వక వహ ధాతువుకంటె ణ్వి ప్రత్యయముచేసిన 'విశ్వవాహ్' అను ప్రాతిపదిక మేర్పడును. ణ్విప్రత్యయము వైదికభాషయందే ప్రవర్తించుననుమతమున విశ్వశబ్దపూర్వక వహధాతువుకంటె ణిచ్ప్రత్యయము, ణిజన్త ధాతువుకంటె విచ్ ప్రత్యయమునుచేసిన విశ్వవాహ్, అను రూపము సిద్ధించును. విశ్వవాహ్ + స్, అనుచోట సులోప, ఢత్వ, జశ్త్వ, చర్త్వములు చేసిన విశ్వవాట్, విశ్వవాడ్, అని యగును. విశ్వవాహౌ, విశ్వవాహః, విశ్వవాహమ్, విశ్వవాహౌ, విశ్వవాహ్ + శస్, ఊఠు. విశ్వ, ఊః, అహ్ + అస్, పూర్వరూపము. విశ్వ, ఊహ్ + అస్, 'ఏత్యేధత్యూఠ్సు, (74) అను సూత్రముచే వృద్ధి. విశ్వౌహః, అని యగును. ఇట్లే భసంజ్ఞయున్న చోటులందు 'విశ్వౌహేత్యాదులగును. పదసంజ్ఞ యున్నచోటున ఢత్వ, జశ్త్వములచే 'విశ్వవాడ్భ్యామ్, ఇత్యాదులగును.

* 332. చతురనడుహోరా ముదాత్తః. 7-1-91. చతురనడుహోః, ఆమ్, ఉదాత్తః (సర్వనామస్థానే)

అనయోరామ్స్యాత్సర్వనామస్థానే. సచోదాత్తః॥

332. చతుర్, అనడుహ్, వీనికి సర్వనామస్థానము పరమగునపు డుదాత్తస్వరకమయిన ఆమాగమమగును. ఇది మిత్తగుటచే 'మిదచోన్త్యాత్', అను పరిభాషవలన నన్త్యాచ్చునకు పరమై వచ్చును.

* 333. సావనడుహః. 7-1-82. సౌ। అనడుహః। (నుమ్)

అస్య నుమ్ స్యాత్సౌ పరే, ఆదిత్యధికారాదవర్ణాత్పరోఽయం నుమ్। అతో విశేష విహితేనాపి నుమా ఆమ్ న బాధ్యతే, అమా చ నుమ్ నబాధ్యతే। హల్ఙ్యాది లోపః, నుమ్విధిసామర్థ్యాద్వసుస్రంస్వితి దత్వం న। సంయోగాన్తలోపస్యాసిద్ధత్వాన్న లోపో న। అనడ్వాన్ ॥

333. అనడుహ్ శబ్దమునకు ప్రథమైక వచనము (సు) పరమగునపుడు నుమాగమమగును. ఈ సూత్రమున 'ఆత్' అను పదము ననువృత్తిచేసి 'అవర్ణముకంటె పరముగ నుమాగమము వచ్చునని యర్థము చెప్పవలయును. కావున అనడుహ్ శబ్దమునకామాగమము ప్రవర్తించినపిదపనే నుమాగమము ప్రవర్తించును. ఇట్లు వ్యాఖ్యానము చేయుటవలన, సర్వనామస్థానము పరమగునపుడు విహిత

మయిన నామాగమము (సామాన్య విహితము) సర్వనామస్థాన విశేషమగు సుప్రత్యయము పరమగునపుడు విధింపబడుటవలన విశేష విహితమయిన నుమాగమముచే బాధింపబడదు. ఇట్లే 'హే అనడ్వన్' అనుచోట సామాన్య విహితమయిన, నుమాగమము, సంబుద్ధిమాత్రము పరమగునపుడు విధింపబడినందున, విశేష విహితమగు అమాగమముచే బాధితముగాదు. అమాగమమునకు పూర్వము నుమాగమమునకు ప్రాప్తి లేకపోవుటచే, నుమాగమ ముపజీవ్యమైనది. ఉపజీవ్యోప జీవకములకు పరస్పర విరోధమనుచితమగుటయే యిట్లు చెప్పుటకు కారణము. కావున విశేష విహితమగు యా సుడాగమము, యా సుట్ పరస్మై పదేషూదాత్తోఙిచ్చ 3-4-103 సామాన్య విహితమైన (లిఙః సీయుట్ 3-4-102) సీయుడాగమమునకు బాధకమయిన ట్లీ అమాగమ నుమాగమము లకు గాని, అమాగమ నుమాగమములకుగాని బాధ్యబాధక భావములేదని యాశయము. 'అనః (శకటమ్) వహతి' అను నర్థమున అనశ్శబ్దపూర్వక వహ ధాతువుకంటె క్విబాదులు చేసినచో ననడుహ్ శబ్దము నిష్పన్నమగును. బండిని మోయునదని యర్థము. అనడుహ్ + స్, అమాగమ యణాదేశములు, అనడ్వాహ్ + స్. నుమాగమము, అనడ్వాన్ హ్ + స్, సులోపము, అనడ్వాన్ హ్, సంయోగాన్తలోపము, అనడ్వాన్ అని యగును. ఈ సూత్రముచే విధింపబడు నుమాగమము, విధాన సామర్థ్యమువలన నకారముగనే యుండును గాని వికారమును చెందదని యర్థమగును, గావున 'అనడ్వాన్' అనుచోట, నకారమునకు "వసుస్రంసు" (335) సూ. చే, దకారాదేశము ప్రవర్తించదు. సంయోగాన్త లోప మసిద్ధమగుటచే నలోపమును రాదు.

వివ:—కొన్ని పుస్తకములందు "అమా చ నుమ్ న బాధ్యతే" అను దానిస్థానమున "ఆమా చ నుమ్ న బాధ్యతే" అను పాఠమున్నది. దాని కర్థమిది. బహ్వనడ్వాంహి, కులాని (బహవోఽనడ్వాహః యేషు) బహ్వనడుహ్ + జస్, ఇచట నపుంసకస్య (315) అను సూత్ర విహితమగు నుమాగమముకంటె పరమగు "చతురనడుహోః" సూత్రముచే విధింపబడు ఆమాగమము పూర్వము ప్రవర్తించినను "పునః ప్రసఙ్గ విజ్ఞానాత్సిద్ధమ్" (పరశాస్త్ర కార్యము ప్రవర్తించినపిదప పూర్వశాస్త్రమునకు ప్రాప్తియున్నచో నదియును బ్రవర్తించును) అను న్యాయముచే నుమాగమముగూడ ప్రవర్తించును. ఆమాగమముచే నుమాగమము బాధింపబడదని.

* **334.** అమ్ సంబుద్ధౌ. 7-1-96. అమ్, సంబుద్ధౌ, (చతురనడుహోః)

చతురనడుహో రమ్ స్యాత్సంబుద్ధౌ। ఆమో ఽపవాదః హే అనడ్వన్. అనడ్వాహౌ। అనడ్వాహః॥ అనడుహః ॥

334. చతుర్, అనడుహ్, వీనికి సంబుద్ధి పరమగునపు డమాగమము వచ్చును. ఆమాగమమున కిది యపవాదము. అనడ్వాన్, అను రూపమందువలె హే అనడుహ్ + స్, అనుచోట ప్రక్రియ నూహింపదగును. హే అనడ్వన్, హే అనడ్వాహౌ, హే అనడ్వాహః, అనడ్వాహమ్, అనడ్వాహౌ, ఈ రూపములం దామాగమము మాత్రము ప్రవర్తించును. అనడుహః (అనడుహ్ + శస్) అనడుహా (అనడుహ్ + టా)

* 335. వసుస్రంసుధ్వంస్వనడుహాం దః. 8-2-72. వసు...... హామ్, దః। (సః। పదస్య। అన్తే)

సాన్తవస్వన్తస్య స్రంసాదేశ్చ దః స్యాత్పదాన్తే। అనడుద్భ్యామిత్యాది। సాన్తేతి కిమ్? విద్వాన్। పదాన్తే ఇతి కిమ్। స్రస్తమ్। ధ్వస్తమ్॥

335. 'వసు' అనునది ప్రత్యయమగుటవలన ప్రత్యయగ్రహణ పరిభాషచే తదన్తబోధకమగును. స్రంస్, ధ్వంస్, అనునవి ధాతువులు. స్రంసు, ధ్వంసు లెపుడును సకారాన్తములే యగుటచే దోషము లేకపోవుటవలనను, అనడుహ్ శబ్ద మెపుడును సకారాన్తము గానందున నసంభవమగుటచేతను అనువృత్తమగు 'సః' అనునది వస్వన్తమునకే విశేషణము. పదాన్తమున విద్యమానమగు సకారాన్త వసుప్రత్యయాన్తమునకును, స్రంసాదులకును దకార మాదేశమగును. అనడుద్భ్యామ్ (అనడుహ్ + భ్యామ్) అనడుద్భిః ఇత్యాదు లీరీతి నూహ్యంబులు. వసుప్రత్యయాన్త మెపుడును సకారాన్తమే యగుటవలన 'సాన్త' అను విశేషణ మెందులకని 'సాన్తేతికిమ్' అను ప్రశ్న కభిప్రాయము. విద్వాన్, (విద్వస్ + సు) అనియుండ అత్వసన్తస్య (428) సూ. చే, నుపధాదీర్ఘము, ఉగిదచామ్ (363) సూ. చే, నుమాగమము, సులోప సంయోగాన్త లోపములు ప్రవర్తించిన విద్వాన్ అని యగును. ఇది వసుప్రత్యయాన్తమైనను సకారాన్తము గానందున నిచట దత్వవారణమునకై ఆ విశేషణ మావశ్యకమని సమాధానాశయము. స్రస్తమ్, ధ్వస్తమ్, ఇవి స్రంసుధ్వంసు ధాతు ప్రకృతిక క్తప్రత్యయాన్తనములు: ఇచట దత్వవారణమునకై పదాన్తమున విద్యమానములగు వానికని యర్థము జెప్పవలయును.

* 336. సహేస్సాడస్సః 8-3-56, సహేః। సాడః। సః, (అపదాన్తస్య। మూర్ధన్యః)

సాడ్రూపస్య సహేస్సస్య మూర్ధన్యాదేశః స్యాత్। తురాషాట్। తురాషాడ్। తురాసాహౌ। తురాసాహః। తురాషాడ్భ్యామిత్యాది. తురం సహత ఇత్యర్థే ఛన్దసి సహః। ఇతి ణ్విః। లోకేతు సాహయతేః క్విప్। అన్యేషామపీతి పూర్వపదస్య దీర్ఘః॥

336. 'సాడః, అనునది ఢత్వఢత్వాదులుగల సహ ధాతువున కనుకరణము. సాడ్ అను రూపముగల సహధాతువుయొక్క సకారమునకు మూర్ధస్థానకమగు వర్ణమనగా షకార మాదేశమగును. తురాసాహ్ + సు, సులోపఢత్వ జశ్త్వములు, తురాసాడ్, ఈ సూత్రముచే షత్వము, వావసానే, (207) సూ. చే, చర్త్వము, తురాషాట్, తురాషాడ్. తురాసాహ్ + భ్యామ్, ఢత్వ డత్వ షత్వములు, తురాషాడ్భ్య మిత్యాదులు, తురం సహతే అను వర్థమున తురశబ్ద పూర్వక సహధాతువుకంటె, 'ఛన్దసి సహః (3-2-63) సూ. చే, ణ్విప్రత్యయము చేసినచో, వేదమున, తురాసాహ్ అను రూప మేర్పడును. తురశబ్ద పూర్వక సహధాతువుకంటె, ణిచ్ప్రత్యయము చేసినచో, 'తురాసాహి' అని యగును. ఈ ణిజన్తముకంటె క్విప్ ప్రత్యయము చేసినయెడల, తురాసాహ్, అని యగును. ఈ రెండు విధములగు రూపములయందు 'అన్యేషా మపిదృశ్యతే' (851) సూ. చే, తురశబ్దమునకు దీర్ఘమగును. (శత్రువుల వేగమును సహించువాడు, ఇన్ద్రుడు)

* 337. దివ ఔత్. 7-1-84. దివః। ఔత్। (సౌ)

దివితి ప్రాతిపదికస్య ఔత్స్యాత్సౌ పరే। అల్విధిత్వే న స్థానివత్త్వాభావాద్ధల్ఙ్యాబితి సులోపో న।
సుద్యౌః। సుదివౌ। సుదివః। సుదివమ్। సుదివౌ॥

337. ఔత్, అను నాదేశములోని తకార ముచ్చారణార్థము. సూత్రమున దివః, అనునది దివ్ శబ్దముయొక్క షష్ఠ్యేకవచనము 'నిరనుబన్ధక గ్రహణేన సానుబన్ధకస్య, (ఇత్సంజ్ఞకరహిత మయినదానిని గ్రహించునపు డిత్సంజ్ఞక వర్ణముతో గూడినదానికి గ్రహణము లేదు) అను పరిభాషచే, సూత్రములోని 'దివ్, శబ్దముచే, నిరనుబన్ధకమయిన ప్రాతిపదికమునకే గ్రహణము, గాని ఇత్సంజ్ఞ కోకారముగల 'దివు, (క్రీడాయామ్) ధాతువునకు గ్రహణములేదు. మూలమున, 'ప్రాతిపదికస్య, అనునది యీ పరిభాషవలన సిద్ధమయినదే. ప్రాతిపదికమగు 'దివ్, అనుదానికి సుప్రత్యయము పరమగునపుడు ఔకారాదేశమగునని సూత్రార్థము. (శోభనాద్యౌర్యస్య) సుదివ్ + సు. ఈ సూత్ర మఙ్గాధికారము లోనిదగుటవలన దివ్ శబ్దాంతమునకు నీ సూత్రముచే నౌకారాదేశమగును. ఔత్వము యణాదేశము, సుద్యౌస్, సకారమునకు రుత్వవిసర్గములు. సుద్యౌః. ఇచట వకారస్థానికమగు నౌకారమునకు స్థానివద్భావముచే హల్త్వము నాశ్రయించినచో, హల్ఙ్యాప్ (253) సూ. చే, సులోపము ప్రాప్తమగుచున్నది గాని సులోపమల్విధి (అలఃపరస్యవిధిః) యగుటచే స్థానివద్భావము ప్రవర్తించనందున దోషములేదు. సుదివౌ, ఇత్యాదులు.

* 338. దివ ఉత్. 6-1-131. దివః। ఉత్। (పదాన్తాత్)

దివోఽన్తాదేశ ఉకారః స్యాత్పదాన్తే। సుద్యుభ్యామ్। సుద్యుభిః। చత్వారః। చతురః। చతుర్భిః। చతుర్భ్యః॥

338. అనువృత్తమగు, 'పదాన్తాత్, అనుదానిని సప్తమ్యన్తముగ విపరిణామము చేయవలయును. పదాన్తమునను్న దివ్ శబ్దమునకు ఉకార మన్తాదేశమగును. సుది ఉ + భ్యామ్, (సుదివ్ + భ్యామ్) యణాదేశము. సుద్యుభ్యామ్, సుద్యుభిః, ఇత్యాదులు. చతుర్శబ్ద మెల్లపుడు నాలువస్తువులను బోధించునదగుటచే నిత్యబహువచనాన్తము. చతుర్ + జస్. చతురనడుహోరాముదాత్తః (332) సూ. చే, ఆమాగమము. చత్వారః. చతుర్ + శస్, చతురః.

* 339. షట్ చతుర్భ్యశ్చ. 7-1-55. షట్ చతుర్భ్యః। చ। (ఆమః (ఆమి) నుట్)

షట్సంజ్ఞకేభ్యశ్చతురశ్చ పరస్యామో నుడాగమః స్యాత్। ణత్వమ్। ద్విత్వమ్। చతుర్ణామ్॥

339. "కృత్రిమా కృత్రిమయోః కృత్రిమే కార్య సంప్రత్యయః (శాస్త్రమున సంకేతము చేయబడినది కృత్రిమము, తద్భిన్నమకృత్రిమము ఈ రెంటిలో కృత్రిమమందే శాస్త్రీయకార్యము ప్రవర్తించును.) అను న్యాయముచే, సూత్రమున షట్ పదముచే, 'ష్ణాన్తాషట్, (371) సూ. చే, సంకేతము చేయబడిన షట్సంజ్ఞకములకే గ్రహణముగాని, షష్ శబ్దమునకుమాత్రము గ్రహణముగాదు. షట్ సంజ్ఞకములు, చతుర్ శబ్దము, వీనికంటె పరమగు 'ఆమ్ ప్రత్యయమునకు నుడాగమమగునని సూత్రార్థము. చతుర్ + ఆమ్ నుడాగమము. ద్విత్వ మసిద్ధమగుటచే పూర్వము ణత్వము, పిదప అచోరహాభ్యామ్ (60) సూ. చే, ద్విత్వము, చతుర్ణామ్.

* 340. రోః సుపి. 8-3-16. రోః। సుపి। (విసర్జనీయః। ఖరి)

సప్తమీ బహువచనే పరే రోరేవ విసర్జనీయో నాన్యరేఫస్య। షత్వమ్। షస్య ద్విత్వే ప్రాప్తే॥

340. ఈ సూత్రమున ఖరి, అను పదమున కనువృత్తి చేయుటవలన సుప్ అనునది సప్తమీ బహువచనమే గాని ప్రత్యాహారమనవలదు. కావున సుప్పు పరమగునపుడు "ఖరవసానయోః" (77) సూ. చే, విసర్గము సిద్ధమగుచున్నది గాన నీ సూత్రము నియమార్థమగును. కావున పయోభ్యామ్, (పయర్ + భ్యామ్) ఇత్యాదులలోన ప్రాప్త విసర్గ విధాయకముగాదు. సప్తమీ బహువచనము పరమగునపు డుకారేత్సంజ్ఞకమగు రేఫముననకే విసర్గము వచ్చును గాని ఋత్వర్థ

రేఫమునకు రాదు. చతుర్ + సు ఇచట రేఫము కారేత్సంజ్ఞకము గానందున విసర్గము రాదు. ఆదేశప్రత్యయయోః (213) సూ. చే, షత్వము, చతుర్షు. షకారమునకు, అచోరహాభ్యామ్, (60) సూ. చే, ప్రాప్తమగు ద్విత్వమును నిషేధించుచున్నాడు.

* 341. శరోఽచి. 8_4_49. శరః। అచి। (న। ద్వే)

అచి పరే శరో న ద్వే స్తః। చతుర్షు। ప్రియ చత్వాః। హే ప్రియచత్వః। ప్రియచత్వారౌ। ప్రియ చత్వారః। గౌణత్వే తు నుట్ నేష్యతే। ప్రియచతు రామ్ ప్రాధాన్యే తు స్యాదేవ। పరమ చతుర్ణామ్। కమలమ్ కమలాం వా అచష్టేః కమల్। కమలౌ। కమలః। షత్వమ్। కమల్షు ॥

341. అచ్చు పరమగునపుడు శర్ వర్ణములకు ద్విత్వము రాదు. చతుర్షు. ఝరోఝరి (72) సూ. చే, లోపము వైకల్పికమగుటవలన ద్విత్వనిషేధము లేనిచో లోపాభావ పక్షమందు ద్విత్వశ్రవణము గావలసివచ్చునని భావము. ప్రియాశ్చత్వారో యస్య ప్రియచత్వాః (నలుగురు ప్రియులు గలవాడు) ప్రియ చతుర్ + సు 'చతురనడుహోః, సూత్ర మజాధికారములోని దగుటవలన చతుర్ శబ్దానమునకు నామాగమమగును. యణాదేశ సులోపములు ప్రియచత్వాః, హే ప్రియచత్వః, ఇచట అమ్ సంబుద్ధౌ, (334) సూ. చే, అమాగమము. ప్రియచతుర్ + ఆమ్, షట్ చతుర్భ్యః (339) అను నుడ్విధాయక సూత్ర మున ద్వివచనమును విడిచి బహువచన నిర్దేశమును చేయుటవలన నర్థమునకు ప్రాధాన్యము వివక్షింపబడును. ప్రధానమయిన షడర్థముకంటె, చతుర్ శబ్దా ర్థముకంటె పరమగు ఆమ్మునకు నుడాగమమని యర్థము. అర్థముకంటె నామ్ ప్రత్యయము పరమగుట యసంభవము గాన తద్వాచక శబ్దముకంటె పరమని చెప్పవలయును. కావున షట్ సంజ్ఞకములయొక్క చతుర్ శబ్దముయొక్క యర్థమునకు ప్రాధాన్యమున్న స్థలములందు షణ్ణామ్, పరమషణ్ణామ్, చతుర్ణామ్, పరమ చతుర్ణామ్ ఇత్యాదులలోనే నుడాగమము వచ్చునుగాని, షడాద్యర్థము నకు ప్రాధాన్యములేనట్టి ప్రియషష్ణాఞ్చానామ్, ఇత్యాదులందు రాదు. కావున ప్రియచతుర్ + ఆమ్, అనుచోట చతుర్ శబ్దార్థమునకు ప్రాధాన్యమున లేనం దున నుడాగమము రాదు. ప్రియచతురామ్ అని యగును.

కమలం, కమలాం వా అచష్టేః (పద్మమును గుఱించిగాని, లక్ష్మిని గుఱించిగాని చెప్పువాడు) అను నర్థమున కమల కమలా శబ్దములకంటె 'తత్క రోతితదాచష్టే, అనువార్తికముచే ణిచ్ప్రత్యయము. ణిజన్తముకంటె క్విప్పు. ఇట్లు కమల్ శబ్దము నిష్పన్నమగును. కమల్ + సు, సులోపము, కమల్, కమలౌ, కమలః, కమల్ + సు. (వ్) ఆదేశ ప్రత్యయయోః, సూ. చే, షత్వము. కమల్షు.

* 342. మో నో ధాతోః. 8-2-64. మః। నః। ధాతోః (పదస్య। అన్తే)

ధాతోర్మస్య నః స్యాత్పదాన్తే। నత్వస్యాసిద్ధత్వాన్నలోపో న। ప్రశామ్యతీతి ప్రశాన్। ప్రశామౌ। ప్రశామః। ప్రశాన్భ్యామిత్యాది॥

342. మః, అనునది షష్ఠ్యన్తము. పదాన్తమందున్న ధాతు మకారమునకు నకారమాదేశమగును. ప్రశామ్యతి, అను నర్థమున ప్రపూర్వక శమ్ ధాతువుకంటె క్విప్ ప్రత్యయము. 'అనునాసికస్య క్విఝలోః (6-4-15) సూ. చే, దీర్ఘము. ప్రశామ్ + స్. సులోపము, ప్రశామ్. ఈ సూత్రముచే నత్వము, ప్రశాన్. ఈ సూత్రముచే విధింపబడు నత్వమసిద్ధమగుటవలన, న లోపః ప్రాతిపదికాన్తస్య, (237) సూ. చే, నలోపము ప్రవర్తింపదు. ప్రశామౌ (ప్రశామ్ + ఔ) ప్రశామః (ప్రశామ్ + జస్) ఇచట మకారము పదాన్తము గానందున నత్వము రాదు. ప్రశామ్ + భ్యామ్. మకారము పదాన్తమగుటచే నిచట నత్వము ప్రవర్తించును. ప్రశాన్ భ్యామ్ ఇత్యాదులగును.

* 343. కిమః కః. 7-2-105. కిమః। కః। (విభక్తౌ)

కిమః కః స్యాద్విభక్తౌ। అకచ్సహితస్యాప్యయమాదేశః। కః। కౌ। కే। కమ్। కౌ। కాన్। ఇత్యాది సర్వవత్॥

343. కిమ్ శబ్దమునకు విభక్తి పరమగునపుడు కాదేశమగును. ఆదేశమనేకవర్ణములు గలదగుటవలన కిమ్ శబ్దమంతకునగును. కిమ్ + స్, కః, 'అకచ్సహితస్యాప్యయమాదేశః' అను గ్రన్థమున కాశయమిది. కిమః కః, సూత్రస్థానమున, ఇమః, అను లఘున్యాసము చేయదగును. సర్వాదిగణమున ద్విశబ్దమునకు పూర్వము కిమ్ శబ్దమును పఠించి 'త్యదాదీనామః, సూత్రము నను వృత్తి చేసినచో త్యదాదుల కవయవమగు 'ఇమ్, నకు అకారమాదేశమగునని యర్థమగును. 'నానర్థకేఽలోఽన్త్యవిధి రనభ్యాసవికారే, (అర్థశూన్యమైన దానియందలోఽన్త్య పరిభాష ప్రవర్తించదు, అనర్థకమగు నభ్యాసమునకు విధింపబడు నాదేశముల విషయమున నలోఽన్త్య పరిభాష ప్రవర్తించును) అను నిషేధమువలనను, ఆరమ్భ సామర్థ్యమువలనను ఇచట నలోఽన్త్య పరిభాష ప్రవర్తించదు గావున, కిమ్ శబ్దమునందు 'ఇమ్' అనుదానికంతకు నకారాదేశమగును, ఇట్లు 'కః' అను రూపము సిద్ధమగుచుండ, 'కిమః కః' అను గురున్యాసమునకు ప్రయోజనమేమనిన కిమ్ శబ్దమున కఙ్గాపేక్షగల నీ యకారాదేశమును బాధించి, అఙ్గాపేక్ష లేనందున నన్తరఙ్గమయినందున, "అవ్యయసర్వనామ్నామకచ్ప్రాక్టేః (5-3-71) సూ. చే, విహితమగు నకచ్ప్రత్యయము పూర్వము ప్రవర్తించుటచే 'కకిమ్'. అని యగును. ఇది, 'తన్మధ్యపతితస్త

ద్గ్రహణేన గృహ్యతే' (గఙ్గానదిని జేరిన యమునానది గఙ్గా వ్యవహారమును జెందినట్లు తన్మధ్యపతితమైనది తద్వ్యవహారము నొందును) అను పరిభాషచే కిమ్ శబ్దముయొక్క టిసంజ్ఞకమునకు పూర్వము వచ్చిన అకచ్ ప్రత్యయముతో గూడిన కకిమ్ శబ్దము కిమ్ శబ్దమగును గాన దీని కవయవమగు 'కిమ్' నకు అకార మాదేశమైనయెడల, 'కకః' అని రూపమగును. అకచ్ సహితమగు కిమ్ శబ్దమునకును, కః, అనురూపమే యిష్టము, 'కిమః కః, అను సూత్రమున్నపుడు తన్మధ్యపతిత న్యాయముచే కకిమ్ శబ్దమున కంతకును కాదేశము ప్రవర్తించును గాన 'కః, అను నిష్టరూపము సిద్ధమగును' అని, కిమ్ + ఔ, కౌ, ఇత్యాదులు. కిమ్ శబ్దము సర్వశబ్దసదృశము.

* 344. ఇదమో మః 7-2-108. ఇదమః । మః । సౌ॥

ఇదమో మః స్యాత్సౌ పరే। త్యదాద్యత్వాపవాదః॥

344. ఇదమ్ శబ్దమునకు, సుప్రత్యయము పరమగునపుడు మకారమన్త్యాదేశమగును. 'త్యదాదీనామః, (204) సూ. చే, విహితమగు అత్వమును బాధించుటకై మకారమునకు మకారాదేశము విధింపబడెను.

* 345. ఇదోఽయ్ పుంసి. 7-2-111. ఇదః । అయ్ । పుంసి । (ఇదమః । సౌ)

ఇదమ ఇదోఽయ్స్యాత్సౌ పరే పుంసి। సోర్లోపః। అయమ్। త్యదాద్యత్వమ్। పరరూపత్వంచ॥

345. పుంలిఙ్గమగు ఇదమ్ శబ్దమునకు సుప్రత్యయము పరమగునపుడు, ఇదమ్ శబ్దమున కవయవమగు ఇద్ అనుదానికి అయాదేశమగును. ఇదమ్ + స్, మకారాదేశము, అయాదేశము, సులోపము, అయమ్. ఇదమ్ + ఔ, మకారమునకు త్యదాద్యత్వము, అతో గుణే (192) సూ. చే, పరరూపము నగును. ఇద + ఔ, ఇట్లుండ.

* 346. దశ్చ. 7-2-109. దః । చ । (ఇదమః । మః । విభక్తౌ)

ఇదమోదస్య మః స్యాద్విభక్తౌ। ఇమౌ। ఇమే। త్యదాదేస్సంబోధనం నాస్తీత్యుత్సర్గః॥

346. ఇదమ్ శబ్దమునకు విభక్తి పరమగునపుడు తదవయవ దకారమునకు మకార మాదేశమగును. ఇమౌ, ఇమే, (ఇద + జస్) త్యదాదులకు సంబోధనమున ప్రచుర ప్రయోగములు లేవు. ప్రచురముగా లేవనుటవలన "తదోస్సస్సా" (383) సూత్ర భాష్యమున 'హేస, అను ప్రయోగము విరుద్ధము గానేరదని యూహింపదగును.

* 347. అనాప్యకః. 7-2-112. అన్। ఆపి। అకః। (ఇదమః। ఇదః। విభక్తౌ)

అకకారస్యేదమ ఇదోఽన్స్యాదాపి విభక్తౌ। ఆబితి టా ఇత్యారభ్య సుపః పకారేణ ప్రత్యాహారః। అనేన॥

347. 'ఆపి' అనునది 'విభక్తౌ' అనుదానికి విశేషణ మగుటవలన టా ప్రత్యయములోని ఆకారము మొదలు సుప్ ప్రత్యయములోని పకారము వరకు ప్రత్యాహారము గాని టాప్ ప్రత్యయము గాదు. (నవిద్యతే క్ యస్య, అక్, తస్య అకః) కకార రహితమగు (అకచ్ రహితమయిన) ఇదమ్ శబ్దమున కవయవమయిన 'ఇద్, అనుదానికి తృతీయాది విభక్తి పరమగునపుడు అన్, ఆదేశమగును. ఇదమ్ + టా. త్యదాద్యత్వ పరరూపములు. ఇద + టా, అనాదేశము, అన + టా, టా ప్రత్యయమున కినాదేశము, గుణము, అనేన.

* 348. హలి లోపః. 7-2-113. హలి। లోపః। (ఆపి। అకః। ఇదమః। ఇదః। విభక్తౌ)

అకకారస్యేదమ ఇదో లోపః స్యాదాపి హలాదౌ। నానర్థకేఽలోన్త్యవిధి రనభ్యాస వికారే॥

348. అకచ్ రహితమయిన ఇదమ్ శబ్దమున కవయవమగు ఇద్ నకు హలాది తృతీయాది విభక్తి పరమగునపుడు లోపము వచ్చును. 'నానర్థకే' అను పరిభాషచే నిచట నలోఽన్త్య పరిభాష ప్రవర్తించదు. కావున ఇద్ అంతకును లోపమగును. ఈ లోప మనాదేశమున కపవాదము, ఇదమ్+భ్యామ్, ఇద + భ్యామ్, ఇద్ నకు లోపముచే 'అ + భ్యామ్, అని యగును. ఇచట 'సుపిచ, సూ. చే, దీర్ఘము ప్రవర్తించిన 'ఆభ్యామ్, అను నిష్టరూపము సిద్ధమగును. కాని 'అ, అనునది మకారరూపమైనది గాని యదన్తము గానందున దీర్ఘ మప్రాప్తమగుచుండ, తత్ప్రవృత్త్యుపాయమగు సూత్రమును వ్యాఖ్యానము చేయుచున్నాడు.

* 349. ఆద్యన్తవదేకస్మిన్. 1-1-21. ఆద్యన్తవత్। ఏకస్మిన్।

ఏకస్మిన్ క్రియమాణం కార్యమాదావివాన్త ఇవ స్యాత్। ఆభ్యామ్॥

349. పరము కొంతయుండ దేనికంటె పూర్వమందు మరియొక వర్ణముండదో యది ఆది శబ్దార్థము. ఇట్లే పూర్వమున గొంతభాగముండి దేనికంటె పరమందు మరియొకటి యుండదో యది యన్తశబ్దార్థము. ఇట్లు ఆద్యన్తశబ్దములు సముదాయబోధకము లగుటచే తదాది తదన్తములకు విధింపబడిన కార్యమునకు

యమందప్రాప్తమగుచుండ నీ యతిదేశసూత్ర మారంభింపబడెను. ఏకశబ్ద మసహాయార్థకము. ఆదిశ్చాన్తశ్చ, ఆద్యన్తౌ, తయోరివాద్యన్తవత్, తదాది తదన్తములందు విధింపబడు కార్యము, తదాది తదన్తములందువలె నసహాయ మందును ప్రవర్తించునని సూత్రార్థము. అ + భ్యామనుచోట 'అ' అనునది సహాయముగావున నదన్తమునకు విధింపబడిన దీర్ఘ మకారమందును ప్రవర్తించును. ఆభ్యామ్.

* 350. నేదమదసోరకోః. 7-1-11. న। ఇదమదసోః। అకోః। (భిసః। ఐస్)

అకకారయోరిదమదసోర్భిస ఐస్ న స్యాత్। ఏత్వమ్, ఏభిః। అత్వమ్। నిత్యత్వాత్స్మై। పశ్చాద్ధలి లోపః। అస్మై। ఆభ్యామ్। ఏభ్యః। అస్మాత్। ఆభ్యామ్। ఏభ్యః। అస్య। అనయోః। ఏషామ్। అస్మిన్। అనయోః। ఏషు. కకారయోగే తు। అయకమ్। ఇమకౌ। ఇమకే। ఇమకమ్। ఇమకౌ। ఇమకాన్। ఇమకేన। ఇమకాభ్యామ్। ఇమకైః॥

350. అకచ్ రహితములగు 'ఇదమ్, అదస్, శబ్దములకంటె పరమయిన భిస్సునకు ఐసాదేశము రాదు. ఇదమ్ + భిస్, త్యదాద్యత్వ పరరూపములు. ఇద్ నకు లోపము. బహువచనే ఝల్యేత్ (206) సూ. చే, నజ్గమున కేత్వము. ఏభిః. ఇదమ్ + జే, ఇద + ఏ, ఇచట నసాదేశముకంటె నిత్యమగు (కృతాకృతప్రసజ్గి నిత్యమ్, అనాదేశము ప్రవర్తించుటకు బూర్వము, తరువాతను ప్రవర్తించునది) స్మైభావము, ప్రకృతికి వచ్చెడి యనాదేశమును బాధించి పూర్వము ప్రవర్తించును. తరువాత లోపముచే నసాదేశము బాధింపబడును. అస్మై. ఆభ్యామిత్యాదులందును త్యదాద్యత్వ పరరూపము లూహ్యములు. ఇదమ్+ఓస్, ఇద + ఓస్. అనాదేశము, ఓసిచ (208) సూ. చే, నేత్వము, అయాదేశము, అనయోః 2, ఇదమ్ + ఆమ్, ఇద + ఆమ్, సుడాగమము. ఇద్ నకు లోపము. అకారమున కేత్వము, ఏషామ్, ఇత్యాదులగును. 'కకారయోగే తు, అను వాక్యముచే 'అనాప్యకః ఇత్యాది సూత్రములలోని 'అకః, అనుదానికి ఫలమును చెప్పుచున్నాడు. ఇదమ్ శబ్దమున కకచ్ ప్రత్యయము వచ్చునపుడు, ఇదకమ్ + సు, అయకమ్. ఇమకౌ, ఇమకే, ఇమకమ్, ఇమకౌ, ఇమకాన్, అను రూపములగును. ఇదమ్ + టా, కకారరహితమ నిదమ్ శబ్దమున కవయవమగు ఇద్ న కనాదేశము చెప్పబడినందున నిచట నసాదేశము రాదు. ఇమకేన. ఇదకమ్ + భ్యామ్, కకారరహితమగు నిదమ్ శబ్దమున కవయవమయిన నిద్ నకు లోపమును విధించుటచే నిచట లోపము రాదు. ఇమకాభ్యామ్. ఇదకమ్ + భిస్, కకార రహితమగు నిదమ్ శబ్దముకంటె పరమగు భిస్సునకైసాదేశము రాదని చెప్పినందున నిచట నైసాదేశము ప్రవర్తించును. ఇమకైః, ఇత్యాదులు,

* 351. ఇదమో ఽన్వాదేశే ఽశనుదాత్త స్తృతీయాదౌ। 2-4-32. ఇదమః। అన్వాదేశే। అశ్। అనుదాత్తః। తృతీయాదౌ॥

అన్వాదేశ విషయస్యేదమో ఽనుదాత్తో ఽశ్ ఆదేశః స్యాత్తృతీయాదౌ। అశ్ వచనం సాకచ్కార్థమ్॥

351. అన్వాదేశ విషయమగు నిదమ్ శబ్దమునకు తృతీయాది విభక్తులు పరమగునపు డనుదాత్తస్వరకమయిన 'అశ్' ఆదేశమగును. అన్వాదేశ పదమున కర్థము ముందు వివరింపబడును. అసౌ వినీతః. అస్మై విద్యాముపదిశ. ఇచట అస్మై అనుచోట నీ సూత్రముచే నశాదేశము వచ్చును. ఈ సూత్రముచే ననుదాత్త స్వరమును మాత్రము విధించినను 'హలి లోపః' (348) సూత్ర విహితమగు లోపముచే 'అస్మై, ఆభ్యామ్' మొదలగు రూపములు, విశేషముగ 'ద్వితీయాటౌస్స్వేనః' సూత్ర విహితమగు నేనాదేశముచే 'ఏనేన' మున్నగు రూపములును, సిద్ధమగుచుండ నీ సూత్రముచే నశ్విధానమునకు, అకచ్ సహితమగు నిదమ్ శబ్దమునకు 'హలి లోపః' (348) సూత్ర విహితమగు లోపము ప్రవర్తించనందున నచట 'అస్మై' మున్నగు రూపములసిద్ధి ఫలమని తెలియనగును. అశ్కు, శిత్తగుటచే సర్వాదేశమగును.

వివ:—లోకమున స్వరము భ్రష్టమగుటచే ననుదాత్తస్వరకమగు నశాదేశమునకు వేదమునందు ప్రయోగము నుదహరింపదగును. 'ఆయురాశాస్తే' అని యుపక్రమించి 'తదస్మై రాధస్తామ్' అని వేదమున చెప్పబడెను. ఆయుర్దాయము నీ యజమానునికి దేవతలు సాధింపవలయునని యర్థము. అస్మై అనుచోట నకార మీ సూత్రముచే ననుదాత్తము, 'సుప్పితావనుదాత్తౌ' సూ. చే, స్మై అనునదియు ననుదాత్తము. కావున 'అస్మై' అను పదమంతయు ననుదాత్తమగును.

* 352. ద్వితీయాటౌస్స్వేనః. 2-4-34. ద్వితీయాటౌస్సు, ఏనః। (ఇదమః। ఏతదః। అన్వాదేశే। అనుదాత్తః)

ద్వితీయాయాం టౌసోశ్చ పరత ఇదమేతదో రేనాదేశః స్యాదన్వాదేశే। కించిత్కార్యం విధాతుముపాత్తస్య కార్యాన్తరం విధాతుం పునరుపాదానమన్వాదేశః। యథానేన వ్యాకరణ మధీత మేనం ఛన్దోఽధ్యాపయేతి। అనయోః పవిత్రం కులమ్। ఏనయోః ప్రభూతం స్వమితి। ఏనమ్। ఏనౌ। ఏనాన్। ఏనేన। ఏనయోః। గణయతేర్వ్విచ్। సుగణ్। సుగణౌ। సుగణః। సుగణ్ఠ్సు। సుగణ్ట్సు। సుగణ్సు। క్విప్।

అనునాసికస్య క్విఝలోరితి దీర్ఘః। సుగాణ్। సుగాణౌ। సుగాణః। సుగాణ్ ఠ్సు। సుగాణ్ ట్సు। సుగాణ్సు। పరత్వా దుపధాదీర్ఘః। హల్ఙ్యాదిలోపః। రాజా॥

352. అన్వాదేశ విషయములను నిదమేతచ్ఛబ్దములకు ద్వితీయావిభక్తి, టా, ఓస్ యివి పరమగునపు డనుదాత్తస్వరకమైన ఏనాదేశమగును. ఏదైన నొక కార్యమును (విషయమును) విధించుటకు స్వీకరింపబడినదానిని వేరొక కార్యమును (విషయమును) అపూర్వముగ బోధించుటకు తిరుగ స్వీకరించుట యన్వాదేశ మనబడును. ఉ॥ అనేన—అధ్యాపయ. (ఇతనిచే వ్యాకరణము చదువబడెను. ఇతనికి వేదమును చెప్పుము) వ్యాకరణము చదువుకొనెనని యెవనినిగురించి చెప్పెనో వానికే వేదమును చెప్పుమని కోరినందున రెండవ వాక్యములోని ఇదమ్శబ్ద మన్వాదేశ విషయమగును. కావున ఏనాదేశము వచ్చును. ఇట్లే 'అనయోః......స్వమ్' అనుచోట నూహింపదగును. ఇట్లే ఏనమ్. ఏనౌ. ఏనాన్. ఏనేన. ఏనయోః. ఇత్యాదులు. గణ ధాతుప్రకృతిక ణిజన్తము కంటె విచ్ ప్రత్యయము. సుష్ఠు గణయతి (బాగుగ లెక్కించువాడు.) సుగణ్ + స్. సులోపము. సుగణ్. సుగణౌ. సుగణ్ + సు. ఇచట "ఙ్ణోః కుక్ టుక్ శరి" (131) సూ. చే, టుగాగమము. సుగణ్ట్ + సు. 'చయో ద్వితీయాః' అనువార్తికముచే, వైకల్పిక ద్వితీయ వర్ణాదేశము. సుగణ్ఠ్సు. పక్షమందు, సుగణ్ట్సు. టుగాగమాభావ పక్షమందు, సుగణ్సు. ఇట్లు మూడు రూపములగును. గణధాతుప్రకృతిక ణిజన్తముకంటె క్విప్ ప్రత్యయము. 'అనునాసికస్య, (6-4-15) సూ. చే, దీర్ఘము. సుగాణ్ + స్. సులోపము. సుగాణౌ. సుగాణ్ + సు. ఇచటను సుగణ్ శబ్దమునకువలె రూపత్రయమగును. రాజన్ + స్. ఇచట హల్ఙ్యాది సూత్రముచే, ప్రాప్తమగు సులోపమును బాధించి పరమగు 'సర్వనామస్థానే, (251) సూ. చే, నుపధాదీర్ఘము పూర్వము ప్రవర్తించును. పిదప పునః ప్రసఙ్గ న్యాయముచే 'హల్ఙ్యాది లోపము ప్రవర్తించును. తరువాత "న లోపః ప్రాతిపదికాన్తస్య, (237) సూ. చే, నలోపము. రాజా.

* 353. న ఙిసంబుద్ధ్యోః. 8-2-8. న। ఙిసంబుద్ధ్యోః (న। లోపః)

నస్య లోపో న స్యాత్ ఙౌ సంబుద్ధౌ చ। హే రాజన్। ఙౌతు ఛన్దస్యుదాహరణమ్। సుపాం సులుగితి ఙేర్లుక్. నిషేధ సామర్థ్యాత్ప్రత్యయ లక్షణమ్। పరమే వ్యోమన్। (వా) ఙావుత్తరపదే ప్రతిషేధో వక్తవ్యః। చర్మణి తిలా అస్య చర్మతిలః। బ్రహ్మణి నిష్ఠా అస్య బ్రహ్మనిష్ఠః। రాజానౌ, రాజానః। రా

జానమ్, రాజానౌ। అల్లోపోఽనః। శ్చుత్వమ్। నచాల్లోపః స్థానివత్। పూర్వత్రాసిద్ధే తన్నిషేధాత్। నాపి బహిరఙ్గతయాఽసిద్ధః। యత్రోద్దేశపక్షే షాష్ఠీం పరిభాషాం ప్రతి శ్చుత్వస్యాసిద్ధతయా అన్తరఙ్గాభావేన పరిభాషాయా అప్రవృత్తేః। జజ్ఞోర్జ్ఞః। రాజ్ఞః। రాజ్ఞా॥

353. ఙి, సంబుద్ధి, ఇవి పరమగునపుడు నకారమునకు లోపము రాదు. హే రాజన్. సప్తమ్యేకవచనము పరమగునపుడు నలోప నిషేధమున కుదాహరణము వేదములోని 'పరమే వ్యోమన్, అనునది యగును. వ్యోమన్ + ఙి. 'సుపాం సులుక్, (7-1-39) సూ. చే, ఙి ప్రత్యయమునకు లుక్కు వచ్చును. వ్యోమన్ (వ్యోమ్ని) అగును. ఇది సుబన్తమయినందున పదమగుటచే నలోపము ప్రసక్తమగుచున్నది. ఈనిషేధ మారంభ సామర్థ్యముచే 'నలుమతాఙ్గస్య, (464) అను నిషేధమున కనిత్యత్వమును బోధించి తద్ద్వారా యచట ప్రత్యయ లక్షణమున్నట్లు చెప్పను. కావున 'వ్యోమన్, అనుదానికి ఙి పరత్వము సంభవించును. ఇచట ప్రత్యయలక్షణము లేదనిన ఙి ప్రత్యయము పరమగునపుడు విధింపబడు నలోప నిషేధము వ్యర్థమగును. లోకమున 'రాజని, అనుచోట భసంజ్ఞయుండుటచే నలోపప్రసక్తి లేనందున నది నలోపనిషేధమున కుదాహరణముగా నేరదని యాశయము. (వా) 'ఙా వుత్తరపదే...వక్తవ్యః, ఉత్తర పదము (సమాసమున చివరపదము) పరమందుగల ఙి ప్రత్యయము పరమగునపుడు, నలోప నిషేధమునకు నిషేధమును చెప్పవలయును. నలోపము వచ్చునని భావము. నలోప నిషేధమును బాధించి 'నలోపః, (237) సూ. చే, విధింపబడు నకారలోపమునే తిరుగ విధించుటచే నిది ప్రతి ప్రసవవార్తిక మన బడును. (ప్రతి = పునః, ప్రసూతే = సంపాదయతి, ప్రాప్తమగు కార్యమునే తిరుగ విధించునది ప్రతి ప్రసవము) చర్మతిలః, (చర్మణి తిలా అస్య = చర్మమందు తిలలు గలవాడు) బ్రహ్మనిష్ఠః, (బ్రహ్మణి నిష్ఠా అస్య = బ్రహ్మయందు ధ్యానము గలవాడు) ఈచోటులందు ఙిప్రత్యయమునకు సమాస ప్రయుక్తమగు లుక్కు వచ్చినందున సుబన్తమగుటచే 'చర్మన్, అనునది పదమగుటవలన ప్రాప్తమగు నలోపమునకు 'న ఙిసంబుద్ధ్యోః, సూ. చే, నిషేధము ప్రాప్తమగుచున్నది. నిషేధ సామర్థ్యముచే ప్రత్యయలక్షణము ప్రవర్తించుటవలన ఙిపరత్వము సంభవించునని యాశయము. రాజానౌ, (రాజన్ + ఔ) 'సర్వనామస్థానే, (257) సూ. చే, నుపధాదీర్ఘము. ఇట్లే రాజానః, రాజానమ్, రాజానౌ, అను రూపములందు నూహింపదగును. రాజన్ + శస్, 'అల్లోపోఽనః (235) సూ. చే, అకారలోపము. రాజ్ న్ + అస్, 'స్తోఃశ్చునాశ్చుః, (112) సూ. చే, శ్చుత్వము. అచః పరస్మిన్ (51) అను సూత్రమున పూర్వవిధౌ అనుచోట, 'పూర్వస్య విధిః, అనియేగాక 'పూర్వస్మాద్విధిః, అను పఞ్చమీ సమాసమున్ను

గూడ స్వీకరింపవలయునని పూర్వము చెప్పబడెను. స్థానిభూతమగు నచ్చుకంటె నేది పూర్వమో దానికంటె పరమగుదానికి కార్యము చేయునపుడు పరనిమిత్తకమగు నజాదేశము స్థానివద్భావము నొందునని యర్థము. ప్రకృతమున 'రాజన్ + అస్' అనుచోట శస్నిమిత్తకమగు అకారలోపము. అకారమునకు పూర్వమయిన జకారముకంటె పరమగు నకారమునకు శ్చుత్వము చేయునపుడు స్థానివద్భావము నొందును. అట్లయిన నకారమున్నపుడు శ్చుత్వము రాదు గాన స్థానివద్భావము వచ్చునపుడును శ్చుత్వము రాకుండును. కాని శ్చుత్వము త్రైపాదిక కార్యము గాన 'పూర్వత్రాసిద్ధే నస్థానివత్' అను నిషేధమువలన నిచట స్థానివద్భావము రాదు.

మఱియు నన్తర్భూతములగు జకార నకారములు నిమిత్తమగుటవలన నన్తరఙ్గమగు శ్చుత్వము చేయునపుడు, బహిర్భూత శస్ నిమిత్తకమగుటవలన బహిరఙ్గమగు అకారలోపము, అన్తరఙ్గ పరిభాషచే అసిద్ధముగ నున్నది. అసిద్ధమయినచో శ్చుత్వ మప్రాప్తమగును. కాని యన్తరఙ్గము (శ్చుత్వము) త్రైపాదికమగుటచే యథోద్దేశ పక్షము నాశ్రయించునపుడు సపాదసప్తాధ్యాయీస్థమగు (ఆరవ యధ్యాయములోనిది) నీ పరిభాషను గుఱించి, పరభాషాప్రవృత్తిలో నిమిత్తమగు నన్తరఙ్గమే 'పూర్వత్రాసిద్ధమ్' (13) సూ. చే, నసిద్ధమగును గాన నీ విషయమున నన్తరఙ్గ పరిభాష ప్రవర్తించదు. సంజ్ఞలు, పరిభాషలు విధిశాస్త్రముల యర్థబోధయం దుపకారము చేయుట కేర్పడినవి. ఉపకారము చేయు రీతి శాస్త్రమున రెండు విధములుగ నున్నది. వీనికే యథోద్దేశపక్ష కార్యకాల పక్షములనెడి వ్యవహారము. కొన్ని పరిభాషలు (షష్ఠీస్థానేయోగా, (39) ఇత్యాదులు) సూత్రములుగ చెప్పబడినవి. ఇవి యష్టాధ్యాయిలో నెచట పఠింపబడినవో వానికదియే దేశమగును. మరికొన్ని జ్ఞాపకసిద్ధములు. ఏ సూత్రముచే నేవి జ్ఞాపితములగునో యా పరిభాషల కదియే దేశమగును. ఉపకారము నపేక్షించి యుపకారకమగు తనయొద్దకు (సంజ్ఞా పరిభాషలు) ఉపస్థితమయిన విధుల కుపకారము చేయునపుడు యథోద్దేశపక్షము. సంజ్ఞా పరిభాషలు విధిదేశమునకు వెళ్లి విధుల కుపకారము చేయునపుడు కార్యకాల పక్షమగును. లక్ష్యానుసారముగ వీనిలో నొకపక్షము నాశ్రయింపదగును. యథోద్దేశ పక్షమున సంజ్ఞా పరిభాషలకు స్వదేశమే దేశము. ప్రకృతమున నన్తరఙ్గ పరిభాషావిషయమై యథోద్దేశపక్షము స్వీకరింపబడెను. 'వాహ ఊఠ్' (430) సూత్రమున నీ పరిభాష జ్ఞాపితమయినందున నీ పరిభాష కదియే దేశము. కావున నీ పరిభాష యారవ యధ్యాయములోనిదగును. పరిభాషలు ప్రవర్తించుటకు కొన్ని నిమిత్తము లుండును. ప్రకృత పరిభాషకు నిమిత్త మన్తరఙ్గ శాస్త్రము. పరిభాషను గుఱించి ప్రవృత్తినిమిత్తమే యసిద్ధమగునపుడు పరిభాష ప్రవర్తించదు గావున నిచట నీ పరిభాష ప్రవర్తించదు కావున అకారలోప మసిద్ధముగాదని యాశయము.

రాజ్ ఞ్ + అస్, జకారఞకారముల యోగమందు 'జ్ఞ్' అను లిపియు ధ్వనియు నగును. కావున రాజ్ఞః అని సిద్ధించును. ఇట్లే అజాదివిభక్తులందు 'రాజ్ఞా' ఇత్యాదులగును.

* 354. నలోపః సుప్సంజ్ఞాతుగ్విధిషు కృతి 8-2-2. నలోపః! సుప్...తుగ్విధిషు। కృతి।

సుబ్విధౌ స్వరవిధౌ సంజ్ఞావిధౌ కృతి తుగ్విధౌ చ నలోపోఽసిద్ధో నాన్యత్ర। రాజాశ్వ ఇత్యాదౌ। ఇత్యసిద్ధత్వాదాత్వమేత్వమైస్త్వం చ న। రాజభ్యామ్। రాజభిః। రాజ్ఞే। రాజభ్యః। రాజ్ఞః। రాజ్ఞోః। రాజ్ఞామ్। రాజ్ఞి। రాజని। ప్రతిదీవ్యతీతి ప్రతిదివా। ప్రతిదివానా। ప్రతిదివానః। అస్య భవిషయేఽల్లోపే కృతే॥

354. నస్య లోపః = నలోపః, సుప్ చ, స్వరశ్చ, సంజ్ఞా చ, తుక్ చ = సుప్ స్వరసంజ్ఞాతుకః. తేషాం విధయః, తేషు, సుప్...విధిషు. 'కృతి, అను నది తుగాగమమునకే విశేషణము. 'పూర్వత్రాసిద్ధమ్, సూ. చే, పూర్వశాస్త్రము గుఱించి నలోపమున కసిద్ధత్వము సంభవించుచుండ నీ సూత్రము నియమార్థమగును. సుబాది విధులకంటె నితరకార్యములు చేయునపుడు నలోపమున కసిద్ధత్వాభావమే యీ నియమమునకు ఫలము. సుప్రత్యయనిమిత్తక కార్యము, స్వరము, సంజ్ఞ, కృత్ప్రత్యయము పరమగునపుడు విధింపబడు తుగాగమము, ఇవి చేయునపుడే నకారలోప మసిద్ధమగును గాని తదితరములగు సవర్ణదీర్ఘాది కార్యములు 'రాజాశ్వః, (రాజ్ఞః అశ్వః) ఇత్యాదులందు చేయునపుడు నలోప మసిద్ధముగాదు. నియమశాస్త్రములు కార్యవిధాయకములగుచు సామాన్యశాస్త్రముయొక్క తాత్పర్యమును సంకోచము చేయునను పక్షమందు సుబాది విధులు చేయునపు డీ సూత్రమే నలోపమున కసిద్ధత్వమును విధించును. ఈ యభిప్రాయముతోనే 'ఇత్యసిద్ధత్వా...న, అని వ్రాయబడెను. రాజభ్యామ్, రాజభ్యః, రాజభిః, అనుచోటులందు క్రమముగ సుబాశ్రితములగు 'ఆత్వము, (సుపిచ,) ఏత్వము (బహువచనే) ఐసాదేశము, (అతోభిస) చేయునపు డీ సూత్రముచే నలోప మసిద్ధమగుటవలన నాత్వాదులు ప్రవర్తింపవు. రాజన్ + ఙి. ఇచట 'విభాషా ఙిశ్యోః, సూ. చే, అకారలోపము వైకల్పికమగుటచే రాజ్ఞి, రాజని, అను రూపద్వయమగును.

వివ:—స్వరవిధి కుదాహరణము, పఞ్చార్మమ్. ఇచట సమాసము చేసిన పిదప నలోపము ప్రవర్తించిన పూర్వపదము (పఞ్చ) అవర్ణాంతమగును. 'అర్మే చావర్ణం ద్వ్యచ్ త్ర్యచ్, (6-2-90) సూ. చే, పూర్వపదమున కాద్యుదాత్తము ప్రాప్తమగుచున్నది. నలోప మసిద్ధమగుటచే నా స్వరము రాదు. సంజ్ఞావిధి కుదాహరణము. పఞ్చ. ఇచట నలోపోత్తరమున షట్ సంజ్ఞ చేయునపు

డసిద్ధమగుటవలన షట్సంజ్ఞ సిద్ధమగును. కావున 'నషట్ స్వస్రాదిభ్యః, (309) సూ. చే, టాప్ప్రాప్తి రాదు. తుగ్విధి కుదాహరణము. వృత్రహభ్యామ్, వృత్రహన్ + భ్యామ్. 'వృత్రహన్, అనునది క్విబన్తమగుటచే నలోపము ప్రవర్తించినపిదప 'హ్రస్వస్య పితి, (6-1-71) సూ. చే, తుగాగమము ప్రాప్తమగుచున్నది. నలోపమసిద్ధమగుటవలన నది రాదు. ప్రతిదీవ్యతి, అను నర్థమున ప్రతిపూర్వక దివుధాతువునకుం బై కనిన్ప్రత్యయము. 'ప్రతిదివన్, అని యగును. సర్వనామస్థానము పరమగునపు డిది రాజన్ శబ్దసదృశము. ఈశబ్దమునకు భసంజ్ఞావిషయమున నల్లోపము చేసినపిదప.

* 355. హలి చ. 7-2-77. హలి। చ। (ర్వోః। ఉపధాయాః। దీర్ఘః। ఇకః। ధాతోః)

రేఫవాన్తస్య ధాతోరుపధాయా ఇకో దీర్ఘః స్యాద్ధలి. నచాల్లోపస్య స్థానివత్త్వమ్। దీర్ఘవిధౌ తన్నిషేధాత్। బహిరఙ్గ పరిభాషా తూక్తన్యాయేన న ప్రవర్తతే। ప్రతిదీవ్నః। ప్రతిదీవ్నేత్యాది। యజ్వా। యజ్వానౌ। యజ్వానః॥

355. రేఫ వకారములన్తమందుగల ధాతువునకు హల్లు పరమగునపు డుపధాభూతమగు నిక్కునకు దీర్ఘమగును. 'ప్రతిదివ్న్ + అస్, ఇచట నీ సూత్రముచే దీర్ఘము ప్రవర్తించిన 'ప్రతిదీవ్నః, అగును. ఇట్లే ప్రతిదీవ్నా, ఇత్యాదులు. ఇకారమునకు దీర్ఘము చేయునపుడు శస్ నిమిత్తకమగు నల్లోపము 'అచః పరస్మిన్, (51) సూ. చే, స్థానివద్భావము నొందినచో ధాతువునకు హల్పరత్వము లేనందున దీర్ఘము రాకపోవును. కాని దీర్ఘము చేయునపుడు 'నపదాన్త, (52) సూ. చే, స్థానివద్భావము నిషిద్ధమైనందున దీర్ఘము ప్రవర్తించును. అన్తరఙ్గమగు దీర్ఘము త్రైపాదికమగుటచే పూర్వము చెప్పబడినయుక్తిచే నిచట నన్తరఙ్గ పరిభాషయును ప్రవర్తించదు. కావున నన్తరఙ్గమగు దీర్ఘము చేయునపుడు బహిరఙ్గమగు నల్లోపమసిద్ధమగును గాన దీర్ఘము ప్రవర్తించదనుటకు వలనుపడదు. ఇష్టవాన్ (యాగమును చేసినవాడు) అను నర్థమున యజధాతు ప్రకృతిక జ్వనిప్ ప్రత్యయాన్తము యజ్వన్ శబ్దము. ఇది సర్వనామస్థానమందు రాజన్ శబ్దసదృశము.

* 356. న సంయోగాద్వమన్తాత్. 6-3-137. న। సంయోగాత్। వమన్తాత్। అల్లోపః। అనః॥

వకారమకారాన్త సంయోగాత్పరస్యా నోఽకారస్య లోపో న స్యాత్। యజ్వనః। యజ్వనా। యజ్వభ్యామిత్యాది। బ్రహ్మణః। బ్రహ్మణా। బ్రహ్మభ్యామిత్యాది॥

356. వకారముగాని మకారముగాని యంతమందుగల సంయోగముకంటె పరమగు 'అస్' లోని అకారమునకు లోపము రాదు. 'అల్లోపోఽనః' (235) సూ. చే, ప్రాప్తమగు నకారలోపమునీ సూత్రము నిషేధించును. యజ్వనః, (యజ్వన్ + శస్) ఇది వకారాన్త సంయోగమున కుదాహరణము. ఇట్లే యజ్వనా, ఇత్యాదులు. యజ్వభ్యామ్ మొదలగు హలాది విభక్తులలోనిది రాజన్ శబ్దసదృశము. మాన్తసంయోగమున కుదాహరణము. బ్రహ్మణః, (బ్రహ్మన్ + శస్) బ్రహ్మన్ శబ్దము యజ్వన్ శబ్దసమానము.

* 357. ఇన్హన్పూషార్యమ్ణాం శౌ। 6-4-12. ఇన్... మ్ణా। శౌ। (ఉపధాయాః, దీర్ఘః)

ఏషాం శావేవోపధాయా దీర్ఘో నాన్యత్ర। ఇతి నిషేధే ప్రాప్తే॥

357. ఇన్, హన్, పూషన్, అర్యమన్, ఇవి యన్తమందుగల యఙ్గమునకు శి ప్రత్యయము పరమగునపుడే ఉపధాదీర్ఘమగును. మిగిలినచోట రాదు. 'సర్వనామస్థానే' (251) సూ. చే, ప్రాప్తమగు నుపధాదీర్ఘమున కిది నియామకము, 'జశ్శసోః శిః' సూత్రవిహితమగు శి ప్రత్యయముకంటె భిన్నమయినవి పరమగునపు డుపధాదీర్ఘ నివృత్తి ఫలితమగును. ఇట్లు సిద్ధించినదే 'నాన్యత్ర' అనునది. వృత్రం హతవాన్ (వృత్రాసురుని చంపినవాడు) అను నర్థమున వృత్ర శబ్దపూర్వక హన్ ధాతువుకంటె క్విప్పుచేసిన వృత్రహన్ శబ్దమగును. వృత్రహన్ + స్. ఇచట నీ సూత్రముచే నుపధాదీర్ఘనిషేధము ప్రాప్తమగుచుండ :—

* 358. సౌ చ. 6-4-13. సౌ। చ. (ఇన్...మ్ణామ్। ఉపధాయాః। దీర్ఘః। అసంబుద్ధౌ)

ఇన్నాదీనాముపధాయా దీర్ఘః స్యాదసంబుద్ధౌ సౌ పరే। వృత్రహా। హేవృత్రహన్। ఏకాజుత్తరపదే ణ ఇతి ణత్వమ్। వృత్రహణౌ। వృత్రహణః। వృత్రహణమ్। వృత్రహణౌ॥

358. ఇన్, హన్, పూషన్, అర్యమన్, ఇవి యన్తమందుగల యఙ్గమునకు సంబుద్ధి భిన్నమగు సు ప్రత్యయము పరమగునపు డుపధాదీర్ఘమగును. వృత్రహన్ + స్, ఇచట పూర్వసూత్రప్రాప్త నిషేధమును బాధించి దీనిచే దీర్ఘమగును. సులోపనలోపములు. వృత్రహా. హేవృత్రహన్, రాజన్ శబ్ద సంబుద్ధి సదృశము. వృత్రహన్ + ఔ. 'ఏకాజుత్తరపదేణః' (308) సూ. చే, ణత్వము. వృత్రహణౌ. ఇట్లే వృత్రహణః. వృత్రహణమ్. వృత్రహణౌ.

* 359. హో హన్తేః ఞ్ణిన్నేషు. 7-3-54. హః। హన్తేః। ఞ్ణిన్నేషు (కుః)

ఞితి ణితి చ ప్రత్యయే నకారే చ పరే హన్తేర్హకారస్య కుత్వం స్యాత్॥

359. 'హః' అనునది షష్ఠ్యేకవచనాన్తము. ఞ్ణిన్నేషు = ఞ్ చ, ణ్ చ, ఞ్ణౌ, తౌ ఇతౌ యయోస్తౌ. ఞ్ణితౌ, తౌ చ నశ్చ ఞ్ణిన్నాః తేషు. అఙ్గాధికారమువలన 'ప్రత్యయే' అనునది యాక్షేపలబ్ధమగును. హనధాతువున కవయవమగు హకారమునకు, ఞకార ణకారేత్సంజ్ఞక ప్రత్యయముగాని, నకారముగాని పరమగునపుడు కుత్వము (ఘకారము) అగును.

* 360. హన్తేః 8-4-22. (రషాభ్యామ్। నః। ణః। ఉపసర్గాత్)

ఉపసర్గస్థాన్నిమిత్తాత్పరస్య హన్తేర్నస్య ణత్వం స్యాత్। ప్రహణ్యాత్॥

360. వృత్రఘ్నః, ఇత్యాదులందు 'ఏకాజుత్తరపదే ణః' మొదలగు సూత్రములచే ప్రాప్తమగు ణత్వమును వారించుటకై 'హన్తేరత్పూర్వస్య' అను సూత్రమును విభాగముచేసి వ్యాఖ్యానము చేయుచున్నాడు. అనువృత్తమగు నుపసర్గ శబ్దము 'తాత్స్థ్యాత్తాచ్ఛబ్ద్యమ్' (దానియందున్నది దానిని బోధించు శబ్దముచే బోధింపబడును) అను న్యాయముచే నుపసర్గస్థమైనదానిని బోధించును. ఉపసర్గమందున్న రేఫ షకారములకంటె పరమైన హన్ ధాత్వవయవ నకారమునకు ణత్వమగును. ప్రహణ్యాత్. ప్రపూర్వక హన్ ధాతువునకు విధి లిఙ్ ప్రథమైకవచనము. ఈ సూత్రముచే నిచట ణత్వము ప్రవర్తించును.

* 361. అత్పూర్వస్య. 8-4-22. (హన్తేః। నః। ణః)

హన్తేరత్పూర్వస్యైవ నస్య ణత్వమ్। నాన్యస్య। ప్రఘ్నన్తి। యోగవిభాగసామర్థ్యాదనన్తరస్య విధిర్వా భవతి ప్రతిషేధో వేతి న్యాయం బాధిత్వా ఏకాజుత్తరపదే ఇతి ణత్వమపి నివర్త్యతే। నకారే పరే కుత్వవిధానసామర్థ్యాదల్లోపో న స్థానివత్। వృత్రఘ్నః। వృత్రఘ్నేత్యాది। యత్తు వృత్రఘ్న ఇత్యాదౌ వైకల్పికం ణత్వం మాధవేనోక్తం తద్భాష్యవార్త్తిక విరుద్ధమ్। ఏవం శార్ఙ్గిన్ యశస్విన్నర్యమన్ పూషన్। యశస్విన్నితి విన్ప్రత్యయే ఇనోఽనర్థకత్వేఽపి ఇన్ హన్నిత్యత్ర గ్రహణం భవత్యేవ। 'అనినస్మన్ గ్రహణాన్యర్థవతా చానర్థకేన చ తదన్తవిధిం ప్రయోజయన్తి' వచనాత్। అర్యమ్ణి। అర్యమణి। పూష్ణి। పూషణి॥

361. ప్రకృతోపయుక్తమగు నంశ మీ సూత్రము. ఈ సూత్రములోని కుపసర్గాత్ అనునది యనువృత్తము గానందున 'ఏకాజుత్తరపదేణః' మొదలగు ణత్వవిధాయకములన్నిటికి నిది నియామకమే యగును. హన్ ధాత్వవయవ నకారమునకు హ్రస్వాకారము పూర్వమందుగలదానికే ణత్వమగును. ఇతరమునకు రాదు. ఇతరనివృత్తి నియమఫలము. ప్రఘ్నన్తి, ప్రపూర్వక హన్ ధాతువునకు లట్ ప్రథమ బహువచనము. ఇచట 'హన్తేః' సూ. చే. ప్రాప్తమగు ణత్వమీ నియమముచే వారితమగును. వృత్రఘ్నః (వృత్రహన్ - శస్) ఇచట 'ప్రాతిపదికాన్త నుమ్విభక్తిషు చ' (1060) 'ఏకాజుత్తరపదే ణః' (308) 'కుమతి చ' (1061) 'హన్తేః' సూత్రములచే ణత్వము ప్రాప్తమగుచున్నది. పక్షమీ సమాసపక్షమందు 'అచః పరస్మిన్' సూ. చే. నల్లోపమునకు స్థానివద్భావమువలన 'వృత్రఘ్నః' అనుచోట నుత్తరపద మేకాచ్కమగును. 'అనన్తరస్య విధిర్వా భవతి ప్రతిషేధో వా' (విధి శాస్త్రముగాని నిషేధ శాస్త్రముగాని యితరముతో వ్యవధానములేనిదానికే యగును.) అను న్యాయముచే నీ నియమము తన కవ్యవహితమగు 'హన్తేః' సూ. చే. విధింపబడు ణత్వమునకే గావలయును. ఇట్లయిన యోగవిభాగము సఫలము గాకపోవును. 'వృత్రఘ్నః' ఇత్యాదులందు ప్రాప్తమగు ణత్వమాత్రమునకు వ్యావృత్తియే యోగవిభాగ ఫలము. కావున యోగవిభాగ సామర్థ్యమువలన బాధ్యసామాన్యచిన్తా పక్షము (స్వవిషయమున ప్రాప్తములగు శాస్త్రము లన్నిటికిని బాధకమగును) నాశ్రయించుటచే పై న్యాయమును బాధించి అనన్తరమగు 'హన్తేః' సూ. చే. ప్రాప్తమగు ణత్వమునువలె వ్యవహితములగు, ఏకాజుత్తర, ఇత్యాది సూత్రములచే ప్రాప్తమగు ణత్వమునుగూడ నీ నియమము వారింపజేయును. 'హోహన్తేః' సూ. చే. నకారము పరమగునపుడు కుత్వవిధానమునకు 'వృత్రఘ్నః' ఇత్యాదులే యుదాహరణములు. ఇచట నల్లోపమునకు 'అచః పరస్మిన్' సూ. చే. స్థానివద్భావము ప్రవర్తించినచో హకారమునకు నకారపరత్వముండదు గాన కుత్వమప్రాప్తమగును. కుత్వవిధానము వ్యర్థమగును. కావున కుత్వవిధాన సామర్థ్యమువలన నిచట స్థానిద్భావము రాదు. కుత్వము నిర్బాధకముగ ప్రవర్తించును. 'వృత్రఘ్నః' వృత్రఘ్నా, ఇత్యాదులగును. ఇచటనే ణత్వముగూడ ప్రవర్తించదని చెప్పి 'వృత్రఘ్నః' అనియే భాష్యమం దుదాహరింపబడెను. కావున "వృత్రఘ్నః' అనుచోట నుత్తరపదమే కాచ్కము గానందున 'ఏకాజుత్తరపద' అను సూత్రము ప్రవర్తింపకున్నను 'ప్రాతిపదికాన్త (1060) సూ. చే. వైకల్పిక ణత్వము ప్రవర్తించును. 'వృత్రఘ్ణః' వృత్రఘ్నః' అని రూపద్వయమగును" అను మాధవాచార్యగ్రన్థము భాష్యవిరుద్ధమని గ్రహించునది. ఇన్నన్తములగు శార్ఙ్గిన్, యశస్విన్, శబ్దములు, అర్యమన్, పూషన్ శబ్దములు ఉపధాదీర్ఘ నియమవిషయమైమాత్రము వృత్రహన్ శబ్దసదృశములు. శార్ఙ్గీ, శార్ఙ్గిణౌ, శార్ఙ్గిణః, ఇత్యాదులు. యశోఽస్యాస్తి (కీర్తిగలవాడు) అనునర్థమున యశశ్శబ్దముకంటె

'అస్మాయా మేధాస్రజో వినిః, (5-2 121) సూ. చే, విని ప్రత్యయము చేసిన 'యశస్విన్' అని యగును. ఇచట విన్ ప్రత్యయములోని 'ఇన్, అనర్థకమైనందున 'అర్థవద్గ్రహణ పరిభాష చే నీ ఇన్నునకు 'ఇన్‌హన్, సూత్రమున గ్రహణము గలుగదు. కాన నీసూత్రము యశస్విన్ శబ్దము విషయమై ప్రవర్తింపకున్నది. కాని అర్థవద్గ్రహణ పరిభాష కపవాదమైన 'అనినస్మన్.....ప్రయోజయన్తి. అను పరిభాషచే యశస్విన్ శబ్దమందును 'ఇన్‌హన్, సూత్రము ప్రవర్తించును. 'అనినస్మన్, పరిభాషకర్థము = అన్, ఇన్, అస్, మన్ ఇవి యే సూత్రమున గ్రహింపబడినను, అవి యర్థవత్తులయినను, అర్థశూన్యములయినను తదన్తవిధిని పొందును. ప్రకృతమున 'శార్ఙ్గిన్ అనునది అర్థవత్తయిన ఇన్నన్తము. 'యశస్విన్, అనునది యనర్థకమగు నిన్నన్తము. అర్యమన్ + స్, 'సౌచ, సూ. చే, నుపధాదీర్ఘము. సులోపనలోపములు. అర్యమా, అర్యమణౌ, అర్యమణః, అర్యమణమ్, అర్యమణౌ, అర్యమ్ణః, అర్యమ్ణా, అర్యమభ్యామ్, అర్యమన్ + ఙి, 'విభాషాఙిశ్యోః, సూ. చే, వైకల్పికమగు నల్లోపము. అర్యమ్ణి. అర్యమణి ఇత్యాదులు. పూషన్ శబ్దము నిట్లే యూహింపదగును.

* 362. మఘవా బహులమ్. 6-4-128. మఘవా। బహులమ్. (తృ)

మఘవన్‌శబ్దస్యవా తృ ఇత్యన్తాదేశః స్యాత్। ఋఇత్ ॥

362. 'మఘవా, అనుచోట ప్రథమావిభక్తి షష్ఠ్యర్థకము. మఘవన్ శబ్దమునకు 'తృ, అను నాదేశము బహులముగ నగును. ఆదేశములోని ఋకార మిత్సంజ్ఞకమగుటవలన 'అనేకాల్ శిత్తనుసూత్ర మిచట ప్రవర్తింపదు గాన 'అలోన్త్యస్య, సూత్రముచే, నిది యన్తాదేశమగును.

* 363. ఉగిదచాం సర్వనామస్థానేఽధాతోః. 7-1-70. ఉగిదచామ్। సర్వనామస్థానే। అధాతోః। (నుమ్)

అధాతోరుగితో నలోపినోఽఞ్చతేశ్చ నుమాగమః స్యాత్ సర్వనామస్థానే పరే। ఉపధాదీర్ఘః। మఘవాన్। ఇహ దీర్ఘే కర్తవ్యే సంయోగాన్తలోపస్యాసిద్ధత్వం న భవతి। బహులగ్రహణాత్। తథా చ శ్వన్నుక్షన్నితి నిపాతనాన్మఘశబ్దాన్మతుపా చ భాషాయామపి శబ్దద్వయసిద్ధిమాశ్రిత్య తత్సూత్రం ప్రత్యాఖ్యాతమాకరే, హవిర్జక్షితి నిశ్శఙ్కో మఖేషు మఘవానసౌ। ఇతిభట్టిః। మఘవన్తౌ। మఘవన్తః। హేమఘవన్। మఘవన్తమ్। మఘవన్తౌ। మఘవతః। మఘవతా। మఘవద్భ్యామిత్యాది। తృత్వాభావే।

మఘవా। ఛన్దసీ వనిపౌ చేతి వనిబన్తం మఘోన్యుదాత్తం ఛన్దస్యేవ। అన్తోదాత్తం తు లోకేఽపీతి విశేషః। మఘవానౌ। మఘవానః। సుటిరాజవత్ ॥

363. ఉక్ ఇత్ యస్య = ఉగిత్ = ఉక్ ప్రత్యాహారవర్ణ మిత్సంజ్ఞగాగలది. అచ్పదము లుప్తనకారముగల అఞ్చు ధాతుబోధకము. 'అధాతోః, అనునది అఞ్చుధాతువున కసంభవము గాన నుగిత్తునకే విశేషణము. ధాతుభిన్నమగు నుగిత్తునకు, లుప్తమగు నకారముగల యఞ్చు ధాతువునకును సర్వనామస్థానము పరమగునపుడు నుమాగమమగును. 'మహ్యతే = పూజ్యతే, ఇతి మఘవాన్. (ఇంద్రుడు) మఘవన్ + స్, త్రాదేశము. మఘవత్ + స్. 'మఘవత్, అనునది ధాతుభిన్నమగు నుగిత్తగుటచే నీసూత్రమువలన నుమాగమము. మఘవన్త్ + స్. సులోప సంయోగాన్తలోపములు. మఘవన్. 'సర్వనామస్థానే, (251) సూ. చే, నుపధాదీర్ఘము. మఘవాన్. 'శర్వన్, ఇత్యాదులందువలె నిచట నుపధాదీర్ఘము చేయునపుడు సంయోగాన్తలోపమసిద్ధమగుటచే నుపధాదీర్ఘ మప్రాప్తమగుచున్నది. కాని యీ సూత్రములోని బహులగ్రహణమువలన నిచట నసిద్ధముగాదు. ఇందు బహులగ్రహణ మెట్లు ప్రమాణమగునగు విషయమునే 'తథాచ...భట్టిః, అను గ్రన్థముచే నుపపాదించుచున్నాడు. 'శ్వన్నుక్షన్...మఘవన్. అను నుణాది సూత్రముచే మఘ ధాతువునకు కని ప్రత్యయము, వుమాగమము, హకారమునకు ఘకారము, యీ మూడింటిని నిపతించుటవలన 'మఘవన్, అను నకారాన్త శబ్దము సిద్ధమగును. ధనవాచకమగు మఘ శబ్దముకంటె 'మఘమస్యాస్తి, అను నర్థమున మతుప్ ప్రత్యయమును చేసినచో 'మఘవత్, అను తకారాన్త శబ్దము సిద్ధమగును. మఘవత్ + స్, అనుచోట 'అత్వసన్తస్య చాధాతోః, (248) సూ. చే, నుపధాదీర్ఘము, పిమ్మట 'ఉగిదచామ్, సూ. చే, నుమాగమము ప్రవర్తించుటవలన 'మఘవాన్, అను రూపము సిద్ధమగును. ఇట్లు మఘవా, మఘవాన్, అను రూపద్వయము లోకమందును సిద్ధమగుచుండ బహులముగ త్రాదేశమును విధించు 'మఘవా బహులమ్, అను సూత్ర మనావశ్యకమని భాష్యమున ప్రత్యాఖ్యానము చేయబడినది. సూత్రారంభ ప్రత్యాఖ్యాన పక్షములలో ఫలభేదమున్న ప్రత్యాఖ్యానము దుష్టమగును. త్రాదేశపక్షమందు (సూత్రారమ్భమందు) ఉపధాదీర్ఘము చేయునపుడు సంయోగాన్తలోప మసిద్ధమయ్యేనేని మఘవన్, అనియు, ప్రత్యాఖ్యానపక్షమందు 'మఘవాన్, అనియు నగును. కావున నారంభ ప్రత్యాఖ్యానములకు ఫలభేదము ప్రసక్తమగును. బహూనర్థాన్ లాతిగృహ్ణాతి, అను వ్యుత్పత్తిచే బహులపద మనేకార్థములకు సంగ్రాహకము. బహులపదార్థము నీ శ్లోకము వివరించుచున్నది. శ్లో॥ క్వచిత్ప్రవృత్తిః క్వచిదప్రవృత్తిః క్వచిద్విభాషా క్వచిదన్యదేవ। శిష్టప్రయోగాననుసృత్య లోకే విజ్ఞేయమేతద్బహులగ్రహణే తు. అర్థము = బహుళ గ్రహణముగల శాస్త్రములచే విధింపబడు కార్యములు శిష్టుల (వైయాకరణుల) ప్రయోగము ననుసరించి కొన్ని

లక్ష్యములందు నిత్యముగను, కొన్నిటియందు వికల్పముగను ప్రవర్తించును. కొన్నిచోటులందు ప్రవర్తింపవు. మరికొన్నిచోటులం దాయాసూత్ర విహితమగు కార్యముకంటె నన్యకార్యమునుగూడ సంపాదించును. ప్రకృతమున నిట్టి బహుళగ్రహణముండుటచే 'మఘవాన్, అనుచోట నుపధాదీర్ఘము చేయునపుడు సంయోగాన్తలోప మసిద్ధముగాదను అన్యార్థమును చెప్పవచ్చును. ఇట్లు త్రాదేశ పక్షమందును 'మఘవాన్, మఘవా, అను రూపద్వయము సిద్ధమగుటచే నారంభ ప్రత్యాఖ్యానములకు ఫలైక్యము సిద్ధమగును. 'హవిర్జక్షితి...మఘవానసౌ, అను భట్టిప్రయోగముగూడ 'మఘవాన్, అనునది లోకమున నుండుటలో సాధకమగును. హేమఘవన్, మఘవన్తౌ, మఘవన్తః మఘవన్తమ్. మఘవన్తౌ, సర్వనామస్థానమందు త్రాదేశ నుమాగమములచే నిట్టి రూపములగును. మఘవతః (మఘవన్ + శస్) మఘవద్భ్యామ్. మఘవత్సు ఇత్యాదులు త్రాదేశమువలన సిద్ధములగును. త్రాదేశాభావపక్షమున మఘవన్ శబ్దము సర్వనామస్థానమందు రాజన్ శబ్దసదృశము. మఘవా, మఘవానౌ, ఇత్యాదులు. 'ఛన్దసీవనిపౌచ, సూ. చే, విహితమగు వనిప్ప్రత్యయాన్తమగు మఘవన్ శబ్దము మధ్యోదాత్తస్వరకమగును. ఇది వేదమందే యుండును. 'శ్వన్నుక్షన్, అను సుణాది సూత్రముచే నిపతింపబడిన కనిప్రత్యయాన్తమగు మఘవన్ శబ్దమన్తోదాత్తము. ఇది లోకమందును ప్రయోగింపదగును.

* 364. శ్వయువమఘోనామతద్ధితే. 6-4-113. శ్వయువమఘోనామ్। అతద్ధితే। (అనః। భస్య। సంప్రసారణమ్)

అన్నన్తానాం భసంజ్ఞకానామేషామతద్ధితే పరే సంప్రసారణం స్యాత్ । సంప్రసారణాచ్చ। అద్గుణః। మఘోనః। అన్నన్తానాం కిమ్। మఘవతః। మఘవతా। స్త్రియామ్। మఘవతీ। అతద్ధితే కిమ్। మాఘవనమ్। మఘోనా। మఘవభ్యామిత్యాది। శునః। శునా। శ్వభ్యామిత్యాది। యువన్ శబ్దే వస్వోత్వే కృతే।

364. అన్నన్తములు, భసంజ్ఞకములునగు శ్వన్, యువన్, మఘవన్, శబ్దములకు తద్ధితభిన్నమగు ప్రత్యయము పరమగునపుడు సంప్రసారణమగును. మఘవన్ + శస్, సంప్రసారణము. మఘ ఉ అన్, సంప్రసారణాచ్చ (331) సూ. చే, పూర్వరూపము. మఘఉన్. అద్గుణః, సూ. చే, గుణము. మఘోనః, శ్వన్నాదులన్నన్తములే గాన నీ విశేషణ మెందులకని 'అన్నన్తానాం కిమ్, అను ప్రశ్నకాశయము. 'మఘవతః, ఇత్యాదులలో నకారమునకు త్రాదేశము వచ్చినను ఏకదేశ వికృతన్యాయముచే మఘవతనునది అన్నన్తమగును గాన నిచట సంప్రసారణనివృత్తికొఱకా విశేషణ మావశ్యకమని సమాధానాశయము. విశేషణమున్నపుడును ఏకదేశవికృత న్యాయముచే నన్నన్తములే యగుటవలన నల్లోపసంప్రసారణములు ప్రాప్తములగుచున్నవి. కాని 'అనః, అనుచోట

నకార ప్రశ్లేషముచేసి శ్రూయమాణ నకారము న్తమందుగల అన్న న్తములను గ్రహము చేయుటవలన నివృత్తములగును. మఘవతః స్త్రీ, అను అర్థమున 'ఉగితశ్చ' అను సూ. చే, జీప్ ప్రత్యయము ప్రవర్తించిన 'మఘవతీ' అని యగును. అన్న న్తము లనుట కిచట సంప్రసారణాభావమును ఫలమగును, 'మఘవా దేవతా అస్య' అను అర్థమున మఘవన్ శబ్దముకంటె 'సాస్య దేవతా' (4-2-24) సూ. చే, అణ్ ప్రత్యయమగుటవలన 'మాఘవనమ్' అని యగును. 'అతద్ధితే' అనునది లేనిచో నిచట తద్ధితము పరమగునపుడు సంప్రసారణము ప్రసక్తమగును. మఘ వన్ శబ్దమున కజాది ప్రత్యయములందు సంప్రసారణాదులవలన 'మఘోనా', మఘోనే, ఇత్యాదులగును. హలాది ప్రత్యయములందు నలోపమువలన మఘ వభ్యా మిత్యాదులగును. శ్వన్, యువన్, శబ్దములుగూడ సర్వనామస్థానమందు రాజన్ శబ్దసదృశములు. శ్వన్ శబ్దమునకు శసాద్యజాది ప్రత్యయములు పరమగు నపుడు సంప్రసారణాదులచే 'శునః, శునే, ఇత్యాదులు, హలాది విభక్తులలో నలోపమువలన శ్వభ్యామిత్యాదులు నగును. యువన్ శబ్దమున కజాది ప్రత్యయ ములందు సంప్రసారణ పూర్వసవర్ణ దీర్ఘములు ప్రవర్తించినయెడల 'యూనః, ఇత్యాదులగును. ఇచట యకారమునకును సంప్రసారణము ప్రాప్తమగుచుండ నిషేధించుచున్నాడు.

* 365. న సంప్రసారణే సంప్రసారణమ్. 6-1-37. న। సంప్రసారణే। సంప్రసారణమ్॥

సంప్రసారణే పరతః పూర్వస్య యణః సంప్రసారణం న స్యాత్। ఇతి యకారస్య నేత్వమ్। అత ఏవ జ్ఞాపకాద న్త్యస్య యణః పూర్వం సంప్రసారణమ్। యూనా। యువభ్యామిత్యాది అర్వా। హే అర్వన్॥

365. సంప్రసారణము పరమగునపుడు పూర్వమగు యణ్ణునకు సంప్రసా రణము రాదు. 'యూనః, ఇత్యాదులలో యకారమునకు నిషేధమువలన సంప్ర సారణము (ఇకారము) రాదు. ఇచట సవర్ణదీర్ఘము ప్రవర్తించినను 'అచః పరస్మిన్' సూ. చే, స్థానివద్భావమువలన సంప్రసారణ పరత్వము సంభవించును. స్థానివద్భావమువలన యకారమునకు సంప్రసారణమునకును మధ్యనున్న ఉకారము వ్యవధాయకమగుటచే సంప్రసారణ పరత్వము లేనందున నిచట నీ నిషేధము ప్రవర్తింపకున్నది గాని యీ నిషేధారమ్భ సామర్థ్యమువలన వ్యవధానమున్నను నిషేధప్రవృత్తి యఙ్గీకరింపబడుటచే దోషములేదని తెలియనగును. యువన్ + అస్ అనుచోట యకారవకారముల కొకేసమయమున సంప్రసారణము ప్రవర్తిం చినచో నీ నిషేధము వ్యర్థమగును గాన నీషేధారమ్భ సామర్థ్యమువలన పర యణ్ణునకే పూర్వము సంప్రసారణమని చెప్పవలయును. అపుడు సంప్రసారణ పరత్వముగూడ సంభవించును గాన పూర్వయణ్ణుకు ప్రాప్తమగు సంప్రసారణ మును నిషేధించుటవలన నీ సూత్రము సార్థకమగును. 'యువన్, ఇత్యాదులలో

సంప్రసారణాశ్రయములగు వర్ణములు భిన్నములగుటవలన 'లక్ష్యే లక్షణం సకృదేవ ప్రవర్తతే, నాసకృత్, (ఒకలక్ష్యమం దొకలక్షణ మొకసారే ప్రవర్తించును గాని యనేకసారులు ప్రవర్తించదు) అను నిషేధము ప్రవర్తించదని తెలియనగును. అర్వన్ శబ్దము సుప్రత్యయము పరమగునపుడు రాజన్ శబ్దసదృశము. అర్వా, హే అర్వన్.

* 366. అర్వణస్త్రసావనఞః. 6-4-12. అర్వణః । తృ । అసౌ అనఞః,

నఞారహితస్యార్వన్నిస్యాఙ్గస్య తృ ఇత్యన్తాదేశః స్యాన్న తు సౌ। ఉగిత్వాన్నుమ్। అర్వన్తౌ, అర్వన్తః। అర్వన్తమ్। అర్వన్తౌ, అర్వతః। అర్వతా। అర్వద్భ్యామిత్యాది। అనఞః కిమ్। అనర్వా। యజ్వవత్ ॥

366. 'అనఞః, అనునది బహువ్రీహి. (నవిద్యతే నఞ్ యస్య) ఇట్లు చెప్పుటలో 'వాజమర్వత్సు, అను ప్రయోగము సాధకమగును. 'అనఞః, అనునది తత్పురుషమనిన నఞ్ భిన్నమగుదానికంటె పరమగు నర్వన్ శబ్దమునకు త్రాదేశమగునని యర్థమగును. పూర్వపదమున్నపుడే యాదేశము వచ్చును గాని 'అర్వత్సు, ఇత్యాదులందు రాకపోవును. నఞుతో శూన్యమగు నర్వన్ శబ్దాఙ్గమునకు త్రాదేశమగును, ప్రథమైకవచనము పరమగునపుడు రాదని సూత్రార్థము. ఆదేశమున ఋకార మిత్సంజ్ఞకము. అర్వన్ + జౌ, త్రాదేశము. అర్వత్ + జౌ, ఉగిత్తగుటచే 'ఉగిదచామ్, (368) సూ. చే, నుమాగమము, అర్వన్తౌ. సర్వనామస్థానమున త్రాదేశ నుమాగమములవలన 'అర్వన్తః, అర్వన్తమ్, అర్వన్తౌ, అని యగును. మిగిలిన విభక్తులందు త్రాదేశమువలన అర్వతః, (అర్వన్ + శస్) అర్వద్భ్యామ్, ఇత్యాదులగును. అనఞః కిమ్? దీనికి వ్యావర్త్యమేమని ప్రశ్నాశయము. యజ్వన్ శబ్దసదృశమగు అనర్వన్ శబ్దము వ్యావర్త్యమని సమాధానాశయము. అనర్వన్ శబ్దము నఞ్ సహితమయినందున త్రాదేశము రాదు.

* 367. పథిమథ్యృభుక్షామాత్. 7-1-85. పథి...క్షామ్। ఆత్। (సౌ)

ఏషామాకారోఽన్తాదేశః స్యాత్ సౌ పరే। ఆ ఆదితి ప్రశ్లేషేణ శుద్ధాయా ఏవ వ్యక్తే ర్విధానాన్నానునాసికః ॥

367. పథిమథ్యృభుక్షామనునది ద్వన్ద్వము. (పన్థాశ్చ, మన్థాశ్చ ఋభుక్షాశ్చ, పథిమథ్యృభుక్షాణః తేషామ్) పథిన్, మథిన్, ఋభుక్షిన్, శబ్దములకు ప్రథమైకవచనము పరమగునపు డాకార మన్తాదేశమగును. అనునాసిక

మగు నకారస్థానమందా న్తర తమ్యమువలన ననునాసికాకారము ప్రాప్తమగు చున్నది గాని 'ఆ త్తనుచోట నాకారప్రశ్లేషమును జేసి తత్సామర్థ్యమువలన శుదమగు నాకారమును విధించుటచే ననునాసికాకారము నివృత్తమగును. పథిన్ + స్. పథి ఆ + స్.

* 368. ఇతోఽత్సర్వనామస్థానే. 7-1-86. ఇతః। అత్। సర్వనామస్థానే। (పథిమథ్యృభుక్షామ్)

పథ్యాదే రికారస్యాకారః స్యాత్సర్వనామ స్థానే పరే॥

368. పథిన్, మథిన్, ఋభుక్షిన్, శబ్దములయొక్క ఇకారమునకు సర్వనామస్థానము పరమగునపుడు అకార మాదేశమగును. పథ ఆ + స్.

* 369. థో న్థః. 7-1-87. థః। న్థః। (పథిమథోః। సర్వనామస్థానే)

పథిమథోస్థస్య న్థాదేశః స్యాత్సర్వనామస్థానే పరే। పన్థాః। పన్థానౌ। పన్థానః। పన్థానమ్। పన్థానౌ॥

369. ఋభుక్షిన్ శబ్దమున థకార మసంభవమగుటవలన నా శబ్దమను వృత్తముగాదు. పథిన్, మథిన్ శబ్దములయొక్క థకారమునకు సర్వనామస్థానము పరమగునపుడు, న్థాదేశమగును. స్థాన్యాదేశములలోని అకార ముచ్చారణార్థము. (పథ ఆ + స్) పన్థ ఆ + స్, సవర్ణదీర్ఘము. ఋత్వవిసర్గములు. పన్థాః. పథిన్ + ఔ, అత్వము, న్థాదేశము, సర్వనామస్థానే (251) సూ. చే, నుపధా దీర్ఘము. పన్థానౌ, పన్థానః, పన్థానమ్, పన్థానౌ. రూపములు నిల్చె.

* 370. భస్య టేర్లోపః. 1-7-89. భస్య। టేః। లోపః। (పథిమథ్యృభుక్షామ్)

భసంజ్ఞకస్య పథ్యాదేష్టేర్లోపః స్యాత్, పథః। పథా। పథిభ్యామిత్యాది. ఏవం మన్థాః। ఋభుక్షాః స్త్రియాంనా న్తలక్షణే జీపి భత్వాట్టిలోపేన। సుపథీ। సుమథీ నగరీ, అన్ఋభుక్షీ సేనా। అత్వం నపుంసకే న భవతి। నలుమ తేతి ప్రత్యయలక్షణ నిషేధాత్। సుపథివనమ్। (వా) సంబుద్ధౌ నపుంసకానాం నలోపో వా వాచ్యః। హేసుపథిన్। హేసుపథి। 'న లోపః సుప్స్వ రేతి నలోపస్యాసిద్ధత్వాద్ధ్రస్వస్య గుణో న। ద్వివచనే భత్వాట్టిలోపః। సుపథీ। శౌ సర్వనామస్థానత్వాత్ సుపన్థాని। పునరపి సుపథి। సుపథీ। సుపన్థాని। సుపథా। సుపథే। సుపథిభ్యామిత్యాది॥

370. భసంజ్ఞకములగు పథ్యాదులయొక్క టిసంజ్ఞకమునకు లోపమగును. పథిన్ + శస్. పథః ఇత్యాదులగును. హలాది విభక్తులందు నలోపమగును. పథిభ్యామిత్యాదులు. ఇట్లే మథిన్, ఋభుక్షిన్ శబ్దములుగూడ నూహింపదగును. ప్రాసఙ్గికములగు విషయములను చెప్పుచున్నాడు. సుపథిన్ (శోభనః, పంథాః యస్యాం) శబ్దమునకు స్త్రీలిఙ్గమున 'ఋన్నేభ్యో ఙీప్, (307) సూ. చే, నకారాన్త నిమిత్తకము ఙీప్ప్రత్యయమగును. ఙీప్ ప్రత్యయము వచ్చినపుడు పూర్వమునకు భసంజ్ఞ యుండుటవలన నీ సూత్రముచే టిలోపము ప్రవర్తించిన సుపథీ (నగరీ) అనియగును. స్త్రీలిఙ్గమగు సుమథిన్ శబ్దము నిట్లే. (నవిద్యతే ఋభుక్షాయస్యామ్ + అనృభుక్షీ (సేనా) ఇదియును సుపథిన్ శబ్దసదృశమే. శోభనః పన్థా యస్య తత్ సుపథిన్, నపుంసకమున ప్రథమైకవచనము లుక్కుచే నపహృతమగుటచేతను, 'నలుమతాఙ్గస్య, అను నిషేధముచే ప్రత్యయలక్షణము ప్రవర్తింపకపోవుటచేతను, సుపథిన్ + (స్) అనుచోట 'పథిమథ్యృభుక్షామ్, సూ. చే, నాత్వము ప్రవర్తించదు. పదమగుటవలన నలోపమగును. సుపథి (వనమ్) (వా) "సంబుద్ధౌ...వాచ్యః" నపుంసకలిఙ్గములకు సంబుద్ధి పరమగునపుడు నలోపము వికల్పముగ జెప్పదగును. సంబుద్ధి లుక్కుచే నపహృతమైనందున సంబుద్ధి పరత్వము సంభవింపకపోవుటచే 'నఙిసంబుద్ధ్యోః, (353) నిషేధము ప్రవర్తించదు గావున నలోపము నిత్యముగ ప్రాప్తమగుచుండ వికల్పార్థమీవార్తిక మారబ్ధమయ్యెను. హేసుపథిన్, హేసుపథి, నలోపపక్షమందు 'నలోపః సుప్ స్వర, (354) సూ. చే, నలోపమసిద్ధమగుటవలన సుబాశ్రయమైన 'హ్రస్వస్య గుణః, (243) సూ. చే, గుణము ప్రవర్తించదు. సుపథిన్ + శీ (ఔ) ద్వివచనము పరమగునపుడు భసంజ్ఞ యుండుటవలన టిలోపమగును. సుపథీ. సుపథిన్ + శి, ఇచట సర్వనామస్థానము పరమగుటచే, అత్వస్థాదేశోపధాదీర్ఘములు ప్రవర్తించును. సుపన్థాని. ఇట్లే ద్వితీయావిభక్తియందును ప్రక్రియ నూహింపదగును. తృతీయాద్యజాది విభక్తులందు భసంజ్ఞ యుండుటవలన టిలోపము. సుపథా, ఇత్యాదులు. హలాది విభక్తులందు నలోపము. సుపథిభ్యామ్, (సుపథిన్ + భ్యామ్) ఇత్యాదులు.

* 371. ష్ణాన్తా షట్. 1-1-24. ష్ణాన్తా। షట్। (సంఖ్యా)

షాన్తా నాన్తా చ సంఖ్యా షట్సంజ్ఞా స్యాత్। షడ్భ్యో లుక్। పఞ్చ 2. సంఖ్యా కిమ్. విప్రుషః। పామానః। శతాని సహస్రాణీత్యత్ర సన్నిపాత పరిభాషయా నలుక్। సర్వనామస్థాన సన్నిపాతేన కృతస్య నుమస్తదవిఘాతకత్వాత్। పఞ్చభిః। పఞ్చభ్యః। షట్చతుర్భ్యశ్చేతి నుట్ ॥

371. 'ష్ణాన్తా, అనునది ద్వన్ద్వగర్భితమగు బహువ్రీహి. షశ్చ, నశ్చ, ష్ణౌ, తౌ అన్తౌయస్యాః. సంఖ్యా అనునది విశేష్యము. షకారాన్తముగాని నకారాన్తముగాని అయిన సంఖ్యావాచకము షట్ సంజ్ఞకమగును. పఞ్చన్ శబ్దము నిత్యబహువచనాన్తము. పఞ్చన్ + జస్. శస్. 'షడ్భ్యో లుక్, (262) సూ. చే. జశ్శస్సులకు లుక్కగును. పఞ్చ 2. సంఖ్యాపద మనువర్తించనిచో షకారాన్తమైన విప్రుష్ శబ్దమునకు, నకారాన్తమగు పామన్ శబ్దమునకును షట్ సంజ్ఞ ప్రసక్తమగును. అపుడు 'విప్రుషః, పామానః, అనుచోట జస్సునకు లుక్కు ప్రసక్తమగును. శత, సహస్ర; శబ్దములకు జశ్శస్సులందు సర్వనామస్థాన నిమిత్తకమగు 'నపుంసకస్య ఝలచః, (315) సూ. చే, నుమాగమము, ఉపధాదీర్ఘము ను ప్రవర్తించిన 'శతాని, సహస్రాణి అను రూపము లగును. నుమాగమమువలన నివి నాన్త సంఖ్యావాచకములగుటచే షట్ సంజ్ఞ ప్రాప్తమగుచున్నది. అట్లయిన జశ్శస్సులకు లుక్కు ప్రసక్తమగును. కాని సన్నిపాతపరిభాషచే లుక్కు ప్రవర్తించదు. సర్వనామస్థాన సంబంధమువలన ప్రవృత్తమయిన నుమాగమము షట్సంజ్ఞాద్వారా సర్వనామస్థాన విఘాతకము గాదు. పఞ్చభిః పఞ్చభ్యః, 2. ఇచట 'న లోపః ప్రాతిపదికాన్తస్య, (237) సూ. చే, నలోపమగును. పఞ్చన్ + ఆమ్, 'షట్ చతుర్భ్యశ్చ, (339) సూ. చే, నుడాగమము. పఞ్చన్ + నామ్, ఇట్లుండ.

* 372. నోపధాయాః. 6-4-7. ఉపధాయాః। (నామి। దీర్ఘః)

నాన్తస్యోపధాయా దీర్ఘః స్యాన్నామి పరే। నలోపః। పఞ్చానామ్। పఞ్చసు। పరమపఞ్చ। పరమపఞ్చానామ్। గౌణత్వే తు న లుఙ్నుటౌ। ప్రియపఞ్చా॥ ప్రియపఞ్చానౌ। ప్రియపఞ్చానః। ప్రియపఞ్చ్ఞమ్। ఏవం। సప్తన్ నవన్। దశన్.

372. న, అనునది లుప్తషష్ఠ్యన్తము, అజమునకు విశేషణము. నకారాన్తమగు నజమునకు 'నామ్, పరమగునపుడు ధా దీర్ఘమగును. పఞ్చన్ + నామ్, పఞ్చాన్ + నామ్, నలోపము, పఞ్చానామ్. ఇచట నలోప మసిద్ధమగుటవలన 'నామి, (210) సూ. చే, దీర్ఘమప్రాప్తమగుచుండ నీ సూత్రమారంభింపబడెను. పఞ్చసు. ఇట్లే 'పరమపఞ్చన్ శబ్దము. పరమపఞ్చన్ + ఆమ్. ఇచట షట్ సంజ్ఞకమగు పఞ్చన్ శబ్దముయొక్క యర్థము ప్రధానమగుటచే 'షట్ చతుర్భ్యశ్చ, సూ. చే, నుడాగమము ప్రవర్తించును. కావున 'పరమ పఞ్చానామ్ అని యగును. 'ప్రియాః, పఞ్చయస్య, ప్రియపఞ్చన్. ఇచట పఞ్చన్ శబ్దార్థ మన్యపదార్థమును గుఱించి యుపసర్జనమగుటచే జశ్శస్సులకు లుక్కుగాని 'ఆమ్, నకు నుడాగమముగాని ప్రవర్తించదు. గౌణమున ప్రవర్తించకపోవుటలో సూత్రములోని బహువచనములే ప్రమాణము. కావున

నీ శబ్దము సర్వనామస్థానమందు హలాది విభక్తులందును రాజన్ శబ్దసదృశము. శస్ మొదలగు నజాదివిభక్తులం దల్లోపము. చకారమునకు పరముగనున్న నకారమునకు శ్చుత్వము నగును. ప్రియపఞ్చః, ప్రియపఞ్చా౯్, ఞకారద్వయ మధ్యను చకారముండును. సప్తన్, నవన్, దశన్, శబ్దములు పఞ్చన్ శబ్దసదృశములు.

* 373. అష్టన ఆ విభక్తౌ. 7-2-84. అష్టనః। ఆ। విభక్తౌ। (హలి)

అష్టన ఆత్వం స్యాద్ధలాదౌ విభక్తౌ॥

373. అష్టన్ శబ్దమునకు హలాదివిభక్తి పరమగునపు డాకారమాదేశమగును.

* 374. అష్టాభ్య ఔశ్. 7-1-21. అష్టాభ్యః। ఔశ్। (జశ్శసోః)

కృతాకారాదష్టనః పరయోర్జశ్శసోరౌశ్ స్యాత్। అష్టభ్య ఇతి వక్తవ్యే కృతాత్వనిర్దేశో జశ్శసోర్విషయే ఆత్వం జ్ఞాపయతి। వైకల్పికత్వం చేదమష్టన ఆత్వమ్। అష్టనో దీర్ఘాదితి సూత్రే దీర్ఘగ్రహణాత్ జ్ఞాపకాత్। అష్టౌ 2. పరమాష్టౌ। అష్టాభిః। అష్టాభ్యః 2. అష్టానామ్। అష్టాసు। ఆత్వాభావే, . అష్ట, అష్ట, ఇత్యాది పఞ్చవత్। గౌణత్వే త్వాత్వాభావే రాజవత్। శసి। ప్రియాష్ట్నః। ఇహ పూర్వస్మాదపి విధావల్లోపస్య స్థానివత్త్వాన్న ష్టుత్వమ్। కార్యకాల పక్షే బహిరఙ్గస్యాల్లోపస్యాసిద్ధత్వాద్వా। ప్రియాష్ట్నా ఇత్యాది జశ్శసోరనుమీయమానమాత్వం ప్రాధాన్య ఏవ। సతు గౌణతాయామ్। తేన ప్రియాష్ట్నో హలాదావేవ వైకల్పికమాత్వమ్। ప్రియాష్టాభ్యామ్। ప్రియాష్టాభిః। ప్రియాష్టాభ్యః। 2. ప్రియాష్టాసు. శ్లో॥ ప్రియాష్ట్నో రాజవత్సర్వం హాహావచ్చాపరంహలి। భష్భావః। జశ్త్వచర్త్వే। భుత్। భుద్। బుధౌ। బుధః। బుధా। భుద్భ్యామ్। భుత్సు॥

374. ఆత్వమును పొందిన అష్టన్ శబ్దముకంటె పరములగు జశ్శస్సులకు ఔ (శ్) ఆదేశమగును. ఇది శిత్తగుటచే సర్వమున కాదేశమగును. హలాది విభక్తులందే ఆత్వమును విధించుటవలన జశ్శస్సులు పరమగునపు డాత్వమున కుపాయమును జ్ఞాపించుచున్నాడు. సూత్రమున 'అష్టాభ్యః' అనునది కృతాత్వ

మున కనుకరణముగాని, 'అష్టన ఆవిభక్తౌ, సూత్రముచే విహితమగు నాత్వము వలన సిద్ధమయినదిగాదు. అట్లయిన వక్ష్యమాణ జ్ఞాపకముచే నాత్వము వికల్పము గావున గురుభూతమగు 'అష్టాభ్యః, అను దానిని విడిచి లఘుభూతమగు 'అష్టభ్యః, అనుదానినే చెప్పను. ఇట్లు కృతాత్వనిర్దేశము జశ్శస్సులు పరమగు నపుడాత్వమును జ్ఞాపకముచేయును. అష్టన్ శబ్దమునకు సూత్రముచే విహితమయి నట్టియు, జ్ఞాపకముచే సిద్ధమయినట్టియు నగు నీ రెండు విధములగు నాత్వము వికల్పముగ్గనగును. ఇట్లు చెప్పుటలో 'అష్టనో దీర్ఘాత్, అను సూత్రమందలి దీర్ఘగ్రహణము ప్రమాణము. సర్వనామస్థాన భిన్నవిభక్తి. దీర్ఘాన్తమగు నష్టన్ శబ్దముకంటె పరమగునపుడుదాత్తమగునని సూత్రార్థము. ఉదా॥ అష్టాభిః. 'అష్టభిః, అనుచోట భిస్సున కుదాత్తమును వారించుటకై 'దీర్ఘాత్, అను విశేషణము. ఆత్వము నిత్యమైనచో 'అష్టభిః, ఇత్యాది రూపములే యసంభవములు గాన నీవిశేషణము వ్యర్థమయి సామాన్యముగ నాత్వ వికల్పమున జ్ఞాపకమగును. అష్టన్ + జస్. శస్. అష్టన్ శబ్దమున కాత్వము. (జ్ఞాపక సిద్ధము) జశ్శస్సులకు ఔశాదేశము, వృద్ధి. అష్టౌ 2. ఔశాదేశ మఙ్గాధికారస్థ మగుటవలన తదన్తముకంటె పరములగు జశ్శస్సులకు నాదేశమగును. పరమాష్టౌ. ఆత్వపక్షమున అష్టాభిః (అష్టన్ + భిస్) అష్టాభ్యః. అష్టన్ + ఆమ్. ఇచట 'షట్ చతుర్భ్యశ్చ, సూత్రముచే నుడాగమము చేసినచో హలాదివిభక్తి పరమందుండును గాన ఆత్వము ప్రవర్తించిన 'అష్టానామ్, అని యగును. అష్టాసు. ఆత్వాభావ పక్షమందు అష్టన్ శబ్దము పఞ్చన్ శబ్దసదృశము. అష్ట ఇత్యాదులగును. (ప్రియాః అష్టౌ యస్య) ప్రియాష్టన్ + స్. అష్టన్ శబ్దార్థ ముపసర్జనమైనపుడు ఆత్వాభావ పక్షమున ప్రియాష్టన్ శబ్దము రాజన్ శబ్దసదృశము. ప్రియాష్టా, ప్రియాష్టానౌ, ప్రియాష్టానః ప్రియాష్టానమ్, ప్రియాష్టానౌ. ప్రియాష్టన్ + శస్, ఇచట నల్లోపముచే ప్రియాష్ట్నః అని యగును. 'అచః, పరస్మిన్, అను సూత్రమున స్థానిభూతమగు నచ్చుకంటె పూర్వమగు వర్ణముకంటె పరమగుదానికి కార్యము చేయునపు డజాదేశము స్థానివద్భావము నొందునను పఞ్చమీసమాస పక్షము నాశ్రయించుటవలన నిచట నల్లోపము స్థానివంటిదగుటచే అకార వ్యవధానముండును గాన నకారమునకు ష్టుత్వము రాదు. లక్ష్యానుసారమున నిచట నన్తరఙ్గ పరిభాష విషయమై కార్యకాల పక్షము నాశ్రయించుటవలన నన్తరఙ్గము (ష్టుత్వము) త్రైపాదికమైనను పరిభాష ప్రవర్తించును. కావున నన్తరఙ్గమగు ష్టుత్వము చేయునపు డజాది ప్రత్యయ నిమిత్తకమగుటవలన బహిరఙ్గమగు నల్లోప మసిద్ధమగుటవలనగూడ నిచట ష్టుత్వమును వారింపవచ్చును. ప్రియాష్ట్నః, ప్రియాష్ట్నా, ఇత్యాదు లగును. ఔశ్ విధాయక సూత్రమున 'అష్టాభ్య ఔశ్, అని యనక 'అష్టాభ్యః, అను బహువచన నిర్దేశమువలన లుక్ నుడాగమములవలె, అష్టన్ శబ్దార్థము ప్రధానమగునపుడే ఔశాదేశమగును. ఔశ్విధిలో కృతాత్వానుకరణమువలన గ్రహింపబడిన నాత్వమును అష్టన్ శబ్దార్థ ప్రాధాన్యమందే ప్రవర్తించుట

యుచితము గాన గౌణమున ప్రవర్తించదు. కావున ప్రియాష్టన్ శబ్దమునకు హలాదులందే వైకల్పికమగు నాత్వమగును. ప్రియాష్టాభ్యామ్, ప్రియాష్టాభిః. ఇత్యాదులు. 'పై యర్థమునే కారికచే సంగ్రహించుచున్నాడు. శ్లో॥ ప్రియాష్టౌ...హలి. ప్రియాష్టన్ శబ్దము రాజన్ శబ్దసదృశము. హలాది విభక్తులందు మాత్ర మాత్వపక్షమున హాహా శబ్దసదృశరూపములుగూడ నగునని యర్థము. బుధ (అవగమనే) ధాతువుకంటె క్విప్ప్రత్యయము చేసినచో బుధ్ శబ్దము సిద్ధమగును. (తెలిసికొనువాడు) బుధ్ + స్, సులోప భష్భావములు, భుధ్, జశ్త్వచర్త్వములు, భుత్, భుద్. బుధౌ, బుధః, బుధా, భుద్భ్యామ్, భుత్సు.

వివ:—త్రైపాదికమగు ష్టుత్వము చేయునపుడు 'పూర్వత్రాసిద్ధే నస్థానివత్, (త్రైపాదిక కార్యము చేయునపు డాదేశము స్థానివద్భావము నొందదు) అను నిషేధమువలన నల్లోపమునకు స్థానివద్భావ నిషేధము ప్రాప్తమగుచున్నది. కాని తస్య దోషః సంయోగాది లోపలత్వణత్వేషు (సంయోగాది లోపము = స్కోః సంయోగాద్యోః, (382) లత్వము = అచి విభాషా. (8-2-31) ణత్వము = రషాభ్యాం నోణః (236) ఇవి చేయునపుడు స్థానివద్భావ నిషేధమునకు నిషేధమును జెప్పవలయును) అనుదానిచే నిచట స్థానివద్భావనిషేధము ప్రవర్తించదు. కావున నీ యభిప్రాయముతో మొదటి సమాధానము జెప్పబడెను. 'తస్య దోషః, అను వచనములోని ణగ్రహణము దీక్షిత రచితశబ్దకౌస్తుభమందు ప్రత్యాఖ్యాతమయినందున ణత్వము చేయునపుడు పూర్వోక్త స్థానివద్భావ నిషేధము ప్రవర్తించునను యాశయయతో రెండవ సమాధానము జెప్పబడెను.

* 375. ఋత్విగ్దధృక్ స్రగ్దిగుష్ణిగఞ్చు యుజిక్రుఞ్చాం చ.
3-2-59. ఋత్విక్...ఞ్చాం చ। (ధాతోః, క్విన్)

ఏభ్యః క్విన్ స్యాత్। అలాక్షణికమపి కించి
త్కార్యం నిపాతనాల్లభ్యతే। నిరుప పదాద్యుజేః
క్విన్। కనావితౌ ॥

375. (ఋతు) యజ్, ధృష్, సృజ్, దిశ్; (ఉద్) స్నిహ్, అఞ్చు, యుజ్, క్రుఞ్చు, ఈ ధాతువులకంటె క్విన్ప్రత్యయమగును. 'ఋత్విక్, దధృక్, ఇత్యాదులం దప్రాప్తములగు కుత్వద్విత్వాదుల కుపాయమును ప్రదర్శించుచున్నాడు. 'అలాక్షణికమపి......లభ్యతే. శాస్త్రము (సూత్రాదులు) వలన నప్రాప్తములగు కొన్ని కార్యములు శాస్త్రకారుల సిద్ధరూప నిర్దేశమువలన లభ్యములగునని యర్థము. యుజ్ ధాతువుకంటె క్విన్ప్రత్యయ విధానమునకు ముందు చెప్పబోవు 'క్విన్ప్రత్యయస్య కుః, (379) సూ. చే, విహితమగు కుత్వము ఫలము. ఈ కుత్వము, యుజ్ శబ్దమునకు

'యుజేరసమాసే (378) సూ. చే, విహితమగు నుమాగమమునకగును. ఆ నుమాగమము సమాసమందే విధింపబడినది. 'సుయుజ్' ఇత్యాది సమాసము లందు 'చోః కుః' (380) సూత్రముచేతనే కుత్వము సిద్ధమగుటచే క్విప్ క్విన్ ప్రత్యయములలో భేదము లేదు. కావున నుపపదరహితమగు అనగా కేవలమగు యుజధాతువుకంటె నీసూత్రముచే క్విన్ప్రత్యయమగునని ఫలితమగును. క్విన్ప్రత్యయమున కకారనకారము లిత్సంజ్ఞకములు. ఇకార ముచ్చారణార్థము.

* 376. కృదతిఙ్ 3-1-93 కృత్, అతిఙ్, (ధాతోః, ప్రత్యయః)

సన్నిహితే ధాత్వధికారే తిఙ్ భిన్నః ప్రత్యయః కృత్సంజ్ఞః స్యాత్.

376. సమీపముననున్న 'ధాతోః' (3-1-91) అను నధికారమున ధాతువుకంటె విహితమై తిఙ్ భిన్నమయిన ప్రత్యయము కృత్సంజ్ఞ కలదగును. ఈ సూత్రముచే విహితమగు క్విన్ ప్రత్యయము కృత్తగును. యుజ్ + వ్, అని యుండ.

* 377. వేరపృక్తస్య 6-1-67 వేః, అపృక్తస్య, (లోపః)

అపృక్తస్య వస్య లోపః స్యాత్। కృత్తద్ధితేతి ప్రాతిపదికత్వాత్స్వాదయః॥

377. ఇత్సంజ్ఞారహితములగు క్విన్, క్విప్, విచ్, మొదలగునవి 'వి' అను పదముచే గ్రహింపబడును. అపృక్త సంజ్ఞకమిగు 'వి' అనుదానికి (వ్) లోపమగును. క్విన్ ప్రత్యయము కృత్సంజ్ఞకమగుటచే తదన్తము. కృత్తద్ధిత (180) సూ. చే, ప్రాతిపదికమగును, గనుక యుజ్ శబ్దముకంటె స్వాదు లుత్పన్నములగును.

* 378. యుజేరసమాసే 7-1-71 యుజేః, అసమాసే, (సర్వనామస్థానే, నుమ్)

యుజేః సర్వనామస్థానే నుమ్ స్యాదసమాసే। సులోపః। సంయోగాన్తలోపః॥

378. 'యుజ్' అనుదానికి సర్వనామస్థానము పరమగునపుడు నుమాగమమగును, సమాసమున రాదు. యుజ్ + స్. యున్ జ్ + స్. సులోప సంయోగాన్తలోపములు. యున్, ఇట్లుండ.

* 379. క్విన్ప్రత్యయస్య కుః 8-2-62 క్విన్ప్రత్యయస్య, కుః, (పదస్య, అన్తే)

క్విన్ప్రత్యయో యస్మాత్తస్య కవర్గోఽన్తాదేశః స్యాత్పదాన్తే। నస్య కుత్వేన ఙకారః। యుఙ్। నశ్చా

పదాన్తస్యేతి నుమోఽనుస్వారః। పరసవర్ణః। తస్యా
సిద్ధత్వాచ్చోః కురితి కుత్వం న। యుఞ్జౌ, యుఞ్జః,
యుఞ్జమ్, యుఞ్జౌ, యుజః। యుజా, యుగ్భ్యామి
త్యాది। అసమాసే కిమ్॥

379. క్విన్ప్రత్యయస్య (క్విన్ ప్రత్యయో యస్మాత్) అనునది బహువ్రీహి. క్విన్నన్తమని యర్థము. క్విన్ప్రత్యయాన్తమునకు పదాన్తమందు కవర్గమన్తాదేశమగును. 'క్విన్ః కుః, అనినను, ప్రత్యయ గ్రహణ పరిభాషచే క్విన్నన్తమను నర్థము లబ్ధమగుచుండ నతిరిక్తమగు ప్రత్యయగ్రహణ సామర్థ్యమువలన నిది 'అతద్గుణ సంవిజ్ఞాన బహువ్రీహి' యగును. దీనికి ఫలము ముందు 'ఘృతస్పృక్', శబ్దమందు చూపబడును. యుఙ్ అనుచోట పదాన్త నకారమునకు స్థానకృత సాదృశ్యమువలన ఙకారమగును. యుఙ్. యున్ జ్ + ఔ, నుమాగమమునకు 'నశ్చాపదాన్తస్య ఝలి, సూత్రముచే ననుస్వారము, 'అనుస్వారస్య (125) సూ. చే, పరసవర్ణము, ఇయ్యది అసిద్ధమగుటచే 'చోః కుః, (380) సూ. చే, కుత్వము రాదు. యుఞ్జౌ, యుఞ్జః, యుఞ్జమ్, యుఞ్జౌ, యుజః, (యుజ్ + శస్) యుగ్భ్యామిత్యాదులగును. నుమ్విధాయక సూత్రమున 'అసమాసే. అనునది లేనిచో 'సుయుక్, అను సమాసమునగూడ నుమ్ము ప్రసక్తమయ్యెడిని.

* 380. చోః కుః. 8-2-30 చోః, కుః, (ఝలి, పదస్య, అన్తే)

చవర్గస్య కవర్గః స్యాజ్ఝలి పదాన్తే చ। ఇతి
కుత్వమ్। క్విన్ప్రత్యయస్యేతి కుత్వస్యాసిద్ధత్వాత్।
సుయుక్। సుయుగ్। సుయుజౌ। సుయుజః। యుజేరితి
ధాతుపాఠపఠితేకార విశిష్టస్యానుకరణమ్ నత్వికా ని
ర్దేశః। తేనేహ న। యుజ్యతే సమాధత్తే ఇతి యుక్।
యుజ సమాధౌ దైవాదిక ఆత్మనేపదీ। సంయోగా
న్తలోపః। ఖఙ్। ఖఞ్జౌ। ఖఞ్జః ఇత్యాది. వ్రశ్చేతిష
త్వమ్. జశ్త్వచర్త్వే। రాట్। రాడ్। రాజౌ। రాజః।
రాట్త్సు। రాట్సు। ఏవం విభ్రాట్। దేవేట్। దేవే
జౌ। దేవేజః। విశ్వసృట్। విశ్వసృడ్। విశ్వసృజౌ। వి
శ్వసృజః। ఇహ సృజియజ్యోః కుత్వం నేతి క్లీబే వ
క్ష్యతే। పరిమృట్। షత్వవిధౌ రాజిసాహచర్యాత్
టుభ్రాజృ దీప్తావితి ఫణాదిరేవ గృహ్యతే। యస్తు ఏ
జృభ్రేజృభ్రాజృదీప్తావితి తస్య కుత్వమేవ। విభ్రాక్,
విభ్రాగ్, విభ్రాగ్భ్యామిత్యాది। (వా) పరౌ వ్రజేః
షః పదాన్తే। పరావుపపదే వ్రజేః క్విప్ స్యాద్దీర్ఘ

శ్చ. పదాన్తవిషయే షత్వంచ। పరిత్యజ్య సర్వం ప్ర
జతీతి పరివ్రాట్। పరివ్రాజౌ। పరివ్రాజః॥

380. ఝల్పరకముగాని, పదాన్తముగాని అయిన చవర్గమునకు కవర్గమాదేశమగును. సుయుజ్ (క్విబన్తము) సుయుజ్ + స్, సులోపము. పదాన్తమగుటవలన నీ సూత్రముచే కుత్వము. ఇది ప్రవర్తించునపుడు 'క్విన్ప్రత్యయస్య కుః' అను సూత్రవిహితమగు కుత్వ మసిద్ధమగును. సుయుఙ్. 'వావసానే' (207) సూ. చే, వైకల్పిక చర్త్వము. సుయుక్, సుయుఙ్. సుయుజౌ, సుయుజః, సుయుజా. సుయుగ్భ్యామిత్యాదులు. 'యుజేరసమాసే' అను సూత్రమున యుజి అనునది ధాతుపాఠమున నికారముతో పఠింపబడిన యుజిర్ (యోగే) అను ధాతువున కనుకరణముగాని ఇక ప్రత్యయాన్తము గాదు. సూత్రములందు ధాతువు ఇక్ ప్రత్యయాన్తముగాను శ్తిప్ ప్రత్యయాన్తముగాను నిర్దేశింపబడును. (ఇక్ శ్తిపౌ ధాతునిర్దేశే) కమేర్ణిఙ్, (3-1-10) భవతేరః (7-4-73) సూత్రములు, క్రమముగ నుదాహరణములు. ఇచట యుజేః అనునది మాత్రము శిష్టుల వ్యాఖ్యానము ననుసరించి యట్లుగాదని భావము. కనుక దివాదిగణమున నాత్మనేపదిగ బఠింపబడిన యుజ (సమాధౌ) అను అకారాన్త ధాతువునకు గ్రహణము లేదు. యుజ్యతే (సమాధత్తే), అను నర్థమున సమాగమము రాదు. కావున క్విబన్తమగు నీ యుజ్ శబ్దమునకు 'యుక్' అనియే రూపమగును. యుజి అనునది ఇక్ ప్రత్యయాన్తము గాదనుట కిదియే ఫలము. యుజౌ, యుజః, యుజా, యుగ్భ్యామ్, ఇత్యాదులు. ఖజి (గతివైకల్యే) అను ధాతువుకంటె 'ఖఞ్జతి' అను నర్థమున క్విప్ ప్రత్యయము. ఖఞ్జ్ + స్, సులోప సంయోగాన్త లోపములు. ఇచట ఞకారము నకార జన్యమగుటవలన జకారము లోపించునపుడు నకారమగును. ఖన్, ఖఞ్జౌ. ఖఞ్జః ఇత్యాదులగును. రాజృ (దీప్తౌ) ధాతువుకంటె క్విప్ ప్రత్యయము. రాజ్ + స్, సులోపము. వ్రశ్చభ్రస్జ (295) సూ. చే, షత్వము. జశ్త్వచర్త్వములు. రాట్, రాడ్, రాజౌ, రాజః. రాజా, రాడ్భ్యామ్, రాజ్ + సు. షత్వజశ్త్వములు. రాడ్ + సు. 'డస్సి ధుట్' (132) సూ. చే, ధుడాగమము, చర్త్వము, రాట్త్సు. ధుడభావ పక్షమందు రాట్సు. ఫణాదులలోని భ్రాజధాతువుకంటె క్విప్ ప్రత్యయము. విభ్రాజ్, (విశేషేణ భ్రాజతే, మిక్కిలి ప్రకాశించువాడు) దేవాన్ యజతి (దేవులను పూజించువాడు) అను నర్థమున దేవశబ్దపూర్వక యజ్ ధాతువుకంటె క్విప్ ప్రత్యయము. దేవేజ్. విశ్వం సృజతి, (ప్రపఞ్చమును సృజించువాడు) అను నర్థమున విశ్వశబ్దపూర్వక సృజ ధాతువుకంటె క్విప్ ప్రత్యయము. విశ్వసృజ్. ఈ శబ్దములకు రాజ్ శబ్దమునకువలె షత్వాదికార్యము లగును. విభ్రాట్, విభ్రాడ్. షిభ్రాడ్భ్యామ్. దేవేట్. దేవేడ్. దేవేడ్భ్యామ్, విశ్వసృట్, విశ్వసృడ్. విశ్వసృడ్భ్యామ్, ఇత్యాదులగును. క్విన్ ప్రత్యయస్య (379) అను సూత్రమున నతద్గుణ సంవిజ్ఞాన

బహువ్రీహి నాశ్రయించుటచే నిపుడు క్లీబన్తములయిన నొకపుడు క్లీవన్నన్తము లగుటవలన వీనికి కత్వము ప్రాప్తమగుచున్నది. అయినను 'సృజిదృశోః (6-1-58) అను సూత్రమున 'రజ్జుసృడ్భ్యామ్, అనియు, 'కామ్యచ్చ' (3-1-9) అను సూత్రమున 'ఉపయట్ కామ్యతి, అనియును భాష్యకార ప్రయోగములవలన క్లీబన్తములగు వీనికి కత్వము రాదని చెప్పవలయును. ఈ విషయము నపుంసకలిఙ్గ ప్రకరణమున చెప్పబడును. పరిమాట్ (శుభ్రపరచుచున్నాడు) అను నర్థమున పరిపూర్వక మృజ్ ధాతువుకంటె క్విప్ ప్రత్యయము. పరిమృజ్. ఇదియును రాజ్ శబ్దసదృశమే. 'పరిమృట్, ఇత్యాదు లగును. 'వ్రశ్చభ్రస్జ, (295) సూత్రమున రాజ్ సాహచర్యము (సహచరితా సహచరితయో స్సహచరితస్యైవ గ్రహణమ్) వలన ఫణాదులలోని 'టుభ్రాజృ (దీప్తౌ) అనునదియే గ్రహింపబడును. కావున 'ఏజృ భ్రేజృ భ్రాజృ (దీప్తౌ) అనుచోట పఠింపబడిన భ్రాజృ ధాతువునకు షత్వము రాదు. 'చోః కుః, సూ. చే, కత్వమేయగును. విభ్రాక్. విభ్రాగ్భ్యామిత్యాదులగును. 'పరౌ వ్రజేః షః పదాన్తే, ఇది యుణాది సూత్రము. పూర్వసూత్రమునుండి క్విప్ దీర్ఘము లనువర్తించును. పరిపూర్వక వ్రజధాతువునకు క్విప్ ప్రత్యయము, ఉపధకు దీర్ఘము నగును, పదాన్తమున షత్వముగూడ నగునని యర్థము. ఈ షత్వము 'చోః కుః అను కుత్వమున కపవాదము. పరివ్రాట్ (పరిత్యజ్య సర్వం వ్రజతి సర్వమును విడిచి పోవువాడు) సన్యాసి అని యర్థము. పరివ్రాజ్ + స్. పరివ్రాట్, పరివ్రాడ్, పరివ్రాజౌ, పరివ్రాజః, పరివ్రాడ్భ్యామ్, ఇత్యాదులగును.

* 381. విశ్వస్య వసురాటోః. 6-3-128. విశ్వస్య। వసురాటోః। (దీర్ఘః)

విశ్వశబ్దస్య దీర్ఘః స్యాద్వసౌ రాట్ శబ్దే చ పరే। విశ్వం వసు యస్య సః। విశ్వావసుః। రాడితి పదాన్తోపలక్షణార్థమ్। చర్త్వమ వివక్షితమ్। విశ్వారాట్। విశ్వారాడ్। విశ్వరాజౌ। విశ్వరాజః। విశ్వారాడ్భ్యామిత్యాది॥

381. విశ్వశబ్దమునకు వసు శబ్దముగాని, రాట్ శబ్దముగాని పరమగు నపుడు దీర్ఘమన్తాదేశమగును. (విశ్వం వసు యస్య = ప్రపఞ్చము ధనముగ గలవాడు) విశ్వావసుః. సూత్రమున 'రాట్' అనునది పదాన్తమున కుపలక్షణము. పదాన్తమందలి ఫలితార్థము. రాట్ అనుచోట చర్త్వమవివక్షితము. కావున జశ్త్వము ప్రవర్తించినచోటను దీర్ఘము వచ్చును. 'విశ్వస్మిన్ రాజతే, (ప్రపఞ్చమందు ప్రకాశించువాడు) అను నర్థమున విశ్వశబ్దపూర్వక రాజ్ ధాతువుకంటె క్విప్ ప్రత్యయము, విశ్వరాజ్ + స్, సులోప షత్వ జశ్త్వ

చర్త్వ దీర్ఘములు. విశ్వారాట్, విశ్వారాడ్. విశ్వరాజౌ, (విశ్వరాజ్ + ఔ) జకారము పదాన్తము గానందున దీర్ఘాదులు రావు. ఇట్లే విశ్వరాజః అనునది. విశ్వారాడ్భ్యామ్. రాట్టనుచోట చర్త్వము వివక్షితము గానందున నిచటను దీర్ఘమగును.

* 382. స్కోః సంయోగాద్యోరన్తే చ. 8-2-29. స్కోః। సంయోగాద్యోః। అన్తే। చ। (ఝలి। పదస్య)

పదాన్తే ఝలి చ పరే యః సంయోగః త దాద్యోః సకారకకారయోర్లోపః స్యాత్। భృట్। భృడ్। సస్య శ్చుత్వేన శః। తస్య జశ్త్వేన జః। భృజ్జౌ। భృజ్జః। ఋత్విగిత్యాదినా ఋతావుపపదే యజేః క్విన్। క్విన్నన్తత్వాత్కుత్వమ్। ఋత్విక్, ఋత్విగ్। ఋత్విజౌ। ఋత్విజః। రాత్సస్యేతి నియమాన్న సంయోగాన్తలోపః। ఊర్క్। ఊర్గ్। ఊర్జౌ। ఊర్జః। త్యదాద్యత్వం। పరరూపత్వం చ॥

382. పదాన్తమున నున్నట్టియు, లేక ఝల్పరక మగునట్టియు నగు సంయోగమున కాదియందున్న సకార కకారములకు లోపమగును. భృజ్జతి (వండువాడు) భ్రస్జ (పాకే) ధాతువుకంటె క్విప్ ప్రత్యయము. భృస్జ్ + స్, సులోపము. సంయోగము పదాన్తమందుండుటచే సంయోగాది లోపము. భృజ్, 'వ్రశ్చభ్రస్జ, అను సూత్రముచే షత్వము. జశ్త్వ చర్త్వములు. భృట్, భృడ్. భృస్జ్ + ఔ. ఇచట శ్చుత్వమువలన సకారమునకు శవర్ణమగును. 'ఝలాం జశ్, (53) సూ. చే, శవర్ణమునకు జశ్త్వము (జకారము) చే, భృజ్జౌ, భృజ్జః, ఇత్యాదులగును. ప్రాప్తస్వర్థకమగు ఋతుశబ్ద ముపపదముగ గల యజధాతువుకంటె 'ఋత్విక్, (375) సూ. చే, క్విన్ప్రత్యయము. ఋత్విజ్. (దక్షిణకొఱకు యాగము చేయువాడు) క్విన్నన్తమగుటచే 'క్విన్ప్రత్యయస్య కుః, సూ. చే, కుత్వము, జశ్త్వచర్త్వములు. ఋత్విక్, ఋత్విగ్. ఋత్విజౌ, ఇత్యాదులు. ణిజన్తమగు ఊర్జ (బలప్రాణనయోః) ధాతువుకంటె క్విప్ ప్రత్యయము. ఊర్జ్ + స్, సులోపము. రాత్సస్య (281) అను నియమసూత్రముండుటచే నిచట సంయోగాన్తలోపము రాదు. "చోః కుః" సూ. చే, కుత్వము. జశ్త్వచర్త్వములు. ఊర్క్, ఊర్గ్ (బలము) ఊర్జౌ, ఊర్గ్భ్యామ్, ఇత్యాదులు. త్యద్ + స్, త్యదాద్యత్వ పరరూపములు. త్య + స్. ఇట్లుండగ.

* 383. తదోస్సస్సావనన్త్యయోః. 7-2-106. తదోః। సః। సౌ। అనన్త్యయోః। (త్యదాదీనామ్)

త్యదాదీనాం తకారదకారయో రనన్త్యయోః సః స్యాత్సౌ పరే। స్యః। త్యౌ। త్యే।త్యమ్। త్యౌ। త్యాన్। సః। తౌ। తే। పరమసః। పరమతౌ। పరమతే। ద్విపర్య న్తానామిత్యేవ। నేహ। త్వమ్। నచ తకారోచ్చారణసా మర్థ్యాన్నేతి వాచ్యమ్। అతిత్వమితి గౌణే చారి తార్థ్యాత్। సంజ్ఞాయాం గౌణత్వే చాత్వసత్వే న। త్యద్। త్యదౌ। త్యదః। అతిత్యద్। అతిత్యదౌ। అతిత్య దః। యః। యౌ। యే। ఏషః। ఏతౌ। ఏతే। అన్వాదేశే తు ఏనమ్। ఏనౌ। ఏనాన్। ఏనేన। ఏనయోః 2.

383. త్యదాదులు సర్వాదిగణములోనివి. వీనికి సు ప్రత్యయము పరమగు నపుడు, అన్త్యములు గానట్టి తకార దకారములకు సకార మాదేశమగును. త్య + స్ అనుచోట సకారాదేశము. సు ప్రత్యయమునకు రుత్వవిసర్గములు. స్యః. తద్ + స్. ఇచట 'స్యః' అను చోటవలె ప్రక్రియను గమనించవల యును. సః. త్యదాద్యత్వ పరరూపములవలన నివి అకారాన్తములగును గాన సర్వశబ్దసదృశము లగును. త్యౌ, త్యే, త్యాన్, తౌ, తే, తాన్, ఇత్యాదులు. త్యదాద్యత్వసత్వము లఙ్గాధికారస్థము లగుటచే నివి తదన్తమునందును ప్రవర్తిం చును. పరమతద్ + స్. పరమసః, పరమతౌ, పరమతే, ఇత్యాదులు. త్యద్ శబ్దము మొదలు ద్విశబ్దాన్తములే త్యదాదులనుటవలన ద్విశబ్దానంతరమున పఠింపబడిన యుష్మచ్ఛబ్దమునకు ప్రథమైకవచనమగు 'త్వమ్' అనుచోట నీ సత్వము ప్రవర్తించదు. 'త్వాహౌసౌ' (386) సూ. చే, యుష్మచ్ఛబ్దమునకు విధింపబడిన త్వాదేశములోని తకారోచ్చారణము, గౌణమందు 'అతిత్వమ్' అనుచోట చరితార్థమయినది గాన 'త్వమ్' అనుచోట తకారోచ్చారణ సామర్థ్యమువలన సత్వము నివర్తించుననుటకు వలనుపడదు. అత్వసత్వములు సర్వాద్యన్తర్గణకార్యము లగుటచే సంజ్ఞయందు, గౌణమందును ప్రవర్తించవు. సంజ్ఞ కుదాహరణములు:—త్యద్, త్యదౌ, త్యదః. గౌణమున కుదాహరణము:— (త్యమతిక్రాన్తః) అతిత్యద్, అతిత్యదౌ, అతిత్యదః, ఇత్యాదులు. యద్ + స్. త్యదాద్యత్వ పరరూపములు. రుత్వవిసర్గములు. యః. సర్వశబ్దసదృశము. ఏతద్ + స్. అత్వ పరరూపములు. తకారమునకు సత్వము. "ఆదేశప్రత్యయ యోః" (213) సూ. చే, షత్వము, ఏషః. సర్వశబ్దసదృశము. ద్వితీయాదులు పరమగునపుడు "ద్వితీయాటౌస్స్వేనః" (352) సూ. చే, ఏనాదేశమగును. ఏనమ్...ఏనయోః.

* 384. ఙే ప్రథమయోరమ్. 7-1-28. ఙే। ప్రథమయోః। అమ్। (యుష్మదస్మద్భ్యామ్)

యుష్మదస్మద్భ్యాం పరస్య ఙే ఇత్యేతస్య ప్రథమాద్వితీయయోశ్చ అమాదేశస్స్యాత్ ॥

384. 'ఙే, అనునది లుప్తషష్ఠీకమగు భిన్నపదము. ప్రథమా శబ్దము లక్షణచే ప్రథమాద్వితీయా విభక్తులను బోధించును. యుష్మదస్మచ్ఛబ్దముల కంటె పరమగు ఙే అనుదానికి, ప్రథమాద్వితీయా విభక్తులకును, అమాదేశ మగును. యుష్మద్ + అమ్, అస్మద్ + అమ్.

* 385. మపర్యన్తస్య. 7-2-91.

ఇత్యధికృత్య॥

385. ఇది అధికార సూత్రము. యుష్మదస్మచ్ఛబ్దముల మకార పర్యన్త భాగమునకు వక్ష్యమాణకార్యము లగునని యర్థము. యుష్మద్ అనుదానిలో యుష్మ అనునది మపర్యన్తము.

* 386. త్వాహౌసౌ. 7-2-94. త్వాహౌ। సౌ। (యుష్మదస్మదోః)

యుష్మదస్మదోర్మపర్యన్తస్య త్వ, అహ, ఇత్యేతా వాదేశౌ స్తః సౌ పరే॥

386. యుష్మదస్మచ్ఛబ్దములకు సుప్రత్యయము పరమగునపుడు తదీయ మపర్యన్త భాగమునకు క్రమముగ, త్వ, అహ, అను నాదేశములగును. త్వ మొదలగు నాదేశము లదన్తములు. త్వఅద్ + అమ్. అహఅద్ + అమ్.

* 387. శేషే లోపః. 7-2-90. శేషే। లోపః। (యుష్మదస్మదోః। విభక్తౌ)

ఆత్వయత్వనిమిత్తేతర విభక్తౌ పరతో యుష్మదస్మదోర న్త్యస్య లోపః స్యాత్। అతో గుణే। అమి పూర్వః। త్వమ్ అహమ్। నను త్వం స్త్రీ, అహం స్త్రీ ఇత్యత్ర త్వఅమ్। అహఅమ్। ఇతిస్థితే అమి పూర్వ రూపం పరమపి బాధిత్వాఽన్తరఙ్గత్వాట్టాప్ ప్రాప్నోతి। సత్యమ్। అలిఙ్గే యుష్మదస్మదీ। తేన స్త్రీత్వాభావాన్న టాప్। యద్వా శేష ఇతి సప్తమీ స్థానినోఽధికరణత్వ వివక్షయా। తేన మపర్యన్తాచ్ఛేషస్య అద్ ఇత్యస్య లోపః। సచ పరోఽపి అన్తరఙ్గే అతోగుణే కృతే ప్రవర్తతే। అదన్తత్వా భావాన్న టాప్। పరమత్వమ్। పరమాహమ్। అతిత్వమ్। అత్యహమ్॥

387. చెప్పబడినదానికంటె నన్యమైనది శేషమనబడును. శేషే అనునది విభక్తి విశేషణము. "యుష్మదస్మదో రనాదేశే" (395) సూ. చే, నాత్వము, "యోఽచి" (394) సూ. చే, యత్వము, కొన్నివిభక్తులు పరమగునపుడు

పూర్వము విధింపబడినవి. కావున నిచట శేషే అనుదానికి ఆత్వయత్వములకు నిమిత్తములగు విభక్తులకంటె భిన్నమగు విభక్తి యర్థము. ఇట్టి విభక్తి పరమగు నపుడు యుష్మదస్మచ్ఛబ్దముల యన్త్యమునకు లోపమగును. ఈ సూత్రముచే దకారమునకు లోపము. త్వ + అ. అహ + అ. అనుచోట, "అతో గుణే" (192) సూ. చే, పరరూపము. అమి పూర్వః (195) సూ. చే, పూర్వరూపము. త్వమ్. అహమ్. యుష్మదస్మచ్ఛబ్దములు స్త్రీ బోధకములగునపుడు త్వ + అమ్. అహ + అమ్. అనియుండ, త్వ, అహ, అనునవి అదన్త ప్రాతిపదికములగుటచే, "అజాద్యతష్టాప్" (457) సూ. చే, టాప్ ప్రత్యయము ప్రాప్తమగుచున్నది. ఇది విభక్త్యపేక్ష లేనిదగుటచే నన్తరఙ్గము గావున పరమగు పరరూపమును బాధించి ప్రాప్తమగుచున్నదని, "నను.....సత్యమ్" అను పూర్వపక్షగ్రన్థమున కాశయము. "అలిఙ్గే...నటాప్", అనునది సమాధానము. యుష్మదస్మచ్ఛబ్దములు లిఙ్గరహితములని, "సామ ఆకమ్" (402) సూత్రభాష్యమున చెప్పబడెను. ఇవి స్త్రీలిఙ్గములే గానందున, స్త్రీలిఙ్గమున విధింపబడు టాప్ ప్రత్యయమున కిచట ప్రసక్తియే లేదని, సమాధానమున కాశయము. "నేతరాచ్ఛన్దసి" (7-1-26) సూత్రభాష్యమున "శిశీలుఙ్ నుమ్విధిభ్యో యుష్మదస్మదోర్విభక్త్యాదేశా విప్రతిషేధేన" అనువార్తికము చెప్పబడెను. నపుంసకమున విధింపబడు శీభావము మొదలగు కార్యములకును, యుష్మదస్మచ్ఛబ్దముల విభక్త్యాదేశములకును, విప్రతిషేధమునావార్తికము జెప్పుచున్నది. కావున యుష్మదస్మచ్ఛబ్దములకు లిఙ్గములు లేవనుట యసంగతము. లిఙ్గమును బోధించెడి పదాన్తర సమభివ్యాహారము లేనపుడు కేవల యుష్మదస్మచ్ఛబ్దముల వలన లిఙ్గవిశేషము తెలియబడదని "అలిఙ్గే యుష్మదస్మదీ" అను వచనమున కర్థము. కావున మొదటి సమాధాన మనుచితమనియెంచి, "యద్వా" ఇత్యాది గ్రన్థముచే రెండవ సమాధానము చెప్పబడెను. "శేషేలోపః" సూత్రములోని శేషపదము, విభక్తి విశేషణమనినచో వ్యర్థమగును. విశేష విహితములగు ఆత్వ యత్వములచే, లోపము బాధితమేయగును. కావున శేషే అనుచోట సప్తమి షష్ఠ్యర్థకము. మపర్యన్తముకంటె శేషించిన భాగమునకు అనగా అద్ అనుదానికి లోపమగునని యర్థము. ఇదియే టిలోపపక్షము. (సామ ఆకమ్ (402) సూత్రమున సామః, అను ససుట్క నిర్దేశమువలన శేషేలోప మన్త్యలోపమను పక్షమును ప్రామాణికమగును). ఈ పక్షమందు, త్వ + అద్. అనుచోట అద్ అనుదానికే లోపమగును. ఈ లోపము పరమైనను "అతో గుణే" (192) సూ. చే, విధింపబడు పరరూప మన్తరఙ్గము గావున పరరూపము మొదట ప్రవర్తించును. త్వద్ + అమ్. ఇపుడు టిలోపముచే ప్రాతిపదికము హలన్తమగును. త్వ్ + అమ్. స్త్రీలిఙ్గమైన నదన్తముగానందున టాప్ ప్రసక్తి వారితమగును. త్వాహాద్యాదేశము లఙ్గాధికారములోని వగుటవలన యుష్మదాద్యన్తమునకును ప్రవర్తించును. పరమత్వమ్. పరమాహమ్ గాణమందు

ప్రవర్తించదనుటకు యుక్తిలేనందున నచటను ప్రవర్తించును. (త్వాం మాం వా అతిక్రాన్తః). అతిత్వమ్. అత్యహమ్॥

* 388. యువావౌ ద్వివచనే. 7-2-92. యువావౌ। ద్వివచనే। (విభక్తౌ। యుష్మదస్మదోః)

ద్వయోరుక్తౌ యుష్మదస్మదో ర్మపర్యన్తస్య యువావౌ స్తో విభక్తౌ॥

388. ద్వయోర్వచనమ్ (బోధకమ్) ద్వివచనమ్, తస్మిన్ ద్వివచనే = ద్విత్వబోధనమందు. ఇది సూత్రగృహీతములగు యుష్మదస్మచ్ఛబ్దములకే విశేషణముగాని తదన్తమునకు గాదు. వచనగ్రహణ సామర్థ్యమువలన ఔ, భ్యామ్, మొదలగు కృత్రిమద్వివచనముల కిది బోధకము గాదు. ద్విత్వబోధన సమర్థములగు యుష్మదస్మచ్ఛబ్దములకు విభక్తి పరమగునపుడు తదీయ పర్యన్తమునకు యువ, ఆవ, అను నాదేశములు క్రమముగ నగును. పరరూపము. యువద్ + అమ్. ఆవద్ + అమ్. ఇట్లుండ,

* 389. ప్రథమాయాశ్చ ద్వివచనే భాషాయామ్. 7-2-78. ప్రథమాయాః। చ। ద్వివచనే। భాషాయామ్। (యుష్మదస్మదోః। ఆ)

ఇహ యుష్మదస్మదోరాకారోఽన్తాదేశః స్యాత్। ఔఙీత్యేవ సువచమ్। భాషాయాం కిమ్। యువం వస్త్రాణి। యువామ్। ఆవామ్। మపర్యన్తస్య కిమ్। సాకచ్కస్య మాభూత్। యువకామ్। ఆవకామ్। త్వయా మయేత్యత్ర త్వ్యామ్యేతి మాభూత్। యువకాభ్యామావకాభ్యామితి చ నసిద్ధ్యేత్॥

389. యుష్మదస్మచ్ఛబ్దములకు, ప్రథమాద్వివచనము (ఔ) పరమగునపుడు లౌకికభాషయందు ఆకార మన్తాదేశమగును. ఔఙ్ అనునది ప్రథమా ద్వితీయా విభక్తుల ద్వివచనమునకు సంజ్ఞయని చెప్పబడెను. ఔఙి పరమగునపుడాత్వ మిష్టము. కావున 'ప్రథమాయాశ్చ ద్వివచనే' అను దానిస్థానమున ఔఙి అనిన లాఘవము సంభవించును. "యువం వస్త్రాణి పీవసా" అను వైదికప్రయోగమునం దాత్వమును వారించుటకై "భాషాయామ్" అనునది యావశ్యకము. దకారమునకు ఆత్వము సవర్ణదీర్ఘము. పూర్వరూపము. యువామ్. ఆవామ్.

మపర్యన్తస్య కిమ్. మపర్యన్తస్య, అను నధికారసూత్రమునకు ఫలమేమను ప్రశ్నకు సమాధానములను చెప్పుచున్నాడు.

(1) అధికారసూత్రము లేనిచో యువా వాదేశములు అనేకాల్లు లగుటచే సర్వాదేశములగును. అకచ్ ప్రత్యయము ప్రవర్తించిన పక్షమందును సర్వాదేశము లగుటవలన యువామ్, ఆవామ్ అని యగునేగాని యిష్టమగు యువకామ్, ఆవకామ్, అనునవి సిద్ధముగాకపోవును. అధికారసూత్ర మున్నయెడల యుష్మకద్ అస్మకద్, అనుచోట మపర్యన్తమునకే యువా వాదేశములగుటచే చూపబడిన యిష్టరూపములు సిద్ధములగును. యుష్మద్ అను ప్రాతిపదికము యొక్క టిసంజ్ఞకమునకు పూర్వమకచ్ ప్రత్యయము వచ్చునను నాశయముతో నీ ఫలము చెప్పబడెను. త్వయకా, అను రూపసిద్ధికై "ఓకార... టేః ప్రాక్" (అకచ్ ప్రత్యయము, ఓకార సకార భకారము లాదియందుగల సుప్ ప్రత్యయము పరమగునపుడు సర్వనామముయొక్క టిసంజ్ఞకమునకు పూర్వముగను, మిగిలిన చోటులందు సుబన్తముయొక్క టిసంజ్ఞకమునకు పూర్వముగ నగును) అను వ్యవస్థచే నిచట, యువామ్, ఆవామ్, అనువాని కకచ్ ప్రత్యయము ప్రవర్తించినయెడల నిష్టమగు 'యువకామ్, 'ఆవకామ్, అను రూపములు సిద్ధమగుటచే నిది ఫలమనుట యుచితముగాదని సమాధానాన్తరమును జెప్పుచున్నాడు.

(2) "త్వయా...మాభూత్" ఇచట త్వ, మ అనెడి యాదేశములు సర్వాదేశములైనచో "యోఽచి" (394) సూ. చే, విహితమగు యత్వము అలోఽన్త్య పరిభాషచే, త్వ, మ, వీని యన్త్యమునకగును. త్వయా, మయా, అనుచోట అనిష్టమగు త్వ్యా, మ్యా, అను రూపములు ప్రసక్తములగును. అధికారమున్నయెడల నా యత్వము దకారమునకు వచ్చును; గాన నిష్టరూపములు సిద్ధించును. త్వ, మ, అనెడి యాదేశములు సర్వాదేశములయినను "యోఽచి" సూత్రస్థానమున, 'అచ్యే (అజాది ప్రత్యయము పరమగునపుడు యుష్మదస్మచ్ఛబ్దములకు, ఏకార మాదేశమగును) అనున్యాసముచేసి సర్వాదేశములగు త్వమాదేశముల యన్త్యమునకు, ఏకారమును విధించినచో నయాదేశమువలన త్వయా, మయా, అను నిష్టరూపసిద్ధి గలుగును గాన నిదియు నధికారఫలమన వీలులేదని మఱియొక ఫలమును జూపుచున్నాడు.

(3) "యువకాభ్యామ్...నసిద్ధ్యేత్" యుష్మద్ + భ్యామ్, అస్మద్ + భ్యామనుచోట భకారాది ప్రత్యయము పరముగ నుండుటచే ప్రాతిపదికమునకే అకచ్ ప్రత్యయము వచ్చును. యుష్మకద్ + భ్యామ్, అస్మకద్ + భ్యామ్, అని యగును. అధికారము లేనపుడు యువా వాదేశములు సర్వాదేశములగుటచే యువకాభ్యామ్, ఆవకాభ్యామ్, అను నిష్టరూపములు సిద్ధముగాకపోవును. మపర్యన్తమునకే ఆదేశములనినచో యువకాభ్యామ్, ఆవకాభ్యామను రూపములు సిద్ధములగును. కావున మపర్యన్తాధికార మావశ్యకమని సమాధానాశయము.

* 390. యుూయవయౌ జసి. 7-2-93. యూయవయౌ। జసి। (యుష్మదస్మదోః)

స్పష్టమ్। యూయమ్। వయమ్। పరమయూయమ్।.పరమవయమ్। అతియూయమ్। అతివయమ్। ఇహ శేషేలోపో౽న్త్యలోపఇతి పక్షే జశః శీ ప్రాప్తః। అఙ్గకార్యే కృతే పునర్నాఙ్గకార్యమితి నభవతి। ఙే ప్రథమయోరిత్యత్ర మకారాన్తరం ప్రశ్లిష్య అమ్ మాన్తఏవావశిష్యతే నతు విక్రియతఇతి వ్యాఖ్యానాద్వా॥

390. యుష్మదస్మచ్ఛబ్దములకు జస్ ప్రత్యయము పరమగునపుడు మపర్యన్తమునకు యథాసంఖ్యముగ, యూయ, వయ, అను నాదేశము లగును. యుష్మద్ + జస్, అస్మద్ జస్, ఇచట ప్రత్యయముల కమాదేశము. ప్రాతిపదికములకు యూయవయాదేశములు. శేషే లోపము. యూయమ్. వయమ్. ఈ యాదేశము లఙ్గాధికారసములగుటచే తదన్తమందును ప్రవర్తించును. పరమయూయమ్, పరమవయమ్, అతియూయమ్, అతివయమ్, "శేషేలోప" సూత్రమున 'శేషే' అనునది విభక్తి విశేషణ మగునపుడు శేషేలోప మన్త్యలోపమగును. "శేషే" అను దానికి మపర్యన్తముకంటె శేషించిన భాగమను నర్థము చెప్పునపుడు శేషలోపము టిలోపమనెడి పక్షము సంభవించును. పక్షద్వయము భాష్యసమ్మతమైనందున ప్రామాణికమే. అన్త్యలోప పక్షమందు, యూయ + అమ్, అనుచోట సర్వనామ మదన్తమగుటచే "జసశ్శీ" (215) సూ. చే, శీభావము ప్రాప్తమగుచున్నది. శీభావవారణమున కుపాయమును జూపుచున్నాడు. "అఙ్గకార్యే...కార్యమ్" (అఙ్గాధికారమున విధింపబడు నొక కార్యము ప్రవర్తించినపిమ్మట నఙ్గాధికారములోని మరియొక కార్యము ప్రవర్తింపదు.) దీనికే "అఙ్గవృత్తే పునర్వృత్తావవిధిః" అను పాఠము గలదు. అఙ్గాధికారసములగు యూయవయాదేశములు ప్రవర్తించుటవలన తిరుగ నఙ్గాధికారసమగు శీభావము ప్రవర్తించదని యర్థము. ఈ పరిభాష అఙ్గసంబంధికార్యవిషయముననే ప్రవర్తించునని భాష్యస్వరసము. శీభావ మఙ్గసంబన్ధి గాదు. మఱియు నీ పరిభాష నిష్ఫలమైనదని భాష్యాభిప్రాయము. కావున నీ పరిభాషచే శీభావవారణము కుదరదని సమాధానాన్తరమును చెప్పుచున్నాడు. "ఙే ప్రథమయోః......వ్యాఖ్యానాద్వా" "ఙే ప్రథమయోరమ్ శసోన" అను సంహితాపాఠమందు శవర్ణమునకు పూర్వము మఱియొక మకారమును ప్రశ్లేషించి మకారాన్తమగు నమాదేశమును విధించినచో నమాదేశమెప్పుడు నుమాన్తముగనే యుండును గాని దానికి మఱియొక యాదేశము రాదను వ్యాఖ్యానమువలన నిచట నమాదేశస్థానమున శీభావము వారితమగును.

* 391. త్వమావేకవచనే. 7-2-97. త్వమౌ। ఏకవచనే
(యుష్మదస్మదోః. విభక్తౌ)

ఏకస్యోక్తౌ యుష్మదస్మదోర్మపర్యన్తస్య త్వమౌ స్తో విభక్తౌ॥

391. ఇచట నేకవచన శబ్దము యౌగికము. (ఏకస్య వచనమ్ = బోధనమ్ తస్మిన్) వచనగ్రహణ సామర్థ్యమువలన కృత్రిమైకవచనమునకు గ్రహణము లేదు. ఏకత్వ సంఖ్యాబోధన సమర్థములగు యుష్మదస్మచ్ఛబ్దములకు విభక్తి పరమగునపుడు మపర్యన్తమునకు, క్రమముగ, త్వ, మ, అను నాదేశములగును. త్వద్ + అమ్, మద్ + అమ్.

* 392. ద్వితీయాయాం చ. 7-2-87. ద్వితీయాయామ్। చ।
(యుష్మదస్మదోః। విభక్తౌ। ఆ)

యుష్మదస్మదోరాకారః స్యాత్। త్వామ్। మామ్। యువామ్। ఆవామ్॥

392. యుష్మదస్మచ్ఛబ్దములకు ద్వితీయావిభక్తి పరమగునపుడు ఆకారమన్తాదేశమగును. ఆత్వము. సవర్ణదీర్ఘము. త్వామ్. మామ్. యువామ్. ఆవామ్.

* 393. శసో న. 7-1-29. శసః। న। (యుష్మదస్మద్భ్యామ్)

నేత్యవిభక్తికమ్। యుష్మదస్మద్భ్యాం పరస్య శసో నకారః స్యాత్। అమోఽపవాదః. ఆదేః పరస్య। సంయోగాన్తస్య లోపః। యుష్మాన్। అస్మాన్॥

393. న అనునది "నః" అను దానియొక్క విభక్తిరహితమగు నిర్దేశము. అకారముచ్చారణార్థము. యుష్మదస్మచ్ఛబ్దములకంటె పరమగు శస్ ప్రత్యయమునకు నకార మాదేశమగును. అమాదేశమున కిది యపవాదము. "ఆదేః పరస్య" (45) సూ. చే, నీ యాదేశ మస్ ప్రత్యయమున కాదియగు అకారమునకగును. యుష్మద్ + అస్. అస్మద్ + అస్. "ద్వితీయాయాం చ" (392) సూ. చే, నాత్వము. ఈ సూత్రముచే నకారాదేశము. యుష్మాన్స్. అస్మాన్స్, సంయోగాన్త లోపము. యుష్మాన్. అస్మాన్.

వివ:—న అనునది నిషేధార్థకావ్యయమని చెప్పి ఈ సూత్రములోని శస్ పదము ననువృత్తిజేసి, శస్ ప్రత్యయమున కమాదేశము రాదని వ్యాఖ్యానము చేసినను, "తస్మాచ్ఛసోనః" (197) సూ. చే, విధింపబడు నత్వమువలన యుష్మాన్ అస్మానను రూపములు సిద్ధమగును గాన, న అనునది యవిభక్తిక నిర్దేశమనుట యనావశ్యక మనవచ్చును. కాని స్త్రీలిఙ్గ నపుంసక లిఙ్గములందు నత్వ మప్రాప్తమగుటవలన యుష్మాన్ (బ్రాహ్మణీః) అస్మాన్ (బ్రాహ్మణీః)

యుష్మాన్ (కులాని) అస్మాన్ (కులాని) అను రూపములు సిద్ధములు గాకపోవును. కావున మూలములోని వ్యాఖ్యాన మావశ్యకమని గ్రహించునది.

* 394. యోఽచి. 7-2-89. యః। అచి। (యుష్మదస్మదో రనాదేశే। విభక్తౌ)

అనయోర్యకారాదేశః స్యాదనాదేశే ఽజాదౌ పరతః। త్వయా। మయా॥

394. అనాదేశే అనునది బహువ్రీహి (నవిద్యతే ఆదేశోయస్య తస్మిన్) ఆదేశమును పొందనటువంటి అజాదివిభక్తి పరమగునపుడు యుష్మదస్మచ్ఛబ్దములకు యకార మన్తాదేశమగును. యుష్మద్ + టా. అస్మద్ + టా. మపర్యన్తమునకు త్వ, మ, అను నాదేశములు. పరరూపము. దకారమునకు యత్వము. త్వయా. మయా.

* 395. యుష్మదస్మదోరనాదేశే. 7-2-96. యుష్మదస్మదోః। అనాదేశే। (హలి। అ। విభక్తౌ)

అనయోరాకారః స్యాదనాదేశే హలాదౌ విభక్తౌ। యువాభ్యామ్। ఆవాభ్యామ్। యుష్మాభిః అస్మాభిః॥

395. ఆదేశమును పొందనటువంటి హలాదివిభక్తి పరమగునపుడు యుష్మదస్మచ్ఛబ్దములకు ఆకార మన్తాదేశమగును. యుష్మద్ + భ్యామ్. అస్మద్ + భ్యామ్. యువావాదేశములు. పరరూపము. దకారమునకీ సూత్రముచే నాత్వము. సవర్ణదీర్ఘము. యువాభ్యామ్. ఆవాభ్యామ్. యుష్మద్ + భిస్. అస్మద్ + భిస్. దకారమునకీ సూత్రముచే నాత్వము. సవర్ణదీర్ఘము. యుష్మాభిః. అస్మాభిః.

* 396. తుభ్యమహ్యౌ ఙయి. 7-2-95. తుభ్యమహ్యౌ। ఙయి। (యుష్మదస్మదోః)

అనయోర్మపర్యన్తస్య తుభ్యమహ్యౌ స్తో ఙయి। అమాదేశః। శేషే లోపః। తుభ్యమ్। మహ్యమ్। పరమతుభ్యమ్। పరమమహ్యమ్। అతితుభ్యమ్। అతిమహ్యమ్। యువాభ్యామ్। ఆవాభ్యామ్॥

396. యుష్మదస్మచ్ఛబ్దముల మపర్యన్తమునకు చతుర్థ్యేకవచనము పరమగునపుడు క్రమముగ, తుభ్య, మహ్య, అను నాదేశములగును. యుష్మద్ + ఙే. అస్మద్ + ఙే. ప్రత్యయమున కమాదేశము. ప్రాతిపదికమునకు, తుభ్యమహ్యాదేశములు. శేషేలోపము, పూర్వరూపము. తుభ్యమ్, మహ్యమ్. ఈ సూత్ర మఙ్గాధికారస్థమగుటవలన తదన్తమందును ప్రవర్తించును. పరమతుభ్యమ్, పరమమహ్యమ్, అతితుభ్యమ్. అతిమహ్యమ్. యుష్మద్ + భ్యామ్. అస్మద్ +

భ్యామ్. "యుష్మదస్మదోరనాదేశే (395) సూ. చే. నాత్వము. సవర్ణ దీర్ఘము. యువాభ్యామ్. ఆవాభ్యామ్.

* 397. భ్యసో భ్యమ్. 7-1-30. భ్యసః। భ్యమ్ (అభ్యమ్) (యుష్మదస్మద్ భ్యామ్)

ట్యసో భ్యమ్, అభ్యమ్వా ఆదేశః స్యాత్। ఆద్యః శేషేలోపస్యాన్త్యలోపత్వ ఏవ। తత్రాఙ్గ వృత్త పరిభాషయా ఏత్వ న। అభ్యమ్తు పక్షద్వయే పి సాధుః। యుష్మభ్యమ్। అస్మభ్యమ్॥

397. సూత్రమున భ్యమ్, అనియు అభ్యమ్ అనియును ఛేదము చేయ వచ్చును. యుష్మదస్మచ్ఛబ్దములకంటె పరమగు భ్యస్ ప్రత్యయమునకు భ్యమ్ అను ఛేదపక్షమున భ్యమాదేశము, 'అభ్యమ్, అను ఛేదమున, అభ్యమాదేశము నగును. శేషేలోప మన్త్యలోపమను పక్షమందే భ్యమాదేశము సాధువగును. అఙ్గాధికారసమగు శేషేలోపమును చేసినతరువాత నఙ్గాధికారస్థమగు "బహువచనే ఝల్యేత్ (206) సూ. చే, ప్రాప్తమగు ఏత్వము "అఙ్గవృత్తపరిభాష చే వారింపబడును. శేషేలోప మన్త్యలోపమను పక్షమందు, టిలోపమను పక్షమందును, అభ్యమాదేశము సాధువగును. అన్త్యలోపపక్షమందు "అతో గుణే" (192) సూ. చే, పరరూపమగును. యుష్మద్ + భ్యమ్. యుష్మభ్యమ్. అస్మద్ + భ్యమ్. అస్మభ్యమ్.

* 398. ఏకవచనస్య చ. 7-1-32. ఏకవచనస్య। చ। (యుష్మదస్మద్భ్యామ్। పఞ్చమ్యాః। అత్)

ఆభ్యాం పఞ్చమ్యేకవచనస్యాత్స్యాత్। త్వత్। మత్। జసేశ్చేతి సువచమ్। యువాభ్యామ్। ఆవాభ్యామ్॥

398. యుష్మదస్మచ్ఛబ్దములకంటె పరమగు పఞ్చమ్యేకవచనమునకు 'అత్, అను నాదేశమగును. ఇది యానేకాల్లగుటచే సర్వాదేశమగును. యుష్మద్ + ఙసి. అస్మద్ + ఙసి త్వమాదేశములు, పరరూపము. ప్రత్యయములకదాదేశము, శేషేలోపము. త్వత్, మత్. ఈ సూత్రస్థానమున లఘుభూతమగు "జసేశ్చ" అను న్యాసము చేయదగును.

* 399. పఞ్చమ్యా అత్. 7-1-31. పఞ్చమ్యాః। అత్ (యుష్మదస్మద్ భ్యామ్, భ్యసః)

ఆభ్యామ్ పఞ్చమ్యా భ్యసోఽత్। యుష్మత్। అస్మత్॥

399. యుష్మదస్మచ్ఛబ్దములకంటె పరమగు పఞ్చమీ బహువచనమునకు 'అత్' అను నాదేశమగును. యుష్మద్ + భ్యస్. అస్మద్ + భ్యస్. ఆదాదేశము. శేషేలోపము. యుష్మత్. అస్మత్.

* 400. తవమమౌ ఙసి. 7-2-96. తవమమౌ। ఙసి। (యు
ష్మదస్మదోః)

అనయోర్మపర్యన్తస్య తవమమౌ స్తః ఙసి।

400. యుష్మదస్మచ్ఛబ్దముల మపర్యన్తమునకు షష్ఠ్యేకవచనము పరమగు నపుడు క్రమముగ తవమమాదేశము లగును. ఇది "త్వమావేకవచనే" (391) సూత్రమున కపవాదము.

* 401. యుష్మదస్మద్భ్యాం ఙసోఽశ్. 7-1-27. యు
ష్మదస్మద్భ్యామ్। ఙసః। అశ్॥

స్పష్టమ్। తవ। మమ। యువయోః। ఆవయోః॥

401. యుష్మదస్మచ్ఛబ్దములకంటె పరమగు షష్ఠ్యేకవచనమునకు అశ్ (అ) ఆదేశమగును. ఇది శిత్తగుటచే సర్వాదేశమగును. యుష్మద్ + ఙస్. అస్మద్ + ఙస్. తవ మమాదేశములు, పరరూపము, ఙస్సున కశాదేశము, శేషే లోపము, అన్త్యలోపపక్షమందు పరరూపము. తవ. మమ. యుష్మద్ + ఓస్, అస్మద్ + ఓస్. మపర్యన్తమునకు యువావాదేశములు. పరరూపము "యోఽచి" (394) సూ. చే, దకారమునకు యత్వము. యువయోః. ఆవయోః.

* 402. సామ ఆకమ్. 7-1-33. సామః। ఆకమ్ (యుష్మద
స్మద్భ్యామ్)

ఆభ్యాం పరస్య సామ ఆకమ్స్యాత్। భావిసః
సుటో నివృత్త్యర్థం ససుట్కనిర్దేశః। యుష్మాకమ్
అస్మాకమ్। త్వయి। మయి। యువయోః। ఆవయోః।
యుష్మాసు। అస్మాసు॥

శ్లో॥ (1) సమస్యమానే ద్వ్యేకత్వవాచినీ యుష్మదస్మదీ।
సమాసార్థోఽన్యసంఖ్యశ్చేత్ స్తోయువావౌ త్వమావపి॥

(2) సుజస్ఙేఙస్సు పరత ఆదేశాస్స్యుస్సదైవ తే।
త్వాహౌ యూయవయౌ తుభ్యమహ్యౌ తవమమావపి॥

(3) ఏతే పరత్వాద్బాధన్తే యువావౌ విషయే స్వకే।
త్వమావపి ప్రబాధన్తే పూర్వవిప్రతిషేధతః॥

(4) ద్వ్యేకసంఖ్యస్సమాసార్థో బహ్వర్థే యుష్మదస్మదీ।
తయోరద్వ్యేకతార్థత్వాన్న యువావౌ త్వమౌచన॥

త్వాం మాం వా అతిక్రాన్త ఇతి విగ్రహః:—అతిత్వమ్। అత్యహమ్। అతిత్వామ్। అతిమామ్। అతియూయమ్। అతివయమ్। అతిత్వామ్ 2. అతిమామ్, 2. అతిత్వాన్। అతిమాన్। అతిత్వయా। అతిమయా। అతిత్వాభ్యామ్। అతిమాభ్యామ్। అతిత్వభ్యమ్। అతిమభ్యమ్। ఙసిభ్యసోః, అతిత్వత్ (2) అతిమత్, 2. భ్యామి, ప్రాగ్వత్। అతితవ। అతిమమ। అతి

త్వయోః॥ అతిమయోః। అతిత్వాకమ్। అతిమాకమ్। అత్యత్వయి। అతిమయి। అతిత్వయోః। అతిమయోః। అతిత్వాసు। అతిమాసు॥ యువామ్ ఆవాంవా అతిక్రాన్త ఇతి విగ్రహే, సుజస్ జేజస్సు ప్రాగ్వత్। ఔ అమ్ ఔట్సు। అతియువామ్, 3. అత్యావామ్. 3, అతియువాన్। అత్యావాన్। అతియువయా। అత్యావయా। అతియువాభ్యామ్। అత్యావాభ్యామ్। అతియువాభిః। అత్యావాభిఃభ్యసి. అతియువభ్యమ్। అత్యావభ్యమ్। జసిభ్యసోః। అతియువత్ (2) అత్యావత్ (2) ఓసి। అతియువయోః (2) అత్యావయోః (2) అతియువాకమ్। అత్యావాకమ్। అతియువయి। అత్యావయి। అతియువాసు। అత్యావాసు। యుష్మానస్మాన్వేతి విగ్రహే, సుజస్ శేజస్సు ప్రాగ్వత్। ఔ అమ్ ఔట్సు। అతియుష్మామ్, (3) అత్యస్మామ్, (3) అతియుష్మాన్। అత్యస్మాన్। అతియుష్మయా। అత్యస్మయా। అతియుష్మాభ్యామ్। అత్యస్మాభ్యామ్। అతియుష్మాభిః। అత్యస్మాభిః। భ్యసి। అతియుష్మభ్యమ్। అత్యస్మభ్యమ్। జసిభ్యసోః। అతియుష్మత్। అత్యస్మత్। ఓసి, అతియుష్మయోః 2. అత్యస్మయోః 2. అతియుష్మాకమ్। అత్యస్మాకమ్। అతియుష్మయి। అత్యస్మయి। అతియుష్మాసు। అత్యస్మాసు॥

402. యుష్మదస్మచ్ఛబ్దములకంటె పరమైై సుడాగమముతో గూడిన ఆమ్ ప్రత్యయమునకు, ఆకమాదేశమగును. యుష్మద్ + ఆమ్ అనుచోట ఆకమాదేశమునకు పూర్వము "యోఽచి" (394) సూ. చే, యత్వము ప్రాప్తమగుచున్నదిగాని శేషేలోపము ప్రాప్తముగాదు. కావున సవర్ణాసము కంటె పరమగు నామ్ ప్రత్యయమునకు విధింపబడు సుడాగమమునకిచట ప్రసక్తియే లేనందున సుడాగమముతో గూడిన, సామః, అను నిర్దేశము వ్యర్థమగుచున్నదను శఙ్కను నిరసించుచున్నాడు. "భావినః...నిర్దేశః". సామః, అనునది "ఆమి సర్వనామ్నస్సుట్" (218) అను సూ. చే, విహితమగు సుడాగమముతో గూడిన ఆమ్‌యొక్క నిర్దేశమనవలయును. యుష్మద్ + ఆమ్, అనుచోట నాకమాదేశమునకు పూర్వము సర్వనామమదన్తము గానందున సుడాగమము ప్రాప్తము గాకుండుటచే, సామ్ ప్రత్యయము (స్థాని) దుర్లభమగుటచే నీ నిర్దేశము వ్యర్థమగుచున్నది. కాని ఆమ్ ప్రత్యయమున కాకమాదేశము ప్రవర్తించినపిమ్మట శేషేలోపము ప్రవర్తించుటచే యుష్మదస్మచ్ఛబ్దము లదన్తములగును గావున సుడాగమము ప్రాప్తమగును. ఇట్లు రాబోవు సుడాగమముయొక్క నివృత్తికొఱకు సుడాగమముతో గలసిన ఆమ్ ప్రత్యయమును స్థానిగ నిర్దేశించెను. ఈ నిర్దేశ సామర్థ్యముచే సకారమును స్థానిగ చెప్పుటవలన రాబోవు సుడాగమముగూడ నివర్తించునని యాశయము. ఆమ్ ప్రత్యయమందే సాత్వము నారోపించుటచే నాకమాదేశమగును. సకారమునుగూడ స్థానిగా నిర్దేశించుట, సుడాగమప్రసక్తిని వారించుటకేయని తాత్పర్యము. యుష్మద్ + ఆమ్, అస్మద్ + ఆమ్, ఆకమాదేశము. శేషేలోపము (అన్త్యలోపము) సవర్ణదీర్ఘము, యుష్మాకమ్, అస్మాకమ్, యుష్మద్ + జే, అస్మద్ + జే, త్వమాదే

ములు, త్వాహాదేశములు, యువావాదేశములు, (394) సూ. చే, యత్వము. త్వయి. మయి. యువయోః. ఆవయోః. యుష్మద్ + సు. అస్మద్ + సు "యుష్మదస్మదోః" 394 సూ. చే, నాత్వము. సవర్ణదీర్ఘము. యుష్మాసు, అస్మాసు.

"యువావౌ ద్వివచనే" (383) "త్వమావేకవచనే" (391) అను సూత్రద్వయమునందును ద్వివచనైకవచన శబ్దములు ప్రత్యయపరములుగాక ద్విత్వబోధకము, ఏకత్వబోధకమను నర్థపరములను వ్యాఖ్యానమున కవ్యాప్త్యతివ్యాప్తి దోషపరిహారరూపమగు ఫలమును కారికాచతుష్టయముచే నిరూపించుచున్నాడు. "సమస్యమానే...త్వమౌచ". అర్థము :— సమస్యమానములగు యుష్మదస్మచ్ఛబ్దములు ద్విత్వైకత్వ సంఖ్యలను బోధించునవైనపుడు, అన్యపదార్థము (ముఖ్యవిశేష్యము) యుష్మదస్మదర్థమందుండెడి సంఖ్యకంటె నితరమగు సంఖ్య (బహుత్వాదికము) తో గూడినదైనను, యువావాదేశములు త్వమాదేశములును వచ్చును. ప్రత్యయపరములనినయెడల నిచట నాదేశముల ప్రాప్తమగుటచే నవ్యాప్తిదోషము సంభవించును. ఈ వ్యాఖ్యానమునందు, "సు, జస్, ఙే, ఙస్, ఇవి పరమగునపుడును యుష్మదస్మచ్ఛబ్దములు ద్విత్వబోధకములైనపుడు యువావాదేశములు, ఏకత్వబోధకములైనపుడు త్వమాదేశములు, ప్రసక్తములగుచున్నవను శఙ్కను సమాధానమును జెప్పుచున్నాడు. "సుజస్...పూర్వవిప్రతిషేధతః" సు, జస్, ఙే, ఙస్ ప్రత్యయములు పరములగునపుడు క్రమముగ త్వాహాదేశములు, యూయవయములు, తుభ్యమహ్యలు, తవమమలు, ఇవి పరములగుటచే యువావాదేశములను, పూర్వవిప్రతిషేధాశ్రయణమువలన త్వమాదేశములనుగూడ, బాధించి ప్రవర్తించును. కావున పై నాల్గు ప్రత్యయములు పరమగునపుడు యుష్మదస్మచ్ఛబ్దములు ద్విత్వైకత్వబోధకములైనను గాకున్నను త్వాహాద్యాదేశములే యగునని యర్థము. ముఖ్యవిశేష్యము ద్విత్వైకత్వ సంఖ్యను బోధించునదై యుష్మదస్మచ్ఛబ్దములు బహుత్వ సంఖ్యాబోధకములైనచో యుష్మదస్మచ్ఛబ్దములు ద్విత్వబోధకములు గానందున, యువావలు, ఏకత్వసంఖ్యను బోధింపనందున, త్వమలును ప్రవర్తించవు. ద్వివచనైకవచన శబ్దములు ప్రత్యయపరములగుచో నిచటగూడ నాదేశప్రసక్తి గల్గుటవలన నతివ్యాప్తిదోషము సంభవించును. యౌగికములనుటచే నీ రెండుదోషములు నివృత్తములగును. శ్లోక చతుష్టయముచే సంగ్రహింపబడిన యర్థము నుదాహరణ ప్రదర్శనముచే విస్తరింపుచున్నాడు. "త్వాం మాం వా అతిక్రాన్తః...అత్యస్మాసు" అని.

(1) త్వాం మాం వా అతిక్రాన్తః, అను విగ్రహమున అతియుష్మద్, అత్యస్మద్, అనునవి సమాసములగును. ఇచట యుష్మదస్మచ్ఛబ్దము లేకత్వార్థబోధకములగుటచే సు, జస్, ఙే, ఙస్, ప్రత్యయములను విడిచి, మిగిలిన యన్నివచనములు పరమగునపుడు, త్వమాదేశములగును. సు, జస్, ఙే, ఙస్సులు పరమగునప్పుడు పూర్వసూత్రము పూర్వవిప్రతిషేధముచే వీనిని బాధించి, త్వాహాద్యాదేశములే యగును.

| | ఏకవచనము | ద్వివచనము | బహువచనము |
|---|---|---|---|
| ప్ర॥ | అతిత్వమ్, అత్యహమ్. | అతిత్వామ్, అతిమామ్. | అతియూయమ్, అతివయమ్. |
| ద్వి॥ | అతిత్వామ్, అతిమామ్. | అతిత్వామ్, అతిమామ్. | అతిత్వాన్, అతిమాన్. |
| తృ॥ | అతిత్వయా, అతిమయా. | అతిత్వాభ్యామ్, అతిమాభ్యామ్. | అతిత్వాభిః, అతిమాభిః. |
| చ॥ | అతితుభ్యమ్, అతిమహ్యమ్. | ,, | అతిత్వభ్యమ్, అతిమభ్యమ్. |
| పం॥ | అతిత్వత్, అతిమత్. | ,, | అతిత్వత్, అతిమత్. |
| ష॥ | అతితవ, అతిమమ. | అతిత్వయోః, అతిమయోః. | అతిత్వాకమ్, అతిమాకమ్. |
| స॥ | అతిత్వయి, అతిమయి. | ,, | అతిత్వాసు, అతిమాసు. |

(2) యుష్మదస్మచ్ఛబ్దములు ద్విత్వార్థకములైనపుడు సు, జస్, ఙే, ఙస్, ప్రత్యయములను విడిచి, మిగిలిన యన్నివచనములందును యువావాదేశములగును. సు, జస్, ఙే, ఙస్సులందు మాత్రము త్వాహాద్యాదేశములు పరములగుటచే వీనిని బాధించును.

యువాం ఆవాం వా అతిక్రాన్తః అను విగ్రహమునందు, అతియుష్మద్, అత్యస్మద్, అనునవి సమాసములు. ఇచట యుష్మదస్మచ్ఛబ్దములు ద్విత్వార్థకము లైనందున పూర్వము చెప్పినరీతి ననుసరించి, సు, జస్, ఙే, ఙస్సులందు త్వాహాద్యాదేశములు, మిగిలిన వచనములందు యువావాదేశములు నగును.

| | ఏకవచనము | ద్వివచనము | బహువచనము |
|---|---|---|---|
| ప్ర॥ | అతిత్వమ్, అత్యహమ్. | అతియువామ్, అత్యావామ్. | అతియూయమ్, అతివయమ్. |
| ద్వి॥ | అతియువామ్, అత్యావామ్. | అతియువామ్, అత్యావామ్. | అతియువాన్, అత్యావాన్. |

| | ఏకవచనము | ద్వివచనము | బహువచనము |
|---|---|---|---|
| తృ॥ | అతియువయా, అత్యావయా. | అతియువాభ్యామ్, అత్యావాభ్యామ్. | అతియువాభిః, అత్యావాభిః. |
| చ॥ | అతితుభ్యమ్, అతిమహ్యమ్. | ,, | అతియువభ్యమ్, అత్యావభ్యమ్. |
| పం॥ | అతియువత్, అత్యావత్. | ,, | అతియువత్, అత్యావత్. |
| ష॥ | అతితవ, అతిమమ. | అతియువయోః, అత్యావయోః. | అతియువాకమ్, అత్యావాకమ్. |
| స॥ | అతియువయి, అత్యావయి. | ,, | అతియువాసు, అత్యావాసు. |

(3) యుష్మానస్మాన్వా అతిక్రాన్తః, అను విగ్రహమున అతియుష్మద్, అత్యస్మద్, అను సమాసములందు యుష్మదస్మచ్ఛబ్దములు, ద్విత్వార్థకములుగాని ఏకత్వార్థకములుగాని గానందున, యువావలుగాని, త్వమలుగాని రావు. సు, జస్, ఙే, ఙస్సులందు మాత్రము త్వాహాద్యాదేశములగును.

| | ఏకవచనము | ద్వివచనము | బహువచనము |
|---|---|---|---|
| ప్ర॥ | అతిత్వమ్, అత్యహమ్. | అతియుష్మామ్, అత్యస్మామ్. | అతియూయమ్, అతివయమ్. |
| ద్వి॥ | అతియుష్మామ్, అత్యస్మామ్. | అతియుష్మామ్, అత్యస్మామ్. | అతియుష్మాన్, అత్యస్మాన్. |
| తృ॥ | అతియుష్మయా, అత్యస్మయా. | అతియుష్మాభ్యామ్, అత్యస్మాభ్యామ్. | అతియుష్మాభిః, అత్యస్మాభిః. |
| చ॥ | అతితుభ్యమ్, అతిమహ్యమ్. | ,, | అతియుష్మభ్యమ్, అత్యస్మభ్యమ్. |
| పం॥ | అతియుష్మత్, అత్యస్మత్. | ,, | అతియుష్మత్, అత్యస్మత్. |
| ష॥ | అతితవ, అతిమమ. | అతియుష్మయోః, అత్యస్మయోః. | అతియుష్మాకమ్, అత్యస్మాకమ్. |
| స॥ | అతియుష్మయి, అత్యస్మయి. | ,, | అతియుష్మాసు, అత్యస్మాసు. |

వివరణము :— శేషేలోప మన్త్యలోపమను పక్షమందే అమ్మునకు సుడాగమ ప్రసక్తియుండును గాన నీ పక్షమందే, "సామ ఆకమ్" సూత్రమున, "సామః" అను ససుట్క నిర్దేశము సఫలమగును. ఈ నిర్దేశమే శేషేలోప మన్త్యలోపమను పక్షమందు జ్ఞాపకమగును. టిలోపపక్షమం దా కమాదేశో త్తరమునగూడ యుష్మదస్మచ్ఛబ్దముల వర్ణాన్తములు గానందున సుడాగమ ప్రసక్తి లేకపోవుటచే భావిసుడాగమ నివృత్తికొఱకగు ససుట్క నిర్దేశము వ్యర్థమగునని గ్రహించునది.

* 403. పదస్య. 8-1-16.

* 404. పదాత్. 8-1-17.

* 405. అనుదాత్తం సర్వమపాదాదౌ. 8-1-18.

ఇత్యధికృత్య.

403. ఇది యధిసూరసూత్రము. "అపదాన్తస్య మూర్ధన్యః, (211) అను సూత్రమువరకు నిది యధికృతమగును. కావుననే "నలోపః ప్రాతిపదిక" (237) సూ. చే, నలోపము పదసంజ్ఞగల రాజభ్యామ్, ఇత్యాదులలోనే ప్రవర్తించును గాని పదసంజ్ఞారహితమగు, రాజానౌ, ఇత్యాదులలో ప్రవర్తించదు.

వివ :— పదస్య, అనునది, "సంయోగాన్తస్య లోపః" (55) ఇత్యాదులందు స్థానషష్ఠ్యన్తము. "మాదుపధాయాశ్చ" 8-2-9 సూత్రమున, నవయవ షష్ఠ్యన్తము. కావుననే పదావయవమగు మతుప్ ప్రత్యయములోని మకారమునకు వత్వమను నర్థము సంభవించును. వృక్షవన్తౌ, ఇత్యాదులందును వత్వము సిదించును. లేనిచో "మతుబన్తమైన పదమున కవయవమగు మకారమునకు వత్వ" మనెడి యర్థము లభించును. పదసంజ్ఞక మతుబన్తమైన వృక్షవాన్ అనుచోటనే వత్వము సిద్ధమగును గాని పదసంజ్ఞకము కానట్టి మతుబన్తమందవగా వృక్షవన్తౌ ఇత్యాదులందు రాకపోవును.

404. ఇది అధికారసూత్రము. "తత్సనేచ సుప్యగోత్రాదౌ" (8-1-69) సూత్రమువర కధికృతమగును.

405. అనుదాత్తమ్ సర్వమ్ అపాదాదౌ. ఈ పదత్రయ మీ పాదము సమాప్తమగువరకు నధికృతమగును. అపాదాదౌ (పాదస్యాదిః, పాదాదిః, న, పాదాదిః, అపాదాదిః తస్మిన్) అను దానికి పాదాది భిన్నమందని యర్థము. పాదశబ్దమునకు ఋక్పాదమనియు శ్లోకపాదమనియు నర్థము. అపాదాదిశబ్దముచే పాదాన్తపాద మధ్యస్థములనువలె ఛందోవిహీన వాక్యస్థమునుగూడ గ్రహింపదగును. ఇట్లు చెప్పుటకు, "గ్రామే కంబలో మేస్వామీ" అను భాష్య ప్రయోగము ప్రమాణము. వాక్యస్థమును గ్రహింపనిచో నిచట "తేమయా

చేక" (408) సూ. చే. విధింపబడు మే అను నాదేశ మసంగతము గావలయును.

* 406. యుష్మదస్మదోః షష్ఠీ చతుర్థీ ద్వితీయా స్థయోర్వాం నావౌ. 8-1-20. యుష్మదస్మదోః। షష్ఠీ చతుర్థీ ద్వితీయాస్థయోః। వాంనావౌ॥

పదాత్పరయోర పాదాదౌ స్థితయో రవయోః షష్ఠ్యాది విశిష్టయోః వాంనావిత్యాదేశౌ స్తస్తౌచా నుదాత్తౌ॥

406. షష్ఠీచ, చతుర్థీచ, ద్వితీయాచ = షష్ఠీ చతుర్థీ ద్వితీయాః, తాభిస్సహతిష్ఠత ఇతి = షష్ఠీ...స్థౌ, తయోః. షష్ఠీ...స్థయోః. వామ్ చ. నౌచ = వాంనావౌ. 1 పదముకంటె పరములు అపాదాదిస్థములు షష్ఠీ చతుర్థీ ద్వితీయా విభక్త్యన్తములు నగు యుష్మదస్మచ్ఛబ్దములకు క్రమముగ వాం, నౌ, అను నాదేశములగును, అవి అనుదాత్తములగును.

వివ:—1 సర్వస్య, పదస్య, అను రెండు నధికృతము లగుటచే నీ యర్థము లబ్ధమైనది. స్థ గ్రహణమువలన శ్రూయమాణ విభక్తికములకే, ఆదేశము లగునను నర్థము చెప్పబోవుచున్నాడు. యుష్మదస్మదోః అని యనుటవలన వీనికి విభక్తులు పరముగనున్నపు డాదేశము లగుననుటకు వీలులేదు. అట్లు చెప్పిన భ్యామాదులు పరమగునపుడు, పదసంజ్ఞకములగు కేవల యుష్మదస్మచ్ఛబ్దములకే ఆదేశములు ప్రవర్తములగును, "సుఖం వాం నౌ" మొదలగు ప్రయోగముల సంగతములు గావలయును.

* 407. బహువచనస్య వస్ నసౌ. 8-1-21. బహువచనస్య। వస్ నసౌ॥

ఉక్తవిధయోః షష్ఠ్యాది బహువచనాన్తయోః వస్ నసౌ స్తః। వాంనావోరపవాదః॥

407. వాంనావౌ అను పదమును విడిచి పూర్వసూత్ర మనువృత్తి మగును. పదముకంటె పరములు, అపాదాదిస్థములు, షష్ఠీ చతుర్థీ ద్వితీయా బహువచనాన్తములునగు, యుష్మదస్మచ్ఛబ్దములకు, క్రమముగ, వస్, నస్, అనునవి ఆదేశములగును. ఇవి వాంనావాదేశముల కపవాదములు.

* 408. తేమయావేక వచనస్య. 8-1-22. తేమయౌ। ఏకవచనస్య॥

ఉక్తవిధయోరనయోః షష్ఠీ చతుర్థ్యేకవచనాన్తయోః తే మే ఏతౌ స్తః॥

408. వాం, నౌ, అను పదములను విడిచి యుష్మదస్మదోః అను సూత్ర మనువృత్తమగును. ఉక్తవిధములైనటువంటి, షష్ఠీ చతుర్థ్యేక వచనాన్తములగు యుష్మదస్మచ్ఛబ్దములకు, తే, మే, అనునవి క్రమముగ నాదేశములగును.

* 409. త్వామౌ ద్వితీయాయాః. 8 1-23. త్వామౌ। ద్వితీయాయాః (యుష్మదస్మదోః। ఏకవచనస్య)

ద్వితీయైకవచనాన్తయోః త్వామా ఏతౌ స్తః.

శ్లో॥ (1) శ్రీశస్త్వావతు మాపీహ దత్తాత్తే మేపి శర్మ సః।
స్వామీ తే మేఽపి సహరిః పాతు వామపి నౌ విభుః।

(2) సుఖం వా నౌ దదాత్వీశః పతిర్వామపి నౌ హరిః।
సోఽవ్యాద్వోనః శివం వో నో దద్యాత్సేవ్యోఽత్ర వః సనః॥
పదాత్పరయోః కిమ్। వాక్యాదౌ మాభూత్। త్వాం పాతు। మాంపాతు। అపాదాదౌ కిమ్। వేదైరశేషైస్సంవేద్యోఽస్మాన్కృష్ణః స్సర్వదాఽవతు। స్థగ్రహణాచ్ఛ్రూయమాణ విభక్తికయోరేవ। నేహ। ఇతి యుష్మత్పుత్రో బ్రవీతి। ఇత్యస్మత్పుత్రో బ్రవీతి। వా॥ సమానవాక్యే నిఘాత యుష్మదస్మదాదేశా వక్తవ్యాః। ఏకతిఙ్ వాక్యమ్। తేనేహ న। ఓదనం పచ తవ భవిష్యతి। ఇహతు స్యాదేవ। శాలీనాం తే ఓదనందాస్యామీతి। వా॥ ఏతే వాంనావాదయ ఆదేశా అనన్వాదేశే వావక్తవ్యాః అన్వాదేశేతు నిత్యం స్యుః। ధాతా తే భక్తోఽస్తి, ధాతాతవ భక్తోఽస్తీతి వా। తస్మైతే నమ ఇత్యేవ॥

409. ఉక్తవిధములగు, ద్వితీయైక వచనాన్త యుష్మదస్మచ్ఛబ్దములకు క్రమముగ త్వా, మా, అనునవి ఆదేశములగును. ప్రసిద్ధమగు విభక్తిక్రమము ననుసరించి, ద్వితీయా చతుర్థీ షష్ఠీ విభక్తులయొక్క ఏకవచన ద్వివచన బహువచనములను, శ్లోకద్వయముచే నుదాహరించుచున్నాడు. "శ్రీశస్త్వాఽవతు మాపీహ" ఇవి ద్వితీయైక వచనాన్తములు. విష్ణువు నిన్ను నన్ను రక్షించుగాక యని యర్థము. ఈ యుదాహరణము లన్నిటిలో యుష్మదస్మచ్ఛబ్దములు పదముకంటె పరములు అపాదాదిస్థములునై యున్నవి. "దత్తాత్తే మేఽపి శర్మసః" ఆ విష్ణువు నీకొఱకు నాకొఱకును సుఖము నిచ్చుగాక. చతుర్థ్యేకవచనాన్తములు. "స్వామీ తే మేపి సహరిః" ఆ విష్ణువు నీకు నాకును ప్రభువు. షష్ఠ్యేక వచనాన్తములు. "పాతు వామపి నౌ విభుః "విష్ణువు మీ యిద్దఱను మా యిద్దఱను రక్షించుగాక. ద్వితీయా ద్వివచనాన్తములు. "సుఖం వాంనౌ దదాత్వీశః" ఈశ్వరుడు మీ యిద్దఱికొఱకు మా యిద్దఱికొఱకును సుఖము నిచ్చుగాక. చతుర్థీ ద్వివచనాన్తములు. "పతిర్వామపి నౌ హరిః" విష్ణువు మీ

యిద్దరికి మా యిద్దరికిని ప్రభువు. షష్ఠీ ద్వివచనాంతములు. "సోఽవ్యాద్వో నః" విష్ణువు మిమ్మును మమ్మును రక్షించుగాక. ద్వితీయా బహువచనాంతములు. "శివం వో నో దద్యాత్" మీకొఱకు, మాకొఱకును మంగళము నిచ్చుగాక. చతుర్థీ బహువచనములు. "సేవ్యోఽత్ర వస్సనః" విష్ణువు మీకును మాకును సేవింపదగినవాడు. షష్ఠీ బహువచనాంతములు. త్వాం పాతు, మాం పాతు, అను వాక్యముల యాదియందున్నవాని కాదేశములను వారించుటకు, "పదాత్పరయోః" అను విశేషణ మావశ్యకము. "వేదైరశేషైస్సంవేద్యోఽస్మాన్ కృష్ణస్సర్వదాఽవతు" ఇచట శ్లోకముయొక్క ద్వితీయ పాదాదియందున్న; అస్మాన్, అనుదాని కాదేశమును వారించుటకై, అపాదాదౌ, అను విశేషణ మావశ్యకము. "యుష్మదస్మదోః" (406) అను సూత్రమున, షష్ఠీ చతుర్థీ ద్వితీయాస్థయోః, అనుచోట స్థగ్రహణమును విడిచి, షష్ఠీ చతుర్థీ ద్వితీయానామ్, అని చెప్పినను సర్వస్య, పదస్య అను పదద్వయానువృత్తివలన షష్ఠ్యాది విశిష్టము లనునర్థము లబ్ధమగుచుండ స్థగ్రహణము వ్యర్థమగునను శఙ్కను మనసు నందిడుకొని స్థగ్రహణ ఫలమును చూపుచున్నాడు. "స్థగ్రహణాచ్ఛ్రూయమాణ విభక్తికయోరేవ...బ్రవీతి" స్థగ్రహణ సామర్థ్యమువలన శ్రూయమాణ విభక్తికములైనవానికే ఆదేశములని యర్థము. "ఇతియుష్మ...బ్రవీతి. (యుష్మత్పుత్రః. అస్మత్పుత్రః) ఇచట సమాసమందు సమాసప్రయుక్తమైన లుక్కుచే విభక్తి యపహరింపబడుటవలన, శ్రూయమాణ విభక్తికములు గానందున నాదేశములు రావు. పదముకంటె పరములైనవని తెలియజేయుటకు ఇతి యుష్మత్పుత్రో...బ్రవీతి అనుచోట నితిశబ్దము ప్రయుక్తమయ్యెను. వా॥ సమాన...వక్తవ్యాః. నిఘాతము (అనుదాత్తము) యుష్మదస్మచ్ఛబ్దముల యాదేశములును, నిమిత్తనిమిత్తులేక వాక్యస్థములైనపుడు విధింపదగునని యర్థము. ప్రకృతమున నాదేశములకు నిమిత్తము పదము, పదనిమిత్తకములగుటచే, యుష్మదస్మచ్ఛబ్దములయొక్క యాదేశములు నిమిత్తులు, (నిమిత్తినః = నిమిత్తముగలవి) భిన్నవాక్యములోని పదమును, నిమిత్తముగాఁగొని యనుదాత్తముగాని, యాదేశములుగాని రావని యాశయము. 1 వాక్యమన సమాన తిఙన్తముగల శబ్దసముదాయము. "ఏకతిఙ్" అనునది బహువ్రీహి. ఇచట నేకశబ్దము సమానార్థకముగాని సంఖ్యావాచకము గాదు. కావుననే "బ్రూహి బ్రూహి దేవదత్త" అనుచోట తిఙన్తద్వయమున్నను, సమాన తిఙన్తమగుటచే వాక్యమగును. ఇచట "దేవదత్త" అనుదానికి "ఆమన్త్రితస్య" (8-1-19) సూ. చే, ననుదాత్తము సిద్ధమగును. నిమిత్తము (పదము) నిమిత్తి (యుష్మదస్మచ్ఛబ్దములు) సమాన వాక్యస్థములైనపుడే యాదేశములను విధింపవలెనను వార్తిక ముండుటవలన, ఓదనం పచ, అను వాక్యములోని పచ, అను పదమును బట్టి రెండవ వాక్యమందున్న యుష్మచ్ఛబ్దమున కాదేశము వారితమగును. "శాలీనాం తే ఓదనం దాస్యామి" అనునదొకేవాక్యము. ఇచటి యుష్మ

చ్ఛబ్దము సమాన వాక్యస్థమగు శాలీనాం, అను పదముకంటె పరమగుటచే, తే, అను నాదేశము వచ్చెను. వా॥ వాం, నౌ, వస్, నస్, మొదలగు నీ యాదేశములు యుష్మదస్మచ్ఛబ్దములన్వాదేశ విషయములు గానపుడు వికల్పముగ నగును, అన్వాదేశ విషయములగువానికి, నిత్యముగ నగును. ఉదా॥ ధాతా తే భక్తోఽస్తి, ధాతా తవ భక్తోఽస్తి. తస్మై తే నమః. ఇచట యుష్మచ్ఛబ్ద మన్వాదేశవిషయక మగుటచే తే, అను నాదేశము నిత్యముగ ప్రవర్తించెను.

వివ:—1 ఈ వాక్యలక్షణము వ్యాకరణ శాస్త్ర విహిత కార్యములకు మాత్ర ముపయోగించును. లౌకిక వాక్యమునకు లక్షణము అమరకోశమునందు జెప్పబడెను. సుప్తిఙన్తచయో వాక్యం క్రియావాకారకాన్వితా అని వాశబ్దముచే దర్థకము. కారకములలో నన్వయించు క్రియబోధ్యమైనయెడల సుప్తిఙన్తచయము, అనగా సుబన్తముల సముదాయము, తిఙన్తముల సముదాయము, సుప్తిఙన్తముల సముదాయమును వాక్యమగునని యర్థము. దేవదత్తేన శయితవ్యమ్. పచతిభవతి, చైత్రః పచతి, అనునవి వరుసగ నుదాహరణములు. క్రియ బోధవిషయము గావలయుననుటచే నర్థరహితమైనది వాక్యము గాదు.

* 410. నచవాహాహైవయుక్తే. 8-1-24. న। చవాహాహైవయుక్తే॥

చాదిపఞ్చకయోగే నైతే ఆదేశాః స్యుః। హరిస్త్వాం మాంచరక్షతు। కథం త్వాం మాంవా నరక్షేదిత్యాది। యుక్తగ్రహణాత్సాక్షాద్యోగేఽయం నిషేధః। పరమ్పరాసంబన్ధేతు ఆదేశః స్యాదేవ। హరిశోహరిశ్చ మే స్వామీ॥

410. (చవాహాహైవైర్యుక్తమ్, చవాహాహైవయుక్తమ్, తస్మిన్) చ, వా, హా, అహ, ఏవ, ఈ అయిదునవ్యయములు. ఇవి వరుసగ, సముచ్చయము, వికల్పము, అద్భుతము, భేదము, అవధారణము అను నర్థముగలవి. వీనిలో నేదైన నొకదానితో యోగమున్నపుడు, యుష్మదస్మచ్ఛబ్దములకు, వాం, నౌ, మొదలగు నాదేశములు రావు. హరిస్త్వాం మాంచ రక్షతు. (విష్ణువు నిన్ను నన్ను రక్షించుగాక.) ఇచట చ శబ్దము యుష్మదస్మచ్ఛబ్దార్థముల సముచ్చయమును ద్యోతనము చేయును. "కథం త్వాం మాంవా నరక్షేత్" (విష్ణువు నిన్నుగాని నన్నుగాని యేల రక్షింపడు) ఇచట వా శబ్దము యుష్మదస్మదర్థగతమగు వికల్పమును బోధించును. ఇట్లే "కృష్ణో మమ హా ప్రసీదతి", "కృష్ణో మమాఽహ నప్రసీదతి", కృష్ణో మమైవ సేవ్యః" అను నుదాహరణముల నూహించునది. సూత్రమున, "చవాహాహైవైః" అనెడి తృతీయావిభక్తి నిర్దేశముఫలననే, యోగే, అను నర్థము లబ్దమగుచుండ యుక్త గ్రహణ మెందులకనుశంకకు సమాధానము చెప్పుచున్నాడు. "యుక్త...

స్వామీ" యుక్తగ్రహణ సామర్థ్యముచే చాదులు యుష్మదస్మదర్థగతమైన సముచ్చయాదులను ద్యోతనచేయునపుడే యీ నిషేధమగుననియు, పరమ్పరా సంబన్ధమున్నపుడాదేశములు తప్పకవచ్చుననియు నర్థము. "హరిర్హరిశ్చ మే స్వామీ" ఇచట చ శబ్దము హరహరులయందలి సముచ్చయమును ద్యోతన చేయును. అస్మదర్థమునకు హరి హరాదులతో సంబంధము గాన చ శబ్దము పరంపరముగ నస్మదర్థగత సముచ్చయమును ద్యోతన చేయుచున్నది. కావున నిచట నిషేధప్రసక్తిలేదని గ్రహించునది.

* 411. పశ్యార్థైశ్చానాఽలోచనే. 8-1-25. పశ్యార్థైః, చ, అనాలోచనే (యుష్మదస్మదాదేశాః। న)

అచాక్షుషజ్ఞానార్థైర్ధాతుభిర్యోగే ఏతే ఆదేశా నస్యుః। చేతసా త్వాం సమీక్షతే। పరమ్పరా సంబన్ధేఽప్యయం నిషేధః। భక్తస్తవ రూపం ధ్యాయతి। ఆలోచనే తు। భక్తస్త్వా పశ్యతి చక్షుషా ॥

411. ఇచట పశ్య శబ్దమునకు దర్శనమర్థము. (పశ్యః = దర్శనం, అర్థః యేషాం తైః, ధాతుభిః) ఆలోచనమన చాక్షుషజ్ఞానము (చూపు) తద్భిన్న మనాలోచనము. అనాలోచనే, అని చెప్పుటవలన పశ్య శబ్దార్థము చాక్షుషజ్ఞానమన వీలుచిక్కదు, గావున జ్ఞానసామాన్యమును వివక్షింపవలయును. చాక్షుషజ్ఞాన భిన్నజ్ఞాన మర్థముగల ధాతువులతో యోగమున్నపుడు యుష్మదస్మదాదేశములు రావని సూత్రార్థము. "చేతసా త్వాం సమీక్షతే"= నిన్ను మనస్సుచే ధ్యానించుచున్నాడు. ఈ సూత్రమున యుక్తగ్రహణము లేనందున, పరమ్పరాసంబన్ధమందు నీ నిషేధము ప్రవర్తించును. "భక్తస్తవ రూపం ధ్యాయతి = భక్తుడు నీ రూపమును ధ్యానించుచున్నాడు. ఇచట యుష్మదర్థము రూపములోనికి. రూపము ధ్యానములోనికి నన్వయించుటచే పరమ్పరాసంబన్ధము నూహించునది. భక్తస్త్వా పశ్యతి చక్షుషా = భక్తుడు నిన్ను కంటితో చూచుచున్నాడు. ఇచట దృశ్ ధాతువు చాక్షుషజ్ఞానార్థకము గాన నీ నిషేధమును వారించుటకై "అనాలోచనే" అనునది యావశ్యకమగును.

* 412. సపూర్వాయాః ప్రథమాయా విభాషా. 8-1-16. సపూర్వాయాః, ప్రథమాయాః, విభాషా, (యుష్మదస్మదాదేశాః)

విద్యమానపూర్వాత్ప్రథమాన్తాత్పరయో రనయోరన్వాదేశేఽప్యేతే ఆదేశా వా స్యుః। భక్తస్త్వమప్యహం తేన, హరిస్త్వాం త్రాయతే సమామ్। [illegible] ॥

412. సపూర్వాయాః అనునది బహువ్రీహి. (సహ విద్యమానం, పూర్వం యస్యాః), ప్రథమా అనునది ప్రత్యయబోధక మగుటవలన తదన్తవిధి కలుగును. విద్యమాన పూర్వముగల ప్రథమాన్తము కంటె పరమగు యుష్మదస్మచ్ఛబ్దముల కన్వాదేశమందు నీ యాదేశములు వికల్పముగ నగును. భక్తస్త్వ..మామ్ (నీవును నేనును భక్తులము గాన నా విష్ణువు నిన్ను నన్ను పాలించును). ఇచట పూర్వవాక్యమున నుపాత్తమైన యుష్మదస్మదర్థముల కుత్తరవాక్యమందు తిరుగ స్వీకారమున్నందున నన్వాదేశమగును. తేన, అను పదము పూర్వమందుగల ప్రథమాన్తము, హరిః, అనునది. "త్రాయతే, అను పదము పూర్వమందుగల ప్రథమాంతము, 'సః, అనునది. కావున నిచట నాదేశములు వికల్పముగ ప్రవర్తించును. యుష్మదస్మదాదేశము లన్వాదేశమందు నిత్యముగ ప్రాప్తమగుచుండ వికల్పార్థ మీ సూత్రము.

* 413. సామన్త్రితమ్. 2-3-48. సా, ఆమన్త్రితమ్. (సంబోధనే)

సంబోధనే యా ప్రథమా తదన్తమామన్త్రితసంజ్ఞం స్యాత్ ॥

413. సా అనునది పూర్వము చెప్పబడిన ప్రథమావిభక్తిని పరామర్శించును. ఇది ప్రత్యయబోధక మగుటవలన తదన్తవిధి గల్గును. సంబోధన ప్రథమాన్తమామన్త్రితసంజ్ఞ గలదగును.

* 414. ఆమన్త్రితం పూర్వమవిద్యమానవత్, 8-1-72. ఆమన్త్రితమ్, పూర్వమ్, అవిద్యమానవత్.

స్పష్టమ్। అగ్నే తవ। దేవాస్మాన్పాహి। అగ్నే నయ। అగ్న ఇంద్రవరుణ। ఇహ యుష్మదస్మదోరాదేశ స్తిఙన్త నిఘాతః ఆమన్త్రిత నిఘాతశ్చన। సర్వదామిత్రదేవ న ఇత్యత్ర తు దేవేత్యస్యా విద్యమానవద్భావేఽపి తతః ప్రాచీనం రక్షేత్యేతదాశ్రిత్యాదేశః। ఏవం ఇమం మే గఙ్గేయమున ఇతిమన్త్రేఽపి యమున ఇత్యాదిభ్యః ప్రాచీనామన్త్రితావిద్యమానవద్భావేఽపి మేశబ్దమేవాశ్రిత్య సర్వేషాం నిఘాతః ॥

414. పూర్వమందుండు ఆమన్త్రిత మవిద్యమానసదృశమగును. అనగా దాని నొక పదముగ గ్రహింపవలనుపడదు. 'పదాత్', అను నధికారమునందు విహితములగు కార్యములు ప్రవర్తించకుండుట యతిదేశ ఫలమగును. అగ్నే తవ. అగ్నే అనుదానికిచట నవిద్యమానవద్భావమునుచే, షష్ఠ్యేకవచనమైన పదముగు యుష్మచ్ఛబ్దమునకు విధింపబడిన, తే, అను నాదేశము... ఇట్లే దేవాస్మాన్పాహి

అనుచోట నసాదేశమురాదు. అగ్నేనయ. ఇచట తిఙన్తభిన్నమగు పదము కంటె పరమగు తిఙన్తమున కనుదాత్త విధాయకమగు 'తిఙతిఙః, (8-1-28) సూత్రముచే ననుదాత్తము రాదు. 'అగ్న ఇన్ద్ర వరుణ. ఇచట నిన్ద్రశబ్దమునకు గాని వరుణ శబ్దమునకుగాని పదముకంటె పరమగు నామన్త్రితమున కనుదాత్త విధాయకమగు, ఆమన్త్రితస్యచ (8-1-19) అను సూత్రముచే ననుదాత్తము రాదు. "సర్వదా రక్షదేవ, నః" ఇచట దేవ అనుదాని కవిద్యమానవద్భావ మున్నను దానికి పూర్వమందున్న రక్ష అను పదము నాశ్రయించి నసాదేశ మగును. "ఇమం మే గఙ్గేయమునే శుతుద్రి" అను మన్త్రమున నామన్త్రితము లగు, గఙ్గే, యమునే, సరస్వతి, మొదలగు పదములలో యమునే అనుదాని కనుదాత్తము చేయునపుడు, గఙ్గే అనుదానికి, సరస్వతి అనుదాని కనుదాత్తము చేయునపుడు, యమునే అనుదానికి నవిద్యమానవద్భావమున్నను, మే అను పదము నాశ్రయించి, 'యమునే సరస్వతి శుతుద్రిపదములకు ఆమన్త్రితస్యచ అను సూత్రముచే ననుదాత్తము ప్రాప్తమగుచున్నది. మూలమున నిఘాతః అనుచోట ప్రాప్తః అని యధ్యాహారమును చేయవలయును. యమునే సరస్వతి పదముల కనుదాత్తము ప్రవర్తించును. పాదాదిస్థమగుటచే, శుతుద్రి పదమునకు నిఘాతము రాదు. ఈ మూడింటి కనుదాత్తము ప్రాప్తమగుటవలన 'ప్రాప్తః, అను పదమున కధ్యాహారము చేయుటచే, సర్వేషాం, అను బహువచన మసంగతము గానేరదు.

* 415. నామన్త్రితే సమానాధికరణే సామాన్య వచనమ్. (8-1-73). న. ఆమన్త్రితే, సమానాధికరణే, సామాన్యవచనమ్। (ఆమన్త్రితమ్, అవిద్యమానవత్)

విశేష్యం సమానాధికరణే ఆమన్త్రితేపరే నావిద్యమానవత్ స్యాత్। హారే దయాలో నః పాహి। అగ్నే తేజస్విన్ ॥

415. సమానాధికరణే అనునది బహువ్రీహి (సమానం అధికరణం అర్థః యస్యతస్మిన్) సమానాధికరణమన నేకార్థబోధకము. సామాన్య వచనమ్, అను పదమునకు విశేష్యమని యర్థము. విశేషణ మనునది యర్థసిద్ధమగును. ఏకార్థబోధకము విశేషణమునగు నామన్త్రితము పరమగునపుడు విశేష్యమవిద్యమానవద్భావము నొందదు. హారే దయాలోనః పాహి. ఇచట దయాలో అను విశేషణము పరమగునపుడు విశేష్యమగు, హారే అనుదాని కవిద్యమానవద్భావము లేనందున నసాదేశము వచ్చెను. అగ్నే తేజస్విన్. ఇచట అగ్నే అనుదాని కవిద్యమానవద్భావములేదు గాన, తేజస్విన్, అను దానికి "ఆమన్త్రితస్య" అను సూత్రముచే ననుదాత్తమగును.

* 416. విభాషితం విశేషవచనే. 8-1-74. విభాషితమ్। విశేషవచనే। (నేతిశేషః పూర్వసూత్రమ్)

అత్రభాష్యమ్। బహువచనమితి వక్ష్యామీతి। బహువచనాన్తం విశేష్యం సమానాధికరణే ఆమన్త్రితే విశేషణేపరే అవిద్యమానవద్వా। యూయం ప్రభవో దేవాశ్శరణ్యాః। యుష్మాన్ప్రభవో భజే ఇతివా। ఇహాన్వాదేశేఽపి వైకల్పికా ఆదేశాః। సుపాత్। సుపాద్। సుపాదౌ। సుపాదః। సుపాదమ్। సుపాదౌ॥

416. విశేషవచనమన విశేషణము. ఈ సూత్రమున, బహువచనపదమును చెప్పవలయునని భాష్యకారుడు చెప్పెను. ఏకార్థకము, ఆమన్త్రితము నగు విశేషణము పరమగునపుడు బహువచనాన్తమగు విశేష్యమవిద్యమాన సదృశము వికల్పముగ నగును. పూర్వసూత్రముచే నిషేధము ప్రాప్తమగుచుండ వికల్పార్థమీ సూత్రము. యూయం ప్రభవః...ఇతివా. ఇచట నవిద్యమానవద్భావముచే నన్వాదేశమందు నాదేశములు వికల్పముగనే ప్రవర్తించును. సుపాత్. సుపాద్. (శోభనౌపాదౌయస్య) సుపాద అను బహువ్రీహియందు తుది యకారము లోపించును. పిదప సులోపము, వికల్పచర్త్వము.

* 417. పాదః పత్. 6-4-130. పాదః, పత్ (అఙ్గస్య, భస్య)

పాచ్ఛబ్దాన్తం యదఙ్గం భం తదవయవస్య పాచ్ఛబ్దస్య పదాదేశః స్యాత్। సుపదః సుపదా। సుపాద్భ్యామిత్యాది। అగ్నిం మథ్నాతీత్యగ్నిమత్। అగ్నిమద్। అగ్నిమథౌ। అగ్నిమథః। అగ్నిమద్భ్యామిత్యాది। ఋత్విగిత్యాదిసూత్రేణాఞ్చేః సుప్యుపపదే క్విన్॥

417. పాదః, అనునది పాద్ అనుదానికి షష్ఠ్యేకవచనాన్తము. పాద్ శబ్దమన్తమందుగలిగి భసంజ్ఞగల యఙ్గమున కవయవమగు పాద్ శబ్దమునకు, పద్ అను నాదేశమగును. అఙ్గావయవమగు పాచ్ఛబ్దమున కనునర్థము నిర్దిశ్యమాన పరిభాషచే లబ్ధమైనది. సుపదః (సుపాద్ + శస్) సుపాద్భ్యామ్, (సుపాద్ + భ్యామ్) ఇచట నఙ్గము భసంజ్ఞకము గానందున పదాదేశము రాదు. 'అగ్నిం మథ్నాతి' అను నర్థమున, అగ్నిశబ్దపూర్వకమగు మథ ధాతువు కంటె క్విప్ప్రత్యయము అగ్నిమథ్ + సు. సులోప జశ్త్వచర్త్వములు. అగ్నిమత్. అగ్నిమద్, అగ్నిమథౌ, ఇత్యాదుల నూహించునది. ప్రకృష్టమఞ్చతి (క్రుఞ్

ముగ నడుచువాడు) అను విగ్రహమున గత్యర్థకమగు ప్రపూర్వాఞ్చు ధాతువునకు, "ఋత్విక్" (375) సూత్రముచే క్విన్ ప్రత్యయము. ప్రాఞ్చ్, అని యగును.

* 418. అనిదితాం హల ఉపధాయాః క్ఙితి. 6-4-24. అనిదితామ్, హలః, ఉపధాయాః, క్ఙితి (న (నస్య), లోపః)

హలన్తానామ నిదితా మఙ్గానా ముపధాయా నస్య లోపః స్యాత్ కితి ఙితి చ। ఉగిదచామితి నుమ్। సంయోగా న్తలోపః। నుమోనకారస్య క్విన్ ప్రత్యయస్యేతి కుత్వేన ఙకారః। ప్రాఙ్। అనుస్వార పరసవర్ణౌ। ప్రాఞ్చౌ। ప్రాఞ్చః। ప్రాఞ్చమ్। ప్రాఞ్చౌ॥

418. ఇత్ = హ్రస్వేకారః, ఇత్సంజ్ఞకః యేషాంతాని ఇదిన్తి, న ఇదిన్తి = అనిదిన్తి, తేషాం అనిదితామ్. ఇత్సంజ్ఞకేకార వర్జితములని యర్థము. ఇదియును, హలః, అనునదియు నధికృతమగు నఙ్గమునకు విశేషణములు. నస్య అనుదానికి, ఉపధాయాః అనునది విశేషణము. క్ఙితి అనునది బహువ్రీహి (క్ చ ఙ్ చ క్ఙౌ, తావితౌ యస్య తస్మిన్) ఇత్సంజ్ఞకమగు నికారముతో రహితములు హలన్తములు నగు నఙ్గములయొక్క యుపధాభూతమగు నకారమునకు, కకారేత్సంజ్ఞక ప్రత్యయముగాని, ఙకారేత్సంజ్ఞక ప్రత్యయముగాని పరమగునపుడు, లోపమగునని సూత్రార్థము. క్విన్ ప్రత్యయాన్తమగు ప్రాఞ్చ్ శబ్దములోని ఞకారము, నకారజన్యమగుటవలన నసిద్ధతచే నకారముండును. అది యీ సూత్రముచే లోపించును. ప్రాచ్ అని యగును. ఉగిదచామ్ (363) సూ. చే. నుమాగమము. నులోపము. ప్రాన్చ్. సంయోగాన్తస్య (55) సూ. చే, చకారలోపము. నుమాగమసంబన్ధి నకారమునకు క్విన్ ప్రత్యయస్య (379) సూ. చే. కుత్వము. ఆన్తరతమ్యమువలన ఙకారమగును. ప్రాఙ్. ప్రాన్చ్ + ఔ. నుమ్ము. నకారమున కనుస్వార పరసవర్ణములు. ప్రాఞ్చౌ. ఇత్యాదులు.

* 419. అచః 6-4-138 (అల్లోపః, భస్య)

లుప్తనకారస్యాఞ్చతేర్భస్యాకారస్య లోపః స్యాత్ ॥

419. అచః అనునది "అనిదితామ్" సూత్రముచే లుప్తమగు నకారముగల అఞ్చు ధాతువునకు షష్ఠ్యన్తము. లుప్త నకారమయి భసంజ్ఞకమగు అఞ్చు ధాతువుయొక్క అకారమునకు లోపమగును. ప్ర + అచ్ + శస్. ఇచ్చట నీ సూత్రముచే అకారలోపము. ప్రచ్ + శస్.

* 420. చౌ. 6-3-138 (దీర్ఘః, అణః)

లుప్తాకారనకారేఽఞ్చతౌ పరే పూర్వస్యాణో దీర్ఘః స్యాత్। ప్రాచః। ప్రాచా। ప్రాగ్భ్యామ్॥ ప్రత్యక్। ప్రత్యఞ్చౌ। ప్రత్యఞ్చః। ప్రత్యఞ్చమ్। ప్రత్యఞ్చౌ। అచ ఇతి లోపస్య విషయేఽన్తరఙ్గోఽపి యణ్ న ప్రవర్తతే। అకృతవ్యూహా పరిభాషయా। ప్రతీచః। ప్రతీచా। అముముఞ్చతీతి విగ్రహే। అదస్ + అఞ్చ్ ఇతిస్థితే॥

420. చౌ, అనునది లుప్తాకార నకారములుగల అఞ్చు ధాతువునకు సప్తమ్యేకవచనము. లుప్తములగు నకారాకారములుగల అఞ్చు ధాతువు పరమగునపుడు పూర్వమందున్న అణ్ణునకు, దీర్ఘమగును. ప్రచ్ + అస్. మొదలగు శసాద్యజాది ప్రత్యయములు పరమగునపుడీ దీర్ఘము ప్రవర్తించును. ప్రాచః. ప్రాచా. అల్లోపదీర్ఘములు లేకున్నను సవర్ణదీర్ఘముచేతనే ప్రాచః, మొదలగు రూపములు సిద్ధములగును, గాని ప్రతీచః, మొదలగు రూపముల సిద్ధికై యీ సూత్రమావశ్యకము. ప్రాచ్ + భ్యామ్. చోః కుః (380) సూ. చే, కుత్వము. ప్రాగ్భ్యామ్. ఇత్యాదులు. ప్రతిపూర్వకమగు గత్యర్థకాఞ్చు ధాతువునకు క్విన్ ప్రత్యయము ప్రత్యచ్ అని యగును. సర్వనామస్థానమందు ప్రాచ్ శబ్దమునకువలె నీ శబ్దమునకును కార్యముల నూహింపవలెను. ప్రత్యక్. ప్రత్యఞ్చౌ. ప్రతి + అచ్ + అస్ మొదలగు అకారలోపమునకు విషయములగు లక్ష్యములందు, అకృతవ్యూహా పరిభాషచే, అకారలోపమునకు బూర్వమన్తరఙ్గమయినను యణాదేశము ప్రవర్తించదు. యణాదేశ నిమిత్తమగు అకారమునకు లోపము (వినాశము) రానున్నందున నిచట నకృతవ్యూహా పరిభాష ప్రవర్తించును. చౌ (420) సూత్రముచే దీర్ఘము. ప్రతీచః. ప్రతీచా, ఇత్యాదులు. అముముఞ్చతి (వీనిని పొందువాడు) అను విగ్రహమందు, అదస్ శబ్దపూర్వకమగు నఞ్చు ధాతువునకు క్విన్ ప్రత్యయము. అదస్ + అఞ్చ్. ఉపపద సమాసము. నలోపము. అదస్ + అచ్, అనియుండ.

* 421. విష్వగ్దేవయోశ్చ టేరద్ర్యఞ్చతావప్రత్యయే. 6-3-92.
విష్వగ్దేవయోః, చ, టేః, అద్రి, అఞ్చతౌ, వప్రత్యయే. (సర్వనామ్నః)

అనయోస్సర్వనామ్నశ్చ టేరద్ర్యాదేశస్స్యాద్వప్రత్యయాన్తేఽఞ్చతౌ పరే। అదద్రిఅఞ్చ్ ఇతిస్థితే॥

421. అద్రి అనునది లుప్త ప్రథమాకము. వప్రత్యయాన్తే = వకారసహితః ప్రత్యయః = వప్రత్యయః తదన్తే. అని విగ్రహము. క్విప్, క్విన్, మొదలగునవి, వప్రత్యయములగును. అప్రత్యయే, అను పాఠమున అవిద్యమాన

ప్రత్యయమని యర్థము. సర్వలోపముగల క్విబాదులే అట్టివగును. ఇది అఞ్చు ధాతువునకు విశేషణము. విష్వక్ దేవశబ్దములయొక్కయు సర్వనామము యొక్కయు టిసంజ్ఞకమునకు వప్రత్యయాన్తముగు నఞ్చు ధాతువు పరముగు నపుడు, అద్రి అను నాదేశమగును. అదస్ అఞ్చ్, అనుచోట నఞ్చ్ ధాతువు క్విన్నన్తమగుటచే వప్రత్యయాన్త మగుటవలన, అదస్ శబ్దముయొక్క టిసంజ్ఞక మునకు (అస్) అద్రి, అను నాదేశమగును. అదద్రి + అచ్. యణాదేశము. అదద్ర్యచ్.

* 422. అదసోఽసేర్దాదుదోమః. 8-2-80. అదసః, అసేః, దాత్, ఉ, దః, మః.

అదసోఽసాన్తస్య దాత్పరస్య ఉదూతౌస్తో దస్య చ మః। ఉ ఇతి హ్రస్వదీర్ఘయోస్సమాహారద్వన్ద్వః। ఆన్తరతమ్యాద్ధ్రస్వవ్యఞ్జనయోర్హ్రస్వః దీర్ఘస్య దీర్ఘః। అముముయఙ్। అముముయఞ్చౌ। అముముయఞ్చః। అముముయఞ్చమ్। అముముయఞ్చౌ। అముముఈచః। అముముఈచా। అముముయగ్భ్యామిత్యాది। ముత్వస్యాసిద్ధత్వాన్నయణ్। అన్త్యబాధేఽన్త్యసదేశస్యేతి పరిభాషామాశ్రిత్య పరస్యైవ ముత్వం వదతాం మతే, అదముయఙ్। అసేః సకారస్యస్థానే యస్యసః అసిరితి వ్యాఖ్యానాత్ త్యదాద్యత్వవిషయఏవ ముత్వం నాన్యత్రేతి పక్షే, అదద్ర్యఙ్। ఉక్తంచ। శ్లో॥ అదసోఽద్రేః పృథఙ్ముత్వం కేచిదిచ్ఛన్తి లత్వవత్। కేచిదన్త్యసదేశస్య నేత్యేకేఽసేర్హి దృశ్యతే। ఇతి। విష్వగ్దేవయోః కిమ్। అశ్వాచీ। అఞ్చతౌ కిమ్। విష్వయుక్। వప్రత్యయే కిమ్। విష్వగఞ్చనమ్। వప్రత్యయగ్రహణం జ్ఞాపయతి। అన్యత్ర ధాతుగ్రహణే తదాది విధిరితి। తేనాయస్కారః। అతః కృకమీతిసః। ఉదఙ్। ఉదఞ్చౌ। ఉదఞ్చః। శసాదావచి॥

422. అదసః అనునది యవయవషష్ఠ్యన్తము. అసేః, అనునది బహువ్రీహి (నవిద్యతే సిః = సకారః, యస్య) ఇది అదసః అనుదానికి విశేషణము. సి అనుచోట నికార ముచ్చారణార్థము సకారరహితమని యర్థము. ఉ, అనునది హ్రస్వదీర్ఘములకు సమాహార ద్వన్ద్వము. (ఉశ్చ, ఊశ్చ, అనయో స్సమాహారః = ఉ) దః అనునది షష్ఠ్యేకవచనము. సకారాన్తముగానట్టి అదస్ శబ్దమున కవయవమగు దకారముకంటె పరమగుదానికి, ఉ ఊ లును దకారమునకు మకారమగునని సూత్రార్థము. ఆన్తరతమ్యమువలన హ్రస్వమునకు హ్రస్వ

నకును, హ్రస్వోకారము, దీర్ఘమునకు, దీర్ఘోకారము నగును. అదద్ర్యచ్ + సు. ఇచట దకారద్వయ మున్నది. మొదటనున్న ద అనునది ముత్వముచే, ‘ము’ అని యగును. రెండవ దకారమునకును మకారము, దానిపైనున్న రేఫమున కుకారము నగును. సులోప కుత్వాదులు ప్రాఙ్చ్ శబ్దమునకువలె నూహింపదగును. అముముయఙ్ ఇత్యాదులు. శస్సు మొదలగు నజాది ప్రత్యయములు పరమగునపు డల్లోప దీర్ఘములు. అముము ఈచః. ఇత్యాదులు. ఇచట నుత్వ మత్వము లసిద్ధములగుటవలన యణాదేశమురాదు. అన్తరఙ్గమయినను అచః అను లోప విషయమున అకృతవ్యూహ పరిభాషచే, యణాదేశమురాదు.

అదద్ర్యచ్ శబ్దమున, ముత్వము విషయమై, “అన్త్యబాధే...... ...అదముయఙ్” అను వాక్యమును మతాన్తరమును చెప్పుచున్నాడు. అన్త్యబాధేఽన్త్యసదేశస్యైవ (అన్త్యవర్ణమునకు బాధయనగా కార్యమప్రాప్తమగునపుడు, అనేకములగు ననన్త్యవర్ణములకు కార్యము ప్రాప్తమగునపు డన్త్యవర్ణముతో సమానదేశముగల ననన్త్యమునకే, అనగా నన్త్యసమీపమునకే కార్యమగును) అన్త్యసదేశః అనునది, అన్త్యేన సమానో దేశో యస్య అను విగ్రహముగల బహువ్రీహి. ఇతర వర్ణముతో వ్యవధానరహితమగు నన్త్యవర్ణ సమీపమని యర్థము. దీనికే, “అనన్త్యవికారేఽన్త్యసదేశస్య” అను పాఠాన్తరము గలదు. సూత్రమున, అదసః అనునది స్థానషష్ఠ్యన్తము. అలోఽన్త్య పరిభాషచే దకారముకంటె పరమగు నదస్ శబ్దాన్త్యవర్ణమునకు ముత్వమని యర్థము లభ్యమగును. అదద్ర్యచ్, అనుచోట దకారమునకు పరమగు నది అదస్ శబ్దాన్త్యము గాదు. అదస్ శబ్దాన్త్యము దకారమునకు పరము గాదు. కావున నిచట నన్త్యమునకు కార్యమప్రాప్తమగుచున్నది. అన్త్యబాధే అను పరిభాషచే నిచట నన్త్యసమీపమగు ద్ర్ శబ్దమునకే ముత్వమగును, గాని ప్రథమ ద శబ్దమునకు ముత్వము రాదని వారియాశయము. కావున వారిమతమున అదముయఙ్. అదముయఞ్చౌ. అదము ఈచః. ఇత్యాది రూపములగును.

ఇక వార్తికకారమతమును, “అః సేః.....దృశ్యతే. ఇతి” అను గ్రన్థముచే ప్రదర్శించుచున్నాడు. సూత్రమున అసేః అనునది బహువ్రీహి (అః సేః (సకారస్యస్థానే) యస్యతస్య) అదసః అనుదానికి విశేషణము. సకారస్థానమున అకారముగల, అదస్ శబ్దముయొక్క యవయవమునకు ముత్వ మగునని సూత్రార్థము. కావున త్యదాద్యత్వముగల అదస్ శబ్దమునకే ముత్వ మగునని వీరియాశయము. అదశ్శబ్దావయవమగు నస్ అనుదాని కద్ర్యాదేశము వచ్చుటచే, త్యదాద్యత్వము ప్రవర్తించలేదు గాన నీ పక్షమున నిచట ముత్వము ప్రవర్తించదు. అదద్ర్యఙ్, మొదలగు రూపములగును. అసేః, అనుదాని కావృత్తిచేసి అర్థద్వయమును చెప్పుటయందు సూత్ర తాత్పర్యమున్న ట్ల[illegible]టలో చెప్పబోవు శ్లోకవార్తికమే ప్రమాణము. కావున వ్యాఖ్యాద్వయము ప్రామాణసిద్ధమే. లక్ష్యానుసారముగ వ్యవస్థచేయవలయును. శ్లోకవా[illegible]

"అదసో......ఇతి", అదస్ శబ్దముయొక్క టిసంజ్ఞకమునకద్ర్యాదేశము చేసినపుడు, అదద్ర్యచ్ అని యగును. కృపధాతువునకు యఙన్తమగు చరీకృప్యతే, అను రూపమున, రీ ఋకారముల రెండిటికిని, కృపోరోలః (8-2-18) సూ. చే, లత్వమువచ్చిన, చలీక్లృప్యతే అని అయినట్లిచటను దకారద్వయమునకు ముత్వమగునని కొందఱి మతము. "అన్త్యబాధే" అను పరిభాషచే నిచట దకార రేఫములకే ముత్వమని మఱికొందఱి మతము. అసేః అనుచోట బహువ్రీహి నాశ్రయించుటవలన నిచట త్యదాద్యత్వము రాకపోవుటచే ముత్వమే రాదని మరికొందఱి యాశయము. ఇది కారికార్థము. అశ్వాచీ, అనుచోట నశ్వశబ్దమున కద్ర్యాదేశమును వారించుటకు, అద్ర్యాదేశ విధాయక సూత్రమున విష్వగ్దేవయోశ్చ, అనునది యావశ్యకము. విష్వగ్యుక్. ఇచట నద్ర్యాదేశమును వారించుటకు, అఞ్చతౌ, అనునది యావశ్యకము. యుక్ అనునది. క్విన్నన్తమగు యుజధాతువు.

వప్రత్యయే అనునది లేనిచో ల్యుడన్తమగు నఞ్చు ధాతువు పరమగునపుడును విష్వగఞ్చనమ్ అనుచోట నద్ర్యాదేశము ప్రసక్తమగును. అద్ర్యాదేశ విధాయకసూత్ర ముత్తరపదాధికారస్థమగుటచే నఞ్చు రూపమగు నుత్తరపదము పరమగునపు డద్ర్యాదేశమగునని యర్థమగును. అముముయఙ్, ఇత్యాదులలో నఞ్చు ధాతువు క్విన్క్విబన్తమగునపుడే యుత్తరపదమగును, గాని విష్వగఞ్చనమ్, ఇత్యాదులలో ల్యుడన్తమైనపు డఞ్చుధాతు వుత్తరపదమగుట సంభవించదు. కనుక వప్రత్యయే, అనునది వ్యర్థమై మిగిలిన సూత్రములందు ధాతువును గ్రహించునపు డా ధాతు వాదియందుగలదానిని బోధించుననుటలో జ్ఞాపకమగును. ఈ సూత్రమున మాత్రము వప్రత్యయే అని యుండుటచే తదాది గ్రహణము కలుగదు, లేనిచో తదాదిగ్రహణము కల్గెడిని. అఞ్చు ధాతు వాదియందుగల యుత్తరపదము పరమగునపు డద్ర్యాదేశమగునని యర్థమయ్యెడిని. విష్వగఞ్చనమ్, అనుచోట దోషము ప్రసక్తమగునని భావము. ఇట్లు సిద్ధమయినదే మూలమున అన్యత్ర, అనునది. "ధాతుగ్ర...ధిః" అనుదానికి ఫలము:— అయస్కారః. ఇచట, కారశబ్దము పరమగునపుడు, "అతఃకృకమి" (161) సూ. చే, సత్వమగును. లేనిచో "నిత్యం సమాసే" (160) సూత్రమునుండి యనువృత్తమగు సమాసగ్రహణముచే నుత్తరపదే, అనునది యాక్షిప్తమగును. కృధాతు రూపమగు నుత్తరపదము పరమగునపుడే సత్వమగునని యర్థమగును. అయస్కృత్, అనుచోటనే వచ్చును గాని అయస్కారః అనుచోట రాకపోవును. సూత్రమున అప్రత్యయే, అని పాఠాన్తరము గలదు. దానికి, అవిద్యమాన ప్రత్యయమని యర్థము. క్విప్ క్విన్ మొదలగు ప్రత్యయములు నిత్యముగ లోపించునవగుటచే నవి యట్టివగును. కావున నది "వప్రత్యయే" అనుదానితో సమానార్థకమగునని గ్రహించునది. ఉదఙ్. ఉత్పూర్వకమగు నఞ్చు ధాతువునకు క్విన్ ప్రత్యయము, ప్రాఙ్ అను శబ్దమునకువలె దీనికిని

సర్వనామస్థానమందు ప్రక్రియ నూహింపదగును. శస్సు మొదలగు అజాది ప్రత్యయములందు విశేషమును చెప్పుచున్నాడు.

* 423. ఉద ఈత్. 6-4-139. ఉదః। ఈత్ (అచః। భస్య)

ఉచ్ఛబ్దాత్పరస్య లుప్తనకారస్యాఞ్చతేర్భస్యాకారస్య ఈత్ స్యాత్। ఉదీచః। ఉదీచా। ఉదగ్భ్యమిత్యాది॥

423. ఉద్ శబ్దముకంటె పరమై, లుప్తనకారమయి భసంజ్ఞకమగు నఞ్చు ధాతువుయొక్క అకారమునకు ఈకార మాదేశమగును. ఉద్ + అచ్ + అస్. ఉదీచః. ఉదచ్ + భ్యామ్. హలాది విభక్తులు పరమగునపుడు భసంజ్ఞ లేకపోవుటచే నీత్వము రాదు. ఉదగ్భ్యామ్ ఇత్యాదులగును.

* 424. సమస్సమి. 6-3-93. సమః, సమి (అఞ్చతౌ। వప్రత్యయే)

వప్రత్యయాన్తేఽఞ్చతౌ పరే। సమ్యఙ్। సమ్యఞ్చౌ। సమ్యఞ్చః। సమీచః। సమీచా॥

424. సమి అనునది లుప్తప్రథమాకము. వప్రత్యయాన్తమగు నఞ్చు ధాతువు పరమగునపుడు, సమ్, అను నుపసర్గమునకు సమి అను నాదేశమగును. 'సఙ్గతమఞ్చతి, అను నర్థమున సంపూర్వకాఞ్చు ధాతువుకంటె క్విన్ ప్రత్యయము. సమ్మునకు సమ్యాదేశము. నుత్వాదులు. సమ్యఙ్ సమి + అచ్ + అస్. అల్లోపదీర్ఘములు. సమీచః. సమీచా. ఇత్యాదులు నిట్లే యగును.

* 425. సహస్యసధ్రిః. 6-3-95. సహస్య। సధ్రిః (వప్రత్యయే। అఞ్చతౌ)

వప్రత్యయాన్తేఽఞ్చతౌ పరే। సధ్ర్యఙ్॥

425. వప్రత్యయాన్తమగు నఞ్చు ధాతువు పరమగునపుడు, సహ అను నవ్యయమునకు, సధ్రి, అను నాదేశమగును. (సహ, అఞ్చతి,) సహ పూర్వకమగు నఞ్చు ధాతువునకు క్విన్ ప్రత్యయము. సధ్ర్యాదేశ యణాదేశములు. సధ్ర్యఙ్. అల్లోపదీర్ఘములచే సధ్రీచః ఇత్యాదులగును.

* 426. తిరసస్తిర్యలోపే. 6-3-94. తిరసః। తిరి। అలోపే (అఞ్చతౌ)

అలుప్తాకారేఽఞ్చతౌ వప్రత్యయాన్తే పరే తిరసస్తిర్యాదేశస్స్యాత్। తిర్యఙ్। తిర్యఞ్చౌ। తిర్యఞ్చః। తిర్యఞ్చమ్। తిర్యఞ్చౌ। తిరశ్చః। తిరశ్చా। తిర్యగ్భ్యామిత్యాది॥

426. తిరి, అనునది లుప్త ప్రథమాకము. అలోపే, అనుచోట శకం ధ్వాదిపరరూపముచే నకారమునకు పూర్వ మకార ప్రశ్లేషను జేయవలయును. (న, లోపః, అలోపః, అస్య, అలోపః యస్మిన్, సః అలోపః, తస్మిన్ అలోపే) లోపించని అకారముగలదని యర్థము. ఇది అఞ్చతౌ అనుదానికి విశేషణము. అలుప్తమగు అకారముగల యఞ్చుధాతువు పరమగునపుడు, తిరస్ అను నవ్యయమునకు, తిరి, అను నాదేశమగునని సూ॥ తార్థము. (తిరో౽ఞ్చతి = అడ్డుగ నడచువాడు) తిరస్ + అన్చ్ + సు. తిరఙ్. తిర్యఞ్చౌ. తిర్యఞ్చః. తిర్యఞ్చమ్. తిర్యఞ్చౌ. తిరస్ + అచ్ + అస్. ఇచట, "అచః" (419) సూ. చే, నకారలోపము ప్రవర్తించుటచే తిర్యాదేశము రాదు. శ్చుత్వమువలన సకారమునకు శవర్ణమగటచే తిరశ్చః అను రూపమగును. "పూర్వత్రాసిద్ధే న స్థానివత్" అను నిషేధమువలన శ్చుత్వముచేయునపు డల్లోపము స్థానివద్భావము నొందదు. శస్సు మొదలగు నజాది ప్రత్యయములం దిట్లే ప్రక్రియ నూహించునది. హలాది విభక్తులందు తిర్యాదేశము వచ్చును. అఞ్చు ధాతువులోని చకారమునకు, చోః కుః, (330) సూ. చే, కుత్వము వచ్చును. తిర్యగ్భ్యామ్. ఇత్యాదులు.

* 427. నా౽ఞ్చేః పూజాయామ్. 6-4-30. న, అఞ్చేః। పూజాయామ్ (నస్య। ఉపధాయాః। లోపః)

పూజార్థస్యాఞ్చతేరుపధాయా నస్య లోపోన స్యాత్। అలుప్తనకారత్వాన్నుమ్। ప్రాఙ్। ప్రాఞ్చౌ ప్రాఞ్చః। నలోపాభావాదకారలోపోన। ప్రాఞ్చః। ప్రాఞ్చా। ప్రాఙ్భ్యామ్। ప్రాఙ్క్షు। ప్రాఙ్షు। ఏవం పూజార్థే ప్రత్యఙ్ఙాదయః। క్రుఞ్చ కౌటిల్యాల్పీభావయోః। అస్య బుత్విగిత్యాదినానలోపాభావో౽పినిపాత్యతే। క్రుఙ్। క్రుఞ్చౌ। క్రుఞ్చః। క్రుఙ్భ్యామ్। ఇత్యాది। చోః కుః। పయోముక్। పయోముగ్। పయోముచౌ। పయోముచః। వ్రశ్చేతిషత్వమ్। స్కోరితి సలోపః। జశ్త్వచర్త్వే। సువృట్। సువృడ్। సువృశ్చౌ। సువృశ్చః। సువృట్సు। సువృట్త్సు। వా॥ వర్తమానే పృషన్మహద్బృహజ్జగచ్ఛతృవచ్చ। ఏతే నిపాత్యన్తే। శతృవచ్చైషాం కార్యంస్యాత్। ఉగిత్వాన్నుమ్। సాన్తమహతఇతి దీర్ఘః। మహ్యతే = పూజ్యతే, ఇతి మహాన్। మహాన్తౌ। మహాన్తః। హేమహాన్॥ మహతః। మహతా। మహద్భ్యామిత్యాదిః

427. పూజార్థము గమ్యమానమగునపు డఞ్చు ధాతువుయొక్క ఉపధా నకారమునకు లోపము రాదు. "అనిదితామ్" (418) సూ. చే, ప్రాప్తమగు

నలోపమున కిది నిషేధము. (ప్రకర్షేణ, అఞ్చతి = పూజయతి) లెస్సగా పూజించువాడను నర్థమున ప్రపూర్వకమగు పూజార్థకాఞ్చు ధాతువుకంటె క్విన్ ప్రత్యయము. ప్రాఞ్చ్ + స్. అఞ్చు ధాతువు లుప్తనకారముగలది గానందున, "ఉగిదచామ్" (363) సూ. చే, నుమాగమము రాదు. సులోప సంయోగాన్త లోపములు. "క్విన్ ప్రత్యయస్య" (379) సూ. చే, కుత్వము. ప్రాఙ్. ప్రాఞ్చౌ. ప్రాఞ్చః. ప్రాఞ్చమ్. ప్రాఞ్చౌ. ప్రాఞ్చః. ప్ర + అఞ్చ్ + అస్. నలోపము రాకపోవుటవలన నిచట "అచః" (419) సూ. చే, అకారలోపము రాదు. ఇట్లే ప్రాఞ్చా, ఇత్యాదులు. ప్రాఙ్భ్యామ్ (ప్రాన్చ్ + భ్యామ్) సంయోగాన్తలోపము. నకారమునకు "క్విన్ ప్రత్యయస్య" (379) సూ. చే, కుత్వము, ప్రాఙ్ + సు (ప్). "ఙ్ణోః కుక్" (131) సూ. చే, కుగాగమము. షత్వము. ప్రాఙ్క్షు. కుగాగమాభావ పక్షమందు ప్రాఙ్షు. అని యగును. ఆగమసంబన్ధి కకారమునకు 'చయోద్వితీయాః అనువార్తికముచే ద్వితీయవర్ణము వచ్చిన ప్రాఙ్ఖ్షు అని మూడవరూపమగు నని తెలియునది. ఇట్లే పూజార్థమందు ప్రత్యఙ్, అముముయఙ్, ఉదఙ్ ఇత్యాది శబ్దములు. క్రుఞ్చు ధాతువునకు కౌటిల్యము, అల్పీభావము నర్థము. ఈ ధాతువునకు, "ఋత్విక్" (375) సూ. చే, క్విన్ ప్రత్యయమగును. ఈ ధాతువుయొక్క యుపధ, సహజమగు ఞకారముగాని నకారజన్యముగాదు గావున నలోపము రాదు. చకారయోగ మున్నపుడు, "చోః కుః" (380) సూ. చే, ఞకారమునకు కుత్వమును రాదు. ఈ విషయములు "ఋత్విక్" సూత్రమున క్రుఞ్చ్ అను నిపాతనమువలన గ్రహింపదగును. క్రుఙ్. ఇచట సులోప సంయోగాన్తలోప కుత్వములు. సంయోగాన్తలోప కుత్వములచే క్రుఙ్భ్యామ్, ఇత్యాదులగును. (పయోముఞ్చతి = నీటిని విడచునది, మేఘము) పయశ్శబ్దపూర్వక ముచ్ ధాతువుకంటె క్విప్ ప్రత్యయము. పయోముచ్ + సు. సులోప కుత్వచర్త్వములు. పయోముక్. పయోముగ్. కుత్వము, పయోముగ్భ్యామ్. ఇత్యాదులు. (సుష్ఠువృశ్చతి = బాగుగ కోయువాడు) సుపూర్వక వ్రశ్చ ధాతువుకంటె క్విప్ ప్రత్యయము. సువృశ్చ్ + సు. సులోపము, "స్కోః స్సంయోగాద్యోః" (332) సూ. చే, సకారలోపము, "వ్రశ్చభ్రస్జ" (295) సూ. చే, షత్వము, జశ్త్వచర్త్వములు. సువృట్. సువృడ్. సువృశ్చౌ. సువృశ్చః. సువృడ్భ్యామ్. (సువృశ్చ్ + భ్యామ్) సంయోగాది లోప షత్వజశ్త్వములు. సువృశ్చ్ + సు. సంయోగాది లోపము, షత్వము. జశ్త్వము. చర్త్వ మసిద్ధమగుటచే పూర్వము "డస్సిధుట్" సూ. చే, ధుడాగమము. డకారధకారములకు చర్త్వము. సువృట్త్సు. ధుడాగమాభావ పక్షమందు సువృట్సు. "వర్తమానే పృషన్మహద్బృహజ్జగచ్ఛతృవచ్చ". ఇది ఉణాది సూత్రము. (1) పృషు (సేచనే) (2) మహ (పూజాయామ్) (3) బృహ (వృద్ధౌ) (4) గమ్లృ (గమనే) ఈ ధాతువులకు వర్తమానకాలమున అతి ప్రత్యయమగును. పృషబృహ ధాతువులకు గుణాభావము, గమ్ ధాతువునకు

జగాదేశము నిపాతనమువలన సిద్ధించును. పృషత్, మహత్, బృహత్, జగత్, అను ప్రాతిపదికము లేర్పడును. శతృవత్, అను వతిదేశమువలన వీనికి శతృ ప్రత్యయాన్తమునకువలె కార్యములగును. మహ్యతే = పూజ్యతే, ఇతి మహాన్. మహత్ + సు. శతృవద్భావాతిదేశమువలన సర్వనామస్థానమందు గిత్త్వ ప్రయుక్తమగు నుమాగమము, ఉగిదచామ్ (363) సూ. చే, నగును. "సాన్త మహతః" (318) సూ. చే, దీర్ఘము. సులోప సంయోగాన్త లోపములు. మహాన్. మహత్ + ఔ. నుమాగమ దీర్ఘములు. మహాన్తౌ. ఇట్లే సర్వనామస్థానమున, నుమ్ దీర్ఘములగును. హే మహన్. దీర్ఘవిధాయక సూత్రమున, అసంబుద్ధౌ అని యుండుటవలన నిచట దీర్ఘము రాదు.

* 428. అత్వసన్తస్య చాఽధాతోః. 6-4-14. అతు, అసన్తస్య, చ, అధాతోః (ఉపధాయాః, దీర్ఘః, అసంబుద్ధౌ, సౌ)

అత్వన్తస్యోపధాయా దీర్ఘస్స్యాద్ధాతుభిన్నాసన్తస్య చాసంబుద్ధౌ సౌ పరే। పరం నిత్యఇచ్చ నుమమ్బాధిత్వా వచనసామర్థ్యాదాదౌ దీర్ఘస్తతో నుమ్। ధీమాన్। ధీమన్తౌ। ధీమన్తః। హేధీమన్। శసాదౌ మహద్వత్। ధాతోరప్యత్వన్తస్య దీర్ఘః। గోమన్తమిచ్ఛతి, గోమానివాచరతీతివా క్యజన్తాదాచారక్విబన్తాద్వా కర్తరి క్విప్॥ ఉగిదచామితి సూత్రేఽఞ్గ్రహణం నియమార్థమ్। ధాతోశ్చేదుగిత్కార్యం, తర్హ్యఞ్చతేరేవేతి। తేన, స్రత్. ధ్వత్, ఇత్యాదౌ న। అధాతోరితితు అధాతుభూతపూర్వస్యాపి నుమర్థమ్। గోమాన్। గోమన్తౌ। గోమన్తః। ఇత్యాది। భాతేర్డవతుః। భవాన్। భవన్తౌ। భవన్తః। శత్రన్తస్యత్వత్వన్తత్వాభావాన్న దీర్ఘః। భవతీతి భవన్॥

428. అతు, అనునది లుప్తషష్ఠ్యన్తము, ఇత్సంజ్ఞకోకారము గల ప్రత్యయమున కనుకరణము. ఇది అఙ్గవిశేషణ మగుటచే, తదన్తబోధకమగును. అధాతోః అనుదానిని విభాగము చేయవలయును. యోగ విభాగ సామర్థ్యము వలన నిది యవ్యవహితమగు, అసన్తస్య, అనుదానికే ప్రతిషేధము. అత్వన్త మగు నఙ్గముయొక్క యుపధకు, ధాత్వవయవ భిన్నమగు, అస్, అన్తమందుగల యఙ్గముయొక్క యుపధకును, సంబుద్ధి భిన్నమగు సుప్రత్యయము పరమగు నపుడు దీర్ఘమగునని సూత్రార్థము. ధీరస్యాస్తి అను నర్థమందు ధీశబ్దమునకు

మతుప్ ప్రత్యయము (తద్ధితము). ధీమత్ + సు. పరము నిత్యమునకు, "ఉగిదచామ్" సూ. చే. విహితమగు నుమాగమ మిచట ప్రాప్తమగుచున్నది. నుమాగమము ప్రవర్తించిన, నుపధ యచ్చు గానందున దీర్ఘమప్రాప్తమగును, గాన దీర్ఘవిధానము వ్యర్థము గావలసియుండును. కావున దీర్ఘవిధాన సామర్థ్యము వలన మొదట దీర్ఘము, తరువాత నుమాగమమునగును. సులోప సంయోగాన్త లోపములు. ధీమాన్. అసంబుద్ధౌ, అని యనుటవలన, హేధీమన్, అనుచోట దీర్ఘము రాదు. సర్వనామస్థానమున నుమాగమము ప్రవర్తించుటచే, ధీమన్తౌ, ధీమన్తః ఇత్యాదులగును. శస్సు మొదలగు విభక్తులు పరమగునపుడు ధీమచ్ఛబ్దము మహాచ్ఛబ్దసదృశము.

అధాతోః అనునది, అతు అనుదానికి విశేషణము గానందున అత్వన్తమగు ధాతువునకును దీర్ఘమగును. గోమచ్ఛబ్దము మతుబన్తము. గోమన్తమిచ్ఛతి = గోవులు కలవానిని కోరుచున్నాడు, గోమానివాచరతి = గోవులు కలవానివలె వ్యవహరించుచున్నాడు, అను నర్థమందు క్యచ్ ప్రత్యయాన్తము గోమత్య ఆచార క్విబన్తము గోమత్ అని యగును. కర్త్రర్థక క్విప్ప్రత్యయముచే గోమత్ అని యగును. ఇది క్విబన్తమగుటచే ధాతువగును. అఝ్చుధాతువు ఉగిత్తగుట వలన నుగిన్నిమిత్తకమగు నుమాగమము సిద్ధమగుచుండ, ఉగిదచామ్ (363) సూత్రమున అఝ్చుగ్రహణము నియమార్థము. ఉగిత్త్వప్రయుక్త కార్యము (నుమ్ జీపులు) నలోపముగల యఝ్చుధాతువునకేగాని యితరధాతువునకు రాదని నియమస్వరూపము. స్రంసుధ్వంసు ధాతువులకు క్విబన్తములగు స్రత్, ధ్వత్, ఇత్యాదులందు నుమాగమనివృత్తి నియమఫలము. ఇట్లు "ఉగిదచామ్" సూత్రమున నఝ్చు గ్రహణము నియమార్థమనుటవలననే ధాతువునకు నుమాగమ నివృత్తి సంభవించుచుండ నా సూత్రములోని అధాతోః, అనునది పూర్వము ధాతువుగాక నిపుడు ధాతువగుదానికి (నామధాతువునకు) నుమాగమము కొఱకగును. కనుక ప్రకృతమున క్విబన్త గోమత్ శబ్దమునకు నుమాగమము నిశ్శంకముగ నగును. గోమాన్, గోమన్తౌ, ఇత్యాది రూపములు సిద్ధములగును. భా ధాతువుకంటె, భాతి అను నర్థమున, డవతుప్రత్యయము చేసినచో, భవత్ అను ప్రాతిపదిక మేర్పడును. ఇది అత్వన్తమగుటవలన "అత్వసన్తస్య" సూ. చే, దీర్ఘము, ఉగిత్తగుటవలన నుమాగమము నగును. భవాన్. భవన్తౌ. భవన్తః ఇత్యాదులు. భూధాతువుకంటె శతృ ప్రత్యయము చేసినచో భవత్, అను ప్రాతిపదికమగును. "అత్వసన్తస్య" (428) సూత్రమున అతు అనునది, ఉకారేత్సంజ్ఞక ప్రత్యయమున కనుకరణమని చెప్పుటవలన, శతృ ప్రత్యయము కారేత్సంజ్ఞకము గాకపోవుటచే, శత్రన్తమగు నీ భవచ్ఛబ్దమునకు దీర్ఘము ప్రవర్తించదు. ఉగిత్తగుటచే నుమాగమమగును. భవన్. భవన్తౌ. భవన్తః ఇత్యాదులు.

* 429. ఉభే అభ్యస్తమ్. 6-1-5. ఉభే, అభ్యస్తమ్. (ద్వే)

షాష్ఠద్విత్వ ప్రకరణే యే ద్వేవిహితే తేఉభే సముదితే అభ్యస్తసంజ్ఞే స్తః ॥

429. ద్విత్వము, ఆఱవ యధ్యాయమునందును నెనిమిదవ యధ్యాయము నందును విధింపబడెను. అనన్తరస్య విధిర్వాభవతి ప్రతిషేధో వా అను న్యాయముచే నవ్యవహితమగు నాఱవ యధ్యాయములోని ద్విత్వమునే యిచట గ్రహింపవలయును. ద్వే అను పదముయొక్క యనువృత్తిచేతనే ద్విత్వమను నర్థము సిద్ధమగుచుండ నతిరిక్తమగు సూత్రములోని ఉభే గ్రహణము సముదాయమునకు సంజ్ఞాబోధకమగును. ఆఱవ యధ్యాయమున విధింపబడిన ద్విత్వముచే నిష్పన్నములగు రెండు భాగములు కలపి అభ్యస్తసంజ్ఞకమగునని సూత్రార్థము. అభ్యస్తసంజ్ఞా నిమిత్తకములగు కార్యములు సముదాయమునకే వచ్చునుగాని ప్రత్యేకమునకు రావని గ్రహించునది.

* 430. నాభ్యస్తాచ్ఛతుః 7-1-78 న, అభ్యస్తాత్, శతుః. (నుమ్)

అభ్యస్తాత్పరస్య శతుర్నుమ్ న స్యాత్। దదత్। దదద్। దదతౌ। దదతః ॥

430. అభ్యస్తముకంటె పరమగు శతృ ప్రత్యయమునకు నుమాగమము రాదు. "ఉగిదచామ్" (363) సూ. చే, ప్రాప్తమగు నుమాగమమున కిది నిషేధము. దదత్. దాఞ్ ధాతువునకు శతృ ప్రత్యయమును చేసినచో ధాతువునకు ద్విత్వము వచ్చును. దదత్ అను ప్రాతిపదిక మేర్పడును. ఇది అభ్యస్తసంజ్ఞకమగును. దదత్ + సు. ఇచట శతృ ప్రత్యయము, (అత్) అభ్యస్తముకంటె పరమయినదగుటచే నుమాగమము రాదు. సులోపాదులు. దదత్, దదద్, దదతౌ, దదతః ఇత్యాదులు.

* 431. జక్షిత్యాదయష్షట్ 6-1-6 జక్ష్, ఇత్యాదయః, షట్ (అభ్యస్తమ్)

షడ్ధాతవోఽన్యే జక్షితిశ్చ సప్తమ ఏతేఽభ్యస్తసంజ్ఞాః స్యుః। జక్షత్। జక్షద్। జక్షతౌ। జక్షతః। ఏవం జాగ్రత్। దరిద్రత్। శాసత్। చకాసత్। దీధీవేవ్యోర్ఙిత్త్వేపి ఛాన్దసత్వాద్వ్యత్యయేన పరస్మైపదమ్। దీధ్యత్। వేవ్యత్। గుప్। గుబ్। గుపౌ। గుపః॥ గుబ్భ్యామిత్యాది ॥

431. ఇత్యాదయః, అనునది అతద్గుణ సంవిజ్ఞాన బహువ్రీహి (ఇతి ఆదిర్యేషాంతే ఇత్యాదయః) ఇతి శబ్దముచే జక్ష్ ధాతువు పరామర్శింపబడును,

దీనివలన జాగృ మొదలగు నాలు ధాతువులు గ్రహింపబడును. జక్ష్ ధాతువు, దీనితరువాతనున్న జాగృ మొదలగు నాలు ధాతువులు మొత్తమేడు నభ్యస్త సంజ్ఞకములగునని యర్థము. జక్షాదులదాది గణములోనివి. జక్ష (భక్షహాసనయోః) (2) జాగృ (నిద్రాక్షయే) (3) దరిద్రా (దుర్గతౌ) (4) చకాసృ (దీప్తౌ) (5) శాస్ (అనుశిష్టౌ) (6) దీధీఙ్ (దీప్తిదేవనయోః) (7) వేవీఙ్ (గతౌ) ఈ ధాతువులకు శతృ ప్రత్యయము చేయునపుడు ప్రాప్తమగు నుమాగమముయొక్క నివృత్తి యభ్యస్తసంజ్ఞకు ఫలము. జక్షత్ + సు. సులోపము. జక్షత్, జక్షతౌ, ఇత్యాదులు. ఇట్లే, జాగ్రత్, దరిద్రత్, చకాసత్, శాసత్, దీధ్యత్, వేవ్యత్ అను శబ్దములు. దీధీ (ఙ్) వేవీ (ఙ్) ధాతువులు ఙిత్తు అగుటచే నాత్మనేపదులగును, గాన వీనికి శతృ ప్రత్యయమురాక శానచ్ ప్రత్యయమే వచ్చును. కనుక వీని కభ్యస్తసంజ్ఞ చేయుట నిష్ప్రయోజనమను శంకకు త్తరమును, "దీధీవేవ్యోః...పరస్మైపదమ్" అను గ్రన్థముచే చెప్పుచున్నాడు. ఈ రెండు ధాతువులు వేదమందే ప్రయోగింపబడవలెనను వ్యవస్థ చేయబడినది. ఛందస్సునందు "వ్యత్యయో బహులమ్" (3-1-85) సూ. చే, వీనికి ఆత్మనేపదమునకు మారుగ పరస్మైపదమగును గాన శతృ ప్రత్యయము సాధువగును. దీధ్యత్, వేవ్యత్ వీనికి నుమాగమనివృత్తికై యభ్యస్తసంజ్ఞ సఫలమగును. గోపాయతి యను నర్థమున, గుపూ (రక్షణే) ధాతువునకు క్విప్ ప్రత్యయము. గుప్ + సు సులోపజశ్త్వములు. గుప్, గుప్, గుపౌ. ఇత్యాదులు.

* 432. త్యదాదిషు దృశోఽనాలోచనే కఞ్చ. 3-2-60. త్యదాదిషు। దృశః। అనాలోచనే। కఞ్। చ (క్విన్)

త్యదాదిషూపపదేష్వ జ్ఞానార్థాద్దృశేర్ధాతోః
కఞ్ స్యాచ్చాత్ క్విన్ ॥

432. అనాలోచనే = న ఆలోచనమ్, అనాలోచనమ్, తస్మిన్, ఇచట ఆలోచన శబ్దమునకు జ్ఞానసామాన్య మర్థము. త్యదాదు లుపపదములుగ నున్నపుడు జ్ఞానార్థకము గానట్టి దృశ్ ధాతువుకంటె, కఞ్, క్విన్ ప్రత్యయము అగును. తచ్ఛబ్ద ముపపదమగునపుడు, దృశ్ ధాతువునకు క్విన్ ప్రత్యయము, పిదప నుపపదసమాసము వచ్చినచో, తద్ + దృశ్, అని యగును. ఇట్లుండగ.

* 433. ఆ సర్వనామ్నః. 6-3-91. ఆ। సర్వనామ్నః। (దృగ్దృశవతుషు)

సర్వనామ్న ఆకారోఽన్తాదేశః స్యాద్దృగ్ దృశవతుషు। కుత్వస్యాసిద్ధత్వాద్వ్రశ్చేతి షః। తస్య జశ్త్వేన డః। తస్య కుత్వేన గః। తస్య చ ర్త్వేన పక్షే కః। తాదృక్। తాదృగ్। తాదృశౌ। తాదృశః। షత్వాపవాదత్వాత్కుత్వేన ఖకార ఇతికై యట - వా

రదత్తాదిమతేతు చర్త్వాభావపక్షే ఖ ఏవ శ్రూయతే న తు గః। జశ్త్వంప్రతి కుత్వస్యాసిద్ధత్వాత్। దిగాదిభ్యోయ దితి నిర్దేశాన్నాసిద్ధత్వమితి వా బోధ్యమ్। వ్రశ్చేతిషత్వమ్। జశ్త్వచర్త్వే। విట్। విడ్। విశౌ। విశః। విశమ్॥

433. సర్వనామశబ్దమునకు దృక్ దృశవతులు పరమగునపుడు, అకారమన్త్యాదేశమగును. తద్ + దృశ్, అనుచోట తచ్ఛబ్దమున ఆత్వము వచ్చును. తాదృశ్ + సు. సులోపము, తాదృశ్. ఇచట క్విన్ ప్రత్యయస్య, సూ. చే, విహితమగు కుత్వమసిద్ధమగుటవలన, మొదట, "వ్రశ్చ భ్రస్జ" సూ. చే, షత్వము. తాదృష్, జశ్త్వము, తాదృడ్. "క్విన్ ప్రత్యయస్య" సూ. చే, కుత్వము. వావసానే సూ. చే, చర్త్వము. (ష, డ, గ, కాః) తాదృక్, తాదృగ్, తాదృశౌ, తాదృశః. "వ్రశ్చభ్రస్జ" సూ. చే, విహితమగు షత్వమునకు "క్విన్ ప్రత్యయస్య కుః" సూ. చే, విహితమగు కుత్వమపవాదమని కైయట హరదత్తాదుల మతము. వీరియాశయమిది. క్విన్ ప్రత్యయస్య కుః, సూత్రస్థానమున, "కుః క్విన్యతః" అని న్యాసముచేసి దృష్టః, అను పదము నధ్యాహారము చేసినచో దేనికంటె క్విన్ ప్రత్యయము దృష్టమగునో దానికి కుత్వమగునను బహువ్రీహి సమాసఫలము సిద్ధమగుచుండ, నధికమగు ప్రత్యయగ్రహణమువలన, "క్విన్ ప్రత్యయో యస్మాద్యస్మాత్" అను వీప్సాగర్భబహువ్రీహి నాశ్రయింపవలయును. క్విన్నన్తములన్నియు నీ సూత్రమునకు లక్ష్యములగును. తాదృశాదిలక్ష్య విషయకమగు లక్షణమచరితార్థమగుటచే నపవాదమగునని ఈ మతమున, తాదృశ్, అనుచోట షత్వమును బాధించి కుత్వము ప్రవర్తించును. ఆన్తరతమ్యమువలన ఖకారమగును. చర్త్వపక్షమున, తాదృక్. చర్త్వాభావ పక్షమున ఖకారమే శ్రుతమగును. తాదృఖ్. జశ్త్వమును గురించి కుత్వమసిద్ధమగుటవలన నిచట జశ్త్వముచే గకారము రాదు. "దిగాదిభ్యోయత్" (4-3-54) సూత్రమున క్విన్నన్తమగు దిశ్ శబ్దమునకు జశ్త్వనిర్దేశమువలన జశ్త్వమునుగురించి కుత్వమసిద్ధముగాదు. కావున జశ్త్వముచే తాదృగ్, అను రూపముగూడ సాధువగుననియు చెప్పవచ్చును. విశతి అను నర్థమందు, విశధాతువుకంటె క్విప్ ప్రత్యయము. విశ్ + సు. సులోపము. "వ్రశ్చభ్రస్జ" సూ. చే, షత్వము. జశ్త్వచర్త్వములు. విట్, విడ్, విశౌ, విశః, ఇత్యాదులు.

వివ:—"క్విన్ ప్రత్యయస్య" అను సూత్రములోని ప్రత్యయగ్రహణము బహువ్రీహిమాత్ర ఫలకమేయని భాష్యమందు చెప్పుటవలన, వీప్సాగర్భబహువ్రీహ్యాశ్రయణము భాష్యవిరుద్ధము. కావున దధృక్, ఇత్యాదులందు కుత్వము చరితార్థమగుటవలన కుత్వము షత్వాపవాదమనుట సరిగాదు.

ఈ యాశయమును సూచించుటకే మూలకారు డిది క్త్రైయటాదుల మతమని చెప్పెను.

* 434. నశేర్వా 8-2-63 నశేః, వా. (కుః, అన్తే, పదస్య)

నశేః కవర్గోన్తాదేశో వా స్యాత్పదాన్తే। నక్। నగ్। నట్। నడ్। నశౌ। నశః। నగ్భ్యామ్। నడ్భ్యామిత్యాది॥

434. పదాన్తమున నశ్ అనుదానికి కవర్గాదేశము వికల్పముగ నగును. నశ్ + సు. సులోపము. ఈ కుత్వ మసిద్ధమగుటచే, "వ్రశ్చభ్రస్జ" సూ. చే, షత్వము. జశ్త్వము, నడ్. పిదప కుత్వముచే గకారము. చర్త్వ వికల్పము. అనగా తాదృశ్ శబ్దమునకువలె వరుసగ, ష, డ, గ, క లగును. నక్, నగ్. కుత్వాభావపక్షమందు షత్వజశ్త్వ చర్త్వములు. నట్, నడ్, నశౌ, నశః, నగ్భ్యమ్. పక్షమందు నడ్భ్యమ్. ఇత్యాదులు.

* 435. స్పృశోఽనుదకే క్విన్ 3-2-58 స్పృశః, అనుదకే, క్విన్, (సుపి)

అనుదకే సుప్యుపపదే స్పృశేః క్విన్ స్యాత్। ఘృతస్పృక్। ఘృతస్పృగ్। ఘృతస్పృశౌ। ఘృతస్పృశః। క్విన్ప్రత్యయో యస్మాదితి బహువ్రీహ్యాశ్రయణాత్, క్విప్యపి కుత్వమ్। స్పృక్। షడగకాః ప్రాగ్వత్। ఇధృషా ప్రాగల్భ్యే। అస్మాదృత్విగాదినా క్విన్, ద్విత్వమన్తోదాత్తత్వం చ నిపాత్యతే। కుత్వాత్పూర్వం జశ్త్వేన, డః, గః, కః। ధృష్ణోతీతి దధృక్। దధృగ్। దధృషౌ। దధృషః। దధృగ్భ్యామిత్యాది। రత్నాని ముష్ణాతీతి రత్నముట్। రత్నముడ్। రత్నముషౌ। రత్నముషః। షడోర్భ్యలుక్। షట్। షడ్। షడ్భిః। షడ్భ్యః (2) షట్ చతుర్భ్యశ్చేతినుట్। అనామితిపర్యుదాసాన్నష్టుత్వ నిషేధః। యరోనునాసికఇతి వికల్పం బాధిత్వా ప్రత్యయే భాషాయాం నిత్యమితివచనా న్నిత్యమనునాసికః। షణ్ణామ్। షట్త్సు। షట్సు। తదన్తవిధిః। పరమషట్। పరమషణ్ణామ్। గౌణత్వేతు ప్రియషషః। ప్రియషషామ్। రుత్వంప్రతి షత్వస్యాసిద్ధత్వాత్ ససజుషోరురితి రుత్వమ్॥

435. ఉదకశబ్ద భిన్నమగు సుబన్తముపపదమగునపుడు స్పృశ్ ధాతువునకు క్విన్ ప్రత్యయమగును. ఘృతంస్పృశతీ అను విగ్రహమున ఘృతస్పృ

పూర్వక స్పృశ ధాతువునకు క్విన్ ప్రత్యయము. ఘృతస్పృశ్ + సు. సులోపము తాదృశ్ శబ్దమునకువలె ష, డ, గ, క, లగును. ఘృతస్పృక్, ఘృతస్పృగ్, ఘృతస్పృశౌ. ఇత్యాదులు. స్పృశతి (తాకుచున్నాడు) అను నర్థమున స్పృశ ధాతువుకంటె క్విప్ ప్రత్యయమగును. క్విన్ ప్రత్యయస్య (379) సూత్రమున, క్విన్ ప్రత్యయస్య, అనునది బహువ్రీహియని వ్యాఖ్యానము చేయుటచేతను, ఘృతస్పృశ్, అనుచోట క్విన్ ప్రత్యయము దృష్టమగుటచేతను, స్పృశ్ అనునది క్విబన్తమైనను కుత్వము వచ్చును. పూర్వమువలె, ష, డ, గ, క, లగును. స్పృక్, స్పృగ్. ఇత్యాదులు. ఞిధృషా (ప్రాగల్భ్యే) ధాతువుకంటె, ఋత్విక్ (375) సూ. చే, క్విన్ ప్రత్యయము, ద్విత్వము, అన్తోదాత్తము, నిపతింపబడెను. దధృష్ + సు. సులోపము. జశ్త్వమును గురించి కుత్వమసిద్ధమగుటవలన జశ్త్వముచే డకారము, పిదప కుత్వముచే గకారము, చర్త్వముచే కకారము, వచ్చును. దధృక్, దధృగ్, దధృషౌ ఇత్యాదులు. రత్నానిముష్ణాతి, అను విగ్రహమున రత్నశబ్దపూర్వక ముష్ ధాతువునకు క్విప్ ప్రత్యయము. ఉపపద సమాసము. రత్నముష్ + సు. సులోప జశ్త్వచర్త్వములు. రత్నముట్, రత్నముడ్, రత్నముషౌ ఇత్యాదులు. షష్ శబ్దము నిత్య బహువచనాన్తము. షష్ + జస్, శస్. షడ్భ్యోలుక్ (262) సూ. చే, జశ్శస్సులకు లుక్కగును. జశ్త్వచర్త్వములు. షట్, షడ్, షష్ + ఆమ్. షట్ చతుర్భ్యశ్చ (339) సూ. చే, ఆమ్ ప్రత్యయమునకు నుడాగమము. పదాన్తమగుటచే జశ్త్వము. షడ్ + నామ్. నపదాన్తాట్టోరనామ్ (115) సూత్రమున, అనామ్, అను పర్యుదాసమువలన నిచట ష్టుత్వనిషేధము ప్రవర్తించదు. షడ్ + ణామ్. ణామ్ అనునది, అనునాసికాది ప్రత్యయమగుటచే "యరోనునాసికేఽనునాసికోవా (117) సూ. చే, ప్రాప్తమగు అనునాసిక వికల్పమును బాధించి, "ప్రత్యయే భాషాయాం నిత్యమ్" అను వచనముచే ననునాసికము నిత్యముగ నగును. షణ్ణామ్. షట్ + సు. జశ్త్వముచే డకారము. ధుడాగమచర్త్వములు. షట్ త్సు. ధుడాగమాభావపక్షమందు. జశ్త్వచర్త్వములు. షట్సు. షడ్భ్యోలుక్, షట్ చతుర్భ్యశ్చ అను సూత్రము లఙ్గాధికారములోని వగుటచే, షట్ సంజ్ఞకాన్తమందును ప్రవర్తించును. పరమషట్, పరమషడ్. ఇత్యాదులగును. పై రెండు సూత్రములందు బహువచన నిర్దేశమువలన షడర్థము ప్రధానమగునపుడే, లుక్ నుడాగమములగును. షడర్థ మప్రధానమగునపుడు, అనగా గౌణమందు ప్రవర్తించవు. ప్రియాఃషట్ యస్య ప్రియషట్. దీనికేకవచన ద్వివచనములు నుండును. ప్రియషషౌ. ప్రియషషః. ఇచట జశ్శస్సులకు లుక్కు రాదు. ప్రియషషామ్. ఇచట నుడాగమము రాదు. పఠితుమిచ్ఛతి అను నర్థమున, పఠ (వ్యక్తాయాంవాచి) ధాతువునకు సన్ ప్రత్యయమగును. సన్నన్తమగు పిపఠిష అను ధాతువునకు, క్విప్ ప్రత్యయము, పిపఠిష్, అను ప్రాతిపదికమగును. పిపఠిష్ + సు. సులోపము, ఇచట షకారము, సన్

ప్రత్యయములోని సకారమునకు, ఆదేశప్రత్యయయోః (213) సూత్రవిహితమగు షత్వముచే సిద్ధమయినది. కావున నిని, "ససజుషోరుః" (163) సూత్ర విహిత రుత్వమును గురించి యసిద్ధమగుటచే సకారబుద్ధి గలుగుటవలనను, ప్రత్యయలక్షణముచే పదాన్తమగుటవలన నిచట రుత్వమగును. పిపఠిర్. ఇట్లుండగ.

* 436. ర్వోరుపధాయా దీర్ఘ ఇకః 8-7-76 ర్వోః, ఉపధాయాః, దీర్ఘః, ఇకః. (ధాతోః, పదస్య, అన్తే)

రేఫవాన్తస్య ధాతోరుపధాయా ఇకో దీర్ఘః స్యాత్పదాన్తే। పిపఠీః। పిపఠిషౌ। పిపఠిషః। పిపఠీర్భ్యామ్। వాశరీతి వా విసర్జనీయః॥

436. ర్వోః, అనునది ద్వంద్వము (ర్ చవ్ చ, ర్వౌ, తయోః) ఇది ధాతువునకు విశేషణము. రేఫాన్తముగాని వకారాన్తముగాని యగు ధాతువు యొక్క యుపధయగు నిక్ ప్రత్యాహారవర్ణమునకు పదాన్తమున దీర్ఘమగును. పిపఠిష్, అనునది ధాతువు పదమునగుటచే రేఫకు పూర్వమగు నికారమునకు దీర్ఘమగును. రేఫకు విసర్గము. పిపఠీః. పిపఠిషౌ. పిపఠీర్భ్యామ్. పిపఠిష్ + సు. రుత్వ దీర్ఘ విసర్గములు. పిపఠీఃసు. ఇచట విసర్జనీయస్యసః (139) సూత్ర ప్రాప్తమగు సత్వమును బాధించి "వాశరి" సూ. చే, పాక్షికమగు విసర్జనీయ మగును. పక్షమందు సత్వము వచ్చును. పిపఠీఃసు, పిపఠీస్ + సు, ఇచట ఇణ్ సకారములకు, వరుసగ విసర్జనీయము. సకారము వ్యవధాయకమగుటవలన, "ఆదేశ ప్రత్యయయోః" సూ. చే, సుప్రత్యయములోని సకారమునకు షత్వమప్రాప్తమగుచుండ షత్వమును విధించుచున్నాడు.

* 437. నుమ్విసర్జనీయశర్వ్యవాయేఽపి 8-3-58 నుమ్విసర్జనీయశర్వ్యవాయే, అపి (ఇణ్ కోః, సః, మూర్ధన్యః)

ఏతైః ప్రత్యేకం వ్యవధానేఽపి ఇణ్ కుభ్యాం పరస్య సస్య మూర్ధన్యాదేశః స్యాత్। ష్టుత్వేన పూర్వస్య షత్వమ్। పిపఠీష్షు। పిపఠీఃషు। ప్రత్యేకమితి వ్యాఖ్యానాదనేక వ్యవధానే షత్వం న। నింస్స్వ। నింస్సే। నుమ్ గ్రహణం నుమ్ స్థానికానుస్వారోప లక్షణార్థమ్ వ్యాఖ్యానాత్। తేనేహన। సుహింస్సు। పుంసు. అతఏవ నశర్ గ్రహణేన గతార్థతా। రాత్సస్యేతి స లోపే విసర్గః। చికీః। చికీర్షౌ। చికీర్షః। రోస్సుపీతిని యమాన్న విసర్గః। చికీర్షు। దమేర్డోస్। డిత్వా సామర్థ్యాట్టిలోపః। షత్వస్యాసిద్ధత్వా ద్రుత్వవిసర్గౌ। దోః। దోషౌ। దోషః। పద్దన్న ఇతి వా దోషన్। దోష్ణః। దోష్ణా। దోషః। దోషా। విశ ప్రవేశనే। సన్నన్తాత్

క్విప్। షత్వస్యాసిద్ధత్వా త్సంయోగాన్తలోపః। వ్రశ్చేతిషః। జశ్త్వచర్త్వే। వివిట్। వివిడ్। వివిషౌ। వివిషః। స్కోరితికలోపః। తట్। తడ్। తక్షౌ। తక్షః। గోరట్। గోరడ్। గోరక్షౌ। గోరక్షః. తక్షిరక్షిభ్యాం ణ్యన్తాభ్యాం క్విపితు స్కోరితి న ప్రవర్తతే। ణిలోపస్య స్థానివత్త్వాభావాత్। పూర్వత్రాసిద్ధీయే న స్థానివదితి తు ఇహ నాస్తి। తస్యదోష స్సంయోగాది లోపలత్వణత్వేష్వితి నిషేధాత్। తస్మాత్సంయోగాన్తలోపఏవ। తక్। తగ్। గోరక్। గోరగ్। స్కోరితిక లోపం ప్రతి షత్వస్యాసిద్ధత్వాత్ సంయోగాన్తలోపః। పిపక్। పిపగ్। ఏవం వివక్। దిధక్। పిస గతౌ। సుష్ఠు పేసతీతిసుపీః। సుపిసౌ। సుపిసః। సుసిసా। సుపీర్భ్యాం। సుపీఃషు। సుపీష్షు। ఏవం సుతూః। తుస ఖండనే। విద్వాన్। విద్వాంసౌ। విద్వాంసః। హేవిద్వన్। విద్వాంసమ్। విద్వాంసౌ॥

437. నుమ్విసర్జనీయ శర్వ్యవాయే అనుచోట శరన్తము ద్వంద్వ సమాసము. పిదప, త్రైర్వ్యవాయే అని తత్పురుషము. నుమ్ గ్రహణము నుమ్ స్థానికమగు ననుస్వారమున కుపలక్షణము. వ్యవాయమన వ్యవధానము. ఇది ద్వంద్వాన్తమున శ్రూయమాణమగుటచే నుమాదులతో ప్రత్యేకముగ సంబంధించును. కావున వీనిలో ననేకములతో వ్యవధానమున్నపుడు షత్వము రాదని ఫలించును. నుమాగమమున కాదేశమగు ననుస్వారము, విసర్జనీయము, శర్ ప్రత్యాహార వర్ణములు, వీనిలో నేదయిన నొకదానితో వ్యవధానమున్నను లేకున్నను ఇణ్ కవర్గములకంటె పరమగు సకారమునకు షత్వము వచ్చునని సూత్రార్థము. ఆదేశప్రత్యయయోః, సూత్రమున 'ఇణ్ కోః' అనునది పంచమ్యన్తమగుటవలన వ్యవధానమందు షత్వమప్రాప్తమగుచుండ నీ సూత్రమును చెప్పెను. పిపఠీఃసు. ఇచట విసర్జనీయాదేశ పక్షమందు విసర్జనీయముతో వ్యవధానముండుటవలన షత్వము వచ్చును. పిపఠీఃషు. సత్వపక్షమందు, శర్ ప్రత్యాహారవర్ణముతో వ్యవధానముండుటచే సుప్రత్యయములోని సకారమునకు షత్వమగును. పూర్వసకారమునకు "ష్టునాష్టుః" సూ. చే, షత్వము. పిపఠీష్షు. నుమాదులతో నేదయిన నొకదానితో వ్యవధానమున్నపుడే షత్వమగునని వ్యాఖ్యానము చేయుటవలన ననేకములతో వ్యవధానమున్నపుడు రాదు. నింస్స్వ (నింస్ + స్వ) నింస్సే (నింస్ + సే) ఇందు మొదటిది నిసి (చుంబనే) ధాతువునకు లణ్మధ్యమ పురుషైకవచనము. రెండవది లణ్మధ్యమైక వచనము. ఇచట నికారమునకును ప్రత్యయ సకారమునకును నుమ్ స్థానికానుస్వారము సకారము (శర్) యీ రెండును, వ్యవధాయకములగుటచే షత్వము రాదు,

సూత్రములోని నుమ్ గ్రహణము సామాన్యముగ ననుస్వారమున కుపలక్షణమనక నుమ్ స్థానికానుస్వారమున కుపలక్షణ మవవలయును. ఇందు శిష్టుల వ్యాఖ్యానమే ప్రమాణము. సుహిన్స్ శబ్దమునకు సప్తమీ బహువచనమునందు (సుహిన్స్ + సు) సంయోగాన్త లోపముచే ప్రాతిపదికాన్త సకారము లోపించును. సుహిన్సు, అని యగును. ఇచట నుమాగమముతో వ్యవధాన మున్నది గాని నుమ్ స్థానికానుస్వారముతో వ్యవధానము లేనందున షత్వము రాదు. పుమ్స్ శబ్దమునకు సప్తమీ బహువచనమునందు, (పుంస్ + సు) సంయోగాన్తలోపముచే ప్రాతిపదిక సకారము లోపించును. ఇచట ననుస్వారము మకారస్థానిక మగుటచే షత్వమురాదు. పై వ్యాఖ్యానమున కిట్టి స్థలము లందు షత్వనివృత్తియే ఫలము. నుమ్ గ్రహణ మిట్టి యనుస్వారమున కుపలక్షణ మగుటచేతను శర్ ప్రత్యాహారమున సామాన్యమగు ననుస్వారమునకే ప్రవేశ ముండుటవలనను, శర్ గ్రహణముచే నుమ్ గ్రహణము గతార్థముకాదు. శర్ ప్రత్యాహారమున ననుస్వారాదులకు పాఠము చేయబడినదగుటచే నిచట నుమ్ గ్రహణ మనుస్వారమాత్రమున కుపలక్షణమనినచో శర్ గ్రహణముచేతనే గతార్థమగుటవలన నుమ్ పదము వ్యర్థము గాకలసివచ్చును. చికీర్ష అను సన్నన్త ధాతువుకంటె కర్తృర్థమందు క్విప్ ప్రత్యయముచేసిన, చికీర్ష్, అను ప్రాతిపదిక మేర్పడును. చికీర్ష్ + సు. సులోపము. షత్వ మసిద్ధమగుటచే, "రాత్సస్య" (281) సూ. చే, సకారలోపము. విసర్గము. చికీః. చికీర్షౌ. చికీర్షః (చికీర్ష్ + సు) సకారలోపము ప్రవర్తించిన పిమ్మట, రోఃసుపి (340) అను నియమమువలన రేఫకు విసర్గము రాదు. దమేర్డోస్. ఇది ఉణాది సూత్రము. దమ (ఉపశమే) ధాతువునకు డోస్ ప్రత్యయమగునని యర్థము. ప్రత్యయములోని డకార మిత్సంజ్ఞకము. డిత్వ సామర్థ్యమువలన, దమ్ అనునది భసంజ్ఞకము గాకపోయినను, టేః (3 7) సూ. చే, టిలోపమగును. దోస్. "ఆదేశ ప్రత్యయ" (213) సూ. చే, సకారమునకు షత్వమువలన దోష్, అను ప్రాతిపదిక మేర్పడును. దోష్ + సు. సులోపము. షత్వ మసిద్ధమగుటవలన సకార బుద్ధిచే రుత్వవిసర్గములు. దోః, దోషౌ, దోషః. దోష్ + శస్. ఇచట పద్దన్నోమాస్, (229) సూ. చే, వైకల్పికమగు దోషన్నాదేశమగును. దోషన్ + అస్. అల్లోపణత్వములు. దోష్ణః. దోషన్నాదేశాభావ పక్షమందు, దోషః. దోష్ + భ్యామ్ = దోషభ్యామ్, దోర్భ్యామ్, ఇత్యాదులగును. విశధాతువునకు సన్నన్తరూపము వివిక్ష అనునది. దీనికి క్విప్ ప్రత్యయముచేసిన వివిక్ష్ అను షకారాన్త ప్రాతిపదిక మేర్పడును. వివిక్ష్ + సు. ఇచట సాపాదికమగు కార్యము (సులోపము) నకు ప్రవృత్తియోగ్యత యున్నపుడు త్రిపాదీస్థకార్యము (ధాతు శవర్ణమునకు షత్వకత్వములు) ప్రవర్తించదు. కావున హల్ఙ్యాబ్ భ్యః (253) సూ. చే, సులోపము మొదట ప్రవర్తించును. పిదప, వివిశ్ + స్, అనియుండ, "వ్రశ్చభ్రస్జ" సూత్ర విహితమగు షత్వము (శవర్ణమునకు)

అసిద్ధమగుటవలన మొదట సంయోగాన్తలోపము (వివిశ్). తరువాత, షత్వము (వివిష్) జశ్త్వచర్త్వములు. వివిట్, వివిడ్, వివిశౌ, వివిశః ఇత్యాదులు. తక్షూ (తనూకరణే) ధాతువునకు క్విప్ ప్రత్యయము, తక్ష్, అను ప్రాతిపదిక మేర్పడును. తక్ష్ + సు. సులోపము. పదాన్తమందలి సంయోగాదిలోపము, పదాన్తమందలి సంయోగాన్తలోపమున కపవాదమగుటచే నిచట సంయోగాదియగు కకారము లోపించును. తష్, జశ్త్వచర్త్వములు. తట్, తడ్. (చెక్కువాడు = కంసాలి) తక్షౌ, తక్షః. ఇత్యాదులు. గాః రక్షతి (గోవులను కాచువాడు) అను నర్థమున గోశబ్దముపపదముగ నున్నపుడు రక్షధాతువునకు క్విప్ ప్రత్యయము. గోరక్ష్, అను షకారాన్త ప్రాతిపదిక మేర్పడును. ఇది తక్ష్ శబ్దసదృశమగును. గోరట్, గోరడ్, గోరక్షౌ. ఇత్యాదులు. ణిజన్తములగు తక్షిరక్షి ధాతువులకు క్విప్ ప్రత్యయమువలన, తక్ష్, రక్ష్, అను షాన్త ప్రాతిపదికములగును. అచః పరస్మిన్ (51) సూ. చే, ణిలోపమునకు స్థానివద్భావము వలన పదాన్త సంయోగము గాకపోవుటచే నిచటమాత్రము సంయోగాన్తలోపాపవాదమగు సంయోగాదిలోపము ప్రవర్తించదు. "తస్యదోష స్సంయోగాదిలోపలత్వణత్వేషు" అను నిషేధముండుటవలన పూర్వత్రాసిద్ధే నస్థానివత్, అను స్థానివద్భావ నిషేధము (సంయోగాదిలోపము విషయమున) ప్రవర్తించుననుటకు వలనుపడదు. కావున నిచట షకారమునకు సంయోగాన్తలోపమే ప్రవర్తించును. జశ్త్వచర్త్వములు. తక్, తగ్. (చెక్కించువాడు) తక్షౌ. ఇత్యాదులు. గోరక్. గోరగ్ (గోవులను కాపించువాడు) గోరక్షౌ, గోరగ్భ్యామ్. ఇత్యాదులు. పిపక్ష అనునది పచ్ ధాతువునకు సన్ ప్రత్యయాన్తరూపము. దీనికి క్విప్ ప్రత్యయము చేసినచో పిపక్ష్, అను షాన్త ప్రాతిపదిక మేర్పడును. పిపక్ష్ + సు. సులోపము. ఇచట కకారము, "చోః కుః, సూత్రవిహిత కుత్వనిష్పన్నమగుటచే నిది సంయోగాదిలోపమునుగూర్చి యసిద్ధమగును గాన నిచట సంయోగాదిలోపము రాదు. కాన షకారమునకు సంయోగాన్తలోపమే వచ్చును. జశ్త్వచర్త్వములు. పిపక్, పిపగ్ (వంట చేయ నిచ్ఛగలవాడు) పిపక్షౌ, పిపక్షః ఇత్యాదులు. ఇట్లే, వచ (పరిభాషణే) దహ (భస్మీకరణే) ధాతువులకు సన్నన్తములగు వివక్ష, దిధక్ష, అనువానికి క్విప్ ప్రత్యయము చేయునపుడు, వివక్, వివగ్. వివక్షౌ (చెప్పుట కిచ్ఛగలవాడు) దిధక్, దిధగ్, దిధక్షౌ. ఇత్యాది రూపములు క్రమముగ నగును. పిసధాతువునకు గమనమర్థము సుష్ఠుపేసతి, అను నర్థమున సుపూర్వకమగు దీనికి క్విప్ ప్రత్యయము ప్రవర్తించిన, సుపిస్, అను సకారాన్త ప్రాతిపదికమగును. సుపిస్ + సు. సులోప రుత్వములు. ర్వోరుపధాయాః (486) సూ. చే, దీర్ఘము. విసర్గము. సుపీః (బాగుగ నడచువాడు) సుపిసౌ, సుపిసః, సుపీఃషు, సుపీష్షు. పిపఠిష్ శబ్దమునకు సప్తమీ బహువచనమునందువలె నిచట ప్రక్రియను గమనింపవలయును. సుపూర్వకతుస (ఖండనే) ధాతువునకు

క్లీబన్తమగు సుతుస్ శబ్దమున క్లీబే ప్రక్రియ నూహించునది. విద (జ్ఞానే) ధాతువునకు వేత్తి అను నర్థమున వసుప్రత్యయమువలన విద్వస్ అని యగును. దీనికి సర్వనామస్థానమందు ఉగిత్త్వప్రయుక్తమగు నుమాగమము, "సాన్తమహత స్సంయోగస్య (318) సూ. చే, దీర్ఘమునగును. ప్రథమైకవచనమున సులోప సంయోగాన్త లోపములు. విద్వాన్ (జ్ఞానముగలవాడు) విద్వాంసౌ, విద్వాంసః. సంబుద్ధి పరమగునపుడు మాత్ర ముపధాదీర్ఘము ప్రవర్తించదు. హేవిద్వన్.

* 438. వసోస్సంప్రసారణమ్ 6-4-131 వసోః, సంప్రసారణమ్. (భస్య)

వస్వన్తస్య భస్య సంప్రసారణం స్యాత్। పూర్వరూపత్వం, షత్వమ్। విదుషః। విదుషా। వసుస్రంస్వితిదత్వమ్। విద్వద్భ్యామిత్యాది। సేదివాన్। సేదివాంసౌ। సేదివాంసః। సేదివాంసమ్। అన్తరఙ్గో పీడాగమః సంప్రసారణవిషయే న ప్రవర్తతే। అకృతవ్యూహాఇతి పరిభాషయా। సేదుషః। సేదుషా। సేదివద్భ్యామిత్యాది। సాన్తమహత ఇత్యత్ర సాన్తసంయోగోపి ప్రాతిపదికస్యైవ గృహ్యతే నతు ధాతోః। మహచ్ఛబ్ద సాహచర్యాత్। సుహ్హిన స్త్వీతి సుహిన్। సుహింసౌ। సుహింసః। సుహిన్భ్యామ్। సుహిన్సు। ధ్వత్। ధ్వద్। ధ్వసౌ। ధ్వసః। ధ్వద్భ్యామ్। ఏవం స్రత్॥

438. వసు అనునది ప్రత్యయమగుటవలన వస్వన్తబోధకమగును. భసంజ్ఞకమగు వసు ప్రత్యయాన్తమునకు సంప్రసారణమగునని సూత్రార్థము. విద్వస్ + శస్. ఇచట సంప్రసారణ పూర్వరూప షత్వములు. విదుషః. విద్వస్ + టా. విదుషా. విద్వస్ + భ్యామ్. వసుస్రంసు (335) సూ. చే, సకారమునకు దకారాదేశము. విద్వద్భ్యామ్ ఇత్యాదులు. సద్ (విశరణగత్యవసాదనేషు) ధాతువునకు క్వసు ప్రత్యయమువలన సేదివస్, అని యగును. ఇది విద్వస్ శబ్దసదృశమగును. సేదివాన్, సేదివాంసౌ, సేదుషః, సేదుషా ఇత్యాదులు. సంప్రసారణ విషయమున (అజాది ప్రత్యయములు పరమగునపుడు) సేదివస్ + శస్, ఇత్యాదులందు, అన్తరఙ్గమైనను "ఆర్ధధాతుకస్యే డ్వలాదేః (7-2-35) సూత్ర విహితమగు నిడాగమము (వస్ ప్రత్యయమునకు) అకృతవ్యూహ పరిభాషచే ప్రవర్తించదు. ఇడాగమ నిమిత్తమగు వకారము సంప్రసారణముచే నశింపనుండుటవలన నిచట నకృతవ్యూహ పరిభాష ప్రవర్తించును. కావున సేదుషః, ఇత్యాదులే యగును. సుపూర్వక హింసి (హింసాయామ్) ధాతువునకు

క్విప్ ప్రత్యయమువలన సుహిన్స్ అను ప్రాతిపదికమగును. సుహిన్స్ + సు. సులోప సంయోగాన్త లోపములు. సంయోగాన్తలోప మసిద్ధమగుటవలన నలోపము రాదు. సర్వనామస్థానే (251) సూ. చే, నకారాన్త ప్రయుక్తమగు నుపధా దీర్ఘమును రాదు. సుహిన్, అని యగును. సాన్తమహతః (318) సూత్రమున మహచ్ఛబ్ద సాహచర్యమువలన, సాన్తసంయోగమును ప్రాతిపదిక సంబంధియగుదానినే గ్రహింపవలయును గాని ధాతు సంబంధియగుదానిని గ్రహింప వలనుపడదు. కావున సుహిన్ అనుచోట సాన్తసంయోగము ధాతు సంబన్ధి యగుటచే దీర్ఘము రాదు. సుహిన్స్ + భ్యామ్. సంయోగాన్త లోపము. సుహిన్ భ్యామ్. సుహిన్స్ + సు. సంయోగాన్త లోపము. సుహిన్సు. ధ్వంసు ధాతువునకు క్విప్ ప్రత్యయమువలన, ధ్వస్ అను ప్రాతిపదికమగును. ధ్వస్ + సు. సులోపము. వసుస్రంసు, (335) సూ. చే, దకారాదేశము. చర్త్వము. ధ్వత్, ధ్వద్, ధ్వసౌ, ధ్వసః. ధ్వద్భ్యామ్. ఇత్యాదులు. ఇట్లే స్రంసు ధాతువునకు క్విప్ ప్రత్యయాన్తమగు స్రస్ శబ్దమునకును కార్యముల నూహింపదగును.

* 439. పుంసోఽసుఙ్. 7-1-89. పుంసః, అసుఙ్ (సర్వనామస్థానే),

సర్వనామస్థానే వివక్షితే పుంసోఽసుఙ్ స్యాత్। ఉకార ఉచ్చారణార్థః। బహుపుంసీ ఇత్యత్ర ఉగితశ్చేతిఙీబర్థం కృతేన పుంశ్శోడుమ్ సున్నితి ప్రత్యయస్యోగిత్త్వేనైవ నుమ్సిద్ధేః। పుమాన్। హే పుమన్। పుమాంసౌ। పుమాంసః। పుంసః। పుంసా। పుంభ్యామ్ పుంభిః। పుంసు। ఋదుశనేత్యనఙ్। ఉశనా। ఉశనసౌ। ఉశనసః। అస్య సంబుద్ధౌ వాఽనఙ్ నలోపశ్చ వా వాచ్యః। హే ఉశనన్। హే ఉశన। హే ఉశనః। ఉశనోభ్యామిత్యాది। అనేహా। అనేహసౌ। అనేహసః। హే అనేహః। అనేహోభ్యామిత్యాది। వేధాః। వేధసౌ। వేధసః। హే వేధః। వేధోభ్యామిత్యాది। అధాతోరిత్యుక్తేర్న దీర్ఘః। సుష్ఠువస్తే సువః। సువసౌ। సువసః। పిణ్డంగ్రసతే పిణ్డగ్రః। పిణ్డగ్లః। గ్రసు, గ్లసు, అదనే ॥

439. సర్వనామస్థానము వివక్షితమగునపుడు పుంస్ శబ్దమునకు అసుఙ్ఙాదేశమగును. వివక్షితే అని యనుటవలన సర్వనామస్థానముయొక్క యుత్పత్తికి పూర్వమే యాదేశమగును. ఇది ఙిత్తగుటచే నన్త్యాదేశమగును. ఆదేశమున నుకార ముచ్చారణార్థము గాని యిత్సంజ్ఞకము కాదు. బహవః పుమాంసో

యస్యామ్, అను విగ్రహమున బహుపుంస్, అను సమాసమునకు ఉగితశ్చ (458) సూ. చే, జీప్ ప్రత్యయము ప్రవర్తించుటచే బహుపుంసీ అని యగును. లిఙ్గనిమిత్తక కార్యములు ప్రవర్తించిన పిమ్మటనే విభక్తి వివక్షయగుటచే జీప్ ప్రత్యయమునకు పూర్వము సుజాదేశమునకు ప్రాప్తిలేదు. కావున నిచ్చోట జీప్ సిద్ధికై పూఞోడుమ్సున్, అను ఉణాది సూత్రముచే విహితమగు డుమ్సున్ ప్రత్యయమున ఉకార మిత్సంజ్ఞకమనుట యావశ్యకము. పూ ధాతువునకు డుమ్సున్ ప్రత్యయముచేసిన, పుమ్స్, అను ప్రాతిపదికమగునని యుణాది సూత్రమున కర్థము. ఇట్లు పుంస్ అనునది యుగిత్తగుటవలననే పుమాన్ ఇత్యాదులందు నుమాగమము సిద్ధమగును గాన నసుజాదేశమున ఉకారమున కిత్సంజ్ఞ యనావశ్యకమని గ్రహించునది. పుంస్ శబ్దమున కసుజాదేశము ప్రవర్తించిన, పుమస్ అని యగును. దీనికి సుప్రత్యయము, నుమాగమము, సాన్తమహతః (318) సూ. చే, ఉపధాదీర్ఘము. సులోప సంయోగాన్త లోపములు. సంయోగాన్తలోప మసిద్ధమగుటవలన నలోపము రాదు. పుమాన్. ఇట్లే మిగిలిన సర్వనామస్థానము పరమగునపుడు నసుజాదేశ నుమాగమ దీర్ఘముల నూహింపవలయును. పుమాంసౌ. పుమాంసః. సంబుద్ధి పరమగునపుడు నుమాగమమును విడిచి శేషించిన కార్యములు ప్రథమైకవచనమునందువలె నూహింపవలయును. హేపుమన్. పుంస్ + శస్. పుంసః. పుమ్స్ + భ్యామ్. సంయోగాన్తలోపము. అనుస్వారము. పుంభ్యామ్. పుంసు. ఇత్యాదులు. ఉశనస్ + సు. "ఋదుశనస్" (277) సూ. చే. అనజాదేశము. ఉశనన్, "సర్వనామస్థానే" (251) సూ. చే, ఉపధాదీర్ఘము. సులోపన లోపములు. ఉశనా (శుక్రుడు) ఉశనసౌ. ఉశనసః. (వా) 1 "అస్య సంబుద్ధౌ వాఽనఙ్ నలోపశ్చ వా వాచ్యః" ఉశనస్ శబ్దమునకు సంబుద్ధి పరమగునపుడు అనఙాదేశము వికల్పముగ జెప్పదగును, అనఙాదేశ పక్షమందు నలోపము వికల్పముగ నగునని వార్తికార్థము. అనఙాదేశ పక్షమున, నలోపాభావ పక్షమందు, హేఉశనన్. అనఙాదేశపక్షమందు నలోపము వచ్చునపుడు హే ఉశన. అనఙాదేశాభావ పక్షమందు హేఉశనః. ఉశనస్ + భ్యామ్. రుత్వము. "హశిచ" (167) సూ. చే, ఉత్వము. గుణము. ఉశనోభ్యామ్, ఇత్యాదులు. అనేహశ్శబ్దము సంబుద్ధియందుతప్ప మిగిలినచోట ఉశనస్ శబ్దసదృశము. అనేహా, అనేహసౌ, హేఅనేహః. అనేహోభ్యామ్, ఇత్యాదులు. వేధస్ + సు. ఇది అసన్తమగుటచే, "అత్వసన్తస్య" (428) సూ. చే, ఉపధాదీర్ఘము. సులోప రుత్వవిసర్గములు. వేధాః, వేధసౌ, వేధసః. సంబుద్ధి పరమగునపుడు దీర్ఘము రాదు. హేవేధః. వేధోభ్యామ్, ఇత్యాదులు. సుపూర్వకమగు వసధాతువునకు క్విప్ ప్రత్యయమువలన సువస్ అను ప్రాతిపదికమగును. సువస్ + సు. "అత్వసన్తస్య" (428) సూత్రమున నసన్తమునకు అధాతోః, అను విశేషణమువలన నిది ధాత్వవయవాఽసన్తమగుటచే నిచట

దీర్ఘము రాదు. సులోప రుత్వవిసర్గములు. సువః (బాగుగ నాచ్ఛాదనము చేయువాడు) సువసౌ, సువసః, సువోభ్యామ్, ఇత్యాదులు. ఇట్లే పిండశబ్ద పూర్వక గ్రసు, గ్లసు, ధాతువులు ప్రకృతులుగాగల్గి క్విబన్తములగు, పిండ గ్రస్, పిండగ్లస్ శబ్దములు, పిండగ్రః, పిండగ్లః. ఇత్యాది రూపములు గలవగును.

వివ:—1. కాశికావృత్తి గ్రంథమున నిది వచనరూపముగ పఠింప బడెను. మాధవాచార్య విరచితమగు ధాతువృత్తియందు వశధాతు వ్యాఖ్యా నావసరమున, "సంబోధనేతూశనసస్త్రిరూపమ్ సాన్తం తథానాన్తమథా ప్యదన్తమ్" అని శ్లోకవార్తికముగ చెప్పబడియె. ఉశనశ్శబ్దమునకు సంబుద్ధి పరమగునపుడు సకారాన్తము, నకారాన్తము, అకారాన్తముగ మూడు రూపము లగునని యర్థము భాష్యమున చెప్పబడనందున నిది యప్రమాణమే యని ప్రామాణికులందురు. హేఉశనః అనునొక రూపమే సాధువగునని భాష్యా శయము.

* 440. అదస ఔ సులోపశ్చ 7-2-107 అదసః, ఔ, సు లోపః, చ (సౌ)

అదస ఔకారోఽన్తాదేశః స్యాత్సౌ పరే సులోపశ్చ। తదోస్సః సావితి దస్య సః। అసౌ। ఔత్వ ప్రతిషేధః సాకచ్కస్య వా వక్తవ్యః సాదుత్వంచ। ప్రతిషేధ సన్నియోగ శిష్టముత్వం తదభావే న ప్ర వర్తతే। అసకౌ। అసుకః। త్యదాద్యత్వం పరరూప త్వమ్। వృద్ధిః। అదసోసేరితి ముత్వోత్వే। అమూ। జసః శీ। అద్గుణః॥

440. అదసః అనునది షష్ఠ్యన్తము. ఔ అనునది నిర్విభక్తికము. అదస్ శబ్దమునకు సుప్రత్యయము పరమగునపుడు ఔకార మన్తాదేశమగును, సులోపము నగును. ఔకారము ప్రవర్తించినతరువాత హలన్తము గానందున, "హల్ జ్యాబ్ భ్యః" (253) సూ. చే, సులోప మప్రాప్తమగుటవలన సులోపమును గూడ విధించెను. అదస్ + సు, సకారము నకారాకారాదేశము. వృద్ధి. తదో స్సస్సావనన్త్యయోః (383) సూ. చే, దకారమునకు సకారము. సులోపము. అసౌ. "తదోస్సస్సావనన్త్యయోః" సూత్రవిహితమగు సత్వము, ముత్వమున కసిద్ధమగుటచే నిచట ముత్వము ప్రవర్తించదు. (వా) ఔత్వప్రతి...చ. అకచ్ ప్రత్యయముతో గూడిన నదస్ శబ్దమునకు ఔత్వనిషేధమును సకార మునకు పరముగ నుకారమును వికల్పముగ చెప్పదగునని యర్థము. అదకస్ శబ్దముగూడ తన్మధ్యపతిత న్యాయముచే నదస్ శబ్దమగుటవలన ప్రాప్తమగు ఔకారాదేశమున కిది నిషేధము. అదకస్ + సు. ఔత్వము, సులోపము,

దకారమునకు సకారము. అసకౌ (ప) సన్నియోగ శిష్టానాం సహవా ప్రవృత్తిః సహ వా నివృత్తిః (ఏకసూత్ర విహితములగు కార్యములు కలసే ప్రవర్తించును, కలసే నివర్తించును). ఈ న్యాయమువలన పై వార్తికముచే విహితములగు నాత్వనిషేధము, ఉత్వము, యీ రెండు నొకచోట కలసి ప్రవర్తించును గావున నాత్వము ప్రవర్తించునపుడు (అసకౌ) ఉత్వము ప్రవర్తించదు. ఔత్వ ప్రతిషేధపక్షమం దుత్వము ప్రవర్తించును. అసుకః. (అదకస్ + సు) ఇచట త్యదాద్యత్వము, సులోపము, దకారమునకు సకారాదేశము, సకారముకంటె పరమగుదాని కుత్వము నగును. అదస్ + ఔ. త్యదాద్యత్వ పరరూపములు. వృద్ధి. అదౌ, "అదసోసేః" (422) సూ. చే, మత్వోత్వములు. అమూ. అదస్ + జస్. త్యదాద్యత్వ పరరూపములు. "జసశ్శీ" (215) సూ. చే, శీభావము. "ఆద్గుణః" (70) సూ. చే, గుణము. అదే. ఇట్లుండ :—

* 441. ఏత ఈ ద్బహువచనే 8-2-81 ఏతః, ఈత్, బహువచనే (అదసః, దాత్, దః, మః)

అదసో దాత్పరస్యైత ఈత్స్యాద్దస్య చ మోబహ్వర్థోక్తౌ। అమీ। పూర్వత్రా సిద్ధమితి విభక్తి కార్యంప్రాక్ పశ్చాదుత్వమత్వే। అముమ్। అమూ। అమూన్। ముత్వేకృతే ఘిసంజ్ఞాయాం నా భావః॥

441. బహువచన శబ్దము యౌగికము (ఉక్తిర్వచనమ్, బహూనాం వచనం బహువచనమ్, తస్మిన్) బహుత్వ సంఖ్యాబోధకమగు నదశ్శబ్దమున కవయవమైన దకారముకంటె పరమగు నేకారమున కీకారాదేశము, దకారమునకు మకారాదేశము నగును. అదే, అనుచోట నీ సూత్రముచే మీత్వము. అమీ. బహువచన శబ్దము పారిభాషికములగు జసాది ప్రత్యయములను బోధించు ననిన, అమీభిః. (అదే + భిస్) అనుచోట నేకారమునకు బహువచనము పరముగ నుండుటచే మీత్వము సిద్ధించినను. అదే (అద + జస్) అనుచోట నేకారమునకు బహువచనము పరముగ లేనందున మీత్వము రాకపోవును. "పూర్వత్రాసిద్ధమితి విభక్తి కార్యం ప్రాక్ పశ్చాదుత్వమత్వే" అను వాక్యమున పశ్చాదుత్వమత్వే అనుచోట నుత్వపద మీత్వమున కుపలక్షణము. పూర్వత్రాఽసిద్ధమ్మను సూత్రముచే ముత్వమీత్వము లసిద్ధములగుటవలన సాపాదికము లగు విభక్తి కార్యములు మొదట ప్రవర్తించును. తరువాత ముత్వమీత్వములు. కావున, అదస్ + జస్, ఇచట మొదట అత్వపరరూప శీభావగుణము లగును. తరువాత మీత్వము. అమీ అని యగును. ఇట్లే అదస్ + అమ్ అనుచోట నత్వపరరూప పూర్వరూపములు. అదమ్. పిమ్మట ముత్వము. అముమ్. అదస్ + శస్, మొదట త్యదాద్యత్వ పరరూపములు. పూర్వసవర్ణదీర్ఘ నత్వములు,

అదాన్. పిమ్మట మూత్వము. అమూన్. ఈ చోటులందు మొదట ముత్వ మీత్వములు ప్రవర్తించినచో అదస్ + ఔ, అనుచోట అముఔ. అదస్ + జస్, అనుచోట అము అః. ఇత్యాదుల నిష్టరూపము లగునని తెలియదగును. అదస్ + టా. త్యదాద్యత్వ పరరూపములు. ముత్వము. అము + ఆ. అజ్గము ఘిసంజ్ఞక మగుటచే, "అఙోనా" (245) సూ. చే, నాభావము. అమునా, అను రూపమగును. సాపాదికమగు నాభావము చేయునపుడు త్రిపాదీస్థమగు ముత్వ మసిద్ధమగుచుండ తన్నిషేధమును చెప్పుచున్నాడు:—

* 442. న ము నే 8-2-3 న। ము। నే (అసిద్ధమ్)

నాభావే కర్తవ్యే కృతే చ ముభావో నాసిద్ధః స్యాత్ । అమునా। అమూభ్యామ్ 3। అమీభిః। అముష్మై। అమీభ్యః 2। అముష్మాత్ । అముష్య। అముయోః। అమీషామ్। అముష్మిన్ । అముయోః। అమీషు ॥

442. ము అనునది సమాహార ద్వంద్వము (మ్చ ఉశ్చ అనయో స్సమాహారః) నే అనునది విషయ సప్తమ్యన్తము. కావున నా భావమును చేయునపుడుగాని నాభావము చేసినపిమ్మట మఱియొక కార్యమును చేయునపుడుగాని ముత్వ మసిద్ధముగాదని యర్థము. అమునా అని యగును. నే అనునది విషయ సప్తమ్యన్తమనుటచే కర్తవ్యే కృతే చ అను నర్థము లబ్ధమైనది. కావున నా భావమును చేసినపిదప, సుపిచ (203) సూ. చే, దీర్ఘము చేయునపుడును ముత్వము సిద్ధమగుటచే దీర్ఘము రాదు. అదస్ + భ్యామ్, అత్వపరరూపములు. సుపిచ (203) సూ. చే, దీర్ఘము. అదాభ్యాం, మూత్వము. అమూభ్యామ్, 3. అదస్ + భిస్. అత్వపరరూపములు. "బహువచనే (206) సూ. చే, నేత్వము. అదేభిః మీత్వము, అమీభిః. నేదమదసోరకోః (350) అను నిషేధమువలన నిచట సైసాదేశము రాదు. అదస్ + ఙే. విభక్తి కార్యములగు, అత్వపరరూపములు, స్మై భావము మొదట ప్రవర్తించును, పిదప ముత్వ షత్వములు. అముష్మై. అమీభ్యః అముష్మాత్, అముష్య, అముయోః, అమీషామ్, అముష్మిన్, అమీషు. ఈ రూపములందును మొదట విభక్తి కార్యములు పిదప మూత్వమీత్వముల నూహింపవలయును.

హలన్త పుంలిఙ్గ ప్రకరణము సమాప్తి నొందెను.

---

# 11. హలన్త స్త్రీలిఙ్గ ప్రకరణము

* 443. నహోధః 8-2-34 నహః ధః (హః, పదస్య, అన్తే, ఝలి)

నహో హస్య ధః స్యాజ్ఝలి పదాన్తే చ। ఉపానత్। ఉపానద్। ఉపానహౌ। ఉపానహః। ఉపానద్భ్యామ్। ఉపానత్సు। ఉత్పూర్వాత్ ష్ణిహ ప్రీతావిత్యస్మాదృత్విగిత్యాదినా క్విన్। నిపాతనాద్దలోపషత్వే। క్విన్నన్తత్వాత్కుత్వేన హస్య ఘః। జశ్త్వచర్త్వే। ఉష్ణిక్। ఉష్ణిగ్। ఉష్ణిహౌ। ఉష్ణిహః। ఉష్ణిగ్భ్యామ్। ఉష్ణిక్షు। ద్యౌః। దివౌ। దివః। ద్యుషు। గీః। గిరౌ। గిరః। ఏవం పూః। చతురశ్చతస్రాదేశః। చతస్రః। 2. చతసృణామ్। కిమః కాదేశే టాప్। కా। కే। కాః। సర్వావత్॥

443. పదాన్తమందున్నది గాని, ఝల్వర్ణ పరకమగునట్టిది గాని యగు నహ్ యొక్క హకారమునకు ధకార మాదేశమగును. "హోఢః" సూ. చే, ప్రాప్తమగు ఢత్వమున కిది యపవాదము. ఉపపూర్వక నహ్ (బన్ధనే) ధాతువునకు క్విప్ ప్రత్యయము. పూర్వపదమునకు దీర్ఘము. ఉపానహ్ + సు. సులోపము, పదాన్తమున నుండుటచే నీ సూత్రముచే హకారమునకు ధత్వము. జశ్త్వచర్త్వములు. ఉపానత్, ఉపానద్. ఉపానహ్ + ఔ. ఉపానహౌ. ధత్వము ప్రవర్తించదు. ఉపానహ్ + సుప్. ధత్వచర్త్వములు. ఉపానత్సు. ఉత్పూర్వక ష్ణిహ (ప్రీతౌ) ధాతువునకు "ఋత్విక్ (375) సూ. చే, క్విన్ ప్రత్యయము. ఆ సూత్రమున ఉష్ణిక్ అను నిపాతనమువలన పూర్వపదాన్త్యమగు దకారమునకు లోపము ధాతు సకారమునకు షత్వము నగును. ఉష్ణిహ్ అనునది క్విన్నన్తమగుటవలన "క్విన్ ప్రత్యయస్య కుః (379) సూ. చే, "హోఢః" సూత్రప్రాప్తమగు ఢత్వమును బాధించి కుత్వము వచ్చును. హకారమున కన్తరతమమగు ఘకారమగును. ఉష్ణిఘ్. జశ్త్వచర్త్వములు. ఉష్ణిక్, ఉష్ణిగ్. ఉష్ణిహ్ + భ్యామ్. కుత్వజశ్త్వములు ఉష్ణిగ్భ్యామ్. ఉష్ణిహ్ + సు. కుత్వచర్త్వములు, ఉష్ణిక్ + సు. ప్రత్యయ సకారమునకు, ఆదేశప్రత్యయయోః (213) సూ. చే, షత్వము. ఉష్ణిక్షు. దివ్ శబ్దము దివ్ + స్. దివ ఔత్ (337) సూ. చే, వకారమున కౌకారాదేశము. యణాదేశ రుత్వ విసర్గములు. ద్యౌః. దివ్ + భ్యామ్. దివ ఉత్ (338) సూ. చే, వకారమున కుత్వము,

ద్యుభ్యామ్. దివ్ + సు. ఉత్వము. సకారమునకు షత్వము. ద్యుషు. గిర్ శబ్దము గౄ (నిగరణే) ధాతువునకు క్విబన్తము. గిర్ + స్. సులోపము. ర్వోరుపధాయాః (436) సూ. చే, నుపధాదీర్ఘము. గీర్. విసర్గము. గీః. గిర్ + ఔ. గిరౌ. గిర్+సు. ఉపధాదీర్ఘ షత్వములు. గీర్షు. పౄ (పాలనే) ధాతువునకు క్విబన్తము పుర్ శబ్దము. ఇది గీర్ శబ్దసదృశము. అనగా నుపధాదీర్ఘాదికమగుటవలన పూః. పురౌ ఇత్యాదులగునని భావము. చతుర్ + జస్. ఇచట చతురనడుహో (332) సూత్రప్రాప్తమగు ఆమాగమమును బాధించి పరమగు త్రిచతురోః (299) సూత్రవిహితమగు చతస్రాదేశమగును. పిదప "సకృద్గతౌ" అను న్యాయముచే తిరుగ నామాదేశము ప్రవర్తించదు. యణాదేశము. చతస్రః. చతుర్ + శస్. చతస్రాదేశ యణాదేశములు. చతస్రః. చతస్రాదేశమన్ని విభక్తులు పరమగునపుడును ప్రవర్తించును. చతసృ + ఆమ్. నుడాగమము. చతసృ+నామ్. నతిసృచతసృ (301) సూ. చే, దీర్ఘనిషేధము ప్రవర్తించును. చతసృణామ్. కిమ్ + స్. కిమఃకః (343) సూ. చే, కాదేశము. క + స్. క అనునది అదన్త స్త్రీలిఙ్గమగుటచే టాప్ ప్రత్యయము. సులోపము. కా. కిమ్ + ఔ. కే. కిమ్ + జస్, కాః. స్త్రీలిఙ్గ కింశబ్ద మిట్లు సర్వాశబ్దసదృశము.

* **444.** యః సౌ 7-2-110 యః. సౌ (ఇదమః, దః)

ఇదమో దస్య యః స్యాత్సౌ। ఇదమో మః। ఇయమ్। త్యదాద్యత్వం టాప్। దశ్చేతి మః। ఇమే। ఇమాః। ఇమామ్। ఇమే। ఇమాః। అనయా। హలి లోపః। ఆభ్యామ్ (3) ఆభిః। అస్యై। అస్యాః। అనయోః (2) ఆసామ్। అస్యామ్। ఆసు। అన్వాదేశేతు. ఏనామ్। ఏనే। ఏనాః। ఏనయా। ఏనయోః (2) ఋత్విగాదినా సృజేః క్విన్, అమాగమశ్చ నిపాతితః। స్రక్। స్రగ్। స్రజౌ। స్రజః। స్రగ్భ్యామ్। స్రక్షు। త్యదాద్యత్వం టాప్। స్యా। త్యే। త్యాః। ఏవం తద్, యద్, ఏతద్। వాక్। వాగ్। వాచౌ। వాచః। వాగ్భ్యామ్। వాక్షు। అప్ శబ్దో నిత్యం బహువచనాన్తః। అప్తృన్నితిదీర్ఘః। ఆపః। అపః ॥

**444.** ఇదమ్ శబ్దముయొక్క దకారమునకు ప్రథమైకవచనము పరమగునపుడు యకార మాదేశమగును. ఇదమ్ శబ్దమునకు పుంలిఙ్గమున "ఇదోయ్

పుంసి” (345) సూ. చే, నయాదేశము విధింపబడుటచేతను, నపుంసకలిఙ్గమున సుప్రత్యయము లుక్కుచే నపహృతమగుటవలన నీ యత్వము స్త్రీలిఙ్గమందే ప్రవర్తించును. ఇదమ్ + స్। యత్వము. త్యదాద్యత్వమున కపవాదమగు, ఇదమో మః (344) సూ. చే, మకారమునకు మకారాదేశము. సులోపము. ఇయమ్. ఇదమ్ శబ్దమునకు ప్రథమైక వచనమును విడిచి మిగిలిన చోటులందు త్యదాద్యత్వము, స్త్రీలిఙ్గ మగుటవలన టాప్ ప్రత్యయమును వచ్చును. ఇదమ్ + ఔ। ఇదా + ఔ। దశ్చ (346) సూ. చే, మత్వము. ఇమా + ఔ। శీభావగుణములు. ఇమే. ఇదంశబ్దము జస్ ప్రత్యయ ద్వితీయా విభక్తులు పరమగు నపుడు సర్వా శబ్దసదృశమగును. ఇదమ్ + టా। అనాప్యకః (347) సూ. చే, టా మొదలగు నజాది ప్రత్యయము పరమగునపు డిద్దున కనాదేశము. అనా + టా, పిదప నిది సర్వా శబ్దసదృశము. అనయా। ఇదమ్ + భ్యామ్। హలి లోపః (348) సూ. చే, హలాది విభక్తులు పరమగునపు డిద్దునకు లోపము. ఆభ్యామ్ 3. ఇదమ్ + భిస్। ఆభిః। ఇదమ్ + ఙే। ఇదా + ఏ। సర్వనామ్నః స్యాట్ (292) సూ. చే, స్యాడాగమ హ్రస్వములు. ఇదస్యై, ఇద్దునకు లోపము. అస్యై। ఇట్లే ఇదమ్ + ఙసి, ఙస్, అను చోటులందు అస్యాః (2) అని యగును. ఇదమ్ + భ్యస్। ఇదా + భ్యస్. ఇద్దునకు లోపము. ఆభ్యః (2). ఇదమ్ + ఓస్। ఇదా + ఓస్। అనాదేశము. పిమ్మట నిది సర్వా శబ్దసదృశమగును. అనయోః (2) ఇదమ్ + ఆమ్, ఇదా + ఆమ్, ఆమ్ ప్రత్యయమునకు సుడాగమము. ఇద్దునకు లోపము. ఆసామ్, ఇదమ్ + ఙి, ఇదా + ఙి। ఙి ప్రత్యయమునకా మాదేశ స్యాడాగమములు. అస్యామ్. ఇదమ్ + సు, ఇదా + సు। ఇద్దునకు లోపము. ఆసు। అన్వాదేశ విషయమగు నిదమ్ శబ్దమునకు ద్వితీయాటౌ స్స్వేనః (352) సూ. చే, ఏనాదేశమగును. పిదప నిది సర్వా శబ్దసదృశము. ఏనామ్, ఏనే ఇత్యాదులు.

“ఋత్విక్ దధృక్।” (375) సూ. చే, సృజ్ (విసర్గే) ధాతువునకు క్విన్ ప్రత్యయము, ధాతువున కవయవమగు ఋకారమున కమాగమము నిపతింపబడెను. స్రజ్ అను ప్రాతిపదిక మేర్పడును. స్రజ్ + సు। సులోపము. “క్విన్ ప్రత్యయస్య” సూ. చే, కుత్వము. స్రగ్, వావసానే (207) సూ. చే, చర్త్వము. స్రక్, స్రగ్, స్రగ్భ్యామ్ ఇత్యాదులు. త్యద్ + సు. త్యదాద్యత్వము. టాప్ ప్రత్యయ సులోపములు, తదోస్సస్సౌ (383) సూ. చే, సత్వము. స్యా. మిగిలిన విభక్తులు పరమగునపుడు సర్వాశబ్దమువలె నుండును. త్యే, త్యాః, త్యయా ఇత్యాదులు. ఇట్లే తద్ యద్ ఏతద్ శబ్దములకును ప్రక్రియ నూహించునది. ఏతచ్ఛబ్దమునకు మాత్రము ప్రథమైక వచనమునందు

ఏషా అను రూపమగును. పుంలిఙ్గమగు ఏషః అనుదానికంటె దీనికి టాప్ ప్రత్యయము విశేషము. వాచ్ శబ్దము. వాచ్ + సు. సులోపము. "చోః కుః" సూ. చే, కుత్వము. జశ్త్వ చర్త్వములు. వాక్. వాగ్. వాగ్భ్యామ్ (వాచ్ + భ్యామ్) వాచ్ + సు. కుత్వ షత్వములు. వాక్షు. అప్ శబ్దము నిత్య బహువచనాన్తము. అప్ + జస్. అప్తృన్ (278) సూ. చే, నుపధా దీర్ఘము. ఆపః (ఉదకము) అప్ + శస్. అపః ॥

* 445. అపో భి 7-4-48 అపః. భి (తః)

అపస్తకారః స్యాద్భాదౌ ప్రత్యయే పరే। అద్భిః। అద్భ్యః। అపామ్। అప్సు। దిక్। దిగ్। దిశౌ। దిశః। దిగ్భ్యామ్। దిక్షు। త్యదాదిష్వితిదృశేః క్విన్విధానాదన్యత్రాపి కుత్వమ్। దృక్। దృగ్। దృశౌ। దృశః। త్విట్। త్విడ్। త్విషౌ। త్విషః। త్విడ్భ్యామ్। త్విట్సు। త్విట్సు। సహజుషతే ఇతి సజూః। సజుషౌ। సజుషః। సజూర్భ్యామ్। సజూష్షు। సజూఃషు। షత్వస్యాసిద్ధత్వాత్ రుత్వమ్। ఆశీః। ఆశిషౌ। ఆశిషః। ఆశీర్భ్యామ్। అసౌ। త్యదాద్యత్వమ్। టాప్। ఔజఃశీ। ఉత్వమత్వే। అమూ। అమూః। అమూమ్। అమూ। అమూః। అముయా। అమూభ్యామ్। అమూభిః। అముష్యై। అమూభ్యామ్। అమూభ్యః। అముష్యాః౽అముయోః। అమూషామ్। అముష్యామ్। అమూషు ॥

445. ఈ సూత్రమ ఙ్గాధికారములోని దగుటవలన ప్రత్యయే అనునది యాక్షేప లభ్యమగును. దీనికి భి, అనునది విశేషణమగుటచే యస్మిన్ విధిరిత్యాది పరిభాషచే భకారాది ప్రత్యయమను నర్థము లభించును. అప్ శబ్దమునకు భకారాది ప్రత్యయము పరమగునపుడు తకార మన్తాదేశమగునని యర్థము. అప్ + భిస్. అద్భిః, అద్భ్యః. అప్ + భ్యస్. దిశ్ + సు. సులోపము. వ్రశ్చభ్రస్జ (295) సూ. చే, శవర్ణమునకు, షత్వము. జశ్త్వము. క్విన్నన్తమగుటచే కుత్వము. చర్త్వము, (ష, డ, గ, క) దిక్, దిగ్. దిగ్భ్యామిత్యాదులు. దృశధాతువునకు క్విప్ ప్రత్యయమును చేసిన, దృశ్ శబ్దమగును. త్యదాదు లుపపదములుగ నున్నపుడు దృశధాతువునకు "త్యదాదిషు దృశో" (432) సూ. చే, క్విన్విధానము చేయుటవలనను, క్విన్ ప్రత్యయస్య (379) సూత్రమున బహువ్రీహి నాశ్రయించుటచేతను, దృశ్ శబ్ద మిపుడు క్విన్

ప్రత్యయాన్తము గాక క్విప్ ప్రత్యయాన్తమయినను కుత్వము ప్రవర్తించును. దృశ్ + సు. సులోప షత్వ జశ్త్వ కుత్వ చర్త్వములు. దృక్, దృగ్, ఇత్యాదులు, త్విష్ శబ్దము, త్విష ధాతుప్రకృతిక క్విబన్తము. త్విష్ + సు. సులోప జశ్త్వ చర్త్వములు. త్విట్, త్విడ్, త్విడ్భ్యామ్. త్విష్ + సు. ఇత్యాదులు. జశ్త్వము. త్విడ్ + సు। ధుడాగమ, చర్త్వములు. త్విట్త్సు. ధుడాగమాభావ పక్షమందు త్విట్సు. సహాజుష తే అను సర్ధమున సహ శబ్ద పూర్వకజుష (ప్రీతిసేవనయోః) ధాతువునకు క్విన్ ప్రత్యయము, సహాశబ్దమునకు సభావమును చేసిన సజుష్ శబ్దము సిద్ధించును. సజుష్ + సు. సులోపరుత్వ ములు. ర్వోరుపధాయా (430) సూ. చే, నుపధాదీర్ఘము. విసర్గము. సజూః, సజూర్భ్యామ్, ఇత్యాదులు. సజుష్ + సు. రుత్వము. ఉపధాదీర్ఘము. సజూర్ + సు. విసర్గము. వాశరి (152) సూ. చే, విసర్గమునకు విసర్గమే వికల్ప ముగనగును. సజూఃసు. నుమ్ విసర్జనీయ శర్వ్యవాయేపి (437) సూ. చే, షత్వము. సజూఃషు. విసర్గాదేశాభావ పక్షమున, విసర్గమునకు సత్వము. సజూస్సు. మొదటి సకారమునకు ఆదేశప్రత్యయయోః సూత్రముచేతను రెండవ సకారమునకు "నుమ్ విసర్జనీయ" సూత్రముచేతను, షత్వమగును. సజూష్షు. ఆశిష్ శబ్దము:—ఆశిష్ + సు. సులోపము. పూర్వత్రాసిద్ధమ్ (13) సూ. చే, రుత్వమును గుఱించి షత్వమసిద్ధమగుటవలన సకారబుద్ధిచే రుత్వము. ఉపధా దీర్ఘము. విసర్గము. ఆశీః. ఆశిష్ + భ్యామ్. రుత్వము. ఉపధాదీర్ఘము. ఆశీర్భ్యామ్. అదస్ + సు. పుంలిఙ్గమందువలె నిచట ప్రక్రియ నూహింపదగును. అసౌ. అదస్ + ఔ। ఇది మొదలన్ని విభక్తులు పరమగునపుడును త్యదాద్యత్వ పరరూప టాప్ ప్రత్యయములగును. అదా + ఔ। ఔఙ ఆపః (288) సూ. చే, శీభావము. గుణము. అదే. అదసోసేర్దాదు దోమః (422) సూ. చే, మాత్వ మత్వములు. అమూ. అదస్ + జస్। పూర్వసవర్ణ దీర్ఘము. ఊత్వమత్వములు. అమూః. అదా + అమ్। పూర్వరూపము. ఊత్వమత్వములు. అమూమ్. అదా + ఔ. అమూ. అదా + శస్. జస్సుయందువలె ప్రక్రియ నూహించునది. అమూః. స్త్రీలిఙ్గమగుటచే తస్మాచ్ఛసో (197) సూత్రవిహిత నత్వము ప్రవర్తించదు. అదా + ఆ, ఆఙి చాపః (290) సూ. చే, ఏత్వము. అయాదేశము ఊత్వ మత్వములు అముయా. అదా + ఏ "సర్వనామ్నః స్యాట్" (292) సూ. చే, స్యాడాగమ హ్రస్వములు, ఉత్వమత్వములు, షత్వము, అముష్యై, అదా + జసి, ఙస్. స్యాడాగమ హ్రస్వములు, అముష్యాః, అదా + ఓస్। ఆఙి చాపః (290) సూ. చే, ఏత్వము, అయాదేశ ముత్వములు. అముయోః (2) అమూషు (అదస్ + సు) మూత్వ షత్వములు.

హలన్త స్త్రీలిఙ్గ ప్రకరణము ముగిసెను.

---

# 12. హలన్త నపుంసకలిఙ్గ ప్రకరణము

స్వమోర్లుక్ । దత్వమ్ । స్వనడుత్ । స్వనడుద్ । స్వనడుహీ । చతురనడుహోరిత్యామ్ । స్వనడ్వాంహి । పునస్తద్వత్ । శేషం పుంవత్ । దివఉత్ । అహర్విమల ద్యు । అన్తర్వర్తినీంవిభక్తి మాశ్రిత్య పూర్వపదస్యై వోత్తరఖండస్యాపి పదసంజ్ఞాయాం ప్రాప్తాయాం ఉత్తరపదత్వేచా పదాదివిధౌ ప్రతిషేధః । ఇతిప్రత్యయలక్షణం న । విమలదివీ । విమలదివి । అపదాదివిధౌ కిమ్ । దధిసేచౌ । ఇహ షత్వనిషేధే కర్తవ్యే పదత్వమస్త్యేవ । షత్వేతు న । వాః । వారీ । అఝులన్తత్వాన్నుమ్ । వారి । చత్వారి । నలుమతేతికాదేశో న । కిమ్ । కే । కాని । ఇదమ్ । ఇమే । ఇమాని । (వా) అన్వాదేశేనపుంసకే ఏనద్వక్తవ్యః । ఏనత్ । ఏనే । ఏనాని । ఏనేన । ఏనయోః । బ్రహ్మ । బ్రహ్మణీ । బ్రహ్మాణి । హేబ్రహ్మన్ । హేబ్రహ్మ । రోఽసుపి । అహర్భాతి । విభాషా ఙిశ్యోః । అహ్నీ । అహనీ । అహాని ॥

స్వనడుహ్ శబ్దము (శోభనాః అనడ్వాహః యస్మిన్ తత్) స్వనడుహ్ + సు । స్వమోర్నపుంసకాత్ (320) సూ. చే, సుప్రత్యయమునకు లుక్కగును. స్వనడుహ్ "వసుస్రంసు (335) సూ. చే, హకారమునకు దకారాదేశము. వావసానే" సూ. చే, చర్త్వము. స్వనడుత్, స్వనడుద్, స్వనడుహ్ + ఔ । నపుంసకాచ్చ (311) సూ. చే, శీభావము. స్వనడుహీ. స్వనడుహ్ + జస్. శిభావము. చతురనడుహో (332) సూ. చే, నామాగమము. నపుంసకస్య ఝలచః (315) సూ. చే, నుమాగమము. అనుస్వారము. స్వనడ్వాంహి । ద్వితీయావిభక్తియు నిట్లే తృతీయాది విభక్తులు పరమగునపుడు పుంలిఙ్గమగు నడుహ్ శబ్దమునకువలె రూపముల నూహింపవలయును. విమలదివ్ శబ్దము (విమలాద్యౌః యస్మిన్ తత్) అహస్సు అన్యపదార్థము. (నిర్మలమయిన యాకసము గల పగలని యర్థము) విమలదివ్ అనునది నపుంసకమని సూచించుటకు అహర్గ్రహణము. విమలదివ్ + సు. సులుక్కు । పదాన్తమగుటచే దివఉత్ (338) సూత్రముచే వకారమున కుత్వము. యణాదేశము. విమలద్యు । (అహః) విమల దివ్ + ఔ । శీభావము. విమలదివీ । విమలదివి । విమలా + సు, దివ్ + సు అను

సమాసమున సుప్రత్యయమునకు సమాసప్రయుక్తమైన లుక్కు వచ్చినది. ఇచట ఔ, విభక్తి పరమైనపుడు సముదాయమునకు పదసంజ్ఞ ప్రసక్తముకాదు గాని దివ్ శబ్దముకంటె పరమగు సుప్రత్యయ లుక్కునకు ప్రత్యయలక్షణము ప్రవర్తించినచో దివ్ అనుదానికి పదసంజ్ఞ ప్రాప్తమగుచున్నది. దివఉత్ (338) సూ. చే, నుత్వము ప్రసక్తమగుచున్నది. ఇచట నుత్తరపదమగు దివ్ అనునది యఙ్గము గానందున పదసంజ్ఞ అఙ్గమునకు కాకపోవుటవలన, దివ్ శబ్దమునకు పదసంజ్ఞ చేయునపుడు "నలుమతాఙ్గస్య (264) అను ప్రత్యయలక్షణ నిషేధము ప్రవర్తించదు. అఙ్గకార్యము గానపుడు నీ నిషేధము ప్రవర్తించుననిన సమాసమున పూర్వపదమునకు పదసంజ్ఞ చేయునపుడును ప్రత్యయలక్షణము లేకపోవును. రాజపురుషః (రాజన్ జస్. పురుష + సు) అనుచోట పూర్వపదమగు రాజన్ శబ్దమునకు పదసంజ్ఞ సిద్ధముగానందున నలోపము రాకపోవును. కావున సమాసమున పూర్వపదమునకువలె నుత్తరపదమునకును పదసంజ్ఞ ప్రాప్తమగుటచే నిచట వకారస్థాన కుత్వము ప్రసక్తమగుచున్నది కాని (వా) "ఉత్తర ...ప్రతిషేధః, అనుదానిచే నిచట ప్రత్యయ లక్షణము నిషిద్ధమగుటవలన దివ్ అనునది పదముగానందున దోషము లేదు. వార్తికార్థము:— ఉత్తరపదత్వే, (ఉత్తరస్య పదత్వం తస్మిన్) అనుచోట నుత్తరశబ్దమున నుత్తరపదమని యర్థము. ఉత్తరపద శబ్దము సమాసముయొక్క చివరభాగమును బోధించును. పదత్వమనగా పదసంజ్ఞాప్రయుక్త కార్యము. సమాస చరమావయవమునకు పదసంజ్ఞా ప్రయుక్తమగు కార్యమేదేని చేయునపుడు ప్రత్యయలక్షణము ప్రవర్తించదు. అపదాదివిధౌ అనుచోట పదస్యాదిః = పదాదిః = తస్యవిధిః. నపదాదివిధిః = అపదాదివిధిః = తస్మిన్, అని సమాసము. పదాదికి కార్యము (అనగా సాత్పదాద్యోః (8-3-111) సూ. చే, షత్వనిషేధము) చేయునపుడు మాత్రము ప్రత్యయలక్షణ నిషేధము ప్రవర్తించదని. విమలదివ్ అనుచోట దివ్ అనునది సమాస చరమావయవమేగాన నిచట ప్రత్యయలక్షణము ప్రవర్తింపక పోవుటచే పదసంజ్ఞ ప్రసక్తముగాదని యాశయము. విమలదివ్ + జస్. శిభావము. విమలదివి. ఇచటను పూర్వమువలె నుత్వప్రసక్తి లేదు. ద్వితీయా విభక్తియం దిట్లే, తృతీయాది విభక్తులందు దివ్ శబ్దమునకువలె దీనికిని రూపములగును. ప్రత్యయలక్షణ నిషేధమున నపదాది విధౌ, అని చెప్పుటవలన దధిసేచౌ అనుచోట షత్వము వారితమగును. దధ్నః సేచౌ + దధిసేచౌ అని షష్ఠీ సమాసము. ఇచట సకారమునకు సాత్పదాద్యోః (8-3-111) సూ. చే, షత్వనిషేధము చేయునపుడు (పదాదికార్యము) ప్రత్యయలక్షణ నిషేధము లేనందున సేచ్ శబ్దమునకు, సమాసప్రయుక్తమగు లుక్కుచే లోపింపబడిన

విభక్తినిబట్టి పదసంజ్ఞ యుండును. ఇచటనే చకారమునకు చోః కుః (380) సూ. చే, కుత్వము చేయునపుడు మాత్రము సేచ్ అనుదానికి పదసంజ్ఞ యుండదు. కుత్వము పదాదికార్యము గానందున అపదాదివిధౌ, అను పర్యుదాసము ప్రవర్తించదు కాబట్టి ప్రత్యయలక్షణ నిషేధము ప్రవర్తించునని యాశయము. వార్ శబ్దము. వార్ + సు. సుప్రత్యయమునకు లుక్కగును. రేఫమునకు విసర్గము, వాః. వార్ + ఔ. శీభావము. వారీ. వార్ + జస్. శీభావము. వారి; ఇచట నజ్గము ఝులన్తము గానందున "నపుంసకస్య" సూ. చే, నుమాగమము రాదు. ద్వితీయావిభక్తియు నిట్లే. వారా. వార్భ్యామ్. ఇత్యాదులు. చతుర్ శబ్దము. చతుర్ + జస్. శీభావము. చతురనడుహాః (332) సూ. చే, నామాగమము. యణాదేశము, చత్వారి, ద్వితీయావిభక్తియు నిట్లే. చతుర్భిః ఇత్యాదులు, పుంలిఙ్గమునందువలె నూహింపదగును. కిమ్ శబ్దము, కిమ్ + సు, సుప్రత్యయమునకు లుక్కు వచ్చినందున "నలుమతాఙ్గస్య" (264) అను నిషేధము ప్రవర్తించును. విభక్తి పరముగ లేదు గావున కిమః కః (343) సూత్రవిహితమగు కాదేశము ప్రవర్తించదు. కిమ్, కిమ్ + ఔ, శీభావము, కాదేశము. గుణము. కే. కిమ్ + జస్. శీభావము, కాదేశము. "నపుంసకస్య" (315) సూ. చే, నుమాగమము. ఉపధాదీర్ఘము కాని, ద్వితీయా విభక్తియు నిట్లే. శేషము పుంలిఙ్గమందువలె నూహింపదగును. ఇదమ్ శబ్దము, ఇదమ్ + సు. సుప్రత్యయమునకు లుక్కగుటచే "యఃసౌ" (444) సూ. చే, యాదేశముగాని త్యదాద్యత్వముగాని ప్రవర్తించదు. ఇదమ్. ఇదమ్ + ఔ. శీభావము. త్యదాద్యత్వ పరరూపములు. దకారమునకు మకారాదేశము. గుణము. ఇమే, ఇదమ్ + జస్. శీభావము. త్యదాద్యత్వ పరరూపములు, మత్వము, నుమాగమము. ఉపధాదీర్ఘము. ఇమాని. ద్వితీయావిభక్తియు నిట్లే. శేషము పుంలిఙ్గ సదృశము. (వార్తి) అన్వాదేశే...వక్తవ్యః, "ద్వితీయాటౌ (352) సూత్రమునుండి "ద్వితీయాటౌస్సు అని సంబంధించును. అన్వాదేశ విషయము నపుంసకమునగు ఇదమ్ శబ్దమునకు ద్వితీయావిభక్తి, టా, ఓస్, ఇవి పరమగునపుడు ఏనదాదేశము చెప్పదగునని వార్తికార్థము. ఔట్ శసాదులు పరమగునపుడు ఏనాదేశముచే గతార్థమగును గాన నీ యాదేశము ద్వితీయైక వచనమునందే ప్రవర్తించును. అమ్ ప్రత్యయము లుక్కుచే లుప్తమయినను వచనసామర్థ్యమువలన ప్రత్యయ లక్షణము ప్రవర్తించునని యూహింపదగును. ఉదా॥ ఏనత్ (ఇదమ్ + అమ్) ఏనే, ఏనాని, ఏనేన, ఏనయోః। (2) బ్రహ్మశబ్దము వేదము, తపస్సు మొదలగు నర్థములం కలది. బ్రహ్మన్ + సు. స్వలుక్కు, నలోపము. బ్రహ్మ, బ్రహ్మన్ + ఔ. శీభావము. ణత్వము.

బ్రహ్మణీ। "న సంయోగాద్వమన్తాత్" అను నిషేధమువలన నిచట "విభాషా ఙిశ్యోః" (238) సూ. చే, నకారలోపము ప్రవర్తింపదు. బ్రహ్మన్ + జస్. శీభావము. సర్వనామస్థానే (251) సూ. చే, నుపధా దీర్ఘము. బ్రహ్మాణి. హే బ్రహ్మన్ + సు. సులుక్కు. సంబుద్ధౌ నపుంసకానాం అను వార్తికముచే నలోప వికల్పము. హే బ్రహ్మన్, హే బ్రహ్మ, బ్రహ్మణా, బ్రహ్మభ్యామ్ ఇత్యాదులు. అహన్ శబ్దము. అహన్ + సు. సులుక్కు. ప్రత్యయలక్షణము లేనందున సుప్పరత్వము లేదు గావున నీ అహన్ శబ్దమునకు భాతి మొదలగునవి పరమగునపుడు "రోఽసుపి (173) సూ. చే, రేఫాదేశమగును అహర్భాతి ఇత్యాదులగును. అహన్ అను సూత్రముచే రుత్వము ప్రవర్తించినచో అహోభాతి మొదలగునవి గావలయును. అహన్ + ఔ. శీభావము. "విభాషా ఙిశ్యోః (238) సూ. చే, వైకల్పికాల్లోపమగును అహ్నీ, అహనీ, అహన్ + జస్. శీభావము. ఉపధాదీర్ఘము. అహాని, అహ్నా ఇత్యాదులు.

* 446. అహన్ 8-2-68 (రుః, పదస్య, అన్తే)

అహన్నిత్యస్య రుః స్యాత్పదాన్తే। అహోభ్యామ్। అహోభిః। ఇహ అహః అహోభ్యా మిత్యాదౌ రత్వరుత్వయోర సిద్ధత్వాన్నలోపే ప్రాప్తే అహన్నిత్యావర్త్య నలోపాభావం నిపాత్య ద్వితీయేన రుర్విధేయః। తదన్తస్యాపి రుత్వరత్వే। దీర్ఘాణ్యహాని యస్మిన్ స దీర్ఘాహా నిదాఘః। ఇహ హల్ఙ్యాదిలోపే ప్రత్యయలక్షణేనాసుపీతి నిషేధాద్రత్వాభావే రుః। తస్యా సిద్ధత్వాన్నాన్తలక్షణ ఉపధాదీర్ఘః। సంబుద్ధౌతు హే దీర్ఘాహోనిదాఘ। దీర్ఘాహాణౌ। దీర్ఘాహాణః। దీర్ఘాహ్నః। దీర్ఘాహోభ్యామ్। దండి। దండినీ। దండీని। స్రగ్వి। స్రగ్విణీ। స్రగ్వీణి। వాగ్మి। వాగ్మినీ। వాగ్మీని। బహువృత్రహాణి। బహుపూషాణి। బహ్వార్యమాణి। అసృజః పదాన్తే కుత్వమ్। సృజేః క్విన్విధానాత్। విశ్వసృడాదౌతు న। సృజిదృశోరితి సూత్రే రజ్జుసృడ్భ్యమితి భాష్యప్రయోగాత్। యద్వా వ్రశ్చాదిసూత్రే సృజియజోః పదాన్తే షత్వం కుత్వాపవాదః। స్రగ్ ఋత్విక్ శబ్దయోస్తు

నిపాతనాదేవ కుత్వమ్। అసృక్శబ్దస్తు అసృతేరౌణా
దికే ఋచ్ ప్రత్యయే బోధ్యః। అసృక్। అసృగ్। అసృ
జీ అసృఞ్జి। పద్దన్నితి వా అసన్। అసాని। అసృజా। అ
స్నా। అసృగ్భ్యామ్। అసభ్యామిత్యాది. ఊర్క్। ఊ
ర్గ్। ఊర్జీ। ఊర్న్జి। నరజానాం సంయోగః। (వా) బ
హూర్జి నుమ్ ప్రతిషేధః। (వా) అన్త్యాత్పూర్వో వా
నుమ్। బహూర్జి। బహూర్ఞ్జి (వా) కులాని। త్యత్।
త్యద్। త్యే। త్యాని। తత్। తద్। తే। తాని। యత్।
యే। యాని। ఏతత్, ఏతద్। ఏతే। ఏతాని। అన్వా
దేశేతు ఏనత్, బేభిద్యతేః క్విప్। బేభిత్। బేభిద్। బే
భిదీ, శావల్లోపస్య స్థానివత్త్వాద ఝలన్తత్వాన్న
నుమ్. అజన్తలక్షణస్తు నుమ్ న. స్వవిధౌ స్థానివత్త్వా
భావాత్। బేభిది బ్రాహ్మణకులాని। చేచ్ఛిది. శ్లో॥
'గవాక్శబ్దస్య రూపాణి క్లీబేర్చాగతిభేదతః। అసంధ్య
వఙ్ పూర్వరూపైర్నవాధికశతం మతమ్ (1) స్వమ్
సుప్సు నవ షడ్భాదౌ షట్కే స్యుస్త్రీణి జశ్శసోః। చ
త్వారి శేషే దశకే రూపాణీతి విభావయ'. తథా
హి। గామంచతీతి విగ్రహే ఋత్విగాదినా క్విన్। గ
తౌ నలోపః। అవఙ్ స్ఫోటాయనస్యేత్యవఙ్, గవాక్।
గవాగ్। సర్వత్ర విభాషేతి ప్రకృతిభావే గోఅక్।
గోఅగ్। పూర్వరూపే గోక్। గోగ్। పూజాయాం
నస్య కుత్వేన ఙః, గవాఙ్। గోఅఙ్। గోఙ్। అమ్యపి
ఏతాన్యేవ నవ। ఔ జశ్శి। భత్వాదచ ఇత్యలోపః। గో
చీ। పూజాయాంతు గవాఞ్చీ। గోఅఞ్చీ। గోఞ్చీ।
జశ్శసోశ్శిః। శేః సర్వనామస్థానత్వాన్నుమ్। గవాఞ్చి।
గోఅఞ్చి। గోఞ్చి। గతిపూజనయోస్త్రీణ్యేవ। గోచా।
గవాఞ్చా। గోఅఞ్చా। గోఞ్చా। గవాగ్భ్యామ్। గోఅ
గ్భ్యాం। గోగ్భ్యామ్। గవాఙ్భ్యామ్। గోఅఙ్భ్యామ్।
గోఙ్భ్యామ్, ఇత్యాది. సుపితు ఙాంతానాం పక్షే
ఙో ఃకుగితికుక్। గవాఙ్క్షు। గోఅఙ్క్షు। గోఙ్క్షు। గ
వాఙ్షు। గోఅఙ్షు॥ గోఙ్షు। గవాక్షు। గోఅక్షు।
గోక్షు, నచేహ చయోర్ద్వితీయా ఇతి పక్షే కకారస్య

ఖకారేణ షణ్ణామాధిక్యం శంక్యమ్. చర్త్వస్యాసిద్ధత్వాత్। షక్ పక్షేతు తస్యాసిద్ధత్వాజ్జశ్త్వాభావే పక్షే ద్వితీయాదేశాత్త్రీణి రూపాణి వర్ధంతఏవ। ఊహ్యమేషాం ద్విర్వచనానునాసిక వికల్పనాత్. రూపాణ్యశ్వాక్షిభూతాన (527) భవన్తీతి మనీషిభిః। తిర్యక్। తిరశ్చీ। తిర్యఞ్చి। పూజాయాంతు తిర్యఙ్। తిర్యఞ్చీ। తిర్యఞ్చి, యకృత్। యకృతీ। యకృన్తి। పద్దన్నఇతివాయకన్। యకాని। యక్నా। యకృతా। శకృత్। శకృతీ, శకృన్తి। శకాని। శక్నా। శకృతా। దదత్। దదతీ॥

446. అహన్ అనునది లుప్తషష్ఠీకము. అహన్ శబ్దమునకు పదాన్తమందు రుత్వమగును. అలోన్త్య పరిభాషచే నది నకారస్థానమందు వచ్చును. అహన్ + భ్యామ్. రుత్వము. హశిచ (167) సూ. చే, ఉత్వము. గుణము. అహోభ్యామ్, అహోభిః ఇత్యాదులు. అహః అహోభ్యామ్ ఇత్యాదులలో క్రమముగ రత్వరుత్వము లసిద్ధము లగుటవలన నలోపము ప్రాప్తమగుచున్నది గాని అహన్ అను సూత్రము నావృత్తిచేసి మొదటి సూత్రమున కహన్ శబ్దములోని నకారమునకు లోపము రాదని యర్థము చెప్పి రెండవ సూత్రముచే రుత్వమును విధించుటచే నిచట నలోపము రాదు. రత్వరుత్వములు పదాధికారములోనివగుటవలన "పదాఙ్గాధికారే తస్య చ, తదన్తస్య చ" అను పరిభాషచే, అహన్ శబ్దాన్తమందును ప్రవర్తించును. దీర్ఘాణ్యహాని యస్య అను విగ్రహమున దీర్ఘాహన్ శబ్దము పుంలిఙ్గమగును. దీర్ఘాహన్ + సు. "హల్ఙ్యాభ్యో" (253) సూ. చే, సులోపము. ప్రత్యయలక్షణ ముండుటవలన సుప్పరత్వ ముండుటచే అసుపి అను నిషేధముచే రోఽసుపి (173) సూ. వలన రత్వము ప్రవర్తించదు గాన అహన్ (446) సూ. చే, రుత్వమగును. ఇది యసిద్ధమగుటచే నకారాన్త ప్రయుక్తమగు సర్వనామస్థానే (251) సూ. చే, నుపధాదీర్ఘమగును. దీర్ఘాహార్, ఇచట భోభగో (168) సూ. చే, యత్వము, హలి సర్వేషాం సూ. చే, యలోపము. దీర్ఘాహా (నిదాఘః) అని సిద్ధమగును. సంబుద్ధియందు హేదీర్ఘాహః (నిదాఘ) అని సిద్ధమగును. ఇచట సుప్రత్యయము హల్ఙ్యాది సూత్రముచే లోపించుటచే, ప్రత్యయ లక్షణముచే అసంబుద్ధౌ అను నిషేధము ప్రవర్తించును గాన సర్వనామస్థానే సూ. చే, నుపధాదీర్ఘము ప్రవర్తింపదు. "అహన్" సూ. చే, రుత్వము మాత్రమగును. హేదీర్ఘాహన్ +

నిదాఘ వాశిచ (167) సూ. చే, నుత్వము, ఆద్గుణః (70) సూ. చే, గుణము, హేదీర్ఘాహో నిదాఘ, అని యగును. దీర్ఘాహోనా। దీర్ఘాహోనః। దీర్ఘాహో భ్యామ్ ఇత్యాదులు. దండిన్ శబ్దము, దండిన్ + సు. సులుక్కు నలోపము. దండి (దండముగల కులము) దండిన్ + ఔ. శీభావము. దండినీ, దండిన్ + జస్. శీభావము. ఇది సర్వనామస్థాన మగుటచే నుపధాదీర్ఘము. దండీని, దండినా ఇత్యాదులు. స్రగ్విన్ + సు. సులుక్కు. నలోపము, స్రగ్వి, (పుష్పమాలగల కులము) స్రగ్విణీ ఇత్యాదులు. వాగ్మిన్ + సు. సులుక్కు. నలోపము, వాగ్మి, (మంచి వాక్కులుగల కులము) వాగ్మినీ, ఇత్యాదులు. 'బహవో వృత్రహణః యస్య తత్' అను విగ్రహమున బహువృత్రహన్ + సు। సులుక్కు. నలోపము। బహువృత్రహ (అనేక దేవేంద్రులుగల మన్వన్తరము) బహువృత్రహన్ + శీ। విభాషాఙిశ్యోః (238) సూ. చే, వైకల్పికమగు నల్లోపము. బహువృత్రహ్న్ + ఈ, హోహన్తేః సూ. చే, కత్వము. బహు వృత్రఘ్నీ అల్లోపము రానపుడు బహువృత్రహణీ। బహువృత్రహన్ + శీ। శీ ప్రత్యయము సర్వనామస్థానమగుటచే ఇన్ హన్ (357) సూ. చే, నుపధా దీర్ఘము. ఏకాజుత్తరపదే ణః (308) సూ. చే, ణత్వము నగును. బహువృత్ర హాణి ఇత్యాదులు. బహుపూషన్, బహ్వర్యమన్ శబ్దములు నిట్లే, అస్పృజ్ శబ్దమునకు రక్తమని యర్థము. నసృజ్యతే, అను నర్థమున నఞ్ పూర్వక సృజ్ ధాతువునకు క్విన్ ప్రత్యయము, శరీరముతోపాటు పుట్టునదేకాని మధ్యకాల మందు దన్తాదులవలె సృజింపబడునది కాదని యాశయము. అస్పృజ్ + సు. సులుక్కు. ఇచట క్విన్ ప్రత్యయస్య కుః అను సూత్ర మసిద్ధమగుటచే "చోః కుః" (380) సూత్రముచే కుత్వము ప్రాప్తమగుచున్నది. వ్రశ్చేతి సూత్ర విహితమగు షత్వ మీ కుత్వమున కపవాదము గాన కుత్వమును బాధించి షత్వ మగును. పిదప క్విన్ ప్రత్యయస్య (379) సూ. చే, కుత్వము. జశ్త్వ చర్త్వ ములు. అస్పృక్. అస్పృగ్. ఈ శబ్దము క్విబన్తమైనను సృజధాతువుకంటె ఋత్విగ్ దధృక్ (375) సూ. చే, క్విన్ ప్రత్యయము విధింపబడుటచేతను క్విన్ ప్రత్యయస్య అను సూత్రమం దతద్గుణ సంవిజ్ఞాన బహువ్రీహి నాశ్రయిం చుటచేతను కుత్వ మిచట నిర్బాధము. "సృజిదృశోః" (6-1-58) సూత్ర మందలి రజ్జుసృడ్భ్యామ్, అను భాష్యప్రయోగమువలన అనవ్యయ పూర్వ పదములగు సృజాదులకు షత్వమనియు నవ్యయ పూర్వపదములగు సృజాదులకు కుత్వమనియును జ్ఞాపనము చేయుటవలన విశ్వసృజ్ మొదలగు శబ్దములందు కుత్వము ప్రవర్తించదు. అస్పృజ్ శబ్దమవ్యయపూర్వ పదకమగుటచే కుత్వము నిర్బాధము. పూర్వోక్త భాష్యప్రయోగము వలన విశ్వసృజ్ మొదలగు

ప్రయోగములలోని సృజ్ ధాతువునకు కుత్వము వారింపబడినను దేవాన్ యజతి మొదలగు విగ్రహములుగల దేవేట్ మొదలగు సాధు ప్రయోగములలోని యజ్ ధాతువునకు కుత్వము ప్రసక్తమగుచున్నదని "యద్వా" ఇత్యాది గ్రంథముచే పక్షాన్తరమును చెప్పుచున్నాడు. వ్రశ్చభ్రస్జ (295) సూత్రమందు సృజ యజ ధాతువులకు పూర్వోత్తర సాహచర్యముచే పదాన్తమందుగూడ విశేషించి షత్వమును విధించుటవలన షత్వము కుత్వబాధకమగును గాన నీ రెండు ధాతువులకు పదాన్తమందును కుత్వము వారింపబడును. ఇట్లు చెప్పుటలో కామ్యచ్చ (3-1-9) సూత్రములోని ఉపయట్ కామ్యతి, అను భాష్య ప్రయోగము ప్రమాణము. కావుననే దేవేట్ మొదలగు రూపములు నిర్బాధములు. "ఋత్విక్ దధృక్ (375) సూత్రమున స్రక్, ఋత్విక్, అను నిర్దేశములవలన నీ రెండు చోటులందు షత్వమపవాదము గాదని బోధింపబడును. కావున పదాన్తవిషయమున క్విన్ ప్రత్యయస్య (374) సూ. చే, కుత్వము ప్రవర్తించును. అసృక్ శబ్దము పూర్వము చెప్పినరీతిని సృజధాతువు సంబంధము గలదయితే పూర్వము చెప్పినరీతిని కుత్వము బాధింపబడును. కావున నది అస్ (క్షేపణే) ధాతు ప్రకృతిక ఋచ్ ప్రత్యయాన్తమనినచో చోః కుః (389) సూ. చే, కుత్వము సిద్ధించును. అసృక్, అసృగ్ (రక్తము), అసృజీ. అసృజ్ + శీ. (జస్) పద్దన్నోమాస్ అను సూత్రముచే వికల్పముగా అసన్ అను నాదేశమగును. అసన్ + ఇ. సర్వనామస్థానే చా సంబుద్ధౌ (251) సూ. చే, నుపధాదీర్ఘము. అసాని. ఆదేశాభావ పక్షమందు "నపుంసకస్య" (315) సూ. చే, నుమాగమము, అనుస్వార పరసవర్ణములు. అసృఞ్జి. అసృజ్ + టా. అసన్నాదేశము. అసన్ + ఆ. అల్లోపము. అస్నా। అసనభావ పక్షమందు అసృజా. అసభ్యామ్, అసృగ్భ్యా మిత్యాదులు. ఊర్జ్ శబ్దము. ఊర్జ్ + సు. సులుక్కు. కుత్వము. చర్త్వ వికల్పము. ఊర్క్, ఊర్గ్, ఊర్జీ. ఊర్జ్ + ఇ. ఝలన్తమగుటచే ప్రాప్తమయిన నుమాగమము మిత్తగుటచే నూకారముకంటె పరముగానగును. ఊన్ర్జి. ద్వితీయావిభక్తియు నిట్లే. ఊర్జా ఇత్యాదులు. బహూని ఊన్ర్జి యస్య తత్కులమ్ = బహూర్క్. బహూర్జ్ శబ్దము చాలవరకు ఊర్జ్ శబ్దము వంటిది. జస్ శస్సులలో మాత్రము విశేషమున్నది:—(వా) బహూ...ధః. (వా) అన్త్యాత్...నుమ్. బహూర్జ్ శబ్దమున నూకారమునకు పరముగా నుమ్ము రాదు. అన్త్యవర్ణమునకు పూర్వమయి వికల్పముగా నుమాగమమగును. బహూర్జ్ + శీ (జస్) బహూర్న్జ్ + ఇ. శ్చుత్వ మసిద్ధమగుటవలన ననుస్వార పరసవర్ణములు. బహూర్ఞ్జి. నుమభావ పక్షమందు, బహూర్జి. బహూర్గ్భి మిత్యాదులు. త్యద్, తద్, ఏతద్, ఈ

శబ్దములకు, స్వమ్ ప్రత్యయములు లుక్కుచే లోపించుటవలన ప్రత్యయలక్షణము లేకపోవుటచే విభక్తిపరత్వము సంభవింపదు. కాన త్యదాద్యత్వముగాని "తదోస్సస్సౌ" (383) సూ. చే, సత్వముగాని ప్రవర్తింపదు. చర్త్వవికల్పముమాత్ర మగును. త్యత్, త్యద్, యత్, యద్, ఏతత్, ఏతద్. మిగిలిన చోటుల త్యదాద్యత్వము ప్రవర్తించును గాన నదన్త నపుంసకలింగ శబ్దమునకు వలె ప్రక్రియ నూహింపదగును. త్యే, త్యాని ఇత్యాదులు. అన్వాదేశమందు మాత్రము ఏనదాదేశము ప్రవర్తించును. ఏనత్ ఇత్యాదులు. భిదిర్ ధాతు ప్రకృతిక యఙన్తమయిన బేభిద్య అను ధాతువుకంటె క్విప్ ప్రత్యయము చేసిన బేభిద్ అను ప్రాతిపదికము సిద్ధమగును. బేభిద్ + సు. సులుక్కు. వైకల్పిక చర్త్వము. బేభిత్, బేభిద్ (తరచుగా భేదించు కులము) బేభిద్ + ఔ. శీభావము. బేభిదీ. బేభిద్ + శీ. (జస్) బేభిది. ఇచట నుమాగమము రాక పోవుటకు కారణమును చెప్పుచున్నాడు. బేభిద్య అను యఙన్తమునకు క్విప్పు పరమగునపుడు ప్రవృత్తమయిన నకారలోపమునకు స్థానివద్భావమువలన నఙ్గము ఝలన్తముగాదు. కాన నుమాగమము ప్రవర్తించదు. మఱియు పరనిమిత్తక మగు నజాదేశము స్థానిభూతమగు నచ్చునకు పూర్వమయినదానికి కార్యము చేయునపుడు స్థానివద్భావము నొందును గాని స్థానిభూతమగు నచ్చునకు కార్యము చేయునపుడు స్థానివద్భావము నొందదు. కావున నిచట నఙ్గ మజన్తము గాదు. కనుక నజన్త నిమిత్తకమగు నుమాగమముగూడ నిచట ప్రవర్తింపదు. బేభిది. (బ్రాహ్మణ కులములు) అనియే యగును. చేచ్ఛిద్ శబ్దము బేభిద్ శబ్దసదృశము. చేచ్ఛిదీ, చేచ్ఛిది ఇత్యాదులు. శ్లో॥ గవాక్ శబ్దస్య...విభాషయా. ఒకానొక రాజసభయందొక కుప్రక్రియాతార్కికుడు పండితుల నీ క్రింది విధముగ ప్రశ్నించెను:—

శ్లో॥ జాయన్తే నవ సౌ తథామిచ నవ భ్యాం భిస్ భ్యసాం సంగమే షట్ సంఖ్యాని నవైవ సుప్యథ జసి త్రీణ్యేవ తద్వచ్ఛసి। చత్వార్యన్యవచఃసు కస్య విబుధాః శబ్దస్య రూపాణి తజ్జానన్తు ప్రతిభాస్తి చేన్నిగదితుం షాణ్మాసికో త్రావధిః ॥

అర్థము. ఏ శబ్దమునకు సుప్రత్యయమునందు తొమ్మిది, ఇట్లే అమ్ ప్రత్యయమునందు తొమ్మిది, భ్యామ్ భిస్ భ్యస్సులలో ప్రత్యేకము నారు, సప్తమీ బహువచనమునందు తొమ్మిది, జశ్శస్సులందు ప్రత్యేకము మూడు, మిగిలిన వచనములందు ప్రత్యేకము నాలుగును, రూపములగునో ఆ శబ్దమును పండితులుంటే చెప్పుడు. ఆరుమాసముల కాలము చెప్పుటకవకాశ మీయబడెను.

అని. అపుడు ప్రశ్నానుసారముగ మఱియొక ప్రాచీన వైయాకరణుడు గవాక్ శబ్దమున కట్టిరూపములగునని "గవాక్......విభావయ" అను శ్లోకద్వయముచే సమాధానము చెప్పెనని దీక్షితునిచే వ్రాయబడెను. శ్లోకద్వయమున కర్థము:—గవాక్ శబ్దమునకు నపుంసక లిఙ్గమందు పూజ, గమనము, అను నర్థభేదము వలనను ప్రకృతి భావము, అవఙాదేశము, పూర్వరూపము, వీని వలనను నూటతొమ్మిది రూపములగును. సు, అమ్, సుప్ వీనియందు తొమ్మిది, భిస్సాదులగు నారు ప్రత్యయములలో నారు, జశ్శస్సులందు మూడు, శేషించిన పది ప్రత్యయములందు పదియును రూపములగును. పైని చెప్పబడిన సంఖ్య ప్రత్యేకముగ నన్వయించునని గ్రహించునది. శ్లోకములచే ప్రతిపాదింపబడిన నర్థమునే యుదాహరణములజూపి యుదాహరించుచున్నాడు. గామఞ్చతి, అను విగ్రహమున గోశబ్దపూర్వకమగు అఞ్చు ధాతువునకు "ఋత్విక్ దధృక్" సూత్రముచే క్విన్ ప్రత్యయము. అఞ్చు ధాతువునకు గతి, పూజ అను నర్థములు చెప్పబడినవి. గత్యర్థమందు నకారము లోపించును. (అనిదితాం...) సూ. చే, గోఅచ్ + సు. సులుక్కు, అవఙ్ స్ఫోటాయనస్య (389) సూ. చే, వైకల్పికమగు నవఙాదేశము. గవాచ్. కుత్వ జశ్త్వ చర్త్వములు. గవాక్ గవాగ్. పక్షమందు, సర్వత్ర విభాషా గోః (88) సూ. చే, ప్రకృతిభావము. జశ్త్వ, చర్త్వములు. గోఅక్, గోఅగ్. ప్రకృతి భావము రానిపక్షమునందు ఏఙః పదాన్తాదతి (87) సూ. చే, పూర్వరూపము. గోక్, గోగ్. పూజార్థమందు, నాఞ్చేః పూజాయామ్. (427) సూ. చే, నఞ్చు ధాతువుకొని నకారము లోపించదు. సంయోగాన్త లోపముచే చకారము లోపించును. నకారమునకు, క్విన్ ప్రత్యయస్య కుః, (379) సూ. చే, కుత్వమగును. ఆ స్వర తమ్యమువలన ఙకారమగును. అవఙ్ ప్రకృతి భావ పూర్వ రూపములచే, గవాఙ్, గోఅఙ్, గోఙ్, అను రూపములగును. ద్వితీయైక వచనమునందు నీ తొమ్మిది యగును. గోఅచ్ + ఔ. శీభావము. భసంజ్ఞ వలన అచః (409) సూ. చే, నకారలోపము. గోచీ. పూజార్థమందు నలోపము రానందున నవఙా దులచే, గవాంచీ, గోఅంచీ, గోంచీ, అను రూపములగును. గోఅచ్ + శి. సర్వనామస్థానము పరమగుటచే నపుంసకస్య ఝలచః (315) సూ. చే, నుమా గమము. అవఙాదులచే రూపత్రయమగును. పూజార్థమందు నిట్టి రూపములు మూడగును. ద్వితీయా బహువచనమునందు నిట్టి రూపములు మూడే యగును. గోఅచ్ + టా. అకారలోపము. గోచా. పూజార్థమందు అవఙాదులచే గవాఞ్చా, గోఅఞ్చా, గోఞ్చా, అను రూపములగును. శేషించిన యట్టి ప్రత్యయములందు నిట్లే నాలుగు చొప్పున రూపములగును. గోఅచ్ + భ్యామ్,

అవజాదులచే గవాగ్భ్యామ్, గోఅగ్భ్యామ్, గోగ్భ్యామ్, అను రూపము లగును. పూజార్థమందు నవజాదులచే, గవాఙ్ భ్యామ్, గోఅఙ్ భ్యామ్, గోఙ్ భ్యామ్, అను రూపములగును. భకారాది సుప్పులు పరమగునపు డిట్లే యూ రేని రూపములగును. సప్తమీ బహువచనమున పూజార్థమం దవజాదులచే గవాఙ్షు మొదలగు మూడు రూపములగును. వీనిలో "ఙ్ణోః" కుక్ టుక్ శరి (131) సూ. చే, వైకల్పికమగు కుగాగమము వచ్చును. గవాఙ్క్షు, గోఅఙ్క్షు, గోఙ్క్షు మొత్త మారురూపములగును. గత్యర్థమందు గవాక్షు, గోఅక్షు, గోక్షు, అను మూడు రూపములగును. కలసి తొమ్మిది రూపములగును. ఇచట చకారమునకు కుత్వ జశ్త్వ చర్త్వములు ప్రవర్తించును. ఇచట చయో ద్వితీయాశ్శరి అను శాస్త్రదృష్టిచే చర్త్వ మసిద్ధమగుటవలన గకారముండుటచే ద్వితీయ వర్ణాదేశము రాదు. కావున నిచట వైకల్పిక ఖకారాదేశమువలన నాఱు రూపము లధికమగును. శంక కవకాశము లేదు. కుగాగమ పక్షమందు కుగాగమ మసిద్ధమగుటచే జశ్త్వము రానందున ద్వితీయ వర్ణాదేశము నిరాటంక ముగ ప్రవర్తించును. ఇందువలన మూడు రూపములుమాత్ర మధికమగును. కావున నూటతొమ్మిదిగాక నూటపది రెండు రూపములగును. శ్లో॥ ఊహ్యా మేషాం...మనీషిభిః॥ ఈ నూటపది రెండు రూపములకు ద్విత్వానునాసికముల వికల్పమువలన నయిదువందల యిరువదియేడు రూపములగునని పండితులచే యూహింపదగునని యర్థము. శ్లోకమున నశ్వశబ్దము యేడవ సంఖ్యకు, అక్షి శబ్దము రెండవ సంఖ్యకు, భూతశబ్ద మయిదవ సంఖ్యకును బోధకమగును. "అఙ్కానాం వామతో గతిః" అను జ్యోతిశ్శాస్త్ర సంప్రదాయానుసారము లెక్కించినచో ప్రదర్శిత సంఖ్య లభించును.

తిర్యక్, తిర్యగ్. (అడ్డముగ నడచునది) తిరః, అఞ్చతి, అను విగ్రహ మున తిరశ్శబ్ద పూర్వకమగు నఞ్చు ధాతువుకంటె ఋత్విక్ దధృక్ (375) సూ. చే, క్విన్ ప్రత్యయము. అఞ్చు ధాతువు గమనార్థకమగుటచే "అనిది తామ్...(418) సూ. చే, నలోపమగును. తిరస్ అచ్, సుప్రత్యయమునకు లుక్కు. తిరశ్శబ్దమునకు తిరి అను నాదేశమగును. యణాదేశము. చోః కుః (880) సూ. చే, కుత్వము. జశ్త్వ, చర్త్వములు. తిరస్ + అచ్ + ఔ. శీభావము. భసంజ్ఞ యుండుటచే అచః అను సూత్రముచే నకార లోపము. కావుననే తిర్యాదేశము రాదు. శ్చుత్వము. తిరశ్చి అని యగును. తిర్యఞ్చౌ. తిరస్ + అచ్ + జస్. శీభావము. సర్వనామస్థాన మగుటచే నుమాగమము. అనుస్వార పరసవర్ణములు. ఇచట భసంజ్ఞ లేనందున నకారలోపము రాదు. కావున తిర్యాదేశమగును, యణాదేశము. తిర్యఞ్ = తిరస్ + అఞ్చు + సు,

అడ్డముగ పూజించునది. ఇచట నఞ్చ్ ధాతువు పూజార్థకమగుటచే నకారము లోపించదు గాన అకారము లోపించదు తిర్యాదేశమగును. ∴ చకారమునకు సంయోగాన్తలోపము. నకారమునకు క్విన్ ప్రత్యయస్య సూ. చే, కుత్వము. తిర్యఙ్చ్ = తిరస్ + అఞ్చ్ + ఔ. శీభావము. తిర్యాదేశము. తిర్యఞ్చి. శీభావము, తిర్యాదేశము. శేషము పుంలిఙ్గమునందువలె నూహింపదగును. తకారాన్తములు. యకృత్ శబ్దము. యకృత్ + సు. సులుక్కు. యకృతీ (యకృత్ + ఔ.) శీభావము యకృత్ + శస్. శీభావము. పద్దన్నోమాస్ (229) సూ. చే, వికల్పముగా యకన్నాదేశము. యకన్నాదేశ పక్షమందు యకన్ + ఇ. అని యుండగా సర్వనామస్థానసంజ్ఞ యుండుటచే నుపధాదీర్ఘము యకాని అని యగును. పక్షమందు నపుంసకస్య (315) సూ. చే, నుమాగమము. యకృన్తి. ద్వితీయావిభక్తియు నిట్లే. యకృత్ + టా. యకన్నాదేశ పక్షమందు యకన్ + టా అని యుండగా అల్లోపోనః (235) సూ. చే, నకారలోపము యక్నా అని యగును. పక్షమందు యకృతా, యకృద్భ్యామిత్యాదులు. శకృత్ శబ్దమునకు యకృత్ శబ్దమునకువలెనే శక్నా శకృతా ఇత్యాదులగును. దదత్ శబ్దము. దదత్ + సు. సులుక్కు. దదత్. దదత్ + ఔ. శీభావము. దదతీ. దదత్ + శీ అని యుండ :—

* 447. వా నపుంసకస్య 7-1-79 వా, నపుంసకస్య (అభ్యస్తాత్, శతుః, నుమ్, సర్వనామస్థానే)

అభ్యస్తాత్పరో యః శతా తదన్తస్య క్లీబస్య నుమ్వా స్యాత్సర్వనామస్థానే పరే। దదన్తి। దదతి। తుదత్ ॥

447. ఆఱవ యధ్యాయమున విధింపబడు ద్విత్వనిష్పన్నములగు రెండు భాగములకు నభ్యస్తమను సంజ్ఞయని యిదివరకు చెప్పబడినది. అట్టి యభ్యస్తముకంటె పరమగు శతృ ప్రత్యయాన్తమునకు నపుంసకమగుచో సర్వనామస్థానము పరమగునపుడు నుమాగమము వికల్పముగానగును. దదత్ అనునది దాఞ్ ధాతువునకు శతృ ప్రత్యయము చేసినపుడు ధాతువునకు ద్విత్వముచే నేర్పడినరూపము గాన దీనికభ్యస్తసంజ్ఞ యుండును. కావున నిచట శతృ ప్రత్యయము (అత్) అభ్యస్తముకంటె పరముగా నుండుటచే నుమాగమము వికల్పము గావచ్చును. దదన్తి. నుమాగమాభావ పక్షమందు దదతి అని యగును. ద్వితీయా విభక్తియు నిట్లే. శేషము పుంలిఙ్గ దదత్ శబ్దసదృశము, తుదత్ శబ్దము. తుదత్ + సు. సులుక్కు. తుదత్ ॥

* 448. ఆచ్ఛీనద్యోర్నుమ్ 7-1-80 ఆత్। శీనద్యోః। నుమ్. (వా, శతు)

అవర్ణాన్తాదఙ్గాత్పరో యః శతురవయవస్తదన్తస్యాఙ్గస్య నుమ్ వా స్యాచ్ఛీనద్యోః పరతః తుదన్తీ। తుదతీ। తుదన్తి। భాత్। భాన్తీ। భాతీ। భాన్తి। పచత్॥

448. ఈకారోకారములకు నదీసంజ్ఞ యనువృత్తి మిచట ననుసరింపబడెను. అధికృతమగు నఙ్గస్య అనునది ఆత్ అనుదానికి విశేషణమగుటచే పఞ్చమ్యన్తముగ మారును. తదన్తవిధి. ఆకార మన్తమందుగల నఙ్గముకంటె పరమగు శతృ ప్రత్యయావయవ మన్తమందు గల్గిన యఙ్గమునకు, శీభావము నదీసంజ్ఞకములగు నీకారోకారములు పరమగునపుడు నుమాగమము వికల్పముగ నగునని సూత్రార్థము. తుదత్ + శీ. తుదన్తీ. నుమాగమము రానపుడు తుదతీ. తుదత్ + శి. నపుంసకస్య (315) సూ. చే, నుమాగమము. తుదన్తి ఇత్యాదు లూహ్యంబులు. భాత్. భాత్ + శీ. ఇచట నీ సూత్రముచే వికల్ప నుమాగమమగును. భాన్తీ. భాతీ. భాత్ + శి. భాన్తి. తుదన్తీ (బ్రాహ్మణీ) అనునది నది పరమగునపుడు నుమాగమోదాహరణము. పచత్. పచ ధాతు ప్రకృతిక శతృ ప్రత్యయాన్తము. పచత్ + సు. సుప్రత్యయమునకు లుక్కు. పచత్. పచత్ + శీ. ఇట్లుండ:—

* 449. శప్శ్యనోర్నిత్యమ్ 7-1-81 శప్శ్యనోః. నిత్యమ్, (ఆత్, శతుః, శీనద్యోః, నుమ్)

శప్శ్యనోరాత్పరో యశ్శతురవయవస్తదన్తస్య నిత్యం నుమ్ స్యాచ్ఛీనద్యోః పరతః। పచన్తీ। పచన్తి। దీవ్యత్। దీవ్యన్తీ। దీవ్యన్తి। స్వప్। స్వబ్। నిత్యాత్పరాదపి నుమః ప్రాక్ అప్తృన్నితి దీర్ఘః। ప్రతిపదోక్తత్వాత్। స్వాम्पि। నిరవకాశత్వం ప్రతిపదోక్తత్వమితి పక్షేతు ప్రకృతే తద్విరహాన్నుమేవ। స్వమ్పి। స్వపా। అపోభి। స్వద్భ్యామ్। స్వద్భిః। అన్త్రిప్రృవపీత్యాదినా ధనేరుస్। రుత్వమ్। ధనుః। ధనుషీ। సాన్తేతి దీర్ఘః। నుమ్ విసర్జనీయేతి షత్వమ్। ధనూంషి। ధనుషా। ధనుర్భ్యామ్। ఏవం చక్షుర్హవిరాదయః। పిపఠిషతేః క్విప్। ర్వోరితిదీర్ఘః। పిపఠీః। పిపఠిషీ। అల్లోపస్య స్థానివత్త్వాజ్ఝలన్తలక్షణో నుమ్

న। స్వవిధౌ స్థానివత్త్వాభావా దజన్తలక్షణోఽపి నుమ్
న। పిపఠిషి। పిపఠీర్భ్యామిత్యాది। పయః। పయసీ।
పయాంసి। పయసా। పయోభ్యామిత్యాది। సుపుమ్।
సుపుంసీ। సుపుమాంసి। అదః। విభక్తికార్యమ్। ఉత్వ
మత్వే। అమూ। అమూని। శేషం పుంవత్।

**449.** శ్యప్ శ్యన్ (భ్వాదులకు దివాదులకు క్రమముగ నివి వికరణ ప్రత్యయములు) వీనియొక్క అకారముకంటె పరమగు శతృప్రత్యయావయవమన్తమందుగల యఙ్గమునకు, శీభావమును, నదీసంజ్ఞకమును పరమగునపుడు నుమాగమము నిత్యముగనగును. పచత్ + శీ. పచధాతు వుభ్వాదిగణము లోనిది. దీనికి శతృప్రత్యయము చేయునపుడు ధాతువునకు ప్రత్యయమునకును మధ్య వికరణమగు శప్ ప్రత్యయమగును. (అ) పచత్ అని యగును. ఇచట శతృ ప్రత్యయావయవ తకారము శప్ ప్రత్యయముయొక్క అకారముకంటె పరమగుటచే నిది యన్తమందుగల యఙ్గము పచత్ అనునది యగును. శీభావము పరమగుటచే నిచట నుమాగమమగును. పచన్తీ. పచన్తి, (పచత్ + శి) నపుంసకస్య సూ. చే, నుమాగమము. దీవ్యత్. దివ్ ధాతువునకు శతృ ప్రత్యయాన్తము. ధాతువునకును శతృ ప్రత్యయమునకును మధ్యను శ్యన్ (య) ప్రత్యయమగును. పిదప పచన్తీ అను చోటునందువలె నుమాగమాదు లూహింపదగును. పచన్తీ, దీవ్యన్తీ (బ్రాహ్మణీ) ఇవి నది పరమగునపుడు నుమాగమోదాహరణములు. ఇవి జీబన్తములగుటవలన శతృ ప్రత్యయావయవమగు తకారమునకు నదీపరత్వము గలదు. స్వప్ శబ్దము (శోభనా ఆపః యస్మిన్ సరసి) స్వప్ + సు. లుక్కు. స్వప్. స్వప్ + శి. ఇచట నిత్యము పరమునగు నుమాగమమును బాధించి ప్రతిపదోక్తమగు "అప్ తృన్ తృచ్" సూత్ర విహితమగు దీర్ఘము మొదట ప్రవర్తించును. పిదప నుమాగమము. స్వాంపి అని యగును. ప్రతిపదోక్తమగు కార్యము నిరవకాశమగునపుడే యితరములను బాధించునను మతమున "అప్తృన్" సూ. చే, విహితమగు దీర్ఘము, ఆపః, అను రూపమందు చరితార్థమయినది గావున స్వప్ + శి, అనుచోట దీర్ఘమును బాధించి నిత్యమగు నుమాగమమే ప్రథమమున ప్రవర్తించును. పిదప దీర్ఘమునకు ప్రసక్తి లేనందున స్వంపి అనియే రూపమగును. స్వపా (స్వప్ + ఆ) స్వప్ + భ్యామ్, అపోభి సూ. చే, పకారమునకు దకారాదేశమగును. స్వద్భ్యామ్. ఇట్లే స్వద్భిః ఇత్యాదులు. ధనుశ్శబ్దము. ధనధాతువుకంటె "అర్తి పృవపి యజితని ధని తపిభ్యోనిత్, అను ఔణాదిక సూత్రముచే ఉస్ ప్రత్యయము వచ్చుటవలన ధనుస్ అను శబ్దము సిద్ధమగును. ధనుస్ + సు. సులుక్కు. సకారమునకు రుత్వ విసర్గములు. ధనుః. ధనుస్ + ఔ. ప్రత్యయమునకు శీభావము. సకారమునకు ఆదేశప్రత్యయయోః (213) సూ. చే, షత్వము. ధనుషీ. ధనుస్ + శి. ఝలన్త లక్షణ నుమాగమము. సాన్తమహతః (318)

సూ. చే, దీర్ఘము. సున్విసర్జనీయ (437) సూ. చే, షత్వము. ధనూంషి, అని యగును. ధనుర్భ్యామ్. ఇచట రేఫాన్తము ధాతువు గానందున ర్వోరుప ధాయాః (436) సూ. చే, దీర్ఘము శజ్కింప వలనుపడదు. ఇట్లే, చక్షుస్, హవిస్, సర్పిస్, మొదలగు సకారాన్తములకు ప్రక్రియ నూహించునది. పిపఠిస్ శబ్దము సన్ ప్రత్యయాన్తమగు పఠధాతువు (పిపఠిష్) కంటె క్విప్పు. కృదన్తమగుటవలన ప్రాతిపదికమగును. సులుక్కు. రుత్వము. ఉపధాదీర్ఘము. పిపఠీః. పిపఠిషా, సన్ ప్రత్యయములోని అకారమునకు క్విప్పు పరమగునపుడు లోపము విధింపబడెను. ఆ లోపమునకు స్థానివద్భావమువలన నిచట ఝలన్త నిమిత్తక నుమాగమము ప్రవర్తించదు. లోపస్థానికి కార్యము చేయుచున్నపుడు స్థానివద్భావము విహితము గానందున నజన్తలక్షణ నుమాగమమును రాదు. పిపఠిషి, అనియే యగును. పిపఠీర్భ్యామ్. ఇచట "ర్వోరుపధాయాః" సూ. చే, దీర్ఘమగును. పయశ్శబ్దము. పయః. పయాంసి. నుమాగమము. దీర్ఘము. సుపుంశ్శబ్దము (శోభనాః పుమాంసో యత్ర కులే) సుపుంస్ + సు. సులుక్కు. సంయోగాన్త లోపము. సుపుమ్, సుపుంసీ. సుపుంస్ + శి, పుంసోఽసుజ్ (439) సూ. చే, అసుజాదేశము "సాన్తమహతః" సూ. చే, దీర్ఘము. సుపుమాంసి, అని యగును. సుపుంసా. సుపుమ్భ్యామ్. ఇత్యాది రూపముల నూహించునది. అదశ్శబ్దము. అదస్ + స్, విభక్తి లుక్కు. రుత్వ విసర్గములు. అదః. అదస్ + శీ. త్యదాద్యత్వ గుణములు (అదే) మత్వోత్వములు. అమూ. అదస్ + శి. త్యదాద్యత్వము. నుమాగమము. ఉపధాదీర్ఘము. అదాని. పిదప మూత్వము. అమూని. ద్వితీయావిభక్తియు నిట్లే. తృతీయా విభక్త్యన్తము లందు ప్రక్రియను పుంలిఙ్గమందువలె నూహింపదగును.

హలన్త నపుంసకలిఙ్గ ప్రకరణము సమాప్తి నొందెను.

---

## 13. అవ్యయ ప్రకరణము

* 450. స్వరాదినిపాత మవ్యయమ్. 1-1-37. స్వరాది నిపాతమ్, అవ్యయమ్.

స్వరాదయో నిపాతాశ్చాఽవ్యయసంజ్ఞాః స్యుః। స్వర్। అన్తర్। ప్రాతర్। పునర్। సనుతర్। ఉచ్చైస్। నీచైస్। శనైస్। ఋధక్। ఋతే। యుగపత్। ఆరాత్। పృథక్। హ్యస్। శ్వస్। దివా। రాత్రౌ। సాయమ్। చిరమ్। మనాక్। ఈషత్। జోషమ్। తూష్ణీమ్। బహిస్। అవస్। సమయా। నికషా। స్వయమ్। వృథా। నక్తమ్। నఞ్। హేతౌ। ఇద్ధా। అద్ధా।

సామి। వత్ "బ్రాహ్మణవత్। క్షత్రియవత్" సనా।
సనాత్। సనత్। ఉపధా। తిరస్। అన్తరా। అన్త
రేణ। జ్యోక్। కమ్। శమ్। సహసా। వినా। నానా।
స్వస్తి। స్వధా। అలమ్। వషట్। శ్రౌషట్। వౌ
షట్। అన్యత్। అస్తి। ఉపాంశు। క్షమా। విహాయ
సా। దోషా। మృషా। మిథ్యా। ముధా। పురా।
మిథస్। మిథో। ప్రాయస్। ముహుస్। ప్రవాహు
కమ్। ప్రవాహికా। ఆర్యహలమ్। అభీక్ష్ణమ్। సాకమ్।
సార్ధమ్। నమస్। హిరుక్। ధిక్। అమ్। ఆమ్। ప్ర
తామ్। ప్రశాన్। ప్రతాన్। మా। మాఙ్। ఆకృతి
గణోఽయమ్। చ। వా। హ। అహ। ఏవ। ఏవమ్।
నూనమ్। శశ్వత్। యుగపత్। భూయస్। కూపత్।
సూపత్। కువిత్। నేత్। చేత్। చణ్। కచ్చిత్।
కించిత్। యత్ర। నహ। హన్త। మాకిః। మాకీమ్।
నకిః। ఆకిమ్। మాఙ్। నఞ్। యావత్। తావత్।
త్వై। ద్వై। న్వై। రై। శ్రౌషట్। వౌషట్। స్వాహా।
స్వధా। తుమ్। తథాహి। ఖలు। కిల। అథో। అథ।
సుష్ఠు। స్మ। ఆదహ. ఉపసర్గవిభక్తిస్వరప్రతిరూపకాశ్చ,
అవదత్తమ్। అహంయుః। అస్తిక్షీరా। అ, ఆ, ఇ,
ఈ, ఉ, ఊ, ఏ, ఐ, ఓ, ఔ, పశు, శుకమ్, యథా
కథాచ। పాట్। ప్యాట్। అఙ్గ। హే। హై। భోః।
అయే। ఘ। విషు। ఏకపదే। యుత్। ఆతః। చాదిర
ప్యాకృతిగణః॥

450. స్వరాది నిపాతమ్మనునది, సమాహార ద్వన్ద్వము. (స్వరాదయశ్చ, నిపాతాశ్చ) స్వరాదిగణ పఠితములు, నిపాతములు, నవ్యయసంజ్ఞ గలవగును. స్వర్, అన్తర్, మొదలగునవి "స్వరాగతః" ఇత్యాది ప్రయోగములలోని, స్వరాదుల కనుకరణములు. వత్. తేన తుల్యమ్ క్రియాచేద్వతిః (5-1-115) తత్రతస్యేవ (5-1-116) తదర్హమ్. (5-1-117) సూత్రములచే విహితమగు వతి ప్రత్యయము. స్వరాదిగణ మాకృతి గణమనగా గణమున చూపబడిన శబ్దములతో సదృశములగు మఱికొన్ని శబ్దముల నిందు జేర్పదగునని యర్థము. కావున కామమ్, ప్రకామమ్, భూయస్ ఇత్యాదుల కవ్యయసంజ్ఞ సిద్ధమగును. "ఉపసర్గ విభక్తిస్వర ప్రతిరూపాశ్చ". ఉపసర్గములు, (ప్రాదులు) విభక్తి

న్తములు, (సుబన్తములు తిఙన్తములు) స్వరములు, (అచ్చులు) వీనితో సదృశమగునవి యవ్యయములగును. ఉపసర్గ సాదృశ్యము, విభక్తి సాదృశ్యము, శబ్దార్థములచే గ్రహింపదగును. స్వర సాదృశ్యము శబ్దముతోనే గాని యర్థముచే సంభవింపదు. ఉపసర్గ ప్రతిరూప కావ్యయము:—అవదత్తమ్, అవ అనునది యుపసర్గ సదృశముగాని యుపసర్గము గాదు. కావున దత్తమనుచోట దాఞ్ ధాతువునకు "అచ ఉపసర్గాత్తః (7-4-47) సూత్ర విహితమగు తాదేశము రాదు. విభక్తి ప్రతిరూపకము:—అహంయుః. అహం అనునది యస్మచ్ఛబ్ద ప్రథమైకవచన సదృశము. కావున అహం శుభమోర్యుస్ (5-2-140) సూత్ర విహితమగు యుస్ ప్రత్యయమువలన నహంయుః, అను రూపమేర్పడును. అహమ్మనునది యస్మచ్ఛబ్ద ప్రథమైకవచనమనిన యుసన్తము, తద్ధితాన్తమగును గాన ప్రాతిపదికమగును. అస్మచ్ఛబ్దముకంటె పరమగు సుప్పునకు లుక్కు వచ్చెడిని. అస్మచ్ఛబ్దమునకు, మదీయః అను శబ్దమునవలె మదాదేశమగును. మద్యుః, అనెడి యనిష్టరూపము గావలసివచ్చును. తిఙన్త ప్రతిరూపకము:— అస్తిక్షీరా। అస్తి అనునది యవ్యయము గనుకనే 'అస్తి క్షీరాణియస్యామ్' (అధికమగు పాలుగలది) అను నర్థముగల బహువ్రీహి యుపపన్నమగును. తిఙన్తమే యనినచో తిఙన్తమునకు సమాసము విహితము గానందున సమాసముపపన్నము గాకపోవును. అ. ఆ. ఇత్యాదులు స్వరప్రతిరూప కావ్యయములు. ఇవి సంబోధన స్మరణాద్యర్థకములు. చాదిగణము నాకృతిగణమే. కావున హేత్వాద్యర్థకములగు యత్. తత్. ఇత్యాదులను చాదులందు చేర్పదగును.

*** 451.** తద్ధితశ్చాసర్వవిభక్తిః. 1-1-38. తద్ధితః। చ। అసర్వవిభక్తిః (అవ్యయమ్)

యస్మాత్సర్వా విభక్తిర్నోత్పద్యతే, స తద్ధితాన్తోఽవ్యయం స్యాత్। పరిగణనం కర్తవ్యమ్। తసిలాదయః ప్రాక్ పాశపః। శస్ప్రభృతయః ప్రాక్ సమాసాన్తేభ్యః। అమ్। ఆమ్। కృత్వోర్థాః। తసివతీ। నానాఞావితి। తేనేహన। పచతికల్పమ్। పచతిరూపమ్॥

**451.** అసర్వవిభక్తిః అనునది బహువ్రీహి. (న సర్వా విభక్తిర్యస్మాత్) కేవల తద్ధితముకంటె విభక్తి యసంభవమగుటచే, తద్ధిత పదము తదన్తమును బోధించును. తద్ధితాన్త మన్యపదార్థము. సర్వశబ్దమునకు సర్వావయవములని యర్థము. సర్వావయవములుగల విభక్తి (మూడు వచనములుగల విభక్తి) యేతద్ధితాన్తముకంటె నుత్పన్నము గాదో, (ఏకవచనము మాత్రముత్పన్నమగునో) అట్టి తద్ధితాన్త మవ్యయమగునని సూత్రార్థము, పఞ్చతి

కల్పప్, మొదలగు తద్ధితాన్తముల కవ్యయసంజ్ఞ యనిష్టము. వానికంటె నేక వచనము మాత్ర ముత్పన్నమగుటవలన నవియు నసర్వ విభక్తులగును. వాని కవ్యయసంజ్ఞను వారించుటకై తద్ధితములను పరిగణనము చేయుచున్నాడు. (1) పాశప్ ప్రత్యయమునకు పూర్వమువఱకునున్న తసిలాదులు (థముఞ్, అన్తమందు గలవి) "పంచమ్యాస్తసిల్" (5-3-7) సూ. చే, విహిత మయినది, తసిల్ ప్రత్యయము. (సర్వతః) యాప్యే పాశప్ (5-3-47) సూత్ర విహితమయినది, పాశప్ ప్రత్యయము. (ఘృతపాశమ్) (2) సమా సాన్త ప్రత్యయములకు పూర్వమువఱకునున్న శస్ మొదలగు ప్రత్యయములు, డాబన్తములు బహ్వల్పార్థాచ్ఛస్...మ్ (5-4-42) సూత్రవిహిత మయినది శస్ ప్రత్యయము. (అల్పశః) (3) అమ్। అముచ ఛందసి (5-4-42) సూత్ర విహితము. (ప్రతరమ్) (4) ఆమ్। కిమేత్తిఙ్ । (5-4-11) సూత్రవిహితము. (పచతితరామ్) (5) కృత్వ సుచ్ ప్రత్యయార్థకములు. సంఖ్యాయాః...ణనే కృత్వసుచ్, (5-4-17) సూత్ర విహితమైనది కృత్వసుచ్ ప్రత్యయము (పఞ్చ కృత్వః) కృత్వోర్థములు మూడు. (6) తసి ప్రత్యయము. తసిశ్చ (4 3-113) సూత్ర విహితము. (పీలుమూలతః) (7) వతిప్రత్యయము. తేన తుల్యమ్... సూత్రవిహితము (బ్రాహ్మణవత్) ఇట్లుండ స్వరాదులందు వత్ అనుదాని యొక్క పాఠమునకు ఫలము చిన్త్యము. (8) నానాఞ్ ప్రత్యయములు, వినఞ్ భ్యామ్, (5-2-27) సూత్ర విహితములు. (వినా, నానా) పచతి కల్పమ్। పచతిరూపమ్ అనువాని కవ్యయసంజ్ఞా నివృత్తి, పరిగణనమునకు ఫలము. అవ్యయసంజ్ఞ యున్నచో అవ్యయా (455) సూ. చే, సుప్పులకు లుక్కు వచ్చెడిని.

* 452. కృన్మేజన్తః 1-1-35. కృత్, మేజన్తః।

కృద్యో మాన్త ఏజన్తశ్చ తదన్త మవ్యయం
స్యాత్ । స్మారంస్మారమ్ । జీవసే । పిబధ్యై ॥

452. కృత్పదము తదన్తమును బోధించును. మేజన్తః అనుచోట మకారైజ్ పదములతో నన్తపదార్థము ప్రత్యేక మన్వయించును. మకారైచ్ పదములకు ద్వంద్వము. పిదప నన్తపదములో బహువ్రీహివలన మేజన్తః అని యగును. సూత్రమున శ్రుతమగునది కృత్ ప్రత్యయమగుటచే, మేజన్తః అనునది కృత్తునకే విశేషణముగాని, తదన్తమునకు గాదు. మకారాన్తముగాని ఏజన్తము గాని యగు కృత్ప్రత్యయ మన్తమందుగలది యవ్యయమగునని యర్థము. మాన్త మున కుదాహరణము స్మారమ్స్మారమ్। స్మృ ధాతుప్రకృతి కణముల్ ప్రత్య యాన్తము. ఏజన్తములం దేకారాన్తమున కుదాహరణము. జీవసే। జీవధాతు ప్రకృతికమగు సే ప్రత్యయమన్తమందు గలది. ఐకారాన్తమున కుదాహరణము పిబధ్యై। పా ధాతుప్రకృతిక ధ్యై ప్రత్యయాన్తము.

* 453. క్త్వాతోసున్ కసునః. 1-1-40.

ఏతదన్త మవ్యయం స్యాత్। కృత్వా। ఉదేతోః। విసృపః॥

453. సూత్రమున క్త్వా, తోసున్, కసున్ ప్రత్యయములకు ద్వంద్వము. క్త్వాదులు ప్రత్యయములగుటచే తదన్తబోధకములు. క్త్వాన్తము, తోసున్ ప్రత్యయాన్తము, కసున్ ప్రత్యయాన్తము, ఇవి యవ్యయములగును. క్రమముగ నుదాహరణములు. కృత్వా। ఉదేతోః విసృపః.

* 454. అవ్యయీభావశ్చ. 1-1-41.

అధిహరి॥

454. అవ్యయీభావ సమాసము నవ్యయమగును. అధిహరి. అవ్యయం విభక్తి సమీప........ వచనేషు (2-1-6) సూ. చే, విభక్త్యర్థమం దవ్యయీభావము. (హరౌ ఇతి అని విగ్రహవాక్యము. హరియందని యర్థము.)

* 455. అవ్యయాదాప్ సుపః. 1-4-82. అవ్యయాత్। ఆప్ సుపః (లుక్)

అవ్యయాద్విహితస్యాపః సుపశ్చ లుక్ స్యాత్। తత్ర శాలాయామ్। విహితవిశేషణాన్నేహ। అత్యుచ్చైసౌ। అవ్యయసంజ్ఞాయాం యద్యపి తదన్త విధిరస్తి తథాపి నగౌణే। ఆప్గ్రహణమ్ వ్యర్థమలిఙ్గత్వాత్॥ శ్లో॥ సదృశం త్రిషు లిఙ్గేషు సర్వాసుచ విభక్తిషు వచనేషుచ సర్వేషు యన్న వ్యేతి తదవ్యయమ్॥ ఇతి శ్రుతిర్లిఙ్గకారక సంఖ్యాఽభావపరా॥ శ్లో॥ వష్టి భాగురిరల్లోపమవాప్యోరుపసర్గయోః। ఆపం చైవ హలన్తానాం యథా వాచా నిశా దిశా। వగాహః। అవగాహః। పిధానమ్। అపిధానమ్॥ ఇత్యవ్యయాని॥

455. ఆప్సుపః, అనునది సమాహార ద్వన్ద్వమునకు షష్ఠ్యేకవచనము. (ఆప్ + చ సుప్ చ. ఆప్సుప్ తస్య) ఆప్పదముచే టాప్ డాప్ చాప్ ప్రత్యయములకు గ్రహణము। అవ్యయముకంటె విధింపబడు ఆప్పునకు సుప్పునకును లుక్కు వచ్చును. తత్ర శాలాయామ్ (తస్యాం శాలాయాం) ఇది త్రల్ ప్రత్యయాన్తావ్యయము దీనికంటె విహితమగు సుప్పునకు (ఙి) లుక్కు వచ్చెను. ఈ సూత్రమున నవ్యయముకంటె పరములగు నాప్ సుప్పులకు లుక్కునర్థమును విడిచి యవ్యయములకంటె విహితములగువానికి లుగ్విధానము చేయుటకు

ఫలమును చూపుచున్నాడు. "అత్ర......చ్చైసౌ" అత్యుచ్చైసౌ అనునది ప్రాదిసమాసము. (ఉచ్చై రతిక్రాన్తౌ) అత్యుచ్చైః అను సమాసముకంటె నౌ ప్రత్యయము విహితమైనది. సమాసము (సముదాయము) లిఙ్గసంఖ్యాదులతో నన్వయము గలదగుటవలన నవ్యయము గాదు. ఉచ్చైః అనునది యవ్యయమే గాని దీనికంటె సుప్ ప్రత్యయము విహితముగాదు. విహిత విశేషణము లేనియెడల నిచట నౌ ప్రత్యయమునకు లుక్కు ప్రసక్తమగును. సముదాయమునకు నవ్యయ సంజ్ఞ నాశఙ్కించి, సమాధానము జెప్పుచున్నాడు. "అవ్యయ......... గౌణే" అవ్యయసంజ్ఞా సూత్రమున (స్వరాది నిపాత మవ్యయమ్) శబ్దస్వరూప మనుదాని నధ్యాహారముజేసి, యది స్వరాదులకును నిపాతములకును విశేష్య మనినచో "ప్రయోజనం సర్వనామావ్యయసంజ్ఞాయామ్, (సర్వనామ సంజ్ఞా సూత్రమందు, నవ్యయసంజ్ఞా సూత్రమందును తదన్తవిధి జెప్పవలయును) అను వచనముచే తదన్తవిధి సిద్ధమగును. ఇట్లు స్వరాద్యన్తములకు నవ్యయసంజ్ఞ యుండుటచే నత్యుచ్చై ననునదియు నవ్యయమగును, గాన విహిత విశేషణ మున్నను లుక్కు ప్రసక్తమగుచున్నదను శఙ్కకు సమాధాన మిది. తదన్త విధివలన స్వరాద్యర్థములకు ప్రాధాన్యముగల పరమోచ్చైః ఇత్యాదు లవ్యయము లగును గాని స్వరాద్యర్థముల కప్రాధాన్యముగల అత్యుచ్చైః మొదలగునవి యవ్యయములు గావని నవ్యేతీత్యవ్యయమ్మను మహా సంజ్ఞాశ్రయణము వలన లిఙ్గసంఖ్యాదులం దన్వయములేని యర్థమును, బోధించునదే యవ్యయమగునను నర్థము లబ్ధమగును. ఏతత్సదృశములగువానికే గణమం దనుకరణము జేయబడెను. కావున లిఙ్గసంఖ్యాద్యన్వయములేనట్టి యర్థమును బోధించు పరమోచ్చైః (ఉత్కృష్టమగు నూర్ధ్వభాగమందు) మొదలగునవి యవ్యయములగును. లిఙ్గసంఖ్యా ద్యన్వయముగల యర్థమును బోధించెడి, అత్యుచ్చైః (ఊర్ధ్వభాగమందున్న వాని నతిక్రమించినవాడు) మొదలగునవి యవ్యయములు గావు. కావున నవ్యయప మునకు (ఉచ్చైః అనుదానికి) మాత్రము సంజ్ఞ యున్నందున సుప్పు యవ్యయ మునకు పరమగును గాన విహితవిశేషణము లేకున్న నిచట సుబ్లుక్కు ప్రసక్త మగునని. అవ్యయములు స్త్రీత్వాది లిఙ్గములు లేనివగుటచే నవ్యయములకంటె టాబాదులకు విధానమే యసంభవమగును. లుగ్విధాయకసూత్రమున నాప్ గ్రహణము వ్యర్థమగును. అవ్యయములు లిఙ్గశూన్యము లనినచో నాథర్వణ ప్రణవ విద్యాగత శ్రుతివిరోధము నాశఙ్కించి సమాధానము జెప్పుచున్నాడు (శ్రుతి) సదృశం .....తదవ్యయమ్. ఏది మూడు లిఙ్గములందు నన్నివిభక్తులందు నన్నివచనములందును వికారములు జెందక సదృశమై (ఏకరీతిగా) యుండునో యది యవ్యయమగునని యర్థము. అవ్యయములకు లిఙ్గమే లేదనిన లిఙ్గము లున్న వనియు నం దేకాకారముగ నున్నది యవ్యయమనియును బోధించెడి యీ శ్రుతి విరోధము గల్గునని శఙ్కాశయము. ఈ శ్రుతికి లిఙ్గసంఖ్యాకారకములు లేనిది యవ్యయమనియే యర్థము గాన విరోధములేదని సమాధానము. శ్రుతిలోని

విభక్తి శబ్దమునకు కారకమనియు వచన శబ్దమునకు సాంఖ్యయనియు నర్థము. శ్రుతి కిట్టియర్థము జెప్పుటయందాశయమిది. ఉపక్రమోప సంహారములచే బ్రహ్మబోధకమగు నీ శ్రుతికి భాష్యప్రామాణ్యమువలన నవ్యయ స్వరూపమును బోధించున ట్లర్థము చెప్పినట్లు భాష్యప్రామాణ్యము వలననే యీ శ్రుతి లిఙ్గ సంఖ్యాద్యభావమును బోధించుననియును జెప్పవలయునని. ప్రసఙ్గవశమున భాగురి మతమును ప్రదర్శించుచున్నాడు. వష్టి......దిశా. భాగురియను నాచార్యుడు ఉపసర్గములగు అవ, అపి, వీనిలో మొదటి అకారమునకు లోపమును, వాచ్, నిశ్, దిశ్ మొదలగు హలన్తములకంటె టాప్ప్రత్యయము నిశ్చయించుచున్నాడు. ఉదా:—వగాహః, మతాన్తరమున, అవగాహః, పిధానమ్, అపిధానమ్, వాచా, నిశా, దిశా ॥

అవ్యయ ప్రకరణము సమాప్తిని జెందెను.

## 14. స్త్రీ ప్రత్యయ ప్రకరణము

*** 456.** స్త్రియామ్. 4-1-3.

అధికారోఽయమ్। సమర్థానామితి యావత్ ॥

456. ఈ యోగము (సూత్రము) సమర్థానాం ప్రథమాద్వా, (4-1-82) అను సూత్రము వఱకధికృతమగును. స్త్రియామ్ అనునది భావప్రధాన నిర్దేశమగుటవలన, స్త్రీత్వమను నర్థము గలదగును. స్త్రీత్వమన స్త్రీలింగము. ఈ యధికారమున విధింపబడు ప్రత్యయములు స్త్రీలిఙ్గద్యోతకములగునను నర్థము ఫలించును.

వివ:—"స్తనకేశవతీ స్త్రీ స్యాల్లోమశః పురుషస్స్మృతః" అను లౌకిక లిఙ్గము, చేతనములందు మాత్రమే యుండును. దీనికి విలక్షణమై శాస్త్రమునే వ్యవహరింపబడు లిఙ్గము చేతనములందు నచేతనములందు నుండును. ఈ స్త్రీయ లిఙ్గము ననుసరించియే శాస్త్రవిహిత కార్యములు ప్రవర్తించును. ప్రపంచమందలి సమస్త వస్తుజాలము సత్త్వ రజస్తమో గుణాత్మకము. ఈ గుణత్రయముయొక్క యవస్థావిశేషమే శాస్త్రీయ లిఙ్గము. ఉపచయావస్థ (వృద్ధి) పుంలింగము. అపచయావస్థ (అల్పము) స్త్రీలింగము. సామ్యావస్థ (హెచ్చుతగ్గులు లేకుండనుండుట) నపుంసక లింగము. ఈ మూడు లింగములు ప్రతివస్తువునందు నుండును. "అయం పదార్థః" "ఇయం వ్యక్తిః" "ఇదం వస్తు" అను మూడు విధములగు వ్యవహారము ప్రపంచమందలి వస్తుమాత్రమునందుండుటయే యింకుకు గారణము. అన్నివస్తువులందును మూడు లింగములున్న నా వస్తువులను బోధించు శబ్దములు స్వభావమున గొన్ని యొకేలింగమును గొన్ని రెండు లింగములను కొన్ని మూడు లింగములను బోధించును. క్రమముగ

ఉదా :—జ్ఞానమ్, ఇషుధిః, ఇషుధీ, తటః, తటీ, తటమ్. ఏశబ్ద మెన్ని లింగ ములను బోధించునను విషయము లింగాను శాసనాదులవలన గ్రహింపనగును. ఈ లింగ మర్థమందే యుండునని భాష్యమున నిర్ణయింపబడినది. "పుంలిఙ్గో రామశబ్దః" ఇత్యాది వ్యవహారము శబ్దార్థములకుగల యభేదమునుబట్టి వచ్చెనని యూహింపదగును.

* 457. *అజాద్యతష్టాప్ 4-1-4. అజాద్యతః। టాప్.

అజాదీనామకారాన్తస్య చ వాచ్యం యత్ స్త్రీత్వంతత్ర ద్యోత్యే టాప్ స్యాత్। అజాద్యుక్తిర్ఙీషో జీపశ్చ బాధనాయ। అజా। అత్, ఖట్వా। అజాదిభిః స్త్రీత్వస్య విశేషణాన్నేహ। పఞ్చాజీ। అత్రహి సమాసార్థసమాహారనిష్ఠం స్త్రీత్వమ్। అజా। ఏడకా। అశ్వా। చటకా। మూషికా। ఏషు జాతిలక్షణో ఙీష్ ప్రాప్తః। బాలా। వత్సా। హోడా। మన్దా। విలాతా। ఏషు వయసి ప్రథమ ఇతి ఙీప్ ప్రాప్తః। 1 (వా) సంభస్త్రాజినశణపిండేభ్యః ఫలాత్। సంఫలా। భస్త్రఫలా। జ్యాపోరితి హ్రస్వః। 2 (వా) సదచ్ కాణ్డప్రాన్తశతైకేభ్యః పుష్పాత్। సత్పుష్పా। ప్రాక్పుష్పా। ప్రత్యక్పుష్పా। 3 (వా) శూద్రా చామహత్పూర్వా జాతిః। పుంయోగే తు శూద్రీ। అమహత్పూర్వా కిమ్। మహాశూద్రీ। క్రుఞ్చా। ఉష్ణిహా। దేవవిశా। జ్యేష్ఠా। కనిష్ఠా। మధ్యమేతి పుంయోగేఽపి। కోకిలా జాతావపి। 4 (వా) మూలాన్నఞః। అమూలా। ఋన్నేభ్యో ఙీప్। కర్త్రీ। దండినీ॥

457. అజాద్యతః అనునది సమాహార ద్వంద్వమునకు షష్ఠ్యేకవచనము. (అజః ఆదిర్యేషాం తే = అజాదయః, తే చ అచ్చ ఏషాం సమాహారః తస్య) ప్రాతిపదికాత్ అనునది యధికార ప్రాప్తము. ఈ సూత్రము ప్రత్యయమును విధించునది కావున అజాద్యతః అనునది పంచమ్యన్తమనుట న్యాయము. కాని అత్యానుసారి వ్యాఖ్యానమువలన నీసూత్రమందుమాత్ర మిది షష్ఠ్యన్తము. అత్, అనునది హ్రస్వాకార (వర్ణ) బోధక మగుటవలనను, ప్రాతిపదికమునకు

* అజ, ఏడక, అశ్వ, చటక, మూషక, బాల, వత్స, హోడ, పాక, మన్ద, విలాత, పూర్వాపహాణ, అపరాపహాణ, క్రుఞ్చా, ఉష్ణిహా, దేవవిశా, జ్యేష్ఠా, కనిష్ఠా, మధ్యమా పుంయోగేఽపి, కోకిలాజాతౌ, దంష్ట్రా ఏతేఽజాదయః "ఆకృతి గణోఽయమ్".

విశేషణ మగుటవల్లనను, అకారాన్త బోధకమగును. స్త్రియామ్, అనునది విశేష్యము. షష్ఠ్యర్థ సంబంధము వాచ్యవాచక భావము. శబ్దములు వాచకములు. స్త్రీత్వము వాచ్యము. అజాదిగణ పఠిత ప్రాతిపదికములకును అకారాన్త ప్రాతిపదికములకును వాచ్యమగు నర్థమందుండునట్టి స్త్రీత్వము ద్యోత్యమగుచుండ నజాదులకంటె నజాదు లన్తమందుగల ప్రాతిపదికముల కంటెను, హ్రస్వాకారాన్తములగు ప్రాతిపదికముల కంటెను, పరమై టాప్ ప్రత్యయ మగునని సూత్రార్థము.

లింగముగూడ ప్రాతిపదికమునకే యర్థము గాన టాపు, జీపు, మొదలగు స్త్రీప్రత్యయములు స్త్రీలింగ ద్యోతకములగును. టాబాదు లున్నపుడు, స్త్రీలింగము తప్పక బోధవిషయమగునను నియమ మేర్పడును. మాతృస్వస్రాది శబ్దములవలన స్త్రీ ప్రత్యయము లేకున్నను, స్త్రీలింగ బోధ గల్గుటచే టాబాదులే స్త్రీ వాచకములనుట యసంగతము. కనుక స్త్రీ ప్రత్యయములు స్త్రీలింగమునకు ద్యోతకములు గాని వాచకములు గావని గ్రహించునది. సూత్రమున అతః అనుదానిచే నకారాన్తములకంటె టాప్ ప్రత్యయము ప్రాప్త మగుచుండ నజాదిగణమం దకారాన్త శబ్దముల (అజ, ఏడక, ఇత్యాదులు) పాఠమునకేమి ఫలమను శఙ్కకు సమాధాన మిది:—"అజాద్యుక్తిః...... బాధనాయ" ఈ సూత్రమువలన ప్రాప్తమగు టాప్ ప్రత్యయమునకు, బాధకములగు జీపు, జీషు, మొదలగు ప్రత్యయములను బాధించి టాప్ ప్రత్యయమే వచ్చుటకై అజాదిగణమున నద న్తములకు పాఠమావశ్యకమని. అజా అజ శబ్దముకంటె టాప్ ప్రత్యయము. టకార పకారము లిత్సంజ్ఞకములు. పిదప సవర్ణదీర్ఘము. "ప్రాతిపదిక గ్రహణే లింగ విశిష్టస్యాఽపి గ్రహణమ్" అను పరిభాషచే నజా శబ్దముకంటె స్వాదు లుత్పన్నములగును. అజా + సు. "హల్ఙ్యాప్" సూత్రముచే సులోపము. ఇది రమా శబ్దసదృశము. అకారాన్త ప్రాతిపదికమునకు టాప్ ప్రత్యయమగునను నంశమున కుదాహరణము చూపబడునని "అతః ఖట్వా", అనుచోటనుండు అతః, అనుదాని కర్థమని గ్రహించునది. (ఖట్వ + ఆ) సవర్ణదీర్ఘ సులోపములు. ఖట్వా.

"ప్రత్యయ విధాయక సూత్రములందు దేనికంటె ప్రత్యయము విధింపబడునో, యట్టి శబ్దముకంటె పంచమీవిభక్తి యుండుట న్యాయము. ఈ సూత్రమున నట్లుగాక "అజాద్యతః" అనునది షష్ఠ్యన్తమనుటకును అజాదులను స్త్రీత్వమునకు విశేషణముగ జేసి యజాదులందలి స్త్రీలింగమే టాప్ ప్రత్యయమునకు నిమిత్తమనుటకును, ఫలమును చూపుచున్నాడు. "అజాదిభిః స్త్రీత్వస్య ......నిష్ఠం స్త్రీత్వమ్" పంచాజ శబ్దమునకు టాబ్నివృత్తియే ఫలము. అజాదివాచ్య స్త్రీత్వమే టాప్పునకు నిమిత్తమని చెప్పబడెను. పంచాజ, అనునది సమాహారద్విగువు. (పంచానాం పుమజానాం సమాహారః) అకారాన్త ముగు నుత్తరపదముగల ద్విగు సమాసము స్త్రీలింగమగునని శాసింపబడినందున,

విది స్త్రీలింగము. ఇచట స్త్రీలింగము, పంచాజ, అను సమాసమున కర్థమగు సమాహారమందుండునది గాని అజ శబ్దార్థ మాత్రమందుండునది గానందున టాప్ ప్రసక్తి వారింపబడునని యాశయము. అజాదిగణమును చూపుచు, వానిలో నెచట నే ప్రత్యయమును టాప్ ప్రత్యయము బాధించునను విషయమును, ప్రదర్శించుచున్నాడు. "అజా ఏడకా......జీష్ ప్రాప్తః", అజా (ఆడమేక) అశ్వా (ఆడగుఱ్ఱము) చటకా (ఆడపిచ్చుక) మూషికా (ఆడయెలుక) వీనికి "జాతేరస్త్రీ" (521) సూ. చే, జీషు ప్రాప్తమగుచున్నది. బాలాది శబ్దము లైదును ప్రథమ వయోవాచకములు. వీనికి "వయసిప్రథమే" (481) సూ. చే, జీషు ప్రాప్తమగుచున్నది.

"సంభస్త్రాజిన" "సదచ్ కాండ" "మూలాన్నఞః" ఈ మూడు వచనములును, "పాకకర్ణ" (522) సూ. చే, ప్రాప్తమగు జీషును బాధించుటకు చెప్పబడినవి. 1 (వా) సమ్, భస్త్రా, అజిన, శణ, పిండ, ఇవి పూర్వమందును ఫలశబ్ద మన్తమందును గల ప్రాతిపదికములకంటె టాప్ ప్రత్యయమగునని యర్థము. సమ్ఫలా, భస్త్రఫలా, "ఙ్యాపోః స్సంజ్ఞా ఛందసోః" (1006) సూ. చే, భస్త్రా శబ్దమునకు హ్రస్వము. అజినఫలా, శణఫలా, పిండఫలా. 2 (వా) సత్, అచ్ (అఞ్చుధాతు వన్తమందుగలవి) కాండ, ప్రాన్త, శత, ఏక, వీనికంటె పరమగు పుష్పశబ్ద మంతమందుగల ప్రాతిపదికములకంటె టాపు వచ్చునని యర్థము. సత్పుష్పా. ప్రాక్పుష్పా. ప్రత్యక్పుష్పా. ప్రాన్తపుష్పా. కాండపుష్పా. శతపుష్పా. ఏకపుష్పా. సంఫలాది శబ్దములోషధి విశేష వాచకములు. 3 (వా) శూద్రాచా...జాతిః ఇది జాతిలక్షణ జీషునకు బాధకము. ఇచట వాక్యద్వయము. శూద్రాచ, అనునది టాబ్విధాయకము. అమహత్పూర్వా అనునది టాబ్నిషేధకము. వాక్యద్వయమందును జాతిః, అనునది సంబంధించును. జాతివాచకమగు శూద్రశబ్దము టాప్ ప్రత్యయమును పొందును. శూద్రా (శూద్రజాతి స్త్రీ) మహచ్ఛబ్దము పూర్వమందుగల శూద్రశబ్దము జాతివాచకమగునపుడు, టాప్ ప్రత్యయమును పొందదు. మహాశూద్రీ "ఆభీరీతు మహాశూద్రీ" అను నమరకోశమువలన మహాశూద్రీశబ్ద మాభీరీజాతిని బోధించును. నిషేధ వాక్యమందుగూడ జాతిపద సంబంధమును చేయుటచే మహాశూద్ర శబ్దము జాతిని బోధింపక గొప్పదైన శూద్రస్త్రీని బోధించునపుడు టాప్ ప్రత్యయము వచ్చును. మహాశూద్రా (గొప్పదైన శూద్రస్త్రీ) ఈ వార్తికము జాతిలక్షణ జీషునకే బాధకమనుటవలన శూద్రునియొక్క స్త్రీ అను నర్థముగల శూద్రశబ్దమునకు "పుంయోగా దాఖ్యాయామ్" (507) సూ. చే, జీష్ ప్రత్యయమే వచ్చును. శూద్రీ (శూద్రునిభార్య లేక కూతురు) క్రుఞ్చా, ఉష్ణిహా, దేవవిశా, వీనికి టాప్ ప్రత్యయము వచ్చును. క్రుఞ్చా, ఇత్యాది రూపములగును. జ్యేష్ఠ కనిష్ఠ మధ్యమ శబ్దములు వరుసగ మొదట పుట్టినది, (స్త్రీ) తుదిని పుట్టినది, ఇద్దఱకు మధ్యను పుట్టినది, అను నర్థము గలవగునపుడు అదన్తములగుట వలననే టాప్ ప్రత్యయమగును. జ్యేష్ఠాదు

యొక్క స్త్రీలను బోధించునపుడుగూడ, పుంయోగలక్షణ జీషును బాధించి టాప్ ప్రత్యయమే వచ్చును. ఈ యర్థము "పుంయోగేఽపి" అనుచోట నుండు నపి శబ్దమువలన లభించును. ఉదా:— జ్యేష్ఠా, కనిష్ఠా, మధ్యమా. కోకిలా, ఇది జాతిబోధక మగునపుడును, దీనికంటె జాతిలక్షణ జీషును బాధించి టాపు వచ్చును. 4 (వా) నఞ్ కంటె పరమగు మూలశబ్ద మన్తమందుగల ప్రాతిపదికముకంటె టాపు వచ్చును. ఉదా:— అమూలా.

"ఋన్నేభ్యో జీప్" (307) ఈ సూత్ర మిదివరలో ప్రసంగవశమున వ్యాఖ్యాతమైనను ప్రకరణశుద్ధికొఱకు తిరుగ నిచట స్మరింపబడెను. జీప్ ప్రత్యయమున జకార పకారములు ఇత్సంజ్ఞకములు. ఋకారాన్తముల కుదాహరణము. కర్త్రీ. కర్తృ + ఈ. యణాదేశము. నకారాన్తమున కుదాహరణము. దండినీ. (దండిన్ + ఈ).

* 458. ఉగితశ్చ. 4-1-6. ఉగితః। చ।

ఉగిదన్తాత్ప్రాతిపదికాత్ స్త్రియాం జీప్ స్యాత్। భవతీ। పచన్తీ। దీవ్యన్తీ। శప్శ్యనోరితి నుమ్। ఉగిదచామితి సూత్రేఽచ్గ్రహణేన ధాతోశ్చే దుగిత్కార్యం తర్హ్యఞ్చతేరేవేతి నియమ్యతే। తేనే హ న। ఉఖాస్రత్। క్విప్। అనిదితామితి నలోపః। పర్ణధ్వత్। అఞ్చతేస్తు స్యాదేవ। ప్రాచీ। ప్రతీచీ॥

458. ఉక్ ప్రత్యాహారవర్ణములు (ఉ, ఋ, ఌ) ఇత్సంజ్ఞకములుగ గలది ఉగిత్తగును. ఉగిత్తులు ప్రాతిపదికములు, ప్రత్యయములునున్నవి. సర్వాదిగణమున భవతు, అని పఠింపబడినది. భవత్, అను ప్రాతిపదికము గిత్తు. శతృప్రత్యయము గిత్తు. ఉగితః అనునది ప్రాతిపదికమునకు విశేషణమగుటవలన తదన్తవిధి కల్గును. "ఉగిద్వర్ణగ్రహణ వర్జమ్" అను వచనముండుటవలన "సంజ్ఞావిధౌ ప్రత్యయవిధౌ" అను దానిచే తదన్తవిధి నిషేధము ప్రవర్తింపదు. ఉగిదన్తమగు ప్రాతిపదికమునకు జీపగునని సూత్రార్థము. భవతీ. భవత్ అను ప్రాతిపదికము వ్యపదేశివద్భావముచే నుగిదన్తమగును. కాన జీపు వచ్చును. కొన్ని పుస్తకములందు భవన్తీ, అని యున్నది. భూ ధాతువునకు శతృ ప్రత్యయమును చేసిన భవత్, అని యగును. ఉగిత్తగు శతృ ప్రత్యయ మన్తమందు కలదగుటవలన నిచట నీ సూత్రముచే జీపు ప్రవర్తించును. శప్శ్యనోర్నిత్యమ్ (448) సూ. చే, నిత్యముగ నుమాగమము వచ్చును. భవన్తీ, అని యగును. పచన్తీ, దీవ్యన్తీ. పచ్, దివ్, ధాతువులకు శతృ ప్రత్యయాన్తములగు పచత్, దీవ్యత్, వీనికంటె జీపు, "శప్శ్యనోః" సూ. చే, నుమాగమము. "ఉగిదచామ్" (363) సూత్రమున నచ్ గ్రహణము ఉగిత్త్వమువలన వచ్చెడి కార్య [illegible] ధాతువులకు ప్రవర్తించినచో నది "నలోపముగల అఞ్చుధాతువునకు

మాత్రమే యగునను” నియమమును బోధించునని యిదివరలో హలన్త ప్రకరణమున గోమచ్ఛబ్ద సందర్భమున చెప్పబడెను. ఈ నియమమువలన ఉఖాస్రత్, పర్ణధ్వత్, అను నుగిదన్త ప్రాతిపదికములకు జీపు నివృత్తమగును. “ఉఖాయాః స్రంసతే” “పర్ణాత్ ధ్వంసతే” అను నర్థమున ఉఖా శబ్దపూర్వక స్రంసు, ధాతువుకంటెను, పర్ణ శబ్దపూర్వక ధ్వంసు ధాతువుకంటెను, క్విప్ ప్రత్యయము చేసిన నీ రూపము లేర్పడును. ఇచట స్రంసు, ధ్వంసు, ధాతువులు గిత్తులగుటచే నుఖాస్రత్, పర్ణధ్వత్, అనునవి యుగిదన్త ప్రాతిపదికములగును. కావున “ఉగితశ్చ” సూ. చే, ప్రాప్తమగు జీపు నీ నియమము వారించును. అఞ్చుధాతువునకు మాత్రము గిత్కార్యము వచ్చును. ప్రాచ్, ప్రత్యచ్, శబ్దములు క్రమముగ ప్ర, ప్రతి, అనునవి పూర్వమందుగల యఞ్చు ధాతువునకు క్విన్నన్తరూపము లగుటవలన నుగిదన్త ప్రాతిపదికములగును. ప్రాచీ, ప్రతీచీ. జీపు పరమగునపుడు భసంజ్ఞ యుండుటవలన అకారలోప దీర్ఘాదుల నూహించునది.

* 459. వనో ర చ. 4-1-7. వనః। ర। చ। (జీప్)

వన్నన్తాత్తదన్తాచ్చ ప్రాతిపదికాత్ స్త్రియాం జీప్ స్యాత్ రశ్చాన్తాదేశః। వన్నితి ఙ్వనిప్ క్వనిప్ వనిపాం సామాన్య గ్రహణమ్। ప్రత్యయ గ్రహణే యస్మాత్సవిహితస్తదాదే స్తదన్తస్య గ్రహణమ్। తేన ప్రాతిపదిక విశేషణాత్తదన్తాన్తమపి లభ్యతే। సుత్వానమతిక్రాన్తా। అతిసుత్వరీ। అతిధీవరీ। శర్వరీ। 1 (వా) వనో న హశ ఇతి వక్తవ్యమ్। హశన్తాదాతో విహితో యో వన్ తదన్తాత్తదన్తాన్తాచ్చ ప్రాతిపదికాత్ జీప్ రశ్చ నేత్యర్థః। ఓణృ అపనయనే వనిప్ విడ్వనోరిత్యాత్వమ్। అవావా, బ్రాహ్మణీ। రాజయుధ్వా। 2 (వా) బహువ్రీహౌ వా। బహుధీవరీ। బహుధీవా। పక్షే డాప్ వక్ష్యతే॥

459. వన్ ప్రత్యయమన్తమందుగల ప్రాతిపదికము కంటెను వన్నన్తమంతమందుగల ప్రాతిపదికము కంటెను, స్త్రీలింగమున జీప్ ప్రత్యయము వచ్చునని యును, దీనితో (జీపుతో) గలసి యన్త్యమునకవగా నకారమునకు రేఫమాదేశమగుననియును సూత్రార్థము. సూత్రమున వన్, అనునది ఙ్వనిప్, క్వనిప్, వనిప్, ప్రత్యయములు మూడింటికిని బోధకము. ఙ్వనిబాదులందు వన్, అనునది శేషించియుండును. మిగిలినవి యిత్సంజ్ఞకములు. “ప్రత్యయ... శేషు...

లభ్యతే”. అర్థము = ప్రత్యయము గ్రహింపబడునపుడు, ఆ ప్రత్యయమే ప్రకృతికంటె విధింపబడునో, ఆ ప్రకృతి యాదియందు నా ప్రత్యయ మన్తమందునుగల సముదాయము బోధింపబడునని ప్రత్యయగ్రహణ పరిభాష కర్థము. ఈ పరిభాషవలన ప్రకృతమున వన్, అగునది వన్నన్తమునకు బోధకమగును. ఈ వన్నన్త మధికారప్రాప్తమగు ప్రాతిపదికమునకు విశేషణ మగుటవలన “యేనవిధిః”. (27) సూ. చే, తిరుగ తదన్తవిధి కల్గును. వృత్తిలో వ్రాయబడిన వన్నన్తాత్తదన్తాత్, అనునర్థ మీ విధముగ లభించెను. జ్వనిబన్తాదులకు క్రమముగ నుదాహరణములు :—అతిసుత్వరీ. (సుత్వానమతిక్రాన్తా) సుత్వన్, అనునది జ్వనిబన్తము. అతిసుత్వన్, అనునది వన్నన్తాన్తము. జీప్ రేఫాదేశము లగును. అతిధీవరీ. (ధీవానమతిక్రాన్తా) ధీవన్ శబ్దము క్వనిబన్తము. అతిధీవన్ శబ్దము వన్నన్తాన్తము. జీప్ రేఫాదేశములు. శర్వరీ, శర్వన్ అనునది శౄధాతుప్రకృతిక వనిబన్తము. వన్నన్తమగుటచే జీప్ రేఫాదేశములు.

1 (వా) హశ్ ప్రత్యాహారవర్ణ మన్తమందుగల ధాతువుకంటె విహితమగు వన్ ప్రత్యయ మన్తమందుగల ప్రాతిపదికమునకు జీప్ రేఫాదేశములు రావని యర్థము. అవావా (బ్రాహ్మణీ) ఓణ్ఱ (అపనయనే) ధాతువుకంటె వనిప్ ప్రత్యయము. ఓణ్ + వన్ అనియుండ “విడ్వనో రనునాసికస్యాత్” 6-4-41 సూ. చే, ణకారాగమున కాత్వము. ఓ ఆ + వన్. అవాదేశము. అవావన్, అని యగును. ఇచట వన్ ప్రత్యయము హశ్ ప్రత్యాహారములోని ణకార మన్తమందుగల ఓణ్ ధాతువుకంటె విధింపబడినందున నిషేధము ప్రవర్తించును. కావున పుంలింగమందువలె నుపధాదీర్ఘ నలోపములగును. అవావా, అవావానౌ ఇత్యాది రూపములగును. రాజయుధ్వా. (రాజానంయోధితవాన్) దీనిని అవావా అను దానినివలె సాధింపదగును. ఈ వార్తికమున విహిత విశేషణమునకు అవ్యాప్త్యతివ్యాప్తి దోషవారణము ప్రయోజనము. శర్వరీ అనుచోట వన్ప్రత్యయము హశ్ను (రేఫ) కంటె పరమగుటచే నిషేధము ప్రసక్తమయ్యెడిని. అవావా అనుచోట నిషేధము ప్రవర్తింపకపోయెడినని గ్రహించునది.

2 (వా) వన్ ప్రత్యయమన్తమందుగల బహువ్రీహి సమాసమునకు జీప్ రేఫాదేశములు వికల్పముగ వచ్చును “అనో బహువ్రీహేః” (463) సూ. చే, జీబ్నిషేధము ప్రాప్తమగుచుండ వన్నన్తమున కీ వికల్పము చెప్పబడెను. బహుధీవరీ, బహుధీవా (బహవో ధీవానో యస్యాం నగర్యామ్) బహుధీవన్ (అన్నన్త బహువ్రీహి) దీనికంటె “డాబుభాభ్యామ్” (464) సూ. చే, పక్షమందు డాప్ ప్రత్యయము వికల్పముగ చెప్పబడెను. బహుధీవన్ + ఆ (డాప్) “టేః” (317) సూ. చే, టిలోపము. బహుధీవా. ఈ వికల్పములవలన నేకవచనమందు రూపద్వయమైనను, ద్వివచనమందు బహుధీవర్యౌ, బహుధీవానౌ, బహుధీవే. అను మూడు రూపములగును.

* 460. పాదోఽన్యతరస్యామ్. 4-1-8. పాదః। అన్యతర స్యామ్ (ఙీప్)

పాచ్ఛబ్దః కృతసమాసాన్తస్తదన్తాత్ప్రాతి పదికాత్ ఙీబ్వా స్యాత్ । ద్విపదీ । ద్విపాత్ ॥

460. సూత్రమున పాదః, అనునది పాద్, అనుదానికి పంచమ్యేక వచనము. "సంఖ్యాసు పూర్వస్య" (834) సూ. చే, సమాసాన్త లోపము వలన సిద్ధమగు ద్విపాద్ మొదలగువానియందలి పాద్ అనుదానికి సూత్రమున అనుకరణము. సమాసాన్తమగు లోపముచే సిద్ధమగు పాద్, అను శబ్దమన్తమందు గల ప్రాతిపదికమునకు ఙీపు, వికల్పముగ వచ్చునని యర్థము. ఉదా:— ద్విపదీ, ద్విపాత్. (ద్వౌ పాదౌ యస్యాః) ద్విపాద అను బహువ్రీహి సమాస మునకు "సంఖ్యాసు" సూ. చే, సమాసాన్తలోపము. ద్విపాద్. ఙీపు పరమగు నపుడు భసంజ్ఞయుండును గాన "పాదఃపత్" (417) సూ. చే, పాద శబ్దమునకు పదాదేశమువలన ద్విపదీ అని యగును. ఙీబభావ పక్షమున ద్విపాత్ అని యగును.

వివ:—సమాసాన్త లోపముగల పాచ్ఛబ్దమంతమందు గలదానికి ఙీపగునను వ్యాఖ్యానమునకు, పాదశబ్దప్రకృతిక ణిజన్తముకంటె క్విప్ ప్రత్యయ మును చేయుటచే సిద్ధమగు పాద్ శబ్దమునకు ఙీబ్నివృత్తి ఫలము.

* 461. టాబృచి. 4-1-9. టాప్ । ఋచి । (పాదః)

ఋచి వాచ్యాయాం పాదన్తాట్టాప్ స్యాత్ । ద్విపదా ఋక్ । ఏకపదా । న షట్ స్వస్రాదిభ్యః । పఞ్చ । చతస్రః । పఞ్చేత్యత్ర నలోపే కృతేఽపి ష్ణాన్తాష డితి షట్సంజ్ఞాం ప్రతి నలోపః సుప్స్వరేతి నలోప స్యాఽసిద్ధత్వాన్న షట్ స్వస్రాదిభ్య ఇతి న టాప్ ॥

461. ఋక్కనగా జగతీ, త్రిష్టుప్, మొదలగు ఛందస్సులచే బద్ధమైన వేదభాగము. (అగ్నిమీళే పురోహితమ్) ఋక్ ప్రతిపాదకమగు పాచ్ఛబ్దాన్త ప్రాతిపదికమునకు టాప్ ప్రత్యయము వచ్చును. ఇది పూర్వ సూత్రముచే ప్రాప్తమగు ఙీపున కపవాదము. ఉదా:—ద్విపదా, ఏకపదా, ఇచట ద్విపదీ అను రూపమునందువలె భసంజ్ఞా పదాదేశముల నూహించునది. ఋక్కర్థమగు నపుడు ద్విపదీ, ద్విపాత్, అను రూపములసాధువులగునని తెలియునది.

"న షట్ స్వస్రాదిభ్యః" (309) ఈ సూత్రము పూర్వమున వ్యా ఖ్యాతమైనను, ప్రకరణ శుద్ధికొఱకు తిరుగ నిచట స్మరింపబడెను. పఞ్చ. (స్త్రియః) పఞ్చన్ శబ్దము నకారాన్త సంఖ్యావాచకమగుటచే, షట్ సంజ్ఞ కము. కాన 'ఋన్నేభ్యః' (307) సూ. చే, ప్రాప్తమగు ఙీపునకు దీనిచే

నిషేధము. చతస్రః. చతస్సృశబ్దము స్వస్రాదులలోనిదగుటచే "ఋన్నేభ్యః" (307) సూ. చే, ప్రాప్తమగు జీపునకు నిషేధము. పఞ్చ అనునది నలోపము చేసినపిదప నదన్తమగును. కావున నిచట టాప్ ప్రత్యయ మేల రాదను శంకకు సమాధానమును చెప్పుచున్నాడు:—"పఞ్చేత్యత్ర......న టాప్". పఞ్చ అనుచోట నలోపము "నలోపః ప్రాతిపదికాన్తస్య" (237) సూ. చే, ప్రవర్తించెను. ఈ నలోపము, ష్ణాన్తాషట్, అను సూత్రముచే షట్‌సంజ్ఞ చేయునపుడు "నలోపః సుప్ స్వర" సూత్రముచే నసిద్ధమగును గాన "నషట్ స్వస్రాదిభ్యః" అను సూత్రముచే టాపు నిషేధింపబడునని మూలగ్రంథమున కాశయము.

* 462. మనః. 4-1-11. (న, జీప్)

మన్నన్తాన్న జీప్। సీమా। సీమానౌ॥

462. మన్, అను నదన్తముందుగల ప్రాతిపదికమునకు జీపు ప్రవర్తించదని యర్థము. "ఋన్నేభ్యః", సూ. చే, ప్రాప్తమగు జీపునకు నిషేధము. ఉదా॥ సీమా. సీమన్ శబ్దము మన్నన్తము గాన జీపు ప్రవర్తించదు. ఉపధాదీర్ఘ నలోపములు. సీమా, అనునది వక్ష్యమాణ డాప్ ప్రత్యయాన్తమను భ్రమను వారించుటకై సీమానౌ, అను ద్వివచనముగూడ నుదాహరింపబడెను. డాబన్తమగుచో ద్వివచనము సీమే, అని గావలయునని గ్రహించునది.

* 463. అనో బహువ్రీహేః. 4-1-12. అనః, బహువ్రీహేః. (న, జీప్)

అన్నన్తాద్బహువ్రీహేర్న జీప్। బహుయజ్వా। బహుయజ్వానౌ॥

463. అన్, అనునది యన్తమందుగల బహువ్రీహికంటె జీపు రాదని యర్థము. ఉ: బహుయజ్వా. (బహవో యజ్వానో యస్యాం నగర్యామ్) బహుయజ్వన్ శబ్దమన్నన్త బహువ్రీహి యగుటచే ప్రాప్తమగు నాన్తలక్షణ జీపునకిది నిషేధము. ఉపధాదీర్ఘ నలోపములు, ఇచటను డాబన్తమను భ్రాంతి నివారణార్థమే ద్వివచన ముదాహరింపబడెను.

* 464. డాబుభాభ్యామన్యతరస్యామ్ 4-2-13 డాప్, ఉభాభ్యామ్, అన్యతరస్యామ్.

సూత్రద్వయోపాత్తాభ్యాం డాప్ వాస్యాత్। సీమా। సీమే। సీమానౌ। దామా। దామే। దా

మానౌ। న పుంసి. దామేత్యమరః। బహుయజ్వా। బహుయజ్వే। బహుయజ్వానౌ ॥

464. "ఉభాభ్యామ్" అను పదమువలన "మనః", "అనో బహువ్రీహేః" అను సూత్రద్వయ మనువృత్తమగును. లేనిచో సన్నిహితమగు "అనో బహువ్రీహేః" అనుదానికిమాత్ర మనువృత్తి కల్గునను శంక గల్గెడిని. మన్నన్త ప్రాతిపదికముకంటెను అన్నన్త బహువ్రీహికంటెను, డాప్ ప్రత్యయము వికల్పముగ నగునని యర్థము. డాపులోని డకార పకారము లిత్సంజ్ఞికములు. ఉదా॥ సీమా. డాపు డిత్తగుటచే "టేః" (317) సూ. చే, సీమన్ శబ్దములోని టిసంజ్ఞకము లోపించును. డాపు ప్రవర్తించునపుడు, లేనపుడు నగు రూపభేదమును సూచించుటకే సీమే, సీమానౌ, అను ద్వివచనము లుదాహరింపబడెను. డాపు రానిపక్షమున పూర్వసూత్రముచే జీబ్నిషేధమగును. ఉదాహరణాన్తరము:— దామా, దామే, దామానౌ. దామ శబ్దము నపుంసకలింగమున ప్రసిద్ధమగుటచే స్త్రీలింగమున నెట్లు సాధువగునను శంకను నివర్తింపచేయుటకు "న పుంసి దామేత్యమరః" అను నమరము ప్రమాణముగ జూపబడెను. దామశబ్దమునకు పుంలింగమును నిషేధించుటచే స్త్రీలింగ నపుంసకలింగము లున్నవని కోశార్థము. అన్నన్త బహువ్రీహి కుదాహరణము: బహుయజ్వా, బహుయజ్వే, బహుయజ్వానౌ. ఇచటను డాప్ప్రత్యయమును పక్షమందు జీబ్నిషేధము నూహించునది.

* 465. అన ఉపధాలోపినోఽన్యతరస్యామ్ 4-1-28 అనః। ఉపధాలోపినః। అన్యతరస్యామ్. (బహువ్రీహేః. ఙీప్).

అన్నన్తాద్బహువ్రీహే రుపధాలోపినో వా ఙీప్ స్యాత్। పక్షే డాబ్నిషేధౌ। బహురాజ్ఞీ। బహురాజ్ఞ్యౌ। బహురాజే। బహురాజానౌ ॥

465. ఉపధాలోపముగల అన్నన్త బహువ్రీహికి ఙీపు వికల్పముగ నగును. ఙీపు రానిపక్షమందు పూర్వమున చెప్పబడిన డాప్ ప్రత్యయ ఙీప్ నిషేధములు ప్రవర్తించును. ఉదా:— బహురాజ్ఞీ. (బహవో రాజానో యస్యాం నగర్యామ్) బహురాజన్ శబ్దమన్నన్త బహువ్రీహి. ఙీపు ప్రవర్తించినపిదప, "అల్లోపోఽనః" (235) సూ. చే, నుపధాలోపము గలదగును గాన నీ సూత్రము ప్రవర్తించును. అల్లోపశ్చ్యత్వములు. డాబన్తమున కుదా:— బహురాజే. జీబ్నిషేధమున కుదాహరణము:— బహురాజానౌ ॥

466. ప్రత్యయస్థాత్కాత్పూర్వస్యాత ఇదాప్యసుపః. 7-3-44. ప్రత్యయస్థాత్। కాత్। పూర్వస్య। అతః. ఇత్। ఆపి। అసుపః.

ప్రత్యయస్థాత్కాత్పూర్వస్యాకారస్యే
కారః స్యాదాపిపరే స ఆప్ సుపఃపరో న చేత్।
సర్వికా। కారికా। అతః కిమ్? । నౌకా। ప్రత్యయ
స్థాత్కిమ్। శక్నోతీతి శకా। అసుపః కిమ్। బహు పరి
వ్రాజకా నగరీ। కాత్కిమ్। నన్దనా। పూర్వస్య కిమ్।
పరస్య మా భూత్। కటుకా। తపరః కిమ్। రాకా।
ఆపి కిమ్। కారకః। (1 వా) మామకనరకయోరుప సం
ఖ్యానమ్। మామికా। నరాన్ కాయతీతి నరికా।
(2వా) త్యక్ త్యపోశ్చ। దాక్షిణాత్యికా। ఇహత్యికా॥

466. ప్రత్యయమందలి కకారమునకు పూర్వమందుండు హ్రస్వాకారమునకు ఆపు (టాప్, డాప్, చాప్) పరమగునపు డికారాదేశమగును. ఆ ప్ప్రత్యయము సుబన్తముకంటె పరమగుచో నిత్వము రాదు. ఉదా:—సర్వికా. సర్వశబ్దము సర్వనామమగుటచే "అవ్యయ సర్వనామ్నామకచ్ ప్రాక్టేః" (5-3-71) సూ. చే, నకచ్ ప్రత్యయము వచ్చును. సర్వకా. ఇచట రేఫ వకారములమీదినుండు యకారము ప్రత్యయస్థ కకారమునకు పూర్వమందున్నది. ఆపు (టాప్) పరముగనున్నది. కావున నికారాదేశమగును. అకారము కకారమునకు పూర్వమందుండవలె ననుటవలన నకారమునకు నాప్పునకును మధ్యను కకారమున్నను ఇత్వము వచ్చును. కారికా. కారకశబ్దము కృఞ్ ధాతుప్రకృతిక ణ్వుల్ ప్రత్యయాన్తము. ణ్వుల్ ప్రత్యయమునకు అక, అను నాదేశము విధింపబడెను. కారకశబ్దమునకు టాపు చేయుటవలన కారకా అని యగును. ఇచట రేఫముపైనున్న అకారము ప్రత్యయస్థ కకారమునకు పూర్వమైనదగుటచేతను, అప్పరక మగుటచేతను దాని కిత్వము వచ్చును. నౌకా. నౌశబ్దముకంటె కప్రత్యయము. టాపు. సూత్రమున అకారమును బోధించు "అతః" అనునది లేనిచో నిచట నౌకారమునకు నిత్వము ప్రసక్తమగును. శకా. శక (మర్షణే) ధాతువు నకచ్ ప్రత్యయమునుచేసిన శక అనియు, దీనికంటె టాపుచేసిన శకా అనియు నగును. ఇచట కకారము ధాత్వవయవమగును గాని ప్రత్యయస్థము గాదు. ఇచట నిత్వనివృత్తికై కకారమునకు "ప్రత్యయస్థాత్" అను విశేషణ మావశ్యకము. బహు పరివ్రాజకా. (బహవః పరివ్రాజకా యస్యామ్ = అనేకమంది సన్న్యాసులుగల నగరి) పరివ్రాజక, అనునది పరి పూర్వక వ్రజధాతువునకు ణ్వుల్ ప్రత్యయాన్తము. సుబన్తములగు బహుపరివ్రాజక శబ్దములకు (బహు + జస్, పరివ్రాజక + జస్) బహువ్రీహి సమాసమున కవయవములగు సుప్పులకు లుక్కగును. సమాసముకంటె టాపు చేసిన బహుపరివ్రాజకా అని యగును. ఇచట పరివ్రాజక; అనునది ప్రత్యయలక్షణముచే సుబన్తమగును గాన నిచటి టాపు సుబన్తముకంటె పరమగును. సూత్రమున 'అసుపః' అనునది లేనపు డీ ప్రయోగమున నిత్వము ప్రసక్తమయ్యెడిని.

నన్దనా. నది ధాతువునకు ల్యుట్ ప్రత్యయాన్తము నన్దన అనునది. దీనికంటె టాపుచేసిన నన్దనా అని యగును. సూత్రమున కాత్ అనునది లేనిచో ప్రత్యయస్థమగు ప్రతివర్ణమునకు పూర్వమగు నకారమునకు నిత్వమనునర్థము లభించును. ఇచట ప్రత్యయస్థమగు నకారమునకు పూర్వమందున్న అకారమునకు నిత్వము ప్రసక్తమగును. కటుకా. కటు శబ్దమునకు అజ్ఞాతాద్యర్థమందు కప్రత్యయము (తద్ధితము) టాపు. (కటుక + ఆ, సవర్ణదీర్ఘము) సూత్రమున పూర్వస్య, అనునది లేనపుడు ద్వితీయ కకారమునకు పరమగు నకారమున కిత్వమపవాదమై సవర్ణదీర్ఘమును బాధించి ప్రవర్తించెడిని. రాకా. రాధాతువునకు ఔణాదిక కప్రత్యయమువలన రాక అనియగును. దీనికంటె టాపుచేసిన రాకా అనియగును. అతః, అనుచోట తపరకరణములేనిచో నిచటి దీర్ఘాకారమునకు నిత్వము ప్రసక్తమయ్యెడిని. ఇత్వమునకు ఆప్పు నిమిత్తముగానిచో కారకః, (పుంలింగము) అనుచోట రేఫముపై యకారమున కిత్వము ప్రసక్తమగును.

(1 వా) మామక నరకశబ్దములందు కకారమునకు పూర్వమగు నకారమున కిత్వమును చెప్పదగును. ఈ శబ్దములందు కకారము ప్రత్యయస్థము కానందున సూత్రముచే నిత్వమప్రాప్తమగుచుండ నీ వార్తిక మారంభింపబడెను. మామికా. మమేయమ్, అను విగ్రహమున అస్మచ్ఛబ్దమున కణ్ ప్రత్యయము. ఇది పరమగునపుడు "తవకమమకావేక వచనే" (4-3-3) సూ. చే, నస్మచ్ఛమునకు మమకాదేశము. ఆదివృద్ధి టాపులచే మామకా అని యగును. ఇత్వముచే మామికా, అని యగును. నరికా. (నరాన్ కాయతి) నరశబ్దపూర్వక కై ధాతువునకు కప్రత్యయమువలన నరక అని యగును. దీనికంటె టాపుచేసిన నరకా అనియగును. ఇత్వముచే నరికా అనియగును. (2 వా) త్యక్, త్యప్, ప్రత్యయాన్తములందలి కకారమునకు పూర్వమగు నకారమున కిత్త్వమును చెప్పవలయును. "ఉదీచా...యాః" (169) సూ. చే, ప్రాప్తమగు నిత్వ వికల్పమున కిది బాధకము. ఉ: దాక్షిణాత్యికా. అవ్యయమగు దక్షిణా శబ్దమునకు (దక్షిణదిక్కున సమీపమందున్నది) 'దక్షిణాభవా' అను విగ్రహమందు త్యక్ ప్రత్యయము, ఆదివృద్ధి, టాపు, వీనిచే దాక్షిణాత్యా అని యగును. దీనికంటె అజ్ఞాతాద్యర్థమున కప్రత్యయము, కప్రత్యయాన్తముకంటె తిరుగ టాపు, హ్రస్వము, వీనిచే దాక్షిణాత్యకా అని సిద్ధమగును. ఇత్వము దాక్షిణాత్యికా. ఇచట కకారమునకు పూర్వమగు నకారము ఆకారస్థానికమగుటచే "ఉదీచామాతః" అను సూత్రమువలన నిత్వము వికల్పముగ ప్రాప్తమగుచున్నది. ఇహత్యికా. ఇహ, అను నవ్యయముకంటె త్యప్ ప్రత్యయము. దాక్షిణాత్యికా, అను రూపమునందువలె కప్రత్యయాదుల ప్రక్రియ మాహింపనది.

* 467. న యాసయోః 7-3-45 న। యాసయోః. (ఇత్)

యత్తదోరస్యేన్న స్యాత్। యకా। సకా। యకామ్। తకామ్। (1 వా) త్యకనశ్చ నిషేధః। అధిత్యకా। ఉపత్యకా। (2 వా) ఆశిషి వునశ్చ న। జీవకా। భవకా। (3 వా) ఉత్తరపదలోపే న। దేవదత్తికా। దేవకా। (4 వా) * క్షిపకాదీనాం చ। క్షిపకా। ధ్రువకా। కన్యకా। చటకా। (5 వా) తారకా జ్యోతిషి। అన్యత్ర తారికా। (6 వా) వర్ణకా తాన్తవే। అన్యత్ర వర్ణికా। (7 వా) వర్తకా శకునౌ ప్రాచామ్। ఉదీచాం తు వర్తికా (8 వా) అష్టకా పితృదేవత్యే। అష్టికాన్యా। (9 వా) సూతకా పుత్రికా బృన్దారకాణాం వేతి వక్తవ్యమ్। ఇహ వా అ, ఇతి చ్ఛేదః। కాత్పూర్వస్యాకారాదేశో వేత్యర్థః। తేన పుత్రికాశబ్దే జీన ఈవర్ణస్య పక్షేఽకారః। అన్యత్రేత్త్వబాధనార్థమకారస్యైవ పక్షేఽకారః। సూతకా। సూతికేత్యాది॥

467. యత్తచ్ఛబ్దములయొక్క అకారమున కిత్త్వము రాదు. పూర్వసూత్రప్రాప్తమగు నిత్త్వమున కిది నిషేధము. ఉదా:— యకా. సకా. యత్తచ్ఛబ్దములు సర్వనామములగుటవలన నకచ్ ప్రత్యయమగును. యకద్। తకద్। త్యదాద్యత్త్వము. టాపు। యకామ్। తకామ్। అను ద్వితీయైక వచనములను గూడ నుదాహరించుట కాశయమిది: సూత్రమున యాసాశబ్దములు స్వరూపబోధకములనిన ప్రథమైక వచనములందే ఇత్త్వనిషేధమను నర్థము లభించును. స్వరూపమును వివక్షింపక యాసా అనునవి యత్తచ్ఛబ్దముల కుపలక్షణమనియు, యత్తచ్ఛబ్దములయొక్క అకారమున కిత్త్వనిషేధ మనియును, వ్యాఖ్యానము చేయుటకు ఫలమును చూపుటకై వీని నుదాహరించెనని.

1 (వా) త్యకన్ ప్రత్యయాన్తమున కిత్త్వ నిషేధమును చెప్పవలయును. "ప్రత్యయస్థాత్" సూత్రప్రాప్తమగు నిత్త్వమునకు నిషేధము. ఉదా:— అధిత్యకా। ఉపత్యకా। అధి, ఉప అను నవ్యయములకంటె త్యకన్ ప్రత్యయము. టాపు. 2 (వా) ఆశీర్వాద రూపార్థమున విధింపబడు వున్ ప్రత్యయముయొక్క స్థానమునవచ్చెడి అకారమున కిత్త్వము రాదు. ఉదా: జీవకా, భవకా, జీవతాత్, భవతాత్, అను నర్థమున క్రమముగ జీవ భూధాతువులకు

---

* క్షిపకా, ధ్రువకా, చరకా, సేవకా, కరకా, చటకా, అవకా, లహకా, అలకా, కన్యకా, ఏడకా, ఏతే క్షిపకాదయః. ఆకృతిగణోఽయమ్.

వున్ ప్రత్యయము, అకారాదేశము. టాపు. 3 (వా) ఉత్తరపదమునకు లోపమగు నపుడు ఇత్త్వము రాదు. ఉదా:—దేవకా। దేవదత్త శబ్దమునకు స్వార్థిక క ప్రత్యయము. టాపు. "అనజాదౌ విభాషా లోపో వక్తవ్యః" (వాలాది ప్రత్యయము పరమగునపుడు ప్రత్యయ ప్రకృతిలో రెండవ యచ్చునకు పైగా నున్న భాగమునకు వికల్పముగ లోపమగును.) అను తద్ధితప్రకరణమున జెప్ప బోవు వార్తికముచే నుత్తరపదమగు దత్తశబ్దమునకు లోపమగును. ఇచట ప్రత్యయ కకారమునకు పూర్వముగు వకారమున కిత్త్వనిషేధము. దేవకా అను చోట నుత్తరపదమగు దత్తశబ్దమునకు లోపము వచ్చినదనియు, లోపము రానపు డిత్త్వము వచ్చుననియును తెల్పుటకై దేవదత్తికా శబ్దముగూడ నుదాహరింపబడెను. 4 (వా) క్షిపకా, మొదలగు శబ్దములయొక్క ఆకార మున కిత్త్వనిషేధము చెప్పవలయును. ఉదా:—క్షిపకా, క్షిప, ధ్రువ, కన్య, చట, ఇవి క్షిపకాదులు. కృదన్తములు. టాపు. టాబన్తమునకు కప్రత్య యము. తిరుగ టాపు. మొదటి టాపునకు హ్రస్వము. దీనికి ప్రాప్తమగు నిత్త్వమునకు నిషేధము. క్షిపకాదిగణ మాకృతిగణము. (వీనితో సదృశము లగువాని నిందు జేర్పవగును.) కావున కన్యకా, చరకా, అలకా, కరకా మొదలగు వానియందు నిత్త్వనిషేధము ప్రవర్తించుటచే నివి సాధువులగును. 5 (వా) జ్యోతిశ్శబ్దమునకు, నక్షత్రము, కనుపాప, అర్థములు. ఈయర్థము లందు తారకాశబ్దమున నిత్త్వము రాదు. ఉదా:—తారకా, తారక అనునది తౄ ధాతువునకు ణ్వుల్ ప్రత్యయాన్తము. దీనికంటె టాపు, అర్థాన్తరమున తారికా. 6 (వా) తన్తు వికారము అర్థమగునపుడు వర్ణకాశబ్దమందు ణకారముపై అకారమున కిత్త్వము ప్రవర్తించదు. ఉదా:—వర్ణకా. ఇది వర్ణ ధాతువునకు ణ్వుల్ ప్రత్యయాన్తము. అర్థాన్తరమం దిత్త్వమగును. వర్ణికా (స్తోత్రముచేయు ఆమది). 7 (వా) పక్షిని బోధించు వర్తకా శబ్దమందు కకార పరకాఽకార మునకు ప్రాగ్దేశస్థులగు వైయాకరణుల మతమున నిత్త్వము రాదు. వర్తక, అనునది ణిజన్తమగు వర్తిధాతువునకు ణ్వుల్ ప్రత్యయాన్తము. టాపు. వార్తిక మున "ప్రాచామ్" అని యనుటచే నుత్తరదేశస్థులగు వైయాకరణుల మతమున పక్షిని బోధించు. వర్తకాశబ్దమున నిత్త్వము ప్రవర్తించునని యాశయము. వర్తికా, వర్తకాశబ్దము శకున బోధకము కానపు డుభయుల మతమందు నిత్త్వము నిత్యముగ వచ్చుననునర్థము ఫలితమగును. 8 (వా) పితృదేవతలకొఱకై చేయబడు కర్మవిశేషమును ప్రతిపాదించు నష్టకాశబ్దమం దిత్త్వ ప్రతిషేధమును చెప్పవలయును. వార్తికమున పితృదేవత్యే, అను పదము పితరశ్చతా దేవ తాశ్చ = పితృదేవతాః, తదర్థం కర్మ అను వ్యుత్పత్తిచే పూర్వోక్తార్థమును బోధించును. ఉదా:—అష్టకా. ఇది అశ ధాతువునకు తకన్ ప్రత్యయాన్తము. అష్టక. ' టాపు. (అశ్నన్తి బ్రాహ్మణా యత్ర = అష్టకా, అను పేరుగల

(శ్రాద్ధవిశేషము) అర్థాన్తరమం దిత్వము ప్రవర్తించును. అష్టికా. (అష్టౌ పరిమాణ మస్యాః) అష్టన్ శబ్దముకంటె కన్ ప్రత్యయము. టాపు. ఇకార రహితమగునది శ్రాద్ధవిశేషమున సాధువు, ఇకారముతో గూడినది యర్థాన్తరమున సాధువను నర్థము ఫలితమగును.

9 (వా) ఈ వార్తికమున "వేతి" అనుచోట 'వా' అ, ఇతి, అని భేదము. సూతకా, పుత్రికా, బృందారకా శబ్దములందు కకారపరకమగు వర్ణమున కవర్ణము వికల్పముగనగునని యర్థము. సూతకా బృన్దారకా శబ్దములం దిత్వబాధనార్థ మకారమున కకారవిధానమనియు, పుత్రికాశబ్దమునం దికార మునకు అకార విధానమనియును గ్రహించునది. సూతకశబ్దము స్వార్థిక కప్రత్యయాన్తము. దీనికి, టాపుచేసిన సూతకా (పుట్టినది) అని యగును. అకారాదేశాభావపక్షమం దిత్త్వము. సూతికా. పుత్రశబ్దము శార్ఙ్గరవాదిగణమున నున్నందున దీనికంటె "శార్ఙ్గరవాదిభ్యో ఙీన్" (530) సూ. చే, ఙీన్ ప్రత్యయము వచ్చును. పుత్రీ శబ్దమునకు స్వార్థమందు కప్రత్యయము. ఈకారమునకు హ్రస్వముచే పుత్రిక అని యగును. దీనికి టాపుచేసిన పుత్రికా అని సిద్ధమగును. అకారము ప్రవర్తించు పక్షమున పుత్రకా అని యగును. బృన్దారకా (బృన్దమస్యాస్తి) బృన్దశబ్దమునకు మతుబర్థకమగు 'ఆరకన్' ప్రత్యయము. టాపు. ఇది దేవతావాచక మగునపుడు పుంలిఙ్గమైనను, ముఖ్యవాచక మగునపుడు త్రిలిఙ్గమని, త్రిషూత్తరే అని యారంభించి "బృన్దారకారూపి ముఖ్యౌ" అని యమరమున చెప్పబడినందున బృన్దారకా శబ్దము స్త్రీలిఙ్గమగును. అకారాదేశాభావ పక్షమందు బృన్దారికా అని యగును.

* 468. ఉదీచామాతః స్థానే యకపూర్వాయాః। 7-3-40
ఉదీచామ్। ఆతః। స్థానే। యకపూర్వాయాః) (ప్రత్యయస్థా దితిసూత్రమ్। న।)

యకపూర్వస్య స్త్రీ ప్రత్యయాకారస్య స్థానే యోఽకార స్తస్య కాత్పూర్వస్యేద్వా స్యాదాపి పరే। కేఽణ ఇతి హ్రస్వః। ఆర్యకా। ఆర్యికా। చటకకా। చటకికా। ఆతః కిమ్। సాంకాశ్యే భవా। సాంకాశ్యకా। యకేతి కిమ్। అశ్వికా। స్త్రీప్రత్యయేతి కిమ్। శుభం యాతీతి శుభంయాః। అజ్ఞాతా శుభంయాః శుభంయికా। (వా) ధాత్వన్తయకోస్తు నిత్యమ్। సునయికా। సుపాకికా॥

468. అర్థమందుండు స్త్రీత్వము నాకారమునం దారోపించుటచే స్త్రీ ప్రత్యయాకారమను నర్థము లభించును. దీనికి 'యకపూర్వాయాః' అనునది విశేషణమగుటచే నిచట స్త్రీలిఙ్గ నిర్దేశ ముపపన్నమగును. యకారముగాని కకారముగాని యవ్యవహిత పూర్వమందు గలదియు స్త్రీ ప్రత్యయాఽకార స్థానికము, ప్రత్యయస్థ కకారమునకు పూర్వమునగు అకారమునకు అపు పరమగు నపు డుత్తరదేశస్థుల మతమం దిత్వము రాదని యర్థము. ఇతరుల మతమునం దిత్వము వచ్చును. (ఇత్వనిషేధము వికల్పమనుటవలన నిత్వవికల్పము ఫలిత మగును) ఉదా:—ఆర్యకా। ఆర్యికా। ఆర్యశబ్దమునకు టాపు, కప్రత్యయము. "కేఽణః" (838) సూ. చే, టాబన్తమునకు హ్రస్వము. సముదాయముకంటె తిరుగ టాపు, ఆర్యకా అని యగును. ఇచట యకారముమీది అకార ముక్త లక్షణ లక్షితమగుటవలన నిత్వనిషేధము ప్రవర్తించును. నిషేధాఽభావ పక్షమం దిత్వము. కకారపూర్వమున కుదాహరణము:—చటకకా, చటకికా, ఆర్యకా శబ్దమునకువలె కప్ప్రత్యయాదులవలన పై రూపద్వయము సిద్ధమగును.

సాంకాశ్యికా, అనుచోటునం దిత్వనిషేధము ప్రవర్తింపకుండుటకై అకారమునకు "అతః, అను విశేషణ మావశ్యకము. "అతః కిమ్", అను ప్రశ్నమున కాశయము:—"ఉదీచాం, యకపూర్వాయాః" అనియే సూత్ర మగుగాక, యకపూర్వాయాః అను స్త్రీలిఙ్గ నిర్దేశమువలన యకపూర్వకమును, స్త్రీబోధకము నగు అకారమున కిత్వనిషేధమను నర్థము లభించును. "సాంకాశ్యే భవా" (సాంకాశ్యమం దుత్పన్నమైన స్త్రీ) అను నర్థమందు విహితమగు వుఞ్ (అక) ప్రత్యయ మన్తమందుగలది సాంకాశ్యికా, అను రూపము. ఇచట నకప్రత్యయము స్త్రీబోధకమగును. కాని ప్రత్యయావయవ మగు నకారము స్త్రీబోధకము గానందున దోషములేదని. సాంకాశ్యికా అను సమాధానమున కాశయమేమన, బహులక్ష్యానురోధమువలన "స్త్రీబోధకమగు నకారమునకని యర్థముగాక స్త్రీబోధకాఽవయవమగు నకారమునకని" యర్థ మును చెప్పవలయును. అపుడు సాంకాశ్యికా, అనుచోట నకారము స్త్రీబోధక మగు నకప్రత్యయాఽవయవమైనందున దోషము వచ్చునని, వకారపూర్వకమగు నకారముగల 'అశ్వికా' ఇత్యాదులం దిత్వనిషేధము ప్రవర్తింపకుండుటకై "యకపూర్వాయాః" అను విశేషణ మావశ్యకము. "స్త్రీ ప్రత్యయేతి కిమ్". ఈ యర్థమును బోధించుటకు "యకపూర్వాయాః" అనుచోట స్త్రీలిఙ్గనిర్దేశ మెందులకని ప్రశ్నాఽశయము. శుభంయికా, అనుచోట నిత్వవికల్పమును వారించుట కావశ్యకమని సమాధానము. శుభంయాతి, అను నర్థముగలది 'శుభంయాః' అనునది, ఇది శుభమ్మను నిపాతము పూర్వమందుగల యాధాతువు ప్రకృతిగగల కృదన్తము. పిదప అజ్ఞాతార్థమున కప్రత్యయము "కేఽణః" (838) సూ. చే, హ్రస్వము. సముదాయముకంటె తిరుగ టాపు ఇచట కకార పరకమగు నకార మాకారస్థానికమైన నా యకారము స్త్రీప్రత్యయము గానందు

దున దోషము వారితమగునని భావము. (వా) ధాతువున కన్తములగు యకార కకారములు పూర్వమందుగల అకారమున కిత్త్వము నిత్యముగ నగునని వార్తికార్థము. ఉ:- సునయికా. సునయా అనునది బహువ్రీహి. టాబన్తము. (సుష్ఠు నయో యస్యాః) కప్రత్యయము హ్రస్వము. సముదాయమునకు తిరుగ టాపు. ఇచట యకారము 'నీఞ్' ధాతువునకు గుణాయాదేశములచే సిద్ధమగుట వలన ధాత్వన్తమగును గాన నిత్త్వము నిత్యముగనగును. సుపాకికా (సుష్ఠు పాకో యస్యాః) ఇచట కకారము పచధాత్వన్తమగుటచే నిత్త్వము నిత్యముగ నగును.

* 469. భస్త్రైషాజాజ్ఞాద్వాస్వానఞ్పూర్వాణామపి. 7-3-47.
భస్త్రైషాజాజ్ఞాద్వాస్వా। నఞ్పూర్వాణామ్। అపి (ప్రత్యయస్థా దితిసూత్రమ్। ఉదీచా మితిసూత్రమ్, న)

స్వేత్యన్తం లుప్తషష్ఠీకం పదమ్। ఏషా మత ఇద్వా స్యాత్। తదన్తవిధినైవ సిద్ధే నఞ్పూర్వాణామపీతి స్పష్టార్థమ్। భస్త్రాగ్రహణ ముపసర్జనార్థమ్। అన్యస్య తూత్తరసూత్రేణ సిద్ధమ్। ఏషా ద్వా ఏతయోస్తు సపూర్వయోర్నేత్త్వమ్. అన్తర్వర్తినీం విభక్తి మాశ్రిత్యాఽసుప ఇతి ప్రతిషేధాత్. అనేషకా. పరమైషకా. అద్వకే. పరమద్వకే. స్వశబ్దగ్రహణం సంజ్ఞోపసర్జనార్థమ్। ఇహ హి ఆతః స్థానే ఇత్యనువృత్తం స్వశబ్దస్యాతో విశేషణం, న తు ద్వైషయోరసంభవాత్ । నాఽప్యన్యేషామవ్యభిచారాత్ । స్వశబ్దస్త్వ నుపసర్జనమాత్మీయవాచీ అకజర్థః। అర్థాన్తరే తు న స్త్రీ। సంజ్ఞోపసర్జనీభూతస్తు కప్రత్యయాన్తత్వా ద్భవత్యుదాహరణమ్। ఏవం చాత్మీయాయాం స్వికా పరమస్వికేతి నిత్యమేవేత్త్వమ్। నిర్భస్త్రకా। నిర్భస్త్రికా। ఏషకా। ఏషికా। కృతవత్వనిర్దేశాన్నేహ ఏజల్పాః। ఏతికే। ఏతికాః। అజకా। అజికా। జ్ఞకా। జ్ఞికా। ద్వకే। ద్వికే। నిఃస్వకా। నిఃస్వికా॥

469. పూర్వసూత్రమువలె నిదియు నిత్త్వనిషేధ వికల్పమునే బోధించును. భస్త్రాదులలో నకారము, యకార కకార పూర్వకము గానందున పూర్వసూత్ర మప్రాప్తమగుచుండ నీసూత్ర మారంభింపబడెను. సూత్రమున "భస్త్రైషాజాజ్ఞాద్వాస్వా" అనునది భస్త్రా, ఏషా, అజా, జ్ఞా, ద్వా, స్వా,

పదములకు ద్వంద్వము. దానికంటె షష్ఠీవిభక్తిని చేసినచో "భస్త్రైషా... ద్వానాం" అని యగును. షష్ఠీవిభక్తికి లుక్కు చేయబడి నిర్దేశింపబడెను. భస్త్రాది శబ్దములలోని ప్రత్యయస్థ కకారమునకు పూర్వమగు నకారమునకు ఆపు పరమగునపు డిత్త్వనిషేధము వికల్పముగ నగునని సూత్రార్థము. ఇత్త్వవికల్పము ఫలితమగును. "నఞ్ పూర్వాణామపి" అనుచోట నపి శబ్దము నఞ్ కంటె భిన్నమగు పదము పూర్వమందుగలవానికిని, కేవల భస్త్రాదులకు నిత్యవికల్పమును బోధించును. ఈ సూత్ర మఙ్గాధికారములోని దగుటవలన "పదాఙ్గాధికారే తస్య చ తద న్తస్య చ" అను పరిభాషచే నీ యర్థము లభించుచుండ "నఞ్ పూర్వాణామపి" అనునది యీ యర్థమును స్పష్టముగ బోధించుటకగును.

అనుపసర్జనమగు (ప్రధానార్థకము) భస్త్రా శబ్దమునకు అభాషిత పుంస్కాచ్చ, అను నుత్తర సూత్రముచే నిత్యవికల్పము సిద్ధమగును గాన నితరార్థమునకు విశేషణమగు నర్థమును బోధించుటచే నుపసర్జనమగు భస్త్రా శబ్దమున నిత్త్వవికల్పముకొఱకీ సూత్రమున భస్త్రా శబ్దము గ్రహింపబడెనని గ్రహించునది. అసుపః, అనుపదమిచట ననువర్తించుటచే ఆపు సుబన్తముకంటె పరమగుచో నీ సూత్రము ప్రవర్తించదను నర్థము లభించును. "న, ఏతద్ + సు" అను విగ్రహమున ఏతచ్ఛబ్దమున కకచ్ ప్రత్యయము ప్రవర్తించినపిదపగాని, తత్పూర్వమందుగాని నఞ్ తత్పురుషమగును. "అన్తరఙ్గానపి విధీన్ బహిరఙ్గో లుగ్బాధతే" (బహిరఙ్గమైనను లుక్కు అన్తరఙ్గ కార్యములను బాధించును). అను పరిభాషచే నన్తరఙ్గమగు త్యదాద్యత్వమునకు పూర్వము సుప్పులకు లుక్కగును. పిమ్మట 'అనేతకద్' అను సమాసముకంటె సుప్ ప్రత్యయమగును. త్యదాద్యత్వము. టాపు. ఈ టాపు, ఏతచ్ఛబ్దముకంటె మొదట ప్రవృత్తమగు, సుప్పుకంటె పరమగుటచే "అసుపః" అను నిషేధము ప్రవర్తించునుగాన అనేషకా, పరమైషకా, అద్వకే, పరమద్వకే, ఇత్యాదులందనగా విద్యమాన పూర్వావయవకములగు ఏషా, ద్వా వీనియొక్క అకారమునకీ వికల్పము ప్రవర్తించదు.

ఇచట ననువృత్తమగు 'అతః' అనునది స్వశబ్దముయొక్క అకారమునకే విశేషణమగును. సర్వనామములగు ద్వా, ఏషా, శబ్దములం దకచ్ ప్రత్యయము వచ్చుటచే వీని యకారమెప్పుడును ఆకారస్థానమున వచ్చుట యసంభవము గాన నీ విశేషణమున కచట ప్రయోజనము లేదు. కప్రత్యయాన్తములగు మిగిలిన శబ్దములం దకారమెల్లప్పుడు నాకారస్థానమందే వచ్చునదగుటవలన నీ విశేషణము లేకున్నను దోషములేదు గాన నితరములకు నిది విశేషణము గాదు. సంభవ వ్యభిచారము లున్నపుడే విశేషణము సార్థకమగునుగదా. స్వశబ్దము సర్వనామమగు నపుడకచ్చు ప్రవర్తించును. అపు డకార మ్మాకార స్థానికముగాదు.

సర్వనామము కానపుడు కప్రత్యయమగును. అపు డకార మాకార స్థానికమగును. ఇచట నిట్లు, సంభవ వ్యభిచారము లుండుటవలన స్వశబ్దాకారమునకే అతః అను నది విశేషణమగును. సర్వనామముకానట్టి (సంజ్ఞోపసర్జనమగు) స్వశబ్దము యొక్క అకారమున కిత్త్వవికల్పము ఫలితమగును. స్వశబ్దమునకు ఆత్మ, ఆత్మీయులు, జ్ఞాతి, ధనము, అర్థము అనుపసర్జనమై ఆత్మీయ వాచకమగు స్వశబ్దము సర్వనామమగుటచే నకచ్ ప్రత్యయమున కర్హమగును. మిగిలిన యర్థములందు స్వశబ్దము స్త్రీలింగమే కాదు. సంజ్ఞాబోధకము, ఉపసర్జనమగు స్వశబ్దము, సర్వనామము కానందున కప్రత్యయమున కర్హమగును. కనుక నట్టి స్వశబ్దము కప్రత్యయాన్తమగుటచే నీసూత్రమున కుదాహరణమగును. (నిఃస్వకా, నిఃస్వికా) ఆత్మీయబోధకము నకజన్తమునగు స్వశబ్దముయొక్క అకార మాకారస్థానికము గానందున నీ వికల్పము ప్రవర్తించదు. "ప్రత్యయస్థాత్" సూ. చే, నిత్త్వము నిత్యముగనే వచ్చును. (స్వికా, పరమస్వికా)

సూత్రమునకు ప్రత్యుదాహరణములను జూపి యుదాహరణములను జూపుచున్నాడు. నిర్భస్త్రికా, నిర్భస్త్రకా. (నిష్క్రాన్తా భస్త్రాయాః) నిర్భస్త్రా అనుదానికి ఉపసర్జన నిమిత్తకమగు హ్రస్వము. టాపు. కప్రత్యయము. 'కేఽణః' సూ. చే, హ్రస్వము. కప్రత్యయాన్తముకంటె తిరుగ టాపు. ఇట్టి ప్రక్రియచే పైనిచూపబడిన రూపములగును. ఏషకా, ఏషికా. ఈ ఏతచ్ఛబ్దమకచ్ ప్రత్యయ సహితము. ఏతకద్ + సు. త్యదాద్యత్వము. టాపు. సులోపము. తకారమునకు సత్వము, షత్వము. సూత్రమున ఏషా. అను షత్వముతో గూడిన నిర్దేశమును చేయుటచే షత్వము గల ఏతచ్ఛబ్దమందే ఇత్త్వవికల్పమగునని యూహింపవలయును. ప్రథమైకవచనమునందే షత్వసహితమగు రూపమగును. కావున ఏతికే, ఏతికాః, ఇత్యాదులందిత్త్వము నిత్యముగనే వచ్చును. అజకా, అజికా. అజాశబ్దముకంటె కప్రత్యయము. హ్రస్వము. టాపు. నిఃస్వకా, నిఃస్వికా, "స్వస్యాః నిష్క్రాన్తా" అను విగ్రహమున "నిఃస్వా" అని యగును. ఉపసర్జన హ్రస్వము, టాపు. కప్రత్యయము. హ్రస్వము. తిరుగ టాపు. ఇట్లే జ్ఞకా. జ్ఞికా ఇత్యాదులు.

* 470. అభాషితపుంస్కాచ్చ 7-3-48 అభాషితపుంస్కాత్। చ। ("ఉదీచామాతః" సూత్రమ్ "ప్రత్యయస్థాత్" సూత్రమ్).

ఏతస్మాద్విహితస్యాఽతః స్థానేఽత ఇద్వా స్యాత్। గఙ్గకా। గఙ్గికా। బహువ్రీహేర్భాషిత పుంస్కాత్వాత్తతో విహితస్య నిత్యమ్। అజ్ఞాతా అఖట్వా, అఖట్వికా। శైషికే కపి తు వికల్ప ఏవ॥

470. అభాషితః పుమాన్ యేన సః=అభాషిత పుంస్కః, తస్మాత్ = అభాషిత పుంస్కాత్. పురుషబోధకముకానట్టి శబ్దమని యర్థము. 'విహితస్య' అనునది యధ్యాహారలభ్యము. అభాషిత పుంస్కముకంటె విధింపబడు నాకారముయొక్క స్థానమున ప్రవర్తించిన అకారమున కిత్త్వనిషేధము వికల్పముగ నగునని సూత్రార్థము. ఇత్త్వవికల్పము ఫలితము. ఉదా = గఙ్గకా, గఙ్గికా. నిత్యస్త్రీలిఙ్గమగు గఙ్గ అను ప్రాతిపదికమున టాపు. క ప్రత్యయము. హ్రస్వము. కప్రత్యయాన్తముకంటె తిరుగ టాపు.

"బహువ్రీహేః......నిత్యమ్" అను గ్రన్థముచే విహిత పదాధ్యాహార మునకు ఫలమును జూపుచున్నాడు:—'అఖట్వికా, ఇత్యాది బహువ్రీహి సమాసమున నిత్త్వవికల్పమును వారించుట యధ్యాహారమునకు ఫలము. "అవిద్యమానా, ఖట్వా యస్యాః" అను విగ్రహమున 'అఖట్వా' అనునది బహువ్రీహి. "శేషాద్విభాషా" (896) సూ. చే, విధింపబడు బహువ్రీహి సమాసాన్తమగు కప్ ప్రత్యయము వైకల్పికమగుటచే, కబభావపక్షమున నుప సర్జన హ్రస్వము. భాషితపుంస్కమగు నఖట్వ శబ్దముకంటె తిరుగ టాపు "అఖట్వా" అని యగును. "అజ్ఞాతా, అఖట్వా" అను నర్థమందు, కప్రత్యయ మగును, "కేఽణః" (833) సూ. చే, హ్రస్వము. కప్రత్యయాన్తముకంటె తిరుగ టాపు ప్రవర్తించును, 'అఖట్వకా' అని యగును. ఇచట కకారమునకు పూర్వమందుండు అకారము భాషితపుంస్కమగు నఖట్వ శబ్దముకంటె విధింప బడు టాపుయొక్క స్థానమున ప్రవర్తించినదగుటవలన నీ వికల్పము ప్రవర్తిం చదు. కావున నిత్యమగు నిత్త్వమే ప్రవర్తించును. విహిత విశేషణము లేనపుడు, అభాషిత పుంస్కముకంటె పరమగు నాకారముయొక్క స్థానమందగు నకార మున కిత్త్వము వికల్పముగ నగునను నర్థము లభించును. అట్లయిన నఖట్వికా, అను రూపమునందు భాషితపుంస్కమగు నఖట్వశబ్దముకంటె విధింపబడిన టాప్ ప్రత్యయ మభాషితపుంస్కమగు ఖట్వాశబ్దమునకు పరమగుటచే నీ వికల్పము ప్రసక్తమగును.

అఖట్వా, అను బహువ్రీహికి సమాసాన్తమగు కప్ ప్రత్యయముయొక్క ప్రవృత్తిపక్షమం దీ వికల్పము ప్రవర్తించును. న ఖట్వా + సు, అను నవస్థ యందే ఉపసర్జన హ్రస్వమును బాధించి కప్ప్రత్యయము ప్రవర్తించును. పిదప సమాసరూపమగు ప్రాతిపదికము (అఖట్వాక) స్త్రీ ప్రత్యయాన్తము కానందున నుపసర్జన హ్రస్వము ప్రవర్తించదు. "కేఽణః" సూ. చే, విహితమగు హ్రస్వము "నకపి" (829) (కప్ప్రత్యయము పరమగునపు డణ్ణునకు హ్రస్వము రాదు), సూ. చే, నిషేధింపబడెను. "ఆపోఽన్యతర స్యామ్" (897) (కప్ప్రత్యయము పరమగనున్నపుడాబన్తమునకు హ్రస్వము వికల్పముగ నగును) సూ. చే, హ్రస్వము. అఖట్వక. కప్రత్యయాన్తమునకు తిరుగ టాపు. అఖట్వకా. ఇచట నకారము అభాషిత పుంస్కమగు ఖట్వ

శబ్దముకంటె విధింపబడు నాకారముయొక్క స్థానమున వచ్చినదగుటచే నీ వికల్పము ప్రవర్తించుటచే అఖట్వికా, అఖట్వికా, అను రూపద్వయము సిద్ధమగును. హ్రస్వాభావపక్షమున అఖట్వాకా అని మూడవ రూపముగూడ నగును.

* 471. ఆదాచార్యాణామ్. 7-3-49. ఆత్ । ఆచార్యాణామ్।

పూర్వసూత్రవిషయే ఆద్వా స్యాత్ । గ
ఙ్గాకా। ఉక్తపుంస్కాత్తు శుభ్రికా॥

471. పూర్వసూత్రముచే నిత్త్వవికల్పము ప్రవర్తించుటకు యోగ్యమగు నకారమునకు ఆకారము, కొందఱు వైయాకరణుల మతమందు వచ్చునని సూత్రార్థము. వికల్పము ఫలితమగును. ఉదా:— గఙ్గాకా। ఇత్త్వాత్త్వములు రెండును వికల్పములగుటవలన నీ రెండును ప్రవర్తింపనిరూప మొకటి యగును. మొత్తమున మూడురూపములు సాధువులగును. భాషితపుంస్కమునం దీ రెండు సూత్రములును ప్రవర్తింపవు. నిత్యమగు నిత్త్వమే వచ్చును. శుభ్రికా. శుభ్ర శబ్దము విశేష్యనిఘ్నమగుటచే, అనియతలిఙ్గముగాన భాషితపుంస్కమగును.

* 472. అనుపసర్జనాత్. 4-1-14.

అధికారోఽయం, యూనస్తిరిత్యభివ్యాప్య.
అయమేవ స్త్రీప్రత్యయేషు తదన్తవిధిం జ్ఞాపయతి॥

472. ఇది యధికార సూత్రము. వక్ష్యమాణ సూత్రములచే విధింపబడు ప్రత్యయములు అనుపసర్జనమగు ప్రాతిపదికముకంటె ప్రవర్తించునని బోధించును. "యూనస్తిః" (4-1-77) అను సూత్రమువరకు ననగా నా సూత్రము లోనికి నధికృతమగును. ఇందుకు ఫల మా సూత్రమున మూలమున చూపబడును. బహుకురుచరా, ఇత్యాదులందు జీబాదివారణ మీ యధికారమునకు ప్రయోజనము. బహుకురుచరా, అనునది "బహవః కురుచరా యస్యామ్" అను విగ్రహముగల బహువ్రీహి. ఇది యన్యపదార్థ ప్రధానకము. కావున నిచట కురుచర, అనునది యుపసర్జనము. "సమాస ప్రత్యయవిధౌ ప్రతిషేధః" అను దానిచే స్త్రీప్రత్యయ విధాయక సూత్రములందు తదన్తవిధి నిషేధింపబడుటవలన "టిడ్ఢాణఞ్..." (473) ఇత్యాది సూత్రములందు "యేనవిధిః" సూ. చే, తదన్తవిధి ప్రవర్తించదు. "టిడ్ఢాణఞ్" ఇత్యాది సూత్రములందు టిదాద్యన్తమగు ప్రాతిపదికముకంటె జీబాదులగునని యే యర్థము లభించును. ప్రకృతమున 'కురుచర' అనునదియే టిదన్తమగును గాని 'బహుకురుచర' అనునది కాదు. అందుచే నిచట జీప్ ప్రసక్తియే లేనందున నిచట జీప్ నివృత్తికై యధికారము వ్యర్థమగును. ఇట్లు వ్యర్థమై స్త్రీ ప్రత్యయవిధాయక సూత్రములందు మాత్రము 'యేనవిధిః' అను సూ. చే, తదన్తవిధి కల్గునను నర్థమును జ్ఞాపకమగును.

అపుడు స్త్రీప్రత్యయ విధాయకసూత్ర గృహీతము లంతమందుగలవానికంటె గూడ ప్రత్యయములు వచ్చుననుసగము లభించును. కనుక "బహుకురుచర" అనునది టిదన్తాన్త ప్రాతిపదికమగుటచే "టిడ్ఢాణఞ్" సూ. చే, ప్రాప్తమగు ఙీపును వారించుటకై యధికారసూత్ర మావశ్యకము. తదన్తవిధి జ్ఞాపనోత్తర మున అనుపసర్జనాత్తనునది సూత్రగృహీతమునకే విశేషణము. టిడ్ఢాణఞ్ సూత్రమున గృహీతము టిదన్తమగును. బహుకురుచర అనుచోట టిదన్తమగు కురుచర అనునది యుపసర్జనము. ఇచట ఙీబ్వారణార్థ మధికార మావశ్యక మగుటచే తదన్తవిధి జ్ఞాపకత్వము సుఘమగును. ఈ యధికారము తత్తత్సూత్రము లందు గ్రహింపబడుదానికే విశేషణ మనియును, "స్త్రియామ్" అనునది స్త్రీప్రత్యయ ప్రకృతి కనగా దేనికంటె స్త్రీప్రత్యయము విధింపబడునో దానికి విశేషణమనియును గ్రహింపవలయును. ఇందు వ్యాఖ్యానమే మానము.

* 473. టిడ్ఢాణఞ్ ద్వయసజ్దఘ్నఞ్ మాత్రచ్తయప్ ఠక్ ఠఞ్కఞ్క్వరపః. 4-1-15. (ఙీప్, ప్రాతిపదికమ్, అతః).

అనుపసర్జనం యట్టిదాది తదన్తం యదదన్తం ప్రాతిపదికం తతః స్త్రియాం ఙీప్స్యాత్। కురుచరీ। ఉపసర్జనత్వాన్నేహ। బహుకురుచరా। నదట్। నదీ। వక్ష్యమాణేత్యత్ర టిత్త్వాదుగిత్త్వాచ్చ ఙీప్ ప్రాప్తః। యాసుటో ఙిత్త్వేన లాశ్రయానుబన్ధకార్యం నాఽఽదేశానామితి జ్ఞాపనాన్న భవతి। శ్నః శానచ శ్చిత్త్వేన క్వచిదనుబన్ధకార్యేఽప్యనల్విధావితి నిషేధజ్ఞాపనాద్వా। సౌపర్ణేయీ। ఐన్ద్రీ। ఔత్సీ। ఊరుద్వయసీ। ఊరుదఘ్నీ। ఊరుమాత్రీ। పంచతయీ। ఆక్షికీ। లావణికీ। యాదృశీ। ఇత్వరీ। (1 వా) తాచ్ఛీలికే ణేఽపి। చౌరీ। (2 వా) నఞ్ స్నఞీకక్ ఖ్యుంస్తరుణతలునానాముపసంఖ్యానమ్। స్త్రైణీ। పౌంస్నీ। శాక్తీకీ। ఆఢ్యంకరణీ। తరుణీ। తలునీ॥

473. (1) టిత్, (2) ఢ, (3) అణ్, (4) అఞ్, (5) ద్వయసచ్, (6) దఘ్నచ్, (7) మాత్రచ్, (8) తయప్, (9) ఠక్, (10) ఠఞ్, (11) కఞ్, (12) క్వరప్, వీనికి ద్వంద్వము. ఢ, మొదలు క్వరప్ వరకు ప్రత్యయములు. "ప్రత్యయగ్రహణ పరిభాష చే తదన్తవిధి. ఢ ప్రత్యయాన్తము, అణ్ ప్రత్యయాన్తము, ఇత్యాద్యర్థము లభించును. టిత్తనిత్సంజ్ఞక టకారము

గలది. ఇది ప్రత్యయము, తద్భిన్నముగూడ నగను. కావుననే యిచట ప్రత్యయ గ్రహణ పరిభాష ప్రవర్తించదు. అనుపసర్జనమగు టిత్తు, ఢాద్యన్తములు, యీ రెండు నదన్త ప్రాతిపదికమునకు విశేషణములు. అనుపసర్జనాధికారముచే జ్ఞాపితమగు తదన్తవిధియు ప్రవర్తించును. అనుపసర్జనమగు టిత్తు, అన్తమందు గల అదన్త ప్రాతిపదికము కంటెను, అనుపసర్జనములగు ఢాది ప్రత్యయాన్తము లన్తమందుగల యదన్త ప్రాతిపదికములకంటెను, స్త్రీలిఙ్గమున ఙీప్ ప్రత్యయము వచ్చునని సూత్రార్థము. టాపునకు బాధక మీ ఙీప్ ప్రత్యయము.

ప్రాతిపదికమునకు టిత్త్వము కొన్నిచోట్లులందు ప్రత్యయకృతము, కొన్నిచోట్లులందు స్వతస్సిద్ధము, మరికొన్నిచోట్లులందు ధాతుకృతమునగును. మొదటిదాని కుదాహరణము:— కురుచరీ (కురుషుచరతి) కురుశబ్దము పూర్వమందుగల చరధాతువునకు టప్రత్యయము విధింపబడెను. ఇచట ప్రత్యయము టిత్తయినందున ప్రయోజనములేదు కావున కురుచర, అను సముదాయమందు టిత్త్వమారోపింపదగును. కాన కురుచర, అనునది టిత్తగును. వ్యపదేశివద్భావముచే నిదియే తదన్తమునగును. ఙీప్ ప్రత్యయము. "యస్యేతిచ" సూ. చే, నకార లోపము. ఇట్లే సూత్రమున కుదాహరణములన్నిటిలోను ఙీపు, పరమగునపుడు, తుది యకారము లోపించునని యూహింపదగును. బహుకురుచరా. ఇచట సూత్రగృహీతమగు టిత్తు, అనగా కురుచర, అనునది యుపసర్జనమగుట వలన ఙీపు రాదు. రెండవ విధమగు టిదన్తప్రాతిపదికమున కుదాహరణము:— నదీ. నదట్, అనునది ప్రాతిపదికము. నద, అనునది స్వయముగనే టిత్తగుట వలన ఙీపగును.

వక్ష్యమాణా. ఇచట "వక్ష్యమాణేత్యత్ర......జ్ఞాపనాద్వా" అను గ్రంథముచే, ఙీబ్వారణోపాయము చూపబడెను. వచధాతువునకు ల్ృట్ ప్రత్యయము. తత్స్థానమున 'శానచు' (అన) ఆదేశమగును. వీనికి మధ్యను స్యప్రత్యయము (వికరణము) ధాతు చకారమునకు కత్వము. స్యప్రత్యయావయవ సకారమునకు షత్వము. వక్ష్య + అన, అని యగును. అన, అనునది పరమగునపుడు పూర్వమగు నకారమునకు ముగాగమమగును. వక్ష్యమాన, ణత్వము, వక్ష్యమాణ, అని యగును. ఇచట శానచ్ ప్రత్యయమునకు స్థానియగు ల్ృట్టు, టిత్తునుగిత్తు నగుటచే స్థానివద్భావమువలన శానచ్చుగూడ టిత్తునుగిత్తు నగును. వక్ష్యమాణ, అను ప్రాతిపదికము టిదన్తముగాని యుగిదన్తముగాని యగుటవలన "టిడ్ఢాణఞ్" సూ. చే, గాని "ఉగితశ్చ" సూ. చే, గాని ఙీపు ప్రసక్తమగుచున్నది. "నల్యపి" (6-4-69) అను సూత్ర మిత్సంజ్ఞా ప్రయుక్త కార్యములందు "అనల్విధౌ" అను నిషేధము ప్రవర్తించదనుటలో జ్ఞాపకమగును గాన "అనల్విధౌ" అను నిషేధమువలన నిచట టిత్త్వముగాని యుగిత్వముగాని స్థానివద్భావముచే శానచ్చునందు రాదనుటకు వీలులేదు. ప్రపూర్వక ధాఞ్ ధాతువునకు క్త్వా ప్రత్యయమగును. క్త్వా ప్రత్యయస్థానమున

ల్యప్పు ప్రవర్తించును, ప్రధాయ, అని యగును. ఇచట స్థానివద్భావముచే ల్యప్పు కిత్తగుటవలన "ఘుమాస్థాగాపా" (6-4-66) సూ. చే, ధాతువునకు ప్రాప్తమగు నీకారాదేశమును వారించుటకై "నల్యపి" (ల్యప్పు పరమగు నపుడు, ఘుమాస్థాదుల కీత్వము రాదు) అను నిషేధ మారంభింపబడెను. "అనల్విధౌ" అను నిషేధమువలన ల్యప్పునందు కిత్త్వ మతిదేశింపబడనందున నీ సూత్రము వ్యర్థమగుచు "అనుబంధకార్యేష్వ నల్విధా వితి నిషేధో న ప్రవర్తతే" అనుటలో జ్ఞాపకమగునని ఙీప్ శంకాగ్రంథమున కాశయము.

సమాధానము:—బ్రూయాత్, (బ్రూ ధాతువునకు విధిలిఙ్ ప్రథమైక వచనము) మొదలగు రూపములందు గుణవృద్ధి ప్రతిషేధార్థమై "యాసుట్పరస్మైపదే షూదాత్తో ఙిచ్చ" (3-4-103) సూ. చే, లిఙాదేశములగు పరస్మైపదములకు విధింపబడు యాసుడాగమమునకు ఙిత్త్వము విధింపబడెను. అనుబన్ధ కార్యముల విషయమున "అనల్విధౌ" అను నిషేధము ప్రవర్తించనపుడు లిఙాదేశములగు పరస్మైపదములకు స్థానివద్భావముచే ఙిత్త్వ మతిదేశింపబడును. ఇట్టి పరస్మైపదములకు విధింపబడు యాసుడాగమమునకును "యదాగమ" పరిభాషచే ఙిత్త్వము లభించును. ఇట్లుండ యాసుడాగమమునకు విధింపబడు ఙిత్త్వము వ్యర్థమై "లాశ్రయాఽనుబన్ధకార్యం నాదేశానామ్" (లకారముల నాశ్రయించిన యిత్సంజ్ఞకములను నిమిత్తముగ జేసి ప్రవర్తించెడి కార్యము, లకారాదేశములందు రాదు) అను నర్థమున 1 జ్ఞాపకమగును. ఈ నిషేధమువలన లిఙాదేశములగు పరస్మైపదములకు ఙిత్త్వము లేనందున యాసుడాగమమునకు ఙిత్త్వవిధాన మావశ్యకమగును. ఇట్లు జ్ఞాపకము చేయుటవలన ప్రకృతమున లృడాశ్రయమగు టిత్త్వమునుబట్టిగాని యుగిత్త్వమునుబట్టిగాని ప్రవర్తించెడి కార్యము లృడాదేశమగు శానచ్చునందు ప్రవర్తింపనందున "వక్ష్యమాణ" అనుచోట టిత్త్వలక్షణముగాని, యుగిత్త్వలక్షణముగాని, యగు ఙీపు ప్రవర్తించదు.

సమాధానాన్తరము:—బధాన మొదలగు రూపముల సిద్ధికొఱకు "హలః శ్నః శానజ్ఝౌ" (3-1-83) సూ. చే, శ్నా ప్రత్యయమునకు శానజాదేశము విధింపబడెను. అనుబన్ధకార్యములందు "అనల్విధౌ" అను నిషేధము ప్రవర్తించ నపుడు, శానచ్చునందు స్థానివద్భావముచేతనే శిత్త్వము సిద్ధమగుచుండ తిరుగ శానజాదేశమందు శిత్త్వవిధానము వ్యర్థమై అనుబన్ధకార్యముల విషయమున్నగూడ కొన్ని స్థలములందు "అనల్విధౌ" అను నిషేధము ప్రవర్తించుననుటలో 2 జ్ఞాపకమగును. ఇది యెచట ప్రవర్తించును యెచట ప్రవర్తించదను వ్యవస్థ లక్ష్యముల ననుసరించియుండును. ఇందువలన వక్ష్యమాణ, అనుచోట స్థానివద్భావముచే టిత్త్వముగాని యుగిత్త్వముగాని రానందున ఙీప్ ప్రసక్తి వారింపబడునని యాశయము.

ఢాదిప్రత్యయాన్తముల కుదాహరణములు:—(1) ఢ:—సౌపర్ణేయీ. (సుపర్ణాయా అపత్యం స్త్రీ) సుపర్ణాశబ్దమున కపత్యార్థమున ఢక్ ప్రత్యయము ఆదివృద్ధి. "ఆయనేయీనీ" (473) సూ. చే, ఢకారమునకు ఏయాదేశము. యస్యేతిచ సూ॥చే నాకారలోపము సౌపర్ణేయ. జీపు. యస్యేతిచ, సూ. చే, వకారలోపము. (2) అణ్:—ఐన్ద్రీ. (ఇంద్రో దేవతా అస్యాః) ఇన్ద్రి శబ్దమున కణ్ ప్రత్యయము. ఇన్ద్రి. జీపు. (3) అఞ్:—ఔత్సీ. (ఉత్సే భవా) ఉత్స శబ్దమున కఞ్ ప్రత్యయము. (4) ద్వయసచ్:—ఊరుద్వయసీ. (ఊరూ ప్రమాణమస్యాః) ఊరు శబ్దమునకు ద్వయసచ్ ప్రత్యయము. (5) దఘ్నచ్:—ఊరుదఘ్నీ. (ఊరూ ప్రమాణమస్యాః) (6) మాత్రచ్:—ఊరుమాత్రీ. (ఊరూ ప్రమాణమస్యాః) (7) జీయప్:—పంచతయీ. పంచన్ శబ్దముకంటె జీయప్ ప్రత్యయము. (8) ఠక్:—ఆక్షికీ. (అక్షైర్దీవ్యతి) అక్ష శబ్దమునకు ఠక్ ప్రత్యయము. ప్రత్యయ ఠకారమునకు "ఠస్యేకః" (7-3-50) సూ. చే, నికాదేశము. (9) ఠఞ్:—లావణికీ. లవణ శబ్దముకంటె ఠఞ్ ప్రత్యయము. (10) కఞ్:—యాదృశీ. "త్యదాదిషు" (432) సూ. చే, యచ్ఛబ్దముకంటె కఞ్ ప్రత్యయము. యచ్ఛబ్దములోని దకారమునకు "ఆ సర్వనామ్నః" (433) సూ. చే, నాకారాఽదేశము. (11) క్వరప్:—ఇత్వరీ. ఇణ్ ధాతువునకు క్వరప్ ప్రత్యయము.

1 (వా) "ఛత్రాదిభ్యో ణః" (4-4-62) సూ. చే, శీలార్థమందు విహితమగు ణప్రత్యయమన్తమందుగల ప్రాతిపదికమునకు జీపు వచ్చును. ఉదా:—చౌరీ. (చురా శీలమస్యాః.) చురా శబ్దమునకు ణప్రత్యయము. 2 (వా) నఞ్, స్నఞ్, ఈకక్, ఖ్యున్, ప్రత్యయాన్తములకంటెను, తరుణ, తలున శబ్దములకంటెను, జీపు వచ్చునని చెప్పవలయును. క్రమముగ నుదాహరణములు:—స్త్రైణీ. స్త్రీశబ్దమునకు నఞ్ ప్రత్యయము: స్త్రైణ. జీపు. పౌంస్నీ. పుంస్ శబ్దమునకు స్నఞ్ ప్రత్యయము. శాక్తీకీ. శక్తిశబ్దమున కీకక్ ప్రత్యయము. ఆఢ్యంకరణీ. ఆఢ్య శబ్దపూర్వక కృఞ్ ధాతువునకు ఖ్యున్ ప్రత్యయము. తరుణీ. తలునీ.

వివ:—1 "సార్వధాతుక మపిత్" (1-2-4) సూ. న 'అపిత్' అనుదానికా వృత్తిచేసి "పిత్ ఙిత్ న" "ఙిత్ పిత్ న" అని యర్థమును చెప్పి యీ సుడాగమమునకు ఙిత్త్వవిధాన మావశ్యకమని భాష్యకారుడు చెప్పుటచే యీ ఙిత్త్వము "లాశ్రయానుబన్ధకార్యం నాదేశానామ్" అను వర్థమున జ్ఞాపకము కానేరదు. కావుననే పమాధానాన్తరము చూపబడెను.

2. కానజాదేశమందు శిత్త్వము భాష్యమున ప్రత్యాఖ్యాతమగుటచే నదియు నిట్టియర్థమున జ్ఞాపకము కానేరదు. కావున వక్ష్యమాణా, అను టాబన్త ప్రయోగము ప్రామాణికమగుచో వజాదిగణమున పాఠమునుచేసి జీపును వారింపదగును.

* 474. యఞశ్చ. 4-1-16. యఞః। చ. (ఙీప్)

యఞన్తాత్ స్త్రియాం ఙీప్ స్యాత్। అకార లోపే కృతే॥

474. యఞ్ ప్రత్యయమన్తమందుగల ప్రాతిపదికముకంటె స్త్రీత్వముద్యోత్యమగునపుడు, ఙీప్ ప్రత్యయము వచ్చును. గర్గశబ్దమున కపత్యార్థమున యఞ్ ప్రత్యయము. గార్గ్య. దీనికంటె ఙీప్ ప్రత్యయము. గార్గ్య + ఈ. "యస్యేతిచ" సూ. చే, నకారమునకు లోపము. గార్గ్య్ + ఈ. ఇట్లుండ.

* 475. హల స్తద్ధితస్య. 6-4-150. హలః। తద్ధితస్య। (లోపః। ఈతి। యః। ఉపధాయాః).

హల ఉత్తరస్య తద్ధిత యకారస్యోపధా భూతస్య లోపః స్యాదీతిపరే। గార్గీ। (వా) అనపత్యాధికారస్థాన్న ఙీప్। ద్వీపే భవా ద్వైప్యా। అధికార గ్రహణాన్నేహ। దేవస్యాపత్యం దైవ్యా। దేవాద్యఞఞావితిహి యఞ్ ప్రాగ్దీవ్యతీయో నత్వపత్యాధికార పఠితః॥

475. హల్లుకంటె పరము నుపధాభూతమునగు తద్ధిత ప్రత్యయము యొక్క యకారము ఈకారము పరమగునపుడు, లోపించును. గార్గ్య్ + ఈ. ఇచట యకారము లోపించుటచే గార్గీ, అని యగును. (వా) "తస్యాపత్యమ్" అను నధికారమున విధింపబడు యఞ్ ప్రత్యయముకంటె భిన్నమగు యఞ్ ప్రత్యయ మన్తమందుగలదానికంటె ఙీపు రాదని యర్థము. "యఞశ్చ" మాత్రమున నపత్యాధికార విహితమగు యఞ్ ప్రత్యయమే గ్రహింపబడునని భావము. భవార్థమున విహితమగు యఞ్ ప్రత్యయమన్తమందుగల ద్వైప్య శబ్దమునకు (ద్వీపే భవా) ఙీపు రాకుండుట యిట్లు చెప్పుటకు ఫలము. ద్వైప్యా అపత్యాధికారములోనిది గావలయుననుటవలన నధికారములోనిది గానట్టు డపత్యార్థకమైనను, అట్టి యఞన్తమునకు ఙీపు రాదు. "దేవస్యాఽపత్యం దైవ్యా". ఇచట దేవశబ్దముకంటె "దేవాద్యఞఞా" అను వార్తికముచే విధింపబడు యఞ్ ప్రత్యయ మపత్యార్థకమైనను, "తస్యాఽపత్యమ్." (4-1-92) అను నధికార పఠితము గాకుండుటచే దోషము వారింపబడునని గ్రహించునది.

* 476. ప్రాచాం ష్ఫ తద్ధితః. 4-1-17. ప్రాచామ్। ష్ఫః। తద్ధితః. (యఞః)

యఞన్తాత్ ష్ఫో వా స్యాత్ స చ తద్ధితః॥

476. యఞ్ ప్రత్యయాన్తముకంటె ష్ఫప్రత్యయము స్త్రీలిఙ్గమున వికల్పముగనగును. అది తద్ధితసంజ్ఞకము నగును.

వివ:—ప్రాగ్దేశస్థుల మతమునందు విధింపబడుటచే నితర మతమందు రాదు గాన వికల్పము ఫలితమగును. ష్ఫప్రత్యయమున షకార మిత్సంజ్ఞకము. "షిద్గౌరాదిభ్యశ్చ" (501) సూ. చే, ఙీష్ వచ్చుట షిత్త్వమునకు ఫలము. ష్ఫప్రత్యయమునకు తద్ధితసంజ్ఞ తదన్తమునకు ప్రాతిపదిక సంజ్ఞార్థము. ఇదియును ఙీష్ ప్రత్యయము ప్రవర్తించుటకు కారణమగును. ప్రాతిపదికసంజ్ఞ లేకున్నను ష్ఫప్రత్యయమందలి షిత్త్వ సామర్థ్యముచేతనే, ఙీషు వచ్చునని చెప్పవచ్చును, లేనిచో షిత్త్వము వ్యర్థమగునుగదా. కావున నీ సూత్రమున తద్ధితగ్రహణ మావశ్యకము గానేరదు. మరియు గార్గ్యాయణీ (గార్గ్య + ఆయన) అను రూపము సవర్ణదీర్ఘముచేతనే సిద్ధమగును గాన నిచట యఞ్ ప్రత్యయములోని అకారమునకు "యస్యేతిచ" సూ. చే, లోపముకొఱకుగూడ తద్ధిత గ్రహణ మావశ్యకము గాదు. కావున నీ తద్ధితగ్రహణ మిఞ్ ప్రత్యయాన్తమునకును, గొన్నిచోటులందు ష్ఫప్రత్యయ మగుననుటలో జ్ఞాపకమగును. 'ఆసురి' అను నిఞ్ ప్రత్యయాన్తము కంటెను ష్ఫప్రత్యయము వచ్చును. ఆసురాయణీ. (ఆసుర + ఆయన). ఇచట "యస్యేతిచ" సూ. చే, లోపమునకై ష్ఫప్రత్యయమునకు తద్ధితసంజ్ఞ సఫలమగును. "ఆసురేరుప సంఖ్యానమ్" అను వార్తిక మీ రీతిని సిద్ధించినదే యని యూహింపదగును.

* 477. షః ప్రత్యయస్య. 1-3-6. షః। ప్రత్యయస్య. (ఆదిః। ఇత్)

ప్రత్యయస్యాఽదిః ష ఇత్స్యాత్ ॥

477. ప్రత్యయమున కాద్యవయవమగు షకార మిత్సంజ్ఞకమగును. ప్రత్యయ షకారమున కనుటచే ప్రాతిపదిక షకారమున కిత్సంజ్ఞ వారితమగును (షోడశ).

* 478. ఆయనేయీనీయియః ఫఢఖఛఘాం ప్రత్యయాదీనామ్. 7-1-2. ఆయనేయీనీయియః। ఫఢఖఛఘామ్। ప్రత్యయాదీనామ్ ॥

ప్రత్యయాదిభూతానాం ఫాదీనాం క్రమాదాయన్నాదయ ఆదేశాః స్యుః। తద్ధితాన్తత్వాత్ప్రాతిపదికత్వమ్। షిత్త్వ సామర్థ్యాత్ ష్ఫేణోక్తేఽపి స్త్రీత్వే షిద్గౌరేతి వక్ష్యమాణో ఙీష్। గార్గ్యాయణీ ॥

478. ఆయన్, ఏయ్, ఈన్, ఈయ్, ఇయ్, ఈ యైదును ప్రత్యయాదులగు ఫ్, ఢ్, ఖ్, ఛ్, ఘ్, ఈ యైదు వర్ణములకు క్రమముగ నాదేశము లగును. సూత్రమున ఫకారాదులపై అకార ముచ్చారణార్థము, కావున ఫిన్ మొదలగు ప్రత్యయములలోని ఫకారాదులకు నాయనాద్యాదేశము లగును. గార్గ్య శబ్దముకంటె ష్ఫప్రత్యయము. గార్గ్య + ఫ. ఫకారమున నాయనాదేశ మగును. ఫకారాదులపైనున్న యచ్చు ఆదేశములతో గలియును. గార్గ్య + ఆయన. "యస్యేతిచ" సూ. చే, అకారమునకు లోపము. ణత్వము. గార్గ్యాయణ. ష్ఫప్రత్యయము తద్ధితమగుటవలన గార్గ్యాయణ అనునది ప్రాతిపదిక మగును. స్త్రీలిఙ్గమున విధింపబడు ష్ఫప్రత్యయముచే స్త్రీత్వము ద్యోత్యమగును. కాన ఉక్తార్థానామ ప్రయోగః (ఒకదానిచే నొక యర్థము బోధితమగునపుడు తిరుగ నా యర్థమునే బోధించుటకు మరియొక శబ్దమును ప్రయోగింపగూడదు). అను న్యాయముచే స్త్రీత్వద్యోతకమగు ఙీష్ ప్రత్యయ మప్రాప్తమగుచున్నది గాని షిత్త్వసామర్థ్యముచే ద్విర్బద్ధం సుబద్ధం భవతి అను న్యాయము ననుసరించి స్త్రీత్వమును దృఢముగ బోధించుటకై "షిద్గౌరాదిభ్యశ్చ" (501) సూ. చే, ఙీష్ ప్రత్యయముగూడ నగును. ద్విర్బద్ధమ్ అను న్యాయమున నీ షిత్త్వమే జ్ఞాపకమనియు ఉక్తార్థానామ్ అను న్యాయము వాచక విషయముగాని ద్యోతక విషయము గాదనియును గ్రహించునది. గార్గ్యాయణీ. ఇట్టి రూపములందు ష్ఫప్రత్యయము, ఙీషు రెండును స్త్రీలిఙ్గద్యోతకము లగును.

* 479. సర్వత్ర లోహితాదికతన్తేభ్యః. 4-1-18. సర్వత్ర। లోహితాదికతన్తేభ్యః. (ష్ఫః। తద్ధితః).

లోహితాదిభ్యః కతశబ్దాన్తేభ్యో యఞన్తేభ్యో నిత్యం ష్ఫః స్యాత్। లౌహిత్యాయనీ। కాత్యాయనీ॥

479. లోహితాదిగణము గర్గాద్యన్తర్గణము. కతన్త, అనుచోట (కత + అన్త) "శకంధ్వా......వాచ్యమ్" అను దానిచే పరరూపము సర్వత్ర, అనుదానికి సర్వమతములందని యర్థము. అందుచే పూర్వసూత్రమునుండి "ప్రాచామ్" అనునదను వర్తించదు. లోహితశబ్ద మాదియందు కతశబ్ద మన్త మందునుగల యఞన్తములకంటె నిత్యముగ ష్ఫప్రత్యయము వచ్చునని యర్థము. ఉ:—లౌహిత్యాయనీ (లోహితస్యాఽపత్యం స్త్రీ) గార్గ్యాయణీ, అను రూపమందువలె ప్రక్రియ నూహింపవలయును. కాత్యాయనీ (కతస్యాఽపత్యం స్త్రీ). ఇచటను పూర్వోక్తరీతి ననుసరించి ప్రక్రియ నూహించునది.

విశ:—లోహితాదిగణము గర్గాద్యన్తర్గణము. గర్గాదిగణమున కత, శకల, కణ్వ, అని పఠింపబడెను. శకల శబ్దము, లోహితాదులందున్న కణ్వాదుల

లందుగూడ జేరనందున శాకల్య శబ్దముకంటె నీ ష్ఫప్రత్యయము, "కణ్వాదిభ్యో గోత్రే" (4-2-111) సూ. చే, విధింపబడు నణ్ ప్రత్యయముగూడ సిద్ధింపకున్నవి. కాని, "కతన్తేభ్యః" "కణ్వాదిభ్యః" అను రెండు చోట్టులందును, షష్ఠీతత్పురుష బహువ్రీహులను (కతస్యాన్తః కతన్తః, కతో న్తో యేషాం తే కతన్తాః. కణ్వస్యాదిః, కణ్వాదిః, కణ్వః, ఆదిర్యేషాం తే కణ్వాదయః) ఆశ్రయించి, కతన్తశబ్దముల కేకశేషమును, కణ్వాదిశబ్దముల కేకశేషమును చేయుటచే లోహితాదులందు, కణ్వాదులందును శకల శబ్దమునకు సంగ్రహము గల్గును. కావున శాకల్యాయనీ, శాకలాః (శాకల్యస్య ఛాత్రాః) అను నిష్టరూపద్వయము సిద్ధమగునని గ్రహించునది.

* 480. కౌరవ్య మాణ్డూకాభ్యాం చ 4-1-19 కౌరవ్య మాణ్డూకాభ్యామ్। చ. (ష్ఫః, సర్వత్ర)

ఆభ్యాం ష్ఫః స్యాత్। టాప్ ఙీషోరపవాదః। కుర్వాదిభ్యో ణ్యః। కౌరవ్యాయణీ। ఢక్ చ మణ్డూకాదిత్యణ్। మాణ్డూకాయనీ। (వా) ఆసురేరుప సంఖ్యానమ్। ఆసురాయణీ॥

480. కౌరవ్య మాణ్డూక శబ్దములకంటె ష్ఫప్రత్యయము నిత్యముగ వచ్చును. ఈ రెండు నపత్య ప్రత్యయాన్తము లగుటవలన జాతికార్యమనగా "జాతేర స్త్రీవిషయాదయో పధాత్" (521) సూ. చే, విహితమగు ఙీషు వీనికి ప్రాప్తమగుచున్నది. అయినను కౌరవ్యశబ్దము యకారోపధకమగుటచే నా సూత్రమువలన ఙీషు నిషేధింపబడుటచే కౌరవ్య శబ్దముకంటె టాప్ ప్రత్యయము ప్రసక్తమగుచున్నది. ఈ ష్ఫప్రత్యయము క్రమముగ టాపు ఙీషుల కపవాదము. ఇచట టాప్ ఙీషోరపవాదః అను పాఠము గొన్ని పుస్తకములందగపడుచున్నది. అణన్తమగు మాణ్డూకశబ్దము జాతివాచకము గావున దీనికంటె ఙీషు ప్రసక్తినే చెప్పవలయును గాన నా పాఠము ప్రమాదపతితమని గ్రహింపవలెను. ఉదా:— కౌరవ్యాయణీ (కురోరపత్యం స్త్రీ) కౌరవ్య. అనునది కురు శబ్దముకంటె "కుర్వాదిభ్యోణ్యః" (4-1-151) సూ. చే, విధింపబడు ణ్యప్రత్యయాన్తము. ష్ఫప్రత్యయము. ఙీషు. మాణ్డూకాయనీ (మణ్డూకస్యాపత్యం స్త్రీ) మాణ్డూక, అనునది మహర్షి ప్రతిపాదకమగు మణ్డూక శబ్దముకంటె "ఢక్ చ మణ్డూకాత్" (4-1-119) సూ. చే, విధింపబడు అణ్ ప్రత్యయాన్తము. (వా) ఆసురి అను నిఞన్తముకంటె ష్ఫప్రత్యయమును చెప్పవలయునని వార్తికార్థము. ఆసురాయణీ. ఈ వచనముయొక్క సిద్ధిప్రకారము 476 వ సూత్రమున చెప్పబడెను.

* 431. వయసి ప్రథమే 4-1-20 వయసి, ప్రథమే (అతః, జీప్),

ప్రథమవయో వాచినోఽదన్తాత్ స్త్రియాం జీప్ స్యాత్। కుమారీ। వా। వయస్య చరమ ఇతి వాచ్యమ్। వధూటీ। చిరణ్టీ। వధూట చిరణ్ట శబ్దౌ యౌవనవాచినౌ। అతః కిమ్। శిశుః। కన్యాయా న। కన్యాయాః కనీనచేతి నిర్దేశాత్ ॥

431. ప్రకరణాదుల నపేక్షింపక ప్రథమవయో బోధకములు నదన్తములునగు ప్రాతిపదికములకంటె జీపు వచ్చును. ఉదా:—కుమారీ. కాలకృతమగు ప్రాణుల యవస్థాభేదము వయస్సనబడును. ఇది కౌమార యౌవన వృద్ధత్వ భేదములచే మూడు విధములు. ఇందు మొదటిదగు కౌమారమును బోధించునవి ప్రథమవయోవాచకము లగును. ప్రకరణ వశమున ప్రథమవయో బోధకములగు నుత్తానశయ రక్తపాదాది శబ్దములకంటె జీపు రాదు. (వా) తుదివయస్సును బోధించు శబ్దములను విడిచి మిగిలిన వయస్సును బోధించు శబ్దము లన్నిటికంటెను జీపును చెప్పవలయును. ఉదా: వధూటీ। చిరణ్టీ। వధూట చిరణ్ట శబ్దములు యౌవన వాచకములు, యౌవనము ద్వితీయ వయస్సగుటవలన సూత్రముచే జీపు యప్రాప్తమగుచుండ నీ వార్తికము చెప్పబడెను. శిశు శబ్దము ప్రథమవయో వాచకమగుటచే ప్రసక్తమగు జీపును వారించుటకు అతః అనుదాని ననువృత్తి చేయవలయును. "కన్యాయాః కనీన చ" (4-1-116) అను సూత్రమున కన్యా శబ్దమును టాబన్తముగ నిర్దేశించుటచే కన్యశబ్ద మదన్తమైనను జీపు రాదు.

వివ:—వయస్సులు, కౌమార యౌవన వృద్ధత్వభేదములచే మూడు విధము లనియును, ఆయుర్దాయముయొక్క నాల్గు భాగములచే (బాల్యయౌవన కౌమార వృద్ధత్వములు) నాల్గు విధములనియు నాయా గ్రన్థములందు చెప్పబడినవి. వీనిలో నే పక్షమందయినను యౌవనము ప్రథమవయస్సు కానందున నా వయసును బోధించు శబ్దములకంటె (వధూట, చిరణ్టము) సూత్రముచే జీపు ప్రాప్తించనందున నచట జీపుకొఱకు, "వయస్యచరమే" అను వార్తిక మారంభింపబడెను.

* 432. ద్విగోః 4-1-21 (అతః జీప్)

అదన్తాద్ద్విగోర్జీప్ స్యాత్। త్రిలోకీ। అజాదిత్వాత్ త్రిఫలా। త్ర్యనీకా సేనా॥

432. అదన్తమగు ద్విగు సమాసముకంటె జీపు వచ్చును. ఉదా:— త్రిలోకీ, (త్రయాణాం లోకానాం సమాహారః) త్రిలోక అనునది యదన్త

మైన ద్విగువు. త్రిఫలత్ర్యనీక శబ్దములు ద్విగువులగుటచే జీపు ప్రాప్తమగుచున్నది గాని యీ శబ్దము లజాదిగణమున పఠింపబడుటచే జీపును బాధించి టాపు వచ్చును. త్రిఫలా. త్ర్యనీకా. (త్రయాణామనీకానాం సమాహారః).

* 483. అపరిమాణబిస్తాచితకంబల్యేభ్యో న తద్ధితలుకి. 4-1-22.
అపరిమాణబిస్తాచితకంబల్యేభ్యః। న। తద్ధితలుకి. (ద్విగోః। జీప్)

అపరిమాణాన్తాద్బిస్తాద్యన్తాచ్చ ద్విగోర్ఙీప్ న స్యాత్తద్ధితలుకి సతి। పంచభిరశ్వైః క్రీతా పఞ్చాశ్వా। ఆర్హీయష్ఠక్। అధ్యర్ధేతి లుక్। ద్వౌ బిస్తౌ పచతి ద్విబిస్తా। ద్వ్యాచితా। ద్వికమ్బల్యా। పరిమాణాన్తాత్తు ద్వ్యాఢకీ। తద్ధితలుకి కిమ్। సమాహారే పఞ్చాశ్వీ॥

483. ఇచట పరిమాణ శబ్దము (పరితః = సర్వతః యేనమీయతే) పరిచ్ఛేదకమాత్రమును గాక పారిభాషికములగు (పరిమాణన్తు సర్వతః) ఆఢకము (కుంచము) కుడబము (సేరు) మొదలగువానిని బోధించును. ఇట్టి పరిమాణ వాచక మన్తమందు లేనట్టి ద్విగువుకంటెను, బిస్త, ఆచిత, కంబల్య యీ శబ్దము లన్తమందుగల ద్విగువుకంటెను తద్ధిత ప్రత్యయమునకు లుక్కు వచ్చునపుడు జీపు రాదు. "ద్విగోః" (482) సూ. చే, ప్రాప్తమగు జీపునకు నిషేధము. పరిమాణశబ్దమునకు ఢకాదు లర్థము. ఉన్మాన వాచకములగు బిస్తాదులు పారిభాషిక పరిమాణములు గావు. ద్విబిస్తా, ద్వ్యాచితా, మొదలగు ద్విగువు లట్టి పరిమాణాన్తములు గావు, కావున వీనికి "అపరిమాణాన్తాత్" అనుదానిచేతనే జీబ్నిషేధము సిద్ధమగుచుండ సూత్రమున బిస్తాది గ్రహణము నియమార్థమగును. ఉన్మానవాచకము లన్తమందుగల ద్విగువునకు నిషేధమగుచో బిస్త ఆచిత, కమ్బల్య యివి యన్తమందుగలవానికే నిషేధమగునని నియమ స్వరూపము. ద్విశాణ్రాపణీ మొదలగు ద్విగువులకు నిషేధాభావము నియమ ఫలము. సూత్రమున కుదాహరణములు:—పఞ్చాశ్వా (పఞ్చభిరశ్వైః క్రీతా) అయిదు గుఱ్ఱములచే కొనబడిన గవాదికమను నర్థమందు పఞ్చాశ్వ శబ్దమునకు "తేన క్రీతమ్" (5-1-37) సూ. చే, ఠక్ ప్రత్యయము, దీనికి "అధ్యర్థ పూర్వాత్" (5-1-28) సూ. చే, లుక్కు, అశ్వశబ్దము పరిమాణవాచకము గానందున పంచాశ్వశబ్ద మపరిమాణాన్తమయినది. తద్ధిత లుక్కు వచ్చినది. కాన జీబ్నిషేధము ప్రవర్తించును. ద్విబిస్తా (ద్వౌబిస్తౌ పచతి) రెండు బిస్తముల పరిమితిగల సువర్ణమును కరుగునట్టి మూసయని యర్థము. ఇచటను ఠక్ ప్రత్యయమునకు లుక్కు. ద్వ్యాచితా. (ద్వౌ ఆచితౌ పచతి) ద్వికమ్బల్యా (ద్వాభ్యాం కమ్బల్యాభ్యాం క్రీతా) కమ్బల్యమన నూర్ణాపలశతము. ద్వికమ్బల్య శబ్దముకంటె క్రీతార్థమందు విధింపబడు ఠఞ్ ప్రత్యయమునకు లుక్కు. పరిమా

ణాన్త ద్విగువగు ద్వ్యాఢకశబ్దమున (ద్వ్యాఢకా పచతి) యీ నిషేధము ప్రవర్తించదు. ఇచటను ఠక్ ప్రత్యయమునకు లుక్కు వచ్చినది. పఞ్చాశ్వీ (పఞ్చానామశ్వానాం సమాహారః) అయిదు గుఱ్ఱములయొక్క గుంపు. ఈ శబ్దముకంటె తద్ధితప్రత్యయము ప్రవర్తించలేదు. ఈ సూత్రమున "తద్ధితలుకి" అనునది లేనపుడిచటను ఙీబ్నిషేధము ప్రసక్తమయ్యెడిని.

* 484. కాణ్డాన్తాత్ క్షేత్రే. 4-1-23. కాణ్డాన్తాత్ క్షేత్రే (ద్విగోః। న। ఙీప్। తద్ధితలుకి)

క్షేత్రే యః కాణ్డాన్తో ద్విగుస్తతో న ఙీప్ తద్ధితలుకి। ద్వే కాణ్డే ప్రమాణమస్యా ద్వికాణ్డా క్షేత్రభక్తిః। ప్రమాణేద్వయసజితి విహితస్య మాత్రచః ప్రమాణే లోద్విగోర్నిత్యమితి లుక్। క్షేత్రే కిమ్। ద్వికాణ్డీ రజ్జుః॥

484. కాణ్డశబ్దమన్తమందుగలదై క్షేత్రమును బోధించునట్టి ద్విగువునకు తద్ధితకు లుక్కు వచ్చునపుడు ఙీపు రాదు. ద్వికాణ్డా. (ద్వే కాణ్డే ప్రమాణమస్యాః). కాణ్డమనగా పదియారుమూరల పొడవుగల దణ్డము. ఇట్టి రెండు దణ్డముల పరిమితిగల భూభాగమని యర్థము. ద్వికాణ్డశబ్దమున కీ యర్థమందు "ప్రమాణే ద్వయసచ్" (5-2-37) సూ.చే, విధింపబడు మాత్రచ్ ప్రత్యయమునకు "ప్రమాణేలః" "ద్విగోర్నిత్యమ్" అను వచనములచే లుక్కగును. కావున నీ సూత్రముచే ఙీబ్నిషేధము ప్రవర్తించును. సూత్రమున "క్షేత్రే" అనునది లేనిచో ద్వికాణ్డీ (రెండు కాణ్డముల పొడవుగల త్రాడు) అను చోటునందును ఙీబ్నిషేధము ప్రసక్తమయ్యెడిని.

* 485. పురుషాత్ప్రమాణే న్యతరస్యామ్. 4-1-24. పురుషాత్। ప్రమాణే। అన్యతరస్యామ్॥ (ద్విగోః, ఙీప్)

ప్రమాణే యః పురుషస్తదన్తాద్విగోర్ఙీప్ వా స్యాత్తద్ధితలుకి। ద్వౌ పురుషౌ ప్రమాణమస్యాస్సా ద్విపురుషీ। ద్విపురుషా వా పరిఖా॥

485. పురుషశబ్దము మనుష్యజాతి వాచకముగ ప్రసిద్ధమయినను సూత్రమున ప్రమాణే అను విశేషమువలనను లోకవ్యవహారమువలనను ప్రమాణవాచకముగూడ నగునని తెలియునది. పురుషశబ్దము గోడలు మొదలగువాని యెత్తును బోధించును గాన నున్మానవాచక మగును. "అపరిమాణ" సూత్రమున బిస్తాది గ్రహణము ఉన్మానవాచకమునకు ఙీబ్నిషేధమగుచో బిస్తాద్యన్తమునకే యను

నియమము కొఱకని యిదివఱకు చెప్పబడెను. కావున ద్విపురుష శబ్దమునకు ఙీప్నిషేధము ప్రవర్తించనందున నిత్యముగ ఙీపు ప్రాప్తమగుచుండ వికల్పము కొఱకీ సూత్ర మారంభింపబడెను. సూత్రమున ప్రమాణశబ్దము పరిచ్ఛేదక మాత్రబోధకము గాని ఆయామమాత్ర బోధకము గాదు. ప్రమాణమును బోధించు పురుషశబ్ద మన్తమందుగల ద్విగువుకంటె తద్ధిత లుక్కు వచ్చినపుడు ఙీపు వికల్పముగా వచ్చునని సూత్రార్థము. ద్విపురుషీ ద్విపురుషా వా పరిఖా, (ద్వౌ పురుషౌ ప్రమాణమస్యాః), రెండు నిలువులు యెత్తుగల కందకమని యర్థము. ద్విపురుష శబ్దముకంటె ప్రమాణ రూపార్థమందు విధింపబడు మాత్రచ్ ప్రత్యయమునకు లుక్కు ప్రవర్తించెను.

* 486. ఊధసోఽనఙ్. 5-4-131. ఊధసః, అనఙ్ (బహువ్రీహౌ)

ఊధో న్తస్య బహువ్రీహే రనఙాదేశః స్యాత్ స్త్రియామ్। ఇత్యనఙి కృతే డాప్ ఙీప్ నిషేధేషు ప్రాప్తేషు ॥

486. ఊధశ్శబ్ద మన్తమందుగల బహువ్రీహి సమాసమునకు స్త్రీలిఙ్గమున అనఙాదేశమగును. స్త్రియామిత్యుప సంఖ్యానమ్ అను వచనముచే నీ సూత్రమున స్త్రీలిఙ్గము ప్రవర్తించునను నర్థము లభించును. అనఙాదేశము సమాసాన్తము, ఙిత్తు నగుటవలన ఙిచ్చ పరిభాషచే న న్త్యమునకు వచ్చును. కుణ్డోధన్ (కుణ్డమివ ఊధో యస్యాః), కుండవంటి లోతుగలది. కుణ్డోధశ్శబ్దమున కనఙాదేశము ప్రవర్తించినపిదప "డాబుభ్యామ్" (164) సూ. చే, డాపు, "అన ఉపధా" (465) సూ. చే, వైకల్పికమగు ఙీపు, "అనో బహువ్రీహేః" (463) సూ. చే, నిషేధము నివి ప్రాప్తము లగుచున్నవి. వీనికి బాధకమగు ఙీషు నుత్తరసూత్రముచే విధించుచున్నాడు.

* 487. బహువ్రీహేరూధసో ఙీష్ 4-1-25 బహువ్రీహేః। ఊధసః। ఙీష్ ॥

ఊధోన్తాద్బహువ్రీహేర్ఙీష్ స్యాత్ స్త్రియామ్। కుణ్డోధ్నీ। స్త్రియాం కిమ్। కుణ్డోధో ధైనుకమ్। ఇహానఙపి న। తద్విధౌ స్త్రియామిత్యుప సఙ్ఖ్యానాత్ ॥

487. ఊధశ్శబ్ద మన్తమందుగల బహువ్రీహికంటె స్త్రీలిఙ్గమున ఙీషు వచ్చును. కుణ్డోధ్నీ పూర్వము చూపబడిన కుణ్డోధన్ శబ్దముకంటె నీ సూత్రమునచే ఙీషు, కుణ్డోధన్ + ఈ. "అల్లోపోఽనః" (235) సూ. చే, అకార

లోపము. 'కుణమివ ఊధో యస్య తత్ కుణ్డోధః.' ధేను సమూహము. ఇది నపుంసక లిఙ్గము. ఈ సూత్రము స్త్రియామ్ అను నధికారములోనిదగుటవలన నిచట జీషు నివర్తించును. పూర్వసూత్రమున స్త్రియామిత్యుప సంఖ్యానమ్, అని చెప్పుటవలన నపుంసకలిఙ్గమగు కుణ్డోధశ్శబ్దమునకు ఆ సూత్రముచే ననఙా దేశముగూడ ప్రవర్తించదు. ప్రకృతమగు జీపును విడిచి జీషును విధించుటకు స్వరము ఫలమని గ్రహించునది.

* 488. సఙ్ఖ్యావ్యయాదేర్ఙీప్ 4-1-26 సంఖ్యావ్యయాదేః। ఙీప్, (బహువ్రీహేః, ఊధసః)

ఙీషోఽపవాదః। ద్వ్యూధ్నీ। అత్యూధ్నీ।
బహువ్రీహేరిత్యేవ। ఊధోఽతిక్రాన్తా అత్యూధాః ॥

488. సంఖ్యాచావ్యయఞ్చ సంఖ్యావ్యయే, తే ఆదీ యస్య తస్మాత్. బహువ్రీహికి విశేషణము. సంఖ్యావాచకముగాని, అవ్యయముగాని ఆదియందును, ఊధశ్శబ్దమన్తమందును గల బహువ్రీహికి స్త్రీలిఙ్గమున ఙీపు వచ్చును. పూర్వసూత్రముచే ప్రాప్తమగు ఙీషున కపవాదము. స్వరభేదమునకై ఈ ఙీపు విధింపబడెను. ద్వ్యూధ్నీ (ద్వే ఊధసీ యస్యాః) "ఊధసోఽనఙ్" సూ. చే, ననఙు. ఈ సూత్రముచే ఙీపు, అకారలోపము అవ్యయాదికుదాహరణము. అత్యూధ్నీ (అతిశయితమూధో యస్యాః) పూర్వమందువలె ప్రక్రియ నూహించునది. అత్యూధాః (ఊధోఽతిక్రాన్తా) ఇది తత్పురుషము. ఈ సూత్రమున "బహువ్రీహేః" అను పదమనువర్తించుటవలన నిచట ఙీపు నివృత్తమగును.

* 489. దామహాయనాన్తాచ్చ 4-1-27 దామహాయనాన్తాత్। చ। (బహువ్రీహేః సంఖ్యాదేః। ఙీప్)

సంఖ్యాదేర్బహువ్రీహేర్దామాన్తాద్ధాయనాన్తాచ్చ ఙీప్ స్యాత్। దామాన్తే డాప్ ప్రతిషేధయోః ప్రాప్తయోః, హాయనాన్తే టాపి ప్రాప్తే వచనమ్। ద్విదామ్నీ। అవ్యయగ్రహణానను వృత్తేరుద్దామా బడబేత్యత్ర డాబ్నిషేధావపి పక్షే స్తః। ద్విహాయనీ బాలా। 1 వా॥ త్రిచతుర్భ్యాం హాయనస్య ణత్వం వాచ్యమ్। 2 వా॥ వయోవాచకస్యైవ హాయనస్య ఙీబ్ ణత్వం చేష్యతే। త్రిహాయణీ। చతుర్హాయణీ। వయసోఽన్యత్ర। త్రిహాయనా। చతుర్హాయనా శాలా ॥

489. దామహాయనాన్తమనది ద్వన్ద్వగర్భబహువ్రీహి. ఇది యనువృత్త మగు బహువ్రీహికి విశేషణము. దామన్ హాయన శబ్దములలో నేదైన నన్తమం దును, సంఖ్యావాచక మాదియందును గల బహువ్రీహికంటె జీపు వచ్చును. దామన్ శబ్దాన్త బహువ్రీహికి "డాబుభ్యామ్" (464) "మనః" (462) సూ. చే, క్రమముగ డాపు జీబ్నిషేధము ప్రాప్తమగుచుండ నీ జీపు విధింప బడెను. హాయనాన్త బహువ్రీహికి "అజాద్యతః" (457) సూ. చే, టాపు ప్రసక్తమగుచుండ నీ జీపు విధింపబడెను. ద్విదామ్నీ (ద్వే దామనీ యస్యాః) ద్విదామన్ + ఈ. అల్లోపము. ఇచటను పూర్వసూత్రమునుండి "అవ్యయాదేః" అను పదమున కనువృత్తి చేయనందున నవ్యయమాదియందుగల దామాన్త బహు వ్రీహికి "అన ఉపధా" (465) సూ. చే, జీపేగాక జీబభావపక్షమందు డాపు జీబ్నిషేధముగూడ ప్రవర్తించును. కావున నుద్దామన్ శబ్దమునకు మూడు రూపములగును. (ఉద్దామ్నీ, ఉద్దామే, ఉద్దామానౌ) హాయనాన్తమున కుదా హరణము ద్విహాయనీ (ద్వౌ హాయనౌ యస్యాః), రెండు వత్సరములు వయస్సు గల బాల, హాయన + ఈ. "యస్యేతిచ" సూ. చే, నకారలోపము.

1 వా॥ త్రిచతుర్ శబ్దములకంటె పరమగు హాయన్ శబ్దముయొక్క నకారమునకు ణత్వమును చెప్పదగును. త్రిహాయణీ చతుర్హాయణీ, ఇచట రేఫ నకారములు సమానపదస్థములు గానందున "అట్ కుప్వాఙ్" (198) సూ. చే, ణత్వ మప్రాప్తమగుచుండ నీ వార్తికము చెప్పబడెను. 2 వా॥ సూత్రవిహితమగు జీపు, వార్తిక విహితమగు ణత్వమును వయోవాచకమగు హాయన శబ్దమునకే వచ్చును. ద్విహాయనా. త్రిహాయనా. చతుర్హాయనా. వీనికి అప్రాణియగు శాల యర్థమగుటచే నిచటి హాయనశబ్దము వయోవాచకము గానందున జీబ్ణత్వములు నివృత్తములగును. కాలకృతమగు ప్రాణుల యవస్థా విశేషమే వయస్సని యిదివరలో వ్రాయబడెను.

* 490. నిత్యం సంజ్ఞాఛన్దసోః. 4-1-29. నిత్యమ్। సంజ్ఞాఛన్దసోః। (అనః, ఉపధాలోపినః, బహువ్రీహేః, జీప్)

అన్నన్తాద్బహువ్రీహే రుపధాలోపినో జీప్। సురాజ్ఞీ నామ నగరీ। అన్యత్ర పూర్వేణ వికల్ప ఏవ। వేదే తు శతమూర్ధ్నీ ॥

490. అన్నన్తము ఉపధాలోపము గలదియునగు బహువ్రీహికంటె సంజ్ఞయందు ఛందస్సునందును (వేదమందు) జీప్ నిత్యముగా వచ్చును. "అన ఉపధా" సూ. చే, ప్రాప్తమగు వికల్పమున కపవాదము. సురాజ్ఞీ, సురాజన్ + ఈ, అల్లోపము. శ్చుత్వము. ఇది యొక పట్టణమునకు సంజ్ఞ. సంజ్ఞ కానపుడు అనఉపధా సూ. చే, జీబ్వికల్పమే ప్రవర్తించును. (శతమూర్ధ్నీ, శతమూర్ధా), వేదమం దుదాహరణము, శతమూర్ధ్నీ.

వివ:—సంజ్ఞా శబ్దములు నియతమగు నానుపూర్వి గలవియు ననాదులు నగును. కావున సంజ్ఞలందు జీబభావముతో గూడిన ప్రయోగము సంభవించదు. ఛన్దస్సునందు దృష్టమగు కార్యమునకే విధానము గావున జీపుతో రహితమగునట్టి ప్రయోగిమునకు సంభవములేదు. సురాజ్ఞీ, శతమూర్ధ్నీ, మొదలగు చోటులందు "అన ఉపధా" (465) అను సూత్రముచేతనే జీపు సిద్ధమగును, కావున నీ సూత్రమున కేమి ప్రయోజనమనిన—ఇది యుత్తర సూత్రమున సంబన్ధముకొఱకగుననియు, నట్లయిన యోగవిభాగము మాత్రము వ్యర్థమే యగుననియును గ్రహించునది.

* 491. కేవల మామక భాగధేయ పాపాపరసమానార్యకృత సుమఙ్గలభేషజాచ్చ. 4-1-30. (నిత్యం సంజ్ఞా ఛందసోః, జీప్)

ఏభ్యో నవభ్యో నిత్యం జీప్ స్యాత్ సంజ్ఞా ఛన్దసోః। అథోత ఇన్ద్రః కేవలీర్విశః। మామకీ। భాగధేయీ। పాపీ। అపరీ। సమానీ। ఆర్యకృతీ। సుమఙ్గలీ। భేషజీ। అన్యత్ర కేవలా ఇత్యాది। మామకగ్రహణం నియమార్థమ్। అణన్తత్వాదేవ సిద్ధేః। తేన లోకేఽసంజ్ఞాయాం మామికా ॥

491. కేవలాది భేషజాన్త శబ్దములకు ద్వన్ద్వము. సంజ్ఞా ఛన్దస్సులందు కేవల, మామక, భాగధేయ, పాప, అపర, సమాన, ఆర్యకృత, సుమఙ్గల, భేషజ, యీ తొమ్మిది ప్రాతిపదికములకంటె నిత్యముగ జీపు వచ్చును. సంజ్ఞ కుదాహరణము: కేవలీ, మామకీ, భాగధేయీ, పాపీ, అపరీ, సమానీ, ఆర్యకృతీ సుమఙ్గలీ, భేషజీ ఛన్దస్సునం దుదాహరణము:—అథోత ఇన్ద్రః కేవలీర్విశః "మామకీ తనూ" "మిత్రా వరుణయోర్భాగధేయీ" "తన్వస్సన్తు పాపీః" "ఉతాఽపరీభ్యః" "సమానీవ ఆకూతిః. ఆర్యకృతీ. సుమఙ్గలీరియం వధూః, శివా రుద్రస్య భేషజీ. వేదములోనివని తెల్పుటకు వాక్యములుదాహృతములయ్యెనని గ్రహించునది. సంజ్ఞగానపుడును, భాషయందును కేవలా, మామికా, ఇత్యాది టాబన్తములే సాధువులగును. అస్మచ్ఛబ్దమున కణ్ ప్రత్యయము పరమగునపుడు మమకాదేశము విధింపబడెను. ఇట్లు మామక శబ్దమణన్తమగుటంజేసి "టిడ్ఢాణఞ్" సూ. చే, జీపు సిద్ధమగుచుండ నిచటి మామక గ్రహణము నియమార్థమగును. మామక శబ్దమునకు సంజ్ఞా ఛన్దస్సులందే జీపు వచ్చునని నియమస్వరూపము. కావున లౌకిక భాషయందును సంజ్ఞ గానపుడును మామికా అను టాబన్తమే సాధువగును.

* 492. అన్తర్వత్పతివతోర్నుక్ 4-1-32 అన్తర్వత్పతివతోః। నుక్।

ఏతయోః స్త్రియాం నుక్ స్యాత్। ఋన్నేభ్యో ఙీప్। గర్భిణ్యాం జీవద్భర్తృకాయాం చ ప్రకృతిభాగౌ నిపాత్యేతే। తత్రాన్తరస్త్యస్యాం గర్భ ఇతి విగ్రహేఽన్తశ్శబ్దస్యాఽధికరణశక్తిప్రధానతయాఽస్తి సామానాధికరణ్యాభావాదప్రాప్తో మతుబ్నిపాత్యతే। పతివత్నీత్యత్ర తు వత్వం నిపాత్యతే। అన్తర్వత్నీ। పతివత్నీ। ప్రత్యుదాహరణన్తు అన్తరస్త్యస్యాం శాలాయాం ఘటః। పతిమతీ పృథివీ॥

492. అన్తర్వత్, పతివత్, అను ప్రాతిపదికములకు స్త్రీలిఙ్గమందు నుమాగమమగును. (అన్తర్వత్నీ, పతివత్నీ) నాన్తము లగుటవలన "ఋన్నేభ్యః" సూ. చే, ఙీపు వచ్చును. గర్భిణీ స్త్రీ అర్థమగునపుడును, సజీవుడగు భర్తగల యాడుదను నర్థమందును, క్రమముగ నన్తర్వత్, పతివత్, అను నీ ప్రకృతి భాగములు నుగాగమమగునపుడు నిపతింపబడినవి. శాస్త్రమువలన నప్రాప్తమగు కార్యములు నిపాతనము వలన లభ్యములగును. ఇందు "అన్తరస్త్యస్యాం గర్భః" (ఈమెలోన గర్భము (శిశువు) గలదు అను విగ్రహమున అన్తశ్శబ్దము లోపున అను నర్థముగలది (అధికరణశక్తి ప్రధానకము). సత్తాశ్రయమును బోధించును. కావున అస్తిశబ్దముతో సమానాధికరణము (అభేద సంబంధముతో నన్వయించునది) గాదు. ఇచట గర్భః అనునదియే అస్తి సమానాధికరణ మగుచున్నది. "తదస్యాఽస్త్యస్మిన్నితి మతుప్" (5-2-94) సూ. చే, నస్తిక్రియలో నెయ్యది కర్తయగునో తద్వాచకముకంటె మతుప్ ప్రత్యయము విధింపబడెను, ఉదా: ధనవాన్. ప్రకృతమున నట్టిది గర్భశబ్దమగును గాని యన్తశ్శబ్దముగాదు, గాన నన్తశ్శబ్దముకంటె సూత్రముచే నప్రాప్తమగు మతుప్ ప్రత్యయ మీ సూత్రమందలి నిపాతనమువలన లభించును. అన్తర్ + మత్. ఇచట మతుపులోని మకారమునకు వకారాదేశము మాత్రము "మాదుపధాయాః" (8-2-9) సూ. చే, వచ్చును. అన్తర్వత్ + నుక్. ఙీపు, అన్తర్వత్నీ (గర్భిణీ) పతిరస్యాస్తి, అను విగ్రహమున పతిశబ్దము అస్తి సమానాధికరణమగుటచే మతుప్ ప్రత్యయము సూత్రముచేతనే లభించును. మతుపులోని మకారమునకు వకారాదేశమును విధించు "మాదుపధాయాః" మొదలగు సూత్రములచే నప్రాప్తమగుచుండు వకారముమాత్ర మిచట నిపాతనము వలన లభించును. పతివత్నీ. (జీవత్పతిః) "అన్తరస్త్యస్యాం శాలాయాం ఘటః" (సాలలో ఘటము గలదు) అనుచోట గర్భిణీ అను నర్థము లేనందున నిపాతనమువలన నిచట యన్తశ్శబ్దముకంటె మతుపు ప్రవర్తించదు. కావున నిట్టిచోట నిట్టివాక్యమే సాధువగును. పతిమతీ (ప్రభువుగల పృథివి) ...

ద్భర్తృక అను నర్థము గానందున నిచట మకారమునకు నకారాదేశము నిపాతనముచే ప్రవర్తింపదు.

* 493. పత్యుర్నో యజ్ఞసంయోగే. 4-1-33. పత్యుః। నః। యజ్ఞసంయోగే।

పతిశబ్దస్య నకారాదేశః స్యాద్యజ్ఞేన సంబన్ధే। వసిష్ఠస్య పత్నీ। తత్కర్తృకయజ్ఞస్య ఫలభోక్త్రీత్యర్థః। దమ్పత్యోః సహాధికారాత్॥

493. పతిశబ్దమునకు స్త్రీలింగమున స్త్రీకి యజ్ఞముతో సంబంధ మున్నపుడు నకారమన్తాదేశమగును. ఉదా:—వసిష్ఠస్య పత్నీ. పతిశబ్దమున నికారమునకు నకారము వచ్చుటచే ప్రాతిపదికము నకారాన్తమగుటవలన (పత్న్) “ఋన్నేభ్యః” సూ. చే, ఙీపు వచ్చును. భార్యతో గలసియే యజ్ఞమును చేయవలయునని శాస్త్రము బోధించుచున్నందున వసిష్ఠునిచే చేయబడు యజ్ఞము యొక్క ఫలము నాతనిభార్యయు ననుభవించును. భర్తృకృత యాగజన్య స్వర్గాది ఫలము ననుభవించుటయే భార్యకు యజ్ఞముతో సంబంధమని గ్రహించునది.

* 494. విభాషా సపూర్వస్య, 4-1-34. విభాషా। సపూర్వస్య। (పత్యుః। నః)

పతిశబ్దాన్తస్య సపూర్వస్య ప్రాతిపదికస్య నో వా స్యాత్। గృహస్య పతిః। గృహపతిః। గృహపత్నీ। అనుపసర్జనస్యేత్యుత్తరార్థమనువృత్తమపి న పత్యుర్విశేషణం కిం తు తదన్తస్య। తేన బహువ్రీహావపి। దృఢపత్నీ। దృఢపతిః। వృషలపత్నీ। వృషలపతిః। అథ వృషలస్య పత్నీతి వ్యస్తే కథమితి చేత్। పత్నీవ పత్నీత్యుపచారాత్। యద్వా। ఆచారక్విబన్తాత్కర్తరి క్విప్। అస్మింశ్చపక్షే పత్నియౌ, పత్నియ ఇతీయఙ్విషయే విశేషః। సపూర్వస్య కిమ్। గవాం పతిః స్త్రీ॥

494. ఈ సూత్రము యజ్ఞసంబంధము లేనపుడు, నకారాదేశమును విధించును. కావున నిది యప్రాప్తవిభాష. (పూర్వేణ సహితః = సపూర్వః.) సపూర్వస్య అనుదానికి విద్యమానమగు పూర్వావయవము గలదని యర్థము. పతిశబ్దాన్తమే యిట్టిదగును గాన తదన్తవిధి గల్గును. విద్యమాన పూర్వావయవముగల పతిశబ్దాన్త ప్రాతిపదికమునకు (సమాసమున) నకారము వికల్పముగ నాదేశమగును. ఉదా:—గృహపత్నీ. గృహపతిః. (గృహస్య పతిః)

ఈ సమాసమున గృహశబ్దము పూర్వావయవము, పతిశబ్ద మన్త్యావయవము నగును.

ఉత్తరసూత్రములం దావశ్యకమగుటచే మధ్యనుండు నీ సూత్రములోనికి ననువృత్తమగు అనుపసర్జనస్య, అనువది సపూర్వస్య అనుదానిచే సూత్రగృహీత మగు పత్యన్తమునకే విశేషణమగును, గాని పతిశబ్దమునకు గాదు. ఉపసర్జనమగు పతిశబ్దముగల బహువ్రీహియందు నీ నకారాదేశము వచ్చుటయే యిట్టి వ్యాఖ్యాన మునకు ఫలము. ఉదా:—దృఢపత్నీ. దృఢపతిః (దృఢఃపతిః, యస్యాః) వృషలపత్నీ, వృషలపతిః. (వృషలః పతిః యస్యాః.) "వృషలస్య పత్నీ" ఇది వాక్యమగుటచే నిచట పతిశబ్దము సపూర్వము గానందున నీ సూత్రము ప్రవర్తించదు, వృషలునికి (శూద్రునికి) యజ్ఞమం దధికారములేనందున పూర్వ సూత్రముకూడ ప్రవర్తించదు. కావున నిచట 'పత్నీ' అనునదెట్లు సాధువగు నని అథేత్యాది శఙ్కాగ్రన్థమున కాశయము. సమాధానమిది:—"వసిష్ఠస్య పత్నీ, అనుచోట పత్నీ శబ్దము సాధువే గదా. పాణిగ్రహణ విషయమున వసిష్ఠుని కాతనిభార్య యెట్టిదో వృషలుని కాతనిభార్యయు నట్టిదే. కావున నిచటి పత్నీశబ్ద మాపచారికము. (పత్నీవ, పత్నీ) అందుచే యజ్ఞసంబన్ధము లేకున్నను, పూర్వసూత్రముచే పత్నీశబ్దము సాధువగును. సమాధానాన్తరము:—"వసిష్ఠస్య పత్నీ" ఇత్యాదులలోని పత్నీ శబ్దమునకు 'పత్నీ వాచరతి' అను నర్థమున నాచార క్విప్పునుచేసి దానికంటె కర్తృబోధకమగు క్విప్పును చేయవలయును. క్విప్ ప్రత్యయము సర్వలోపియగుటచే పత్నీ అను క్విబన్త ప్రాతిపదికము సిద్ధమగును. వృషలస్య పత్నీ అనుచోట పత్నీశబ్ద మట్టిదికాదగును. ఈ పక్షమున పత్నీశబ్దము ధాతువగును. కావున నజాదిప్రత్యయము పరమగునపుడు "అచిశ్ను ధాతు" (272) సూ. చే, నియజాదేశము వచ్చుటయే ప్రథమ సమాధానము వలన సిద్ధమగు పత్నీ శబ్దముకంటె నీ సమాధానమువలన సిద్ధమగు పత్నీశబ్దమునకు గల భేదము, పత్నీ, పత్న్యియౌ, పత్న్యియః. "సపూర్వస్య కిమ్" అవయవ వాచకమగు పూర్వశబ్దమున కేమిఫలమని ప్రశ్నాశయము. "గవాం పతిః" (స్త్రీ) గోవులకు స్వామిని, యని యర్థము. ఇచట గోశబ్దము పతిశబ్దమున కవయవముగాదు. ఇచట నకారాదేశవారణము ఫలమని సమాధానాశయము.

* 495. నిత్యం సపత్న్యాదిషు. 4-1-35. నిత్యం। సపత్న్యాదిషు (పత్యుః। నః)

పూర్వవికల్పాపవాదః। సమానస్య సభావోఽపి నిపాత్యతే। సమానః పతిర్యస్యాస్సా సపత్నీ। ఏకపత్నీ। వీరపత్నీ॥

---

* సమాన, ఏక, వీర, పిణ్డ, శ్వ, భ్రాతృ, భద్ర, పుత్ర, దాసాచ్ఛన్దసి, ఇతిసమాదిః.

495. సమాన, ఏక. మొదలగు శబ్దములు పూర్వావయవములు గాగల పతి శబ్దమునకు (సమాసమున) నకారాదేశము నిత్యముగనగును. పూర్వసూత్రముచే విధింపబడు వికల్పమున కిది యపవాదము. ఉదా:—సపత్నీ (సమానః పతిర్యస్యాః) ఏకపత్నీ, వీరపత్నీ, మొదలగుననియు నిట్లే సాధువులగును. సమాన శబ్దమునకు సకారాదేశముగూడ సపత్న్యాదిషు అను నిపాతనమువలన సిద్ధమగును.

వివ:—సూత్రమున 'సపత్యాదిషు' అని చెప్పక "సపత్న్యాదిషు" అని ఙీబ్నకారములతో సహితమగు నుచ్చారణమును చేయుటచే రూఢిశక్తివలన సమానమగు భర్తగల యాడుదానిని (సవతి) బోధించునపుడే యీ శబ్దము సాధువగునని తెలియదగును. ఒకే ప్రభువుగల దాసిగాని, భూమిగాని, యర్థమగునపుడు, ఙీబ్నకారాదేశములు ప్రవర్తించవు గాన సపతిః అనియే యగును.

* 496. పూతక్రతోరై చ. 4-1-36. పూతక్రతోః। ఐ, చ (ఙీప్)

ఇయం త్రిసూత్రీ పుంయోగ ఏవేష్యతే।
పూతక్రతోః స్త్రీ పూతక్రతాయీ। "యయా తు
క్రతవః పూతాః స్యాత్పూతక్రతురేవ సా"॥

496. పూతక్రతు శబ్దమునకు ఙీప్ ప్రత్యయము వచ్చును, దీనితో గలసి పూతక్రతు శబ్దమున నుకారమునకు ఐకార మాదేశమగును. ఈ సూత్రముతో గలపి వరుసగ మూడు సూత్రములును పుంవాచక శబ్దము పురుష సంబంధము వలన స్త్రీని బోధించునపుడే (పుంయోగమున) ప్రవర్తించును. ఇట్లు చెప్పుటలో శిష్టుల వ్యాఖ్యానమే శరణము. ఉదా:—పూతక్రతాయీ (పూతక్రతోః స్త్రీ) పూతక్రతువగు పురుషునికి సంబంధించిన స్త్రీ (జాయా సుతా వా) అని యర్థము. పూతక్రతు + ఈ. ఐకారాదేశము, దీని కాయాదేశము "పూతాః క్రతవః యయా సా" (ఎవతెచే స్వయముగ క్రతువులు పవిత్రము చేయబడినవో యామె) అను విగ్రహముగల పూతక్రతుశబ్దము విషయమున పురుషసంబంధము లేకుండుటచే నీ సూత్రము ప్రవర్తించనందున "పూతక్రతుః" అని యగుట ఈ సూత్రము పుంయోగమునందే ప్రవర్తించుననుటకు ఫలమగును. "యయాతు ...సా" అను నీ వచనము పై యర్థమును స్పష్టపరచును.

* 497. వృషాకప్యగ్నికుసితకుసిదానాముదాత్తః. 4-1-37.
వృషాకప్యగ్నికుసితకుసిదానామ్। ఉదాత్తః। (ఐ। ఙీప్)

ఏషాముదాత్త ఐ ఆదేశస్స్యాత్ ఙీప్ చ।
వృషాకపేః స్త్రీ వృషాకపాయీ హారవిష్ణూ వృషా

కపీ ఇత్యమరః। వృషాకపాయీ శ్రీగౌర్యోరితి చ।
అగ్నాయీ। కుసితాయీ। కుసిదాయీ। కుసిదశబ్దో
హ్రస్వమధ్యో నతు దీర్ఘమధ్యః॥

497. వృషాకపి, అగ్ని, కుసిత, కుసిద, వీనికంటె జీప్ ప్రత్యయము, వీనియొక్క అన్త్యమున ఉదాత్తస్వరకమగు నైకారాదేశమును వచ్చును. ఉదా:—వృషాకపాయీ. (వృషాకపేః స్త్రీ). "హరవిష్ణూ వృషాకపీ" అనియును "వృషాకపాయీ శ్రీగౌర్యోః" అనియు నమరకోశము. ఇది వృషాకపి శబ్దము హరిహరబోధకమనియు, వృషాకపాయీ శబ్దము తత్పత్ను లగు లక్ష్మీ పార్వతులను బోధించుననియును గ్రహింపదగును. అగ్నాయీ. (అగ్నేః స్త్రీ). ఇట్లే కుసితాయీ. కుసిదాయీ. సూత్రమున కుసిద శబ్దము హ్రస్వేకారము మధ్యనుగలది గ్రహింపబడును గాని దీర్ఘేకారము మధ్యనుగల కుసీద శబ్దము గ్రహింపబడదని గ్రహించునది.

* 498. మనోరౌ వా. 4-1-38. మనోః। ఔ! వా. (ఉదాత్తః। ఐ। జీప్).

మనుశబ్దస్యౌకారాదేశస్స్యా దుదాత్తైకారశ్చ వా, తాభ్యాం సన్నియోగశిష్టో జీప్ చ। మనోః స్త్రీ। మనావీ। మనాయీ। మనుః।

498. మనుశబ్దమునకు, ఔకారాదేశము, ఉదాత్తస్వరకమగు నైకారా దేశమును వికల్పముగ నగును, వీనితోఁగలసి జీపుగూడ నగును. ఉదా:—మనావీ. (ఔకారాదేశము వచ్చునపుడు) మనాయీ. (ఐకారాదేశము వచ్చునపుడు). ఈ యాదేశములతోఁ గలపి విహితమగు జీప్ ప్రత్యయ మాదేశములు రానపుడు ప్రవర్తించదు. ఆదేశములు వికల్పముగ విధింపబడినందున నాదేశములు జీపును లేనట్టి రూపముగూడ స్త్రీలిఙ్గమందు సాధువగును. మనుః, మొత్తము మూడు రూపములగును.

వివ:—ఈ సూత్ర వివరణమున "ఔకారాదేశః, ఉదాత్తైకారాదేశశ్చ" అని చెప్పబడెను. ఇచట "ఉదాత్తైకారాదేశః" అను సమాస నిర్దేశముచే నైకారముతో సంబన్ధముగల నుదాత్తపదమే యీ సూత్రములోని కనువృత్తమగుననియు నుదాత్తమున కౌకారముతో సంబన్ధము లేదనియును తెలిసికొనదగును. ఔకారముతోఁగూడ నుదాత్త శబ్దము సంబంధించుననను ప్రాచీనులాశయము పేక్ష్యమని గ్రహించునది.

* 499. వర్ణాదనుదాత్తాత్తోపధాత్తో నః. 4-1-39. వర్ణాత్। అనుదాత్తాత్। తోపధాత్। తః। నః। (ఙీప్)

వర్ణవాచీ యోఽనుదాత్తాన్తస్తోపధస్తదన్తాదనుపసర్జనాత్ప్రాతిపదికాద్వా ఙీప్ స్యాత్, తకారస్య నకారాదేశశ్చ। ఏనీ। ఏతా। రోహిణీ। రోహితా। వర్ణానాం తణతినితాన్తానామితి ఫిట్ సూత్రేణాద్యుదాత్తౌ। త్ర్యేణ్యా చ శలల్యేతి గృహ్యసూత్రమ్। త్రీణ్యేతాని యస్యా ఇతి బహువ్రీహిః। అనుదాత్తాత్కిమ్। శ్వేతా। ఘృతాదీనాం చేత్యన్తోదాత్తోఽయమ్। అత ఇత్యేవ। శితిః స్త్రీ। (1వా) పిశఙ్గాదుపసంఖ్యానమ్। పిశఙ్గీ। పిశఙ్గా। (2 వా) అసిత పలితయోర్న। అసితా। పలితా। (3 వా) ఛందసి క్నమేకే। అసిక్నీ। పలిక్నీ। అవదాతశబ్దస్తు న వర్ణవాచీ। కిం తు విశుద్ధవాచీ। తేన అవదాతా ఇత్యేవ॥

499. అనుదాత్తాన్తము తకారోపధమునగు, వర్ణవాచక మన్తమందు గలదియగు ననుపసర్జనమునగు ప్రాతిపదికముకంటె ఙీపు వికల్పముగ నగును, తకారమునకు నకారాదేశమును వచ్చును. ఉదా:—ఏనీ, ఏతా. రోహిణీ, రోహితా. ఏత రోహిత శబ్దములు క్రమముగ చిత్రవర్ణ రక్తవర్ణ వాచకములు. "వర్ణానాం తణతినితాన్తానామ్" ఇది ఫిట్ సూత్రము. త, ణ, తి, ని, త్, ఇవి అన్తమందుగల వర్ణవాచకము లాద్యుదాత్తములగునని యీ సూత్రమున కర్థము. ఫిట్, అను పదమునకు ప్రాతిపదికమని యర్థము. ఏతః, శోణః, శితిః, పృశ్నిః, పృషత్, క్రమముగ నివి యీ సూత్రమున కుదాహరణములు. ఈ సూత్రముచే ఏతరోహిత శబ్దము లాద్యుదాత్తము లగుటవలనను, ఒకపదమందొకవర్ణ ముదాత్తమగునపు డాపదములోని మిగిలిన వర్ణములన్నియు ననుదాత్తములగునని, "అనుదాత్తం పదమేక వర్జమ్" సూ. చే, బోధిత మగుటవలనను, యీ రెండు పదముల యన్త్యవర్ణ మనుదాత్తమగును. ఙీప్ నకారాదేశములు ప్రవర్తించునపుడు. ఏనీ, రోహిణీ. తదభావ పక్షమందు ఏతా, రోహితా. (టాబన్తములు) "త్ర్యేణ్యా చ శలల్యా" అనునది గృహ్యసూత్రము. "త్రీణ్యేతాని యస్యాః" అని బహువ్రీహి. ఇచట ఏతశబ్దముప సర్జనమైనను, తదన్తము (త్ర్యేత) అనుపసర్జనమగుటచే ఙీప్ నకారాదేశములు వచ్చును. శ్వేత శబ్దము "ఘృతాదీనాం చ" సూ. చే, నన్తోదాత్తము. ఇచట ఙీబ్నకారములు ప్రవర్తింపకుండుటకై వర్ణవాచకమునకు 'అనుదాత్తాత్' అను విశేషణ మావశ్యకము. "శితిః" (స్త్రీ) ఇది యనుదాత్తాన్తమగు వర్ణవాచకమని చూపబడెను. ఇచట ఙీప్ నకారములను వారించుటకు అతః అన్నదా

ననువృత్తిజేసి వర్ణవాచక మకారాన్తము గావలయునని చెప్పవలయును. (1 వా) పిశఙ్గ శబ్దమునకు జీపు వికల్పముగ చెప్పవలయును. ఉదా:—పిశఙ్గీ. పిశఙ్గా. "లఘావన్తే ద్వయోశ్చ బహ్వషో గురుః" ఇది ఫిట్ సూత్రము. ఒకటిగాని రెండుగాని లఘువులు పరమగునపుడు అనేకములగు యచ్చులుగల ప్రాతిపదికముయొక్క గురువుదాత్తమగునని యర్థము. సూత్రమున అష్, అను దానికి అచ్చని యర్థము. ఈ సూత్రముచే పిశఙ్గశబ్దము మధ్యోదాత్తమగుటచే నన్తానుదాత్తమగును. కావున "అన్యతో జీష్" (500) అను నుత్తర సూత్రముచే ప్రాప్తమగు జీషును బాధించుటకు జీపు విధింపబడెను. స్వరమున విశేషముండును గాని జీపుచేసినను జీషుచేసినను రూపము లొకరీతినే యుండునని తెలియునది. (2 వా) అసితపలిత శబ్దములకు జీబ్నకారాదేశములు రావు. అసితా, పలితా. (3 వా) అసితపలిత శబ్దములకు ఛందస్సునందు క్నమ్ అను నాదేశము జీపుతో కలిపి వచ్చునని గొందరిచ్ఛయించుచున్నారు. "వర్ణాదనుదాత్తాత్" సూ. చే, తకారమునకు నకారము ప్రాప్తమగుచుండ దీనికి బాధకముగ నీ క్నమాదేశము బధింపబడుటచే నిదియును తకారస్థానమందే ప్రవర్తించును. అసిక్నీ. పలిక్నీ. అవదాత శబ్దము ప్రతివర్ణముననుండు స్వచ్ఛతను బోధించును గాని యేదైన ప్రత్యేకవర్ణమును (రంగును), బోధించదు. కావున దీనికి జీబ్నకారాదేశములు రావు. అందుచే 'అవదాతా' అనియే యగును. "అవదాతస్సితో గౌరః" అను నమరమున విశుద్ధత్వసాధర్మ్యమునుబట్టి వర్ణవాచకముగ చెప్పబడినదని గ్రహించునది.

విశే :- "త్ర్యేణ్యా శలల్యా" అని గృహ్యసూత్రము. గృహ్యసూత్రవ్యాఖ్యాతయగు నారాయణభట్టు త్ర్యేణీపదము బహువ్రీహి యనియు, "వర్ణాదనుదాత్తాత్..." సూ. చే, జీబ్నకారాదేశములు వచ్చుననియును చెప్పుటవలన, అనుపసర్జనాధికారము మిగిలిన సూత్రములందు గృహ్యమాణవిశేషణమైన నీ సూత్రమున మాత్రము తదన్తవిశేషణమని యఙ్గీకరింపవలయునని ప్రాచీనాశయము. భాష్యరీతి ననుసరించి మిగిలిన సూత్రములందనుపసర్జనాధికారము గృహ్యమాణవిశేషణమగుటవలన నీ సూత్రమునగూడ గృహ్యమాణవిశేషణమనుటయే న్యాయము. త్ర్యేణీశబ్దము బహువ్రీహి యనినచో నేతశబ్దముపసర్జనమగుటచే జీబ్నకారాదేశముల ప్రాప్తములయ్యెడిని. కావున "త్రిషు (స్థానేషు) ఏనీ" అని సత్పురుషమును చెప్పిన త్ర్యేణీ, అను ప్రయోగము, సాధువగునని నవీనుల యభిప్రాయము.

ఛందసి క్నమేకే, అనువార్తికమున 'ఏకే' అనునది 'ఛందసి' అను దానితో నన్వయించును. ఛందస్సున గొందరు క్నమాదేశమును చెప్పిరను నర్థము లబ్ధమగును. ఇట్లు చెప్పుటచే లోకమునగూడ క్నమాదేశము సిద్ధమగునని ఫలితమగును. కావున "గతో గణస్తూర్ణ మసిక్నికానామ్" మొదలగు లౌకిక ప్రయోగములు సాధువులగును. క్నమాదేశము లోకమున ప్రవర్తించదనియును ఛన్దస్సునందు మాత్రము వికల్పముగ ప్రవర్తించుననియు నిష్టమైనచో భాష్యమున 'వా' పదమునే చెప్పియుండును.

* 500. అన్యతో ఙీష్. 4-1-40. అన్యతః। ఙీష్. (వర్ణాత్। అనుదాత్తాత్).

తోపధభిన్నాద్వర్ణవాచినోఽనుదాత్తాన్తాత్ప్రాతిపదికాత్ స్త్రియాం ఙీష్ స్యాత్। కల్మాషీ। సారఙ్గీ। లఘావన్తే ద్వయోశ్చ బహ్వషో గురురితి మధ్యోదాత్తావేతౌ। అనుదాత్తాన్తాత్కిమ్। కృష్ణా। కపిలా॥

500. పూర్వసూత్రోక్తమగు తోపధానుదాత్తవిధానియొక్క సాన్నిధ్యము వలనను వ్యాఖ్యానమువలనను అన్యతః, అనుదానికి తోపధభిన్నాత్" అని యర్థము. అనుదాత్తాన్తము తకారోపధముగానట్టియు నగు వర్ణవాచకముకంటె ఙీషు వచ్చును. ఉదా:—కల్మాషీ. సారఙ్గీ. కల్మాష సారఙ్గ శబ్దములు "లఘావన్తేద్వయోశ్చ" అను ఫిట్ సూత్రముచే మధ్యోదాత్తము లగుటవలన నన్తానుదాత్తములగును. ఫిట్ సూత్రార్థము పూర్వసూత్రమున వ్రాయబడెను. అన్తోదాత్తములగు కృష్ణకపిల శబ్దములకు ఙీషును వారించుటకై అనుదాత్తాన్తము గావలయునని చెప్పబడినది.

* 501. షిద్గౌ*రాదిభ్యశ్చ. 4-1-41. షిద్గౌరాదిభ్యః। చ. (ఙీష్)

షిద్భ్యో గౌరాదిభ్యశ్చ స్త్రియాం ఙీష్ స్యాత్। నర్తకీ। గౌరీ। వా॥ ఆమనడుహః స్త్రియాం వా। అనడుహీ। అనడ్వాహీ। (గ. సూ) పిప్పల్యాదయశ్చ। ఆకృతిగణోఽయమ్॥

---

* గౌర, మత్స్య, మనుష్య, శృఙ్గ, పిఙ్గల, హయ, గవయ, ముకయ, ఋష్య, పుట, తూణ, ద్రుణ, ద్రోణ, హరిణ, కాకణ, పటర, ఉణక, ఆమలక, కువల, బిమ్బ, బదర, కర్కర, తర్కార, శర్కార, పుష్కర, శిఖణ్డ, సదల, కుష్కాణ్డ. సనన్ద, సుషమ, సుషవ, అలిన్ద, గుడుల, పాణ్డశ, ఆఢక, ఆనన్ద, ఆశ్వత్థ, సృపాట, ఆపచ్చిక, శష్కులి, సూర్మ, శూర్ప, సూచ్యత, యూష, యూథ, సూప, పూప, మేయ, వల్లక, ధాతక, సల్లక, మాలక, మాలత, సాల్వక, వేతస, బృద, అతస, ఉభయ, భృఙ్గ, దహ, మఠ, ఛేద, పేశ, మేద, శ్వన్, తక్షన్, అనడుహ్, అనడ్వహ్, ఏషణః, కరేణ, దేహ, దేహల, కాకాదన, గవాదన, తేజన, రజన, లవణ, ఔద్గాహమాని, గౌతమ, పారక, అయఃస్థూణ, భౌరికి, భౌలికి, భౌలిఙ్గి, యాన, మేధ, ఆలిమ్బి, ఆలజి, ఆలబ్ధి, ఆలక్షి, కేవాల, ఆపక, ఆరట, నట, టోట, నోట, మూలాట, శాతన, పోతన, పాతన, పాటన, ఆస్తరణ, అధికరణ, అధికార, అగ్రహాయణ, ప్రత్యవరోహిన్, సేచన, సుమఙ్గలాత్సంజ్ఞాయామ్, అణ్డర, సున్దర, మణ్డల, మన్దర, మణ్డల, పట, పిణ్డ, పిటక, షణ్డ, ఊర్ద, గుర్ద, శమ,

501. షిత్పదమునకు ఇత్సంజ్ఞక షకారముగల ప్రాతిపదికములని యర్థము. (షః ఇత్ యేషామ్). ఇత్సంజ్ఞకమగు షకారముగల ప్రాతిపదికములకంటెను, గౌరాదిగణమున పఠింపబడిన ప్రాతిపదికములకంటెను, ఙీష్ వచ్చును. నర్తకీ, గౌరీ, అనునవి క్రమముగ నుదాహరణములు. నృతధాతువునకు ష్వున్ ప్రత్యయమును చేసిన నర్తక, అని యగును. ఇచట ప్రత్యయమందు షిత్త్వము చరితార్థమై తదన్తమగు ప్రాతిపదికమునకు ఙీషును సంపాదించును. గౌరీ, అనునది వర్ణవాచకమైన నన్తోదాత్తమగుటవలన పూర్వసూత్రముచే ఙీష్ అప్రాప్తమగుచుండ నీ గణమున పఠింపబడెను. "ఉమా కాత్యాయనీ గౌరీ" అను కోశమువలన గౌరశబ్దము సంజ్ఞావాచకమనియును చెప్పదగును. అర్థద్వయమందును గౌరశబ్దమునకీ సూత్రముచేతనే ఙీష్ అగునని తెలియదగును. "ఆమనడుహో వా" గౌరాదిఙీషుతో గలపి అనడుహ్ శబ్దమునకు స్త్రీలిఙ్గమున ఆమాగమము వికల్పముగ నగును. అనడుహీ, అనడ్వాహీ, అను రూపద్వయమగును. (1 గ, సూ.) పిప్పల్యాదిగణము గౌరాద్యన్తర్గణము. గౌరాదిగణ మాకృతిగణము. కావున గౌరాది సదృశములగు మరికొన్నిటి నిందు చేర్పవచ్చును.

* 502. సూర్యతిష్యాగస్త్యమత్స్యానాం య ఉపధాయాః.
6-4-149. సూర్యతిష్యాగస్త్యమత్స్యానామ్, యః। ఉపధాయాః। (లోపః)

అఙ్గస్యోపధాయా యస్య లోపః స్యాత్స చేద్యః సూర్యాద్యవయవః। (1 వా) మత్స్యస్య ఙ్యామ్. (2 వా) సూర్యాగస్త్యయోశ్ఛే చ ఙ్యాం చ. (3 వా) తిష్యపుష్యయోర్నక్షత్రాణి యలోప ఇతి వాచ్యమ్. మత్సీ. మాతరి షిచ్చేతి షిత్త్వాదేవ సిద్ధే గౌరాదిషు మాతామహీశబ్ద పాఠాదనిత్యః షితాం ఙీష్. దంష్ట్రి॥

502. అఙ్గమున కుపధయగు సూర్య, తిష్య, అగస్త్య, మత్స్య, వీని కవయవమునగు యకారమునకు లోపమగును. సూర్యాదులయొక్క యకారమునకు లోపమును నిర్ణయించు వార్తికములు చూపబడుచున్నవి. (1 వా) "మత్స్యశబ్దమునకు ఙీపు పరమగునపుడే యకారలోపము." ఉదా:—మత్సీ, (2 వా) సూర్యాగస్త్యశబ్దముల యకారమునకు ఛ ప్రత్యయముగాని ఙీషుగాని

---

మూద. ఆర్ద, హృద, పాణ్డ, బాణ్డ, లోహాణ్డ, కదర, కల, తరుణ, తలున, కల్మాష, బృహత్, మహత్, సోమ, సౌధర్మ, రోహిణీ రేవతీ నక్షత్రే, వికల, నిష్కల, పుష్కల, కటాచ్ఛ్రోణివచనే, పిప్పల్యాదయశ్చ, పిప్పలీ, హరీతకీ, కోశాతకీ, శమీ, వరీ, శరీ, పృథివీ, క్రోష్ట్రీ, మాతామహీ, పితామహీ, ఇతి గౌరాదిః॥

పరమగునపుడే లోపమగును. ఉదా:—సూరీయః, సూరీ, అగస్తీయః, అగస్తీ, (3 వా) "తిష్యపుష్య శబ్దముల యకారమునకు నక్షత్రవాచకముకంటె విధింపబడిన అణ్ ప్రత్యయము పరమగునపుడే లోపమగును. ఉదా:—తైషః, పౌషః, (తిష్యేణ, పుష్యేణ యుక్తః కాలః) పుష్యశబ్దావయవ యకారమునకు సూత్రముచే నప్రాప్తమగు లోపము నీ వార్తికముచే విధించుచున్నాడని గ్రహింపవలయును. మత్సీ. మత్స్యశబ్దమునకు గౌరాదిఙీషు యలోపము. ఈ శబ్దము జాతివాచకమైనను యోపధమగుటచే జాతిలక్షణ ఙీషు అప్రాప్తమగుచుండ నీ గణమున పఠింపబడెను.

షిత్త్వనిమిత్తకమగు ఙీషు యనిత్యము గావున దంష్ట్రా అనుచోట ఙీషు నివృత్తమగును. దశ్యతే అనయా అను విగ్రహమున దశధాతువుకంటె ష్ట్రన్ ప్రత్యయమువలన దంష్ట్రా అనునది షిత్తగును. గౌరాదిగణమున మాతామహీ శబ్దపాఠ మీ యనిత్యత్వమున జ్ఞాపకము. ఎట్లన:—"పితృవ్య మాతుల" (4-2-36) అను సూత్రమున "మాతరి షిచ్చ" అను వచనము పఠింపబడెను. దీనిచే మాతుర్మాతా, అను విగ్రహమున "మాతామహీ" అను చోటున "షిద్గౌరాదిభ్యశ్చ" సూ. చే, ఙీషు వచ్చుటకై షిత్త్వ మతిదేశింపబడెను. ఇట్లు మాతామహ శబ్దము షిత్త్వమగుటవలననే ఙీషు సిద్ధమగుచుండ ఙీషు కొఱకు గౌరాదిగణమున మాతామహీ శబ్దపాఠము వ్యర్థమై షిత్త్వప్రయుక్తమగు ఙీషు అనిత్యమనుటలో జ్ఞాపకమగును.

* 503. జానపదకుణ్డగోణస్థల భాజనాగ కాలనీలకుశకాముక కబరాద్వృత్త్యమత్రావ పనాకృత్రిమా శ్రాణా స్థౌల్యవర్ణా2నాచ్ఛాదనాయో వికారమైథునేచ్ఛా కేశవేశేషు 4-1-42. జానపదకుణ్డ...కబరాత్। వృత్త్యమత్రా... కేశవేశేషు। (ఙీష్).

ఏభ్య ఏకాదశభ్యః ప్రాతిపదికేభ్యః, క్రమాద్వృత్త్యాదిష్వర్థేషు ఙీష్ స్యాత్. జానపదీ వృత్తిశ్చేత్। అన్యా తు జానపదీ। ఉత్సాదిత్వాదఞన్తత్వే టిడ్ఢేతిఙీప్యాద్యుదాత్తః। కుణ్డీ అమంత్రం చేత్। కుణ్డా2న్యా। కుడి దాహే। గుహోశ్చ హాల ఇతి అప్రత్యయః। యస్తు "అమృతే జారజః కుణ్డః" ఇతి మనుష్యజాతివచన స్తతో జాతిలక్షణో ఙీష్ భవత్యేవ। అను త్రే హి స్త్రీవిషయత్వాదప్రాప్తో ఙీష్ విధీయతే। న తు నియమ్యతే। గోణీ ఆవపనం చేత్। గోణా2న్యా। స్థలీ అకృత్రిమా చేత్। స్థలా2న్యా। భా

జీ (శ్రాణా చేత్। భ్రాజాఽన్యా। నాగీ స్థూలా చేత్। నాగాఽన్యా। గజవాచీ నాగశబ్దః స్థౌల్యగుణయోగాదన్యత్ర ప్రయుక్తః ఉదాహరణమ్। సర్పవాచీ తు దైర్ఘ్యగుణయోగాదన్యత్ర ప్రయుక్తః ప్రత్యుదాహరణమ్। కాలీ వర్ణశ్చేత్। కాలాన్యా। నీలీ అనాచ్ఛాదనం చేత్। నీలాఽన్యా। నీల్యా రక్తా శాటీత్యర్థః। నీల్యా ఽన్యత్కృత్యా ఇత్యేకే। అనాచ్ఛాదనేఽపి న సర్వత్ర కిం తు (1 వా) నీలాదోషధౌ। నీలీ। (2 వా) ప్రాణిని చ। నీలీ గౌః। (3 వా) సంజ్ఞాయాం వా। నీలీ। నీలా। కుశీ అయోవికారశ్చేత్। కుశాఽన్యా। కాముకీ మైథునేచ్ఛా చేత్। కాముకాఽన్యా। కబరీ కేశానాం సన్నివేశశ్చేత్। కబరాఽన్యా। చిత్రేత్యర్థః॥

503. "జానపదకుణ్డ......కబరాత్" అనునది జానపదశబ్దము మొదలు పదునొకండు శబ్దములకు సమాహారద్వంద్వము. వృత్త్యమత్రా... కేశవేశేషు. ఇది వృత్త్యాదులగు పదునొకండు శబ్దములకు నితరేతరాశ్రయ ద్వంద్వము. (1) జానపద, (2) కుణ్డ, (3) గోణ, (4) స్థల, (5) భాజ, (6) నాగ, (7) కాల, (8) నీల, (9) కుశ, (10) కాముక, (11) కబర, యీ ప్రాతిపదికములకంటె వరుసగ (1) వృత్తి, (2) అమత్రము, (3) ఆవపనము, (4) అకృత్రిమము, (5) శ్రాణము, (6) స్థౌల్యము, (7) వర్ణము, (8) అనాచ్ఛాదనము, (9) అయోవికారము, (10) మైథునేచ్ఛ, (11) కేశవేశము, ఈ యర్థములందు జీషు వచ్చును. (1) జానపదీ, (జనపదే భవా) జనపదమన దేశము. జనపదమందగు వృత్తి, అని యర్థము. వృత్తియన స్థిరమగు జీవనోపాయము. వృత్తికంటె భిన్నమగు 'జనపదభవమను నర్థమందును, 'జానపదీ' అనియే యగును. ఎట్లన:—జనపదేభవా, అనునర్థమున, జనపద శబ్దమునకు "ఉత్సాదిభ్యోఽఞ్" (4-1-86) సూ. చే, అఞ్ ప్రత్యయము. "టిడ్ఢాణఞ్" (473) సూ. చే, జీపు వచ్చును. ఇది యాద్యుదాత్తము. వృత్త్యర్థక జానపదీశబ్దమన్తోదాత్తమగును. (2) కుణ్డీ, కమండలు రూపమగు పాత్రము. ఇతరార్థమున (దహింపచేయునది) కుండా అని యగును. కుడి (దాహే) ధాతువునకు "గురోశ్చహలః" (3-3-103) సూ. చే, అకార ప్రత్యయము. కుణ్డ శబ్దముకంటె టాప్ ప్రత్యయము ప్రవర్తించిన కుణ్డా, అని యగును. భర్త బ్రతికియుండగా, జారునివలన బుట్టినవానిని కుణ్డశబ్దము బోధించునని యమరమున చెప్పబడెను, (అమృతే జారజః కుణ్డః) మనుష్యజాతి వాచకమగు

నీ కుణ్డ శబ్దమునకు "జాతేర స్త్రీవిషయా" (521) సూ. చే, జీషు సిద్ధమగును. కుణ్డీ అని యగును. కమండలు బోధకమగు కుణ్డ శబ్దము "కుణ్డీకమండలౌ జారాత్పతిపతీజీసుతే పుమాన్" అను మేదినీకోశమువలన నిత్యస్త్రీలిఙ్గమని బోధింపబడుటచే "జాతేరస్త్రీ" సూ. చే, జీషు అప్రాప్తమగుచుండ నీ సూత్రముచే జీషు విధింపబడెను. అంతియకాని, కుండ శబ్దమునకు కమండలు రూపార్థమునందే జీషు వచ్చును గాని మిగిలిన యర్థములందు జీషు రాదని "జాతేరస్త్రీ" సూ. చే, ప్రాప్తమగు జీషు యీ సూత్రముచే నియమింపబడునని జెప్పవలనుపడదు. కావున జారునివలన పుట్టినవనునర్థమున కుండ శబ్దముకంటె "జాతేరస్త్రీ" సూ. చే, జీషు వచ్చును గాన కుణ్డీ, అని యగునని భావము. (3) గోణీ (ఆవపనము) "ఓప్యతే నిక్షిప్యతే ధాన్యాదికం యస్మిన్" అను వ్యుత్పత్తిచే నావపనశబ్దము ధాన్యము నుంచుకొనుట కాధారమగు గోనె సంచి మొదలగువానిని బోధించును. గోణా. ఇది యొక స్త్రీకి పేరు. (4) స్థలీ (పురుషునిచే దున్నబడని భూమి). స్థలా (పురుషునిచే దున్నబడిన భూమి). (5) భాజీ. (పక్వమైనది) భాజా (అపక్వమైనది) (6) నాగీ. (స్థూలమైన యాడుది). నాగా. (పొడవైన యాడుది) గజవాచకమగు నాగ శబ్దము స్థౌల్యగుణ సంబంధమువలన స్త్రీబోధకముగ ప్రయోగింపబడునపు డీ సూత్రమున కుదాహరణమగును. సర్పవాచకమగు నాగశబ్దము, దైర్ఘ్యగుణ సంబంధమువలన స్త్రీ రూపార్థమందు ప్రయుక్తమైనపుడు, సూత్రమునకు ప్రత్యుదాహరణ మగును. ఉదాహరణ ప్రత్యుదాహరణములగు నాగశబ్దములు రెండును గౌణములే యనియును విధాన సామర్థ్యముచే వీనికంటె జీషు ప్రవర్తించుననియును తెలియుచుది. (7) కాలీ. (నల్లనిరంగుగల యాడుది) సూత్రమున వర్ణశబ్దము అర్శఆద్యజన్తము. (వర్ణో౽స్యాస్తీతివర్ణః) వర్ణముగలది. ఇట్లు వ్యాఖ్యానము చేయునిచో "గుణే శుక్లాదయః పుంసి" అను కోశమువలన శుక్లాదులు గుణ వాచకములగునపుడు, పుంలిఙ్గములనుటచే నిది యసఙ్గతము గావలసివచ్చును. కాలా (కార్శ్యగుణయుక్తమైన యాడుది). (8) నీలీ. (వస్త్రముకంటె భిన్నమైన ఓషధి మొదలగునవి). నీలా. (ఓషధిచే రంగువేయబడిన వస్త్రము). "నీల్యా రక్తా" అను నర్థమున "నీల్యా అన్ వక్తవ్యః" అను వార్తికముచే నోషధి విశేషవాచకమగు నీలీ శబ్దముకంటె అన్ ప్రత్యయము విధింపబడెను. అన్నన్త నీలశబ్దముకంటె టాప్ ప్రత్యయముచే నీలా అని సిద్ధమగును. "అనాచ్ఛాదనే" అని యనుటవలన వస్త్రభిన్నములగు నర్థము లన్నిటియందు నీల శబ్దమునకు జీషు ప్రసక్తమగుచుండ నే యే యర్థములందు జీషు రావలయునో యా యర్థములను చూపుచున్నాడు. (వా) నీలాదోషధౌ. (వా) ప్రాణిని చ. (వా) సంజ్ఞాయాంవా. ఓషధి, ప్రాణి, అర్థమగునపుడు, నిత్యముగను, సంజ్ఞా వాచకమగునపుడు వికల్పముగను నీలశబ్దముకంటె జీషు వచ్చును. నీలీ. నీలా. (సంజ్ఞావాచకము). (9) కుశీ. ఇనుముతో చేయబడినవస్తువు. (కరుకోల, లేక

నక్కు). కశా. మేడికఱ్ఱతో చేయబడు కొయ్యలు కశాశబ్దార్థమని ఛందోగులు వ్యవహరింతురు. (10) కాముకీ, మైథునేచ్ఛగలది. సూత్రమున మైథునేచ్ఛా శబ్దమర్థ ఆధ్యాజనము. కాముకా. మైథునముకంటె నితరములగు ధనాదుల నపేక్షించునది. (11) కబరీ. (కేశముల నన్నివేశ విశేషము) కబరా. చిత్ర వర్ణము గలది,

* 504. శోణాత్ప్రాచామ్. 4-1-43. శోణాత్ । ప్రాచామ్ । (ఙీష్)

శోణీ । శోణా ॥

504. ప్రాగ్దేశస్థుల మతమందు శోణశబ్దముకంటె ఙీషు వచ్చును. "శోణః కోకనదచ్ఛవిః" అను నమరకోశమువలన శోణశబ్దము వర్ణవాచకము. "వర్ణానాం తణతి" అను ఫిట్ సూత్రముచే నిది యాద్యుదాత్తమగుటచే ననుదాత్తాన్తమైనది. కావున "అన్యతో ఙీష్" (500) సూ. చే, ఙీషు సిద్ధమగుచుండ నీ సూత్రము వికల్పార్థము. ప్రాగ్దేశస్థుల మతమందు, శోణీ అనియు, నన్యమతమున శోణా, అనియు నగును.

* 505. వోతో గుణవచనాత్. 4-1-44. వా । ఉతః । గుణ వచనాత్ (ఙీష్)

ఉదన్తాద్గుణవాచినో వా ఙీష్ స్యాత్ । మృద్వీ । మృదుః । ఉతః కిమ్ । శుచిః । గుణేతి కిమ్ । ఆఖుః । (వా) ఖరుసంయోగోపధాన్న । ఖరుః పతింవరా కన్యా । పాణ్డుః ॥

505. హ్రస్వోకారమన్తమందుగల గుణవచనముకంటె వికల్పముగ ఙీష్ ప్రత్యయమగును. ఉదా:—మృద్వీ. మృదుః. "శుచిః" ఇచట ఙీషును వారించుటకై 'ఉతః' అను విశేషణము. ఆఖు. (ఎలుక) ఇది జాతివాచకము. దీనికంటె ఙీషును వారించుటకు "గుణవచనాత్" అనునది యావశ్యకము. (వా) ఖరుశబ్దమునకు, సంయోగ ముపధగాగల గుణవచనమునకును, ఙీషు రాదు. ఖరుః=పతిని పొందుటకై యుత్కంఠతోఁగూడిన కన్య. ఖరుశబ్ద ముత్కంఠా రూపమగు గుణమును బోధించునదగుటచే నీ సూత్రముచే ఙీషు ప్రసక్తమగు చున్నది. పాణ్డుః. ఇది సంయోగోపధ కుదాహరణము.

విధ:—సమాసము, కృదన్తము, తద్ధితాన్తము, సర్వనామములు, జాతి శబ్దములు, సంఖ్యావాచకములు, సంజ్ఞావాచకములు వీనికంటె విశేషణమగు శబ్దమిచటి గుణవచన శబ్దముచే గ్రహింపబడును. గుణవచనమ్ అను నన్వర్థ సంజ్ఞచే గుణోపసర్జన గుణవాచకములే గ్రహింపబడును గాని రూపాదులు గ్రహింపబడవు. ఈ యర్థము "ఆకడారాదేకా సంజ్ఞా" అను సూత్రము వ్యాఖ్యానమందు చెప్పబడెను.

* 506. * బహ్వాదిభ్యశ్చ. 4-1-45. బహ్వాదిభ్యః। చ। (వా। ఙీష్)

ఏభ్యో వా ఙీష్ స్యాత్। బహ్వీ। బహుః। కృదికారాద క్తినః। రాత్రిః। రాత్రీ। సర్వతోఽ క్తిన్నర్థాదిత్యేకే। శకటిః। శకటీ। అ క్తిన్నర్థాత్కిమ్। అజననిః। క్తిన్నన్తత్వాదప్రాప్తే విధ్యర్థం పద్ధతి శబ్దో గణే పఠ్యతే। హిమకాషిహతిషు చేతి పద్భావః। పద్ధతిః। పద్ధతీ.

506. బహ్వాదిగణపఠితములగు ప్రాతిపదికములకంటె వికల్పముగ ఙీషు అగును. ఉదా:—బహ్వీ, బహుః. "కృదికారాద క్తినః" సర్వతోఽ క్తిన్నర్థాదిత్యేకే" ఈ రెండును గణసూత్రములు (1) క్తిన్ ప్రత్యయాన్తము కంటె భిన్నమై కృత్ప్రత్యయ సంబంధియగు ఇకారమన్తమందుగల ప్రాతిపదికముకంటె ఙీషు వచ్చును. ఉదా:—రాత్రిః రాత్రీ. (2) క్తిన్ ప్రత్యయముయొక్క అర్థమున విధింపబడు ప్రత్యయము లన్తమందుగలవానిని విడిచి, కృదికారముగాని తద్భిన్నమగు నికారముగాని యన్తమందుగల ప్రాతిపదికముకంటె ఙీషు వచ్చునని కొందఱి వైయాకరణుల యాశయము. శకటిః. శకటీ. ఇది ప్రకృతి ప్రత్యయ విభాగము లేనిది. (అవ్యుత్పన్నము) కాన కృదన్తము గాదు. 'అజననిః' "స్త్రియాం క్తిన్" (3-3-94) అను నధికారమున "ఆక్రోశే నఞ్యనిః" (3-3-112) సూ. చే, నఞ్ పూర్వక జనధాతువునకు నిందార్థమందు అని ప్రత్యయము విధింపబడెను. "అ క్తిన్నర్థాత్" అను విశేషణమువలన అజననిశబ్దమునకు ఙీషు వారితమగును. పద్ధతిశబ్దము క్తిన్నన్తము. (పాదాభ్యాం హతిః) పాద + హతిః, అనియుండ "హిమకాషిహతిషు చ" (997) సూ. చే, పాదశబ్దమునకు పదాదేశము. క్తిన్నన్తమగుటవలన నిచట ఙీషు అప్రాప్తమగుచుండ ఙీషుకొఱకీ శబ్దము గణమున పఠింపబడెను. ఉదా:—పద్ధతిః. పద్ధతీ.

* 507. పుంయోగాదాఖ్యాయామ్. 4-1-48. పుమ్। యోగాత్। ఆఖ్యాయామ్। (ఙీష్)

యా పుమాఖ్యా పుంయోగాత్ స్త్రియాం వర్తతే తతో ఙీష్ స్యాత్। గోపస్య స్త్రీ గోపీ. (1 వా) పాలకాన్తాన్న। గోపాలికా। (2 వా) సూర్యాద్దేవతా

---

* బహు, పద్ధతి, అఙ్కతి, అఞ్చతి, అంహతి, శకటి, శక్తి, శస్త్రి, శారి, వారి, రాతి, రాధి, శాధి, అహి, కపి, యష్టి, ముని, ఇతః ప్రాణ్యఙ్గాత్, కృదికారాద క్తినః, సర్వతోఽ క్తిన్నర్థాదిత్యేకే, చణ్డ, అరాల, కృపణ, కమల, వికట, విశఙ్కట, భరుజ, ధ్వజ, చన్ద్రభాగాన్నద్యామ్, కల్యాణ, ఉదార, పురాణ, అహన్, ఇతి బహ్వాదయః.

యాం చాప్ వాచ్యః। సూర్యస్య స్త్రీ దేవతా సూ
ర్యా। దేవతాయాం కిమ్। సూరీ। కున్తీ। మానుషీ
యమ్ః

507. సూత్రమున పుమ్, అనునది లుప్తషష్ఠీకము, (పుంసః) దీని
నావృత్తిచేసి యందొకదానిని యోగాత్ అనుదానితో నన్వయింపవలయును.
రెండవది "ఆఖ్యాయామ్" అనుదానితో సంబంధించును. "ఆఖ్యాయామ్"
అనుచోట సప్తమి పంచమ్యర్థకము. (ఆఖ్యాయాః) ఆఖ్యాపదము బోధక
పరము. "స్త్రియామ్" అనునది యధికృతమగును. ఏ పురుషబోధక శబ్దము
పురుష సంబంధమువలన (ప్రకృతి నిమిత్తారోపముచే) స్త్రీని బోధింప
ప్రయుక్తమగునో, అట్టి యదన్త పురుషబోధక శబ్దముకంటె జీషు అగునని
సూత్రార్థము. ఉదా:—గోపీ. (గోపస్య స్త్రీ) గోపశబ్దమునకు గోవులను
పాలించువాడని యర్థము. గోపరిపాలనము స్వభావముచే పురుషధర్మమగుట
వలన నీశబ్దము పురుషులందే ప్రసిద్ధము. గోపునికిని, వాని స్త్రీకిని, గల సంబం
ధమును (దాంపత్యము, జన్యజనకభావము) బట్టి గోపశబ్దము, గోపసంబంధియగు
స్త్రీని బోధించుచున్నందున నిట్టి గోపశబ్దమునకు జీషు అగును. (1 వా) పాలక
శబ్దమన్తమందుగల ప్రాతిపదికముకంటె నీ సూత్రముచే జీషు రాదు. గోపాలికా.
(గోపాలకస్య స్త్రీ). అశ్వపాలికా. (అశ్వపాలకస్య స్త్రీ) (2 వా)
సూర్యశబ్దము సూర్యసంబంధియగు స్త్రీని, అనగా ఛాయాదేవి మొదలగు
దేవతలను, బోధించునపుడు, ఆ శబ్దముకంటె చాప్ ప్రత్యయమును చెప్పవల
యును. పుంయోగలక్షణ జీషునకిది యపవాదము. సూర్యా. (సూర్యస్య స్త్రీ,
దేవతా). సూర్యసంబంధిని మానుషి యగునపుడు చాపును వారించుటకై
వార్తికమున "దేవతాయామ్" అనునది యావశ్యకము. (సూర్యస్య స్త్రీ
మానుషీ). సూరీ (కున్తీదేవి). ఇచట పుంయోగలక్షణ జీషు. "సూర్యతిష్యా
గస్త్య" (502) సూ. చే, యలోపము.

వివ:—ఇచట యోగశబ్దార్థమగు సంబన్ధము దాంపత్యరూపమేయని
సంకోచము చేయుటలో ప్రమాణము లేనందున జన్యజనక భావముగూడ
గ్రహింపదగునని దీక్షితాశయము. ఈ విషయమున "కౌసల్యాఽసావి
సుఖేన రామః ప్రాక్కేకయీతో భరతస్తతో భూత్" (కేకయీ = కేక
యస్య దుహితా) అను భట్టిప్రయోగము (కేకయీ) ప్రమాణమగును. దేవకస్య
దుహితా అను నర్థమున దేవకీ అను రూపముయొక్క సిద్ధి ఫలమగును. "యాధేయం
భర్తృపాపకృతాన్ బన్ధాదీన్ లభతే ఏవం తచ్ఛబ్దమపి" (భార్య తనభర్తచే
చేయబడు పాపములయొక్క ఫలము ననుభవించునట్లు భర్త బోధించు శబ్దమును
గూడ పొందును) అను భాష్యోక్తివలన దాంపత్యసంబన్ధమునే గ్రహింపవలయు
ననియును, దేవకీత్యాది శబ్దములను గౌరాదిగణమున పఠింపవలయుననియును
నవీనుల యాశయము.

* 508. ఇన్ద్ర వరుణ భవశర్వరుద్ర మృడ హిమారణ్య యవయ వనమాతులాచార్యాణామానుక్ । (ఙీష్)

ఏషామానుగాగమః స్యాత్ ఙీష్ చ। ఇన్ద్రాదీనాం షణ్ణాం మాతులాచార్యయోశ్చ పుంయోగ ఏవేష్యతే। తత్ర ఙీషి సిద్ధే ఆనుగాగమ మాత్రం విధీయతే। ఇతరేషాం చతుర్ణా ముభయమ్। ఇన్ద్రాణీ। (1 వా) హిమారణ్యయోర్మహత్త్వే। మహద్ధిమం హిమానీ। మహదరణ్యమ్, అరణ్యానీ। (2 వా) యవాద్దోషే। దుష్టో యవో యవానీ। (3 వా) యవనాల్లిప్యామ్। యవనానాం లిపిర్యవనానీ। (4 వా) మాతులోపాధ్యాయయోరానుగ్వా। మాతులానీ। మాతులీ। ఉపాధ్యాయానీ। ఉపాధ్యాయీ। (5 వా) యా తు స్వయమేవాఽధ్యాపికా తత్ర నా ఙీష్ వాచ్యః। ఉపాధ్యాయీ। ఉపాధ్యాయా। (6 వా) ఆచార్యాదణత్వం చ। ఆచార్యస్య స్త్రీ ఆచార్యానీ। పుంయోగ ఇత్యేవ। ఆచార్యా స్వయం వ్యాఖ్యాత్రీ। (7 వా) అర్యక్షత్రియాభ్యాం వా స్వార్థే। అర్యాణీ। అర్యా। స్వామినీ వైశ్యా వేత్యర్థః। క్షత్రియాణీ। క్షత్రియా। పుంయోగే తు। అర్యీ। క్షత్రియీ। కథం బ్రహ్మాణీతి। బ్రహ్మాణమానయతి జీవయతీతి కర్మణ్యణ్ ॥

508. (1) ఇన్ద్ర, (2) వరుణ, (3) భవ, (4) శర్వ, (5) రుద్ర, (6) మృడ, (7) హిమ, (8) అరణ్య, (9) యవ, (10) యవన, (11) మాతుల, (12) ఆచార్య, ఈ శబ్దములకు ఆనుక్ అను నాగమము, ఙీషును వచ్చును. వీనిలో నిన్ద్రశబ్దము మొదలు యారింటికిని మాతులాచార్య శబ్దములకును పుంయోగమందే ఙీషానుగాగమములు వచ్చును. పుంయోగమును విడిచి యీ శబ్దములు స్త్రీలిఙ్గమున ప్రవర్తింపకుండుటయే యిందులకు గారణము. కావున వీనికి పుంయోగలక్షణమగు ఙీషు ప్రాప్తమగుచున్నందున నీ సూత్రముచే నా ఙీషుతోఁగలిపి ఆనుగాగమము మాత్రము విధింపబడును. శేషించిన హిమారణ్య యవయవనశబ్దములకు పుంయోగము సంభవింపనందున ఙీషానుగాగమములు రెండును విధింపబడును. ఉదా:—ఇన్ద్రాణీ. (ఇన్ద్రస్య స్త్రీ). ఆనుగాగమమున నుకార కకారము లిత్సంజ్ఞకములు. ఆన్ అనునది మిగిలియుండును. ఇది కి త్తగుటచే నన్త్యావయవమై యగును. ఇన్ద్ర + ఆన్ + ఈ. సవర్ణదీర్ఘము. ణత్వము. ఇట్లే వరుణానీ, భవానీ, శర్వాణీ, రుద్రాణీ, మృడానీ, శబ్దములు సాధువు లగును. (1 వా) హిమారణ్య శబ్దములకు తదర్థములందాధిక్యము ప్రతీయమాన

మగునపుడే జీషా నుగాగమములగును. మహత్త్వయోగమునందే యివి స్త్రీలిఙ్గములగునని భావము. హిమానీ. (మహద్ధిమమ్) హిమసమూహము. అరణ్యానీ. (మహదరణ్యమ్) పెద్దయడవి. (2 వా) దుష్టుడగు యవుడు, అను నర్థమందు యవశబ్దముకంటె జీషా నుగాగమములగును. యవానీ. (దుష్టో యవః) దుష్టయవుడన యవత్వజాతి విశిష్టుడు గాపన్నను, యవునియాకృతి ననుకరించువాడు. యవాకారాఽనుకరణమే ఆట్టివానియం దుగల దోషము. యవానీ శబ్దము యవత్వజాతికంటె భిన్నమగు జాతిని బోధించును. (3 వా) యవన శబ్దమునకు యవనుల లిపి, (అక్షరవిన్యాసము). అను నర్థమందు జీషా నుగాగమములు. యవనానీ. (యవనానాం లిపి). ఈయర్థమున "తస్యేదమ్" (4-3-120) సూ. చే, ప్రాప్తమగు అణ్ ప్రత్యయమున కిది బాధకము.

(4 వా) మాతులోపాధ్యాయ శబ్దములకు పుంయోగమున ఆనుగాగమము వికల్పముగనగును. మాతుల శబ్దమునకు నిత్యముగ ప్రాప్తమగుచుండ, నుపాధ్యాయశబ్దమున కప్రాప్తమగుచుండ విధింపబడుటచే నిది ప్రాప్తాఽప్రాప్త విభాషయగును. మాతులానీ. ఆనుగాగమము రానపుడు మాతులీ. మేనమామ భార్య అని యర్థము. ఇచట పుంయోగలక్షణ జీషుమాత్రమగును. ఉపాధ్యాయానీ. (ఉపాధ్యాయస్య స్త్రీ) ఉపాధ్యాయుని భార్య. ఆనుగాగమము రానపుడు ఉపాధ్యాయీ అని యగును. "ఇఙశ్చ" (3-3-21) అనుఘఞ్ విధాయక సూత్రమున "అపాదానే స్త్రియాం ఘఞ ఉపసంఖ్యానమ్, తదన్తాచ్చ వా జీష్ అనువార్తికము చెప్పబడెను. "ఉపేత్య అధీయతే యస్యాః" అను విగ్రహమున స్త్రీలిఙ్గమున ఘఞ్ ప్రత్యయమును చెప్పవలయును. (ఉపాధ్యాయ). ఘఞన్తముకంటె వికల్పముగ జీషు చెప్పదగునని పైవార్తికమున కర్థము. ఈవార్తికమువలన సిద్ధమగునర్థమే. మూలమున (5వా) యా తు స్వయమేవ...వాచ్యః, అని చెప్పబడెను. స్వయముగ నధ్యాపనము జేయునదను నర్థముగల ఉపాధ్యాయ శబ్దమునకు జీషు వికల్పముగ వచ్చునని యీ వాక్యమున కర్థము. ఉదా:—ఉపాధ్యాయీ. ఉపాధ్యాయా.

(6 వా) ఆచార్య శబ్దమునకు విధింపబడు ఆనుగాగమముయొక్క నకారమునకు ణత్వము రాదు. ఆచార్యానీ. (ఆచార్యస్య స్త్రీ). ఆచార్యుని భార్య. పుంయోగమందే జీషు నానుగాగమము నగును. ఇట్లు చెప్పుటచే స్వయముగ నుపదేశము జేయునదను నర్థమున టాపు ప్రవర్తించుటవలన ఆచార్యా అనియే యగును. (7 వా) అర్యక్షత్రియ శబ్దములకంటె స్వార్థమందు జీషా నుగాగమములు వికల్పముగ నగును. "స్వార్థే" అనునది భాష్యమువలన లబ్ధమైనదే. ఎట్లన:—ఈవార్తికమునకు ఆర్యాణీ, ఆర్యా, అను నుదాహరణముల జూపెను. స్వార్థమందే జీషా నుగాగమములుగాక పుంయోగమందే ప్రవృత్తము లైనచో

నానుగాగమము రానపుడు అర్యీ, అను పుంయోగలక్షణ జీషన్తము నుదహరింపవలసియుండును. వార్తికమున కుదాహరణము:—ఆర్యాణీ. అర్యా. యజమానురాలు లేక వైశ్యజాతి స్త్రీ అని యర్థము. "అర్యః స్వామివైశ్యయోః" (3-1-103) సూ. చే, నర్థద్వయమందే అర్యః, అని నిపాతనము చేయుటవలన నీ రెండర్థములు చూపబడినవి, క్షత్రియాణీ. క్షత్రియా. (క్షత్రియజాతి స్త్రీ) పుంయోగమందు వీనికంటె జీషు వచ్చును. అర్యీ. (అర్యస్య స్త్రీ) క్షత్రియీ. (క్షత్రియస్య స్త్రీ).

బ్రహ్మన్ శబ్దము సూత్రమున లేనందున దానికంటె నానుగాగమము ప్రవర్తింపకుండుటచే బ్రహ్మాణీ, అను రూపమెట్లు సాధువగునను శంకకు సమాధానమిది:—బ్రహ్మాణ మానయతి (జీవయతి) అను విగ్రహమున బ్రహ్మన్ శబ్దపూర్వకమగు అనధాతువు ప్రకృతిగగల ణిజన్తముకంటె "కర్మణ్యణ్" (3-2-1) సూ. చే, అణ్ ప్రత్యయమగును. బ్రహ్మాణ, అని యగును. అణ్ ప్రత్యయాన్తమగుటవలన "టిడ్ఢాణఞ్" (473) సూ. చే, దీనికంటె జీపు వచ్చును. బ్రహ్మాణీ. బ్రహ్మను జీవింపచేయునది, అనగా బ్రహ్మదేవుని భార్య యని ఫలితమగును. ఈ రీతిగ నిన్ద్రాణీ, వరుణానీ, మొదలగునవియు సిద్ధమగుచుండ నిన్ద్రవరుణేత్యాది సూత్రమునకు ఇన్ద్రస్య స్త్రీ అను నర్థమున ఇన్ద్రీ, ఇత్యాది రూపముల నివృత్తియే ఫలమగునని గ్రహించునది.

* 509. క్రీతాత్కరణపూర్వాత్. 4-1-50. క్రీతాత్ । కరణపూర్వాత్. (అతః).

క్రీతాన్తాదదన్తాత్కరణాదేః స్త్రియాం జీష్ స్యాత్ । వస్త్రక్రీతీ । క్వచిన్న । ధనక్రీతా ॥

509. కరణపూర్వాత్ = కరణం పూర్వమ్ (పూర్వావయవః). యస్య తస్మాత్. అనువృత్తమగు 'ప్రాతిపదికాత్' అనుదాని కిది విశేషణము. సూత్రమున కరణాత్తని చెప్పక యవయవవాచక పూర్వశబ్దమును గ్రహించుటచే నీ సూత్రము వస్త్రేణ క్రీతా అను వాక్యమందు ప్రవర్తింపక వస్త్రక్రీతీ అను సమాసమందే ప్రవర్తించుట సిద్ధమగును. కరణవాచకము పూర్వావయవముగా గలి క్రీతశబ్ద మన్త్యావయవముగల యదన్త ప్రాతిపదికము (సమాసము) కంటె జీషు వచ్చునని సూత్రార్థము. ఉదా:—వస్త్రక్రీతీ. (వస్త్రేణ క్రీతా). తృతీయాన్తమగు వస్త్ర శబ్దమునకు "గతికారకోపపదానాం కృద్భిస్సహ సమాస వచనం ప్రాక్సుబుత్పత్తేః" అను పరిభాషవలన సుబుత్పత్తికంటె బూర్వము కృదన్తమగు క్రీతశబ్దముతోనే సమాసము. వస్త్రక్రీత, అని యగును. దీనికంటె నీ సూత్రముచే జీషు. పరిభాషార్థము. గతి, కారకము, ఉపపదము, ఇవి సుబుత్పత్తికి పూర్వమందు కృదన్తముతోనే సమసించునవి. వస్త్రక్రీత అను

చోట సుబన్తముతో సమాసమగుననిన సుబుత్పత్తికి పూర్వమందు, కారకము కంటె పూర్వముపస్థితమగు స్త్రీలిఙ్గమున విధింపబడుటచే నన్తరఙ్గమగు స్త్రీలిఙ్గ ప్రత్యయము (టాప్) ప్రవర్తించెనని. అదన్తము గానందున నీ సూత్రమున కిచట ప్రవృత్తియే లేకపోవునని తెలియునది.

క్వచిన్న। ధనక్రీతా. ఈ గ్రన్థమున కాశయమిది:—"కర్తృకరణే కృతా బహులమ్" (2-1-32) సూత్రమందలి బహులగ్రహణము, గతికారక పరిభాష యనిత్యమనుటలో ప్రమాణమగును. కావున 'ధనక్రీతా' ఇత్యాదు లందు సుబన్తముతోనే సమాసమగును. సుబుత్పత్తి పూర్వమే క్రీతశబ్దమున కదన్తత్వప్రయుక్తమగు టాప్ ప్రవర్తించుటచే 'ధనక్రీతా' అని యగును: ఇపుడది యదన్తము గానందున నీ సూత్రమున కిచట ప్రసక్తిలేదు. ఇట్లు సిద్ధమైనదే "క్వచిన్న" అనునది గాని, యపూర్వము గాదని. బహులగ్రహణ మునకు పరిభాషానిత్యత్వము ఫలమని భాష్యమున చెప్పబడుటచే పరిభాషా నిత్యత్వమున నుచితమగు ప్రమాణము లేనందున నజాదిగణపాఠమువలన 'ధన క్రీతా' మొదలగునవి సాధువులగునని కొందఱిమతము.

* 510. క్తాదల్పాఖ్యాయామ్. 4-1-51. క్తాత్। అల్పాఖ్యా యామ్. (కరణపూర్వాత్).

కరణాదేః క్తాన్తాత్ స్త్రియాం ఙీష్ స్యాదల్ప త్వే ద్యోత్యే। అభ్రలిప్తీ ద్యౌః॥

510. ప్రత్యయగ్రహణ పరిభాషచే 'క్త' అనునది క్త ప్రత్యయాన్త మును బోధించును. ఇది ప్రాతిపదిక విశేషణమగుటచే క్తాన్తాన్త బోధక మగును. "అల్పాఖ్యాయామ్" అను దానికి అల్పత్వమందని అని యర్థము. ఇది కరణగతమైనది గాని క్రియాగతమైనది గాని గ్రహింపదగును. కరణవాచకము పూర్వావయవముగగల్గి క్తప్రత్యయాన్తము నదన్తమునగు ప్రాతిపదికముకంటె, సముదాయముచే నల్పత్వము గమ్యమానమగునపుడు ఙీషు వచ్చునని సూత్రార్థము. ఉదా:—అభ్రలిప్తీ. (అల్పైరభ్రైర్లిప్తా). ద్యౌః = అన్తరిక్షము. ఇచటి యల్పత్వము కరణములగు మేఘములందుండునదై సముదాయద్యోత్యమగును.

* 511. బహువ్రీహేశ్చాన్తోదాత్తాత్. 4-1-52. బహువ్రీ హేః। చ। అన్తోదాత్తాత్। (క్తాన్తాత్).

బహువ్రీహేః క్తాన్తాదన్తోదాత్తా దదన్తాత్ స్త్రియాం ఙీష్ స్యాత్। (1 వా) జాతిపూర్వాదితి వ క్తవ్యమ్। తేన బహునఞ్ సుకాలసుఖాది పూర్వా న్న। ఊరుభిన్నీ। నేహ। బహుకృశా. (2 వా) జా తాన్తాన్న। దన్తజాతా। (3 వా) పాణిగృహీతీ భా ర్యాయామ్। పాణిగృహీతాన్యా॥

511. క్త ప్రత్యయాన్తము నన్తోదాత్తము నగు నన్తమునగు బహువ్రీహి రూప ప్రాతిపదికముకంటె ఙీషు వచ్చును. (1 వా) జాతివాచకము పూర్వపదముగా గల బహువ్రీహికంటె నీసూత్రముచే ఙీషు అగునని చెప్పదగును. ఇట్లు చెప్పుట వలన, బహు, నఞ్, సు, కాల, సుఖ, దుఃఖ మొదలగునవి పూర్వమందున్న పు డీ సూత్రము ప్రవర్తింపదని ఫలితమగును. ఎట్లన:—జాతివాచకములు బహ్వా దులును పూర్వపదములుగా గల క్తాన్త బహువ్రీహికి అన్తోదాత్తము విధింపబడెను. అందు జాతివాచకము పూర్వపదముగా నున్నపుడే ఙీషని చెప్పుటచే బహ్వాదులు పూర్వావయవములుగాగల బహువ్రీహికంటె, ఙీష్ నిషేధ మర్థసిద్ధమగును. ఉదా:—ఊరుభిన్నీ. (భిన్నౌ ఊరూ యస్యాస్సా) ఒకదానినొకటి కలియనట్టి తొడలుగలది. ఊరు శబ్దము జాతివాచకము. భిన్నశబ్దము క్తాన్తము. సమాస ముగా భిన్నశబ్దమునకు పూర్వనిపాతము ప్రాప్తమగుచుండ, బహువ్రీహి సమాస మున, జాతివాచకముకంటె పరముగ నిష్ఠాన్తమును (క్తాన్తము, క్తవత్వన్తము) ప్రయోగింపవలయునను వార్తికముచే భిన్నశబ్దమునకు పరనిపాతమయ్యెను. బహుకృతా. (బహూని కృతాని యయా సా). ఇచట బహు శబ్దము జాతి వాచకము గానందున ఙీషు రాదు. (2 వా) జాత శబ్దము న్తమందుగల బహువ్రీహి కంటె ఙీషు రాదు. దన్తజాతా. (జాతా దన్తా యస్యాః). (3 వా) పాణి గృహీత శబ్దముకంటె భార్యయను నర్థమున ఙీషు చెప్పదగును. పాణిగృహీతీ. (పాణిర్గృహీతో యస్యాః). అగ్నిసాక్షిగ గ్రహింపబడు హస్తముగలది. ఇట్లుగాక కౌతుకాదికముచే గ్రహింపబడు పాణిగలదనునర్థమున పాణిగృహీత శబ్దముకంటె టాప్ ప్రత్యయమే యగును.

* 512. అస్వాఙ్గ పూర్వపదాద్వా. 4-1-53. అస్వాఙ్గ పూర్వ పదాత్ । వా । (పూర్వసూత్రమ్)

పూర్వేణ నిత్యే ప్రాప్తే వికల్పోఽయమ్।
సురాపీతీ। సురాపీతా। అన్తోదాత్తాత్కిమ్। వస్త్రచ్ఛన్నా। అనాచ్ఛాదనాదిత్యుదాత్త నిషేధః। అతఏవ పూర్వేణాఽపి న ఙీష్ ॥

512. న స్వాఙ్గమ్ = అస్వాఙ్గమ్, పూర్వం చ తత్పదం చ పూర్వపదమ్. అస్వాఙ్గంచ తత్పూర్వపదంచా స్వాఙ్గ పూర్వపదం. తస్మాత్తని విగ్రహము. స్వాఙ్గవాచకముకంటె భిన్నమగు పూర్వపదముకంటె పరమగు క్తాన్తమన్తమందు గలినట్టియు అన్తము నన్తోదాత్తమునగు బహువ్రీహికంటె ఙీషు వికల్పముగ నగునని సూత్రార్థము. పూర్వసూత్రముచే నిత్యముగ ఙీషు ప్రాప్తముగుచుండ నీ

స్సూత్రము వికల్పముకొఱకు చెప్పబడెను. ఉదా:— సురాపీతీ. సురాపీతా (పీతా సురా యయా సా). సురా శబ్దము స్వాఙ్గవాచకము గాదు. పూర్వ సూత్రములోని విషయములన్నియు నీ సూత్రమున నూహింపదగును. ‘‘అన్తోదాత్తాత్’’ అను విశేషణము లేనిచో ననుదాత్తాన్తమగు వస్త్రచ్ఛన్న శబ్దముకంటె జీషు ప్రసక్తమగును. క్తాన్త బహువ్రీహికి అన్తోదాత్తమును విధించు ‘‘జాతికాల...నాత్’’ (6-2-17) సూత్రమున ‘‘అనాచ్ఛాదనాత్’’ (వస్త్రవాచకము పూర్వమందున్నపుడు రాదు) అని యుండుటచే వస్త్రచ్ఛన్నా మొదలగు బహువ్రీహి యన్తోదాత్తము గానందున నీ సూత్రముచే గాని పూర్వ సూత్రముచే గాని జీషు రాదు.

* 513. స్వాఙ్గాచ్చోపసర్జనాద సంయోగోపధాత్. 4-1-54.
స్వాఙ్గాత్ । చ । ఉపసర్జనాత్ । అసంయోగోపధాత్ ।
(ఙీష్)

అసంయోగోపధ ముపసర్జనం యత్స్వాఙ్గం తదన్తాదదన్తాత్ప్రాతిపదికాద్వా ఙీష్। కేశానతిక్రాన్తా। అతికేశీ। అతికేశా। చన్ద్రముఖీ। చన్ద్రముఖా। సంయోగోపధాత్తు సుగుల్ఫా। ఉపసర్జనాత్కిమ్। శిఖా। స్వాఙ్గం త్రిధా (శ్లోకవార్తికమ్) (1 వా) అద్రవం మూర్తిమత్స్వాఙ్గం ప్రాణిస్థమవికారజమ్। సుస్వేదా। ద్రవత్వాత్। సుజ్ఞానా। అమూర్తత్వాత్। సుముఖా శాలా అప్రాణిస్థత్వాత్। సుశోఫా। వికారజత్వాత్। (2 వా) అతత్స్థం తత్ర దృష్టం చ। సుకేశీ, సుకేశా వా రథ్యా। అప్రాణిస్థస్యాఽపి ప్రాణిని దృష్టత్వాత్. (3 వా) తేన చేత్తత్తథాయుతమ్। సుస్తనీ, సుస్తనా వా ప్రతిమా। ప్రాణివత్ప్రాణి సదృశే స్థితత్వాత్॥

513. సంయోగముపధగాగలది గానట్టియు నుపసర్జనమునగు స్వాఙ్గవాచక మన్తమందుగల యదన్త ప్రాతిపదికముకంటె వికల్పముగ జీషు వచ్చును. ఉదా:— అతికేశీ. అతికేశా. (కేశానతిక్రాన్తా) ‘బహువ్రీహేః’ అనునది యీ సూత్రములోని కనువృత్తము గావున విషయము నీ యుదాహరణము సూచించుచున్నది. ఇచట కేశశబ్దము స్వాఙ్గవాచకము. ఆమె ప్రధానమగుట వలన కేశము లుపసర్జనము లయినవి. చన్ద్రముఖీ, చన్ద్రముఖా. (చన్ద్రఇవ

ముఖం యస్యాః). బహువ్రీహియందు నీ సూత్రము ప్రవర్తించునను టకు నిదర్శనమిది. ఇచట ముఖము స్వాఙ్గమునుపసర్జనము నగును. సుగుల్ఫా. (శోభనం గుల్ఫం యస్యాః). ఇచట గుల్ఫశబ్దము సంయోగోపధము. "అసంయోగోపధాత్" అను విశేషణమువలన నిచట జీషు వారితమగును. శిఖా. శిఖ యుపసర్జనము గానందున నిచట జీషు నివృత్తికొఱ కుపసర్జనపద మావశ్యకము. "ఉపసర్జనాత్" అనునది కానిచో టాప్పును బాధించి జీషు ప్రసక్తమగును. కొన్ని కౌముదీ పుస్తకములందు "సుశిఖా" అనుచోట జీష్ నివృత్తి యుపసర్జన గ్రహణ ఫలమని వ్రాయబడియున్నది. శిఖా శబ్దముతో సమాసమును జేసినపిదప ప్రాతిపదిక మదన్తము గాకపోవుటచే జీషునకు ప్రాప్తియే లేనందున నీ పాఠము గ్రన్థకారాభిమతము గాదని తెలియదగును.

స్వమఙ్గమ్ = స్వాఙ్గమ్. (తన సంబన్ధమైన యవయవము). అని స్వాఙ్గ పదమున కర్థమును జెప్పినచో నతివ్యాప్తి, (అలక్ష్యమందు లక్షణ ప్రవృత్తి) అవ్యాప్తి, (కొన్ని లక్ష్యములలో లక్షణము ప్రవర్తింపకుండుట) అను దోష ద్వయము సంభవించును. సుముఖా. (శోభనం ముఖం యస్యాః). (శాలా) ముఖపదార్థమగు ద్వారము శాల కవయవమగుటచే స్వాఙ్గము గావలసివచ్చును. కావున నిట్టిచోటులం దతివ్యాప్తి ప్రసక్తమగును. సుకేశీ. (శోభనాః కేశా యస్యామ్). (రథ్యా) ఇచట కేశములు రథ్యకు (వీధికి) అవయవములు గానందున స్వాఙ్గము గాకపోవలసివచ్చును. కావున నిట్టిచోటులం దవ్యాప్తి సంభవించును. అవ్యాప్త్యతివ్యాప్తి దోష పరిహారము కొఱకు స్వాఙ్గలక్షణమును మూడు విధములుగ పరిష్కరించుచున్నాడు.

(1) ద్రవద్రవ్యము గానట్టియు రోగాదిజన్యము గానట్టియు ఆకారము గలదియు ప్రాణియందుండునట్టి వస్తువు స్వాఙ్గమగునని ప్రథమ లక్షణార్థము. ఉదా:—చంద్రముఖీ. ఇచట ముఖము లక్ష్యము. సుస్వేదా. (శోభనః స్వేదో యస్యాః). స్వేదము (చెమట) ద్రవద్రవ్యమగుటచే ప్రాణిస్థమైనను, స్వాఙ్గము గాదు. సుజ్ఞానా. (శోభనం జ్ఞానం యస్యాః). మూర్తియన స్పర్శగల ద్రవ్య పరిమాణము. జ్ఞానము మూర్తిమత్తు గానందున స్వాఙ్గము గాదు. సముఖా. (శాలా) ఇచట ముఖశబ్దము ప్రాణియగు శాలయొక్క ప్రారంభమును బోధించునదగుటచే ప్రాణిస్థము గానందున స్వాఙ్గముగాదు. సుశోఫా. శోఫ, రోగజన్యమగుటచే స్వాఙ్గముగాదు.

(2) "అతత్స్థమ్" ఇచట తత్పదముచే ప్రాణి పరామర్శింపబడును. అతత్ = ప్రాణిభిన్నము. దీనియందుండునది అతత్స్థ పదముచే బోధింపబడును.

త్ర అనుదానికి ప్రాణియందని యర్థము. ప్రాణియం దొకపుడు చూడబడి, యిపుడు ప్రాణిభిన్నమగు వీథి, మొదలగువానియం దుండునదియును స్వాఙ్గమగు నని ద్వితీయ లక్షణార్థము. రథ్యయందుండు కేశము లిపుడు ప్రాణియందు లేవందున, ప్రథమలక్షణముచే నివి స్వాఙ్గములు గావందుటచే నీ లక్షణ మారంభింపబడెను. ఉదా:—సుకేశీ. సుకేశా. (శోభనాః కేశా యస్యామ్) రథ్యాగత కేశములు ప్రస్తుతము ప్రాణిభిన్నమందున్న నొకప్పుడు ప్రాణియందు చూడబడుటచే స్వాఙ్గములగును.

(3) ప్రతిమాదులందున్న స్తనములు మొదలగునవి ఒకప్పుడైనను ప్రాణియందు చూడబడకపోవుటచే ద్వితీయ లక్షణమువలన కూడ స్వాఙ్గము గాకపోవుటచే, వానికి స్వాఙ్గత్వముకొఱకు మూడవలక్షణ మారంభింపబడెను. "తేనచేత్తత్థాయుతమ్" అని అప్రాణితోఽపి స్వాఙ్గమునది యధ్యాహారలబ్ధము. చేత్తనునది యద్యర్థకము. ప్రాణ్యఙ్గములగు స్తనాదులతో ప్రాణులెట్లు సంబద్ధములగునో యట్లే ప్రాణ్యఙ్గసదృశములగు స్తనాదులతో ప్రాణిసదృశమగు ప్రతిమాదులు సంబద్ధములయినచో నట్టి ప్రతిమాదిగత స్తనాదులును స్వాఙ్గము లగునని యర్థము, ఉదా:—సుస్తనీ, సుస్తనా (బొమ్మ) ప్రాణియందువలె ప్రాణిసదృశమం దుండుటచే నివి స్వాఙ్గములగును.

* 514. నాసికోదరౌష్ఠజఙ్ఘాదన్తకర్ణశృఙ్గాచ్చ. 4-1-55. నాసికోదరౌష్ఠ...శృఙ్గాత్ । చ । (వా । జీష్).

ఏభ్యో వా జీష్ స్యాత్ । అద్యయోర్బహ్వజ్లక్షణో నిషేధో బాధ్యతే । పురస్తా దపవాదన్యాయాత్ । ఓష్ఠాదీనాం పఞ్చానాం తు అసంయోగోపధాదితి పర్యుదాసే ప్రాప్తే వచనమ్ । మధ్యేఽపవాదన్యాయాత్ । సహనఞ్లక్షణస్తు ప్రతిషేధః పరత్వాదస్య బాధకః । తుఙ్గనాసికీ । తుఙ్గనాసికా ఇత్యాది ॥ నేహ । సహనాసికా । అనాసికా । అత్ర వృత్తిః । అఙ్గగాత్రకణ్ఠేభ్యో వక్తవ్యమ్ । స్వఙ్గీ । స్వఙ్గేత్యాది । ఏతచ్చానుక్తసముచ్చయార్థేన చకారేణ సంగ్రాహ్యమితి కేచిత్ । భాష్యాద్యనుక్తత్వాద ప్రమాణమితి ప్రామాణికాః ॥ అత్ర వార్తికాని । (1 వా) పుచ్ఛాచ్చ । సుపుచ్ఛీ । సుపుచ్ఛా । (2 వా) కబరమణివిషశరేభ్యో నిత్యమ్ । కబరం చిత్రం పుచ్ఛం యస

స్యాస్సా కబరపుచ్ఛీ మయూరీ ఇత్యాది। (3 వా) ఉపమానాత్పక్షాచ్చ పుచ్ఛాన్న్యా। నిత్యమిత్యేవ। ఉలూకపక్షీ, శాలా। ఉలూకపుచ్ఛీ సేనా॥

514. స్వాఙ్గములు నుపసర్జనములునగు నాసికా, ఉదర, ఓష్ఠ, జఙ్ఘా, దన్త, కర్ణ, శృఙ్గ, ఇవి యన్తమందుగల ప్రాతిపదికములకంటె ఙీషు వికల్పముగనగును. నాసికోదర శబ్దములకు విధింపబడు ఙీషు "నఖోదాది బహ్వాచః" (515) అను సూత్రములోని బహ్వాచః అను నిషేధమును "పురస్తాదపవాదా అనన్తరాన్ విధీన్ బాధన్తే నోత్తరాన్" అను న్యాయముచే బాధించును. ముందుగా జెప్పబడిన యపవాద శాస్త్రము తనకు పరమున వ్యవహితమునగు శాస్త్రమునే బాధించును. గాని వ్యవహితమగు శాస్త్రమును బాధింపదని న్యాయమున కర్థము. ఈ న్యాయముచే నాసికోదర శబ్దములకు విహితమగు ఙీషు అవ్యవహితమగు "బహ్వాచః" అను నిషేధమునే బాధించును గాని వ్యవహితమగు "సహనఞ్ విద్యమాన పూర్వాచ్చ" (516) అను నిషేధమును బాధింపదు. కావున సహనఞ్ విద్యమాన శబ్దములు పూర్వమందును నాసికోదరశబ్దములన్తమందునుగల ప్రాతిపదికములకంటె ఙీషును బాధించి పరమగు "సహనఞ్" అను నిషేధమే ప్రవర్తించును. ఉదా:—సహనాసికా. ఓష్ఠాదులగు నైదు శబ్దములకు విధింపబడు ఙీషు, "మధ్యేపవాదాః పూర్వాన్ విధీన్ బాధన్తే నోత్తరాన్" (మధ్యనుండెడి యపవాద శాస్త్రములు తమకు పూర్వమందుండు సూత్రములనే బాధించును గాని తరువాతనుండు సూత్రములను బాధింపవు). అను న్యాయముచే "స్వాఙ్గాచ్చోపసర్జనాత్" (513) సూత్రములోని అసంయోగోపధాత్తను పర్యుదాసమునే బాధించును గాని "సహనఞ్" అను నిషేధమును బాధింపదు. సహనఞ్ విద్యమాన శబ్దములు పూర్వమందును ఓష్ఠాదులన్తమందునుగల ప్రాతిపదికములకంటె, పరమగు "సహనఞ్" అను నిషేధ మీ ఙీషును బాధించి ప్రవర్తించును. ఉదా:—సహోష్ఠా ఇత్యాదులు. సూత్రమున నుదాహరణములు:—తుఙ్గనాసికీ. తుఙ్గనాసికా. (తుఙ్గా నాసికా యస్యాః). తలోదరీ, తలోదరా. బింబోష్ఠీ, బింబోష్ఠా. దీర్ఘజఙ్ఘీ, దీర్ఘజఙ్ఘా. సమదన్తీ, సమదన్తా. చారుకర్ణీ, చారుకర్ణా. తీక్ష్ణశృఙ్గీ, తీక్ష్ణశృఙ్గా ఇత్యాదులూహ్యంబులు.

ఈ సూత్ర వ్యాఖ్యాన సందర్భమున వృత్తిగ్రంథములో పఠింపబడిన వచనము:—"అఙ్గ...వక్తవ్యమ్". అఙ్గగాత్ర కణ్ఠశబ్దము లన్తమందుగల ప్రాతిపదికములకంటె ఙీషు చెప్పదగునని యర్థము. ఇచటివృత్తి పఠనముకుక

కాశికావృత్తియని యర్థముచేయుట సంప్రదాయము. కాని యీ వచనము కాశికలో గాన్పింపదేదు. భాగవృత్తిలోనిది కావచ్చును. భాగవృత్తియను గ్రంథముమాత్ర మిప్పుడుపలబ్ధముగాదు. సంయోగోపధములగు అఙ్గాదులకు "అసంయోగోపధాత్" అను పర్యుదాసముచే జీష్ నిషేధము ప్రాప్తమగుచుండ నీ వచనము జెప్పబడెను. ఉదా:—స్వఙ్గీ, స్వఙ్గా. (శోభనాన్యఙ్గాని యస్యాః). సుగాత్రీ, సుగాత్రా. సుకణ్ఠీ, సుకణ్ఠా. "నాసికోదర" (514) సూత్రములోని నాసికాదుల సముచ్చయమును బోధింపదల్చి చకారమువలన నీ వచనము సంగ్రహింపదగునరియు, తుస్తనాశికీ శబ్దమునకె సుగాత్రీ మొదలగు నవియు సాధువు లనియును కొందరి యాశయము. సర్వజ్ఞుడగు భాష్యకారు డీ చకారమున కిట్టి యర్థమును చెప్పనందున నీ వచనము ప్రమాణము గాదనియు, కృశాఙ్గీ, సుగాత్రీ, సుకణ్ఠీ, మొదలగు ప్రయోగముల అప్రయోగములే యనియును ప్రామాణికుల యాశయము. ఈ సూత్రమున వార్తికములు. (1) పుచ్ఛశబ్దాన్తమగు ప్రాతిపదికముకంటె జీషు వికల్పముగ జెప్పదగును. ఉదా:—సుపుచ్ఛీ, సుపుచ్ఛా. (2) కబర, మణి, విష, శర, ఇవి పూర్వమందును పుచ్ఛశబ్ద మన్తమందును గల ప్రాతిపదికముకంటె జీషు నిత్యముగ నగును. ఉదా:—కబరపుచ్ఛీ. (కబరం = చిత్రం పుచ్ఛం యస్యాః). నెమిలి. మణిపుచ్ఛీ, విషపుచ్ఛీ, శరపుచ్ఛీ. (3) ఉపమాన వాచకముకంటె పరములగు పక్షపుచ్ఛశబ్దము లన్తమందుగల ప్రాతిపదికములకంటె జీషు నిత్యముగవచ్చును. ఉదా:—ఉలూకపక్షీ. (ఉలూకపక్షావివ పక్షౌ = పార్శ్వౌ యస్యాః). (శాలా) గ్రుడ్లగూబ రెక్కలవంటి పార్శ్వములుగల శాల. ఉలూకపుచ్ఛీ. (సేనా). (ఉలూకపుచ్ఛమివ పుచ్ఛం యస్యాః).

* 515. న క్రోడాది బహ్వచః. 4-1-56. న। క్రోడాది బహ్వచః॥

క్రోడాదేర్బహ్వచశ్చ స్వాఙ్గాన్న ఙీష్। కల్యాణక్రోడా। అశ్వానామురః క్రోడా। ఆకృతి గణోఽయమ్। సుజఘనా.

515. క్రోడాది బహ్వచః = క్రోడః ఆదిర్యస్య స క్రోడాదిః, (బహవః అచో యస్య బహ్వచ్,) వీనికి సమాహారద్వంద్వము = క్రోడాది బహ్వచ్, తస్మాత్. క్రోడాదిగణ పఠితముగాని, రెండుకంటె నధికమైన యచ్చులు గలది

---

* క్రోడ, నఖ, ఖుర, గోఖా, ఉఖా, శిఖా, వాల, శఫ, శుక్ర, ఆకృతిగణోఽయమ్, [illegible], గల, ఘోణా, వాల, [illegible], గుద, శర, ఇత్యాది ఇతి క్రోడాదిః

(బహ్వచ్కము) గాని యగు స్వాంగము నంతమునందుగల ప్రాతిపదికముకంటె ఙీషు రాదని యర్థము. "స్వాఙ్గాత్" (5.3) సూ. చే, విహితమగు ఙీషున కిది నిషేధము. ఉదా:—కల్యాణక్రోడా. (కల్యాణీ క్రోడా యస్యాః). కల్యాణీ శబ్దము, పుంవద్భావముచలన కల్యాణ, అని యగును. క్రోడాశబ్దము నిత్యస్త్రీలిఙ్గము. ఇది శబ్దశక్తి స్వభావముచే గుఱ్ఱములయొక్క వక్షఃస్థలమునే బోధించును. సమాసమున నుపసర్జన హ్రస్వముచే నదన్తమగుటవలన ఙీషు ప్రాప్తమగుచున్నది. ఇది యాకృతిగణము. బహ్వచ్కమునకు సుజఘనా. మహాలలాటా. ఇత్యాదు లుదాహరణములు.

వివ:—క్రోడాశబ్దము టాబన్తము. స్వభావమువలన నశ్వములయొక్క వక్షఃస్థలమును బోధించునని హరదత్తాదుల యభిప్రాయము. (న నా క్రోడం భుజాన్తరమ్) క్రోడశబ్దము పుంలిఙ్గము గాదు, భుజాంతరమును బోధించునని అమరమున చెప్పబడెను. పుంలిఙ్గమని రత్నపతి యనెను. క్రోడాదిగణమున్న క్రోడ, అను ప్రాతిపదికము మాత్రమే పఠింపబడెను గాని టాబన్తము పఠింపబడలేదని గణరత్నమహోదధికారు డనెను. వీనినిబట్టి క్రోడశబ్దము మూడు లిఙ్గములు గలదని తెలియుచున్నది. ఇట్టి క్రోడశబ్దము సూత్రమున కుదాహరణమగునని దీక్షితాశయము. తుదాదిగణమున క్రుడ (నిమజ్జనే) అను ధాతువుయొద్ద మాధవీయ ధాతువృత్తిలో మాధవు డిట్లు చెప్పెను. క్రోడః అనునది ఘఞన్తము. క్రోడాదిగణమున టాబన్తమునకే పాఠమువలన భుజాన్తరమును మాత్రము బోధించు క్రోడశబ్దమునకు బహువ్రీహియందు "స్వాఙ్గాత్" అను సూ. చే, ఙీషు వికల్పముగ నగును. కాన కల్యాణక్రోడీ, కల్యాణక్రోడా (మయూరీ), అని యగును.

* 516. సహనఞ్ విద్యమాన పూర్వాచ్చ. 4-1-57. సహ। నఞ్ విద్యమాన పూర్వాత్ । చ । (న, ఙీష్)

సహాద్యాది త్రికపూర్వాన్న ఙీష్ । సకేశా । అకేశా । విద్యమాననాసికా ॥

516. సహనఞ్ విద్యమాన శబ్దములు పూర్వమందును స్వాఙ్గవాచకము లన్తమందును గల ప్రాతిపదికముకంటె ఙీషు రాదు. "స్వాఙ్గాత్" "నాసికోదర" సూత్రములచే ప్రాప్తమగు ఙీషునకు నిషేధము. ఉదా:—సకేశా. (కేశైస్సహ వర్తతే) సహ శబ్దమునకు సకారాదేశము. అకేశా. (అవిద్యమానాః కేశా యస్యాః). విద్యమాననాసికా. (విద్యమానా నాసికా యస్యాః) పెద్దముక్కు గలది.

* 517. నఖముఖాత్సంజ్ఞాయామ్. 4-1-58. నఖముఖాత్, సంజ్ఞాయామ్. (఼ఙీష్, న)

ఙీష్ న స్యాత్। శూర్పణఖా। గౌరముఖా। సంజ్ఞాయామ్ కిమ్। తామ్రముఖీ కన్యా॥

517. నఖముఖశబ్దము లన్తమందుగల ప్రాతిపదికములకంటె ఙీషు రాదు. ఉదా:—శూర్పణఖా. "పూర్వపదాత్సంజ్ఞాయామ్" (862) సూ. చే, ణత్వము ఇది రావణుని సోదరికి సంజ్ఞ. శూర్పవత్ నఖాని యస్యాః (చేటలు వంటి గోళ్లు గలది) అను నవయవార్థమును వివక్షించునపుడు ఙీష్ నిషేధము, ణత్వముగూడ రానందున శూర్పనఖీ అని యగును. గౌరముఖా. ఒక స్త్రీకి పేరు. తామ్రముఖీ (తామ్రం ముఖం యస్యాః) కన్యా = ఎఱ్ఱని ముఖముగల కన్య. ఇది సంజ్ఞగాదు. సూత్రమున "సంజ్ఞాయామ్" అనుటచే నిచట నీ నిషేధము ప్రవర్తించదు.

* 518. దిక్పూర్వపదాన్ ఙీప్. 4-1-60. దిక్పూర్వపదాత్, ఙీప్. (ఙీష్)

దిక్పూర్వపదాత్స్వాఙ్గాన్తాత్ప్రాతిపదికాత్పరస్య ఙీషో ఙీబాదేశః స్యాత్। ప్రాఙ్ముఖీ। ఆద్యుదాత్తం పదమ్॥

518. అనువృత్తమగు ఙీష్ అనునది షష్ఠ్యన్తముగ విపరిణామము నొందును. దిగ్వాచకము పూర్వపదముగాగల్గి స్వాఙ్గవాచక ముత్తరపదముగగల ప్రాతిపదికముకంటె పరమగు ఙీషునకు ఙీబాదేశమగును. ఉదా:—ప్రాఙ్ముఖీ. (ప్రాక్ ముఖం యస్యాః) స్వరభేదమే ఫలము. ఇది ఙీబన్తమగుటచే నాద్యుదాత్తము సిద్ధమగును. ఙీషన్తమైనచో నన్తోదాత్తము ప్రసక్తమయ్యెడిని.

వివ:—ఙీష్పదమున కనువృత్తిజేసి ఙషునకు ఙీపును విధించుటమాని, స్వతన్త్రముగ ఙీపును విధించినచో 'ప్రాక్ గుల్ఫా' ప్రాక్ క్రోడా, మొదలగు చోటులందును, "అసంయోగోపధాత్" అను నిషేధమును బాధించి యీ ఙీపు ప్రసక్తమగును. ఙీషునకు ఙీపును విధించినచో ప్రాక్ గుల్ఫాదులందు గుల్ఫాదులు సంయోగోపధము లగుటచే ఙీషు రానందున దోషము వారింపబడును.

* 519. వాహః. 4-1-61. (ఙీష్)

వాహాన్తాత్ప్రాతిపదికాత్ ఙీష్ స్యాత్। ఙీషే

వానువర్తతే న జీప్। దిత్యవాట్ చ మే దిత్యౌహీ
చ మే॥

519. వాహః అనునది వాహ్ శబ్దమునకు పంచమ్యేక వచనము. వాహ్, అనునది ణ్వి ప్రత్యయాన్తమగు వహ్ ధాతువున కనుకరణము. స్వరితత్వము లేనందున సన్నిహితమైనను జీపున కనువృత్తి లేదు. స్వరితత్వ ప్రతిజ్ఞవలన ఙీష్ యనువర్తింపబడును. వాహ్, అనునది యన్తముగాగల ప్రాతిపదికముకంటె ఙీషు వచ్చునని సూత్రార్థము. ఉదా:—"దిత్యవాట్ చ మే, దిత్యౌహీ చ మే" దిత్యం వహాతి అని యర్థము. (ఆరుమాసముల కాలము పశువులకొక వయస్సనియును, దిత్యశబ్దముట్టి మూడవ వయస్సు బోధించుననియును, యజుర్వేద భాష్యమున చెప్పబడెను). దిత్యవాహ్ + ఈ. భసంజ్ఞ యుండుటచే, "వాహ ఊఠ్" (330) సూ. చే, సంప్రసారణ సంజ్ఞగల ఉఠ్ అగును. పూర్వరూపము. వృద్ధి. ణ్వి ప్రత్యయము ఛందోమాత్ర గోచరమగుటచే వేద వాక్యమే యుదాహరింపబడెను.

వివ:—ణిజన్తమునగు వహ్ ధాతువుకంటె క్విప్ ప్రత్యయమువలన లోకమునగూడ వాహ్ అను రూపము సిద్ధమగును గాన లోకమందును దిత్యౌహీ, అను రూపము సాధువగును. ఇట్లైే సూత్రము లోకమునకును నావశ్యకమగుటచేతనే యీ సూత్రము నిచట వ్యాఖ్యానము చేసెను. లేనిచో వైదిక ప్రకరణముననే వ్యాఖ్యానము చేయవలసియుండును.

* 520. సఖ్యశిశ్వీతి భాషాయామ్. 4-1-62. సఖీ। అశిశ్వీ। ఇతి। భాషాయామ్॥

ఇతిశబ్దః ప్రకారే భాషాయా మిత్యవన్తరం ద్రష్టవ్యః। తేన ఛందస్యపి క్వచిత్। సఖీ। అశిశ్వీ। ఆధేనవో ధునయన్తా మశిశ్వీః॥

520. సఖి, అశిశు, ఈ శబ్దములకు లోకమున సార్వత్రికముగను వేదమున గొన్నిచోటులందును ఙీషు నిపతింపబడెను. ఇతి శబ్దమునకు ప్రకారము, అనగా సాదృశ్యమని యర్థము. భాషాసదృశము వేదమగును. దీనిని భాషాయామ్, అను పదము చివరను జేర్పవలయును. (భాషాయామితి). భాషయన లౌకిక ప్రయోగము. ఇట్లు చేయుటవలన సఖ్యశిశ్వీ శబ్దములు లోకమందువలె వేదమందును సాధువులగునను నర్థము లభించును. భాషాయామ్, అను పదమును విడిచిన నీ యర్థము లభించును, గాని యిట్లు చెప్పుటచే వేదమున గొన్నిచోటుల లందే సఖ్యశిశ్వీ శబ్దములకు సాధుత్వమను నర్థము లభించును. ఉదా:—సఖీ.

అశిశ్వీ. (నవిద్యతే శిశు ర్యస్యాః). వేదమున గొన్నిచోటులందే యనుటవలన "సఖా సప్తపదాభవ" అను చోటున ఙీషు నివృత్తమగును.

* 521. జాతేర స్త్రీవిషయాదయోపధాత్. 4-1-63. జాతేః। అస్త్రీవిషయాత్। అయోపధాత్। (ఙీష్)

జాతివాచి యన్న చ స్త్రియాం నియతమయోపధం తతః స్త్రియాం ఙీష్ స్యాత్. (1 వా) ఆకృతిగ్రహణా జాతిః। అనుగతసంస్థానవ్యఙ్గ్యేత్యర్థః। తటీ। (2 వా) లిఙ్గానాం చ న సర్వభాక్। సకృదాఖ్యాతనిర్గ్రాహ్యా। అసర్వలిఙ్గత్వే సత్యేకస్యాం వ్యక్తౌ కథనాద్వ్యక్త్యన్తరే కథనం వినాఽపి సుగ్రహా జాతిరితి లక్షణాన్తరమ్। వృషలీ। సత్యన్తమ్ కిమ్। శుక్లా। సకృదిత్యాదికిమ్। దేవదత్తా। (3 వా) గోత్రం చ చరణైస్సహ। అపత్యప్రత్యయాన్తః శాఖాధ్యేతృవాచీ చ, శబ్దో జాతికార్యం లభత ఇత్యర్థః। ఔపగవీ। కఠీ। బహ్వృచీ। బ్రాహ్మణీత్యత్ర తు శార్ఙ్గరవాది పాఠాత్ ఙీనా ఙీష్ బాధ్యతే। జాతేః కిమ్। ముణ్డా। అస్త్రీవిషయాత్ కిమ్। బలాకా। అయోపధాత్కిమ్। క్షత్రియా। (4 వా) యోపధప్రతిషేధే హయ, గవయ ముకయ మనుష్య మత్స్యానా మప్రతిషేధః। హయీ। గవయీ। ముకయీ। హలస్తద్ధితస్యేతి యలోపః। మనుషీ। (5 వా) మత్స్యస్య ఙ్యామ్। మత్సీ॥

521. అస్త్రీవిషయాత్తనుచోట విషయశబ్దమున కితరార్థమును బోధింపకుండుట యని యర్థము. అస్త్రీవిషయాత్తను పదమువలన నిత్య స్త్రీలిఙ్గము గానట్టి యనునర్థము లభించును. నిత్య స్త్రీలిఙ్గము యకారోపధమును గానట్టి జాతివాచకముకంటె ఙీషు వచ్చునని సూత్రార్థము. "నిత్యమేకమనేకానుగతం జాతిః" "జననేన ప్రాప్యతే యాసా జాతిః." ఈ రీతిగ జాతి లక్షణములు వేర్వేరుగ నున్నవి. ఇందు మొదటి లక్షణము శుక్లగుణము, ఏకము నిత్యమను పక్షమున, శుక్లగుణమం దతివ్యాప్తమగును. రెండవది, యువత్వము (నడిమివయస్సు) మొదలగు జాతులు జన్మతో వచ్చునవి గానందున వానియం దవ్యాప్తమగును. కావున నిచటి జాతిస్వరూపమును మూడు విధములుగ చెప్పుచున్నాడు:—"ఆకృతిగ్రహణా.....గోత్రంచ చరణైస్సహ",

(1) ఆకృతిగ్రహణా జాతిః (గృహ్యతే అనేనేతి గ్రహణమ్ = గ్రహణ సాధనము. ఆకృతిః = అవయవ సన్నివేశము. ఆకృతిః గ్రహణం యస్యాః = ఆకృతి గ్రహణా). ఒకేరీతిగనుండెడి యవయవ సన్నివేశముచే బోల్పదగినదని యర్థము. ఇట్టి యాకారముగలది గోవు, ఇట్టి యాకారముగలది తటము. ఈరీతి నాకృత్యుపదేశమువలన తెలియదగినది జాతియని ఫలితార్థమగును. ఉదా:—తటీ. జలసమీపదేశ విశేషము తటమను నుపదేశముచే తెలియదగినది తటత్వజాతి యగును. జాతివాచకమగు తట శబ్దముకంటె జీషు వచ్చును.

(2) వృషలుని (శూద్రుడు) యందలి యవయవ సన్నివేశము బ్రాహ్మణాది సాధారణమగుటచే ప్రథమ లక్షణముచే వృషలత్వము జాతి గాకుండుటచే నీ ద్వితీయ లక్షణ మారంభింపబడెను. 2 "లింగానాం చ...నిర్గ్రాహ్యా" లిఙ్గానా మనుచోట షష్ఠీ కర్మార్థకము. సర్వభాక్ = సర్వాణి లిఙ్గాని న భజతి అను విగ్రహమున సర్వశబ్దము లిఙ్గాపేక్ష గలదైనను భాష్య ప్రామాణ్యమువలన నిచట సమాసము క్వవృత్తియు నగును. సకృత్ = ఒక్కమారు, ఆఖ్యాత నిర్గ్రాహ్యా = ఉపదేశమువలన తెలిసికొనదగినది. దేనికి మూడు లిఙ్గము లుండవో, యేది యొకవ్యక్తియం దొకమారు చెప్పుటవలన వానిసహోదరుడు మొదలగువారి యందు తిరుగ చెప్పనక్కరలేకనే గ్రహింపబడునో యదియును జాతి యగునని యర్థము. ఉదా:—వృషలీ. ఇచట వృషలత్వము జాతి. దీనియందు పుంలిఙ్గ స్త్రీలిఙ్గములే యుండుటచే నిది యసర్వలిఙ్గభాక్కగును. మఱియు నొకనిని జూపి యితడు వృషలుడని చెప్పిన నతని పుత్రులందరు, సోదరులందును, చెప్పకనే వృషలత్వము గృహీతమగును. శుక్లత్వము మూడు లిఙ్గములు గలదగుటచే జాతి గాదు. ఇచట శుక్లశబ్దముకంటె ఙీష్వారణమునకై అసర్వలిఙ్గత్వే అను విశేషణ మావశ్యకము. (శుక్లా) దేవదత్తుడను పేరుగలవాని నొకనినిజూపి యితడు దేవదత్తుడని జెప్పినను వాని పుత్రులందుగాని వాని సోదరులందుగాని దేవదత్తత్వము గృహీతము గానందున దేవదత్తత్వము జాతి గాదు, ఇచట దేవదత్త శబ్దముకంటె జీష్నివృత్తికొఱకు సకృదాఖ్యాత నిర్గ్రాహ్యా అనున దావశ్యకము.

(3) ఔపగవత్వము కఠత్వము మొదలగునవి, తటత్వ వృషలత్వాదులవలె ననుగతసంస్థానవ్యఙ్గ్యములు గానందునను, మూడు లిఙ్గములు గలవగుట వలనను, పై రెండు లక్షణములు ప్రవర్తింపకున్నందున ఔపగవీ కఠీ మొదలగు రూపముల సంగ్రహార్థము, మూడవ లక్షణమును చెప్పుచున్నాడు. "గోత్రం చ...సహ". గోత్రశబ్దమున కిచట శాస్త్రీయగోత్ర మర్థము. (ప్రవరాధ్యాయ

ప్రోక్తమగు శాకలగోత్రము (గ్రహింపబడదు) "అపత్యం పౌత్ర ప్రభృతి గోత్రమ్" (4-1-162) అను సూత్రముచే విధింపబడు పౌత్రులు మొదలగు నపత్యము శాస్త్రీయగోత్ర మనబడును. గోత్రాపత్యార్థమందు ప్రాతిపదికముల కంటె నణాది ప్రత్యయములు విధింపబడెను. చరణశబ్దము వేదములయొక్క శాఖల నధ్యయనము జేయువానిని బోధించును. అపత్య ప్రత్యయాన్తములు, శాఖాధ్యేతృ వాచకములును, జాతికార్యమును పొందునని ఫలితార్థము. ఉదా:—ఔపగవీ. (ఉపగోరపత్యం స్త్రీ) ఔపగవశబ్ద మణన్తము. "టిడ్ఢాణఞ్" (473) సూ. చే, ప్రాప్తమగు ఙీపును బాధించి ఙీషు వచ్చును. కఠీ. (కఠశాఖను జదివిన యాడుది) బహ్వృచీ (బహ్వ్యః ఋచః అధ్యేతవ్యా యస్యాః). (చదువదగిన యనేక ఋక్కులుగల యాడుది). ఇపుడు స్త్రీలకు వేదాధ్యయనమునం దధికారము నిషిద్ధమైనను, "పురాకల్పేషు నారీణాం మౌంజీబంధన మిష్యతే. అధ్యాపనం చ వేదానాం సావిత్రీ వచనం తథా" అను యమస్మృతివలన పూర్వకల్పములం దధికారము విహితమగుటచే నివి యుదహరింపబడెను.

బ్రాహ్మణత్వము రెండవ లక్షణముచే జాతియైనందున బ్రాహ్మణశబ్దము నకు ఙీషు ప్రాప్తమగుచున్నది, గాని శార్ఙ్గరవాదిగణమున బ్రాహ్మణశబ్దము పఠింపబడుటచే "శార్ఙ్గరవాద్యఞో ఙీన్" (520) సూ. చే, విధింపబడు ఙీన్ ప్రత్యయ మీ ఙీషును బాధించును. కాన బ్రాహ్మణీ, అనునది ఙీన్ ప్రత్యయాన్త మగును. (ముణ్డ గుణయోగాన్ముణ్డా) ముణ్డమను గుణసంబంధముచే ముండ అను వ్యవహారముగల స్త్రీని బోధించు ముణ్డశబ్దమునకు ఙీషును వారించుటకు సూత్ర మున జాతేః అనున దావశ్యకము. ముణ్డా, అని యగును. నిత్య స్త్రీలిఙ్గమగు, బలాక శబ్దమునకు ఙీషును వారించుటకై "అస్త్రీవిషయాత్" అనునది యావ శ్యకము. బలాకా. యకారోపధమగు క్షత్రియ శబ్దమునకు ఙీషును వారించుటకై "అయోపధాత్" అనునది యావశ్యకము. క్షత్రియా. (వా) హయ, గవయ, ముకయ, మనుష్య, మత్స్య, వీనికి "అయోపధాత్" అను నిషేధము ప్రవర్తించదు. వీనికి జాతిలక్షణమగు ఙీషు వచ్చును. ఉదా:—హయీ, గవయీ, ముకయీ, మనుషీ. (మనుష్య + ఈ, అకారలోపము, "హల స్తద్ధితస్య" (475) సూ. చే, యకారలోపము). మత్సీ. (మత్స్య + ఈ, అకారలోపము. "సూర్యతిష్యాగస్త్య" (502) సూత్రములోని "మత్స్యస్య ఙ్యామ్" అను వార్త్తికముచే యలోపము).

* 522. శాకకర్ణ పర్ణ పుష్ప ఫలమూలవాలోత్తర పదాచ్చ.

4-1-64. శాకకర్ణ... త్తర పదాత్, చ (జాతేః, ఙీష్).

పాకాద్యుత్తరపదాజ్జాతివాచినః స్త్రీ విషయా దపి ఙీష్ స్యాత్। ఓదనపాకీ। శఙ్కుకర్ణీ। శాలపర్ణీ। శఙ్ఖపుష్పీ। దాసీఫలీ। దర్భమూలీ। గోవాలీ। ఓషధి విశేషే రూఢా ఏతే॥

522. పాక, కర్ణ, పర్ణ, పుష్ప, ఫల, మూల, వాల, వీనిలో నేదైన నుత్తరపదముగఁగల్గి జాతివాచకమగు ప్రాతిపదికముకంటె, నిత్య స్త్రీలిఙ్గమైనను ఙీషు వచ్చును. ఓదనపాకీ మొదలగునవి యుదాహరణములు. ఇవి సముదాయ శక్తిచే నోషధి విశేషబోధకములు. అవయవార్థ శూన్యములని భావము. ఇవన్ని యును నిత్య స్త్రీలిఙ్గము లగుటవలన పూర్వసూత్రముచే ఙీషు అప్రాప్తమగుచుండ నీ సూత్ర మారంభింపబడెను. బహుపుష్పా (శాఖ) బహుఫలా మొదలగు శబ్దము లందు ఙీష్నివృత్తి జాతిగ్రహణానువృత్తికి ఫలమని తెలియునది.

* 523. ఇతో మనుష్యజాతేః. 4-1-65. ఇతః। మనుష్యజాతేః. (ఙీష్)

ఙీష్ స్యాత్। దాక్షీ। యోపధాదపి। ఉదమే యస్యాపత్యం ఔదమేయీ। మనుష్యేతి కిమ్। తిత్తిరిః॥

523. ఇకార మన్తమందుగల మనుష్యజాతి వాచకముకంటె ఙీషు వచ్చును. ఉదా:—దాక్షీ. (దక్షస్యాఽపత్యం స్త్రీ) దాక్షీ శబ్దమపత్య ప్రత్యయాన్తమగుటచే "గోత్రం చ చరణైస్సహ" అను లక్షణముచే జాతి యగును. జాతిపదము పూర్వసూత్రమునుండి యనువరించుచుండ తిరుగ నీ సూత్రమందలి జాతిగ్రహణమువలన యకారోపధమగుదానికంటె నీ సూత్రముచే ఙీషు వచ్చుననునర్థము సిద్ధమగును. ఉదా:—ఔదమేయీ. (ఉదమేయస్యాపత్యం స్త్రీ) సూత్రమున మనుష్యగ్రహణము లేనిచో పక్షిజాతి వాచకమగు తిత్తిరి శబ్దముకంటెను ఙీషు ప్రసక్తమగును.

* 524. ఊఙుతః. 4-1-66. ఊఙ్, ఉతః (మనుష్యజాతేః, అయోపధాత్)

ఉకారాన్తా దయోపధాన్మనుష్యజాతి వాచినః స్త్రియామూఙ్ స్యాత్। కురూః। కురు నాదిభ్యో ణ్యః। తస్య స్త్రియామవన్తీత్యాదినా లుక్। అయోపధాత్కిమ్। అధ్వర్యుః (వా) అప్రాణిజాతేశ్చా రజ్జ్వాదీనా ముపసంఖ్యానమ్। రజ్జ్వాదిపర్యుదా సాదు క

ణ్ణాన్తేభ్య ఏవ। అలాబ్వా। కర్కన్ధ్వా। అనయో ర్దీర్ఘాన్త త్వేఽపి నోఙ్ ధాత్వోరితి విభక్త్యుదాత్తత్వ ప్రతిషేధ ఊఙః ఫలమ్। ప్రాణిజాతేస్తు కృకవాకుః। రజ్జ్వాదేస్తు రజ్జుః। హనుః॥

524. హ్రస్వోకారాన్తము, యకారోపధ భిన్నమునగు మనుష్యజాతి వాచకముకంటె స్త్రీలిఙ్గమున ఊఙ్ (ఙ్) ప్రత్యయమగును. ఉదా:—కురూః (కురోరపత్యం స్త్రీ) అపత్య ప్రత్యయాన్తమగుటచే కురుశబ్దము జాతికార్యము నొందును. కురుశబ్దమున కపత్యార్థమున ప్రాప్తమగు ణ్య ప్రత్యయమును బాధించి "కురునాదిభ్యోణ్యః" (4-1-172) సూ. చే, ణ్యప్రత్యయము వచ్చును. దానికి "స్త్రియామవన్తి" (4-1-176) సూ. చే, లుక్కగును. అధ్వర్యుః. (అధ్వర్యుశాఖ నధ్యయనము చేయు వాడుది) చరణమగుటచే జాతి కార్యము నొందును. అయోపధాత్తను విశేషణమువలన నిచట నూఙు వారిత మగును.

(వా) రజ్జ్వాదిగణ పఠితములనువిడిచి ప్రాణిభిన్నములగు నుకారాన్త జాతివాచకములకంటె నూఙు చెప్పదగును. "అరజ్జ్వాదీనామ్" అనునది పర్యుదాసము. రజ్జ్వాదిభిన్నము, రజ్జ్వాది సదృశమునని యర్థము లభించును. ఇచటి సాదృశ్య ముకారాన్తరూపమును గ్రహింపదగును. కాన రజ్జ్వాదిభిన్నము లుకారాన్తములే గావలయుననుని నర్థము లభించును. "అలాబూః" అను భాష్యోదాహరణమువలన నీ వార్తికములోనికి 'ఉతః' అనునది యనువర్తింపదు. అలాబ్వా. (అలాబూ + టా) కర్కన్ధ్వా. (కర్కన్ధూ + టా) అలాబూ కర్కన్ధూ శబ్దములు దీర్ఘోకారాన్తములైనను, వీనికి తృతీయైక వచనాదులందు "నోఙ్ ధాత్వోః" (6-1-175) (ఊఙు, ధాతువు, వీనియొక్క యణ్ణుకంటె పరమగు శస్సు మొదలగు విభక్తుల కుదాత్తస్వరము రాదు). సూ. చే, విహితమగు విభక్త్యుదాత్త ప్రతిషేధము ఊఙ్ విధానమునకు ఫలము. ఈ విషయమును సూచించుటకే ప్రథమా ద్వితీయా విభక్తులనువిడిచి తృతీయైకవచన ముదాహృత మయ్యెను. ప్రాణిజాతి యగుటచే కృకవాకుః, (కోడి) అనుచోట నూఙ్ వారింపబడును. మనుష్యజాతి వచనము గానందున పూర్వసూత్రముచేగూడ నూఙు రాదు. అరజ్జ్వాదీనా మనుపర్యుదాసముచే రజ్జ్వాదులకు ఊఙు నివృత్త మగును. ఉదా:—రజ్జుః. హనుః.

525. బాహ్వన్తాత్సంజ్ఞాయామ్. 4-1-67. బాహ్వన్తాత్, సంజ్ఞాయామ్ (ఊఙ్)

స్త్రీ యామూఙ్ స్యాత్। భద్రబాహూః।
సంజ్ఞాయాం కిమ్। వృత్తబాహుః॥

525. బాహుశబ్దము నంతమందుగల ప్రాతిపదికముకంటె సంజ్ఞయందు ఊఙు వచ్చును. ఉదా:—భద్రబాహూః. (ఒక స్త్రీకి సంజ్ఞ). వృత్త బాహుః. (వృత్తౌ బాహూ యస్యాః). గుండ్రని భుజములుగల యాడుది. సంజ్ఞాయామ్, అను విశేషణమువలన నిచట నూఙు వారితమగును.

* 526. పఙ్గోశ్చ. 4-1-6. పఙ్గోః చ (ఊఙ్)

పఙ్గూః (వా) శ్వశురస్యోకారాకార లోపశ్చ।
చామూఙ్। పుంయోగలక్షణస్య ఙీషోఽపవాదః।
లిఙ్గవిశిష్ట పరిభాషయా స్వాదయః। శ్వశ్రూః॥

526. పఙ్గు శబ్దముకంటె ఊఙు వచ్చును. ఉదా:—పఙ్గూః, (కాళ్లు లేనిది) పఙ్గు శబ్దము గుణవాచకమగుటవలన "ఊఙుతః" (521) సూ. చే, నూఙు, అప్రాప్తమగుచుండ నీ సూత్ర మారంభింపబడెనని తెలియుచున్నది. (వా) శ్వశురస్య స్త్రీ అను నర్థమున శ్వశురశబ్దముకంటె నూఙ్ ప్రత్యయమును, శ్వశుర శబ్దములోని యుకారమునకును, రేఫము పైనుండు అకారమునకును లోపముగూడ చెప్పవలెను. ఈ వచనము "శ్వశురః శ్వశ్ర్వా" (942) అను నిర్దేశమువలన సిద్ధమగు నర్థమును బోధించునది గాని యపూర్వముగాదు. కావున తుది అకారమునకే లోపమగును. ఊఙ్ ప్రత్యయము పుంయోగలక్షణ ఙీషున కపవాదము. ఉదా:—శ్వశ్రూః. (తనభార్యవ తల్లి) "ప్రాతిపదిక గ్రహణే ......గ్రహణమ్" అను పరిభాషచే నూఙన్త శ్వశ్రూ శబ్దముకంటె స్వాది ప్రత్యయములగును. ప్రత్యయాన్తమగుటచే నర్థవత్సూత్రముచే గాని కృత్తద్ధితాన్తము గానందున కృత్తద్ధిత సూత్రముచే గాని ప్రాతిపదిక సంజ్ఞ లేనందున పరిభాషవలననే స్వాదులను చేయవలయును.

* 527. ఊరూత్తరపదాదౌపమ్యే. 4-1-69. ఊరూత్తర పదాత్, ఔపమ్యే (ఊఙ్)

ఉపమానవాచి పూర్వపద మూరూత్తరపదం
యత్ప్రాతిపదికం తస్మాదూఙ్ స్యాత్। కరభోరూః॥

527. ఉపమీయతే అనయేతి = ఉపమా. (ఉపమానము). తద్భావః, ఔపమ్యమ్. (సాదృశ్యము). ఔపమ్యము (ఉపమానోపమేయ భావము) గమ్యమానమగుచుండ నుపమేయవాచకమగు నూరుశబ్దము త్తరపదముగల ప్రాతిపదికముకంటె నూఙు వచ్చునని యర్థము. ఉత్తరపదమన సమాస చరమావయవము. పూర్వపదమన సమాసముయొక్క పూర్వావయవము. పూర్వపదమున్న

గాని యుత్తరపదముండదు గాన "యేన వినా యదనుపపన్నమ్ తత్తే నాక్షిప్యతే" (దేనిని విడిచి యేదియుండదో, అది దానిచే నాక్షేపింపబడును). అను న్యాయమువలన సూత్రమందలి యుత్తరపదముచే పూర్వపద మాక్షిప్తమగును. ఉత్తరపద సాన్నిధ్యమువలన నా పూర్వపద ముపమానవాచకమే యగును. ఫలితార్థము:—ఉపమాన వాచకము పూర్వపదముగను, ఉపమేయ వాచకమగు నూరుశబ్ద ముత్తరపదముగనుగల ప్రాతిపదికముకంటె, ఊఙ్ ప్రత్యయము వచ్చును. ఉదా:—కరభోరూః. (కరభావివోరూ యస్యాః). మణిబంధమునుండి చిటికెనవ్రేలి వరకుగల హస్త పార్శ్వభాగము కరభ మనబడును. దీనితో సదృశములు తొడలుగలదని కరభోరూశబ్దమున కర్థము.

* 523. సంహిత శఫలక్షణవామాదేశ్చ. 4-1-70. సంహితశఫలక్షణవామాదేః। చ। (ఊరూత్తరపదాత్। ఔపమ్యే)

అనౌపమ్యార్థం సూత్రమ్। సంహితోరూః। సైవ శఫోరూః। శఫౌ ఖురౌ, తావివ సంశ్లిష్టత్వా దుపచారాత్। లక్షణశబ్దాదర్శ ఆద్యచ్। లక్షణోరూః। వామోరూః। (వా) సహితసహాభ్యాం చేతి వక్తవ్యమ్। హితేన సహ సహితౌ, ఊరూ యస్యాః సా సహితోరూః। సహేతే ఇతి సహౌ ఊరూ యస్యాః సహోరూః। యద్వా। విద్యమానవచనస్య సహశబ్దస్య ఊర్వతిశయ ప్రతిపాదనాయ ప్రయోగః॥

528. సంహిత, శఫ, లక్షణ, వామ, యివి పూర్వపదముగను, ఊరుశబ్ద ముత్తరపదముగనుగల ప్రాతిపదికముకంటె ఊఙు వచ్చును. ఔపమ్యము గమ్యమానము గానపుడు నూఙ్ ప్రత్యయముకొరకీ సూత్ర మారంభింపబడెను. ఉదా:—సంహితోరూః. (సంహితావూరూ యస్యాః), ఒకదానితో నొకటి గలసికొనిన తొడలుగలది. శఫోరూః. (శఫౌ ఊరూ యస్యాః). సంహితోరూ శఫోరూ శబ్దములు సమానార్థకములు. శఫశబ్దము "శఫం క్లీబే ఖురః పుమాన్" అని యమరకోశమున నపుంసకలిఙ్గముగ జెప్పబడినను, "శఫః ఖురే గవాదీనాం మూలే విటపినామపి" అను హేమచంద్రకోశమున పుంలిఙ్గముగ జెప్పబడుటచే నిచట "శఫౌ" అనుట దోషము గాదు. శఫములన పశువుల డెక్కలు. ఇవి యూరువులగుట ప్రత్యక్షవిరుద్ధమైన నూరువులు డెక్కలవలె గలసియుండుటచే నారోపితమగు శఫత్వముగలవను నర్థము నిరూఢమగును. సమాస ముపమానోపమేయ భావబోధకము గానందున పూర్వసూత్రమునకు ప్రాప్తిలేదు. లక్షణోరూః. (లక్షణౌ ఊరూ యస్యాః). "లక్షణయుక్తములగు తొడలుగల యాడుది", ఇచట లక్షణశబ్దము "అర్శ ఆదిభ్యోఽచ్" (5-2-127) సూ. చే, మతుబర్థ

మున విహితమగు అచ్ ప్రత్యయాన్తముగాని మార్దవాది గుణపర్యాయముగాదు. వామోరూః. (వామా ఊరూ యస్యాః). సుందరములగు తొడలుగలది. (వా) సహిత, సహ, యివి పూర్వపదముగను, ఊరుశబ్ద ముత్తరపదమునుగల ప్రాతిపదికముకంటెను, ఊఙు చెప్పదగును. ఉదా:—సహితోరూః. (సహితా ఊరూ యస్యాః). సహిత శబ్దమునకు హితముతో గూడినదని యర్థము. సుందరములగు తొడలుగల యాడుదని యర్థము ఫలితమగును. సహోరూః (సహతే ఇతి = సహా, రతియందలి శ్రమను సహించునవి. సహా ఊరూ యస్యాః). లేక విద్యమానవాచకమగు సహశబ్దముగల బహువ్రీహి. (సహ = విద్యమానా, ఊరూ యస్యాః). ఊరువులందలి సౌన్దర్యాతిశయమును బోధింప నిట్టి ప్రయోగము చేయబడును.

* 529. సంజ్ఞాయామ్. 4_1_72; (కద్రుకమణ్డల్వోః. ఊఙ్)

కద్రుకమణ్డల్వోః సంజ్ఞాయాం స్త్రియామూఙ్ స్యాత్ । కద్రూః । కమణ్డలూః । సంజ్ఞాయాం కిమ్ । కద్రుః । కమణ్డలుః । అచ్ఛన్దోర్థం వచనమ్ ॥

529. కద్రుకమణ్డలు శబ్దములకు సంజ్ఞయందు ఊఙు వచ్చును. కద్రూః. (నాగమాతపేరు). కమణ్డలూః. (మృగవిశేష వాచకము). సంజ్ఞయందనుటవలన కద్రుః, కమణ్డలుః, అను (సంజ్ఞగాని) చోటులందు, ఊఙు వారితమగును. ఛందస్సునందు "కద్రుకమణ్డల్వోశ్ఛన్దసి" (4_1_72) సూ. చే, నూఙు సిద్ధమగును, గాన నీసూత్రము లోకమున నూఙ్ ప్రత్యయ విధానము కొఱకగునని గ్రహించునది.

* 530. శార్ఙ్గరవాద్యఞో ఙీన్. 4_1_73. శార్ఙ్గరవాది, అఞః, ఙీన్, (అతః, జాతేః).

శార్ఙ్గరవాదేరఞో యోఽకారస్తదన్తాచ్చ జాతివాచినో ఙీన్ స్యాత్ । శార్ఙ్గరవీ । బైదీ । జాతేరిత్యనువృత్తేః పుంయోగే ఙీషేవ । నృనరయోర్వృద్ధిశ్చేతి గణసూత్రం । నారీ ॥

---

* శార్ఙ్గరవ, కాపటవ, గౌగ్గులవ, బ్రాహ్మణ, గౌతమ, కామణ్డలేయ, బ్రాహ్మణకృతేయ, ఆనిచేయ, ఆనిధేయ, ఆశోకేయ, వాత్స్యాయన, మౌఞ్జాయన, కైకసేయ, కావ్య, శైబ్య, ఏహి, పర్యేహి, ఆశ్మరథ్య, ఔదపాన, అరాల, చణ్డాల, వతణ్డ, భోగవద్గౌరిమతోః సంజ్ఞాయాం ఘటాదిషు నిత్యం హ్రస్వార్థమ్ । నృనరయోర్వృద్ధిశ్చ. పుత్ర, ఇతి శార్ఙ్గరవాదిః ॥

530. శార్ఙ్గరవాది, అనునది లుప్త షష్ఠ్యన్తము. అఞః, అనునది షష్ఠ్యన్తము. ఇది అకారమునకు విశేషణము. శార్ఙ్గరవాది గణపఠితములగు జాతి వాచకముల కంటెను, అఞ్ ప్రత్యయముయొక్క అకార మన్తమందుగల జాతి వాచకము కంటెను, ఙీన్ ప్రత్యయము వచ్చును. ఉదా:— శార్ఙ్గరవీ. (శృంగ రోరపత్యం స్త్రీ) శార్ఙ్గరవ, అనునది అపత్యార్థకమగు నణ్ ప్రత్యయాన్తము. "టిడ్ఢాణఞ్" సూ. చే, ప్రాప్తమగు ఙీపును బాధించి జాతిలక్షణ ఙీషు ప్రాప్తమగుచున్నది. దీనిని బాధించి ఙీను వచ్చును. స్వరభేదము ఫలము. బైదీ. (బిదస్యాపత్యం స్త్రీ). బైద, అనునది అఞన్తము. జాతిలక్షణ ఙీషును బాధించి ఙీను వచ్చును. జాతేః, అనుదాని ననువృత్తి చేయుటవలన పుంయోగమందీ సూత్రము ప్రవర్తించదు, గాన పుంయోగమున పుంయోగలక్షణ ఙీషే ప్రవర్తించును. "శార్ఙ్గరవస్య స్త్రీ" "బిదస్య స్త్రీ" అను నర్థములందు క్రమముగ శార్ఙ్గరవీ, బైదీ. అను రూపములగును. స్వరభేదము ఫలము. గణసూత్రము:— నృనరశబ్దములకంటె ఙీన్ ప్రత్యయము వాని యాద్యచ్చునకు వృద్ధియునగును. నృశబ్దమునకు "ఋన్నేభ్యః" (307) సూ. చే, ఙీపును నరశబ్దమునకు జాతి లక్షణ ఙీషును, ప్రాప్తమగుచుండ వీనిని బాధించుటకును, వృద్ధిని విధించుటకు నీ సూత్ర మారంభింపబడెను. రెండింటికి నుదాహరణము. నారీ. (నృ + ఈ, వృద్ధి). నర + ఈ. లక్ష్యానుసారి వ్యాఖ్యానమువలన మొదటి యకారమునకే వృద్ధి. నారీ.

వివ:— అలోన్త్యపరిభాషచే నరశబ్దమున, తుది యకారమునకే వృద్ధి ప్రాప్తమగుచున్నది. కాని చూపబోవు గణసూత్ర వ్యాఖ్యానము ననుసరించి ప్రథమాఽకారమునకే వచ్చును. గణసూత్ర వ్యాఖ్యానము:— నరస్య + అః = నరః। పరరూపము. నాచ, నరశ్చ = నృనరౌ। తయోః = నృనరయోః। అకార ప్రశ్లేష సామర్థ్యమువలన నిచట నలోన్త్య పరిభాష ప్రవర్తింపదు, అన్త్యాఽకారమునకు వృద్ధి వచ్చినచో ప్రశ్లేషము వ్యర్థమగును. కావున నాద్య చ్చునకు వృద్ధియగునను నర్థము ఫలితమగును.

* 531. యఙశ్చాప్. 4-1-74. యఙః। చాప్। యఙన్తాత్ స్త్రియాం చాప్ స్యాత్। యఙఇతి ష్యఙ్ ష్యఞోస్సా మాన్యగ్రహణమ్। ఆమ్బష్ఠ్యా। కారీషగన్ధ్యా (వా) షాద్యఞశ్చాప్ వాచ్యః। పౌతిమాష్యా॥

531. యఙ్ ప్రత్యయాన్తమగు ప్రాతిపదికముకంటె స్త్రీలిఙ్గమున చాపు (అ) వచ్చును. యఙ్ పదము ష్యఙ్ ష్యఞులకు బోధకము. ఆమ్బష్ఠ్యా (అమ్బష్ఠస్యాపత్యం స్త్రీ) అమ్బష్ఠ శబ్దమున కపత్యార్థము "వృద్ధేత్కోసల" (4-1-171) సూ. చే, ష్యఙ్ ప్రత్యయము విధింపబడెను. ఆమ్బష్ఠ్య. దీనికంటె చాపు. కారీషగన్ధ్యా. (కరీషస్యేవ గన్ధోయస్య = కరీషగన్ధిః, తస్యా

పత్యం స్త్రీ) కారీషగన్ధ్యాశబ్దము ష్యఙ న్తము. (వా) షకారముకంటె పరమగు యఞ్ ప్రత్యయము న్తముందుగల ప్రాతిపదికముకంటె చాపు చెప్పదగును. పౌతిమాష్యా. (పూతిమాషస్యాపత్యం స్త్రీ) పూతిమాష శబ్దము గర్గాదిగణము లోనిదగుటచే యఞ న్తమగును. ఇది "యఞశ్చ" సూత్రముచే విహితమగు జీపున కపవాదము.

* 532. ఆవట్యాచ్చ. 4-1-75.

ఆవట్యాత్ । చ । (చాప్) అస్మాచ్చాప్ స్యాత్ ।
యఞశ్చేతిజీపోఽపవాదః । అవటశబ్దో గర్గాదిః । ఆవట్యా ॥

532. ఆవట్యశబ్దముకంటె చాపు వచ్చును. "యఞశ్చ" సూ. చే, విధింపబడు జీపున కపవాదము. అవటశబ్దము గర్గాదులలోనిదగుటచే నావట్య శబ్దము యఞ న్తము. ఉదా:—ఆవట్యా. (అవటస్యాఽపత్యం స్త్రీ)

* 533. తద్ధితాః. 4-1-76.

ఆపఞ్చమసమాప్తే రధికారోఽయమ్ ॥

533. ఇచటనుండి, ఐదవ యధ్యాయము తుదివరకు తద్ధితాః, అనునది యధికృతమగును.

వివ:—తద్ధితాః, అనుచోట బహువచనము, సూత్రములచే విహితము లగు ప్రత్యయములనేగాక వార్తికములచే చెప్పబడు ప్రత్యయములనుగూడ సంగ్రహించుటకని తెలియునది. తేభ్యః = ప్రయోగేభ్యః (ప్రయోగముల కొఱకు) హితాః (హితములైనవి) తద్ధితాః అను అన్వర్థలాభముకొఱకు మహా సంజ్ఞాకరణము. దీనివలన నీ తద్ధిత ప్రత్యయములు ప్రయోగము ననుసరించియే వచ్చుననునర్థము లభించును.

* 534. యూనస్తిః. 4-1-77. యూనః । తిః ।

యువన్ శబ్దాత్తి ప్రత్యయః స్యాత్సచ తద్ధితః ।
లిఙ్గవిశిష్ట పరిభాషయా సిద్ధే తద్ధితాధికార ఉత్తరార్థః ।
యువతిః । అనుపసర్జనాదిత్యేవ । బహవో యువానో య
స్యాం సా బహుయువా॥ యువతీతి తు యౌతేః శత్ర
న్తాత్ జీపి బోధ్యమ్॥ ఇతి స్త్రీ ప్రత్యయాః ॥

534. యువన్ శబ్దముకంటె 'తి' ప్రత్యయము వచ్చును, అది తద్ధిత సంజ్ఞకమగును. "ఋన్నేభ్యః" సూ. చే, ప్రాప్తమగు జీపున కపవాదము. తిప్రత్యయము తద్ధితమగుటచే తదన్తము ప్రాతిపదికము గాన స్వాదులుత్పన్నము లగును. ఇదియే యీ సూత్రములోనికి తద్ధితాధికారమువలన ఫలము. కాని లిఙ్గ

విశిష్ట పరిభాషవలననే స్వాదులు వచ్చును గాన తద్ధితాధికారమున కిచట ఫలము మృగ్యము. కాన తరువాతనుండు సూత్రములలోనే యధికారమునకు ఫలమును జూడవలయును. ఉదా:—యువతిః. (యువన్ + తి. "స్వాదిష్వసర్వనామస్థానే" (231) సూ. చే, పూర్వము పదమగుటవలన "నలోపః ప్రాతి" (237) సూ. చే, నలోపము). ఈ సూత్రములోనికిని "అనుపసర్జనాత్" అనునది యధికృతమగును. కాన బహుయువా, (బహవో యువానో యస్యాం) అనుచోట యువన్‌శబ్ద ముపసర్జనము గాన 'తి' ప్రత్యయము వారితమగును. 'యౌతి = మిశ్రీకరోతి, పత్యా' అను విగ్రహమున యుధాతువునకు శతృ ప్రత్యయమునుచేసిన యువత్ అని యగును. శతృ ప్రత్యయము గిత్తగుటచే "ఉగితశ్చ" (458) సూ. చే, ఙీప్ వచ్చును. ఇట్లు "యువతీ" అను రూపముగూడ సిద్ధమగును. కావున "యువతీకర నిర్మథితమ్" మొదలగు ప్రయోగములును, సాధువులగునని గ్రహించునది.

స్త్రీ ప్రత్యయ ప్రకరణము ముగిసెను.

గద్య:—శ్రీ శ్రీ శ్రీ పూషపాడ్వంశ పయఃపారావార రాకా సుధాకరులును ననితర సాధారణ ప్రతిభావిశేష వినిర్జిత గీష్పతులును, సకల కలా పరిపోషకులు నగు, శ్రీ శ్రీ శ్రీ విజయనగర సంస్థానాధీశ్వర రాజాధిరాజ శ్రీ విజయరామ గజపతి మహారాజవర్య సంవర్ధ్యమానుఁడును, కళాప్రపూర్ణులును, విద్వదభిమానులును, వదాన్యావతంసులు నగు శ్రీ శ్రీ శ్రీ జయపుర సంస్థానాధీశ్వర రాజాధిరాజ శ్రీ విక్రమదేవవర్మ మహారాజోత్తముల యసాధారణ కృపకుఁ బాత్రుఁడును, విద్వత్సార్వభౌమ శ్రీ వేఙ్కట సుబ్బరాయ, సుధీమణి ప్రసాదాసాదిత విద్యాసమన్వితుఁడును, శ్రీమదప్పల్ల వంశ పయోనిధి శీతకిరణులును, శ్రీ ఖాశింకోట సంస్థానాస్థాన విద్వాంసులును, అద్వైత వేదాన్త శాస్త్ర తత్త్వజ్ఞులును, సతత హరినామస్మరణ పరిపూతాన్తరఙ్గులును, శ్రీ బాలా త్రిపురసున్దరీ ప్రసాదాసాదితాఖణ్డధీవైభవులును, అరున్ధతీ సమాన శ్రీ వేఙ్కమామ్బా సమన్విత వామభాగులు నగు సోమేశ్వర శాస్త్రుల వారి కాత్మజుఁడును, యజుర్వేదాధ్యయన సంపన్నులును, సౌజన్య నిధులును, శ్రీ బాలా త్రిపురసున్దరీ ప్రసాదపాత్రులు నగు, భవానీశఙ్కర, శ్రీ రామ, కామేశ్వర శర్మలకు ప్రియసోదరుఁడును, శ్రీ మేధా దక్షిణామూర్తి ప్రసాదోపలబ్ధ ప్రజ్ఞా పరికలితుఁడును, వ్యాకరణాలఙ్కార విద్యాప్రవీణుఁడు నగు, జోగన్న శాస్త్రిచే విరచితంబగు వైయాకరణ సిద్ధాన్త కౌముదీ శరదాగమమున ప్రథమ భాగము సంపూర్ణము. శ్రీః శ్రీః శ్రీః.

శ్రీః

శుభమస్తు.

# వైయాకరణసిద్ధాన్తకౌముదీశరదాగమము

## (పూర్వార్ధము – ద్వితీయభాగము)



1. శ్లో॥ యస్యానుగ్రహతో లోకః ప్రథితశ్శేముషీశ్రియా।
శ్రీమేధాదక్షిణామూర్తిం తం నమామీష్టసిద్ధయే॥

2. శ్లో॥ నౌడూరువంశామ్బుధిశీతభానుమ్
దిగన్తవిశ్రాన్తయశోవిభూషితమ్।
స్మరామి తం శాబ్దికసార్వభౌమమ్
గురుం సదా వేఙ్కటశాస్త్రివర్యమ్॥

3. శ్లో॥ తాతాన్వయామ్భోధికలానిధిం తమ్
శ్రీసుబ్బరాయాఖ్యసుధీశ్వరం గురుమ్।
కలాప్రపూర్ణం సుయశోభిరామమ్
నమామ్యహం దేశికచక్రవర్తినమ్॥

4. శ్లో॥ అప్పల్లవంశజలధిసోమం సోమేశశాస్త్రిణమ్।
వేఙ్కమార్గాజిరుచిరం వన్దే మత్పితరం సదా॥

5. శ్లో॥ రాజకీయవిలసద్గుణసాన్ద్రైః
పూషవాడ్విజయరామగజేన్ద్రైః।
శ్రీచిరాయురతులప్రతిభాభిః
వర్ధతామవితపణ్డితచన్ద్రైః॥

6. శ్లో॥ జేజీయతాం విక్రమసార్వభౌమః
కల్పద్రుతుల్యశ్రితనన్దనోఽయమ్।
అనల్పకీర్త్యా ధవలీకృతాశః
కలానిధిశ్శ్రీజయపట్టణేన్ద్రః॥

7. శ్లో॥ విద్యానగరగీర్వాణకలాశాలే నియోజితః।
ప్రధానాధ్యాపకస్థానేఽలఙ్కారపతశాస్త్రయోః॥

8. శ్లో॥ జోగన్నశాస్త్ర్యభిఖ్యాతనామా రాజేశ్వరీప్రియః।
పాణిన్యాదిమునీన్నత్వా శబ్దశాస్త్రప్రవర్తకాన్॥

9. శ్లో॥ శబ్దశాస్త్రబుభుత్సూనాం కుర్వేఽహముపకారకమ్।
వైయాకరణసిద్ధాన్తకౌముదీశరదాగమమ్॥

10. శ్లో॥ పదక్లేశమహామేఘైశ్ఛన్నేయం దైక్షితీ కృతిః।
చకాస్తు కౌముదీదానీం శరదాగమసఙ్గతా॥



# 15. విభక్త్యర్థప్రకరణము

అవతారిక :—స్వౌజసమౌట్ (184) సూత్రముచే, జ్యన్తాదిస్త్రప్రాతిపదికములకంటె స్వాదులు విధింపబడినవి. వానికర్థవిశేషమందు వ్యవస్థను ప్రదర్శింపనీప్రకరణమారంభింపబడినది.

535. ప్రాతిపదికార్థలిఙ్గపరిమాణవచనమాత్రే ప్రథమా.
2-3-46. ప్రాతిపదికార్థ......... ....మాత్రే, ప్రథమా।

నియతోపస్థితికః ప్రాతిపదికార్థః। మాత్రశబ్దస్య ప్రత్యేకం యోగః। ప్రాతిపదికార్థమాత్రే లిఙ్గమాత్రాద్యాధిక్యే సంఖ్యామాత్రే చ ప్రథమా స్యాత్। ఉచ్చైః। నీచైః। కృష్ణః। శ్రీః। జ్ఞానమ్। అలిఙ్గా నియతలిఙ్గాశ్చ ప్రాతిపదికార్థమాత్ర ఇత్యస్యోదాహరణమ్। అనియతలిఙ్గాస్తు లిఙ్గమాత్రాఽధిక్యస్య। తటః। తటీ। తటమ్। పరిమాణమాత్రే, ద్రోణో వ్రీహిః। ద్రోణరూపం యత్పరిమాణం తత్పరిచ్ఛిన్నో వ్రీహిరిత్యర్థః। ప్రత్యయార్థే పరిమాణే ప్రకృత్యర్థోఽభేదేనసంసర్గేణ విశేషణమ్। ప్రత్యయార్థస్తు పరిచ్ఛేద్యపరిచ్ఛేదకభావేన వ్రీహౌ విశేషణమితి వివేకః। వచనంసంఖ్యా। ఏకః। ద్వౌ। బహవః। ఇహోక్తార్థత్వాద్విభక్తేరప్రాప్తౌ వచనమ్॥

535. ప్రాతిపదికార్థ, లిఙ్గ, పరిమాణ, వచన, పదములకు ద్వన్ద్వము. ప్రాతిపదికార్థలిఙ్గపరిమాణవచనాన్యేవ = ప్రాతిపదికార్థలిఙ్గపరిమాణ వచన మాత్రమ్, అనిమయూరవ్యంసకాదిసమానము. మాత్రపదము ద్వన్ద్వాన్తమున శ్రూయమాణమగుటచే దంద్వముననున్న పదములతో ప్రత్యేకముగ నన్వయించును. కావ సూత్రమందు నాల్గువాక్యములేర్పడును. (1) ప్రాతిపదికముకంటె, ప్రాతిపదికార్థమునందే ప్రథమావిభక్తి (సు-ఔ-జస్.) యగును. ఉచ్చారితమగునే ప్రాతిపదికముచేనేయర్థము నియతముగ బోధితమగునో యది ప్రాతిపదికార్థమనబడును. శక్యార్థమనిఫలితమగును. కొన్ని చోటులందు స్వార్థద్రవ్యములు (ప్రవృత్తినిమిత్తతదాశ్రయములు.) మరి కొన్ని చోటుల, లిఙ్గముతోగూడినస్వార్థద్రవ్యములను శక్యములగును. మాత్రశబ్దమునకవధారణమర్థము. (2) లిఙ్గమన స్త్రీత్వాదికము. లిఙ్గమాత్రే, అనుదానికి, లిఙ్గమందే ప్రథమ యనియర్థమగును కావి స్వార్థద్రవ్యములను విడిచి కేవలలిఙ్గమెచటను భాసింపనందున స్వార్థద్రవ్యములకంటె నధికముగా

లిఙ్గమాత్రమే భాసించునపుడు ప్రథమవచ్చునని యర్థము చేయవలయును. (3) ఇచట పరిమాణశబ్దము కోశమునచెప్పబడినద్రోణము (నాల్గుకుంచములు) మొదలగువానినేగాక ఉన్మానము, ఆయామము, మొదలగుపరిచ్ఛేదకములన్నిటిని బోధించును. పూర్వమువలెనే పరిమాణము మాత్రమధికమైనపుడు ప్రథమయగునని యర్థము. (4) వచనమనవేకత్వాదికమగుసంఖ్య. సంఖ్యామాత్రమందు ప్రథమయగును. క్రమముగనుదాహరణములు :— (1) ప్రథమవాక్యమునకు లిఙ్గశూన్యములగు నవ్యయములు, నియతలిఙ్గములగు (ఏకైకలిఙ్గములు) కృష్ణాది శబ్దములనుదాహరణములు. ఉచ్చైః. నీచైః. ఇవి సుబన్తములనుటవలన పద సంజ్ఞకములగును. పదత్వముచే, ఉచ్చైస్, ఇత్యాదులలోని సకారమునకు రుత్వ విసర్గములగును. కృష్ణః. ఈశబ్దము నీలవర్ణబోధకమగునపుడనియతలిఙ్గకమైనను, శ్రీకృష్ణునిబోధించునపుడు నియతలిఙ్గమే యగుటచే ప్రథమవాక్యమునకుదాహరణమగును. కృష్ణశబ్దముచే, స్వార్థము=కృష్ణత్వము, (ప్రవృత్తినిమిత్తము, లేక విశేషణము). ద్రవ్యము, = కృష్ణత్వమనుప్రవృత్తినిమిత్తమున కాశ్రయమైన కృష్ణుడు, లిఙ్గము=పుంస్త్వము. యీమూడును నియతోపస్థితములగుటవలన నివి ప్రాతిపదికార్థములగును. ఇట్లే శ్రీః, అనుచోట స్త్రీలిఙ్గము, జ్ఞానమ్ అనుచోట నపుంసకలిఙ్గమును నియతోపస్థితము. (2) నియతలిఙ్గకములుగానట్టి తటాది శబ్దములు ద్వితీయవాక్యమునకుదాహరణములు. తటః, తటీ, తటమ్, తటశబ్దము మూడులిఙ్గములుగలదగుటచే నేలిఙ్గము, నియతోపస్థితముగాక పాక్షికోపస్థితమే యగును. కాన ప్రథమవాక్యమునకిది యుదాహరణము గాదు.

(3) "ద్రోణో వ్రీహిః" మొదలగువాక్యములలోని ద్రోణాదులు తృతీయ వాక్యమునకుదాహరణము. ద్రోణమనుపరిమాణముచే కొలవబడిన ధాన్యమని యావాక్యమునకర్థము. ద్రోణాదిశబ్దములకు ప్రథమవాక్యముచేతనే ప్రథమావిభక్తి సిద్ధమగును గానిలోకమందనుభవసిద్ధమైన వాక్యార్థబోధ సిద్ధించుటకై, ప్రత్యేకముగ పరిమాణమందు ప్రథమ విధింపబడెను. ఇచట ప్రాతిపదికార్థమందే ప్రత్యయము విధింపబడిన, పరిమాణముగూడ ప్రాతిపదికార్థమేయగును. ప్రాతిపదికార్థములకు (నామార్థములకు) అభేద సంబన్ధముచేతనే యన్వయమని నియమము గలదు. "నీలముత్పలమ్" ఇత్యాదులందు నీలమునకునుత్పలమునకును, నీలాఽభిన్న ముత్పలమ్, అనునభేదాన్వయము క్లృప్తమైయున్నది. కావున నిట్లే, ద్రోణో వ్రీహిః అను వాక్యమునకును, "ద్రోణాఽభిన్నో వ్రీహిః" అనియేబోధ కలుగవలసి వచ్చును. ఇచట నీవిధమగునభేదాన్వయము లోకమున బాధితము. ద్రోణమునకును, వ్రీహికిని భేదసంబన్ధము (పరిచ్ఛేద్యపరిచ్ఛేదకభావము) చేతనే యన్వయమిష్టము. పరిమాణమందు ప్రథమావిధానము చేసిన, నియమాఽవిరుద్ధమునిష్టమునగు బోధ సిద్ధించును. ప్రకృత్యర్థమగుద్రోణము ప్రత్యయార్థమగు పరిమాణమందభేదసంబన్ధముచే విశేషణమగును. ప్రకృతి ప్రత్యయార్థములకభేదసంబన్ధముచేనన్వయము, దేవదత్తకర్తృకప్రత్యయాన్తములగు, ఇన్ద్రాదిశబ్దములందు ప్రసిద్ధమైయున్నది. ఇన్ద్రో

దేవతాఅస్య అనునర్థమున నింద్రశబ్దముకంటె అణ్ ప్రత్యయమును చేసిన ఐన్ద్రి మనురూపమగును. ఇన్ద్రశబ్దార్థమింద్రుడు. అణ్ ప్రత్యయార్థము దేవత. ఈ రెండిటికి నభేదాన్వయమువలన, ఇన్ద్రాభిన్నమగు దేవతగలదనునర్థములభించును. ఇట్లు ప్రకృతమునప్రకృత్యర్థవిశేషితమగు పరిమాణము ప్రత్యయార్థముగాని ప్రాతిపదికార్థము (నామార్థము) గానందున విది, వ్రీహిపదార్థములోనికి భేదసంబన్ధముచే ననగా పరిచ్ఛేద్యపరిచ్ఛేదకభావముచే నన్వయించును. ఈ రెండును నామార్థములుగానందున పూర్వోక్తనియమమునకు విరోధములేదు. పరిచ్ఛేద్యములు (కొలవబడునవి) వ్రీహులు. పరిచ్ఛేదకము (కొలుచుటకు సాధనము) ద్రోణము. వీనికిగలసంబన్ధమే పరిచ్ఛేద్యపరిచ్ఛేదకభావము. ఇట్టిబోధ లోకమునన బాధితమునగును. (4) ఏకః. ద్వౌ. బహవః. ఇవి చతుర్థవాక్యమునకుదాహరణములు. ఏకాదిశబ్దముచే నేకత్వాది సంఖ్య చెప్పబడుచున్నందున, "ఉక్తార్థానామప్రయోగః" (ఒకయర్థమును బోధింప నొక శబ్దముప్రయుక్తమైయుండ తిరుగనాయర్థమునే బోధించువేరొకశబ్దమునకు ప్రయోగముండరాదు.) అను న్యాయముచే సంఖ్యాబోధకమగు ప్రథమ యప్రాప్త మగును. సంఖ్యయందు ప్రథమావిధానమున్నచో విధానసామర్థ్యమువలన సంఖ్యా వాచకములగు, ఏకాదిశబ్దములకంటెను, సంఖ్యాబోధకమగు ప్రథమ సిద్ధమగును. ప్రథమాద్వితీయాదిశబ్దములేడును సుప్పులయొక్క త్రికములను (సు, ఔ, జస్, ఇత్యాదులు.) బోధించునని యీ వరలో చెప్పబడెను.

వివరణము:—ప్రాతిపదికార్థము, ఏకము. ద్వికము, త్రికము, చతుష్కము, పఞ్చకము అను పక్షములు వ్యవహారమునన్నవి. వీనిస్వరూపమెద్ది యివి యెవరి కభిమతములనుప్రశ్నకు సమాధానమిది. స్వార్థము (జాతి, ప్రవృత్తినిమిత్తము) ద్రవ్యము (వ్యక్తి. ప్రవృత్తి నిమిత్తమున కాశ్రయము) లిఙ్గము (స్త్రీత్వాదికము) సంఖ్య (ఏకత్వాది) కారకము (కర్తృత్వాది) యీయైదునుశబ్దమువలనభాసించును. వీనిలో స్వార్థమేగాని ద్రవ్యమే గాని ప్రాతిపదికార్థము, యితరములు ప్రత్యయార్థ ములనునది ప్రథమపక్షము. స్వార్థద్రవ్యములు రెండును ప్రాతిపదికార్థమనునది ద్వితీయపక్షము. కొందరువైయాకరణులు దీనినంగీకరించిరి. లిఙ్గముతోగల్పి మూడును ప్రాతిపదికార్థము, టాబాదులుద్యోతకములనునది తృతీయము. ఇది వృత్తి కారసమ్మతము. సంఖ్యతోగూడిననాల్గును ప్రాతిపదికార్థము, కారకమొమాత్రము విభక్త్యర్థమనునది చతుర్థము. ఇది తత్రోప పదమనుసూత్రమున కైయటునిచే నిరూపితమయ్యెను. కారకముతోగల్పి అయిదును ప్రాతిపదికార్థములే, ప్రత్యయములు ద్యోతకములు. కావుననే, దధి, మధు, ఇత్యాదులందు విభక్త్యాదులులేకున్నవవి భాసించుచున్నవనునది పంచమము. ఈపక్షము భాష్యకారసమ్మతము. ఈపక్షములన్నియు నరూపసూత్రభాష్యమునవిరూపితములగుటచే ప్రమితములే యని గ్రహించునది.

**536. సంబోధనే చ. 2-3-47. సంబోధనే, చ, (ప్రథమా.)**

ఇహ ప్రథమా స్యాత్ హే రామ॥

536. తనకభిముఖునిగాజేసికొనుటకనుకూలమగువ్యాపారము సంబోధన మనబడును. సంబోధనమందువర్తమానమగు ప్రాతిపదికముకంటె ప్రథమ వచ్చును. హేరామ. (రామ+సు.) సంబుద్ధిలోపము.

వివరణము :— పూర్వసూత్రమందు మాత్రశబ్దముండుటచే, సంబోధన రూపమగు నర్థమధికముగనుండునపుడు పూర్వసూత్రమప్రాప్తమగుచుండ నీ సూత్రమారంభింపబడెను. ఈ సంబోధనము ప్రకృత్యర్థమును గురించి విశేష్యము, క్రియనుగురించి విశేషణమునగును. "రామమాంపాహి" ఇచట రామసంబంధి సంబోధనవిషయము, మత్కర్మకమగు రక్షణమని శాబ్దబోధకల్గును.

ఇది ప్రథమావిభక్తి

537. కారకే. 1-4-23.

ఇత్యధికృత్య॥

537. ఇది యధికారసూత్రము.

వివరణము :— కారకే, అనుచోట సప్తమి ప్రథమార్థకమగుటచే కారక మనియేయర్థము. ఈయధికారమువలన ముందుసూత్రములందు వాక్యభేదమునుచేసి కారకసంజ్ఞవిధింపబడును. ఎట్లన :— "ధ్రువమపాయేఽపాదానం" (539) అనుసూత్రమున "ధ్రువమపాయే" అనునదొకవాక్యము. అపాయము (విశ్లేషము) గల్గునపుడు ధ్రువము (అవధిభూతము) కారకసంజ్ఞగలదగునని యర్థము. "అపాదానం" అనునది రెండవవాక్యము. పూర్వవాక్యము, కారకగ్రహణమునను వృత్తములగును. ధ్రువము, కారకసంజ్ఞగలదై యపాదానసంజ్ఞకమగునని యర్థము. ఇట్లే తక్కినసూత్రములందునూహించునది. అపాదానాదులకు కారకసంజ్ఞయుండుట వలన స్వరము మొదలగునవి ఫలమగును. క్రియలోనన్వయించునది కారకమన బడును. కర్త, కర్మ, సంప్రదానము మొదలగునవి కారకములు. ప్రథమగూడ క్రియలో నన్వయించునదే గావుననదియు కారకమగును. సంబన్ధార్థకమగుషష్ఠి యొక్క అర్థము క్రియతోనన్వయించనందున నదిమాత్రము కారకముగానేరదు. అని దీక్షితాదులయాశయము.

538. కర్తురీప్సితతమం కర్మ. 1-4-49. కర్తుః, ఈప్సిత తమమ్, కర్మ।

కర్తుః క్రియయా ఆప్తుమిష్టతమం కారకం కర్మసంజ్ఞం స్యాత్। కర్తుఃకిమ్। మాషేష్వశ్వం బధ్నాతి। కర్మణఈప్సితా మాషా నతుకర్తుః। తమబ్గ్రహణంకిమ్। పయసా ఓదనం భుఙ్క్తే। కర్మేత్యనువృత్తౌ పునఃకర్మగ్రహణమాధారనివృత్త్యర్థమ్। అన్యథా గేహం ప్రవిశతీత్యత్రైవ స్యాత్॥

538. కర్తుః, అనుచోట షష్ఠ్యర్థముకర్త. కర్తచే అని యర్థము. "ఈప్సితతమమ్" (ఆప్తుమిష్టతమమ్) అనుపదమునకు, పొందుటకు మిక్కిలి యిష్టమైనదని యర్థము. ఆప్ధాతువుప్రకృతిగగల ఇచ్ఛార్థకమగుసన్ ప్రత్యయాంతముకంటె కర్మార్థమునక్తప్రత్యయము, దీనికంటె నతిశయార్థమునందు తమప్ప్రత్యయముచేసిన "ఈప్సితతమమ్" అనురూపమగును. కర్తచే పొందుటకు మిక్కిలియిష్టమగునదికర్మసంజ్ఞగలదగునని సూత్రార్థము లభించును. పొందుట, దేనితోననియాకాంక్ష గల్గునపుడు వ్యాపారాశ్రయుడే కర్తగాన తనకుసన్నిహితమైన వ్యాపారముతోనే, యని చెప్పవలయును. కర్తచే తనయందుగల వ్యాపారముతో పొందుటకు మిక్కిలి యిష్టమైనది, కారకమై కర్మసంజ్ఞకమగుననునర్థము ఫలితమగును. ఉదాహరణమును, కర్మణిద్వితీయా (540) అను సూత్రమున జూపుచు, ప్రకృతమున నీసూత్రములోని పదములకు సార్థక్యమును జూపుచున్నాడు. మాషేష్వశ్వం బధ్నాతి। ఇచట మాషములకు కర్మసంజ్ఞను వారించుటకై, కర్తుః, అనుపదమావశ్యకము. మినపచేనులో గుఱ్ఱమును కట్టుచున్నాడని పైవాక్యమునర్థము. ఇచట మాషములు కర్మయగుగుఱ్ఱమునకే యిష్టతమములు గాని కర్తకు కావు గాన "కర్తుః" అనుపదము, మాషములకు కర్మత్వమును వారించుటకై యావశ్యకమని భావము. తమప్గ్రహణంకిమ్ అను ప్రశ్నకు కర్తకుద్దేశ్యమగునది కర్మసంజ్ఞకలదగునని యర్థముచెప్పిననిష్టసిద్ధియగుచుండ ఈప్సితతమమను పదమెందులకని యాశయము. పయసా ఓదనం భుంక్తే. ఇది కృతభోజనుడై పయోలాభముచేనన్నభక్షణమందు ప్రవర్తించునపుడు ప్రత్యుదాహరణము. ఇచట పయస్సు భక్షణక్రియయందుద్దేశ్యమగుటచే నీప్సితతమశబ్దములేనపుడు పయస్సునకు కర్మసంజ్ఞప్రసక్తమగునని సమాధానాశయము. ఈప్సితతమశబ్దమున్ననది క్రియాశబ్దముగాన పయస్సు ఫలాశ్రయముగనవివక్షితమగుటచే దోషము వారితమగునని భావము. "అధిశీఙ్స్థాసాం కర్మ" (545) అను సూత్రమునుండి కర్మపదమనువృత్తమగుచుండ తిరుగనీసూత్రమందు కర్మగ్రహణమాధారనివృత్త్యర్థము. అనగా "అధిశీఙ్స్థాసాం" సూత్రముచే నాధారమునకు కర్మసంజ్ఞ విధింపబడెను. కావున నాధారముతో సంబద్ధముగల కర్మపదమేయనువృత్తమగును. అట్లయిన నీసూత్రముచేగూడ కర్తకిష్టతమమగునాధారమునకే కర్మసంజ్ఞయగును గానియాధారముగానట్టిదానికి రాకపోవును. గేహంప్రవిశతి ఇచటనిష్టతమమగు గేహము ప్రవేశమునకాధారమైనది గావున నిట్టిచోటులందే కర్మసంజ్ఞ ప్రవర్తించును. "హరింభజతి" మొదలగు ప్రయోగములందాధారముగానట్టిహరికి కర్మసంజ్ఞ రాకపోవును. ఈసూత్రమున తిరుగ కర్మపదమును గ్రహించినందున నిష్టతమమైనది, యాధారమైనను, గాకున్నను కర్మయగును.

539. అనభిహితే. 2-3-1.

ఇత్యధికృత్య.

539. ఇది యధికారసూత్రము. తిఙాదులచేననుక్తమగు దానియందను నర్థమును బ్రతిపాదించును.

540. కర్మణి ద్వితీయా. 2_3_2 కర్మణి, ద్వితీయా।

అనుక్తే కర్మణి ద్వితీయా స్యాత్। హరిం భజతి। అభిహితే తు కర్మణి ప్రాతిపదికార్థమాత్రఇతి ప్రథమైవ। అభిధానం చ ప్రాయేణ తిఙ్కృత్తద్ధితసమాసైః। తిఙ్। హరిః సేవ్యతే। కృత్। లక్ష్మ్యా సేవితః। తద్ధితః। శతేన క్రీతః శత్యః। సమాసః। ప్రాప్త ఆనందో యంసః ప్రాప్తానందః। కచిన్నిపాతేనాఽభిధానమ్। యథా। విషవృక్షోఽపి సంవర్ధ్య స్వయంచ్ఛేత్తుమసాంప్రతమ్। సాంప్రతమిత్యస్యహి యుజ్యత ఇత్యర్థః।

540. తిఙాదులచేననుక్తమగు కర్మను బోధించుప్రాతిపదికముకంటె ద్వితీయావిభక్తి వచ్చునని సూత్రార్థము. హరింభజతి. సేవనక్రియయందు కర్మ హరి. ఇచట హరియందుగల కర్మత్వము దేనిచేతను చెప్పబడలేదు. కాన కర్మవాచకమగుహరిశబ్దముకంటె ద్వితీయావిభక్తి వచ్చును. తిఙాదులచే కర్మ యభిహితమైనపుడు కర్మవాచకముకంటె, ప్రాతిపదికార్థమాత్రే (538) సూ. చే, ప్రథమయే వచ్చును. కర్మాదులు తఙమగ తిఙ్, కృత్, తద్ధితప్రత్యయముల చేతను సమాసముచేతనభిహితములగును. క్రమముగ నుదాహరణములు తిఙ్ ప్రత్యయము. హరిః సేవ్యతే. (హరిసేవింపబడుచున్నాడు.) ఇచట కర్మార్థకతిఙ్ ప్రత్యయమువలనహరియందుగల కర్మత్వముక్తమైనది.కానకర్మవాచకముకంటెను ప్రథమయే వచ్చెను. కృత్తు-లక్ష్మ్యా సేవితః. (హరిః.) ఇచట సేవితః అనునది, సివ్ధాతువుకంటెకర్మయందువిహితమగు క్తప్రత్యయాంతము. క్తప్రత్యయముచేహరియందుగల కర్మత్వముక్తమైనది, గనుక ప్రథమావిభక్తియే వచ్చెను. తద్ధితము—శత్యః. (అశ్వః.) శతేనక్రీతః. అనునర్థమున. శతశబ్దముకంటె శతాచ్చఠన్యతావశతే (5-1-2.) అనుసూత్రముచే యత్ప్రత్యయము ప్రవర్తించిన శత్యః, అను రూపమగును. నూరుచేకొనబడినదని యర్థము. అట్టివి అశ్వాదులుగావచ్చును. ఇచట తద్ధితప్రత్యయముచే కర్మయభిహితమైనందున ద్వితీయావిభక్తిరాక ప్రథమయే వచ్చెను. సమాసము—ప్రాప్తఆనందోయంసః = ప్రాప్తానందః (గ్రామః.) ఆనందకర్తృకము, ప్రాప్తికర్మభూతమునగుగ్రామమనియర్థము. ఇది ద్వితీయార్థబహువ్రీహి. దీనిచే గ్రామమందుగల కర్మత్వముక్తమైనందున గ్రామశబ్దముకంటె ప్రథమయే వచ్చెను. అభిధానము లనుచునా తఙాదులచేనగుననుటవలన నిపాతముచేగూడ గొన్నిచోటులందభిధానము సంభవించుననునర్థము లభించును. విషవృక్షోఽపి......ప్రతమ్. సాంప్రతమ్, అను నిపాతమునకు, యుజ్యతే, అని యర్థము, కాన, అసాంప్రతమ్ అనుదానికి, నయుజ్యతే, అనునర్థము లభించును.

(విషవృక్షమైనను స్వయముగఁబెంచి ఛేదించుటకుచితమైనదిగాదని పైవాక్యమున కర్థము.) సంవర్ధనమందు, ఛేదనమందును, విషవృక్షమే కర్మయగును. యుజ్యతే, అనునది కర్మార్థకమగుతిఙన్తము. ఇట్టియర్థముగల, సాంప్రతమ్, అనెడి నిపాతముచే విషవృక్షమందుండు కర్మత్వము క్తమైనందున విషవృక్షశబ్దముకంటె ప్రథమయే వచ్చెను.

541. తథాయుక్తం చానీప్సితమ్. 1-4-50. తథాయుక్తం, చ, అనీప్సితమ్। (కారకమ్, కర్మ).

ఈప్సితతమవత్క్రియయాయుక్తమనీప్సితమపి కారకం కర్మసంజ్ఞం స్యాత్। గ్రామం గచ్ఛన్ తృణం స్పృశతి। ఓదనం భుఞ్జానో విషం భుంక్తే।

541. తథాయుక్తం = ఈప్సితతమమువలె క్రియతో సంబన్ధముగలది. అనీప్సితమ్=ఈప్సితమనను ద్దేశ్యము, అనీప్సితమననుద్దేశ్యభిన్నము. ఈప్సితతమమువలెక్రియతోసంబద్ధమగు, ననీప్సితముగూడ కారకసంజ్ఞగలదై, కర్మసంజ్ఞకమగుననునర్థము ఫలించును. ఉదాసీనము, ద్వేష్యము, ఈరెండునీసూత్రమునకుదాహరణములు. (1) గ్రామంగచ్ఛన్తృణంస్పృశతి (ఊరకు వెళ్ళుచు తృణమును తాకుచున్నాడు.) గ్రామమునకు వెళ్ళువానికి తృణస్పర్శమావశ్యకమైనను, స్పర్శలో తృణముదాసీనము గాని యుద్దేశ్యము గాదు. ఇచట తృణము స్పర్శనక్రియాజన్యఫలాశ్రయముగ నభిమతముకాకున్నను, తాదృశఫలాశ్రయమగుటవలన నీసూత్రముచే కర్మసంజ్ఞ గలదగును. (2) విషంభుంక్తే। ఓదనంభుంక్తే, ఇత్యాదులందీప్సితతమమగునోదనమువలెననీప్సితమగువిషముగూడ భుజిక్రియతో సంబన్ధము కలదగుటచే కర్మసంజ్ఞకమగును. అన్నమును తినునట్లే విషమును తినుచున్నాడనియర్థము. మరణమునభీతిగలవాడైనను, శత్రువుచే నిగ్రహింపబడి హేయమగు విషమును తినుచున్నపుడే యీసూత్రమునకిది యుదాహరణము. రోగాదులచే పీడితుడగుచు, మరణమెన్నటికిని రాకపోవుటచే బాధను సహింపలేక మరణమే మంచిదనుకొని విషమును తినుచున్నపుడు, విషమునీప్సితతమమే యగును గానన పుడిది పూర్వసూత్రమునకే (కర్తురీప్సితతమం) యుదాహరణమగును.

542. అకథితం చ. 1-4-57. అకథితం, చ (కారకమ్, కర్మ) అపాదానాదివిశేషైరవివక్షితం కారకం కర్మసంజ్ఞం స్యాత్। దుహ్యాచ్ పచ్ దణ్డ్రుధిప్రచ్ఛిచిబ్రూశాసుజిమంథ్ముషామ్। కర్మయుక్ స్యాదకథితం తథా స్యాన్నీహృకృష్వహామ్॥ దుహాదీనాం ద్వాదశానాం, తథా నీప్రభృతీనాం చతుర్ణాం కర్మణా యద్యుజ్యతే తదేవాకథితం కర్మేతి పరిగణనం కర్తవ్యమిత్యర్థః। గాం దోగ్ధి పయః। బలిం యాచతే వసు

ధామ్। అవినీతం వినయం యాచతే। తణ్డులానోదనం పచతి। గర్గాన్ శతం దణ్డయతి। వ్రజమవరుణద్ధి గామ్। మాణవకం పన్థానం పృచ్ఛతి। వృక్షమవచినోతి ఫలాని। మాణవకం ధర్మం బ్రూతే శాస్తి వా। శతం జయతి దేవదత్తమ్। సుధాం క్షీరనిధిం మథ్నాతి। దేవదత్తం శతం ముష్ణాతి। గ్రామమజాం నయతి హరతి కర్షతి వహతి వా। అర్థనిబన్ధనేయం సంజ్ఞా। బలిం భిక్షతే వసుధామ్। మాణవకం ధర్మంభాషతే అభిధత్తే వక్తీత్యాది। కారకమ్ కిమ్। మాణవకస్య పితరం పన్థానం పృచ్ఛతి। * (వా) అకర్మకధాతుభిర్యోగే దేశః కాలో భావో గన్తవ్యోఽధ్వా చ కర్మసంజ్ఞక ఇతివాచ్యమ్। కురూన్ స్వపితి। మాసమాస్తే। గోదోహమాస్తే। క్రోశమాస్తే॥

542 అపాదానము, సంప్రదానము, అధికరణము ఇవి తత్తద్రూపములచే వివక్షింపబడనిచో కర్మగవివక్షితములగునపుడు కారకసంజ్ఞగలదై కర్మసంజ్ఞగల దగును. శ్లోకము :— "దుహ్ ... వహామ్". 1 దుహ, (ప్రపూరణే) 2 యాచ, (యాచ్ఞాయామ్) 3 డుపచష్, (పాకే) 4 దణ్డ, (దణ్డనిపాతే) 5 రుధిర్, (ఆవరణే) 6 ప్రచ్ఛ, (జ్ఞీప్సాయామ్) 7 చిఞ్, (చయనే) 8 బ్రూఞ్, (వ్యక్తాయాంవాచి) 9 శాస్, (హింసాయామ్) 10 జి, (జయే) 11 మన్థ, (విలోడనే) 12 ముష, (స్తేయే) 13 ణీఞ్, (ప్రాపణే) 14 హృఞ్, (హరణే) 15 కృష, (విలేఖనే) 16 వహ, (ప్రాపణే) ఈ పదియాఱుధాతువుల యొక్క ముఖ్యకర్మతో సంబద్ధమై అపాదానాదులచే నవివక్షితమైనదియే అకథిత కర్మయని పరిగణనము చేయవలయును. కావున దుహ్యాదులు ద్వికర్మకము లగును. క్రమముగ నుదాహరణములు :— 1 గాందోగ్ధిపయః. ఇచట పయస్సు ముఖ్యకర్మ. దీనితో సంబన్ధముగలది గోవు. అపాదానముగ వివక్షింపబడనపుడీ సూత్రముచే దీనికి కర్మసంజ్ఞయగును. కావున గోశబ్దముకంటె ద్వితీయావిభక్తి వచ్చును. అపాదానముగ వివక్షితమగునపుడు పఞ్చమి వచ్చును. (గోఃపయోదోగ్ధి). 2 బలింయాచతేవసుధామ్. ప్రార్థనార్థకమగు యాచధాతువునకు వసుధ ముఖ్య కర్మ. బలి, అప్రధానకర్మ. అపాదానముగ వివక్షింపబడునపుడు పఞ్చమి యగును. (బలేర్యాచతేవసుధామ్) అవినీతం వినయం యాచతే. (అవినీతుని వినయమునకై బ్రతిమాలుచున్నాడు.) అనునయార్థకమగు యాచధాతువునకు, అవినీతుడు ముఖ్యకర్మ. వినయమకథితకర్మ. ఇచట సంప్రదానమున కవివక్ష. 3 "తణ్డులానోదనం పచతి" (బియ్యమువలననన్నమును వండుచున్నాడు.) ఓదనము ముఖ్యకర్మ. తణ్డులములకథితకర్మ. అపాదానమున కవివక్ష. 4 గర్గాన్ శతం దణ్డయతి. (గర్గులవలననూరురూప్యములదీసికొనుచున్నాడు.) గ్రహణార్థకమగు దణ్డధాతువునకు శతము ముఖ్యకర్మ. గర్గులకథితకర్మ. అపాదానమున

కవివక్ష. 5 వ్రజమవరుణద్ధి గామ్. (గోవును శాలలోగట్టుచున్నాడు.) గోవు ముఖ్యకర్మ. వ్రజమకథితకర్మ. అధికరణమునకవివక్ష. 6 మాణవకం పన్థానం పృచ్ఛతి. (బ్రహ్మచారివలన మార్గమునడుగుచున్నాడు.) పన్థ ముఖ్యకర్మ. మాణవకుడకథితకర్మ. అపాదానమునకవివక్ష. 7 వృక్షమవచినోతి ఫలాని. (చెట్టునుండి పండ్లను కోయుచున్నాడు.) వృక్షమకథితకర్మ. అపాదానమునకవివక్ష. 8 + 9 మాణవకం ధర్మం బ్రూతే శాస్తి వా. (బ్రహ్మచారికొఱకు ధర్మమును చెప్పుచున్నాడు.) మాణవకుడకథితకర్మ. సంప్రదానమునకవివక్ష. 10 శతం జయతి దేవదత్తమ్. (దేవదత్తునివలన నూరురూప్యములను తీసుకొనుచున్నాడు.) శతము ముఖ్యకర్మ. దేవదత్తుడకథితకర్మ. అపాదానమునకవివక్ష. 11 సుధాం క్షీరనిధిం మథ్నాతి. (అమృతమునకై పాలసముద్రమ మథించుచున్నారు.) సుధ అకథితకర్మ. సంప్రదానమవివక్షితము. 12 దేవదత్తం శతం ముష్ణాతి. (దేవదత్తునివలన నూరురూప్యములను దొంగిలించుచున్నాడు.) దేవదత్తుడకథితకర్మ. అపాదానమునకవివక్ష. 13 – 16 గ్రామమజాం నయతి, హరతి, కర్షతి, వహతి, వా. (గ్రామమునకై మేకను తీసికొనిపోవుచున్నాడు.) గ్రామమకథితకర్మ. సంప్రదానమునకవివక్ష. "అర్థ.........సంజ్ఞా" ఈయకథితకర్మసంజ్ఞ పరిగణిత దుహాదులయొక్క ప్రపూరణము, యాచనము మొదలగు నర్థములనాశ్రయించి ప్రవర్తించునదిగాని దుహాదిస్వరూపములనాశ్రయించి ప్రవర్తించునదిగాదు. అనగా పరిగణితములగు దుహాదులే, ద్వికర్మకములుగాక, దుహాదులయర్థములుగలధాతువు లన్నియును, ద్వికర్మకములే యగునని యాశయము. అహమపీదమచోద్యంచోద్యే, అనుతద్రాజసూత్రస్థభాష్యమున పృచ్ఛపర్యాయమగు చుదధాతువునకును ద్వికర్మకత్వమగపడుట పైయర్థమందు మానము. ఈకర్మసంజ్ఞ యర్థనిబన్ధనమనుటకు ప్రయోజనము చూపబడుచున్నది. బలింభిక్షతే.....వక్తీత్యాది। యాచనాద్యర్థ ములుగల భిక్షాదులనేకధాతువులు, ద్వికర్మకములగును. క్రియలోనన్వయించునది కారకమనబడును. కారకమునకే కర్మసంజ్ఞ విధింపబడెను. ఈసూత్రమున, కారకమ్, అనునది యధికృతము గానిచో, మాణవకస్య పితరం పన్థానం పృచ్ఛతి, అనువాక్యమందలి మాణవకునికిని కర్మసంజ్ఞ ప్రసక్తమగును. మాణవకునికి పితలోనికన్వయము గానిక్రియలోనికి లేనందున మాణవకునికి కారకసంజ్ఞలేదు. ఈదోషమును వారించుటకై కారకాధికారమావశ్యకమగును.

* (వా) ధాతువులు సకర్మకములనియు నకర్మకములనియు రెండువిధ ములు. ధాతువునకు ఫలము, వ్యాపారము, అర్థము. దేనియొక్క యర్థములగు ఫలవ్యాపారములు విభిన్నాశ్రయకములగునో యాధాతువు సకర్మకము. దేని యొక్క ఫలవ్యాపారములు సమానాశ్రయకములగునో యాధాతువకర్మకము. ఫలాశ్రయము కర్మసంజ్ఞకము, వ్యాపారాశ్రయము కర్తృసంజ్ఞకమునగును. కృఞ్ మొదలగుధాతువులు సకర్మకములు (దేవదత్తోఘటం కరోతి) ఏధ మొదలగు ధాతువులకర్మకములు. (దేవదత్తః ఏధతే) అకర్మకధాతువులప్రయోగమందు

1 దేశము, (కురుపాఞ్చాలాదులు) 2 కాలము, (ప్రసిద్ధములగుమాసాదులు) 3 భావము, (క్రియ, గోదోహనాది) 4 గమనార్హమగుమార్గము (క్రోశాదిపరిమితమగు మార్గము) ఇవికర్మసంజ్ఞగలవగునని చెప్పవలయునని వార్తికార్థము. క్రమముగ నుదాహరణములు. (1) కురూన్ స్వపితి. కురుశబ్దము దేశప్రతిపాదకము, స్వపధాతువకర్మకము. (2) మాసమాస్తే. (3) గోదోహమాస్తే. (4) క్రోశమాస్తే. ఇచట ఆసధాతువు అకర్మకము.

543. గతిబుద్ధిప్రత్యవసానార్థశబ్దకర్మాకర్మకాణామణి కర్తా స ణౌ. 1-4-52. గతిబుద్ధి......కాణాం, అణి, కర్తా, సః, ణౌ (కర్మ).

గత్యాద్యర్థానాం శబ్దకర్మకాణామకర్మకాణాం చాణౌ యః కర్తా స ణౌ కర్మ స్యాత్। శ్లో॥ శత్రూనగమయత్స్వర్గం వేదార్థం స్వానవేదయత్। ఆశయచ్చామృతం దేవాన్వేదమధ్యాపయ ద్విధిమ్॥ (1) ఆసయత్సలిలే పృథ్వీం యః స మే శ్రీహరి ర్గతిః॥ గత్యాదికిమ్। పాచయత్యోదనం దేవదత్తేన। అణ్యన్తానాం కిమ్। గమయతి దేవదత్తో యజ్ఞదత్తం, తమపరః ప్రయుఙ్క్తే గమయతి దేవదత్తేన యజ్ఞదత్తం విష్ణుమిత్రః। 1 (వా) నీవహ్యోర్న। నాయయతి వాహయతివా భారం భృత్యేన। 2 (వా) నియన్తృకర్తృకస్య వహేరనిషేధః। వాహయతి రథం వాహాన్ సూతః। 3 (వా) ఆదిఖాద్యోర్న। ఆదయతి ఖాదయతి వాఽన్నం వటునా। 4 (వా) భక్షేరహింసార్థస్య న। భక్షయత్యన్నం వటునా। అహింసార్థస్య కిమ్। భక్షయతి బలీవర్దాన్ సస్యమ్। 5 (వా) జల్పతి ప్రభృతీనాముపసంఖ్యానమ్।జల్పయతి భాషయతి వా ధర్మం పుత్రం దేవదత్తః। 6 (వా) దృశేశ్చ। దర్శయతి హరిం భక్తాన్। సూత్రే జ్ఞానసామాన్యార్థానామేవ గ్రహణం, న తు తద్విశేషార్థానామిత్యనేన జ్ఞాప్యతే। తేన స్మరతిజిఘ్రతీత్యాదీనాం న। స్మారయతి ఘ్రాపయతి వా దేవదత్తేన। 7(వా) శబ్దాయతేర్న। శబ్దాయయతి దేవదత్తేన। ధాత్వర్థసంగృహీత కర్మకత్వేన ఽకర్మకత్వాత్ప్రాప్తిః। యేషాం దేశకాలాది భిన్నం కర్మ న సంభవతి తేఽత్రాకర్మకాః। నత్వవివక్షిత కర్మాణోఽపి। తేన మాసమాసయతి దేవదత్తమిత్యాదా కర్మత్వం భవత్యేవ॥ దేవదత్తేన పాచయతీత్యాదౌ తు న॥

543. "గతి........నామ్"। ఇచట గతిబుద్ధిప్రత్యవసానశబ్దములకు ద్వన్ద్వము. పిదపనర్థశబ్దముతో బహువ్రీహి। (గతిబుద్ధిప్రత్యవసానాన్యర్థా

యేషామ్ ) అర్థశబ్దము ద్వన్ద్వాన్తమందుండుటచే గత్యాదులతో ప్రత్యేకముగ సంబన్ధించును. గత్యర్థకములు. (గమ్, మొదలగుధాతువులు) బుద్ధ్యర్థకములు (విద, మొదలగునవి) ప్రత్యవసానార్థకములు (అశ, మొదలగునవి) అని ఫలించును. అర్థశబ్దాన్తమునకు, "శబ్దకర్మాఽకర్మక" శబ్దములకును ద్వన్ద్వము. గతి (గమనము) బుద్ధి (జ్ఞానసామాన్యము.) ప్రత్యవసానము (భక్షణము.) ఈయర్థములుగల ధాతువులకు, శబ్దరూపము (వేదము మొదలగునవి.) కర్మకారకముగగల ధాతువులకు, (శబ్దఃకర్మకారకంయేషామ్ = శబ్దకర్మాణః.) అకర్మక ధాతువులకును, హేతుమణ్ణిచ్ప్రత్యయముత్పన్నము కాకపూర్వమేది కర్తయగునో యయ్యది ణిచ్ప్రత్యయముత్పన్నమైనపిదప కర్మసంజ్ఞకమగునని సూత్రార్థము. గమ్యాదిణిజన్తములను వరుసగ నుదాహరించుచున్నాడు:— శ్లో॥ శత్రూనగమయత్స్వర్గం... శ్రీహరిగ్గతిః। గత్యర్థమునకు:— (1) శత్రూనగమయత్ స్వర్గం। ణిచ్చునకుప్రేరణమర్థము. శత్రవః స్వర్గమగచ్ఛన్। ఇచట శుద్ధమగు (ణిచ్. ప్రత్యయరహితమగు.) గమ్‌ధాతువునకు కర్తలు శత్రువులు. గమ్‌ధాతువునకు ణిచ్చు చేసినపుడు శత్రువులు కర్మసంజ్ఞగలవారగుదురు. కాన కర్మవాచకమగు శత్రుశబ్దము కంటె ద్వితీయావిభక్తి వచ్చును. ణిజన్తధాతువునకు కర్త శ్రీమహావిష్ణువు. ఇట్లు ణ్యన్తమగు గమ్‌దాతువు ద్వికర్మకమయ్యెను. స్వర్గమునుగురించి వెళ్ళునట్టి శత్రువులను విష్ణువు వెళ్ళునట్లు ప్రేరేపించుచున్నాడని యర్థము (2) బుద్ధ్యర్థకము,— వేదార్థం స్వానవేదయత్. వేదార్థం స్వే అవిదుః ఇచట శుద్ధమగు విద ధాతువునకు స్వకీయులు కర్తలు. ణిజుత్పత్తియైనపిదప వీరికి కర్మసంజ్ఞ వచ్చును. (3) ప్రత్యవసానార్థమునకు :— ఆశయచ్చామృతం దేవాన్. దేవాః అమృతమాశ్నన్ శుద్ధమగు అశ ధాతువునకు దేవులు కర్తలు. ణిజన్తమందు వీరికి కర్మసంజ్ఞ యగును. (4) శబ్దకర్మకధాతువునకు ;— వేదమధ్యాపయద్విధిమ్. విధిర్వేదమధ్యైత. శబ్దరూపమగు వేదము కర్మకారకముగాగల అధిపూర్వకమగు ఇఙ్ ధాతువునకు కర్తవిధి (బ్రహ్మ) ణ్యన్తావస్థయందు వీనికి కర్మసంజ్ఞ. (5) అకర్మక ధాతువునకు :— ఆసయత్సలిలే పృథ్వీమ్. పృథ్వీసలిలే ఆస్త. అకర్మకము శుద్ధమునగు ఆసధాతువునకు కర్త పృథివి. దీనికి ణిజన్తావస్థయందు కర్మసంజ్ఞ యగును. గతీత్యాదిఃకిమ్। "అణికర్తాసణౌ" అని సూత్రించినను శత్రూనగమయత్స్వర్గమిత్యాదులందిష్టసిద్ధియగుచుండ "గతిబుద్ధిప్రత్యవసానార్థశబ్దకర్మాకర్మకాణా" మనుదానికేమిఫలమనిప్రశ్నాశయము. పాచయత్యోదనం దేవదత్తేన। గతిబుద్ధీత్యాదిపదము లేనిచో అణ్యన్తావస్థయందు పచధాత్వర్థకర్తయగు దేవదత్తునికిని ణ్యన్తావస్థయందు కర్మసంజ్ఞ ప్రసక్తమగునని సమాధానాశయము. ఈసూత్రమపూర్వముగ కర్మసంజ్ఞావిధాయకమను దీక్షితమతమునను సరించి యిట్లీ శంకాసమాధానములకాశయము వర్ణింపబడెను. అణ్యన్తానాం కిమ్. శుద్ధములగు గత్యాద్యర్థకధాతువులయొక్క కర్తకు కర్మసంజ్ఞనేలవిధింపవలయుననిశఙ్కాశయము. ణిజన్తములగునీధాతువులయొక్క కర్తకు కర్మసంజ్ఞానివృత్త్యర్థమై అణ్యన్తానామ్‌అను

విశేషణమావశ్యకమని సమాధానాశయము. ఈవిశేషణము లేనపుడు దోషప్రసక్తిగల స్థలమును జూపుచున్నాడు :— గమయతి... విష్ణుమిత్రః. యజ్ఞదత్తోగచ్ఛతి. తం గమయతి దేవదత్తః. ఇచట యజ్ఞదత్తునికి కర్మసంజ్ఞనిర్బాధము. ఈదేవదత్తుని విష్ణుమిత్రుడు ప్రేరేపించుచున్నాడు. (తమపరః ప్రయుఙ్క్తే) ఇచట గమయతి అనునది ణిజన్తప్రకృతికణిజన్తము. ప్రథమణిజన్తమున కర్తయగు దేవదత్తునికి సూత్రముచే కర్మసంజ్ఞనువారించుటకు సూత్రమున అణ్యన్తానామ్ అనున దావశ్యకము.

నీ వహ్ధాతువులు గత్యర్థకములగుటచే వీనికంటె ణిచ్చును జేసినపుడు శుద్ధధాతువులకర్తకు ప్రసక్తమగు కర్మసంజ్ఞను నిషేధించుచున్నాడు. 1 (వా) నీ వహ్ వీనికంటె ణిచ్చు వచ్చునపుడణ్యన్తావస్థయందలి కర్తకు కర్మసంజ్ఞరాదు. ఉదా:— "నాయ... ... భృత్యేన". భృత్యః భారం నయతి వహతి వా "నాయయతి వాహయతి వా ప్రభుః భారం భృత్యేన। ఇచట భృత్యునికి కర్మసంజ్ఞలేనందున కర్తృవాచకమునకంటె తృతీయ వచ్చెను. నీవహ్ధాతువులు ప్రాపణార్థకములు గాని గత్యర్థకములు గావని కొందఱిమతము. వీరిమతమున నీవహ్యోర్న" అను నిషేధమనావశ్యకమని గ్రహించునది.

2 (వా) "నియన్తృ.........ధః" నియన్తృశబ్దమునకు పశువులదోలెడువాడని యర్థము. నియన్తకర్తగాగల వహధాతుప్రకృతికణిజన్తముయొక్క ప్రయోజ్యకర్తకు (అణ్యన్తావస్థయందలికర్త, ణ్యన్తావస్థయందు ప్రయోజ్యకర్తయనబడును.) కర్మసంజ్ఞానిషేధము లేదు. నీవహ్యోర్న అనునిషేధమును బాధించి కర్మసంజ్ఞ యగునని ఫలితార్థము. ఉదా:— వాహయతి రథం వాహాన్ సూతః. వాహాః (అశ్వాః.) రథం వహన్తి. రథం తాన్ సూతో వాహయతి. సూతుడన సారథి. నియన్తృశబ్దమునకు "నియన్తా ప్రాజితా యన్తా సూతః క్షత్తా చ సారథిః" అను నిఘంటువుచే సూతుడనునర్థము రూఢము. నియమయతి (తోలెడువాడు) అను యోగమువలన పశువులబ్రేరేపించువాడను నర్థము యౌగికము. "వాహయతిబలీవర్దాన్ యవాన్" అను భాష్యప్రయోగమువలన నిచట యోగార్థమునే గ్రహింపదగును. చూపబడిన ప్రయోగద్వయమందును ప్రయోజ్యకర్తకు (అణ్యన్తావస్థయందలికర్త.) కర్మసంజ్ఞసిద్ధమగును.

3 (వా) అద (భక్షణే) ఖాదృ, (భక్షణే) అనుధాతువులుప్రకృతిగగల ణిజన్తముయొక్కప్రయోజ్యకర్తకుకర్మసంజ్ఞానిషేధమును చెప్పవలయును. అదఖాదధాతువులుప్రత్యవసానార్థకములగుటవలనప్రసక్తమగుకర్మసంజ్ఞనువారించుటకీ వార్తికము. "ఆదయతి ...... వటునా". "వటురన్నమత్తి". "వటునా ఒన్నమాదయతి పితా". ప్రయోజ్యకర్తయగు వటువునకుకర్మసంజ్ఞనిషేధింపబడెను.

4 (వా) "భక్షే ........న". "హింసాఙ్గమగుభక్షణమునుబోధింపనట్టి భక్షధాతువుయొక్క(ణిజన్తము)ప్రయోజ్యకర్తకుకర్మసంజ్ఞానిషేధమును చెప్పవల

యును". ఉదా :— భక్షయత్యన్నం వటునా. అన్నకర్మకమగునపుడు భక్షధాతువు హింసార్థకముగాదు. "భక్షయతిబలీవర్దాన్ సస్యమ్". (బలీవర్దాః సస్యం భక్షయన్తి। తాన్ భక్షయతి) ఇచట భక్షధాతువుహింసాఫలకమగు భక్షణమును బోధించును. ఇతరులసస్యము భక్షింపబడునపుడితరులు హింసితులగుదురుగాననిచట సస్యాధికారికిహింసయనితెలియదగును.

5 (వా) "జల్పతి....... నమ్". జల్ప, (వ్యక్తాయాంవాచి) భాష మొదలగు ధాతువుల (ణిజన్తముల) యొక్కప్రయోజ్యకర్తకుకర్మసంజ్ఞను చెప్పవలయును. జల్పసదృశములుగత్యాద్యర్థకములుగానందున సూత్రముచే కర్మసంజ్ఞ యప్రాప్తమగుచుండ నీవార్తికము జెప్పబడెను. ఉదా:—"జల్పయతి భాషయతి వా....... దత్తః". పుత్రో ధర్మం జల్పతి (ధర్మబోధకవాక్యములనుడుపుచున్నాడు.) పుత్రం ధర్మం జల్పయతి దేవదత్తః.

6 (వా) "దృశేశ్చ". దృశిర్ (ప్రేక్షణే) ధాతుప్రయోజ్యకర్తకును కర్మసంజ్ఞను జెప్పవలెను. ఉదా:— దర్శయతిహరింభక్తాన్. (భక్తా హరిం పశ్యన్తి తాన్ దర్శయతి పూజకః.) ఈ వార్తికము సూత్రమున బుద్ధిశబ్దముచే జ్ఞానసామాన్యమును బోధించుధాతువులకే గ్రహణము గాని జ్ఞానవిశేషార్థకములగు ధాతువులకు గ్రహణము లేదనుటలో జ్ఞాపకమగును. జ్ఞానవిశేషమును (చూచుట వినుట మొదలుగునవి.) బోధించువానికిని బుద్ధిశబ్దముగ్రాహకమనిన దృశధాతువునకు సంగ్రహము గల్గును గాని నిదివ్యర్థమగును ఇట్టిజ్ఞాపనమునకు స్మరణము ఆఘ్రాణము మొదలగు జ్ఞానవిశేషములను బోధించెడి స్మృ (స్మరణే) ఘ్రా (ఆఘ్రాణే) మొదలగు ధాతువులయొక్క ప్రయోజ్యకర్తకు కర్మసంజ్ఞానివృత్తి ఫలము. ఉదా:— స్మారయతి ....... దేవదత్తేన. (దేవదత్తః స్మరతి మాతరం। దేవదత్తేన స్మారయతి యజ్ఞదత్తః.)

7 (వా) "శబ్దా ....... ర్మ". శబ్దశబ్దముకంటె శబ్దంకరోతి అను నర్థమందు "శబ్దవైరకలహాభ్రకణ్వమేఘేభ్యః కరణే' (3-1-17) సూ. చే క్యఙ్ ప్రత్యయమునుచేసిన శబ్దాయతే అని యగును. శబ్దాయయతి అనునది క్యఙన్తప్రకృతికణిజన్తము. దీనియొక్క అణ్యన్తావస్థయందలికర్తకు కర్మసంజ్ఞ రాదు. ఉదా:— శబ్దాయయతి దేవదత్తేన. (దేవదత్తశ్శబ్దాయతే తేనశబ్దాయయతి యజ్ఞదత్తః.) శబ్దాయ అనుక్యఙన్తధాతువకర్మకమగుటచే ప్రాప్తమగు కర్మసంజ్ఞను నిషేధించుటకీవార్తికము. శబ్దాయ అనుధాతువునకు శబ్దంకరోతిఅనియర్థము. శబ్దరూపమగు కర్మ ధాత్వర్థముచే సంగ్రహింపబడినందున నీక్యఙన్తమకర్మకమాయెను.

సూత్రమున అకర్మకపదముచే దేనికి దేశము కాలము భావము గన్తవ్యాధ్వ వీనికంటె భిన్నమగు కర్మ సంభవింపదో యట్టిధాతువులకు మాత్రమే గ్రహణము గల్గును. కర్మ వివక్షితము గానందుననకర్మకములగు ధాతువులకు గ్రహణము

లేదు. కావున మాసమాసయతి దేవదత్తమ్ అనుచోట ఆసధాతువు సకర్మకమైనను కాలరూపమగుకర్మకంటె భిన్నమగు కర్మలేనిదగుటవలన నకర్మకమే యగును. అందుచే ఆసధాతుప్రకృతికణిజన్తముయొక్క ప్రయోజ్యకర్తయగు దేవదత్తునికి కర్మసంజ్ఞ సిద్ధించెను. (దేవదత్తఃమాసమాస్తే తమాసయతి.) కర్మ వివక్షితము గానందును నకర్మకముఁగుపానికి గ్రహణము లేదనుటచే దేవదత్తేనపాచయతి మొదలగు స్థలములందు ప్రయోజ్యకర్తయగు దేవదత్తునకు కర్మసంజ్ఞ వారింప బడును. పచధాతువు సకర్మకమైనను కర్మ వివక్షింపబడనందుననకర్మకమైనది. పచధాతువునకు దేశకాలాదులకంటె వేరగునోదనాదికర్మలు సంభవించునుగాన సూత్రములోని యకర్మకపదముచే గ్రహణములేదు.

వివ:—గతిత్యాదికిమ్. శ్రీహరిః శత్రూన్ స్వర్గమగమయత్ ఈమొదలగు వాక్యములందు శుద్ధమగు గమ్‌ధాతువుయొక్క ఫలమునకాశ్రయమగుటచే స్వర్గము నకు కర్మసంజ్ఞ సిద్ధించినట్లు,ణిజన్త గమ్‌ధాతువుయొక్క ఫలమునకాశ్రయమగుటచే శత్రువులకును "కర్తురీప్సితతమమ్" సూ. చేతనే కర్మసంజ్ఞ సిద్ధమగుచుండనీ సూత్రమునకు ప్రయోజనమేమని ప్రశ్నాశయము. పాచయత్యోదనం దేవదత్తేన. "గతిబుద్ధి. .........ణౌ" అను నీసూత్రము నియమార్థము. ణిజన్తధాత్వర్థఫలా శ్రయమునకు కర్మసంజ్ఞ (కర్తురీప్సితతమమ్.... .....సూ. చే) యగుచో గత్యా ద్యర్థధాతుప్రకృతికణిజన్తధాత్వర్థఫలాశ్రయమునకే కర్మసంజ్ఞ యగునని నియమ స్వరూపము. ఇట్టి నియమమునకు ఫలము, పాచయత్యోదనం దేవదత్తేనఅను నది. పాచయతి అనునది గత్యాద్యర్థప్రకృతికమగు ణిజన్తము గానందున "కర్తు రీప్సితతమమ్" సూ. చే దేవదత్తునికి ప్రాప్తమగు కర్మసంజ్ఞ వారింపబడును. కర్తృసంజ్ఞ యుండుటచే తృతీయవచ్చెను అని, సమాధానాశయమని నాగేశాదుల యాశయము.

544. హృక్రోరన్యతరస్యామ్. 1-4-53, హృక్రోః. అన్యత రస్యామ్ (అణి కర్తా సః ణౌ కర్మ)

హృక్రోరణౌ యః కర్తా స ణౌ వా కర్మస్యాత్। హార యతి కారయతి వా భృత్యం భృత్యేన వా కటమ్। (వా) అభివాదిదృశోరాత్మనేపదే వేతి వాచ్యమ్। అభివాదయతే దర్శయతే దేవం భక్తం భక్తేన వా॥

544. హృఞ్ (హరణే) కృఞ్ (కరణే) అనుధాతువులయొక్క అణ్యన్తావస్థయందలికర్తకు ణ్యన్తావస్థయందు కర్మసంజ్ఞ వికల్పముగనగును. హారయతి .........కటమ్. (భృత్యః కటం కరోతి హరతి వా) భృత్యం భృత్యేన వా హార యతి కారయతి వా కటమ్ (వా) ఆత్మనేపదులగు అభివాది (అభిపూర్వకవద ధాతువునకుహేతుమణ్ణిజన్తము) అనుదానియొక్కయు దృశిప్రకృతికణిజన్తము

యొక్కయు ప్రయోజ్యకర్తకు కర్మసంజ్ఞ వికల్పముగనగును. అభివాదయతే దర్శయతే దేవం భక్తం భక్తేన వా (భక్తోదేవమభివదతి తమన్యః ప్రేరయతి = భక్తం భక్తేనవాఅభివాదయతే. భక్తోదేవం పశ్యతి తమన్యః ప్రేరయతి = భక్తం భక్తేన వా దేవం దర్శయతే).

వివ:— ఈ సూత్రము భయత్రవిభాష. అభ్యవపూర్వకమగు హృఞ్ ధాతువు భక్షణార్థకమగుటచే దీనియొక్క ప్రయోజ్యకర్తకు గతిబుద్ధి (543) సూ. చే కర్మసంజ్ఞ నిత్యముగ ప్రాప్తమగుచున్నది. [వటురన్నమభ్యవహరతి] వటుమన్నమభ్యవహారయతి. విపూర్వకమగు క్రీఞ్ ధాతువు [వికారార్థకము.] అకర్మకమగుటవలన దీనియొక్క ప్రయోజ్యకర్తకు గతిబుద్ధి [543] సూ. చే కర్మసంజ్ఞ ప్రాప్తముగుచున్నది. [అశ్వోవిక్రీణతే.] అశ్వాన్ వికారయతి. మూలమునజూపబడిన యర్థములందు [హరణము కరణము.] కర్మసంజ్ఞయప్రాప్తముగుచున్నది. కావుననిది ప్రాప్తాఽప్రాప్త విభాషయగును. దీనిచేనీరెండుధాతువులకు నెట్టియర్థమును బోధించినను జ్యంతములగు వీనియొక్క ప్రయోజ్యకర్తకు కర్మసంజ్ఞ వికల్పముగనగును.

545. అధిశీఙ్స్థాసాం కర్మ. 1-4-46. అధిశీఙ్స్థాసాం, కర్మ [ఆధారః]

అధిపూర్వాణామేషామాధారః కర్మ స్యాత్। అధిశేతే అధితిష్ఠతి అధ్యాస్తే వా వైకుణ్ఠం హరిః॥

545. అధిపూర్వములగు శీఙ్ [స్వప్నే] స్థా [గతినివృత్తౌ] ఆస [ఉపవేశనే.] అనుధాతువులయొక్క యాధారము కర్మసంజ్ఞకమగును. ఆధారోఽధికరణమ్ [635] సూ. చే ప్రాప్తమగునధికరణసంజ్ఞనీకర్మసంజ్ఞ బాధించును. అధిశేతే అధితిష్ఠతి అధ్యాస్తే వా వైకుణ్ఠం హరిః. విష్ణువు వైకుంఠమున నిద్రించుచున్నాడు మొదలగునవి యర్థములు. వైకుణ్ఠమాధారము॥

546. అధినివిశశ్చ. 1-4-37. అభినివిశః, చ [ఆధారః]

అభినీత్యేతత్సంఘాతపూర్వస్య విశతేరాధారః కర్మ స్యాత్। అభినివిశతే సన్మార్గమ్। పరిక్రయణే సంప్రదానమితిసూత్రాదిహ మణ్డూకప్లుత్యాఽన్యతరస్యాంగ్రహణమనువర్త్య వ్యవస్థితవిభాషాశ్రయణాత్క్వచిన్న. పాపేఽభినివేశః।

546. అభినివిశః అనునదిఅభి ని శబ్దములకుద్వన్ద్వముచేసి పిదపవిశ్ అనుదానితోసమాసముచేసిన సిద్ధమగును. అభిని అనుసుసమర్గసముదాయము పూర్వమందుగల విశ [ప్రవేశనే] ధాతువుయొక్క యాధారము కర్మసంజ్ఞ గలదగును.

అభినివిశతే సన్మార్గమ్. అభినివేశమనయాగ్రహము. [పట్టుదల] సన్మార్గవిషయక మగుయాగ్రహముగలవాడనియర్థము. పాపేఽభినివేశః. ఇచట అభినిపూర్వకమగు విశధాతువుయొక్క యాధారమగు పాపమునకు కర్మసంజ్ఞలేకపోవుటకుపాయమును జూపుచున్నాడు:—ఈసూత్రము వ్యవస్థితవిభాషయనిన గొన్నిచోట్ల దీనికి ప్రవృత్తి లేకుండుట సిద్ధమగును. పరిక్రయణే సంప్రదానమన్యతరస్యామ్ [583] అను సూత్రమునుండి అన్యతరస్యామ్ అనుదానికనువృత్తిచేసి యిది వ్యవస్థితవిభాషయని యంగీకరింపవలయును. వ్యవస్థితవిభాషయొక్క స్వరూపము అపజ్ఞస్ఫోటాయ నస్య [89] అనుసూత్రవ్యాఖ్యానసందర్భమున జూపబడినది.

వివ :— I. అభి ని శబ్దములకు ద్వన్ద్వమని చెప్పబడెను. వానిలో నభిశబ్దముకంటె నిశబ్దమల్పాచ్తరమగుటచే అల్పాచ్తరమ్ [910] సూ. చే ప్రాప్తమగు పూర్వనిపాతమును నిశబ్దమునకు చేయక పాణిని విపరీతోచ్చారణము చేయుటవలన అభిని అనుసంఘాతము పూర్వమందున్నప్పుడే యీసూత్రము ప్రవర్తించుననిగ్రహింపవగును. ఇట్లు చెప్పుటకు "నివిశతే యది శాకశిఖా పదే" అనుప్రయోగమువలి పదే అనుచోటనీసూత్రము ప్రవర్తింపకుండుట ఫలమగును.

II. అన్యతరస్యామ్ అనుదానికనువృత్తిచేసి యిట్లు వ్యాఖ్యానము చేయుటలో "ఏష్వర్థేష్వభినివిష్టానామ్" అనుసమర్థసూత్రస్థభాష్యప్రయోగము మూలము. కైయటునిమతమునననుసరించి చెప్పినసమాధానమిది.. పై భాష్యప్రయోగమువలన అభినివిశ్ అనునవికృతమగునానుపూర్వికి శ్రవణమున్నచోటనే యీసూత్రము ప్రవర్తించుననర్థము లబ్ధమగును. కావున పాపేఽభినివేశః అనుచోటనానుపూర్వీభేదముండుటచే కర్మసంజ్ఞకు ప్రసక్తిలేదు. అన్యతరస్యామ్ అనుదానికనువృత్తిచేయుటయందు వ్యవస్థితవిభాషాశ్రయణమునందును ప్రమాణము లేదని నాగేశాదులమతము.

547. ఉపాన్వధ్యాఙ్వసః. 1-4-48. [ఆధారః కర్మ]

ఉపాదిపూర్వస్య వసతేరాధారః కర్మస్యాత్। ఉపవసతి అనువసతి అధివసతి వా వైకుణ్ఠం హరిః। 1 [వా] అభుక్త్యర్థస్య న। వనే ఉపవసతి। ఉభసర్వతసోః కార్యా ధిగుపర్యాదిషు త్రిషు। ద్వితీయాఽఽమ్రేడితాన్తేషు తతోఽన్యత్రాఽపి దృశ్యతే॥ ఉభయతః కృష్ణం గోపాః। సర్వతః కృష్ణమ్। ధిక్ కృష్ణాఽభక్తమ్। ఉపర్యుపరిలోకం హరిః। అధ్యధిలోకమ్। అధోఽధోలోకమ్. 2 [వా] అభితఃపరితః సమయానికషాహాప్రతియోగేఽపి। అభితః కృష్ణమ్। గ్రామం సమయా। నికషా లఙ్కామ్। హా కృష్ణాఽభక్తమ్। తస్య శోచ్యత ఇత్యర్థః। బుభుక్షితం న ప్రతిభాతి కించిత్॥

547. ఉప అను అధి ఆఙ్ అనువానిలోనేదైన పూర్వమందుగల్గి శబ్ది కరణియైనవన [నివాసేః త్యాదిగణములోనిది] ధాతువుయొక్క యాధారము కర్మ సంజ్ఞకమగును. ఉపవసతి......వా వైకుణ్ఠంహరిః. విష్ణువు వైకుణ్ఠమున నివసించుచున్నాడని యర్థము. వైకుణ్ఠమాధారము.

1 [వా] అభు......న. భోజననివృత్తిని [ఉపవాసమును] బోధించు వసధాతువుయొక్క యాధారమునకు కర్మసంజ్ఞానిషేధమును చెప్పవలయును. వనే ఉపవసతి. వనమందు భోజనములేనివాడై యున్నాడని యర్థము.

ఇంతవరకు కారకములనువ్యవహారముగలవిభక్తులు (కారకవిభక్తులు) చెప్పబడెను. ఇటుపైని (తృతీయావిభక్తిపర్యన్తము) చెప్పబోవునవియుపపద విభక్తులని తెలియదగును. వీనికి విశేషించి యర్థమును చెప్పకపోవుటచేతను, షష్ఠీ విభక్తికపవాదములనుటచేతను సంబన్ధమర్థము. (శ్లో॥ వా॥) ఉభసర్వతసోః......తే. ఉభసర్వతసోః=ఉభశబ్దసర్వశబ్దములకు ద్వన్ద్వము. దీనికి పిదపతసిప్రత్యయముతో షష్ఠీతత్పురుషము. (ఉభసర్వయోస్తసౌ) తత్ప్రకృతికత్వము షష్ఠ్యర్థము. ఉభశబ్దము కంటె సర్వశబ్దముకంటెను విహితమగు తస్ప్రత్యయ న్తముదుగలదవియర్థము. ఉభ శబ్దమునకు తసిప్రత్యయముపరమగునపుడు అయచ్ప్రత్యయమగును. ఈవిధముగ నుభయశబ్దసర్వశబ్దప్రకృతికతసిప్రత్యయా న్తములతో సంబన్ధముగల ప్రాతిపదికము కంటె ద్వితీయావిభక్తి చేయదగుననునర్థము లభించును. మఱియు ధిక్ శబ్దయోగ మందు ద్విరుక్తములగు ఉపర్యాదులమూడింటి యోగమందును ప్రాతిపదికముకంటె ద్వితీయ ప్రయోగింపదగును. ఉపర్యాదులుమూడును "ఉపర్యధ్యధసస్సామీప్యే". (18-1-7) అనుసూత్రమున గ్రహింపబడిన ఉపరి అధి అధః అనునవి యవి తెలియదగును. ఈచోటులందేగాకనితరస్థలములందును ద్వితీయ చూడబడుచున్నదని పైశ్లోకమునకర్థము. క్రమముగనుదాహరణములు :—"ఉభయతః కృష్ణం గోపాః" ద్వితీయార్థము సంబన్ధము. కృష్ణునియొక్కపార్శ్వద్వయమందును గోవుల గాచు వారుండిరని యర్థము సర్వతః కృష్ణం (గోపాః) కృష్ణునిచుట్టు గోపాలకులుండి రనియర్థము. "ధిక్ కృష్ణాఽభక్తమ్" (కృష్ణాఽభక్తసంబన్ధినిన్దా.) కృష్ణునికిభక్తుడుగాని వానికి నిందయగుగాక యనియర్థము. ద్వితీయకు ప్రథమార్థమునుజెప్పి కృష్ణాఽభక్తుడు నిన్ద్యుడనునర్థమును గొందరుచెప్పిరి. ఉపర్యుపరి లోకంహరిః. విష్ణువు లోకమునకు మీదుగా సమీపమందుండెనని యర్థము. అధ్యధిలోకమ్ (హరిః.) విష్ణువు లోకము నకు మీదుగా సమీపమందుండెనని యర్థము. అధోఽధోలోకమ్ (హరిః.) విష్ణువు లోకమునకు దిగువ సమీపమందుండెనని యర్థము. ఉపర్యాదులమూడింటికి పై జెప్పబడిన "ఉపర్యధ్యధసస్సామీప్యే సూ. చే సమీపదేశమనునర్థమున ద్విత్వము వచ్చెను. ఈశ్లోకములోని "అన్యత్రాఽపిదృశ్యతే" అనుదానియర్థమునే వార్తికముచే జూపుచున్నాడు.

2 [వా] అభితః....పి. అభితః పరితః సమయా నికషా హా ప్రతి అనుపీనియొక్కయోగమందును ప్రాతిపదికముకంటె ద్వితీయ ప్రయోగింపదగును.

క్రమముగనుదాహరణములు :— అభితః కృష్ణమ్. కృష్ణునకిరుపార్శ్వములందని యర్థము. పరితః కృష్ణమ్. కృష్ణునిచుట్టునని యర్థము. గ్రామం సమయా. గ్రామసమీపమందని యర్థము. నికషా లఙ్కామ్. లఙ్కాసమీపమందని యర్థము, సమయానికషాశబ్దములు సామీప్యబోధకములగు నవ్యయములు. హా కృష్ణాఽభక్తమ్. హా అనునది ఖేదమును ద్యోతనజేయు నవ్యయము. కృష్ణునికి భక్తునిగానివానికి సంబన్ధించిన శోచనమని యర్థము. బుభుక్షితం న ప్రతిభాతి కించిత్. ఆకలి గొన్నవానికి పదార్థములేవియు రుచియించుటకైన తెలియదని యర్థము.

వివ :— వస ధాతువు భ్వాదిగణమందు [శబ్వికరణి.] అదాదిగణమందును, [లుగ్వికరణి.] గలదు. లుగ్వికరణాఽలుగ్వికరణయోరలుగ్వికరణస్య [లుగ్వికరణధాతువునకును అలుగ్వికరణ ధాతువునకును గ్రహణము ప్రసక్తమైనపుడు అలుగ్వికరణమునకే గ్రహణము గాని, లుగ్వికరణమునకు గ్రహణము లేదు.] అను పరిభాషచే భ్వాదిగణములోని వసధాతువునకే గ్రహణమని లభించును.

"ఉపర్యుపరిబుద్ధీనాంచరన్తీశ్వరబుద్ధయః" అనుచోట, ఉపరిబుద్ధీనాముపరి=ఉత్తానబుద్ధీనముపరి [చరన్తి] అని యన్వయించుటచేనుపరి యనునది ద్విరుక్తముగానందునని చట ద్వితీయ ప్రవర్తింపదు. ప్రతిపదోక్తమగు "ఉపర్యధ్యధః" సూ. చే ద్విత్వము వచ్చినపుడే ద్వితీయ వచ్చును. ఇచట నిత్యవీప్సయోః [8-1-4] అను సూ. చే వీప్సయందు ద్విత్వమగుటచే ద్వితీయ ప్రవర్తించలేదని సమాధానాన్తరము.

548. అన్తరాన్తరేణయుక్తే. 2-3-4 [ద్వితీయా.]

> అభ్యాం యోగే ద్వితీయా స్యాత్। అన్తరా త్వాం మాం హరిః. అన్తరేణ హరిం న సుఖమ్॥

548. అవ్యయములగు అన్తరా అన్తరేణ అనువానితో యోగమున్నపుడు ప్రాతిపదికముకంటె ద్వితీయ వచ్చును. అన్తరాత్వాంమాం హరిః. అన్తరాశబ్దము మధ్యార్థకమగునవ్యయము. నీకు నాకును మధ్యను విష్ణువని యర్థము. అన్తరేణ హరిం నసుఖమ్. అన్తరేణ అనునది వినార్థకమగు నవ్యయము. విష్ణువును విడిచి సుఖము లేదని యర్థము.

వివ :— అన్తరా అను ప్రథమైకవచనాన్తమునకనభిధానమని [ప్రయోగము లేదని] యీసూత్రముయొక్క భాష్యమునజెప్పబడినందున అన్తరా అనుయానుపూర్వీగల నిపాతమునకే గ్రహణమనవలయును. ఇట్టి అన్తరాశబ్దసాహచర్యమువలన అన్తరేణ అనునదియు తృతీయాన్తముగాకనట్టి యానుపూర్వీగల నిపాతమే గ్రహింపబడును. ఈ రీతిగ నవ్యయములను నర్థము ఫలించును. ఇట్లు చెప్పుటకు "కిమనయోరన్తరేణ [విశేషేణ] విజ్ఞానేన" అను ప్రయోగమందు తృతీయాన్తమగు అన్తరేణ అనుదానితో యోగమున్నప్పుడు ద్వితీయానివృత్తి ఫలము.

అన్తరా త్వాం మాం హరిః అనుచోట, ఉపపదవిభక్తేః కారకవిభక్తిర్బలీయసీ [క్రియలోనన్వయించెడి యర్థముగలవిభక్తి కారకవిభక్తియనబడును. ఇట్టివికర్మాది వాచకములకంటె విహితములగు ద్వితీయాదులగును. తద్వ్యతిరిక్తములుపపద విభక్తులు. అనగా నేదైననొకపదముయొక్క యోగమందు విధింపబడుద్వితీయా దులు. ఉపపదవిభక్తికంటె కారకవిభక్తి ప్రబలమైనది] అనుపరిభాషచే హరిశబ్దముకంటె ప్రథమ వచ్చును గానియీసూత్రముచే ద్వితీయ ప్రవర్తించదు.

549. కర్మప్రవచనీయాః. 1-4-83.

ఇత్యధికృత్య।

549. ఈసూత్రము విభాషాకృఞి [1-1-98] అనుసూత్రమువరకునధి కృతమగును.

వివ :— కర్మప్రవచనీయమనుగురుసంజ్ఞను జేయుటవలన నిదియన్వర్థమని తెలియదగును. కర్మ = క్రియాం, ప్రోక్తవన్తః = కర్మప్రవచనీయాఃఅవి. ఇదివరకు క్రియను ద్యోతనచేసినవి అనగానిపుడు క్రియాద్యోతకములుగాక, క్రియానిరూపితవగుసంబన్ధవిశేషమును ద్యోతనజేయునవియనియర్థము. కుతోఽ ధ్యాగచ్ఛతి మొదలగు ప్రయోగములందు అధి మొదలగునవి [అనర్థకములు] సంబన్ధవిశేషద్యోతకములుగాకున్నను అధిపరీఅనర్థకౌ [557] అను సూ. చే సంజ్ఞావిధానసామర్థ్యమువలన కర్మప్రవచనీయసంజ్ఞగలవగును. కర్మప్రవచనీయ సంజ్ఞ గత్యుపసర్గసంజ్ఞలకు బాధకమగును. నిపాతసంజ్ఞతోమాత్రముదీనికిసమా వేశముకల్గును.

550. అనుర్లక్షణే. 1-4-84. అనుః, లక్షణే।

లక్షణేద్యోత్యేఽనురుక్తసంజ్ఞఃస్యాత్। గత్యుపసర్గసంజ్ఞా పవాదః।

550. లక్షణమన లక్ష్యలక్షణభావరూపమగుసంబన్ధము. [లక్ష్యము = జ్ఞానజన్యజ్ఞానవిషయము, లక్షణము = జ్ఞానజనకజ్ఞానవిషయము] ఇట్టిది ద్యోత్య మగునప్పుడు అను అనునది కర్మప్రవచనీయసంజ్ఞగలదగును. ఈసంజ్ఞ గతిసంజ్ఞోప సర్గసంజ్ఞలకుఅపవాదము. గత్యుపసర్గసంజ్ఞాప్రయుక్తమగు కార్యజాతము ప్రవర్తించదనిభావము.

551. కర్మప్రవచనీయయుక్తే ద్వితీయా. 2-3-8. కర్మప్రవచ నీయయుక్తే, ద్వితీయా।

ఏతేన యోగే ద్వితీయా స్యాత్। జపమనుప్రావర్షత్। హేతుభూతజపోపలక్షితం వర్షణమిత్యర్థః। పరాఽపి హేతౌ

వీతి తృతీయాఽనేన బాధ్యతే। లక్షణేత్థంభూతేత్యాదినా సిద్ధే పునః సంజ్ఞావిధానసామర్థ్యాత్।

551. కర్మప్రవచనీయసంజ్ఞగలదానితో యోగముగల ప్రాతిపదికమునకు ద్వితీయ వచ్చును. "జపమను ప్రావర్షత్". ఇచట అను అనుదానిచే లక్షణము [హేతువు] ద్యోత్యమగును. జపాఽభిన్న హేతుజ్ఞానజన్యజ్ఞానవిషయో వర్షణమ్ అని శాబ్దబోధకల్గును. జపజ్ఞానముచే వర్షము జ్ఞానవిషయమగును. జపము వర్షమున హేతువగును. జపము హేతువగుటచే పరమగు హేతౌ (571) అను సూ. చే జపశబ్దముకంటె ప్రాప్తమగు తృతీయావిభక్తి యీ ద్వితీయచే బాధింపబడును. వృక్షమను విద్యోతతే విద్యుత్, మొదలగు ప్రయోగములందు హేతువుకానిచోట [కేవలలక్షణమందు] కర్మప్రవచనీయసంజ్ఞకవకాశము. ధనేనకులమ్ మొదలగు చోటులందు హేతృతృతీయకవకాశము. జపమను ప్రావర్షత్। ఇచట హేతుభూత లక్షణమందు పరమగు తృతీయ రావలసియున్నది. కాని లక్షణేత్థంభూతాఖ్యాన [555] అను సూ. చే జపమను అనుచోట కర్మప్రవచనీయసంజ్ఞ సిద్ధమగుచుండ తిరుగ అనుర్లక్షణే సూ. చే సంజ్ఞాకరణమువలన బోధితమగు ద్వితీయావిభక్తి విధానసామర్థ్యమువలన తృతీయ బాధింపబడునని తెలియదగును. సంజ్ఞావిధాన సామర్థ్యాత్తనుమూలమునకిట్లువ్యాఖ్యానముచేయుటచే, విజాతీయమగు సంజ్ఞచే తృతీయావిభక్తికి బాధచెప్పుట శక్యముగాదను శంక నిరస్తమగును.

552. తృతీయార్థే. 1-4-85. [అనుః.]

అస్మిన్ ద్యోత్యేఽనురుక్తసంజ్ఞః స్యాత్। నదీమన్వ వసితా సేనా। నద్యా సహ సంబద్ధేత్యర్థః। షిఞ్ బన్ధనే క్తః।

552. తృతీయాశబ్దముచే తృతీయకునిమిత్తమగు సహయుక్తేఽప్రధానే [567] అనుసూత్రమునను పాత్తమైన సహశబ్దము లక్ష్యమాణమగును. సహ శబ్దార్థమగు సాహిత్యరూపసంబన్ధము ద్యోత్యమైనపుడు అను అనునది కర్మప్రవచ నీయమగును. నదీమన్వవసితా సేనా. ద్వితీయకు సాహిత్యరూపసంబన్ధమర్థము. సేన నదితో సంబద్ధమైనదని యర్థము. అవసితా అనునది అవపూర్వకషిఞ్ [బన్ధనే] ధాతువుకంటె కర్త్రర్థమందు క్తప్రత్యయాన్తము.

553. హీనే. 1-4-86. [అనుః,]

హీనే ద్యోత్యేఽనుః ప్రాగ్వత్। అను హరిం సురాః। హరేర్హీనా ఇత్యర్థః॥

553. అపకర్షము ద్యోత్యమగునపుడు అను అనునది కర్మప్రవచనీయ మగును. అను హరిం సురాః, [దేవతలు విష్ణువుకంటె తక్కువవారు] శక్తి స్వభా వమువలన సుత్కృష్టవాచకముకంటె ద్వితీయ యగునని తెలియునది.

554. ఉపోఽధికే చ. 1-4-87. ఉపః, అధికే, చ [హీనే.]

అధికే హీనే చ ద్యోత్యే ఉపేత్యవ్యయం ప్రాక్సంజ్ఞం స్యాత్। అధికే సప్తమీ వక్ష్యతే।హీనే। ఉపహరిం సురాః॥

554. చకారముచవలన హీనే అనునదనువృత్తమగును. అధిక్యము న్యూనతయు [ఉత్కర్షాపకర్షములు] ద్యోత్యములగునపుడు ఉప అను అవ్యయము కర్మప్రవచనీయసంజ్ఞకమగును. అధికార్థమున సంజ్ఞావిధానమువలన యస్మాదధికం [618] అనుసూత్రముచే విధింపబోవు సప్తమీవిభక్తి ఫలము.గాని ద్వితీయ గాదు. [ఉపఖార్యాంద్రోణః,] హీనార్థమందుద్వితీయకుదాహరణము. ఉపహరింసురాః. [దేవతలు విష్ణువుకంటె తక్కువవారు.]

555. లక్షణేత్థంభూతాఖ్యానభాగవీప్సాసు ప్రతిపర్యనవః.

1-4-90. లక్షణే..........ప్సాసు, ప్రతిపర్యనవః।

ఏష్వర్థేషు విషయభూతేషు ప్రత్యాదయ ఉక్తసంజ్ఞాః స్యుః। లక్షణే। వృక్షం ప్రతిపర్యనువా విద్యోతతే విద్యుత్। ఇత్థంభూతాఖ్యానే। భక్తో విష్ణుం ప్రతిపర్యనువా। భాగే। లక్ష్మీర్హరింప్రతిపర్యనువా। హరేర్భాగ ఇత్యర్థః। వీప్సాయాం। వృక్షం వృక్షం ప్రతిపర్యనువా సిఞ్చతి। అత్రోపసర్గత్వాఽభావాన్నషత్వమ్। ఏషు కిమ్। పరిషిఞ్చతి॥

555. లక్షణము ఇత్థంభూతాఖ్యానము భాగము వీప్స అనునీ యర్థములు విషయములగునపుడు ప్రతి పరి అను, యీ మూడును కర్మప్రవచనీయములగును. [1] లక్షణమన లక్ష్యలక్షణభావము [జ్ఞాప్యజ్ఞాపకభావము.] అని యీవరలో చెప్పబడెను. [2] ఇత్థంభూతాఖ్యానము [ఇత్థభూతః=కంచిత్ప్రకారంప్రాప్తః, స ఆఖ్యాయతేఽనేన=ఇత్థంభూతాఖ్యానమ్.] రీతివిశేషమును నిరూపించునది. [3] భాగము:—భాగోఽస్యాస్తి అనునర్థమున భాగశబ్దముకంటె అర్శఆదిభ్యోఽచ్ [5-2-127] సూ.చే అచ్ప్రత్యయము చేసిన భాగః అనియే రూపమగును. దీనికి భాగముగలదనియర్థము. భాగస్వామియని ఫలితార్థము. [4] వీప్స:— [వ్యాప్తుమిచ్ఛా.] వ్యాపకతను బోధింపనిచ్ఛ. క్రమముగనుదాహరణములు।—[1]వృక్షం ప్రతిపర్యనువా విద్యోతతే విద్యుత్। వృక్షము లక్షణము, విద్యుద్విద్యోతనము [మెఱుపు మెరయుట] లక్ష్యము। వృక్షజ్ఞానమువలన విద్యుద్విద్యోతనజ్ఞానము గల్గును. ఇచట లక్ష్యలక్షణభావసంబన్ధము ప్రత్యాదిద్యోత్యము. [2] భక్తో విష్ణుం ప్రతిపర్యనువా। విష్ణువునకు భక్తికినిగలవిషయవిషయిభావము ప్రత్యాదిద్యోత్యము. విష్ణువిషయకమగు భక్తిగలవాడని యర్థము। [విష్ణుభక్తుడు.]

[3] లక్ష్మీర్హరిం ప్రతిపర్యనువా। లక్ష్మి విష్ణువుయొక్క భాగము. లక్ష్మీ రూపమగుభాగమునకు హరికినిగల స్వస్వామిభావసంబంధము ప్రత్యాదిద్యోత్యము. ఈ మూడుచోటులందుసంజ్ఞకు కర్మప్రవచనీయయుక్తముకంటె [వృక్షాదులకు] ద్వితీయా ప్రవృత్తి ఫలము. [4] వృక్షంవృక్షంప్రతిపర్యనువాసిఞ్చతి। ఇచట వృక్షశబ్దమునకు నిత్యవీప్సయోః [8-1-4] అను సూ. చే వీప్సయందు ద్విత్వము విధింపబడెను. కాన ద్విర్వచనముచేతనే యిచట వీప్స ద్యోత్యమగును. కావుననే లక్షణాదుల విషయములగునపుడు కర్మప్రవచనీయసంజ్ఞ విధింపబడెను. ఇతరములచే ద్యోత్యములగునవి కర్మప్రవచనీయసంజ్ఞకు నిమిత్తములగును. వృక్షములన్నిటిని తడుపుచున్నాడని యర్థము. వృక్షము సేచనమందు కర్మయగుటచే కర్మణిద్వితీయా [540] సూ. చేతనే ద్వితీయ వచ్చును. అందుచేనిచట కర్మప్రవచనీయ సంజ్ఞకు పసర్గసంజ్ఞాభావమే ఫలము ప్రతిసిఞ్చతి అనుచోట ప్రతి అనునది యుపసర్గము గాకపోవుటవలన "ఉపసర్గాత్సునోతి [8-3-65] అను సూ. చే విధింపబడుషత్వము సిఞ్చతి అనుదానిలోని సకారమునకు నివృత్తమగును. ఈయర్థము "అతోఽనుపసర్గత్వాత్ ఽభావాన్న షత్వమ్" అనువాక్యముచే మూలమున ప్రదర్శింపబడెను. పైనాలుగర్థములందే ప్రత్యాదులకు సంజ్ఞ విధింపబడుటచే పరిషిఞ్చతి అనుచోట పరి అనుదానికి కర్మప్రవచనీయసంజ్ఞ వారింపబడును. పరిషిఞ్చతి అనుచోట పరి అనుదానికి అంతట [సర్వతః] యనియర్థము. ఇది పైయర్థములలో చేరలేదు. పరి అనునది యుపసర్గమగుటచే పైజూపబడిన "ఉపసర్గాత్సునోతి [8-3-65] అను సూ.చే సకారమునకు షత్వమగును.

556. అభిరభాగే. 1-4-91. అభిః, అభాగే [లక్షణే ... ... వీప్సాసు]

భాగవర్జే లక్షణాదావభిరుక్తసంజ్ఞః స్యాత్। హరిమభి వర్తతే। భక్తో హరిమభి। దేవందేవమభిసిఞ్చతి। అభాగే కిమ్। యదత్ర మమాఽభిష్యాత్తద్దీయతామ్॥

556. భాగరూపార్థమును విడిచి మిగిలినయర్థములు [లక్షణము ఇత్థంభూతాఖ్యానము వీప్స] విషయములగునపుడు అభి అనునది కర్మప్రవచనీయమగును. లక్షణమందుదాహరణము:—హరిమభివర్తతే [దేవదత్తః.] ఇచట అభి అనునది వృక్షం ప్రతివిద్యోతతే విద్యుత్ అనుప్రయోగమందు ప్రతిశబ్దమువలె లక్ష్యలక్షణభావసంబంధద్యోతకమగును. ఇత్థంభూతాఖ్యానమందుదాహరణము :— భక్తోహరిమభి. ఇచట భక్తోవిష్ణుంప్రతి అను ప్రయోగమందువలె నిత్థంభూతాఖ్యానమభిద్యోత్యమగును. వీప్సయందుదా:—దేవందేవమభిసిఞ్చతి। ఇచట కర్మప్రవచనీయసంజ్ఞకు వృక్షంవృక్షంప్రతిసిఞ్చతి అనుప్రయోగమునందువలె షత్వనివృత్తియే ఫలము. స్వస్వామిభావద్యోతకమగునపుడు అభి అనుదానికి కర్మప్రవచనీయసంజ్ఞావ్యావృత్తికై సూత్రమున అభాగే అనుపదమావశ్యకము. ఫలముచూపబడుచున్నది:—యదత్రమమాభిష్యాత్తద్దీయతామ్। ఇందు నాకుగలభాగము నాకీయ

బడుగాక అనియర్థము. ఇచట అభి అనుదానికుపసర్గసంజ్ఞయుండుటచే "స్యాత్" అనుచోట సకారమునకు "ఉపసర్గప్రాదుర్భ్యామస్తిర్యచ్పరః. [8-3-87] అను సూ. చే విహితమగు షత్వము వచ్చును. స్యాత్తనుసది సత్తార్థకమగు అస్ధాతువు నకు విధ్యర్థకలిఙ్ ప్రథమైకవచనము.

557. అధిపరీ అనర్థకౌ. 1-4-93. అధిపరీ, అనర్థకౌ।

ఉక్తసంజ్ఞౌ స్తః। కుతో౽ధ్యాగచ్ఛతి। కుతః పర్యాగచ్ఛతి। గతిసంజ్ఞాబాధాద్గతిర్గతావితి నిఘాతో న॥

557. అనర్థకములగు అధి పరి అనునీరెండును కర్మప్రవచనీయము లగును. కుతో౽ధ్యాగచ్ఛతి. కుతఃపర్యాగచ్ఛతి. ఇచటనధి పరులకుగతిసంజ్ఞలేక పోవుటవలన అధ్యాగచ్ఛతి అనుతిఙన్తమునకు "గతిర్గతౌ [8-1-70] అను సూ. చే విధింపబడునసుదాత్తము నివృత్తమగును.

వివ:— అధి పరి అనునవి ధాత్వర్థమాత్రద్యోతకములగుటంజేసి క్రియాయోగముండుటవలన గతిసంజ్ఞగలవగును. వృక్షంప్రతివిద్యోతతే విద్యుత్ ఇత్యాదులందు ప్రతి మొదలగువానివలెనివి క్రియావిశేషద్యోతకములు గాకుండుట వలననర్థకములగుచున్నవని తెలియదగును.

558. సుః పూజాయామ్. 1-4-94. సుః, పూజాయామ్।

సుసిక్తమ్। సుస్తుతమ్। అనుపసర్గత్వాన్నషః। పూజాయాం కిమ్। సుషిక్తం కిం తవాఽత్ర। క్షేపో౽యమ్॥

558. పూజ్యతాద్యోతకమగు సు అనునది కర్మప్రవచనీయమగును. సుసిక్తమ్. సుస్తుతమ్. ఇచట క్రియలందు (సేచనము స్తుతి) గలపూజ్యతను సు అను నది ద్యోతనముజేయును. క్రియాపూజ్యతచే క్రియాకర్తకు పూజ్యత గమ్యమానమ గునపుడేయీసంజ్ఞయగును. ఇచట సు అనునది యుపసర్గముగాకపోవుటవలన ఉపసర్గాత్సునోతి (8-3-65) సూ. చే సిక్త స్తుత శబ్దములలోని సకారమునకు షత్వము ప్రవర్తించదు. సూత్రమున "పూజాయామ్" అనుదానికి ఫలమిది:— సుషిక్తంకింతవాఽత్ర. సేకక్రియాకర్తకు (తదుపువానికి) పూజ్యత గమ్యమానము గాకపోవుటచే కర్మ ప్రవచనీయసంజ్ఞలేనందున పూర్వసూత్రముచే (ఉపసర్గాత్ సునోతి) షత్వము ప్రవర్తించును. ఇది సేకకర్తకు నిన్దను ప్రతిపాదించువాక్యము.

559. అతిరతిక్రమణే చ. 1-4-95. అతిః, అతిక్రమణే, చ (పూజాయామ్.)

అతిక్రమణే పూజాయాం చాఽతిః కర్మప్రవచనీయసంజ్ఞః స్యాత్। అతిదేవాన్ కృష్ణః।

559. అతిక్రమణము (చేయుటకు ఉచితమగు దానికంటె నధికమును జేయుట) పూజ అనునీయర్థములను ద్యోతనజేయు అతి అనునది కర్మప్రవచనీయ మగును. అర్థద్వయమందునొకే యుదాహరణము. అతిదేవాన్కృష్ణః. కృష్ణుడు దేవతలకంటెనధికుడు లేక దేవపూజ్యుడని యర్థము. దేవశబ్దమునకు ద్వితీయవచ్చుట సంజ్ఞాఫలము.

వివ:—అతిసిక్తమ్. అతిస్తుతమ్. అనికొందరుదాహరించిరి. మొదటిది యతిక్రమణమునకుదాహరణము. అధికముగ తడుపబడినదని యర్థము. రెండవది పూజకుదాహరణము. బాగుగస్తుతింపబడినదని యర్థము. ఇచట సంజ్ఞకు, ధాతుసకారమునకు షత్వనివృత్తి ఫలమనిపేరియాశయము.

560. అపిః పదార్థసంభావనాఽన్వవసర్గగర్హాసముచ్చయేషు. 1-4-96. అపిః, పదార్థ........యేషు।

ఏషు ద్యోత్యేష్వపిరుక్తసంజ్ఞః స్యాత్। సర్పిషోఽపి స్యాత్। అనుపసర్గత్వాన్నషః। సంభావనాయాం లిఙ్। తస్యా ఏవవిషయభూతే భవనే కర్తృదౌర్లభ్యప్రయుక్తం దౌర్లభ్యం ద్యోతయన్నపిశబ్దః స్యాదిత్యనేన సంబధ్యతే। సర్పిష ఇతి షష్ఠీ తు అపిశబ్దబలేన గమ్యమానస్య బిన్దోర వయవావయవిభావసంబన్ధే। ఇయమేవ హ్యపిశబ్దస్య పదార్థద్యోతకతా నామ। ద్వితీయా తు నేహ ప్రవర్తతే। సర్పిషో బిన్దునా యోగో న త్వపినేత్యుక్తత్వాత్। అపిస్తుయాద్విష్ణుమ్। సంభావనం శక్త్యుత్కర్షమావిష్కర్తుమత్యుక్తిః। అపి స్తుహి। అన్వవసర్గః కామచారాఽనుజ్ఞా। ధిగ్దేవదత్తమపిస్తుయాద్వృషలమ్। గర్హా। అపిసిఞ్చ। అపిస్తుహి। సముచ్చయే॥

560. 1 పదార్థము 2 సంభావన 3 అన్వవసర్గము 4 గర్హ 5 సముచ్చయము యివి ద్యోత్యములగునపుడు అపి అనునది కర్మప్రవచనీయసంజ్ఞ గలదగును క్రమముగనుదాహరణములు:—(1) సర్పిషోఽపిస్యాత్. ఇచట అపి అనుదానికుపసర్గత్వము లేకుండుటచే స్యాత్తనుచోట సకారమునకు "ఉపసర్గ...." (8-3-87) సూ, చే ప్రాప్తమగు షత్వము నివృత్తమగును. అపి అనునది పదార్థద్యోతకము. పదార్థశబ్దమునకు అప్రయుజ్యమానమగు (ప్రయోగింపబడని) పదాన్తరముయొక్క అర్థమని యర్థము. ఇచట పదార్థమన బిందువు. "స్యాత్తను నది లిఙ్ప్రథమైకవచనము. లిఙర్థము సంభావన. "సంభావనాయాం లిఙ్" అను గ్రన్థమునకు "ఉపసంవాదాశఙ్కయోశ్చ (3-4-8) అనుసూత్రభాష్యమందు పఠింపబడిన "ఉపసంవాదాశఙ్కయోర్లిఙ్" అనువార్తికముచే లిఙని యర్థము. ఆశఙ్కయన సంభావన. (ఉత్ప్రేక్ష.) "తస్యాఏవ ......" ఇత్యాదిగ్రన్థముచే అపి

ద్యోత్యమగు సంబన్ధమును ప్రదర్శించుచున్నాడు:—సంభావనావిషయము ధాత్వర్థ భవనము. (సత్తా.) భవనక్రియాసంభావనయందు భవనము విషయమగునని యాశయము. ఇందుచే భవనక్రియాదౌర్లభ్యమర్థమగును. క్రియా దౌర్లభ్యమెప్పుడును కర్తృదౌర్లభ్యప్రయుక్తమే యగును. కావున కర్తయగు బిందువుయొక్క దౌర్లభ్యమువలన క్రియ దౌర్లభ్యముగలదగును. బిందుదౌర్లభ్యప్రయుక్తమగు దౌర్లభ్యమును ధాత్వర్థమగు భవనమందు ప్రకాశింపచేయు అపిశబ్దము స్యాత్తను దానితోనన్వయించును. అపిద్యోత్యమగు బిందువు కర్తయై దౌర్లభ్యప్రయుక్తసంబన్ధముచే స్యాత్పదవాచ్యమగు క్రియయందన్వయించునని భావము. సర్పిషః అనుచోట షష్ఠి అపిశబ్దబలముచే గమ్యమానమగు బిన్దువునకు (అవయవము) సర్పిస్సునకును (నెయ్యి – అవయవి.) గల యవయవావయవిభావసంబన్ధమున వచ్చినది. నేతిచుక్క (కర్త) దుర్లభమగుటచే బిన్దువుకర్తగాగల సంభావనావిషయమగు సత్త (భవనము) దుర్లభమైనదని, సర్పిషోఽపిస్యాత్తను వాక్యమునకర్థము. (సర్పిరవయవబిన్దుదౌర్లభ్యప్రయుక్తదౌర్లభ్యవతీ తత్కర్తృకాసంభావనావిషయాసత్తా అని శాబ్దబోధము.) అపిశబ్దమునకు పదార్థద్యోతకత్వమన బిన్దుదౌర్లభ్యప్రయుక్తదౌర్లభ్యద్యోతకత్వమే. ఇట్లు కర్మప్రవచనీయద్యోత్యమగునర్థమందు సర్పిస్సునకు సంబన్ధముండుటచే సర్పిఃపదము కర్మప్రవచనీయయుక్తమగును గాన సర్పిశ్శబ్దముకంటె ద్వితీయ యేలరాదను శంకకు సమాధానమును చెప్పుచున్నాడు:—“ద్వితీయాతు.........త్వాత్”. సర్పిశ్శబ్దముకంటె ద్వితీయ రాదు. సర్పిస్సునకు బిందువుతో సంబన్ధముగలదు గాని అపిశబ్దద్యోత్యమగు సంబన్ధముతో (దౌర్లభ్యప్రయుక్తదౌర్లభ్యము) నన్వయములేదు. “కర్మప్రవచనీయయుక్తే ద్వితీయా” అను సూత్రమున, కర్మప్రవచనీయయుక్తత్వమన కర్మప్రవచనీయద్యోత్యమగు సంబన్ధమందు ప్రతియోగి (ఆధేయము) యగుట. ప్రకృతమున అపిద్యోత్యసంబన్ధమునకు బిందువుప్రతియోగి కాని సర్పిస్సు ప్రతియోగికాదు. ఈవిషయము పూర్వగ్రన్థముచేనుక్తప్రాయమే. మూలమున ఉక్తత్వాత్తనుదానికి ఉక్తప్రాయమగుటవలన అనియర్థము.” అపిశబ్దః స్యాదిత్యనేనసంబధ్యతే” అనుగ్రన్థముచేపై విషయమర్థసిద్ధమగునని యాశయము. స్పష్టప్రతిపత్తికొరకుబిన్దుపదప్రయోగము చేసినప్పుడును బిన్దుశబ్దముకంటె “ఉపపదవిభక్తేః” అనున్యాయముచే ప్రథమయే యగునని గ్రహించునది.

(2) అపిస్తుయాద్విష్ణుమ్. ఇచట సంజ్ఞకు షత్వనివృత్తియే ఫలము. స్తుయాత్తనుచోట పూర్వముజూపబడిన “ఉపసంవాదాఽఽశఙ్కయోర్లిఙ్ అను వార్తికముచే సంభావనయందు లిఙ్ వచ్చును. అపిశబ్దము సంభావనాద్యోతకము. అపిద్యోత్యసంభావనయన సామర్థ్యాతిశయమును వెల్లడించుటకైనయధికోక్తి. అసంభావ్యమగు నర్థముయొక్క సంభావన యధికోక్తి యగును. అవాఙ్మనసగోచరుడగు విష్ణువును గూడ స్తోత్రముచేయుటయందు సామర్థ్యముగలవాడనియర్థము. ఇట్టివానికితరులను స్తోత్రముచేయుటయందలి సామర్థ్యము చెప్పవలసినదేమిగలదని ఫలితార్థము.

అపిశబ్దమిచట సంభావనాద్యోతకము. పూర్వోదాహరణమందు సంభావనావిషయ దౌర్లభ్యద్యోతకమునగుటచే రెండిటికి విశేషభేదముగలదనియూహించునది.

(3) అపిస్తుహి। ఉపసర్గాత్ ......... (8-3-65)సూ. చే ప్రాప్తమగు షత్వముయొక్క నివృత్తియే సంజ్ఞకు ఫలము. అపిశబ్దమన్వవసర్గద్యోతకము. అన్వవసర్గమన కామచారానుజ్ఞ. స్తోత్రముచేయుము లేదా మానుము నీకుతోచిన రీతిని చేయుమనియర్థము.

(4) ధిగ్దేవదత్తమపిస్తుయాద్వృషలమ్. ఇచటగూడ షత్వనివృత్తియే సంజ్ఞకు ఫలము. క్రియాగతమగునింద అపిద్యోత్యము. వృషలపదసాన్నిధ్యము వలన స్తుతికర్తకు నింద ఫలితమగును. ఈయర్థము ధిగ్దేవదత్తమనుదానిచేనను వదింపబడెను. వృషలశబ్దమునకు శూద్రుడనియర్థము.

(5) అపిసిఞ్చ, అపిస్తుహి. వీనికి క్రమముగ తడుపుము స్తుతింపుమని యర్థము. ఇచట మిళితమగునపిశబ్దద్వయముచే సముచ్చయముద్యోత్యమగుటవలన నపిశబ్దములకు ప్రత్యేకముగ సంజ్ఞ యుండును. కాన రెండుచోటులందును షత్వాభావమే సంజ్ఞకు ఫలము.

561. కాలాఽధ్వనోరత్యన్తసంయోగే. 2-3-5 కాలాధ్వనోః, అత్యన్త సంయోగే, (ద్వితీయా.)

ఇహ ద్వితీయా స్యాత్। మాసం కల్యాణీ। మాసమధీతే। మాసం గుడధానాః। క్రోశం కుటిలా నదీ। క్రోశమధీతే। క్రోశం గిరిః। అత్యన్తసంయోగే కిమ్। మాసస్య ద్విరధీతే। క్రోశస్యైకదేశే పర్వతః॥

561. అత్యన్తసంయోగమన నిరన్తరసంబన్ధము. (అన్తం విరామమతిక్రాన్తోఽత్యన్తః సచాసౌసంయోగశ్చ=అత్యన్తసంయోగః.) గుణక్రియాద్రవ్యములతోను అభావముతో నట్టిసంబన్ధముండునని యెరుంగునది. గుణాదులతో కాలము అధ్వ (మార్గము) వీనికి నిరన్తరసంబన్ధమున్నపుడు కాలాధ్వవాచకముల కంటె ద్వితీయవచ్చునని సూత్రార్థము. గుణముతో నిరన్తరసంబన్ధమున్నపుడు దాహరణము :— మాసం కల్యాణీ. బుద్ధిస్థములగు యావదవయవములతో (ముప్పదిదినములతో) సంబన్ధరూపమగు వ్యాప్తి ద్వితీయార్థము. మాసముతో వ్యాప్తిగల కల్యాణగుణము గలదని యర్థము. క్రియతో నిరన్తరసంబన్ధమున్నపుడుదాహరణము :— మాసమధీతే. అధ్యయనరూపమగు క్రియ ముప్పదిదినములలో వ్యాప్తిగలదని యర్థము. ద్రవ్యముతో సంబన్ధమున్నపుడుదా :— మాసం గుడధానాః. బెల్లముచే గలసినఅటుకులు మాసముచే వ్యాప్తములైనవని యర్థము. అధ్వవాచకముకంటె ద్వితీయకుదాహరణములు :— (1) క్రోశం కుటిలా నదీ. క్రోశబముతకు క్రోశపరిమితమగు (ఒకక్రోసు) మార్గమర్థము. (2) క్రోశమధీతే

(3) క్రోశం గిరిః. వీనికి పూర్వవాక్యములకువలెనర్థమునూహించునది. అత్యన్త సంయోగే, అనిలేకున్నచో మాసస్యద్విరధీతే. క్రోశస్యైకదేశే పర్వతః అను చోటులందు మాసక్రోశశబ్దములకు ద్వితీయప్రసక్తమగును. నెలకు రెండుమారులు చదువుచున్నాడనియు క్రోసుదూరముగల త్రోవలోగొంతవరకే పర్వతమున్నదనియును, క్రమముగ బై వాక్యములకర్థము. ఇచట కాలమునకధ్యయనక్రియతోను, అధ్వకు పర్వతరూపద్రవ్యముతోను నిరన్తరసంబన్ధములేమింజేసి ద్వితీయ వారితమగును.

ఇది ద్వితీయావిభక్తి.

562. స్వతన్త్రః కర్తా. 1-4-54. స్వతన్త్రః, కర్తా (కారకమ్.)

క్రియాయాం స్వాతన్త్ర్యేణ వివక్షితోఽర్థః కర్తా స్యాత్॥

562. కారకాధికారమువలన "క్రియాయామ్" అనునది లభించును. క్రియయందు స్వతన్త్రముగ వివక్షింపబడునది కారకసంజ్ఞకమై కర్తయనబడును. కర్తృప్రత్యయసమభివ్యాహారమున ప్రధానీభూతధాత్వర్థాశ్రయత్వము స్వాతన్త్ర్యమునాబడును. "దేవదత్తుడు గ్రామమునుగురించి వెళ్లుచున్నాడు.". (దేవదత్తో గ్రామంగచ్ఛతి.) "గచ్ఛతి" అనుచోట తి అనునది కర్త్రర్థకప్రత్యయము. (కర్తృప్రత్యయము.) ఇచట ప్రధానమగు ధాత్వర్థము (గమ్ ధాత్వర్థము.) దేవదత్తునియందుండు వ్యాపారము. (గమనము) దీనికాశ్రయుడు దేవదత్తుడు. కాన నతడు కర్తృసంజ్ఞగలవాడగును. ధాతువునకు వ్యాపారము ఫలమునర్థములు. ఈరెండింటిలో పైజెప్పిన కర్తృప్రత్యయసమభివ్యాహారమున వ్యాపారమే ప్రధానము. గమనరూపక్రియా జననమందు దేవదత్తునికే స్వాతన్త్ర్యము గలదు. స్వతన్త్రముగ వివక్షింపబడునది కర్త యనుటచే పాకక్రియయందు స్థాలియు (గిన్నె) కాష్ఠములను (కట్టెలు) వాస్తవముగ స్వతన్త్రములు గాకున్నను వానికిగూడ కర్తృసంజ్ఞ సిద్ధించును.

563. సాధకతమం కరణమ్. 1-4-42 సాధకతమమ్, కరణమ్।

క్రియాసిద్ధౌ ప్రకృష్టోపకారకం కరణసంజ్ఞం స్యాత్।
తమప్గ్రహణం కిమ్। గఙ్గాయాం ఘోషః॥

563. సాధకశబ్దము సాధయతి = క్రియాంజనయతి (క్రియను పుట్టించునది.) అనునర్థముగలది గావున కారకపర్యాయము. సాధకశబ్దముకంటె నతిశయార్థమందు (ప్రకర్షము) తమప్ప్రత్యయము విధింపబడెను. దేనియొక్క వ్యాపారము ప్రవృత్తమైనవెంటనే కార్యముత్పన్నమగునో యయ్యది ప్రకృష్టమగును. కారకాధికారమువలన క్రియాసిద్ధౌ అనునది లభించును. క్రియానిష్పత్తియందితరకారకములకంటె (సంప్రదానము, అపాదానము మొదలగునవి యితరములు.) ప్రకృష్టముగ వివక్షింపబడునది కారకమై కరణసంజ్ఞకమగునని సూత్రార్థము. తమప్గ్రహ

ణంకిమ్. సాధకపర్యాయమగు కారకపదమధికృతమగుటవలనను (కారకాధికారము వలన) కరణమనుమహాసంజ్ఞచేతను (క్రియతేఽనేన = కరణమ్. కృ + ల్యుట్ అనాదేశము.) సాధకపదము లేకున్నను సాధకత్వము (ఉపకారకత్వము) లబ్ధమగుచుండ తిరుగ సూత్రమున గ్రహింపబడిన సాధకపదమే సాధకతమార్థకమగును. (తమప్ప్రత్యయార్థమగు ప్రకర్షము సిద్ధమగును.) ఇట్లు తమప్గ్రహణము లేకున్ననుతదర్థమగు ప్రకర్షము సిద్ధమగుటచే తమబ్గ్రహణమునకేమి ఫలమని ప్రశ్నాశయము.

గఙ్గాయాం ఘోషః. ఆధారోఽధికరణమ్ (635) అనుసూత్రమున అధికరణల్యుట్ప్రత్యయాన్తమగు అధికరణమను మహాసంజ్ఞచేతనే (అధిక్రియతేఽస్మిన్ = అధికరణమ్। అధికృ + ల్యుట్ – అనాదేశము.) ఆధారమనునర్థము లబ్ధమగుచుండ నధికమగు నాధారపదగ్రహణసామర్థ్యమువలన ముఖ్యాధారమునకు (సర్వావయవములు కర్తృకర్మలకాధారమగునపుడే) అధికరణసంజ్ఞ యగునను నర్థము గల్గును. అట్లయిన నాసూత్రము తిలేషుతైలమ్ మొదలగు చోటులందుముఖ్యాధారమునకే అధికరణసంజ్ఞను విధించును. తైలమునకు తిలలయొక్కయవయవములన్నియునాధారమేయగును. గఙ్గాయంఘోషః మొదలగు స్థలములందు (గౌణాధారమునకు) గఙ్గాదులకు అధికరణసంజ్ఞ రాకపోవును. సప్తమియసాధువగును. గఙ్గాశబ్దమునకు లక్ష్యార్థము గాంగాతీరము. ఘోషము (పల్లె) తీరముయొక్క యేకదేశమునున్నది గానితీరమంతటనులేదు. కావున నీతమప్గ్రహణము కారకప్రకరణమందు శబ్దసామర్థ్యమువలన గమ్యమానమగు ప్రకర్షమాశ్రయింపబడదనుటలో జ్ఞాపకమగును. ఇట్టిజ్ఞాపకమువలన ఆధారోధికరణమ్(635)అనుసూత్రమునపూర్వోక్తరీతిని శబ్దసామర్థ్యమువలనగమ్యమానమగు ప్రకర్షమాశ్రయింపబడనందున నా సూత్రముచే ముఖ్యాధారమునకువలె గౌణాధారమునకునధికరణసంజ్ఞ సిద్ధమగును. ప్రకృతసూత్రమున తమప్గ్రహణము లేనియెడల కారకమాత్రమునకు (క్రియాజననమందుపకారకమాత్రమునకు) కరణసంజ్ఞ ప్రసక్తమగును. తద్వారణార్థము తమప్గ్రహణమావశ్యకమని సమాధానాశయము.

వివ :— కర్తృకరణాదికారకములు వివక్షాఽధీనములు. (వక్తయొక్కయిచ్ఛకధీనములు) వ్యాపారాశ్రయములుగ వివక్షితములగునపుడు స్థాల్యాదులకు కర్తృసంజ్ఞ వచ్చును. (స్థాలీఓదనంపచతి। కాష్ఠానిఓదనంపచన్తి.) ఇట్లేక్రియాజననమందు ప్రకృష్టోపకారకముగ వివక్షింపబడునది కరణసంజ్ఞకమగును. కావున స్థాల్యాదులు కరణములు నగును. (స్థాల్యాఓదనంపచతిదేవదత్తః,) అనగా కర్తయెల్లప్పుడు కర్తయే గాదు. కరణమెల్లపుడు కరణమేగాదని భావము. ఇట్లేయితరకారకములునవిగ్రహించునది. ఒకపుడు కర్తయగునది మరియొకపుడు కరణమగును. ఒకపుడు కరణమగునది మరియొకపుడు కర్తయగును. కారకములు వస్తువిశేషములందు స్థిరములైనవి గావన్నితెలియునది.

564. కర్తృకరణయోస్తృతీయా. 2-3-18. కర్తృకరణయోః, తృతీయా (అనభిహితే)

అనభిహితే కర్తరి కరణే చ తృతీయా స్యాత్। రామేణ బాణేన హతో వాలీ। (వా) ప్రకృత్యాదిభ్య ఉపసంఖ్యానమ్। ప్రకృత్యా చారుః। ప్రాయేణ యాజ్ఞికః। గోత్రేణ గార్గ్యః। సమేనైతి। విషమేణైతి। ద్విద్రోణేన ధాన్యం క్రీణాతి। సుఖేన దుఃఖేన వా యాతీత్యాది॥

564. తిఙాదులచేననుక్తమగు కర్తనుగాని, కరణమును గాని బోధించెడి ప్రాతిపదికము (కర్తృవాచకము, కరణవాచకము) కంటె తృతీయావిభక్తి వచ్చును. రామేణ బాణేన హతో వాలీ. వాలిని చంపుటలో రాముడు కర్తగను (ప్రాణవియోగానుకూలవ్యాపారాశ్రయుము) బాణము కరణముగను (ప్రకృష్టోపకారకము) వివక్షింపబడుటచే రామబాణశబ్దములకంటె తృతీయవచ్చెను. వాక్యమువలన గల్గెడి బోధప్రకారమిది :— రామనిష్ఠో యో వ్యాపారః ధనురాకర్షణాదిః, తద్విషయీభూతో యో బాణవ్యాపారః శరీరభేదనాదిః, తత్సాధ్యప్రాణవియోగాశ్రయో వాలీ, అని.

(వా) ప్రకృతి ప్రాయ గోత్ర మొదలగు శబ్దములకంటె తృతీయ వచ్చునని చెప్పవలయును. ఇతరవిభక్తులకన్నిటికియథాయోగముగ నీతృతీయ యపవాదము. (1) "ప్రకృత్యా చారుః". (ప్రకృతిసంబన్ధీ చారుః) (స్వభావముచేతనే సుందరుడై చేయబడినవాడు) ఇచట క్రియాపదశ్రవణము లేకపోవుటచే ప్రకృతి కర్తగాని కరణముగాని గానందున ప్రకృతి శబ్దముకంటె షష్ఠి ప్రాప్తమగుచున్నది. (2) "ప్రాయేణ యాజ్ఞికః". (ఆచారబాహుళ్యముచే యాజ్ఞికుడు) పూర్వోదాహరణమందువలె నిచటను షష్ఠిప్రాప్తమగుచున్నది. (3) గోత్రేణ గార్గ్యః. (ఇతనికి గార్గ్యుడు గోత్రము.) ఇచట గోత్రశబ్దముకంటె ప్రథమావిభక్తి ప్రాప్తమగుచున్నది. (4) సమేనైతి. (సమమార్గమునొందుచున్నాడు.) సమమార్గము ఇణ్ధాత్వర్థఫలాశ్రయమగుటచే కర్మయైనందునసమశబ్దముకంటెద్వితీయ ప్రాప్తమగుచున్నది. (5) విషమేణైతి. (విషమమార్గమునొందుచున్నాడు.) పూర్వోదాహరణమందువలె ద్వితీయ ప్రాప్తమగుచున్నది. (6) ద్విద్రోణేన ధాన్యం క్రీణాతి (ద్విద్రోణశబ్దము సమాహారద్వన్ద్వము. ద్రోణద్వయ (రెండు కుంచములు) సంబన్ధియగు ధాన్యమునుగొనుచున్నాడు.) ద్విద్రోణశబ్దముకంటె షష్ఠి ప్రాప్తమగుచున్నది. (7-8). సుఖేన దుఃఖేన వా యాతి. (సుఖసంబన్ధిగాని, దుఃఖసంబన్ధిగాని యగు యానముగలవాడు) ఇచటను షష్ఠి ప్రాప్తమగుచున్నది.

వివ:— ప్రకృత్యాదులాకృతిగణము. కావున నామ్నా సుతీక్ష్ణశ్చరితేన దాన్తః ఇత్యాదులందు నామ మొదలగు శబ్దములకు తృతీయ సిద్ధించును. ప్రకృత్యాదులు గమ్యమానక్రియలో కరణములగుటచే వీనికంటె కర్తృకరణయోః (564) సూ. చేతనే తృతీయ సిద్ధమగును. (1) ప్రకృత్యా చారుః, ఇచట కృతః అనునది

గమ్యమానము. స్వభావముచే సుందరుడై చేయబడెను. (2) ప్రాయేణ యాజ్ఞికః. ఇచట జ్ఞానక్రియగమ్యమానము. ఆచారబాహుళ్యముచే యాజ్ఞికుడని జనులచే తెలియబడుచున్నాడు. (3) గోత్రేణ గార్గ్యః. ఇచటను జ్ఞానక్రియ గమ్యమానము. గోత్రముచే గార్గ్యుడని నేనుతెలిసికొనుచున్నాను. ఇట్లీవార్త్తికమునుకొందరు ప్రత్యాఖ్యానముచేసిరి.

565. దివః కర్మ చ. 1-4-43. దివః, కర్మ, చ (సాధకతమమ్, కరణమ్.)

దివః సాధకతమం కారకం కర్మ సంజ్ఞం స్యాత్, చాత్కరణసంజ్ఞమ్। అక్షై రక్షాన్వా దీవ్యతి॥

565. దివు [క్రీడాయామ్] అనుధాతువుయొక్కయర్థమగు క్రియలో సాధకతమమగునది [ప్రకృష్టోపకారకము] కారకమై కర్మసంజ్ఞకము కరణసంజ్ఞకము నగును. అక్షై రక్షాన్వాదీవ్యతి. అక్షములు [పాచికలు] దేవనమందు [క్రీడయందు] సాధకతమములగుటచే కరణము, కర్మయునగును. అక్షశబ్దముకంటె ద్వితీయతృతీయలు వచ్చినవి.

వివ :-కరణశబ్దానువృత్తి చేగాని "పరిక్రయణే సంప్రదానమన్యతరస్యామ్" [583] అనునుత్తరసూత్రమునుండి అన్యతరస్యామనుదానినపకర్షముచేయుటచే గాని కర్మకరణసంజ్ఞలకు పరాయత్వము సిద్ధింపుచుండ సూత్రములోని చకారము కర్మకరణసంజ్ఞలకొకచోట సమావేశమును బోధించును. కావున మనసాదేవః అను చోట మనస్సు కర్మయగుటచే కర్మణ్యణ్ (3-2-1) అనుసూత్రమువలన దివ్ ధాతువుకంటె నణ్ ప్రత్యయమగును కరణమగుటచే మనశ్శబ్దముకంటెతృతీయయు వచ్చును. మనసాదేవః అనునది తృతీయాతత్పురుషము మనసస్సంజ్ఞాయామ్ (966) అను సూ. చే తృతీయకు లుగభావము వచ్చెను.

566. అపవర్గే తృతీయా. 2-3-6 అపవర్గే, తృతీయా (కాలాధ్వనోరత్యన్తసంయోగే.)

అపవర్గః ఫలప్రాప్తిస్తస్యాం ద్యోత్యాయాం కాలాధ్వనోరత్యన్తసంయోగే తృతీయా స్యాత్। అహ్నా క్రోశేన వాఽనువాకోఽధీతః। అపవర్గే కిమ్। మాసమధీతో నాఽయాతః॥

566. అపవర్గమన ఫలప్రాప్తి. (ఫలమునొందుట) ఇది ద్యోత్యమగుచుండ గుణాదులతోనత్యన్తసంయోగమందు కాలాధ్వవాచకములకుతృతీయవచ్చును. ఇది ద్వితీయావిభక్తికి బాధకము. అహ్నా క్రోశేన వాఽను వాకోఽధీతః. వేదములోని కొంతభాగమునకనువాకమని వ్యవహారము. పగలంతయనువాకము చదువ

బడెను. ఆయనువాకము జాగుగనధ్యేతకు స్వాధీనమయ్యెననునర్థమిచట వ్యఙ్గ్యము. క్రోశపరిమితమార్గమందంతటననువాకము చదువబడెను అదియధ్యేతకు స్వాధీనమయ్యెననునర్థమిచట వ్యఙ్గ్యము. అపవర్గే అనునది లేనిచో మాసమధీతో నాయాతః, అనుచోట మాసశబ్దమునకు తృతీయ ప్రసక్తమగును. మాసమునవాకదివసమైనను విడువకయనువాకము చదువబడెను గాని యది యధ్యేతకు స్వాధీనముగానందున ఫలప్రాప్తిలేదు. ఫలాఽప్రాప్తి, నాఽయాతః అనువాక్యశేషముచే స్ఫుటముగ జెప్పబడెను.

567. సహయుక్తేఽప్రధానే. 2-3-19 సహయుక్తే, అప్రధానే (తృతీయా.)

సహాఽర్థేన యుక్తే అప్రధానే తృతీయాస్యాత్ । పుత్రేణ సహాగతః పితా। ఏవం సాకంసార్ధంసమంయోగేఽపి। వినాపి తద్యోగం తృతీయా। వృద్ధోయూనేత్యాదినిర్దేశాత్ ॥

567. పృథగ్వినానానాభిః (606) అనుసూత్రమందు యుక్తగ్రహణములేకున్నను పృథగాదులతోయుక్తమగునపుడని యర్థమగుచున్నది. అట్లీసూత్రమందును యుక్తగ్రహణములేకున్నను (సహేనాఽప్రధానే) సహశబ్దముతోగూడునపుడను నర్థము సిద్ధమగును కాన సూత్రమున నతిరిక్తమైన యుక్తగ్రహణము శబ్దవిశేషములతో బనిలేదనియు సహార్థముతో యోగమున్నపుడు తృతీయవచ్చుననియును బోధించును. ఇట్లు సిద్ధమైనదే వృత్తిలోని సహార్థేన యుక్తే అనునర్థము. సహార్థముతో (సాహిత్యముతో) యోగమున్నపుడ ప్రధానవాచకమునకంటె తృతీయవచ్చునని సూత్రార్థము. పుత్రేణ సహాగతః పితా. (పుత్రునితో గలసి తండ్రి వచ్చెను.) గుణక్రియాద్రవ్యములందన్వయము లేకపోవుట యిచటనప్రాధాన్యము. ఆగమనక్రియయందు పితకు (తండ్రికి) సంబన్ధము (శాబ్దము) గాని పుత్రునికి లేనందున పుత్రుడప్రధానము, పుత్రునికి ఆగమనక్రియయందన్వయమర్థసిద్ధమగును. సహార్థముతో యోగమున్నపుడు తృతీయ వచ్చుననుటచే సహార్థబోధకములగు సహ సాకం సార్థం సమం అనువీనితో యోగమున్నపుడును తృతీయ వచ్చును. (పుత్రేణసాకం సార్థంపితా) శబ్దవిశేషములతో (సహాదులతో) బనిలేకుండ సహార్థముతోయోగమున్నపుడనుటచే సహార్థముతో (సాహిత్యము) యోగముండి సహాదిశబ్దములులేకున్నను తృతీయ వచ్చును. ఈ యర్థమీరీతిని న్యాయసిద్ధము. ఇందుమానమునుగూడ జూపుచున్నాడు:—వృద్ధో......నిర్దేశాత్. "వృద్ధోయూనాతల్లక్షణశ్చేదేవవిశేషః" (936) అనుసూత్రమున యూనా అనుదానికి యూనాసహ అని యర్థము. సహాదిశబ్దములయోగములేకున్నను యూనా అనుతృతీయాన్తమును పాణిని ప్రయోగించుటచేనిది పైజెప్పిన యర్థమున జ్ఞాపకమగును.

వివ:—స్వసమభివ్యాహృతములగు గుణము క్రియ ద్రవ్యమువీనితో సమకాలికములగు గుణాదులను గల్గియుండుట సాహిత్యమునాబడు. పుత్రేణ సహాగతః పితా. ఇచట స్వసమభివ్యాహృతమగు క్రియ యాగమనము. దీనితో సమకాలికమగు నాగమనమును పుత్రుడు గల్గియుండుట సాహిత్యమగును. పుత్రేణసహాగతః అనుచోట నాగమనమందు పుత్రుడు కర్తయగుటచే పుత్రశబ్దముకంటె "కర్తృకరణయో స్తృతీయా" (564) సూ. చేతనే తృతీయ సిద్ధమగును గాని పుత్రేణసహస్థూలః ఇత్యాదులందు క్రియావాచకశబ్దములేనందున నిట్టిచోటులందు తృతీయకొఱకీసూత్ర మావశ్యకమని యెఱుంగునది.

568. యేనాఙ్గవికారః. 2-3-20. యేన, అఙ్గవికారః (తృతీయా.)

యేనాఙ్గేన వికృతేనాఙ్గినో వికారో లక్ష్యతే తతస్తృతీయా స్యాత్। అక్ష్ణా కాణః। అక్షిసంబన్ధికాణత్వవిశిష్ట ఇత్యర్థః।
అఙ్గవికారః కిమ్। అక్షి కాణమస్య॥

568. సూత్రమున అఙ్గశబ్దమర్శఆద్యజన్తము. (అఙ్గమస్యాస్తి.) కావున నఙ్గము (అవయవము) గలదని యర్థము. (అవయవి) అఙ్గశబ్దమిట్లవయవిబోధకమగుటచే దీనిసాన్నిధ్యమువలన యచ్ఛబ్దమఙ్గమును (అవయవమును) బోధించును. అవికృతమగు [వికారమునుపొందని] నవయవమువలననవయవికి [శరీరమునకు] వికారము సంభవింపదు గాన యచ్ఛబ్దార్థమగునవయవము వికృతమైనదే గావలయును. వికారముగల యేయవయవముచే శరీరమునకు వికారము తెలియబడునో అట్టి యవయవవాచకముకంటె తృతీయయగునని సూత్రార్థముఫలితమగును. అక్ష్ణా కాణః. అక్షిసంబన్ధముగల కాణత్వము [గ్రుడ్డితనము] గలవాడు. కంటియందుగల గ్రుడ్డితనమును [అవయవధర్మమును] సముదాయమందు [అవయవియందు] ఆరోపముచేనిట్టి ప్రయోగము చేయబడెను. ఈతృతీయ షష్ఠికపవాదము. అఙ్గవికారః కిమ్ ? సూత్రముననఙ్గగ్రహణమునకేమి ప్రయోజనమని ప్రశ్నాశయము. అక్షి కాణమస్య. [వీనియొక్క కన్ను గ్రుడ్డిది.] ఇచటనవయవికివికారముగాక యవయవమునకు వికారములక్ష్యమాణమగుచున్నది. అఙ్గగ్రహణములేనిచో నక్షిశబ్దముకంటె ప్రథమను బాధించి తృతీయ ప్రసక్తమగునని సమాధానాశయము.

వివ :— దర్శనసామర్థ్యమించుకైనను లేకపోవుటయే కాణశబ్దార్థము. కాణశబ్దమక్షిగతమగు వికారమునే బోధించునదగుటచే అక్ష్ణా అనునది పునరుక్తమగును గాని "ద్వౌవిప్రౌ" అనుచోట ద్వౌ అనుదానికివలె దీనికిని సాధుత్వమిష్టము।

569. ఇత్థంభూతలక్షణే. 2-3-21. [తృతీయా.]

కంచిత్ప్రకారం ప్రాప్తస్య లక్షణే తృతీయా స్యాత్।
జటాభిస్తాపసః। జటాజ్ఞాప్యతాపసత్వవిశిష్ట ఇత్యర్థః॥

569. ఇత్థం అనుశబ్దము ప్రకారమాత్రబోధకము. దీనికి భూతశబ్దముతో సమాసము. లక్షణశబ్దము కరణల్యుడన్తము. [లక్ష్యతేఽనేన.] దీనితోకర్మషష్ఠ్యన్తమగునిత్థంభూతశబ్దమునకు సమాసము. [ఇత్థంభూతస్యలక్షణమ్.] ఒకానొక ధర్మమునొందినవాడు దేనిచే జ్ఞాప్యుడగునో యద్దానిని బోధించుప్రాతిపదికముకంటె తృతీయ వచ్చునని సూత్రార్థము. జటాభిస్తాపసః. జటలచే జ్ఞాప్యమగు తాపసత్వము గలవాడని యర్థము. తాపసత్వమనుధర్మమునొందినవాడు జటచే జ్ఞాప్యుడగుటచే జటాశబ్దమునకు తృతీయ వచ్చెను. సూత్రమున లక్షణశబ్దము లక్ష్యలక్షణభావమును బోధించును. లక్షణము: జటలు. తాపసత్వము లక్ష్యము.

వివ:—జటాభిస్తాపసో జ్ఞాతః అనుచోట జ్ఞానక్రియయందు జటలు కరణమగుటచే "కర్తృకరణయోః" [564] సూ. చేతనే తృతీయ సిద్ధమగును గాని జటలు కరణములనువివక్షలేక లక్ష్యలక్షణభావముమాత్రము వివక్షింపబడునపుడును తృతీయ సిద్ధించుటకొఱకీసూత్రమని తెలియనగును.

570. సంజ్ఞోఽన్యతరస్యాం కర్మణి. 2-3-22. సంజ్ఞః, అన్యతరస్యామ్, కర్మణి [తృతీయా.]

సంపూర్వస్య జానాతేః కర్మణి తృతీయా వా స్యాత్। పిత్రా పితరం వా సంజానీతే॥

570. సమ్ అనునుపసర్గముపూర్వమందుగల జ్ఞా [అవబోధనే క్ర్యాది గణము.] ధాతువుయొక్క కర్మను [ధాత్వర్థఫలాశ్రయమును] బోధించుప్రాతిపదికమునకు తృతీయ వికల్పముగనగును. పిత్రా పితరం వా సంజానీతే. తృతీయాఽభావపక్షమున కర్మణిద్వితీయా [540] సూ. చే ద్వితీయ వచ్చును.

571. హేతౌ. 2-3-23. [తృతీయా.]

హేత్వర్థే తృతీయా స్యాత్। ద్రవ్యాదిసాధారణం నిర్వ్యాపారసాధారణం చ హేతుత్వమ్। కరణత్వం తు క్రియామాత్రవిషయం వ్యాపారనియతం చ। దణ్డేన ఘటః। పుణ్యేన దృష్టో హరిః। ఫలమపీహ హేతుః। అధ్యయనేన వసతి। గమ్యమానాఽపి క్రియా కారకవిభక్తౌ ప్రయోజికా। అలం శ్రమేణ। శ్రమేణ సాధ్యం నాస్తీత్యర్థః। ఇహ సాధనక్రియాం ప్రతి శ్రమః కరణమ్। శతేన శతేన వత్సాన్పాయయతి పయః। శతేన పరిచ్ఛిద్యేత్యర్థః। [వా] అశిష్టవ్యవహారే దాణః ప్రయోగే చతుర్థ్యర్థే తృతీయా। దాస్యా సంయచ్ఛతే కాముకః। ధర్మ్యే తు భార్యాయై సంయచ్ఛతి॥

571. ఇచట హేతువనలోకసిద్ధమగు కారణముగాని శాస్త్రీయముగాదు. కారణవాచకముకంటె తృతీయ యగును. లౌకికహేతువుగూడ కరణమగును గాన

నీసూత్రము కరణతృతీయచే గతార్థమగుననుశంకను నివర్తింపజేయుటకై హేతుకరణములకు భేదమును జూపుచున్నాడు :— "ద్రవ్యాది....... నియతంచ". ద్రవ్యాది అనుచోటనాదిశబ్దముచే గుణక్రియలకు గ్రహణము. ద్రవ్యగుణక్రియలకు మూడింటికి జనకము హేతువనబడును. క్రియాజనకమే కరణమనబడును. వైషమ్యాన్తరము జూపబడుచున్నది :— వ్యాపారముగలదియు వ్యాపారముగలదిగానిదియుఁగూడ హేతువగును. వ్యాపారముగలదే కరణమగును. కాన నిట్లు హేతుకరణలకు భేదముండుటవలన నొకదానిచే మరియొకటి గతార్థముగాదని గ్రహించునది. ఈసూత్రముచే వచ్చెడితృతీయకు హేతుహేతుమద్భావమర్థము. దణ్డేనఘటః. ద్రవ్యజనకము హేతువనుటకిది యుదాహరణము. దణ్డము హేతువు. ఘటము [ద్రవ్యము] హేతుమత్తు. అనగా ఘటజనకముదండము. [దణ్డహేతుకోఘటః.] ఇచట దండము వ్యాపారము [చక్రభ్రమణమునుగలుగజేయునది] గలదైనను క్రియాన్వయము లేనిదగుటచే కరణము గాదు. పుణ్యేన దృష్టో హరిః. క్రియాజనకము హేతువనుటకిది యుదాహరణము. పుణ్యము [స్వర్గహేతువగు యాగాదిజన్యధర్మవిశేషము] హేతువు. హరికర్మకదర్శనము [క్రియ] హేతుమత్తు. [పుణ్యహేతుకంహరికర్మకదర్శనమ్। అనిబోధగలుగును. [హరినిజూచుటయందు పుణ్యము గారణము] దర్శనరూపయాన్వయముగలదైనను పుణ్యము వ్యాపారము గలది గానందున కరణముగాదు.

"ఫలమపీహహేతుః" ఏతత్సూత్రోదాహరణము విషయమై ఫలముగూడ హేతువుగ వివక్షింపబడును. అధ్యయనేన వసతి. [అధ్యయనముకొఱకునివసించుచున్నాడు.] నివాసమునకధ్యయనము ఫలము. అలం శ్రమేణ మొదలగు చోటులందు క్రియావాచకపదము లేనందున క్రియాప్రతీతిలేదు గానశ్రమాదులు కరణములెట్లగుననిశంకించి యుపాయమును [అట్టిచోటులందుకరణత్వముసిద్ధించుటకు]జూపుచున్నాడు:— "గమ్యమానా ఽపి......ప్రయోజికా". గమ్యమానమన ప్రతీయమానము. [శ్రమేణ మొదలగు పదములవలన గల్గుబోధయందు విషయమైనది] అపి శబ్దముచే శ్రూయమాణముగూడ గ్రహింపబడును. ఈరెండువిధములగుక్రియలు కారకవిభక్తికి కారణములని యర్థము. అలంశ్రమేణ. [శ్రమేణ సాధ్యం నాస్తి= శ్రమచేసాధించదగినదిలేదు.] అలం శబ్దము నిషేధార్థకము. శ్రమపదమువలన శ్రమేణసాధ్యం అనుబోధగల్గును. శ్రమపదార్థమగు సాధనక్రియయందు శ్రమ కరణమగునని భావము. ఉదాహరణాన్తరము:—"శతేన శతేన వత్సాన్ పాయయతి పయః".[లేగలను నూఱుచే విభజించి నీరును ద్రావించుచున్నాడు.]ఇచట ప్రతీయమానమగు పరిచ్ఛేదనక్రియలో శతము కరణము. [వా] "అశిష్ట......... తృతీయా". అశిష్టులన సంకీర్ణాచారములు [అధర్మఫలకములు] గలవారు. వీరియొక్క వ్యవహారమున క్రియ. అశిష్టులక్రియను [దానమును] బోధించుదాణ్ [దానే] ధాతువుయొక్క ప్రయోగమందు చతుర్థీవిభక్త్యర్థమున తృతీయ వచ్చును. ప్రత్యాసత్తి [సాన్నిధ్యము] చేవెవనిసంబన్ధమువలవ వ్యవహారము సంకీర్ణాచార

మగునో అట్టివానిని బోధించు ప్రాతిపదికముకంటె తృతీయయగునని గ్రహించునది. దాస్యా సంయచ్ఛతే కాముకః. [రతిఫలకము దాసినిద్దేశించి చేయబడిన దానము.) కాముకుడు దాసికొఱకు దానమును చేయుచున్నాడని యర్థము. సంయచ్ఛతే అనునది దాణ్ ధాతువునకు లట్ప్రథమైకవచనము. దాసీసంబద్ధమువలన దానము సంకీర్ణాచారమగుటచే దాసీశబ్దమునకు తృతీయ వచ్చెను. "భార్యాయైసంయచ్ఛతి". [భార్యకొఱకుపభోగార్థము దానము చేయుచున్నాడు.] భార్యకొఱకగు దానము సంకీర్ణాచారము [అధర్మము] గానందున భార్యాశబ్దమునకు తృతీయావిభక్తిరాదు.

ఇది తృతీయావిభక్తి.

572. కర్మణా యమభిప్రైతి స సంప్రదానమ్. 1-4-32.
కర్మణా. యమ్, అభిప్రైతి, సః. సంప్రదానమ్।
దానస్య కర్మణా యమభిప్రైతి స సంప్రదానసంజ్ఞః స్యాత్ ॥

572. వృత్తిలోని దానస్య అనుదానికి దాణ్ధాత్వర్థమునకని యర్థము. ఇది క్రియామాత్రమునకుపలక్షణము. "సంబన్ధమ్" అనుపదమునకధ్యాహారము. ఏక్రియయందైనను కర్మయగుదానితో [ధాత్వర్థఫలాశ్రయముతో] సంబన్ధమును గలుగజేయుటకు దేనినిచ్ఛయించునో యది [ఉద్దేశ్యము]సంప్రదానసంజ్ఞకమగును. కర్మతో సంబన్ధము స్వత్వము మొదలగునది.

వివ:—దానస్య అనునది క్రియామాత్రమునకుపలక్షణమనుటచే విప్రాయ గాం దదాతి మొదలగుచోటులందు విప్రాదులకే గాక పుత్రాయపత్రం ప్రేషయతి ఇత్యాదులందు పుత్రాదులకును సంప్రదానసంజ్ఞ సిద్ధమగునని భాష్యమతము. ఈ సూత్రమునకు కాశికావృత్తి కారుడిట్లువ్యాఖ్యానముచేసెను:— సంప్రదానసంజ్ఞ యన్వర్థము. [మహాసంజ్ఞ. సంప్రదీయతేఽస్మై] అన్వర్థసంజ్ఞవలననే మూలమున దానస్య అనునది సిద్ధమయ్యెను. దాణ్ధాత్వర్థము [దానము] యొక్క కర్మతో సంబన్ధముకలుగజేయనుద్దేశింపబడుదానికే సంప్రదానసంజ్ఞయని యర్థము. ఒకవస్తువుయందు తనకుగల హక్కును విడుచుకొనుచునావస్తువునందితరునికి హక్కును గలుగజేయుట దానమనబడును. విప్రాయ గాం దదాతి మొదలగునవి యుదాహరణములు. గ్రామమజాం నయతి ఇత్యాదులందు దాణ్ధాతుప్రయోగము లేనందున గ్రామాదులకు సంప్రదానసంజ్ఞలేదు. రజకస్య వస్త్రం దదాతి [చాకలివానికి శుభ్రముచేయుటకొఱకు బట్టనిచ్చుచున్నాడు.] ఇత్యాదులందు దాణ్ధాత్వర్థమధీనముజేయుటగాని దానముగానందున రజకునికి సంప్రదానసంజ్ఞ రాదని. ఇచట మూలము కాశికాకారునిమతమునననుసరించి వ్రాయబడెనని గ్రహించునది.

573. చతుర్థీ సంప్రదానే. 2-3-13. చతుర్థీ, సంప్రదానే [అనభిహితే].

విప్రాయ గాందదాతి। అనభిహితఇత్యేవ। దానీయో విప్రః. [వా] క్రియయా యమభిప్రైతి సోఽపి సంప్రదానమ్। పత్యే శేతే. [వా] యజేః కర్మణః కరణసంజ్ఞా సంప్రదానస్య చ కర్మసంజ్ఞా। పశునా రుద్రం యజతే పశుం రుద్రాయ దదాతీత్యర్థః॥

573. తిజామిలచేనుక్తముగానట్టి సంప్రదానమును బోధించు ప్రాతిపదికము కంటె చతుర్థీవిభక్తి వచ్చును. విప్రాయ గాం దదాతి. దాధాత్వర్థము యొక్క కర్మ గోవు. దీనితో సంబన్ధము [స్వస్వామిభావము] గలుగజేయుటకిచ్ఛయింపబడువాడు విప్రుడు గాన విప్రుడు సంప్రదానమగును. అందుచే విప్రశబ్దమునకు చతుర్థి వచ్చెను. బ్రాహ్మణునుద్దేశించి గోవును [తనకుగలహక్కును విడుచుకొని]యిచ్చు చున్నాడని యర్థము. అనభిహితే అనునదధికృతమగుటచే "దానీయోవిప్రః" అనుచోట విప్రశబ్దమునకు చతుర్థిరాదు. దాఞ్ధాతువుకంటె తవ్యత్తవ్యానీయరః [3-1-96] అను సూ. చే సంప్రదానార్థమందుఅనీయర్ [ర్] ప్రత్యయముజేసిన దానీయః అనురూపమగును. అనీయర్ప్రత్యయముచేనివట సంప్రదానముక్తమై నందున చతుర్థిరాకపోవుటచే ప్రథమ వచ్చెను. [వా] క్రియయా......సమ్. కర్మరహితమగు క్రియతో [ధాత్వర్థముతో] సంబన్ధముగలుగజేయనెవనినిచ్ఛయించునో వాడును సంప్రదానమగును. సూత్రమున కర్మణా అని ముండుటవలన నకర్మకక్రియోద్దేశ్యమునకు సూత్రమువలన సంజ్ఞ సిద్ధముగానందుననీవార్తికము జెప్పబడియెను. పత్యే శేతే. [పతినుద్దేశించి నిద్రించుచున్నది.] భార్యయని శేషము. శయనక్రియయందు పతి యుద్దేశ్యమగుటవలన సంప్రదానమాయెను. [వా] యజేః ...... సంజ్ఞా. యజ [దేవపూజాయాం] ధాతువు యొక్క కర్మకు కరణసంజ్ఞను, సంప్రదానమునకు కర్మసంజ్ఞను జెప్పవలయును. పశునారుద్రం యజతే [రుద్రునికొఱకు పశువునిచ్చుచున్నాడు] యజ [దానార్థకము] ధాత్వర్థమున పశువు కర్మ, రుద్రుడు సంప్రదానము.

574. రుచ్యర్థానాం ప్రీయమాణః. 1-4-33. రుచ్యర్థానామ్, ప్రీయమాణః [సంప్రదానమ్.]

రుచ్యర్థానాం ధాతూనాం ప్రయోగే ప్రీయమాణోఽర్థః సంప్రదానం స్యాత్। హరయే రోచతే భక్తిః। అన్యకర్తృకోఽభిలాషో రుచిః। హరినిష్ఠప్రీతేర్భక్తిః కర్త్రీ। ప్రీయమాణః కిమ్। దేవదత్తాయ రోచతే మోదకః పథి॥

574. రుచిరర్థోయేషాంతే=రుచ్యర్థాః. రుచి [ప్రీతి] అర్థముగల ధాతువులప్రయోగమందు ప్రీతివిషయమగు వస్తువు సంప్రదానమగును. హరయే రోచతే భక్తిః. భక్తి [పూజ్యులందనురాగము] విష్ణువును సంతసింపజేయుచున్నదని యర్థము. హరి, ప్రీతివిషయుడగుటచే వానికికర్మసంజ్ఞ ప్రాప్తమగుచుండ నీసంజ్ఞ

విధింపబడెను. హరిర్భక్తిమభిలష్యతి. ఇచట నభిపూర్వకమగు లషధాతుప్రయోగమందు సంప్రదానసంజ్ఞను వారించుటకై సూత్రమున రుచిపదముచే వివక్షితమగు నర్థమును ప్రదర్శింపుచున్నాడు:—"అన్య ...కర్త్రి" అభిలషధాతువుల యొక్క కర్తృకంబెనితరమగునది యభిలషధాతువుయొక్క కర్మ యగును. ఈకర్మ కర్తగా గలది రుచి యగును. ఇట్లు అభిలషధాతువు రుచ్యర్థకము గానందున నభిలషధాతు ప్రయోగమందు [హరిర్భక్తిమభిలష్యతి.] హరికి సంప్రదానసంజ్ఞ రాదు. సూత్రమున ప్రీయమాణః అను విశేషణము లేనిచో, దేవదత్తాయ రోచతే మోదకః పథి, అనుచోట పథికు [మార్గమునకు] అధికరణసంజ్ఞను బాధించి సంప్రదానసంజ్ఞ ప్రసక్తమగును. పై విశేషణము లేనపుడు రుచ్యర్థధాతుప్రయోగమందు కారకమునకు సంప్రదానసంజ్ఞయని యర్థమగును. ప్రీతివిషయముగాకుండ కారకమగు మార్గమునకును [దేవదత్తునికివలె] సంజ్ఞ ప్రసక్తమగునని భావము.

575. శ్లాఘహ్నుఙ్స్థాశపాం జ్ఞీప్స్యమానః. 1-4-34. శ్లాఘ...... శపాం, జ్ఞీప్స్యమానః [సంప్రదానమ్.]

ఏషాం ప్రయోగే బోధయితుమిష్టః సంప్రదానం స్యాత్। గోపీ స్మరాత్ కృష్ణాయ శ్లాఘతే హ్నుతే తిష్ఠతే శపతే వా। జ్ఞీప్స్యమానః కిమ్। దేవదత్తాయ శ్లాఘతే పథి॥

675. శ్లాఘృ [కత్థనే] హ్నుఙ్ [అపనయనే] ష్ఠా [గతినివృత్తౌ] శప [ఉపాలమ్భే] అనునీనాల్గుధాతువులప్రయోగమందు బోధింపనిష్టమైనది సంప్రదానమగును. బోధయితుమిష్టః అనునది సూత్రములోని జ్ఞీప్స్యమాన పదమునకర్థము. గోపీ స్మరాత్ కృష్ణాయ శ్లాఘతే హ్నుతే తిష్ఠతే శపతేవా. ఇచట శ్లాఘాదిధాతువులకు స్తుత్యాదులచే బోధనమర్థము. స్మరాత్తనుచోట పఞ్చమి హేత్వర్థకము. గోపిక కృష్ణునియొక్క స్తుతిచే తనయనురాగమును కృష్ణునికి దెలుపుచున్నదని యర్థము. "కృష్ణాయ హ్నుతే". సవతులవలన కృష్ణుని దాచుచు కృష్ణునికి స్వానురాగమును దెల్పుచున్నదని యర్థము. తిష్ఠతే శపతే అనుచోటులందును క్రమముగస్థితిచేతను శపథముచేతను స్వానురాగమును దెల్పుచున్నదని యర్థము. అన్నిస్థలములందును బోధనమునకిష్టము [ఉద్దేశ్యము] కృష్ణుడగుటచేనతనికి సంప్రదానసంజ్ఞ వచ్చెను. సూత్రమున జ్ఞీప్స్యమానః అనునది లేనియెడల శ్లాఘాదిధాతువులప్రయోగమందు కారకమునకు సంప్రదానసంజ్ఞ యగునని యర్థమగును. అట్లయిన, దేవదత్తాయ శ్లాఘతేపథి, అనుచోట మార్గమునకును అధికరణసంజ్ఞను బాధించి సంప్రదానసంజ్ఞ ప్రసక్తమగును.

576. ధారేరుత్తమర్ణః. 1-4-35. ధారేః. ఉత్తమర్ణః

ధారయతేః ప్రయోగే ఉత్తమర్ణ ఉక్తసంజ్ఞః స్యాత్। భక్తాయ ధారయతి మోక్షం హరిః। ఉత్తమర్ణః కిమ్। దేవదత్తాయ శతం ధారయతి గ్రామే॥

576. ధారి అనునది ధృఙ్ (అవస్థానే) ధాతువునకు హేతుమణ్ణిజన్తము. ఉత్తమర్ణుడన ఋణమునిచ్చువాడు. ణ్యన్తమగు ధృఙ్ధాతువు యొక్క ప్రయోగమందు ఋణమునిచ్చువాడు సంప్రదానసంజ్ఞగలవాడగును. భక్తాయ ధారయతి మోక్షం హరిః. స్వరూపముచే సిద్ధమగు మోక్షమును గురించి విష్ణువు భక్తుని ప్రేరేపించుచున్నాడు. (విష్ణువుభక్తునికి మోక్షమునిచ్చుచున్నాడని ఫలితము.) భక్తుడుత్తమర్ణుడు. ఋణమన తప్పకనివ్వదగినది. (అవశ్యదేయము.) భక్తునికి మోక్షమునిచ్చితీరవలయును గాన మోక్షముగూడఋణమగును. సూత్రమున ఉత్తమర్ణః అనునది లేనియెడల కారకమునకు సంజ్ఞయని యర్థమగును. అట్లైన దేవదత్తాయశతంధారయతిగ్రామే అనుచోట, కారకమగు గ్రామమునకును సంజ్ఞ ప్రసక్తమగును.

వివ :—ఉత్తమర్ణవాచకమునకంటె షష్ఠీవిభక్తి ప్రాప్తమగుచుండ తద్బాధనము నకీసూత్రమారంభింపబడెను.

577. స్పృహేరీప్సితః. 1-4-36. స్పృహేః, ఈప్సితః।

స్పృహయతేః ప్రయోగే ఇష్టః సంప్రదానం స్యాత్। పుష్పేభ్యః స్పృహయతి। ఈప్సితః కిమ్। పుష్పేభ్యో వనే స్పృహయతి। ఈప్సితమాత్రే ఇయం సంజ్ఞా। ప్రకర్షవివక్షాయాం తు పరత్వాత్కర్మసంజ్ఞా। పుష్పాణి స్పృహయతి॥

577. స్పృహి అనునది స్పృహ [ఈప్సాయాం] ధాతువునకు స్వార్థణిజన్తము. ణ్యన్తమగుస్పృహధాతువుయొక్క ప్రయోగమందిచ్ఛావిషయము సంప్రదానసంజ్ఞకమగును. పుష్పేభ్యః స్పృహయతి [పుష్పములిచ్ఛావిషయములు. పుష్ప సంప్రదానకమగునిచ్ఛ.] ఈప్సితపదములేనిచో స్పృహిప్రయోగమందు కారకమునకు సంప్రదానసంజ్ఞయగునని యర్థమగును. అపుడు పుష్పేభ్యో వనే స్పృహయతి, అనుచోట వనమునకును సంప్రదానసంజ్ఞ ప్రసక్తమగును. ఈసంజ్ఞ యీప్సితమాత్రమందు ప్రవర్తించును. ఈప్సితముగగాక ఈప్సితతమముగ [ఫలాశ్రయముగ] వివక్షితమగునపుడు పరమగు "కర్తురీప్సితతమంకర్మ" [538] సూ. చే విహితమగు కర్మసంజ్ఞయే వచ్చును. పుష్పాణి స్పృహయతి. ఇచ్చోట పుష్పములీప్సితతమములు. [ఇచ్ఛాజన్యఫలాశ్రయములు].

వివ :—స్పృహధాతువిచ్ఛామాత్రవాచకము, ఫలవిశిష్టేచ్ఛావాచకమునగును. మొదటియర్థమందు సంప్రదానసంజ్ఞ, రెండవయర్థమందు కర్మసంజ్ఞయని యాశయము.

578. క్రుధద్రుహేర్ష్యాఽసూయార్థానాం యం ప్రతికోపః.
1-4-37. క్రుధ ......ర్థానామ్, యమ్, ప్రతి, కోపః।

క్రుధాద్యర్థానాం ప్రయోగే యం ప్రతి కోపః స ఉక్త సంజ్ఞః స్యాత్। హరయే క్రుధ్యతి। ద్రుహ్యతి, ఈర్ష్యతి, అసూయతి। యం ప్రతి కోపః కిమ్। భార్యామీర్ష్యతి మైనా మన్యోఽద్రాక్షీదితి। క్రోధోఽమర్షః। ద్రోహోఽపకారః। ఈర్ష్యాఽక్షమా। అసూయా గుణేషు దోషావిష్కరణమ్। ద్రుహాదయోఽపి కోపప్రభవా ఏవ గృహ్యన్తే। అతో విశేషణం సామాన్యేన యం ప్రతి కోప ఇతి॥

578. క్రుధ [క్రోధే] ద్రుహ [జిఘాంసాయామ్] ఈర్ష్య [ఈర్ష్యాయాం] అసూ [ఉపతాపే-కణ్డ్వాదిః.] అను నీధాతువులయర్థములతో [క్రోధాదులు] సదృశములగునర్థములుగలధాతువుల ప్రయోగమందెవనినిగుఱించి కోపమో వానికి సంప్రదానసంజ్ఞయగును. హరయేక్రుధ్యతి [హరినిగుఱించికోపగించుచున్నాడు.] సూత్రమందు యం ప్రతికోపః అనునది లేనిచో క్రుధాద్యర్థకధాతుప్రయోగమందు కారకమునకు సంప్రదానసంజ్ఞయని యర్థమగును. అట్లైన, భార్యామీర్ష్యతే [మైనా మన్యోఽద్రాక్షీదితి. "పరులచేజూడబడుభార్యను సహింపకున్నాడు."] అనుచోట భార్యకు సంప్రదానసంజ్ఞ ప్రసక్తమగును. ఇచట భార్యపై కోపజన్యమగునీర్ష్య లేదు. అన్యపురుషదర్శనమువలన గల్గెడి యీర్ష్యగలదు. [తనభార్యనితరపురుషులు జూడగూడదని.] క్రోధము = అమర్షము. [వాక్కు కండ్లు మొదలగువానియొక్క వికారముచే తెలియదగిన యధికకోపము.] ద్రోహము = అపకారము. [అపకారము జేయువలయుననునిచ్ఛ.] ఈర్ష్య = అసహనము. [ఇతరులయుత్కర్షనుజూచి యోర్వలేకుండుట.] అసూయ = గుణములను దోషములుగ ప్రకటించుట. క్రుధ ద్రుహ ధాతువులకర్మకములగుటచే తద్యోగమున షష్ఠి ప్రాప్తమగుచున్నది. ఇతరములు సకర్మకధాతువులగుటచే తద్యోగమున ద్వితీయ ప్రాప్తమగుచున్నది. ఈరెంటికినీచతుర్థి యపవాదము. ద్రుహాదులిచట కోపజన్యములగునవే గ్రహింపబడును. అందుచేతనే యంప్రతికోపః అను సామాన్యమగు విశేషణము సార్థకమగును.

579. క్రుధద్రుహోరుపసృష్టయోః కర్మ. 1-4-38. క్రుధద్రుహోః, ఉపసృష్టయోః, కర్మ [యం, ప్రతి, కోపః.]

సోపసర్గయోరనయోర్యం ప్రతి కోపస్తత్కారకం కర్మసంజ్ఞం స్యాత్। క్రూరమభిక్రుధ్యతి। అభిద్రుహ్యతి॥

579. ఉపసృష్టములననుపసర్గముతో గూడినవవి యర్థము. ఉపసర్గములతో గూడిన్న, క్రుధ ద్రుహ ధాతువుల ప్రయోగమందెవనినిగుఱించి కోపమో

వానికి కర్మసంజ్ఞ యగును. పూర్వసూత్రమునకిది యపవాదము. క్రూరమభి క్రుధ్యతి అభిద్రుహ్యతి.

580. రాధీక్ష్యోర్యస్య విప్రశ్నః. 1-4-39. రాధీక్ష్యోః, యస్య, విప్రశ్నః [సంప్రదానమ్.]

ఏతయోః కారకం సంప్రదానంస్యాత్, యదీయోవివిధః ప్రశ్నః క్రియతే। కృష్ణాయ రాధ్యతి ఈక్షతే వా। పృష్టో గర్గః శుభాఽశుభం పర్యాలోచయతీత్యర్థః॥

580. రాధ [సంసిద్ధౌ] ఈక్ష [దర్శనే] అనునీరెండుధాతువులకు ప్రశ్న విషయకమగు శుభాఽశుభపర్యాలోచనమర్థము. ఈరెండుధాతువులకారకమునకనగా ఎవనియొక్క శుభాఽశుభములనుగురించిన వివిధప్రశ్నముచేయబడునో వానికి సంప్రదానసంజ్ఞ వచ్చును. కృష్ణాయ రాధ్యతి ఈక్షతే వా. గోవులచేనడుగబడిన గర్గమహాముని కృష్ణసంబన్ధులగు శుభాఽశుభములనాలోచించుచున్నాడని యర్థము. శుభాశుభములు కృష్ణునివగుటచే కృష్ణునికి సంప్రదానసంజ్ఞ వచ్చెను. షష్ఠీవిభక్తికిది యపవాదము.

581. ప్రత్యాఙ్భ్యాం శ్రువః పూర్వస్య కర్తా. 1-4-40. ప్రత్యాఙ్భ్యామ్, శ్రువః, పూర్వస్య, కర్తా।

ఆభ్యాం పరస్య శృణోతేర్యోగే పూర్వస్య ప్రవర్తనరూపవ్యాపారస్య కర్తా సంప్రదానం స్యాత్। విప్రాయ గాం ప్రతిశృణోతి ఆశృణోతి వా। విప్రేణ మహ్యం దేహీతి ప్రవర్తితః ప్రతిజానీత ఇత్యర్థః॥

581. ప్రతిపూర్వకము ఆఙ్పూర్వకమునగు శ్రు [శ్రవణే] ధాతువునకు ఇతరులచేనేదైననిమ్మనమనికోరబడినపిదపనిచ్చెదననియంగీకరించుట (ప్రవర్తనాపూర్వకాభ్యుపగమము) యర్థము. అట్టి శ్రుధాతుప్రయోగమందేదైన వస్తువు నిమ్మనమని యడిగినవానికి సంప్రదానసంజ్ఞ వచ్చును. "విప్రాయగాం ప్రతిశృణోతి ఆశృణోతి వా". "విప్రునిచే తనకు గోవునీయమని యడుగబడినవాడగుచు గోవునిచ్చెదనని ప్రతిజ్ఞజేయుచున్నాడు" (ప్రభువు) అని యర్థము. గోవునడిగినవాడు విప్రుడుగాన వీనికి సంప్రదానసంజ్ఞ వచ్చెను.

582. అనుప్రతిగృణశ్చ. 1-4-41. అనుప్రతి, గృణః, చ, (పూర్వస్య, కర్తా)

ఆభ్యాం గృణాతేః కారకం పూర్వవ్యాపారస్య కర్తృభూతముక్తసంజ్ఞం స్యాత్। హోత్రేఽనుగృణాతి। ప్రతిగృణాతి। హోతా ప్రథమం శంసతి తమధ్వర్యుః ప్రోత్సాహయతీత్యర్థః॥

582. అనుప్రతి అనునది లుప్తపఞ్చమ్యన్తమగుభిన్నపదము. అను అనుదాని కంటెగాని ప్రతి అనుదానికంటెగాని పరమగుగృధాతువునకు శంసనమును జేయువానిని ప్రోత్సహించుట యర్థము. అట్టి గృధాతువుయొక్క కారకమునకనగా శంసనముజేయువానికి సంప్రదానసంజ్ఞ వచ్చును. హోత్రేఽనుగృణాతి ప్రతిగృణాతి. హోత మొదట శంసనమునుజేయుచున్నాడు. ఇట్టి హోతనధ్వర్యుడు, ఓథామ మొదలగు శబ్దములచే శంసనమునుజేయ ప్రోత్సహించుచున్నాడు. హోత శంసనకర్త గానసంప్రదానమాయెను. హోత అధ్వర్యుడు అనువారు యాగమును జేయించుప్రధానులగు ఋత్విక్కులనబడువారిలోనివారు. ఇంద్రాదులందరి గుణములను జెప్పుట శంసనమనబడును.

583. పరిక్రయణే సంప్రదానమన్యతరస్యామ్. 1-4-44. పరిక్రయణే, సంప్రదానమ్, అన్యతరస్యామ్ (సాధకతమమ్).

నియతకాలం భృత్యా స్వీకరణం పరిక్రయణం తస్మిన్ సాధకతమం కారకం సంప్రదానసంజ్ఞం వా స్యాత్। శతేన శతాయ వా పరిక్రీతః (హ) తాదర్థ్యే చతుర్థీ వాచ్యా। ముక్తయే హరిం భజతి। (వా) క్లుపి సంపద్యమానే చ। భక్తిర్జ్ఞానాయ కల్పతే, సంపద్యతే, జాయతే, ఇత్యాది। (వా) ఉత్పాతేన జ్ఞాపితే చ। వాతాయ కపిలా విద్యుత్। (వా) హితయోగే చ। బ్రాహ్మణాయ హితమ్॥

583. ధనమునిచ్చి వస్తువులను పూర్తిగ స్వీకరించుట క్రయమగును. జీతమునిచ్చి కొంతకాలమువరకు మనుష్యుని స్వీకరించుట పరిక్రయణమగును. పరిక్రయణమందు ప్రకృష్టోపకారకమునకు సంప్రదానసంజ్ఞ వికల్పముగనగును. శతేన శతాయ వా పరిక్రీతః. (కర్మకరః పురుషః.) నూఱురూపాయిలనిచ్చి కర్మకరుని గొంతకాలమువరకు స్వీకరించెను. పరిక్రయణమందు శతము సాధకతమము.

(వా) తాదర్థ్యే.........వాచ్యా. తస్మై కార్యాయ ఇదమ్ = తదర్థమ్. (కారణమ్), తస్య భావః = తాదర్థ్యమ్ = ఉపకార్యోపకారకభావరూపమగు సంబన్ధము. ఇది యనేకవిధములు. కార్యకారణభావము ప్రకృతివికృతిభావము సంస్కార్యసంస్కారకభావము మొదలగునవి. ముక్తయే హరిం భజతి. హరిని భజించుట ముక్త్యర్థము. ముక్తి (మోక్షము) కార్యము. హరిసేవ కారణము. "యూపాయ దారు". ఇచట యూపదారువులకు ప్రకృతి వికృతిభావము. (వా) క్లుపి...... ......చ. క్లుపి అనునది క్లుప్ శబ్దమునకు సప్తమ్యన్తము. దీనిచే క్లుప్త్యర్థకధాతువులకు గ్రహణము. సంపత్తియను మత్పత్తి. క్లుప్త్యర్థకధాతుయోగమందు సంపద్యమానార్థమును బోధించుప్రాతిపదికము (వికృతివాచకము) కంటె చతుర్థి వచ్చును. ప్రకృతివికృతులకు భేదము వివక్షితముగునపుడు వికృతివాచకముకంటె

చతుర్థి వచ్చునని ఫలితార్థము. భక్తిర్జ్ఞానాయకల్పతే. (భక్తి జ్ఞానమనువికారము నొందుచున్నది.) క్లపి అనునది తదర్థములకు గ్రహణమని సూచించుటకై సంపద్యతే జాయతే అని చెప్పబడెను.

(వా) "ఉత్పా......చ". ప్రాణులయొక్క శుభాశుభములకు సూచకమగు పృథివ్యాదిభూతములవికారము ఉత్పాతమనబడును. దీనిచే జ్ఞాపితమగు నర్థమును బోధించు ప్రాతిపదికము కంటె చతుర్థి వచ్చును. వాతాయ కపిలా విద్యుత్. కపిల వర్ణమగు మెఱపు (జ్యోతిర్వికారము) పెనుగాలికి జ్ఞాపకము. (సూచకము.) విద్యుత్తుచే వాతము జ్ఞాపితమగుటచే వాతశబ్దముకంటె చతుర్థి వచ్చెను.

(వా) "హిత. .......చ". చకారము సుఖశబ్దమునకు గ్రాహకము. హిత సుఖ శబ్దములయోగమందు చతుర్థివచ్చును. బ్రాహ్మణాయ హితమ్. గవేసుఖమ్.

వివ = హితయోగేచ అనువచనము జ్ఞాపకసిద్ధము. చతుర్థీతదర్థార్థబలిహిత సుఖరక్షితైః (702) అను సూ. చే చతుర్థ్యంతమునకు హిత సుఖ శబ్దములతో సమాసవిధానము హిత సుఖ శబ్దములయోగమున చతుర్థి వచ్చుననుటలో జ్ఞాపక మగును.

584. క్రియార్థోపపదస్యచకర్మణిస్థానినః. 2-3-14. క్రియార్థోప పదస్య, చ, కర్మణి స్థానినః (చతుర్థీ.)

క్రియార్థా క్రియా ఉపపదం యస్య తస్య స్థానినోఽప్రయుజ్యమానస్య తుమునః కర్మణి చతుర్థీ స్యాత్। ఫలేభ్యోయాతి। ఫలాన్యాహర్తుం యాతీత్యర్థః। నమస్కుర్మో నృసింహాయ। నృసింహమనుకూలయితుమిత్యర్థః। ఏవం స్వయంభువే నమస్కృత్యేత్యాదావపి॥

584. క్రియార్థోపపదస్య = క్రియా అర్థః (ఫలం) యస్యాస్సా = క్రియార్థా। క్రియాఫలకమని యర్థము. క్రియ ఫలముగగలది ప్రత్యాసత్తిచే క్రియయే యగును. క్రియార్థా (క్రియా) ఉపపదమ్ యస్య అని బహువ్రీహి గర్భమగు బహువ్రీహి. క్రియ యుపపదమగుట యసంభవము గాన క్రియాపదము లక్షణచే క్రియావాచకమును (ధాతువును) బోధించును. స్థానిపదమునకప్రయుజ్యమానమను నర్థము వైయాకరణ వ్యవహారసిద్ధము. క్రియార్థ = క్రియోపపదత్వము తుమున్ ణ్వుల్ మొదలగువానికే సంభవించునని గ్రహించునది. ఇట్లు లభించిన దేమూలమున "తుమునః" అనునది. తుమున్ అనునది ప్రత్యయమగుటచే తదన్తమును బోధించును. క్రియయే ఫలముగగల క్రియ (క్రియావాచకము) యుపపదముగ గల్గి (ప్రకృతికము) అప్రయుజ్యమానమగు తుమున్నన్తముయొక్క కర్మను బోధించెడి ప్రాతిపదికముకంటె చతుర్థి వచ్చునని సూత్రార్థము. ఫలేభ్యో యాతి. పండ్లను

దెచ్చుటకై వెళ్లుచున్నాడని యర్థము. ఆహరణము (క్రియ) ఫలముగ గలది యానము. (క్రియ) ఈక్రియను బోధించునది యాధాతువు. ధాతువుపపద మెన్నడు గాదు గానవిచటియుపపదశబ్దము తాదృశక్రియావాచక ప్రకృతికమగు పదమును బోధించును. యాధాతుప్రకృతికము యాతి అను తిజన్తము. (ఉపపదము) ఆహర్తుమ్ అనునది యిట్టియుపపదముగల్గి యప్రయుజ్యమానమగు తుమున్నన్తము. దీనికి కర్మ ఫలములు. ఫలశబ్దముకంటె చతుర్థి వచ్చెను. నమస్కుర్మో నృసింహాయ. నరసింహమూర్తి ననుకూలునిగజేసికొనుటకై నమస్కరించుచున్నామని యర్థము. స్వయంభువే నమస్కృత్య. బ్రహ్మననుకూలునిగ జేయుటకై నమస్కరించి అని యర్థము. "ఉపపదవిభక్తేః కారకవిభక్తిర్బలీయసీ" అనున్యాయముచే చతుర్థిని బాధించి కర్మణిద్వితీయా (540) సూ. చే ద్వితీయ ప్రసక్తమగును గాన నిచట (స్వయంభువే) నమఃస్వస్తిస్వాహా (586) అను సూ. చేతనేచతుర్థి సిద్ధించుననుటకు వలనుపడదు.

585. తుమర్థాచ్చభావవచనాత్. 2-3-15. తుమర్థాత్, చ. భావవచనాత్ (చతుర్థీ.)

భావవచనాశ్చేతిసూత్రేణ యో విహితస్తదన్తాచ్చతుర్థీ స్యాత్। యాగాయ యాతి। యష్టుం యాతీత్యర్థః॥

585. తుమర్థాత్ = తుమున్‌పదము లక్షణచే తదర్థబోధకము. తుమునర్థోఽర్థో యస్య అని బహువ్రీహి. తుమున్‌ప్రత్యయార్థమర్థముగాగలది అనియర్థము. భావవచనపదము భావార్థకమనునర్థమును బోధించదు. అట్లైన తుమున్‌ప్రత్యయము భావార్థమందే విహితమగుటచే తుమర్థాత్తనుదానిచేతనే గతార్థమగును గాన భావవచనాత్తనునది వ్యర్థము గావలయును. కావుననది సూత్రవిశేషమునుగ్రహింపజేయును. అట్టిసూత్రము భావవచనాశ్చ (3-3-11) అనునది. (భావే అనునధికారమున విధింపబోవు ఘఞ్ మొదలగుప్రత్యయములు క్రియాఫలకమగుక్రియ యుపపదముగనున్నపుడు భవిష్యత్కాలమున వచ్చునవి యాసూత్రార్థము.) భావవచనాశ్చ అనుసూత్రముచే విధింపబడి తుమున్‌ప్రత్యయార్థమర్థముగగల ప్రత్యయమంతమందు గలదానికంటె చతుర్థి వచ్చునని సూత్రార్థము. యాగాయ యాతి. యాగ శబ్దము తుమునర్థకమగు "భావవచనాశ్చ" సూత్రవిహితఘఞ్‌ప్రత్యయమన్తమునగలది. కాన యాగశబ్దముకంటె చతుర్థి వచ్చెను. యాగమును జేయుటకై వెళ్లుచున్నాడనియర్థము. యాగఫలకం యానం అనియర్థము.

586. నమఃస్వస్తిస్వాహాస్వధాలంవషడ్యోగాచ్చ. 2-3-16. నమః .........యోగాత్, చ (చతుర్థీ)

ఏభిర్యోగే చతుర్థీ స్యాత్। హరయే నమః। ఉపపదవిభక్తేః కారకవిభక్తిర్బలీయసీ। నమస్కరోతి దేవాన్ ప్రజా

భ్యః స్వస్తి। అగ్నయే స్వాహా। పితృభ్యః స్వధా। అల మితి పర్యాప్త్యర్థగ్రహణమ్। తేన దైత్యేభ్యో హరిరలం ప్రభుః సమర్థః శక్త ఇత్యాది, ప్రభ్వాదియోగే షష్ఠ్యపి సాధుః। తస్మై ప్రభవతి స ఏషాం గ్రామణీరితి నిర్దేశాత్। తేన ప్రభుర్బుభూషుర్భువనత్రయస్యేతి సిద్ధమ్। వషడిన్ద్రా య। చకారః పునర్విధానార్థః। తేనాశీర్వివక్షాయాం పరామపి చతుర్థీచాశిషీతిషష్ఠీం బాధిత్వా చతుర్థ్యేవ భవతి। స్వస్తి గోభ్యో భూయాత్॥

౫౮౬. నమః స్వస్తి స్వాహా స్వధా అలమ్ వషట్ అనువీనితో యోగ మున్నపుడు చతుర్థి వచ్చును. హరయే నమః. నమస్కరోతి దేవాన్ అనుచోట నమఃపదయోగముగల దేవశబ్దముకంటె చతుర్థి రాకుండుటకు గారణమును జూపు చున్నాడు:— ఉపపద........బలీయసీ. కారకే అను నధికారమున విధింపబడిన కర్త, కర్మ, కరణము సంప్రదానము, అపాదానము, అధికరణము, అనునీయర్థ ములను బోధించు ప్రాతిపదికములకంటె విధింపబడు తృతీయాదివిభక్తులు ప్రథమావిభక్తియు కారకవిభక్తు లనబడును. వీనికంటె భిన్నములగునవి యుపపద విభక్తు లగును. ఉపపదవిభక్తి కంటె కారకవిభక్తి ప్రబలమగునని యర్థము. దేవులు కృఞ్ ధాతువుయొక్క కర్మ యగుటచే దేవశబ్దముకంటె కర్మణిద్వితీయా (౫40) సూ. చే ద్వితీయ, ఉపపదవిభక్తి యగునీచతుర్థిని బాధించి వచ్చును. స్వస్త్యాది యోగమునసుదాహరణములు :— ప్రజాభ్యః స్వస్తి. అగ్నయే స్వాహా. పితృభ్యః స్వధా. అలం శబ్దమునకు భూషణము పర్యాప్తి (సామర్థ్యము) వారణము అనునర్థ ములు గలవు. ఇచట పర్యాప్త్యర్థములకే గ్రహణము. దైత్యేభ్యో హరిరలమ్. ప్రభుసమర్థాదిపదములు పర్యాప్త్యర్థకములు. పర్యాప్త్యర్థకమునకే గ్రహణమను టలో వ్యాఖ్యానమేమానము. ఈ విషయమును సౌత్రప్రయోగముచేతనుపష్టా పించుచున్నాడు. "తస్మై ప్రభవతి సంతాపాదిభ్యః" (5-1-101) అనుసూత్ర మున పర్యాప్త్యర్థకమగు ప్రభవతి శబ్దయోగమందు చతుర్థీప్రయోగము షష్ఠ్యర్థ మును బోధించును.పర్యాప్త్యర్థకప్రభ్వాదిశబ్దములయోగమందుషష్ఠీవిభక్తియునుసాధు వగుననుటలో "సఏషాం గ్రామణీః" (5-2-78) అనుసూత్రమున ప్రభ్వర్థకమగు గ్రామణీశబ్దయోగమందు ఏషామ్ అను షష్ఠ్యన్తనిర్దేశము ప్రమాణమగును. ఇట్లు చెప్పుటచే "ప్రభుర్బుభూషుర్భువనత్రయస్య" అను మాఘప్రయోగమందలి షష్ఠి సాధువగును. వషడ్యోగమున చతుర్థికుదాహరణము :— వషడిన్ద్రాయ. స్వస్తి గోభ్యో భూయాత్. ఇచట ఆశీర్వాదము వివక్షితమగునపుడు పరమగు "చతుర్థీ చాశిష్యాయుష్య" (౫84) అను సూ. చే గోశబ్దమునకు ప్రాప్తమగు షష్ఠిని బాధించి చతుర్థి వచ్చుటకుపాయమునుజూపుచున్నాడు:— "చకారః ......ర్థః। నమఃస్వస్తి" అను సూత్రమందలి చకారమును విభజించి నమఃస్వస్త్యాదియోగ మందు నమఃస్వస్త్యాదివాక్యముచే చతుర్థి విహితమైయుండినను తిరుగవిభక్తమగు

పీఠకారముచే చతుర్థీవిధానమును చేయవలయును. ఈవిధానమాశీర్వాదము వివక్షిత మైనను నమఆదియోగమందు షష్ఠిని బాధించి చతుర్థియే వచ్చుననుటను బోధించును.

వివ :—భూషణార్థకము వారణార్థకమునగు అలమ్ శబ్దమునకు క్రియావాచకధాతుసమభివ్యాహారమందే ప్రయోగము (కన్యామలంకరోతి। హరిదినే భోజనమలంకరోతి) గాన్పించుటచేతను అచట ప్రబలమగు కారకవిభక్తియే ప్రవర్తించుటచేతను భూషణవారణార్థకాలంశబ్దయోగమందీసూత్రము ప్రవర్తింపదు. కాన పర్యాప్త్యర్థకయోగమందే యీసూత్రము ప్రవర్తించునని సిద్ధమగును. ఇట్టి వ్యాఖ్యానము పర్యాప్త్యర్థకమగు అలంశబ్దమునకే గ్రహణమనుటలో మానమగును.

587. మన్యకర్మణ్యనాదరే విభాషాఽప్రాణిషు 2-3-17.
మన్యకర్మణి, అనాదరే, విభాషా, అప్రాణిషు (పదచ్ఛేదః)

ప్రాణివర్జే మన్యతేః కర్మణి చతుర్థీ వా స్యాత్తిరస్కారే। న త్వాం తృణం మన్యే తృణాయ వా। శ్యనా నిర్దేశాత్తానాదికయోగే న। న త్వాం తృణం మన్వే (వా) అప్రాణిష్విత్యపనీయ నౌకాకాన్నశుకశృగాలవర్జేష్వితి వాచ్యమ్। తేన న త్వాం నావమన్నం వా మన్యే ఇత్యత్రాఽప్రాణిత్వేపి చతుర్థీ న। న త్వాం శునే మన్యే ఇత్యత్ర ప్రాణిత్వేఽపి భవత్యేవ॥

587. అనాదరశబ్దమునకు తిరస్కారమని యర్థము. ఇది మనధాతువుయొక్క కర్మకు విశేషణము. దైవాదికమగు మనధాతువుయొక్క కర్మప్రాణిభిన్నమై తిరస్కారద్యోతకమగునపుడు తద్వాచకప్రాతిపదికముకంటె చతుర్థి వికల్పముగ వచ్చును న త్వాం తృణం మన్యే తృణాయ వా. (నిన్ను తృణముతో సమానునిగగూడ దలంచను.) ఇచట మన్యకర్మ తృణము ఇది ప్రాణిభిన్నము తిరస్కారద్యోతకమునగును. మన (జ్ఞానే) ధాతువు దివాదులలో నున్నది. తనాదులలో మను (అవబోధనే) ధాతువున్నది. సూత్రమున మన్య అనుశ్యన్ప్రత్యయముతోగూడినదానిని నిర్దేశించుటచే (శ్యన్ప్రత్యయము దివాదిగణపతితములగు ధాతువులకంటె విధింపబడినది) దైవాదికమునే గ్రహింపవలయును. ఇట్లు చెప్పుటచే తనాదులలోని మనుధాతుయోగమందీసూత్రము ప్రవర్తించదు. న త్వాం తృణం మన్వే. కర్మవాచకమగు తృణశబ్దమునకు చతుర్థి రాదు. (వా) సూత్రమున అప్రాణిషు అను కర్మవిశేషణమును దీసివేసి దానిస్థానమున నౌ కాక అన్న శుక శృగాల అను వీనికంటె భిన్నమగు కర్మయని చెప్పవలయును. ఇందువలన, న త్వాం నావమన్నంవా మన్యే, అనుచోటనావయు నన్నమును (మన్యకర్మలు) ప్రాణిభిన్నములైనను వీనికంటె చతుర్థి రాదు. న త్వాం శునే శ్వానం వా మన్యే.

అనుచోట శ్వన్పదార్థము (మన్యకర్మ) ప్రాణియైనను శ్వన్శబ్దముకంటె చతుర్థి వచ్చును. కర్మ ప్రాణిభిన్నమే గావలయునన్నచో నిచ్చోటులందుదోషముప్రసక్త మగును.

వివ:—అనాదరే అనునది కర్మకు విశేషణమనుటచే, న త్వాం తృణం మన్యే తృణాయ వా, అనుచోట తృణమే తిరస్కారద్యోతకము గాన తృణశబ్దము కంటె చతుర్థి వచ్చును. యుష్మదర్థము తిరస్కారద్యోతకము గానందున యుష్మచ్ఛబ్దముకంటె రాదు.

శ్యన్ప్రత్యయముతో గూడిన నిర్దేశము దైవాదికధాతువునుగ్రహింపవలయు ననియే బోధించును గాని శ్యన్ప్రత్యయముతోనవశ్యముగూడుకొని యుండవలయు నని బోధింపదు. కాన శ్యన్ప్రత్యయరహితమగు లిడాదిప్రయోగమందును చతుర్థి సిద్ధించును. న త్వాం తృణాయ మేనే. అశ్వత్థామనుగుఱించి శౌర్యాధిక్యముగల స్త్రీల వాక్యమిది.

588. గత్యర్థకర్మణి ద్వితీయాచతుర్థ్యౌ చేష్టాయామనధ్వని.
2-3-12. గత్యర్థకర్మణి, ద్వితీయాచతుర్థ్యౌ, చేష్టాయామ్, అనధ్వని।

అధ్వభిన్నే గత్యర్థానాం కర్మణి ఏతే స్తశ్చేష్టాయామ్। గ్రామం గ్రామాయ వా గచ్ఛతి। చేష్టాయాం కిమ్। మనసా హరిం వ్రజతి। అనధ్వనీతి కిమ్। పన్థానం గచ్ఛతి। గన్త్రాఽధిష్ఠితేఽధ్వన్యేవాఽయం నిషేధః। యదాతూత్పథాత్పన్థా ఏవాక్రమితుమిష్యతే తదా చతుర్థీ భవత్యేవ। ఉత్పథేన పథే గచ్ఛతి।

588. అధ్వశబ్దార్థము (మార్గము, పన్థమొదలగునవి) కంటెభిన్నమైనట్టి గమనార్థకధాతువులకర్మను బోధించు ప్రాతిపదికములకంటె చేష్టగమ్యమానమగునపుడు ద్వితీయాచతుర్థులు వచ్చును. గ్రామం గ్రామాయ వా గచ్ఛతి. గమ్ ధాతువుయొక్క కర్మ గ్రామము. గమనము శరీరవ్యాపారమే గావుననిచట చేష్ట గమ్యమానమగును. చేష్టాయాంకిమ్? చేష్టయన క్రియగదా। ధాత్వర్థము క్రియరూపమేయగును గాన తిరుగనీవిశేషణమునకేమిప్రయోజనమని శఙ్కాఽశయము. మనసా హరిం వ్రజతి. (మనసుచే విష్ణువును పొందుచున్నాడు.) చేష్టాశబ్దముచే శరీరవ్యాపారమునే గ్రహించవలయును గావి క్రియామాత్రమును గ్రహింపవలను పడదు. కావున శరీరవ్యాపారములేనట్టి పై యుదాహరణమున చతుర్థీవారణము చేష్టాయామ్ అనుదానికి ఫలమని యుత్తరాఽశయము.. పన్థానం గచ్ఛతి. ఇచట గమ్ ధాతుకర్మపథిన్శబ్దార్థము. (పన్థః) పథిన్ శబ్దమునకు చతుర్థిని వారించుటకై అనధ్వని, అనునిషేధమావశ్యకము. సూత్రమునఅధ్వశబ్దము తదర్థపరము.

"అధ్వన్యర్థగ్రహణం కర్తవ్యమ్" అను వార్తికమిందుమానము. కావుననే పన్థానం గచ్ఛతి అను ప్రత్యుదాహరణమీయబడెను "అనధ్వని" (అధ్వశబ్దార్థభిన్నమగు) అను నిషేధము, గమనకర్తచే (వెళ్లువానిచే) నాక్రమింపబడిన (అధిష్ఠితమైన) అధ్వపదార్థమునకే వర్తించును. ఇందు "ఆస్థితప్రతిషేధో వక్తవ్యః" (ప్రాప్తమగు అధ్వకర్మక చతుర్థీనిషేధమును చెప్పవలయును) అను వార్తికము మానము. ఇట్లుచెప్పుటచే నుత్పథమునగా నెత్తైనమార్గమును విడిచి సమమార్గమాక్రమింపనిచ్ఛయించుచున్నాడనునర్థముగల ఉత్పథేన పథే గచ్ఛతి (ఎత్తగు మార్గముచే వెళ్లుటకొఱకై సమ మార్గమునాక్రమింప నిచ్ఛయించుచున్నాడు.) అనుచోట మార్గమాక్రాన్తము గానందున నిషేధము ప్రవర్తించదుగాన పథిన్‌శబ్దమునకు చతుర్థి తప్పక వచ్చును. మూలమున ఉత్పథాత్ అనుచోట ల్యబ్లోపమున పంచమి. ఉత్పథమును విడిచి (ఉత్సృజ్య) అని యర్థము. ఉత్పథేన అనుచోట తృతీయ కరణార్థకము. ఉత్పథముచే వెళ్లుటకొఱకై అని యర్థము. "గన్తుమశక్తః" అని యధ్యాహారము.

ఇది చతుర్థీవిభక్తి.

589. ధ్రువమపాయేఽపాదానమ్. 1-4-24. ధ్రువమ్, అపాయే, అపాదానమ్ (కారకమ్).

అపాయో విశ్లేషస్తస్మిన్ సాధ్యే ధ్రువమవధిభూతం కారకమపాదానం స్యాత్॥

589. ప్రకృతధాత్వర్థవ్యాపారమునకనాశ్రయమై తాదృశవ్యాపారజన్యమగు విభాగమునకాశ్రయమగునది ధ్రువమనబడును. అట్టిది అవధియే యగును. అపాయమనగ విశ్లేషము. (విభాగమునుగలుగజేయు వ్యాపారము) అపాయము సాధింపదగినదైయుండ ధ్రువము స్థిరమైనను, చలమైనను ప్రకృతధాత్వర్థజన్య విభాగాశ్రయముగ (అవధిభూతముగ) వివక్షితమగునపుడు కారకసంజ్ఞగలదై యపాదానసంజ్ఞగలదగును. మూలమున అవధిభూతమనునది ధ్రువమనుదానికి వివరణమని యెఱుంగునది.

590. అపాదానే పఞ్చమీ. 2-3-28. అపాదానే. పఞ్చమీ।

గ్రామాదాయాతి। ధావతోఽశ్వాత్పతతి। కారకం కిమ్। వృక్షస్య పర్ణం పతతి। (వా) జుగుప్సావిరామప్రమాదార్థానాముపసంఖ్యానమ్॥ పాపాజ్జుగుప్సతే, విరమతి। ధర్మాత్ప్రమాద్యతి॥

590. అపాదానవాచకముకంటె పఞ్చమీవిభక్తి వచ్చును. గ్రామాదాయాతి. ప్రకృతధాత్వర్థమగు నాగమనమునకనాశ్రయమై దీనివలనగల్గెడి విభాగమున (ఆగమనకర్తకు గ్రామమునకును గల్గునది.) కాశ్రయము (విభాగాఽవధి) గ్రామము గాన దీని

యపాదానమగును. అపాదానవాచకమగు గ్రామశబ్దముకంటె పఞ్చమి వచ్చెను. ధావతోఽశ్వాత్పతతి (పరుగెడుచున్న గుఱ్ఱమునుండి పడుచున్నాడు.) ఇచట నశ్వము పరుగెత్తుచున్నదైనను (చలమైనను) పతనాశ్రయమగుపతనమువలన గల్గెడి విభాగమునకాశ్రయమగుటచేనపాదానమగును. ధ్రువశబ్దమునకు స్థిరమని యర్థముజెప్పిన నిచ్చోటులందశ్వాదులకపాదానసంజ్ఞ సిద్ధింపకుండునని తెలియు నది. వృక్షస్య పర్ణం పతతి. ఇచట వృక్షమునకు పర్ణమందన్వయము గాని పతన క్రియయందన్వయములేమింజేసివృక్షము కారకముగాదు. వృక్షమునకపాదాన సం జ్ఞనువారింపకారకాధికారమిచటనావశ్యకము. (వా) జుగు......నమ్. జుగుప్సయన నింద. విరామమనవిరమణము. ప్రమాదమన నసవధానత. (హెచ్చరికతప్పుట.) ఈయర్థములుగల ధాతువులయొక్క కారకమపాదానసంజ్ఞకమగునని చెప్పవల యును. సంయోగపూర్వకమగు విశ్లేషము విభాగమనబడును. పాపాజ్జుగుప్సతే ఇత్యాదులందు పాపాదులకు నిందాదులకును సంయోగమే లేనందున విభాగములేదు. పాపాదులు విభాగాశ్రయములు కానేరవు. కావుననిట్టిచోటులందు సూత్రముచే నపాదానసంజ్ఞ యప్రాప్తమగుచుండనీవార్తికముజెప్పబడియెను. పాపాజ్జుగుప్సతే, పాపాద్విరమతి, ధర్మాత్ప్రమాద్యతి, క్రమముగనివి యుదాహరణములు.

వివ:— విభాగము వాస్తవమగు సంయోగసంబన్ధపూర్వకమై వాస్తవమగు నదే గానక్కఱలేదు. బుద్ధిపరికల్పితసంయోగపూర్వకమై బుద్ధి పరికల్పితమైనది గూడ గ్రహింపదగును. ఇట్లు చెప్పుటకు "మధురాః పాటలిపుత్రకేభ్య అఢ్యతరాః" (మధురానగరవాస్తవ్యులు పాటలిపుత్రపత్తనవాసులకంటె ధనికులు.) ఇత్యాదు లందు మాధురులకు పాటలిపుత్రకులకునిట్టి బౌద్ధమగు విభాగమునాశ్రయించి "అపా దానేపఞ్చమీ" అనునీసూత్రముచే పఞ్చమిని సాధించుభాష్యమే మానము. బుద్ధి పరికల్పితమగునపాదానము నాశ్రయించియే "జుగుప్సావిరామ" అనువార్తికమును, "భీత్రార్థానాంభయహేతుః" మొదలగు వక్ష్యమాణసూత్రములను భాష్యకారుడు ప్రత్యాఖ్యానము జేసెనని గ్రహించునది.

591. భీత్రార్థానాం భయహేతుః, 1-4-25. భీత్రార్థానామ్, భయ హేతుః (అపాదానమ్.)

భయార్థానాం త్రాణార్థానాంచప్రయోగే భయహేతురపా దానంస్యాత్। చోరాద్బిభేతి। చోరాత్త్రాయతే। భయహేతుః కిమ్। అరణ్యే బిభేతి త్రాయతే వా॥

591. భీః = భయము. త్రాః = రక్షణము. భయము రక్షణము అర్థముగల ధాతువులప్రయోగమందు భయకారణమపాదానసంజ్ఞకమగును. ఇది హేతుతృతీయ కపవాదము. చోరాద్బిభేతి. చోరాత్త్రాయతే. భయమందు రక్షణమందును చోరుడు కారణము గావున నతడపాదానసంజ్ఞగలవాడగును. తద్వాచకమగు చోరశబ్దముకంటె పఞ్చమి వచ్చెను. భయహేతుః-అనునది లేనిచో భయాద్యర్థకధాతుప్రయోగమందు

కారకమపాదానమగునని యర్థమగును. అట్లైననీసంజ్ఞ యన్నిసంజ్ఞలకపవాదము గావలసివచ్చును. అరణ్యేబిభేతి (త్రాయతేవా) అనుచోట అరణ్యమునకిష్టమగు నధికరణసంజ్ఞ నీసంజ్ఞ బాధించును. భయహేతుపదమున్నపుడరణ్యము భయకారణముగానందుననీసంజ్ఞ ప్రసక్తముగాదు.

విప :— భయహేతుః, అనుచోట భయపదము రక్షణమునకుపలక్షణము. రక్షణహేతువనునర్థమునుగూడ బోధించును. "కస్య బిభ్యతి దేవాశ్చజాతరోషస్య సంయుగే" అను రామాయణశ్లోకమందు భీధాతుప్రయోగమున కస్మాద్బిభ్యతి అని యుండవలసియుండ "కస్య బిభ్యతి" అని షష్ఠ్యన్త ప్రయోగమెట్లు సాధువగు ననిన కస్య సంయుగే అనియుచటనన్వయముజేసి నచోకింశబ్దార్థమునకు భీధాత్వర్థ యోగముండదు గానపాదానసంజ్ఞ ప్రవర్తింపకపోవుటచే షష్ఠి సాధువగునని గ్రహించునది. పరమగునధికరణసంజ్ఞచేనీసంజ్ఞ బాధింపబడినది గానసంయుగమున కపాదానసంజ్ఞను శంకింపవలనుపడదు.

592. పరాజేరసోఢః. 1–4–26. పరాజేః, అసోఢః (అపాదానమ్).

పరాజేః ప్రయోగేఽసహ్యోఽర్థోఽపాదానం స్యాత్। అధ్యయనాత్పరాజయతే। గ్లాయతీత్యర్థః। అసోఢఃకిమ్। శత్రూన్ పరాజయతే। అభిభవతీత్యర్థః॥

592. పరా అనునుపసర్గము పూర్వమందుగల జి (జయే) ధాతుప్రయోగమందు అసహ్యార్థము "గ్లానివిషయము" అదానసంజ్ఞకమగును. గ్లానియననసహనము. గ్లానివిషయమధ్యయనాదులగును. పరాపూర్వకజిధాతువునకు కొన్నిచోటులందు (శత్రూన్పరాజయతే) తిరస్కారమర్థము. ఇచట నసోఢగ్రహణముండుట వలన పరాజిధాతువునకు న్యూనీభావమర్థమనవలయును. న్యూనీభావమన శక్తివైకల్యాదిరూపము. పరాజిధాతువకర్మకమగునపుడే యీసూత్రము ప్రవర్తింపునని ఫలితార్థము. అధ్యయనాత్పరాజయతే. (అధ్యయనమువలన శక్తిహీనుడగుచున్నాడు) శత్రూన్ పరాజయతే. (శత్రువులదిరస్కరించుచున్నాడు) అభిభవార్థకమగునపుడీధాతువుసకర్మకమగును. ఇచట శత్రువులకపాదానసంజ్ఞను వారించుటకై అసోఢగ్రహణమావశ్యకము. ఈసూత్రము షష్ఠికపవాదము

593. వారణార్థానామీప్సితః. 1–4–27. వారణార్థానామ్, ఈప్సితః (అపాదానమ్.)

ప్రవృత్తివిఘాతో వారణమ్। వారణార్థానాం ధాతూనాం ప్రయోగే ఈప్సితోఽర్థోఽపాదానం స్యాత్। యవేభ్యో గాం వారయతి। ఈప్సితః కిమ్। యవేభ్యో గాం వారయతి క్షేత్రే॥

593. వారణమన ప్రవృత్తివిఘాతము. (యవభక్షణాదులనుండి మరలింపజేయుట.) వారణార్థములగు ధాతువుల ప్రయోగమందీప్సితము (వారణధాత్వర్థఫలాశ్రయము) అపాదానసంజ్ఞకమగును. యవేభ్యో గాం వారయతి. ధాత్వర్థఫలము భక్షణసంయోగము. తదాశ్రయములు యవలుగావున నపాదానసంజ్ఞ వచ్చెను. ఈప్సితగ్రహణము లేనియెడల వారణార్థక ధాతుప్రయోగమున కారకమునకపాదానసంజ్ఞయని యర్థమగును. అట్లైన యవేభ్యో గాం వారయతి క్షేత్రే, అనుచోట క్షేత్రమునకపాదానసంజ్ఞ ప్రసక్తమగును.

594. అన్తర్ధౌ యేనాఽదర్శనమిచ్ఛతి. 1-4-28. అన్తర్ధౌ, యేన, అదర్శనమ్, ఇచ్ఛతి (అపాదానమ్)

వ్యవధానే సతి యత్కర్తృకస్యాఽఽత్మనో దర్శనస్యాఽభావమిచ్ఛతి తదపాదానం స్యాత్। మాతుర్నిలీయతే కృష్ణః। అన్తర్ధౌ కిమ్। చోరాన్న దిదృక్షతే। ఇచ్ఛతిగ్రహణం కిమ్। అదర్శనేచ్ఛాయాః సత్యాం సత్యపి దర్శనే యథా స్యాత్॥

594. అన్తర్ధిశబ్దమునకపవారణమర్థము. అనగానితరులు తనను చూడకుండునట్లు చాటున (అడ్డుగల ప్రదేశమందు) నుండుట. యేన అనునది కర్త్రర్థక తృతీయాన్తము. ఆత్మనః అనునది సాన్నిధ్యలభ్యము. తనను చూచువానికి తనకును మధ్యమ గోడ మొదలగువానితో వ్యవధానముండగా తననెవడు జూడగూడదని యిచ్ఛయించునో యట్టివానికి (దర్శనకర్తకు) అపాదానసంజ్ఞ వచ్చునని ఫలితార్థము. మాతుర్నిలీయతే కృష్ణః. (కృష్ణుడు తల్లికగపడకుండ చాటున దాగికొనుచున్నాడు.) తల్లి తనను జూడగూడదనునిచ్ఛతో కృష్ణుడు దాగొన్నందున తల్లికపాదానసంజ్ఞ వచ్చును. తద్వాచకమగు మాతృశబ్దమునకు పఞ్చమియగును. చోరాన్న దిదృక్షతే. (చోరులజూచుటకు తానిష్టపడకున్నాడు.) చోరులు తనను జూడకుండుటకై తాను చోరుల జూచుటకిష్టపడకున్నాడని యర్థము. చోరకర్తృకస్వకర్మకదర్శనాఽభావేచ్ఛ యుండుటచే చోరులకపాదానసంజ్ఞ ప్రాప్తమగుచున్నది. అన్తర్ధిగ్రహణమున్నపుడు చోరులకు తనకును వ్యవధానము లేకుండుటచే సంజ్ఞ వారింపబడును. ఇచ్ఛతి అని యనుటచే తననితరులు చూడకుందురుగాక యనునిచ్ఛతో దాగొన్నపుడు దైవవశముచే నితరులు తనను జూచినను చూచువానికి సంజ్ఞ ప్రవర్తించును. ఇచ్ఛతి గ్రహణము లేనియెడల నెచట దర్శనాభావముండునో నచటనే సంజ్ఞ ప్రవర్తించును గాని దర్శనమున్నచోటున ప్రవర్తింపకపోవును.

595. ఆఖ్యాతోపయోగే. 1-4-29. ఆఖ్యాతా. ఉపయోగే [అపాదానమ్.]

నియమపూర్వకవిద్యాస్వీకారే వక్తా ప్రాక్సంజ్ఞః స్యాత్। ఉపాధ్యాయాదధీతే। ఉపయోగే కిమ్। నటస్య శృణోతి॥

595. ఇచటనుపయోగశబ్దము నియమపూర్వకమగు విద్యాస్వీకారమను నర్థమందు రూఢము. [ప్రయోజనార్థకముగాదు.] నియమమన బ్రహ్మచర్యాదికము. ఆఖ్యాతా అనునది అజ్పూర్వకమగు చక్షిఙ్ [వ్యక్తాయాంవాచి] ధాతువునకు తృజన్తమగుటచే వక్తను బోధించును. విద్యాస్వీకారము [అధ్యయనము] శాస్త్రోక్త నియమపూర్వకమైనపుడు వక్త [అధ్యాపకుడు] అపాదానసంజ్ఞకమగును. ఉపాధ్యాయాదధీతే. [ఉపాధ్యాయునివలన నియమముతో విద్యను నేర్చుకొనుచున్నాడు.] నటస్య శృణోతి. [నటునివలన వినుచున్నాడు.] శ్రవణము నటజన్యమగుటచే నటునికి క్రియాన్వయమున్నందున నటునికి కారకసంజ్ఞ యున్నది. ఉపయోగే అనునది సూత్రమున లేనిచో కారకమగువక్త అపాదానమగునని సూత్రార్థమగును. అపుడు నటునికి సంజ్ఞ ప్రసక్తమగును. ఉపయోగే అనియున్నపుడిచట నటుడు నియమపూర్వకవిద్యావక్త గాడుగాననతనికి సంజ్ఞ వారితమగును. కొన్నిపుస్తకములందు "నటస్యగాథాంశృణోతి" అనుపఠమగపడుచున్నది. ఇట్టిపాఠమందు నటునికి గాథయందన్వయముచితమగుటచే క్రియయందన్వయము లేనందున కారకసంజ్ఞయే యుండదు గావున ఉపయోగే అనునది లేకున్నను సంజ్ఞ ప్రాప్తముగాదు. ఉపయోగే అనుదానికిది ప్రయోజనమనుటకు వీలులేకపోవును. అందుచే గాథాపను దానితోగూడిన పాఠమపపాఠమని యెఱుగునది.

వివ:—"నటస్య గాథాం శృణోతి" అను వాక్యమునకు గాథాకర్మకమైన నటసంబంధియగుశ్రవణమని యర్థమును చెప్పునపుడు నటునికి క్రియాన్వయముండును గానకారకత్వము సిద్ధించును. ఇట్టిపాఠమునుగూడ సమర్థింపవచ్చును. కాని యిట్టియన్వయము క్లిష్టమగుటచే పూర్వోక్తప్రకారముగనపపాఠమనుటయే యుచితమని భావము.

596. జనికర్తుః ప్రకృతిః. 1-4-30. జనికర్తుః, ప్రకృతిః।

జాయమానస్య హేతురపాదానం స్యాత్। బ్రహ్మణః ప్రజాః ప్రజాయన్తే॥

596. జనికర్తుః అనుచోట జనేఃకర్తా = జనికర్తాతస్య, అని షష్ఠీసమాసము. జనియనజననము. [ఉత్పత్తి] ఉత్పత్తికికర్త యనగా జాయమానుడు [పుట్టిన వాడు] అనియర్థము. ఇట్టిజాయమానునికి హేతువపాదానమగునని సూత్రార్థము. బ్రహ్మణః ప్రజాః ప్రజాయన్తే [బ్రహ్మవలన ప్రజలు పుట్టుచున్నారు] ప్రజలు జాయమానులు. వీరికి హేతువు బ్రహ్మయగుటచే బ్రహ్మకపాదానసంజ్ఞ వచ్చెను.

వివ:—కాశికాకారుడీసూత్రమునకు పుత్రాత్ప్రమోదో జాయతే అని యుదాహరణమును జూపుటచే సూత్రములోని ప్రకృతిపదము కారణమాత్రపరమని నాతని మతము. ఉపాదానకారణమాత్రపరమని భాష్యమతము. మతద్వయముపాధారణమైన యుదాహరణము మూలమున జూపబడెను. [illegible]

హిరణ్యగర్భుడర్థము. హిరణ్యగర్భుడు ప్రజల యుత్పత్తికి గారణమగును గాని యుపాదానము గాదు. భాష్యమతమందు బ్రహ్మయన మాయాశబలము. ఈబ్రహ్మ సర్వకార్యములకుపాదానమని వేదాన్తులసిద్ధాన్తము. ప్రకృతిశబ్దముపాదానకారణమందే రూఢమగుటవలన నిందు భాష్యకారమతమే యుక్తమైనదని గ్రహించునది.

597. భువః ప్రభవః. 1-4-31. భువః, ప్రభవః [కర్తుః]

భవనం భూః। భూకర్తుః ప్రభవస్తథా। హిమవతో గఙ్గా ప్రభవతి। తత్ర ప్రకాశత ఇత్యర్థః। [వా] ల్యబ్లోపే కర్మణ్యధికరణే చ। ప్రాసాదాత్ప్రేక్షతే। ఆసనాత్ప్రేక్షతే। ప్రాసాదమారుహ్య ఆసనే ఉపవిశ్య ప్రేక్షత ఇత్యర్థః। శ్వశురాజ్జిహ్రేతి। శ్వశురం వీక్ష్యేత్యర్థః। గమ్యమానాఽపి క్రియా కారకవిభక్తీనాం నిమిత్తమ్। కస్మాత్త్వం। నద్యాః। [వా] యతశ్చాధ్వకాలనిర్మాణం తత్ర పఞ్చమీ। [వా] తద్యుక్తాదధ్వనః ప్రథమాసప్తమ్యౌ। [వా] కాలాత్సప్తమీ చ వక్తవ్యా। వనాద్గ్రామో యోజనం యోజనే వా। కార్తిక్యా ఆగ్రహాయణీ మాసే।

597. భూశబ్దమునకు భవనమనగా ప్రథమప్రకాశమర్థము. భూకర్తయన ప్రథమప్రకాశము గలది. ప్రభవశబ్దమునకు ప్రథమప్రకాశస్థానమర్థము. ప్రథమప్రకాశము [తొలుదొల్తయగపడుట] గలదానికేది ప్రథమప్రకాశస్థానమో అయ్యది యపాదానమగును. హిమవతో గఙ్గా ప్రభవతి. [గఙ్గ హిమవత్పర్వతమందు మొదట జూరబడుచున్నది] గఙ్గానదియొక్క ప్రథమ ప్రకాశస్థానము హిమవత్పర్వతమగుటచేనిది యపాదానసంజ్ఞగలదగును. [వా] ల్యబ్లోపే .... .. చ. ల్యప్ప్రత్యయాన్తముయొక్క ప్రయోగములేనపుడు [తదర్థముగమ్యమానమగుటచే ప్రయోగములేకపోవునని తెలియునది.] ల్యప్ప్రత్యయమునకు ప్రకృతియగు ధాత్వర్థముయొక్క కర్మనుగాని యధికరణమును గానిబోధించు ప్రాతిపదికముకంటె పంచమివచ్చును. క్రమముగనుదాహరణములు:—ప్రాసాదాత్ప్రేక్షతే. [మేడనెక్కిచూచుచున్నాడు.] ఇచట ఆరుహ్య అను ల్యబన్తమునకు ప్రయోగములేదు. ల్యప్ప్రకృతిధాత్వర్థమధిరోహణము. ఇందు ప్రాసాదము కర్మ. ఆసనాత్ప్రేక్షతే [ఆసనముఁ గూర్చొని చూచుచున్నాడు] ఉపవిశ్య అనునది యప్రయుక్తల్యబన్తము. ల్యప్ప్రకృతిధాత్వర్థమగునుపవేశనమందధికరణ మాసనము. శ్వశురాజ్జిహ్రేతి (మామనుచూచి సిగ్గుపడుచున్నాడు) వీక్ష్య అనునది యప్రయుక్తల్యబన్తము. ల్యప్ప్రకృతిధాత్వర్థమగు వీక్షణమందు శ్వశురుడు కర్మ. "గమ్యమానాఽపి........ నిమిత్తమ్". క్రియ విశేషించి ధాతువుచే ప్రతిపాదింపబడకున్నను (గమ్యమానమైనను) కారకవిభక్తియందు నిమిత్తమగును. కస్మాత్త్వం? అను ప్రశ్నమునకే ప్రదేశమునుండి నీవు వచ్చుచున్నావని యర్థము. ఆగమనక్రియావాచకము లేకున్న

నాగమనము గమ్యమానమగుచున్నది. నద్యాః అనునది సమాధానము. నదినుండి వచ్చుచున్నానని యర్థము. ఇచట నాగమనము గమ్యమానమగుచున్నది. ఇందు నది యవధి యగుటచే, ధ్రువమపాయేఽపాదానమ్ (౫౮౪) సూ. చేతనే నదిపాదానసంజ్ఞ వచ్చును (వా) యతశ్చా ...... సప్తమీ చ వక్తవ్యా. దేనినవధిగజేసి మార్గము యొక్క లేక కాలము యొక్క నిర్మాణము (పరిచ్ఛేదము=కొలత) ప్రతిపాదింపబడునో యట్టి యవధివాచకముకంటె పఞ్చమి వచ్చును. పఞ్చమ్యర్థము (అవధి) చే పరిచ్ఛేద్యమగు మార్గమును బోధించుశబ్దముకంటె ప్రథమాసప్తమీవిభక్తులు వచ్చును. పఞ్చమ్యర్థము (అవధి) చే పరిచ్ఛేద్యమగు కాలమును బోధించు శబ్దముకంటె సప్తమి వచ్చును. వనాద్గ్రామో యోజనం యోజనే వా. (వనమునుండి గ్రామము యోజనపరిమితమగు దూరముననున్నది.) మార్గపరిచ్ఛేదమున వనమవధి యగుటచే వనశబ్దముకంటె పంచమియు పరిచ్ఛేద్యము యోజనమగుటచే యోజనశబ్దముకంటె ప్రథమాసప్తమీవిభక్తులును వచ్చును. "కార్తిక్యా అగ్రహాయణీ మాసే" (కార్తికపూర్ణిమను మార్గశీర్షపూర్ణిమ మాసపరిమిత కాలమునందున్నది.) కార్తికపౌర్ణమాసి కాలపరిచ్ఛేదమునందవధి గావున కార్తికీ శబ్దముకంటె పంచమియు కార్తికపౌర్ణమాసిచే పరిచ్ఛేద్యమగు కాలమును బోధించుమాసశబ్దముకంటె సప్తమియు వచ్చెను.

**౫౯౮. అన్యారాదితరర్తేదిక్శబ్దాఞ్చూత్తరపదాజాహియుక్తే 2-3-29. (పఞ్చమీ)**

ఏతైర్యోగే పఞ్చమీ స్యాత్। అన్య ఇత్యర్థగ్రహణమ్। ఇతరగ్రహణం ప్రపఞ్చార్థమ్। అన్యో భిన్న ఇతరో వా కృష్ణాత్। ఆరాద్వనాత్। ఋతే కృష్ణాత్। పూర్వో గ్రామాత్ దిశి దృష్టః శబ్దో దిక్శబ్దః। తేన సమ్ప్రతి దేశకాలవృత్తినా యోగేఽపి భవతి। చైత్రాత్పూర్వః ఫాల్గునః। అవయవవాచియోగే తు న। తస్య పరమామ్రేడితమితి నిర్దేశాత్। పూర్వం కాయస్య। అఞ్చూత్తరపదస్య తు దిక్శబ్దత్వేఽపి షష్ఠ్యతసర్థేతి షష్ఠీం బాధితుం పృథగ్గ్రహణమ్। ప్రాక్ ప్రత్యగ్వా గ్రామాత్। ఆచ్ దక్షిణా గ్రామాత్। ఆహి దక్షిణాహి గ్రామాత్। అపాదానే పఞ్చమీతి సూత్రే కార్తిక్యాః ప్రభృతీతి భాష్యప్రయోగాత్ ప్రభృత్యర్థయోగే పఞ్చమీ। భవాత్ప్రభృతి ఆరభ్య వా సేవ్యో హరిః। అపపరిబహిరితి సమాసవిధానాజ్జ్ఞాపకాద్బహిర్యోగే పఞ్చమీ। గ్రామాద్బహిః॥

౫౯౮. అన్య ఆరాత్ ఇతర ఋతే దిక్శబ్ద అఞ్చూత్తరపద ఆచ్ [ప్రత్యయాన్తము] అనువీనికి ద్వన్ద్వము. పిదప యుక్తశబ్దముతో తృతీయాతత్పురుషము. అన్యాదిశబ్దముల యోగమందు పంచమి వచ్చును. సూత్రమున అన్యశబ్దము స్వరూప

బోధకము గాక తదర్థబోధకము. భేదవత్తు [భేదముగలది] అన్యశబ్దార్థము. ఏతదర్థకములతో యోగమందు పంచమి వచ్చునని యర్థము. ఇందువలననితరశబ్దము యొక్క [భేదవదర్థకము] యోగమందును పంచమి సిద్ధించును గాన సూత్రమున నితరగ్రహణము స్పష్టార్థమగును. అన్యః భిన్నః మొదలగు శబ్దములన్యార్థకములు. అన్యో భిన్న ఇతరో వా కృష్ణాత్ [కృష్ణునికంటె భిన్నుడు.] ఆరాద్వనాత్ [వనమునకు దూరమందు లేక సమీపమందు.] ఇచట "దూరాన్తికార్థైః షష్ఠ్యన్యతరస్యామ్" [614] అను సూ. చే ప్రాప్తమగు షష్ఠికి పంచమి యపవాదము. ఋతే కృష్ణాత్ [కృష్ణుని విడిచి] పూర్వో గ్రామాత్ [గ్రామమునకు పూర్వప్రదేశము] దిక్శబ్దః అనుచోట శబ్దగ్రహణసామర్థ్యమువలన దిక్కునందు రూఢములగు వానికి [దిగ్విశేషవాచకములగు పూర్వాది శబ్దములకు] గ్రహణము. అవయవశక్తిచే దిక్కులను బోధించు ఐన్ద్రీ కౌబేరీ మొదలగు పదములయోగమందు పంచమి రాదు. ఎపుడైన దిగ్విశేషమును బోధించునదై ఇపుడు దిగ్వాచకము గాకున్నను తాదృశపదయోగమందును పంచమి వచ్చును. ఇట్లు చెప్పుటచే దిగ్వాచకములగు పూర్వాదిశబ్దములిపుడు దిక్కును బోధింపక దేశబోధకములు కాలబోధకములైనను వీనితో యోగమందు పంచమి వచ్చును. చైత్రాత్పూర్వః ఫాల్గునః [చైత్రమాసమునకు పూర్వమాసము ఫాల్గునము] పూర్వశబ్దమిచట కాలమును బోధించును. పూర్వో గ్రామాత్ అనుచోట పూర్వశబ్దము దేశబోధకమగును. అవయవబోధకములగు పూర్వాదిశబ్దముల యోగమందవయవివాచకముకంటె పంచమి రాదు. పూర్వం కాయస్య [శరీరముయొక్క పూర్వభాగము.] ఇట్లు చెప్పుటలో తస్యపరమామ్రేడితమ్ [81] అను సూత్రమున నవయవివాచకపదశబ్దయోగమందు పాణిని పంచమీవిభక్తిని ప్రయోగింపక పోవుటయే మానము. అఞ్చూత్తరపదములన ప్రాక్ ప్రత్యక్ మొదలగునవి. ఇవి దిక్శబ్దములే యగుచుండ తిరుగ సూత్రమున నఞ్చూత్తరపదగ్రహణము పరమగు "షష్ఠ్యతసర్థప్రత్యయేన" [612] అను సూత్రముచే ప్రాప్తమగు షష్ఠిని బాధించుటకని తెలియదగును. ప్రాక్ ప్రత్యక్ వా గ్రామాత్. ఆచ్ ఆహి అనునవి ప్రత్యయములగుటవలన తదన్తబోధకములగును. దక్షిణా గ్రామాత్ [గ్రామావధికమగు దక్షిణదిక్కునందు] దక్షిణా అనునది అజన్తము దక్షిణాహి గ్రామాత్. [గ్రామావధికమగు దక్షిణదిక్కునందు దూరమున.] దక్షిణాహి అనునది ఆహ్యన్తము. అజన్తాఽహ్యన్తములవ్యయములు. "అపాదానే పఞ్చమీ" [590] అను సూత్రభాష్యమందు "కార్తిక్యాః ప్రభృతి" అని ప్రభృతి శబ్దయోగమున పఞ్చమీ ప్రయోగమువలన ప్రభృత్యర్థకశబ్దయోగమున పంచమి ప్రయోగింపదగునని తెలియదగును. ప్రభృతి ఆరభ్య మొదలగుశబ్దములు ప్రభృత్యర్థకములు. భవాత్ప్రభృతి ఆరభ్య వా సేవ్యో హరిః. "అపపరిబహిరఞ్చవః పఞ్చమ్యా" [670] అను సూత్రమునకు అపపరిబహిశ్శబ్దములు, ప్రాగాది శబ్దములు, పఞ్చమ్యన్తముతో సమాసమునొందునని యర్థము. అపవిష్ణు, బహిర్వనమ్ మొదలగునవి యుదాహరణములు. ఇట్లు బహిశ్శబ్దమునకు పఞ్చమ్యన్తముతో సమాసవిధానము బహిశ్శబ్దయోగమందు పంచమి యగుననుటలో జ్ఞాపక

మగును. కానిచో నది వ్యర్థము గావలయును. గ్రామాద్బహిః. మూలమున పఞ్చమీ అనునది పఞ్చమ్యపి అనునర్థముగలది. అపిశబ్దముచే బహిశ్శబ్దయోగమందు షష్ఠియు నగునని యర్థము. కావున "కరస్యకరభో బహిః" అనుచోట బహిర్యోగమున షష్ఠి సాధువగును.

వివ :—"పురుషారాధనమృతే" అనుచోట ఋతేశబ్దయోగమున ద్వితీయా ప్రయోగమగపడుచున్నది. న్యాయ్యముగ నీ సూత్రముచే నచట పంచమి రావలసి యున్నది. ఈప్రయోగసాధుత్వమునకుపాయమేమన :— ఇది యసాధువే యని కొందరనిరి. మఱికొందరు "ఉభసర్వతసోః" అను శ్లోకవార్తికమున "అన్యత్రాఽపిదృశ్యతే" అని యనుటవలన ఋతేశబ్ద యోగమందు ద్వితీయగూడ సాధువగు ననిరి. చాంద్రవ్యాకరణమున "ఋతేచద్వితీయా" (ఋతేశబ్దయోగమందు ద్వితీయ వచ్చును.) అనుసూత్రముండుటవలననిందు రెండవమతమే యుక్తమైనదని గ్రహించునది.

599. అపపరీ వర్జనే. 1-4-88. అపపరీ, వర్జనే (కర్మప్రవచనీయాః.)

ఏతౌ వర్జనే కర్మప్రవచనీయౌ స్తః।

599. అప పరి అనునవి వర్జనరూపార్థమందు (విడుచుట) కర్మప్రవచనీయసంజ్ఞకములగును.

600. ఆఙ్ మర్యాదావచనే. 1-4-96. ఆఙ్, మర్యాదావచనే (కర్మప్రవచనీయాః.)

ఆఙ్ మర్యాదాయాముక్తసంజ్ఞః స్యాత్। వచనగ్రహణాదభివిధావపి॥

600. ఆఙ్ అనునది మర్యాదయందు (అవధియందు) కర్మప్రవచనీయ మగును. ఏదైన నొకయధికారసూత్రమునకేసూత్రమునవధిగజెప్పుదురో యాసూత్రమున ప్రవర్తింపకనంతవఱకు ప్రవర్తించుచోటున మర్యాదయనియు అవధిగజెప్పబడు సూత్రమునగూడ బ్రవర్తించునపుడభివిధి యనియును మర్యాదాభివిధులకు భేదము వృద్ధులచేనంగీకరింపబడినది. (తేనవినామర్యాదా. తేనసహేత్యభివిధిః.) ఈసూత్రమున "మర్యాదాయామ్" అనిచెప్పక "మర్యాదావచనే" అనివచన గ్రహణమునుచేయుటవలన పూర్వోక్తమగువృద్ధోక్తిలోని భేదమునాదరింపకనిచట నవధిమాత్రమునుగ్రహింపవలెను. కావ మర్యాదయందునభివిధియందును ఆఙ్ కర్మప్రవచనీయమగునని యర్థమగును. వచనగ్రహణసామర్థ్యాత్తనుమూలమునకర్థమిట్లు జెప్పవచ్చును.మర్యాదాశబ్దమేసూత్రమునజెప్పబడినదో యాసూత్రము మర్యాదావచన మనబడును. "ఆఙ్మర్యాదాభివిధ్యోః" (600) అనుసూత్రమట్టిదగును. అచటదృష్ట

మగునాజ్ఞు. (మర్యాదాభివిధ్యర్థకము.) కర్మప్రవచనీయమగునని సూత్రార్థము. ఈవిధముగ నభివిధియందును సంజ్ఞ సిద్ధమగును.

601. పఞ్చమ్యపాఙ్ పరిభిః. 2-3-10. పఞ్చమీ, అపాఙ్ పరిభిః।

ఏతైః కర్మప్రవచనీయైర్యోగే పఞ్చమీ స్యాత్। అప హరేః సంసారః। పరి హరేః సంసారః। పరిరత్రవర్జనే। లక్షణాదౌ తు హరిం పరి। ఆముక్తేః సంసారః। ఆసకలాద్బ్రహ్మ।

601. కర్మప్రవచనీయములగు అప ఆఙ్ పరి అనువానియోగమందు పంచమి వచ్చును. "అపహరేః పరిహరేస్సంసారః". (విష్ణువును విడిచి సంసారము.) ఈసూత్రమున వర్జనార్థకమగు అప అనుదాని సాహచర్యమువలన వర్జనార్థకమగు పరి అనుదానికే గ్రహణము. లక్షణేత్థంభూతాఖ్యానాద్యర్థద్యోతకమగు పరి యొక్క యోగమందు ద్వితీయయే వచ్చును. హరిం పరి భక్తః. (హరిభక్తుడు) ఆముక్తేః సంసారః। (మోక్షమునకుబూర్వము సంసారము గాని మోక్షమందు సంసారము లేదు.) ఇది మర్యాదార్థకమగు నాఙ్ఞునకుదాహరణము. ఆసకలాద్బ్రహ్మ (సమస్తమును వ్యాపించి బ్రహ్మయున్నది.) అభివిధ్యర్థకమగునాఙ్ఞునకిది యుదాహరణము.

602. ప్రతిః ప్రతినిధిప్రతిదానయోః. 1-4-92. ప్రతిః, ప్రతినిధిప్రతిదానయోః (కర్మప్రవచనీయాః.)

ఏతయోరర్థయోః ప్రతిరుక్తసంజ్ఞః స్యాత్।

602. ప్రతినిధి (ముఖ్యమగువస్తువులేనపుడు తత్సదృశమై స్వీకరింపబడువస్తువు.) ప్రతిదానము (తనకీయబడినవస్తువుయొక్క విలువతో తుల్యమగు విలువగల మరియొకవస్తువును తిరుగవిచ్చివేయుట.) అనునీయర్థములందు ప్రతి అనునది కర్మప్రవచనీయమగును.

603. ప్రతినిధిప్రతిదానే చ యస్మాత్. 2-3-11. ప్రతినిధిప్రతిదానే, చ, యస్మాత్ (పఞ్చమీ.)

అత్ర కర్మప్రవచనీయైర్యోగే పఞ్చమీ స్యాత్। ప్రద్యుమ్నః కృష్ణాత్ప్రతి। తిలేభ్యః ప్రతియచ్ఛతి మాషాన్॥

603. సూత్రమున యస్మాత్తనుచోట పంచమ్యర్థము సంబంధము. ఏ వస్తువునకు ప్రతినిధిప్రతిదానములగునో యావస్తువును బోధించుశబ్దముకంటె కర్మప్రవచనీయముగుదానితో యోగమున్నపుడు పంచమి వచ్చును. ప్రతినిధికుదాహరణము:— ప్రద్యుమ్నః కృష్ణాత్ప్రతి. (కృష్ణునికి ప్రద్యుమ్నుడు ప్రతినిధి)

ప్రతిదానమునకుదాహరణము:— తిలేభ్యః ప్రతియచ్ఛతి మాషాన్ (నువ్వులను దీసికొని వానికి బదులు మినుములనిచ్చుచున్నాడు.)

604. అకర్తర్యృణే పఞ్చమీ. 2-3-24. అకర్తరి, ఋణే, పఞ్చమీ (హేతౌ.)

కర్తృవర్జితం యదృణం హేతుభూతం తతః పఞ్చమీ స్యాత్। శతాద్బద్ధః। అకర్తరి కిమ్। శతేన బన్ధితః॥

604 కర్తృసంజ్ఞారహితము హేతువునగు ఋణమును (అవశ్యదేయమును) బోధించెడిప్రాతిపదికముకంటె పంచమి ప్రయోగింపదగును. హేతౌ (561) సూ. చే ప్రాప్తమగు తృతీయకిది యపవాదము. శతాద్బద్ధః. (నూరురూపాయీలఋణముచే బద్ధముగలవాడయ్యెను) శతము బన్ధకారణము. శతేన బన్ధితః. బన్ధితః అనునది హేతుమణ్ణిజన్తమగు బన్ధధాతువునకు క్తప్రత్యయాన్తము. తత్ప్రయోజకో హేతుశ్చ (1-4-55) అను సూ. చే శతమునకు కర్తృసంజ్ఞాహేతుసంజ్ఞలు రెండును గలవు. ఇచట శతశబ్దమునకు పంచమిని వారించుటకై సూత్రమున అకర్తరి (కర్తృసంజ్ఞారహితము) అనువిశేషణమావశ్యకము.

605. విభాషా గుణేఽస్త్రియామ్ 2-3-25. విభాషా, గుణే, అస్త్రియామ్ (పఞ్చమీ)

గుణే హేతావస్త్రీలిఙ్గే పఞ్చమీ వా స్యాత్। జాడ్యాజ్జాడ్యేన వా బద్ధః। గుణేకిమ్। ధనేన కులమ్। అస్త్రియామ్ కిమ్। బుద్ధ్యా ముక్తః। విభాషేతియోగవిభాగాదగుణే స్త్రియాఞ్చ క్వచిత్। ధూమాదగ్నిమాన్। నాఽస్తిఘటోఽనుపలబ్ధేః॥

605. స్త్రీలిఙ్గరహితము హేతువునగుగుణమును బోధించుశబ్దముకంటె పంచమి వికల్పముగనగును. జాడ్యాజ్జాడ్యేన వా బద్ధః. జాడ్యము (మాన్ద్యము) స్త్రీలిఙ్గరహితము బన్ధకారణమునగుగుణముగావునజాడ్యశబ్దముకంటె పంచమి వచ్చెను. పక్షమందు "హేతౌ" (571) సూ. చే తృతీయ వచ్చును. ధనేనకులమ్. ధనము ద్రవ్యము. ధనశబ్దమునకు పంచమి రాకుండుటకై గుణగ్రహణమావశ్యకము. బుద్ధ్యా ముక్తః. బుద్ధి స్త్రీలిఙ్గము. బుద్ధిశబ్దమునకు పంచమిని వారించుటకై అస్త్రియామ్ అనునది యావశ్యకము. సూత్రమున "విభాషా" అనుదానిని విభజించి హేతువాచకముకంటె పంచమి వికల్పముగనగునని యర్థమునుజెప్పవలెను. యోగవిభాగముచే గుణముగాకున్నను స్త్రీలింగమైనను కొన్నిచోటులందు పంచమి వచ్చును. ధూమాదగ్నిమాన్. ధూమశబ్దము ద్రవ్యవాచకమైనను పంచమి వచ్చెను. "నాఽస్తిఘటోఽనుపలబ్ధేః" అనుపలబ్ధిశబ్దము స్త్రీలింగమైనను పంచమివచ్చెను.

"బాహ్లీకం ప్రకృతే స్తనుదృష్టేః" అనువార్తికమున ప్రకృతిశబ్దమునకు పఞ్చమీ విర్దేశమీయోగవిభాగమున జ్ఞాపకమగును.

606. పృథగ్వినానానాభి స్తృతీయాఽన్యతరస్యామ్. 2-3-32.
పృథగ్వినానానాభిః, తృతీయా, అన్యతరస్యామ్ (పఞ్చమీ, ద్వితీయా.)

ఏభిర్యోగే తృతీయాస్యాత్పఞ్చమీద్వితీయే చ। అన్యతరస్యాంగ్రహణం సముచ్చయార్థమ్। పఞ్చమీద్వితీయేఽను వర్తేతే। పృథగ్ రామేణ, రామాత్, రామం వా। ఏవం వినానానా॥

606. పృథక్ వినా నానా వీనితో యోగముగలప్రాతిపదికమునకు తృతీయ పఞ్చమి ద్వితీయ యీమూడువిభక్తులునగును. ఇచట అన్యతరస్యామ్ అనునది నిపాతము. నిపాతములనేకార్థకములు గాననిది సముచ్చయార్థకము. ఇది తృతీయతో పఞ్చమీద్వితీయలకు సమావేశమును బోధించును. పఞ్చమీద్వితీయ పదములనిచటనుస్వృత్తిజేసి తృతీయాది విభక్తులను మూడింటిని విధించవలయు ననిఫలితమగును. పృథగ్ రామాత్ రామేణ రామం వా. ఇట్లే వినానానాశబ్దముల యోగమందును తృతీయాదివిభక్తులగును.

వివ :— పృథక్ వినా నానా అనునవి సమానార్థకములు. కావున పృథగర్థైస్తృతీయా అని సూత్రమును జేసినను వినానానాశబ్దములయోగమందు తృతీయాదులు సిద్ధమగుచుండ పర్యాయత్రయోపాదానము పృథగర్థముగలయితరశబ్దములతో (హిరుక్ మొదలగువానితో) యోగమందు తృతీయాదులు రావని బోధించును. కావున హిరుగ్ దేవదత్తస్య, అనుచోట నీసూత్రము ప్రవర్తించదు.

607. కరణే చ స్తోకాల్పకృచ్ఛ్రకతిపయస్యాసత్త్వవచనస్య. 2-3-33. కరణే, చ, స్తోకాల్ప.... .... .... ....యస్య, అసత్త్వవచనస్య (అన్యతరస్యామ్, తృతీయా, పఞ్చమీ)

ఏభ్యోఽద్రవ్యవచనేభ్యః కరణే తృతీయాపఞ్చమ్యౌ స్తః। స్తోకేన స్తోకాద్వా ముక్తః। ద్రవ్యే తు స్తోకేన విషేణ హతః॥

607. ద్రవ్యభిన్నబోధకములు (ధర్మమాత్రబోధకములు) కరణములగు స్తోక అల్ప కృచ్ఛ్ర కతిపయ అనుశబ్దములకంటె తృతీయాపఞ్చమీ విభక్తి అగును. కరణవాచకమునకు తృతీయ ప్రాప్తమగుచుండ పక్షమున పఞ్చమీవిధానమునకీసూత్రము. స్తోకాదిశబ్దములు శుక్లాదిశబ్దములవలె ధర్మబోధకములు (గుణవాచకములు) ధర్మిబోధకములు (ద్రవ్యవాచకములు) గూడనగును, ఉదా :—

స్తోకేన స్తోకాద్వా ముక్తః (అనాయాసముగ ముక్తుడాయెను.) స్తోకశబ్దార్థమిచట క్రియావిశేషణమగుటచే స్తోకపదము ద్రవ్యవచనము గాదు. స్తోకేన విషేణ హతః. స్తోకశబ్దార్థము విషవిశేషణమగుటచేనిచట స్తోకశబ్దము ద్రవ్యవాచకము. ఇచట స్తోకశబ్దమునకు పఞ్చమీవారణమునకై సూత్రమున "అసత్త్వవచనస్య" అనున దావశ్యకము.

608. దూరాన్తికార్థేభ్యో ద్వితీయా చ. 2-3-35. దూరాన్తికార్థేభ్యః, ద్వితీయా, చ (అసత్త్వవచనస్య, పఞ్చమీ తృతీయే.)

ఏభ్యో ద్వితీయా స్యాచ్చాత్పఞ్చమీతృతీయే। ప్రాతిపదికార్థమాత్రే విధిరయమ్। గ్రామస్య దూరం దూరాత్ దూరేణ వా। అన్తికమ్, అన్తికాత్ అన్తికేన వా। అసత్త్వవచనస్యేత్యనువృత్తేర్నేహ। దూరః పన్థాః॥

608. దూరము అన్తికము (సమీపము) అనునర్థముగల్గి ద్రవ్యభిన్న వాచకములగు ప్రాతిపదికములకంటె ద్వితీయ, తృతీయ, పఞ్చమి యీ విభక్తుల గును. ప్రాతిపదికార్థమాత్రమందే యీవిభక్తులగును. ఈవిభక్తులకు ప్రాతిపదికార్థములగు దూరము అన్తికముకంటె వేరగునర్థములులేవని భావము. గ్రామస్య దూరం దూరాత్ దూరేణ వా. (గ్రామమునకు దూరము) గ్రామస్య అన్తికం అన్తికాత్ అన్తికేన వా. (గ్రామమునకు సమీపము). దూరః పన్థాః. దూరపదార్థము మార్గవిశేషణమగుటచే దూరశబ్దమిచట ద్రవ్యవాచకమగును. ఈసూత్రమందు "అసత్త్వవచనస్య" అను దానికనువృత్తిజేయుటవలననిచట నీసూత్రము ప్రవర్తింపదు॥

ఇది పఞ్చమీవిభక్తి.

609. షష్ఠీ శేషే. 2-3-50. షష్ఠీ, శేషే।

కారకప్రాతిపదికార్థవ్యతిరిక్తః స్వస్వామిభావాదిసంబన్ధః శేషస్తత్ర షష్ఠీ స్యాత్। రాజ్ఞః పురుషః। కర్మాదీనామపి సమ్బన్ధమాత్రవివక్షాయాం షష్ఠ్యేవ। సతాం గతమ్।సర్పిషో జానీతే। మాతుః స్మరతి। ఏధోదకస్యోపస్కురుతే। భజే శంభోశ్చరణయోః। ఫలానాం తృప్తః॥

609. ఉక్తార్థములకంటెనితరము శేషపదమునకర్థము. కారకములగు కర్మాదులు ప్రాతిపదికార్థమునీసూత్రమునకు ముందు (అష్టాధ్యాయియందు) జెప్పబడినవి. వీనికంటె భిన్నములైన స్వస్వామిభావము జన్యజనకభావము మొదలగు సంబన్ధములు శేషపదార్థమగును. సంబన్ధరూపార్థమందు షష్ఠీవిభక్తి ప్రయోగింప దగునని యర్థము.షష్ఠీవిభక్తికి సంబన్ధమర్థమనిఫలితమగును.రాజ్ఞః పురుషః.(రాజసేవకుడు) రాజునకు సేవకునికి స్వస్వామిభావము సంబన్ధము. రాజు స్వామి. పురుషుడు

స్వపదమునకర్థము. కర్మత్వం కర్తృత్వం కరణత్వముమొదలగునవియు సంబన్ధ విశేషములే. కర్మగను కర్తగను వివక్షితమగునపుడు ద్వితీయాదులగును. సంబన్ధ సామాన్యముగ వివక్షితమగునపుడీషష్ఠియే వచ్చును. రూపవిశేష మును వివక్షింపనపుడు రూపవాన్ ఘటః అనియు, రూపవిశేషమును వివక్షించు నపుడు నీలో ఘటః అనియునెట్లు ప్రయోంపబడునోయట్లే షష్ఠీవిభక్తియు ద్వితీ యాదివిభక్తులునగునని భావము. సతాంగతమ్. (సత్పురుసంబన్ధిగమనము.) గమనక్రియయందు సత్పురుషులు కర్తలుగ వివక్షింపబడక సంబన్ధులుగ (శేష ముగ) వివక్షింపబడుటచే షష్ఠి వచ్చెను. సర్పిషోజానీతే. (సర్పిస్సంబన్ధిప్రవర్త నము) ఇచట కరణము (సర్పిస్సు) శేషముగ వివక్షింపబడినందున షష్ఠి వచ్చెను. మాతుఃస్మరతి. (మాతృసంబన్ధి స్మరణము.) ఇచట కర్మ (మాత) శేషముగ వివక్షితమైనందున షష్ఠి వచ్చెను ఏధోదకస్యోపస్కురుతే (ఏధః కర్తృకమ్ ఉదకసంబన్ధి గుణాధానమ్=కాష్ఠము దకమునకు వేడిమిని గలుగజేయుచున్నది.) కర్మ (దకము) శేషముగ వివక్షితమైనందున షష్ఠి వచ్చెను. ఏధశబ్దము ఃరాన్తము కాష్ఠవాచకము. దకశబ్దము ఉదకపర్యాయమని (భువనమమృతంజీవనీయంద కంచ.) హలాయుధనిఘంటువున జెప్పబడియున్నది. భజే శంభోశ్చరణయోః. ఇచట కర్మ (చరణములు) శేషముగ వివక్షింపబడుటచే షష్ఠి వచ్చెను. ఫలానాం తృప్తః. (ఫలసంబన్ధి తృప్తి.) కరణము (ఫలములు) శేషముగ వివక్షితమైనం దునవిచట షష్ఠి వచ్చెను.

610. షష్ఠీ హేతుప్రయోగే. 2-3-26. షష్ఠీ, హేతుప్రయోగే (హేతౌ)

హేతుశబ్దప్రయోగే హేతౌద్యోత్యే షష్ఠీ స్యాత్ అన్న స్య హేతోర్వసతి॥

610. హేతుశబ్దప్రయోగమందు హేతుహేతుమద్భావము ద్యోత్యమగున పుడు హేతువాచకముకంటె షష్ఠి వచ్చును. అన్నస్య హేతోర్వసతి. హేతౌ (571) సూ. చే ప్రాప్తమగు తృతీయకిది బాధకము.

611. సర్వనామ్నస్తృతీయా చ. 2-3-27. సర్వనామ్నః, తృతీయా చ, (హేతౌ. హేతుప్రయోగే, షష్ఠీ).

సర్వనామ్నో హేతుశబ్దస్య చ ప్రయోగే హేతౌ ద్యోత్యే తృతీయా స్యాత్ షష్ఠీ చ। కేన హేతునా వసతి। కస్య హేతోః। (వా) నిమిత్తపర్యాయప్రయోగే సర్వాసాంప్రాయ దర్శనమ్। కిం నిమిత్తం వసతి। కేన నిమిత్తేన। కస్మై నిమిత్తాయేత్యాది। ఏవం కింకారణం కో హేతుః కింప్రయో జనమిత్యాది॥ ప్రాయగ్రహణాదసర్వనామ్నః ప్రథమాద్వి

తీయే నస్తః। జ్ఞానేన నిమిత్తేన హరిః సేవ్యః। జ్ఞానాయ నిమిత్తాయేత్యాది।

611. సర్వనామ్నః అనునది షష్ఠ్యన్తము. సర్వనామముయొక్క ప్రయోగమందు హేతుశబ్దముయొక్క ప్రయోగమందును హేతుహేతుమద్భావము ద్యోత్యమగునపుడు సర్వనామముకంటె హేతువాచకముకంటెను తృతీయయు షష్ఠియు ప్రయోగింపదగినవి. కేన హేతునా వసతి. కస్య హేతోర్వసతి. (వా) నిమిత్త పర్యాయములప్రయోగమందు నిమిత్తాదిశబ్దములకంటె తత్సమానాధికరణములకంటెను (అభేదసంబన్ధముచే విశేషణములు సమానాధికరణములనబడును.) అన్ని విభక్తులను దఱచుగ ప్రయోగింపదగును. కిం నిమిత్తం వసతి. ఇవి ప్రథమాన్తములు ద్వితీయాన్తములునగును. కేన నిమిత్తేన కస్మై నిమిత్తాయ ఈ మొదలగునవి, యుదాహరణములు వార్తికమున పర్యాయగ్రహణమువలన కారణహేతు ప్రయోజనాదిశబ్దములప్రయోగమందును సర్వవిభక్తులగును. వార్తికములోని ప్రాయగ్రహణమువలన (తఱచుగాననుటవలన) సర్వనామభిన్నమగుశబ్దముకంటె ప్రథమాద్వితీయలుకంటె భిన్నమగు విభక్తులే వచ్చును. జ్ఞానేన నిమిత్తేన హరిస్సేవ్యః. జ్ఞానాయ నిమిత్తాయమొదలగునవి.

వివ:—"నిమిత్త.........దర్శనమ్" అనువార్తికముచేతనే "షష్ఠీహేతుప్రయోగే" "సర్వనామ్నస్తృతీయాచ" అనుసూత్రద్వయోదాహరణములందును షష్ఠీతృతీయలు సిద్ధమగునుగాననారెండుసూత్రములు దృష్టప్రయోజనరహితములని (అదృష్టప్రయోజనముమాత్రము గలవి) తెలియదగును.

612. షష్ఠ్యతసర్థప్రత్యయేన, 2–3–30. షష్ఠీ, అతసర్థప్రత్యయేన।

ఏతద్యోగే షష్ఠీస్యాత్। దిక్‌శబ్దేతిపఞ్చమ్యా అపవాదః।
గ్రామస్య దక్షిణతః పురః పురస్తాత్ ఉపరి ఉపరిష్టాత్॥

612 దక్షిణోత్తరాభ్యామతసుచ్ (5–3–18) అను సూ.చే విహితమగు అతసుచ్‌ప్రత్యయమునకు దిగ్దేశకాలములర్థము. ఇట్టియర్థముగల ప్రత్యయములు అస్తాతి మొదలగునవి పదినైదు గలవు. ఈప్రత్యయము లన్తమందుగలవి దక్షిణతః పురః పురస్తాత్ మొదలగునవి. వీనితో యోగమున్నపుడు షష్ఠి యగును. అతసర్థప్రత్యయాన్తములన్నియును దిక్‌శబ్దములగుటచే వీనియోగమందు "అన్యారాత్" (598) సూ. చే ప్రాప్తమగు పఞ్చమీవిభక్తికిషష్ఠి యపవాదము. గ్రామస్య దక్షిణతః పురః పురస్తాత్ ఉపరి ఉపరిష్టాత్. దక్షిణతః అనునది అతసుచ్‌ప్రత్యయాన్తము. పురః అనునది అసిప్రత్యయాన్తము. పురస్తాత్ అనునది అస్తాతిప్రత్యయాన్తము. ఉపరి అనునది రిల్‌ప్రత్యయాన్తము. ఉపరిష్టాత్ అనునది రిష్టాతిల్‌ప్రత్యయాన్తము.

613. ఏనపా ద్వితీయా. 2-3-31. ఏనపా, ద్వితీయా।

ఏనబన్తేన యోగే ద్వితీయా స్యాత్। ఏనపేతియోగ విభాగాత్ షష్ఠ్యపి। దక్షిణేన గ్రామం గ్రామస్య వా। ఏవ ముత్తరేణ॥

613. ఏనప్ అనునది "ఏనబన్యతరస్యామదూరేऽపఞ్చమ్యాః" (5-3-35) అను సూ. చే నుత్తరాదిశబ్దములకంటెనవధ్యవధిమత్తులసామీప్యమందు విధింపబడు తద్ధితప్రత్యయము. ఏనబన్తముతో యోగమందు ద్వితీయ యగును. ఏనపా అనుదానిని విభజించి షష్ఠీపదమునను వృత్తిచేసి ఏనబన్తయోగమందు షష్ఠిని విధింపవలయును. ఇందువలననేనబన్తయోగమున షష్ఠియును సాధువగును. దక్షిణేన గ్రామం గ్రామస్య వా (గ్రామమునకు దక్షిణదిశయందు) దక్షిణేన అనునది పైసూత్రముచే విహితమగునేనబన్తము. ఇట్లె ఉత్తరేణ అనునేనబన్తయోగమందును షష్ఠీద్వితీయలనూహించునది.

వివ:—కాశికాకారుననుసరించి యోగవిభాగము వ్రాయబడెను. ఇచటయోగవిభాగము భాష్యమందగపడదు. మేఘదూతకావ్యమున "తత్రాऽగారం ధనపతిగృహాదుత్తరేణ" అనుపాఠము కొన్నిపుస్తకములందగపడుచున్నది. ఉత్తరేణ అనునది ఏనబన్తమవిన ధనపతిగృహాత్ అనుచోట పంచమి యసాధువుగావలయును. కాన ఉత్తరేణ అనునది తృతీయాన్తమనియునది యాశ్లోకములోని తోరణేన అనుదానికి విశేషణమనియును జెప్పవలయును. "ధనపతిగృహానుత్తరేణ" అనుపాఠమును కొంతమంది చెప్పుచున్నారు. అపుడు ఉత్తరేణ అనునది ఏనబన్తమనియే జెప్పవచ్చును.

614. దూరాన్తికార్థైః షష్ఠ్యన్యతరస్యామ్. 2-3-34. దూరాన్తికార్థైః. షష్ఠీ, అన్యతరస్యామ్ (పఞ్చమీ).

ఏతైర్యోగే షష్ఠీ స్యాత్పఞ్చమీ చ। దూరం నికటం గ్రామస్య గ్రామాద్వా॥

614, దూరార్థకములతోను, సమీపార్థకములతోను యోగమున్నపుడు షష్ఠీపఞ్చమీవిభక్తులగును. దూరం నికటం గ్రామస్య గ్రామాద్వా.

వివ:—దూరత్వమునకు సామీప్యమునకునేది యవధియగునో తద్వాచకము కంటెనీవిభక్తులగును. అన్యతరస్యామ్ అనునది నిపాతము, సముచ్చయార్థకము. ఈషష్ఠికి వ్యవహితమగు పంచమితోనే సముచ్చయముగాని సన్నిహితములైనను ద్వితీయాతృతీయలతో గాదు, ఇందు శిష్టకృతమగువ్యాఖ్యానమే మానము.

615. జ్ఞోऽవిదర్థస్య కరణే. 2-3-51. జ్ఞః, అవిదర్థస్య, కరణే (షష్ఠీశేషే)

జానాతేరజ్ఞానార్థస్య కరణే శేషత్వేన వివక్షితే షష్ఠీ స్యాత్। సర్పిషో జ్ఞానమ్॥

615. జ్ఞానార్థకముగానట్టి జ్ఞాధాతువుయొక్క కరణము (సాధకతమము) శేషముగ వివక్షింపబడునపుడు (కరణవాచకముకంటె) షష్ఠి యగును. సర్పిషో జ్ఞానమ్. (సర్పిస్సంబన్ధియగు ప్రవృత్తి) జ్ఞాధాతువునకు లక్షణచే జ్ఞానపూర్వక ప్రవృత్తి యర్థము. ప్రవృత్తినిగుఱించి వాస్తవముగ కరణమగు సర్పిస్సు శేషముగ వివక్షితమగుటచే షష్ఠి వచ్చెను.

వివ:—సర్పిషోజ్ఞానమ్ మొదలగుస్థలములందు "షష్ఠీశేషే" (609) సూ. చేతనే షష్ఠి సిద్ధమగును. ఏతత్సూత్రోదాహరణములందేగాక చెప్పబోవు 1. అధీగర్థదయేశాంకర్మణి 2. కృఞః ప్రతియత్నే. 3. రుజార్థానాంభావవచనానామజ్వరేః 4. ఆశిషినాథః. 5. జాసినిప్రహణనాటక్రాథపిషాంహింసాయామ్. 6. వ్యవహృపణోస్సమర్థయోః 7. కృత్వోర్థప్రయోగేకాలేఽధికరణే. అనునేడుసూత్రముల యుదాహరణములందును "షష్ఠీశేషే" (609) సూ. చేతనే షష్ఠి సిద్ధమగును. ఇట్లుండనీయెనిమిదిసూత్రములకేమిప్రయోజనమనిన, షష్ఠీ (706) అనుసూత్ర విహితమగు సమాసము యొక్క నివృత్తియే ఫలమని తెలియదగును. ఎట్లన:— షష్ఠీ అనుసూత్రముచే విధింపబడు సమాసము "ప్రతిపదవిధానాషష్ఠీనసమస్యతే" అనువార్తికముచే నిషేధింపబడును. ఈసూత్రములచే విధింపబడు షష్ఠి ప్రతిపద విధానమగును. కావుననీయెనిమిదిసూత్రములచే విధింపబడు షష్ఠ్యన్తములకు (సర్పిషోజ్ఞానమ్ మాతుఃస్మరణమ్ఇత్యాదులు.) సమాసము రాదు. ఈవిషయ మును సూచించుటకే ఈయెనిమిదిసూత్రములయుదాహరణములందును తత్తత్సూత్రోక్తములగు ధాతువులకు తిఙన్తరూపములను (జానాతిస్మరతిఇత్యాదులు) విడిచి కృదన్తరూపములే (జ్ఞానమ్ స్మరణమ్ మొదలగునవి) చూపబడినవి. "సర్పిషో జానీతే" అనురీతిని తిఙన్తరూపములను చూపినను సూత్రములయుదాహరణము లగును గానితిఙన్తముతో సమాసమునకు ప్రాప్తియే లేనందుననీసూత్రములకు సమాసనివృత్తి ఫలమని చెప్పుటకవకాశము గలుగదు.

616. అధీగర్థదయేశాం కర్మణి. 2-3-52. అధీ....యేశాం, కర్మణి (షష్ఠీశేషే.)

ఏషాం కర్మణి శేషే షష్ఠీ స్యాత్। మాతుః స్మరణమ్। సర్పిషో దయనమ్। ఈశనం వా॥

616. అధిపూర్వకమగు ఇక్ ధాతువునకు స్మరణమర్థము. అధీగర్థములన స్మృత్యర్థకధాతువులు. స్మృత్యర్థకధాతువులయొక్కయు దయ (దానే) ఈశ (ఐశ్వర్యే) ధాతువులయొక్కయు కర్మ శేషముగ వివక్షితమగునపుడు కర్మవాచకముకంటె షష్ఠి యగును. మాతుః స్మరణమ్, సర్పిషో దయనమ్, సర్పిష

ఈశనమ్, మాత్రాధులు కర్మలు. మాతృసంబన్ధిస్మరణము మొదలగునవి యర్థములు.

617. కృఞః ప్రతియత్నే. 2-3-53. కృఞః, ప్రతియత్నే (షష్ఠీ శేషే.)

కృఞః కర్మణి శేషే షష్ఠీ స్యాత్ గుణాధానే। ఏధోదకస్యోపస్కరణమ్॥

617. గుణాధానమర్థముగల కృఞ్ధాతువుయొక్క కర్మ శేషముగ వివక్షితమగునపుడు షష్ఠి వచ్చును. ఏధోదకస్యోపస్కరణమ్.

618. రుజార్థానాం భావవచనానామజ్వరేః. 2-3-54. రుజార్థానామ్, భావవచనానామ్, అజ్వరేః (కర్మణి, షష్ఠీ, శేషే.)

భావకర్తృకాణాం జ్వరివర్జితానాం రుజార్థానాం కర్మణి శేషే షష్ఠీ స్యాత్। చౌరస్య రోగస్య రుజా। (వా) అజ్వరిసంతాప్యోరితి వాచ్యమ్। రోగస్య చౌరజ్వరః। చౌరసంతాపో వా। రోగకర్తృకం చౌరసంబన్ధి జ్వరాదికమిత్యర్థః॥

618. రుజాశబ్దమునకర్థము వ్యాధి. భావవచనశబ్దమునకు భావము కర్తగాగలవని యర్థము. భావమన కృదన్తబోధ్యమగు ధాత్వర్థము. భావము కర్తగగల్గి జ్వరధాతుభిన్నములైన వ్యాధ్యర్థకధాతువులయొక్క కర్మ శేషముగ వివక్షితమగునపుడు కర్మవాచకమునకు షష్ఠి యగును. చోరస్య రోగస్య రుజా. రుజుధాతుకర్మ చోరుడు గానచోరశబ్దమునకు షష్ఠి వచ్చెను. రోగము (భావము) కర్త. రోగశబ్దముకంటె "కర్తృకర్మణోః కృతి". (626) అను సూ. చే షష్ఠి వచ్చెను. రోగకర్తృకమగు చోరసంబన్ధివ్యాధి యని యర్థము. (వా) సూత్రకారుడు జ్వరధాతువునువిడువమన్నియెను. జ్వరధాతువును సంపూర్వకతపధాతువునుగూడ విడువవలయునని వార్తికకారమతము. రోగస్య చోరజ్వరః. రోగస్య చోరసంతాపో వా. ఈచోటు లందీసూత్రముచే షష్ఠి రానందున పూర్వోక్తమగు "ప్రతిపదవిధానా షష్ఠీ న సమస్యతే" అనుసమాసనిషేధమిచట ప్రవర్తింపదు. కావున షష్ఠీ (706) అను సూత్రముచే సమాసమగును. ఇట్లీయెనిమిది సూత్రములప్రత్యుదాహరణములందును సమాసమగునని యూహింపదగును. రోగకర్తృకమగు చోరసంబన్ధిజ్వరాదికి యర్థము.

619. ఆశిషి నాథః. 2-3-55. ఆశిషి, నాథః (కర్మణి)

ఆశీరర్థస్య నాథతేః శేషే కర్మణి షష్ఠీ స్యాత్। సర్పిషో నాథనమ్। ఆశిషీతి కిమ్। మాణవకనాథనమ్। తత్సంబన్ధినీ యాచ్ఞేత్యర్థః॥

619. ఆశీర్వాదమర్థముగల నాథధాతువుయొక్క కర్మ శేషముగ వివక్షిత మగునపుడు షష్ఠి వచ్చును. సర్పిషో నాథనమ్ (సర్పిస్సు నాకు కలుగవలెయునను ఆశాసనము.) మాణవకనాథనమ్ (మాణవకసంబన్ధి యాచనము.) యాచనార్థక మగు నాథధాతువుయొక్క కర్మను బోధించు శబ్దముకంటె షష్ఠిని వారించుటకై సూత్రమున ఆశిషి అననది యావశ్యకము.

620. జాసినిప్రహణనాటక్రాథపిషాం హింసాయామ్. 2-3-56.
జాసి......పిషాం, హింసాయామ్। (కర్మణి)

హింసార్థానామేషాం కర్మణి శేషే షష్ఠీ స్యాత్। చౌరస్యో జ్జాసనమ్। నిప్రౌ సంహతౌ విపర్యస్తౌ వ్యస్తౌ వా। చౌరస్య నిప్రహణనమ్। ప్రణిహననమ్। నిహననమ్। ప్రహణనం వా। నట అవస్కందనే చురాదిః। చౌరస్యోన్నాటనమ్। చౌరస్య క్రాథనమ్। వృషలస్య పేషణమ్। హింసాయామ్ కిమ్। ధానాపేషణమ్॥

620. హింసార్థకములగు జాసి (జసు=హింసాయాం। చురాదిగణము) నిప్రపూర్వకమగు హన (హింసాగత్యోః) నాట (నట=అవస్కందనే। చురాది) క్రాథ (క్రథ=హింసాయాం) పిష్ల్ (పేషణే) ధాతువులయొక్క కర్మ శేషముగ వివక్షితమగునపుడు షష్ఠియగును. చోరస్యోజ్జాసనమ్. (చోరసంబన్ధియగుహింస) ఉజ్జాసనమ్ అమనది ఉత్పూర్వకజసుధాతు ప్రకృతికల్యుడన్తము. నిప్రహణ అను దానిచే ని పహణ ప్రణిహన నిహన ప్రహణ ధాతువులకు గ్రహణము. చోరస్య నిప్రహణనమ్ మొదలగునవి యుదాహరణములు. వృషలస్య పేషణమ్. చోరస్యోన్నాటనమ్. వీనికి తత్తత్సంబన్ధి హింస యర్థము. ధానాపేషణమ్. (అటుకులను దంపుట.) ప్రాణులపీడయే హింస యనబడును. పిషధాతువిచట హింసార్థకము గాదు. ఇట్టిచోటులందు సూత్రము ప్రవర్తింపకుండుటకై సూత్రమున హింసాయామ్ అనునది యావశ్యకము.

621. వ్యవహృపణోస్సమర్థయోః. 2-3-57. వ్యవహృపణోః, సమర్థయోః (కర్మ.)

శేషే కర్మణి షష్ఠీ స్యాత్। ద్యూతే క్రయవిక్రయవ్యవహారే చానయోస్తుల్యార్థతా। శతస్య వ్యవహరణం పణనం వా। సమర్థయోః కిమ్। శలాకావ్యవహారః। గణనేత్యర్థః। బ్రాహ్మణపణనమ్। స్తుతిరిత్యర్థః॥

621. సమర్థయోః=సమపర్యాయమగు సమ్ శబ్దమునర్థశబ్దముతో సమాసము. లేకసమశబ్దమున్నకర్థశబ్దముతో సమాసముచేసి శకన్ధ్వాదిపరరూపము వలన నిట్టిరూపము సాధువగును. తుల్యార్థకములనియర్థము. సమానార్థకములగు వ్యవ

పూర్వకమగు హృఞ్ (హరణే) ధాతువు, పణ (వ్యవహారే స్తుతౌ చ.) ధాతువు, వీనియొక్క కర్మ శేషముగ వివక్షింపబడునపుడు షష్ఠి వచ్చును. ద్యూతము (జూదము) క్రయవిక్రయవ్యవహారము (కొనుట అమ్ముట) అనునీయర్థములందీ రెండుధాతువులు సమానార్థకములగును. శతస్య వ్యవహరణం. శతస్య పణనం. (శతసంబన్ధిద్యూతము శతసంబన్ధి క్రయవిక్రయవ్యవహారము.) శలాకావ్యవహారః. (శలాకలనులెక్కించుట) బ్రాహ్మణపణనం (బ్రాహ్మణస్తుతి) ఈయర్థములందు హృ పణ ధాతువులు ఉల్యార్థకములు గావు. ఇట్టిచోటులందీసూత్రము ప్రవర్తింపకుండుటకై సమర్థయోః అను విశేషణమావశ్యకము.

622. దివస్తదర్థస్య. 2-3-58. దివః, తదర్థస్య (కర్మణి, షష్ఠీ)

ద్యూతార్థస్య క్రయవిక్రయరూపవ్యవహారార్థస్య చ దివః కర్మణి షష్ఠీ స్యాత్। శతస్య దీవ్యతి। తదర్థస్య కిమ్। బ్రాహ్మణమ్ దీవ్యతి। స్తౌతీత్యర్థః॥

622. తదర్థస్య అనుచోట తచ్ఛబ్దము పూర్వసూత్రములోని వ్యవహృపణ ధాతువులను పరామర్శించును. వానికి పూర్వసూత్రమున ద్యూతక్రయవిక్రయవ్యవహారములర్థము. ఇట్టి యర్థముగల దివ్ధాతువుయొక్క కర్మను బోధించుశబ్దముకంటె షష్ఠి వచ్చును. ఈసూత్రములోనికి శేషే అనునది యనువర్తింపదు. కావుననీ సూత్రోదాహరణములందు "షష్ఠీశేషే" సూ. చే షష్ఠి సిద్ధముగాదు. ఈ సూత్రము "కర్మణిద్వితీయా" (540) సూ. చే ప్రాప్తమగు ద్వితీయకు బాధకము. సమాసనివృత్తి యీసూత్రమునకు ఫలముగాదని సూచించుటకే శతస్య దీవ్యతి (శతకర్మకమగు ద్యూతము.) అనుతిఙన్తరూపములనుదాహరించెను. బ్రాహ్మణం దీవ్యతి (బ్రాహ్మణుని స్తుతింపుచున్నాడు.) స్తుత్యర్థకమగుదివ్ధాతువుయొక్క కర్మను బోధించు శబ్దమునకు షష్ఠిని వారించుటకు సూత్రమును తదర్థస్య అనునది యుండవలయును.

623. విభాషోపసర్గే. 2-3-59. విభాషా, ఉపసర్గే (దివస్తదర్థస్య, కర్మణి, షష్ఠీ)

పూర్వయోగాపవాదః। శతస్య శతం వా ప్రతిదీవ్యతి॥

623. ద్యూతార్థకము క్రయవిక్రయవ్యవహార్థకము ఉపసర్గముపూర్వమందు గలదినగు దివ్ధాతువుయొక్క కర్మను ప్రతిపాదించుశబ్దముకంటె షష్ఠి వికల్పముగ నగును. పక్షమందు ద్వితీయవచ్చును. పూర్వసూత్రమునకిది యపవాదము. శతస్య శతం వా ప్రతిదీవ్యతి.

624. ప్రేష్యబ్రువోర్హవిషో దేవతాసంప్రదానే. 2-3-61. ప్రేష్యబ్రువోః, హవిషః, దేవతాసంప్రదానే (షష్ఠీ,కర్మణి)

దేవతాసంప్రదానేఽర్థే వర్తమానయోః ప్రేష్యబ్రువోః కర్మణో హవిర్విశేషస్య వాచకాచ్ఛబ్దాత్ షష్ఠీ స్యాత్। అగ్నయే ఛాగస్య హవిషో వపాయా మేదసః ప్రేష్య అను బ్రూహి వా.

624. ప్రేష్య అనునది దైవాదికముగత్యర్థకమునగు ఇషధాతువునకు లోణ్మధ్యమపురుషైకవచనము. దీనిసాహచర్యమువలన బ్రూఞ్ అనువానిచే బ్రూహి (బ్రూఞ్ధాతువునకు లోణ్మధ్యమపురుషైకవచనము) అనుదానికే గ్రహణము. దేవతాసంప్రదానకములగు ప్రేష్య బ్రూహి అనువీనికి కర్మలగు హవిర్విశేషములను బోధించుశబ్దములకంటె షష్ఠి యగును. అగ్నయే ఛాగస్య హవిషో వపాయా మేదసః ప్రేష్య అనుబ్రూహి వా. అగ్నిసంప్రదానకములగు ప్రేష్య బ్రూహి అనువీనికి ఛాగాదులు కర్మలగుటచే తద్వాచకములకంటె షష్ఠి వచ్చెను.

625. కృత్వోఽర్థప్రయోగే కాలేఽధికరణే. 2-3-64. కృత్వోఽర్థ ప్రయోగే, కాలే, అధికరణే (షష్ఠీ, శేషే.)

కృత్వోఽర్థానాం ప్రయోగే కాలవాచిన్యధికరణే శేషే షష్ఠీ స్యాత్। పఞ్చకృత్వోఽహ్నో భోజనమ్। ద్విరహ్నో భోజనమ్। శేషే కిమ్। ద్విరహన్యధ్యయనమ్॥

625. "సంఖ్యాయాః క్రియాఽభ్యావృత్తిగణనే కృత్వసుచ్" (5-4-17) అనుసూత్రముచే క్రియాజన్మగణనమును ప్రతిపాదించు సంఖ్యావాచకముకంటె స్వార్థమందు కృత్వసుచ్ప్రత్యయము విధింపబడెను, ఉదా :—పఞ్చకృత్వో భుఙ్క్తే (అయిదుసారులు భుజించుచున్నాడు.) కృత్వసుచ్ప్రత్యయముయొక్క యర్థమును (క్రియాజన్మగణనమును) బోలుఅర్థముగల ప్రత్యయములన్నమందు గల్గిన శబ్దములయొక్క ప్రయోగమందు కాలవాచకమగు నధికరణము శేషముగ వివక్షింపబడునపుడు కాలవాచకముకంటె షష్ఠియగునని సూత్రార్థము. పఞ్చకృత్వోఽహ్నో భోజనమ్. (అహస్సంబన్ధియగు భోజనమైదుసారులు.) అధికరణమగునహమ్సు (కాలము) శేషముగ వివక్షితమగుటచే తద్వాచకమునకు షష్ఠి వచ్చెను. ద్విరహ్నో భోజనమ్. ద్విః అనునది కృత్వసుజర్థకసుచ్ప్రత్యయాన్తము. శేషేకిమ్ ? "దివస్తదర్థస్య" సూత్రములోనికి శేషగ్రహణమనువృత్తముగాదు. శేషగ్రహణ సంబన్ధము విచ్ఛిన్నమగుటవలననీసూత్రముచేనధికరణకారకమందే షష్ఠి విధానము యుక్తమని ప్రశ్నాశయము. ద్విరహన్యధ్యయనమ్. కాశికావృత్త్యాదిగ్రన్థప్రామాణ్యమువలన మణ్డూకానువృత్తిచే శేషగ్రహణమునకీ సూత్రమున సంబన్ధమును చేయవలయును. లేనిచో ద్విరహన్యధ్యయనమ్ అనుచోట అహస్సు శేషముగ వివక్షితముగానపుడును అహశ్శబ్దమునకు షష్ఠి ప్రసక్తమగునని యుత్తరాశయము.

626. కర్తృకర్మణోః కృతి. 2-3-65. కర్తృకర్మణోః, కృతి (షష్ఠీ)

కృద్యోగే కర్తరి కర్మణి చ షష్ఠీ స్యాత్। కృష్ణస్య కృతిః। జగతః కర్తా కృష్ణః। (వా) గుణకర్మణి వేష్యతే। నేతాఽశ్వస్య స్రుఘ్నస్య స్రుఘ్నం వా। కృతి కిమ్। తద్ధితే మా భూత్। కృతపూర్వీ కటమ్॥

౬౨౮. కృదన్తయోగమందు కృత్ప్రత్యయప్రకృతియగు ధాతువుయొక్క కర్తను (ధాత్వర్థవ్యాపారాశ్రయమును) గాని కర్మను (ధాత్వర్థఫలాశ్రయమును) గాని బోధించుశబ్దముకంటె షష్ఠి యగును. కర్తృవాచకములకుదాహరణము:— కృష్ణస్య కృతిః (కృష్ణకర్తృకం కరణమ్) కృష్ణుడు కర్త, కృతిః అనునది కృదన్తము. కర్మవాచకమునకుదాహరణము:— జగతః కర్తా కృష్ణః జగత్తు కర్మ, కర్తా అనునది కృదన్తము. (వా) కృదన్తయోగమునందప్రధానకర్మవాచకములకంటె షష్ఠి వికల్పముగనగును నేతాఽశ్వస్య స్రుఘ్నస్య స్రుఘ్నం వా. స్రుఘ్నమప్రధానకర్మ. షష్ఠ్యభావపక్షమునద్వితీయ వచ్చును. కృతికిమ్? ధాత్వర్థవ్యాపారాశ్రయముకర్త, ధాత్వర్థఫలాశ్రయముకర్మ. కర్తృకర్మలు ధాతువునువిడిచియుండవు. కావునవానిచే ధాతువాక్షిప్తమగును. ధాతువులకంటె విహితములగు ప్రత్యయములు తిఙ్లనియు, కృత్తులనియు రెండువిధములు. తిఙ్ యోగమందు (కటంకరోతి ఇత్యాదులందు) నలోకావ్యయనిష్ఠాఖలర్థతృనామ్ (౬౩౦) అను సూ. చే షష్ఠి నిషేధింపబడుచున్నందున కృద్యోగమందే (జగతః కర్తా) కర్తృకర్మవాచకములకంటె షష్ఠి ప్రవర్తించును గాన సూత్రమందలి కృద్గ్రహణమునకేమి ప్రయోజనమని ప్రశ్నాశయము. "తద్ధితే మా భూత్। కృతపూర్వీకటమ్" తద్ధితాన్తసముదాయశక్తిచేగల్గెడిబోధమునందు విషయమగుక్రియయొక్క కర్తనుగానికర్మనుగానిబోధించుశబ్దము(కర్తృవాచకముకర్మవాచకము) కంటె షష్ఠిని వారించుటకై కృద్గ్రహణమావశ్యకము. కృతపూర్వీకటమ్. కృతం పూర్వమనేన అని విగ్రహము. కృఞ్ ధాతువు అవివక్షితకర్మగలదగుటచే నకర్మకమగునుగాన భావార్థమందు క్తప్రత్యయము. (కృత్తుచేకర్మయుక్తము గాదు.) కృతపూర్వశబ్దములకు సుపా (౬౫౩) అను సూ. చే సమాసము. "సపూర్వాచ్చ" (౫-౨-౮౭) అను సూ. చే కర్త్రర్థమందిని ప్రత్యయము. (కృతపూర్వీ అనియగును. తద్ధితాన్తము) తరువాత కర్మ వివక్షితమగును. కృత్తుచే కర్మ యభిహితముగావందున కటశబ్దమనుక్తకర్మవాచకమగును. కటము తద్ధితాన్తసముదాయశక్తిచే బోధ్యమగునర్థమున విషయమగుక్రియయొక్క (కృధాత్వర్థముయొక్క) కర్మయగుటవలన కటశబ్దముకంటె నీసూత్రముచే ప్రాప్తమగు షష్ఠి వారితమగును. ద్వితీయ వచ్చును. ఈసూత్రమున కృద్గ్రహణమున్నపుడు కృదన్తమగుశబ్దముచేతనేగల్గెడిబోధమునందు విషయమగుక్రియయొక్క కర్తనుగాని, కర్మనుగాని బోధించెడిప్రాతిపదికముకంటె షష్ఠి యగుననియర్థము లభించును గావుననిచ్చోట షష్ఠివారితమగుననిసమాధానాశయము. కృతపూర్వీ అనుచోట తద్ధితవృత్తికిపూర్వము కర్మయవివక్షితమగుననియు పిదపవివక్షితమగుననియు చెప్పుటలో నీసూత్రముయొక్కభాష్యమే మానమని గ్రహించునది,

627. ఉభయప్రాప్తౌ కర్మణి. 2-3-66. ఉభయప్రాప్తౌ, కర్మణి (షష్ఠీ, కృతి.)

ఉభయోః ప్రాప్తిర్యస్మిన్ కృతి తత్ర కర్మణ్యేవ షష్ఠీ స్యాత్। ఆశ్చర్యోగవాందోహో౽గోపేన। (వా) స్త్రీప్రత్యయయోరకాకారయోర్నాయం నియమః। భేదికా బిభిత్సా వా రుద్రస్య జగతః 2 (వా) శేషే విభాషా। స్త్రీప్రత్యయ ఇత్యేకే। విచిత్రా జగతః కృతిర్హరేర్హరిణా వా। కేచిదవిశేషేణ విభాషామిచ్ఛన్తి। శబ్దానామనుశాసనమాచార్యేణాచార్యస్య వా॥

627. ఉభయప్రాప్తౌ అనునది బహువ్రీహి (ఉభయోః ప్రాప్తిర్యస్మిన్ = ఉభయప్రాప్తిర్యస్మిన్) ఏకృద్యోగమునందుభయమునకును (కర్తృవాచకమునకును, కర్మ వాచకమునకును) షష్ఠి ప్రాప్తమగునో యట్టిచోట కర్మవాచకమునకే షష్ఠి వచ్చును. (కర్తృవాచకమునకురాదు.) పూర్వసూత్రప్రాప్తమగు షష్ఠికిది నియామకము. ఆశ్చర్యోగవాందోహో౽గోపేన. (గోపభిన్నునిచే గోకర్మకదోహనమాశ్చర్యకరము.) దోహః అనునది కృదన్తము. ఈ కృదన్తయోగమందు అగోపశబ్దమునకు (కర్తకు) గోశబ్దమునకు (కర్మకు) పూర్వసూత్రముచే షష్ఠి ప్రాప్తమగుచున్నది. ఈ సూత్రముచే గోశబ్దమునకే షష్ఠి వచ్చును. అగోపశబ్దమునకు నివృత్తమగును. 1 (వా) స్త్రీప్రత్యయములన "స్త్రియాం క్తిన్" (3-3-94) అనునధికారమున విహితములగు కృత్ప్రత్యయములు. స్త్రీప్రత్యయములగు అక అ అనునవి యన్తమందుగలవాని యొక్క యోగమందీనియమము ప్రవర్తించదు. ఉభయమునకు షష్ఠి వచ్చునని ఫలితమగును. భేదికా బిభిత్సా వా రుద్రస్య జగతః (రుద్రకర్తృకము జగత్కర్మకమునగు భేదనము లేక భేదనేచ్ఛ.) భేదికా అనునది అకప్రత్యయాన్తము. బిభిత్సా అనునది అ ప్రత్యయాన్తము. ఉభయమునకు షష్ఠివచ్చెను. 2 (వా) శేషేవిభాషా. శేషశబ్దమునకు అకాకారప్రత్యయములకంటె మిగిలిన స్త్రీప్రత్యయములు (క్తినాదులు) అని కొందఱు వ్యాఖ్యానముజేసిరి. ఈపక్షమున అకప్రత్యయాకారప్రత్యయములకంటెభిన్నమగు స్త్రీప్రత్యయముల న్తమందుగలవానితో యోగమందు కర్తృవాచకములకంటె షష్ఠి వికల్పముగనగునని యర్థము విచిత్రా జగతః కృతిర్హరేర్హరిణా వా. కృతిః అనునది క్తిన్ప్రత్యయాన్తము. హరిశబ్దము కర్తృవాచకము. షష్ఠ్యభావపక్షమందు తృతీయ వచ్చును. శేషపదమునకు అకా౽కారప్రత్యయభిన్నములగు స్త్రీప్రత్యయములేగాక మిగిలినకృత్ప్రత్యయములన్నియునర్థమని మఱికొందఱు వ్యాఖ్యానముచేసిరి. వీరిమతమున అకా౽కారప్రత్యయభిన్నకృదన్తయోగమందు కర్తృవాచకముకంటె షష్ఠి వికల్పముగనగునని యర్థము. శబ్దానామనుశాసనమాచార్యేణాచార్యస్య వా. అనుశాసనమ్ అనునదిల్యుట్ప్రత్యయాన్తము. ఆచార్యుడు కర్త.

వివ:—ఉభయప్రాప్తౌ అనునది బహువ్రీహి. అన్యపదార్థమేకకృత్ప్రత్యయము. ఏకకృత్ప్రత్యయయోగమునను భయమునకు షష్ఠి ప్రాప్తమగునపుడే యీనియమము ప్రవర్తించును. అనగా కర్తృకర్మలకొకేకృత్ప్రత్యయము నిమిత్తమగు చోటులందే ప్రవర్తించునని భావము. ఆశ్చర్యోగవాందోహోఽగోపేన అనుచోట కర్తృకర్మలకొకదోహశబ్దమే (కృదన్తము) నిమిత్తము. ఇట్లు చెప్పుటవలన "ఓదనస్య పాకః, బ్రాహ్మణానాం చ ప్రాదుర్భావః" అనుచోట ఓదనశబ్దనకు (కర్మకు) షష్ఠివచ్చుటలో పాకః అనునది నిమిత్తము బ్రాహ్మణశబ్దమునకు షష్ఠి వచ్చుటలో (కర్తలకు) ప్రాదుర్భావః అనునది నిమిత్తమునగుటచే కర్తృకర్మలకు నిమిత్తభేదమున్నందుననీనియమము ప్రవర్తించదు. కావుననిట్టిచోటులందుభయమునకు షష్ఠి వచ్చునని యభిప్రాయము.

628. క్తస్య చ వర్తమానే. 2-3-67. క్తస్య, చ, వర్తమానే
(షష్ఠీ.)

వర్తమానార్థస్య క్తస్యయోగే షష్ఠీ స్యాత్। నలోకేతి
నిషేధస్యాపవాదః। రాజ్ఞాం మతో బుద్ధః పూజితో వా॥

628. వర్తమానకాలమున విహితమగు క్తప్రత్యయమన్తమందుగలదానితో యోగమందు కర్తృవాచకముకంటె షష్ఠి యగును. "నలోకావ్యయ" (630) అను సూత్రప్రాప్తమగు షష్ఠీనిషేధమునకిది యపవాదము. రాజ్ఞాంమతో బుద్ధః పూజితో వా. "మతః" మొదలగునవి "మతిబుద్ధిపూజార్థేభ్యశ్చ" (3-2-188) అను సూ. చే వర్తమానకాలమునవిహితమగు క్తప్రత్యయాన్తములు. రాజన్ శబ్దముకర్తృవాచకము.

వివ:—"పూజితోయస్సురాసురైః" అనుచోట పూజితః అనునది భూతకాలిక క్తప్రత్యయాన్తమగుటచేనీసూత్రము ప్రవర్తింపదుగాన తృతీయ యుపపన్నమగును.

629. అధికరణవాచినశ్చ. 2-3-68. అధికరణవాచినః, చ
(క్తస్య, షష్ఠీ)

క్తస్యయోగే షష్ఠీ స్యాత్। ఇదమేషామాసితం శయితం
గతం భుక్తం వా॥

629. అధికరణార్థమునవిహితమగు క్తప్రత్యయమన్తమందుగలదానితో యోగమందు కర్తృకర్మవాచకములకంటె యథాసంభవముగషష్ఠి వచ్చును. ఈసూత్రము గూడ "నలోకావ్యయ" అనుసూత్రమునకపవాదము. ఇదమేషామాసితం శయితం గతం భుక్తం వా. ఆసితాదిశబ్దములధికరణార్థక క్తప్రత్యయాన్తములు. (ఆస్యతేఅస్మిన్ మొదలగునర్థములందు క్తప్రత్యయమగును) ఆసితం=కూర్చొనుటకాధారము. (పీటమొ॥) శయితం=శయనాధారము. ఇదంశబ్దార్థము కర్తకావున ఏషామనుచోట షష్ఠి వచ్చెను.

630. నలోకావ్యయనిష్ఠాఖలర్థతృనామ్. 2-3-69. న, లోకావ్యయ.........తృనామ్ (షష్ఠీ, కృతి)

ఏషాం ప్రయోగే షష్ఠీ న స్యాత్। లాదేశాః। కుర్వన్ కుర్వాణో వా సృష్టిం హరిః। ఉః। హరిం దిదృక్షుః। అలంకరిష్ణుర్వా। ఉక। దైత్యాన్ ఘాతుకో హరిః। 1 (వా) కమేరనిషేధః। లక్ష్మ్యాః కాముకో హరిః। అవ్యయమ్। జగత్ సృష్ట్వా। సుఖం కర్తుమ్। నిష్ఠా। విష్ణునా హతా దైత్యాః। దైత్యాన్ హతవాన్ విష్ణుః। ఖలర్థాః। ఈషత్కరః ప్రపఞ్చో హరిణా। తృన్నితి ప్రత్యాహారః శతృశానచావితి తృశబ్దాదారభ్యా తృనో నకారాత్। శానన్। సోమం పవమానః। చానశ్। ఆత్మానం మణ్డయమానః। శతృ। వేదమధీయన్। తృన్। కర్తా లోకాన్। 2 (వా) ద్విషః శతుర్వా। మురస్య మురం వా ద్విషన్। సర్వోఽయం కారకషష్ఠ్యాః ప్రతిషేధః। శేషేషష్ఠీ తు స్యాదేవ। బ్రాహ్మణస్య కుర్వన్। నరకస్య జిష్ణుః॥

630. లశ్చఉకశ్చ=ఉకౌ లశ్చఉకౌచ అవ్యయంచ నిష్ఠాచ ఖలర్థాశ్చ తృన్ చ అని ద్వన్ద్వము. ఇందు ల పదము లట్ లిట్ మొదలగు లకారకముల స్థానమున విహితములగు నాదేశములను (శతృ శానచ్ మొదలగునవి.) బోధించును. ఉ అనునది యనువృత్తమగు కృత్ప్రత్యయమునకు విశేషణమగుటచే తదన్త విధివలనముకారాన్త ప్రత్యయమును (ఇష్ణు మొదలగునవి) ఉకారరూపప్రత్యయమును బోధించును. లాదేశములు ఉకారాన్తప్రత్యయము, ఉకారరూప ప్రత్యయము, ఉకప్రత్యయము అవ్యయకృత్తులు (కృదన్తావ్యయములు) నిష్ఠ (క్త క్తవతుప్రత్యయములు.) ఖలర్థప్రత్యయములు తృన్ప్రత్యాహారములోని ప్రత్యయములు ఇవి యన్తమందుగల వానితో యోగమున్నపుడు కర్తృకర్మవాచకములకంటె షష్ఠి రాదు. కర్తృకర్మణోః కృతి (626) అనుసూత్రముచే ప్రాప్తమగు షష్ఠికి నిషేధము. క్రమముగను దాహరణములు:—కుర్వన్ కుర్వాణో వా సృష్టిం హరిః. కృఞ్ ధాతువు నుండు లట్టు స్థానమున శతృ ప్రత్యయమును జేసిన కుర్వన్ అని యగును. కుర్వాణః అనునది కృఞ్ ధాతు ప్రకృతికమగు శానచ్ ప్రత్యయాన్తము. శతృశానజన్తముల యోగమునందు సృష్టి (కర్మవాచకము) హరి (కర్తృవాచకము) శబ్దములకంటె షష్ఠి నిషిద్ధమగును. హరిం దిదృక్షుః. దిదృక్షుః అనుచోట ఉ అనునది ప్రత్యయము. హరిమలంకరిష్ణుః. ఇచట ప్రత్యయము (ఇష్ణు) ఉకారాన్తము. దైత్యాన్ ఘాతుకో హరిః. ఘాతుకః అనునది ఉకప్రత్యయాన్తము. 1 (వా) ఉకప్రత్యయాన్తమగు కము ధాతువు యొక్క యోగమందు షష్ఠికి నిషేధములేదు. లక్ష్మ్యాః కాముకో హరిః కాముకః అనునది కముధాతుప్రకృతికగల ఉకప్రత్యయాన్తము. లక్ష్మీ కర్మ. లక్ష్మీ

శబ్దముకంటె షష్ఠి యగును. అవ్యయకృత్తులన క్త్వాప్రత్యయము, మకారాన్తములగు తుమ్ ఆమ్ (ణముల్) మొదలగునవి. జగత్ సృష్ట్వా. సృష్ట్వా అనునది క్త్వాప్రత్యయాన్తము. సుఖం కర్తుమ్. కర్తుమ్ అనునది తుమున్నన్తము. నిష్ఠ:— 1. విష్ణునా హతా దైత్యాః. హతాః అనునది క్తప్రత్యయాన్తము, 2. దైత్యాన్ హతవాన్ విష్ణుః. హతవాన్ అనునది క్తవతుప్రత్యయాన్తము. ఖలర్థములు:— ఈషత్కరః ప్రపఞ్చో హరిణా. ఈషత్కరః అనునది ఖలన్తము. సూత్రమున తృన్ అనునది "లటశ్శతృశానచౌ" (3-2-124.) అనుసూత్రమందలి తృ అను దానికి "తృన్" (3-2-125) అనుసూత్రమందలి నకారముతో ప్రత్యాహారము. కావున శానన్ చానశ్ శతృ తృన్ మొదలగునవియన్తమందుగలవానితో యోగ మందు షష్ఠి రాదు. శానన్=సోమం పవమానః. చానశ్=ఆత్మానం మణ్డయ మానః. శతృ=వేదమధీయన్. తృన్=కర్తాలోకాన్. 2 (వా) శతృప్రత్యయాన్త మగు ద్విషధాతువుయొక్క యోగమందు షష్ఠీనిషేధము వికల్పముగనగును. ముకస్య మురం వాద్విషన్.

ఈసూత్రముచే నిషేధము కారకములను (కర్త, కర్మ, కరణము మొదలగు నవి) బోధించుశబ్దములకంటె విధింపబడు షష్ఠీవిభక్తికే యగునని గ్రహింపునది. అనన్తరస్య విధిర్వా భవతి ప్రతిషేధో వా అనున్యాయముచే నవ్యవహితమగు సూత్రముచే విహితమైనకారకషష్ఠికే నిషేధమని యాశయము. కావున లాదేశాది యోగమందు "శేషే" అనునధికారమున విధింపబడు షష్ఠి ప్రవర్తించును. ఉదా:-బ్రాహ్మణస్య కుర్వన్. ఇచట బ్రాహ్మణశబ్దమునకు "షష్ఠీశేషే" (609)సూ. చే షష్ఠి యగును. కుర్వన్ అనునది శతృప్రత్యయాన్తము. (లాదేశము) నరకస్య జిష్ణుః. నరకశబ్దమునకు "షష్ఠీశేషే" సూ. చే షష్ఠి యగును. జిష్ణుః అనునది స్నుప్రత్యయాన్తము. (ఉకారన్తప్రత్యయము).

631. అకేనోర్భవిష్యదాధమర్ణ్యయోః. 2-3-70. అకేనోః, భవిష్య దాధమర్ణ్యయోః. (షష్ఠీ, న)

భవిష్యత్యకస్య భవిష్యదాధమర్ణ్యార్థేనశ్చ యోగే షష్ఠీ న స్యాత్। సతః పాలకోఽవతరతి। వ్రజం గామీ। శతం దాయీ॥

631. అకేనోః=అకప్రత్యయేన్ప్రత్యయములకు ద్వన్ద్వము. భవిష్యదాధమర్ణ్యయోః=భవిష్యత్ ఆధమర్ణ్యశబ్దములకు ద్వన్ద్వము. ఆధమర్ణ్యరూపార్థమునక ప్రత్యయమునకు సంభవములేదు గానవిచట యథాసంఖ్యముగనన్వయమిష్టముగాదు. భవిష్యత్కాలికమగు అకప్రత్యయము భవిష్యదర్థమందు ఆధమర్ణ్యరూపార్థమందును విహితమగు ఇనిప్రత్యయము ఇవియన్తమందుగలవానియొక్క యోగమందు కర్తృ కర్మత్వవాచకములకు షష్ఠిరాదనియర్థము. సతః పాలకోఽవతరతి. పాలకః అనునది భవిష్యతి అనునధికారమున విహితమగు అక(ణ్వుల్)ప్రత్యయాన్తము. వ్రజంగామీ,

గామీ అనునది భవిష్యతి అనునధికారమున విహితమగు ఇనిప్రత్యయాన్తము. శతం దాయీ. దాయీ అనునది అధమర్ణ్యరూపార్థమున (అప్పుతీసుకొనువాని ధర్మము.) విహితమగు ఇనిప్రత్యయాన్తము.

632. కృత్యానాం కర్తరి వా. 2-3-71. కృత్యానాం, కర్తరి వా (షష్ఠీ)

షష్ఠీ వా స్యాత్। మయా మమ వా సేవ్యో హరిః। కర్తరీతి కిమ్। గేయోమాణవకస్సామ్నామ్। భవ్యగేయేతి కర్తరి యద్విధానాదనభిహితం కర్మ। అత్రయోగోవిభజ్యతే। కృత్యానామ్ ఉభయప్రాప్తావితి నేతిచానువర్తతే। తేన నేతవ్యా వ్రజం గావః కృష్ణేన। తతః। కర్తరి వా। ఉక్తోఽర్థః।

633. కృత్యప్రత్యయములు (యత్ ణ్యత్ అనీయర్ మొదలగుకృత్యసంజ్ఞ గల్గిన కృత్ప్రత్యయములు.) అన్తమందుగలవానితో యోగమున్నపుడు కర్తృవాచకమునకు షష్ఠి వికల్పముగనగును. "కర్తృకర్మణోః" కృతి (626) అను సూ. చే నిత్యముగ ప్రాప్తమగు షష్ఠికిది వికల్పవిధాయకము. మయా మమ వా సేవ్యో హరిః. సేవ్యః అనునది ణ్యత్ప్రత్యయాన్తము. అస్మచ్ఛబ్దము కర్తృవాచకము. గేయోమాణవకః సామ్నామ్. గేయః అనునది యత్ప్రత్యయాన్తము. కర్మవాచకమగు సామశబ్దమునకు షష్ఠీవికల్పమును వారించుటకై కర్తరి అనునది యావశ్యకము. గేయః అనుచోట యత్ప్రత్యయము "భవ్యగేయప్రవచనీయ...... వా" (3-4-68) అనుసూత్రముచే కర్త్రర్థమున విహితమగుటవలన సామశబ్దమును క్తకర్మవాచకమగుటచే షష్ఠి (నిత్యమైనది) నిశ్శంకముగ ప్రవర్తించును.

భాష్యకారులీసూత్రమును విభజించి వ్యాఖ్యానముజేసిరి. (1) కృత్యానామ్. ఉభయప్రాప్తౌన అనునవి యనువృత్తములగును. కృత్యప్రత్యయనిమిత్తకమగు షష్ఠి కర్తృవాచకమునకు కర్మవాచకమునకునురాదని యర్థము. "ఉభయప్రాప్తౌ కర్మణి" (627) సూ. చే కర్తృవాచకమునకు షష్ఠీనిషేధము సిద్ధమగుచుండ కర్మవాచకమునకును నిషేధముకొఱకీయోగమని తెలియునది. ఉదా:—నేతవ్యా వ్రజం గావః కృష్ణేన. వ్రజము కర్మ. కృష్ణుడు కర్త. నేతవ్యాః అనుతవ్యప్రత్యయాన్తముతో యోగమున్నందుననుభయమునకు షష్ఠి రాదు. (2) కర్తరి వా. కృత్యానామ్ అనునది యనువృత్తమగును కృత్యప్రత్యయాన్తములయోగమున కర్తృవాచకమునకు షష్ఠి వికల్పముగనగునవిపూర్వముచెప్పినదియే యర్థము. మయా మమ వా సేవ్యోహరిః.

633. తుల్యార్థైరతులోపమాభ్యాం తృతీయాన్యతరస్యామ్, 2-3-72. తుల్యార్థైః, అతులోపమాభ్యామ్, తృతీయా, అన్యతరస్యామ్।

తులార్థైర్యోగే తృతీయా వా స్యాత్ పక్షే షష్ఠీ। తుల్యః సదృశః సమో వా కృష్ణస్య కృష్ణేన వా। అతులోపమాభ్యాం కిమ్। తులా ఉపమా వా కృష్ణస్య నాస్తి॥

633. తుల్యశబ్దమునకు సాదృశ్యమర్థము. సాదృశ్యార్థకములగు తులోపమా శబ్దములపర్యుదాసమిందుమానము. తుల్యశబ్దము సదృశార్థకమైనచో తులోపమాశబ్దములు సాదృశ్యార్థకము లగుటచేనా పర్యుదాసము వ్యర్థమయ్యెడిని. తులోపమాశబ్దములను విడిచి సాదృశ్యార్థకములగు తుల్యసదృశాది శబ్దములయోగమందు తృతీయ వికల్పమగనగును. శేషషష్ఠి ప్రాప్తమగుచుండనీసూత్రమువికల్పముగ తృతీయను విధించును. తృతీయాఽభావపక్షమున షష్ఠి వచ్చును. తుల్యః సదృశః సమో వా కృష్ణస్య కృష్ణేన వా. తులా ఉపమావా కృష్ణస్య నాస్తి. ఇచట కృష్ణశబ్దమునకు తృతీయానివృత్తికొఱకు అతులోపమాభ్యామనునదావశ్యకము.

వివ:—అనవ్యయములగు తులోపమా శబ్దములపర్యుదాసము (తద్భిన్నము తత్సదృశము) వలన నవ్యయభిన్నములగుసాదృశ్యార్థకశబ్దముల యోగమందే యీసూత్రము ప్రవర్తించును. అందువలన సాదృశ్యార్థకమగునివశబ్దయోగమందీ సూత్రము ప్రవర్తించదు. "తులాం యదారోహతి దన్తవాససా", (కాళిదాసప్రయోగము). "స్ఫుటోపమ్ భూతిసితేనశమ్భునా" (మాఘప్రయోగము.) మొదలగు చోటులందు తృతీయ యెట్లు సాధువగుననుశంకకు "సహయుక్తేఽప్రధానే" (567) సూ. చే నిట్టిచోటులందు తృతీయ సాధువగునని సమాధానము. సహయోగము లేకున్నను సూత్రముప్రవర్తించునని పూర్వము చెప్పబడెను.

634. చతుర్థీ చాశిష్యాయుష్యమద్రభద్రకుశలసుఖార్థహితైః 2-3-73. చతుర్థీ, చ, ఆశిషి, ఆయుష్య......హితైః. (షష్ఠీ.)

ఏతదర్థైర్యోగే చతుర్థీ వా స్యాత్పక్షే షష్ఠీ ఆశిషి। ఆయుష్యం చిరంజీవితం కృష్ణాయ కృష్ణస్య వా భూయాత్। ఏవం మద్రం భద్రం కుశలం నిరామయం సుఖం శం అర్థః ప్రయోజనం హితం పథ్యం వా భూయాత్। ఆశిషి కిమ్। దేవదత్తస్యాయుష్యమస్తి। వ్యాఖ్యానాత్సర్వత్రాఽర్థగ్రహణమ్।మద్రభద్రయోః పర్యాయత్వాదన్యతరో న పఠనీయః॥

634. ఆయుష్య మద్ర భద్ర కుశల సుఖ సుఖ అర్థ హిత శబ్దములకు ద్వన్ద్వము. ఆయుష్యాద్యర్థకశబ్దములయోగమున నాశీర్విషయక్రియయందన్వయించువర్థముగల ప్రాతిపదికమునకు చతుర్థి వికల్పముగనగును. పక్షమందు షష్ఠి వచ్చును. ఆయుష్యం చిరంజీవితం కృష్ణాయ కృష్ణస్య వాభూయాత్. ఆశీర్వాదమన నలభ్యములగు వస్తువులను బొందవలయునను కోరికగానివస్తుస్థితిని దెల్పుటయాశీర్వా

దము గానేరదు. కావున దేవదత్తస్యాయుష్యమస్తి (దేవదత్తునికాయుష్యు కలదు.) అనుదేవదత్తునికిగల నాయుష్యును దెల్పువాక్యమున దేవదత్తశబ్దమునకు చతుర్థీ వారణార్థము సూత్రమున "ఆశిషి" అనునది యావశ్యకము. సూత్రమున నాయుష్యాది శబ్దములు తత్తత్స్వరూపములనేగాక తత్తదర్థశబ్దములనన్నిటిని బోధించును. ఇందు శిష్టకృతమగు వ్యాఖ్యానమే మానము. సూత్రమునఁ నర్థశబ్దముఁగూడ నాయుష్యాదిశబ్దములవలె ప్రత్యేకనిమిత్తము. కావున నాయుష్యాదిశబ్దములతో నర్థశబ్దమునకు ద్వన్ద్వము గానిబహువ్రీహిగాదని గ్రహించునది. మద్రభద్రశబ్దములు పర్యాయములు గాన వీనిలో నొకశబ్దముయొక్క పాఠమనావశ్యకమగును.

ఇది షష్ఠీవిభక్తి

౬౩౫. ఆధారోఽధికరణమ్. 1-4-45. ఆధారః, అధికరణమ్।

కర్తృకర్మద్వారాతన్నిష్ఠక్రియాయా ఆధారః కారకమధికరణసంజ్ఞం స్యాత్।

౬౩౫. కారకాధికారమువలన "క్రియాయాః" అనునది లబ్ధమగును. క్రియయన ధాత్వర్థము, ఆధారమన నాశ్రయము. క్రియకు సాక్షాత్తుగ నాశ్రయమగుదానికధికరణసంజ్ఞనుజేయ వీలులేదు. వ్యాపారమనియు, ఫలమనియు క్రియద్వివిధము. వ్యాపారాశ్రయమునకు, పరమగు కర్తృసంజ్ఞ (స్వతంత్రః కర్తా) ప్రవర్తించును. ఫలాధారమునకు పరమగు కర్మసంజ్ఞ ప్రవర్తించును. కావున పరమ్పరచే క్రియాశ్రయమే సూత్రమునఁ నాధారపదముచే గ్రహింపదగును. కర్తృకర్మద్వారకమగు పరమ్పరనే గ్రహింపవలయునని వ్యాఖ్యాతలు చెప్పిరి. కర్తృద్వారాగాని, కర్మద్వారాగాని కర్తృకర్మలయందుండు క్రియకాశ్రయమగునది కారకమై యధికరణసంజ్ఞ గలదగునని యర్థము.

౬౩౬. సప్తమ్యధికరణే చ. 2-3-36. సప్తమీ, అధికరణే, చ।

అధికరణే సప్తమీ స్యాత్। చకారాద్దూరాన్తికార్థేభ్యః। ఔపశ్లేషికో వైషయికోఽభివ్యాపకశ్చేత్యాధారస్త్రిధా। కటే ఆస్తే। స్థాల్యాం పచతి। మోక్షే ఇచ్ఛాఽస్తి। సర్వస్మిన్నాత్మాఽస్తి। వనస్య దూరే అన్తికే వా॥ దూరాన్తికార్థేభ్య ఇతి విభక్తిత్రయేణ సహ చతస్రోఽత్ర విభక్తయః ఫలితాః। (వా) క్తస్యేన్విషయస్య కర్మణ్యుపసంఖ్యానమ్। అధీతీ వ్యాకరణే। అధీతమనేనేతివిగ్రహే ఇష్టాదిభ్యశ్చేతి కర్తరి ఇనిః। (వా) సాధ్వసాధుప్రయోగే చ। సాధుః కృష్ణో మాతరి। అసాధుర్మాతులే। (వా) నిమిత్తాత్కర్మయోగే। నిమిత్తమిహ ఫలమ్। యోగః సంయోగసమవాయాత్మకః। చర్మణి ద్వీపినం హన్తి దన్తయోర్హన్తి కుఞ్జరమ్। కేశేషు చమరీం

హన్తి సీమ్ని పుష్కలకో హతః। హేతౌతృతీయాఽత్ర ప్రాప్తా తన్నివారణార్థమిదమ్। సీమాణ్డకోశః। పుష్కలకో గన్ధమృగః। యోగవిశేషే కిమ్। వేతనేన ధాన్యం లునాతి॥

638. అధికరణవాచకముకంటె సప్తమీవిభక్తి ప్రయోగింపదగును. సూత్రమందలి చకారమువలన దూరాన్తికార్థకములకంటె ప్రాతిపదికార్థమున సప్తమియగును. ఔపశ్లేషికమనియు, వైషయికమనియు, నభివ్యాపకమనియునాధారము మూడువిధములు. శ్లేషస్యసమీపమ్=ఉపశ్లేషమ్। తత్కృతమ్=ఔపశ్లేషికమ్. శ్లేషమన సంబన్ధము. ఏకదేశసంబన్ధకృతము ఔపశ్లేషికము విషయమే వైషయికము. కర్తగాని కర్మగాని దేనియొక్క సర్వావయవములను వ్యాపించియుండునో యది యభివ్యాపకము. క్రమముగనుదాహరణములు :— (1) కర్తృద్వారా క్రియాశయమునకు కటే ఆస్తే. (ఔపశ్లేషికము. చాపయొక్క కొంతభాగమునందున్నవాడని యర్థము.) కర్మద్వారా క్రియాశయమునకు :—స్థాల్యాం పచతి (ఔపశ్లేషికము. గిన్నెలో కొంతభాగమందు వండుచున్నాడని యర్థము.) (2) మోక్షే ఇచ్ఛాఽస్తి (వైషయికము. మోక్ష విషయకమగు కోరికగలదు.) కర్తయగువిచ్ఛయందు మోక్షము విషయమగుటచే మోక్షము వైషయికాధారమగును (3) సర్వస్మిన్నాత్మాస్తి (అభివ్యాపకము. ఆత్మ యన్నివస్తువుల దన్నియవయవములను వ్యాపించి యున్నదని యర్థము.) తిలేషు తైలమ్ అనునది యభివ్యాపకోదాహరణమునకుదాహరణమగును. "వనస్యదూరే అన్తికే వా". దూరాన్తికార్థములగు దూరాన్తికశబ్దములకు ఈసూత్రములోని చకారమువలన సప్తమి వచ్చెను. "దూరాన్తికార్థేభ్యో ద్వితీయా చ" (608) అను సూ. చే విహితమగు విభక్తిత్రయముతో గలిపి దూరాన్తికార్థములకంటె యిట్లు నాల్గు విభక్తులు సాధువులగును.

(వా) క్తస్యే.........నమ్. ఇన్విషయస్య అనునది తత్పురుషము. ఇన్ పదమిన్నన్తబోధకము. ఇనో విషయః ఇన్విషయః తస్య అనివిగ్రహము. విషయ శబ్దమునకు ప్రకృతియని అర్థము. ఇన్ప్రత్యయమునకు ప్రకృతియగు క్తాన్తమున కర్మయగుదానివిబోధించు ప్రాతిపదికముకంటె సప్తమియగునని వార్తికార్థము. అధీతీ వ్యాకరణే. అధీతమ్ అనునది భావార్థకమగు క్తప్రత్యయాన్తము. అధీతమనేన అనునర్థమున అధీతశబ్దముకంటె "ఇష్టాదిభ్యశ్చ" (5–2–88) అను సూ.చే కర్త్రర్థమందు ఇన్ప్రత్యయము విధింపబడెను. అధీతీ అనురూపమగును. ఇన్ ప్రత్యయమునకు ప్రకృతియగు (అధీత) క్తప్రత్యయాన్తమున కర్మ వ్యాకరణము. కాననీవార్తికముచే వ్యాకరణశబ్దమునకు సప్తమి వచ్చెను. వీనిచే వ్యాకరణము చదువబడెనని "అధీతీ.........రణే" అనుదానికర్థము (వా) సాధ్వ.........చ. సాధ్వసాధుశబ్దముల ప్రయోగమందు సప్తమి వచ్చును. సాధుః కృష్ణో మాతరి. అసాధుర్మాతులే. ఈవార్తికము శేషషష్ఠికపవాదము.

(వా) నిమి.........యోగే. నిమిత్తముతోనన్వయముగల క్రియయందు కర్మయగుదానితో సంబన్ధమున్న పదము నిమిత్తవాచకముకంటె సప్తమి యగును. ఇచట

నిమిత్తమన క్రియాఫలము. యోగమన సంయోగము సమవాయము అను సంబన్ధ ద్వయము. రెండుపదార్థములుగలసియున్నవనువ్యవహారమునకసాధారణకారణము సంయోగమనబడును. అవయవావయవములకుగలసంబన్ధము సమవాయమగును. శ్లో॥ చర్మణి ద్వీపినం హన్తి దన్తయోర్హన్తి కుఞ్జరమ్। కేశేషు చమరీం హన్తి సీమ్ని పుష్కలకో హతః. పులినిచర్మముకొఱకు, యేనుగునుదన్తములకొఱకు, చమరీ మృగమునుకేశములకొఱకు, గన్ధమృగమును (బూతుపిల్లి) అణ్డములకొఱకును చంపు చున్నాడనియర్థము. పులిని చంపుట చర్మముకొఱకు గావున చర్మము క్రియాఫల మగును. ద్వీపి కర్మ. కుంజరహననమునకు దన్తములు ఫలము. కుంజరము కర్మ. చమరీవధకు కేశములు ఫలము. చమరికర్మ. గంధమృగమారణమునకునణ్డకోశము ఫలము. గంధమృగము కర్మ. ఇచట ద్వీపిచర్మములకునణ్డకోశగంధమృగముల కును సమవాయము ఇతరములకు సంయోగముసంబన్ధము. వార్తికోదాహరణము లందు "హేతౌ" (671) సూ. చే తృతీయ ప్రాప్తమగుచున్నది. వార్తికమందలి యోగశబ్దమునకు సంయోగసమవాయములే యనిచెప్పుటకు పేతనేన ధాన్యం లునాతి అనుచోట పేతనశబ్దమునకు సప్తమివారణము ఫలమనిగ్రహించునది. నిమిత్తమగు పేతనమునకు అదనక్రియలో కర్మయగుధాన్యమునకును సంయోగసమవాయములు సంబంధములుగావందున పేతనశబ్దమునకు సప్తమి నివృత్తమగునవి భావము.

వివ:—"సాధునిపుణాభ్యామర్చాయాం సప్తమ్యప్రతేః" (643) అను సూ. చే సాధుశబ్దయోగమున సప్తమి సిద్ధమగుచుండ "సాధ్వసాధు ప్రయోగేచ" అను వార్తికమున సాధుశబ్దమునకు పూజ విషేశింపబడునపుడేగాక తత్త్వకథనమందును (సాధుః భృత్యో రాజ్ఞి) సప్తమి సిద్ధించుటఫలమనియు నాసూత్రమందలియర్చా గ్రహణము విపులశబ్దముకొఱకనియును తెలియునది. "సీమాఘాటస్థితిక్షేత్రేష్వణ్డ కోశేషు చ స్త్రియామ్। "అథ పుష్కలకో గన్ధమృగే క్షపణకీలయోః" అను మేదినీ కోశము సీమశబ్దమునకణ్డకోశమర్థమనుటయందును పుష్కలశబ్దమునకు గంధమృగ మర్థమనుటయందును ప్రమాణము. పుష్కలకశబ్దమునకు శంకు (కర్రమేకు) అనియు సీమశబ్దమునకు పొలిమెర (గ్రామములకుగలసరిహద్దు) అనియునర్థముచె చెప్పి పొలిమెరనుతెల్పుటకై శంకుపుభూమిలోపాతబడెనని హరదత్తాదులర్థ మునుచెప్పిరి.

637. యస్య చ భావేన భావలక్షణమ్. 2-3-37. యస్య, చ, భావేన, భావలక్షణమ్ (సప్తమీ.)

యస్య క్రియయా క్రియాన్తరం లక్ష్యతే తతః సప్తమీ స్యాత్। గోషు దుహ్యమానాసు గతః (వా) అర్హాణాం కర్తృత్వేఽనర్హాణామకర్తృత్వే తద్వైపరీత్యే చ। సత్సు తరత్సు అసన్త ఆసతే। అసత్సు తిష్ఠత్సు సన్తస్తరన్తి। సత్సు తిష్ఠత్సు అసన్తస్తరన్తి। అసత్సు తరత్సు సన్తస్తిష్ఠన్తి॥

637. సూత్రమున యత్పదార్థము కర్తృకర్మలు. భావమనక్రియ. (ధాత్వర్థము) దేనియొక్క క్రియచే క్రియాన్తరము (ఇతరమైనదానియొక్క అజ్ఞాతకాలముగలక్రియ) జ్ఞాతమగునో దానికంటె (తెలియబడుకాలముగల ఫలవ్యాపారములకాశ్రయములగు కర్తృకర్మలను బోధించు శబ్దములకంటె) సప్తమివచ్చును. తెలియబడినకాలముగల క్రియ జ్ఞాపకము. తెలియబడని కాలముగల క్రియ జ్ఞాప్యము. జ్ఞాపకక్రియాశ్రయవాచకముకంటె సప్తమి యగునని ఫలితార్థము. కాన విశేషణవిశేష్యవాచకములకంటె సప్తమి సిద్ధమగును. జ్ఞాపకక్రియాశ్రయము కర్తగాని కర్మగానియగును. కర్తృవాచకముకంటె సప్తమికుదాహరణము:—బ్రాహ్మణేష్వధీయానేషు గతః. (బ్రాహ్మణులు చదువుచున్నకాలమున వెళ్లినవాడు.) బ్రాహ్మణులందుగలయధ్యయనక్రియ (తెలియబడినకాలముగలది) అజ్ఞాతకాలముగలగమనక్రియకు జ్ఞాపకము. జ్ఞాపకక్రియాశ్రయులధీయానులగు బ్రాహ్మణులు. కాన బ్రాహ్మణశబ్దముకంటెను విశేషణమగుఅధీయానశబ్దముకంటెను సప్తమి వచ్చెను. కర్మవాచకముకంటె సప్తమికుదాహరణము:—గోషు దుహ్యమానాసు గతః గోదోహనము జ్ఞాపకము. గమనము జ్ఞాప్యము జ్ఞాపకక్రియాశ్రయములుగోవులు. (కర్మ.)

(వా) అర్హా.........చ. వార్తికమును నాల్గువాక్యములుగవిభజించియర్థమును జెప్పవలయును. (1) ఏక్రియయందెవరుచితమైనవారగుదురో యాక్రియయందువారర్హు లనబడుదురు. ఆక్రియయందు వారు (అర్హులు) కర్తలుగ వివక్షింపబడునపుడు కర్తృవాచకముకంటె సప్తమి యగును. (2) ఏక్రియయందెవరికి కర్తృత్వమనుచితమగునో వారాక్రియయందనర్హు లనబడుదురు. అట్టిక్రియయందు వారు (అనర్హులు) కర్తలుగ వివక్షింపబడునపుడు సప్తమి వచ్చును. (3) ఏక్రియయందెవరికి కర్తృత్వమనుచితమో ఆక్రియయందు వారు కర్తలుగానట్లు వివక్షితులగునపుడు సప్తమి వచ్చును. (4) ఏక్రియయందెవరికి కర్తృత్వముచితముకాదో ఆక్రియయందు వారు కర్తలుగ వివక్షింపబడునపుడును సప్తమి వచ్చును. ప్రథమవాక్యోదాహరణము:—సత్సు తరత్సు అసన్త ఆసతే. తరణక్రియయందు కర్తలగుటకుచితులగు సత్పురుషులాక్రియయందు కర్తలుగ వివక్షితులగుటచే కర్తృవాచకముకంటె (సత్సుతరత్సు) సప్తమి వచ్చెను. ద్వితీయ వాక్యోదాహరణము:—అసత్సు తిష్ఠత్సు సన్తస్తరన్తి తరణక్రియయందు కర్తలగుటకనుచితులగు నసత్పురుషులాక్రియయందు కర్తలుగ వివక్షింపబడనందున సప్తమి వచ్చెను. తృతీయవాక్యోదాహరణము:—సత్సు తిష్ఠత్సు అసన్తస్తరన్తి. తరణక్రియయందు కర్తలగుటకర్హులగు సత్పురుషులాక్రియయందు కర్తలుగానట్లు వివక్షింపబడిరి. చతుర్థవాక్యోదాహరణము:—అసత్సు తరత్సు సన్తస్తిష్ఠన్తి తరణమందు కర్తలగుటకనర్హులగు నసత్పురుషులు తరణమందు కర్తలుగ వివక్షింపబడిరి. ఈవిషయము "తరత్సు" అనుదానిచే గమ్యమగును.

వివ :—వార్తికోదాహరణములందు "యస్య చ భావేన" అనుసూత్రముచే సప్తమి సిద్ధమగును గాని క్రియలకు లక్ష్యలక్షణభావము వివక్షితము గానియపుడును సప్తమిసిద్ధించుటకొఱకు వార్తికమావశ్యకమగును.

638. షష్ఠీ చాఽనాదరే. 2-3-38. షష్ఠీ, చ, అనాదరే (యస్య చ,........లక్షణమ్, సప్తమీ.)

అనాదరాఽధిక్యే భావలక్షణే షష్ఠీసప్తమ్యౌ స్తః। రుదతి, రుదతో వా ప్రావ్రాజీత్। రుదన్తం పుత్రాదికమనాదృత్య సన్యస్తవానిత్యర్థః॥

638. అనాదరే అనునది విషయసప్తమి, అనాదరము గమ్యమానమగు నపుడు దేనియొక్క క్రియచే క్రియాన్తరము లక్ష్యమగునో దానికంటె (కర్తృకర్మ వాచకములకంటె) షష్ఠీసప్తములగును. అనాదరాధిక్యే అనునది ఫలితార్థము. కేవల జ్ఞాప్యజ్ఞాపకభావమందు సప్తమిమాత్రము వచ్చుననియు ననాదరమధికమగునపుడు షష్ఠీసప్తములగుననియును తెలియదగును. రుదతి రుదతో వా ప్రావ్రాజీత్, ఏడ్చుచున్నపుత్రాదుల ననాదరింపక తండ్రి సన్యసించెనని యర్థము.

వివ:—ప్రపూర్వకమగు వ్రజధాతువునకు అనాదరవిశిష్టసన్యాసమర్థము. షష్ఠి తాత్పర్యగ్రాహకము. సాన్నిధ్యమువలన ననాదరమిచట పుత్రాదివిషయకమే యగును.

639. స్వామీశ్వరాధిపతిదాయాదసాక్షిప్రతిభూప్రసూతైశ్చ. 2-3-39. (షష్ఠీసప్తమ్యౌ)

ఏతైస్సప్తభిర్యోగే షష్ఠీసప్తమ్యౌ స్తః। షష్ఠ్యామేవ ప్రాప్తాయాం పాక్షికసప్తమ్యర్థం వచనమ్। గవాం గోషు వా స్వామీ। గవాం గోషు వా ప్రసూతః। గా ఏవాఽనుభవితుం జాత ఇత్యర్థః॥

639. స్వామీ ఈశ్వరః అధిపతిః దాయాదః సాక్షీ ప్రతిభూః ప్రసూతః అను నీయేడుశబ్దములయోగమందు షష్ఠీసప్తములగును. "షష్ఠీ శేషే" (609)సూ.చే షష్ఠిమాత్రము ప్రాప్తమగుచుండ పక్షమందు సప్తమికొఱకీ సూత్రము. గవాం గోషు వా స్వామీ. ఇట్లే ఈశ్వరాదిపదములయోగమందును షష్ఠీసప్తముల నూహించునది: గవాం గోషు వా ప్రసూతః. గోవులనేయనుభవింపబుట్టినవాడని యర్థము.

వివ :— స్వామీశ్వరాధిపతిశబ్దములు సమానార్థకములు గాన సూత్రమున "స్వామ్యర్థ" అని జెప్పినజాలును గాని స్వామిపర్యాయములగు నితరపదముల వ్యావృత్తికై యిట్లు సూత్రము రచింపబడెను.

640. ఆయుక్తకుశలాభ్యాం చాఽసేవాయామ్. 2-3-40. ఆయుక్త కుశలాభ్యాం, చ, ఆసేవాయామ్. (షష్ఠీ, సప్తమీ.)

ఆభ్యాం యోగే షష్ఠీసప్తమ్యౌ స్తస్తాత్పర్యేఽర్థే। ఆయుక్తో వ్యాపారితః। ఆయుక్తః కుశలో వా హరిపూజనే హరిపూజనస్య వా। ఆసేవాయాం కిమ్। ఆయుక్తో గౌః శకటే। ఈషద్యుక్త ఇత్యర్థః॥

640. తాత్పర్యము గమ్యమానమగునపుడు ఆయుక్తకుశల శబ్దములతో సంబద్ధములగు ప్రాతిపదికములకంటె షష్ఠీసప్తములగును. తాత్పర్యమన తదేకవ్యాపారత్వము. ఆసేవాపదమునకు తాత్పర్యమనునర్థమందు రూఢి. ఆయుక్తుడన వ్యాపారముగలవాడని యర్థము. ఆయుక్తః కుశలో వా హరిపూజనే హరిపూజనస్య వా. (విష్ణుపూజయందాసక్తుడు.) ఆయుక్తో గౌః శకటే. ఇచటనాయుక్తశబ్దమునకీషద్యుక్తుడని యర్థము. ఇట్టిచోటులందు సూత్రము ప్రవర్తింపకుండుటకు ఆసేవాయామ్ అనునది యావశ్యకము.

వివ :— ఆయుక్తశబ్దయోగమందధికరణత్వము వివక్షింపునపుడు సప్తమి, ఆయుక్తకుశలశబ్దములయోగమందు సంబంధము వివక్షితమగునపుడు షష్ఠి, ప్రాప్తమగుచుండ నీసూత్రముచే రెండువిభక్తులు విధింపబడినవి.

641. యతశ్చనిర్ధారణమ్. 2-3-41. యతః, చ, నిర్ధారణమ్ (షష్ఠీ, సప్తమీ)

జాతిగుణక్రియాసంజ్ఞాభిస్సముదాయాదేకదేశస్య పృథక్కరణం నిర్ధారణం యత స్తతః షష్ఠీసప్తమ్యౌ స్తః। నృణాం నృషు వా బ్రాహ్మణః శ్రేష్ఠః। గవాం గోషు వా కృష్ణా బహుక్షీరా। గచ్ఛతాం గచ్ఛత్సు వా ధావన్ శీఘ్రః। ఛాత్రాణాం ఛాత్రేషు వా మైత్రః పటుః॥

641. జాతి (బ్రాహ్మణత్వము మొదలగునది) గుణము (నీలత్వము మొదలగునది) క్రియ (ధావనము మొదలగునది) సంజ్ఞ (ఛాత్రుడు మొదలగునది) వీనిలోనేదైననొకదానితో గూడుకొనిన నేకదేశమునకు (అవయవమునకు) ఇట్టియేకదేశముతో గూడిన సముదాయమునుండి (అవయవి) వేరుజేయుట నిర్ధారణమనబడును, ఏసముదాయమునుండి నిర్ధారణమో అట్టి సముదాయవాచకము (నిర్ధారణావధివాచకము) కంటె షష్ఠీసప్తములగును. జాతివిశిష్టమగు నేకదేశముయొక్క పృథక్కరణమునకుదాహరణము :— నృణాం నృషు వా బ్రాహ్మణః శ్రేష్ఠః. మనుష్యసముదాయమునుండి బ్రాహ్మణునకు (బ్రాహ్మణత్వజాతివిశిష్టునకు) నిర్ధారణము చేయబడినందున సముదాయవాచకముకంటె సప్తమి వచ్చెను. గుణవిశిష్టమునకుదాహరణము :— గవాం గోషు వా కృష్ణా బహుక్షీరా. కృష్ణా = నీలగుణవిశిష్టము. క్రియా

విశిష్టమునకు :— "గచ్ఛతాం గచ్ఛత్సు వా ధావన్ శ్రేష్ఠః". ధావన్ = పరుగిడు చున్నవాడు. సంజ్ఞావిశిష్టమునకు :— ఛాత్రాణాం ఛాత్రేషు వా మైత్రః పటుః. మైత్రః = మైత్రుడను పేరుగలవాడు.

642. పఞ్చమీ విభక్తే. 2-3-42. పఞ్చమీ, విభక్తే (యతశ్చ నిర్ధారణమ్)

విభాగో విభక్తమ్। నిర్ధార్యమాణస్య యత్ర భేద ఏవ తత్ర పఞ్చమీ స్యాత్। మాథురాః పాటలిపుత్రకేభ్య ఆఢ్య తరాః॥

642. విభక్తమన విభాగము. అనగా భేదమని యర్థము. వేరుచేయ బడుదానికి నిర్ధారణావధికిని సర్వవిధముల భేదమే (ఉపాత్తమగునేదేనియొకరూపముచే భేదముగాక సర్వవిధముల భేదముండవలయును.) యున్నపుడు నిర్ధారణావధివాచక ముకంటె పంచమి వచ్చును. మాథురాః పాటలిపుత్రకేభ్య ఆఢ్యతరాః. నిర్ధార్య మాణులగు మాథురులకు నిర్ధారణావధియగు పాటలిపుత్రులకు సర్వవిధముల భేద మేయున్నది గాని గవాం కృష్ణా మొదలగుచోటులందువలె సామాన్యవిశేషభావము లేదు.

వివ:— నిర్ధారణమందెట్టిదైన భేదముండితీరును. అట్టితరి విభక్తగ్రహణ సామర్థ్యమువలన భేదమే (భేదఏవ) యుండితీరవలయునని లబ్ధమగును.

643. సాధునిపుణాభ్యామర్చాయాం సప్తమ్యప్రతేః. 2-3-43. సాధునిపుణాభ్యామ్, అర్చాయామ్, సప్తమీ, అప్రతేః।

ఆభ్యాం యోగే సప్తమీ స్యాదర్చాయామ్. న తు ప్రతేః ప్రయోగే। మాతరి సాధుర్నిపుణో వా। అర్చాయాం కిమ్। నిపుణో రాజ్ఞో భృత్యః। ఇహ తత్త్వకథనే తాత్ప ర్యమ్। (వా) అప్రత్యాదిభిరితి వక్తవ్యమ్। సాధుర్నిపుణో వా మాతరం ప్రతి పర్యను వా॥

643. పూజ గమ్యమానమగునపుడు (వివక్షితమగునపుడు) సాధునిపుణ శబ్దములయోగమందు సప్తమివచ్చును ప్రతి అనునుపసర్గప్రయోగమున్నచోటున రాదు మాతరి సాధుర్నిపుణో వా. నిపుణో రాజ్ఞో భృత్యః. (రాజభృత్యుడు నిపు ణుడు) ఇచట యథార్థకథనమందు తాత్పర్యముగాని పూజ వివక్షితముగాదు. రాజన్ శబ్దమునకు సప్తమివారణమునకై అర్చాయామ్ అనునది యావశ్యకము (వా) ప్రత్యా దుల ప్రయోగమందు సప్తమి రాదనిచెప్పదగును. "లక్షణేత్థంభూతాఖ్యాన" (565) అనుసూత్రమునందుపాత్తములైన ప్రతి పరి అను అనునవి ప్రత్యాదులనితెలియు నది, ఉదా:— సాధుర్నిపుణో వా మాతరం ప్రతి పర్యను వా.

644. ప్రసితోత్సుకాభ్యాం తృతీయా చ. 2-3-44, ప్రసితోత్సుకాభ్యామ్, తృతీయా, చ (సప్తమీ.)

ఆభ్యాం యోగే తృతీయా స్యాచ్చాత్సప్తమీ। ప్రసిత ఉత్సుకో వా హరిణా హరౌ వా॥

644. ప్రసితోత్సుకశబ్దముల ప్రయోగమందు తృతీయాసప్తములువచ్చును. ప్రసిత ఉత్సుకో వా హరిణా హరౌ వా. (విష్ణువుయందేయాసక్తిగలవాడు.)

వివ:—"తత్పరే ప్రసితాసక్తౌ" అనునమరనిఘంటువువలన ప్రసితశబ్దమునకు తత్పరుడని యర్థము. దీనిసాహచర్యమువలననిట్టియర్థము గలయుత్సుకశబ్దమునకేయిచట గ్రహణమని గ్రహింపునది.

645. నక్షత్రే చ లుపి. 2-3-45. నక్షత్రే, చ లుపి (అధికరణే, తృతీయాసప్తమ్యౌ)

నక్షత్రే ప్రకృత్యర్థే యో లుప్యమానస్య ప్రత్యయస్యాఽర్థః తత్ర వర్తమానా త్తృతీయాసప్తమ్యౌ స్తోఽధికరణే। మూలేనావాహయేద్దేవీం శ్రవణేన విసర్జయేత్। మూలే శ్రవణే। ఇతి వా। లుపి కిమ్। పుష్యే శనిః॥

645. ఇచట లుప్‌శబ్దము లుప్‌శబ్దముచే లోపించు ప్రత్యయముయొక్క యర్థమును బోధించును. లుప్పుచే లుప్తమగు ప్రత్యయముయొక్కయర్థమును బోధించు అధికరణవాచకమగునక్షత్రబోధకశబ్దముకంటె తృతీయాసప్తములగును. మూలేనావాహయేద్దేవిం శ్రవణేన విసర్జయేత్। మూలే శ్రవణే ఇతి వా. (మూలనక్షత్రముతో కూడినకాలమందు దేవినావాహనముజేసి శ్రవణనక్షత్రయుక్తమగు కాలమందు దేవిని విసర్జింపవలయునని యర్థము.) మూలశ్రవణశబ్దములకంటె "నక్షత్రేణ యుక్తః కాలః" (4-2-3) అనుసూత్రముచే విహితములగు అణ్ ప్రత్యయములకు "లుబవిశేషే" (4-2-4) అనుసూత్రముచే లుప్పు వచ్చెను. కావునవాశబ్దములు పై యర్థమునుబోధించును. లుపి అనునది లేనియెడల పుష్యే శనిః అనుచోట పుష్యమీనక్షత్రమునుబోధించు పుష్యశబ్దముకంటె తృతీయ ప్రసక్తమగును. పుష్యశబ్దము (పుష్యమీనక్షత్రబోధకము) లుబన్తముగాదు.

646. సప్తమీపఞ్చమ్యౌ కారకమధ్యే. 2-3-7. సప్తమీపఞ్చమ్యౌ, కారకమధ్యే (కాలాధ్వనోః)

శక్తిద్వయమధ్యే యౌ కాలాధ్వానౌ తాభ్యామేతే స్తః। అద్య భుక్త్వాఽయం ద్వ్యహే ద్వ్యహాద్వా భోక్తా। కర్తృశక్త్యోర్మధ్యేఽయం కాలః। ఇహస్థోఽయం క్రోశే క్రోశాద్వా లక్ష్యం విధ్యేత్। కర్తృకర్మశక్త్యోర్మధ్యేఽయం దే

త॥ అధికశబ్దేనయోగే సప్తమీపఞ్చమ్యావిష్యేతే। తదస్మిన్నధికమితి యస్మాదధికమితి చ సూత్రనిర్దేశాత్। లోకే లోకాద్వాఽధికో హరిః॥

**646.** అనువృత్తమగు కాలాధ్వనోః అనునది పఞ్చమ్యన్తముగ విపరిణామమునొందును. మధ్యమవధిద్వయమునపేక్షించునదగుటచే కారకమధ్యే అనుచోట కారకయోర్మధ్యమ్ తస్మిన్ అని ద్వివచనాన్తముతో సమాసమును చెప్పవలయును. కారకములన కర్తృత్వకరణత్వకర్మత్వాది శక్తులర్థము. శక్తిద్వయముయొక్క మధ్యనున్న కాలవాచకములకైనను అధ్వవాచకములకైనను సప్తమీ పంచమీవిభక్తులు ప్రయోగింపదగును. కర్తృశక్తిద్వయమధ్యముననున్న కాలమునకుదాహరణము:—అద్యభుక్త్వాఽయం ద్వ్యహే ద్వ్యహాద్వా భోక్తా. అయమ్ అనుచోట భోక్తా అనుచోటను కర్తృత్వశక్తియేగలదు. రెండుచోటులందునొకడే కర్తయైనను కర్తృత్వశక్తికిమాత్రము క్రియాభేదముచే భేదముగల్గును. ద్వ్యహశబ్దము కాలవాచకము. అధ్వవాచకమునకుదాహరణము:—ఇహస్థోఽయం క్రోశే క్రోశాద్వా లక్ష్యం విధ్యేత్. అయమ్ అనుచోట కర్తృత్వశక్తి. లక్ష్యమ్ అనుచోట కర్మత్వశక్తి, క్రోశశబ్దమధ్వవాచకము.

"అధికశబ్దేన......ష్యేతే", కర్త్రర్థకక్తప్రత్యయాన్తమగు సధ్యారూఢశబ్దముయొక్క యర్థముగల యధికశబ్దప్రయోగమందు సప్తమీ పంచమీవిభక్తులిష్టములగును. "తదస్మిన్నధికం" (5–2–45) "యస్మాదధికమ్" (648) అను సూత్రములందధికశబ్దయోగమున సప్తమీపంచమీ విభక్తులనిర్దేశమిందుమానము. లోకే లోకాద్వాఽధికో హరిః (విష్ణువులోకమందధ్యారూఢుడై యున్నాడు) చూపబడిన అర్థముగలయధికశబ్దయోగమున లోకశబ్దమునకు షష్ఠి ప్రాప్తమగుచుండ జ్ఞాపకమువలననీవిభక్తులు చెప్పబడినవి.

**647.** అధిరీశ్వరే. 1–4–97. అధిః, ఈశ్వరే (కర్మప్రవచనీయాః.)

స్వస్వామిభావసంబన్ధేఽధిః కర్మప్రవచనీయసంజ్ఞః స్యాత్।

**647.** స్వస్వామిభావసంబన్ధద్యోతకమగు అధి అనునది కర్మప్రవచనీయసంజ్ఞకమగును.

**648.** యస్మాదధికం యస్యచేశ్వరవచనం తత్ర సప్తమీ. 2–3–9. యస్మాత్, అధికమ్, యస్య, చ, ఈశ్వరవచనమ్, తత్ర, సప్తమీ।

అత్ర కర్మప్రవచనీయయుక్తే సప్తమీ స్యాత్। ఉపపరార్ధే హరేర్గుణాః। పరార్ధాదధికా ఇత్యర్థః। ఐశ్వర్యే తు

స్వస్వామిభ్యాం పర్యాయేణ సప్తమీ। అధిభువి రామః।
అధిరామే భూః। సప్తమీ శౌణ్డైరితిసమాసపక్షే తు రామా
ధీనా। అషడక్షేత్యాదినా ఖః॥

648. కర్మప్రవచనీయములతో (ఉప అధి అనువానితో) యోగమందుదేని కంటె నధికమో దేనికి ఈశ్వరవచనమో దానికంటె సప్తమియగును. ఉపపరార్ధే హరేర్గుణాః. "ఉపోఽధికే చ" (654) అను సూ. చే ఉపశబ్దముకర్మప్రవచనీయము. విష్ణుగుణములు పరార్ధముకంటె నధికములని యర్థము. పరార్ధముకంటె నధికములనుటవలన పరార్ధశబ్దముకంటె సప్తమి వచ్చెను. స్వస్వామిభావసంబన్ధమందు (అధియోగమందు) స్వవాచకముకంటె నొకమారు స్వామివాచకముకంటె నొకమారును సప్తమివచ్చును. ఇట్లు చెప్పుటకుగారణము వ్రాయబడుచున్నది:— "యస్యచేశ్వరవచనమ్" అను వాక్యమునకర్థద్వయము వివక్షితము. ఈశ్వరశబ్దము భావార్థకము. (ఈశ్వరత్వము = ప్రభువునందుండుధర్మము.) వచనశబ్దము కర్మార్థకము. (ఉచ్యతే) యస్య అనుదానికి స్వామియొక్క అని యర్థము. ఎవని (స్వామి) యందుండునీశ్వరత్వము చెప్పబడునో తద్వాచకముకంటె సప్తమియగునని యొకయర్థము. ఈవ్యాఖ్యానమువలన స్వామివాచకముకంటె సప్తమి సిద్ధించును. యస్య అనుదానికి సేవకునియొక్క (స్వస్య) అని యర్థము. ఈశ్వరశబ్దము ప్రభుపర్యాయము ఎవనియొక్క ఈశ్వరుడు (స్వామి) చెప్పబడునో తద్వాచకముకంటె సప్తమి యగునని రెండవయర్థము. ఈ వ్యాఖ్యానమువలన స్వవాచకముకంటె సప్తమి సిద్ధమగును. ఇట్టి వ్యాఖ్యానభేదమువలన స్వస్వామివాచకములకు పర్యాయముగ సప్తమి ఫలితమగును. స్వవాచకమునకుదాహరణము:—అధిభువి రామః. రామునికి భూమినికి స్వస్వామిభావముసంబన్ధము. రాముడు స్వామి. భూమి స్వపదార్థము. స్వామివాచకమునకుదాహరణము:—అధిరామేభూః. "సప్తమీశౌణ్డైః" (721) అనుసూత్రముచే సప్తమ్యన్తమగు రామశబ్దమునకు శౌణ్డాదిగణములోని అధిశబ్దముతో సమాసమగును. ఈపక్షమందు రామాధీనా (భూః) అని యగును. రామాధిశబ్దముకంటె "అషడక్షాశితఙ్గ్వలంకర్మాలంపురుషాధ్యుత్తరపదాత్ ఖః" (5-4-7) అనుసూత్రముచే ఖప్రత్యయము (ఈన) అగును.

649. విభాషా కృఞి. 1-4-98. విభాషా, కృఞి (కర్మప్రవచనీయాః, అధిరీశ్వరే)

అధిః కరోతౌ ప్రాక్సంజ్ఞో వా స్యాదీశ్వరేఽర్థే। యదత్ర మామధికరిష్యతి। వినియోక్ష్యత ఇత్యర్థః। ఇహ వినియోక్తురీశ్వరత్వం గమ్యతే। అగతిత్వాత్తిఙిచోదాత్తవతీతి నిఘాతో న॥

ఇతి విభక్త్యర్థాః.

649. కృఞ్ ధాతుయోగమందు స్వస్వామిభావసంబన్ధద్యోతకము గు అధి అనునది వికల్పముగ కర్మప్రవచనీయసంజ్ఞగలదగును. యదత్రమామధికరిష్యతి. ఎవడునన్నీకార్యమున వినియోగించగలడని యర్థము. తనను వినియోగించువానికి యీశ్వరత్వము (స్వామిత్వము) గమ్యమానమగును. మామధికరిష్యతి అనుచోట నస్మచ్ఛబ్దార్థము కృఞ్ ధాత్వర్థకర్మయగుటచే నస్మచ్ఛబ్దముకంటె "కర్మణి ద్వితీయా" (540) అను సూ. చే ద్వితీయ సిద్ధమగును గాన కర్మప్రవచనీయసంజ్ఞకు ఫలమేమన నిచట అధి అనుదానికి గతిసంజ్ఞలేనందున "తిజి చోదాత్తవతి" (8-1-71 ఉదాత్తమగు తిఙన్తము పరమగునప్పుడు గతిసంజ్ఞకమనుదాత్తమగును) అనుసూత్రముచే విహితమగు యనుదాత్తము రాకుండుట ఫలమని తెలియదగును.

విభక్త్యర్థప్రకరణము సమాప్తినొందెను.



# 16. అవ్యయీభావప్రకరణము

650. సమర్థః పదవిధిః. 2-1-1. సమర్థః, పదవిధిః
పదసమ్బన్ధీ యో విధిస్సమర్థాశ్రితో బోధ్యః॥

650. పదములు లేకపదములనుద్దేశించి విధింపబడు కార్యమేకార్థీభావరూపసామర్థ్యముతో గూడుకొనునట్టిదాని నాశ్రయించి యుండును. పదవిధిః అనుచోట సంబంధార్థకషష్ఠ్యన్తమునకు సమాసము గాన "పదసమ్బన్ధీ విధిః" అనునర్థము లభించును. (పదస్యవిధిః, పదయోర్విధిః, పదానాంవావిధిః అని ఏకవచనబహువచనాన్తములకు సమాసమని గ్రహించునది.) పదవిధిశబ్దముచే సమాసాదిపంచవృత్తులకు గ్రహణము కలుగును. వృత్తివిభాగము ముందు తెలుపబడును. సమాసము వృత్తులలో నొకటి. సమాసము తద్ధితము మొదలగునవి పదములనుద్దేశించి విధింపబడుటచే పదవిధులగును. అట్టివి సమర్థాశ్రితములగునని భావము. సమర్థపదము లక్షణచే "సమర్థాశ్రితః" అనునర్థమును బోధించును. సమర్థపదమునకు సామర్థ్యముతో గూడినదనియర్థము.

వివ :— ఈశాస్త్రమున సామర్థ్యము వ్యపేక్షయనియు నేకార్థీభావమనియును రెండువిధములుగనున్నది. విశిష్టా అపేక్షా వ్యపేక్షా అనువ్యుత్పత్తివలన స్వార్థసమన్వితములగు పదములకు ఆకాంక్షాదులవలన నన్యోన్యము సంభవించు నన్వయము వ్యపేక్షయనబడును. అట్టిది రాజ్ఞః పురుషః మొదలగు వాక్యములందే సంభవించును. రాజన్ + ఙస్, పురుష + సు అను ప్రక్రియావస్థలో ప్రత్యేకముగ నర్థవత్తులుగ గ్రహింపబడు పదములకు "రాజపురుషః" అను సమాసమున రాజసంబన్ధవిశిష్టః పురుషః ఇత్యాది రీతినొకే యర్థమును బోధింపజేయునదియే కార్థీభావసామర్థ్యము. ఈపక్షమున రాజపురుషః అనుచోట సముదాయమే యర్థముగలది గాని ప్రత్యేకపదములకర్థము లేదు. ఇట్టియేకార్థీభావము రాజపురుషః ఇత్యాదివృత్తులలోనే యుండును. ఈసూత్రమున నిట్టియేకార్థీభావసామర్థ్యమునే గ్రహింపవలయును. ఏకార్థీభావపక్షమున వ్యపేక్షాపక్షమందువలె రాజపురుషః ఇత్యాది వృత్తులలోనుండు రాజాదిపదార్థములతో ఋద్ధస్య మొదలగు విశేషణపదార్థము లన్వయింపవు. వృత్తులలోనుండు రాజాదిపదార్థములకు స్వాతంత్ర్యముగనుపస్థితి లేకపోవుటయే యిందుకుగారణము. విశేషణపదార్థాన్వయసహితమగు బోధజనకత్వరూపమైన గమకమున్నచో కొన్నిస్థలములందు (దేవదత్తస్య గురుకులమ్ మొదలగుచోటులందు) విశేషణాన్వయముసుండవచ్చును. ఏకార్థీభావము వృత్తులలో అలౌకికవిగ్రహవాక్యమందే భాష్యాది ప్రామాణ్యమువలన గల్పింపబడును.

ఇది పరిభాషాసూత్రమగుటచే పదమునుద్దేశించి కార్యమును విధించు ప్రతి సూత్రమందును ప్రవర్తించి "సమర్థాశ్రితోబోధ్యః" అనునర్థమును బోధించును. పశ్య రామం శ్రితో భీమః చైత్రః, ఇత్యాదులలో రామశ్రితశబ్దముల కన్యోన్య సంబంధము లేనందున నేకోపస్థితిజనకత్వరూపమగు నేకార్థీభావసామర్థ్యము సంభవింపదు గాననవి సమర్థములుగాకపోవుటచే "ద్వితీయాశ్రితాతీత" (690) అను వక్ష్యమాణసూత్రముచే సమాసము రాదు. ఇట్టిదోషమును వారించుటకై సూత్రమున సమర్థపదమవశ్యముగనుండవలయును.

651. ప్రాక్కడారాత్సమాసః. 2-1-3. ప్రాక్, కడారాత్, సమాసః।

కడారాః కర్మధారయ ఇత్యతః ప్రాక్ సమాస ఇత్యధిక్రియతే।

651. "కడారాః కర్మధారయే" (765) అనుసూత్రమునకు ముందు సూత్రములలోనికి ప్రాక్ సమాసః అనుపదము అధికృతము అగును.

వివ :— ప్రాక్పదము నావృత్తిచేయవలయును. అందొకటి యవధిబోధకమగుటచే పైజెప్పిన యర్థము లభించును. రెండవ ప్రాక్పదము సమాసపదమునకు ప్రవృత్తములై మొదట సమాససంజ్ఞ గలవగును అవ్యయీభావాది విశేషసంజ్ఞ గలవగునను నర్థమును తత్సూత్రములకు గలుగజేయును. సమాససంజ్ఞతో నవ్యయీభావాదివిశేష సంజ్ఞలకు సమావేశముండునని ఫలితమగును. అట్లుగాకున్న "ఆకడారాదేకా సంజ్ఞా" అనుసూత్రమువలన సంజ్ఞాద్వయసమావేశము లేకుండును.

సమ్ అనునుపసర్గము పూర్వమందుగల అస్ ధాతువునకు భావార్థమున ఘఞ్ ప్రత్యయమును చేర్చిన సమాసః అనురూపమేర్పడును. (సమ్+అస్+ఘఞ్=సమాసః) దీనివలన నేకపదములకేకీభావరూపమగు సంశ్లేషమనునర్థము సమాసపదమునకు సంభవించును.

652. సహ సుపా. 2-1-4. సహ, సుపా (సుప్)

సహేతియోగో విభజ్యతే। సుబన్తం సమర్థేన సహ సమస్యతే। యోగవిభాగస్యేష్టసిద్ధ్యర్థత్వాత్తిఙన్తోత్తరపదోఽయం సమాసః। స చ ఛన్దస్యేవ పర్యభూషయత్। అనువ్యచలత్।

652. సూత్రమున సహ అనుదానిని విభాగముచేయవలయును. సుబన్తము సామర్థ్యయుక్తమైన శబ్దముతో సమసించును. సూత్రమును విభజించుట యిష్టమగుకార్యము సిద్ధించుటకొఱకగుటచే నీసమాసము తిఙ్ప్రత్యయాన్త

ములగు కొన్నిశబ్దములు మాత్రము త్రపదములుగలదియగును. అట్టిదియు వేదమునందే యుండదగును. కవి లోకమునందుండగూడదు. ఉదా:— పర్యభూషయత్, అనువ్యచలత్. మొదటిస్థలమున పరి, అనుసుబన్తము "అభూషయత్" అనుసమర్థతిఙన్తముతో సమసించినది. రెండవస్థలమున వి అనెడిసుబన్తమునకు "అచలత్" అనుసమర్థతిఙన్తముతోను, అను అనుసుబన్తమునకు "వ్యచలత్" అనుసమర్థతిఙన్తముతోను, పర్యాయముగ సమాసమును చేయవలయును.

653. సుపా. 2-1-4. (సుప్)

సుప్సుపా సహ సమస్యతే। సమాసత్వాత్ప్రాతిపదికత్వమ్।

653. సుబన్తము సమర్థమగు సుబన్తముతో సమసించును. సమాసము నకు కృత్తద్ధితసమాసాశ్చ (181) అనుసూత్రమునచే ప్రాతిపదికసంజ్ఞ సిద్ధమగును.

వివ:— యోగవిభాగమును చేయనియెడలననువృత్తమగు సుప్పదము సుబన్తమనునర్థమును బోధించుటచే సుబన్తము సమర్థమగు సుబన్తముతో సమసించుననునర్థము సూత్రమునకు లభించును. అట్లైన పర్యభూషయత్ మొదలగు పైనిచూపబడిన రూపములు సిద్ధింపకుండును. కాన యోగవిభాగమావశ్యకము. యోగవిభాగమునుచేసి పైరీతిగనర్థమును చెప్పినచో లోకమునగూడ "ఘటోభవతి" ఇత్యాదులందు తిఙన్తముతో సమాసముప్రసక్తమగును. సమాసావయవములగు సుప్పులకు "సుపోధాతు" (654) సూ. చే లుక్కుప్రసక్తమగును. ఘటభవతి మొదలగునవిష్టరూపములు ప్రసక్తములయ్యెడిని. అట్టివి యభీష్టములుగాకపోవుటచే "యోగవిభాగస్యేష్ట......సమాసః" అనిచెప్పివానినివారించెను. సహ అనుయోగమందు, అనువృత్తమగు సుప్పదమునవేకత్వము వివక్షితమగుటచే నొకసుబన్తమన్యముతో సమసించును గానిరెండుమూడుసుబన్తములొకేసారి యితరముతో సమసించవనెడియర్థము లభించుటవలన "అనువ్యచలత్" ఇత్యాదిరూపములందు పర్యాయముగ సమాసమును చేయవలయును గాని ఒకేసారి సమాసముచేయరాదు. విభక్తముగురెండవసూత్రములోనికనువృత్తమగు సుప్పదముగూడ పైరీతినే అర్థమును బోధించును, సమాసః అనునదధికృతమగును. "భూతపూర్వః" అనునదిదీనికుదాహరణము. ఇచట పూర్వమ్ అనుసుబన్తము భూతః అనుసమర్థసుబన్తముతో సమసించినది. ప్రతివృత్తికి విగ్రహవాక్యమొకటియుండును. విగ్రహమన విభిన్నం గ్రహః (వేరుగ పదములను గ్రహించుట) అనువ్యుత్పత్తిచే వృత్తిలోనుండు పదములస్వరూపమును తదర్థముమొదలగువానిని తెలియజేయునది. లౌకికమనియు నలౌకికమనియునది రెండువిధములు. లౌకికమన సిద్ధరూపములతోబాటు లోకమునగూడ పృథక్ప్రయోగార్హమైనది. తద్భిన్నమలౌకికము. రాజపురుషః అనునది సమాసవృత్తి. అందున్నపదములస్వరూపాదులదెలిసికొనుటకు విగ్రహమునుచూపవలయును. అస్థలమున "రాజ్ఞః పురుషః" అనునది లౌకికవిగ్రహవాక్యము. ఇట్టి విగ్రహమునకును పృథక్ప్రయోగముండవచ్చును. రాజన్ + ఙస్, పురుష + సు

అనునది లౌకిక విగ్రహము. ఇది పృథక్ప్రయోగార్హముగాదు. వృత్తియందేకార్థీభావ మిట్టి విగ్రహము. దీనిలగునని యిదివరలో జెప్పబడినది. ప్రకృతమున పూర్వ+స్, భూత+స్ అనెడియలౌకికవిగ్రహవాక్యమందు "సుపా" అనుయోగముచే సమాస సంజ్ఞ సిద్ధమగును గాన సముదాయమునకు ప్రాతిపదికసంజ్ఞ ... సిద్ధమగును ఇట్లుండ :—

854. సుపోధాతుప్రాతిపదికయోః. 2-4-71. సుపః, ధాతు ప్రాతిపదికయోః (లుక్)

> ఏతయోరవయవస్య సుపో లుక్స్యాత్। భూతపూర్వేచరడితి నిర్దేశాద్భూతశబ్దస్య పూర్వనిపాతః। పూర్వం భూతో భూతపూర్వః. వా॥ ఇవేన సమాసో విభక్త్యలోపశ్చ।జీమూతస్యేవ॥

854. ధాతువునకుగాని ప్రాతిపదికమునకుగాని అవయవములగు సుప్పులకు లుక్కగును. పూర్వ+స్, భూత+స్ అనుచోట ప్రాతిపదికావయవములగు సుప్పులకు లుక్కువచ్చినచో పూర్వభూత అనియగును. సమాసమునకు "కృత్తద్ధిత (180) సూ. చే ప్రాతిపదికసంజ్ఞ యుండును గాన సముదాయమునకు సువుత్పత్తి యగును. రుత్వవిసర్గాదులు, భూతశబ్దమునకు పూర్వనిపాతమువచ్చిన భూతపూర్వః అనియగును. పూర్వభూతశబ్దములు రెండును సుబన్తములేగాన సమాసవిధాయక శాస్త్రమున ప్రథమా నిర్దిష్టములగుటచే నుపసర్జనములేయైనను "భూతపూర్వే చరట్" (5-3-53) అను పాణినినిర్దేశమువలన (పాణిని భూతశబ్దమునే పూర్వమున ప్రయోగించుటవలన) భూతశబ్దమునకే పూర్వనిపాతమగును. ఉపసర్జనసంజ్ఞ యన్వర్థమగుటచేతను (అప్రధానమునుబోధించునది) పూర్వశబ్దము కాలవాచకమగుటవలనక్రియనుగుఱించి విశేషణమగుటచేతను పూర్వశబ్దమునకే "ఉపసర్జనంపూర్వమ్" (858) సూ. చే పూర్వనిపాతము ప్రాప్తమగుచుండ నీపాణిని నిర్దేశము భూతశబ్దమునకేపూర్వనిపాతమగునను టలో జ్ఞాపకమగును. కావున నీనిర్దేశమెట్లు భూతశబ్దమునకే పూర్వనిపాతమును బోధించునను శంక నివృత్తమగును. ఉపసర్జనసంజ్ఞ యన్వర్థమగుటచే సమాసశాస్త్రమున ప్రథమానిర్దిష్టము విశేషణమునగునది ఉపసర్జనసంజ్ఞకలదగునని "ప్రథమానిర్దిష్టం" (857) అనుసూత్రమునకర్థమనితెలియదగును.

(వా) సుబన్తము ఇవ అనునవ్యయముతో సమసించునని యీ వార్తికముచే ప్రాప్తించు సుబ్లుక్కు రాదనియును చెప్పవలయును. జీమూతస్యేవ జీమూతస్య అను సుబన్తము ఇవ అనునవ్యయముతో సమసించినది. తదవయవమగు షష్ఠ్యేకవచనమునకు లుక్కు నివృత్తమయ్యెను.

వివ:.... అలుక్సమాసప్రకరణమున "పఞ్చమ్యాః స్తోకాదిభ్యః" (964) అనుసూత్రముచే పంచమీవిభక్తికి లుగభావమును విధించుచున్నది. ఈ సూత్రమున

సుపః అనుదానిచే సుప్ప్రత్యాహారమునకు గ్రహణము గాని సప్తమీబహువచనము నకుమాత్రము గ్రహణము గాదనియెరుగవలయును. అట్లయిన పంచమికి లుక్ ప్రాప్తియే లేనందున తదభావవిధానము వ్యర్థమయ్యెడిని. "ఇవేన... ....శ్చ" ఈవార్తికము "సుపా" అనుయోగముచే సిద్ధమగుసమాసమునసువదించి విభక్తికి ప్రాప్తవగు లుక్కునమాత్రము నిషేధించును. యోగవిభాగసిద్ధమగుటచే నిది కొన్నిచోటులందే ప్రవర్తించును. కావున "ఉద్బాహురివ వామనః" అనుకాళిదాసుని ప్రయోగము సాధువగును. సమాసమైనచో ఇవశబ్దమునకు పరనిపాతము కాదగును. జీమూతస్యేవ మొదలగునవి సమాసములనుటకు సమాసస్వరము మొదలగునవి ఫలములని యెఱుంగునది.

655. అవ్యయీభావః. 2-1-5.

అధికారోఽయమ్।

655. ఇది అధికారసూత్రము. కావునను త్తరసూత్రములందు అవ్యయీభావసంజ్ఞకవగుననునర్థము ను బోధించును. అందుచేనీప్రకరణమున సమాససంజ్ఞ గలదగుచు నవ్యయీభావసంజ్ఞగలదగుననునర్థము లభించును. అవ్యయీభావమనునది విశేషసంజ్ఞయని తెలియునది.

వివ :— "అనవ్యయమవ్యయం భవతి" అనునర్థమున చ్విప్రత్యయాన్తమగునవ్యయశబ్దము పూర్వమందుగల భూధాతువుకంటె కర్త్రర్థకణప్రత్యయమును చేసిన అవ్యయీభావశబ్దము సిద్ధించును. స్వరాదినిపాతభిన్నమైనందుననవ్యయము కానిదైనను అవ్యయసంజ్ఞగలదగుననియర్థము.

656. అవ్యయం విభక్తిసమీపసమృద్ధివ్యృద్ధ్యర్థాభావాత్యయాసంప్రతిశబ్దప్రాదుర్భావపశ్చాద్యథానుపూర్వ్యయౌగపద్యసాదృశ్యసంపత్తిసాకల్యాన్తవచనేషు. 2-1-6. అవ్యయమ్, విభక్తి.... ....వచనేషు।

అవ్యయమితియోగో విభజ్యతే। అవ్యయం సమర్థేన సహ సమస్యతే సోఽవ్యయీభావః।

656. సూత్రమున "అవ్యయమ్" అనుదానివివిభాగము చేయవలయును. విభక్తమగునీసూత్రములోనికి సమర్థపదముపస్థితమగును. అది తృతీయాన్తముగ విపరిణామమునొందును. సమాసః అనుపదమధికృతమగును. కాన అవ్యయము సమర్థముతో సమసించును అదియవ్యయీభావసంజ్ఞగలదగునని అర్థము లభించును. అపదిశమనునది యుదాహరణము.

వివ :—అపదిశమ్ మొదలగుసమాసములందు అప మొదలగు నవ్యయములు విభక్తిసమీపాద్యర్థద్యోతకములుగాకుండుటచే నట్టిచోటులందు యథాశ్రుత

సూత్రముచే సమాసము సిద్ధించదు. గాన యోగవిభాగమావశ్యకమగును. ద్వితీయ యోగమునకర్థము ముందు ప్రదర్శింపబడును. అపదిశమ్ అనుచోట "దిశయో ర్మధ్యే" అనివిగ్రహవాక్యము. ఇట్టిదానిని యస్వపదవిగ్రహమందురు. స్వపద విగ్రహమన వృత్తిలో గ్రాహ్యమాణములగు పదములతో వృత్త్యర్థమును వివరించు వాక్యము. రాజపురుషః మొదలగువృత్తులకు "రాజ్ఞః పురుషః" మొదలగు వాక్యము లట్టి విగ్రహములగును. తద్భిన్నములస్వపదవిగ్రహములనిగ్రహించునది. ప్రకృతమున నవ్యయమనుయోగముచే మధ్యార్థకమగు అప అనునవ్యయమునకు సమర్థ మగు దిశాపదముతోనవ్యయీభావసమాసము సిద్ధమగును. సమాసమగుటచే ప్రాతి పదికసంజ్ఞ సిద్ధించునుగాన అప దిశా + ఓస్ అనుచోట సమాసావయవములగు సుప్పులకు "సుపోధాతు" (654) సూ. చే లుక్కగును. అపదిశా అనియుండును.

657. ప్రథమానిర్దిష్టం సమాసఉపసర్జనమ్. 1-2-43. ప్రథమానిర్దిష్టమ్, సమాసే, ఉపసర్జనమ్।

సమాసశాస్త్రే ప్రథమానిర్దిష్టముపసర్జనసంజ్ఞం స్యాత్।

657. సమాసవిధాయకశాస్త్రమునందు ప్రథమాన్తముగనుచ్చరింపబడునది ఉపసర్జనసంజ్ఞగలదగును.

వివ :— సూత్రమున సమాసే అనుపదమునకు సమాసవిధాయకశాస్త్ర మందనునర్థమును చెప్పవలయును. అంతియకాని సమాసమందని చెప్పరాదు. అట్లయిన సమాససంజ్ఞ ప్రవర్తించినవెంటనే ప్రథమకు "సుపోధాతుప్రాతిపది కయోః" సూ. చే లుక్కగును గానసట్టియర్థమునకు సంభవమే కలుగకపోవును. సమాసే అనుదానికి "సమాసముచేయబోవుచుండ" అనునర్థమును చెప్పినచో "కృష్ణశ్రితః" మొదలగుసమాసములలో "కృష్ణంశ్రితః" అనువిగ్రహమునకృష్ణ శబ్దము ప్రథమాన్తముగ నిర్దేశింపబడలేదు గానదానికుపసర్జనసంజ్ఞ సిద్ధింపక పోవును. అనిష్టమగు శ్రితశబ్దమునకీ సంజ్ఞ ప్రసక్తమయ్యెడిని. కాన సమాసవిధా యకశాస్త్రమునందనునర్థమునే చెప్పవలయును. సమాసవిధాయకశాస్త్రమున (ద్వితీ యాశ్రితాతీత, 690) ద్వితీయా అనునది ప్రథమాన్తముగ నిర్దేశింపబడినది గాన కృష్ణం అను ద్వితీయాన్తమే యుపసర్జనమగును. ప్రకృతమున దిశాఅప అవి యుండ అవ్యయమను సమాసశాస్త్రమున ప్రథమాన్తముగ నిర్దేశింపబడినదిఅవ్య యమే గావున అప అనునవ్యయమునకుపసర్జనసంజ్ఞ సిద్ధించును. ఇట్లుండ :—

658. ఉపసర్జనం పూర్వమ్. 2-2-30. ఉపసర్జనమ్ పూర్వమ్। (సమాసః)

సమాసే ఉపసర్జనం ప్రాక్ప్రయోజ్యమ్।

658. ఉపసర్జనసంజ్ఞగలది సమాసమున పూర్వమందు ప్రయోగింపదగును. (పూర్వనిపాతము) కాన ప్రకృతమున అపదిశా అనియగును.

వివ:—సమాసపదపద్ధీకృతమగును. ప్రకృతమున సమాసమందమనర్థము చెప్పిన యోగ్యముగనుండును గాననట్టియోగ్యతాబలముచేనది సప్తమ్యన్తముగ విపరిణామమునొందును. సూత్రమున పూర్వమ్ అనుపదము పూర్వమందు ప్రయోగింపదగుననునర్థమును బోధించును. ఇట్లు అప అనుదానికి దిశాశబ్దముకంటె పూర్వప్రయోగము సిద్ధమగును. అపదిశా అనియగును.

659. ఏకవిభక్తి చాఽపూర్వనిపాతే. 1-2-44. ఏకవిభక్తి, చ, అపూర్వనిపాతే (సమాసే, ఉపసర్జనమ్.)

విగ్రహే యన్నియతవిభక్తికం తదుపసర్జనసంజ్ఞం స్యాత్, న తు తస్య పూర్వనిపాతః।

659. విగ్రహవాక్యములన్నిటియందొకేవిభక్తిగల పదముపసర్జనసంజ్ఞగలదగును, దీనికి పూర్వప్రయోగముమాత్రము లేదు.

వివ:—అనువృత్తమగు సమాసే అనునది లక్షణచే విగ్రహే అనునర్థమును బోధించును. ఏకవిభక్తి అనుచోట "ఏకైవవిభక్తిర్యస్యతత్" అని విగ్రహము. నియతముగనొకేవిభక్తిగలదనునర్థము లభించును. ఇట్లు ఫలితమగునర్థమే మూలమున "విగ్రహే యన్నియతవిభక్తికమ్" అని చూపబడినది. "న తు తస్య పూర్వనిపాతః" అనునది "అపూర్వనిపాతే" అనుదానికి ఫలితార్థము. పూర్వనిపాతవిషయమున యీసంజ్ఞప్రవర్తించదని వాచ్యార్థము. ఈసూత్రమునకు విశదముగబోధయగుటకు "నిష్కౌశామ్బిః" అను నుదాహరణము చూపబడుచున్నది. ఇచట కౌశామ్బ్యాః నిష్క్రాన్తః నిష్క్రాన్తమ్, నిష్క్రాన్తేన, ఇత్యాదిరీతిని విగ్రహములను చెప్పునపుడు క్రమముగ నిష్కౌశామ్బినా, నిష్కౌశామ్బిమ్, నిష్కౌశామ్బినా, మొదలగుసిద్ధరూపములగును. అన్నివిగ్రహము లందును కౌశామ్బ్యాః అనునదిమాత్రము నియతవిభక్తికమగుటచే నీసూత్రముచే దానికుపసర్జనసంజ్ఞయగును. గాని దీనికి పూర్వనిపాతముమాత్రము రాదు. ఇచట సమాసవిధాయకమగు "కుగతిప్రాదయః" (765) అనుశాస్త్రమున ప్రథమానిర్దిష్టముగానందున కౌశామ్బీశబ్దమునకు పూర్వసూత్రముచేనుపసర్జనసంజ్ఞ సిద్ధించనేరదు. ప్రకృతమున "దిశయోర్మధ్యమ్" దిశయోర్మధ్యేన" ఇత్యాదిరీతిని మనమెన్నివిగ్రహములను చెప్పినను ప్రతివిగ్రహమందును దిశా అనునది నియతవిభక్తికముగనుండును గానదానికి యీసూత్రముచేనుపసర్జనసంజ్ఞ సిద్ధించును.

660. గోస్త్రియోరుపసర్జనస్య. 1-2-48. గోస్త్రియోః; ఉపసర్జనస్య. (హ్రస్వః, ప్రాతిపదికస్య.)

ఉపసర్జనం యోగోశబ్దః స్త్రీప్రత్యయాన్తం చ తదన్తస్య ప్రాతిపదికస్య హ్రస్వః స్యాత్। అవ్యయీభావశ్చేత్యవ్యయత్వమ్॥

660. ఉపసర్జనసంజ్ఞగల గోశబ్దము, ఉపసర్జనసంజ్ఞగల స్త్రీప్రత్యయాన్తము, ఇవియంతమందుగల ప్రాతిపదికమునకు హ్రస్వము వచ్చును. "అవ్యయీభావశ్చ" (618) సూ. చే అవ్యయీభావసమాసమునకు అవ్యయసంజ్ఞ సిద్ధముగును.

వివ:—గోస్త్రియోః అనునది ద్వన్ద్వసమాసము. స్త్రీశబ్దముచే "స్త్రియామ్" అనునధికారమున విధింపబడు స్త్రీప్రత్యయములు గ్రహింపబడును. ప్రత్యయగ్రహణపరిభాషచే తదన్తవిధివలన స్త్రీప్రత్యయాన్తమను నర్థము లభించును. ఉపసర్జనస్య అనునది గోస్త్రీశబ్దములతో ప్రత్యేకముగ సంబంధించును. ఉపసర్జనమగు గోశబ్దమునకు నట్టి స్త్రీప్రత్యయాన్తమునకు సమన్వయము లభించును. ఈ రెండిటిని ప్రాతిపదికమునకు విశేషణముగజేసి తదన్తవిధిచేసిన మూలోక్తమగునర్థము సిద్ధించును. అపదిశా అనుచోట దిశా అనునది ఉపసర్జనము టాబన్తమునగుటచే నిది యన్తమందుగల "అపదిశా" అను ప్రాతిపదికమునకు హ్రస్వము ప్రవర్తించిన అపదిశ అని యగును. సమాసమునకు కృత్తద్ధితసూత్రముచే ప్రాతిపదికసంజ్ఞయుండుటచే సుబుత్పత్తికలుగగా అపదిశ+సు అను యుండును. అవ్యయీభావసమాసమునకు నవ్యయసంజ్ఞయుండుటచే "అవ్యయాదాప్సుపః" (455) సూ. చే సుప్పులకు లుక్కు ప్రసక్తమగుచున్నది.

661. నావ్యయీభావాదతోఽమ్త్వపఞ్చమ్యాః. 2-4-83.
న. అవ్యయీభావాత్. అతః, అమ్, తు. అపఞ్చమ్యాః,
(సుపః, లుక్)

అదన్తాదవ్యయీభావాత్సుపో న లుక్, తస్య తు పఞ్చమీం వినా అమాదేశస్స్యాత్। దిశయోర్మధ్యే అపదిశమ్। "క్లీబావ్యయం త్వపదిశం దిశోర్మధ్యే విదిక్ స్త్రియామ్" ఇత్యమరః॥

661. హ్రస్వాకారమన్తమందుగల యవ్యయీభావసమాసముకంటె పరమగుసుప్పులకు లుక్కురాదు, పంచమినివిడిచి మిగిలినసుప్పులకు అమాదేశమగును. అపదిశ+సు అనుచోట సుప్రత్యయమునకు లుక్కురాక అమాదేశమగును. పిదప "అమిపూర్వః" (195) సూ. చే పూర్వరూపము వచ్చిన అపదిశమ్ అని సిద్ధమగును. అపదిశమ్ అనునది ప్రదర్శితరీతిని సాధువనుట ప్రాచీనులైన నమరసింహాదులకును సమ్మతమని తదీయవచనమువలన తెలియనగును. "క్లీబావ్యయం...... స్త్రియామ్." అర్థముసుగమము.

వివ:—ఈసూత్రమున వాక్యద్వయము. ఇందు మొదటిది "నావ్యయీభావతః" అనునది. అదన్తమగునవ్యయీభావముకంటె పరమగుసుప్పులకు లుక్కు రాదని యర్థము. "అమ్త్వపఞ్చమ్యాః" అనునది రెండవది. పంచమికంటెనితరములగు సుప్పులకు అమాదేశమగునని యర్థము. అపఞ్చమ్యాః అనునిషేధము

"అనన్తరస్య విధిర్వా భవతి ప్రతిషేధో వా" (విధిప్రతిషేధములవ్యవహితములకే సంభవించును.) అనుపరిభాషచే ప్రత్యాసన్నమగు అమ్మునకే నగును గాని లుజ్నిషేధమునకు గాదు. అదన్తమగునవ్యయీభావముకంటె పరమగుపంచమికంటె నితరమైన సుప్పునకు లుక్కు రాదు. అట్టి సుప్పునకమాదేశమగును, పంచమికిమాత్రము లుక్కు అమాదేశము రెండును రావు అని ఫలితమగును. ప్రకృతమున(అపదిశ + సు) పంచమీభిన్నమగుసుప్పుపరమగునపుడు అపదిశమ్ అనియగును. పంచమీవిభక్తిపరమగునపుడు అపదిశాత్ అని యగును.

"అవ్యయీభావశ్చ" అనుసూత్రముచే నవ్యయీభావసమాసము నపుంసకలింగమగును గాన "హ్రస్వోనపుంసకేప్రాతిపదికస్య" (319) సూ.చే హ్రస్వము ప్రవర్తించిన అపదిశమ్ మొదలగురూపములు సిద్ధమగును కాని అతిఖట్వః ఇత్యాదిరూపములకొఱకావశ్యకమగుటవలనను ఇచట ప్రసక్తియుండుటవలనను "గోస్త్రియోః" అనుసూత్రమిచట నుపన్యసింపబడెనని గ్రహించునది.

**662. తృతీయాసప్తమ్యోర్బహులమ్. 2-4-84. తృతీయాసప్తమ్యోః,బహులమ్। (అతః, అవ్యయీభావాత్, అమ్.)**

అదన్తాదవ్యయీభావాత్తృతీయాసప్తమ్యోర్బహులమమ్భావస్స్యాత్। అపదిశమ్। అపదిశేన। అపదిశమ్। అపదిశే। బహులగ్రహణాత్సుమద్రమున్మత్తగఙ్గమిత్యాదౌ సప్తమ్యాః నిత్యమమ్భావః॥ విభక్తీత్యాదేరయమర్థః। విభక్త్యర్థాదిషు వర్తమానమవ్యయం సుబన్తేన సహ సమస్యతే। సోఽవ్యయీభావః। విభక్తౌ తావత్। హరౌ ఇత్యధిహరి। సప్తమ్యర్థస్యైవాత్ర ద్యోతకోఽధిః। హరి + ఙి. అధి, ఇత్యలౌకికం విగ్రహవాక్యమ్। అత్ర నిపాతేనాఽభిహితేఽప్యధికరణే వచనసామర్థ్యాత్సప్తమీ॥

662. హ్రస్వాకారాన్తమగు నవ్యయీభావసమాసముకంటె పరములగు తృతీయాసప్తమీవిభక్తులకమాదేశము బహులముగనగును. తృతీయకుదా:—అమాదేశము వచ్చునపుడు అపదిశమ్, రానపుడు అపదిశేన "నావ్యయీభావాత్" అనుసూత్రముచే సుప్పునకు లుగభావము సిద్ధించును. అపదిశమ్,అపదిశే. ఇచట సప్తమికమాదేశము. సూత్రమున వాశబ్దమువలన వికల్పార్థము లభించుచుండ బహులగ్రహణముచే (క్వచిత్ప్రవృత్తిః క్వచిదప్రవృత్తిః.) కొన్నిస్థలములందుమాత్రము సప్తమికి నిత్యముగనమ్భావము సిద్ధించును. ఉదా:—సుమద్రమ్. (మద్రాణాం సమృద్ధిః) ఉన్మత్తగఙ్గమ్. (ఉన్మత్తా గఙ్గా యస్మిం స్తత్)

అవ్యయంవిభక్తీత్యాది సూత్రమున రెండవయోగమునకర్థము :— "విభక్తి......వచనేషు, అనుచోట విభక్తి సమీప సమృద్ధి వ్యృద్ధి అర్థాభావ అత్యయ అసంప్రతి శబ్దప్రాదుర్భావ పశ్చాత్ యథా ఆనుపూర్వ్యయౌగపద్య

సాదృశ్య సంపత్తి సాకల్య అన్త శబ్దములకు ద్వన్ద్వసమాసము. దీనికి వచనశబ్దముతో కర్మధారయము. వచనశబ్దమునకు కర్మవ్యుత్పత్తిచే (ఉచ్యన్త ఇతి=వచనాః) విభక్త్యాద్యర్థములు ద్యోత్యములగుచుండ అను నర్థము లభించును. విభక్తిశబ్దము లక్షణచే విభక్త్యర్థమును బోధించును. ఈవాక్యములోని కవ్యయపదమను వర్తించును. అవ్యయీభావః, సమాసః, అనునవి యధికారలబ్ధములు. సుపా అను పదమనువర్తించును. తదన్తవిధిచే సుబన్తేన అనునర్థము లభించును. కావున విభక్తిసమీపసమృద్ధ్యాద్యర్థములందు వర్తమానమగునవ్యయము సమర్థమగుసుబన్తముతో సమసించి యవ్యయీభావసంజ్ఞకమగునని సూత్రార్థము లభించును. సూత్రములోని క్రమమునననుసరించి విభక్త్యర్థమందుదాహరణము చూపబడెను. అధిహరి. హరౌ అనుదానికి అధిహరి అనుసమాసమునకునర్థభేదములేదు. ప్రకృతమున సమాససంజ్ఞసిద్ధించినతరువాత హరి+ఙి అధి అనునవస్థలో "సుపోధాతు" (654) సూ. చే సుప్పునకు లుక్కగును. పిదప సమాసవిధాయక శాస్త్రమునవ్యయము ప్రథమానిర్దిష్టము గాన అధి అనుదానికుపసర్జనసంజ్ఞ యుండుటచే పూర్వనిపాతమగును. అధిహరి అనుసమాసముకంటె వచ్చిన సుప్పునకు "అవ్యయాదాప్సుపః (455) సూ. చే లుక్కగును. అధి హరి అని సిద్ధమగును అలౌకికవిగ్రహవాక్యముచే సమాససంజ్ఞయనియునపుడే సుబ్లుక్కనియు నెరుగవలయును. సూత్రమున సుపా అనుదానిననువర్తింపజేసి సమాసమును విధించుటచే తత్సామర్థ్యమువలన సప్తమ్యర్థము అధి అనుదానిచేనభిహితమైనను సప్తమీవిభక్తి వచ్చునని గ్రహింపవలెను.

663. అవ్యయీభావశ్చ. 2-4-18. అవ్యయీభావః, చ (నపుంసకమ్)

అయం నపుంసకం స్యాత్। హ్రస్వో నపుంసకే ప్రాతిపదికస్య। గోపాయతీతి, గాః పాతీతి వా గోపాః। తస్మిన్నిత్యధిగోపమ్। సమీపే=కృష్ణస్య సమీపముపకృష్ణమ్। సమయా గ్రామమ్, నికషా లఙ్కామ్, ఆరాద్వనాదిత్యత్ర తు నావ్యయీభావః। అభితః పరితః, అన్యారాత్, ఇతి ద్వితీయాపఞ్చమ్యోర్విధానసామర్థ్యాత్। మద్రాణాం సమృద్ధిః సుమద్రమ్। యవనానాం వ్యృద్ధిర్దుర్యవనమ్। విగతా బుద్ధిర్వ్యృద్ధిః। మక్షికాణామభావో నిర్మక్షికమ్। హిమస్యాఽత్యయోఽతిహిమమ్। అత్యయో ధ్వంసః। నిద్రా సంప్రతి న యుజ్యత ఇత్యతినిద్రమ్। హరిశబ్దస్య ప్రకాశ ఇతిహరి। విష్ణోః పశ్చాదనువిష్ణు। పశ్చాచ్ఛబ్దస్య తు నాఽయం సమాసః। తతః పశ్చాత్స్రంస్యతే ధ్వంస్యతే ఇతి భాష్యప్రయోగాత్। యోగ్యతావీప్సాపదార్థానతివృత్తిసాదృశ్యాని. యథార్హః। అనురూపమ్। రూపస్య యోగ్యమిత్యర్థః। అర్థమర్థం ప్రతి

ప్రత్యర్థమ్। ప్రతిశబ్దస్య వీప్సాయాం కర్మప్రవచనీయ సంజ్ఞావిధానసామర్థ్యాత్తద్యోగే ద్వితీయాగర్భం వాక్యమపి। శక్తిమనతిక్రమ్య యథాశక్తి। హరేస్సాదృశ్యం। సహరి। వక్ష్యమాణేన సహస్య సః। జ్యేష్ఠస్యానుపూర్వ్యేణేత్యను జ్యేష్ఠమ్। చక్రేణ యుగపదితివిగ్రహే॥

663. అవ్యయీభావసమాసముగూడ నపుంసకమగును. నపుంసకలింగ మగుటచే తత్ప్రయుక్తమగు "హ్రస్వోనపుంసకే ప్రాతిపదికస్య (319) సూ. చే హ్రస్వము సిద్ధించును. (1) గోపాః అనుపదమునకు "గోపాయతి" (రక్షించు వాడు) అనిగాని "గాఃపాతి" (గోవులనుపాలించువాడు) అనిగాని వ్యుత్పత్తి చెప్ప వచ్చును. గోపునియందనుసర్థమున వర్తమానమగు అధి అనునవ్యయము గోపా పదముతో సమసించును. నపుంసకహ్రస్వము విభక్తికిలుగభావము అమాదేశము నగును. అధిగోపమ్ అని యగును.

(2) సమీపార్థమందు :— ఉపకృష్ణమ్. "కృష్ణస్యసమీపమ్" అనునర్థ మునసమీపార్థద్యోతకమగు ఉప అనునవ్యయము కృష్ణస్య అనుదానితో సమ సించెను. సమీపార్థద్యోతకములగు సమయా నికషా ఆరాత్ అనునవ్యయములు క్రమముగ గ్రామమ్ లఙ్కామ్ వనాత్ అనుపదములతో సమసించవు. "అభితః పరితః సమయానికషాహాప్రతియోగేఽపి" (వార్తికము) "అన్యారాదితరర్తేది క్శబ్దాఞ్చూత్తరపదాజాహియుక్తే" (598) అనువచనములచే పైస్థలములందు ద్వితీయాపంచమీవిభక్తులను విధించుటయే సమాసాభావమునకు గారణము. సమా సమున విభక్తికి లుగాదులగుటవలననావిభక్తివిధానమువ్యర్థమగుననియాశయము. (3) సమృద్ధ్యర్థమందు :— సుమద్రమ్. సమృద్ధ్యర్థద్యోతకమగు సు అనునవ్య యము మద్రపదముతో సమసించును. (4) వ్యృద్ధియన ఋద్ధిలేకపోవుటయని యర్థము. ఉదా :— దుర్యవనమ్. (5) అర్థాభావమందు :— నిర్మక్షికమ్. "మక్షికాణామభావః" అనునర్థమందు నిర్ అనునవ్యయము మక్షికపదముతో సమ సించును. (6) అత్యయమన నాశమని యర్థము. ఈయర్థముగల "అతి" అను నవ్యయము హిమపదముతో సమసింప అతిహిమమ్ అని యగును. (హిమస్యా త్యయః).

(7) అతినిద్రమ్ అమనది అసంప్రత్యర్థమునకుదాహరణము. ఇచట అతి అనునవ్యయము అసంప్రత్యర్థకము. ఈయర్థమే యుజిక్రియాన్తర్భావముచే "సంప్రతినయుజ్యతే" అనురీతిని వివరింపబడెను. అతిశబ్దము నిద్రాశబ్దముతో సమసించిన అతినిద్రమ్ అని యగును. (నిద్రాసంప్రతినయుజ్యతే). (8) సూత్ర మున శబ్దప్రాదుర్భావపదమునకు శబ్దవిషయకప్రకాశమని యర్థము. దీనికి ఇతిహరి అని యుదాహరణము. ఇచట ఇతి అనునది శబ్దప్రకాశద్యోతకము. దీనికి షష్ఠ్యన్తము స్వరూపమాత్రబోధకమునగు హరిశబ్దముతో సమాసము. (హరిశబ్దస్య

ప్రకాశః). (౯) పశ్చాత్ అనుదానియొక్క యర్థమందు వర్తమానమగు అను అనునవ్యయము విష్ణుశబ్దముతో సమసింప అనువిష్ణు అని యగును. పశ్చాత్తను శబ్దమునకు మాత్రమీసమాసము రాదు. "అచఃపరస్మిన్" (౫౧) అనుసూత్రభాష్యములోని "తతఃపశ్చాత్స్రంస్యతే" ఇత్యాదిప్రయోగములిందు గారణము. సమసించినచో సమాసవిధాయకశాస్త్రముననవ్యయము ప్రథమానిర్దిష్టము గాన పశ్చాత్ అనుదానికి పూర్వనిపాతము ప్రసక్తమయ్యెడిని.

(౧౦) సూత్రమున యథా అనుదానికి యథార్థద్యోతకమగునవ్యయము సమసించునని యర్థము. యోగ్యత వీప్స పదార్థాఽనతిక్రమణము సాదృశ్యము ఇవి యథార్థములు. యోగ్యతారూపార్థమునకు అనురూపమ్ అని యుదాహరణము. రూపమునకు యోగ్యమైనదని యర్థము. ప్రత్యర్థమ్ అనునది వీప్సారూపార్థమున కుదాహరణము. ప్రతిశబ్దమునకు వీప్సయందు (అర్థమర్థమ్) "లక్షణేత్థంభూతాఖ్యాన (౬౫౫) సూ. చే కర్మప్రవచనీయసంజ్ఞా విధానసామర్థ్యమువలన "అర్థమర్థం ప్రతి" అను ద్వితీయాగర్భితమగు వాక్యమునుండవచ్చును. పదార్థానతిక్రమణరూపార్థమునకు యథాశక్తి అనునది యుదాహరణము. (శక్తిమనతిక్రమ్య) శక్తినతిక్రమించక యని యర్థము. యథా అనునవ్యయము పదార్థానతిక్రమణార్థద్యోతకము. సహరి (హరేస్సాదృశ్యమ్) అనునది సాదృశ్యార్థమునకుదాహరణము. సహశబ్దమునకు అవ్యయీభావేచాఽకాలే (664) సూ. చే సాదేశమగును. (11) అను పూర్వ్యార్థద్యోతకమగు అను అనునవ్యయము జ్యేష్ఠశబ్దముతో సమసింప అనుజ్యేష్ఠమ్ (జ్యేష్ఠస్యానుపూర్వ్యమ్) అను రూపము సిద్ధించును. (12) యుగపదర్థద్యోతకమగు "సహ" అనునవ్యయము "చక్రేణ" అనుదానితో సమసించును. చక్రేణ యుగపత్ అనియుండ.

వివ :— అధిగోపమ్ అనుస్థలమున విభక్త్యర్థమందవ్యయీభావము. గోపాశబ్దమాకారాన్తము. ఇచటగూడ అధిహరి అనుచోటునందువలె గోపి అనునది లౌకికవిగ్రహము. ఈసూత్రముచే నపుంసకత్వము తత్ఫలముగ "హ్రస్వో నపుంసకే" (౩౦౯) సూ.చే హ్రస్వము విశిష్టముకంటె సుబుత్పత్తియు అమాదేశము నగును. స్త్రీప్రత్యయాన్తముగాకపోవుటచే "గోస్త్రియోః" (౬౬౦) సూ. చే హ్రస్వము రాదు.

ఈసూత్రముచే విధింపబడుసమాసము వక్ష్యమాణమగు మహావిభాషాధికారమున జేరనందున నిత్యమగును, నిత్యసమాసమునకు అస్వపదవిగ్రహమును చెప్పుటన్యాయ్యము. కావున "ఉపకృష్ణమ్" ఇత్యాదిసమాసములకు "కృష్ణస్య సమీపమ్"మొదలగునవియే లౌకికవిగ్రహములగును. సమయాగ్రామమ్ ఆరాద్వనాత్ ఇత్యాదులలో "గ్రామస్య సమయా" వనస్య ఆరాత్ అనుచోట షష్ఠీశేషే (౬౦౪) సూ. చే విధింపబడు షష్ఠియున్నను ఉపపదవిభక్తులగు ద్వితీయాపంచములున్నను అవ్యయీభావసమాసమునుచేసినచో ప్రాతిపదికావయవములగు సుప్పులకు లుక్కు వచ్చునుగానపై విభక్తులులోపింపనక్కరదాయముకంటెసుబుత్పత్తియథేచ్ఛముగనగును,

అందుచే సమయాగ్రామమ్ సమయాగ్రామాత్ ఆరాద్వనమ్ ఆరాద్వనాత్ ఇత్యాదిరూపములు సమాసమున సంభవించుచుండ మరల "అభితఃపరితః" అనుదానికేతను" అన్యారాదితర ర్తే (598) సూత్రముచేతను క్రమముగ ద్వితీయాపంచమీవిభక్తులను విధించుట వ్యర్థమగును. తత్సామర్థ్యమువలన పైచోటులందు సమీపార్థమున నవ్యయీభావసమాసము రాదనిచెప్పవలెను. కనుకనే గ్రామంసమయా లంకాంవిఃషా ఇత్యాదిప్రయోగములు నుండవచ్చును. సమాసమే ప్రవర్తించినచో నవ్యయమున కెల్లప్పుడు పూర్వనిపాతమేయగును గాననిట్టిప్రయోగములకవకాశము లేకపోవును.

అర్థాభావమన సమసించుపదముయొక్క అర్థమునకత్యన్తాభావమనియర్థము. నిర్మక్షికమ్ అనుచోట మక్షికపదార్థముయొక్క అత్యన్తాభావమే భాసించును. "మక్షికాణామభావః" అనునది లౌకికవిగ్రహము. ఇట్లు చెప్పుటచే "దుర్యవనమ్" అనునది అర్థాభావమందుదాహరణము గానేరదు. అచట యవనపదార్థముయొక్క యత్యన్తాభావము ప్రతీయమానము కాదు. యవనసంబంధియగు వృద్ధ్యభావము ప్రతీయమానమగును. అతిహిమమ్=అత్యయమన ధ్వంసము. ఇది యర్థాభావమున చేరనందున పునరుక్తి దోషము లేదు. అతినిద్రమ్="ఐతర్హి సంప్రతీదానీమ్" అనునమరకోశమువలన సంప్రతి అనుదానికిప్పుడని యర్థము. "అసంప్రతి" అనునది యుజ్యతే అనుయజిక్రియా కర్తృత్వముగచేయబడినసనఞ్ సమాసము. ఇతిహరి=అవ్యయీభావమునకునవ్యయత్వముండుటచే సముదాయముకంటెనుప్పన్నమైనసుప్పునకు "అవ్యయాదాప్సుపః" (455) సూ. చే లుక్కగునని యెరుగవలయును. అదన్తము కాదుగాన నావ్యయీభావాత్తనుసూత్రము ప్రవర్తించదు.

"అర్థమర్థంప్రతి" అనునది విగ్రహవాక్యము. వీప్సయందు ద్విర్భావము వచ్చినది. ప్రతి అనుదానికెట్టియవస్థలో కర్మప్రవచనీయసంజ్ఞయుండుటచే తద్యోగమున ద్వితీయ వచ్చును. సమాసముచేతనే వీప్స ప్రతీయమానమగును గాన సమాసమునందుమాత్రము ద్విర్వచనము రాదు. ఈస్థలమునమాత్రము సమాసము వైకల్పికమని తెలియవలయును. నిత్యమగుచో పైస్థలమునశేషషష్ఠితో సమాసము చేసినను సుప్పులకు లుక్కయినపిదప సముదాయముకంటె సర్వవిభక్తులును (ప్రత్యర్థం ప్రత్యర్థేన) సిద్ధించునుగానకేవలము ద్వితీయావిభక్తిఫలకమగు కర్మప్రవచనీయసంజ్ఞావిధానము వ్యర్థము గావలసివచ్చును. అందువలననే "అర్థమర్థం ప్రతి" అనురీతిని వాక్యముగూడ ప్రయోగార్హమగును. అనుజ్యేష్ఠమ్=అనుపూర్వమన క్రమమని యర్థము. "అనుజ్యేష్ఠం" ఇత్యాదులందు "కార్యంకృతమ్" ఇత్యాదులను శేషవాక్యములనుగనెరుగునది. జ్యేష్ఠాదిక్రమమునునుసరించి కార్యము చేయబడినదని యర్థము. సూత్రమున (విభక్తిసమీప....) యుగపచ్ఛబ్దముకంటె స్వార్థమందు ష్యఞ్ ప్రత్యయమువచ్చిన యౌగపద్యమ్ అనురూపమగును. కనుక యౌగపద్యయుగపచ్ఛబ్దములు సమానార్థకములు.

**664. అవ్యయీభావే చాఽకాలే. 6-3-81. అవ్యయీభావే, చ, అకాలే (సహస్య. సః.)**

సహస్య సస్స్యాదవ్యయీభావే న తు కాలే। సచక్రమ్। కాలే తు సహపూర్వాహ్ణమ్। సదృశస్సఖ్యా ససఖి। యథా ర్థత్వేనైవ సిద్ధే పునఃసాదృశ్యగ్రహణం గుణభూతేఽపి సాదృశ్యే యథాస్యాదిత్యేవమర్థమ్। క్షత్రాణాం సంపత్తిః సక్షత్రమ్। బుద్ధేరాధిక్యం సమృద్ధిః అనురూప ఆత్మభావ స్సంపత్తిరితి భేదః। తృణమప్యపరిత్యజ్య సతృణమత్తి సాకల్యేనేత్యర్థః। నత్వత్ర తృణభక్షణే తాత్పర్యమ్। అన్తే= అగ్నిగ్రన్థపర్యన్తమధీతే సాగ్ని॥

664. అవ్యయీభావసమాసమందు సహ అనుదానికి స అనునది యాదేశ మగును. కాలవాచకముపరమగునపుడీయాదేశము రాదు. ప్రకృతమున "చక్రేణ యుగపత్" అనువిగ్రహముగలసహచక్రమ్ అనుసమాసమున సహ అనుదానికి యాదేశము వచ్చెను. సచక్రమ్। సహపూర్వాహ్ణమ్ అనుచోట కాలవాచకపదము పరమగుటచేసియాదేశము రాదు. ససఖి అనుస్థలమున సాదృశ్యార్థకమగు సహ అనునది సఖిశబ్దముతో సమసించెను. "సదృశః సఖ్యా" అని విగ్రహము. ఈసూత్రముచే సాదేశము.

సాదృశ్యముగూడ యథార్థమగుటచే దానిచేత ససఖి మొదలగురూపములు గతార్థములగుచుండ సూత్రమున మరల సాదృశ్యగ్రహణముచేయుటవలన గుణీ భూతమగు సాదృశ్యార్థమందును సమాసమువచ్చునని గ్రహింపదగును. అట్లు కాకున్న సూత్రములోని వచనగ్రహణసామర్థ్యమునసవ్యయార్థమునకు ప్రాధాన్య వివక్షయందే సమాసము ప్రవర్తించును గానిగుణభూతమగువర్థమునందు ప్రవ ర్తించకపోవును. అవ్యయార్థములగు సాదృశ్యాదులకు ప్రాధాన్యవివక్షగల సహరి మొదలగురూపములే సిద్ధించునుగానిససఖి మొదలగునవి సిద్ధింపకపోవునని తాత్ప ర్యము. "క్షత్రాణాంసంపత్తిః" అనువిగ్రహమున సంపత్తిద్యోతకమగు సహ అను నవ్యయము సమసించును. సాదేశమగును. సక్షత్రమ్ అనియగును. బుద్ధియొక్క (ధనాదులయొక్క) ఆధిక్యము సమృద్ధిపదార్థము. యోగ్యమగు స్వభావము సంపత్తి శబ్దార్థము. కాన సంపత్తి సమృద్ధిశబ్దములకు పౌనరుక్త్యము లేదు. అందువలన సక్షత్రమ్ అనుదానికి క్షత్రియులకు యోగ్యమగు కర్మ అని యర్థమును చెప్ప వలయును.

సతృణమ్ అనుచోట సాకల్యార్థమందు వర్తమానమగు సహ అను నవ్య యము తృణశబ్దముతో సమసించినది. సాదేశము. "తృణమప్యపరిత్యజ్య" అని యస్వపదలౌకికవిగ్రహము. తృణ+టా సహ అని యలౌకికము. ఇచట సహశబ్ద మపరిత్యాగరూపార్థమందు వర్తించును. అత్తి అనునది శేషము. కాన "సతృణ మత్తి" అనుదానికి "పాత్రయందు వడ్డింపబడిన సమస్తమును భక్షించుచున్నాడనియే యర్థము గాని తృణసహితముగ భక్షించుచున్నాడని యర్థము కాదు. తృణభక్షణ

మందు తాత్పర్యములేదని యాశయము అన్తార్థమందు "సాగ్ని" అనునది యుదాహరణము. సూత్రమునన సశబ్దముచేన న్తవయవసాహిత్యము వివక్షింపబడును. అగ్నిశబ్దమునకగ్నిచయనప్రతిపాదకగ్రన్థమర్థము. కనుకనగ్నిగ్రన్థాన్తావయవపర్యన్తమనునర్థమును చెప్పవలయును. సహ అనునవ్యయమునకగ్నిశబ్దముతో సమాసము సాదేశము.

వివ:— సాగ్ని అనుచోట "అగ్నిగ్రన్థాన్తవయవేన సహితంగ్రన్థమ్" అను రీతిని మరియొకగ్రన్థపదమునకధ్యాహారముచేసి విగ్రహమును చెప్పవలయును. అందుచే అన్తావయవసహితమగునగ్నిగ్రన్థముతో గూడిన వేదభాగము నధ్యయనము చేయుచున్నడని సాగ్ని అధీతే అనుదాని యర్థము ఫలించును.

665. యథాఽసాదృశ్యే. 2-1-7. యథా, అసాదృశ్యే।

అసాదృశ్యే ఏవ యథాశబ్దస్సమస్యతే। తేనేహ న।యథా హరిస్తథాహరః। హరేరుపమానత్వం యథాశబ్దో ద్యోతయతి। తేన సాదృశ్యఇతివా యథార్థఇతివా ప్రాప్తం నిషిధ్యతే॥

665. యథా - నునవ్యయమసాదృశ్యరూపార్థమందే సమసించును. ఇట్లు చెప్పుటవలన "యథాహరిస్తథాహరః" అనుచోట సమాసము రాదు. ఇచటనుండు యథాశబ్దము హరియెట్టివాడో అట్టివాడు హరుడనునర్థమును బోధించునదగుటచే హరికుపమానత్వమును ద్యోతనచేయును. అందుచే అవ్యయంవిభక్తీత్యాదిసూత్రముననుండు సాదృశ్యాంశముచేగాని యథార్థములలో సాదృశ్యము చేరియుండుటచే యథార్థాంశముచేగాని ప్రాప్తమగునట్టి సమాసమీసూత్రముచే నిషేధింపబడునని యాశయము.

వివ:— ఈసూత్రము నియమార్థము. "అసాదృశ్యే" అనుదానికి సాదృశ్యభిన్నములగు యోగ్యతావీప్సాద్యర్థములకు ద్యోతకమగుయథాఅను నవ్యయము సమసించునని యర్థముచెప్పిన అట్టియర్థముయోగ్యతాదులు యథార్థములగుటచే అవ్యయంవిభక్తీత్యాది సూత్రముచేతనే సిద్ధించును గానమరల నీసూత్రమారభింపబడుటచేనిది (సిద్ధేసత్యారభ్యమాణోవిధిర్నియమాయభవతి) "అసాదృశ్యార్థమందే యథాశబ్దము సమసించును" నియమముకొఱకగును.

666. యావదవధారణే. 2-1-8. యావత్, అవధారణే।

యావన్తశ్శ్లోకాస్తావన్తోఽచ్యుతప్రణామా యావచ్ఛ్లోకమ్॥

666. అవధారణార్థద్యోతకమగు యావత్ అనునవ్యయము సుబన్తముతో సమసించునదియునవ్యయీభావసంజ్ఞకమగును. యావచ్ఛ్లోకమ్. (యావన్తః శ్లోకాః

తావన్తః అచ్యుతప్రణామాః) శ్లోకములెన్నిగలవో అన్నియు అచ్యుతనమస్కారములని యర్థము.

విప :— అవధారణమున సంఖ్యాదికముచేనింతయనునర్థమును బోధించు నిశ్చయము. యావన్తః శ్లోకాః అనునది విగ్రహము. అవధారణే అనునది లేకున్న "యావద్దత్తం తావద్భుక్తమ్" అనుచోటను సమాసము ప్రసక్తమయ్యెడిని. ఇచట నింతతినబడినదను నిశ్చయము లేదు.

667. సుప్ప్రతినా మాత్రార్థే. 2-1-9, సుప్, ప్రతినా, మాత్రార్థే।

శాకస్యలేశః శాకప్రతి। మాత్రార్థే కిమ్। వృక్షంప్రతివిద్యోతతే విద్యుత్॥

667. సుబన్తము అల్పార్థమునుద్యోతనచేయు ప్రతి అనుదానితో సమసించును. శాకప్రతి. (శాకస్యలేశః) కొంచెమున్నకూర అని యర్థము. ఇచట ప్రతి అనునదల్పార్థద్యోతకము. సూత్రమున సుప్పనునదే ప్రథమానిర్దిష్టము గాన శాకశబ్దమునకే పూర్వనిపాతము. "మాత్రార్థే" అనునది లేకున్న "వృక్షంప్రతి" (విద్యోతతే విద్యుత్) ఇత్యాదులందు లక్షణార్థద్యోతకమగు ప్రతి అనుదానితోగూడ సమాసము ప్రసక్తమగును.

వివ :— సుప్పనుదానికి తదన్తవిధిచే సుబన్తమనునర్థము లభించును. సుప్పపా సూత్రమునుండి సుప్పనునదనువర్తించుచుండ మరల సూత్రమున సుప్ గ్రహణము సన్నిహితమగు "అవ్యయమ్" అనునది యీసూత్రములోనికనువర్తించదని తెలుపును.

668. అక్షశలాకాసంఖ్యాః పరిణా. 2-1-10. అక్షశలాకా సంఖ్యాః, పరిణా।

ద్యూతవ్యవహారే పరాజయఏవాయం సమాసః। అక్షేణ విపరీతం వృత్తం అక్షపరి। శలాకాపరి ఏకపరి॥

668. అక్షశబ్దము శలాకాశబ్దము ఏకాదిసంఖ్యాశబ్దములును పరి అనుదానితో సమసించునదియునవ్యయీభావసంజ్ఞకమగును. ఈసూత్రముచే విధింపబడు సమాసము ద్యూతక్రీడయందగునపజయమనూపార్థమందే యగును. అక్షపరి (అక్షేణ విపరీతం వృత్తమ్) అక్షశబ్దము పరి అనుదానితో సమసించినది. ఒకయక్షము (పాచిక) తిరుగబడినందుననాట చెడినదని యర్థము. ఇట్లే శలాకాపరి ఏకపరి ఇత్యాదులు.

వివ :—పాచికలచేగాని శలాకలచేగాని ద్యూతక్రీడను సల్పుదురు. అట్టి క్రీడలందుగల నియమములను ననుసరించి యెల్లపాచికపడిన జయమగునో దానికి

విపరీతముగానొకపాచిక పడినదని "అక్షపరి" అనుదానికర్థము. అట్లు పడుటచే నపజయము వచ్చినదని యాశయము. ఇట్టి యర్థమందే యీసమాసము ప్రవర్తించును. ఇవి నిత్యసమాసములు గావున వీనికస్వపదవిగ్రహములను చూపవలయును, ఏకపరి అనుచోట "ఏకేనవిపరీతంవృత్తమ్" అని విగ్రహము.

669. విభాషా. 2-1-1.

అధికారోఽయమ్। ఏతత్సామర్థ్యాదేవ ప్రాచీనానాం నిత్యసమాసత్వమ్। "సుప్సుపా" ఇతి తు న నిత్యసమాసః। అవ్యయమిత్యాదిసమాసవిధానాద్ జ్ఞాపకాత్॥

669. ఇది యధికారసూత్రము. సూత్రమునిచట పఠించుటవలన వీనికి పూర్వమున విధింపబడు సమాసములకు నిత్యత్వము సిద్ధించును. అవ్యయమ్(668) ఇత్యాదిసూత్రములచే తెలుగసమాసము విధించుటవలన "సుప్సుపా" అను సూత్రముచే విధింపబడు సమాసముమాత్రము నిత్యముగానేరదు.

వివ :— ఇదియధికారసూత్రము గావుననుత్తరసూత్రములలోని కధికృతమై వానిచేవిధింపబడువానికి వికల్పమును బోధించును. "ప్రాక్కడారాత్సమాసః" (651) అనుసూత్రమునకు పూర్వమందే యీసూత్రమును సూత్రించిన సమాస విధాయకమగు ప్రతిసూత్రమందధికృతమై విభాషగ సమాసమగు ననునర్థమును బోధించును. అట్లుచేయక సమాసవిధాయక సూత్రములమధ్య నిచటనీసూత్రమును పఠించినందుననీసూత్రముకంటె ముందుండుసూత్రములచే విధింపబడు సమాసము నిత్యమని తెలియదగును అనగా పూర్వసూత్రోదాహరణములందేకార్థీభావమునకు నిత్యత్వమని యాశయము. ఇతరస్థలములందేకార్థీభావమందు సమాసము, వ్యపేక్షయందు వాక్యమునుండును. అందువలననే నిత్యసమాసములకు స్వపదములతో విగ్రహము సంభవించదనియెరుగునది.

ఈసూత్రమునకుపూర్వమే "సుప్సుపా" అనుసూత్రమున్నది గానతత్సూత్ర విహితమగు సమాసమునకును నిత్యత్వము న్యాయ్యము. అట్లైన భాష్యమునతత్సూత్రోదాహరణసందర్భమున చూపబడిన విస్పష్టంపటుః (విస్పష్టపటుః) అను విగ్రహ ప్రదర్శనము విరోధించును. కావున నాసూత్రవిహితమగు సమాసముమాత్రము నిత్యముగాదని నిరూపింపవలయును. తత్ప్రకారమెట్టిదన :— ప్రాక్కడారాత్తను సూత్రమున "ప్రాక్" గ్రహణమువలన సమాససంజ్ఞకవ్యయీభావాదిసంజ్ఞలతో సమావేశముండునని యీవరలో తెలుపబడినది. "సుప్సుపా" అనుసూత్రముచే విధింపబడుసమాసమునను నదించి కేవలములగునవ్యయీభావాదిసంజ్ఞలను విధించుట వలననే సంజ్ఞాద్వయసమావేశము సిద్ధమగుచుండ మరల అవ్యయంవిభక్తీత్యాది సూత్రములచే చేయుసమాసవిధానమువలన అవ్యయమిత్యాదిసూత్రమునకు ప్రాచీనము "సుప్సుపా" అనుసమాసము వైకల్పికమని జ్ఞాపనము చేయబడును.

ఈసూత్రమున "విస్పష్టంపటుః" అనువిగ్రహప్రదర్శనరూపమగు భాష్యముగూడ నీవిషయమున ప్రమాణమగును. ఈరీతిని "సుప్సుపా" సూత్రవిహితసమాసము నిత్యముకాదని యెరుగవలయును.

670. అపపరిబహిరఞ్చవః పఞ్చమ్యా. 2-1-12. అప.... రఞ్చవః. పఞ్చమ్యా॥

అపవిష్ణు సంసారః। అపవిష్ణోః। పరివిష్ణు। పరివిష్ణోః। బహిర్వనమ్। బహిర్వనాత్। ప్రాగ్వనమ్। ప్రాగ్వనాత్॥

670. అప పరి అనునుపసర్గములు బహిః అనుసవ్యయము అఞ్చు ధాత్వ న్తము ఇవి పంచమ్యన్తముతో వికల్పముగ సమసించును; అదియు నవ్యయీభావ సంజ్ఞకమగును. అపవిష్ణు (సంసారః) ఇత్యాదులుదాహరణములు.

వివ:—అపవిష్ణు ఇచట అప అనుదానికి "విడిచిపెట్టుట" అని యర్థము. కృష్ణుని విడచి సంసారబంధమని ఫలితార్థము. అపపరీవర్జనే" (599) సూ. చే అప అనుదానికి కర్మప్రవచనీయసంజ్ఞయుండుటవలన దానితోగూడినపుడు విష్ణు శబ్దమునకు పఞ్చమ్యపాఙ్పరిభిః (601) సూ. చే పంచమి యగును. ఈసూత్ర ముచే పంచమ్యన్తముతో సమాసము "సుపోధాతు" (651) సూ. చే పంచమికి లుక్కు వచ్చును. సమాసశాస్త్ర ప్రథమానిర్దిష్టమగుటచే అప అనుదానికి పూర్వ నిపాతము. సమాసముకంటె నుత్పన్నమగు సుప్పునకు "అవ్యయాదాప్సుపః" (455) సూ. చే లుక్కగును. ఈరీతిగ "అపవిష్ణు" అని సిద్ధమగును. తక్కిన స్థలములందునిట్లే ప్రక్రియనూహింపవలయును. అపవిష్ణోః అనునది లౌకికవిగ్రహము. బహిర్వనమ్. ప్రక్రియసమానమే. అదన్తముగానసమ్భావమయ్యెను. బహిర్వనాత్. బహిశ్శబ్దయోగమున పంచమి ఈసూత్రముచే సమాసవిధానరూపమగు జ్ఞాపనమువలన సిద్ధమగును. కాకున్న సూత్రమున బహిశ్శబ్దము వ్యర్థము గావల యును. ప్రాగ్వనమ్. ప్రాగ్వనాత్. అఞ్చుధాతువుత్తరపదమందుగల ప్రాక్శబ్ద యోగమున "అన్యారాత్" (598) సూ. చే పంచమి విహితమయ్యెను.

671. ఆఙ్మర్యాదాభివిధ్యోః. 2-1-13. ఆఙ్. మర్యాదాభివి ధ్యోః। (పఞ్చమ్యా)

ఏతయోరాఙ్ పఞ్చమ్యన్తేన వా సమస్యతే, సోవ్యయీ భావః। ఆముక్తి సంసారః। ఆముక్తేః। ఆబాలం హరి భక్తిః ఆబాలేభ్యః॥

671. మర్యాద అభివిధి అనునర్థములను ద్యోతనజేయు ఆఙ్ అనునుప సర్గము పంచమ్యన్తముతో వికల్పముగ సమసించును అదియవ్యయీభావమగును. ఆముక్తి (సంసారః) ఇత్యాదులుదాహరణములు.

వివ:—ఆముక్తి, ఇది మర్యాదయందుదాహరణము. మోక్షమునకు పూర్వము సంసారమని యర్థము. ఇచ్చట "ఆఙ్ మర్యాదావచనే" (600) సూ. చే ఆఙ్నకు కర్మప్రవచనీయసంజ్ఞ యుండుటవలన "పఞ్చమ్యపాఙ్" (601) సూ. చే పంచమి సిద్ధమగును. అభివిధ్యర్థమున ఆబాలమ్ అని యుదాహరణము. బాలుర మొదలుకొని అని యర్థము. అవ్యయీభావము విశేషము. ఇచటను పైసూత్రముచేతనే పంచమి యగును. "ఆఙ్ మర్యాదావచనే" అనుసూత్రమున వచనగ్రహణము వలననభివిధ్యర్థమందును ఆఙ్నకుకర్మప్రవచనీయసంజ్ఞ యుండును.

672. లక్షణేనాభిప్రతీ ఆభిముఖ్యే. 2-1-14. లక్షణేన, అభిప్రతీ, ఆభిముఖ్యే।

ఆభిముఖ్యద్యోతకావభిప్రతీ చిహ్నవాచినా సహ ప్రాగ్వత్। అభ్యగ్ని శలభాః పతన్తి। అగ్నిమభి। ప్రత్యగ్ని। అగ్నింప్రతి॥

672. అభిముఖ్యార్థమును ద్యోతనచేయు అభి ప్రతి అనునుపసర్గములు చిహ్నవాచకముతో వికల్పముగ సమసించును అది యవ్యయీభావమగును. అభ్యగ్ని (శలభాఃపతన్తి) ఇత్యాదులుదాహరణములు. లక్షణేన అనుదానికి "చిహ్నవాచినా" అనునది వివరణము. అభ్యగ్ని=శలభములన మిడుతలు. అవి యగ్నికభిముఖముగ పడుచున్నవని యర్థము. ఇచట అభి అనునది యాభిముఖ్యద్యోతకము. అగ్ని కెదురుగపడుచున్నవనుటచేనగ్నిచిహ్నము కావనగ్నిశబ్దము చిహ్నవాచి యగును. సమాసాభావపక్షమందు "అగ్నిమభి" అని యగును. అభిరభాగే (556) సూ. చే అభి అనునది కర్మప్రవచనీయమగుటవలన తద్యోగమందు "కర్మప్రవచనీయయుక్తే" (551) సూ. చే ద్వితీయ యగును. ప్రత్యగ్ని. అగ్నింప్రతి. "లక్షణేత్థంభూతాఖ్యాన" (555) సూ. చే ప్రతి అనునది కర్మప్రవచనీయమగుటవలన తద్యోగమున ద్వితీయయగును.

673. అనుర్యత్సమయా. 2-1-15. అనుః యత్, సమయా। (లక్షణేన)

యం పదార్థం సమయా ద్యోత్యతే తేన లక్షణభూతేనానుః సమస్యతే। సోఽవ్యయీభావః। అనువనమశనిర్గతః। వనస్య సమీపం గత ఇత్యర్థః॥

673. ఏపదార్థముయొక్క సమీపము ద్యోతనచేయబడునో అట్టి చిహ్నవాచకమగుపదముతో అను అనెడి యుపసర్గము సమసించును, అదియునవ్యయీభావమగును. అనువనమ్ (అశనిర్గతః) "పిడుగు వనసమీపమును పొందినదని" యర్థము.

వివ:—"సమయా" అనుదానితో యోగమున్నపుడు "అభితః పరితః" అనువార్తికముచే ద్వితీయ యగును గానసూత్రములోని యత్ అనునది ద్వితీయార్థము. అనువనమ్ అనుచోట వనశబ్దము లక్షణచే వనసమీపమును బోధించును. అవ్యయంవిభక్తిత్యాదిసూత్రమువలననిచట సమాసము సిద్ధమగును గానివికల్పముకొఱకువిభాషాధికారమునసీసూత్రము పఠింపబడెను. కనుక "వనస్యాను" అనియునుండును. ఇచట అను అనునది వనపదార్థముయొక్క సమీపమును ద్యోతనచేయును. ఇది చిహ్నవాచియగు వనశబ్దముతో సమసించెను.

674. యస్య చాఽఽయామః. 2-1-16. యస్య, చ, ఆయామః।
(లక్షణేన, అనుః.)

యస్య దైర్ఘ్యమనునా ద్యోత్యతే తేన లక్షణభూతేనానుః సమస్యతే। అనుగఙ్గం వారాణసీ। గఙ్గాయాఅను। గఙ్గాదైర్ఘ్యసదృశదైర్ఘ్యోపలక్షితేత్యర్థః॥

674. దేనియొక్క పొడవుతో సమానమగుపొడవు, అను అనెడి యుపసర్గముచే ద్యోతనచేయబడునో చిహ్నవాచకమగునట్టి పదముతోఅను అనునది సమసించును. అనుగఙ్గమ్, (వారాణసీ) గఙ్గాయా అను. వారాణసి (కాశి) గంగానదియొక్క పొడవుతో సమానమగు పొడవుగలదని యర్థము.

వివ:—అనుః అనుదానిని యనువర్తింపజేసి చావినావృత్తిజేసి ఒందొకదానిని తృతీయార్థముగ విపరిణామముచేసి "ఆయామః" అనుదానితో సంబంధింపచేయవలయును. ఆయామమన పొడవు. ఈరీతిగ మూలోక్తార్థము లభించును.

* 675. తిష్ఠద్గుప్రభృతీని చ. 2-1-17. తిష్ఠద్గుప్రభృతీని, చ।

ఏతాని నిపాత్యన్తే। తిష్ఠన్తి గావో యస్మిన్ కాలే స తిష్ఠద్గు। దోహనకాలః। ఆయతీగవమ్। ఇహ శత్రాదేశః పుంవద్భావవిరహః సమాసాన్తశ్చ నిపాత్యతే।

675. తిష్ఠద్గు మొదలగు శబ్దస్వరూపములు శాస్త్రకారులచే నిపతింపబడినవి. ఏకాలమందావులు నిలువబడియుండునో ఆసమయము "తిష్ఠద్గు" (తిష్ఠన్తి గావో యస్మిన్) అనిచెప్పబడును. అనగా పాలుపితికెడి సమయమని యర్థము.

---

*తిష్ఠద్గు బృహద్గు ఆయతీగవమ్ ఖలేయవమ్ ఖలేబుసమ్ లూనయవమ్ లూయమానయవమ్ పూతయవమ్ పూయమానయవమ్ సంహృతయవమ్ సంహ్రియమాణయవమ్ సంహృతబుసమ్ సంహ్రియమాణబుసమ్ సమభూమి సమపదాతి సుషమమ్ విషమమ్ దుఃషమమ్ నిఃషమమ్ అపసమమ్ ఆయతీసమమ్ పాపసమమ్ పుణ్యసమమ్ ప్రాహ్ణమ్ ప్రరథమ్ ప్రమృగమ్ ప్రదక్షిణమ్ సంప్రతి అసంప్రతి ఇచ్ ఇతి తిష్ఠద్గ్వాదిః॥

"ఆయతీగవమ్" అనురూపమునిట్టిదే. ఇచట శతృప్రత్యయాదేశము, పుంవద్భావమ రాకుండుట, సమాసాన్తప్రత్యయము, నిపతింపబడినవి. ఆయతీగవమ్ అనుచోట "ఆయత్యో గావో యస్మిన్" అని విగ్రహము.

వివ:—తిష్ఠద్గు ఆయతీగవమ్ అనెడి రెండుస్థలములందును ప్రథమాసామానాధికరణ్యముండుటచే శతృప్రత్యయము (లటశ్శతృశానచావప్రథమాసమానాధికరణే (3-2-124) సూ. చే విహితమైనది.) అప్రాప్తమగుచుండనది నిపతింపబడెను. "ఆయతీగవమ్" అనుచోట సమాసాన్తము, (టచ్ప్రత్యయము) "స్త్రియాః పుంవత్" (835) అను వక్ష్యమాణ సూత్రముచే పుంవద్భావము ప్రాప్తమగుచుండ దానియొక్క యభావమును నిపతింపబడినవి. "సమాసాన్తశ్చ" అనుచోట చకారముచే నవ్యయీభావసంజ్ఞయు నిపతింపబడెను. నపుంసకలింగమగుటవలన "తిష్ఠద్గు అనుచోట హ్రస్వోనపుంసకే (319) సూ. చే హ్రస్వమగును. ఆయతీగవమ్ అనుచోట టచ్ ప్రత్యయాన్తమమ్భావమగును. ఖలేయవమ్ ఇత్యాదులందు నిట్లే ప్రక్రియనూహింపవలయును.

676. పారేమధ్యే షష్ఠ్యా వా. 2-1-18. పారేమధ్యే, షష్ఠ్యా, వా।

పారమధ్యశబ్దౌ షష్ఠ్యన్తేన సహ వా సమస్యేతే। ఏదన్తత్వం చానయోర్నిపాత్యతే। పక్షే షష్ఠీ తత్పురుషః। పారేగఙ్గాదానయ। గఙ్గాపారాత్। మధ్యేగఙ్గాత్। గఙ్గామధ్యాత్। మహావిభాషయా వాక్యమపి। గఙ్గాయాః పారాత్। గఙ్గాయా మధ్యాత్।

676. పార మధ్యశబ్దములు షష్ఠ్యన్తముతో వికల్పముగ సమసించును అది యవ్యయీభావమగును. ఈసూత్రముచేతనే పారమధ్యశబ్దములకేకారాన్తత్వము నిపతింపబడును. వాగ్రహణమువలననిది ప్రవర్తించనపుడు ముందుచెప్పబోవు షష్ఠీతత్పురుషసమాసమగును. పారేగఙ్గాత్ (గఙ్గాయాః పారాత్) ఈసూత్రముచే సమాసము సుప్పులకు లుక్కగును. అనంతరము ప్రథమానిర్దిష్టమగుటచే పారశబ్దమునకు పూర్వనిపాతము, నపుంసకహ్రస్వము, సమాసముకంటె సువుత్పత్తియగును. దీనికి "నావ్యయీభావాత్" (661) సూ. చే లుక్కురాదు అమ్భావమగును. గఙ్గాపారాత్. ఇది షష్ఠీ తత్పురుషము. ఇట్లే మధ్యేగఙ్గాత్ గఙ్గామధ్యాత్ అనురూపములగును. విభాషా అనునధికారమువలననవ్యయీభావతత్పురుషముల యభావపక్షమందు గఙ్గాయాః పారాత్ గఙ్గాయా మధ్యాత్ అను వాక్యములునుండవచ్చును. ఈవిభాషాధికారమనేకసూత్రములందు ప్రవర్తించుటచే దీనికి మహావిభాషయను వ్యవహారము గలదు.

వివ:—సూత్రమున వాగ్రహణములేకున్నను విభాషాధికారమువలన వైకల్పికత్వము సిద్ధమగుచుండ మరల వాగ్రహణమువలన విశేషవిహితమగుటచే నీయ

వ్యయీభావసమాసము షష్ఠీతత్పురుషసమాసమును బాధించునను శంకకవకాశము గలుగదు. విశేషవిహితమగు నవ్యయీభావముచే బాధింపబడక షష్ఠీతత్పురుషము గూడ ప్రవర్తించుటకు వాగ్రహణమవిననట్టిదానివలన గఙ్గాయాః పారాత్ ఇత్యాది వాక్యములు సిద్ధించకున్నవి. అందువలన మహావిభాషాధికారముచే పక్షమందు వాక్యముగూడ సిద్ధించునని చెప్పబడెను.

677. సంఖ్యా వంశ్యేన 2-1-19. సంఖ్యా, వంశ్యేన।

వంశో ద్విధా।విద్యయా జన్మనా చ।తత్రభవో వంశ్యః। తద్వాచినా సహ సంఖ్యా వా సమస్యతే। ద్వౌమునీ వంశ్యౌ ద్విముని। వ్యాకరణస్య త్రిముని। విద్యాతద్వతామభేదవివక్షా యాం త్రిముని వ్యాకరణమ్। ఏకవింశతి భారద్వాజమ్॥

677. విద్యచేతను జన్మచేతను వంశము రెండువిధములు. ఇందు మొదటిది గురుశిష్యాదులపరంపర. రెండవది పుత్రపౌత్రాదులపరంపర. వంశములోనివాడు వంశ్యుడు. వంశ్యవాచకముతో నేకాదిసంఖ్యావాచకము వికల్పముగ సమసించును. ద్విముని. ద్వౌ చ తౌ మునీ చ అనువిగ్రహమందు "విశేషణం విశేష్యేణ" (740) సూ. చే ప్రాప్తించు కర్మధారయమును బాధించి దీనిచే నవ్యయీభావమ గును. సుప్పులకు లుక్కగును. విశిష్టముకంటెనుత్పన్నమైన సుప్పునకు "అవ్య యాదాప్" (456) సూ. చే లుక్కగును. ఇచట వంశ్యవాచకము మునిశబ్దము. ద్వౌమునీ వంశ్యౌ అనునది విగ్రహము. త్రిముని. (త్రయోమునయః) వ్యాకరణ మునకు ప్రవర్తకులు ముగ్గురు మునులు. (పాణినికాత్యాయనపతంజలులు) ఇచట మునిశబ్దము విద్యావంశ్యవాచకము. విద్యకు విద్యగలవారలకునభేదము వివక్షిత మగునపుడు "త్రిముని వ్యాకరణమ్" అనెడి సామానాధికరణ్యముపపన్నమగును. ఏకవింశతిభారద్వాజమ్। ఇతి జన్మచే వంశ్యవాచియగుదానితో సమాసమునకుదాహ రణము "ఏకవింశతిర్భారద్వాజాః" (భరద్వాజవంశములోనివారు) అని విగ్రహము.

678. నదీభిశ్చ. 2-1-20. నదీభిః, చ (సంఖ్యా)

నదీభిస్సహ సంఖ్యా ప్రాగ్వత్। (వా) సమాహారే చాయ మిష్యతే। సప్తగఙ్గమ్। ద్వియమునమ్॥

678. నదీవాచకములతో సంఖ్యావాచకము సమసించునదియునవ్యయీభావ మగును. (వా) సమాసార్థము సమాహారమగునపుడే యీసమాసము ప్రవర్తించును. సప్తగఙ్గమ్. (సప్తానాం గఙ్గానాం సమాహారః) వక్ష్యమాణమగు ద్విగుసమాస సమును బాధించి దీనిచేనవ్యయీభావము. సప్తగఙ్గాసమాహారమని యర్థము. ద్వియ మునమ్. (ద్వయోః యమునయోః సమాహారః) యమునాద్వయసముదాయము. ఇచట సుప్పులకు లుగభావాదుల మూహించునది.

వివ:—భాష్యప్రామాణ్యమువలననీసూత్రమందు నదీపదముచే నదీవిశేష వాచకములకు నదీసామాన్యవాచకములకును గ్రహణముగల్గును. కనుక "వఙ్ఘ

నదమ్" మొదలగునవి సిద్ధించును. "సమాహారేచాయ మిష్యతే" అను వార్తికమున చకారమేవకారార్థకము గానసమాహారమునందే యనెడి యర్థము లభించును.

679. అన్యపదార్థే చ సంజ్ఞాయామ్. 2-1-21. అన్యపదార్థే. చ, సంజ్ఞాయామ్। (సుప్, నదీభిః).

అన్యపదార్థే విద్యమానం సుబన్తం నదీభిస్సహ నిత్యం సమస్యతే. సంజ్ఞాయామ్। విభాషాఽధికారేఽపి వాక్యేన సంజ్ఞానవగామాదిహ నిత్యసమాసః। ఉన్మత్తగఙ్గం నామ దేశః। లోహితగఙ్గమ్॥

679. అన్యపదార్థమున వర్తమానమగు సుప్ప్రత్యయాన్తము నదీవాచకములతో సంజ్ఞ గమ్యమానమైనపుడు నిత్యముగ సమసించును. అది యవ్యయీభావమగును. ఈసూత్రము విభాషాధికారస్థమయినను సమాసము వలననే సంజ్ఞ గమ్యమానమగును గాననీసూత్రముచే విధింపబడు సమాసము నిత్యమగును. వాక్యము నివృత్తమగును. ఉన్మత్తగఙ్గమ్. (ఉన్మత్తాగఙ్గాయస్మిన్) ఇది యొకదేశమునకు సంజ్ఞ। ఇట్లే "లోహితగఙ్గమ్" అనునదియును.

680. సమాసాన్తాః. 5-4-69.

ఇత్యధికృత్య॥

680. ఇది యధికారసూత్రము. అయిదవయధ్యాయమున నాల్గవపాదాన్తము వరకునీసూత్రమధికృతమగును. సూత్రమున సమాసపదము భాష్యప్రామాణ్యమువలనసలౌకికవిగ్రహవాక్యబోధకమని గ్రహించునది. కాన సలౌకికవిగ్రహమందు సమాససంజ్ఞతో సమముగనే టజాదిసమాసాన్తప్రత్యయములగును. అన్తశబ్దము తుదియవయమును బోధించును. కావున సమాసాన్తములు సమాసావయవములగును.

681. అవ్యయీభావే శరత్ప్రభృతిభ్యః. 5-4-107. అవ్యయీభావే, శరత్ప్రభృతిభ్యః (టచ్)

శరదాదిభ్యష్టచ్స్యాత్సమాసాన్తోఽవ్యయీభావే। శరదస్సమీపముపశరదమ్। ప్రతివిపాశమ్। శరద్, విపాశ్, అనస్, మనస్, ఉపానహ్, దివ్, హిమవత్, అనడుహ్, దిశ్, దృశ్, విశ్, చేతస్, చతుర్, త్యద్, తద్, యద్, కియత్। జరాయాజరస్చ। ఉపజరసమ్। ప్రతిపరసమనుభ్యోఽక్ష్ణః। యస్యేతిచ। ప్రత్యక్షమ్। అక్ష్ణః పరమితివిగ్రహే సమాసాన్తవిధానసామర్థ్యాదవ్యయీభావః। పరోక్షే లిడితినిపాతనాత్పర

స్వ్యాదాదేశః। పరోక్షమ్। పరోక్షా క్రియేత్యాది తు అర్శఆద్య
చ్। సమక్షమ్। అన్వక్షమ్॥

681. శరదాదిగణమున పఠింపబడిన శరద్ విపాశ్ మొదలగుశబ్దములు అంతమునగలయవ్యయీభావముకంటె టచ్ప్రత్యయము (సమాసమునకన్త్యావయవమై) వచ్చును. ఉపశరదమ్। (శరదః సమీపమ్) సామీప్యార్థము నందవ్యయీభావము. టచ్ప్రత్యయము. అమ్భావము. ప్రతివిపాశమ్. "లక్షణేనాభిప్రతీ" (672) సూ. చే సమాసము. టచ్ప్రత్యయము. సుబ్లుక్కు. సుబుత్పత్తి. టచ్ప్రత్యయము సమాసావయవమే గాన "నావ్యయీభావాత్" (661) సూ. చే నమ్భావము. శరదాదిగణమును చూపుచున్నాడు :— శరద్ విపాశ్ అనస్ మనస్ ఉపానహ్ దివ్ హిమవత్ అనడుహ్ దిశ్ దృశ్ విశ్ చేతస్ చతుర్ త్యద్ తద్ కియత్. "జరాయా జరస్చ" జరాశబ్దమునకు జరసాదేశమగును. ఇది గణసూత్రము. విభక్తిపరముగలేనపుడు "జరాయాజరసన్యతరస్యామ్" (228) సూ. చే జరసాదేశముప్రాప్తమగుచుండ దీనిచేనది విధింపబడెను. ఉపజరసమ్.(జరాయాస్సమీపమ్) సామీప్యార్థమునవ్యయీభావము టచ్ప్రత్యయము జరసాదేశము అమ్భావము నగును.

"ప్రతిపరసమనుభ్యోఽక్ష్ణః" ఇదియు గణసూత్రము. ప్రతి పరసమ్ అను వీనికంటె పరమగునక్షిశబ్దమునకు గణమున పాఠమును చేయవలయును, "యస్యేతిచ" (టచ్ప్రత్యయము తద్ధితము గావుననది పరమగునపుడికారలోపమగునని సూచించుటకు చూపబడినసూత్రము) ప్రత్యక్షమ్. (అక్షిణీప్రతి) కన్నులకెదురుగ నని యర్థము. "లక్షణేనాభిప్రతీ" (672) సూ. చే సమాసము. టచ్ప్రత్యయము సుబ్లుక్కు. ప్రత్యక్షి+అ అని యుండనికారలోపము. మరలసుప్పు. అమ్భావము. అవ్యయముగానట్టి పరశబ్దముకంటె పరమగునక్షిశబ్దమునకునీగణమున పాఠము చెప్పబడెను. గణపాఠమునకు టచ్ప్రత్యయము ఫలము. కనుకనట్టిపాఠసామర్థ్యము వలన అనవ్యయమగు పరశబ్దము "అక్ష్ణః పరమ్" అనువిగ్రహమున నక్షిశబ్దముతో నవ్యయీభావసమాసమొందునని చెప్పవలయును. పరోక్షమ్. (అక్ష్ణః పరమ్) అవ్యయీభావసమాసము. టచ్ప్రత్యయము. సుప్పులకు లుక్కు. "పరోక్షే లిట్" (3-2-115) అనుసూత్రమున "పరోక్షే" అను పాణిని నిర్దేశమువలన పరశబ్దమునకన్త్యాదేశముగనోకారమాదేశమగును. "ఏఙః పదాన్తాదతి" (87) సూ. చే పూర్వరూపము. విశిష్టముకంటెసుబుత్పత్తి. అమ్భావము. ఇంద్రియములకవిషయ మని యర్థము. పరోక్షాక్రియా ఇత్యాద్యుక్తులందు "పరోక్షా" అనురూపము "పరోక్షమస్యాస్తి" అనునర్థమున "అర్శఆదిభ్యోఽచ్" (5-2-127) సూ. చే అచ్ప్రత్యయమును పిదప టాప్ ప్రత్యయముచేసిన సిద్ధమగును. సమక్షమ్ (అక్ష్ణోర్యోగ్యమ్) అన్వక్షమ్ (అక్ష్ణఃపశ్చాత్) అనురూపములప్రక్రియము యథాపూర్వముగ నెరుగవలయును.

682. అనశ్చ. 5-4-108. అనః, చ (టచ్, అవ్యయీభావే)

అన్నన్తాదవ్యయీభావాట్టచ్ స్యాత్॥

682. అన్ అన్తమందుగల అవ్యయీభావసమాసముకంటె టచ్ప్రత్యయము సమాసాన్తమగును.

683. నస్తద్ధితే. 6-4-144. నః, తద్ధితే (భస్య, లోపః, టేః)

నాన్తస్య భస్య టేర్లోపః స్యాత్తద్ధితే। ఉపరాజమ్।అధ్యాత్మమ్॥

683. తద్ధితప్రత్యయముపరమగునపుడు నకారాన్తము భసంజ్ఞకమునగు దానియొక్క టిసంజ్ఞకమునకు లోపమగును. ఉపరాజమ్. (రాజ్ఞః సమీపమ్) సామీప్యార్థముననవ్యయీభావసమాసము. అనశ్చ (682) సూ. చే టచ్ప్రత్యయము. సుప్పులకు లుక్కు. ఉపరాజన్+అ అనియుండగనీసూత్రముచే అన్ అనుదానికి లోపమగును. ఉపరాజశబ్దముకంటె సుబుత్పత్తి. అమ్భావము. ఇట్లే "అధ్యాత్మమ్" అనుచోటున ప్రక్రియనెఱుగవలయును. విభక్త్యర్థమందవ్యయీభావము ఆత్మని అనునది విగ్రహవాక్యము.

684. నపుంసకాదన్యతరస్యామ్. 5-4-109. నపుంసకాత్, అన్యతరస్యామ్ (అనః, అవ్యయీభావే, టచ్)

అన్నన్తం యత్క్లీబం తదన్తాదవ్యయీభావాట్టజ్వా స్యాత్। ఉపచర్మమ్। ఉపచర్మ॥

684. అన్నన్తమగునపుంసకలింగశబ్దమన్తమందుగల యవ్యయీభావ సమాసముకంటె వికల్పముగ టచ్ప్రత్యయమగును. ఉపచర్మమ్-ఉపచర్మ. (చర్మణః సమీపమ్) సమీపార్థమునందవ్యయీభావము. టచ్ప్రత్యయము. పూర్వసూత్రముచే టిలోపము. అమ్భావము. టజభావమందు ఉపచర్మ అని యగును.

685. నదీపౌర్ణమాస్యాగ్రహాయణీభ్యః. 5-4-110. (టచ్, అన్యతరస్యామ్).

వా టచ్ స్యాత్। ఉపనదమ్। ఉపనది। ఉపపౌర్ణమాసమ్। ఉపపౌర్ణమాసి। ఉపాగ్రహాయణమ్। ఉపాగ్రహాయణి॥

685. నదీ పౌర్ణమాసీ ఆగ్రహాయణీ వీనిలోనేనయిననొకశబ్దమన్తమందుగల యవ్యయీభావసమాసముకంటె టచ్ప్రత్యయము వికల్పముగనగును. ఉపనదమ్। ఉపనది। (నద్యాస్సమీపమ్) టచ్ప్రత్యయము. సుప్పులకు లుక్కు. ఉపనదీ+అ అనియుండ "యస్యేతిచ" (312) సూ. చే ఈకారలోపము. విశేష్యముకంటెనువ్వు అమ్భావము. ఉపనది. ఇది టజ్వికల్పరూపము. ఉపనదీ

అనుచోట "హ్రస్వోనపుంసకే" (313) సూ. చే. హ్రస్వము. విశిష్టముకంటె నుత్పన్నమైన సుప్పునకు "అవ్యయాదాప్" (455) సూ. చే లుక్కగును. ఇట్లే ఉపపౌర్ణమాసమ్ ఉపపౌర్ణమాసి మొదలగునుదాహరణములఁ బ్రవృత్తియనెఱుంగునది.

686. ఝయః. 5-4-111. (టచ్, అవ్యయీభావే, అన్యతరస్యామ్)

ఝయన్తాదవ్యయీభావాట్టజ్వాస్యాత్। ఉపసమిధమ్। ఉపసమిత్॥

686. ఝయ్ప్రత్యాహారవర్ణమన్తమందుగల యవ్యయీభావసమాసముకంటె టచ్ప్రత్యయము వికల్పముగనగును. ఉపసమిధమ్. సామీప్యార్థమందవ్యయీభావము. టచ్చు. సుబ్లుక్కు. విశిష్టముకంటెనుప్పు. అమ్భావము. టచ్చురానపుడు ఉపసమిత్ అని యగును.

వివ :— ఈసూత్రముచే వికల్పముగటచ్ప్రత్యయము ప్రాప్తించుచుండ నిత్యముగ టచ్ప్రత్యయముకొఱకు శరదాదిగణమున ఝయన్తములకుఁ బాఠము చేయబడెనని తెలియునది.

687. గిరేశ్చ సేనకస్య. 5-4-112. గిరేః, చ, సేనకస్య. (టచ్, అవ్యయీభావే, అన్యతరస్యామ్.)

గిర్యన్తాదవ్యయీభావాట్టజ్వా స్యాత్। సేనకగ్రహణం పూజార్థమ్। ఉపగిరమ్। ఉపగిరి॥

687. గిరిశబ్దమన్తమందుగల యవ్యయీభావముకంటె టచ్చు విభాషగ నగును. "అన్యతరస్యామ్" అనునదనువర్తించుటచేతనే వికల్పము సిద్ధమగును. గాన నీసూత్రమున సేనకగ్రహణము ఋషిస్మరణమునకలనగఁబడు. పుణ్యముకొఱకగును. సేనకుడనునొకవైయాకరణాచార్యుఁడు. ఉపగిరమ్. సామీప్యమునందవ్యయీభావము. టచ్చు. టజభావమందు "ఉపగిరి" అని యగును.

అవ్యయీభావప్రకరణము సమాప్తము.



# 17. తత్పురుషప్రకరణము

668. తత్పురుషః. 2-1-22.

అధికారోఽయం ప్రాగ్బహువ్రీహేః॥

668. ఈసూత్రము "శేషో బహువ్రీహిః" అనుసూత్రమువఱకధికృత మగును. ఉత్తరసూత్రములందుపస్థితమై వానిచే విధింపబడు సమాసమునకు తత్పురుషసంజ్ఞను బోధించుచుండును.

669. ద్విగుశ్చ. 2-1-23. ద్విగుః। చ। (తత్పురుషః)

ద్విగురపి తత్పురుషసంజ్ఞస్స్యాత్। ఇదం సూత్రం త్యక్తుం శక్యమ్। సంఖ్యాపూర్వోద్విగుశ్చేతిపఠిత్వా సంజ్ఞాద్వయసమావేశస్య సువచత్వాత్। సమాసాన్తః ప్రయోజనమ్। పఞ్చరాజమ్॥

669. ద్విగుసమాసముగూడ తత్పురుషసంజ్ఞకమగును. "సంఖ్యాపూర్వో ద్విగుః" (734) అను వక్ష్యమాణద్విగుసంజ్ఞావిధాయకసూత్రముననే సముచ్చయార్థకచకారమును పఠించినచో ద్విగుతత్పురుషసంజ్ఞలకు సమావేశము సిద్ధమగును గాననీసూత్రమునకావశ్యకత లేదు. ద్విగువునకు తత్పురుషసంజ్ఞను విధించుటవలన పఞ్చానాం రాజ్ఞాం సమాహారః అనునర్థమున విధింపబడు ద్విగుసమాసమునకును "రాజాహస్సఖిభ్యష్టచ్" (792) సూ. చే తత్పురుషసమాసమునకు విధింపబోవు సమాసాన్తటచ్ ప్రత్యయము సిద్ధమగును. పఞ్చరాజమ్.

వివ :— "ఆకడారాదేకా సంజ్ఞా" (233) సూ. చే ద్విగుసంజ్ఞ తత్పురుష సంజ్ఞను బాధించును గానసంజ్ఞాద్వయసిద్ధికై వేరగసూత్రముండవలయుననెడి భావముతో నీసూత్రము రచింపబడియెను. అట్టిసంజ్ఞాద్వయసమావేశము ద్విగుసంజ్ఞావిధాయకసూత్రమున సముచ్చయార్థకచకారపఠనమువలననే ఫలించును గాన వేరుగ సూత్రమావశ్యకము గాదని యాశయము. "సంఖ్యాపూర్వోద్విగుః" అనుసూత్రమును విభజించి "సంఖ్యాపూర్వః" అనుయోగమునే "తద్ధితార్థ—" అను సూ. చే విహితమగుదానికి తత్పురుషసంజ్ఞను విధించి, ద్విగుః అనురెండవయోగముచే దానికి ద్విగుసంజ్ఞను విధించినను రెండుసంజ్ఞలకు సమావేశము సిద్ధమగును. చకారమీసంజ్ఞలకు సమావేశమును బోధించునని గ్రహింపవలెను.

690. ద్వితీయా శ్రితాతీతపతితగతాత్యస్తప్రాప్తాపన్నైః. 2-1-24.
ద్వితీయా, శ్రితా... ...పన్నైః (తత్పురుషః, విభాషా, సమాసః, సుపా.)

ద్వితీయాన్తం శ్రితాదిప్రకృతికైస్సుబన్తైస్సహ వా సమస్యతే, స తత్పురుషః। కృష్ణం శ్రితః। కృష్ణశ్రితః। దుఃఖమతీతో దుఃఖాతీతః। (వా) గమ్యాదీనాముపసంఖ్యానమ్। గ్రామం గమీ। గ్రామగమీ। అన్నం బుభుక్షుః। అన్నబుభుక్షుః॥

690. ప్రత్యయగ్రహణపరిభాషచే ద్వితీయా అనుదానికి ద్వితీయాన్తమనునర్థము లభించును. సుపా అనునది "శ్రితా....పన్నైః" అనుదానికి విశేష్యమగుటవలన బహువచనాన్తముగ విపరిణామమునొందును. తదన్తవిధివలన "సుబన్తైః" అనునర్థము గలుగును. అందుచే శ్రితాదిశబ్దములు శ్రితాదిశబ్దఘటిత సముదాయములందు లాక్షణికములని గ్రహింపవలయును. ద్వితీయావిభక్త్యన్తమగుపదము శ్రితాదిశబ్దములు ప్రకృతులుగాగల సుబన్తములతో వికల్పముగ సమసించును. అదియు తత్పురుషసంజ్ఞకమగును అని సూత్రార్థము. కృష్ణశ్రితః. (కృష్ణం శ్రితః) దుఃఖాతీతః. (దుఃఖమతీతః) కృష్ణ+అమ్, శ్రిత+సు అనియు, దుఃఖ+అమ్, అతీత+సు అనియు క్రమముగ నలౌకికవిగ్రహములు. ఇచట కృష్ణమ్ దుఃఖమ్ మొదలగు ద్వితీయాన్తములు శ్రితః అతీతః మొదలగు సుబన్తములతో సమసించినవి. (అలౌకికవిగ్రహమందే సమాససంజ్ఞ ప్రవర్తించుటచే సమాసావయవములగు) అలౌకికవిగ్రహమందే సమాససంజ్ఞ ప్రవర్తించుటచే సమాసావయవములగు సుప్ప్రత్యయములకు "సుపోధాతు" (654) సూ. చే లుక్కగును. సూత్రమున ద్వితీయాన్తము ప్రథమానిర్దిష్టమగుటచే ద్వితీయాన్తమునకుపసర్జనసంజ్ఞయుండును గాన "ఉపసర్జనం పూర్వమ్" (658) సూ. చే. పూర్వనిపాతమగును. సమాసమునకు "కృత్తద్ధిత" సూత్రముచే ప్రాతిపదికసంజ్ఞ యుండుటవలన మరల సముదాయముకంటె సుబుత్పత్తియగును. మహావిభాషాధికారమువలన పక్షమందు "కృష్ణం శ్రితః" ఇత్యాదివాక్యములునుండును. (వా) గమీ బుభుక్షుః ఇత్యాదులగు గమ్యాదిప్రకృతికసుబన్తములతో గూడ ద్వితీయాన్తము సమసించునని చెప్పవలయును. గ్రామగమీ (గ్రామం గమీ) అన్నబుభుక్షుః (అన్నం బుభుక్షుః) ఇత్యాదులుదాహరణములు.

691. స్వయం క్తేన. 2-1-25. స్వయమ్, క్తేన (సుపా, తత్పురుషః).

ద్వితీయేతి న సంబధ్యతే. అయోగ్యత్వాత్. స్వయం కృతస్యాపత్యం స్వయంకృతః॥

691. స్వయమ్ అనునవ్యయము క్తప్రత్యయాన్తప్రకృతిగల సుబన్తముతో సమసించునదియుతత్పురుషసంజ్ఞకమగును. ఆత్మనా అనునర్థముగల స్వయమ్ అనునవ్యయము కర్తృర్థకమగుటచే ద్వితీయాన్తమగుట సంభవింపదు గాన పూర్వసూత్రోపాత్తమగు ద్వితీయాపదమీసూత్రమునననువర్తింపదు. స్వాయం కృతిః (స్వయంకృతస్యాపత్యమ్) ఇచట కృతః అను క్తప్రత్యయాన్తప్రకృతిక సుబన్తముతో స్వయమ్ అనునవ్యయము సమసించినది. సుబ్లుక్కు మొదలగువానిని యథాపూర్వముగ తెలియదగును. స్వయంకృతః అనియగును. దీనికంటె స్వయం కృతస్యాపత్యమ్ అనునర్థమున షష్ఠ్యన్తమగు స్వయంకృతశబ్దముకంటె "అతఇఞ్" (4-1-95) అనుసూత్రముచే ఇఞ్ప్రత్యయమగును. స్వయంకృత+జస్+ఇ అని యుండను. ప్రాతిపదికావయవమగుసుప్పునకు లుక్కగును. స్వయంకృత+ఇ అనియుండ "యస్యేతి చ" (312) సూ.చే అకారలోపము. "తద్ధితేష్వచామాదేః" (7-2-117) సూ.చే నాదివృద్ధియగును. స్వాయంకృతి అనిరాగా తద్ధితాన్తమగుటచే విశిష్టమునకు ప్రాతిపదికసంజ్ఞ యుండుటవలన సముదాయముకంటె సుబుత్పత్తి యగును. స్వాయంకృతిః అని సిద్ధించును.

వివ:— స్వయమ్ అనునవ్యయమునకు పై రీతిగ సమాసమును విధింప నిచో కృత మొదలగు శబ్దములకంటెనే ఇఞ్ ప్రత్యయము మొదలగునవి వచ్చి యుండును. స్వయంకాః రిః మొదలగుననిష్టరూపములు రావలసివచ్చును. సమాసమును విధించినచో సమస్తశబ్దముకంటె తద్ధితప్రత్యయము వచ్చును గాని తదన్తర్భూతములగు కృతాదిశబ్దములకంటె రావుగాన నిష్టసిద్ధియగునని భావము.

692. ఖట్వా క్షేపే. 2-1-26. ఖట్వా, క్షేపే (క్తేన, సుపా, ద్వితీయా।)

> ఖట్వాప్రకృతికం ద్వితీయాన్తం క్తాన్తప్రకృతికేన సుబ
> న్తేన సమస్యతే, నిందాయామ్। ఖట్వారూఢో జాల్మః।
> నిత్యసమాసోఽయమ్। న హి వాక్యేన నిందా గమ్యతే॥

692. ద్వితీయా క్తేన సుపా అనునవి ప్రత్యయగ్రహణపరిభాషచే తదన్త బోధకములగును. ఖట్వాశబ్దము ఖట్వాప్రకృతికమందు లాక్షణికము. ఖట్వాశబ్ద ప్రకృతికద్వితీయాన్తము క్తాన్తప్రకృతికసుబన్తముతో నింద ప్రతీయమానమగు నపుడు సమసించునని సూత్రార్థము. ఖట్వారూఢః జాల్ముడు. (ఖట్వా+ అమ్ఆరూఢ+సు) ఆరూఢ+సు అను క్తాన్తప్రకృతిక సుబన్తముతో ఖట్వా+ అమ్ అను ద్వితీయాన్తము సమసించినది. సుబ్లుగాదులూహ్యంబులు. జాల్ముడన నాలోచనము లేకుండ పనిచేయువాడు. ఇట్టి నింద సమాసమువలననే గమ్యమాన మగును. ఈసూత్రముచే విధింపబడు సమాసమును నిత్యసమాసముగనెరుగునది. నింద ప్రతీయమానమగునపుడే యీసూత్రముచే సమాసము ప్రవర్తించును గాన "ఖట్వారూఢః" అనుసముదాయమునుండే నిర్గాణి వాక్యముచేననమిత్యకారిత్వరూప

మగు నింద ప్రతీయమానము గాకపోవుటచే సమాసము వైకల్పికమనుటకవకాశము లేదు. అనగా లౌకికవిగ్రహవాక్యము లేదని యాశయము.

వివ :— బ్రహ్మచారి స్వాశ్రమవిహితములగు నియమములనన్నిటిని సలిపి గృహస్థాశ్రమమును స్వీకరించునపుడు మంచముపై పండుకొనవలయును. అంత వరకధశ్శయనమే వానికి విహితము. అట్టి నియమము నతిక్రమించి బ్రహ్మచర్యమునందే ఖట్వారోహణమును చేసినవాడు ఖట్వారూఢుడగును. కనుకనా పదమువలననిట్టి నింద ప్రతీయమానమగును. ఇది రూఢశబ్దమగుటచే ఖట్వారోహణము లేకున్నను నిషిద్ధాచారమును జేయువారినందరిని బోధించును.

693. సామి. 2-1-27. (క్తేన, సుపా)

సామికృతమ్॥

693. సామి అనునది సగమనునర్థమును బోధించునవ్యయము. సామి అనునవ్యయము క్తాన్తప్రకృతికసుబన్తముతో సమసించును. సామికృతమ్ సమాసముగాన దీనికి తద్ధితాన్తము "సామికృతిః" (సామికృతస్యాపత్యమ్) అని యగును. సమాసముగానిచో సామికాత్తిః అని యయ్యెడిని.

694. కాలాః. 2-1-28. (క్తేన, ద్వితీయా.)

క్తేనేత్యేవ। అనత్యన్తసంయోగార్థం వచనమ్। మాసప్రమితః ప్రతిపచ్చన్ద్రః। మాసం పరిచ్ఛేత్తుమారబ్ధవానిత్యర్థః॥

694. కాలాః అనుచోట బహువచనముండుటచే కాలశబ్దము స్వరూపము నకుగాక కాలవాచకములకు గ్రహణమును బోధించును. కాలవాచకములు ప్రకృతిగల ద్వితీయాన్తములు క్తప్రత్యయాన్తప్రకృతికసుబన్తములతో వికల్పముగ సమసించును. క్తేన అనుపదమునను వర్తింపక "కాలా అత్యన్తసంయోగేచ" అని యేకసూత్రమునే చేయవలసియుండ "కాలాః" అని యోగవిభాగమును చేయుటవలననీసూత్రమునమాత్రము "క్తేన" అనునదనువర్తించుననియు అత్యన్తసంయోగములేనపుడు సమసించుననియు నర్థమును తెలియఁదగును. మాసప్రమితః. (మాసంప్రమితః) కాలవాచకప్రకృతికద్వితీయాన్తమగు "మాసమ్" అనునది ప్రమితః అను క్తప్రత్యయాన్తప్రకృతికసుబన్తముతో సమసించినది. సుబ్లుగాదులగును. పాడ్యమినాటి చంద్రుడు మాసపరిచ్ఛేదమునకారంభించినాడని యర్థము. ఇట్టి చంద్రునకు మాసముతోనత్యన్తసంయోగములేకున్నను సమాసము సిద్ధమగును.

695. అత్యన్తసంయోగే చ. 2-1-29. అత్యన్తసంయోగే, చ (కాలాః, సుపా.)

కాలా ఇత్యేవ। అక్తాన్తార్థం వచనమ్। ముహూర్తం సుఖమ్। ముహూర్తసుఖమ్॥

౬౯౫. క్తేన అనునది యీసూత్రములోనికనువర్తించదు. కాలవాచకప్రకృతికములగు ద్వితీయాంతములు సుబంతముతో అత్యంతసంయోగము గమ్యమానమైనప్పుడు సమసించును. క్తప్రత్యయాంతప్రకృతికముకంటె నన్యమగు సుబంతముతో సమాసమువచ్చుటకీసూత్రము. (యోగవిభాగము) ముహూర్తసుఖమ్. (ముహూర్తం సుఖమ్) ముహూర్తపరిమితకాలమంతయును వ్యాపించు సుఖమని యర్థము. కావున సమస్యమానపదార్థములకత్యంతసంయోగమున్నది.

ఇది ద్వితీయాతత్పురుషము.

౬౯౬. తృతీయా తత్కృతార్థేన గుణవచనేన. 2-1-30. తృతీయా, తత్కృత, అర్థేన, గుణవచనేన (సుప్, సుపా.)

తత్కృతేతి లుప్తతృతీయాకమ్। తృతీయాంతం తృతీయాంతార్థకృతగుణవచనేన, అర్థశబ్దేన చ, సహ ప్రాగ్వత్। శఙ్కులయా ఖణ్డః। శఙ్కులాఖణ్డః। ధాన్యేనార్థో ధాన్యార్థః। తత్కృతేతి కిమ్। అక్ష్ణా కాణః।

౬౯౬. సూత్రమున "తత్కృత" అనునది లోపించినతృతీయావిభక్తిగలది. (తత్కృతేన) తృతీయా అనునది తదంతవిధిచే తృతీయాంతమును బోధించును. "తత్కృత" అనునది "గుణవచనేన" అనుదానికి విశేషణము. "తత్కృతేన గుణవచనేన" అని యన్వయమును చేయవలయును. తృతీయాంతమును పరామర్శించు తచ్ఛబ్దము లక్షణచే తృతీయాంతముయొక్క యర్థమును బోధించును. కాన "తత్కృతేన" అనుదానికి "తృతీయాంతార్థముతో చేయబడినదను నర్థము ఫలించును. గుణవచనమనుచోట వచనగ్రహణమువలన గుణోపసర్జనద్రవ్యవాచకమునకు గ్రహణము. (తృతీయాంతము తృతీయాంతార్థముచే చేయబడిన గుణమును బోధించుశబ్దముతోను ధనవాచకమగునర్థశబ్దముతోను సమసించును.) శఙ్కులాఖణ్డః. (శఙ్కులయా ఖణ్డః) ఖణ్డః (శకలము) అనునది ఖండనమను గుణముపసర్జనముగ గల ద్రవ్యమును బోధించును. శఙ్కుల అనునది ఆయుధవిశేషమునకు సంజ్ఞ. శఙ్కులయా అను తృతీయాంతము స్వార్థమగునాయుధవిశేషముచే చేయబడిన ఖండనగుణవాచకమగు ఖణ్డశబ్దముతో సమసించినది. ధాన్యార్థః. (ధాన్యేనార్థః) ధాన్యేన అను తృతీయాంతమర్థశబ్దముతో సమసించినది. తత్కృతేతి కిమ్। శఙ్కులాఖణ్డః ఇత్యాదులు వక్ష్యమాణమగు "కర్తృకరణే కృతా బహులమ్" (౬౯౯). అను సూత్రముచేతనే సిద్ధించును గాననీసూత్రమున "తత్కృత" అనుదానికి ప్రయోజనమేమని ప్రశ్నాశయము. తృతీయాంతము గుణవచనముతో సమసించినచో తత్కృతమగు గుణమునుబోధించుశబ్దముతోనే సమసించును గాని యితరముతో సమసించదను నియమమును జెప్పుటకు "తత్కృత" అనునది సూత్రోపాత్తమైనది. అందువలన "అక్ష్ణా కాణః" అనుచోట సమాసము వారితమగుచు, దుష్కార్యాదులచే

వంధత్వగుణము గల్గినది గావితృతీ యాన్తార్థమగు నేత్రముచే గలుగలేదు. అని సమాధానాశయము.

697. పూర్వసదృశసమోనార్థకలహనిపుణమిశ్రశ్లక్ష్ణైః. 2-1-31. (తృతీయా)

తృతీయాన్తమేతైః ప్రాగ్వత్। మాసపూర్వః। మాతృసదృశః। పితృసమః। ఊనార్థే। మాషోనం కార్షాపణమ్। మాషవికలమ్। వాక్కలహః। ఆచారనిపుణః। గుడమిశ్రః। ఆచారశ్లక్ష్ణః। మిశ్రగ్రహణే సోపసర్గస్యాఽపి గ్రహణమ్। మిశ్రంచానుపసర్గమసన్ధావిత్యత్రాఽనుపసర్గగ్రహణాత్। గుడసమ్మిశ్రా ధానాః। (వా) అవరస్యోపసంఖ్యానమ్। మాసేనాపరో మాసాపరః॥

697. పూర్వ....శ్లక్ష్ణైః అనునది పూర్వాదిశ్లక్ష్ణాన్తశబ్దములకు ద్వంద్వసమాసము. తృతీయాన్తము పూర్వ సదృశ సమ ఊనార్థ కలహ నిపుణమిశ్ర శ్లక్ష్ణ అను శబ్దములతో వికల్పముగ సమసించును. ఊనార్థ అను పదముచే ఊనశబ్దార్థవాచకము లగు వికల హీన మొదలగు శబ్దములు గ్రహింపబడును. మాసపూర్వః. (మాసేన పూర్వః) మాతృసదృశః. (మాత్రా సదృశః) పితృసమః. (పిత్రా సమః) ఊనార్థములు :— మాషోనమ్. (కార్షాపణమ్) (మాషేణోనమ్) మాసమను పేరుగల పరిమాణముచే తక్కువైనది. మాషవికలమ్. (మాషేణ వికలమ్) వాక్కలహః. (వాచా కలహః) ఆచారనిపుణః. (ఆచారేణ నిపుణః) గుడమిశ్రః. (గుడేన మిశ్రః) ఆచారశ్లక్ష్ణః. (ఆచారేణ శ్లక్ష్ణః) ఇచట సమసదృశశబ్దయోగమందు "తుల్యార్థైరతులోపమాభ్యామ్" (633) అనుసూత్రముచేతను, పూర్వాదిశబ్దముల యోగమందీసమాసవిధానసామర్థ్యమువలనను మాసాదిశబ్దములకంటె తృతీయ వచ్చునని తెలియనగును. సూత్రమున మిశ్రపదముచేనుపసర్గ సహితమగు మిశ్రశబ్దమునకును గ్రహణము కల్గును. తృతీయాన్తముకంటె పరము ఉపసర్గరహితమునగు మిశ్రశబ్దము సంధిభిన్నార్థమందన్తోదాత్త మగునను నర్థముగల "మిశ్రం చానుపసర్గమసన్ధౌ" (6-2-154) అను సూత్రమందలి యనుపసర్గగ్రహణము తద్భిన్నస్థలము లందు మిశ్రశబ్దముచే నుపసర్గసహితమగుదానికిని గ్రహణము కలుగునని బోధించును. కావున "గుడసమ్మిశ్రా ధానాః" (గుడేన సమ్మిశ్రాః) అనుచోట సమ్ అనునుపసర్గపూర్వకమిశ్రశబ్దముతో తృతీయాన్తము సమసించినది. (వా) అవరశబ్దమునకును తృతీయాన్తముతో సమాసమును చెప్పవలయును. మాసావరః. (మాసేన అవరః.)

698. కర్తృకరణే కృతా బహులమ్. 2-1-32. కర్తృకరణే కృతా, బహులమ్ (తృతీయా)

కర్తరి కరణే చ తృతీయా కృదన్తేన బహులం ప్రాగ్వత్। హరిణా త్రాతో హరిత్రాతః। నఖైర్భిన్నో నఖభిన్నః। కృద్గ్రహణే గతికారకపూర్వస్యాపి గ్రహణమ్। నఖనిర్భిన్నః। కర్తృకరణే ఇతి కిమ్। భిక్షాభిరుషితః। హేతావేషా తృతీయా। బహులగ్రహణం సర్వోపాధివ్యభిచారార్థమ్। తేన దాత్రేణ లూనవానిత్యాదౌ న। కృతా కిమ్। కాష్ఠైః పచతితరామ్॥

698. కృతా అనునది తదన్తబోధకమగును. కర్తృకరణశబ్దములను సమాహారద్వంద్వముచేసి సప్తమీవిభక్తిని చేసిన కర్తృకరణే అని సిద్ధమగును. కర్తర్థమందుగాని కరణార్థమందుగాని విహితమగు తృతీయావిభక్త్యన్తమందుగల శబ్దము కృదన్తముతో బహుళముగ సమసించును అదియు తత్పురుషసంజ్ఞకమగును. హరిత్రాతః. (హరిణా త్రాతః) ఇచట హరిణా అను కర్త్రర్థకతృతీయాన్తము త్రాత అను కృదన్తముతో సమసించెను. నఖభిన్నః. (నఖైః భిన్నః) కృత్ప్రత్యయము గ్రహింపబడునపుడు గతిసంజ్ఞకముగాని కారకము గాని పూర్వమందున్నచో తద్విశిష్టమే కృదన్తమగును, గతికారకసమభివ్యాహారములేనపుడు కేవలమే కృదన్తమగును అనునర్థముగల "కృద్గ్రహణపరిభాష"చే గతికారకపూర్వకమగు కృదన్తముతోగూడ సమాసమగును. కాన "నిర్భిన్నం" అను పదానితో తృతీయాన్తము సమసించును. నఖనిర్భిన్నః. (నఖైర్నిర్భిన్నః). కర్తృకరణే అనుపదమును తీసివేచి తృతీయాన్తముకృదన్తముతో సమసించునని యర్థముచెప్పినచో "హేతౌ" (571) అను సూ.చే విధింపబడు తృతీయాన్తముగూడ కృదన్తముతోసమసించవలసివచ్చును; కానట్టిచోటులందు సమాసమును వారించుటకై "కర్తృకరణే" అనునది యావశ్యకము అందువలన "భిక్షాభిరుషితః" అనుచోట హేతుతృతీయాన్తమునకు సమాసము వారింపబడును. బహుళగ్రహణమునవలన కర్తృకరణార్థములందు విహితమగు తృతీయయన్తమందుగలదిగూడ నొక్కచోట కృదన్తముతో సమసించదు, ఒక్కచోట మరియొకవిభక్త్యన్తముగూడ కృదన్తముతో సమసించుననునర్థము లభించును. అందువలన "దాత్రేణ లూనవాన్" అనుచోట కరణతృతీయాన్తము క్తవతు ప్రత్యయాన్తముతో సమసించదు. కృతాకిమ్। సుపా అనునది యధికృతమగుటచే తిఙన్తముతో సమాసము ప్రసక్తము కాదు. కర్త్రాదులచే సాక్షిప్తము గు ధాత్వర్థబోధక కృదన్తముతోనే సమాసము సిద్ధమగునని శంకాశయము, తిఙన్తప్రకృతికతద్ధితాన్తముతో (పచతితరామ్) సమాసమును వారించుటకై "కృతా" అనునదావశ్యకమని సమాధానాశయము. కాష్ఠైః పచతితరామ్.

699. కృత్యైరధికార్థవచనే. 2-1-33. కృత్యైః, అధికారార్థవచనే. (పూర్వసూత్రమ్. సుపా)

స్తుతినిన్దాఫలకమర్థవాదవచనమధికారవచనమ్। తత్ర కర్తరి కరణే చ తృతీయా కృత్యైః సహ ప్రాగ్వవత్। వాతచ్ఛేద్యం తృణమ్। కాకపేయా నదీ॥

699. స్తోత్రముగాని నిందగాని ఫలితముగగల యర్థవాదము (ఆరోపితార్థము) అధికారమనబడును. అధికారవచనమందు కర్త్రర్థకతృతీయాన్తము కరణార్థకతృతీయాన్తముగూడ కృత్యప్రత్యయాన్తప్రకృతిక సుబన్తములతో సమసించునదియు తత్పురుషసంజ్ఞకమగును. వాతచ్ఛేద్యమ్. (వాతేన ఛేద్యమ్) తృణము. ఛేద్యశబ్దము శక్యార్థకకృత్యప్రత్యయాన్తము. గాలిచేతను ఛేదించుటకర్హమైనదని యర్థము. కోమలమైనదనుస్తుతియు బలహీనమైనదను నిందయునీవాక్యమువలన గమ్యమానమగును. కాననిది యధికారవచనమగును. కాకపేయా. (కాకైః పేయా) నదీ. పేయశబ్దముగూడ శక్యార్థకకృత్యప్రత్యయాన్తము. కాకులచే త్రాగుటకర్హమైనదని యర్థము. నది కూలంకషముగ పారుచుండుటచేనొడ్డునుండియే సులభముగ కాకులకును త్రాగుటకు యోగ్యమైనదనుస్తుతియు, కాకులచే త్రాగుటకు యోగ్యమైనది గానచాలతక్కువనీరుగలదనునిందయు ప్రతీయమానమగును. కాననిదియు నధికారవచనమగును. ఈ రెండువచనములు పై రీతిగ స్తుతినిందాఫలకములనగునని గ్రహించునది.

700. అన్నేన వ్యఞ్జనమ్. 2-1-34. అన్నేన. వ్యఞ్జనమ్ (తృతీయా)

సంస్కారకద్రవ్యవాచకం తృతీయాన్తమన్నేన ప్రాగ్వత్। దధ్నా ఓదనో దధ్యోదనః, ఇహ సమ్భూతోపసేకక్రియాద్వారా సామర్థ్యమ్॥

700. వ్యంజనమన సంస్కారకద్రవ్యవాచకము. అన్నశబ్దమునకు సము దాయశక్తిచే ఓదనమనియే యర్థము. సంస్కారకద్రవ్యవాచకమగు తృతీయాన్తము అన్నవాచకముతో విభాషగ సమసించును. దధ్యోదనః. (దధ్నా ఉపసిక్తః ఓదనః) దధిచేనుపసిక్తమైన (తడుపబడిన) యన్నమని యర్థము. దధ్యోదనమునందు సమ్భూతమగునుపసేకక్రియాద్వారా సామర్థ్యము నూహింపవలయును. లేనిచో దధికి సంస్కారకత్వము ప్రతీయమానముగానేరదు.

701. భక్ష్యేణ మిశ్రీకరణమ్. 2-1-35. భక్ష్యేణ, మిశ్రీకరణమ్ (తృతీయా)

గుడేన ధానాః గుడధానాః। మిశ్రణక్రియాద్వారా సామర్థ్యమ్॥

701. మిశ్రిక్రియతేఽనేన (దీనిచే కలుపబడునో యది) అనువ్యుత్పత్తివలన గుడాదులు మిశ్రీకరణములగును. కఠినములైన భక్ష్యమనబడును

గలది భక్షణార్థమగు వస్తువు భక్ష్యమనబడును. మిశ్రీకరణవాచకమగు తృతీయాంతము భక్ష్యవాచకముతో విభాషగసమసించును. గుడధానాః (గుడేన మిశ్రాః ధానాః) శరావమున వేచబడిన ధాన్యసముదాయము ధానాశబ్దార్థము. ఇది భక్ష్యమగును. గుడధానాః అనుదానికి బెల్లముతోకలసిన అటుకులని యర్థము. గుడధానములకు మిశ్రణక్రియాద్వారా సామర్థ్యముండుటవలన సమాసము నిశ్శంకముగ ప్రవర్తించును.

ఇది తృతీయాతత్పురుషము.

702. చతుర్థీ తదర్థార్థబలిహితసుఖరక్షితైః. 2-1-36.
చతుర్థీ, తదర్థార్థ........తైః, (సుప్, సుపా.)

చతుర్థ్యన్తార్థాయ యత్తద్వాచినా ఽర్థాదిభిశ్చ చతుర్థ్యన్తం వా ప్రాగ్వత్। తదర్థేన ప్రకృతివికృతిభావ ఏవ గృహ్యతే। బలిరక్షితగ్రహణాజ్ఞాపకాత్, యూపాయ దారు। యూపదారు। నేహ। రన్ధనాయ స్థాలీ। అశ్వఘాసాదయస్తు షష్ఠీసమాసాః। (వా) అర్థేన నిత్యసమాసో విశేష్యలిఙ్గతా చేతి వక్తవ్యమ్। ద్విజాయాఽయం ద్విజార్థః సూపః। ద్విజార్థా యవాగూః। ద్విజార్థం పయః। భూతబలిః। గోహితమ్। గోసుఖమ్। గోరక్షితమ్॥

702. తదర్థమనుచోట తచ్ఛబ్దముచే చతుర్థ్యన్తబోధ్యమగునర్థము వివక్షితమగును. చతుర్థ్యన్తార్థముకొఱకగునది తదర్థమగును. ప్రత్యయగ్రహణ పరిభాషచే "చతుర్థీ" అనునది చతుర్థ్యన్తబోధకమగును. "తదర్థార్థ.......తైః" అనునది ద్వంద్వముకడలె తృతీయాంతము. చతుర్థ్యన్తము, చతుర్థ్యన్తార్థమునకై యగు వస్తువును బోధించు సుబంతములతోను అర్థ బలి హిత సుఖ రక్షిత ఇవి ప్రకృతిగగల సుబంతములతోను వికల్పముగ సమసించునదియు తత్పురుషసంజ్ఞకమగును. భూతబలిః (భూతేభ్యో బలిః) గోరక్షితమ్ (గోభ్యో రక్షితమ్) ఇత్యాదిసమాసములందు బల్యాదులు చతుర్థ్యన్తార్థములగుభూతాదులకొఱకగుచున్నవి గాన "తదర్థ" పదముచేతనే "భూతబలిః" ఇత్యాదిసమాసములు సిద్ధించుచుండ సూత్రమున వేరుగ బలిరక్షిత శబ్దములగ్రహణము వ్యర్థమై తదర్థపదముచే ప్రకృతివికృతిభావమే(చతుర్థ్యన్తార్థమగువస్తువుప్రకృతియుతదర్థమగువస్తువుప్రకృతియునైయుండవలయును.) గ్రహింపబడునని జ్ఞాపనముచేయును."భూతబలిః"ఇత్యాదులలోభూతాదులకు బల్యాదులకును ప్రకృతివికృతిభావములేకపోవుటచే తదర్థపదమువలనగతార్థముకాదు.గానబలిరక్షితగ్రహణమావశ్యకమగును.ఇట్లుచెప్పుటచేరన్ధనాయ స్థాలీ ఇత్యాదులలో చతుర్థ్యన్తార్థమగు పాకమునకు స్థాలి వనార్థమగు పాత్రము ప్రకృతివికృతిభావము లేనందున సమాసాభావము సిద్ధమగును. యూపదారు. (యూపాయ దారు) ఇచట యూపము తిరునమ్మ్యన్తము యొక్కయర్థము యూపస్తంభము, దారువు (కొయ్య

దలి పశువును గట్టుకొయ్య) దారుపదార్థము (కట్టె) అగుటచే యూపదారువులకు ప్రకృతివికృతిభావమున్నది గానసమాసము సిద్ధమగును. అశ్వఘాసః ఇత్యాదులను చెప్పబోవు "షష్ఠీ" (706) అనుసూత్రముచే విధింపబడు షష్ఠీసమాసముచేతనే (అశ్వానాంఘాసః) సిద్ధింపచేసికొనవలయునుగాని "అశ్వేభ్యోఘాసః" ఇత్యాది విగ్రహమునుజూపి యీసూత్రమందలి తదర్థపదముచే సమాసము వచ్చుననుటకు వలనుపడదు. ఘాసాదులు తదర్థములైనను (అశ్వార్థములు) అశ్వఘాసాదులకు ప్రకృతివికృతిభావము లేకుండుటచే నేతత్సూత్రవిహితసమాసము ప్రవర్తించదని గ్రహించునది.

(వా) చతుర్థ్యంతమునకు అర్థశబ్దముతో నిత్యముగ సమాసమగుననియు విశేష్యముయొక్క లింగమే యాసమాసమునకగుననియు జెప్పవలయును. మహావిభాషాధికారమువలననర్థపదముతో వికల్పముగనే సమాసము రావలసియుండ తన్నివారణమునకై నిత్యసమాసము చెప్పబడెను. అర్థశబ్దము (ఉత్తరపదము) పుంలింగమగుటవలన (విశేష్యమే లింగమైనను) "పరవల్లింగం ద్వంద్వతత్పురుషయోః" (816) అను సూ. చే సమాసము నిత్యపుంలింగముగావలసి వచ్చునను యాశయముతో విశేష్యలింగము విధింపబడెను. ద్విజాయాయం ద్విజార్థః (సూపః) నిత్యసమాసమగుట నస్వపదవిగ్రహము చూపబడెను. సూపః అను విశేష్యము పుంలింగమగుటచే సమాసముగూడ తల్లింగమే యగును. విశేష్యలింగమును చెప్పినందులకు ప్రయోజనమును జూపుచున్నాడు:—ద్విజార్థా(యవాగూః) విశేష్యమగు యవాగు స్త్రీలింగమగుటచే సమాసము స్త్రీలింగమగును. ద్విజార్థమ్. (పయః) విశేష్యము నపుంసకలింగము గానసమాసము నపుంసకమైనది. భూతబలిః (భూతేభ్యో బలిః) గోహితమ్. (గోభ్యోహితమ్) గోసుఖమ్. (గోభ్యస్సుఖమ్) గోరక్షితమ్ (గోభ్యో రక్షితమ్).

ఇది చతుర్థీతత్పురుషము.

703. పఞ్చమీ భయేన, 2-1-37. పఞ్చమీ, భయేన.

చోరాద్భయమ్। చోరభయమ్। (వా) భయభీతభీతిభీభిరితి వాచ్యమ్। వృకభీతః। వృకభీతిః। వృకభీః॥

703. సూత్రమున భయశబ్దముచే స్వరూపమునకే గ్రహణము గాని భయార్థకములగు శబ్దములకన్నిటికిని గ్రహణము లేదు. అట్లైన "భయభీత" అను వార్తికమనావశ్యకము గావలయును. పంచమ్యంతము భయశబ్దముతో సమసించును. చోరభయమ్. (చోరాద్భయమ్) చోర+ఙసి, భయ+సు అని యలౌకికవిగ్రహము. (వా) పంచమ్యంతము భయ భీత భీతి భీ శబ్దములతో సమసించును. వృకభీతః (వృకభ్భీతః) వృకభీతిః. (వృకాద్భీతిః) వృకభీః. (వృకాద్భీః)

704. అపేతాపోఢముక్తపతితాపత్రస్తైరల్పశః, 2-1-38.
అపేతా,... ...పత్రస్తైః, అల్పశః, (పఞ్చమీ)

పేత్తైః సహాల్పం పఞ్చమ్యన్తం సమస్యతే స తత్పు
రుషః। సుఖాపేతః। కల్పనాపోఢః। చక్రముక్తః। స్వర్గపతి
తః। తరఙ్గాపత్రస్తః। అల్పశః కిమ్। ప్రాసాదాత్పతితః॥

704. "అపేతా... ....స్తైః" అనునది ద్వంద్వము. అపేత అపోఢముక్త పతిత అపత్రస్త యీశబ్దములతో కొన్నిపంచమ్యన్తములే సమసించునదియు తత్పురుషసంజ్ఞకమగునని యర్థము. సుఖాపేతః. (సుఖాదపేతః) కల్పనాపోఢః. (కల్పనాయాః అపోఢః) చక్రముక్తః. (చక్రాన్ముక్తః) తరఙ్గాపత్రస్తః (తరఙ్గాదపత్రస్తః) అల్పశః అనునది లేనిచో ప్రాసాదాత్పతితః అనుచోట పంచమ్యన్తము నకు సమాసము ప్రసక్తవగును. కొన్నిపంచమ్యన్తములే సమసించుననుటవలన నిచట రాదని తెలియునది.

705. స్తోకాన్తికదూరార్థకృచ్ఛ్రాణి క్తేన. 2-1-39. స్తోకాన్తి
కదూరార్థకృచ్ఛ్రాణి, క్తేన (పఞ్చమీ.)

స్తోకాన్ముక్తః। అల్పాన్ముక్తః। అన్తికాదాగతః। అభ్యా
శాదాగతః। దూరాదాగతః। విప్రకృష్టాదాగతః। కృచ్ఛ్రా
దాగతః। పఞ్చమ్యాః స్తోకాదిభ్య ఇత్యలుక్॥

705. సూత్రమున స్తోకమ్ అన్తికమ్ దూరమ్ యీశబ్దములకు అర్థశబ్దముతో బహువ్రీహి. పంచమ్యన్తములగు స్తోకార్థములు అన్తికార్థకములు దూరార్థకములు పంచమ్యన్తమగు కృచ్ఛ్రశబ్దము ఇవి క్తప్రత్యయాన్తముతో సమసించును. స్తోకాన్ముక్తః (స్తోకాన్ముక్తః) అల్పాన్ముక్తః. అల్పాత్ అను స్తోకార్థక పంచమ్యన్తము ముక్తశబ్దముతో సమసించెను. అన్తికాదాగతః। అభ్యాశాదాగతః। దూరాదాగతః। విప్రకృష్టాదాగతః। కృచ్ఛ్రాదాగతః। ఈయుదాహరణములందు సమాసము వచ్చిన పిదప "సుపోధాతుప్రాతిపదికయోః" అనుసూత్రముచే ప్రాప్తమగు పంచమీ లుక్కు "పఞ్చమ్యాః స్తోకాదిభ్యః" (864) అను సూ. చే నిషేధింపబడెను. అందుచే పంచమి శ్రూయమాణమగును.

ఇది పఞ్చమీతత్పురుషము.

706. షష్ఠీ. 2-2-8, (సుపా)

రాజ్ఞః పురుషో రాజపురుషః॥

706. షష్ఠీవిభక్త్యన్తము సమర్థమగు సుబన్తముతో సమసించునదియు తత్పురుషమగును. రాజపురుషః. (రాజ్ఞః పురుషః) రాజన్ + ఙస్, పురుష + సు. అని యలౌకికవిగ్రహము. సుప్పులకు లుక్కువచ్చిన పిదప ప్రత్యయలక్షణముచే రాజన్‌శబ్దము పదమగుటవలన నలోపమగును.

*707. యాజకాదిభిశ్చ. 2-2-9. యాజకాదిభిః, చ (షష్ఠీ)

ఏభిః షష్ఠ్యన్తం సమస్యతే। తృజకాభ్యాం కర్తరీత్యస్య ప్రతిప్రసవో౽యమ్। బ్రాహ్మణయాజకః। దేవపూజకః। (వా) గుణాత్తరేణ తరలోపశ్చేతి వక్తవ్యమ్। తరబన్తం యద్గుణవాచి తేనసహ సమాసస్తరప్ప్రత్యయలోపశ్చ। ననిర్ధారణఇది పూరణగుణేతి చ నిషేధస్య ప్రతిప్రసవో౽యమ్। సర్వేషాం శ్వేతతరః సర్వశ్వేతః। సర్వేషాం మహత్తరః సర్వమహాన్। (వా) కృద్యోగా చ షష్ఠీ సమస్యత ఇతి వాచ్యమ్। ఇధ్మస్య ప్రవ్రశ్చనః ఇధ్మప్రవ్రశ్చనః॥

707. యాజకాదిగణమున పఠింపబడు శబ్దములతో షష్ఠ్యన్తము సమసించును. కర్త్రర్థమునవిహితములగు తృచ్ప్రత్యయాన్తముతోనుఅకప్రత్యయాన్తముతోడను షష్ఠ్యన్తము సమసింపదనునర్థముగల "తృజకాభ్యాం కర్తరి" (613) అను షష్ఠిసమాసనిషేధమునకిది ప్రతిప్రసవము. (నిషేధమును బాధించి తిరుగ కార్యమునువిధించునది) బ్రాహ్మణయాజకః. (బ్రాహ్మణస్య) యాజకః యాజకః అనునది కర్త్రర్థకమగు అకప్రత్యయాన్తము. దేవపూజకః అనునదియునిట్లే (వా) తరప్ప్రత్యయాన్తమగు గుణవాచకముతో షష్ఠ్యన్తమగు సర్వశబ్దము సమసించును గుణవాచకముకంటె విహితమగు తరప్ప్రత్యయము లోపించును. వార్తికమున సర్వశబ్దమనువృత్తమగుటచేనిట్టియర్థము లభించెను. నిర్ధారణమర్థముగల షష్ఠ్యన్తము సమసింపదనునర్థముగల "న నిర్ధారణే" (708) అను సూత్రమునకు గుణవాచకశబ్దముతో షష్ఠ్యన్తము సమసింపదను నర్థముగల "పూరణగుణ" (709) అను సూత్రమునకునీవార్తికము ప్రతిప్రసవము. సర్వశ్వేతః. (సర్వేషాం శ్వేతతరః) శ్వేత అను గుణవాచకముకంటె తరప్ప్రత్యయము విహితమయ్యెను. దీనికి సర్వేషామ్ అను షష్ఠ్యన్తముతో సమాసము తరప్ప్రత్యయలోపము పైవార్తికముచే సిద్ధములగును. వార్తికము లేకున్న నిచట "పూరణగుణ" సూత్రముచే సమాసనిషేధము ప్రసక్తమగునని తెలియునది. సర్వమహాన్. ఇచట మహత్తరః అను తరబన్తముతో సర్వశబ్దమునకుసమాసము తరప్ప్రత్యయలోపమును సిద్ధమగును. (వా) "కర్తృకర్మణోః కృతి" (626) సూ. చే విధింపబడు షష్ఠ్యన్తమునకు సమర్థమగు పదముతో సమాసమును చెప్పవలయును. ఇధ్మప్రవ్రశ్చనః. (ఇధ్మస్య ప్రవ్రశ్చనః) ప్రవ్రశ్చనః అనునది ల్యుట్ప్రత్యయాన్తము. కుఠారమర్థము. తద్యోగమున "కర్తృకర్మణోః" సూ. చే షష్ఠి వచ్చెను. "ప్రతిపదవిధానా షష్ఠీ న సమస్యతే" అను వక్ష్యమాణవార్తికమునకిది యపవాదము.

---

* యాజక పూజక పరిచారిక పరిషేచక పరివేషక స్నాపక అధ్యాపక ఉత్సాదక ఉద్వర్తక హోతృ భర్తృ రథగణక పత్తిగణకఇదియాజకాదిగణము,

వివ :— దేనినుండి యేకదేశము వేరుచేయబడునో ఏది వేరుచేయబడునో వేరుచేయుటకైయ్యది కారణమో యీమూడును ప్రయుక్తములగునప్పుడే నిర్ధారణ షష్ఠీవిభక్తియు "ననిర్ధారణే" అనుసమాస నిషేధముగూడ ప్రవర్తించును. (నృణాం ద్విజః (శ్రేష్ఠః) సర్వశ్వేతః అను చోట పైమూడునులేనందున "ననిర్ధారణే" అను సూత్రమునకు ప్రసక్తి లేదు. ఇట్టి యస్వారసమును మనసునందుంచుకొని దీనిని విడిచి "పూరణగుణ" అను నిషేధమునకిది ప్రతిప్రసవమనిమూలమున చెప్పబడెను.

708. న నిర్ధారణే. 2-2-10. న, నిర్ధారణే (షష్ఠీ)

నిర్ధారణే యా షష్ఠీ సా న సమస్యతే। నృణాం ద్విజః శ్రేష్ఠః। (వా) ప్రతిపదవిధానా షష్ఠీ న సమస్యత ఇతి వాచ్యమ్। సర్పిషో జ్ఞానమ్॥

708. నిర్ధారణమున విధింపబడు షష్ఠ్యన్తమునకు సమాసము రాదు. నృణాం ద్విజః (శ్రేష్ఠః) "యతశ్చ నిర్ధారణమ్" (641) సూ. చే నృణామ్ అను చోట షష్ఠి విహితమయ్యెను కాన నది ద్విజపదముతో సమసించదు. (వా) ప్రతిపదమునుద్దేశించి విధింపబడు షష్ఠ్యన్తము సమసించదు. శేషపదసంబంధముగల షష్ఠిని విడిచి మిగిలినసూత్రములచే ("జ్ఞోఽవిదర్థస్య") (615) సూత్రము మొదలు "కృత్వోఽర్థ" (625) సూత్రమువరకునుండు సూత్రములచే) విహితమగు షష్ఠియంతయు ప్రతిపదవిధానమగును. సర్పిషోజ్ఞానమ్. ఇచట షష్ఠి "జ్ఞోఽవిదర్థస్య కరణే" సూత్రముచే విహితము.

వివ — పురుషోత్తమః. (పురుషాణాముత్తమః) ఇచట "ననిర్ధారణే" అనునిషేధము ప్రవర్తించును గాననీరూపమెట్లు సాధువగుననిన సప్తమీతత్పురుషముచే (పురుషేషూత్తమః అనువిగ్రహమున "సంజ్ఞాయామ్" 7[illegible]6 సూ. చే) సాధువగునని గ్రహించునది.

709. పూరణగుణసుహితార్థసదవ్యయతవ్యసమానాధికరణేన. 2-2-11. (న, షష్ఠీ)

పూరణాద్యర్థైస్సదాదిభిశ్చ షష్ఠీ న సమస్యతే। పూరణే। సతాం షష్ఠః। గుణే। కాకస్య కార్ష్ణ్యమ్। బ్రాహ్మణస్య శుక్లాః। యదా ప్రకరణాదినా దన్తా ఇతి విశేష్యం జ్ఞాతం తదేద ముదాహరణం। అనిత్యోఽయం గుణేన నిషేధః। తద శిష్యం సంజ్ఞాప్రమాణత్వాదిత్యాదినిర్దేశాత్। తేన అర్థగౌరవం బుద్ధిమాన్ద్యమిత్యాది సిద్ధమ్। సుహితార్థాస్తృప్త్యర్థాః। ఫలానాం సుహితః। తృతీయాసమాసస్తు స్యాదేవ। స్వరే విశే

ఇచట ఫలములకు కరణత్వము వివక్షితమగునపుడుమాత్రము "కర్తృకరణే కృతా" (698) సూ. చే సమాసమగును. షష్ఠీసమాసమునకు ఫలసంబంధి తృప్తిగలవాడని యర్థము. తృతీయాసమాసమునకు ఫలకరణతృప్తిగలవాడని యర్థము. ఫలసహిత శబ్దములకేదోరీతిగ సమాసము సిద్ధమగును గాన షష్ఠీసమాసనిషేధము వ్యర్థమని మాత్రము శంకింపవీలులేదు. తృతీయాసమాసమున పూర్వపదప్రకృతిస్వరమగుటయు షష్ఠీసమాసమునందన్తోదాత్తస్వరమగుటయు నీరీతిని స్వరమగుటచే సమాసనిషేధము సార్థకమగును. శతృశానచ్ప్రత్యయాన్తములతో షష్ఠ్యన్తము సమసింపదనుటకుదాహరణము:—ద్విజస్య కుర్వన్. ద్విజస్య కుర్వాణః। బ్రాహ్మణునికి సేవకుడని యర్థము. కుర్వన్ అనునది శతృప్రత్యయాన్తము. కుర్వాణః అనునది శానచ్ప్రత్యయాన్తము. "ద్విజస్య ఘటం కుర్వన్" ద్విజస్య అనుచోట షష్ఠి ద్విజునికి ఘటమునకుగల సంబంధమును బోధింపదు. అట్లయిన ద్విజునికి కుర్వన్ శబ్దార్థముతో సామర్థ్యములేనందున సమాసప్రాప్తియేలేదు. కావున కుర్వన్ శబ్దమునకు సేవకుడర్థమని చెప్పి ద్విజకింకరులకుగల సంబంధమును బోధించు షష్ఠి ద్విజశబ్దమునకగునని చెప్పవలెను. ఈయర్థమును సూచించుటకే కుర్వన్ శబ్దమునకు కింకరః అని యర్థము వ్రాయబడెను. అవ్యయముతో సమాసనిషేధమునకుదాహరణము:—బ్రాహ్మణస్య కృత్వా. కృత్వా అనునవ్యయముతో షష్ఠ్యన్తము సమసింపదు. సూత్రముననవ్యయపదమునకు పూర్వమందున్న సత్తనుకృత్ప్రత్యయనిర్దేశము వలన, పరమందున్న తవ్య అను కృత్ప్రత్యయనిర్దేశమువలనను (సహచరితపరిభాషచే) వానిమధ్యనుండు నవ్యయపదముచే కృదన్తావ్యయమే గ్రహింపబడును గాని తదితరమగునవ్యయము గ్రహింపబడదు. కావున తదుపరి (తస్య ఉపరి) ఇత్యాదులందు ఉపరి మొదలగు కృద్భిన్నావ్యయములతో షష్ఠ్యన్తమునకు సమాసము సిద్ధమగునని రక్షితులను వైయాకరణులు చెప్పెను. ఇట్లు చెప్పుటచే "సర్వపశ్చాత్" అను భాష్యప్రయోగము ప్రమాణమని తెలియునది. తవ్యప్రత్యయాన్తముతో సమాసనిషేధమునకుదాహరణము:—బ్రాహ్మణస్య కర్తవ్యమ్. కర్తవ్యమను నది తవ్యప్రత్యయాన్తము. సూత్రమున తవ్య అని అనుబంధనిర్ముక్తమును గ్రహించుటవలన ననుబంధసహితమగు తవ్యత్ప్రత్యయాన్తమునకు గ్రహణము కలుగదు. కావున స్వకర్తవ్యమ్ (స్వస్య కర్తవ్యమ్. కర్తృకషష్ఠ్యన్తముతో సమాసము) ఇత్యాదులందు తవ్యదన్తముతో షష్ఠ్యన్తమునకు సమాసము సిద్ధమగును. "బ్రాహ్మణస్య కర్తవ్యమ్" ఇత్యాదులందును తవ్యత్ప్రత్యయాన్తమునే గ్రహించుటచే సమాసము సంభవించును, గాన సూత్రమున తవ్యగ్రహణమనావశ్యకమనుటకు వలనుపడదు. తవ్యత్ప్రత్యయాన్త తవ్యప్రత్యయాన్తములకు స్వరభేదముండుట యిందు గారణము. సమానాధికరణమునందానితో షష్ఠ్యన్తము సమసింపదనుట కుదాహరణము:—తక్షకస్య సర్పస్య. సమానాధికరణమన (సమానం అధికరణం = ద్రవ్యం యస్య) ఏకార్థబోధకము. విశేషణము విశేష్యముతో బహుళముగ సమసించుననర్థముగల "విశేషణం విశేష్యేణ బహులమ్" (740) అను చెప్పబోవు విశేషణసమాసవిధాయకసూత్రమున "క్వచిత్ప్రవృత్తిః క్వచిదప్రవృత్తిః

క్వచిద్విభాషా క్వచిదన్యదేవ" అనురీతిననేకములగునర్థములబోధించు బహుళగ్రహణముండుటచే తత్సామర్థ్యమువలననావిశేషణసమాసముగూడ "తక్షకస్య సర్పస్య" ఇత్యాదులందు ప్రవర్తించదని గ్రహించునది. సమానాధికరణముతో షష్ఠ్యన్తము సమసించదనుటకు మరియొక యుదాహరణము.—గోః ధేనోః। ఇచట "పోటాయువతి" (748) సూ. చే విధించు కర్మధారయసమాసము విశేషవిహితమగుటచే "షష్ఠీ" (706) సూత్రవిహితమగు సమాసమును బాధింపవలసియున్నది. కాని "గౌఃధేనుః" ఇత్యాదిప్రథమా విభక్త్యన్తములందు చరితార్థమైన (సావకాశమైన) "పోటాయువతి" అనుసూత్రమును "గోర్ధేనోః" ఇత్యాదులందును పరమగు (రాజ్ఞః పురుషః. ఇత్యాదులందు సావకాశమైన) "షష్ఠీ" అను సూత్రముచే విహితమగు సమాసము బాధించి ప్రవర్తింపవలసియున్నది. "షష్ఠీ" అనుసూత్రముచే ప్రాప్తించునట్టిసమాసముగూడనీసూత్రముచే వారింపబడును.

710. క్తేన చ పూజాయామ్. 2-2-12. క్తేన, చ, పూజాయామ్ (షష్ఠీ, న)

మతిబుద్ధీతిసూత్రేణ విహితో యః క్తః తదన్తేన షష్ఠీ న సమస్యతే। రాజ్ఞాం మతో బుద్ధః పూజితో వా। రాజపూజిత ఇత్యాదౌ తు భూతే క్తాన్తేన సహ తృతీయాసమాసః॥

710. సూత్రమున పూజాయామ్ అనుపదము "మతిబుద్ధిపూజార్థేభ్యశ్చ" (3-2-188) అనుసూత్రమునకుపలక్షణము, క్తేన అనువానికి తదన్తవిధిచే క్తాన్తేన అని యర్థము. "మతిబుద్ధిపూజార్థేభ్యశ్చ" అనుసూత్రముచే విధింపబడు క్తప్రత్యయాన్తముతో షష్ఠ్యన్తము సమసించదని యర్థము. ఇది శేషషష్ఠ్యన్తమునకు కారకషష్ఠ్యన్తమునకును సమాసనిషేధమును విధించును. రాజ్ఞాం. మతః.మనధాతువుకంటె మతిబుద్ధీత్యాదిసూత్రముచే వర్తమానకాలమున క్తప్రత్యయము విధింపబడెను. (మతః) "క్తస్య చ వర్తమానే" (628) సూ. చే రాజన్‌శబ్దముకంటె షష్ఠి వచ్చెను. రాజ్ఞాం బుద్ధః రాజ్ఞాం పూజితః ఇత్యాదులు నిట్లే. ఇచట మతః మొదలగు పదములకు ఇష్టపడుచున్నవాడనురీతిని వర్తమానకాలమర్థమును చెప్పవలయును. వ్యవహారమునవగపడు రాజపూజితః" ఇత్యాదిసమాసములు భూతకాలమున విధింపబడిన క్తప్రత్యయాన్తముతో రాజ్ఞా ఇత్యాదితృతీయాన్తములకు ("కర్తృకరణే" సూ. చే) సమాసముచేసిన సిద్ధములగును. రాజుచే పూజింపబడినవాడని యర్థము.

711. అధికరణవాచినా చ. 2-2-13. అధికరణవాచినా, చ (క్తేన, షష్ఠీ, న.)

క్తేన షష్ఠీ న సమస్యతే। ఇదమేషామాసితం గతం భుక్తం వా।

711. అధికరణార్థమున విధింపబడు క్తప్రత్యయాన్తముతో షష్ఠ్యన్తము సమసించదు. (ఇదమ్) ఏషామ్ ఆసితమ్. (గతమ్ భుక్తమ్). ఆసితమ్ మొదలగురూపములు "క్తోఽధికరణే" (3-4-76) అను సూత్రముచేనధికరణార్థమున విధింపబడు క్తప్రత్యయాన్తములు. తద్యోగమందు "అధికరణవాచినశ్చ" (629) సూ. చే షష్ఠి వచ్చును.

712. కర్మణి చ. 2-2-14. కర్మణి, చ. (షష్ఠీ, న.)

ఉభయప్రాప్తౌ కర్మణీతి యా షష్ఠీ సా న సమస్యతే।
ఆశ్చర్యో గవాం దోహోఽగోపేన॥

712. "క్తేన చ పూజాయామ్" అను నిషేధము వ్యర్థమగును గాన నీ సూత్రమున క్తేన అను పదమనువర్తించదు. సూత్రమున చ అనునిపాతము ఇతి శబ్దముయొక్క యర్థమును బోధించును. కావున "కర్మణి" అను సప్తమ్యేకవచనాన్తముచ్చరింపబడి యేసూత్రముచే షష్ఠి విధింపపడునో ఆషష్ఠ్యన్తము (ఉభయప్రాప్తౌ కర్మణి అనుసూత్రవిహితషష్ఠ్యన్తము) సమర్థమగుదానితో సమసించదని సూత్రార్థము. అంతియకాని కర్మార్థమున విధింపబడు షష్ఠ్యన్తము సమసించదని యర్థమునుచెప్పరాదు. అట్లైన అపాంస్రష్టా ఇత్యాదులందునీసూత్రముచేతనేనిషేధము సిద్ధమగును గావున తదర్థమగు "తృజకాభ్యాం కర్తరి" అనుసూత్రము వ్యర్థమయ్యెడిని. ఆశ్చర్యోగవాం దోహోఽగోపేన. గవామ్ అనుచోట "ఉభయప్రాప్తౌ" (627) సూ. చే షష్ఠి వచ్చెను. కాన సమాసనిషేధము ప్రవర్తించును.

713. తృజకాభ్యాం కర్తరి. 2-2-15. తృజకాభ్యామ్, కర్తరి, (షష్ఠీ), న)

కర్త్రర్థతృజకాభ్యాం షష్ఠ్యా న సమాసః। అపాం స్రష్టా। వజ్రస్య భర్తా। ఓదనస్య పాచకః। కర్తరి కిమ్। ఇక్షూణాం భక్షణమిక్షుభక్షికా। పత్యర్థభర్తృశబ్దస్య యాజకాదిత్వాత్సమాసః। భూభర్తా। కథం తర్హి ఘటానాం నిర్మాతుస్త్రిభువనవిధాతుశ్చ కలహః। ఇతి। శేషషష్ఠ్యా సమాస ఇతి కైయటః॥

713. కర్తరి అనునది తృజకాభ్యామ్ అనుదానితోనన్వయించును. కర్త్రర్థమున విహితములగు తృచ్ప్రత్యయాన్తముతోను అక (ణ్వుల్) ప్రత్యయాన్తముతోను షష్ఠ్యన్తమునకు సమాసము రాదు. అపాం స్రష్టా. వజ్రస్య భర్తా. క్రమముగ సృజ్భృధాతువులకంటె కర్త్రర్థమందు తృచ్ ప్రత్యయముచే నీరూపములు సిద్ధములగును. తద్యోగమున "కర్తృకర్మణోః కృతి" (626) సూ. చే షష్ఠి వచ్చును. ఓదనస్య పాచకః. పచధాతువుకంటె కర్త్రర్థమున ణ్వుల్ ప్రత్యయము. దీనికి అక అనునదాదేశమగును. భక్షణమను ధాత్వర్థమును విర్దేశించునపుడు భక్ష

ధాతువుకంటె భావార్థమున ణ్వుల్ ప్రత్యయముచేసిన భక్షికా అని యగును. ఇక్షూణాం భక్షికా అను విగ్రహమందు కర్మవాచకముకంటె విహితమగు షష్ఠ్యన్తమునకు సమాసము ప్రవర్తించెను. సూత్రమున కర్తరి అనుపదము లేనిచో నిచటను నిషేధము ప్రసక్తమగును. ప్రసిద్ధమగుటచే పతిశబ్దార్థకమగు భర్తృశబ్దమే యాజకాదిగణమున పఠింపబడుటవలన నట్టిభర్తృశబ్దముతో షష్ఠ్యన్తమునకు "యాజకాదిభిశ్చ" (707) సూ. చే సమాసమగును. భూభర్తా. (భువో భర్తా) భూపతియని యర్థము. "ఘటానాం.........త్రిభువనవిధాతుశ్చ....హాః". అను శ్లోకమున త్రిభువనవిధాతుః అనుస్థలమున తృజన్తమగు విధాతృశబ్దముతో త్రిభువనస్య అనుషష్ఠ్యన్తమునకు సమాసమగపడుచున్నది. అది యెట్లు సాధువగునని కథంతర్హి అను శంకకాశయము. ఈ సూత్రముచే విధింపబడు నిషేధము సాన్నిధ్యముచే కారకషష్ఠ్యన్తమునకేయగును. "షష్ఠీ శేషే" (609) సూ. చే విధింపబడు షష్ఠ్యన్తమునకు ప్రవర్తింపదు. పైస్థలమున శేషషష్ఠ్యన్తమనిన సమాసము సిద్ధమగునని కైయటుడు చెప్పెను. ఇది సమాధానాయాశయము.

714. కర్తరి చ. 2-2-16. కర్తరి, చ। (షష్ఠీ. అకేన, న)

కర్తరిషష్ఠ్యా అకేన న సమాసః। భవతః శాయికా। నేహ తృజనువర్తతే। తద్యోగే కర్తురభిహితత్వేన కర్తృషష్ఠ్యా అభావాత్॥

714. కర్తరి అనునది షష్ఠీ అనుదానితోనన్వయించును. కర్త్రర్థమున విధింపబడు షష్ఠ్యన్తమునకు అకప్రత్యయాన్తముతో సమాసము రాదు. భవతః శాయికా. ధాత్వర్థనిర్దేశమున శీఙ్ (శయనే) ధాతువుకంటె అకప్రత్యయమువలన శాయికా అని సిద్ధించును. భవతః అనునది కర్త్రర్థకషష్ఠ్యన్తము. తృచ్ప్రత్యయము కర్త్రర్థమందే విధింపబడుటచే దానిచే కర్త యభిహితుడగును గాననట్టిశబ్దములతో సంబంధమున్నపుడు కర్త్రర్థమందు షష్ఠికి ప్రాప్తియేలేకపోవుటవలన పూర్వసూత్రమునుండి తృచ్ పదమీసూత్రములోనికనువర్తించదు. తృజకాభ్యామ్. అను చోటనేకదేశమందు స్వరితత్వమనుదోషము నంగీకరించుటవలన అకపదము మాత్రమనువర్తించును.

715. నిత్యం క్రీడాజీవికయోః. 2-2-17. నిత్యమ్, క్రీడాజీవికయోః (షష్ఠీ, అకేన)

ఏతయోరర్థయోరకేన షష్ఠీ నిత్యం సమస్యతే। ఉద్దాలకపుష్పభంజికా। క్రీడావిశేషస్య సంజ్ఞా। సంజ్ఞాయామితి భావే ణ్వుల్। జీవికాయాం। దన్తలేఖకః। తత్ర క్రీడాయాం వికల్పే జీవికాయాం తృజకాభ్యాంకర్తరీతి నిషేధే ప్రాప్తేవచనమ్॥

715. క్రీడార్థమందు జీవికా (వృత్తి) ర్థమందును విహితమగు అకప్రత్యయమన్తమందుగలదానితో షష్ఠ్యన్తము నిత్యముగ సమసించును. ఉద్దాలకపుష్ప

భఞ్జికా. (ఉద్దాలకపుష్పాణి భజ్యన్తే యస్యాం) భఞ్జధాతువుకంటె "సంజ్ఞాయామ్" (3-3-109) సూ. చే భావార్థమున ణ్వుల్ ప్రత్యయవగును. దీనికి అకాదేశము. ఇందొకవిధమగు ఖేలనమునకు సంకేతము. సమాసమువలననే యట్టిక్రీడారూపమగునర్థమవగతమగును. జీవికార్థమందుదాహరణము:—దన్తలేఖకః దన్తలేఖనముచే జీవించువాడని యర్థము. లిఖధాతువుకంటె కర్త్రర్థమందు ణ్వుల్ ప్రత్యయము. అకాదేశము. విశిష్టమువలన జీవిక గమ్యమానమగును. ఉద్దాలకపుష్పభఞ్జికా అనుస్థలమున ణ్వుల్ప్రత్యయము కర్త్రర్థమందు విహితమగునదికాదు గావున "తృజకాభ్యాం కర్తరి" అనుసూత్రముచే నిషేధము ప్రవర్తింపకున్నను "షష్ఠీ" (706) సూ. చే వికల్ప సమాసము ప్రాప్తించుచుండ దన్తలేఖకః అనుచోట ణ్వుల్ప్రత్యయము కర్త్రర్థమున విహితమగుటచే "తృజకాభ్యాం" సూ. చే నిషేధము ప్రాప్తించుచుండ నీరెండుస్థలములందును నిత్యసమాసము కొఱకీ సూత్రమారంభింపబడినెను.

716. పూర్వాపరాధరోత్తరమేకదేశినైకాధికరణే. 2-2-1.
పూర్వాపరాధరోత్తమమ్, ఏకదేశినా, ఏకాధికరణే।

అవయవినా సహ పూర్వాదయః సమస్యన్తే, ఏకత్వసంఖ్యావిశిష్టశ్చేదవయవీ। షష్ఠీసమాసాऽపవాదః। పూర్వం కాయస్య పూర్వకాయః। అపరకాయః। ఏకదేశినా కిమ్। పూర్వం నాభేః కాయస్య। ఏకాధికరణే కిమ్। పూర్వశ్ఛాత్రాణాం। సర్వోఽప్యేకదేశోఽహ్నా సమస్యతే। సంఖ్యావిసాయేతి జ్ఞాపకాత్। మధ్యాహ్నః సాయాహ్నః। కేచిత్తు సర్వోఽప్యేకదేశః కాలేన సమస్యతే। తత్త్వహ్నైవ। జ్ఞాపకస్య సామాన్యాపేక్షత్వాత్। తేన మధ్యరాత్రః "ఉపారతాః పశ్చిమరాత్రగోచరాః" ఇత్యాది సిద్ధమిత్యాహుః॥

716. ఏకదేశశబ్దమవయవవాచకము. ఏనాదేశినా అనుశబ్దమువలన అవయవినా అనునర్థము లభించును. ఏకాధికరణే=అధికరణమన ద్రవ్యము, ఏకత్వసంఖ్యాసహితమగు ద్రవ్యమందని యర్థము. పూర్వపరాధరోత్తరమ్ అనునది సమాహారద్వన్ద్వము. (పూర్వం చ అపరం చ అధరం చ ఉత్తరం చ ఏషాం సమాహారః) ఏకత్వసంఖ్యాసహితమగు ద్రవ్యమునుబోధించు అవయవివాచకముతో పూర్వాదిశబ్దములు సమసించును. పూర్వకాయః. (పూర్వం కాయస్య) కాయశబ్దమేకత్వసంఖ్యావిశిష్టమగు ద్రవ్యమును బోధించుయవయవివాచకమగుటచే నద్దానితో పూర్వశబ్దము సమసించెను. సూత్రమున పూర్వాదులు ప్రథమానిర్దిష్టములగుటచే వానికి పూర్వనిపాతమగును. పూర్వశ్చాసౌ కాయశ్చ అని కర్మధారయసమాసమును చేసినను పూర్వకాయః మొదలగు రూపములు సిద్ధించును గాని "పూర్వంకాయస్య" అనురీతిని విగ్రహమును చెప్పునపుడు "షష్ఠీ" (706) సూ. చే సమాసము ప్రసక్తమగుటవలననా సూత్రమున షష్ఠ్యన్తము ప్రథమానిర్దిష్టమగుటవలనను కాయాదిశబ్ద

ములకు పూర్వనిపాతము ప్రసక్తమయ్యెడిని. అట్టి విగ్రహములందును పూర్వాది శబ్దములకే పూర్వనిపాతముకొఱకీ సూత్రము షష్ఠీసమాసమునకపవాదముగ రచింపబడినది. అపరకాయః (అపరం కాయస్య) అధరకాయః మొదలగురూపములనిట్లే యూహించునది. సూత్రమున "ఏకదేశినా" అనుపదము లేనిచో ఏకత్వసంఖ్యావిశిష్టద్రవ్య వాచకముతో సమాసమగుననునర్థము సంభవించును గాన "పూర్వం నాభేః కాయస్య" అనుచోట నాభిశబ్దముతోగూడ సమాసము ప్రసక్తమగును. శరీరమునకవయవభూతమగు నాభికి పూర్వభాగమని అవాక్యమునకర్థము. నాభిశబ్దమేకద్రవ్యవాచకమైనవయవివాచకము గాదు. కాననచట పూర్వనాభిశబ్దములకు సమాసమును వారింపనేకదేశినా అనుపదమావశ్యకము. పూర్వః ఛాత్రాణామ్ అనుచోట ఛాత్రశబ్దము సముదాయవాచకము. సముదాయమునందునవయవభేదము వివక్షింపబడుటవలన బహువచనము ప్రవర్తించెను. శిష్యసమూహమున పూర్వభాగమని యర్థము. ఛాత్రశబ్దమిచట సమూహబోధకము గాననేకదేశియైనది. కాని యవయవభేదమును వివక్షించుటచేనేకత్వసంఖ్యాశివిశిష్టముకాదు గానసమాసము రాదు. సూత్రమున నేకాధికరణపదము లేకున్ననీస్థలమందును సమాసము ప్రసక్తమయ్యెడిని.

"సంఖ్యావిసాయపూర్వస్య" (239) సూ. చే సాయపూర్వకమగు అహ్నశబ్దమునకు ఙిప్రత్యయముపరమగునపుడహన్నాదేశము వికల్పముగ విధింపబడెను. (సాయహ్ని-సాయాహని) సాయాహ్నశబ్దము సిద్ధమయినపిదప సంఖ్యావిసాయ సూత్రము ప్రవర్తింపవలయును గదా। అహ్నః సాయః అను విగ్రహమున షష్ఠీసమాసము ప్రవర్తించినచో అహ్నశబ్దమునకు పూర్వనిపాతమగును. సాయాహ్నశబ్దము సిద్ధింపకపోవును. సాయాహ్నశబ్దములకేకదేశిసమాసమును చేయుదమనిన సాయశబ్దమేకదేశిసమాసవిధాయకశాస్త్రమున లేకుండుటచేనది సంభవింపదు. కాన సాయపూర్వకమగు అహ్నశబ్దము లభింపకపోవుటచే నాయహన్నాదేశవిధానము వ్యర్థమై "సర్వోఽప్యేకదేశోఽహ్నా సమస్యతే" (ఏకదేశవాచకములన్నియు నహన్శబ్దముతో సమసించును.) అని జ్ఞాపనముచేయును. ఇట్లు సాయాహ్నశబ్దము లభించుటవలననహన్నాదేశవిధానము సఫలమగును. ఇట్లు జ్ఞాపనముచేయుటవలన "మధ్యాహ్నః" (అహ్నోమధ్యమ్) ఇత్యాదులందేకదేశిసమాసము సిద్ధించును. సాయాహ్నః మధ్యాహ్నః ఇత్యాదులందేకదేశిసమాసము ప్రవర్తించిన పిదప "రాజాహస్సఖిభ్యష్టచ్" (782) సూ. చే సమాసాన్తమగు టచ్ప్రత్యయము "అహ్నోఽహ్న ఏతేభ్యః" (794) సూ. చే అహ్నాదేశమునగునని యెరుగవలయును.

సంఖ్యావిసాయ సూత్రముచే "సర్వోఽప్యేకదేశః అహ్నా సమస్యతే" అను రీతిని విశేషాపేక్షమగు జ్ఞాపనమును చేయక సామాన్యముగ "సర్వ ఏకదేశః కాలేన (కాలవాచకశబ్దేన) సమస్యతే, నత్వహ్నైవ" అని జ్ఞాపనముచేయవలయును. అనగా కాలవిశేషవాచకమగు అహన్శబ్దముతోనే యనిగాక కాలసామాన్యవాచకము

లతోనేకదేశము సమసించునని చెప్పవలయునని యాశయము. కనుక మధ్యరాత్రః (రాత్రేర్మధ్యమ్) "ఉపారతాః పశ్చిమరాత్రగోచరాః" ఇత్యాదిస్థలములందేకదేశిసమాసము సిద్ధించును. ఇట్లు చెప్పకున్న పైస్థలములందహఃశబ్దము లేదుగావుననేకదేశి సమాసము రాకుండుటచే నీప్రయోగములు సిద్ధింపకుండునని కొందఱు వైయాకరణులు చెప్పిరి.

717. అర్ధం నపుంసకమ్. 2-2-2. అర్ధమ్, నపుంసకమ్।

సమాంశవాచ్యర్ధశబ్దో నిత్యం క్లీబే స ప్రాగ్వత్ (వా) ఏకవిభక్తావషష్ఠ్యన్తవచనమ్। ఏకదేశిసమాసవిషయేऽకోऽయముపసర్జనసంజ్ఞానిషేధః। తేన పంచఖట్వీత్యాది సిధ్యతి। అర్ధం పిప్పల్యా అర్ధపిప్పలీ। క్లీబే కిమ్। గ్రామార్ధః। ద్రవ్యైక్యఏవ। అర్ధం పిప్పలీనామ్॥

717. సూత్రమున అర్ధమనునపుంసకలింగనిర్దేశముచేలననే అర్ధశబ్దమునకు నపుంసకలింగము సిద్ధమగుచుండ మరలనపుంసకపదగ్రహణము నిత్యముగ నపుంసకలిఙ్గముగలదనునర్థమును బోధించును. ఖండసామాన్యవాచకమగునర్ధశబ్దము పున్నపుంసకలింగములందుండవచ్చును. సమాంశవాచియగునర్ధశబ్దము మాత్రము నిత్యనపుంసకమగును. నిత్యనపుంసలింగమగునర్ధశబ్దము అవయవివాచకముతో సమసించునని సూత్రార్థము. ఈసూత్రమునకుదాహరణభూతమైన అర్ధపిప్పలియను స్థలమున అర్ధం పిప్పల్యాః అర్ధస్య పిప్పల్యాః ఇత్యాదివిగ్రహములందు పిప్పలీశబ్దము నియతవిభక్తికమగుటచే "ఏకవిభక్తిచాऽపూర్వనిపాతే" (659) అనుసూత్రముచే నద్దానికుపసర్జనసంజ్ఞయుండుటవలన "గోస్త్రియోరుపసర్జనస్య" (660) సూత్రముచే పిప్పలీశబ్దమునకు హ్రస్వము ప్రాప్తించుచుండ తన్నివారణమునకై ఉపసర్జనసంజ్ఞానిషేధకమగు (వా) ఏకవిభక్తావషష్ఠ్యన్తవచనమనువార్తికమారబ్ధమాయెను. "ఏకవిభక్తిచ" (659) అనుసూత్రమునందు అషష్ఠ్యన్తమ్ (విగ్రహమున షష్ఠ్యన్తము నియతముగనున్నను దానికుపసర్జనసంజ్ఞయుండదు) అని చెప్పవలయును. పైస్థలమున షష్ఠ్యన్తమే నియతముగనుండుటవలన దానికుపసర్జనసంజ్ఞలేకపోవుటచేఅర్ధపిప్పలి యనుస్థలమున నభీష్టమగు హ్రస్వాభావము సిద్ధమగును. పైవార్తికముచే జేయబడిన నుపసర్జనసంజ్ఞానిషేధమేకదేశిసమాసమునందే ప్రవర్తించును గానపంచఖట్వీ ఇత్యాదిసమాసములందు పంచానాం ఖట్వానాం సమాహారః సమాహారేణ సమాహారాత్ అనురీతిగ విగ్రహములను చెప్పినపుడు ఖట్వానామ్ అనునది నియతముగ షష్ఠీవిభక్తికమైనను ఏకదేశిసమాసము గానందుననుపసర్జనసంజ్ఞానిషేధము ప్రవర్తించదు గాననిచట హ్రస్వాదులు ప్రవర్తించును. పంచఖట్వ అనియగును. పిదప జీబాదులచే పంచఖట్వీ అనియగును. షష్ఠీసమాసమునకీసూత్రమపవాదము. అర్ధపిప్పలీ. (అర్ధం పిప్పల్యాః) అవయవివాచకమగు పిప్పలీశబ్దముతో నిత్యనపుంసకమగు అర్ధశబ్దము సమసించినది. గ్రామార్ధః (గ్రామ

స్యార్థః) అనుచోటనర్థశబ్దము సమాంశవాచకముగానందున నది నిత్యనపుంసకము గాకపోవుటచే నీసూత్రముచే సమాసము ప్రవర్తించదు. ఈసూత్రములోనికిగూడ ఏకాధికరణే యనునదనువర్తించును. కావుననే అర్థం పిప్పలినామ్ అనుస్థలమున ద్రవ్యైక్యము లేకపోవుటచే సమాసము రాదు.

వివ :— ఇచటినపుంసకగ్రహణము సూత్రనిర్దేశమందు లిఙ్గవివక్ష లేదని జ్ఞాపకముకొఱకగును. "ఏచ ఇక్" (324) అను సూత్రమున "అర్థః ఏకారో ఽర్ధ ఓకారో వా స్తి" అని భాష్యకారుడు సమాంశవాచకార్థశబ్దమును పుంలిఙ్గమునగూడ ప్రయోగించుటవలననీసూత్రములోని నపుంసకపదగ్రహణము సమాంశవాచ్యర్థ శబ్దమునకు నిత్యనపుంసకగ్రహణార్థమనుటకు వలనుపడదు. అవయవవాచకము మాత్రము పుంలిఙ్గమే। గ్రామార్ధమ్ఇత్యాదులుగూడ సమప్రవిభాగమందే సాధువు లగునని కొందఱియాశయము.

718. ద్వితీయతృతీయచతుర్థ తుర్యాణ్యన్యతరస్యామ్.

2-2-3. ద్వితీయతృతీయచతుర్థతుర్యాణి, అన్యతరస్యామ్।

ఏతాన్యేకదేశినాసహ ప్రాగ్వద్వా। ద్వితీయం భిక్షాయాః ద్వితీయభిక్షా। ఏకదేశినా కిమ్। ద్వితీయం భిక్షాయా భిక్షుకస్య। అన్యతరస్యాంగ్రహణసామర్థ్యాత్ పూరణగుణేతి నిషేధం బాధిత్వా పక్షే షష్ఠీసమాసః। భిక్షాద్వితీయా॥

718. ఏకదేశినాఅనుపదమనువర్తించును. ద్వితీయ తృతీయ చతుర్థ తుర్య శబ్దములు అవయవివాచకమగుపదముతో వికల్పముగ సమసించును. ద్వితీయభిక్షా। (ద్వితీయం భిక్షాయాః) అవయవివాచకమగు భిక్షాపదాముతో ద్వితీయశబ్దము సమసించినది. ద్వితీయాదిశబ్దములు ప్రథమానిర్దిష్టములగుటచే వానికే పూర్వనిపాతము. భిక్షయొక్క రెండవభాగమని యర్థము. ఇట్లే తృతీయభిక్ష ఇత్యాదులనెఱుగవల యును. "ద్వితీయం భిక్షాయా భిక్షుకస్య" అనుచోట భిక్షాయా ద్వితీయం (భాగం) భిక్షుకస్య (జ్ఞేయం) (భిక్షయొక్క రెండవభాగము భిక్షుకునిది) అనురీతిగ ద్వితీయ పదము భిక్షుక పదముతోనన్వయించుచున్నది. కాని ద్వితీయపదార్థము భిక్షాపదార్థము యొక్క యవయవమగుటచే భిక్షాపదమే యవివాచకము కాని భిక్షుకపదము కాదుగావున ద్వితీయభిక్షుకపదములకు సమాసము వారితమగును. ఏకదేశినా అను పదమనువర్తింపకపోయినచో పైస్థలమున సమాసముప్రవర్తించెడిది. మహావిభాషాధి కారమువలననే యీసూత్రముచేవిధింపబడు సమాసమునకు పైకల్పికత్వముసిద్ధమగు చుండమరలసూత్రముననన్యతరస్యామ్ అనుపదముయొక్కగ్రహణరూపమగుసామ ర్థ్యమువలన షష్ఠీసమాసాపవాదమగునీసూత్రముచే సమాసమురానిపక్షమందు ద్వితీ యం భిక్షాయాః ఇత్యాదులందు ప్రాప్తమగు "పూరణగుణసహితార్థ" (709) అను సూత్రవిహితమగు నిషేధమును బాధించి "షష్ఠీ" (706) అను సూత్రముచే విహిత

మగు షష్ఠీసమాసము వచ్చునని తెలియదగును. షష్ఠ్యన్తమునకు పూర్వనిపాతము వచ్చును. భిక్షాద్వితీయమ్ ఇత్యాదిరూపములగును.

(ఏకదేశిసమాసము సమాప్తము)

719. ప్రాప్తాపన్నే చ ద్వితీయయా. 2-2-4. ప్రాప్తాపన్నే, చ, ద్వితీయయా (అన్యతరస్యామ్).

పక్షే ద్వితీయాశ్రితేత్యాదినా సమాసః। ప్రాప్తో జీవికాం ప్రాప్తజీవికః। జీవికాప్రాప్తః। ఆపన్నజీవికః। జీవికాపన్నః। ఇహ సూత్రే ద్వితీయయా, అ, ఇతి ఛిత్వా అకారోఽపి విధీయతే। తేన జీవికాం ప్రాప్తా స్త్రీ ప్రాప్తజీవికా। ఆపన్నజీవికా॥

719. ద్వితీయయా అనువానికి ప్రత్యయగ్రహణపరిభాషచే తదన్తవిధి వలన ద్వితీయాన్తేన అనునర్థము లభించును. ప్రాప్త ఆపన్న ఈ రెండు శబ్దములు ద్వితీయావిభక్త్యన్తముతో వికల్పముగ సమసించును. పక్షమందు ద్వితీయాశ్రితాతీత (690) సూత్రవిహితమగు ద్వితీయాతత్పురుష సమాసము ప్రవర్తించును. ఈ సూత్రమున ప్రాప్తాపన్నశబ్దములు ప్రథమాన్తములుగనిర్దేశింపబడుటచే వానికే పూర్వనిపాతము వచ్చును. ప్రాప్తజీవికః (ప్రాప్తో జీవికామ్) ఆపన్నజీవికః (ఆపన్నో జీవికాం) జీవికామ్ అనుద్వితీయాన్తముతో ప్రాప్తాపన్నశబ్దములు సమసించినవి. జీవికాశబ్దమునకు "గోస్త్రియోరుపసర్జనస్య" (660) అనుసూత్రముచే హ్రస్వమగును. ద్వితీయాతత్పురుషము వచ్చునపుడు ద్వితీయాన్తము ప్రథమానిర్దిష్టమగుటచే ద్వితీయాన్తమునకు పూర్వనిపాతమగును. జీవికాప్రాప్తః। జీవికాపన్నః। ఈ సూత్రమందు ద్వితీయయా అనుచోట కృతసంధినిర్దేశమనుకొని ద్వితీయయా + అ = అని ఛేదమునుచేసి ప్రాప్తాపన్నశబ్దములు ద్వితీయాన్తముతో సమసించును ఆశబ్దములకన్తాదేశముగ అకారముగూడ వచ్చునని యర్థమును చెప్పవలయును. ఇట్లు చెప్పుటచే జీవికాం ప్రాప్తా (స్త్రీ) అను విగ్రహమున ప్రాప్తాఅను టాబన్తముతో సమాసమునుచేయునపుడు ప్రాప్తాపన్నాశబ్దములకు అన్తాదేశముగ అకారము ప్రవర్తించుటచే ప్రాప్తజీవికా ఆపన్నజీవికా అనురూపములగును.

విప :— సూత్రములోని విధేయసముచ్చయార్థకచకారము సూత్రమందకార ప్రశ్లేషమున సూచనమగును. ప్రాప్తాపన్నశబ్దములకు సమాసము వానికన్తాదేశముగ అకారముయీ రెండును సూత్రవిధేయములనిబోధించును. ప్రాప్తాపన్నశబ్దములు టాబన్తములయినను పూర్వాన్తవద్భావముచే సమాసము గలదగునని తెలియదగును.

720. కాలాః పరిమాణినా. 2-2-5. కాలాః, పరిమాణినా।

పరిచ్ఛేద్యవాచినా సుబన్తేనసహ కాలాః సమస్యంతే। మాసోజాతస్య యస్య స మాసజాతః। ద్వ్యహజాతః। ద్వయోరహ్నోస్సమాహారో ద్వ్యహః। ద్వ్యహో జాతస్య యస్యేతి విగ్రహః। (వా) ఉత్తరపదేన పరిమాణినా ద్విగోస్సిద్ధయే బహూనాం తత్పురుషస్యోపసంఖ్యానమ్।ద్వేఅహనీ జాతస్య యస్యసః ద్వ్యహ్నజాతః। అహ్నోఽహ్నఇతి వక్ష్యమాణోఽహ్నాదేశః। పూర్వత్రతు నసంఖ్యాదేస్సమాహారేఇతి నిషేధః॥

720. పరిమీయతే యేన అనువ్యుత్పత్తిచే పరిమాణశబ్దమునకు కొలచునది అని యర్థము. పరిమాణముకలది (పరిమాణం అస్యాస్తి) పరిమాణి యనబడును. అనగా కొలవబడుచున్నది. పరిచ్ఛేద్యమని యర్థము. పరిచ్ఛేద్య వాచకమగు సుబన్తముతో కాలవిశేషవాచకములు సమసించునని సూత్రార్థము. మాసజాతః. ఇచట మాసో జాతస్య యస్య అనునది లౌకికవిగ్రహము. పరిచ్ఛేద్యవాచకమగు జాతశబ్దముతో కాలవిశేషవాచకమగు మాసశబ్దము సమసించినది. షష్ఠీసమాసము ప్రాప్తించుచుండ దానినిబాధించి కాలవాచకములకు పూర్వనిపాతనమునకై యీ సూత్రమారంభింపబడియె. మాసజాతుడన పుట్టినతరువాత నెలరోజులుగడచినవాడు అని యర్థము. కావున జాతునకు మాసము పరిచ్ఛేదకమైనది. సమాసమునకూడ జాతునకే ప్రాధాన్యమని "యస్యసః" అనుదానివలన తెలియును. అలౌకికవిగ్రహవాక్యమందుమాత్రము యస్యసః అనుదానికి ప్రవేశము లేదు. ద్వ్యహజాతః— ద్వ్యహో జాతస్య యస్యసః అనునది లౌకికవిగ్రహము. కాలవిశేషవాచకమైన ద్వ్యహశబ్దము జాతశబ్దముతో సమసించినది. ద్వయోరహ్నోస్సమాహారః అను విగ్రహమున "తద్ధితార్థోత్తరపదసమాహారేచ" అనువక్ష్యమాణసూత్రముచే సమాహారమునందు ద్విగుసమాసము. టచ్ప్రత్యయాదులవలన ద్వ్యహః అనురూపమగును.

వా— ఉత్తరపదమన సమాసముయొక్క తుదియవయవము. ఉత్తరపదమగు పరిచ్ఛేద్యవాచకముతో ద్విగుసమాసము సిద్ధించుటకై బహుపదములకు తత్పురుష సమాసము చెప్పవలయునని వార్తికార్థము. ఉదా:— ద్వ్యహ్నజాతః। ద్వే అహనీ జాతస్య యస్యసః అనునది లౌకికవిగ్రహవాక్యము. ఇచట పైవార్తికముచే మూడుపదములకు తత్పురుషము సిద్ధించును. సుబ్లుగనంతరమున ద్వ్యహన్ జాతఅనురూపమగును. ఇపుడిచట జాతశబ్దము పరిచ్ఛేద్యవాచకమగును త్తరపదమైనందున "తద్ధితార్థేత్యాదివక్ష్యమాణసూత్రవిహితమగు ద్విగుసమాసము ద్వ్యహన్ శబ్దములకు సిద్ధించును. తరువాత సమాసాన్తమగు టచ్ప్రత్యయము (792) అహ్నోఽహ్న ఏతేభ్యః (794) అనుసూత్రముచే అహ్నాదేశము ప్రవర్తించును.

ద్వ్యహ్నజాతః అనియగును. పైవార్తికములేనపుడు తద్ధితార్థేత్యాదిసూత్రముచే నుత్తరపదము పరముగునపుడు దిక్సంఖ్యావాచకములకు సుబన్తముతో సమాసము విధించినందున, ద్వే అహనీ జాతస్య ఇత్యాది విగ్రహములందు, సుప్సుపాఅను చోటనేకవచనసామర్థ్యముచేతను, కాలాః పరిమాణినా ఇత్యాదిసూత్రముంచే బహుపదములకు తత్పురుషము రాకపోవుట చేతను, ప్రపశితమగు ద్వ్యహ్నజాతః అనునది సిద్ధింపకపోయెడిని. "న సంఖ్యాదేస్సమాహారే" (787) అనువక్ష్యమాణ సూత్రముచే సమాహారమందుండు అహన్‌శబ్దమునకు అహ్నాదేశనిషేధము విధింపబడినందున ద్వ్యహజాతఃఅనుచోట అహ్నాదేశము రాదని తెలియుసది.

(ఇది షష్ఠీతత్పురుషము)

721. సప్తమీ * శౌణ్డైః. 2-1-40. సప్తమీ, శౌణ్డైః।

సప్తమ్యన్తం శౌణ్డాదిభిః ప్రాగ్వత్। అక్షేషు శౌణ్డః। అక్షశౌణ్డః। అధిశబ్దోఽత్ర పఠ్యతే। అధ్యుత్తరపదాదితి ఖః। ఈశ్వరాధీనః॥

721. సప్తమ్యన్తము, శౌణ్డాదిగణపఠితములైన సుబన్తములతో వికల్పముగ సమసించును. అక్షశౌణ్డః. (అక్షేషుశౌణ్డః) శౌండుడన కుశలుడనియర్థము. శౌణ్డాదిగణమున అధిశబ్దము పఠింపబడినది. సప్తమ్యంతము అధిశబ్దముతోగూడ సమసించును. ఈశ్వరాధీనః। (ఈశ్వరే అధి) సమాసము అధిశబ్దము ఉత్తరపదమందు గలదగుటచే "అషడక్ష" (5-4-7) అనుసూత్రముచే ఖప్రత్యయము వచ్చును. దానికి "ఆయనేయీనీ" (478) సూత్రముచే ఈనాదేశమగును.

722. సిద్ధశుష్కపక్వబన్ధైశ్చ. 2-1-41. సిద్ధశుష్కపక్వబన్ధైః, చ, (సప్తమీ).

ఏతైస్సప్తమ్యన్తం ప్రాగ్వత్। సాంకాశ్యసిద్ధః। ఆతపశుష్కః। స్థాలీపక్వః। చక్రబన్ధః॥

722. సప్తమ్యన్తము, సిద్ధ శుష్క పక్వ బన్ధ యీశబ్దములతో సమసించును. యథాక్రమముగనుదాహరణములు. సాంకాశ్యసిద్ధః (సాంకాశ్యేసిద్ధః) సాంకాశ్యనగరమందు పుట్టినవాడనియర్థము. ఆతపశుష్కః. (ఆతపేశుష్కః) స్థాలీపక్వః (స్థాల్యాంపక్వః) చక్రబన్ధః (చక్రేబన్ధః).

723. ధ్వాంక్షేణ క్షేపే. 2-1-42. ధ్వాంక్షేణ, క్షేపే, (సప్తమీ)

* శౌణ్డ ధూర్త కితవ వ్యాడ ప్రవీణ సంవీత అన్తర అధి పటు పణ్డిత కుశల చపల నిపుణ ఇతిశౌణ్డాదిః.

ధ్వాంక్షవాచినాసహ సప్తమ్యన్తం సమస్యతే నిందా యామ్। తీర్థే ధ్వాంక్షఇవ తీర్థధ్వాంక్షః। తీర్థకాకఇత్యర్థః॥

723. సూత్రములోని ధ్వాంక్షశబ్దమువలన తదర్థమును గ్రహింపవలయును. ధ్వాంక్షపర్యాయములకు గ్రహణము సిద్ధమగును. క్షేపమన నిందయనియర్థము. సప్తమ్యన్తము ధ్వాంక్షవాచియగుశబ్దముతో నిందగమ్యమానమగునపుడు సమసించును. తీర్థధ్వాంక్ష। (తీర్థే ధ్వాంక్షఇవ) ధ్వాంక్షమన కాకము. తీర్థమందుకాకివలె గురుకులమందు చిరకాలమెవడుండడో వాడుతీర్థధ్వాంక్షుడని వ్యవహరింపబడును. ఈరీతినిచట నింద ప్రతీయమానమగును. ధ్వాంక్షశబ్దముచే ధ్వాంక్షపర్యాయము లకు గ్రహణమనుటవలన తీర్థకాకః ఇత్యాదులుగూడ సాధువులగును.

724. కృత్యైర్ఋణే. 2-1-43. కృత్యైః, ఋణే, (సప్తమీ)

సప్తమ్యన్తం కృత్యప్రత్యయాన్తైస్సహ ప్రాగ్వదావ శ్యకే। మాసేదేయం ఋణమ్। పూర్వాహ్ణేగేయం సామ॥

724. ప్రత్యయగ్రహణపరిభాషచే కృత్యైః అనుపదము కృత్యప్రత్యయా న్తములకు గ్రాహకమగును. ఋణపదము ఆవశ్యకమనునర్థమునకుపలక్షణము. సప్తమ్యన్తము కృత్యప్రత్యయాన్తములతో ఆవశ్యకార్థమందు సమసించును. మాసేదేయమ్ (ఋణమ్) దేయమనునది కృత్యసంజ్ఞకమగు యత్ప్రత్యయాన్తము. "తత్పురుషే కృతిబహులమ్" (977) అనువక్ష్యమాణసూత్రముచే సప్తమీవిభక్తికి లుగభావము. మాసములోపున నవశ్యముగ నీయవలసిన ఋణమనియర్థము. పూర్వాహ్ణేగేయం (సామ) గేయమనునది యత్ప్రత్యయాన్తము. పూర్వాహ్ణమంద వశ్యముగ గానముచేయవలసిన సామమని యర్థము. ఇచటగూడ ప్రదర్శితసూత్ర ముచే సప్తమికి లుగభావము. ఋణగ్రహణమావశ్యకోపలక్షణముగనుకనే యిచట సమాసము సిద్ధించినది.

725. సంజ్ఞాయామ్. 2-1-44. (సుపా, సప్తమ్యన్తమ్)

సప్తమ్యన్తం సుపా ప్రాగ్వత్సంజ్ఞాయామ్। వాక్యేన సంజ్ఞాఽనవగమాన్నిత్యసమాసోఽయమ్। అరణ్యేతిలకాః। వనేకసేరుకాః। హలదన్తాత్సప్తమ్యా ఇత్యలుక్॥

725. సంజ్ఞయందు సప్తమ్యంతము సుబన్తముతో సమసించును. అరణ్యే తిలకాః। వనేకసేరుకాః। ఈరెండును సంజ్ఞాశబ్దములు. వాక్యమువలన పైస్థలము లందు సంజ్ఞప్రతీయమానముకాదుగాన నీసూత్రము విభాషాధికారమున పఠింప బడినదైన నీసూత్రవిహితమగు సమాసము నిత్యమని యెఱుగవలయును. సమా సమున "హలదన్తాత్సప్తమ్యాస్సంజ్ఞాయామ్" (971) అనుసూత్రముచే సప్తమికి లుగభావము.

726. క్తేనాహోరాత్రావయవాః. 2-1-46. క్తేన, అహోరాత్రావయవాః (సప్తమీ.)

అహ్నో రాత్రేశ్చావయవాస్సప్తమ్యన్తాః క్తాన్తేనసహ ప్రాగ్వత్। పూర్వాహ్ణకృతమ్। అపరరాత్రకృతమ్। అవయవగ్రహణంకిమ్। అహ్నిదృష్టమ్॥

(726) క్తేనఅనుపదము క్తప్రత్యయాన్తమునకు బోధకము. అహోరాత్రయోఽవయవాః ఆహోరాత్రావయవాః। సప్తమ్యన్తములగు అహస్సు (పగలు) యొక్కయు, రాత్రియొక్కయు అవయవవాచకశబ్దములు క్తప్రత్యయాన్తముతో సమసించును. పూర్వాహ్ణకృతమ్। (పూర్వాహ్ణేకృతమ్) ఇది అహస్సుయొక్క అవయవమునకుదాహరణము. పూర్వాహ్ణశబ్దము (పగటియందు పూర్వభాగము) అహస్సుయొక్క అవయవమును బోధించును. కృతమనునది క్తప్రత్యయాన్తము. అపరరాత్రకృతమ్. రాత్రియొక్క అవయవమునకుదాహరణము. అపరరాత్రశబ్దము (రాత్రియొక్కఅపరభాగము) రాత్రియొక్క అవయవమును బోధించును. సూత్రమున నవయవగ్రహణములేకున్న అహ్నిదృష్టమ్ అనుచోట పగటిసంతయు బోధించెడి అహ్ని అనుసప్తమ్యన్తము దృష్టమను క్తప్రత్యయాన్తముతో సమసించెడిని.

727. తత్ర. 2-1-46. (సప్తమీ, క్తేన)

తత్రేత్యేతత్సప్తమ్యన్తం క్తాన్తేనసహ ప్రాగ్వత్। తత్రభుక్తమ్।

727. తత్రఅనుసప్తమ్యన్తము క్తప్రత్యయాన్తముతో సమసించును. తత్రభుక్తమ్। భుక్తమనునది క్తప్రత్యయాన్తము. తత్రభుక్తంమొదలగునవి తత్పురుషసమాసములగుటవలన పూర్వపదప్రకృతిస్వరముసిద్ధమగును. అవ్యయే నఞ్కుని పాతానామితిపరిగణనము చేయుటచే నవ్యయమగుటవలన నిచటనిష్టస్వరసిద్ధికాకుండునని తెలియునది.

728. క్షేపే. 2-1-47. (సప్తమీ, క్తేన)

సప్తమ్యన్తం క్తాన్తేన ప్రాగ్వన్నిందాయామ్। అవతప్తేనకులస్థితం తఏతత్॥

728. క్షేపమన నింద. నిందయందు సప్తమ్యన్తము క్తప్రత్యయాన్తముతో సమసించును. అవతప్తే నకులస్థితమ్। (తఏతత్) నకులేన స్థితం, నకులస్థితమ్। ఇచట కర్తృకరణే (802) అనుసూత్రముచే సమాసము. నకులస్థితమనునది కారకపూర్వకముగావున కృద్గ్రహణపరిభాషచే క్తప్రత్యయాన్తమగును. ఇట్టిపదముతో అవతప్తేఅనుసప్తమ్యన్తము సమసించినది. తత్పురుషేకృతి (977) అనుసూత్ర

ముచే సప్తమికి లుగభావము. అవతప్తప్రదేశమందు నకులములస్థితియెట్లుచంచలమో యట్లేకార్యములను ప్రారంభించి సంపూర్తినిచేయక నిటునటుతిరుగుటయని యొకానొకయవ్యవస్థితచిత్తునిగూర్చిన నింద ఈవాక్యమువలన ప్రతీయమానమగును.

729. * పాత్రేసమితాదయశ్చ. 2-1-48. పాత్రేసమితాదయః, చ।

ఏతే నిపాత్యంతేక్షేపే। పాత్రేసమితాః। భోజనసమయఏవ సంగతా నతుకార్యే। గేహేశూరః। గేహేనర్దీ। ఆకృతిగణోఽయమ్। చకారోఽవధారణార్థః। తేనైషాం సమాసాంతరే ఘటకతయా ప్రవేశో న। పరమాః పాత్రేసమితాః॥

729. పాత్రేసమితాదిగణపఠితములగు శబ్దములు సమాసాది కార్యసహితములుగ నిపతింపబడినవి. పాత్రేసమితాః। నిపాతనమువలననే సప్తమికి లుగభావము సిద్ధించును. భోజనపాత్రము సిద్ధముగచేయబడినదగుచుండనచట సన్నిహితులగువారేగాని కార్యసమయమున సన్నిహితులు కారనునింద ప్రతీయమానమగుచున్నది. ఇట్లే గేహేశూరః ఇత్యాదులందు, గృహములందే ప్రగల్భములుపలుకువారుకాని యుద్ధాదులందట్టివారుకారనురీతిగ నిందనూహించవలయును. గేహేనర్దీ। పాత్రేసమితాదిగణమాకృతిగణము. సూత్రముననుండు చకారము నిశ్చయార్థకము. కావున నాయా శబ్దములు గణముననెట్లు పఠింపబడినవో యట్లేయుండునుగాని యితరసమాసములందు ప్రవేశమును పొందవనునర్థము లభించును. అందుచే పరమాః పాత్రేసమితాః అనుచోట కర్మధారయసమాసము నివృత్తమగును.

730. పూర్వకాలైక సర్వజరత్పురాణనవకేవలాస్సమానాధికరణేన. 2-1-49. పూర్వకాలైక..... కేవలాః, సమానాధికరణేన।

విశేషణం విశేష్యేణేతిసిద్ధే పూర్వనిపాతనియమార్థం సూత్రమ్। ఏకశబ్దస్య దిక్సంఖ్యేసంజ్ఞాయామితి నియమ

---

* పాత్రేసమితాః పాత్రేబహులాః ఉదుమ్బరకృమిః కూపకచ్ఛపః అవటకచ్ఛపః ఉదుమ్బరమశకః కూపమణ్డూకః కుమ్భమణ్డూకః ఉదపానమణ్డూకః నగరకాకః నగరవాయసః మాతరిపురుషః పిణ్డీశూరః పితరిశూరః గేహేశూరః గేహేనర్దీ గేహేవిజితీ గేహేవ్యాడః గేహేమేహీ గేహేదాహీ గేహేదృప్తః గేహేధృష్టః గర్భేతృప్తః ఆఖనికబకః గోష్ఠేశూరః గోష్ఠేవిజితీ గోష్ఠేక్ష్వేడీ గోష్ఠేపటుః గోష్ఠేపణ్డితః గోష్ఠేప్రగల్భః కర్ణేటిరిటిరా కర్ణేచురుచురా ఇతిపాత్రేసమితాదిరాకృతిగణః॥

బాధనార్థంచ। పూర్వంస్నాతః పశ్చాదనులిప్తః=స్నాతానులిప్తః। ఏకనాథః। సర్వయాజ్ఞికాః। జరన్నైయాయికాః। పురాణమీమాంసకాః। నవపాఠకాః। కేవలవైయాకరణాః॥

730. పూర్వకాలశబ్దముపూర్వకాలికమగునర్థమునుబోధించుశబ్దమునుబోధించును. ఏక సర్వ జరత్ పురాణ నవ కేవల ఈయాయశబ్దములు తత్తత్స్వరూపపరములు. సమానం (ఒకటియైన) అధికరణమ్ (అర్థము) యస్యసః అనువిగ్రహముచే సమానాధికరణపదమునకు ఏకార్థబోధకమని యర్థము. పూర్వకాలాదిసుబన్తములు సమానాధికరణమగు సుబన్తముతో సమసించునని సూత్రార్థము ఫలించును. యథాక్రమముగనుదా:—స్నాతానులిప్తః (పూర్వంస్నాతః పశ్చాదనులిప్తః) (మొదట స్నానముచేసినవాడు మరల మైపూతగలవాడునగుమనుజుడు) పూర్వకాలవృత్తియగు స్నాతశబ్దము ఏకార్థబోధకమగుఅనులిప్తశబ్దముతో సమసించినది. ఏకనాథః (ఏకశ్చాసౌనాథశ్చ) ఇచట సంఖ్యావాచకమగునేకశబ్దమునే గ్రహించునది. సర్వయాజ్ఞికాః (సర్వేచతేయాజ్ఞికాశ్చ) యాజ్ఞికులన యజ్ఞమును దెలిసినవారు) జరన్నైయాయికాః (జరన్తశ్చతేనైయాయికాః) పురాణమీమాంసకాః। నవపాఠకాః। పురాణశబ్దసాహచర్యమువలన నూతనార్థకనవశబ్దమునకే గ్రహణముగాని సంఖ్యావాచకమునకు గ్రహణములేదు. కేవలవైయాకరణాః। పై ఉదాహరణములందు "విశేషణంవిశేష్యేణ బహులమ్" (740) అనుసూత్రముచే సమాసము సిద్ధమగుచున్నది. అయినను పైస్థలములందు విశేషణవిశేష్యభావమనియతమగుటచేనాసూత్రముచే సమాసము ప్రవర్తించిన పూర్వనిపాతమాయాశబ్దములకు నియతముగ సంభవింపదుగాన నాయాశబ్దములకు పూర్వనిపాతనియమమునకై యీసూత్రమారంభింపబడెను. మఱియునేకశబ్దమునకు దిక్సంఖ్యేసంజ్ఞాయామ్" అనుఅనన్తర సూత్రముచే విధింపబడునియమమునుబాధించుటకై గూడ సూత్రారంభమని యెరుగవలయును.

731. దిక్సంఖ్యే సంజ్ఞాయామ్. 2-1-50. దిక్సంఖ్యే, సంజ్ఞాయామ్॥

సమానాధికరణేనేత్యాపాదపరిసమాప్తేరధికారః। సంజ్ఞాయామేవేతి నియమార్థంసూత్రమ్। పూర్వేషుకామశమీ। సప్తర్షయః। నేహ। ఉత్తరావృక్షాః। పంచబ్రాహ్మణాః॥

731. పూర్వకాలైకసూత్రమందలి సమానాధికరణేనఅనునది పాదసమాప్తిపర్యంతమనువర్తించును. దిగ్వాచకసంఖ్యావాచకశబ్దములు సంజ్ఞయందు సమానాధికరణమగుసుబన్తముతో సమసించునని సూత్రార్థము. "విశేషణం విశేష్యేణ" (740) అనుసూత్రముచేతనే యీసూత్రోదాహరణములందు సమాసముసిద్ధించుచుండ నీసూత్రము దిక్సంఖ్యావాచకములు సంజ్ఞయందే సమసించుననునియమార్థ

మగును. పూర్వేషుకామశమీ। దిగ్వాచకశబ్దము (పూర్వ) ఇషుకామశమీశబ్దముతో
సమసించినది. ఇదియొక దేశమునకు సంజ్ఞ. సంఖ్యావాచకమునకుదాహరణము:—
సప్తర్షయః। అత్ర్యాదిసప్తఋషులకిదిసంజ్ఞ. ఉత్తరా వృక్షాః। ఇదిసంజ్ఞకానందున ఉత్తర
శబ్దము వృక్షశబ్దముతో సమసించుటలేదు. పంచబ్రాహ్మణాః। ఇదికూడ సంజ్ఞకాక
పోవుటచే సంఖ్యావాచకము బ్రాహ్మణశబ్దముతో సమసించలేదు.

732. తద్ధితార్థోత్తరపదసమాహారే చ. 2-1-51. తద్ధితార్థో....
....సమాహారే, చ (దిక్సంఖ్యే)

తద్ధితార్థే విషయే. ఉత్తరపదే చ పరతః, సమాహారే చ
వాచ్యే, దిక్సంఖ్యే ప్రాగ్వత్। పూర్వస్యాంశాలాయాం భవః
పౌర్వశాలః। సమాసే కృతే దిక్పూర్వపదాదసంజ్ఞాయాం ఞ
ఇతి ఞః (వా) సర్వనామ్నో వృత్తిమాత్రే పుంవద్భావః।
ఆపరశాలః। పూర్వాశాలా ప్రియాయస్యేతి, త్రిపదే బహు
వ్రీహౌ కృతే ప్రియాశబ్దే ఉత్తరపదే పూర్వయోస్తత్పురుషః।
తేన శాలాశబ్దే ఆకార ఉదాత్తః। పూర్వశాలాప్రియః। దిక్షు
సమాహారో నాస్త్యనభిధానాత్। సంఖ్యాయాస్తద్ధితార్థే। షణ్ణాం
మాతౄణామపత్యం షాణ్మాతురః। పఞ్చగావో ధనం
యస్యేతి త్రిపదే బహువ్రీహౌ అవాన్తరతత్పురుషస్య వికల్పే
ప్రాప్తే, ద్వన్ద్వతత్పురుషయోరుత్తరపదే నిత్యసమాసవచ
నమ్॥

732. సూత్రమున తద్ధితార్థము ఉత్తరపదము సమాహారము వీనికి
ద్వన్ద్వము. ఇచట సప్తమి వైషయికాధారబోధకము. విషయత్వమనేకవిధము.
తద్ధితప్రత్యయార్థము విషయమగునపుడు (అనగా తద్ధితప్రత్యయము వివక్షితమగు
నపుడు) ఉత్తరపదము పరముగనున్నపుడు, సమాహారము (సమూహము) వాచ్య
మగునపుడును, దిగ్వాచకసంఖ్యావాచకములు సమానాధికరణమగు సుబన్తముతో
సమసించును. దిగ్వాచకశబ్దమునకు తద్ధితార్థమందుదాహరణము. పౌర్వశాలః।
(పూర్వస్యాంశాలాయాంభవః) సమాసానన్తరము "దిక్పూర్వపదాదసంజ్ఞాయాంఞః"
(4-2-107) అనుసూత్రముచే ఞప్రత్యయము (తద్ధిత) ప్రవర్తించును. ఆదివృద్ధి
మొదలగు తద్ధిత ప్రత్యయనిమిత్తకకార్యములు ప్రవర్తించును, (వా) కృత్తద్ధిత
సమాసైకశేషసనాద్యన్తధాతురూపములయిదును, వృత్తులనిముందు చెప్ప
బడును. అట్టి వృత్తులలోనుండు సర్వనామశబ్దమునకు పుంవద్భావమగును.
ప్రకృతమున సమాసవృత్తియందున్న పూర్వాశబ్దమునకు పుంవద్భావము.
ఇట్లే అపరశాలః। (అపరస్యాంశాలాయాంభవః) పుంవద్భావమిచటగూడ
ప్రవర్తించును. ఉత్తరపదముపరమగునపుడు దిక్శబ్దము సమానాధికరణ
ముతో సమసించుననుటకుదాహరణము. పూర్వశాలాప్రియః। ఇచట పూర్వా

శాలాప్రియాయస్యసః అనువిగ్రహమున త్రిపదబహువ్రీహిచేసిన తరువాత సుబ్లుగాద్యనన్తరము ప్రియాశబ్దముత్తరపదమగుచుండ పూర్వాశబ్దశాలాశబ్దములకీ సూత్రముచే తత్పురుషసమాసము. ఇట్లవాంతరతత్పురుషముచేసినందున సమాసముయొక్క అంతముదాత్తమగునుగాన శాలాశబ్దమందలి ఆకారమునకుదాత్తస్వరము సిద్ధమగును. బహువ్రీహిసమాసముచేతనే సిద్ధించుచుండ పరలక్షీనిచే నవాంతరతత్పురుషసమాసమునకిదియే ప్రయోజనము అనభిధానము (శిష్టప్రయోగములేకుండుట) వలన దిగ్వాచకములకు సమాహారమందు సమాసములేదని గ్రహించునది. సంఖ్యావాచకమునకు తద్ధితార్థమందుదాహరణము:—షాణ్మాతురః। (షణ్ణాంమాతౄణామపత్యం) సమాసానన్తరము "మాతురుత్సంఖ్యాసంభద్రపూర్వాయాః" (4-1-115) అనుసూత్రముచే అణాదులు. ఆదివృద్ధి. సంఖ్యావాచకమగు షట్ శబ్దము తద్ధితార్థమందు సమానాధికరణమగు మాతృశబ్దముతో సమసించెను. ఉత్తరపదమువరమగునపుడు సంఖ్యావాచకమునకుదాహరణము. పంచగవధనః। ఇచట పఞ్చగావోధనంయస్య అనువిగ్రహమందు త్రిపదబహువ్రీహిచేసినపిమ్మట ధనశబ్దముత్తరపదమగుచుండ పూర్వమందుండు పఞ్చన్‌శబ్దగోశబ్దములకీసూత్రముచే విధింపబడుసమాసము మహావిభాషాధికారవిహితమగుటవలన వికల్పముగ ప్రాప్తించుచున్నది. అట్లయిన తత్పురుషములేనిపక్షమందు, విధింపబోవుటచ్ప్రత్యయము ప్రవర్తించదుగాన పఞ్చగోధనః అనురూపముగూడ కావలసివచ్చును. కావుననిచ్చోట సమాసనిత్యత్వమునకై వార్తికమును జూపుచున్నాడు. (వా) "ద్వన్ద్వ.........వచనమ్" ఉత్తరపదమువరమగునపుడు ద్వన్ద్వతత్పురుషసమాసములు నిత్యములగునని చెప్పవలయుననివార్తికార్థము.

783. గోరతద్ధితలుకి, 5-4-92. గోః, అతద్ధితలుకి, (తత్పురుషస్య. టచ్.)

గోఽన్తాత్తత్పురుషాట్టచ్స్యాత్సమాసాన్తో నతద్ధితలుకి।
పఞ్చగవధనః। పంచానాంగవాంసమాహారః॥

783. తత్పురుషస్య అనునది పంచమ్యన్తముగ విపరిణామమునొందును. గోః అనుదానికది విశేష్యము. తదన్తవిధి. గోశబ్దాన్తమగు తత్పురుషముకంటె పరముగ సమాసాన్తమగు (సమాసాన్తాః అనిఅధికారము) టచ్ ప్రత్యయమగును, తద్ధితలుక్కునకు విషయమగునపుడుమాత్రమది ప్రవర్తించదు. ప్రకృతమున "పఞ్చగోధనః" అనుచోట గోశబ్దముకంటె పరముగటచ్ప్రత్యయము వచ్చును. అవాదేశము ప్రవర్తించును. పంచగవధనః అనియగును. సమాహారమందు సంఖ్యావాచకపూర్వపదసమాసమునకుదాహరణము:—పఞ్చగవమ్। (పఞ్చానాంగవాం సమాహారః) ఇచట సమాసమువచ్చినపిదప ఈసూత్రముచే టచ్ప్రత్యయము, అవాదేశముప్రవర్తించిన పఞ్చగవమనురూపము సిద్ధించును.

734. సంఖ్యాపూర్వో ద్విగుః. 2-1-52. సంఖ్యాపూర్వః, ద్విగుః।

తద్ధితార్థేత్యత్రోక్తస్సంఖ్యాపూర్వోద్విగుస్స్యాత్॥

734. తద్ధితార్థోత్తరపదసమాహారేచ అనుసూత్రముచే తద్ధితార్థము విషయమగునపుడు ఉత్తరపదము పరమగునపుడు సమాహారము వాచ్యమగునపుడును విధింపబడినసంఖ్యాపూర్వకసమాసము ద్విగుసంజ్ఞకమగును.

735. ద్విగురేకవచనమ్. 2-4-1. ద్విగుః, ఏకవచనమ్।

ద్విగ్వర్థస్సమాహార ఏకవత్స్యాత్। సనపుంసకమితి నపుంసకత్వమ్। పఞ్చానాంగవాంసమాహారః పఞ్చగవమ్॥

735. ద్విగుసమాసమునకర్థమైన సమాహారమేకవద్భావమునొందును. సమాహారద్విగుసమాసమేకార్థప్రతిపాదకమగునని ఫలితమగును. అపూర్వముగ ద్విగుసమాససామాన్యమునకీసూత్రమేకవద్భావమును విధించుననుటకంటె సమాహారమందుండుటయేకత్వమననువదించి సమాహారద్విగువునకే మేకవద్భావమువిధించినన లాఘవము సంభవించును. ఇట్లుసిద్ధమైనదే యీయర్థమున "సమాహారః" అనునదని గ్రహించునది. పఞ్చగవఅనుదానికి పూర్వసూత్రముచే ద్విగుసంజ్ఞయు నీసూత్రముచే తదర్థమగు సమాహారమునకేకవద్భావము సిద్ధింప "సనపుంసకం" (825) అనుసూత్రముచే నపుంసకలిఙ్గమువచ్చును. పఞ్చగవమ్ అనురూపము ఫలితమగును.

736. కుత్సితాని కుత్సనైః. 2-1-53. కుత్సితాని, కుత్సనైః।

కుత్స్యమానాని కుత్సనైస్సహ ప్రాగ్వత్। వైయాకరణఖసూచిః। మీమాంసకదుర్దురూఢః॥

736. కుత్సయన నింద. కుత్స్యమానబోధకములగు శబ్దములు (నిందింపబడువ్యక్తిని ప్రతిపాదించుశబ్దములు) సమానాధికరణములగు కుత్సనశబ్దములతో (నిందాహేతుకశబ్దములతో)సమసించును. ఉదా:—వైయాకరణఖసూచిః, (వైయాకరణశ్చాసౌఖసూచిశ్చ) ఇచటనిందింపబడువ్యక్తి వైయాకరణుడు తత్ప్రతిపాదకము వైయాకరణశబ్దము. అదినిందాహేతుకమగు ఖసూచిశబ్దముతో సమసించినది. ప్రశ్నన డిగినవెంటనే సమాధానము తెలియక దానిని మరపింపజేయుటకెవడాకసమును జూచునోవాడు ఖసూచియనబడును. ఇట్టి ఖసూచనము నిందాకారణము. మీమాంసకదుర్దురూఢః। దుర్దురూఢపదము దుష్టకర్మనుచేయువానియందు రూఢము. విశేష్యమునకు పూర్వనిపాతము కొఱకీసూత్రమారంభింపబడెను.

737. పాపాణకేకుత్సితైః. 2-1-54. పాపాణకే, కుత్సితైః।

పూర్వసూత్రాపవాదః। పాపనాపితః। అణకకులాలః॥

737. పాపశబ్దము అణకశబ్దమును సమానాధికరణములగు కుత్స్యమానశబ్దములతో సమసించును. పూర్వసూత్రమునకిది యపవాదము. పాపశబ్దము పాపముగల వానిని బోధించును. అణకశబ్దము కురూపిని బోధించును. కనుకనీరెండుశబ్దములు కుత్సనశబ్దములగుటచే పూర్వసూత్రముచే సమాసమువచ్చినచో వీనికి పరనిపాతము ప్రాప్తించును. అందువలన పూర్వసూత్రమునుబాధించి యీశబ్దములకు పూర్వనిపాతముకొఱకై యీసూత్రమారంభింపబడినదని భావము, ఉదా:—పాపనాపితః (పాపశ్చాసౌ నాపితశ్చ) (పాపముగలమంగలి) అణకకులాలః (కురూపియైన కుమ్మరి)

738. ఉపమానాని సామాన్యవచనైః. 2-1-55. ఉపమానాని, సామాన్యవచనైః.

ఘనఇవశ్యామో ఘనశ్యామః। ఇహ పూర్వపదం తత్సదృశే లాక్షణికమితి ద్యోతయితుం లౌకికవిగ్రహే ఇవశబ్దః ప్రయుజ్యతే। పూర్వనిపాతనియమార్థంసూత్రమ్॥

738. ఉపమానమన సాదృశ్యనిరూపకము. ఉపమీయతేయేన వస్త్వంతరం అనువ్యుత్పత్తివలననుపమానశబ్దమునకు, ఏదిస్వవృత్తిధర్మముచే మరియొకవస్తువును పరిచ్ఛిన్నమగునట్లుచేయునో అట్టిపరిచ్ఛేదకమగు వస్తువర్థమనిలభించును. "చన్ద్రఇవముఖం" అనుచోట చంద్రునిచే స్వవృత్తి ధర్మము. (వర్తులత్వం)వలన ముఖము పరిచ్ఛిన్నమగుచున్నదిగాన చంద్రుడుపమానమగును. ఉపమానమును బోధించు శబ్దములనీసూత్రములోని ఉపమానపదమువలన గ్రహింపబడును. సాదృశ్యముచేపరిచ్ఛేద్యమగువస్తువు ఉపమేయము. (సాదృశ్యాశ్రయము) చంద్రఇవముఖమనుస్థలమందు ముఖముపమేయమగును. ఉపమానమందునుపమేయమునందునుండునట్టి సమానధర్మము సామాన్యమనబడును. సామాన్యమును ప్రతిపాదించుశబ్దములు సామాన్యవచనములు. ఉపమానశబ్దములు (ఉపమానత్వేన బోధకాని) సమానధర్మమును చెప్పునట్టియు ప్రకృతమునట్టిధర్మసహితమగువ్యక్తిని బోధించునట్టియునగు సమానాధికరణశబ్దములతో సమసించునని సూత్రార్థముఫలితమగును. ఉదా:—ఘనశ్యామః। (ఘనఇవశ్యామః) పురుషుడు. ఇచట ఘనశబ్దము సమానవాచకము. శ్యామత్వము సామాన్యధర్మము. శ్యామశబ్దము సామాన్యధర్మముతో కూడుకొన్నవ్యక్తిని బోధించుచున్నది. గానసామాన్యవచనమైనది. లౌకికవిగ్రహమున ఇవశబ్దము, పూర్వపదము తత్సదృశమందు లాక్షణికమని తెలుపుటకుప్రయోగింపబడినది. కాన ఘనశబ్దము ఘనసదృశమునులక్షచే బోధించును. అందుచే ఘనశ్యామశబ్దములకు సామానాధికరణ్యము నిర్బాధమగును. విశేషణంవిశేష్యేణబహులమ్ (741) అను సూత్రముచేతనే ఏతత్సూత్రోదాహరణములందు సమాసము సిద్ధించుచుండ మరలనీసూత్రారంభము ఉపమానమునకు పూర్వనిపాతార్థమగును. లేకున్న ఘనశ్యామః ఇత్యాదులలోనుపమాన సామాన్య

వాచకములు రెండును గుణవాచకములగుటచే విశేషణవిశేష్యభావమనియతమగును గాన ఉపమానమునకే పూర్వనిపాతమనునియమమునకవకాశము లేకపోవును.

739. ఉపమితం * వ్యాఘ్రాదిభిః సామాన్యాప్రయోగే. 2-1-56. ఉపమితం, వ్యాఘ్రాదిభిః, సామాన్యాప్రయోగే,

ఉపమేయం వ్యాఘ్రాదిభిస్సహ ప్రాగ్వత్సాధారణధర్మస్యాఽప్రయోగేసతి। విశేష్యస్య పూర్వనిపాతార్థం సూత్రం। పురుషవ్యాఘ్రః। నృసోమః। వ్యాఘ్రాదిరాకృతిగణః। సామాన్యాఽప్రయోగేకిమ్। పురుషోవ్యాఘ్రఇవశూరః।

739. ఉపమితమనను ఉపమేయము, ఉపమానముచే పరిచ్ఛేద్యము. (సాదృశ్యాశ్రయము) ఉపమేయవాచకము సమానాధికరణమగు వ్యాఘ్రాదిగణపఠితశబ్దములతోనుపమానోపమేయసాధారణమగుధర్మమును బోధించుపదము ప్రయోగింపబడనపుడు సమసించును. ఉపమేయమునకు నిత్యముగనుపమానాకాంక్షయుండును గాన "వ్యాఘ్రాదిభిః" అను పదమువలన నుపమానభూతములగు వ్యాఘ్రాదులతోననెడియర్థము ఫలించును. ఉపమానోపమేయసమభివ్యాహారమునను ఉపమానము విశేషణమగునను నియమము కలదు. దీనిచేనుపమేయము విశేష్యమగును గాన "విశేషణం విశేష్యేణ బహులమ్" (740) సూ. చే సమాసము ప్రవర్తించిననుపమేయమునకు పూర్వనిపాతము లభింపదు కావున తల్లాభమునకై యీసూత్రమారంభింపబడెనని యెరుంగవయులను. ఉదా:—పురుషవ్యాఘ్రః। (పురుషోవ్యాఘ్రఇవ) పెద్దపులివంటి మనుజుడు. వ్యాఘ్రముపమానము పురుషుడుపమేయము. ఉపమానోపమేయసాధారణధర్మవాచకములగు శూరః క్రూరః ఇత్యాదిపదము లేవియు ప్రయోగింపబడలేదు. నృసోమః (నా సోమ ఇవ) వ్యాఘ్రాదిగణమాకృతిగణము. సామాన్యాప్రయోగే అనునదిలేనిచో పురుషో వ్యాఘ్ర ఇవ శూరః। అను సామాన్యధర్మము ప్రయోగింపబడిన స్థలములందును సమాసము ప్రసక్తమయ్యెడిని.

740. విశేషణం విశేష్యేణ బహులమ్. 2-1-52. విశేషణం, విశేష్యేణ, బహులమ్।

భేదకం సమానాధికరణేన భేద్యేన బహులం ప్రాగ్వత్। నీలముత్పలం నీలోత్పలమ్। బహులగ్రహణాత్క్వచిన్నిత్యమ్। కృష్ణసర్పః। క్వచిన్న। రామో జామదగ్న్యః॥

740. ఇతరవస్తువునుండి భేదింపజేయునది విశేషణము (విశిష్యతేఽనేన) భేదింపబడినది విశేష్యము. అందువలననే వ్యావర్తకం భేదకమ్ మొదలగు విశేషణ

* వ్యాఘ్ర సింహ ఋక్ష ఋషభ చన్దన వృక వృష వరాహ హస్తిన్ తరు వృషత్ పుణ్డరీక పలాశ కితవ ఇతి వ్యాఘ్రాదిరాకృతిగణః। తేన ఘనశ్యామః నృసోమః ముఖపద్మమ్ ముఖకమలమ్ కరకిసలయమ్ పార్థివచన్ద్ర ఇత్యాదిసిద్ధమ్॥

పర్యాయములును, వ్యావర్త్యం భేద్యం మొదలగు విశేష్యపర్యాయములును యుక్తములగుచున్నవి. విశేషణము (వ్యావర్తకవాచకము) సమానాధికరణమగు విశేష్యముతో (వ్యావర్త్యవాచకముతో) బహులముగ సమసించునని సూత్రార్థము. ఉదా:— నీలోత్పలమ్ (నీలం చ తదుత్పలం చ) అని విగ్రహము. ఇచట నీల పదము, ఉత్పలమును (కలువ) నీలభిన్నములగువానినుండి వేరుచేయుచున్నది గాన నదివిశేషణము. ఉత్పలము వేరుచేయబడునుగానతద్వాచకము విశేష్యము. రెండుపదములు నేకార్థవృత్తులగుటంజేసి సమానాధికరణములగును. విశేషణము ప్రథమానిర్దిష్టమగుటచేదానికి పూర్వనిపాతము. వాగ్రహణమువలననేవికల్పము సిద్ధించుచుండ దానిని విడిచి బహూనర్థాన్ లాతి (అనేకములగు నర్థములను గ్రహించునది) అనునర్థముగల బహులగ్రహణమువలన నీసమాసము కొన్నిచోటులందునిత్యముగవచ్చుననియు కొన్నిస్థలములందు రానేరాదనియు తెలియనగును. కృష్ణసర్పః కృష్ణస్సర్పః = నల్లనిపాము) ఇచ్చోట సమాసము నిత్యము. రామో జామదగ్న్యః అనుచోట సమాసము ప్రవర్తింపదు.

741. పూర్వాపరప్రథమచరమజఘన్యసమానమధ్యమధ్యమవీరాశ్చ. 2-1-58. పూర్వాపర............వీరాః, చ (బహులమ్)

పూర్వనిపాతనియమార్థమిదమ్। పూర్వవైయాకరణః। అపరాధ్యాపకః (వా) అపరస్యార్ధే పశ్చభావో వక్తవ్యః। అపరశ్చాసావర్ధశ్చ పశ్చార్ధః। కథమేకవీర ఇతి। పూర్వకాలైక ఇతి బాధిత్వా పరత్వాదనేన సమాసే వీరైక ఇతి హి స్యాత్। బహులగ్రహణాద్భవిష్యతి॥

(741) పూర్వ అపర ప్రథమ చరమ జఘన్య సమాన మధ్య మధ్యమవీర యీశబ్దములు సమానాధికరణమగు సుబన్తముతో బహులముగ సమసించును. పూర్వసూత్రముచేతనేసమాసము సిద్ధించుచుండ నీసూత్రారంభము పూర్వాదులకు పూర్వనిపాతార్థము. ఉదా:—పూర్వవైయాకరణః। (పూర్వశ్చాసౌ వైయాకరణశ్చ) ఇట్లే అపరాధ్యాపకః అనునది (వా) అపరశబ్దమునకర్ధశబ్దము పరమగునపుడు పశ్చాదేశమగును. పశ్చార్ధః (అపరశ్చాసావర్ధశ్చ) అపరశబ్దమునకర్ధశబ్దముతో సమాసము. అపరశబ్దమునకు పశ్చాదేశము. ప్రథమనైయాయికః। మొదలగునుదాహరణముల నిట్లే యూహింపవలయును. వీరశ్చాసావేకశ్చ అనువిగ్రహమున నీసూత్రముచే వీరశబ్దమునకు సమానాధికరణమగునేకశబ్దముతో సమాసమువచ్చిన వీరశబ్దమునకు పూర్వనిపాతమువలన "వీరైకః" అనురూపము కావలయును. అంతియకాని ఏకవీరః యనిసిద్ధింపదు. ఈసూత్రము పరమగుటచే పూర్వకాలైకేత్యాదిసూత్రమును బాధించును గానపూర్వకాలైకసర్వజరదిత్యాదిసూత్రముచేనేకశబ్దమునకు వీరశబ్దముతో సమాసముచేసిన పైరూపము సిద్ధించునని చెప్పుటకవకాశములేదు. కావున ఏకవీరః అనురూపమెట్లు సాధువగునని శంక కల్గును.

పై సూత్రమునుండి యనువృత్తమైన బహులగ్రహణముచే కొన్నిస్థలములందీ సూత్రము ప్రవర్తింపదనునర్థములభించును గాన పైస్థలమునందీసూత్రము ప్రవర్తింపదు. అపుడు పూర్వకాలైకేత్యాదిసూత్రముచే సమాసము చేసిననభీష్టరూపము సిద్ధమగునని సమాధానాశయము.

వివ:—బహుళగ్రహణానువృత్తివలన పూర్వాదులకు క్రియాశబ్దములగు పాచకాదులతో సమాసము రాదని సమర్థసూత్రభాష్యమున చెప్పబడెను. అధ్యాపక శబ్దము క్రియావాచకమగుటచే నపరాధ్యాపకః అను నుదాహరణముచితముగాదు. అపరమీమాంసకః అనునుదాహరణముచితమని గ్రహించునది.

742. * శ్రేణ్యాదయః ** కృతాదిభిః. 2-1-59. శ్రేణ్యాదయః, కృతాదిభిః।

(వా) శ్రేణ్యాదిషు చ్వ్యర్థవచనం కర్తవ్యమ్। అశ్రేణయః శ్రేణయః కృతాః శ్రేణీకృతాః॥

742. శ్రేణ్యాదిగణపఠితములగు శబ్దములు సమానాధికరణములగు కృతాదిగణపఠితశబ్దములతో సమసించును. (వా) చ్విప్రత్యయార్థమగు అభూతతద్భావము ప్రతీయమానమగునపుడు శ్రేణ్యాదులకు సమాసమగునని చెప్పవలయును. ఉదా:- శ్రేణీకృతాః (అశ్రేణయః శ్రేణయః కృతాః) శ్రేణియన నొకశిల్పముచే జీవించు వారిసంఘము. ఇదివరకు శ్రేణులుకానివారు ప్రస్తుతమట్టివారుగ జేయబడిరి అనెడి చ్విప్రత్యయార్థము గమ్యమానమగుచున్నందున సమాసము ప్రవర్తించినది. ఇట్లే తద్గణపఠితములైనవానికుదాహరణములనూహింపవలయును. కృతాదిగణమాకృతిగణము.

743. క్తేన నఞ్విశిష్టేనాఽనఞ్. 2-1-60. క్తేన, నఞ్విశిష్టేన, అనఞ్।

నఞ్విశిష్టేన క్తాన్తేనాఽనఞ్ క్తాన్తం సమస్యతే। కృతం చ తదకృతం చ కృతాకృతం। (వా) *** శాకపార్థి

---

* శ్రేణీ ఏక పూగ ముకున్ద రాశి విషయ నిచయ నిధన పర ఇన్ద్ర దేవ ముణ్డ భూతశ్రవణ వదాన్య అధ్యాపక అభిరూపక బ్రాహ్మణ క్షత్రియ పటు పణ్డిత కుశల చపల నిపుణ కృపణ ఇతిశ్రేణ్యాదయః॥

** కృత మిత భూత మత ఉక్త సమాజ్ఞాత సమామ్నాత సమాఖ్యాతసంభావిత అవధారిత నిరాకృత అవకల్పిత ఉపకృత ఉపాకృత। ఇతికృతాదిరాకృతిగణః॥ తేన దృష్టకలిత దళిత ఉదాహృత విశ్రుత ఉదిత ఏతే జ్ఞేయాః॥

*** శాకపార్థివ కుతపసౌశ్రుత అజాతౌల్వలి. ఆకృతిగణోఽయమ్। తేన కృతాఽపకృత భుక్తవిభుక్త పీతవిపీత గతప్రత్యాగత యాతానుయాత క్రయాక్రయిక పుటాపుటికా ఫలాఽఫలికా మనోన్మానికా ఇత్యాదిర్జ్ఞేయాః॥

వాదీనాం సిద్ధయే ఉత్తరపదలోపస్యోపసంఖ్యానమ్। శాక
ప్రియః పార్థివః శాకపార్థివః। దేవబ్రాహ్మణః॥

743. నఞ్విశిష్టేన అనునది క్తేన అనుదానికి విశేషణము. విశిష్టశబ్దమధి కార్థకము. నఞ్మాత్రముచేనధికమగు క్తాన్తముతో నఞ్రహితమగు క్తప్రత్యయాన్తము సమసించును. కృతాకృతమ్। (కృతం చ తద కృతం చ) పూర్వనిపాత నియమమునకీసూత్రారంభము. (వా) శాకపార్థివః దేవబ్రాహ్మణః మొదలగురూపములసిద్ధికై ఉత్తరపదలోపమును చెప్పవలయును. శాకపార్థివః (శాకప్రియశ్చాసౌ పార్థివశ్చ) "విశేషణం విశేష్యేణ" అనుసూత్రముచే సమాసము. శాకప్రియః అనునది బహువ్రీహి సమాసము. పిదప దీనికి పార్థివశబ్దముతో తత్పురుషము. ఉత్తరపదమగు ప్రియశబ్దమునకు లోపము ప్రవర్తించునని యెరుగవలయును. ఇట్లే దేవపూజకో బ్రాహ్మణః దేవబ్రాహ్మణః మొదలగు రూపములందును ప్రక్రియ నెఱుగునది.

వివ:— క్తేన అనునది విభక్తివిపరిణామముచే అనఞ్ అనుదానితోగూడ నన్వయించును. కావుననీసమాసము పూర్వోత్తరపదములేక ప్రకృతికక్తాన్తములయినపుడే ప్రవర్తించును. కృతాభుక్తమిత్యాదిసమాసము లసాధువులని యెరుగవలయును.

744. సన్మహత్పరమోత్తమోత్కృష్టాః పూజ్యమానైః. 2-1-61.
సన్మహత్పరమోత్తమోత్కృష్టాః, పూజ్యమానైః।

సద్వైద్యః। వక్ష్యమాణేన మహత ఆకారః। మహా
వైయాకరణః। పూజ్యమానైః కిమ్। ఉత్కృష్టో గౌః।
పఙ్కాదుద్ధృత ఇత్యర్థః॥

744. సత్ మహత్ పరమ ఉత్తమ ఉత్కృష్ట శబ్దములు పూజ్యమాన బోధకశబ్దములతో సమసించును. సద్వైద్యః। (సంశ్చాసౌ వైద్యశ్చ) మంచివైద్యుడనగా చికిత్సాజ్ఞానము బాగుగనున్నవాడని యర్థము. వైద్యశబ్దము పూజ్యమాన వ్యక్తిబోధకము. మహావైయాకరణః। (మహాంశ్చాసౌ వైయాకరణశ్చ) సమాసానంతరముమహచ్ఛబ్దమునకు "ఆన్మహతః" (811) సూ. చే ఆకారమన్తాదేశమగును. ఇట్లే ఉత్కృష్టమీమాంసకః మొదలగువానినూహింపవలయును. సూత్రమున పూజ్యమానైః అనునది లేనిచో ఉత్కృష్టో గౌఃఅనుచోట నతిశయవాచిగాక పంకమునుండి పైకితీయబడినదనునర్థమును బోధించునుత్కృష్టశబ్దమునకు గోశబ్దముతో సమాసము ప్రసక్తమయ్యెడిని. సదాదిశబ్దములకు పూర్వనిపాతమునకై యీసూత్రారంభము.

745. బృన్దారకనాగకుఞ్జరైః పూజ్యమానమ్. 2-1-62.
బృన్దారకనాగకుఞ్జరైః, పూజ్యమానమ్।

గోబృన్దారకః। వ్యాఘ్రాదేరాకృతిగణత్వాదేవ సిద్ధే సామాన్యప్రయోగార్థం వచనమ్॥

745. పూజ్యమానవ్యక్తిబోధకమగుశబ్దము (పూజింపబడునట్టి వ్యక్తిని బోధించునది) సమానాధికరణములగు బృందారకనాగకుంజరశబ్దములతో సమసించును. గోబృందారకః। (గౌః బృందారక ఇవ) బృందారకశబ్దము దేవజాతివాచకము. బృందారకశబ్దముచే గోవునకుత్తమత్వము గమ్యమానమగుచున్నది. ఇట్లే గోనాగః పురుషకుంజరః। ఇత్యాదులనూహించవలయును. కుంజరాదిశబ్దములచే శ్రైష్ఠ్యము ప్రతీయమానమగును గాన పురుషాదిశబ్దములు పూజ్యమానబోధకములగును. వ్యాఘ్రాదిగణమాకృతిగణము గావున "ఉపమితం వ్యాఘ్రాదిభిః" (739) అను సూత్రముచేతనే పై చోటులందు సమాసము సిద్ధమగుచుండ నీసూత్రారంభము సామాన్యధర్మవాచకములకు ప్రయోగమున్నను సమాససిద్ధికొఱకని యెఱుంగునది. (గోకుంజరః స్థూలః).

746. కతరకతమౌ జాతిపరిప్రశ్నే. 2-1-63. కతరకతమౌ, జాతిపరిప్రశ్నే॥

కతరకఠః। కతమకలాపః। గోత్రం చ చరణైస్సహ ఇతిజాతిత్వమ్॥

746. జాతిపరిప్రశ్నము గమ్యమానమగునపుడు కతరకతమశబ్దములు సమానాధికరణమగు సుబన్తముతో సమసించును. కతరకఠః। (కతరః కఠః) కఠప్రోక్తమగుదానినధ్యయనముచేయువాడు కఠుడనబడును. కతమకలాపః। (కతమః కలాపః) కలాపిప్రోక్తమగుదానినధ్యయనము చేయువాడు కలాపుడు. ఇరువురు వ్యక్తులందు కఠశాఖాధ్యేతయెవడనియు బహువ్యక్తులందు కలాపశాఖాధ్యేత యెవడనియు పై రెండుస్థలములందు జాతిప్రశ్నము గమ్యమానమగుచున్నది. గోత్రం చ చరణైస్సహ అనుజాతి లక్షణముచే కఠకలాపశాఖాధ్యేతృత్వమునకు జాతిత్వము సిద్ధమగును. కతమోభవతాం పండితః ఇత్యాదులందు సమాసమును వారింపజాతిపరిప్రశ్నే అనునదావశ్యకమగును.

747. కిం క్షేపే. 2-1-64. కిమ్, క్షేపే।

కుత్సితో రాజా కింరాజా। యో న రక్షతి॥

747. నిందార్థకమగు కిమ్అనునవ్యయము సమానాధికరణమగు సుబన్తముతో సమసించును. కింరాజా। (కుత్సితో రాజా) వాక్యమువలన నిందగమ్యమానము కాదు గాననీరీతినస్వపదవిగ్రహమును చెప్పవలయును. రక్షింపనట్టి రాజని పై సమాసమునర్థము. కో రాజా పాటలిపుత్రే (కింశబ్దము ప్రశ్నార్థకము) ఇచట సమాసనివృత్త్యర్థమై క్షేపే అనునది సూత్రమున యావశ్యకమగును.

748. పోటాయువతిస్తోకకతిపయగృష్టిధేనువశావేహద్బష్కయణీ ప్రవక్తృశ్రోత్రియాధ్యాపకధూర్తైర్జాతిః. 2-1-65. పోటా యువతి........ధూర్తైః, జాతిః॥

748. జాతివాచకము, పోటా యువతిస్తోక కతిపయ గృష్టి ధేను వశా వేహత్ బష్కయణీ ప్రవక్తృ శ్రోత్రియ అధ్యాపక ధూర్త ఈశబ్దములతో సమసించునదియు తత్పురుషసంజ్ఞకమగును. జాతివాచకమునకు పూర్వనిపాతమునకై యీసూత్రము.

749. తత్పురుషస్సమానాధికరణః కర్మధారయః. 1-4-42.

750. పుంవత్కర్మధారయజాతీయదేశీయేషు. 7-3-42.

కర్మధారయే జాతీయదేశీయయోశ్చ పరతః భాషితపుంస్కాత్పరఊఙభావోయస్మింస్తథాభూతం పూర్వం పుంవత్। పూరణీప్రియాదిష్వప్రాప్తః పుంవద్భావో విధీయతే। మహానవమీ। కృష్ణచతుర్దశీ। మహాప్రియా। తథా కోపధాదేః ప్రతిషిద్ధః పుంవద్భావః కర్మధారయాదౌ ప్రతిప్రసూయతే। పాచకస్త్రీ। దత్తభార్యా। శ్రౌఘ్నభార్యా। సుకేశభార్యా। బ్రాహ్మణభార్యా। ఏవం పాచకజాతీయా, పాచకదేశీయా, ఇత్యాది। ఇభపోటా। పోటా స్త్రీపుంసలక్షణా। ఇభయువతిః। అగ్నిస్తోకః। ఉదశ్విత్కతిపయమ్। గృష్టిస్సకృత్ప్రసూతా। గోగృష్టిః। ధేనుర్నవప్రసూతికా। గోధేనుః। వశా వంధ్యా। గోవశా। వేహద్గర్భఘాతినీ। గోవేహత్ః బష్కయణ్యతరుణవత్సా। గోబష్కయణీ। కఠప్రవక్తా। కఠశ్రోత్రియః। కఠాధ్యాపకః। కఠధూర్తః॥

749. పోటాయువతీత్యాదిసూత్రవిహితమగు సమాసమునందు కర్మధారయకార్యమును విధింప కర్మధారయమును నిర్వచింపుచున్నాడు. సమానాధికరణః అనునది తత్పురుషః అనుదానికి విశేషణము. సమానాధికరణః అనుపదమునకు సమానేఽధికరణే (పదే) అస్మిన్సః అను వ్యుత్పత్తివలన సమానాధికరణములగు (ఏకార్థబోధకములు) పదములుగలది యనునర్థము లభించును. సమానాధికరణము లగు పదములవయవములుగగల తత్పురుషము కర్మధారయసంజ్ఞకమగునని సూత్రార్థము.

750. "స్త్రియాః పుంవద్భాషితపుంస్కాదనూఙ్ సమానాధికరణే స్త్రియామపూరణీప్రియాదిషు" (835) అను వక్ష్యమాణసూత్రమునుండి స్త్రియాఃభాషితపుంస్కాదనూఙ్ అనుపదములనువర్తించును. భాషితపుంస్కాదనూఙ్ అనునది సమస్తపదము, స్త్రియాఃఅనుదానికి విశేషణము. భాషితపుంస్కశబ్దము బహువ్రీహి

(భాషితః పుమాన్ యేనశబ్దేన) అనూఙనునది తత్పురుషము. (నఞూఙ్) ఊఙ్ అనునది స్త్రీ ప్రత్యయము. భాషితపుంస్కాదనూఙనునది బహువ్రీహి (భాషిత పుంస్కాదనూఙ్ యస్యాః) ఈసూత్రమున నిర్దేశమువలననే పుంస్కశబ్దముకంటె పరమగు పంచమికి అలుక్కు విశిష్టసమాసముకంటె పరమగు షష్ఠికి లోపమును సిద్ధములగును. పుంవత్తనునది రూపాతిదేశమనుటచే "పుంసఇవ" అను విగ్రహముకల్గి పుంలిఙ్గశబ్దముయొక్క రూపమగునను నర్థమును బోధించును. కర్మధారయమందు జాతీయదేశీయప్రత్యయములు పరమగునపుడును పుంలిఙ్గమునుగూడ బోధించుశబ్దముకంటె పరమగు ఊఙభావముగల స్త్రీలిఙ్గపూర్వపదమునకు పుంవద్భావమగునని సూత్రార్థము ఫలితమగును. కర్మధారయమునందు "స్త్రియాః పుంవత్" (835) అను సూత్రముచేతను, జాతీయదేశీయప్రత్యయములు పరములగునపుడు "తసిలాదిష్వాకృత్వసుచః" (840) అనుసూత్రముచేతను, పుంవద్భావము సిద్ధమగుచుండ, "స్త్రియాః పుంవత్" సూత్రమున అపూరణీప్రియాదిషు అనుపర్యుదాసమువలన స్త్రీలింగములగుపూరణప్రత్యయాన్తములు పరములగునపుడును నిషేధింపబడిన పుంవద్భావమును విధించుటకై యీసూత్రమారంభింపబడెను. మహానవమీ। (మహతీ చాసౌ నవమీ చ) నవమీ శబ్దము స్త్రీలింగమగు పూరణప్రత్యయాన్తము. "సన్మహత్" (744) సూ. చే సమాసము. సమానాధికరణతత్పురుషమైనందున కర్మధారయ సంజ్ఞకమైనది. ఈసూత్రముచే పుంవద్భావమువచ్చినపిదప "ఆన్మహతః" (811) సూ.చే మహచ్ఛబ్దమునకాకారాదేశము. ఇట్లే కృష్ణచతుర్దశీ (కృష్ణాచాసౌ చతుర్దశీ చ) యనుచోటగూడ సమాసానంతరము చతుర్దశీశబ్దము పూరణప్రత్యయాన్తమైనను యీసూత్రముచే పుంవద్భావము ప్రవర్తించుటచే నభీష్టసిద్ధి యగును. మహాప్రియా(మహతీచాసౌప్రియా చ) ప్రియాశబ్దము ప్రియాది గణపఠితము. ఈసూత్రముచే పుంవద్భావము. ఆకారాదేశము. ఇట్లే "న కోపధాయాః" (842) సంజ్ఞాపూరణ్యోశ్చ (843) వృద్ధినిమిత్తస్య చ తద్ధితస్యారక్తవికారే (844) స్వాఙ్గాచ్చేతః (845) జాతేశ్చ (846) అనువక్ష్యమాణములగు నైదు సూత్రములచే నిషేధింపబడిన పుంవద్భావమును కర్మధారయమందు జాతీయదేశీయ ప్రత్యయములుపరములుగనున్నప్పుడును తిరుగ విధించుటకై గూడనీసూత్రారంభమని తెలియనగును. పాచకస్త్రీ। (పాచికా చాసౌ స్త్రీ చ) ఇది కర్మధారయము కావున "న కోపధాయాః" అనుసూత్రప్రాప్తమగు నిషేధమును బాధించి యీసూత్రముచే పుంవద్భావము ప్రవర్తించును. దత్తభార్యా (దత్తాచాసౌ భార్యా చ) పంచమభార్యా (పంచమీచాసౌ భార్యా చ) ఈరెండుస్థలములందును "సంజ్ఞాపూరణ్యోశ్చ" అను సూ. చే నిషేధము ప్రాప్తమగుచున్నది. స్రౌఘ్నభార్యా (స్రౌఘ్నీ చాసౌ భార్యా చ) వృద్ధి నిమిత్తస్యేత్యాదిసూత్రప్రాప్తమగు నిషేధమును బాధించి యీసూత్రముచే పుంవద్భావము. సుకేశభార్యా (సుకేశీచాసౌభార్యాచ) ఇచట "స్వాఙ్గాచ్చేతః అనుసూత్రముచే నిషేధము ప్రాప్తించుచున్నది. బ్రాహ్మణభార్యా

"జాతేశ్చ" సూత్రప్రాప్తమగు నిషేధమునీసూత్రము బాధించును. ఇట్లే జాతీయ దేశీయప్రత్యయములు పరములగునపుడు పాచకజాతీయా పాచకదేశీయా ఇత్యాదులనుదాహరణముగనూహించునది. పోటాయువతీత్యాది సూత్రమునకు వరుసగ నుదాహరణములు. ఇభపోటా। (పోటా చాసౌ ఇభీ చ) పుంవద్భావము. జాతి వాచకమగునిభశబ్దమునకు పూర్వనిపాతము. పోటయన స్త్రీ పురుషలక్షణములుగలది. "పోటా స్త్రీపుంసలక్షణా" అను నిఘంటువిందు ప్రమాణము. ఇభయువతిః। (యువతిశ్చాసౌ ఇభీ చ) అగ్నిస్తోకః (స్తోకశ్చాసావగ్నిశ్చ) ఉదశ్విత్కతిపయమ్ (కతిపయం చ తదుదశ్విచ్చ) ఉదశ్విచ్ఛబ్దమునకు మజ్జిగయని యర్థము. గృష్టి యననొకమారే ప్రసవించినది. "గృష్టిస్సకృత్ప్రసూతా" (నిఘంటువు) గోగృష్టిః (గృష్టిశ్చాసౌ గౌశ్చ) నూతనప్రసూతిక ధేనువనబడును. "ధేనుర్నవప్రసూతికా" (నిఘంటువు) గోధేనుః. (ధేనుశ్చాసౌ గౌశ్చ) వశయన వంధ్య (గొడ్డురాలు) గోవశా (వశా చాసౌ గౌశ్చ) గర్భనాశకురాలు వేహత్తనబడును. గోవేహత్ (వేహచ్చాసౌ గౌశ్చ) చిరప్రసూతము బష్కయణి యనబడును. "చిరసూతా బష్కయణీ" అనునమరమిందుకుహాసము. గోబష్కయణీ (బష్కయణీ చాసౌ గౌశ్చ) కఠప్రవక్తా (ప్రవక్తా చాసౌ కఠశ్చ) కఠశ్రోత్రియః (శ్రోత్రియశ్చాసౌ కఠశ్చ) కఠాధ్యాపకః (అధ్యాపకశ్చాసౌ కఠశ్చ)కఠధూర్తః (ధూర్తశ్చాసౌ కఠశ్చ)

751. ప్రశంసావచనైశ్చ. 2-1-66. ప్రశంసావచనైః. చ। (జాతిః)

> ఏతైస్సహ జాతిః ప్రాగ్వత్। గోమతల్లికా, గోమచర్చికా। గోప్రకాణ్డమ్। గవోద్ఘః। గోతల్లజః। ప్రశస్తా గౌరిత్యర్థః। మతల్లికాదయో నియతలింగా న తు విశేష్యనిఘ్నాః। జాతిః కిమ్। కుమారీ మతల్లికా॥

751. రూఢములగు ప్రశంసావాచకశబ్దములతో జాతివాచకము సమసించును. గోమతల్లికా। (మతల్లికా చాసౌ గౌశ్చ) జాతిశబ్దమునకు పూర్వనిపాతము. గోమచర్చికా। (మచర్చికా చాసౌ గౌశ్చ) గోప్రకాణ్డమ్. (ప్రకాణ్డం చ తత్ గౌశ్చ) గవోద్ఘః (ఉద్ఘశ్చాసౌ గౌశ్చ) సమాసానంతరము "అవఙ్ స్ఫోటాయనస్య" (89) సూ. చే గోశబ్దమునకవఙాదేశము. గోతల్లజః। (తల్లజశ్చాసౌ గౌశ్చ) మతల్లికాదిశబ్దములు సముదాయశక్తిచే ప్రశంసావాచకములు. కాన పైయుదాహరణములన్నిటికి ప్రశస్తమగు గోవనియే యర్థము. మతల్లికా మచర్చికామొదలగు శబ్దములు నియతలిఙ్గకములు గానివిశేష్యాయత్తములు కావు. కాన విశేష్యము పుంలిఙ్గమైననవియు పుంలిఙ్గములుకావలెననిగాని స్త్రీలింగమైననవియు స్త్రీలింగములు గావలెననిగాని నియమముండదని భావము. కుమారీశబ్దము వయసును బోధించుశబ్దము కానిజాతిశబ్దము కాదు గానకుమారీమతల్లికాశబ్దములకు సమాసము రాదు జాతిః అనునది లేనిచోనిచట సమాసము ప్రసక్తమయ్యెడిని.

752. యువా ఖలతిపలితవలినజరతీభిః. 2-1-67. యువా, ఖలతిపలితవలినజరతీభిః।

పూర్వనిపాతనియమార్థం సూత్రం। లిఙ్గవిశిష్టపరిభాషయా యువతిశబ్దోపి సమస్యతే। యువా ఖలతిః యువఖలతిః। యువతిః ఖలతీ యువఖలతీ। యువజరతీ। యువత్యామేవ జరతీధర్మోపాలంభేన తద్రూపారోపాత్సామానాధికరణ్యమ్॥

752. యువన్‌శబ్దము, ఖలతి పలిత వలిన జరతీ అనుశబ్దములతో సమసించును. దీనికి "విశేషణం" (740) సూ. చే సమాసము సిద్ధించునని చెప్పినచో ఖలతి పలిత మొదలగుశబ్దములు యువన్‌శబ్దముగూడ గుణవాచకములేఅయినందున విశేష్యవిశేషణభావమనియతమగుటచే పూర్వనిపాతనియమము సంభవింపదు గాన యువన్‌శబ్దమునకు పూర్వనిపాతనియమమునకై యీసూత్రారంభమని యెఱుఁగునది. సూత్రమున యువాఅని పుంలిఙ్గనిర్దేశమున్నను "ప్రాతిపదికగ్రహణే లిఙ్గవిశిష్టస్యాపి గ్రహణమ్" అనుపరిభాషచే యువతిశబ్దమునకును ఖలత్యాదులతో సమాసము సిద్ధమగును. యువఖలతిః। (యువా చాసౌ ఖలతిశ్చ) సుబ్లుగాద్యనన్తరము యువన్‌శబ్దములోని నకారమునకు లోపము. ఖలతియన బట్టతలవాఁడని యర్థము. యువఖలతీ (యువతిశ్చాసౌ ఖలతీ చ) "పుంవత్కర్మధారయ" (760) సూ. చే పుంవద్భావము. ఇట్లే యువపలితః। ఇత్యాదులు. పలితుడన ముదిమిచే నైన తెల్లదనముగలవాఁడు. యువజరతీ (యువతిశ్చాసౌ జరతీ చ) పుంవద్భావము. జరతియన ముదుసలి। నడిమివయసుగలస్త్రీయందే ముదుసలియొక్క గుణములుపలబ్ధములగుటవలన జరతీ రూపారోపముచేనిచట యువతిజరతీశబ్దములకు సామానాధికరణ్యము నిర్బాధమని యెఱుంగునది.

753. కృత్యతుల్యాఖ్యా అజాత్యా. 2-1-68. కృత్యతుల్యాఖ్యాః, అజాత్యా।

భోజ్యోష్ణమ్। తుల్యశ్వేతః। సదృశశ్వేతః। అజాత్యా కిమ్। భోజ్య ఓదనః। ప్రతిషేధసామర్థ్యాద్విశేషణసమాసోపి న॥

753. కృత్యప్రత్యయాన్తములు తుల్యవాచకములును (తుల్యపర్యాయములు) సమానాధికరణము జాతిభిన్నవాచకమునగుసుబన్తముతో సమసించును. భోజ్యోష్ణం। (భోజ్యం చ। తదుష్ణం చ) భోజ్యశబ్దము కృత్యప్రత్యయాన్తము. (ణ్యత్) ఉష్ణశబ్దము గుణవాచకము. పూర్వనిపాత నియమమునకై సూత్రారంభము. తుల్యశ్వేతః। (తుల్యశ్చాసౌ శ్వేతశ్చ) సదృశశ్వేతః। సదృశశబ్దము తుల్యపర్యాయము కానసమాసము ప్రవర్తించినది. భోజ్య ఓదనః అనుచోట భోజ్యశబ్దము

కృత్యప్రత్యయాన్తమైనను ఓదనశబ్దము జాతివాచకమైనందున సమాసము ప్రవర్తింపదు. అజాత్యా అను ప్రతిషేధసామర్థ్యముచే నిచ్చోట విశేషణసమాసముగూడ ప్రవర్తించదు. జాతిభిన్నవాచకముతో సమాసమునందు పూర్వోత్తరపదములు గుణశబ్దములుగాని క్రియాశబ్దగుణశబ్దములుగానియగును. కానవిశేషణవిశేష్యభావ మనియతమగుటచే పూర్వనిపాతమునకనియమము ప్రాప్తించుచుండ కృత్యాన్తాదులకు పూర్వనిపాతనియమమునకై సూత్రమావశ్యకమగును గాన అజాత్యా అనునది సార్థకమగును. పై స్థలమున విశేషణసమాసము ప్రవర్తించినను విశేషణమగుటచే భోజ్యశబ్దమునకే పూర్వనిపాతమగును గాన అజాత్యా అనుపదము వ్యర్థముగావలసివచ్చును. తత్సామర్థ్యమువలన జాతివాచకముతో విశేషణసమాసముగూడ నిషేధింపబడెనని యాశయము.

వివ:—అజాత్యా అనునది కృత్యప్రత్యయాంతాదులకే పూర్వనిపాతమనుటకు సూత్రారంభమనునర్థమును స్పష్టముగ బోధించును. కాని జాతివాచకముతో విశేషణసమాసమును వారింపదు. కావుననే "కురుగార్హపత" (6-2-42) సూత్రభాష్యములోని "పణ్యకంబలః పణ్యహస్తీ" మొదలగుసమాసములు సిద్ధములగును. భోజ్య ఓదనః అనుచోట సమాసాభావ మిష్టమైనయెడల బహులగ్రహణానువృత్తివలననది సిద్ధమగును. జాతివాచకముతో కృత్యాన్తాదులకు విశేషణసమాసములాదని ప్రాచీనుల ననుసరించి దీక్షితులు వ్రాసెనని నవీనులయాశయము.

754. వర్ణో వర్ణేన. 2-1-69. వర్ణః, వర్ణేన।

సమానాధికరణేనసహ ప్రాగ్వత్॥

754. వర్ణవాచకము సమానాధికరణమగు వర్ణవాచకముతో సమసించును. కృష్ణసారంగః (కృష్ణశ్చాసౌ సారంగశ్చ) కృష్ణశబ్దము వర్ణవాచకము. లక్షణచేనిది కృష్ణవర్ణముగలయవయవములుగలదానిని బోధించును. సారంగశబ్దము చిత్రవర్ణవాచకము. ఈరీతిని సామానాధికరణ్యము సిద్ధించును.

వివ:—వర్ణవాచకములకు విశేషణసమాసము సిద్ధమగును గాన నీసూత్రము దృష్టఫలరహితమైనదని గ్రహించునది.

755. * కడారాః కర్మధారయే. 2-2-38. కడారాః, కర్మధారయే, (వా, పూర్వమ్.)

కడారాదయః శబ్దాః కర్మధారయే వా పూర్వం ప్రయోజ్యాః। కడారజైమినిః। జైమినికడారః॥

---

* కడార గడుల ఖఞ్జ ఖాడ కాణ కుణ్ఠ ఖలతి గౌర వృద్ధ భిక్షుక పిఙ్గ పిఙ్గల తను జఠర బధిర మఠర కుబ్జ బర్బర ఇతికడారాదిః॥ క్వచిత్తు। నౌ కాక అన్న శుక శృగాల ప్రకృతి ప్రాయ గోత్ర సమ విషమ ద్విద్రోణ పఞ్చక సాహస్ర ప్రతి పరి అను ఏతేఽపిక్వచిన్నే॥

755. కడారాః అనుబహువచననిర్దేశమువలన కడారాదులకు గ్రహణము. కడారాదిశబ్దములు కర్మధారయసమాసమునందు వికల్పముగ పూర్వప్రయోగార్హములగును. "ఉపసర్జనం పూర్వ" మను సూత్రముచే పూర్వనిపాతము నిత్యముగ ప్రాప్తించుచుండ వికల్పమునకై యీసూత్రము. కడారజైమినిః। జైమినికడారః। (కడారశ్చాసౌ జైమినశ్చ)

756. కుమారః * శ్రమణాదిభిః. 2-1-70. కుమారః, శ్రమణాదిభిః।

కుమారీ శ్రమణా, కుమారశ్రమణా, ఇహ గణే, శ్రమణా, ప్రవ్రజితా, గర్భిణీత్యాదయః, స్త్రీలిఙ్గాఃపఠ్యన్తే। లిఙ్గవిశిష్టపరిభాషాయా ఏతదేవ జ్ఞాపకం బోధ్యమ్॥

756. కుమారశబ్దము శ్రమణాదిగణపఠితములతో సమసించును. కుమారశ్రమణా (కుమారీ చాసౌ శ్రమణా చ) పుంవద్భావము. శ్రమణులన బుద్ధిసన్యాసులు. శ్రమణాదిగణమునందు శ్రమణా గర్భిణీ మొదలగు స్త్రీలింగశబ్దములు పఠింపబడినవి. పుంలిఙ్గకుమారశబ్దము సూత్రమున పఠింపబడినది. సామానాధికరణ్యము కుదురదు. కాన నీగణమున స్త్రీలిఙ్గపాఠముగూడ "ప్రాతిపదికగ్రహణే లిఙ్గవిశిష్టస్యాపి గ్రహణం" అను పరిభాషకు జ్ఞాపకమని యెరుగునది. "యువాఖలతీ" త్యాదిసూత్రమందలి జరతీశబ్దము పై పరిభాషయందు జ్ఞాపకమనుటచే "ఏతదేవ" అనుచోట నేవకారమపిశబ్దార్థకమని యెఱుంగునది.

757. చతుష్పాదో గర్భిణ్యా. 2-1-71. చతుష్పాదః, గర్భిణ్యా।

చతుష్పాజ్జాతివాచినో గర్భిణీశబ్దేనసహ ప్రాగ్వత్। గోగర్భిణీ॥

757. "జాతిగ్రహణం కర్తవ్య" మనువార్తికమువలన జాతిః అనునది లభించును. చతుష్పాజ్జాతివాచకములు (నాల్గుపాదములుగల జంతువును బోధించునవి.) గర్భిణీశబ్దముతో సమసించును. గోగర్భిణీ। (గర్భిణీ చాసౌ గౌశ్చ)

758. ** మయూరవ్యంసకాదయశ్చ. 2-1-72. మయూరవ్యంసకాదయః, చ॥

---

* శ్రమణా ప్రవ్రజితా కులటా గర్భిణీ తాపసీ దాసీ బన్ధకీ అధ్యాపక అభిరూపక పణ్డిత పటు మృదు కుశల చపల నిపుణ ఇతి శ్రమణాది॥

** మయూరవ్యంసక ఛాత్రవ్యంసక కమ్బోజముణ్డః యవనముణ్డః ఛిన్ధిని। హస్తేగృహ్య పాదేగృహ్య లాఙ్గూలేగృహ్య పునర్దాయ ఏహీడాదయోన్యపదార్థే। ఏహీడమ్ ఏహిపచమ్। ఏహివాణిజా। క్రియా। అపేహివాణిజా ప్రేహివాణిజా

ఏతే నిపాత్యంతే। మయూరో వ్యంసకః। మయూర వ్యంసకః। వ్యంసకో ధూర్తః। ఉదక్చావచ్చ=ఉచ్చావచమ్। నిశ్చితం చ ప్రచితం చ నిశ్చప్రచమ్। నాస్తి కించన యస్య సః అకించనః (వా) ఆఖ్యాతమాఖ్యాతేన క్రియాసాతత్యే। అశ్నీతపిబతేత్యేవం సతతం యత్రాభిధీయతే సా అశ్నీత పిబతా। పచతభృజ్జతా। ఖాదతమోదతా (వా) ఏహీడాదయోఽ న్యపదార్థే। ఏహీడ ఇతి యస్మిన్కర్మణితదేహీడం। ఏహి వచమ్। ఉద్ధర కోష్ఠాదుత్సృజ దేహీతి యస్యాం క్రియా యాం సా ఉద్ధరోత్సృజా॥ ఉద్ధమవిధమా। అసాతత్యార్థ మిహ పాఠః (వా) జహికర్మణా బహులమాభీక్ష్ణ్యే కర్తారం చాభిదధాతి। జహీత్యేత త్కర్మణా బహులం సమస్యతే ఆభీ క్ష్ణ్యే గమ్యే సమాసేన చేత్కర్తాఽభిధీయత ఇత్యర్థః। జహి జోడః। జహిస్తంబః। నాస్తి కుతో భయం యస్య సః అకుతోభయః। అన్యో రాజా రాజాన్తరం। చిదేవ చిన్మా త్రమ్॥

758. మయూరవ్యంసకాదిగణపఠితములగు మయూరవ్యంసకః మొద లగునవి సమాసకార్యసహితనులుగ నిపతింపబడినవి మయూరవ్యంసకః (వ్యంస కశ్చాసౌ మయూరశ్చ) వ్యంసకమన ధూర్తము. ఉచ్చావచమ్ (ఉదక్చఅవక్చ) ఉదక్ శబ్దావాక్ శబ్దములకుచ్చావచాదేశము నిపాతనముపలన కలుగును. నిశ్చప్రచమ్ (నిశ్చితం చ ప్రచితం చ) నిశ్చితప్రచిత శబ్దములకు నిశ్చప్రచాదేశము. అకిఞ్చనః (నాస్తి కిఞ్చన యస్యసః) (గ 1 సూ) "ఆఖ్యాత.........సాతత్యే" క్రియ యొక్క సాతత్యము గమ్యమానమగుచు అన్యపదార్థము (సమస్యమానపదార్థము

---

ఏహిస్వాగతా అపేహిస్వాగతా ఏహిద్వితీయా అపేహిద్వితీయా ప్రేహిద్వితీయా ఏహికటా అపేహికటా ప్రేహికటా ఆహరకరటా ప్రేహికరటా ప్రేహికర్దమా ప్రోహికర్దమా విధమచూడా ఉద్ధమచూడా ఆహరచేలా ఆహరవనితా ఆహరవసనా కృన్తవిచక్షణా ఉద్ధరోత్సృజా ఉద్ధరావసృజా ఉద్ధమవిధమా ఉత్పచనిపచా ఉత్పత నిపతా ఉచ్చావచమ్ ఉచ్చనీచమ్ ఆచోపచమ్ ఆచపరాచమ్ నిశ్చప్రచమ్ అకిం చనః స్నాత్వాకాలకః పీత్వాస్థిరకః భుక్త్వాసుహితః ప్రోష్యపాపీయాన్ ఉత్పత్య పాకలా నిపత్యరోహిణీ నిషణ్ణశ్యామా అపేహిప్రఘసా ఏహివిఘసా ఇహపఞ్చమీ ఇహద్వితీయా జహికర్మణాబహులమాభీక్ష్ణ్యేకర్తారంచాభిదధాతి। జహిజోడః జహి స్తమ్బః ఆఖ్యాతమాఖ్యేతేన క్రియాసాతత్యే। అశ్నీతపిబతా పచతభృజ్జతా ఖాదత మోదతా ఖాదతరమతా ఆహరనివపా ఆహరనిష్కిరా భిన్ధిలవణా కృన్ధివిచక్షణా పచలవణి పచప్రకూటా। ఆకృతిగణోఽయమ్। తేన। అకుతోభయ కాన్దిశీక అహో పురుషికా అహమహమికా యదృచ్ఛా ఏహిరేయాహిరా ఉన్మృజావమృజా ద్రవ్యాన్త రమ్ అవశ్యకార్యమిత్యాదిసిద్ధమ్॥

కంటెనితరము) ప్రధానమగునపుడు తిజ్ప్రత్యయాన్తము (క్రియాప్రధానము) తిజ్ప్రత్యయాన్తముతో సమసించును. గణమున పూర్వము పఠింపబడిన "ఏహీడాదయోఽన్యపదార్థే" అనువచనమునుండి అన్యపదార్థే అనునది యిచట కనువర్తించును. ఏహీడాదులకు క్రియాసాతత్యమపేక్షితము దానినిద్యోతన చేయుటకై వార్తికము వ్యుత్క్రమముగ వ్యాఖ్యాతములయ్యెను. అశ్నీతపిబతా। ఏక్రీడయందెల్లప్పుడు అశ్నీత (తినుడు) పిబత (త్రావుడు) అని చెప్పబడుచుండునో ఆక్రీడ అశ్నీతపిబతయనబడును. ఇచట క్రియాసాతత్యము ప్రతీయమానమగుచున్నది. ఇట్లే పచతభృజ్జతా (పచత భృజ్జతేతి సతతం యత్రాభిధీయతే సా) ఖాదతమోదతా (ఖాదత మోదతేతి సతతం యత్రాభిధీయతే సా) ఇత్యాదులనూహింపవలయును. పైస్థలములందు క్రీడాదిక్రియప్రధానము గానస్త్రీత్వమువలన ప్రాతిపదికమగు సమాసముకంటె టాప్ప్రత్యయము ప్రవర్తించును. (2 సూ.) "ఏహీడాదయోఽన్యపదార్థే" ఏహీడాదులన్యపదార్థమునందు నిపతింపబడుచున్నవి. ఏహీడమ్ ఏహీడే అని ఏపనియందు చెప్పబడునో ఆపని ఏహీడమగును. (ఏహీడేతియస్మిన్కర్మణితత్) ఏహిపచమ్ (ఏహిపచ, ఇతియస్మిన్కర్మణితత్) ఉద్ధరోత్సృజా (ఉద్ధర ఉత్సృజేతి యస్యాం క్రియాయాం సా) మూలమును దీసి అనునది ఉత్సృజ అనుదానికి వివరణము. కోష్ఠమున ధాన్యాదులుండుస్థలము. ఉద్ధమవిధమా। క్రియయొక్క అసాతత్యమందుగూడ సమాసమునకై యీరెండునేహీడాదులందు పఠింపబడినవి. (3 సూ.) జహికర్మణా………………చాభిదధాతి। జహిఅనునది పౌనఃపున్యము ప్రతీయమానమగునపుడు కర్మవాచకముతో బహుళముగ సమసించును సమాసముచే కర్త చెప్పబడవలయును. జహిజోడః। "జహి జోడం" అనిపలుమారెవడు చెప్పునో వాడు (కర్త) జహిజోడుడగును. జోడం అనునది కర్మవాచకము. జోడుడని యొకానొకనిపేరు. ఇట్లే జహిస్తమ్బః అనునది. అకుతోభయః (నాస్తి కుతో భయం యస్య) ఎవరివలనను భయములేనివాడు. రాజాన్తరమ్ (అన్యో రాజా) చిన్మాత్రమ్ (చిదేవ) అన్తరమాత్రశబ్దములతో నిత్యసమాసమని దెల్పుటకై యీరెండుచోటులందునస్వపదవిగ్రహములు చూపబడెను. మాత్రశబ్దమేవార్థకము. అన్తరశబ్దము భిన్నవాచకము.

వివ :— సూత్రమున చకారము ఏవకారార్థకము. కావున మయూరవ్యంసకాదిసమాసములకు సమాసాన్తరప్రవేశములేదని తెలియదగును. పరమో మయూరవ్యంసకః। అనుచోట వాక్యమే యుండును గానిసమాసము ప్రవర్తింపదు.

(759) ఈషదకృతా. 2-2-7. ఈషత్, అకృతా।

ఈషత్పిఙ్గలః। (వా) ఈషద్గుణవచనేనేతి వాచ్యమ్।
ఈషద్రక్తమ్॥

759. ఈషత్ అనుశబ్దము కృదన్తప్రకృతికముగానట్టి సుబన్తముతో సమసించును. ఈషత్పిఙ్గలః। పింగలశబ్దమవ్యుత్పన్నము గానకృదన్తముకాదు. (వా)

సూత్రమున అకృతా అనుదానిని విడిచి గుణవచనేన అని చెప్పవలయును. గుణవాచకముతో సమాసమగునని యర్థము. ఈషద్రక్తమ్। రక్తశబ్దము గుణవాచకమగుటచే కృదన్తమైనను సమసించెను.

760. నఞ్. 2-2-6. (సుపా)

నఞ్ సుపాసహ సమస్యతే॥

760. నఞ్ (ఇకారేత్సంజ్ఞకనశబ్దము) సుబన్తముతో సమసించును.

వివ :—ఇచటను "నలోపోనఞః" అనుసూత్రమందును ఞకారము విశేషణార్థము. నిషేధార్థకనశబ్దమునకు తత్పురుషము రాకుండుట యిందుకు ఫలము. నైకధా మొదలగు చోటులందు తత్పురుషస్వరము వారితమగును. ఇచట నలోపవారణముగూడ దానికిప్రయోజనమగును.

ఈనఞ్ సమాసమునను త్తరపదార్థము ప్రధానము ఆరోపితత్వము నఞ్ద్యోత్యము. అబ్రాహ్మణః ఇత్యాదులందు ఆరోపితో బ్రాహ్మణః అని బోధకల్గును. బ్రాహ్మణభిన్నుడనునర్థము పర్యవసితమగును. అతస్మిన్ ఇత్యాదులలో తచ్ఛబ్దమనుపసర్జనమగుటచే సర్వనామసంజ్ఞాకార్యములు సిద్ధములగును. తత్పురుషము త్తరపదార్థప్రధానమనుప్రాయోవాదము నిర్బాధమగును. కొందరు నఞర్థము. 1 తత్సాదృశ్యము 2 తదభావము 3 తదన్యత్వము 4 తదల్పత 5 అప్రాశస్త్యము 6 విరోధము ఆరువిధములనిచెప్పి క్రమముగ అబ్రాహ్మణః అపాపమ్ అనశ్వః అనుదరా (కన్యా) అపశవోవా అన్యేగోఅశ్వేభ్యః। అధర్మః। వీనినుదాహరించిరి. కాని యీయర్థములర్థసిద్ధములగునవియు ఆరోపితత్వముమాత్రము నఞ్ద్యోత్యమనియును దీక్షితాశయము.

761. నలోపో నఞః. 6-3-73. న, లోపః, నఞః (ఉత్తరపదే)

నఞోనస్యలోపస్స్యాదుత్తరపదే। నబ్రాహ్మణః, అబ్రాహ్మణః॥

761. ఉత్తరపదము పరమగునపుడు నఞ్ యొక్క నకారమునకులోపము వచ్చును. అబ్రాహ్మణః (న బ్రాహ్మణః) నఞ్ సుబన్తముతో సమసించినది. అనన్తరమీసూత్రముచే నకారలోపము ప్రవర్తించెను.

762. తస్మాన్నుడచి. 6-3-74. తస్మాత్, నుట్, అచి. (ఉత్తరపదే)

లుప్తనకారాన్నఞ ఉత్తరస్యాజాదేర్నుడాగమస్స్యాత్।
అనశ్వః। అర్థాఽభావేఽవ్యయీభావేన సహాయం వికల్ప్యతే।
రక్షోహాగమలఘ్వసందేహాః ప్రయోజనమ్। ఇతి, అద్రుతాయామసంహితాయామ్, ఇతి చ భాష్యవార్తికప్రయోగాత్।

తేన అనులబ్ధిః। అవివాదః। అవిఘ్నమిత్యాది సిద్ధమ్. (వా) నఞో నలోపస్తిఙి క్షేపే। అపచసి త్వం జాల్మ। నైకధేత్యాదౌ తు నశబ్దేనసహ సుప్సుపేతి సమాసః.

762. తస్మాత్తనుచోట తచ్ఛబ్దము పూర్వసూత్రముచే విధింపబడిన నకార లోపముగల నఞ్ అనుదానిని పరామర్శించును. అచి అనునది యనువృత్తమగు ఉత్తరపదే అనుదానికి విశేషణము. తదాదివిధివలననజాద్యుత్తరపదే అనునర్థము లభించును. అచి అనునది షష్ఠ్యన్తముగ విపరిణామమునొందును. నకారలోపము గల నఞ్ కంటెపరమగు అజాద్యుత్తర పదమునకు నుడాగమమగునని సూత్రార్థము. అనశ్వః (నఅశ్వః) "నఞ్" అనుసూత్రముచే విధింపబడు తత్పురుషము అర్థాభావమందు "అవ్యయం విభక్తి"త్యాదిసూత్రముచే విధింపబడు సమాసముతో వికల్పితమగును. పూర్వపదార్థము ప్రధానమైనపుడవ్యయీభావము. ఉత్తరపదార్థము ప్రధానమైనపుడు తత్పురుషము. లేకున్నవిఘ్నమిత్యాదులలో విఘ్నానామభావః అనునర్థమునందు (అర్థాభావమందవ్యయీభావము, నిర్మక్షికం (మక్షికాణామభావః) ఇత్యాదులందువలె అవకాశముగలదిగావున) అవ్యయీభావమును బాధించి పరమగు తత్పురుషమే ప్రవర్తింపవలసివచ్చును. అట్లయిన తత్పురుషమున పర పదముయొక్క లింగము సమాసమునకు వచ్చును గానఅవిఘ్నః ఇత్యాదిప్రయోగములే యుండవలసివచ్చును గానిఅవిఘ్నమిత్యాదిప్రయోగములకవకాశము లేక పోవును. ఇపుడవిఘ్నమిత్యాదిప్రయోగములు నిశ్శంకముగ సిద్ధించును. ఈవిషయమున "రక్షోహాగమలఘ్వసందేహాః ప్రయోజనమ్" అనుభాష్యము "అద్రుతాయామసంహితమ్" అనువార్తికమును ప్రమాణములు. భాష్యమున సందేహస్యాభావః అనునర్థమందు అసందేహః అనునది పుంలింగముగ ప్రయోగింపబడినది (రక్షోహాగమ.........హాః అనునదిద్వంద్వము) కావుననచట అసందేహః అనునది నఞ్ తత్పురుషమని తెలియుచున్నది. అవ్యయీభావమగుచో అసందేహమని యుండవలయును. వార్తికకారునిచే సంహితాభావమనునర్థమునందు అసంహితం అనిప్రయోగింపబడినది. అచటనర్థాభావమందవ్యయీభావమని చెప్పవలయును. లేకున్నసంహితః అనిగావలసివచ్చును. అందుచే పైభాష్యవార్తికప్రయోగమువలన రెండు సమాసములకు వికల్పమని ఫలించును. ఇట్లు చెప్పుటవలన అనుపలబ్ధిః అవివాదః ఇత్యాదులు నఞ్ తత్పురుషమువలనను అవిఘ్నమిత్యాదులవ్యయీభావమువలనను సిద్ధములగును.

(వా) నఞో నలోపస్తిఙి క్షేపే। నింద గమ్యమానమగునపుడు నఞ్ యొక్క నకారమునకు తిఙ్ప్రత్యయాంతము పరమగునపుడు లోపమగును. అపచసి (త్వం జాల్మ) తిఙన్తముతో సమాసము లేనందున "నలోపోనఞః" సూ. చే నలోపమప్రాప్తమగుచుండ నీవార్తికము రచింపబడెను. నైకధా ఇత్యాదులందు

విషేధార్థకనశబ్దమునకు "సహ సుపా" అను సూ. చే ఏకధాశబ్దముతో సమాసము. ఇది నఞ్ తత్పురుషమైన అనేకధా అనిగావలసివచ్చును.

763. నభ్రాణ్ణపాన్నవేదా నాఽసత్యా నముచినకులనఖ నపుంసక నక్షత్రనక్రనాకేషు ప్రకృత్యా. 6-3-75. నభ్రాట్, నపాత్, నవేదాః, నాసత్యాః, నముచినకుల.... .... .... ....నాకేషు, ప్రకృత్యా॥

పాదితిశత్రన్తః। వేదా ఇత్యసున్నన్తః। న సత్యా అసత్యాః। న అసత్యా నాఽసత్యాః। నముఞ్చతీతి నముచిః, న కులమస్య నకులమ్। న ఖమస్య నఖమ్। న స్త్రీ పుమాన్ నపుంసకమ్। స్త్రీపుంసయోః పుంసకభావో నిపాతనాత్। న క్షరతీతి నక్షత్రమ్। క్షీయతేః క్షరతేర్వా క్షత్రమితి నిపాత్యతే। న క్రామతీతి నక్రః। క్రమేర్డః। న అకమస్మిన్నితి నాకః॥

763. సూత్రమున నభ్రాట్ నపాత్ నవేదాః నాసత్యాః ఇవి పృథక్పదములు. సమాసమైన "నవేదోనాసత్యాః" అని గావలయును. నముచినకుల నఖ నపుంసక నక్షత్ర నక్ర నాక యీశబ్దములకు ద్వంద్వము. ఇవి నఞ్ సమాసములు. వీనియందున్న నఞ్ యొక్క నకారమునకు లోపమురాక స్వరూపముతోనే యుండును. వీనిలో పాత్తనునది శతృప్రత్యయాన్తము. వేదాః అనునది అసున్ ప్రత్యయాన్తము. న సత్యాః అసత్యాః। న అసత్యాః నాసత్యాః। అని నాసత్యాః అనుచోట విగ్రహమును చెప్పవలయును. న స్త్రీ పుమాన్ నపుంసకమ్। నిపాతనమువలన స్త్రీపుంస్శబ్దములకు పుంసకాదేశమగును. నక్షత్రమ్ (న క్షరతి న క్షీయతేవా) క్షర సంచలనే (భ్వాదిః) క్షిష్ హింసాయామ్ (దివాదిః) వీనిలోనేదైన నొకధాతువునకు క్షత్రమని నిపాతనము చేయబడెను, నక్రః (న క్రామతి) క్రము ధాతువునకు డప్రత్యయమును చేసిన క్రః అనురూపము సిద్ధమగును. నాకః (న అకమస్మిన్) అకమన పాపము. నాకమన స్వర్గము. శేషము సుగమము.

764. నగోఽప్రాణిష్వన్యతరస్యామ్. 6-3-77. నగః, అప్రాణిషు, అన్యతరస్యామ్॥

నగ ఇత్యత్ర నఞ్ ప్రకృత్యా వా। నగాః, అగాః పర్వతాః॥ అప్రాణిష్వితి కిమ్। అగో వృషలశ్శీతేన। నిత్యం క్రీడేత్యతో నిత్యమిత్యనువర్తమానే॥

764. నగః అనుదానికి ప్రాణిభిన్నమర్థమగునపుడచటనుండునఞ్ వికల్పముగ ప్రకృతిభావమునొందును. నలోపవికల్పము ఫలితమగును. నగాః అగాః (నగచ్ఛంతి) అప్రాణులగు పర్వతములు నగశబ్దవాచ్యములు. సూత్రమున అప్రా

జము అనునది లేనిచో అగః (చలిచే వెలుపలకు వెళ్ళుటకవకాశములేని శూద్రుడు) అనుచోటగూడ నలోపవికల్పము ప్రసక్తమయ్యెడిని.

"నిత్యం క్రీడాజీవికయోః" (715) అనుసూత్రమునుండి నిత్యమ్ అను పదమనువర్తించుచుండ :—

765. కుగతిప్రాదయః. 2-2-18.

ఏతే సమర్థేన నిత్యం సమస్యంతే। కుత్సితః పురుషః కుపురుషః గతిశ్చేత్యనువర్తమానే॥

765. కు అనునవ్యయము గతిసంజ్ఞకము ప్రాదులును సమర్థమగుదానితో నిత్యముగ సమసించునదియు తత్పురుషమగును. గతిసాహచర్యమువలన కుశబ్దముచే నిందార్థకమగునవ్యయమే గ్రహింపవలయును. కాని పృథివీవాచకము గ్రహింపబడదు. కుపురుషః (కుత్సితః పురుషః) నిత్యసమాసమగుటవలన నస్వపదవిగ్రహము చూపబడెను.

"గతిశ్చ" (24) అనుసూత్రము త్తరసూత్రములందనువర్తించుచుండ:—

766. * ఊర్యాదిచ్విడాచశ్చ. 1-4-61. ఊర్యాదిచ్విడాచః, చ (క్రియాయోగే)

ఎతే క్రియాయోగే గతిసంజ్ఞాః స్యుః। ఊరీకృత్య। ఉరరీకృత్య। శుక్లీకృత్య। పటపటాకృత్య। (వా) కారికాశబ్దస్యోపసంఖ్యానమ్। కారికా క్రియా। కారికాకృత్య॥

766. ఊర్యాదిచ్విడాచ్ శబ్దములకు ద్వంద్వము. ఊర్యాదిగణపఠితములగు ఊరీ ఉరరీ మొదలగుశబ్దములు, చ్విప్రత్యయాన్తములు, డాచ్ప్రచ్యయాన్తములును క్రియాయోగమందు గతిసంజ్ఞకములగునవియర్థము. చ్విప్రత్యయడాచ్ప్రత్యయములు కృ భూ అస్ధాతువులయొక్క సంబంధమునందే విధింపబడినవి. కాన వీనిసాహచర్యమువలన నూర్యాదిశబ్దములకును కృభ్వస్తియోగమునందే గతిసంజ్ఞయని యెరుగవలయును. ఈ సూత్రముచే గతిసంజ్ఞానన్తరము "కుగతిప్రాదయః" సూ. చే గతిసమాసము ప్రవర్తించును. అంగీకారార్థకమగు ఊరీఅనునదవ్యయము. కృఞ్ధాతువుకంటె క్త్వాప్రత్యయముచేసినచో కృత్వా అనురూపము సిద్ధించును. తద్యోగమందు ఊరీఅనునది గతిసంజ్ఞకమగును. గతిసమాసము. అనన్తరము

---

* ఊరీ ఉరరీ పేతాళీ ధూసీ శకలా స్రంసకలా ధ్వంసకలా భ్రంసకలా గులుగుధాసజూః ఫల ఫలీ విక్లీ ఆక్లీ ఆలోష్టీ కేవాలీ సేవాలీ శేవాలీ వర్షాలీ మసమసా మస్మసా వౌషట్ వషట్ శ్రౌషట్ స్వాహా స్వధా పాంప్నీ ప్రాదుః శ్రత్ ఆవిస్ ఇత్యూర్యాదిః॥

ల్యప్ప్రత్యయము. ఊరీకృత్య। ఇట్లే ఉరరీకృత్య అనునది. శుక్లీకృత్య (అశుక్లం శుక్లం కృత్వా) అభూతతద్భావమందు శుక్లశబ్దముకంటె చ్విప్రత్యయము విహిత మయ్యెను, శుక్లీ అనునది గతిసంజ్ఞకము. సమాసల్యప్ ప్రత్యయములు. పటపటా కృత్య। పటత్ శబ్దము (అనుకరణము) కంటె డాచ్ప్రత్యయము పటచ్ఛబ్దమునకు ద్విత్వము విధింపబడినవి. పటపటా అని యగును. కృత్వాశబ్దముతో సమాసము. ల్యప్ప్రత్యయము (వా) కారికాశబ్దమునకు గతిసంజ్ఞను చెప్పవలయును. కారికాశబ్దమునకు క్రియ యని యర్థము. కారికాకృత్య (కారికాం కృత్వా) సమాసల్యప్ప్రత్యయములు.

వివ :— (1) సూత్రములోని చకారము నిపాతసంజ్ఞతో నీగతిసంజ్ఞకు సమావేశము కొఱకగును. ఊర్యాదులు నిపాతములు గతిసంజ్ఞకములునగునని యర్థము. ఊరీకృతమనుచోట నిపాతప్రయుక్తమగునాద్యోదాత్తస్వరము నిపాత సంజ్ఞకు ఫలమగును.

767. అనుకరణం చానితిపరమ్. 1-4-62. అనుకరణం, చ, అనితిపరమ్।

ఖాట్కృత్య। అనితిపరం కిమ్। ఖాడితికృత్వా నిరష్ఠీవత్॥

767. ఇతిశబ్దము పరమందులేనట్టి అనుకరణశబ్దము క్రియాయోగమున గతిసంజ్ఞకమగును. ఖాట్కృత్య। ఖాటనునది అనుకరణశబ్దము. (ఖాట్ అను ధ్వనిని చేసి) ఖాడితికృత్వా నిరష్ఠీవత్। ఇచటనితిశబ్దము పరమందుగల ఖాటనుదానికి గతి సంజ్ఞావారణమునకై అనితిపరమ్ అనునదావశ్యకము.

768. ఆదరానాదరయోస్సదసతీ. 1-4-63. అదరనాదరయోః, సదసతీ।

సత్కృత్య। అసత్కృత్య॥

768. క్రమముగనాదరము అనాదరమునునర్థములందు వర్తించు సదసచ్ఛబ్దములు క్రియాయోగమునందు గతిసంజ్ఞకములగును. సత్కృత్య (సత్కృత్వా) సమాసల్యప్ప్రత్యయములు. ఆదరించియని యర్థము. అసత్కృత్య. (అసత్ కృత్వా) ఆదరింపకయని యర్థము.

769. భూషణేఽలమ్. 1-4-64. భూషణే, అలమ్।

అలంకృత్య। భూషణే కిమ్। అలంకృత్వోదనం గతః। పర్యాప్తమిత్యర్థః। అనుకరణమిత్యాదిసూత్రత్రి స్వభావాత్ కృఞ్విషయా॥

769. భూషణార్థకమగు అలమ్ అనునవ్యయము క్రియాయోగమున గతి సంజ్ఞకమగును. అలంకృత్య (అలంకృత్వా) నూపురాదులచేనలంకరించియని

యర్థము. సూత్రమున భూషణే అనునది లేనిచో అలంకృత్వోదనం గతః అనుచోట పర్యాప్త్యర్థకమగు అలం అనుదానికిని గతిసంజ్ఞ ప్రసక్తమగును. "అనుకరణం చానితిపరమ్" "ఆదరానాదరయోస్సదసతీ" "భూషణేలమ్" అనునీమూడుసూత్రములును సహజముగ కృఞ్ధాతుయోగమునందే ప్రవర్తించును. ఇతరధాతువుల యోగమందవి గతిసంజ్ఞను విధింపవని తాత్పర్యము.

770. అన్తరపరిగ్రహే. 1-4-65. అన్తః, అపరిగ్రహే।

అన్తర్హత్య। మధ్యే హత్వేత్యర్థః। అపరిగ్రహే కిమ్।
అన్తర్హత్వా గతః। హతం పరిగృహ్య గత ఇత్యర్థః॥

770. పరిగ్రహమన స్వీకారము. అదిలేనపుడు అన్తఃఅనునవ్యయము గతిసంజ్ఞకమగును. అన్తర్హత్య (అన్తః హత్వా) సమాసల్యప్ప్రత్యయములు. మధ్యయందు చంపియని యర్థము. అపరిగ్రహే అనునది లేనిచో అన్తర్హత్వాగతః అనుచోట అన్తఃఅనుదానికిని గతిసంజ్ఞప్రసక్తమయ్యెడిని. చంపినవానిని తీసికొని వెళ్ళినవాడని యర్థము. ఒకనిని చంపినపిదప చంపినవానినచటవిడుచుటగాని దేశాంతరమునకు తీసికొనివెళ్ళుటగాని సంభవింపవచ్చును. విడువబడినపుడుదాహరణము. తీసికొనిపోవునపుడు ప్రత్యుదాహరణమగునని గ్రహించునది.

771. కణేమనసీ శ్రద్ధాప్రతీఘాతే. 1-4-66. కణేమనసీ, శ్రద్ధాప్రతీఘాతే।

కణేహత్య పయః పిబతి। మనోహత్య। కణేశబ్దస్సప్తమీప్రతిరూపకో నిపాతోఽభిలాషాతిశయే వర్తతే। మనశ్శబ్దోప్యత్రైవ॥

771. కణేమనసీ=కణేమనశ్శబ్దములకు ద్వన్ద్వము. శ్రద్ధయనఁనధికమగు నభిలాషము. దానియొక్క ప్రతీఘాతము=నివృత్తి, శ్రద్ధాప్రతీఘాతమగును. శ్రద్ధాప్రతీఘాతమునందు కణేశ్శబ్దమనశ్శబ్దములు గతిసంజ్ఞకములగును. కణేహత్య పయః పిబతి। (కణేహత్వా) ఇట్లే మనోహత్య పయః పిబతి। జలమునత్యంతమభిలషించి యభిలాషముతీరువరకు త్రాగుచున్నాడని యర్థము. కావున శ్రద్ధాప్రతీఘాతమిచట స్పష్టమగుచున్నది. కణేశబ్దము సప్తమ్యన్తసదృశమగునిపాతము. ఇది అధికమగునభిలాషను బోధించును. మనశ్శబ్దమునట్టిదే. కావునకణేహత్య అనుచోట సమాసాన్తరము సప్తమికి లుగభావమెట్లగునని శంకింపరాదు.

772. పురోవ్యయమ్. 1-4-67. పురః, అవ్యయమ్।

పురస్కృత్య॥

772. పురః అనునవ్యయము గతిసంజ్ఞకమగును. పురస్కృత్య (పురః కృత్వా) "నమస్పురసోర్గత్యోః" అనుసూత్రముచే విసర్గమునకు సత్వమగును.

(పూ., పురో) పురఃకృత్వా అనుచోట పురశ్శబ్దమునకు గతిసంజ్ఞా నివృత్తికై అవ్యయగ్రహణమావశ్యకము. ఈసూత్రమున కృఞ్ యోగమందే అనునియమము లేదు. కాన పురోభూయ పురోగత్య మొదలగునవిగూడనుదాహరణములగును.

773. అస్తంచ. 1-4-68. అస్తమ్, చ (అవ్యయమ్)

అస్తమితిమాన్తమవ్యయం గతిసంజ్ఞం స్యాత్। అస్తం గత్య॥

773. మకారాన్తమగు అస్తమ్ అనునవ్యయము క్రియాయోగమునందు గతిసంజ్ఞకమగును. అస్తంగత్య (అస్తం గత్వా) అంతర్ధానమునుపొంది అని యర్థము. అవ్యయగ్రహణమనువర్తింపకున్నసర్థాంతరమందు అవ్యయముగానట్టి అస్తమనుదానికిని గతిసంజ్ఞ ప్రవర్తింపవలసివచ్చును. అస్తం కృత్వా కాండం గతః। ఇచట అస్తమనునది యవ్యయముగాదు. అస్తమ్—క్షిప్తము. కాండమును క్షిప్తమైనదానినిగజేసి వెళ్ళినవాడనియర్థము.

774. అచ్ఛ గత్యర్థవదేషు. 1-4-69. అచ్ఛ, గత్యర్థవదేషు, (అవ్యయమ్)

అవ్యయమిత్యేవ। అచ్ఛగత్య। అచ్ఛోద్య। అభిముఖం గత్వా ఉక్త్వా చేత్యర్థః। అవ్యయం కిమ్। జలమచ్ఛం గచ్ఛతి॥

774. అచ్ఛ అనునవ్యయము,గత్యర్థకమగు ధాతువులు, వదధాతువువీనితో యోగమున్నపుడు గతిసంజ్ఞకమగును. అచ్ఛగత్య (అచ్ఛ గత్వా) అచ్ఛ అనునవ్యయమభిముఖవాచకము. ఎదురుగవెళ్లి యనియర్థము. అచ్ఛోద్య। ఇది వదధాతువుతో యోగమున్నపుడుదాహరణము. వదధాతువుకంటె క్త్వాప్రత్యయము. సమాసాన స్తరము ల్యప్ప్రత్యయము అభిముఖముగ చెప్పియని యర్థము. అవ్యయమనునది లేనిచో జలమచ్ఛం గచ్ఛతి అనుచోట స్వచ్ఛమనునర్థమును బోధించుఅచ్ఛమను జలవిశేషణవాచకమునకును గతిసంజ్ఞ ప్రసక్తమయ్యెడిని. గతిసంజ్ఞయున్నచో నవ్యయమగును గానసుప్ప్రత్యయమునకు లుక్కు ప్రసక్తమగును.

775. అదోఽనుపదేశే. 1-4-60. అదః, అనుపదేశే.

అదఃకృత్య, అదఃకృతమ్। పరంప్రత్యుపదేశే ప్రత్యుదాహరణమ్। అదః కృత్వా॥

775. ఉపదేశముకంటెభిన్నమగునర్థమందు అదశ్శబ్దము గతిసంజ్ఞకమగును. అదఃకృత్య (అదఃకృత్వా) దీనిని చేసి యనియర్థము. అదః కృతమ్। ఈరెండుమదాహరణములు. అదఃకృత్య అనుచోట గతిసంజ్ఞకు సమాసల్యబాదులు ఫలము. అదఃకృతమనుచోట అదః అనుదానికి "గతిరనన్తరః" (6-2-49) సూ.చే

విహితమగు స్వరము ప్రవర్తించుట గతిసంజ్ఞకు ఫలము. ఇతరులకుపదేశింపక తనంతటతానాలోచించునపుడుదాహరణము. పరులకుపదేశముచేయునపుడు ప్రత్యుదాహరణము. అదః కృత్వా॥

776. తిరోఽన్తర్ధౌ. 1-4-71. తిరః అన్తర్ధౌ।

తిరోభూయ॥

776. తిరస్అనునవ్యయము వ్యవధానమనునర్థమందు గతిసంజ్ఞకమగును. తిరోభూయ (తిరః భూత్వా)

777. విభాషా కృఞి. 1-4-72. విభాషా, కృఞి (తిరః)

తిరస్కృత్య। తిరఃకృత్య। తిరఃకృత్వా॥

777. తిరస్అనునవ్యయము కృఞ్ధాతువుతో యోగమున్నపుడు వికల్పముగ గతిసంజ్ఞకమగును. తిరస్కృత్య। తిరఃకృత్య। తిరఃకృత్వా। గతిసంజ్ఞాపక్షమందు గతిసమాసము. ల్యప్ప్రత్యయము. "తిరసోఽన్యతరస్యామ్" (157) సూ. చే సత్వవికల్పమునగును. సత్వవిధాయకసూత్రమున గతిగ్రహణానువృత్తియుండుటచే గతిసంజ్ఞలేనిపక్షమందు సత్వముగూడ ప్రవర్తింపదు. కావున మూడు రూపములగును.

వివ:—పరాభవరూపార్థమున తిరస్కారశబ్దప్రయోగముననుసరించి కొందఱు సత్వవిధాయకసూత్రమున గతిగ్రహణానువృత్తిచేయలేదని మాధవాచార్యులు ధాతువృత్తిఅనుగ్రన్థమున వ్రాసెను.

778. ఉపాజేఽన్వాజే. 1-4-73. ఉపాజే, అన్వాజే (విభాషా, కృఞి)

ఏతౌ కృఞి వా గతిసంజ్ఞౌ స్తః। ఉపాజేకృత్య, ఉపాజే కృత్వా। అన్వాజేకృత్య। అన్వాజే కృత్వా। దుర్బలస్య బలమాధాయేత్యర్థః॥

778. ఉపాజేఅన్వాజే అనునీరెండును ఏదన్తములు విభక్తిప్రతిరూపకములునగునిపాతములు. ఇవి బలహీనునకు బలమును సమకూర్చుట యనునర్థమును బోధించును. ఉపాజే అన్వాజే అనునీరెండునిపాతములు కృఞ్ధాతుయోగమున వికల్పముగ గతిసంజ్ఞకములగును. ఉపాజేకృత్య। ఉపాజేకృత్వా। గతిసంజ్ఞాభావపక్షమందు సమాసము ప్రవర్తింపకుండుటచే ల్యప్ప్రత్యయమురాదు. ఇట్లే అన్వాజేకృత్య, అన్వాజేకృత్వా। అనియగును. దుర్బలునకు బలమును సమకూర్చియని యర్థము.

779. * సాక్షాత్ప్రభృతీని చ. 1-4-74. సాక్షాత్ప్రభృతీని, చ, (విభాషా, కృఞి)

కృఞి వా గతిసంజ్ఞాని స్యుః। (వా) చ్వ్యర్థఇతి వాచ్యమ్। సాక్షాత్కృత్య। సాక్షాత్కృత్వా। లవణంకృత్య। లవణంకృత్వా। మాన్తత్వం నిపాతనాత్॥

779. సాక్షాత్ప్రభృతిగణమున పఠింపబడు సాక్షాత్ మిథ్యా చిన్తా మొదలగునవి కృఞ్ ధాతువుతో యోగమున్నప్పుడు వికల్పముగ గతిసంజ్ఞగలవగును. (వా) ఈసూత్రముచే గతిసంజ్ఞ చ్వి ప్రత్యయార్థము (అభూత తద్భావము) గమ్యమానమగునపుడు ప్రవర్తించునని చెప్పవలయును. సాక్షాత్కృత్య। సాక్షాత్కృత్వా। ఇచట అసాక్షాత్ సాక్షాత్కృత్వా అనుచ్వ్యర్థము (అభూతతద్భావము) గమ్యమానమగును. ఇట్లే లవణంకృత్య। లవణంకృత్వా। అగుచున్నవి, లవణమ్ ఉష్ణమ్ శీతమ్ ఉదకమ్ ఆర్ద్రమ్ అనునవి యగు శబ్దములకు గతిసంజ్ఞయున్నప్పుడు మకారాన్తత్వము నిపతింపబడెను.

780. అనత్యాధాన ఉరసిమనసీ. 1-4-75. అనత్యాధానే, ఉరసిమనసీ, (విభాషా, కృఞి)

ఉరసికృత్య। ఉరసి కృత్వా। అభ్యుపగమ్యేత్యర్థః। మనసికృత్య। మనసి కృత్వా। నిశ్చిత్యేత్యర్థః। అత్యాధానముపశ్లేషణం తత్ర న। ఉరసి కృత్వా పాణిం శేతే॥

780. ఉరసి మనసి అనునవి సప్తమ్యన్తశబ్దసదృశములగునవ్యయములు. అత్యాధానమనగనుపశ్లేషణము. తదభావమందు ఉరసి మనసి అనునవి కృఞ్ ధాతుయోగమున వికల్పముగ గతిసంజ్ఞకములగును. ఉరసికృత్య। ఉరసి కృత్వా। అంగీకరించి యని యర్థము. మనసికృత్య। మనసి కృత్వా। నిశ్చయించియని యర్థము. ఈరెండు స్థలములందునత్యాధానము గమ్యమానముకాదు. ఉపశ్లేషణమనగ సంయోగము అది ప్రతీయమానమగునపుడు గతిసంజ్ఞరాదు. ఉరసి కృత్వా పాణిం శేతే। వక్షస్థలమందు హస్తముంచి నిద్రించుచున్నాడని యర్థము. ఇచట హస్తసంయోగము గమ్యమానమగుచున్నందున గతిసంజ్ఞ ప్రవర్తింపదు.

781. మధ్యే పదే నివచనే చ. 1-4-76. మధ్యే, పదే. నివచనే, చ, (విభాషా, కృఞి, అనత్యాధానే)

---

* సాక్షాత్ మిథ్యా చిన్తా భద్రా రోచనా ఆస్థా అమా అద్ధా ప్రాజర్యా ప్రాజరుహా బీజర్యా బీజరుహా సంసర్యా అర్థే లవణమ్ ఉష్ణమ్ శీతమ్ ఉదకమ్ ఆర్ద్రమ్ అగ్నౌ వశే వికసనే విహసనే ప్రతపనే ప్రాదుస్ నమస్ ఆవిస్ ఆకృతిగణోఽయమ్.

ఏతే కృఞి వా గతిసంజ్ఞాః స్యురనత్యాధానే। మధ్యేకృత్య।
మధ్యేకృత్వా। పదేకృత్య। పదే కృత్వా। నివచనేకృత్య। నివ
చనే కృత్వా। వాచం నియమ్యేత్యర్థః॥

781. మధ్యే పదే నివచనే ఇవి ఏదన్తములుగ నిపతింపబడినవి. ఈమూడును అనత్యాధానమందు కృఞ్ధాతుయోగమున్నప్పుడు వికల్పముగ గతిసంజ్ఞకలవగును. మధ్యేకృత్య। మధ్యేకృత్వా। పదేకృత్య। పదే కృత్వా। నివచనే కృత్య। నివచనే కృత్వా। నివచనేకృత్య అనుదానికి వాచంనియమ్య (మాటలను విడిచి) అని యర్థము. వచనస్యాభావః అనునర్థమునందవ్యయీభావముచే నివచనమని సిద్ధమగుటవలన నిట్టియర్థము లభించును.

782. నిత్యం హస్తే పాణావుపయమనే. 1-4-77. నిత్యమ్. హస్తే, పాణౌ, ఉపయమనే, (కృఞి)

కృఞి। ఉపయమనం వివాహః। స్వీకారమాత్రమిత్యన్యే
హస్తే కృత్య। పాణౌకృత్య॥

782. హస్తే పాణౌ అను రెండుశబ్దములు ఉపయమనార్థమందు కృఞ్ధాతుయోగమున్నపుడు నిత్యముగ గతిసంజ్ఞకములగును. ఉపయమనమున వివాహము. స్వీకారమాత్రమని కొందరనిరి. ఉపయమనార్థమందీరెండును క్రమముగ ఏకారాన్తముగను ఔకారాన్తముగను నిపతింపబడినవి. హస్తేకృత్య। పాణౌకృత్య। వివాహముచేసికొని యనియర్థము.

783. ప్రాధ్వం బన్ధనే. 1-4-78. ప్రాధ్వమ్। బన్ధనే। (కృఞి)

ప్రాధ్వమిత్యవ్యయమ్। ప్రాధ్వంకృత్య। బన్ధనేనాను
కూల్యం కృత్వేత్యర్థః। ప్రార్థనాదినాత్వానుకూల్యకరణే।
ప్రాధ్వంకృత్వా॥

783. ప్రాధ్వమ్ అనునది మాన్తమగునవ్యయము. ఇది బన్ధనముచే నానుకూల్యమును బోధించును. ప్రాధ్వమ్ అనునది బన్ధనముచేనానుకూల్యము గమ్యమానమగునపుడు కృఞ్ధాతుయోగమునందు గతిసంజ్ఞకమగును. ప్రాధ్వంకృత్య। బన్ధనముచేననుకూలమునుగాజేసి అనియర్థము. బన్ధనముచేగాక ప్రార్థనాదులచేనానుకూల్యము గమ్యమానమగునపుడుమాత్రమీసూత్రము ప్రవర్తింపదు. ప్రాధ్వం కృత్వా॥

784. జీవికోపనిషదావౌపమ్యే. 1-4-79. జీవికోపనిషదౌ,
ఔపమ్యే (కృఞి)

జీవికామివ కృత్వా జీవికాకృత్య। ఉపనిషదమివ కృత్వా ఉపనిషత్కృత్య। ఔపమ్యే కిమ్। జీవికాం కృత్వా। ప్రాది గ్రహణమగత్యర్థమ్। సుపురుషః। అత్రవార్తికాని। (1) ప్రాదయో గతాద్యర్థే ప్రథమయా। ప్రగతఆచార్యః ప్రాచార్యః। (2) అత్యాదయః క్రాన్తాద్యర్థే ద్వితీయయా। అతిక్రాన్తో మాలామతిమాలః। (3) అవాదయః క్రుష్టాద్యర్థే తృతీయయా। అవకృష్టః కోకిలాయా అవకోకిలః। పర్యాదయో గ్లానాద్యర్థే చతుర్థ్యా। పరిగ్లానోఽధ్యయనాయ పర్యధ్యయనః। (5) నిరాదయః క్రాన్తాద్యర్థే పంచమ్యా। నిష్క్రాన్తః కౌశాంబ్యాః నిష్కౌశాంబిః। (వా) కర్మప్రవచనీయానాం ప్రతిషేధః। వృక్షంప్రతి॥

784. జీవికా ఉపనిషత్ అను రెండుశబ్దములును సాదృశ్యము గమ్యమాన మగునపుడు కృఞ్ ధాతుయోగమందు గతిసంజ్ఞకములగును. జీవికాకృత్య (జీవికామివ కృత్వా) గతిసమాసల్యప్ప్రత్యయములు. జీవనోపాయము జీవికయనం బడు. జీవికవలెనవశ్యముగజేసి యనియర్థము. ఉపనిషత్కృత్య। (ఉపనిషదమివ కృత్వా) వేదాన్తముపనిషచ్ఛబ్దార్థము. దానినివలెజేసి యనియర్థము. జీవికాం కృత్వా। ఇచటనౌపమ్యముప్రతీయమానముగానందున గతిసంజ్ఞరానేరదు. ఇది గతిసమాసనిరూపణము. ప్రాదిసమాసములు:—కుగతిప్రాదయః, అనుసూత్రము లోని ప్రాదిగ్రహణము, ప్రాదులకు గతిసంజ్ఞలేకున్నను సమర్థమగుదానితో సమాసము సిద్ధించుటకగును. కనుకనే సుపురుషః అనుచోట క్రియాయోగములేనందున సుఅనుదానికి గతిసంజ్ఞలేకున్నను ప్రాదిసమాసము సిద్ధించును. వ్యవస్థలేకుండ ప్రాప్తమగు ప్రాదిసమాసముయొక్క వ్యవస్థకొఱకు వార్తికములిచట ప్రదర్శింపబడుచున్నవి. (1) ప్రాదులు గతాద్యర్థమందు ప్రథమాన్తముతో సమసించును. ప్రాచార్యః। నిత్యసమాసమగుటచే ప్రగతః ఆచార్యః అని యస్వపదవిగ్రహమును చెప్పవలయును. ప్రఅనునది "గతః" అనునర్థమందు వర్తించును. ప్రపితామహః। ఇత్యాదులనిట్లే యూహింపవలయును. (2) అత్యాదులు క్రాన్తాద్యర్థమందు ద్వితీయాన్తముతో సమసించును. అతిమాలః (అతిక్రాన్తో మాలమ్) అతిఅనునది క్రాన్తార్థమును బోధించును. మాలాశబ్దమువసర్జనమగుటచే "గోస్త్రియోః" (660) సూ. చే హ్రస్వము వచ్చును. (3) తృతీయాన్తముతో అవాదులు క్రుష్టాద్యర్థమందు సమసించును. అవకోకిలః। (అవకృష్టః కోకిలయా) క్రుష్టఃఅనుదానికి ఆహూతః (పిలువబడినవాడు) అనియర్థము. (4) చతుర్థ్యన్తముతో గ్లానాద్యర్థమందు పరిమొదలగునవి సమసించును.పర్యధ్యయనః। (పరిగ్లానోఽధ్యయనాయ) అధ్యయనముకొఱకు అలసినవాడని యర్థము. (5) పంచమ్యన్తముతో నిరాదులు క్రాన్తాద్యర్థమందు సమసించును. నిష్కౌశాంబిః (నిష్క్రాన్తః కౌశామ్బ్యాః) కౌశాంబి

నుండి వెడలినవాడని యర్థము. నిర్ అనునవ్యయము క్రాన్తార్థమందు వర్తించును. కౌశాంబీశబ్దమునకుపసర్జనహ్రస్వమగును.

(వా) కర్మప్రవచనీయానాం ప్రతిషేధః = కర్మప్రవచనీయసంజ్ఞకములగు ప్రాదులకీసమాసము రాదు. వృక్షంప్రతి। ఇచట ప్రతిఅనునది "లక్షణేత్థంభూతాఖ్యాన" (555) సూ. చే కర్మప్రవచనీయసంజ్ఞకము గానప్రాదిసమాసము ప్రవర్తింపదు. (సురాజా అతిసఖా అనుభాష్యప్రయోగమువలన సు అతి వీనికంటె భిన్నములగు కర్మప్రవచనీయములకే ప్రాదిసమాసనిషేధమని గ్రహించునది.) ఇది ప్రాదిసమాసము.

ఇటుపై ఉపపదసమాసమును చెప్పబోవుచునుపపదసంజ్ఞాసూత్రమును వ్యాఖ్యానముచేయుచున్నాడు:—

785. తత్రోపపదం సప్తమీస్థమ్. 3-1-92. తత్ర, ఉపపదమ్, సప్తమీస్థమ్।

సప్తమ్యన్తే పదే కర్మణీత్యాదౌ వాచ్యత్వేన స్థితమ్
కుమ్భాది తద్వాచకం పదముపపదసంజ్ఞం స్యాత్తస్మింశ్చ
సత్యేవ వక్ష్యమాణః ప్రత్యయః॥

785. ఇది అధికారసూత్రము. ఈసూత్రమున సప్తమిఅనుపదముచే సప్తమ్యన్తము గ్రహింపబడును. సప్తమ్యన్తే (వాచ్యవాచకభావసంబంధముచే) తిష్ఠతి అనువృత్తిచే సప్తమీస్థమనుదానికి సప్తమ్యన్తపదవాచ్యమనునర్థము ఫలించును. ధాతోః అనునధికారమున "కర్మణ్యణ్" (3-2-1) ఇత్యాదిసూత్రములందు కర్మణి ఇత్యాదిసప్తమ్యన్తములకు వాచ్యమగునదని యర్థము. అందుచే కర్మణ్యణ్ ఇత్యాదిసూత్రములకుదాహరణములగు కుంభకారః ఇత్యాదులందు కుంభంకరోతి అనునవస్థయందు సప్తమ్యన్తపదవాచ్యములు కుంభాదులగును. కుంభాదులకుపపదసంజ్ఞవలన ప్రయోజనములేకుండుటచేతను ఉపపదమనుమహాసంజ్ఞాబలముచేతను తద్వాచకములందు సంజ్ఞ పర్యవసన్నమగును. కావున కర్మణీత్యాదిసప్తమ్యన్తములకర్థములగు కుంభాదులను బోధించుపదములుపపదసంజ్ఞకములగుననిసూత్రార్థము. "తస్మింశ్చసత్యేవ వక్ష్యమాణః ప్రత్యయః" అనునది తత్ర అనుదానికి వివరణము. ఉపపదమున్నపుడే అణ్ప్రత్యయాదులు ప్రవర్తించునని యర్థము. అట్లుకాకున్నునుపపదములేనపుడును కేవలధాతువుకంటెగూడనణ్ప్రత్యయాదులు ప్రవర్తింపవలసివచ్చును.

వివ :— "కర్మణ్యణ్" ఇత్యాదిసూత్రములందు "కర్మణి" మొదలగునవి ప్రథమార్థమందు సప్తమ్యన్తములు. ధాతోః అనునధికారమువలన ధాతువున కణ్ప్రత్యయము వచ్చును, కర్మవాచకముపపదసంజ్ఞకమగుననునర్థము లభించు

చుండును. కుంభకారః మొదలగునవి యుదాహరణములు. కుంభకరోతి అనునర్థమందు "కర్మణ్యణ్" సూత్రముచే కృఞ్ధాతువునకణ్ప్రత్యయమగును. కర్మవాచకమగుకుంభమనునది యుపపదమగును. ఉపపదమున్నపుడే అణాదులు ప్రవర్తించును. కర్మణీత్యాదిసప్తమీనిర్దేశముపపదసంజ్ఞాప్రవృత్తికొఱకగును. "ధాతోః సమానకర్తృకాదిచ్ఛాయాం"। (2) "ధాతోరేకాచో హలాదేః క్రియాసమభిహారే యఙ్" (3) ధాతోః" అనునీమూడు ధాత్వధికారములలో సామీప్యముచే మూడవ ధాత్వధికారమే యిచట గ్రహింపబడును. కావున ధాతోరేకాచో అనుధాత్వధికారమందలి "చ్లిలుఙి" ఇత్యాదిసూత్రములలోని సప్తమ్యన్తములిచట సప్తమీశబ్దముచే గ్రహింపబడవు.

786. ఉపపదమతిఙ్. 2-2-19. ఉపపదమ్, అతిఙ్ (సుప్)

ఉపపదం సుబన్తం సమర్థేన నిత్యం సమస్యతే। అతిఙన్తశ్చాయం సమాసః। కుమ్భంకరోతీతి కుమ్భకారః। ఇహ కుమ్భఅస్ కార ఇత్యలౌకికం ప్రక్రియావాక్యమ్।అతిఙ్ కిమ్। మా భవాన్ భూత్। మాఙి లుఙితి సప్తమీనిర్దేశాన్మాఙుపపదమ్। అతిఙ్గ్రహణం జ్ఞాపయతి సుపేత్యేతన్నేహాఽనువర్తత ఇతి। పూర్వసూత్రేఽపి గతిగ్రహణం పృథక్కృత్య అతిఙ్గ్రహణం తత్రాపకృష్యతే। సుపేతి చ నివృత్తమ్। తథా చ। గతికారకోపపదానాం కృద్భిస్సహ సమాసవచనం ప్రాక్సుబుత్పత్తేరితి సిద్ధమ్। వ్యాఘ్రీ। అశ్వక్రీతీ। కచ్ఛపీ॥

786. సమర్థపరిభాషవలన సమర్థేన అనునది లభించును. ఉపపదసంజ్ఞకమగు సుబన్తము సమర్థమగుదానితో సమసించును. అతిఙ్ అనుచోట తిఙ్పదముచే తిఙన్తము గ్రహింపబడును. అతిఙ్ అనునది బహువ్రీహియగుటచే నీసమాసము తిఙన్తముగలది కాదనునర్థము లభించును. కుంభకారః। కుంభంకరోతి అనునర్థమందు "కర్మణ్యణ్" (3-2-1) సూత్రముచే కర్మవాచకమగు కుంభపదముపపదమగుచుండ కృఞ్ధాతువుకంటె కర్త్రర్థమున అణ్ప్రత్యయమగును. "అచోఞ్ణితి" (265) సూత్రముచే వృద్ధి ప్రవర్తింప కారఅనుశబ్దము సిద్ధించును. కారశబ్దముతో కుంభశబ్దమునకీసూత్రముచే సమాసము. ఇచట కుంభ+అస్+కార అనునది లోకమున ప్రయోగార్హముగానట్టి (అలౌకికము) ప్రక్రియావాక్యము. ఈయలౌకికవాక్యమునందే సమాసము మొదలగునవి ప్రవర్తించును. కుంభంకరోతి అనునదర్థప్రదర్శనము గానివిగ్రహవాక్యము కాదు. కావున సమాసము తిఙన్తరహితమగునని చెప్పునపుడు కుంభంకరోతిఅనువిగ్రహప్రదర్శనమయుక్తమని చెప్పుటకవకాశములేదు. కృద్యోగమందు షష్ఠివిధింపబడుటచే కుంభ+అమ్ కారఅనిఅలౌకికవాక్యమునుచూపకూడదు. అతిఙ్ కిమ్।సుపా అనుతృతీయాన్తమనువృత్తగుటచేతిఙన్తముతోసమాసము ప్రసక్తము కానందున దీనికేమి ఫలమని ప్రశ్నాశయము. "మాఙి లుఙ్" (3-3-175)

(మాఙ్ ఉపపదమైనపుడు లుఙ్ వచ్చును) అనుసూత్రమందు సప్తమీనిర్దేశము వలన మాఙుపపదమగును గాన "మాభూత్" అనుచోట మాఙునకు భూత్ అను తిఙన్తముతో సమాసము రాకుండుటకై సూత్రమున అతిఙ్గ్రహణమావశ్యకమని సమాధానాశయము. భవాన్ అనునది సమాసాభావమును సూచించుటకై ప్రయోగింపబడినది. ఈసూత్రమున "సుపా" అనుదానికనువృత్తిచేసినందుననే "మాభూత్"అనుచోట తిఙన్తముతోనుపపదమునకు సమాసము నివృత్తమగుచుండనచట సమాసనివృత్తికొరకుచేయబడిన "అతిఙ్పదము వ్యర్థమయి ఈసూత్రమున "సుపా" అనుదానికి సంబంధము లేదనునర్థమును జ్ఞాపనము చేయును. అందుచే నుపపదసమాసము తిఙన్తభిన్నోత్తరపదకమగునని సూత్రార్థము ఫలించును. అనన్తరము "మాభూత్" అనుచోట సమాసనివృత్తికొరకు అతిఙ్ గ్రహణమావశ్యకమగును. ఇందువలననుపపదము సుబుత్పత్తిగాకపూర్వముకృదన్తముతో సమసించుననిఫలితమగును. ఈసూత్రమునకు పూర్వమందున్న "కుగతిప్రాదయః" అనుసూత్రమున గతిగ్రహణమును విభాగముచేసి (కుప్రాదయః—గతిః అని యోగవిభాగమునుచేసి) ఈసూత్రమునుండి అతిఙ్గ్రహణము విభక్తమగు గతిః అను సూత్రములోనికపకర్షము చేయబడును. ఇచటను సుపాఅనుదానికి నివృత్తి బోధితమగును. (ఉత్తరసూత్రమునుండి పూర్వసూత్రములోనికనువృత్తి యపకర్షమనబడును) అందువలన గతిసమాసమ గూడ తిఙన్తభిన్నోత్తరపదకమగునని సిద్ధించును. ఇందువలన గతిసంజ్ఞకము సుబుత్పత్తిగాక పూర్వము కృదన్తముతో సమసించునని ఫలితమగును. ఈరీతిని గతికారకోపపదానాం కృద్భిస్సహ సమాసవచనం ప్రాక్సుబుత్పత్తేః అనుప్రాచీన పఠితమగు పరిభాష సిద్ధించును. గతిసంజ్ఞకములకు, కారకములకు, ఉపపదములకును, కృదన్తములతో సుబుత్పత్తిగాక పూర్వము సమాసమును చెప్పవలయునని పై పరిభాషకర్థము. ఆలోచింప పైజూపిన విధముచే గత్యుపపదములకే కృదన్తములతో సుబుత్పత్తికిపూర్వము సమాసమవిలభించును. అయినను కారకవిషయకము గూడనగునని ప్రాచీనులపరిభాషకు "ఏకాదేశాను మత్యా సర్వానుమతిః" (ప్రామాణికులచేనంగీకరింపబడు విషయము అందు కొన్నిప్రమాణసహితములగునపుడు మిగిలినవియు సప్రమాణములేయని యూహింపదగును) అనున్యాయముచే కారకవిషయమునగూడప్రవృత్తి సిద్ధమగునని గ్రహించునది. ఈపరిభాషకు ఫలములు జూపబడుచున్నవి.

(1) గతిసమాసమునకు:—వ్యాఘ్రీ=ఘ్రఅనునది ఘ్రా (గంధోపాదానే) ధాతుప్రకృతికమగు కప్రత్యయాన్తము. కృదన్తమగు దీనితో గతిసంజ్ఞకమగు ఆఙనకున్న ఆఘ్రశబ్దముతో వి అనుదానికిని గతిసమాసమునుచేసిన వ్యాఘ్ర అను ప్రాతిపదికమేర్పడును. పిదపనిది జాతివాచకమునదన్తమగుటచే "జాతేరస్త్రీ" అను సూ. చే జీషు ప్రవర్తించిన వ్యాఘ్రీ అనునది సిద్ధమగును. గతిసంజ్ఞకము సుబన్తముతో సమసించుననిన ఘ్రశబ్దముకంటె సుబుత్పత్తిగావలయును. అది సంఖ్యాదులనపేక్షించును. అట్లయిన స్వార్థద్రవ్యలిఙ్గసంఖ్యాకారకప్రయుక్తకార్యములకు

క్రమికత్వనియమముండుటవలన ప్రథమమున పుశబ్దముకంటె స్త్రీలిఙ్గబోధక టాప్ప్రత్యయము రావలసివచ్చును. కేవలమగు పుశబ్దము జాతివాచకముగాకపోవుటచే టాప్పునకపవాదమగు జాతిలక్షణజీషునకు ప్రాప్తియుండదు. కావుననభీష్టరూపసిద్ధిగాకపోవును. పరిభాషనంగీకరించినచో కృదన్తమగు పుశబ్దముకంటె సుబుత్పత్తిగాకపూర్వమే గతిసమాసము ప్రవర్తించును. అనన్తరము వ్యాఘ్రశబ్దము జాతివాచకమునదన్తమునగుటవలన టాపునుబాధించి జీష్ప్రత్యయము వచ్చుటచేనిష్టసిద్ధియగును.

(2) కారకమునకు:—అశ్వక్రీతీ అశ్వేనక్రీతాఅనువిగ్రహమున అశ్వశబ్దక్రీతశబ్దములకు "కర్తకరణే కృతా బహులమ్" (698) అనుసూత్రముచే సమాసము. క్రీతాత్కరణపూర్వాత్ (509) అను సూ. చే జీష్ప్రత్యయము ప్రవర్తించిన పైరూపము సిద్ధమగును ఇచటగూడ అశ్వేన అను కరణవాచకమునకు సుబన్తముతో సమాసమనిన పూర్వమువలె క్రీతశబ్దముకంటె మొదట టాప్ప్రత్యయమే ప్రవర్తిపవలసివచ్చును. సమాసానన్తరము క్రీతశబ్దమదన్తముగానందున జీషు రాకుండును. పరిభాషయున్నపుడు సుబుత్పత్తికి పూర్వమేసమాసము ప్రవర్తించుటచే కరణపూర్వకమగు క్రీతశబ్దమదన్తమగును గానజీష్ప్రత్యయము నిశ్శంకముగ ప్రవర్తించును.

(3) ఉపపదసమాసమునకు :— కచ్ఛపీ। కచ్ఛే పిబతి అనునర్థమందు "సుపి స్థః" (3-2-4) అనుసూత్రమున సుపి అనుయోగవిభాగముచే పాధాతువునకు కప్రత్యయము. కచ్ఛశబ్దముపపదమగుటవలననీసూత్రముచేనుపపదసమాసము. ఇచటగూడ సుబన్తముతో సమాసమనిన పైరీతిని టాప్ప్రత్యయమే ప్రవర్తింపవలసివచ్చును. సుబుత్పత్తికి పూర్వముపపదసమాసమనిన కచ్ఛపశబ్దము జాతివాచకమగును గానటాపునుబాధించి జీష్ప్రత్యయము నిర్బాధముగనగును.

787. అమైవావ్యయేన. 2-2-20. అమా, ఏవ, అవ్యయేన।

అమైవ తుల్యవిధానం యదుపపదం తదేవాఽవ్యయేన సహ సమస్యతే। స్వాదుఙ్కారమ్। నేహ। కాలసమయవేలాసు తుమున్। కాల స్సమయో వేలా వా భోక్తుమ్। అమైవేతి కిమ్। అగ్రే భోజమ్। అగ్రే భుక్త్వా। విభాషాగ్రేప్రథమపూర్వేష్వితి క్త్వాణములౌ। అమాచాన్యేన చ తుల్యవిధానమేతత్॥

787. అధ్యాహారమువలన తుల్యవిధానమనునది లభించును. అమ్ ప్రత్యయముతోనే సమానమగు విధానముగల ఉపపదమే అవ్యయముతో సమసించును. అమ్ప్రత్యయమును (ణముల్ ఖముఞ్) మాత్రము విధించుశాస్త్రముచే దేనికి అమ్ప్రత్యయముతోగూడనుపపదసంజ్ఞ విధింపబడునో ఆయుపపదమే అవ్యయ

ముతో సమసించునని ఫలితము. పూర్వసూత్రముచే సమాసము సిద్ధించుచుండ నీసూత్రము నియమార్థమగును. ఉదా:—స్వాదుఙ్కారమ్। (స్వాదుం కృత్వా) "స్వాదుమిణముల్", (3-4-26) అనుసూత్రముచే నమ్ప్రత్యయముతో (ణముల్) సమానముగనే స్వాదుమ్ అను దానికుపపదసంజ్ఞ విధింపబడెను. స్వాదుమ్ అనునది నిపాతనమువలన మాన్తమగును. ఇది కాంమనునవ్యయముతో సమసించును. ఇది అమాతుల్య విధానమనుటకు ఫలము. "కాలసమయవేలాసు తుమున్" (3-3-167) అనుసూత్రమున కాలసమయవేలాసు అనుసప్తమీవిర్దేశమువలన కాలసమయవేలాశబ్దములకుపపదసంజ్ఞయున్నను వానికి తుమున్ప్రత్యయముతో తుల్యవిధానమున్నది గాని అమ్ప్రత్యయముతో తుల్యవిధానము లేనందున నాసూత్రోదాహరణములగు కాలో భోక్తుమ్ సమయో భోక్తుమ్ ఇత్యాదులందీ సూత్రముచే నుపపదసమాసము ప్రవర్తింపదు. అగ్రేభోజమ్ అగ్రే భుక్త్వా అనుచోట "విభాషాగ్రేప్రథమపూర్వేషు" (3-4-24) అను సూ.చే క్త్వాప్రత్యయణముల్ ప్రత్యయములతో సమానముగ అగ్రేప్రథమపూర్వశబ్దములకుపపదసంజ్ఞ విధింపబడినది గాని అమ్ప్రత్యయముతోనే అది విధింపబడలేదు గాన అగ్రేశబ్దభోజశబ్దములకుపపదసమాసము రాదు. అమైవ అనునియమమునకిదియే ఫలము.

788. తృతీయాప్రభృతీన్యన్యతరస్యామ్. 2-2-21. తృతీయాప్రభృతీని, అన్యతరస్యామ్।

ఉపదంశస్తృతీయాయామిత్యాదీన్యుపపదాన్యమన్తేనాఽవ్యయేన సహ వా సమస్యంతే। మూలకేనోపదంశం భుఙ్క్తే। మూలకోపదంశమ్॥

788. ఏవకారమునువిడిచి పైసూత్రమునువర్తించును. అమా అనునది అవ్యయేన అనుదానికి విశేషణము. తృతీయాప్రభృతీని అనుచోట తృతీయాశబ్దము "ఉపదంశస్తృతీయాయామ్" (3-4-47) అనుసూత్రమును గ్రహించును. ప్రభృతిగ్రహణముచే నాసూత్రము మొదలు "అన్వచ్యానులోమ్యే" (3-4-64) అనుసూత్రాన్తమువరకున్న సూత్రములు వివక్షితములు. కావున ఉపదంశస్తృతీయాయామ్ అనుసూత్రము మొదలు అన్వచ్యానులోమ్యే అనుసూత్రాన్తమువరకునున్న సూత్రములచే బోధింపబడిన నుపపదసంజ్ఞకములు అమన్తమగునవ్యయముతో వికల్పముగ సమసించును. మూలకోపదంశమ్ (మూలకేన ఉపదంశం భుఙ్క్తే।) ఉపదంశస్తృతీయాయామ్ అనుసూత్రముచే దంశధాతువునకు ణముల్ ప్రత్యయము, మూలకేన అనుతృతీయాన్తమునకుపపదసంజ్ఞయునగును. సమాసాభావమందు మూలకేనోపదంశమ్ అనియుండును.

వివ:— మూలకోపదంశమ్। ఇచట ఉపపదసంజ్ఞ అమ్ప్రత్యయముతోనే తుల్యవిధానముగలది గాన పూర్వసూత్రముచే సమాసము నిత్యముగ ప్రాప్తించు

చుంత, ఉచ్చైఃకారమ్ ఇత్యాదులందు "అవ్యయే యథాభిప్రేతే" త్యాదిసూత్రముచే క్త్వాప్రత్యయణముల్ ప్రత్యయములు విధింపబడుచున్నవి గానపూర్వసూత్రముచే సమాసమప్రాప్తమగుచుండ నీసూత్రమారంభింపబడుటవలననిది యుభయత్రవిభాషయని యెరుగవలయును. ఉచ్చైఃకారమిత్యాదులందుపపదసమాసమునకు సమాసస్వరము ఫలమగుననియూహించునది.

789. క్త్వాచ.2-2-22. క్త్వా,చ,(పూర్వసూత్రమనువృత్తమగును)

తృతీయాప్రభృతీన్యుపపదాని క్త్వాన్తేన సహ వా సమస్యంతే। ఉచ్చైఃకృత్య। ఉచ్చైః కృత్వా। అవ్యయేయథాభిప్రేతేతి క్త్వా। తృతీయాప్రభృతీనీతి కిమ్। అలం కృత్వా। ఖలు కృత్వా॥

789. క్త్వాఅనునది తృతీయాంతము. "ఉపదంశస్తృతీయాయామ్" మొదలగుసూత్రములచే విహితములగు ఉపపదసంజ్ఞగలవి క్త్వాప్రత్యయాంతముతోగూడ వికల్పముగ సమసించును. ఉచ్చైఃకృత్య। ఉచ్చైఃకృత్వా। ఇచట "అవ్యయేయథాభిప్రేతాఖ్యానేకృఞః క్త్వాణములౌ"। అను సూ. చే క్త్వాప్రత్యయము విధింపబడెను. ఈసూత్రము తృతీయాప్రభృతులలోనిది. ఉచ్చైః అనునవ్యయముపపదము. సమాసపక్షమందు ల్యప్ప్రత్యయము. సమాసాభావమందు ల్యప్ ప్రత్యయము ప్రవర్తింపదు. అలంకృత్వా। ఖలు కృత్వా। ఈస్థలములందు "ఉపదంశస్తృతీయాయామ్"ను సూత్రమునకు పూర్వమునున్న "అలంఖల్వోః ప్రతిషేధయోః ప్రాచాం క్త్వా" (3-4-18) అనుసూత్రముచే క్త్వాప్రత్యయము విధింపబడెనందున సమాసము ప్రవర్తింపదు. ఇట్టి స్థలములందు సమాసము ప్రవర్తింపకుండుటకై తృతీయాప్రభృతీని అనుటదావశ్యకము. ఇది ఉపపదసమాసము.

అవ :— తత్పురుషమందుమాత్రము ప్రవర్తించుసమాసాన్తప్రత్యయము లను ప్రదర్శింపుచున్నాడు.

790. తత్పురుషస్యాఙ్గులేః సంఖ్యాఽవ్యయాదేః, 5-4-86. తత్పురుషస్య, అఙ్గులేః, సంఖ్యావ్యయాదేః। (అచ్, సమాసాన్తాః)

సంఖ్యాఽవ్యయాదేరఙ్గుల్యన్తస్య తత్పురుషస్య సమాసాన్తోఽచ్ స్యాత్। ద్వే అఙ్గులీ ప్రమాణమస్య ద్వ్యఙ్గులం దారు। నిర్గతమఙ్గులిభ్యో నిరఙ్గులమ్॥

790. సంఖ్యావ్యయాదేః అనుదానికి సంఖ్యాఽవ్యయే ఆదీ యస్యస సంఖ్యాఽవ్యయాదిః తస్యఅని విగ్రహము. అఙ్గులేఃఅనునది తత్పురుషస్య అను దానికి విశేషణము. సంఖ్యావాచకముగాని అవ్యయముగాని ఆదియందుగల్గి అఙ్గులి

శబ్దమ స్తమందుగల తత్పురుషసమాసముకంటెపరమై సమాసాన్తమగు అచ్ ప్రత్యయము వచ్చునని యర్థము. సమాసాన్తముకావున సమాసమునకన్త్యావయవమగును. ప్రత్యయముకావున ప్రత్యయః పరశ్చ అను సూత్రములచే తత్పురుషముకంటెపరముగ వచ్చునని గ్రహించునది. ద్వ్యఙ్గులమ్ (దారు) ద్వే అఙ్గులీ ప్రమాణమస్య అనువిగ్రహమున "తద్ధితార్థోత్తరపదేత్యాది" సూత్రముచే ద్విగుసమాసము. ప్రమాణమందు "ప్రమాణేద్వయసజ్ దఘ్నచ్ మాత్రచః" (5-2-37) అను సూ. చే విధింపబడిన ద్వయసచ్ ప్రత్యయమునకు "ద్విగోర్లుగనపత్యే" (411-88) అను సూ. చే లుక్కగును. ఈసూత్రముచే ద్వ్యఙ్గులిశబ్దముకంటె అచ్ ప్రత్యయము ప్రవర్తించును. అదిపరమగునపుడు "యస్యేతిచ" అను సూ. చే ఇకారము లోపించును. ద్వ్యఙ్గులమని సిద్ధించును. అవ్యయాదియగు తత్పురుషమునకుదాహరణము. నిరఙ్గులమ్। (నిర్గతమఙ్గులిభ్యః) ఇచట "నిరాదయఃక్రాన్తాద్యర్థే" అనుదానిచే(ప్రాదిసమాసము) ఈసూత్రముచే సమాసాన్తము "యస్యేతిచ" సూత్రముచే ఇకారలోపమునూహించునది.

791. అహస్సర్వైకదేశసంఖ్యాతపుణ్యాచ్చ రాత్రేః.
5-4-87. అహస్సర్వైకదేశసంఖ్యాతపుణ్యాత్, చ, రాత్రేః
(అచ్, సంఖ్యావ్యయాదేః)

ఏభ్యో రాత్రేరచ్ స్యాచ్చాత్సంఖ్యావ్యయాదేః। అహర్గ్రహణం ద్వన్ద్వార్థమ్। అహశ్చ రాత్రిశ్చాహోరాత్రః। సర్వా రాత్రిస్సర్వరాత్రః। పూర్వం రాత్రేః పూర్వరాత్రః। సంఖ్యాతరాత్రః। ద్వయోరాత్ర్యోస్సమాహారో ద్విరాత్రమ్। అతిక్రాన్తో రాత్రిమతిరాత్రః॥

791. అహన్ సర్వ ఏకదేశ (పూర్వాదులు) సంఖ్యాత పుణ్య ఈశబ్దములలోనేదైనగాని, సంఖ్యావాచకముగాని, అవ్యయముగాని, ఆదియందుగల్గి రాత్రిశబ్దమ స్తమందుగల తత్పురుషముకంటె అచ్ ప్రత్యయమగును. సూత్రములోని చకారమువలన "సంఖ్యావ్యయాదేః" అనునది యనువర్తించును. ఈసూత్రమున అహన్ శబ్దము ద్వన్ద్వసమాసమున అచ్ ప్రత్యయము ప్రవర్తించుటకు గ్రహింపబడినది. అహన్ శబ్దపూర్వకము రాత్రిశబ్దాన్తమునగు తత్పురుషమునకు సంభవములేదని గ్రహించునది. క్రమముగ నుదాహరణములు :—అహోరాత్రః అనునది (అహశ్చ రాత్రిశ్చఅనయోః సమాహారః) ద్వన్ద్వసమాసము. అహోరాత్రి అనుసమాసముకంటె అచ్ ప్రత్యయము. యస్యేతిచ అను సూ. చే ఇకారలోపము. "జాతిరప్రాణినామ్" (915) అను సూ. చే నేకవద్భావము. "రాత్రాహ్నాహాః పుంసి" (818) అను సూ. చే పుంలిఙ్గము. (2) సర్వరాత్రః (సర్వా రాత్రిః) పూర్వకాలైకసర్వ" (730) అను సూ. చే సమాసము. అచ్ ప్రత్యయము. ఇకారలోపము,

"రాత్రాహ్నాహాః పుంసి" అను సూ. చే పుంస్త్వము సర్వనామ్నోవృత్తిమాత్రే పుంవద్భావః అనువచనముచే సర్వాశబ్దమునకు పుంవద్భావము. (3) పూర్వరాత్రః। (పూర్వం రాత్రేః) "పూర్వాऽపరాధరోత్తరమేకదేశినైకాధికరణే" (716) అను సూ. చే నేకదేశిసమాసము. అచ్ ప్రత్యయము. ఇకారలోపము. పుంస్త్వము. (4) సంఖ్యాతరాత్రః (సంఖ్యాతా రాత్రిః) కర్మధారయసమాసము. "పుంవత్కర్మధారయ" (750) అను, సూ.చే పుంవద్భావము. శేషప్రక్రియ సుగమము. (5) పుణ్యరాత్రః। (పుణ్యా రాత్రిః) పుంవద్భావము మొదలగుకార్యములనూహించునది. సంఖ్యాదియగుదానికుదాహరణము :— ద్విరాత్రమ్ (ద్వయోరాత్ర్యోస్సమాహారః) "తద్ధితార్థోత్తరపద" సూ.చే ద్విగుసమాసము. అచ్ ప్రత్యయము. ఇకారలోపము. "సంఖ్యాపూర్వంరాత్రంక్లీబమ్" అనువార్తికముచే నపుంసకలిఙ్గము. అవ్యయాదియగుదానికి అతిరాత్రః (అతిక్రాన్తోరాత్రిమ్) "అత్యాదయః" ఇత్యాదివచనముచే ప్రాదిసమాసము. మిగిలిన కార్యజాతమూహ్యాంబు.

792. రాజాహఃసఖిభ్యష్టచ్. 5-4-91. రాజాహఃసఖిభ్యః, టచ్, (తత్పురుష్య)

ఏతదన్తాత్తత్పురుషాట్టచ్ స్యాత్। పరమరాజః। అతిరాజీ। కృష్ణసఖః॥

792. తత్పురుషస్య అనునది పంచమ్యన్తముగ విపరిణామమునొందును. దీనికి రాజాహఃసఖిభ్యః అనునది విశేషణము. తదన్తవిధి. రాజన్ శబ్దము, అహన్ శబ్దము, సఖిశబ్దము ఇవి యంతమందుగల తత్పురుషసమాసముకంటె టచ్ ప్రత్యయము ప్రవర్తించునని సూత్రార్థము. పరమరాజః (పరమశ్చాసౌ రాజా చ) కర్మధారయము. టచ్ ప్రత్యయము. (పరమరాజన్ + అ) "నస్తద్ధితే" (883) అను సూ.చే టిలోపము, ఇట్లు పై రూపము సిద్ధమగును. అతిరాజీ (అతిక్రాన్తా రాజానం) "అత్యాదయః" అనువచనముచే సమాసము. టచ్ ప్రత్యయము. టిలోపము. టిత్త్వమువలన "టిడ్ఢాణఞ్" (473) ఇత్యాదిసూత్రముచే ఙీపు। కృష్ణసఖః (కృష్ణస్య సఖా) షష్ఠీతత్పురుషము. టచ్ ప్రత్యయము. (కృష్ణసఖి + అ) ఇకారలోపము.

793. అహ్నష్టఖోరేవ. 6-4-145. అహ్నః, టఖోః, ఏవ (టేః, లోపః)

టిలోపః స్యాన్నాన్యత్ర। ఉత్తమాహః। ద్వే అహనీ భృతో ద్వ్యహీనః క్రతుః। తద్ధితార్థే ద్విగుః। తమధీష్ట ఇత్యధికారే ద్విగోర్వేత్యనువృత్తౌ రాత్ర్యహస్సంవత్సరాచ్చేతి ఖః। లిఙ్గవిశిష్టపరిభాషాయా అనిత్యత్వాన్నేహ। మద్రాణాం రాజ్ఞీ మద్రరాజ్ఞీ॥

793. అహన్‌శబ్దమునకు టచ్ప్రత్యయఖప్రత్యయములు పరములగునపుడే టిలోపమగును. ఇతరము పరమగునపుడు ప్రవర్తింపదని ఫలితార్థము. ఈసూత్రము "నస్తద్ధితే" అనుసూత్రమునకు నియామకమగును. టచ్ప్రత్యయముపరమగునపుడుదాహరణము:—ఉత్తమాహః (ఉత్తమంచ తదహశ్చ) పూర్వసూత్రముచే టచ్ప్రత్యయము. ఈసూత్రముచే టిలోపము. "రాత్రాహ్నాహాః పుంసి" (818) అనుసూత్రముచే పుంలింగము. ఖప్రత్యయముపరమగునపుడుదాహరణము :— ద్వహీనః (ద్వే అహనీ భృతః) తద్ధితార్థోత్తరపద ఇత్యాదిసూత్రముచే తద్ధితార్థమునందు ద్విగుసమాసము. ఇచట "తమధీష్టే" అనునధికారమున "ద్విగోర్వా" అని యనువర్తింప "రాత్ర్యహస్సంవత్సరాచ్చ" (5-1-87) అనుసూత్రముచే తద్ధితమగు ఖప్రత్యయము ప్రవర్తించును. "ఆయనేయీనీయియః" (478) అనుసూత్రముచే ఖప్రత్యయమునకు ఈనాదేశము. ఈసూత్రముచే టిలోపము. ద్వ్యహీనః అను రూపము సిద్ధమగును. సమాసాన్తవిధానమనిత్యమగుటచేనిచట టచ్ప్రత్యయము రాదు. లిఙ్గవిశిష్టపరిభాష యనిత్యమగుటవలన రాజాహస్సఖిభ్యష్టచ్ అనుసూత్రములోని రాజన్‌శబ్దము స్త్రీప్రత్యయవిశిష్టమగు రాజ్ఞీశబ్దమును గ్రహించదు. కాన మద్రరాజ్ఞీ (మద్రాణాం రాజ్ఞీ। షష్ఠీతత్పురుషము) రాజ్ఞీశబ్దాన్తమగు తత్పురుషముకంటె టచ్ప్రత్యయము రాదు. టచ్ప్రత్యయము ప్రవర్తించినచో "భస్యాఽఢేతద్ధితే" అనువార్తికముచే పుంవద్భావము, "నస్తద్ధితే" సూ. చే టిలోపమును, ప్రసక్తము లగును. అపుడు మద్రరాజ అనునని‌ష్టరూపము గావలసివచ్చును.

794. అహ్నోఽహ్న ఏతేభ్యః. 5-4-88. అహ్నః, అహ్నః. ఏతేభ్యః।

సర్వాదిభ్యః పరస్యాహన్‌శబ్దస్యాహ్న దేశస్స్యాత్సమాసాన్తేపరే॥

794. ఏతచ్ఛబ్దమువలన దీనికి పూర్వసూత్రమగు "అహస్సర్వైకదేశసంఖ్యాతపుణ్యాచ్చరాత్రేః" అనుసూత్రములోని సర్వాదులు చకారమువలన లబ్ధములగు సంఖ్యావ్యయములును పరామృష్టములగును. అహశ్శబ్దముకంటెపరమగు అహన్‌శబ్దము తత్పురుషమందు సంభవింపదు గానన హశ్శబ్దము పరామర్శింపబడదు. ఈరీతిని సర్వాదులకంటెపరమగు అహన్‌శబ్దమునకు అహ్న అనునాదేశము సమాసాన్తము పరమగునపుడు వచ్చునని సూత్రమువక్షరము. సమాసాన్తప్రకరణముగాన సమాసాన్తముపరమగునపుడనునర్థము లభించును.

795. అహ్నోఽదన్తాత్. 8-4-7. అహ్నః, అదన్తాత్, (పూర్వపదాత్, రషాభ్యాంనోణః)

అదన్తపూర్వపదస్థాద్రేఫాత్పరస్యాఽహ్నాదేశస్య నస్య ణః స్యాత్। సర్వాహ్ణః। పూర్వాహ్ణః। సఙ్ఖ్యాతాహ్నః॥ వ్యయోరహ్నోర్భవః। కాలాట్ఠఞ్। ద్విగోర్లుగనపత్య ఇతి

ఠఞో లుక్। ద్వ్యహ్నః। స్త్రియామదన్తత్వాట్టాప్।ద్వ్యహ్నా।
ద్వ్యహ్నప్రియః। అత్యహ్నః॥

795. పూర్వపదాత్ అనునది అదన్తాత్ అనుదానికి విశేష్యమగును. పూర్వపదాత్తనదానివలన పూర్వపదస్థాత్ అనునర్థము వివక్షితము. అకారాన్తమగు పూర్వపదమందుండు రేఫముకంటెపరమగు అహ్నాదేశములోని నకారమునకు ణకారమగును. సర్వాహ్ణః (సర్వమహః) పూర్వకాలై కేత్యాది సూత్రముచే సమాసము. టచ్ప్రత్యయము. అహ్నాదేశణత్వములు. "రాత్రాహ్నాహాఃపుంసి" అను సూ. చే పుంలిఙ్గము. పూర్వాహ్ణః। పూర్వమువలె ప్రక్రియనూహించునది. సంఖ్యాతాహ్నః। (సంఖ్యాతమహః) "విశేషణం" సూ. చే సమాసము. టచ్ప్రత్యయము. అహ్నాదేశము. ణత్వనిమిత్తములేకపోవుటచే ణత్వము రాదు. ద్వ్యహ్నః (ద్వయోరహ్నోర్భవః) తద్ధితార్థమందు ద్విగుసమాసము. ఇచట "కాలాట్ఠఞ్" (4-3-11) సూ. చే ఠఞ్ప్రత్యయమగును. "ద్విగోర్లుగనపత్యే" (4-1-88) సూ. చే దానికి లుక్కగును. టచ్ప్రత్యయము. అహ్నాదేశము. నిమిత్తము లేకపోవుటచే ణత్వము రాదు. ద్వయోరహ్నోర్భవా అని స్త్రీత్వము వివక్షితమగునపుడును ప్రక్రియసమానమేగాని అదన్తమగుటవలన టాప్ప్రత్యయముప్రవర్తించును. ద్వ్యహ్నా అనియగును. ద్వ్యహ్నప్రియః ఇది సంఖ్యాపూర్వకమగుదానికి మరియొక యుదాహరణము ఉత్తరపదముపరమగునపుడు ద్విగుసమాసము, టచ్చు, అహ్నాదేశము. అత్యహ్నః। అవ్యయపూర్వకమునకుదాహరణము. "అత్యాదయః" అనువచనముచే ప్రాదిసమాసము. టచ్ప్రత్యయము. అహ్నాదేశము.

వివః—ద్వ్యహ్నాశబ్దమునకు స్త్రీలిఙ్గమున టాపువచ్చునని మూలమున చెప్పబడెను. ఠఞ్ ప్రత్యయము లుక్కు చేనపహృతమైనందున టిడ్ఢాణఞ్ సూత్రమునకు ప్రసక్తిలేదు. అపరిమాణే అనునిషేధముండుటవలన ద్విగోః అను సూత్రము ప్రవర్తించదు. లుప్తతద్ధితాన్తమగునిట్టిస్థలములందు "రాత్రాహ్నాహాః పుంసి" అను సూత్రము ప్రవర్తించదు. ఇట్టిరూపములెప్పుడును విశేష్యనిఘ్నములే యగును. గావున ద్వ్యహ్నీ అను ప్రయోగమసాధువని దీక్షితాశయము. "రాత్రాహ్నాహాఃపుంసి" అను సూత్రముండుటచే ద్వ్యహ్నశబ్దము స్త్రీలిఙ్గమేగాదని నాగేశాదులమతము.

796. * క్షుభ్నాదిషు చ. 8-4-39. క్షుభ్నాదిషు, చ (ణః, న)

---

* క్షుభ్నా నృనమన నన్దిన్ నన్దన నగర। ఏతాని త్రీణ్యుత్తరపదాని సంజ్ఞాయాం ప్రయోజయన్తి। హరినన్దీ హరినన్దః గిరినగరమ్। నృతిర్యఙ్ప్రయోజయతి। పరినృత్యతే। నర్తన గహన నన్దన నివేశ నివాస అగ్ని అనూప। ఏతాని సప్తోత్తరపదాని ప్రయోజయన్తి। పరినర్తనమిత్యాది। ఆచార్యాదణత్వంచ। ఆకృతిగణోఽయమ్॥

ఏషు ణత్వం న స్యాత్। దీర్ఘాహ్నీ ప్రావృట్। ఏవం చై తదర్థమహ్నఇత్యదన్తానుకరణక్లేశోన కర్తవ్యః. ప్రాతిపదికాన్తఇతి ణత్వవారణాయ క్షుభ్నాదిషు పాఠస్యావశ్యకత్వాత్। అదన్తాదితితపరకరణాన్నేహ। పరాగతమహః పరాహ్నః॥

796. క్షుభ్నాదిగణపఠితములగు క్షుభ్నా మొదలగుశబ్దములందు నకారమునకు ణత్వము రాదు. దీర్ఘాహ్నీ (ప్రావృట్) దీర్ఘాణ్యహాని యస్యాం అనువిగ్రహమున బహువ్రీహిసమాసము. "అల్లోపోనః" సూ. చే అకారలోపము. "అనఉపధాలోపినః" సూత్రముచే జీప్ప్రత్యయము. క్షుభ్నాదిగణమాకృతిగణమగుటవలననాగణమునదీర్ఘాహ్నీశబ్దము గ్రహింపబడుటచే దీనికి అహ్నోఽదన్తాత్" సూ. చే ణత్వము ప్రవర్తించదు. అహ్నోఽదన్తాత్ అనుసూత్రమున అహ్నః అనునది యదన్తమగు అహ్నశబ్దమునకనుకరణము. అట్టి అహ్నశబ్దముకంటె షష్ఠ్యర్థమందు ప్రథమావిభక్తి. కావున అదన్తపూర్వపదస్థమగురేఫముకంటె పరమగుఅదన్తాహ్నశబ్దముయొక్క నకారమునకు ణత్వమగుననునర్థము లభించును. దీర్ఘాహ్నీ అనుచోట "అహ్నోహ్నఏతేభ్యః" సూ. చే అహ్నాదేశము ప్రవర్తించనందున "అహ్నోఽదన్తాత్" సూత్రముచే ణత్వము ప్రవర్తింపదు. కావున దీర్ఘాహ్నీశబ్దమున ణత్వనివృత్తికై క్షుభ్నాదిగణపాఠమావశ్యకము గాదు. కాని "ప్రాతిపదికాన్తనుమ్విభక్తిషు చ" (1067) అనుసూత్రముచేనచట ప్రాప్తించు ణత్వమును వారించుటకై దీర్ఘాహ్నీశబ్దమునకు క్షుభ్నాదిగణమునపాఠమావశ్యకమే యగును. ఈపాఠముచేతనే "అహ్నోఽదన్తాత్" అనుసూత్రముచేప్రాప్తించుణత్వముగూడ వారింపబడుటచే నిచట ణత్వనివృత్తికొఱకు పైని జూపబడినరీతిని అహ్నఅనునది అదన్తానుకరణమనియు షష్ఠ్యర్థమందు ప్రథమయనియునిట్టిక్లేశహేతువగు పద్ధతిననుసరించుట యావశ్యకముగాదు. పరాహ్నః(పరాగతమహః) "ప్రాదయోగతాద్యర్థేప్రథమయా" అను వచనముచే ప్రాదిసమాసము. టచ్ప్రత్యయము. అవ్యయపూర్వకమగుటచే నహ్నాదేశమగును. "అహ్నోఽదన్తాత్" అనుసూత్రమున అదన్తాత్ అను తపరకరణమువలన (పరాఅనెడిపూర్వపదముదీర్ఘాన్తము) నిచట ణత్వము రాదు.

797. న సంఖ్యాదేస్సమాహారే. 5-4-89. న, సంఖ్యాదేః, సమాహారే, (అహ్నః, అహ్నః)

సమాహారే వర్తమానస్య సంఖ్యాదేరహ్న దేశో న స్యాత్। సంఖ్యాదేరితి స్పష్టార్థమ్। ద్వయోరహ్నోస్సమాహారో ద్వ్యహః। త్ర్యహః॥

797. సమాహారమందలి సంఖ్యాదియగు తత్పురుషములోని అహన్శబ్దమునకు అహ్నాదేశము రాదు. సంఖ్యాదిభిన్నమగు తత్పురుషమునకు సమాహారమున సంభవములేకపోవుటచే నీ సూత్రమున సంఖ్యాదేః అనునది లభించుచుండ

సంఖ్యాదేః అనునది స్పష్టార్థమగును. ద్వ్యహః (ద్వయోరహ్నోస్సమాహారః) సమాహారమందు ద్విగుసమాసము. టచ్ప్రత్యయము సంఖ్యాదియగుటచే ప్రాప్తించుచున్న అహ్నాదేశమీసూత్రముచే నిషేధింపబడినది. త్ర్యహః। పూర్వమువలె ప్రక్రియనూహించుచున్నది.

798. ఉత్తమైకాభ్యాం చ. 5-4-90. ఉత్తమైకాభ్యామ్, చ
(న, అహ్నః)

ఆభ్యాం అహ్నాదేశో న। ఉత్తమశబ్దోఽన్త్యార్థః, పుణ్యశబ్దమాహ। పుణ్యైకాభ్యామిత్యేవ సూత్రయితుముచితమ్। పుణ్యాహమ్। సుదినాహమ్। సుదినశబ్దః ప్రశస్తవాచీ। ఏకాహః। ఉత్తమగ్రహణముపాన్త్యస్యాపి గ్రహణార్థమిత్యేకే। సంఖ్యాతాహః॥

798. ఉత్తమశబ్దైకశబ్దములకంటెపరమగు అహన్శబ్దమునకు అహ్నాదేశము రాదు. సూత్రమున నుత్తమశబ్దమన్త్యార్థకము గానఆహస్సర్వైక దేశేత్యాది సూత్రమంతస్థమగు పుణ్యశబ్దమును బోధించును. పుణ్యైకాభ్యాం చ అని సూత్రమునరచించిన లాఘవముసంభవించును గాననది యుచితము. పుణ్యాహమ్। విశేషణసమాసము. టచ్ ప్రత్యయము. "అహ్నష్టఖోరేవ" అను సూ. చే టిలోపము. "పుణ్యసుదినాభ్యామహ్నః క్లీబతేష్టా" అనువార్తికముచే నపుంసకత్వము. సుదినాహమ్ అనునది పుణ్యాహమనుచోట విధింపబడు నపుంసకలింగమునకు దృష్టాన్తముగ ప్రదర్శింపబడెను. ఏకాహః। "పూర్వకాలైక" త్యాదిసూత్రముచే సమాసము. టచ్ప్రత్యయము. టిలోపము. "రాత్రాహ్నాహాః పుంసి" అను సూ. చే పుంస్త్వము. ఉత్తమశబ్దము "అహస్సర్వ" అనుసూత్రమున వస్త్యమగు పుణ్యశబ్దముమాత్రము బోధించుటకనిన "అన్త్యైకాభ్యాం చ అనుటవలననే పైయర్థము సిద్ధమగుచుండ ఉత్తమగ్రహణసామర్థ్యమువలన అన్త్యసమీపమందున్న సంఖ్యాతశబ్దముగూడ గ్రహింపబడునని కొందరనిరి. "ప్రథమయోః పూర్వసవర్ణః" అనుచోట ప్రథమయోః అను ద్వివచనమువలననెట్లు ప్రథమాద్వితీయలకు గ్రహణమో యట్లే ఉత్తమశబ్దమందుద్వివచనమువలననన్త్యోపాన్త్యములురెంటికి గ్రహణమనియు ఉత్తమైకాభ్యామనుచోట ఉత్తమౌ చ ఏకశ్చ అనివిగ్రహమనియు ఉత్తమైకాభ్యామ్ అనుద్వివచనము సౌత్రమనియునువారియాశయము. సంఖ్యాతాహః॥

799. అగ్రాఖ్యాయామురసః. 5-4-93. అగ్రాఖ్యాయామ్, ఉరసః
(టచ్, తత్పురుషస్య)

టచ్ స్యాత్, అశ్వానామురఇవ అశ్వోరసమ్। ముఖ్యోఽశ్వ ఇత్యర్థః॥

799. అగ్రాఖ్యాయామనుచోట సప్తమి పంచమ్యర్థకము. అగ్ర్యశబ్దము ముఖ్యార్థకము. (అగ్రేభవోఽగ్ర్యః) ముఖ్యార్థకమగునురస్శబ్దమన్తమందుగల

తత్పురుషముకంటె టచ్ప్రత్యయమగును. అశ్వోరసమ్ (అశ్వానామురఇవ) షష్ఠీసమాసము. టచ్ప్రత్యయము. ఇచటనురశ్శబ్దము ప్రధానవాచకము. ముఖ్యమగు నశ్వమని యర్థము. "పరవల్లిఙ్గం ద్వన్ద్వతత్పురుషయోః" అనుసూత్రముచే సమాసమునకు నపుంసకత్వము.

800\. అనోశ్మాయస్సరసాం జాతిసంజ్ఞయోః. 5-4-94. అనో శ్మాయః సరసామ్, జాతిసంజ్ఞయోః। (టచ్)

టచ్ స్యాజ్జాతౌ సంజ్ఞాయాం చ। ఉపానసమ్। అమృతాశ్మః. కాలాయసమ్। మండూకసరసమ్। ఇతి జాతిః। మహానసమ్. పిండాశ్మః। లోహితాయసమ్। జలసరసమితి సంజ్ఞా॥

800\. అనస్ అశ్మన్ అయస్ సరస్ ఈశబ్దములంతమందుగల తత్పురుషముకంటె జాతియందును సంజ్ఞయందును టచ్ప్రత్యయమగును. ఉపానసమ్ (ఉపగతమనః) ప్రాదిసమాసము. టచ్ప్రత్యయము. అనశ్శబ్దము నపుంసకమగుటచే సముదాయము నపుంసకమగును. అమృతాశ్మః। విశేషణసమాసము. టచ్ప్రత్యయము. "నస్తద్ధితే" సూత్రముచే టిలోపము. అశ్మన్శబ్దము పుంలిఙ్గమగుటచే సమాసము పుంలింగమగును. కాలాయసమ్। (కాలమయః) టచ్ప్రత్యయము. మండూకసరసమ్। షష్ఠీసమాసము. టచ్ప్రత్యయము. ఈశబ్దములు జాతివిశేషవాచకములు. (జాతిప్రవృత్తినిమిత్తకములు) ఇట్లే మహానసమ్. పిండాశ్మః। లోహితాయసమ్। జలసరసమ్। ఈస్థలములందుగూడ ప్రక్రియనూహించవలయును. ఈశబ్దములు సంజ్ఞావాచకములు. (సంజ్ఞాప్రవృత్తినిమిత్తకములు.)

801\. గ్రామకౌటాభ్యాం చ తక్ష్ణః. 5-4-95. గ్రామకౌటాభ్యాం, చ తక్ష్ణః। (టచ్)

గ్రామస్య తక్షా గ్రామతక్షః। సాధారణ ఇత్యర్థః। కుట్యాం భవః కౌటః। స్వతంత్రః సచాసౌ తక్షా చ కౌటతక్షః॥

801\. గ్రామకౌటశబ్దములకంటెపరమగు తక్షన్శబ్దమంతమందుగల తత్పురుషముకంటె టచ్ప్రత్యయమగును. గ్రామతక్షః (గ్రామస్య తక్షా) టచ్ప్రత్యయము (గ్రామతక్షన్ + అ) టిలోపము. గ్రామస్థులకందఱకు సంబంధించినవాడని యర్థము. కుటి (చిన్నయిల్లు) యందుండువాడు కౌటుడనబడును. ఇతరులగృహమునకుండక స్వయముగనొకగృహమును సంపాదించి అందునివసించువాడను నర్థము లభించుటచే కౌటశబ్దమునకు స్వతంత్రుడనునర్థము ఫలితమగును. కౌటశ్చాసౌ తక్షా చ అనువిగ్రహమున కౌటతక్షః అనియగును.

802\. అతేశ్శునః. 5-4-96. అతేః, శునః (టచ్)

అతిశ్వో వరాహః। అతిశ్వీ సేవా॥

802. అతి అనునవ్యయముకంటెపరమగు శ్వన్‌శబ్దమంతమందుగలతత్పురుషముకంటె టచ్‌ప్రత్యయమగును. అతిశ్వః (వరాహము) శ్వానమతిక్రాన్తః అనువిగ్రహమున అత్యాదయఃఅనువచనముచే సమాసము. టచ్‌ప్రత్యయము. టిలోపము. వేగముచే శునకమును మించినదనియర్థము. అతిశ్వీ (సేవ) శ్వానమతిక్రాన్తా అనివిగ్రహము. టచ్‌ప్రత్యయము. టిలోపము. "టిడ్ఢాణఞ్" (473) సూ. చే జీప్ప్రత్యయము. సేవ శునకముకంటె నీచమైనదని యర్థము.

803. ఉపమానాదప్రాణిషు. 5-4-77. ఉపమానాత్, అప్రాణిషు, (శునః, టచ్)

అప్రాణివిషయకోపమానవాచినశ్శునష్టచ్ స్యాత్। ఆకర్షః శ్వేవ ఆకర్షశ్వః। అప్రాణిషు కిమ్। వానరః శ్వేవ వానరశ్వా॥

803. ప్రాణిభిన్నముపమేయమై దానికి ఉపమానమును బోధించు శ్వన్‌శబ్దమంతమందుగల తత్పురుషమునకు టచ్‌ప్రత్యయమగును. ఆకర్షశ్వః। (ఆకర్షః శ్వేవ) ఉపమితసమాసము. ఆకృష్యతేఽనేన అనువ్యుత్పత్తివలన ఆకర్షశబ్దమునకు ప్రేళ్ళవంటి అయిదుకర్రముక్కలుగల్గి రళ్ళములోని ధాన్యాదులప్రోగుచేసికొనుటకుపయోగించు కర్రయని యర్థము. కావనిచట శ్వన్‌శబ్దమప్రాణివిషయకమగునుపమానమును బోధించుచున్నది. వానరశ్వా (వానరః శ్వేవ) అనుచోట శ్వన్‌శబ్దము ప్రాణియగు వానరమునకుపమానమును బోధించుచున్నందున టచ్ ప్రత్యయము ప్రవర్తించదు. అప్రాణిషు అనునది సూత్రమునలేకున్న నీస్థలము నందనిష్టము ప్రసక్తమయ్యేడిని.

804. ఉత్తరమృగపూర్వాచ్చ సక్థ్నః. 5-4-98. ఉత్తరమృగపూర్వాత్ చ, సక్థ్నః॥

చాదుపమానాత్। ఉత్తరసక్థమ్। మృగసక్థమ్। పూర్వసక్థమ్। ఫలకమివ సక్థి ఫలకసక్థమ్॥

804. చకారమువలన పూర్వసూత్రమునసుండు ఉపమానాదనునదనువృత్తమగును. ఉత్తరమృగపూర్వశబ్దములు ఉపమానవాచకము వీనిలో నొకటి పూర్వమందుగల్గి సక్థిశబ్దమంతమందుగల తత్పురుషమునకు టచ్‌ప్రత్యయమగును. ఉత్తరసక్థమ్। (ఉత్తరం చ తత్ సక్థి చ) టచ్‌ప్రత్యయము. టిలోపము. మృగసక్థమ్। (మృగస్య సక్థి) షష్ఠీసమాసము. శేషమగు ప్రక్రియనూహ్యంబు। పూర్వసక్థమ్। పూర్వకాలైకేత్యాదిసూత్రముచే సమానము. ఫలకసక్థమ్। (ఫలకమివ సక్థి) "మయూరవ్యంసకాదయశ్చ" అను సూ. చే సమాసము. ప్రక్రియావిశేషము లేదు.

805. నావో ద్విగోః. 5-4-99. నావః, ద్విగోః (అతద్ధితలుకి)

నౌశబ్దాన్తాద్ద్విగోష్టచ్ స్యాన్నతు తద్ధితలుకి। ద్వాభ్యాం నౌభ్యామాగతః ద్వినావరూప్యః। ద్విగోర్లుగనపత్యఇత్యత్ర

అచీత్యస్యాపకర్షణాద్ధలాదేర్నలుక్। పంచనావప్రియః। ద్వినావమ్। త్రినావమ్। అతద్ధితలుకీతి కిమ్। పంచభిః నౌభిః క్రీతః పంచనౌః॥

805. నౌశబ్దమంతమందుగల ద్విగువుకంటె సమాసాన్తమగు టచ్ప్రత్యయమగును. తద్ధితమునకు లుక్కు ప్రవర్తించునపుడు రాదు. ద్వినావరూప్యః। (ద్వాభ్యాం నౌభ్యామాగతః) తద్ధితార్థమునందు ద్విగుసమాసము. టచ్ ప్రత్యయము. ఆవాదేశము. ద్వినావ అనురూపము సిద్ధింపగా "హేతుమనుష్యేభ్యోఽన్యతరస్యామ్" (4-3-81) అనుసూత్రముచే రూప్యప్రత్యయము. ఉత్తరసూత్రమగు "గోత్రేలుగచి" (4-1-89) అనుసూత్రమునుండి అచి అనుదానిని అపకర్షము చేయుటచే "ద్విగోర్లుగనపత్యే" (4-1-88) అను సూ. వలన హలాదియగునీరూప్యప్రత్యయమునకు లుక్కు రాదు. పంచనావప్రియః (పంచ నావః ప్రియాః యస్య) ఉత్తరపదముపరమగునపుడు ద్విగుసమాసము. టచ్ప్రత్యయము. ఆవాదేశము. ద్వినావమ్। సమాహారమందు ద్విగుసమాసము. టచ్ప్రత్యయము. ఆవాదేశము. "స నపుంసకమ్" (826) అను సూ. చే నపుంసకత్వము. త్రినావమ్। (తిసృణాం నావాం సమాహారః) పంచనౌః అనుచోట పంచభిః నౌభిః క్రీతః అనువిగ్రహమున తద్ధితార్థమందు ద్విగుసమాసము. ఆర్హీయమగు ఠక్ప్రత్యయము. దానికి అధ్యర్ధపూర్వేత్యాదిసూత్రముచే లుక్కగును. అతద్ధితలుకి అనిసూత్రమున లేకున్ననిట్టి చోటులందును టచ్ప్రత్యయము ప్రవర్తింపవలసివచ్చును.

806. అర్ధాచ్చ. 5-4-100. అర్ధాత్, చ (నావః, తత్పురుషస్య)

అర్ధాన్నావష్టచ్స్యాత్। నావోఽర్ధమర్ధనావమ్। క్లీబత్వం లోకాత్॥

806. అర్ధశబ్దముకంటెపరమగు నౌశబ్దమంతమందుగల తత్పురుషముకంటె టచ్ప్రత్యయమగును. అర్ధనావమ్ (నావోఽర్ధః) "అర్ధం నపుంసకమ్" అను సూ. చే సమాసము. టచ్ప్రత్యయము. ఆవాదేశము. "పరవల్లిఙ్గం ద్వన్ద్వతత్పురుషయోః" (816) అను సూ. చే నిచట పరపదమగునౌశబ్దము స్త్రీలిఙ్గముగాన సమాసమునకు స్త్రీత్వము ప్రవర్తింపవలసియుండ నపుంసకత్వము లోకవ్యవహారము వలన గల్గెనని తెలియునది.

807. ఖార్యాః ప్రాచామ్. 5-4-101. ఖార్యాః, ప్రాచామ్। (అతద్ధితలుకి, ద్విగోః, అర్ధాత్, తత్పురుషస్య)

ద్విగోరర్ధాచ్చ ఖార్యాష్టచ్ వా స్యాత్। ద్విఖారమ్। ద్విఖారి। అర్ధఖారమ్। అర్ధఖారి॥

807, ఖారీశబ్దమంతమందుగల ద్విగువుకంటెను అర్ధశబ్దముపూర్వమందు గల్గి ఖారీశబ్దాంతమగు తత్పురుషముకంటెను వికల్పముగ టచ్ప్రత్యయమగును. ద్విఖారమ్ ద్విఖారి (ద్వయోః ఖార్యోస్సమాహారః) సమాహారమునందు ద్విగుసమాసము. టచ్ప్రత్యయము. యస్యేతిచ అను సూ. చే నీకారలోపము స నపుంసకమ్ సూ. చే నపుంసకత్వము. టజభావపక్షమందును నపుంసకముగాన "హ్రస్వో నపుంసకే" సూత్రముచే హ్రస్వము. అర్ధఖారమ్। అర్ధఖారి। "అర్ధం నపుంసకమ్" (717) అను సూ. చే సమాసము. టచ్ప్రత్యయము. ఈకారలోపము. లోకవ్యవహారమువలన నపుంసకత్వము. టజభావపక్షమందు నపుంసకహ్రస్వము.

808. ద్విత్రిభ్యామఞ్జలేః. 5-4-102. ద్విత్రిభ్యామ్, అఞ్జలేః, (ద్విగోః, అతద్ధితలుకి, ప్రాచామ్)

టజ్వా స్యాద్ద్విగౌ। ద్వ్యఞ్జలమ్। ద్వ్యఞ్జలి। అతద్ధితలుకీ త్యేవ। ద్వాభ్యామఞ్జలిభ్యాం క్రీతః ద్వ్యఞ్జలిః॥

808. ద్విత్రిశబ్దములాదియందుగల్గి అఞ్జలిశబ్దము తుదియందుగల ద్విగుసమాసముకంటె టచ్చువికల్పముగనగును, తద్ధితలుక్కులేనప్పుడునగును. ద్వ్యఞ్జలమ్। ద్వ్యఞ్జలి। సమాహారమునందు ద్విగుసమాసము. టచ్ప్రత్యయము. ఇకారలోపము. స నపుంసకమ్ అను సూ.చే నపుంసకత్వము, ఈసూత్రములోనికి అతద్ధితలుకి అనునది యనువర్తించును. కావున ద్వ్యఞ్జలిః (ద్వాభ్యామఞ్జలిభ్యాం క్రీతః) తద్ధితార్థమందు ద్విగుసమాసానంతరము ప్రవర్తించిన ఠఞ్ప్రత్యయమునకు "అధ్యర్ధపూర్వే" త్యాదిసూత్రముచే లుక్కగుటచే టచ్ప్రత్యయము ప్రవర్తింపదు. ఇచట నఞ్జలిశబ్దమునకు అఞ్జలి (దోసిలి) పరిమితమగు ధాన్యాదులర్థము.

809. బ్రహ్మణో జానపదాఖ్యాయామ్. 5-4-104. బ్రహ్మణః. జానపదాఖ్యాయామ్। (టచ్, తత్పురుషస్య)

బ్రహ్మాన్తాత్తత్పురుషాట్టచ్ స్యాత్సమాసేన జానపదత్వ మాఖ్యాయతే చేత్। సురాష్ట్రే బ్రహ్మా। సురాష్ట్రబ్రహ్మః॥

809. జనపదమన దేశము. తద్భవుడు జానపదుడగును. ఇచట జానపద శబ్దము భావప్రధాననిర్దేశమగుటచే జానపదత్వమును బోధించును. బ్రహ్మన్ శబ్దమంతమందుగల తత్పురుషముకంటె టచ్ప్రత్యయమగును. సమాసముచే బ్రహ్మన్ శబ్దార్థమునకు జానపదత్వము చెప్పబడవలయును. సురాష్ట్రబ్రహ్మః (సురాష్ట్రే బ్రహ్మ) సప్తమీ అనుయోగవిభాగమువలన సప్తమీ తత్పురుషము. టచ్ప్రత్యయ టిలోపములు. బ్రహ్మన్ శబ్దము పుంలిఙ్గముగాన "పరవల్లిఙ్గమ్" సూ. చే పుంస్త్వము. బ్రహ్మన్ శబ్దమునకు బ్రాహ్మణుడని యర్థము. సురాష్ట్రదేశమందలి బ్రాహ్మణుడని సమాసమునకర్థమగుటచే జానపదత్వము సమాసముచే బ్రాహ్మణునికి చెప్పబడుచున్నది.

810. కుమహద్భ్యామన్యతరస్యామ్. 5-4-105. కుమహద్భ్యామ్, అన్యతరస్యామ్, (బ్రహ్మణః, టచ్)

అభ్యాం బ్రహ్మణో వా టచ్ స్యాత్తత్పురుషే। కుత్సితో బ్రహ్మ కుబ్రహ్మః। కుబ్రహ్మా॥

810. తత్పురుషమందు కు అనునవ్యయముకంటెను మహచ్ఛబ్దముకంటెను పరవగు బ్రహ్మన్‌శబ్దముకంటె వికల్పముగ టచ్ప్రత్యయమగును. కుబ్రహ్మః। కుబ్రహ్మా। (కుత్సితో బ్రహ్మ) "కుగతిప్రాదయః" సూ. చే సమాసము. టచ్ ప్రత్యయాటిలోపము లు. టజభావపక్షమందు సమాసము నకారాంతమగును. మహచ్ఛబ్ద పూర్వకమగు బ్రహ్మన్‌శబ్దమునకు టచ్ప్రత్యయోదాహరణమును చూపబోవుచు నచటకార్యవిశేషమును దెల్పుచున్నాడు.

811. ఆన్మహతస్సమానాధికరణజాతీయయోః, 6-3-46. ఆత్, మహతః, సమానాధికరణజాతీయయోః। (ఉత్తరపదే)

మహత ఆకారోఽన్తాదేశస్స్యాత్సమానాధికరణేఉత్తర పదే జాతీయే చ పరే। మహాబ్రహ్మః। మహాబ్రహ్మా। మహాదేవః। మహాజాతీయః సమానాధికరణే కిమ్। మహతస్సేవా మహత్సేవా। లాక్షణికం విహాయ ప్రతిపదోక్తస్సన్మహదితి సమాసో గ్రహీష్యతే చేన్మహాబాహుర్నస్యాత్। తస్మాల్లక్షణప్రతిపదోక్తయోః ప్రతిపదోక్తస్యైవ గ్రహణమితి పరిభాషా నేహ ప్రవర్తతే। సమానాధికరణగ్రహణసామర్థ్యాత్। ఆదితి యోగవిభాగాదాత్వమ్. ప్రాగేకాదశభ్య ఇతి నిర్దేశాద్వా। ఏకాదశ। మహతీశబ్దస్య పుంవత్కర్మధారయేతి పుంవద్భావే కృతే ఆత్వమ్। మహాజాతీయా। (వా) మహదాత్వే ఘాసకరవిశిష్టేషూపసంఖ్యానం, పుంవద్భావశ్చ। అసామానాధికరణ్యార్థమిదమ్। మహతో మహత్యా వా ఘాసో మహాఘాసః। మహాకరః। మహావిశిష్టః। (వా). అష్టనః కపాలే హవిషి। అష్టాకపాలః (వా) గవి చ యుక్తే। గోశబ్దేపరే యుక్తఇత్యర్థే గమ్యేఽష్టన ఆత్వం వక్తవ్యమిత్యర్థః। అష్టాగవమ్ శకటమ్। అచ్ప్రత్యన్వవేత్య త్రాణితి యోగవిభాగాద్బహువ్రీహావప్యచ్। అష్టానాం గవాం సమాహారః అష్టగవమ్।తద్యుక్తత్వాచ్ఛకటమష్టాగవమితివా॥

811. ఉత్తరపదే అనునది సమానాధికరణముతో నన్వయించును. ఆత్ అనుచోట తకారముచ్చారణార్థము. మహచ్ఛబ్దమునకు సమానాధికరణమగునుత్తర పదము పరమగునపుడు, జాతీయర్ప్రత్యయముపరమగునపుడును, ఆకారమన్తా

దేశమగును. మహాబ్రహ్మః। మహాబ్రహ్మ। (మహాంశ్చాసౌ బ్రహ్మ చ) "సన్మహత్పరమోత్తమోత్కృష్టాః" సూ. చే సమాసము. మహచ్ఛబ్దమునకాత్వము. సవర్ణదీర్ఘము, పూర్వసూత్రముచే టచ్ప్రత్యయము. టిలోపము. "పరవల్లింగం" సూ. చే పుంస్త్వము. ఉభయపక్షములందాత్వము వచ్చిన మహాబ్రహ్మ అనినగును. మహాదేవః. ఇది సమానాధికరణమగునుత్తరపదము పరమగునపుడాత్వమునకు మరియొకయుదాహరణము. మహాజాతీయః। ఇది జాతీయర్ప్రత్యయముపరమగునపుడుదాహరణము. ప్రకారవచనమున జాతీయర్ప్రత్యయము. ఆత్వము. సవర్ణదీర్ఘము. మహత్సేవా (మహతః సేవా) షష్ఠీసమాసము. ఉత్తరపదమగుసేవా శబ్దము సమానాధికరణము గాకపోవుటచే మహచ్ఛబ్దమునకాకారాదేశము రాదు. ఇట్టిచోటులందాత్వము ప్రవర్తింపకుండుటకై "సమానాధికరణే" అనుపదావశ్యకము. అందుచే, "ఆన్మహతః జాతీయే చ" అని సూత్రము చేసినను చకారము వలనను త్తరపదము సముచ్చితమగుటవలన మహచ్ఛబ్దమునకు త్తరపదము పరమగునపుడు జాతీయర్ప్రత్యయముపరమగునపుడునాత్వము వచ్చునను నర్థము లభించును గావునమహాదేవః మొదలగురూపములు సిద్ధించును గాన "సమానాధికరణే" అనునది వ్యర్థమని శంకింపగూడదని యాశయము. "షష్ఠీ" (706) అను సూత్రము సామాన్యముగషష్ఠ్యంతమునకు సమాసమును విధించుచున్నది, గావున దానిచేవిహితమగుసమాసము లాక్షణికమగును. "సన్మహత్పరమోత్తమోత్కృష్టాః"(744)అను సూ. చే సమసించుపదములనుచ్చరించి సమాసమువిధింపబడినది గాన నది ప్రతిపదోక్తమగును. కావున "లక్షణప్రతిపదోక్తయోః ప్రతిపదోక్తస్యైవగ్రహణమ్" అనుపరిభాషచే లాక్షణికమగు షష్ఠీసమాసము గ్రహింపబడక ప్రతిపదోక్తమగు సన్మహదిత్యాదిసూత్రవిహితమగు సమాసమే గ్రహింపబడును గాననీసూత్రమున సమానాధికరణపదము లేకున్నను మహత్సేవా మొదలగుషష్ఠీసమాసములందటి ప్రసక్తియుండదు. అందుచే సమానాధికరణపదము వ్యర్థమనుటకు వలనుపడదు. ఏలయన మహత్సేవా ఇత్యాదులందాత్వమును లక్షణప్రతిపదోక్తపరిభాషనాశ్రయించి వారించినచో "మహాబాహుః" అనుబహువ్రీహియందునీపరిభాషచేనాత్వము సిద్ధింపకపోవును గాననీసూత్రమున పైపరిభాషనాశ్రయింపవలనుపడదు. ఇచట నీపరిభాష ప్రవర్తించదనుటలో సూత్రమునందు సమానాధికరణపదమే జ్ఞాపకము. పరిభాషనిచట ప్రవర్తింపచేసిన సన్మహదిత్యాదిసూత్రవిహితమగుసమాసము సమానాధికరణమే గాననీసూత్రమున సమానాధికరణపదము వ్యర్థమయ్యెడిని.

ఏకశ్చ దశచ అనువిగ్రహమందు ద్వంద్వసమాసముప్రవర్తించిన పిదప ఏకశబ్దమునకాత్వము వచ్చునపుడు ఏకాదశ అనురూపము సిద్ధించును. ఈసూత్రమున మహచ్ఛబ్దమే గ్రహింపబడుటవలనను "ద్వ్యష్టనస్సంఖ్యాయా" మనుఉత్తరసూత్రమునందు ద్విశబ్దాష్టన్శబ్దములే గ్రహింపబడియుండుటవలనను ఏకశబ్దమునకాత్వము ప్రాప్తింపకున్నది. అందుచే నీసూత్రమున ఆత్ అనుదానిని విభాగము చేసి దీనిచేనాత్వమును విధింపవలయును. అత్వమువలన పైరూపము సిద్ధించును.

యోగవిభాగము భాష్యమందగపడకపోవుటవలన నట్లు చెప్పుటకు వీలులేదనినచో "ప్రాగేకాదశభ్యః" (5-3-49) అను సూత్రమున నత్వనిర్దేశసామర్థ్యమువలన నిటచ నత్వము సిద్ధమగును. మహతీశబ్దమునకు జాతీయర్ప్రత్యయము పరమగునపుడు "పుంవత్కర్మధారయజాతీయదేశీయేషు" అను సూ. చే పుంవద్భావము ప్రవర్తించినపిదప నీసూత్రముచే నత్వము ప్రవర్తించును. మహాజాతీయా అను రూపమగును.

(1) వా॥ ఘాస కర విశిష్ట శబ్దములలోనేదైనను పరమగునపుడు మహచ్ఛబ్దమునకాత్వమును పుంవద్భావమును గూడ జెప్పవలయును. "పుంవత్కర్మధారయేత్యాది" సూత్రవిహితమగు పుంవద్భావముచేతను "ఆన్మహతః" సూత్రవిహితమగునాత్వముచేతను ఈవార్తికముచే సాధింపబోవు రూపములు సిద్ధించుచుండ నీవార్తికారంభము సామానాధికరణ్యములేకపోయినను ఆత్వపుంవద్భావములు ప్రవర్తించుటకని గ్రహింపదగును. మహాఘాసః। మహతోఘాసః అనిగాని మహత్యా ఘాసః అనిగాని విగ్రహము. షష్ఠీసమాసము. ఈవార్తికముచే ఆత్వపుంవద్భావములు. మహాకరః। (మహతో మహత్యావాకరః) మహావిశిష్టః (మహతో మహత్యా వా విశిష్టః).

(2) వా॥ కపాలశబ్దముత్తరపదమగునపుడు హోమద్రవ్యము సమాసవాచ్యమగునపుడు అష్టన్శబ్దమునకాత్వమును చెప్పవలయును. అష్టాకపాలః (అష్టసు కపాలేషు సంస్కృతః) పురోడాశమని సమాసమునర్థము. తద్ధితార్థమందు ద్విగుసమాసము. "సంస్కృతంభక్షాః" (4-2-16) అను సూ. చే వచ్చినఅణ్ప్రత్యయమునకు "ద్విగోర్లుగనపత్యే" (4-1-88) అనుసూత్రముచే లుక్కగును. అష్టన్శబ్దమునకాత్వము. సవర్ణదీర్ఘము.

(3) వా॥ గోశబ్దముపరమగునపుడు యుక్తమనునర్థము ప్రతీయమానమగుచో నష్టన్శబ్దమునకాత్వమును చెప్పవలయును. అష్టాగవమ్ (శకటము) అష్టౌ గావః యస్య తత్ అనువిగ్రహమున బహువ్రీహిసమాసము. "గోరతద్ధితలుకి" అను టజ్విధాయకసూత్రము తత్పురుషవిషయకమైనను "అచ్ప్రత్యన్వవపూర్వాత్సామలోమ్నః" (948) అనువక్ష్యమాణసూత్రమున అచ్ అను యోగవిభాగమువలన బహువ్రీహిసమాసమందు నచ్ప్రత్యయము సిద్ధించును. దీనిచే ఆత్వము. సవర్ణదీర్ఘము. ఎనిమిదెద్దులతోకూడుకొనినబండియని యర్థము. అష్టానాం గవాం సమాహారః అను విగ్రహమున సమాహారద్విగువును చేసినచో తత్పురుషమగును గాన "గోరతద్ధితలుకి" సూత్రముచేతనే టచ్ప్రత్యయము వచ్చును. అష్టగవమను రూపమగును. లక్షణచే నీశబ్దము ఎనిమిదెద్దులతోగూడినబండిని బోధించినచో యుక్తార్థము గమ్యమానమగును. గాననిచటను పైవార్తికముచేనాత్వము ప్రవర్తించును. ఈరీతిని తత్పురుషమందుగూడనష్టాగవమను రూపము సిద్ధమగును.

812. ద్వ్యష్టనస్సంఖ్యాయామబహువ్రీహ్యశీత్యోః. 6-3-47.

ద్వ్యష్టనః, సంఖ్యాయామ్, అబహువ్రీహ్యశీత్యోః (ఆత్).

అత్స్యాత్। ద్వౌ చ దశ చ ద్వాదశ। ద్వ్యధికా దశేతి వా। ద్వావింశతిః। అష్టాదశ। అష్టావింశతిః। అబహుప్రీహ్యశీత్యోః కిమ్। ద్విత్రాః। ద్వ్యశీతిః। (వా) ప్రాక్ శతాదితి వక్తవ్యమ్। నేహ। ద్విశతమ్। ద్విసహస్రమ్॥

812. ద్విశబ్దమునకు అష్టన్ శబ్దమునకును సంఖ్యావాచకము పరమగునపుడు ఆత్వమన్నాదేశమగును, బహువ్రీహియందు అశీతిశబ్దముపరమగునపుడును ఆత్వము రాదు. ద్వాదశ. ద్వౌ చ దశ చ అని గానిద్వ్యధికా దశ అనిగాని విగ్రహము. ఆత్వము. ద్వావింశతిః। (ద్వౌ చ వింశతిశ్చ) సమాహారద్వన్ద్వము. ద్వ్యధికా వింశతిః అనువిగ్రహమున తత్పురుషమైనను కావచ్చును. ఆత్వము. లోకవ్యవహారమువలన స్త్రీలిఙ్గము. ఇట్లే అష్టాదశ అష్టావింశతిఃఅను రూపముల ప్రక్రియనూహించునది. ద్విత్రాః (ద్వౌ వా త్రయో వా) "సంఖ్యయావ్యయాసన్నాదూరాధిక" (847) అను సూ. చే బహువ్రీహిసమాసము. కావననిచటనాత్వము రాదు. ద్వ్యశీతిః। (ద్వౌ చ అశీతిశ్చ) అనిద్వంద్వము లేక ద్వ్యధికా అశీతిః అనితత్పురుషసమాసము. అశీతిశబ్దము పరమగుటచేనాత్వమురాదు. "అబహువ్రీహ్యశీత్యోః" అనునది లేనిచో పైస్థలములందనిష్టము ప్రసక్తమగును. (వా) ఈసూత్రముచే విధింపబడిన ఆత్వము శతమునకు లోపలనుండు సంఖ్యావాచకము పరమగునపుడే వచ్చునని చెప్పవలయును. ద్విశతమ్ ద్విసహస్రమ్। ఈస్థలములందు శతసహస్రశబ్దములు పరములగుటచేనాత్వము రాదు. శతసహస్రశబ్దములు సంఖ్యావాచకములైనను శతమునకులోపుననుండునవి గాకుండుటచేనత్వము ప్రవర్తించదనిభావము.

813. త్రేస్త్రయః. 7-3-48. త్రేః త్రయః (సంఖ్యాయామ్, అబహువ్రీహ్యశీత్యోః)

త్రిశబ్దస్య త్రయస్ స్యాత్పూర్వవిషయే। త్రయోదశ। త్రయోవింశతిః। బహువ్రీహౌ తు త్రిర్దశ, త్రిదశాః। సుజర్థేన బహువ్రీహిః।అశీతౌ తు త్ర్యశీతిః।ప్రాక్ శతాదిత్యేవ। త్రిశతమ్, త్రిసహస్రమ్॥

813. సంఖ్యాశబ్దముత్తరపదమగునపుడు త్రిశబ్దమునకు త్రయస్ అనునాదేశము వచ్చును, అశీతిశబ్దముపరమగునపుడును బహువ్రీహిసమాసమందును మాత్రము త్రయసాదేశము రాదు. త్రయోదశ। (త్రయశ్చ దశ చ అనిగాని త్ర్యధికా దశ అనిగాని విగ్రహము) సులుగన నరము త్రయసాదేశము. సకారమునకు రుత్వము. ఉత్వగుణములు. త్రయోవింశతిః। ప్రక్రియావిశేషము లేదు. లోకమువలన స్త్రీలిఙ్గమగును. త్రిదశాః. త్రిర్దశ అనువిగ్రహమున "ద్విత్రిచతుర్భ్యస్సుచ్" (5-4-18) సూ. చే క్రియాభ్యావృత్తిగణనమందు విధింపబడిన సుచ్ ప్రత్యయముయొక్క యర్థమును లక్షణచే బోధించు త్రిశబ్దమునకు బహువ్రీహిసమాసము. శాస్త్రవ మువ్వదియని సమాసమునకర్థము. బహువ్రీహియగుటచే

త్రయాసాదేశము రాదు. త్ర్యశీతిః। (త్రయశ్చ అశీతిశ్చ అనిగాని త్ర్యధికా అశీతిః అనిగాని విగ్రహము) అశీతిశబ్దము పరమగుటచే త్రయసాదేశము ప్రవర్తింపదు. త్రయసాదేశముగూడ శతశబ్దమునకు పూర్వమందున్న సంఖ్యావాచకము పరమగునపుడే ప్రవర్తించును గానిశతశబ్దముగాని తత్పరములగు సంఖ్యావాచకములుగాని పరమందున్నపుడు ప్రవర్తించదు. త్రిశతమ్। త్రిసహస్రమ్॥

814. విభాషా చత్వారింశత్ప్రభృతౌ సర్వేషామ్. 6-3-49.
విభాషా, చత్వారింశత్ప్రభృతౌ, సర్వేషామ్। (ద్వ్యష్టనోః, త్రేః, ఆత్, త్రయస్)

ద్వ్యష్టనోస్త్రేశ్చ ప్రాగుక్తం వా స్యాచ్చత్వారింశదాదౌ పరే। ద్విచత్వారింశత్। ద్వాచత్వారింశత్। అష్టచత్వారింశత్। అష్టాచత్వారింశత్। త్రిచత్వారింశత్। త్రయశ్చత్వారింశత్। ఏవం పఞ్చాశత్షష్టిసప్తతినవతిషు॥

814. సర్వేషాం అనుపదమువలననవ్యవహితమగు త్రేః అనునదియు వ్యవహితమగు ద్వష్టనః అనునదియుననువృత్తములగును. చత్వారింశత్ మొదలగు సంఖ్యావాచకములు పరములగునపుడు ద్విశబ్దాష్టన్ శబ్దములకాత్వము త్రిశబ్దమునకు త్రయసాదేశము వికల్పముగనగును. ద్వాచత్వారింశత్ (ద్వౌ చ చత్వారింశచ్చ అనిగాని ద్వ్యధికా చత్వారింశత్ అనిగాని విగ్రహము) ఆత్వాఽభావపక్షమందు ద్విచత్వారింశత్ అనియగును. అష్ట చత్వారింశత్। అష్టాచత్వారింశత్। విశేషము లేదు. త్రయసాదేశము ప్రవర్తించునపుడు త్రయశ్చత్వారింశత్।లేనపుడు త్రిచత్వారింశత్। ఈవిధముగనే పఞ్చాశత్షష్టిసప్తతినవతిశబ్దములు పరములగునపుడును రూపద్వయమునూహించవలయును. ఆత్వత్రయసాదేశవిధాయకములగు పూర్వసూత్రములు అశీతిశబ్దము పరమగునపుడు ప్రవర్తింపవు గాననీవికల్పముగూడ నచట ప్రవర్తించదు.

815. ఏకాదిశ్చైకస్య చాఽదుక్. 6-3-76. ఏకాదిః, చ, ఏకస్య చ, అదుక్ (నఞః, ప్రకృత్యా)

ఏకాదిర్నఞ్ ప్రకృత్యా స్యాదేకస్య చ అదుగాగమశ్చ, నఞో వింశత్యాసహ సమాసే కృతే ఏకశబ్దేన సహ తృతీయేతియోగవిభాగాత్సమాసః। అనునాసికవికల్పః। ఏకేన నవింశతిః। ఏకాన్నవింశతిః। ఏకాద్నవింశతిః। ఏకోనవింశతిరిత్యర్థః। (వా) షష ఉత్వం దతృదశధాసూత్తరపదాదేః ష్టుత్వం చ ధాసు వేతి వాచ్యమ్। షోడన్, షోడశ। షోఢా, షడ్ధా॥

815. అనువృత్తమగు నఞః అనునది ప్రథమాన్తముగ విపరిణామమునొందును. ఏకాదిః అనునది బహువ్రీహి। (ఏకః ఆదిః యస్య సః) ఏకశబ్దమాది

యందుగల నఞ్ ప్రకృతిభావమునొందును, (స్వరూపముతోనుండును) ఏకశబ్దము నకు అదుక్ అనెడి యాగమమగును. కిత్తగుటచే నాగమమన్త్యావయవమగును. న వింశతిః అను విగ్రహమందు నఞ్ సమాసముచే నవింశతిః అనురూపము కాగా ఏకేన నవింశతిః అనువిగ్రహమున "తృతీయా తత్కృతార్థేన" (696) అనుసూత్రమున తృతీయా అనుదానిని విభాగముచేయుటవలన నవింశతిశబ్దముతో ఏకేన అను తృతీయాన్తమునకు సమాసము. సుబ్లుగన్తరము ఏకనవింశతి అనియుండ నీసూత్రముచే నలోపము రాకపోవుటయు ఏకశబ్దమునకదుగాగమమును సిద్ధించును. ఏకఅద్ నవింశతి అనుచోట నవర్ణదీర్ఘాన్తరము "యరోఽనునాసికేఽనునాసికోవా" (117) అను సూ. చే అనునాసికవికల్పము. ఏకాన్నవింశతిః। ఏకాద్నవింశతిః। పందొమ్మిదియని యర్థము.

(వా) దత్శబ్దదశన్శబ్దములు పరములగునపుడు షష్శబ్దముయొక్క యన్త్యమునకుత్వమగును, ఉత్తరపదములగు దత్దశన్శబ్దములయొక్క ఆదియందున్న దకారమునకు నిత్యముగ ష్టుత్వము, ధాప్రత్యయము పరమగునపుడు షష్శబ్దమునకు వికల్పముగనుత్వము, ఉత్తరఖండమగు ధాప్రత్యయమునకాదియగు ధకారమునకు విభాషగ ష్టుత్వమును చెప్పవలయును. ఉదా:—(1) షోడన్ (షట్ దన్తా యస్య) షట్శబ్దదన్తములకు బహువ్రీహి। "వయసిదన్తస్యదతృ" (885) అను సూ. చే దన్తశబ్దమునకు దత్రాదేశము. ఆదేశములోని ఋకారమిత్సంజ్ఞకము. షష్శబ్దములోని యన్త్యషకారమునకుత్వము. గుణము. ష్టుత్వమువలన డకారము నుమ్ప్రత్యయముపరమందున్నపుడు "ఉగిదచాం" (363) సూ. చే నుమాగమము. సులోప సంయోగాన్తలోపములు. (2) షోడశ (షట్ చ దశ చ అనిగాని షడధికా దశ అనిగాని విగ్రహము) ఉత్వము. గుణము. ష్టుత్వము. (3) షోఢా। "సంఖ్యాయా విధార్థేధా" (5-3-42) సూ. చే షష్శబ్దమునకంటె ధాప్రత్యయము. ఉత్వము. గుణము. ష్టుత్వము. ఉత్వష్టుత్వములు ప్రవర్తించనపుడు షడ్ధా అని యగును. ఉత్వము వికల్పముగుటచేనుత్వము వచ్చునపుడే ష్టుత్వము వచ్చును గాననుత్వము రానపుడు ష్టుత్వమును రాదని తెలియునది.

వివ:—"ధాసువా" అనుటచేనుత్వమునకే వికల్పము. ష్టుత్వమునిత్యము గనే ప్రవర్తించును. షడ్ఢా అనియే యగునని కైయటుని యాశయము. షడ్ఢా అను భాష్యప్రయోగమువలననీమతమే యుక్తమైనది. ఉత్వష్టుత్వములు రెండును వికల్పమను హరదత్తమతమునననుసరించి గ్రన్థకర్త షడ్ధా అనివ్రాసెనని గ్రహింపనది.

816. పరవల్లిఙ్గం ద్వన్ద్వతత్పురుషయోః. 2-4-26. పరవత్ : లిఙ్గమ్, ద్వన్ద్వతత్పురుషయోః॥

ఏతయోః పరపదస్యేవ లిఙ్గం స్యాత్। కుక్కుటమయూర్యావిమే। మయూరీకుక్కుటావిమౌ। అర్ధపిప్పలీ (వా) ద్విగుప్రాప్తాపన్నాలంపూర్వగతిసమాసేషు ప్రతిషేధో వా

చ్యః। పంచసు కపాలేషు సంస్కృతః పంచకపాలః పురోడాశః। ప్రాప్తో జీవికాం ప్రాప్తజీవికః। ఆపన్నజీవికః। అలం కుమార్యై అలంకుమారిః। అతఏవ జ్ఞాపకాత్సమాసః। నిష్కౌశాంబిః॥

816. పంవత్ అనుచోట పరస్యైవ అని షష్ఠ్యన్తముకంటె వతిప్రత్యయము. ద్వన్ద్వతత్పురుషయోః అనునది షష్ఠ్యన్తము. ద్వన్ద్వతత్పురుషములకు పంపదముయొక్క లిఙ్గముతో సదృశమగులిఙ్గమగును. సూత్రమున ద్వన్ద్వపదము చేనితరేతరయోగద్వన్ద్వమునే గ్రహింపవలయును. సమాహార ద్వన్ద్వమున నీసూత్రమునకపవాదమగు "సనపుంసకమ్" అనుసూత్రముచే నపుంసకత్వము విధింపబడును. కుక్కుటమయూర్యౌ (ఇమే) కుక్కుటశ్చమయూరీ చ అనివిగ్రహము. ద్వన్ద్వమున పూర్వపదలిఙ్గముపరపదలిఙ్గముగూడ అనియమముగ ప్రాప్తించుచుండ నీసూత్రము నియమార్థమగును. మయూరీకుక్కుటౌ (ఇమౌ) (మయూరీ చ కుక్కుటశ్చ) అర్ధపిప్పలీ। ఏకదేశిసమాసము, పూర్వపదార్థప్రధానము గానపూర్వపదలిఙ్గము సమాసమునకు ప్రాప్తించుచుండ నుత్తరపదలిఙ్గము నీసూత్రము విధించును.

(వా) ద్విగుసమాసము ప్రాప్తాపన్నసమాసము అలంశబ్దపూర్వకసమాసము గతిసమాసము వీనియందు పరవల్లిఙ్గప్రతిషేధమును చెప్పవలయును. ఉదా :— (1) పఞ్చకపాలః। (పంచసు కపాలేషు సంస్కృతః) ద్విగుసమాసము. ఈనిషేధము లేనిచో పరపదమగుకపాలశబ్దము నపుంసకము గావునసమాసముగూడ నపుంసకము గావలసివచ్చును. (2) ప్రాప్తజీవికః (ప్రాప్తో జీవికామ్) ఉత్తరపదమగు జీవికాశబ్దముయొక్క లిఙ్గము సమాసమునకు రాదు. (3) అలంకుమారిః। అలంపూర్వకసమాసమునకుదాహరణము. అలం కుమార్యై అని విగ్రహము. వార్తికములేనిచో కుమారీశబ్దముయొక్క స్త్రీత్వము సమాసమునకు రావలసివచ్చును. అలంకుమార్యై అనిభాష్యమున విగ్రహమును చూపుటచే "పర్యాదయోగ్లానాద్యర్థే" అనువార్తికముచే నిత్యసమాసము ప్రవర్తింపదు. కాని యీవార్తికమునలంపూర్వగ్రహణరూపమగు జ్ఞాపకముచేనీస్థలమున సమాసము నూహించునది. లేకున్న వార్తికమందలంపూర్వగ్రహణము వ్యర్థమయ్యెడిని. (4) నిష్కౌశాంబిః। గతిసమాసమునకుదాహరణము. కౌశాంబీ శబ్దముయొక్క లిఙ్గము సమాసమునకు రాదు.

వివ :— సూత్రమున ద్వన్ద్వతత్పురుషయోః అనునది పరవత్తనునదియు నర్థపరములు. ద్వన్ద్వతత్పురుషార్థములకు పరపదార్థలిఙ్గమగునని సూత్రార్థము. ఇట్లు చెప్పుటవలన ఇమౌ ఇమే అను అనుప్రయోగములందును పరపదార్థలింగము సిద్ధమగునని గ్రహించునది.

817. పూర్వవదశ్వబడబౌ. 2-4-27. పూర్వవత్, అశ్వబడబౌ।

ద్వివచనమతంత్రమ్। అశ్వబడబౌ। అశ్వబడవాన్। అశ్వబడబైః॥

817. పూర్వవత్ (పూర్వస్యేవ) అనుదానికి పూర్వపదార్థగతలిఙ్గమున కతిదేశమని యర్థము. అశ్వబడబౌ అనుచోటనుండు ద్వివచనం వివక్షితము. అశ్వశ్చ బడబాచ అనువిగ్రహముగల ద్వంద్వసమాసమునకు పూర్వసూత్రముచే ప్రాప్తించుపరపదార్థలిఙ్గమును బాధించి యీసూత్రముచే పూర్వపదార్థలిఙ్గము విధింపబడుచున్నది. ద్వివచనమవివక్షితమనుటచే బహువచనమందు మరియొకవిభక్తియందును పూర్వపదార్థలిఙ్గమే యతిదేశింపబడును. అశ్వబడవాః। (అశ్వాశ్చ బడవాశ్చ) అశ్వబడబైః॥

వివ :— ద్వివచనమతంత్రమ్ అనుచోట ద్వివచనపదముపలక్షణముచే విభక్తినిగూడ బోధించును. కావున విభక్త్యన్తరమందుగూడ పూర్వపదార్థలిఙ్గము సిద్ధించును. అవివక్షితమనుటలో నీసూత్రమందలి పూర్వపత్తనుపదమే మూలము. ద్వివచనమందే పూర్వపదార్థలిఙ్గమభిమతమైనచో "అశ్వబడబౌ" అనునిపాతమువలన నయ్యది సిద్ధించును గాన పూర్వవద్గ్రహణము వ్యర్థము గావలసివచ్చును.

818. రాత్రాహ్నాహాః పుంసి. 2-4-28. రాత్రాహ్నాహాః, పుంసి, (ద్వంద్వతత్పురుషయోః)

ఏతదన్తౌ ద్వన్ద్వతత్పురుషౌ పుంస్యేవ। అనన్తరత్వాత్పరవల్లిఙ్గతాపవాదోఽప్యయం పరత్వాత్సమాహారనపుంసకతాం బాధతే। అహోరాత్రః। రాత్రేః పూర్వభాగః పూర్వరాత్రః। పూర్వాహ్ణః। ద్వ్యహః। సంఖ్యాపూర్వం రాత్రం క్లీబమ్। ద్విరాత్రమ్। గణరాత్రమ్॥

818. ద్వన్ద్వతత్పురుషయోః అనుదానిని ప్రథమాబహువచనాన్తముగ విపరిణామము చేసి "రాత్రాహ్నాహాః" అనుదానికి విశేషణముగ చేయవలయును. తదన్తవిధి. రాత్రిశబ్దము అహ్నశబ్దము అన్తమందుగల ద్వన్ద్వతత్పురుషసమాసములు పుల్లిఙ్గమందే యుండునని యర్థము. ఇది పరవల్లిఙ్గమ్ అను సూత్రమునకపవాదము. పురస్తాదపవాదన్యాయముచే నీసూత్రమవ్యవహితపూర్వమగు "పరవల్లిఙ్గమ్" అను సూత్రమునకే అపవాదమైనను పరమనుటవలన "స నపుంసకమ్" అనునపుంసకత్వవిధాయకమగుసూత్రమును గూడ బాధించును. కావున సమాహారద్వన్ద్వముగూడ నీసూత్రమునకుదాహరణమగును. ఉదా :— అహోరాత్రః। (అహశ్చ రాత్రిశ్చ తయోస్సమాహారః) పూర్వరాత్రః (రాత్రేః పూర్వభాగః) ఏకదేశిసమాసము "అహస్సర్వైకదేశ" (791) సూ.చే అచ్ప్రత్యయము. పూర్వాహ్ణః। ఏకదేశిసమాసము. టచ్ప్రత్యయము. "అహ్నోఽహ్న ఏతేభ్యః" (794) సూ. చే అహ్నాదేశము. ణత్వము. ద్వ్యహః (ద్వయోరహ్నోస్సమాహారః) సమాహారద్విగుసమాసము.

"న సంఖ్యాదేః" (767) సూ. చే ఆదేశ నిషేధము. పుంస్త్వము. (వ) సంఖ్యావాచకము పూర్వపదముగగలిగి రాత్రశబ్దము సమందుగలసమాసమునపుంసక మగును. ఈవిషయమున "అపథ పుణ్యాహౌ నపుంసకౌ, సంఖ్యాపూర్వా రాత్రిః" అను లింగానుశాసనసూత్రము "రాత్రం ప్రాక్సంఖ్యయాన్వితమ్" అనునమరము మానమని గ్రహించునది. ద్విరాత్రమ్ సమాహారంద్విగుసమాసము. నపుంసకత్వము. త్రిరాత్రమ్ గణరాత్రమ్. (గణానాం=బహూనాం రాత్రీణాం సమాహారః) గణ శబ్దము బహుత్వవాచకము. గణశబ్దమునకు "బహుగణ" (259) సూ. చే సంఖ్యాసంజ్ఞ। సమాహారద్విగువు। అచ్ప్రత్యయము. నపుంసకత్వము.

వివ:—సంఖ్యాపదము గ్రహింపబడిన చోటులందు, కృత్రిమాకృత్రిమ న్యాయము ప్రవర్తించదని సూచింపుటకై, ద్విరాత్రమ్ గణరాత్రమ్ వీనినుదా హరించెను.

819. అపథం నపుంసకమ్. 2-4-30. అపథమ్. నపుంసకమ్, (తత్పురుషః)

తత్పురుష ఇత్యేవ। అన్యత్ర తు అపథో దేశః। కృత సమాసాన్తనిర్దేశాన్నేహ। అపన్థాః॥

819. అపథమనునది ద్వన్ద్వమగుటకు యోగ్యము కానందున నీసూత్రము తత్పురుషమందే ప్రవర్తించును. తత్పురుషమందపథశబ్దము నపుంసకమగునని సూత్రార్థము. నపన్థాః అను విగ్రహమున నఞ్ సమాసము. నలోపము. "పథో విభాషా" (972) అను వక్ష్యమాణసూత్రముచే వికల్పముగ అప్రత్యయమగును. టిలోపము. ఇట్లు అపథశబ్దము సిద్ధమగును. ఈసూత్రము పరవల్లింగమును బాధిం చును. తత్పురుషమందే అనిచెప్పుటవలన అపథః (న విద్యతే పన్థాః యస్య సః) దేశము. అను బహువ్రీహియందు నపుంసకత్వము నివృత్తమగును. సూత్రమున అపథమ్ అని సమాసాన్తప్రత్యయముతోగూడినదానిని నిర్దేశించుటచే సమాసాన్త ప్రత్యయము ప్రవర్తింపనపుడీసూత్రము ప్రవర్తింపదు. అపన్థాః॥

820. * అర్ధర్చాః పుంసి చ. 2-4-31. అర్ధర్చాః. పుంసి, చ।

అర్ధర్చాదయః శబ్దాః పుంసి క్లీబే చ స్యుః। అర్ధ ర్చః। అర్ధర్చమ్। ధ్వజః, ధ్వజమ్। ఏవం తీర్థ, శరీర, మండ, పీయూష, దేహ, అఙ్కుశ, కలశ, ఇత్యాది॥

---

* అర్ధర్చ గోమయ కషాయ కార్షాపణ కుతప కుణప కపాట శఙ్ఖ గూథ యూథ ధ్వజ కబన్ధ పద్మ గృహ సరక కంస దివస యూష అన్ధకార దణ్డ కమ ణ్డలు మణ్డ భూత ద్వీప ద్యూత చక్ర ధర్మ కర్మన్ మోదక శతమాన యాన నఖ నఖర చరణ పుచ్ఛ దాడిమ హిమ రజత సక్తు పిధాన సార పాత్ర ఘృత సైన్ధవ

820. అర్ధర్చ మొదలగు నర్ధర్చాదిగణపఠితములగు శబ్దములు పుంలిఙ్గనపుంసకలిఙ్గములు గలవగును. అర్ధర్చః। అర్ధర్చమ్। (ఋచో౽ర్ధమ్) "అర్ధం నపుంసకమ్" (717) సూ. చే నేకదేశసమాసము. "ఋక్పూరబ్ధూః" (945) సూ. చే సమాసాన్తమగు అప్రత్యయము. పరవల్లిఙ్గమను బాధించి యీసూత్రముచే పున్నపుంసకములగును. ధ్వజః ధ్వజమ్। ఇట్లే తీర్థ శరీర మండ పీయూష దేహ అఙ్కుశ కలశ మొదలగువానియందును పున్నపుంసకలిఙ్గములనూహించవలయును.

821. జాత్యాఖ్యాయామేకస్మిన్బహువచనమన్యతరస్యామ్.
1-2-58. జాత్యాఖ్యాయామ్, ఏకస్మిన్, బహువచనమ్, అన్యతరస్యామ్॥

ఏకో౽ప్యర్థో వా బహువద్భవతి। బ్రాహ్మణాః పూజ్యాః,। బ్రాహ్మణః పూజ్యః॥

821. జాత్యాఖ్యాయామ్=జాతి (గోత్వము, బ్రాహ్మణత్వము) ప్రధానముగ బోధ్యమగునపుడు, ఏకస్మిన్=ఒకయర్థమును ప్రతిపాదించుశబ్దము, బహువచనమ్=బహూనామర్థానాం, వచనమ్=ప్రతిపాదనమ్. అనువృత్త్తిచే అనేకార్థములకు బోధకమగునని యర్థము. జాతిని ప్రధానముగ బోధించునపుడేకత్వసంఖ్యావిశిష్టమగునర్థముగూడ ననేకార్థమువంటిదగునని సూత్రమునకర్థము. ఇట్లు వ్యాఖ్యానముచేయుటవలన జాతివాచకములకు వీనివిశేషణములకును ఏకవచ

---

ఔషధ అథక చషక ద్రోణ ఖలీన పాత్రీవ షష్టిక వారవాణ ప్రోథ కపిత్థ శాల శీల శుక్ల శీధు కవచ రేణు కపట శీకర ముసల సువర్ణ వర్ణ పూర్వ చమస క్షీర కర్ష ఆకాశ అష్టాపద మఙ్గల నిధన నిర్యాస జృమ్భ వృత్త పుస్త బుస్త క్ష్వేడిత శృఙ్గ నిగడ మూలక మధు మూల స్థూల శరావ నాల వప్ర విమాన ముఖ ప్రగ్రీవ శూల వజ్ర కటక కంటక శిఖర కల్కసటమక పలయ కుసుమ తృణ పఙ్క కుణ్డల కిరీట అర్బుద అఙ్కుశ తిమిర ఆశ్రాయ భూషణ ఇక్కాన ముకుల వసన్త తటాక పిటక విటఙ్క పిణ్యాక మాష కోశ ఫలక దిన దైవత పినాక సమర స్థాణు అనీక ఉపవాస శాక కర్పాస చషాల ఖణ్డ దర విటప మృగాల హస్త ఆర్ద్ర హల తాణ్డవ గాణ్డీవ మణ్డప పటహ సౌధ యోధ పార్శ్వ శరీర ఫల పుర రాష్ట్ర అమ్బర బిమ్బ కుట్టిమ మణ్డల కుడప కుకుద ఖణ్డల తోమర తోరణ మఞ్చక పఞ్చక పుఙ్ఖ మధ్య ఛాలవల్మీక వర్ష వస్త్ర వసు దేహ ఉద్యాన ఉద్యోగ స్నేహ స్తేన సఙ్గమ నిష్క క్షేమ శూక క్షత్ర పవిత్ర యౌవక మూషిక కుజ విహార లోహిత విషాణ భవన అరణ్య పులిన దృఢ ఆసన ఐరావత శూర్ప తీర్థ లోమశ తమాల లోహ దణ్డక శపథ ప్రతిసర దారు ధనుస్ మాన వర్చస్క కూర్చ తణ్డక మఠ సహస్ర ఓదన ప్రవాల శకట అపరాహ్ణ నీడ శకల తణ్డుల ముస్తక ఇత్యర్ధర్చాదిః॥

నమును ప్రయోగింపదగినచోట బహువచనముగూడ సిద్ధించును. ఉదా।— బ్రాహ్మణాః (పూజ్యాః) ఇచట బ్రాహ్మణశబ్దము ప్రధానముగ జాతిని బోధించునదగుటచే నీశబ్దముకంటె వికల్పముగ బహువచనము ప్రవర్తించెను. పక్షమందు "బ్రాహ్మణః పూజ్యః" అనుచోట జాతియందుండేకత్వమును బోధించుయేకవచనమగును.

వివ:—ఘటపటాదిశబ్దములచే జాతియొకటియే ప్రధానముగ ప్రతిపాద్యమగుటవలన దానికంటె ఏకవచనమే ప్రాప్తించుచుండ బహువచనమునకై యీ సూత్రారంభము. జాతి ప్రధానముగ వివక్షితమైనపుడేకవచనము, వ్యక్తులుప్రధానమగునపుడు బహువచనమిట్లు, జాతివాచకములకంటె ఏకవచనబహువచనములు వికల్పముగ సిద్ధించుచుండ నీసూత్రమునకు ప్రయోజనమేమను శఙ్క గల్గును. ఇట్లే అర్ధనావమిత్యాదులందు నపుంసకమునకై లిఙ్గము లోకాశ్రయమని యఙ్గీకరించుట యావశ్యకమయినపుడు "అర్ధర్చాః పుంసి చ" మొదలగు లిఙ్గానుశాసన సూత్రములకేమి ఫలమను శఙ్కగూడ గల్గుచున్నది. "జాత్యాఖ్యాయామ్" మొదలగు నాల్గు సూత్రములు పై జెప్పినరీతిని వ్యర్థములు, యిట్లే లిఙ్గానుశాసనసూత్రములును వ్యర్థములనుట యిష్టము. ఈవిషయమును సూచింపుటకే లిఙ్గవిధాయకములగు సూత్రములమధ్యను బహువచనావిధాయకసూత్రచతుష్టయము వ్యాఖ్యాతమయ్యెనని గ్రంథకర్తయొక్క యాశయము గ్రహింపదగును. జాతిని ప్రధానముగ బోధించునపుడు బ్రాహ్మణాః అను సూత్రకారాభిమతములగు బహువచనాన్తరూపములసాధువులని ప్రత్యాఖ్యాతృభాష్యకారుని యాశయము.

822. అస్మదో ద్వయోశ్చ. 1-2-59. అస్మదః, ద్వయోః, చ।
(ఏకస్మిన్, బహువచనమ్, అన్యతరస్యామ్)

ఏకత్వే ద్విత్వే చ వివక్షితే అస్మదో బహువచనం వా స్యాత్। వయం బ్రూమః। పక్షే అహం బ్రవీమి। ఆవాం బ్రూవ ఇతి వా। (వా) సవిశేషణస్య ప్రతిషేధః। పటురహం బ్రవీమి॥

822. పూర్వసూత్రమువలెనిదియు నతిదేశసూత్రము. ద్వయోః అను దానివలన ద్విత్వే అనునర్థము లభించును. అస్మచ్ఛబ్దార్థముయొక్క ఏకత్వము వివక్షితమైనపుడు, ద్విత్వము వివక్షితమైనపుడును, అస్మచ్ఛబ్దము కంటె వికల్పముగ బహువచనమగును. ఏకత్వమందుదా—వయంబ్రూమః। బహువచనాభావపక్షమందు, అహం బ్రవీమి। ద్విత్వమందుదా—వయంబ్రూమః. పక్షమందు ఆవాం బ్రూవః అని యగును. (వా) విశేషణసహితమగు నస్మచ్ఛబ్దమునకు బహువచన ప్రతిషేధమును చెప్పవలయును. పటురహం బ్రవీమి। ఇచట పటుః అనునది అస్మచ్ఛబ్దమునకు విశేషణము. కావున వైకల్పికబహువచనాతిదేశము ప్రవర్తింపదు.

823. ఫల్గునీప్రోష్ఠపదానాం చ నక్షత్రే. 1-2-60. ఫల్గునీ ప్రోష్ఠపదానాం, చ, నక్షత్రే। (ద్వయోః బహువచనమ్, అన్యతరస్యామ్)

ద్విత్వే బహుత్వప్రయుక్తం కార్యం వా స్యాత్। పూర్వే ఫల్గున్యౌ। పూర్వాః ఫల్గున్యః। పూర్వే ప్రోష్ఠపదే। పూర్వాః ప్రోష్ఠపదాః। నక్షత్రే కిమ్। ఫల్గున్యౌ మాణవికే॥

823. నక్షత్రే అనునది ప్రథమాద్వివచనము. ప్రధానముగ నక్షత్రము లభిధీయమానము లైనపుడు తద్గతద్విత్వవివక్షయందు ఫల్గునీశబ్దమునకుప్రోష్ఠపదశబ్దమునకును బహువచనము విభాషగనగును. పూర్వే ఫల్గున్యౌ। పూర్వాః ఫల్గున్యః। పూర్వఫల్గునీనక్షత్రములభిహితములగుచున్నవి. పూర్వే ప్రోష్ఠపదే। పూర్వాః ప్రోష్ఠపదాః। ఫల్గున్యౌ (మాణవికే) "ఫల్గునీభ్యాంజాతే"। అనునర్థమందు ఫల్గునీశబ్దము కంటె "నక్షత్రేణ యుక్తః కాలః" (4-2-3) అను సూ. చే అణ్ప్రత్యయము. "లుబవిశేషే" (4-2-4) సూ. చే నణ్ప్రత్యయమునకు లుప్పగును. అనన్తరము "ఫల్గున్యషాఢాభ్యామ్టానౌవక్తవ్యౌ" అనువార్తికముచే టప్రత్యయము. "టిడ్ఢాణఞ్" (473) సూ. చే ఙీప్ప్రత్యయము. ఫల్గునీనక్షత్రయుక్తకాలమందు పుట్టిన వారని యర్థము. ప్రధానముగ నక్షత్రమభిధీయమానము కాలేదు గావ నిచట బహువచననివారణమునకై సూత్రమున నక్షత్రే అనునదావశ్యకమని తెలియనగును.

824. తిష్యపునర్వస్వోర్నక్షత్రద్వన్ద్వే బహువచనస్య ద్వివచనం నిత్యమ్. 1-2-63. తిష్యపునర్వస్వోః, నక్షత్రద్వన్ద్వే, బహువచనస్య, ద్వివచనమ్, నిత్యమ్। (నక్షత్రే)

బహుత్వం ద్విత్వవద్భవతి। తిష్యశ్చ పునర్వసూ చ, తిష్యపునర్వసూ। తిష్యేతి కిమ్। విశాఖానూరాధాః। నక్షత్రే కిమ్। తిష్యపునర్వసవో మాణవకాః॥

824. తిష్యశబ్దపునర్వసూశబ్దములకు వాచ్యమైననక్షత్రములను ప్రధానముగ ప్రతిపాదించు శబ్దములయొక్క ద్వన్ద్వమందు బహువచనమునకు నిత్యముగ ద్వివచనమగును. ఇట్లు అర్థము చెప్పుటవలన తిష్యపునర్వసూ శబ్దములపర్యాయములయొక్క ద్వంద్వమునగూడ నీసూత్రము ప్రవర్తించును. తిష్యపునర్వసూ। (తిష్యశ్చ పునర్వసూ చ) తిష్యమొకనక్షత్రము. పునర్వసువులు రెండు నక్షత్రములు. ఇచట బహువచనము ప్రాప్తించుచుండ నిత్యద్వివచనము విధింపబడెను. విశాఖాఽనూరాధాః। (విశాఖే చ అనూరాధాశ్చ) తిష్యపునర్వసూశబ్దవాచ్యమైన నక్షత్రములను బోధించు శబ్దములద్వన్ద్వము కాదుగాన నిచట ద్వివచనము రాదు. తిష్యపునర్వస్వోః। అనుదానికిది ఫలమని గ్రహించునది. తిష్యపునర్వసవః (మాణవకులు) ఇచట గూడ "నక్షత్రేణ యుక్తః కాలః" అను సూ.చే అణ్ప్రత్య

యము. దానికి "లుబవిశేషే" సూ. చే లుప్పగును. అనన్తరము "సంధివేలా" (4-3-16) సూ. చే జాతార్థమందు అణ్ప్రత్యయము వచ్చును. "శ్రవిష్ఠాఫల్గునీ" త్యాదిసూత్రముచే దానికి లుక్కగును. తిష్యపునర్వసూనక్షత్రయుక్త కాలమందు పుట్టినవారని యర్థము. నక్షత్రే అనునది యీసూత్రములోని కనువర్తింపకపోయిన నిచట ద్వివచనము ప్రసక్తమగును.

825. స నపుంసకమ్. 2-4-17. సః, నపుంసకమ్।

సమాహారే ద్విగుర్ద్వంద్వశ్చ నపుంసకం స్యాత్। పరవల్లిఙ్గాపవాదః। పంచగవమ్। దన్తోష్ఠమ్। వా॥ (1) అకారాన్తోత్తరపదో ద్విగుః స్త్రియామిష్టః। పంచమూలీ వా॥ (2) ఆబన్తో వా। పఞ్చఖట్వీ। పంచఖట్వమ్। వా॥ (3) అనో నలోపశ్చ వా ద్విగుః స్త్రియామ్। పఞ్చతక్షీ। పఞ్చతక్షమ్। వా॥ (4) పాత్రాద్యన్తస్య న। పఞ్చపాత్రమ్। త్రిభువనమ్। చతుర్యుగమ్। వా॥ (5) పుణ్యసుదినాభ్యామహ్నః క్లీబతేష్టా। పుణ్యాహమ్। సుదినాహమ్। వా॥ (6) పథస్సంఖ్యావ్యయాదేః। సంఖ్యాఽవ్యయాదేః పరః కృతసమాసాన్తః పథశబ్దః క్లీబమిత్యర్థః। త్రయాణామ్ పన్థాః త్రిపథమ్। విరూపః పన్థాః విపథమ్। కృతసమాసాన్తనిర్దేశాన్నేహ। సుపన్థాః। అతిపన్థాః। వా॥ (7) సామాన్యే నపుంసకమ్। మృదు పచతి। ప్రాతః కమనీయమ్॥

825. సః అనుశబ్దముచే సమాహారద్విగుసమాసము సమాహారద్వన్ద్వసమాసము పరామర్శింపబడును. సమాహారమందలి ద్విగుద్వన్ద్వ సమాసములు నపుంసకములగునని సూత్రార్థము. పరవల్లిఙ్గం ద్వన్ద్వతత్పురుషయోః అనుసూత్రమునకిది యపవాదము. పఞ్చగవమ్ (పఞ్చానాం గవాం సమాహారః) ద్విగుసమాసము. ప్రక్రియ ఉక్తపూర్వము. దీనిచే నపుంసకత్వము. దన్తోష్ఠమ్। (దన్తాశ్చ ఓష్ఠౌ చ) "ద్వన్ద్వశ్చ ప్రాణితూర్య" (911) సూ. చే సమాహారద్వన్ద్వము. నపుంసకత్వము.

(1) వా॥ అకారాన్తం ఉత్తరపదం యస్య సః। అని విగ్రహము. అకారాన్తమగును త్తరపదముగల ద్విగుసమాసము స్త్రీలిఙ్గమందుండుట యభిమతము. "స నపుంసకమ్" సూత్రమునకపవాదము. పఞ్చమూలీ। సమాహారద్విగుసమాసము. ఉత్తరపదమైన మూలశబ్దమకారాన్తమగుటచే దీనిచే స్త్రీత్వమగును. "ద్విగోః" (482) సూ. చే జీప్ప్రత్యయము.

(2) వా॥ ఆబన్తము త్తరపదముగగల ద్విగుసమాసము విభాషగ స్త్రీలిఙ్గమందుండును. పఞ్చఖట్వీ। సమాహారద్విగువు. ఖట్వాశబ్దమాబన్తము. ఉపసర్జ

నహ్వాస్వాన్తరమదన్తమగునుగాన "ద్విగోః" (482) సూ. చే ఙీప్ప్రత్యయము. స్త్రీత్వాభావపక్షమందు నపుంసకత్వము. పఞ్చఖట్వమ్ అని యగును.

(3) వా॥ అనః ఇనుదానినావృత్తిజేసి అందొకదానిని ప్రథమాన్తముగ విపరిణామముచేసి ద్విగువునకు విశేషణముగ చేయవలయును. తదన్తవిధి। అన్నన్తమైన ద్విగుసమాసము స్త్రీలిఙ్గమందు వికల్పముగనుండును, అన్నులోనినకారమునకు లోపము గూడనగునని వార్తికార్థము. వార్తికములోని వాగ్రహణము స్త్రియాం అనుదానితోనే సంబంధించును. కావుననలోపము స్త్రీత్వమందును స్త్రీత్వాభావమందును నిత్యముగనగునని తాత్పర్యము. ఉదా :— పఞ్చతక్షీ—పఞ్చతక్షమ్. పఞ్చన్‌శబ్ద తక్షన్‌శబ్దములకు సమాహారద్విగువు. స్త్రీత్వము. నలోపము. అదన్తమగును గాన "ద్విగోః" సూత్రముచే ఙీప్ప్రత్యయము. స్త్రీత్వాభావమందు సనపుంసకమ్ అను సూ. చే నపుంసకత్వము. నలోపము. పఞ్చతక్షమ్.

(4) వా॥ పాత్రాదిగణపతితములగు శబ్దములన్తమందుగల ద్విగుసమాసమునకు స్త్రీత్వము ప్రవర్తింపదు. పఞ్చపాత్రమ్। త్రిభువనమ్। చతుర్యుగమ్। సమాహారద్విగుసమాసములు. వీనికి స్త్రీత్వనిషేధమువలన సనపుంసకమ్ అను సూత్రముచే నపుంసకలిఙ్గమగును.

(5) వా॥ పుణ్యసుదినశబ్దములకంటె పరమగు అహన్‌శబ్దమన్తమందుగల తత్పురుషమునకు నపుంసకత్వమును చెప్పవలయును. "రాత్రాహ్నాహాః" అనుదానికిది యపవాదము. పుణ్యాహమ్। సుదినాహమ్। పుణ్యమహః సుదినమహఃఅనువిగ్రహములందు కర్మధారయసమాసములు టచ్ప్రత్యయము. టిలోపము. పుణ్యాహమనుచోట "ఉత్తమైకాభ్యాం చ" (798) అను సూ. చే అహ్నాదేశము నిషేధింపబడెను, నపుంసకత్వము.

(6) వా॥ సంఖ్యావ్యయమ్ అనునది సమాహారద్వన్ద్వము. పథః అనునది కృతసమాసాన్తమునకనుకరణము, ప్రథమాన్తము. సంఖ్యావ్యయమ్ ఆదిః అని కర్మధారయసమాసము. సంఖ్యావాచకముగాని అవ్యయముగాని పూర్వపదముగాగలిగి సమాసాన్తప్రత్యయసహితమైన పథశబ్దమంతమందుగలసమాసము నపుంసకమగునని యర్థము. పరలిఙ్గమునకపవాదము. త్రిపథమ్ (త్రయాణాం పన్థాః) "ఋక్పూరబ్ధూః" (945) సూ.చే అప్రత్యయము. టిలోపము. నపుంసకత్వము. విపథమ్ (విరూపః పన్థాః) ప్రాదయో గతాద్యర్థే అనువార్తికముచే సమాసము. పరిశిష్టమగుప్రక్రియ యూహించునది. సుపన్థాః। అతిపన్థాః। ఈస్థలములందు "న పూజనాత్" (959) సూ. చే సమాసాన్తనిషేధము. వార్తికమున పథః అని సమాసాన్తసహితమగుదానిని నిర్దేశించుటవలన నీస్థలములందు నపుంసకత్వము ప్రవర్తించదు. ఆవశ్యకమగునీవార్తికముచేతనే అపథమ్ అనురూపముసిద్ధమగును గాన "అపథమ్ నపుంసకమ్" (819) సూత్రమనావశ్యకమని తెలియునది.

(7) వా॥ సామాన్యమందు నపుంసకమగును. సామాన్యమనసత్త్వంజస్తమోగుణములయొక్క సామ్యావస్థ। ఈవచనము అనియతలిఙ్గవిషయకము. విశేష్యవిశేష్యముయొక్క సన్నిధానములేనపుడు అనియతలిఙ్గశబ్దమునకు నపుంసకలిఙ్గమే వచ్చుట న్యాయ్యము. కాననీవార్తికము న్యాయసిద్ధము. ఉదా :— మృదు పచతి। ప్రాతః కమనీయమ్। క్రియావిశేషణములకు నీవార్తికముచేతనే నపుంసకత్వము సిద్ధమగును గాన "క్రియావిశేషణానాం నపుంసకత్వ" మనువచనమపూర్వము గాదని గ్రహించునది.

826. తత్పురుషోఽనఞ్కర్మధారయః. 2-4-19. తత్పురుషః, అనఞ్కర్మధారయః।

అధికారోఽయమ్॥

826. ఇది అధికారసూత్రము. పరవల్లిఙ్గమ్ అనుసూత్రమువఱకధికృతమగును. నఞ్సమాసముకంటె కర్మధారయసమాసముకంటె భిన్నమగుతత్పురుషము వక్ష్యమాణసూత్రవిహితములగు కార్యములను పొందుననిసూత్రార్థము.

827. సంజ్ఞాయాం కన్థోశీనరేషు. 2-4-20. సంజ్ఞాయామ్, కన్థా, ఉశీనరేషు (నపుంసకమ్)

కన్థాన్తస్తత్పురుషః క్లీబం స్యాత్సాచేదుశీనరదేశోత్పన్నాయాః కన్థాయాస్సంజ్ఞా। సుశమస్యాపత్యాని సౌశమయః। తేషాం కన్థా, సౌశమికన్థమ్। సంజ్ఞాయామ్। కిమ్। వీరణకన్థా। ఉశీనరేషు కిమ్। దాక్షికన్థా॥

827. కన్థాశబ్దాన్తమగు తత్పురుషము ఉశీనరదేశమందుపుట్టిన కంథకుసంజ్ఞయైనచో నపుంసకమగును. సౌశమికన్థమ్। (సుశమస్యాపత్యాని సౌశమయః తేషాం కన్థా) నపుంసకత్వము. ఉశీనరదేశమందుపుట్టినకంథకిది సంజ్ఞ. వీరణకన్థా। ఇది సంజ్ఞగాకపోవుటచేనిచటనపుంసకత్వవారణమునకై సంజ్ఞాయామ్ అనుపదిసూత్రమునయుండవలయును. దాక్షికన్థా। ఉశీనరదేశమందుత్పన్నమైనకన్థకు సంజ్ఞ కాకపోవుటచే నిచట నపుంసకత్వవారణమునకై ఉశీనరేషు అనుపదమావశ్యకము.

విశ:—ఇచట సంజ్ఞయన అనాదిసంకేతము. ఈసంజ్ఞ ఉశీనరదేశములందు నఞ్సమాసకర్మధారయభిన్నమగుతత్పురుషమందేయుండుటవలన "తత్పురుషః" (826) అనునధికారసూత్రమునకిచటప్రయోజనములేదని గ్రహించునది. ఈప్రకరణము పరవల్లిఙ్గమునకు విశేష్యనిఘ్నత్వమునకు నపవాదము.

828. ఉపజ్ఞోపక్రమం తదాద్యాచిఖ్యాసాయామ్. 2-4-21. ఉపజ్ఞోపక్రమ్, తదాద్యాచిఖ్యాసాయామ్ (నపుంసకమ్)

ఉపజ్ఞాన్తః, ఉపక్రమాన్తశ్చ తత్పురుషో నపుంసకం స్యాత్, తయోరుపజ్ఞాయమానోపక్రమ్యమాణయోరాదిః ప్రాథమ్యం చేదాఖ్యాతుమిష్యతే। పాణినేరుపజ్ఞా పాణిన్యుపజ్ఞం గ్రన్థః। నన్దోపక్రమం ద్రోణః॥

828. ఉపజ్ఞోపక్రమశబ్దములు కర్మార్థకఘఞన్తములు. (ఉపజ్ఞాయతే ఉపక్రమ్యతే) వీనికి ప్రథమజ్ఞానవిషయము ప్రథమారమ్భవిషయము క్రమముగ అర్థము. ఇట్టిశబ్దములకు సమాహారద్వన్ద్వమువలన ఉపజ్ఞోపక్రమమని యగును. ఇది అనువృత్తమగు తత్పురుషమునకు విశేషణముగాన తదన్తవిధిచే ఉపజ్ఞాశబ్దము ఉపక్రమశబ్దము అన్తమందుగల తత్పురుషమని యర్థము లభించును. తదాద్యాచిఖ్యాసాయామ్—తయోరాదిస్తదాదిః ఆఖ్యాతుమిచ్ఛా అచిఖ్యాసా తదాదేరాచిఖ్యాసా తస్యామ్। ఇచట తత్పదముచేనుపజ్ఞోపక్రమములు వివక్షితములు. ఉపజ్ఞాన్తము ఉపక్రమాన్తమునగు తత్పురుషము ఉపజ్ఞాయమానోపక్రమ్యమాణముల యొక్క ప్రాథమ్యము వివక్షితమగునపుడు నపుంసకమగునని సూత్రార్థము. ఉదా:—పాణిన్యుపజ్ఞమ్ (గ్రన్థః) పాణినేరుపజ్ఞా అనివిగ్రహము. పాణినేః అనుచోట షష్ఠ్యర్థము కర్త. పాణినిచే మొదట తెలిసికొనబడినది. (పాణిని సంబన్ధ్యాద్యజ్ఞానవిషయః) అని యర్థము. నన్దోపక్రమమ్ (ద్రోణః) నన్దస్యోపక్రమః అనివిగ్రహము. నన్దునిచే మొదట నారంభింపబడినదని యర్థము.

829. ఛాయా బాహుల్యే. 2-4-22. ఛాయా, బాహుల్యే, (నపుంసకమ్, తత్పురుషః)

ఛాయాన్తస్తత్పురుషో నపుంసకం స్యాత్పూర్వపదార్థబాహుల్యే। ఇక్షూణాం ఛాయా ఇక్షుచ్ఛాయమ్। విభాషా సేనేతి వికల్పస్యాయమపవాదః। ఇక్షుచ్ఛాయానిషాదిన్య ఇతి తు ఆసమన్తాన్నిషాదిన్య ఇత్యాఙ్ ప్రశ్లేషో బోధ్యః॥

829. పూర్వపదార్థముయొక్క బాహుల్యమున్నపుడు గడిచిఛాయను (నీడను) బోధించు ఛాయాశబ్దమన్తమందుగల తత్పురుషము నపుంసకమగును. ఇక్షుచ్ఛాయమ్ (ఇక్షూణామ్ ఛాయా) పూర్వపదార్థములగు నిక్షువుల (చెఱకుల) బాహుళ్యముండుటచేనిచట నపుంసకమగును. విభాషా సేనా" (832) అను పరముమాణసూత్రముచే విధింపబోవు నపుంసకత్వ వికల్పమునకీసూత్రమపవాదము. "ఇక్షుచ్ఛాయానిషాదిన్యః" అను కాళిదాసప్రయోగమున ఇక్షుచ్ఛాయమ్ అనునపుంసకశబ్దమునకు అనిషాదినీశబ్దముతో సమాసము. ఆసమన్తాన్నిషాదిన్యః అని ఆఙ్ ప్రశ్లేషమును చేయవలయును. సవర్ణదీర్ఘమువలన ఇక్షుచ్ఛాయానిషాదిన్యః అని సిద్ధమగును. కావుననిచట నపుంసకలిఙ్గమేల ప్రవర్తించలేదను శంక నిరస్తమగును.

వివ: —ఛాయ అవరకద్రవ్యనిమిత్తకము గావున "కస్యబాహుళ్యే"అను నాకాంక్ష గల్గును. తద్బాహుళ్యే అనునది గమ్యమానమగును, తత్పదార్థము పూర

పదార్థమే యగును గానసభూలమందులోని పూర్వపదార్థబాహుళ్యే అనునది ఫలిత మగును.

830. సభా రాజాఽమనుష్యపూర్వా. 2-4-23. సభా; రాజాఽమనుష్యపూర్వా। (నపుంసకమ్, తత్పురుషః)

రాజపర్యాయపూర్వోఽమనుష్యపూర్వశ్చ సభాన్తస్తత్పురుషః నపుంసకం స్యాత్। ఇనసభమ్। ఈశ్వరసభమ్। (వా) పర్యాయస్యైవేష్యతే। నేహ। రాజసభా చంద్రగుప్తసభా। అమనుష్యశబ్దో రూఢ్యా రక్షఃపిశాచాదీనాహ। రక్షస్సభమ్। పిశాచసభమ్॥

830. రాజాఽమనుష్యపూర్వా అనుచోట రాజా చ అమనుష్యశ్చ రాజామనుష్యౌ తౌపూర్వౌయస్యాస్సా అనివిగ్రహము. రాజశబ్దముచే రాజ పర్యాయములు వివక్షింపబడును. అమనుష్యశబ్దము రూఢిచే పిశాచాదులను బోధించును. రాజ శబ్దపర్యాయములుగాని అమనుష్యవాచకములుగాని పూర్వమందుగల్గి సభాశబ్దము న్తమందుగలతత్పురుషము నపుంసకమగునని యర్థము. ఇనసభమ్ (ఇనస్య సభా) ఇనశబ్దము రాజ పర్యాయము. ఈశ్వరసభమ్ (ఈశ్వరస్య సభా) ఈశ్వరశబ్దముగూడ రాజపర్యాయము (వా) సూత్రములోని రాజశబ్దముచే తత్పర్యాయములకే గ్రహణమిష్టమని వార్తికార్థము. కావున "స్వంరూపం" (26) అనుసూత్రముచే రాజశబ్దమునకు (స్వరూపమునకు) గ్రహణము కలుగదు. ఏవకారమువలన రాజవిశేషవాచకములకుగూడ గ్రహణము గలుగదని ఫలితమగును. రాజసభా (రాజ్ఞః సభా) ఇచట రాజశబ్దము తత్పర్యాయము కాదు కాన నపుంసకత్వమురాదు. చంద్రగుప్తసభా (చంద్రగుప్తస్య సభా) చంద్రగుప్తశబ్దమొకరాజ విశేషమునకు బోధకము గాననిచట నపుంసకత్వము ప్రవర్తింపదు. సూత్రమువ అమనుష్యశబ్దము సముదాయశక్తిచే రక్షస్సులు, పిశాచములు మొదలైనవానిని బోధించును. రక్షస్సభమ్ (రక్షసాం సభా) పిశాచసభమ్ (పిశాచానాం సభా) అమనుష్యశబ్దమునకిట్టియర్థము వివక్షితమగుటచే దేవసభా అనుచోట దేవశబ్దమమనుష్యవాచకమైననీసూత్రము ప్రవర్తించదు.

831. అశాలా చ. 2-4-24 అశాలా. చ (నపుంసకమ్, తత్పురుషః. సభా)

సంఘాతార్థా యా సభా తదన్తస్తత్పురుష క్లీబం స్యాత్। స్త్రీసభమ్। స్త్రీసంఘాత ఇత్యర్థః। అశాలా కిమ్। ధర్మసభా। ధర్మశాలేత్యర్థః॥

831. అశాలార్థమును (సంఘాతమును) ప్రతిపాదించు సభాశబ్దమన్తమందుగల తత్పురుషము నపుంసకమగును. స్త్రీసభమ్ (స్త్రీణాం సభా) స్త్రీసమూహ

మని యర్థము. అశాలాకిమ్। పూర్వసూత్రమున "సభా" అనుదానిని విభాగము చేసి సభాన్తమగుతత్పురుషమునకు నపుంసకలిఙ్గమును విధింపవలయును. దీనిచే శాలార్థకసభాన్తమునకు సంఘాతార్థకసభాన్తమునకుగూడ నపుంసకత్వము విహితమగును. "రాజామనుష్యపూర్వా" అనునది నియమార్థమగును. శాలార్థకసభాన్తమునకు నపుంసకత్వమయినచో రాజామనుష్యపూర్వమగునపుడే వచ్చునని నియమాకారము. సభా అను యోగమువలననీసూత్రోదాహరణములగు "స్త్రీసభ"మిత్యాదులందు నపుంసకత్వము సిద్ధమగును. నియమమునాశ్రయించుటచే "ధర్మసభా" (శాలార్థకసభాన్తము) అనుచోటనతివ్యాప్తి వారితమగును. కావున "అశాలా చ" అనుసూత్రమునకు ప్రయోజనమేమని ప్రశ్నాశయము. ధర్మసభా। ఉక్తరీతినే నియమమునాశ్రయించుటలో వినిగమకము లేనందున సంఘాతార్థకసభాన్తమునకు నపుంసకత్వమైనచో రాజామనుష్యపూర్వమునకే అగునను నియమముగూడ సంభవించును. శాలార్థకసభాన్తము నియమకోటిప్రవిష్టముగానందున "ధర్మసభా" (ధర్మశాల) అనుచోట "సభా" అనుయోగముచే నపుంసకత్వము ప్రసక్తమయ్యెడిని. అశాలా అనుసూత్రమున్నచో పూర్వసూత్రము శాలార్థకసభాన్తవిషయకము యీసూత్రము సంఘాతార్థక సభాన్తవిషయకమునగును. ధర్మసభా అనుచోట దోషము నివృత్తమగునని సమాధానాశయము.

> 832. విభాషా సేనాసురాచ్ఛాయాశాలానిశానామ్. 2-4-25.
> విభాషా. సేనాసురాచ్ఛాయాశాలానిశానామ్ (నపుంసకమ్, తత్పురుషః)
>
> ఏతదన్తస్తత్పురుషః క్లీబం వా స్యాత్। బ్రాహ్మణసేనమ్। బ్రాహ్మణసేనా। యవసురమ్। యవసురా। కుడ్యచ్ఛాయమ్। కుడ్యచ్ఛాయా। గోశాలమ్। గోశాలా। శ్వనిశమ్ శ్వనిశా। తత్పురుషోఽనఞ్ కర్మధారయ ఇత్యనువృత్తేర్నేహ। దృఢసేనో రాజా। అసేనా। పరమసేనా॥

832. సేనా.......నిశానామనుచోట షష్ఠి ప్రథమార్థకమని తెలియునది. సేనా సురా ఛాయా శాలా నిశా శబ్దములన్తమందుగల తత్పురుషము వికల్పముగ నపుంసకమగును. బ్రాహ్మణసేనమ్. బ్రాహ్మణసేనా। (బ్రాహ్మణస్య సేనా) యవసురమ్। యవసురా। కుడ్యచ్ఛాయమ్। కుడ్యచ్ఛాయా। గోశాలమ్ గోశాలా। శ్వనిశమ్ శ్వనిశా। (శునో నిశా) కృష్ణ చతుర్దశి అని యర్థము. కృష్ణచతుర్దశియందు శునకములుపవాసముండునని శాబరభాష్యము (పూర్వమీమాంస) యొక్క తిర్యగధికరణమున చెప్పబడెను. దృఢసేనః। (దృఢా సేనా యస్య సః) రాజని యర్థము. బహువ్రీహి। అసేనా (న సేనా) నఞ్సమాసము. పరమసేనా।

(పంమా చ సేనాచ) కర్మధారయము. "తత్పురుషోనఞ్కర్మధారయః" అనునది యీసూత్రములోని కనువర్తించుటవలన నీస్థలములందు క్లీబత్వము ప్రవర్తింపదు.

వివ:— "సంజ్ఞాయాంకన్థోశీనరేషు" అనుసూత్రము మొదలు "ఆశాలాచ" అనుసూత్రమువరకునున్న అయిదుసూత్రములయుదాహరణములందును తత్పురుషభిన్నమగుసమాసము నఞ్సమాసకర్మధారయ సమాసములును సంభవింపవు గాన "తత్పురుషోఽనఞ్కర్మధారయః" అనునధికారసూత్రమునకీసూత్రమందే ప్రయోజనమని యూహించునది.

తత్పురుషప్రకరణము సమాప్తము.



# 17. బహువ్రీహిప్రకరణము

833. శేషో బహువ్రీహిః. 2-2-23. శేషః, బహువ్రీహిః।

అధికారోఽయమ్। ద్వితీయాశ్రితేత్యాదినా యస్య త్రికస్య విశిష్య సమాసో నోక్తః స శేషః ప్రథమాన్త మిత్యర్థః॥

833. ఇది యధికారసూత్రము. ద్వితీయాశ్రితేత్యాది సూత్రములచే నేవిభక్తికి ప్రత్యేకముగ సమాసము విధింపబడలేదో యది యిచటి శేషపదము యొక్కర్థము. ఏసూత్రముచేతను ప్రథమకు సమాసము విధింపబడనందున శేషపదార్థము ప్రథమాన్తమని ఫలితమగును.

వివ:— శిష్ (అసర్వోపయోగే) ధాతువుకంటె కర్మార్థమందు ఘఞ్ప్రత్యయమువలన శేషః యనురూపము సిద్ధమగును. ఉక్తాదన్యః శేషః = ఇదివఱకు చెప్పబడినదానికంటె భిన్నమైనది శేషపదార్థము. "ద్వితీయా......పన్నైః", "తృతీయా......గుణవచనేన", "చతుర్థీ......రక్షితైః", "పంచమీభయేన", "షష్ఠీ", "సప్తమీశౌణ్డైః", అనుసూత్రములచేనిదివఱకు ఆవిభక్తులకు విశేషముగ సమాసము విధింపబడినది. అట్లు ప్రథమావిభక్తినుచ్చరించి ప్రత్యేకముగ ప్రథమావిభక్తికిఁతరముతో సమాసము విధింపబడలేదు. కావున శేషపదమునకు ప్రథమావిభక్తియను నర్థము లభించును. "విశేషణం......బహులమ్"(740) అను సూత్రవిహితమగు సమాసము ప్రథమాన్తములకు ప్రవర్తించునదైనప్పటికి "ద్వితీయాశ్రితే" త్యాదులందువలె ప్రథమాశబ్దమునుచ్చరించి సమాసము విధింపబడకుండుటచే శేషమన ప్రథమాన్తమే యగును. ఈయధికారమువలనను త్తరసూత్రములందు, ప్రథమాన్తములకు సమాసమగుననియు నది బహువ్రీహిసంజ్ఞకలదగుననియునర్థము లభించును.

834. అనేకమన్యపదార్థే. 2-2-24. అనేకమ్, అన్యపదార్థే।

అనేకం ప్రథమాన్తమన్యస్య పదస్యార్థే వర్తమానం వా సమస్యతే స బహువ్రీహిః। అప్రథమావిభక్త్యర్థే బహువ్రీహిరితి సమానాధికరణానామితి చ ఫలితమ్। ప్రాప్తముదకం యం ప్రాప్తోదకో గ్రామః। ఊఢరథోఽనడ్వాన్।

ఉపహృతపశూ రుద్రః। ఉద్ధృతౌదనా స్థాలీ। పీతాంబరో హరిః। వీరపురుషకో గ్రామః। ప్రథమార్థేతు న। వృష్టేదేవే గతః। వ్యధికరణానామపి న। పఞ్చభిర్భుక్తమస్య। (వా) ప్రాదిభ్యో ధాతుజస్య వాచ్యో వా చోత్తరపదలోపః। ప్రపతితపర్ణః-ప్రపర్ణః। (వా) నఞోఽస్త్యర్థానాం వాచ్యో వా చోత్తరపదలోపః। అవిద్యమానపుత్రః, అపుత్రః। అస్తీతి విభక్తిప్రతిరూపకమవ్యయమ్। అస్తిక్షీరా గౌః॥

834. శేషపదానువృత్తివలన ప్రథమాన్తమనునర్థము లభించును. సమసింపబోవు ప్రథమాన్తములకంటెనన్యమగు పదముయొక్క యర్థమును బోధించునవేకములగు ప్రథమాన్తములు వికల్పముగ సమసించుననియు నదిబహువ్రీహి సంజ్ఞకమగుననియునుసూత్రార్థము. "అన్యపదార్థే" అనుచోటనన్యపదమునకు శేషపదముచేనుపస్థితమగు ప్రథమాన్తముకంటె భిన్నమగునదనునర్థము లభించును. ఇట్లు చెప్పుటచే ద్వితీయాదివిభక్త్యర్థమందు ప్రథమాన్తములకు బహువ్రీహి ప్రవర్తించును గాని ప్రథమావిభక్త్యర్థమందు ప్రవర్తింపదనియు సమానాధికరణములగు పదములచే (సమానవిభక్త్యన్తములచే) బహువ్రీహి యగుననియును ఫలితమగును. ద్వితీయాదివిభక్త్యర్థములందు క్రమముగనుదాహరణములు:—ప్రాప్తోదకః। (ప్రాప్తముదకం యం సః) ద్వితీయార్థమందుండు ప్రాప్తమ్ ఉదకమ్ అను ప్రథమాన్తములు సమసించినవి. సమస్యమానపదములు సమానాధికరణములైనవి. గ్రామము విశేష్యము. సుబ్లుగాదిప్రక్రియనూహించునది. ఉదకకర్తృకప్రాప్తికర్మ గ్రామః అని సమాసార్థము. ఊఢరథః (ఊఢో రథో యేన) వృషభము విశేష్యము. (రథకర్మకోద్వహనకర్తా) ఉపహృతపశుః। (ఉపహృతః పశుః యస్మై) రుద్రుడు. (పశుకర్మకోపహరణ సంప్రదానం రుద్రః) ఉద్ధృతౌదనా। (ఉద్ధృతం ఓదనం యస్యాః) స్థాలి। (ఓదనకర్మకోద్ధరణావధిః) పీతామ్బరః। (పీతామ్బరం యస్య) విష్ణువు. (పీతామ్బరవాన్విష్ణుః) వీరపురుషకః। (వీరాః పురుషా యస్మిన్) గ్రామము। (వీరపురుషాధికరణకో గ్రామః) శేషాద్విభాషా।(896) సూ. చే నిచట సమాసాన్తకప్రత్యయమగును. పైని చూపబడినయుదాహరణములందు కర్మకర్తృసంప్రదానాదులు సమాసముచే నభిహితములగును గానసమాసమునందంటె ప్రథమావిభక్తియే వచ్చును. ప్రథమావిభక్త్యర్థమందుమాత్రము బహువ్రీహి ప్రవర్తింపదు. వృష్టే దేవేగతః। వృష్టదేవపదములు ప్రథమాన్తములు గానందునిచట సమాసము ప్రవర్తింపదని భావము. వ్యధికరణములగు (విభిన్నవిభక్త్యన్తములగు) పదములకును బహువ్రీహికాదు. పఞ్చభిర్భుక్తమస్య. ఇదియు శేషగ్రహణమునకే ఫలము.

(1) వా॥ ప్రాదులకంటె పరమగు ధాతుజన్యశబ్దము ప్రకృతిగాగల ప్రథమాన్తమునకు మరియొకప్రథమాన్తముతో బహువ్రీహిసమాసమును చెప్పవల

యును, అందు పూర్వపదమునందన్తర్భూతము ధాతుజమునగునుత్తరపదమునకు వికల్పముగ లోపమును చెప్పవలయును. ప్రపర్ణః। (ప్రపతితం పర్ణం యస్మాత్) పతధాతుజమగు పతితశబ్దమునకు వికల్పముగ లోపము. ప్రకృష్టం పతితమ్ అను విగ్రహమున "ప్రాదయో గతాద్యర్థే" అనువార్తికముచే సమాసమువలన ప్రపతిత శబ్దము సిద్ధించును. ఉత్తరపదలోపము రానపుడు ప్రపతితపర్ణః అని యగును. ఈవార్తికము సూత్రప్రాప్తమగు సమాసమునననువదించి ధాతుజమగునుత్తరపదమునకు లోపవికల్పమును మాత్రము విధించునని గ్రహించునది.

(2) వా॥ నఞ్ కంటె పరములై అస్తిపదముయొక్క యర్థమును (విద్యమానరూపార్థమును) బోధించు పదములకు మరియొకపదముతో బహువ్రీహిసమాసమును, అస్త్యర్థకములగునుత్తరపదములకు వికల్పముగ లోపమును చెప్పవలయును: అపుత్రః। (అవిద్యమానః పుత్రో యస్య) అస్త్యర్థకమగు విద్యమానశబ్దమునకు లోపము వచ్చునపుడిట్లగును. అవిద్యమానః అనునది నఞ్ సమాసము. అస్త్యర్థకమునకు లోపము రానపుడు అవిద్యమానపుత్రః అని యగును.

అస్తి అనువిభక్తిప్రతిరూపకమగునవ్యయము కలదు. కాన దానికంటె నుత్పన్నమగు సుప్రత్యయమునకు "అవ్యయాదాప్సుపః" (455) సూ. చే లుక్కగును. అనన్తరము ప్రత్యయలక్షణముచే అస్తి అనునదియును ప్రథమాన్తమగును గాన దీనికి క్షీరశబ్దముతో నీసూత్రముచే సమాసమునుజేసిన అస్తిక్షీరా (అస్తిక్షీరాణి యస్యాః) (గౌః) మొదలగు ప్రయోగములు సిద్ధములగును. కావున సూత్రమున సుప్ అను ప్రథమాన్తమునకనువృత్తియుండుటవలన అస్తి అనువిభక్తికి సమాసమెట్లు సాధువగునను శంక నివృత్తమగును.

వివ:—శేషగ్రహణమువలనను అన్యపదార్థే అనుదానివలనను అప్రథమావిభక్త్యర్థమందు సమానాధికరణములకే సమాసమునర్థము ఫలించును గాన "అప్రథమావిభక్త్యర్థే బహువ్రీహిర్వాచ్యః", "సమానాధికరణానామితి వక్తవ్యమ్" అనువార్తికములావశ్యకములు గావని తెలియదగును. బహుపదములకు బహువ్రీహి సిద్ధించుటకై (చిత్రాజరద్గుః) అనేక గ్రహణమావశ్యకము.

836. స్త్రియాః పుంవద్భాషితపుంస్కాదనూఙ్ సమానాధికరణే స్త్రియామపూరణీప్రియాదిషు. 6–3 34. స్త్రియాః, పుంవత్, భాషితపుంస్కాదనూఙ్, సమానాధికరణే, స్త్రియామ్, అపూరణీప్రియాదిషు। (ఉత్తరపదే)

భాషితపుంస్కాదనూఙ్ ఊఙో౽భావో యస్యామితి బహువ్రీహిః। నిపాతనాత్పఞ్చమ్యా అలుక్। షష్ఠ్యాశ్చలుక్.

తుల్యే ప్రవృత్తినిమిత్తే యదుక్తపుంస్కం తస్మాత్పర ఊఙో౽భావో యత్ర తథాభూతస్య స్త్రీవాచకశబ్దస్య పుం వాచకస్యేవ రూపం స్యాత్సమానాధికరణే స్త్రీలిఙ్గే ఉత్తర పదే న తు పూరణ్యాం ప్రియాదౌ చ పరతః। గోస్త్రియో రితి హ్రస్వః. చిత్రాగావో యస్యేతి లౌకికవిగ్రహే చిత్రా+ జస్, గో+జస్ ఇత్యలౌకికవిగ్రహే। చిత్రగుః। రూపవ ద్భార్యః। చిత్రా జరతీ గౌర్యస్యేతి విగ్రహే అనేకో క్తే ర్బహూనామపి బహువ్రీహిః। అత్ర కేచిత్। చిత్రాజరతీ గుః। జరతీచిత్రాగుర్వా। ఏవం దీర్ఘాతన్వీజఙ్ఘః। తన్వీదీర్ఘా జఙ్ఘః। త్రిపదే బహువ్రీహౌ ప్రథమం న పుంవత్। ఉత్తర పదస్య మధ్యమేన వ్యవధానాత్। ద్వితీయమపి న పుంవత్। పూర్వపదత్వాభావాత్। ఉత్తరపదశబ్దో హి సమాసస్య చర మావయవే రూఢః। పూర్వపదశబ్దస్తు ప్రథమావయవే రూఢ ఇతి వదన్తి। వస్తుతస్తు నేహ పూర్వపదమాక్షిప్యతే। ఆనఙ్ ఋత ఇత్యత్ర యథా। తేనో పాన్త్యస్య పుంవదేవ। చిత్రాజరద్గురిత్యాది। అతఏవ చిత్రాజరత్యో గావౌ యస్యేతి ద్వన్ద్వగర్భే౽పి చిత్రాజరద్గురితి భాష్యమ్। కర్మధారయ పూర్వపదే తు ద్వయోరపి పుంవత్। జరచ్చిత్రగుః। కర్మ ధారయోత్తరపదే తు చిత్రజరద్గవీకః। స్త్రియాః కిమ్। గ్రామణి కులం దృష్టిరస్య గ్రామణిదృష్టిః। భాషితపుంస్కా త్కిమ్। గఙ్గాభార్యః। అనూఙ్ కిమ్। వామోరూభార్యః। సమానాధికరణే కిమ్। కల్యాణ్యాః మాతా కల్యాణీమాతా। స్త్రియాం కిమ్। కల్యాణీ ప్రధానం యస్య స కల్యాణీ ప్రధానః। పూరణ్యాం తు॥

835. భాషితపుంస్కాదనూఙ్ అనునది సమస్తపదము. భాషితః పుమాన్ యస్మిన్నర్థే తత్ = భాషితపుంస్కమ్॥ ఏయర్థమున పురుషుడు చెప్పబడునో ఆయర్థము భాషితపుంస్కపదమునకర్థము. శబ్దప్రవృత్తి నిమిత్తమని ఫలితము. దేనిని నిమిత్తముగ గైకొని శబ్దమర్థమందు ప్రవర్తించునో దానికి ప్రవృత్తినిమిత్త మని వ్యవహారము. (జాతిగుణక్రియాసంజ్ఞలు) అనంతరము భాషితపుంస్క మస్యాస్తి అనునర్థమున "అర్శ ఆదిభ్యోచ్" (5-2-128) సూ. చే మత్వర్థీయమగు నచ్ప్రత్యయమునుజేసిన భాషితపుంస్కమనురూపము సిద్ధమగును. ఈరీతిగనొకే ప్రవృత్తి నిమిత్తమునను క్తపుంస్కమనునర్థము భాషితపుంస్కశబ్దమునకు లభిం చును. అనూఙ్ అనునది నఞ్తత్పురుషము. ఇచట నఞ్ ప్రసజ్యప్రతిషేధార్థ కము. కావున అనూఙ్ పదమునకు ఊఙ్ప్రత్యయముయొక్క యభావమని యర్థము.

పరః అనుపదమునధ్యాహారముజేసి "భాషితపుంస్కాత్పరః అనూఙ్ యస్య" అనువిగ్రహమున బహువ్రీహిని చెప్పవలయును. ఇది స్త్రియాః అనుదానికి విశేషణము. భాషితపుంస్కాదనూఙ్ అను సూత్రకారుని నిపాతనము (అన్యథాప్రాప్తస్యాన్యథోచ్చారణమ్) వలననే సమాసమున పంచమీవిభక్తికి లుగభావము సహా సముకంటెవిహితమగు షష్ఠీవిభక్తికి లుక్కును సిద్ధించును.

సమానమగు ప్రవృత్తినిమిత్తమునను త్తపుంస్కమగు శబ్దముకంటె పరముగ ఊఙ్ప్రత్యయములేనట్టి స్త్రీవాచకశబ్దమునకు, సమానాధికరణము స్త్రీలింగమునగు నుత్తరపదము పరమగునపుడు పుంలిఙ్గశబ్దముయొక్క రూపమువంటిరూపమగును; పూరణప్రత్యయాన్తమగు స్త్రీలింగశబ్దము పరమగునపుడు, ప్రియాదిగణపతితశబ్దములు పరములగునపుడు నీయతిదేశము ప్రవర్తింపదని సూత్రార్థము. ఇచట సమానాధికరణమున నేకార్థవిశేష్యకమగు బోధను కలుగజేయునదని యర్థము.

చిత్రగుః। చిత్రా గావో యస్య అని లౌకికవిగ్రహము. చిత్రా+జస్, గో+జస్ అనియలౌకికవిగ్రహము. బహువ్రీహి. సుబ్లుక్కు. అనేకమ్ అనునది ప్రథమానిర్దిష్టమగుటవలనగాని విగ్రహమున నియతవిభక్తికమగుటవలన గాని గోశబ్దముపసర్జనమగును గాన "గోస్త్రియోః" (660) సూ. చే హ్రస్వము. ఈ సూత్రముచే చిత్రాశబ్దమునకు పుంవద్భావము. రూపవద్భార్యః। (రూపవతీ భార్యా యస్య) బహువ్రీహి। ఉపసర్జనహ్రస్వము. రూపవతీశబ్దమునకు పుంవద్భావము. ఇచట చిత్రారూపవతీశబ్దములు విశేషణములగుటచే "సప్తమీవిశేషణే బహువ్రీహౌ" అను సూ. చే పూర్వప్రయోగము కలదైనదని గ్రహింపనది.

బహువ్రీహివిధాయకసూత్రమున ననేకపదగ్రహణమువలన రెండుప్రథమాన్తములకునంతకధికములగు ప్రథమాన్తములకును బహువ్రీహియగును. చిత్రా, జరతీ, గౌర్యస్య అనువిగ్రహమున మూడుపదములకును సమాసము సిద్ధమగును. ఇచట చిత్రాజరతీశబ్దములు రెండును గోవునకు విశేషణములే గాన "సప్తమీ విశేషణే బహువ్రీహౌ" (903) సూ. చే చిత్రాజరతీశబ్దములకు పర్యాయముగ పూర్వప్రయోగము కలుగును. అందుచే చిత్రాజరతీగుః జరతీచిత్రాగుః అను రూపములగును. ఇట్లే దీర్ఘే తన్వ్యౌజఙ్ఘే యస్య అనువిగ్రహమున బహువ్రీహి ప్రవర్తించునపుడు "దీర్ఘాతన్వీజఙ్ఘః", "తన్వీదీర్ఘాజఙ్ఘః" అనురూపములగును.

ఈసూత్రమునను త్తరపదే అనుదానివలన పూర్వపదమాక్షిప్తమగును. ఉత్తరపదశబ్దము, సమాసముయొక్క తుదియవయవమందు పూర్వపదశబ్దము, సమాసముయొక్క ఆద్యవయవమందును రూఢము. అందుచే మూడుపదములకగు బహువ్రీహియందు (చిత్రాజరతీగుః మొదలగునవి.) ఉత్తర పదమునకు మధ్యమ పదముతో వ్యవధానముండును గానను త్తరపదపర్వము లేకపోవుటవలన మొదటి పదమునకు పుంవద్భావము రాదు. రెండవపదము పూర్వపదము గానందున దానికిని పుంవద్భావము ప్రవర్తించదు అని కొందరు వైయాకరణులు చెప్పుచున్నారు.

వాస్తవముగనీసూత్రమున "ఆనఙ్ ఋతోర్ద్వన్ద్వే" (926) అనుసూత్రమందు వలెనుత్తరపదముచే పూర్వపదమాక్షేపింపబడదు. ఋకారాన్తములకు ద్వంద్వమున నుత్తరపదము పరమగునపుడు ఆనఙాదేశమగునని యాసూత్రమునకర్థము. భాష్యకారునిచే ప్రయోగింపబడిన "హోతృపోతృ నేష్టోద్గాతారః" (హోతా చ పోతా చ నేష్టా చ ఉద్గాతా చ) అనుస్థలమున నుద్గాతృశబ్దము త్తరపదమగుచుండ నేష్టృశబ్దమునకాసూత్రముచేనానఙాదేశ మగపడుచున్నది. ఆసూత్రమునను త్తరపదముచే పూర్వపదమునకాక్షేపమున్నచో పైస్థలమున నేష్టృశబ్దమునకు నిరుక్తపూర్వపదత్వము లేకపోవుటచేనానఙాదేశము ప్రవర్తించుటకవకాశము లేకపోవును. కావున భాష్యప్రయోగసామర్థ్యము వలన "ఆనఙ్ ఋతోర్ద్వన్ద్వే" (926) అను సూత్రమున పూర్వపదాక్షేపము లేదని చెప్పవలయును. అట్లే లక్ష్యానుసారముగ నీసూత్రమందును పూర్వపదాక్షేపము లేదని భావము. అందుచే త్రిపద బహువ్రీహియందంత్యపదసమీపమందుండు పదమునకు పుంవద్భావము ప్రవర్తించును. చిత్రా జరద్గుః. చిత్రాశబ్దమునకుమాత్రము మధ్యమపదముతో వ్యవధానముండుటవలన పుంవద్భావము రాదు.

ఈసూత్రమందు పూర్వపదాక్షేపము లేదుగావుననే చిత్రాజరత్యౌ (చిత్రా చ జరతీ చ) గావౌ యస్య అనుద్వంద్వసమాసగర్భమగు బహువ్రీహియందును "చిత్రాజరద్గుః" అను పుంవద్భావముతోగూడిన రూపమును భాష్యకారుడు ప్రయోగించెను. ప్రథమమున "జరతీ చాసౌ చిత్రా చ" అనువిగ్రహమున "పూర్వకాలైక" (730) సూ. చే కర్మధారయమునుజేసి యనంతరము గోపదముతో బహువ్రీహిని జేసినచో కర్మధారయమందు జరతీపదమునకు "పుంవత్కర్మధారయ"అను సూత్రముచేతను, బహువ్రీహియందు జరచ్చిత్రా పదము పూర్వపదమగును గాననీసూత్రముచే చిత్రాపదమునకును పుంవద్భావము ప్రవర్తించును. జరచ్చిత్రగుః అను రూపమగును. మొదట జరతీగోశబ్దములకు కర్మధారయమునుచేసిన "పుంవత్కర్మధారయ" (757) సూ. చే పుంవద్భావము వలన జరతీశబ్దమున ఙీప్ప్రత్యయము నివర్తించును. "గోరతద్ధితలుకి" (793) సూ. చే టచ్ప్రత్యయము. అవాదేశము. స్త్రీలింగమగుటచే సమాసముకంటె "టిడ్ఢాణఞ్" (473) సూ. చే ఙీప్ప్రత్యయము. జరద్గవీ అనురూపము సిద్ధించును. పిదప చిత్రా జరద్గవీయస్య అనువిగ్రహమున కర్మధారయోత్తరపదమగు బహువ్రీహినిజేసిన నీసూత్రముచే చిత్రాశబ్దమునకు పుంవద్భావము. సమాసముకంటె "నద్యృతశ్చ" (836) సూ. చే కప్ప్రత్యయము ప్రవర్తించును. చిత్రజరద్గవీకః।

గ్రామణి (కులమ్) దృష్టిరస్య అనువిగ్రహమున బహువ్రీహిచే గ్రామణి దృష్టిః అను రూపమగును. గ్రామణీశబ్దమునకు నపుంసకలింగమున "హ్రస్వో నపుంసకే" (319) సూ. చే హ్రస్వమువలన గ్రామణిశబ్దము సిద్ధమగును. కుల శబ్దము నపుంసకత్వసూచనార్థము ప్రయోగింపబడెను. స్త్రియాః అను షష్ఠ్యన్తమీ సూత్రమున లేకున్న గ్రామణిశబ్దమునకును పుంవద్భావము ప్రసక్తమయ్యెడిని,

(గ్రామణీదృష్టిః) గఙ్గాభార్యః (గఙ్గా భార్యా యస్య) అనుచోట గఙ్గాశబ్దము నిత్య స్త్రీలింగమగుటవలన భాషితపుంస్కముగాకపోవుటచేనిచట పుంవద్భావవారణము నకై సూత్రమున "భాషితపుంస్కాత్" అనునది యావశ్యకము. వామోరూః (వామౌ ఊరూ యస్యాః)అను బహువ్రీహియందు "సంహితశఫలక్షణవామాదేశ్చ" (528) సూ. చే నూరుశబ్దముకంటె ఊఙ్ ప్రత్యయమువలన వామోరూః అను రూపము సిద్ధించును. అనంతరము దీనికి భార్యాశబ్దముతో బహువ్రీహి। వామో రూభార్యః। (వామోరూః భార్యా యస్య) సూత్రమున "అనూఙ్" అనునది లేనిచో వామోరూశబ్దమునకు పుంవద్భావము ప్రసక్తమగును. కల్యాణీమాతా। (కల్యాణ్యాః మాతా) షష్ఠీతత్పురుషము. సమానాధికరణే అనుపదము లేనిచో నిచట కల్యాణీశబ్దమునకు పుంవద్భావము ప్రసక్తమగును. కల్యాణీమాతృశబ్దము లిచట సమానాధికరణములుగావు. కల్యాణీ ప్రధానః (కల్యాణీప్రధానం యస్య) షష్ఠ్యర్థబహువ్రీహి, ఇచట నుత్తరపదమగు ప్రధానశబ్దము నిత్యనపుంసకలింగము కావున కల్యాణీశబ్దముతో సమానాధికరణమైనను స్త్రియామ్ అను సప్తమ్యన్త మీసూత్రముననుండుటవలన కల్యాణీశబ్దమునకు పుంవద్భావము వారితమగును,

అవ:— పూరణార్థకప్రత్యయాన్తము పరమగునపుడు పుంవద్భావనిషేధో దాహరణము చెప్పబడుచున్నది.

836. అప్పూరణీప్రమాణ్యోః 5-4-116. అప్, పూరణీ ప్రమాణ్యోః (బహువ్రీహౌ)

పూరణార్థప్రత్యయాన్తం యత్ స్త్రీలిఙ్గం తదన్తాత్ప్రమా ణ్యన్తాచ్చ బహువ్రీహేరప్ స్యాత్। కల్యాణీ పఞ్చమీ యా సాం రాత్రీణాం తాః కల్యాణీపఞ్చమా రాత్రయః। స్త్రీ ప్రమాణీ యస్య స స్త్రీప్రమాణః। (వా) పుంవద్భావప్రతి షేధోఽప్ప్రత్యయశ్చ ప్రధానపూరణ్యామేవ। రాత్రిఃపూరణీ వాచ్యాచేత్యుక్తోదాహరణే మాభూత్। అన్యత్ర తు॥

836. (1) పూరణార్థకమగు ప్రత్యయమంతమందుగల స్త్రీలింగశబ్ద మన్తమందుగల బహువ్రీహికంటెను,ప్రమాణీశబ్దాన్తబహువ్రీహికంటెను అప్ప్రత్య యము సమాసాన్తమగును. కల్యాణీపఞ్చమాః। (రాత్రయః=ఉద్భూతావయవ భేదముగల రాత్రులు) కల్యాణీ పఞ్చమీ యాసాం తాః. అనువిగ్రహమున బహు వ్రీహి. పఞ్చమీ అనునది పూరణప్రత్యయాన్తము. (పఞ్చానాం పూరణీ) పూర ణప్రత్యయాన్తము పరమగుటచే కల్యాణీశబ్దమునకు "స్త్రియాః పుంవత్" అను సూత్రముచే పుంవద్భావము నిషేధింపబడెను. ఈసూత్రముచే అప్ప్రత్యయమ గును. "యస్యేతి చ" (312) సూ. చే నీకారలోపము. టాప్ప్రత్యయము. ప్రమాణ్యన్తమునకుదాహరణము:— స్త్రీప్రమాణః (స్త్రీ ప్రమాణీ యస్య) బహు వ్రీహి. అప్ప్రత్యయము. "యస్యేతిచ" సూ. చే నీకారలోపము. (2) వా॥

"స్త్రియాః) పుంవత్" అనుసూత్రములోని "అపూరణీప్రియాదిషు" అనుదానిచే గల్గెడి పుంవద్భావప్రతిషేధము, యీసూత్రముచే విధింపబడు అప్ప్రత్యయము ప్రధానమగు పూరణప్రత్యయాన్తము పరమగునపుడే ప్రవర్తించును. కల్యాణీ పఞ్చమీః అనుచోట పఞ్చమీపదబోధ్యము రాత్రి యగును. అన్యపదార్థములగు రాత్రులలో పఞ్చమీపదార్థమగు రాత్రియును జేరును గావ రాత్రి బహువ్రీహికి ప్రధానముగవాచ్యమగును. బహువ్రీహి అన్యపదార్థప్రధానమగుటచే రాత్రియును ముఖ్యమగును. పఞ్చమీపదము ప్రధానపూరణార్థకప్రత్యయాన్తమగుటచే సమాసమునకు అప్ప్రత్యయముకల్యాణీశబ్దమునకు పుంవద్భావనిషేధము సిద్ధమగును. ప్రధానపూరణార్థకప్రత్యయాన్తము పరముగలేనపుడు పుంవద్భావనిషేధము అప్ప్రత్యయమునీరెండును ప్రవర్తించవు.

వివ:—(1) సూత్రమున "పూరణీ" అను స్త్రీలింగనిర్దేశమువలన పూరణార్థకప్రత్యయాంతమందుగల స్త్రీలింగశబ్దమే గ్రహింపబడును. అనువృత్తమగు బహువ్రీహౌ అనునది పంచమ్యన్తముగ విపరిణతమై "పూరణీప్రమాణ్యోః" అనుదానికి విశేష్యమగును. తదన్తవిధివలన మూలోక్తార్థము లభించును. (2) కల్యాణపఞ్చమీకః అను అప్ప్రత్యయరహితమగు భాష్యోదాహరణమువలనను, ప్రధానమందు కార్యములను ప్రవర్తింపజేయుటన్యాయ్యమగుటవలన నీవార్తికము న్యాయసిద్ధమగును.

837. నద్యృతశ్చ. 5-4-153. నద్యృతః, చ। (బహువ్రీహౌ, కప్)

నద్యుత్తరపదాదృదన్తోత్తరపదాచ్చ బహువ్రీహేః కప్ స్యాత్। పుంవద్భావః॥

837. నదీసంజ్ఞకమగుశబ్దము త్తరపదముగగల బహువ్రీహికంటెను, ఋకారాన్తము త్తరపదముగగల బహువ్రీహికంటెను కప్ప్రత్యయము సమాసాన్తమగును. కల్యాణపఞ్చమీకః। (కల్యాణీ పఞ్చమీ యస్య (పక్షః) బహువ్రీహి। ఉత్తరపదమగు పఞ్చమీశబ్దము నదీసంజ్ఞకమగుటచే నీసూత్రముచే కప్ప్రత్యయమగును. ఇచటనన్యపదార్థము తిరోహితావయవభేదముగల పక్షము గాని రాత్రులు గావు. కాన పూరణప్రత్యయవాచ్యమగు రాత్రి సమాసవాచ్యముగాకుండుటచే పఞ్చమీశబ్దము ప్రధానపూరణప్రత్యయాన్తము కాదు. అందుచే "అపూరణీప్రియాదిషు" అనునిషేధము ప్రవర్తింపనందున "స్త్రియాః పుంవత్" అను సూత్రముచే పుంవద్భావము ప్రవర్తించును. పూర్వసూత్రముచేనిచటనప్ప్రత్యయముగూడ ప్రవర్తింపదు. కల్యాణ పఞ్చమీకః అని యగును.

వివ:—నద్యృతః అనునది సమాహారద్వంద్వము. (నదీచఋచ్చ) పంచమీవిభక్త్యన్తము. బహువ్రీహౌ అనునది పంచమ్యన్తముగ విపరిణామమునొందును. బహువ్రీహౌ అనుదానివలననాక్షిప్తమగును త్తరపదము నద్యృతః అనుదానికి

విశేష్యము. తదన్తవిధి. ఈరీతిగ మూలోక్తార్థము ఫలించును. ఋకారాన్తోత్తర పదమగు బహువ్రీహి సంభవింపనందున ఋతః అనుచోట తపరకరణము స్పష్టార్థము.

838. కేఽణః. 7-4-13. కే, అణః। (హ్రస్వః)

కే పరే అణో హ్రస్వస్స్యాత్। ఇతి ప్రాప్తే॥

838. కప్రత్యయము పరమగునపుడు అణ్ వర్ణమునకు హ్రస్వమగును. ఈసూత్రముచే కల్యాణపఞ్చమీ+క అనుచోట హ్రస్వము ప్రాప్తించుచుండ:—

వివ:—వ్యాఖ్యానమువలన సూత్రములోని కపదముచే తద్ధితప్రత్యయమే గ్రహింపబడును. కావున రాకా (కృదన్తము) అనుచోట హ్రస్వము ప్రవర్తింపదు.

839. న కపి. 7-4-14. న, కపి। (అణః హ్రస్వః)

కపిపరే హ్రస్వో న స్యాత్। కల్యాణపఞ్చమీకః పక్షః। అత్ర తిరోహితావయవభేదస్య పక్షస్యాన్యపదార్థతయా రాత్రిరప్రధానమ్॥ బహుకర్తృకః। అప్రియాదిషు కిమ్। కల్యాణీప్రియః। ప్రియా। మనోజ్ఞా। కల్యాణీ। సుభగా। దుర్భగా। భక్తిః। సచివా। స్వసా। కాన్తా। క్షాన్తా। సమా। చపలా। దుహితా। వామా। అబలా। తనయా। సామాన్యే నపుంసకమ్, దృఢం భక్తిర్యస్య స దృఢభక్తిః। స్త్రీత్వ వివక్షాయాం తు దృఢాభక్తిః॥

839. కప్ప్రత్యయము పరమగునపుడణ్ణునకు హ్రస్వము రాదు. కల్యాణపఞ్చమీకః అనుచోటనీసూత్రముచే హ్రస్వనిషేధమగును. కల్యాణపఞ్చమీకః। (పక్షః) ఇచట నవయవభేదములేనట్టి పక్షమన్యపదార్థమగుటచే పూరణీయగు రాత్రికి పక్షమున ప్రవేశములేనందున రాత్రియప్రధానమైనది. కాన పుంవద్భావాదికములగు కార్యములు ప్రవర్తింపవని యభిప్రాయము. పక్షమన పదునైదుదినములసమూహము. అవయవభేదమిచట వివక్షితముగాదు. "నద్యృతశ్చ" అను సూత్రములోని ఋదన్తోత్తరపదమునకుదాహరణము:—బహుకర్తృకః (బహవః కర్తారో యస్య) బహువ్రీహి ఋదన్తోత్తరపదకమగుటచే కప్ప్రత్యయము ప్రవర్తించును.

"స్త్రియాః పుంవత్" అనుసూత్రములోని అప్రియాదిషు అనునిషేధమునకు ప్రయోజనము ప్రదర్శింపబడుచున్నది. కల్యాణీప్రియః। (కల్యాణీప్రియా యస్య) ప్రియాశబ్దము పరమగుటచే నిచట కల్యాణీశబ్దమునకు పుంవద్భావము రాదు. ప్రియాశబ్దము ప్రియాదిగణములోనిది. అప్రియాదిషు అనునది లేనిచో నిట్టిస్థలము

లందు పుంవద్భావము ప్రసక్తమగును. ప్రియామనోజ్ఞాదిశబ్దములచే ప్రియాది గణము ప్రదర్శింపబడెను. "దృఢ భక్తిః అను ప్రయోగము లోకమున నగపడు చున్నది. ఇచట భక్తిశబ్దము స్త్రీలింగము గానతద్విశేషణమగు దృఢశబ్దమును స్త్రీలింగమే గావలయును. అట్టి స్త్రీలింగమగు దృఢాశబ్దమునకు భక్తిశబ్దముతో సమాసమును జేయునపుడు భక్తిశబ్దము ప్రియాదిగణపఠితము గావున స్త్రియాః పువత్ అనుసూత్రముచే పుంవద్భావము నిషిద్ధమగుటవలన దృఢాభక్తిః అనురూపమే గావలయును. దృఢ భక్తిః అనుప్రయోగమనుపపన్నమగుచున్నది. అయిన నిచట దృఢశబ్దము అదార్ధ్యముయొక్క విప్రృత్తిమాత్రము బోధించునదగుటవలన లింగవిశేషము వివక్షితముగాదు. "సామాన్యే నపుంసకమ్" (పదార్థమునందు సత్త్వరజస్తమోగుణములయొక్క సామ్యావస్థ వివక్షిత మగునపుడు నపుంసకమగును.) అనువార్తికముచే దృఢశబ్దము నపుంసకమగును. ఈశబ్దమునకు సమాసమునుజేసిన "దృఢ భక్తిః" అనుప్రయోగము నిశ్శంకముగ సాధువగును. దృఢశబ్దమునకు స్త్రీత్వము వివక్షితమగునపుడుమాత్రము దృఢాభక్తిః అనురూపమే యగును. ఇట్టిచోటులందు పుంవద్భావమును వారించుటకై ప్రియాదిగణమున భక్తిశబ్దపాఠము సార్థకమగునని గ్రహించునది.

840. తసిలాదిష్వాకృత్వసుచః. 6-3-35. తసిలాదిషు, ఆకృత్వసుచః। (స్త్రియాః, పుంవత్)

తసిలాదిషు కృత్వసుజన్తేషు పరేషు స్త్రియాః పుంవత్స్యాత్। పరిగణనం కర్తవ్యమ్। అవ్యాప్త్యతివ్యాప్తిపరిహారాయ। త్రతసౌ। తరప్తమపౌ। చరడ్జాతీయరౌ। కల్పద్దేశీయరౌ। రూపప్పాశపౌ। థాల్। తిల్థ్యనౌ। బహ్వీషు బహుత్ర। బహుతః। దర్శనీయతరా। దర్శనీయతమా।ఘరూపేతివక్ష్యమాణో హ్రస్వః పరత్వాత్పుంవద్భావం బాధతే। పట్వితరా। పట్వితమా। పటుచరీ। పటుజాతీయా। దర్శనీయకల్పా। దర్శనీయదేశీయా। దర్శనీయరూపా। దర్శనీయపాశా। బహుథా। ప్రశస్తా వృకీ వృకతిః। అజాభ్యో హితా అజథ్యా (వా) శసి బహ్వల్పార్థస్య పుంవద్భావో వక్తవ్యః। బహ్వీభ్యో దేహి బహుశః। అల్పాభ్యో దేహి అల్పశః (వా) త్వతలోర్గుణవచనస్య। శుక్లాయా భావశ్శుక్లత్వమ్। శుక్లతా। గుణవచనస్య కిమ్। కర్త్ర్యా భావః కర్త్రీత్వమ్। శరదః కృతార్థతేత్యాదౌ తు సామాన్యే నపుంసకమ్ (వా) భస్యాఢే తద్ధితే। హస్తినీనాం సమూహో హాస్తికమ్। అఢే కిమ్। రౌహిణేయః। స్త్రీభ్యో ఢగితి ఢోఽత్ర గృహ్యతే। అగ్నేర్ఢగితి ఢకి తు పుంవదేవ। అగ్నాయీ దేవతా అస్య స్థాలీపాకస్యాగ్నేయః। సపత్నీశబ్దస్త్రిధా। శత్రుపర్యాయా

త్సపత్నీశబ్దాచ్ఛార్ఙ్గరవాదిత్వాత్ ఙీన్న్యేకే। సమానః పతిర్యస్యా ఇతి విగ్రహే వివాహనిబన్ధనం పతిశబ్దమాశ్రిత్య నిత్యస్త్రీలిఙ్గో ద్వితీయః। స్వామిపర్యాయపతిశబ్దేన భాషితపుంస్కస్తృతీయః। ఆద్యయోశ్శివాద్యణ్। సపత్న్యా అపత్యం సాపత్నః। తృతీయాత్తు లిఙ్గవిశిష్టపరిభాషయా పత్యుత్తరపదలక్షణో ణ్య ఏవ। న త్వణ్। శివాదౌ యోగయోరేవ గ్రహణాత్। సాపత్న్యః (వా) ఠక్ఛసోశ్చ। భవత్యాశ్ఛాత్రా భావత్కాః। భవదీయాః। ఏతద్వార్తికమేకతద్ధితే చేతి సూత్రం చ న కర్తవ్యమ్। సర్వనామ్నో వృత్తిమాత్రే పుంవద్భావ ఇతి భాష్యకారేష్ట్యా గతార్థత్వాత్। సర్వమయః। సర్వకామ్యతి। సర్వికా భార్యా యస్య సః సర్వకభార్యః। సర్వప్రియః ఇత్యాది। పూర్వస్యైవేదమ్। భస్త్రైషాం ద్వేతి లిఙ్గాత్। తేనాకచి ఏకశేషవృత్తౌ చ న। సర్వికాః। సర్వాః। (వా) కుక్కుట్యాదీనామణ్డాదిషు। కుక్కుట్యా అణ్డం కుక్కుటాణ్డమ్। మృగ్యాః పదం మృగపదమ్। మృగక్షీరమ్। కాకశాబః॥

840. "పఞ్చమ్యాస్తసిల్" (5-3-7) అను సూత్రము మొదలు "సంఖ్యాయాః క్రియాభ్యావృత్తిగణనే కృత్వసుచ్" (5-4-17) అనుసూత్రముతుదిపఱకు నుండు సూత్రములచే విహితములగు తసిలాదిప్రత్యయములు పరములగునపుడు స్త్రీవాచకశబ్దమునకు పుంవద్భావమగును. అభిమతస్థలమందు లక్షణము (సూత్రము) ప్రవర్తింపకుండుట యవ్యాప్తి యనబడును. అనభిమతస్థలమందు లక్షణము ప్రవర్తించుట యతివ్యాప్తి యనబడును. ఇట్టి యవ్యాప్త్యతివ్యాప్తులను నివర్తింపచేయుటకై తసిలాదులను పరిగణనము చేయవలయును :— 1 త్రల్ 2 తసిల్ప్రత్యయములు. 3 తరప్ 4 తమప్ప్రత్యయములు. 5 చరట్ 6 జాతీయర్ప్రత్యయములు. 7 కల్పప్ 8 దేశీయర్ప్రత్యయములు. 9 రూపప్ 10 పాశప్ప్రత్యయములు. 11 థాల్ప్రత్యయము. 12 తిల్ 13 థ్యన్ప్రత్యయములు. పరిగణితములగు నీప్రత్యయములు పరములగునపుడే పుంవద్భావము ప్రవర్తించును.

క్రమముగనుదాహరణములు చూపబడుచున్నవి :— (1) బహుత్ర। "బహ్వీషు" అనునర్థమున "సప్తమ్యాస్త్రల్" (5-3-10) సూ. చే బహ్వీశబ్దముకంటె త్రల్ప్రత్యయము. పుంవద్భావము. (2) బహుతః। బహ్వీభ్యః అనునర్థమున "పఞ్చమ్యాస్తసిల్" (5-3-7) సూ. చే బహ్వీశబ్దముకంటె తసిల్ప్రత్యయము. పుంవద్భావము. (3) దర్శనీయతరా। "ద్వివచనవిభజ్యోపపదే తరప్" (5-3-57) సూ. చే ఇద్దఱిస్త్రీలలోనిను మిక్కిలి సుందరమైనది అనునర్థమున దర్శనీయాశబ్దముకంటె తరప్ప్రత్యయము. పుంవద్భావమువలన టాప్ప్రత్యయము నివృత్తమగును. (4) దర్శనీయతమా। దర్శనీయాశబ్దముకంటె స్త్రీలందఱిలోనిను

మిక్కిలిసుందరమైనది అనునర్థమున "అతిశాయనే తమబిష్ఠనౌ" (5-3-55) సూ. చే తమప్ప్రత్యయము. పుంవద్భావము. స్త్రీలింగమగు పట్వీశబ్దముకంటె తరప్ప్రత్యయమును గానితమప్ప్రత్యయమును గానిచేయునపుడు "ఘరూపకల్ప చేలడ్ బ్రువగోత్రమతహతేషు ఙ్యోఽనేకాచో హ్రస్వః" (990) సూ. చే విధింపబడు హ్రస్వము దీనికంటె పరమగుటవలననీపుంవద్భావమును బాధించును. కావున హ్రస్వము ప్రవర్తించిన క్రమముగ పట్వితరా పట్వితమా అని యగును. (5) పటుచరీ। పట్వీశబ్దముకంటె, పూర్వం పట్వీ అనునర్థమున "భూతపూర్వే చరట్" (5-3-53) సూ. చే చరట్ప్రత్యయము. జీబాదుల నూహించునది. (6) పటుజాతీయా। (పటుసదృశీ) "ప్రకారవచనే జాతీయర్" (5-3-69) సూ.చే పట్వీశబ్దముకంటె సదృశరూపార్థమందు జాతీయ (ర్) ప్రత్యయము. (7) దర్శనీయకల్పా. దర్శనీయాశబ్దముకంటె "ఈషదసమాప్తౌ కల్పబ్దేశ్యదేశీయరః" (5-3-67) సూ. చే కల్పప్ప్రత్యయము. (8) దర్శనీయదేశీయా। "ఈషదసమాప్తౌ" సూ. చే దేశీయ (ర్) ప్రత్యయము. (9) దర్శనీయరూపా। "ప్రశంసాయాం రూపప్" (5-3-66) అనుసూత్రమువలన దర్శనీయాశబ్దముకంటె ప్రశంసయందు రూపప్ప్రత్యయము. (10) దర్శనీయపాశా। "యాప్యే పాశప్" (5-3-47) సూ. చే పాశప్ప్రత్యయము. కుత్సితముగ చూడతగినదని యర్థము. (11) బహుధా। (బహుప్రకారా) "ప్రకారవచనే థాల్" (5-3-23) సూ. చే బహ్వీశబ్దముకంటె థాల్ ప్రత్యయము. అనేకవిధములైనదని యర్థము. (12) వృకతిః। (ప్రశస్తా వృకీ) "వృకజ్యేష్ఠాభ్యాం తిల్తాతిలౌ చ ఛన్దసి" (5-4-41) సూ. చే వృకీశబ్దముకంటె తిల్ ప్రత్యయము. ప్రశస్తమైన యాడుతోడేలని యర్థము. (13) అజథ్యా। (అజాభ్యో హితా) అజాశబ్దముకంటె "అజావిభ్యాం థ్యన్" (4-1-8) సూ. చే థ్యన్ ప్రత్యయము. పుంవద్భావము. ఆడుమేకలకు హితమైన లతాదులని యర్థము.

(1) వా॥ శస్ప్రత్యయము (తద్ధితము) పరమగునపుడు బహ్వర్థకమగు శబ్దమునకు అల్పార్థకమగుశబ్దమునకును పుంవద్భావమును చెప్పవలయును. బహుశః। బహ్వీశబ్దముకంటె "బహ్వల్పార్థాచ్ఛస్ కారకాదన్యతరస్యామ్" (5-4-42) సూ. చే "బహ్వీభ్యోదేహి" అనునర్థమందు శస్ప్రత్యయమగును. పుంవద్భావము. అల్పశః। (అల్పాభ్యో దేహి) పూర్వోక్తసూత్రముచేతనే అల్పాశబ్దముకంటె శస్ప్రత్యయము. పుంవద్భావము. (2) వా॥ త్వప్రత్యయతల్ ప్రత్యయములు పరమగునపుడు స్త్రీలింగమగు గుణవచనమునకు పుంవద్భావమగును. సంజ్ఞాజాతికృదన్తతద్ధితాన్తసమాససర్వనామసంఖ్యలకంటెనితరమగు శబ్దము గుణవచనశబ్దముచే గ్రహింపబడును. శుక్లత్వమ్। (శుక్లాయా భావః) శుక్లాశబ్దముకంటె త్వప్రత్యయము. శుక్లాశబ్దము ప్రసిద్ధగుణవాచకము. పుంవద్భావము. శుక్లతా। (శుక్లాయా భావః)శుక్లాశబ్దముకంటె తల్ప్రత్యయము. పుంవద్భావము. కర్త్రీత్వమ్।

(కర్త్ర్యా భావః) కర్త్రీశబ్దముకంటె త్వప్రత్యయము. కర్త్రీశబ్దము (ఏదోయొకపనిని చేయుస్త్రీయని యర్థము) క్రియానిమిత్తకమగుటచే గుణవాచకము గాదు. కావునిచట పుంవద్భావము రాదు. వార్తికమున గుణవచనపదము లేనిచోనిచటగూడ త్వప్రత్యయముపరమైనది గానపుంవత్త్వము ప్రవర్తింపవలసివచ్చును.

కావ్యములందు "నిరీక్ష్య మేనే శరదః కృతార్థతా" ఇత్యాదిశ్లోకములలో "కృతార్థతా" మొదలగు రూపములగపడుచున్నవి. కృతార్థాశబ్దముకంటె భావార్థమందు తల్ప్రత్యయమునవలయును. కృతార్థాశబ్దము సమాసమగుటచే (కర్తవ్యమునునిర్వర్తించినస్త్రీయనియర్థము) గుణవచనము గానందున పుంవద్భావము ప్రవర్తింపదు గానకృతార్థతా అనురూపము సిద్ధింపకున్నది. అయినను "దృఢభక్తిః" అనుస్థలమునందువలెనిచటను సామాన్యమున నపుంసకమగు కృతార్థశబ్దముకంటె తల్ప్రత్యయమును జేసిన "కృతార్థతా" అనురూపము సిద్ధించును. ఈరీతిగ సామాన్యనపుంసకత్వమునాశ్రయించుటచే "సా ముమోచ రతిమాత్మశీలతామ్", "నేష్టంపురో ద్వారవతీత్వమాసీత్" మొదలగుప్రయోగములును సాధువు లగును.

(3) వా॥ ఢప్రత్యయము పరమగునపుడు భసంజ్ఞకమగు స్త్రీవాచకశబ్దమునకు పుంవద్భావమగును. హాస్తికమ్. (హస్తినీనాం సమూహః) హస్తినీశబ్దముకంటె "అచిత్తహస్తిధేనోః" (4-2-47) సూ. చే ఠక్ప్రత్యయమగును. ఆదివృద్ధి. ప్రత్యయమునకు "ఠస్యేకః" (7-3-50) సూ. చే ఇకాదేశము. పుంవద్భావముచే ఙీప్ప్రత్యయము నివర్తించును. "నస్తద్ధితే" సూ. చే టిలోపము నగును. రౌహిణేయః। రోహితశబ్దముకంటె స్త్రీలింగమున "వర్ణాదనుదాత్తాత్" (499) సూ. చే ఙీప్ప్రత్యయనకారాదేశము లగును. "రోహిణ్యాః అపత్యమ్" అనునర్థమున రోహిణీశబ్దముకంటె "స్త్రీభ్యో ఢక్" (4-1-120) సూ. చే ఢక్ప్రత్యయమగును. ఆదివృద్ధి. ఢప్రత్యయమునకేయాదేశము. వార్తికమున "అఢే" అనుపదములేకున్న నిట్టిస్థలములందును పుంవద్భావము ప్రసక్తమగును. అట్లయిన ఙీప్నకారములు నివర్తించును గాన రౌహితేయః అనునిష్టరూపము ప్రసక్తమగును. అఢే అనుచోట ఢపదముచే "స్త్రీభ్యో ఢక్" సూత్రవిహితమగు ఢక్ప్రత్యయమే గ్రహింపబడును. అనగా "స్త్రీభ్యోఢక్" సూత్రవిహిత ఢప్రత్యయము పరమగునపుడే పుంవద్భావము నిషేధింపబడును. ఇతరసూత్రముచేవిధింపబడు ఢప్రత్యయము పరమగునపుడుమాత్రము పుంవద్భావనిషేధము ప్రవర్తింపదు. అందుచే "అగ్నేర్ఢక్" (4-2-33) సూ. చే విధింపబడిన ఢక్ప్రత్యయముపరమగునపుడు పుంవద్భావము ప్రవర్తించును. ఆగ్నేయః। అగ్నిశబ్దముకంటె స్త్రీత్వవివక్షయందు "వృషాకప్యగ్ని" (487) సూ. చే ఙీష్ప్రత్యయైకారాదేశములు ప్రవర్తించును. అగ్నాయీ అని యగును. దీనికంటె అగ్నాయీ దేవతా అస్య (స్థాలీపాకస్య) అనునర్థమున "అగ్నేర్ఢక్" సూ. చే ఢక్ప్రత్యయము. ఏయాదేశము. పుంవద్భావమువలన ఙీష్ప్రత్యయైకారా

దేశములు నివృత్తములగును. అగ్ని + ఏయ, అనియుండ "యస్యేతిచ" (312) సూ. చే నికారలోపము. ఆదివృద్ధి. ఆగ్నేయః అనురూపము సిద్ధించును.

వ్యుత్పత్తిభేదముచే సపత్నీశబ్దము మూడువిధములుగనున్నది. (1) శత్రుశబ్దమునకు పర్యాయమగు సపత్నశబ్దముకంటె స్త్రీలింగమున "శార్ఙ్గరవాద్యఞో జీన్" (530) సూ. చే జీన్ప్రత్యయము ప్రవర్తించునపుడు సిద్ధమగునది మొదటిది. ఇది భాషితపుంస్కమగును. శత్రుపర్యాయసపత్నశబ్దమవ్యుత్పన్నమని గ్రహించునది. (2) వివాహమందగు సంస్కారవిశేషముగల పురుషునియందు రూఢమగు పతిశబ్దమునాశ్రయించి "సమానః పతిః యస్యాః" అను విగ్రహమున సమాసమునుచేసిన "నిత్యం సపత్న్యాదిషు" (495) అను సూత్రమువలన సమానశబ్దమునకు సభావము పతిశబ్దమునకు జీప్ప్రత్యయమునకారాదేశములు. వీనిచే సిద్ధించిన సపత్నీశబ్దము రెండవది. ఇది నిత్యస్త్రీలిఙ్గము. (3) ప్రభువాచకమగు పతిశబ్దముతో "సమానః పతిర్యస్యాః" అనువిగ్రహమున సమాసమునుచేసి "నిత్యంసపత్న్యాదిషు" సూ. చే సభావాదులను ప్రవర్తింపచేసినపుడు సిద్ధమగునది మూడవది. ఇట్టి పతిశబ్దముతో సమాసముచేసినపుడన్యపదార్థము స్త్రీయే గావలయునను నియమము లేదు గాననీశబ్దము భాషితపుంస్కమగును.

శత్రుపర్యాయసపత్నశబ్దమువలన, వివాహనిబంధన పతిశబ్దమువలన, సిద్ధములగు సపత్నీశబ్దములకంటె "సపత్న్యా అపత్యమ్" అనునర్థమున "తస్యాపత్యమ్" (4-1-92) సూ. చే ప్రాప్తమగునణ్ ప్రత్యయమును బాధించి "స్త్రీభ్యోఢక్" సూ. చే ఢక్ప్రత్యయము ప్రాప్తించుచున్నది. దానిని బాధించి "శివాదిభ్యోఽణ్" (4-1-112) సూ. చే నణ్ ప్రత్యయమేయగును. ఆదివృద్ధి. ఇందుప్రథమసపత్నీశబ్దము భాషితపుంస్కము గాన దానికి "భస్యాఢే" అను పైవార్తికముచే పుంవద్భావమువలన జీన్ప్రత్యయము నివర్తించును గానసాపత్నః అనురూపమగును. ఇచటి నకారము స్త్రీలింగమును నిమిత్తముగజేసికొని ప్రవర్తించినదిగాకుండుటచే దానికిమాత్రము నివృత్తి యుండదు. ద్వితీయసపత్నీశబ్దము నిత్యస్త్రీలింగమగుటచే పుంవద్భావము ప్రవర్తించదు. "సాపత్నీ + అ" అనియుండ "యస్యేతి చ" సూ. చే నీకారలోపము. కాన సాపత్నః అని యగును. ఇచటను పుంవద్భావము ప్రవర్తించినచో సాపతః అనురూపమయ్యెడిని. స్వామిపర్యాయపతిశబ్దమువలన సిద్ధమైన సపత్నీ శబ్దముకంటె మాత్రము "సపత్న్యా అపత్యమ్" అనునర్థమున లిఙ్గవిశిష్టపరిభాషచే "దిత్యదిత్యాదిత్యపత్యుత్తరపదాణ్ణ్యః" (4-1-85) సూ. చే ణ్యప్రత్యయమగును. శివాదిగణమున రూఢములగు సపత్నీశబ్దమునే గ్రహించుటవలన "శివాదిభ్యోఽణ్" సూ. చే నణ్ప్రత్యయము రాదు. ప్రథమసపత్నీశబ్దము శత్రువనునర్థమున కేవల రూఢము. ద్వితీయ సపత్నీశబ్దముగూడ సమానభర్తృక యనునర్థమున యోగరూఢము. అందుచే నా రెండుశబ్దములకణ్ప్రత్యయము సిద్ధమగును. తృతీయసపత్నీశబ్దముమాత్రము పాతీతిపతిః అనురీతిగ కేవలయోగసిద్ధమగుపతిశబ్దముగలదగుటచే రూఢము

గానందున దీనికి శివాదిగణమున గ్రహణములేదు. కానసణ్ప్రత్యయము ప్రవర్తింపక ఞ్యప్రత్యయమే ప్రవర్తించునని యాశయము. "దిత్యదిత్యాదిత్య" అను సూత్రముచే పతిశబ్దము త్తరపదమగుదానికి ఞ్యప్రత్యయము విధింపబడినను "ప్రాతిపదిక గ్రహణే లిఙ్గవిశిష్టస్యాపి గ్రహణమ్" అనుపరిభాషచే పత్నీశబ్దముత్తరపదముగ గల శబ్దమునందును ఞ్యప్రత్యయము సిద్ధమగును. అందువలన తృతీయ సపత్నీశబ్దముకంటె ఞ్యప్రత్యయము నిస్సందేహముగ ప్రవర్తించును. ఆదివృద్ధి. ఈశబ్దము భాషితపుంస్కము గాన పుంవద్భావము ప్రవర్తించుటచే ఙీబ్నకారాదేశములు నివృత్తములగును. సాపతి+య అని యుండ "యస్యేతి చ" సూ. చే ఇకారలోపము. సాపత్యః అని యగును. (4 వా) ఠక్ప్రత్యయము గాని ఛస్ప్రత్యయముగాని పరమగునపుడు స్త్రీవాచకమునకు పుంవద్భావమును చెప్పవలయును. భావత్కాః భవత్యాశ్ఛాత్రాః అనునర్థమున "భవతష్ఠక్ఛసౌ" (4-2-115) సూ. చే భవతీశబ్దముకంటె ఠక్ప్రత్యయము. ఈవార్తికముచే పుంవద్భావము. "ఠస్యేకః" (7-3-50) సూ. చే ప్రాప్తమగు ఇకాదేశమును బాధించి "ఇసుసుక్తాన్తాత్కః" (7-3-51) సూ. చే ఠక్ప్రత్యయమునకు కాదేశమగును. ఆదివృద్ధి. భవదీయాః "భవతష్ఠక్ఛసౌ" సూ. చే భవతీశబ్దముకంటె ఛస్ప్రత్యయము. ఈయాదేశము. పుంవద్భావము.

"ఏకతద్ధితే" చ (1005) అనుసూత్రమునకు తద్ధితప్రత్యయము, ఉత్తర పదము, పరమగునపుడేకశబ్దమునకు హ్రస్వమగునని యర్థము. ఏకత్వమ్ (ఏకస్యా భావః) మొదలగునవి యుదాహరణములు. సర్వనామమునకు కృత్తద్ధితసమాసాదివృత్తులన్నిటియందు పుంవద్భావమును విధించు "సర్వనామ్నో వృత్తిమాత్రే పుంవద్భావః" అను భాష్యకారునివచనమువలన "ఠక్ఛసోశ్చ" "ఏకతద్ధితేచ" అనువచనములచే సాధింపదగు భావత్కాః ఏకత్వమ్ మొదలగునవి సుతరూపములు సిద్ధించును గాన వార్తికము ఏకతద్ధితేచ అనుసూత్రమును ఆవశ్యకములుగావు. "సర్వనామ్నో వృత్తిమాత్రే పుంవద్భావః" అను భాష్యకారవచనమునకుదాహరణములు:— సర్వమయః సర్వాశబ్దముకంటె "సర్వస్యా ఆగతః" అనునర్థమున "మయట్ చ" (4-3-82) సూ. చే మయట్ప్రత్యయమగును. తద్ధితవృత్తియగుటవలననీవచనముచే పుంవద్భావము. సర్వకామ్యతి (సర్వామాత్మన ఇచ్ఛతి) సర్వాశబ్దముకంటె "కామ్యచ్చ" (3-1-9) సూ. చే కామ్యచ్ ప్రత్యయము. సనాద్యన్తధాతువృత్తియగుటచే నీవచనమువలన పుంవద్భావము. తిబాదులు. సర్వకభార్యః (సర్వికా భార్యా యస్య) బహువ్రీహిసమాసము. సమాసవృత్తియగుటచే నీవచనమువలన పుంవత్త్వము. సర్వప్రియః (సర్వా ప్రియా యస్య) సమాసమగుటచే పుంవద్భావము. "భస్త్రైషాజాజ్ఞాద్వా" (469) సూ. చే సకచ్ సహితములగు ఏషకా ద్వకా అను శబ్దములకకారమునకంటె పూర్వమగువానికిత్వము విధింపబడెను. పై భాష్యకారవచనముచే వృత్తిఘటకములగు ననేకభాగములలో నొకదానికంటె పూర్వమునందు సర్వనామమునకే పుంవద్భావమును చెప్పవల

యును. అట్లు చెప్పనిచో ఏషా ద్వా అనుశబ్దములకకచ్ప్రత్యయమును చేయునపుడు తద్ధితవృత్తియగుటవలన పుంవద్భావమే ప్రవర్తించును గాననిత్యవిధానమునకవకాశము లేకపోవును. అందుచే "భస్యాఢే" అను సూ. చే నిత్యవిధానము "సర్వనామ్నో" అనువచనముచే పూర్వమునకే పుంవద్భావమనుటలో ప్రమాణమగును. ఇట్లు చెప్పుటవలననకచ్ప్రత్యయము ప్రవర్తించునపుడును ఏకశేషవృత్తియందునీవచనముచే పుంవద్భావము రాదు. సర్వికా। అకచ్ప్రత్యయముతో గూడిన సర్వాశబ్దముకంటె టాప్ప్రత్యయము. "ప్రత్యయస్థాత్" (466) సూ. చే నిత్వము. సర్వాః। సర్వాశబ్దమునకు బహువచనము. సరూపసూత్రముచే నేకశేషము.

(5 వా) కుక్కుటీ మృగీ మొదలగు కుక్కుట్యాదిగణపఠితములగు శబ్దములకు అణ్డ శాబ మొదలగునస్త్రాదిగణపఠితశబ్దములు పరములగునపుడు పుంవద్భావము చెప్పవలయును కుక్కుటాణ్డమ్। (కుక్కుట్యా అణ్డమ్) పుంవద్భావము. మృగక్షీరమ్। (మృగ్యాః క్షీరమ్) మృగపదం। (మృగ్యాః పదమ్) కాకశాబః। (కాక్యాః శాబః)॥

విప : — "అక్కృత్వసుచః" అనుచోట అజ్ఞ అభివిద్యర్థకము. కాన కృత్వసుచ్ప్రత్యయవిధాయకసూత్రముగూడ తసిలాదులలో జేయనని గ్రహించునది. తిల్థ్యన్ప్రత్యయములు తసిలాదికృత్వసుజన్తములందుపఠింపబడనందున వృకతిః అజథ్యా ఇత్యాదులగునిమిత్తస్థలములందు పుంవద్భావము ప్రవర్తింపకపోవును కానవిట్టిచోటులందవ్యాప్తియని యెఱుగునది. దేశ రూప్య ప్రత్యయములు తసిలాదికృత్వసుజన్తములందు పఠింపబడుటచే వట్వీదేశ్యా శుభ్రారూప్యా ఇత్యాదిరూపములందు పుంవద్భావము ప్రసక్తమయ్యెడిని. కానవిట్టిచోటులందతివ్యాప్తి యనియెఱుగునది. అందుచే పరిగణనమావశ్యకము. "శసి బహ్వల్పార్థస్య", "భస్యాఢే" అనువార్తికములు అయాప్రత్యయములు పరిగణనమందన్తర్భూతములు గాకపోవుటచే పుంవద్భావమప్రాప్తముగుచుండ తదర్థమారంభింపబడినవి.

841. క్యఙ్మానినోశ్చ. 6-3-6, క్యఙ్మానినోః, చ। (స్త్రియాః, పుంవత్)

ఏతయోః పరతః పుంవత్। ఏనీవాచరతి ఏతాయతే। శ్యేనీవాచరతి శ్యేతాయతే। స్వభిన్నాం కాం చిద్దర్శనీయాం మన్యతే దర్శనీయమానినీ। దర్శనీయాం స్త్రియం మన్యతే దర్శనీయమానీ చైత్రః॥

841. క్యఙ్ప్రత్యయముపరమగునపుడు, మానిన్శబ్దముపరమగునపుడును స్త్రీవాచకశబ్దమునకు పుంవద్భావమగును. ఏతాయతే। (ఏనీవాచరతి) ఏతశబ్దముకంటె "వర్ణాదనుదాత్తాత్" (499) సూ. చే ఙీప్ప్రత్యయనకారాదేశములైనచో ఏనీ

శబ్దము సిద్ధమగును. "ఏనీవాచరతి" అనునర్థమున "కర్తుః క్యఙ్ సలోపశ్చ" (3-1-11) సూ. చే ఏనీశబ్దముకంటె క్యఙ్ప్రత్యయము. ఈసూత్రముచే పుంవద్భావము. కాన ఙీబ్నకారాదేశములు నివర్తించును. "అకృత్సార్వధాతుకయోః" (7-4-25) సూత్రముచే ఏతశబ్దమునకు దీర్ఘమునగును. శ్యేతాయతే। (శ్యేనీవాచరతి) శ్యేతశబ్దమునకు ఏతశబ్దమునకువలె ఙీబ్నకారాదేశములనుచేసిన శ్యేనీశబ్దముసిద్ధించును. శ్యేనీశబ్దముకంటె క్యఙ్ప్రత్యయము. పుంవద్భావము. దర్శనీయమానినీ। (స్వభిన్నాం కాంచిద్దర్శనీయాం మన్యతే) దర్శనీయాశబ్దముపపదమగుచుండ మనధాతువుకంటె "మనః" (3-2-82) సూ. చే ణినిప్రత్యయము. "ఉపపదమతిఙ్" (766) సూ. చే సమాసము. పుంవద్భావము. సమాసము నకారాన్తమగుటచే "ఋన్నేభ్యోఙీప్" సూ. చే ఙీప్ప్రత్యయము. దర్శనీయమానీ। (దర్శనీయాం ప్రియం మన్యతే) చైత్రుడు. ఇచట పూర్వమునవలె ప్రక్రియనూహించునది. దర్శనీయమానిన్శబ్దము పుంలింగమగుటచే ఙీనాదేశము మాత్రము రాదు.

వివ :— "దర్శనీయమానినీ" ఇత్యాదులందు స్త్రీలిఙ్గమగు మానినీశబ్దముత్తరమగును గాన "స్త్రియాఃపుంవత్" సూ. చే పుంవద్భావము సిద్ధమగును. అయినను సమానాధికరణముగానట్టి మానినీశబ్దము పరమగునపుడును స్త్రీలింగము గానట్టి మానిన్శబ్దము పరమగునపుడును పుంవద్భావముకొఱకీసూత్రమున మానిన్శబ్దము గ్రహింపబడెను. "దర్శనీయమానినీ" అనుచోట మానినీశబ్దము స్త్రీలింగమైనను సమానాధికరణము గాదు. ఈ విషయమును సూచించుటకే "స్వభిన్నాం కాంచిత్"(దర్శనీయాం మన్యతే) అని యుపపాదింపబడెను. తనకంటె భిన్నమగు మరియొకస్త్రీని సుందరమైనదానినిగ తలంచుస్త్రీ యనియర్థము. దర్శనీయమానీ అనుచోట మానిన్శబ్దము పుంలింగము గానస్త్రియాఃపుంవత్ సూత్రమునకు ప్రాప్తి లేదు. ఇచటనీసూత్రముచేతనే పుంవద్భావమగును.

842. న కోపధాయాః. 6-3-37. న, కోపధాయాః। (స్త్రియాః, పుంవత్)

> కోపధాయాః స్త్రియా న పుంవత్। పాచికాభార్యః। రసికాభార్యః। మద్రికాయతే। మద్రికామానినీ। (వా) కోపధ ప్రతిషేధే తద్ధితవుగ్రహణమ్। నేహ। పాకా భార్యా యస్య సః పాకభార్యః॥

842. కకారోపధమగు స్త్రీవాచకమునకు పుంవద్భావము రాదు. తత్తత్సూత్రవార్తికములచే ప్రాప్తమగు పుంవద్భావమునకిది నిషేధము. పాచికాభార్యః। (పాచికా భార్యా యస్య) "స్త్రియాః పుంవత్" సూ. చే. ప్రాప్తమగుపుంవద్భావమునకు నిషేధము. రసికాభార్యః। (రసికా భార్యాయస్య) పుంవద్భావనిషేధము. మద్రికాయతే। మద్రికాశబ్దముకంటె క్యఙ్ప్రత్యయము. పూర్వసూత్రముచే ప్రాప్త

మగు పుంవద్భావమునకు నిషేధము. మద్రికామానినీ। "దర్శనీయమానినీ" అను చోటునందువలె ప్రక్రియ నెఱుగునది. పుంవద్భావనిషేధము విశేషము.

(వా) నకోపధాయాః అను సూత్రముచే విధింపబడు నిషేధమందు తద్ధితవు పదములను గ్రహింపవలయును. తద్ధితప్రత్యయసంబంధి వుప్రత్యయ (ణ్వుల్) సంబంధి యైనటువంటి కకారముపధగాగల శబ్దమునకే పుంవద్భావనిషేధమని యర్థము. పాకభార్యః। (పాకా భార్యా యస్య సః) పాకశబ్దము గణములలో నిపతింపబడినది. అందుచేని కకారము తద్ధితసంబంధిగాని వుసంబంధిగాని కానందున నిషేధము ప్రవర్తించదు.

వివ:—పంచధాతువుకంటె ణ్వుల్ప్రత్యయము అకాదేశము టాప్ప్రత్యయము ఇత్వము ప్రవర్తించిన పాచికాశబ్దము సిద్ధమగును. రసశబ్దముకంటె "అత ఇనిఠనౌ" (5-2-115) సూ. చే రసోఽస్యాస్తి అనునర్థమున ఠన్ప్రత్యయము. (తద్ధితము) దానికి ఇకాదేశము టాప్ మొదలగువానినిచేసిన రసికాశబ్దము సిద్ధమగును. మద్రేషుభవా అనునర్థమున మద్రశబ్దముకంటె "మద్రవృజ్యోః కన్" (4-2-131) సూ. చే కన్ప్రత్యయము. (తద్ధితము) టాబాద్యనంతరము మద్రికా అనియగును. ఈస్థలములందును పుంవద్భావము నిషిద్ధమగును.

843. సంజ్ఞాపూరణ్యోశ్చ. 6-3-38. సంజ్ఞాపూరణ్యోః, చ, (న, పుంవత్)

అనయోర్న పుంవత్। దత్తాభార్యః। దత్తామానినీ। దానక్రియానిమిత్తః స్త్రియాం పుంసి చ సంజ్ఞాభూతోఽయమితి భాషితపుంస్కత్వమస్తి। పఞ్చమీభార్యః। పఞ్చమీపాశా॥

843. సంజ్ఞావాచకముగాని పూరణప్రత్యయాంతముగాని యగు స్త్రీవాచకశబ్దమునకు పుంవద్భావము రాదు. దత్తాభార్యః (దత్తా భార్యా యస్య) దత్తాశబ్దము సంజ్ఞావాచకము. "స్త్రియాః పుంవత్" సూ. చే ప్రాప్తమగు పుంవద్భావమునకిది నిషేధము. దత్తామానినీ। దత్తాం మన్యతే అనునర్థమున ణినిప్రత్యయము. పుంవద్భావనిషేధము. దానక్రియను (దానమును) పురస్కరించుకొనియే దత్తాశబ్దము పుంలింగమందు స్త్రీలింగమందును సంజ్ఞాశబ్దమైనది. అందుచే నొకేప్రవృత్తినిమిత్తమందు భాషితపుంస్కమగును గాన "స్త్రియాః పుంవత్" సూత్రమువలన ప్రాప్తమగు పుంవద్భావమీసూత్రముచే నిషేధింపబడును. పఞ్చమీభార్యః। (పఞ్చమీ భార్యా యస్య) పఞ్చమీశబ్దము పూరణప్రత్యయాంతము గాననిషేధమగును. పఞ్చమీపాశా. కుత్సితార్థమున పాశప్ప్రత్యయము. నిందితమగుపంచమి యని యర్థము. "తసిలాదిషు" (840) సూ. చే ప్రాప్తమగు పుంవద్భావము నిషిద్ధమగును.

844. వృద్ధినిమిత్తస్య చ తద్ధితస్యారక్తవికారే. 6-3-39. వృద్ధినిమిత్తస్య, చ, తద్ధితస్య, అరక్తవికారే। (న, పుంవత్)

వృద్ధిశబ్దేన విహితా యా వృద్ధిః తద్ధేతుర్యస్తద్ధితో೭
రక్తవికారార్థ స్తదన్తా స్త్రీ న పుంవత్। స్రౌఘ్నీభార్యః।
మాథురీయతే। మాథురీమానినీ। వృద్ధినిమిత్తస్య కిమ్।
మధ్యమభార్యః। తద్ధితస్య కిమ్। కాణ్డలావభార్యః। వృద్ధి
శబ్దేన కిమ్। తావద్భార్యః। రక్తేతు కాషాయీ కన్థా యస్య
సః కాషాయకన్థః। వికారే తు హైమీ ముద్రికా యస్య సః
హైమముద్రికః। వృద్ధిశబ్దేన వృద్ధిం ప్రతి ఫలోపధానాభావా
దిహ న పుంవత్। వైయాకరణభార్యః। సౌవశ్వభార్యః॥

844. వృద్ధిశబ్దముచే విధింపబడు వృద్ధికి నిమిత్తమై రక్తార్థకముకంటె వికారార్థకముకంటె భిన్నమైన తద్ధితప్రత్యయమన్తమందుగల స్త్రీవాచకమునకు పుంవద్భావము ప్రవర్తించదు. సూత్రములోని వృద్ధిశబ్దముయొక్క వృత్తివలన వృద్ధి శబ్దముచే విధింపబడువృద్ధికనునర్థము లభించినదని గ్రహించునది. స్రౌఘ్నీభార్యః స్రుఘ్నశబ్దము దేశవిశేషవాచకము. స్రుఘ్నేభవా అనునర్థమున "తత్రభవః" అను సూత్రముచే స్రుఘ్నశబ్దముకంటె అణ్ ప్రత్యయము. "యస్యేతిచ" సూ. చే అకారలోపము. అణ్ ప్రత్యయము ణిత్తగుటవలన "తద్ధితేష్వచామాదేః" (7-2-122) సూ. చే నాదివృద్ధి. "టిడ్ఢాణఞ్" సూ. చే ఙీప్. స్రౌఘ్నీ అని యగును. స్రౌఘ్నీ భార్యా యస్య అనివిగ్రహము. "స్త్రియాఃపుంవత్" సూత్రము వలన ప్రాప్తించు పుంవద్భావమీసూత్రముచే నిషేధింపబడును. మాథురీయతే. "తత్రభవః" (4-3-53) సూ. చే మధురాయాంభవా అనునర్థమున మథురాశబ్దము కంటె అణ్ ప్రత్యయము. అకారలోపము ఆదివృద్ధి ఙీప్ప్రవర్తించిన మాథురీ అనియగును. మాథురీవాచరతి అనునర్థమున "కర్తుః క్యఙ్" (3-1-11) సూ. చే క్యఙ్ ప్రత్యయము. సనాద్యన్తాధాతవగుటచే లడాదులగును. ఇచట "క్యఙ్మానినోశ్చ" సూ. చే ప్రాప్తించు పుంవద్భావము నిషేధింపబడును. మాథురీమానినీ। మాథురీం (మధురాయాం భవాం) మన్యతే అనునర్థమున మన ధాతువుకంటె ణిని ప్రత్యయము. ఉపపదసమాసము. ఇదినకారాంతమగుటవలన విశే షముకంటె ఙీప్ప్రత్యయము. ఇచటను "క్యఙ్మానినోశ్చ" సూ. చే ప్రాప్తించు పుంవద్భావము నిషేధింపబడును.

మధ్యమభార్యః। (మధ్యమా భార్యా యస్య) "స్త్రియాఃపుంవత్" సూ. చే పుంవత్త్వము. మధ్యశబ్దముకంటె "మధ్యాన్మః" (4-3-8) సూ. చే మప్రత్యయ మునుచేసిన మధ్యమాశబ్దము సిద్ధమగును. ఇచట మప్రత్యయము వృద్ధిహేతువు కాదు. సూత్రమున వృద్ధినిమిత్తస్య అనుపదము లేకున్ననిచట పుంవద్భావనిషే ధము ప్రసక్తమగును. కాణ్డలావభార్యః। (కాణ్డలావీ భార్యా యస్య) "స్త్రియాః పుంవత్" సూ. చే పుంవద్భావము. [illegible] కలూఞ్ధాతువుకంటె "[illegible]" ( ) సూ. "అచోఞ్ణితి" (256) సూ. చే వృద్ధి. ఆవాదేశము. ఉపపదసమాసము. "[illegible]"

సూ. చే జీపు. కాణ్ణలావీ, అనియగును. ఇచట అణ్ప్రత్యయము వృద్ధికి నిమిత్తమైనను తద్ధితముగాదు. (కృత్తు) సూత్రమున తద్ధితస్య అనుపదములేనిచో నిచట పుంవద్భావనిషేధము ప్రసక్తమగును. తావద్భార్యః (తావతీ భార్యా యస్య) పుంవద్భావము. తచ్ఛబ్దముకంటె పరిమాణార్థమున "యత్తదేతేభ్యః పరిమాణే వతుప్" (5-2-39) అను సూ. చే వతుప్రత్యయము. "ఆ సర్వ నామ్నః" (433) సూ. చే నాకారాదేశము. వతుప్రత్యయముగిత్తు గానజీపగును. తావతీ అనియగును. ఇచట వతుప్రత్యయము వృద్ధిసంజ్ఞకమగునాకారమునకు నిమిత్తమైనను వృద్ధిశబ్దముచే నాకారము విహితముగాదు. కానసూత్రమున "వృద్ధి శబ్దేనవిహితా" అను నర్థము వివక్షితముగానిచోనిట్టిస్థలములందు పుంవత్త్వనిషే ధము ప్రసక్తమగును.

రక్తార్థకమగు తద్ధితాన్తమునకు కాషాయకస్ఠః అనియుదాహరణము. కాషాయీ కన్ఠా యస్య అనివిగ్రహము. పుంవద్భావము. కషాయేన రక్తా అనునర్థమున "తేన రక్తం రాగాత్" (4-2-1) అను సూ. చే కషాయశబ్దముకంటెనణ్ప్రత్యయము. అకారలోపము ఆదివృద్ధి జీప్ప్రత్యయమును ప్రవర్తించిన కాషాయీ అనురూప మగును. ఇచట వృద్ధినిమిత్తమగు తద్ధితము రక్తార్థమగుటచే పుంవద్భావనిషేధము ప్రవర్తించదు. హైమముద్రికః హైమీ ముద్రికా యస్య అనివిగ్రహము. పుంవ ద్భావము, హేమ్నోవికారా అనునర్థమున హేమన్శబ్దముకంటె "అనుదాత్తాదేశ్చ" (4-3-147) సూ. చే అఞ్ప్రత్యయము. టిలోపము. ఆదివృద్ధి "టిడ్ఢాణఞ్" సూ. చే జీపు. హైమీ అనియగును. ఇచట తద్ధితము వికారార్థమున విహితమగుటచే నిషేధము ప్రవర్తించదు.

వ్యాకరణమధీతే అనునర్థమున వ్యాకరణశబ్దముకంటె "తదధీతే తద్వేద" (4-2-59) అను సూ. చే నణ్ప్రత్యయము. "యస్యేతిచ" సూ. చే నకార లోపము. అణ్ప్రత్యయము ణిత్తగుటవలన ప్రాప్తమగునాదివృద్ధి "నయ్వాభ్యాం పదాన్తాభ్యామ్" (7-3-3) అను సూ. చే నిషేధింపబడును. "నయ్వాభ్యాం" అను సూత్రముచేతనే యకారమునకు పూర్వమైకారాగమమగును. "టిడ్ఢాణఞ్" సూ. చే. జీపు. వైయాకరణీ అనియగును. వ్యాకరణమును చదువుకొను స్త్రీయని యర్థము. వైయాకరణీ భార్యా యస్య అనువిగ్రహమున సమానము, "స్త్రియాః పుంవత్" సూ. చే పుంవద్భావము. వైయాకరణభార్యః అనియగును. స్వశ్వస్యాపత్యం స్త్రీ అనునర్థమున స్వశ్వశబ్దముకంటె "శివాదిభ్యోఽణ్" (4-1-112) సూ. చే నణ్ ప్రత్యయము. అకారలోపము. ఆదివృద్ధి "నయ్వాభ్యాం" సూత్రముచే నిషేధింప బడును. ఆసూత్రముచేతనే ప్రథమవకారమునకు పూర్వమౌకారాగమము. జీప్ ప్రత్యయము. సౌవశ్వీ అనియగును. సౌవశ్వీ భార్యా యస్య అనువిగ్రహమున సమాసపుంవద్భావములవలన సౌవశ్వభార్యః అనియగును. ఈరెండుస్థలములందు ఆదివృద్ధి "నయ్వాభ్యాం" అనుసూత్రముచే నిషేధింపబడినవి వృద్ధినిమిత్తక తద్ధిత

ప్రత్యయాన్తములైనందున నీసూత్రముచే పుంవద్భావనిషేధము ప్రాప్తమగుచున్నది. అయిననీసూత్రమున వృద్ధినిమిత్తస్య అనుచోట నిమిత్తపదము ఫలోపహితపరము. కావునతద్ధితప్రత్యయమును నిమిత్తముగఁజేసికొని యెచట వృద్ధి యితరముచే నబాధితమై ప్రవర్తించునో అట్టితద్ధితాన్తమునకే పుంవద్భావనిషేధమని సూత్రమునకర్థములభించును. ఇట్లు చెప్పుటవలన పైరెండుచోటులందు సఙ్ ప్రత్యయము వృద్ధినిమిత్తమైననావృద్ధి నిషేధింపబడినందున వృద్ధి ప్రవర్తింపకుండుటచే పుంవద్భావనిషేధము ప్రవర్తించదు. ఇష్టరూపములు సిద్ధములగును.

వివ :— "వృద్ధేస్తద్ధితస్య" అని పఠించినను షష్ఠీవిభక్తికి నిమిత్తార్థమును చెప్పినచో వృద్ధినిమిత్తస్య తద్ధితస్య అనునర్థము లభించుచుండ సూత్రమున నిమిత్తగ్రహణముచే ఫలోపహితముగువృద్ధికి నిమిత్తము గావలయునని వివక్షింపబడును.

845. స్వాఙ్గాచ్చేతః. 6-3-40. స్వాఙ్గాత్, చ, ఈతః। (న, స్త్రియాః, పుంవత్)

స్వాఙ్గాద్య ఈకారస్తదన్తా స్త్రీ న పుంవత్। సుకేశీభార్యః।
స్వాఙ్గాత్ కిమ్। పటుభార్యః। ఈతః కిమ్। అకేశభార్యః।
(వా) అమానినీతి వక్తవ్యమ్। సుకేశమానినీ॥

845. స్వాంగమును (అద్రవంమూర్తిమత్స్వాఙ్గమ్ ఇత్యాదిలక్షణలక్షితము) బోధించుశబ్దముకంటె పరమగునీకారమంతమందుగల స్త్రీవాచకమునకు పుంవద్భావము రాదు. సుకేశీభార్యః। (సుకేశీ భార్యా యస్య) సుకేశశబ్దముకంటె "స్వాఙ్గాచ్చోపసర్జనాత్" (513) సూ. చే ఙీష్ప్రత్యయము. "స్త్రియాఃపుంవత్" సూ. చే ప్రాప్తమగు పుంవద్భావము నిషేధింపబడును. పటుభార్యః। (పట్వీ భార్యా యస్య) గుణవాచకమగు పటుశబ్దముకంటె స్త్రీలింగమున "వోతోగుణవచనాత్" (505) సూ. చే ఙీష్. పుంవద్భావమువలననది నివర్తించును. ఈసూత్రమున "స్వాఙ్గాత్" అనుపదముండుటవలన స్వాఙ్గవాచకముకానట్టి పటుశబ్దము ప్రకృతిగగల ఈకారాన్తమందుగలదానికి పుంవద్భావనిషేధము వారితమగును. అకేశభార్యః। (అకేశా భార్యా యస్య) పుంవద్భావము. అవిద్యమానాః కేశా యస్యాః అనువిగ్రహమున "నఞోఽస్త్యర్థానాం" అనువార్తికముచే సమాసమును ఉత్తరపదలోపమును చేసిన అకేశా అనియగును. కేశములు స్వాంగములైనను "సహనఞ్విద్యమానపూర్వాచ్చ" (516) సూ. చే నిషేధమువలన ఙీష్ప్రవర్తించక టాప్ ప్రవర్తించును. ఈసూత్రమున ఈతః అనుపదముండుటచే అకేశాశబ్దమునకు పుంవద్భావనిషేధము వారింపబడును.

(వా) మానినీశబ్దముపరమగునపుడు "స్వాఙ్గాచ్చేతః" సూత్రముచే పుంవద్భావనిషేధము ప్రవర్తించదని చెప్పవలయును. సుకేశమానినీ। (సుకేశీం

మన్యతే) ఇచటనీవార్తికముచే పుంవద్భావనిషేధము నిషేధింపబడినందున పుంవద్భావము ప్రవర్తించును.

వివ:— ఈతః అనునది "స్త్రియాః" అనుదానికి విశేషణము. తదన్తవిధి వలన ఈకారాన్తస్య స్త్రీవాచకశబ్దస్య అనునర్థము లభించును. ఇట్లు ఫలితమగు నర్థమే తదన్తా స్త్రీ అని మూలమున చెప్పబడెను.

846. జాతేశ్చ. 6-3-41. జాతేః, చ। (వ, పుంవత్)

జాతేః పరో యః స్త్రీప్రత్యయస్తదన్తం న పుంవత్। శూద్రాభార్యః। బ్రాహ్మణీభార్యః। సౌత్రస్యైవాయం నిషేధః। తేన హస్తినీనాం సమూహో హాస్తికమిత్యత్ర భస్యాఢ ఇతి తు భవత్యేవ॥

846. జాతివాచకముకంటె పరమగు స్త్రీప్రత్యయము న్తమందుగలశబ్దము పుంవద్భావమును బొందదు. శూద్రాభార్యః। (శూద్రా భార్యా యస్య) శూద్ర శబ్దముకంటె "శూద్రాచామహత్పూర్వా" అనువచనముచే టాప్ప్రత్యయము. పుంవద్భావనిషేధము. బ్రాహ్మణీభార్యః। (బ్రాహ్మణీ భార్యా యస్య) "శార్ఙ్గరవాద్యఞోఙీన్" (530) సూ. చే బ్రాహ్మణశబ్దముకంటె ఙీన్ప్రత్యయము. పుంవద్భావనిషేధము. సూత్రముచే విహితమగు పుంవద్భావమునకే యీనిషేధము ప్రవర్తించును. (ఇందు వ్యాఖ్యానమేమానము) అందుచే హాస్తికమ్ (హస్తినీనాం సమూహః) అనుచోట "భస్యాఢేతద్ధితే" అనువార్తికముచే విధింపబడు పుంవద్భావము నిశ్శంకముగ ప్రవర్తించును.

847. సంఖ్యయాఽవ్యయాసన్నాదూరాధికసంఖ్యాస్సంఖ్యేయే. 2-2-25. సంఖ్యయా, అవ్యయా............సంఖ్యాః, సంఖ్యేయే (బహువ్రీహౌ, సుప్)

సంఖ్యేయార్థయా సంఖ్యయా అవ్యయాదయస్సమస్యన్తే। స బహువ్రీహిః। దశానాం సమీపే యే సన్తి తే ఉపదశాః। నవ ఏకాదశ వేత్యర్థః। బహువ్రీహౌ సంఖ్యేయే ఇది వక్ష్యమాణో డచ్॥

847. సంఖ్యయా పరిచ్ఛేద్యమ్=సంఖ్యేయమ్ లెక్కింపదగినది. సంఖ్యేయమును బోధించు సంఖ్యావాచకముతో, అవ్యయము అసన్నాఽదూరాధికశబ్దములు సంఖ్యావాచకము సమసించును, అది బహువ్రీహిసంజ్ఞకమగును. ఉపదశాః। (దశానాం సమీపే యే సన్తి) ఇచటనుపయనునవ్యయము (సమీపవర్తిబోధకము) సంఖ్యేయార్థకసంఖ్యావాచకమగు దశశబ్దముతో సమసించెను. పదికి సమీపమందుండునవని యర్థము. పదికి సమీపమునందునని తొమ్మిదిగాని పదనోకండుగాని యగును, సమాసానన్తరము మట్లుగాదిప్రక్రియచేసినను పదశన్ అనియుం

డును. ఇపుడు "బహువ్రీహౌ సంఖ్యేయే డజబహుగణాత్" (858) అనువక్ష్య మాణసూత్రముచేనుపదశబ్దముకంటె డచ్ప్రత్యయము. (సమాసాన్తము) ప్రవర్తించును. పిదప "నస్తద్ధితే" సూ. చే టిలోపము ప్రవర్తింప ఉపదశాః అనియగును.

వివ :— ప్రసంగవశమున పుంవద్భావతన్నిషేధప్రకరణములు వ్యాఖ్యానము చేయబడి ప్రకృతమగు సమాసవిధాయకశాస్త్రము వ్యాఖ్యానము చేయబడెను. ఏతత్సూత్రవిషయములగుపదములకు సామానాధికరణ్యము లేకపోవుటచేతను అన్యపదార్థముండకపోవుటచేతను "అనేకమన్యపదార్థే" అను పూర్వసూత్రముచే సమాసమప్రాప్తమగుచుండ నీసూత్రమారంభింపబడెను.

848. తి వింశతేర్డితి. 6-4-142. తి, వింశతేః. డితి। (భస్య, లోపః)

వింశతేర్భస్య తిశబ్దస్య లోపస్స్యాడ్డితి। ఆసన్నవింశాః। వింశతేరాసన్నా ఇత్యర్థః। అదూరత్రింశాః। అధికచత్వారింశాః। ద్వౌ వా త్రయో వా ద్విత్రాః। ద్విరావృత్తా దశ ద్విదశాః। వింశతిరిత్యర్థః।

848. తి అనునది లుప్తషష్ఠ్యన్తము. డకారమిత్సంజ్ఞగగల ప్రత్యయము పరమగునపుడు భసంజ్ఞకమగు వింశతిశబ్దము యొక్క తిశబ్దమునకు లోపమగును. ఆసన్నవింశాః। పూర్వసూత్రముచేనాసన్నశబ్దమునకు షష్ఠ్యన్తమగు వింశతిశబ్దమునకును సమాసము. సుబ్లుగాద్యనంతరమున "బహువ్రీహౌ సంఖ్యేయే" సూ. చే. డచ్ప్రత్యయమనుచేసిన ఆసన్నవింశతి + అ అనియుండును. "టేః" (317) సూ. చే నికారమునకుమాత్రము లోపము ప్రాప్తమగుచున్నది. దానిని బాధించి యీసూత్రముచే తిశబ్దమునకు లోపమగును. పరరూపము. ఇరువదికి సమీపమునునున్నవని యర్థము. అదూరత్రింశాః। అదూరశబ్దమునకుత్రింశచ్ఛబ్దముతో పూర్వసూత్రముచే సమాసము. డచ్ప్రత్యయము. "టేః" సూ. చే టిలోపము. అధికచత్వారింశాః। అధికశబ్దమునకు చత్వారింశచ్ఛబ్దముతో సమాసము. డచ్ప్రత్యయటిలోపములు. ద్విత్రాః। సంఖ్యావాచకమునకు సంఖ్యావాచకముతో సమాసమునకుదాహరణమిది. ద్వౌ వాత్రయో వా అనునర్థమున సమాసము. డచ్ప్రత్యయటిలోపములు. రెండుగాని మూడుగాని యనియర్థము. సంఖ్యావాచకమునకు సంఖ్యావాచకముతోసమాసమునకు మరియొకయుదాహరణము. ద్విదశాః। ద్విరావృత్తా దశ అనునర్థమున సమాసము. డచ్ప్రత్యయటిలోపములు ఇరువదియనియర్థము.

849. దిఙ్నామాన్యన్తరాలే. 1-2-26. దిఙ్నామాని, అన్తరాలే। (బహువ్రీహిః)

దిశో నామాన్యన్తరాలే వాచ్యే ప్రాగ్వత్। దక్షిణస్యాశ్చ పూర్వస్యాశ్చ దిశోఽన్తరాలం దక్షిణపూర్వా। నామగ్రహణాద్యౌగికానాం న। ఐన్ద్ర్యాశ్చ కౌబేర్యాశ్చాన్తరాలం దిక్॥

849. అంతరాలము (ఆగ్నేయాదివిదిక్కులు) వాచ్యమగునపుడు దిగ్వాచకములు పరస్పరము సమసించును. అది బహువ్రీహిసంజ్ఞకమగును. దక్షిణపూర్వా। (దక్షిణస్యాః పూర్వస్యాశ్చ దిశోఽన్తరాలమ్) దక్షిణాపూర్వాశబ్దములకు సమాసము సుబ్లుగాదులు. దక్షిణదిక్కునకు తూర్పుదిక్కునకు మధ్యనుండుదిక్కని యర్థము.

దిశోఽన్తరాలే అని పఠించినను దిశః అనుపదమువలన దిగ్వాచకములనెడి యర్థము లభించుచుండ నామగ్రహణమువలన దిక్కులందు రూఢములగు శబ్దములే గ్రహింపబడును గానియోగమువలన సిద్ధములగు దిగ్వాచకములు గ్రహింపబడవు. అందుచేనట్టి యౌగికములగు దిగ్వాచకములకీసూత్రముచే సమాసము రాదు. ఐన్ద్ర్యాశ్చ కౌబేర్యాశ్చ అన్తరాలం దిక్. ఇచటనైంద్రీశబ్దమవయవశక్తిచే (ఇంద్రసంబంధినీ) తూర్పుదిక్కును బోధించును గానయౌగికము. ఇట్లు కౌబేరీశబ్దముగూడయౌగికమే. (కుబేరస్య సంబంధినీ) కాన వీనికి సమాసము రాదు.

850. తత్ర తేనేదమితి సరూపే. 2-2-27. తత్ర, తేన, ఇదమ్, ఇతి, సరూపే। (బహువ్రీహిః)

సప్తమ్యన్తే గ్రహణవిషయే సరూపే పదే తృతీయాన్తే చ ప్రహరణవిషయే ఇదం యుద్ధం ప్రవృత్తమిత్యర్థే సమస్యేతే కర్మవ్యతిహారే ద్యోత్యే స బహువ్రీహిః। ఇతిశబ్దాదయం విషయవిశేషో లభ్యతే॥

850. తత్ర అనుపదముచే సప్తమ్యన్తములు వివక్షితములు. తేన అనుపదముచే తృతీయాన్తములు వివక్షితములు. వీనికి క్రమముగ "గ్రహణవిషయే", "ప్రహరణవిషయే" అనువానిని విశేషణములుగనధ్యాహారము చేయవలయును. కర్మవ్యతిహారే అనుదానినిగూడ నధ్యాహారమును చేయవలయును. ఇదమ్ అనుదానికి యుద్ధమ్ అనువిశేష్యమునధ్యాహారము చేయవలయును. గ్రహణశబ్దము గృహ్యతే (గ్రహింపబడునది) అను వ్యుత్పత్తివలన కేశములుమొదలగువానిని బోధించును. గ్రహణమ్ విషయః (వాచ్యః) యయోస్తే అనువిగ్రహమందు సమాసముచే గ్రహణవిషయే అని యగును. గ్రహణవాచకములని యర్థము. ప్రహరణశబ్దము ప్రహ్రియతే అనేన అనువ్యుత్పత్తివలన ప్రహరణసాధనములగు దండాదులను బోధించును. ప్రహరణవిషయే అనుపదమునకు ప్రహరణవాచకములని యర్థము. కర్మవ్యతిహారమననన్యోన్యగ్రహణము (కేశాదులను పరస్పరము పట్టుకొనుట) అన్యోన్యప్రహరణము (దండాదులచేనొకరినొకరు బాదుకొనుట) అనితెలియునది. సమానవర్ణములుగలిగి గ్రహణవాచకములగు రెండుసప్తమ్యన్తములు, సమానవర్ణములనుగల్గి ప్రహరణవాచకములగు రెండుతృతీయాన్తములను ఈయుద్ధము జరిగినదను నర్థమున కర్మవ్యతిహారము ప్రతీయమానమగునపుడు

సమసించునదియు బహువ్రీహి సంజ్ఞకమగునని సూత్రార్థము. సూత్రాక్షరముల వలన నింతటివిషయవిశేషము లభింపకున్నను లోకప్రసిద్ధియనెడి ప్రకాశమును బోధించునితిశబ్దమువలననది లభించునని గ్రహించునది.

వివ:—ఇదంయుద్ధమ్ అనునది "క్రియాభిధానాత్" అను భాష్యమువలన క్రియామాత్రమనుబోధించును. గ్రహణప్రహరణములు క్రియలకుపలక్షణము. కావున "కర్ణాకర్ణిప్రథితయశసః", "హస్తాహస్తిమిషాత్" మొదలగు ప్రయోగములును సాధువులగును

851. అన్యేషామపి దృశ్యతే. 6-3-137. అన్యేషామ్ అపి, దృశ్యతే। (దీర్ఘః)

దీర్ఘ ఇత్యనువర్తతే। ఇచి కర్మవ్యతిహారే బహువ్రీహౌ పూర్వపదాన్తస్య దీర్ఘః। ఇచ్ సమాసాన్తో వక్ష్యతే। తిష్ఠద్గు ప్రభృతిష్విచ్ప్రత్యయస్య పాఠాదవ్యయీభావత్వమవ్యయత్వం చ। కేశేషు కేశేషు గృహీత్వా ఇదం యుద్ధం ప్రవృత్తం కేశాకేశి। దణ్డైర్దణ్డైశ్చ ప్రహృత్యేదం యుద్ధం ప్రవృత్తం దణ్డాదణ్డి। ముష్టీముష్టి॥

851. ఇచ్ప్రత్యయము పరమగునపుడు కర్మవ్యతిహారబహువ్రీహియందు పూర్వపదమునకు దీర్ఘమగును. సమాసాన్తమగునిచ్ప్రత్యయము "ఇచ్కర్మవ్యతిహారే"(871) సూ. చే ముందు చెప్పబడును. తిష్ఠద్గ్వాది గణమునవిచ్ప్రత్యయము పఠింపబడినది. అందుచేనిజన్తమవ్యయీభావమై యవ్యయమగును.

కేశాకేశి:—"కేశేషు కేశేషు గృహీత్వా స్థితయోరిదం యుద్ధం ప్రవృత్తం" అనువిగ్రహమందు "తత్రతేనేదమ్" అనుసూత్రముచే కేశేషు కేశేషు అనుసప్తమ్యన్తములకు సమాసము. సుబ్లుక్కు. ఇచ్కర్మవ్యతిహారే" సూ. చే నిచ్ప్రత్యయము. "యస్యేతిచ" సూ. చే నకారలోపము. ఈసూత్రముచే పూర్వపదాన్తమునకు దీర్ఘము. అవ్యయమగుటచే సమాసముకంటెనుత్పన్నమైన సుప్పునకు లుక్కగును. కేశాకేశి అనియగును. ఒకరికేశములనొకరు పట్టుకొనియుండు మనుజులకు జరిగినయుద్ధమనియర్థము. దణ్డాదణ్డి:—"దణ్డైర్దణ్డైశ్చ ప్రహృత్య స్థితయోరిదం యుద్ధం ప్రవృత్తమ్ అనునర్థమున సమాసము. సుబ్లుక్కు. ఇచ్ప్రత్యయము. అకారలోపము, పూర్వపదాన్తదీర్ఘము. అవ్యయత్వము. దణ్డాదణ్డి. ఇట్లే ముష్టీముష్టి యనుచోట ప్రక్రియనూహించునది. (ముష్టిభిర్ముష్టిభిః ప్రహృత్యేదం యుద్ధం ప్రవృత్తమ్)

825. ఓర్గుణః. 6-4-146. ఓః. గుణః। (భస్య, తద్ధితే)

ఉవర్ణాన్తస్య భస్య గుణస్స్యాత్తద్ధితే। అవాదేశః బాహవః బాహవి। ఓరోఽతిత క్తవ్యే గుణో క్షిస్సంజ్ఞాపూర్వకో విధి

రనిత్య ఇతి జ్ఞాపయితుమ్। తేన స్వాయంభువమిత్యాది సిద్ధమ్। సరూపే ఇతి కిమ్। హలేన ముసలేన॥

852. ఉపకారమంతమందుగలిగి భసంజ్ఞకమగు పదమునకు తద్ధిత ప్రత్యయముపరమగునపుడు గుణమాదేశమగును. బాహూబాహవి. (బాహౌ చ బాహౌ చ గృహీత్వేదం యుద్ధం ప్రవృత్తమ్) బాహూశబ్దములకు "తత్రతేనేదమ్" సూ.చే సమాసము. సుబ్లుక్కు. ఇచ్ప్రత్యయము. పూర్వసూత్రముచే పూర్వపదమునకు దీర్ఘము. ఇచ్ప్రత్యయము తద్ధితమగుటవలననది పరమగునపుడీసూత్రముచేనుకారమునకు గుణము. అవాదేశము. అవ్యయమగుటచే విశిష్టముకంటెనుత్పన్నమగు సుప్పునకు లుక్కగును. ఒకరిచేతినొకరు పట్టుకొనియుండు మనుజులకు జరిగిన యుద్ధమనియర్థము. ఆ సప్తమ్యంతమువలననుకారమునకు గుణమోకారమే యగును గావున "ఓరోత్" అనుసూత్రమును రచించిననుకారమునకోకారమాదేశమగునను నర్థము లభించును. అయినను సంజ్ఞాపూర్వకమగు విధానమనిత్యమను సర్థమును జ్ఞాపనముచేయుటకు గుణపదముపాత్తమైనది. కావున స్వాయంభువమ్ ఇత్యాదిరూపములు సాధువులగును. స్వయంభువ ఇదమ్ అనునర్థమున "తస్యేదమ్" (4-3-120) అను సూ. చే స్వయంభూశబ్దముకంటె నణ్ప్రత్యయము. ఆదివృద్ధి. స్వాయమ్భూ+అ అనియుండగనీసూత్రముచే గుణముప్రాప్తమగుచున్నది. కాని గుణః అను సంజ్ఞాస్వరూపముతో నీసూత్రముచే గుణాదేశము విహితమగుటవలన నీసూత్రము సంజ్ఞాపూర్వకమగు విధియగును. అందుచే నీసూత్రమనిత్యమగుటవలన నీస్థలమందు ప్రవర్తించదు. ఉవఙాదేశమగును. "స్వాయమ్భువమ్ అనునది సాధువగును. హలేన ముసలేన। ఇవి తృతీయాన్తములైనను సమానానుపూర్వీగలవి గానందున "తత్ర తేనేదమ్" సూ. చే సమాసము ప్రవర్తింపదు. ఈసూత్రమున సరూపే అనుపదములేకున్న నిట్టిస్థలములందును సమాసము ప్రసక్తమగును.

వివ :— ఓః అనునది ఉశబ్దమునకు షష్ఠ్యేకవచనాన్తము. భస్య అనుదానికిదివిశేషణము. తదన్తవిధి. గుణః వృద్ధిః మొదలగు సంజ్ఞా స్వరూపములతోనాదేశములను విధించుసూత్రములు సంజ్ఞాపూర్వకములగు విధులగును. అనిత్యత్వము వలనసార్వత్రికత్వము (ఎల్లచోటుల ప్రవర్తింపకుండుట) ఫలితమగును. ఈపరిభాష భాష్యమునసగపడదు. కాన స్వయంభువ ఇదమ్ అనునర్థమున స్వాయంభువమ్ అనురూపము సాధువు గాదు. భాష్యకారునిచేనవిధానితప్రయోజనముగల పదములకు (గుణః మొ) పాణినిమహామునియందదృష్టార్థత్వము చెప్పబడుటవలననీసూత్రమున గుణపదమునకునదృష్టార్థత్వమును చెప్పుటయే యుచితమని నాగేశాదుల యాశయము.

853. తేన సహేతి తుల్యయోగే. 1-2-28. తేన, సహ, ఇతి, తుల్యయోగే। (సమాసః, బహువ్రీహిః)

తుల్యయోగే ప్రథమాసం సహేత్యేతత్తృతీయాన్తేన ప్రాగ్వత్॥

853. గమనాదిరూపమగునొక క్రియతో సంబంధమును ద్యోతనజేయు సహ అనునది తృతీయావిభక్త్యన్తముతో సమసించునది బహువ్రీహిసంజ్ఞక మగును.

వివ :— తేన అను పదమువలన తృతీయాన్తమనునర్థము లభించును. తుల్య యోగే అనుచోట తుల్యేన యోగః తస్మిన్ అని విగ్రహము, ఏకకాలికమగు గమ నాదిక్రియతో యోగమందనునర్థము లభించును.

854. వోపసర్జనస్య. 6-3-82. వా, ఉపసర్జనస్య। (ఉత్తరపదే, సహస్య, సః)

బహువ్రీహ్యవయవస్య సహస్య సస్స్యాద్వా। పుత్రేణ సహ సపుత్రః, సహపుత్రో వా ఆగతః పితా। తుల్యయోగ వచనం ప్రాయికమ్। సకర్మకః। సలోమకః॥

854. బహువ్రీహికవయవమగు సహ అనుదానికి వికల్పముగ సకారాదేశ మగును. సపుత్రః పుత్రేణ సహాగతః పితా అనునర్థమున సమకాలికమగునాగమన క్రియాయోగమును సహ అనునది ద్యోతనచేయుచున్నది గానసదానికి పుత్రేణ అను తృతీయాన్తముతో "తేనసహేతి" అను సూ. చే సమాసమగును. సుబ్లుక్కు, ఈ సూత్రముచే సభావము. సభావము ప్రవర్తింపనపుడు సహపుత్రః అనియగును. పుత్రునితో గలిసి వచ్చినవాడని యర్థము. తండ్రికొడుకులయాగమనమేకకాలికము. సహ అనునది సమకాలికక్రియాసంబంధద్యోతకము. "తేనసహేతి" సూత్రమున తుల్యయోగవచనము ప్రాయికము. కావున కొన్నిచోటులందు తుల్యయోగద్యోత కముగానట్టి సహ అనునదియు తృతీయాన్తముతో సమసించుట సిద్ధించును. సకర్మకః। కర్మణా సహ (కర్మగలదని యర్థము) అని విగ్రహము. ఇచట సహ అనునది విద్యమానార్థద్యోతకము. తుల్యయోగవచనము ప్రాయికముగావిచో నిచట పూర్వ సూత్రముచే సమాసము ప్రవర్తింపకుండును. ఇట్లే సలోమకః అనురూపము నూహించవలయును. ఇచటను సహ అనునది విద్యమానార్థద్యోతకమే.

వివ :— ఉత్తరపదాధికారమువలన సమాసమాక్షిప్తమగును. ఉపసర్జనమ్ అనునది దానికి విశేషణము. ఉపసర్జనస్య అనుచోట షష్ఠ్యవయవార్థకము. ఉప సర్జనసర్వావయవకసమాసమనునర్థము లభించును. ఈరీతిగ బహువ్రీహ్యవయ వస్య అనుమూలోక్తార్థము ఫలించును. "విభాషాసపూర్వస్య" (484) అనుచోట సపూర్వస్య అనుసూత్రకారనిర్దేశము తుల్యయోగవచనము ప్రాయికమనుటలో జ్ఞాపకము. కాకున్నచట సహ అనునది తుల్యయోగద్యోతకము కాదుగాన

సమాసస్వభావములు ప్రవర్తించవు. సపూర్వస్య అనుప్రయోగమసాధువు గావలయును.

855. ప్రకృత్యాఽఽశిషి. 6-3-83. ప్రకృత్యా, ఆశిషి। (సహస్య)

సహశబ్దః ప్రకృత్యా స్యాదాశిషి। స్వస్తి రాజ్ఞే సహపుత్రాయ సహామాత్యాయ। (వా) అగోవత్సహలేష్వితి వాచ్యమ్। సగవే। సవత్సాయ। సహలాయ॥

855. ఆశీర్వాదమున సహశబ్దము సాదేశమును పొందక స్వరూపముతో నుండును. (స్వస్తిరాజ్ఞే) సహపుత్రాయ। "తేనసహేతి" సూ. చే సమాసము. ఆశీర్వాదమిచట గమ్యమానమగుచున్నందున సహశబ్దమునకు "వోపసర్జనస్య" సూ. చే విహితమగు సభావము నివర్తించును. ఇట్లే సహామాత్యాయ అనుస్థలమున ఆశీర్వాదముప్రతీతమగుటచే సమాసాన్తస్వరము సభావము రాదని గ్రహించునది.

(వా) గోశబ్దవత్సశబ్దహలశబ్దములకంటె భిన్నమగు శబ్దము పరమగునపుడు సహశబ్దమునకు ప్రకృతిభావమగునని చెప్పవలయును. గోవత్సహలశబ్దములు పరములగునపుడాశీర్వాదమున్నప్పటికిని సహశబ్దమునకు ప్రకృతిభావము ప్రవర్తించదని యాశయము. సగవే। ఇచట స్వస్తిరాజ్ఞే అనువాక్యమునధ్యాహారమును చేసికొనవలయును. ఆశీర్వాదము గమ్యమానమగుచున్నను ఈవార్తికముచే సహశబ్దమునకు ప్రకృతిభావము నిషేధింపబడినందున సభావము ప్రవర్తించినది. ఇట్లే సవత్సాయ సహలాయ అనుస్థలములందును ప్రకృతిభావము ప్రవర్తించదు.

వివ :—అనువృత్తమగు సహస్య అనునది ప్రథమాన్తముగ విపరిణామమును పొందును. ఆశీర్వాదమున ప్రకృతిభావము నిత్యము గాన "సపుత్రస్య యజమానస్యైశ్వర్యాభివృద్ధిరస్తు మొదలగు ప్రయోగములు సాధువులు గావని యెఱుంగునది.

అవ :— ఇక బహువ్రీహిమాత్రమందు ప్రవర్తించెడిసమాసాన్తములను విధించుసూత్రములు వివరింపబడును.

856. బహువ్రీహౌ సంఖ్యేయే డజబహుగణాత్. 5-4-73. బహువ్రీహౌ, సంఖ్యేయే, డచ్, అబహుగణాత్॥

సంఖ్యేయే యోబహువ్రీహిస్తస్మాడ్డచ్ స్యాత్। ఉపదశాః। బహుగణాత్కిమ్। ఉపబహవః। ఉపగణాః। అత్ర స్వరే విశేషః। (వా) సంఖ్యాయాస్తత్పురుషస్య వాచ్యః। నిర్గతాని త్రింశతో నిస్త్రింశాని వర్షాణి చైత్రస్య। నిర్గతస్త్రింశతోఙ్గులిభ్యో నిస్త్రింశః ఖడ్గః॥

856. సంఖ్యేయార్థకమగు సంఖ్యావాచకముతో "సంఖ్యయాఽవ్యయా సన్నా" (847) అను సూ. చే విధింపబడు బహుౡ్రీహికంటె డచ్ప్రత్యయ మగును. బహుశబ్దాన్తము గణశబ్దాన్తమునగు బహువ్రీహికంటె డచ్ప్రత్యయము రాదు. ఉపదశాః (దశానాం సమీపే యే సన్తి) "సంఖ్యయా" అను సూ. చే సమాసము. ఉపబహవః। (బహూనాం సమీపే యే సన్తి) "బహుగణవతు" (259) అను సూ. చే బహుశబ్దమునకు సంఖ్యాసంజ్ఞయున్నందున "సంఖ్యయా" అను సూ. చే సమాసమగును. "అబహుగణాత్" అనునిషేధమువలననిచట డచ్ ప్రత్యయము రాదు. ఉపగణాః। (గణానాం సమీపే యే సన్తి) పైస్థలమందువలె నిచటను సమాసాదిప్రక్రియనెరుగవలయును. అబహుగణాత్ అనునిషేధమువలన డచ్ప్రత్యయమురాదు. ఇచట డచ్ప్రత్యయము ప్రవర్తించినను లేకున్నను గణ శబ్దముగాన్తమగుటవలననుపగణాః అనురూపమే యగును. అయినను డచ్ప్రత్య యము ప్రవర్తించినచో సమాసమునకు "చితః" అను సూ. చే అన్తోదాత్త స్వరము ప్రసక్తమయ్యెడిని. లేనపుడిష్టమగు పూర్వపదప్రకృతిస్వరము సిద్ధ మగును.

(వా) సంఖ్యావాచకమంతమందుగల తత్పురుషమునకు డచ్ప్రత్యయమును చెప్పవలయును. నిస్త్రింశాని. (వర్షాణి చైత్రస్య) నిర్గతాని త్రింశతః అనువిగ్రహ మున "నిరాదయః క్రాన్తాద్యర్థే" అను వార్తికముచే సమాసము. డచ్ప్రత్యయము. "టేః" సూ. చే టిలోపము. ముప్పదికంటె నధికమైనవని యర్థము. నిస్త్రింశః (నిర్గతస్త్రింశతః అంగులిభ్యః) ఖడ్గము. ఇచటను "నిరాదయః" ఇత్యాదివార్తిక ముచే సమాసాదిప్రక్రియనెరుగవలయును. ముప్పదియంగుళములకంటెనధికమగు పొడవు గలదని యర్థము.

857. బహువ్రీహౌ సక్థ్యక్ష్ణోః స్వాఙ్గాత్ షచ్. 5-4-113.
బహువ్రీహౌ : సక్థ్యక్ష్ణోః, స్వాఙ్గాత్, షచ్॥

వ్యత్యయేన షష్ఠీ। స్వాఙ్గవాచిసక్థ్యక్ష్యన్తాద్బహువ్రీహేః షచ్ స్యాత్। దీర్ఘే సక్థినీ యస్య స దీర్ఘసక్థః। జలజాక్షీ। స్వాఙ్గాత్ కిమ్। దీర్ఘసక్థి శకటమ్। స్థూలాక్షా వేణుయష్టిః॥ అక్ష్ణోఽదర్శనాదిత్యచ్॥

857. సూత్రమున సక్థ్యక్ష్ణోః అనుచోట షష్ఠి పంచమీవిభక్త్యర్థకము. ఇట్లే బహువ్రీహౌ అనుచోట సప్తమియు వ్యత్యయముచే పంచమ్యర్థకము. "సక్థ్యక్ష్ణోః" అనునది బహువ్రీహికి విశేషణమగుటచే తదన్తవిధి గల్గును. "అద్రవం మూర్తి మత్" ఇత్యాదిలక్షణలక్షితమగునది యిచట స్వాఙ్గశబ్దమునకర్థము. స్వాంగవాచకము లగు సక్థ్యక్షిశబ్దములంతమందుగల బహువ్రీహికంటె షచ్ప్రత్యయము. సమాసాన్త మగును. దీర్ఘసక్థః। (దీర్ఘే సక్థినీ యస్య) షచ్ప్రత్యయము. "యస్యేతి చ" సూ. చే ఇకారలోపము. పొడవైన తొడలుగలవాడని యర్థము. జలజాక్షీ. (జలజే

ఇవ అక్షిణీ యస్యాః) షచ్ప్రత్యయము. "యస్యేతిచ" సూ.చే నికారలోపము. జలజాక్షీ అనియగును. షచ్ప్రత్యయము షిత్తగుటచే "షిద్గౌరాదిభ్యశ్చ" (501) సూ. చే ఙీష్ప్రత్యయము. షచ్ప్రత్యయమున షిత్త్వమునకిదియే ఫలమని గ్రహింపదగును. పద్మములవంటికన్నులుగలదని యర్థము.

దీర్ఘసక్థి (దీర్ఘే సక్థినీ యస్య తత్) శకటము. ఇచటిసక్థిశబ్దము శకటావయవమును బోధించుటచే "అద్రవంమూర్తిమత్స్వాఙ్గమ్" అనులక్షణముచే నిచటసక్థిస్వాంగముకాదు గాననీసూత్రముచే షచ్ప్రత్యయమురాదు. సూత్రమున "స్వాఙ్గాత్" అనుపదము లేనిచోనిచట షచ్ప్రత్యయము ప్రసక్తమగును. స్థూలాక్షా (స్థూలాని అక్షీణి = పర్వాఙ్కురాణి యస్యాః) వెదురుకఱ్ఱ. ఇచటనక్షిశబ్దమునకు పర్వలందు (కణుపులు)ఉండు రంధ్రమువంటి భాగమని యర్థము. ఇచటనక్షిశబ్దము స్వాంగవాచకము గాదు. స్వాఙ్గాత్తనుపదములేనిచోనిచట షచ్ప్రత్యయము ప్రసక్తమగును. స్థూలాక్షిశబ్దముకంటె "అక్ష్ణోఽదర్శనాత్" (849) సూ. చే నచ్ప్రత్యయమగును. (సమాసాన్తము) ఇకారలోపము. అకారాన్తమగుటచే టాప్ప్రత్యయము. షచ్ప్రత్యయము ప్రవర్తించినచో ఙీష్ప్రత్యయము ప్రసక్తమగునని గ్రహించునది.

858. అఙ్గులేర్దారుణి. 5-4-114. అఙ్గులేః, దారుణి. బహువ్రీహౌ, షచ్)

అఙ్గుల్యన్తాద్బహువ్రీహేః షచ్ స్యాద్దారుణ్యర్థే। పఞ్చ అఙ్గులయో యస్య తత్పఞ్చాఙ్గులం దారు। అఙ్గులిసదృశావయవం ధాన్యాదివిక్షేపణకాష్ఠముచ్యతే। బహువ్రీహేః కిమ్। ద్వే అఙ్గులీ ప్రమాణమస్యాః ద్వ్యఙ్గులా యష్టిః। తద్ధితార్థే తత్పురుషే తత్పురుషస్యాఙ్గులేరిత్యచ్। దారుణికిమ్। పఞ్చాఙ్గులిర్హస్తః॥

858. బహువ్రీహౌ అనునది పంచమ్యన్తముగమారును. దారువు సమాసార్థమగునపుడు అఙ్గులిశబ్దమంతమందుగల బహువ్రీహికంటె షచ్ప్రత్యయమగును. పఞ్చాఙ్గులమ్ (పఞ్చ అఙ్గులయో యస్య తత్) షచ్ప్రత్యయము. "యస్యేతిచ" సూ. చే వికారలోపము. వ్రేళ్ళతోసదృశములగునవయవములనుగలిగి కళ్లములో నుండు ధాన్యాదులనాకర్షించు కఱ్ఱయని యర్థము. ఇట్టియర్థమాశబ్దమునకు లక్షణచే గల్గును.

ద్వ్యఙ్గులా (ద్వే అఙ్గులీ ప్రమాణమస్యాః) యష్టిఅనియర్థము. "తద్ధితార్థోత్తరపద" సూ. చే తద్ధితార్థమందు తత్పురుషము. బహువ్రీహిగావందునవిచట షచ్ప్రత్యయము రాదు. "తత్పురుషస్యాఙ్గులేస్సంఖ్యావ్యయాదేః" సూ. చే అచ్ప్రత్యయమగును. ద్వ్యఙ్గులా అనియగును. రెండంగుళములపొడవుగల కఱ్ఱయని యర్థము. షచ్ప్రత్యయమైనచో ఙీషు ప్రసక్తమగును. పఞ్చాఙ్గులిః

(పఞ్చాఙ్గులయో యస్య) అయిదు వ్రేళ్లుగల హస్తమని యర్థము. సమాసార్థము దారువు గాకపోవుటచే షచ్ప్రత్యయనివృత్తమగును.

859. ద్విత్రిభ్యాం ష మూర్ధ్నః. 5-4-115. ద్విత్రిభ్యామ్, ష, మూర్ధ్నః। (బహువ్రీహౌ)

ఆభ్యాం మూర్ధ్నః షః స్యాద్బహువ్రీహౌ। ద్విమూర్ధః। త్రిమూర్ధః। (వా) నేతుర్నక్షత్రే అబ్వక్తవ్యః। మృగో నేతా యాసాం తాః మృగనేత్రా రాత్రయః। పుష్యనేత్రాః॥

859. ష అనునది లుప్తప్రథమాన్తము. ద్విత్రిశబ్దములకంటె పరమగు మూర్ధన్శబ్దము త్తరపదముగగల బహువ్రీహిసమాసమునకు ష ప్రత్యయమగును. ద్విమూర్ధః। (ద్వౌ మూర్ధానౌ) షప్రత్యయము. "నస్తద్ధితే" (683) సూ. చే టిలోపము. త్రిమూర్ధః। (త్రయో మూర్ధానో యస్య) షప్రత్యయము. టిలోపము.

(వా) నక్షత్రబోధకనేతృశబ్దమంతమందుగల బహువ్రీహికంటె అప్ ప్రత్యయమును చెప్పవలెను. మృగనేత్రాః (మృగో నేతా యాసాం తాః) రాత్రులు. మృగనేతృశబ్దమునకంటెనీవార్తికముచేనప్ప్రత్యయము. యణాదేశము. స్త్రీలింగమగుటవలన టాప్ప్రత్యయమగును. మృగశబ్దమునకు మృగశీర్షానక్షత్ర మర్థము. నేతృశబ్దమునకు నాయకుడని యర్థము. రాత్రికినాయకుడు చంద్రుడైనను చంద్రయోగమువలన నక్షత్రమునకును నాయకత్వవ్యవహారము కలుగునని గ్రహించునది. మృగశీర్షానక్షత్రనాయకములగురాత్రులని యర్థము. ఇట్లే పుష్యనేత్రాః అనుచోట ప్రక్రియనూహించునది.

860. అన్తర్బహిర్భ్యాం చ లోమ్నః. 5-4-117. అన్తర్బహిర్భ్యామ్, చ. లోమ్నః। (అప్, బహువ్రీహౌ)

ఆభ్యాం లోమ్నోఽప్ స్యాద్బహువ్రీహౌ। అన్తర్లోమః। బహిర్లోమః॥

860. అన్తశ్శబ్దముకంటె బహిశ్శబ్దముకంటెను పరమగు లోమన్శబ్దము త్తరపదముగాగల బహువ్రీహికంటె అప్ప్రత్యయమగును. అన్తర్లోమః (అన్తః లోమాని యస్య) అప్ప్రత్యయము. "నస్తద్ధితే" సూ. చే టిలోపము. బహిర్లోమః అనురూపమునిట్లే॥

861. అచ్ నాసికాయాః సంజ్ఞాయాం నసం చాస్థూలాత్. 5-4-118. అచ్, నాసికాయాః, సంజ్ఞాయామ్, నసమ్, చ, అస్థూలాత్। (బహువ్రీహౌ)

నాసికాన్తాద్బహువ్రీహేరచ్ స్యాత్ నాసికాశబ్దశ్చ నసం ప్రాప్నోతి. న తు స్థూలపూర్వాత్॥

861 సంజ్ఞయందు నాసికాశబ్దమంతమందుగల బహువ్రీహికంటె నచ్ ప్రత్యయమగును, నాసికాశబ్దమునకు నస్ అనునాదేశమగును, నాసికాశబ్దము స్థూల శబ్దముకంటె పరమగునపుడీసూత్రము ప్రవర్తించదు.

వివ :— నాసికాయాః అనునది బహువ్రీహౌ అనుదానికి విశేషణమగుటచే తదన్తవిధి గలుగును. నసమ్ అనుపదముతరువాత ప్రాప్నోతిఅనుక్రియనధ్యాహారము చేయవలయును. ఉపస్థితిమగుటవలన నాసికాశబ్దమే నసాదేశమును పొందునని గ్రహించవలయును.

862. పూర్వపదాత్సంజ్ఞాయామగః. 8-4-3. పూర్వపదాత్, సంజ్ఞాయామ్, అగః। (రషాభ్యామ్, నః, ణః)

పూర్వపదస్థాన్నిమిత్తాత్పరస్య నస్య ణః స్యాత్ సంజ్ఞాయాం న తు గకారవ్యవధానే। ద్రురివ నాసికా అస్య ద్రుణసః। ఖరణసః। అగః కిమ్। ఋచామయనం ఋగయనమ్। అణృగయనాదిభ్య ఇతి నిపాతనాణ్ణత్వాఽభావమాశ్రిత్య అగ ఇతి ప్రత్యాఖ్యాతం భాష్యే। అస్థూలాత్ కిమ్। స్థూలనాసికః। (వా) ఖురఖరాభ్యాం వా నస్। ఖురణాః। ఖరణాః। (వా) పక్షేఽచ్ప్రత్యయసిష్యతే। ఖురణసః। ఖరణసః॥

862. "రషాభ్యామ్" (236) అను సూత్రమున సమానపదే అని యుండుటవలన సమాసమందు ణత్వము ప్రాప్తమగుచుండ నీసూత్రముచే ణత్వము విధింపబడెను. పూర్వపదశబ్దము లక్షణచే పూర్వపదస్థమును బోధించును. రషాభ్యామ్ అను పది పూర్వపదాత్తనుదానితో నన్వయించును. అగః అనునది పంచమ్యన్తము. పూర్వపదమందుండు రేఫషకారములకంటె పరమగు నకారమునకు సంజ్ఞయందు ణకారమగును గకారముతో వ్యవధానమున్నపుడు ణత్వము రాదు. ద్రుణసః (ద్రురివ నాసికా అస్య) "అఙ్ నాసికాయాః" సూ. చే నచ్ప్రత్యయము నాసికాశబ్దమునకు నసాదేశమగును. ద్రునస అని యుండ నీసూత్రముచే ణత్వము. ఖరణసః (ఖరరూపా నాసికా యస్య) అచ్ప్రత్యయము నసాదేశ ణత్వములు ఈ రెండును సంజ్ఞావాచకములు.

ఋగయనమ్ (ఋచామయనమ్) "ఋవర్ణాన్నస్య ణత్వంవాచ్యమ్" అను వార్తికముగూడ నీసూత్రములోనికనువృత్తమగును గాననిచట పూర్వపదస్థమగు ఋకారముకంటె పరమగు నకారమునకును ణత్వము ప్రాప్తమగుచున్నది. కాని గకారముతో వ్యవధానమున్నందున ణత్వము రాదు. అగః అనునది లేనిచో నిచట ణత్వము ప్రసక్తమగును. "అణృగయనాదిభ్యః" (4-3-73) అను పాణినినిర్దేశము వలన ఋగయనమ్ మొదలగు రూపములందు ణత్వము రాకుండుట సిద్ధించునని చెప్పి భాష్యకారుడీసూత్రమున అగః అనుపదమును ప్రత్యాఖ్యానముచేసెను. స్థూలనాసికః (స్థూలానాసికా యస్య) "అఙ్ నాసికాయాః" సూత్రమున అస్థూలాత్

అనునది లేనిచో నీస్థలమందచ్ప్రత్యయనసాదేశములు ప్రసక్తములగును. (వా) ఖుర ఖరశబ్దములకంటె పరమగు నాసికాశబ్దమునకు సంజ్ఞయందు బహువ్రీహిసమాసమున వికల్పముగ నసాదేశమును చెప్పవలయును. వార్త్తికముచే కేవలనసాదేశ విధానము అచ్ప్రత్యయనివృత్తికొఱకగునని తెలియునది. ఉదా:—ఖురణాః (ఖురా ఇవ నాసికే యస్య) వసాదేశము. "పూర్వపదాత్" సూ. చే ణత్వము. "అత్వస న్తస్య" (428) సూ. చే దీర్ఘము. రుత్వవిసర్గములు. ఖరణాః అనుచోట ప్రక్రియయునిట్లే. (వా) కేవలనసాదేశము రావిపక్షమందచ్ప్రత్యయముతో గూడిన నసాదేశము వచ్చుట యిష్టము. అపిశబ్దమువలన నసాదేశము గ్రహింపబడును. ఈవార్త్తికముచే ఖురణసః ఖరణసః అనురూపములగును. ఈవార్త్తికములేకున్న పూర్వవార్త్తికము వికల్పము గావుననసాదేశము రానపుడు ఖురనాసికః ఖరనాసికః అనురూపములు గావలయును.

863. ఉపసర్గాచ్చ. 5-4-119. ఉపసర్గాత్, చ। (అచ్, నాసికాయాః, నసమ్, చ)

ప్రాదేర్యో నాసికాశబ్దస్తదన్తాద్బహువ్రీహేరచ్ నాసికాయా నసాదేశశ్చ। అసంజ్ఞార్థమిదం వచనమ్। ఉన్నతా। నాసికా యస్య సః ఉన్నసః। ఉపసర్గాదనోత్పర ఇతిసూత్రమ్। తద్భఙ్క్త్వా భాష్యకార ఆహ॥

863. నాసికాశబ్దము క్రియావాచకముగానందుననిచటి యుపసర్గగ్రహణము ప్రాదులకుపలక్షణము. ప్రాదులకంటె పరమగు నాసికాశబ్దమన్తమందుగల బహువ్రీహికంటె అచ్ప్రత్యయము నాసికాశబ్దమునకు నసాదేశమునగును. ఈసూత్రము సంజ్ఞకానపుడు ప్రవర్త్తించుటకారంభింపబడెను. ఉన్నసః (ఉన్నతా నాసికా యస్య) ఉత్తనునుపసర్గముకంటె పరమగు నాసికాశబ్దమంతమందుగల బహువ్రీహి యగుటచే నీసూత్రమువలన నచ్ప్రత్యయము నసాదేశమునగును. ఎత్తైనముక్కుగలవాడనియర్థము.

"ఉపసర్గాదనోత్పరః" అనుసూత్రము పాణినిచే పఠింపబడెను. భాష్యకారుడు సూత్రముననుండు "అనోత్పరః" అనుదానిని తీసివేసి తత్స్థానమున బహుళగ్రహణమునుజేర్చి యీదిగువచూపబడిన ప్రకారమాసూత్రమును పఠించెను:—

864. ఉపసర్గాద్బహులమ్. 8-4-28. ఉపసర్గాత్, బహులమ్। (రషాభ్యామ్, నః, ణః, నసో")

ఉపసర్గస్థాన్నిమిత్తాత్పరస్య నసో నస్య ణః స్యాద్బహులమ్। ప్రణసః। (వా) వేర్గ్రోవక్తవ్యః। విగతా నాసికా యస్య విగ్రః। (వా) ఖ్యశ్చ। విఖ్యః। కథం తర్హి వినసా

హతబాంధవేతి భట్టిః। విగతయా నాసికయోపలక్షితేతి
వ్యాఖ్యేయమ్॥

864. ఇచటనుపసర్గగ్రహణము ప్రాదులకుపలక్షణము. అనువృత్తమగు నస్ అనునది లుప్తషష్ఠ్యన్తము. ఉపసర్గయందుండు రేఫషకారములకంటెపరమగు నసాదేశముయొక్క నకారమునకు ణకారము బహుళముగ వచ్చును. ప్రణసః (ప్రగతా నాసికా యస్య) "ఉపసర్గాచ్చ" సూ. చే నచ్ప్రత్యయనసాదేశములు. ఈసూత్రముచే ణత్వము. (వా) వి అనునుపసర్గముకంటె పరమగు నాసికాశబ్దమునకు గ్ర అనునాదేశమును చెప్పవలయును. విగ్రః (విగతా నాసికా యస్య) ఈవార్తికముచే నాసికాశబ్దమునకు గ్రాదేశము. ముక్కులేనివాడని యర్థము. (వా) వి అనునుపసర్గముకంటె పరమగు నాసికాశబ్దమునకు ఖ్య అనునాదేశమును గూడ చెప్పవలయును. విఖ్యః (విగతా నాసికా యస్య) ఖ్యాదేశము.

"వినసాహతబాంధవా" అని భట్టికవి ప్రయోగించెను. విగతా నాసికా యస్యాః అనువిగ్రహమున సమాసానంతరము అచ్ప్రత్యయనసాదేశములను బాధించి "వేర్గ్రోవక్తవ్యః ఖ్యశ్చ" అనువార్తికములచే గ్రాదేశముగాని ఖ్యాదేశముగాని ప్రవర్తించును గాన విగ్రా అనిగాని విఖ్యా అనిగాని ప్రయోగింపవలసియుండ వినసా అనునసాదేశటాప్ప్రత్యయములతోగూడిన ప్రయోగమెట్లు సాధువగునని శంక కలుగును. భట్టిగ్రంథమునకీవిధముగ వ్యాఖ్యానము చేయవలయును:— "విగతా నాసికా" అనువిగ్రహమున "ప్రాదయోగతాద్యర్థే" అనువార్తికముచే సమాసమును చేసిన వినాసికా అనియగును. పోయినముక్కని యర్థము. బహువ్రీహి గానందున నాసికాశబ్దమునకు గ్రాదేశఖ్యాదేశములు రావు. టాప్ప్రత్యయము. వినాసికాశబ్దమునకు తృతీయైకవచనము పరమగునపుడు "పద్దన్నోమాస్" (228) సూ. చే నసాదేశమగుటచే వినసా అనియగును. ఉపలక్షితా అనుపదమున కధ్యాహారమును చేయవలయును. ఇట్లు వినసా అనుపదమునకు "పోయిన ముక్కుతోకూడుకొనినదనునర్థమును చెప్పవలయును" అని. ఇట్లు భట్టిప్రయోగముసాధువగును. "కథంతర్హి.........వ్యాఖ్యేయమ్" అను శంకాసమాధానగ్రంథములకాశయమిదియే.

విప:—"ఉపసర్గాదనోత్పరః" అనుసూత్రకారునిపాఠమునందు నస్ అనునదియు "రషాభ్యాంనోణః" అనునదియుననువృత్తములగునుగాన ఉపసర్గస్థనిమిత్తముకంటెపరమగు నసాదేశముయొక్క నకారమునకు ణత్వమగును ఓకారపరకమగు నకారమునకు ణత్వము రాదని యర్థము. "ప్రణ ఆయూంషితారిషత్" మొదలగునవి యుదాహరణములు. "ప్రనో ముఞ్చతమ్" ఇత్యాదులందు ణత్వము రాకపోవుట అనోత్పరః అనుపదమునకు ఫలమగును. ఈపాఠమునంగీకరించి "ప్రణోనయ" ఇత్యాదులందవ్యాప్తియు "ప్రనఃపూషా" ఇత్యాదులందు వ్యాప్తియు కలుగుననునభిప్రాయముతో భాష్యకారుడు "అనోత్పరః" అనుదానిని తీసివేసి బహుళపదమునుచేర్చి "ఉపసర్గాద్బహులమ్" అని సూత్రమునుప[ఠి]ంచెను

బహుళగ్రహణమువలన పైని జూపబడిన అవ్యాప్త్యతివ్యాప్తిదోషములు వారితము లగును.

865. సుప్రాతసుశ్వసుదివశారికుక్షచతురశ్రైణీపదాజపద ప్రోష్ఠపదాః. 5-4-120. సుప్రాత.... ....ప్రోష్ఠపదాః॥

ఏతే బహువ్రీహావచ్ప్రత్యయాన్తా నిపాత్యన్తే। శోభనం ప్రాతరస్య సుప్రాతః। శోభనం శ్వోఽస్య సుశ్వః। శోభనం దివాఽస్య సుదివః। శారేరివ కుక్షిరస్య శారికుక్షః। చతస్రోఽశ్రయోఽస్య చతురశ్రః। ఏణ్యా ఇవ పాదావస్య ఏణీపదః। అజపదః। ప్రోష్ఠో గౌః తస్యేవ పాదావస్య ప్రోష్ఠపదః॥

865. సుప్రాత సుశ్వ సుదివ శారికుక్ష చతురశ్ర ఏణీపద అజపద ప్రోష్ఠపద ఈయెనిమిదిశబ్దములును బహువ్రీహిసమాసమున అచ్ప్రత్యయాన్తములుగ నిపతింపబడినవి. సుప్రాతః (శోభనం ప్రాతరస్య) ప్రాతశ్శబ్దమునకు ప్రాతఃకాలమునజేయు కర్మయర్థము. అచ్ప్రత్యయము. సుప్రాతర్ + అ అని యుండగ "అవ్యయానాం భమాత్రే టిలోపః" (అవ్యయములకు భసంజ్ఞయున్నపుడు టిలోపమగును.) అనువచనముచే టిలోపము. శోభనమగు ప్రాతఃకాలిక్రియ గలవాడని యర్థము. సుశ్వః (శోభనం శ్వోఽస్య) అచ్ప్రత్యయము. టిలోపము. శోభనమగు రేపటిదినము కలవాడని యర్థము. సుదివః (శోభనం దివాఽస్య) దివా అనునది అకారాన్తమగునవ్యయము. అచ్ప్రత్యయము. టిలోపము. శోభనమగు పగలుకలవాడు. శారికుక్షః (శారేరివ కుక్షిరస్య) అచ్ప్రత్యయము. "యస్యేతిచ" సూ. చే ఇకారలోపము. శారి యనెడు పక్షియొక్క కుక్షివంటి కుక్షిగలవాడు. చతురశ్రః (చతస్రోఽశ్రయోఽస్య) అచ్ప్రత్యయేకారలోపములు. నాలుగు అంచులు గలది. ఏణీపదః (ఏణ్యా ఇవ పాదావస్య) అచ్ప్రత్యయము. నిపాతనమువలన పాదశబ్దమునకు పద్భావము. ఆడులేడియొక్కపాదములవంటి పాదములు గలవాడు. అజపదః (అజస్యేవ పాదావస్య) అచ్ప్రత్యయము. పద్భావము. మేకయొక్క పాదములతో సదృశములగు పాదములుగలవాడు. ప్రోష్ఠపదః (ప్రోష్ఠస్యేవ పాదావస్య) ప్రోష్ఠమన గోవు. అచ్ప్రత్యయము. నిపాతనమువలన పద్భావము. గోవుయొక్క పాదములవంటి పాదములుగలవాడు.

866. నఞ్దుఃసుభ్యో హలిసక్థ్యోరన్యతరస్యామ్. 5-4-121. నఞ్దుఃసుభ్యః, హలిసక్థ్యోః, అన్యతరస్యామ్। (అచ్)

అచ్ స్యాత్। అహలః। అహలిః। అసక్థః। అసక్థిః। ఏవం దుఃసుభ్యామ్। శక్త్యోరితి పాఠాన్తరమ్। అశక్తః। అశక్తిః॥

866. నఞ్ దుర్ సు వీనికంటె పరములగు హలిసక్థిశబ్దములంతమందు గల బహువ్రీహికి వికల్పముగ అచ్ప్రత్యయమగును. అహలః. అహలిః। హలి శబ్దమికారాన్తము. (పెద్దనాగలి) అవిద్యమానః హలిః యస్య అనివిగ్రహము. అచ్ప్రత్యయము. "యస్యేతిచ" సూ. చే నికారలోపము. నాగలిలేనివాడని యర్థము. అచ్ప్రత్యయాభావపక్షమునందు అహలిః అనియగును, అసక్థః. అసక్థిః (అవిద్యమానం సక్థి యస్య) అచ్ ప్రత్యయేకారలోపములు. పిరుదులేనివాడని యర్థము. అచ్ప్రత్యయము రానపుడు అసక్థిః అనియగును. ఈప్రకారముగనే దుర్ సువీనికంటె పరములగు హలిసక్థిశబ్దములంతమందుగలబహువ్రీహియందును రూపములనూహింపవలయును. (దుర్హలః దుర్హలిః, దుఃసక్థః దుస్సక్థిః మొ॥)

సూత్రమున "హలిసక్థ్యోః" అనుచోట "హలిశక్త్యోః" అని మరియొక పాఠమున్నది. హలిశక్త్యోః అనురీతినిగూడ పాణినిచే కొంతమంది శిష్యులుపదే శింపబడిరని భావము. ఈపాఠమందు శక్తిశబ్దాన్తబహువ్రీహికిని వికల్పముగనచ్ ప్రత్యయము సిద్ధించును. ఉదా:—అశక్తః। అశక్తిః। (అవిద్యమానా శక్తిరస్య) అచ్ప్రత్యయేకారలోపములు. సామర్థ్యములేనివాడని యర్థము. అచ్ప్రత్యయాభావమందు అశక్తిః అనియగును. ఇట్లే దుశ్శక్తః దుశ్శక్తిః ఇత్యాదులనూహింప వలయును.

వివ:——హలహలిశబ్దములు రెండున్నందున వైకల్పికమగు నచ్ప్రత్యయ విధానములేకున్నను అహలః అహలిః అనురెండురూపములును సిద్ధించును. అయినను అచ్ప్రత్యయవిధానములేనపుడు అహలశబ్దము అను కనసమాసాన్త మగును గాన "శేషాద్విభాషా" (886) అను వక్ష్యమాణసూత్రముచే కప్ప్రత్య యము ప్రసక్తమగును. అట్టికప్ప్రత్యయమును వారించుటకై హలిశబ్దాన్తబహు వ్రీహికచ్ప్రత్యయము విధింపబడెను. అచ్ప్రత్యయము వైకల్పికమైనను అహలి శబ్దము కనసమాసాన్తమేయగును గాన కప్ప్రత్యయము వారితమగును. అందుచే సూత్రమందు హలిగ్రహణము వ్యర్థముగాదు.

867. నిత్యమసిచ్ ప్రజామేధయోః. 4-4-122. నిత్యమ్, అసిచ్, ప్రజామేధయోః। (నఞ్దుఃసుభ్యః)

నఞ్దుఃసుభ్య ఇత్యేవ। అప్రజాః। దుష్ప్రజాః। సుప్ర జాః। అమేధాః। దుర్మేధాః। సుమేధాః॥

867. బహువ్రీహియందు నఞ్ దుర్ సు వీనికంటెపరములగు ప్రజా మేధాశబ్దములకంటె నిత్యముగ అసిచ్ అనెడుసమాసాన్తప్రత్యయము వచ్చును. అసిచ్చునందికారచకారములిత్సంజ్ఞకములు. అస్ అనునది మిగులును. అప్రజాః (అవిద్యమానా ప్రజా యస్య) "నఞోస్త్యర్థానామ్" అనువార్తికముచే సమాసము. అసిచ్ప్రత్యయము. యస్యేతిచ" సూ. చే నాకారలోపము. అప్రజస్ అని

యగును. దీనికంటె సుప్రత్యయము పరముగునపుడు "అత్వసన్తస్య" (42౦) సూ. చే దీర్ఘ మగును. సులోపయత్వ విసర్గములు. దుష్ప్రజాః (దుర్గతా ప్రజా యస్య) "ప్రాదిభ్యోధాతుజస్య" అనువార్తికముచే సమాసము. అసిచ్ప్రత్య యము మొదలగు ప్రక్రియ ఉక్తోదాహరణమందువలె నూహించునది. "ఇదుదుప ధస్య" (256) సూ. చే షత్వము. సుప్రజాః అమేధాః దుర్మేధాః సుమేధాః ఈస్థలములందును ప్రక్రియనిట్లే యూహించునది.

వివ:—— సిచ్ప్రత్యయమున అకారము పూర్వమునకు భసంజ్ఞను సంపా దించుటకై చేయబడినది. కావున సుప్రజసౌ మొదలగురూపములందు "యస్యే తిచ" సూ. చే నాకారలోపము సిద్ధమగును. సిచ్చునువిధించినను ప్రథమైకవచన మున రూపభేదమగపడదు.

868. ధర్మాదనిచ్ కేవలాత్. 5 4-124. ధర్మాత్, అనిచ్, కేవలాత్, (బహువ్రీహౌ)

కేవలాత్పూర్వపదాత్పరో యోధర్మశబ్దస్తదన్తాద్బహు వ్రీహేరనిచ్ స్యాత్। కల్యాణధర్మా। కేవలాత్ కిమ్। పరమః స్వో ధర్మో యస్యేతి త్రిపదే బహువ్రీహౌ మా భూత్। స్వశబ్దోహిహ న కేవలం పూర్వపదం కిం తు మధ్య మత్వా దాపేక్షికమ్। సందిగ్ధసాధ్యధర్మేత్యాదౌ తు కర్మధారయ పూర్వపదో బహువ్రీహిః। ఏవం చ పరమస్వధర్మేత్యపి సాధ్వేవ, నివృత్తిధర్మా అనుచ్ఛిత్తిధర్మేత్యాదివత్। పూర్వ పదం తు బహువ్రీహిణాఽఽక్షిప్యతే॥

868. కేవలమగు పూర్వపదముకంటె పరమగు ధర్మశబ్దమంతమందు గల బహువ్రీహికంటె అనిచ్ అనుసమాసాన్తప్రత్యయమగును. అనిచ్చున ఇకార చకారములుచ్చారణార్థములు. కల్యాణధర్మా। కల్యాణః ధర్మోయస్య అనివిగ్ర హము. ఇచటనీసూత్రముచేననిచ్ప్రత్యయము. "యస్యేతిచ" సూ. చే అకార లోపము. కల్యాణధర్మన్ అనియగును. దీనికంటె సుప్రత్యయముచేయునపుడుపధా దీర్ఘ సులోపనలోపములగును.

కేవలాత్ కిమ్। బహువ్రీహిచే పూర్వపదముసకాక్షేపము గల్గును. పూర్వప దశబ్దము సమాసప్రథమావయవమందు రూఢము గాన త్రిపదబహువ్రీహియందు దోషములేదని ప్రశ్నాయము. పరమః స్వో ధర్మోయస్య అనువిగ్రహమున త్రిపద బహువ్రీహియందనిచ్ప్రత్యయమును వారించుటకై పూర్వపదమునకు కేవలాత్తనువి శేషణమావశ్యకము. ఇచట స్వశబ్దము ధర్మశబ్దమునకు పూర్వమందున్ననీసమాస మున మధ్యమపదమగుటచేనాపేక్షికమగు(ధర్మశబ్దమునుగురించి పూర్వమగునుగాన నాపేక్షికమనబడును)పూర్వపదమగునుగాని సమాసపూర్వావయవము కానేరదు. కేవ లాత్తనువిశేషణములేనిచోపూర్వపదమెట్టిదైనను ధర్మశబ్దాన్తబహువ్రీహికంటెనని

ప్రత్యయమగుననుర్థమగునుగాన త్రిపదబహువ్రీహియందుననిచ్ ప్రత్యయము ప్రసక్తమగును. ఇచట పూర్వపదశబ్దము సమాసప్రథమావయవమందు రూఢ మనుటలో ప్రమాణము లేదని యుత్తరాశయము.

"సన్దిగ్ధసాధ్యధర్మా" మొదలగుప్రయోగములగపడుచున్నవి. త్రిపద బహువ్రీహియందు పైనిచూపబడినవిధమున కేవలాత్ అనువిశేషణమువలననిచ్ ప్రత్యయము ప్రవర్తించదు గాననిట్టిరూపములెట్లు సాధువులగునను శంకగల్గును. ఇట్లు సమాధానమును చెప్పవలయును :— సందిగ్ధసాధ్యధర్మాఅనునది త్రిపద బహువ్రీహియవిన ఆనిచ్ప్రత్యయము ప్రవర్తింపవీలులేకున్ననచట కర్మధారయ సమాసము పూర్వపదముగగల బహువ్రీహినంగీకరించిన ననిచ్ప్రత్యయము నిశ్శంకముగనగును. సందిగ్ధశ్చాసౌసాధ్యశ్చ అనువిగ్రహమున సందిగ్ధసాధ్యశబ్దములకు ప్రథమమున కర్మధారయమును చేసినపిదప సందిగ్ధసాధ్యపదమునకు ధర్మశబ్దముతో బహువ్రీహినిచేసినచో సందిగ్ధసాధ్యశబ్దము కేవలపూర్వపదమగును గానదానికంటె పరమగు ధర్మశబ్దమంతమునగల బహువ్రీహికి అనిచ్ప్రత్యయము సిద్ధమగును. సందిగ్ధసాధ్యధర్మా మొదలగురూపములు సాధువులగునని సందిగ్ధసాధ్యధర్మా మొదలగురూపములసాధుత్వముకొఱకు కర్మధారయగర్భమగు బహువ్రీహినంగీకరించునప్పుడీరీతినే పరమశ్చాసౌస్వశ్చ అనువిగ్రహమున పరమస్వశబ్దములకు మొదటకర్మధారయముచేసి పిదపపరమస్వో ధర్మో యస్య అనువిగ్రహమున బహువ్రీహినిచేసినచో పరమస్వశబ్దము కేవలపూర్వపదమగును గానదానికంటెపరమగు ధర్మశబ్దమంతమందుగల సమాసమునకనిచ్ప్రత్యయము సిద్ధించుటచే పరమస్వధర్మాఅనురూపముగూడ నివృత్తిధర్మా అనుచ్ఛిత్తిధర్మా మొదలగు రూపములవలె సాధువే యగును. బహువ్రీహిచే పూర్వపదమాక్షేపింపబడును. (సమాసమున నవశ్యముగ పూర్వోత్తరపదములుండును గనుకబహువ్రీహిపదముచే పూర్వపదమాక్షేపింపబడును.) అందుచే సూత్రమున శ్రుతముగానందున పూర్వసూత్రములనుండియనువృత్తిలేనందునను పూర్వపదార్తమునదెట్లు లభించినదని శంకింపవలనుపడదు.

వివ :— సజాతీయమగునది మరియొకటి లేకుండనుండునట్టిది కేవలమన బడును. కావున కేవలపూర్వపదమన మధ్యమపదముగాకుండునదనునర్థము ఫలించును. నిర్గతా వృత్తిః నివృత్తిః ప్రాదిసమాసము. పిదపనివృత్తిః ధర్మో యస్య అనువిగ్రహమున బహువ్రీహి. అనిచ్ప్రత్యయము. నివృత్తిధర్మా అనియగును. న ఉచ్ఛిత్తిః అనుచ్ఛిత్తిః నఞ్ సమాసము. పిదప బహువ్రీహి. అనిచ్ప్రత్యయము. అనుచ్ఛిత్తిధర్మా అనియగును. ఈ రెండుస్థలములందును తత్పురుషగర్భమగు బహువ్రీహినిచేసినందున నివృత్త్యనుచ్ఛిత్తిశబ్దములు కేవల పూర్వపదములగును గానననిచ్ప్రత్యయము సిద్ధించెను. ఇట్లే పరమస్వధర్మా అనుచోటను కర్మధారయ పూర్వపదకమగు బహువ్రీహినిచేసిననిచ్ప్రత్యయము సిద్ధించుటచే పరమస్వధర్మా అనురూపము సాధువగునని భావము.

869. జమ్బా సుహరితతృణసోమేభ్యః. 5-4-125. జమ్బా, సుహరితతృణసోమేభ్యః॥

జమ్బేతి కృతసమాసాన్తం నిపాత్యతే। జమ్భో భక్ష్యే దన్తే చ। శోభనో జమ్భోఽస్య సుజమ్భా। హరితజమ్భా। తృణం భక్ష్యం యస్య తృణమివ దన్తా యస్యేతి వా తృణజమ్భా। సోమజమ్భా। స్వాదిభ్యః కిమ్। పతితజమ్భః॥

869. సూత్రమున జమ్భా అనునదిచే యబడినసమాసాన్తప్రత్యయము (అనిచ్) గలదై నిపతింపబడినది. సు హరిత తృణ సోమ వీనికంటె పరమగు జమ్భశబ్దమంతమందుగల బహువ్రీహికంటెననిచ్ప్రత్యయమగునని సూత్రార్థము. జమ్భశబ్దమునకు భక్ష్యము (తినుబడిపదార్థము) లేక దంతమర్థము. సుజమ్భా (శోభనో జమ్భోఽస్య) సుజమ్భశబ్దముకంటె ననిచ్ప్రత్యయము. "యస్యేతిచ" సూ. చే నకారలోపము. సుజమ్భాఅను నకారాన్తశబ్దము సిద్ధించును. శోభనమగు భక్ష్యముగాని దంతముగాని గలవాడని యర్థము. హరితజమ్భా (హరితః జమ్భో యస్య) అనిచ్చు. తృణజమ్భా. భక్ష్యవాచకమగు జమ్భశబ్దముతో తృణశబ్దమునకు సమాసమగునపుడు తృణం జమ్భోఽస్య అనువిగ్రహమును చెప్పవలయును. తృణము భక్ష్యముగగలవాడని యర్థము. దంతవాచకమగు జమ్భశబ్దముతో తృణశబ్దమునకు సమాసమగునపుడు సామానాధికరణ్యముకొఱకై తృణశబ్దమునకు తృణసదృశమందు లక్షణనంగీకరింపవలయును. కాన తృణమివ జమ్భాః అస్య అనివిగ్రహమును చెప్పవలయును. తృణమువంటి దంతములుగలవాడని యర్థము. సోమజమ్భా (సోమఇవ జమ్భాః యస్య) సోమశబ్దమునకు చంద్రుడని యర్థము. చంద్రునివలె స్వచ్ఛములైన దంతములుగలవాడని యర్థము. సూత్రమున సుహరితతృణసోమేభ్యః అనుపదము లేనిచో వీనికంటెభిన్నములగు పదములకంటె పరమగు జమ్భశబ్దమంతమందుగల బహువ్రీహికిని అనిచ్ప్రత్యయము ప్రసక్తమగును. అట్లైన పతితజమ్భః (పతితః జమ్భో యస్య) ఇత్యాదులందు ననిచ్ప్రత్యయము ప్రవర్తించెడిని.

870. దక్షిణేర్మా లుబ్ధయోగే. 5-4-126. దక్షిణేర్మా, లుబ్ధయోగే॥

దక్షిణే ఈర్మం వ్రణం యస్య దక్షిణేర్మా మృగః। వ్యాధేన కృతవ్రణ ఇత్యర్థః॥

870. లుబ్ధదన వ్యాధుడు. (వేటకాడు) వ్యాధునిసంబంధమందు దక్షిణేర్మా అనునదిచ్ప్రత్యయాన్తమగుబహువ్రీహి నిపతింపబడినది. దక్షిణేర్మా (మృగః) దక్షిణే ఈర్మం యస్య అనివిగ్రహము. నిపాతనమువలన వ్యధికరణములైనను దక్షిణేర్మశబ్దములకు బహువ్రీహి. అనిచ్చు. అకారలోపము. ఈర్మమన వ్రణమని) (దెబ్బ) యర్థము. మూలమున వ్రణమ్‌అనునది ఈర్మశబ్దమునకు వివరణ

మని గ్రహించునది. కుడిప్రక్కన వ్యాధునిచే చేయబడిన వ్రణముగల మృగము (లేడి) అనియర్థము.

వివ :— లుబ్ధయోగమును సూచించుటకు "వ్యాధేనకృతవ్రణ ఇత్యర్థః" అని చెప్పబడినది. లుబ్ధయోగే అనుటచే లుబ్ధునిచేగాక వ్రణము రోగాదులచేకలిగిన దైనపుడు దక్షిణేర్మః అనియే యగును.

871. ఇచ్ కర్మవ్యతిహారే. 5-4-127. ఇచ్, కర్మవ్యతిహారే॥

కర్మవ్యతిహారే యో బహువ్రీహిస్తస్మాదిచ్ స్యాత్స మాసాన్తః। కేశాకేశి। ముసలాముసలి॥

871. కర్మవ్యతిహారమందలి బహువ్రీహికంటె ఇచ్ అనుసమాసాన్త ప్రత్యయమగును. కేశాకేశి. ఇచట "తత్రతేనేదమ్" (850) సూ. చే కర్మవ్యతిహారమందు బహువ్రీహిసమాసము. ఇచ్ప్రత్యయము. ఇచ్ప్రత్యయము తిష్ఠద్గు ప్రభృతిగణమున పఠింపబడుటచే తదన్తమవ్యయీభావమై అవ్యయమగును. ఇట్లే ముసలాముసలి అనునదియును.

872. *ద్విదణ్డ్యాదిభ్యశ్చ. 5-4-128. ద్విదణ్డ్యాదిభ్యః, చ। (ఇచ్)

తాదర్థ్యే చతుర్థ్యేషా। ఏషాం సిద్ధ్యర్థమిచ్ప్రత్యయః స్యాత్। ద్వౌ దణ్డౌ యస్మిన్ ప్రహరణే తద్ద్విదణ్డి ప్రహరణమ్। ద్విముసలి। ఉభయాహస్తి॥

872. ద్విదణ్డ్యాదిభ్యః అనుసధి తాదర్థ్యచతుర్థ్యన్తము. ద్విదణ్డ్యాదిగణ పఠితములగు ద్విదణ్డి ద్విముసలి మొదలగురూపములు సిద్ధించుటకై ఇచ్ప్రత్యయ మగును. ద్విదణ్డి మొదలగురూపములందు కేశాకేశి మొదలగురూపములందువలె కర్మవ్యతిహారము సమానానుపూర్వీకములగుపదములులేకున్నను బహువ్రీహి సమాసము సమాసాన్తమగునిచ్ప్రత్యయము నిపతింపబడినవి. ద్విదణ్డి। ద్వౌ దణ్డౌ యస్మిన్ ప్రహరణే అనివిగ్రహము. నిపాతనమువలన సమాసము ఇచ్ప్రత్యయ మునగును. కర్మవ్యతిహారము లేనందున పూర్వపదమునకు దీర్ఘముమాత్రము రాదు. (రెండుకఱ్ఱలుగల ప్రహరణము) ద్విముసలి. ద్వే ముసలే యస్మిన్ అని విగ్రహము. పూర్వమునకువలె ప్రక్రియ నూహించునది. ఉభాహస్తి. ఉభయాహస్తి. ఉభౌహస్తౌ యస్మిన్ ప్రహరణే అనివిగ్రహము. "ఉభయోఽన్యత్ర" అనువచనముచే నిత్యముగ ప్రాప్తించునయచ్ప్రత్యయము నిపాతనమువలననిచట

---

* ద్విదణ్డి ద్విముసలి ఉభాఞ్జలి ఉభయాఞ్జలి ఉభాదన్తి ఉభయాదన్తి ఉభహస్తి ఉభయాహస్తి ఉభాకర్ణి ఉభయాకర్ణి ఉభాపాణి ఉభయాపాణి ఉభాబాహు ఉభయాబాహు ఏకపది ప్రోష్ఠపది ఆఢ్యపది సపది నికుచ్యకర్ణి సంహతపుచ్ఛి అన్తేవాసి ఇతిద్విదణ్డ్యాదిః॥

వికల్పముగనగును. కాన రెండురూపములగును. పూర్వపదమునకు దీర్ఘముకూడ నిపాతనమువలన సిద్ధించినదే యనిగ్రహించునది.

873. ప్రసమ్భ్యాం జానునోర్జ్ఞుః. 5-4-129. ప్రసమ్భ్యామ్, జానునోః, జ్ఞుః॥

అభ్యాం పరయోర్జానుశబ్దయోర్జ్ఞురాదేశః స్యాద్బహువ్రీహౌ। ప్రగతే జానునీ యస్య ప్రజ్ఞుః। సంజ్ఞుః॥

873. ప్ర సమ్ వీనికంటెపరములగు జానుశబ్దములకు బహువ్రీహియందు జ్ఞు అనునాదేశమగును. ప్రజ్ఞుః (ప్రగతే జానునీ యస్య) "ప్రాదిభ్యోధాతుజస్య" అనువార్తికముచే సమాసము. సంజ్ఞుః (సఙ్గతే జానునీయస్య) కలసికొనిన మోకాళ్లుగలవాడని యర్థము.

విప :— జానుశబ్దమొకటేయైనను "ప్రసమ్భ్యామ్" అనుఉపపదమునందలి ద్విత్వమునాశ్రయించిగాని యర్థగతమైనద్విత్వమునాశ్రయించిగాని జానునోః అని ద్వివచననిర్దేశము చేయబడినది. జ్ఞు అనునదియాదేశమనిస్పష్టముగ తెల్పుట ద్వివచననిర్దేశమునకు ఫలము. అనగా జానునోః అనిద్వివచనాన్తమునువిడిచి జానునః అని యేకవచనాన్తమును నిర్దేశించిన "ప్రత్యయః" "పరశ్చ" అనునధికారములవలన జానునః అనునది పంచమ్యన్తమనుటకును వీలుండుటచే జ్ఞు అనునది ప్రత్యయమగునని యూహించుటకవకాశము కలుగును. ద్వివచనాన్తనిర్దేశమున్నచో స్థానషష్ఠీత్వము స్ఫుటమగును కాన జ్ఞు అనుదానిని ప్రత్యయమనుటకవకాశము కలుగదనియాశయము.

874. ఊర్ధ్వాద్విభాషా. 5-4-130. ఊర్ధ్వాత్, విభాషా। (జానునోః, జ్ఞుః)

ఊర్ధ్వజ్ఞుః। ఊర్ధ్వజానుః॥

874. ఊర్ధ్వశబ్దముకంటె పరమగు జానుశబ్దమునకు బహువ్రీహియందు వికల్పముగ జ్ఞు అనునాదేశమగును. ఊర్ధ్వజ్ఞుః — ఊర్ధ్వజానుః (ఊర్ధ్వే జానునీ యస్య) ఆదేశము ప్రవర్తించునపుడు ఊర్ధ్వజ్ఞుః అనియు లేనపుడు ఊర్ధ్వజానుః అనియు రూపములగును.

875. ధనుషశ్చ. 5-4-132. ధనుషః, చ। (అనఙ్)

ధనురన్తస్య బహువ్రీహేరనఙాదేశః స్యాత్। శార్ఙ్గధన్వా॥

875. ధనుషః అనుదానిని బహువ్రీహికి విశేషణముగజేయుటచే తదన్తవిధి కలుగును. ధనుశ్శబ్దమన్తమందుగల బహువ్రీహిసమాసమునకనఙాదేశమగును. అనఙను ఙకారమిత్సంజ్ఞకము. అకారముచ్చారణార్థము. శార్ఙ్గధన్వా (శార్ఙ్గం ధను

ర్యస్య) అనజాదేశము జిత్తగుటచేన న్తాదేశమగును. కాన శార్ఙ్గధనుస్ అనుచోట సకారమునకాదేశమగును. పిదప యణాదేశముచే శార్ఙ్గధన్వన్ అనురూపము సిద్ధించును. దీనికంటె సుప్రత్యయము పరమగునపుడు దీర్ఘాదులగును.

వివ :— శృఙ్గస్యేదమ్ అనువిగ్రహమున శృఙ్గశబ్దముకంటె "తస్యేదమ్" అను సూ. చే నణ్ప్రత్యయమునుచేసిన శార్ఙ్గశబ్దము సిద్ధించును కొమ్ముతోచేయబడినదని యర్థము. శార్ఙ్గధన్వా అనురూపమువలె ద్విధన్వా మొదలగురూపముల నూహింపవలయును.

876. వా సంజ్ఞాయామ్. 6-4-133. వా, సంజ్ఞాయామ్। (ధనుషః, అనఙ్)

శతధన్వా। శతధనుః॥

876. ధనుశ్శబ్దాన్తమగు బహువ్రీహికి సంజ్ఞయందు వికల్పముగ ననజాదేశమగును. శతధన్వా - శతధనుః। శతధన్వా అనునది ఒకానొక రాజునకు సంజ్ఞః॥

877. జాయాయా నిఙ్. 5-4-134. జాయాయాః, నిఙ్॥

జాయాన్తస్య బహువ్రీహేర్నిఙాదేశః స్యాత్॥

877. జాయాశబ్దమన్తమందుగలబహువ్రీహికి నిఙ్ అనెడి యాదేశమగును. ఆదేశమున ఙకారమిత్సంజ్ఞకము.

వివ:—ప్రత్యయః పరశ్చ అనునధికారములందు పఠింపడినను నిఙ్ఙిత్తగుటవలననాదేశమగునని యాశయము.

878. లోపో వ్యోర్వలి. 6-1-66. లోపః, వ్యోః, వలి॥

వకారయకారయోర్లోపః స్యాద్వలి। పుంవద్భావః। యువతిర్జాయా యస్య యువజానిః॥

878. వ్ చ య్ చ వ్యౌ తయోః = వ్యోః వకారయకారములని యర్థము. వల్ప్రత్యాహారవర్ణము పరముగనున్నపుడు వకారయకారములకు లోపమగునని సూత్రార్థము. యువజానిః (యువతిః జాయా యస్య) "జాయాయా నిఙ్ సూ. చే యకారముపై ఆకారమునకు నిఙాదేశము. ఈసూత్రముచే యకారలోపము. యువతి శబ్దమునకు "స్త్రియాః పుంవత్" సూ. చే పుంవద్భావముచే యువజానిః అనురూపమగును. యౌవనవతి భార్యగాగలవాడని యర్థము.

879. గన్ధస్యేదుత్పూతిసుసురభిభ్యః 5-4-135. గన్ధస్య. ఇత్, ఉత్పూతి.........భ్యః॥

ఏభ్యో గన్ధస్య ఇకారోఽన్తాదేశః స్యాత్। ఉద్గన్ధిః। పూతిగన్ధిః। సురభిగన్ధిః। (వా) గన్ధస్యేత్త్వే తదేకాన్తగ్రహణమ్। ఏకాన్త ఏకదేశఇవ అవిభాగేన లక్ష్యమాణ ఇత్యర్థః॥

సుగన్ధి పుష్పం సలిలం చ। సుగన్ధిర్వాయుః। నేహ। శోభనా
గన్ధాః ద్రవ్యాణ్యస్య సుగన్ధః ఆపణికః॥

879. ఉత్ పూతి సు సురభి వీనికంటె పరమగు గన్ధశబ్దమునకు బహువ్రీహియందికారమన్తాదేశమగును. సమాసాన్తాః అనునధికారమువలన "ఆదేః పరస్య" అనుపరిభాష యిచట ప్రవర్తించదు. ఉద్గన్ధిః (ఉద్గతో గన్ధో యస్య) వ్యాపించిన సువాసనగలదని యర్థము. పూతిగన్ధిః (పూతిః గన్ధో యస్య) ఇకారాదేశము. దుర్వాసనగలదని యర్థము. సుగన్ధిః (శోభనో గన్ధో యస్య) సురభిగన్ధిః (సురభిః గన్ధో యస్య) వీనికన్నిటికిని వాయువు విశేష్యము.

(వా) తదేకాన్తగ్రహణమ్ (తస్య ఏకాన్తః=తదేకాన్తః, తస్యగ్రహణమ్=తదేకాన్తగ్రహణమ్) తచ్ఛబ్దముచే విశేష్యము(బహువ్రీహ్యర్థమగు అన్య పదార్థము) గ్రహింపబడును. విశేష్యముగుపదార్థముతో నభిన్నముగనగపడు నర్థమును బోధించుగన్ధశబ్దమునకేసూత్రమునగ్రహణమని వార్తికార్థము. గుణసముదాయమేగుణియనుమతమున గుణముగుణికంటె వేరుగనగపడదుగదా ? కావున గుణవాచకమగు గంధశబ్దమునే యిచట గ్రహింపవలయునుగాని ద్రవ్యవాచకమును గ్రహింపవలదని ఫలితమగును. గంధశబ్దముగుణిబోధకము గుణబోధకముగనున్నదనియాశయము. సుగన్ధి (పుష్పం సలిలం చ) శోభనః గన్ధః యస్య తత్ అనివిగ్రహము. పుష్పముగాని సలిలముగాని విశేష్యమగును. పుష్పాదులందు గన్ధము వేరుగనగపడదు. కాననిచట గన్ధశబ్దమునకికారాదేశము ప్రవర్తించును. సుగన్ధిః (వాయుః) వాయువునందలి గంధము వేరుగనగపడదు గాననిచటనికారాదేశమగును. సుగన్ధః (ఆపణికః) శోభనాః గన్ధాః (ద్రవ్యాణి) యస్య అనివిగ్రహము. ఇచ్చోట గన్ధశబ్దము చందనాదిద్రవ్య (గుణి) వాచకము. ఆపణికుడు (చందనాదిసుగంధద్రవ్యములనమ్మువాడు) విశేష్యము. వర్తకునికంటె గన్ధశబ్దవాచ్యములగు చందనాదిద్రవ్యములు వేరుగనగపడుచుండుటచేనిచటనికారాదేశము ప్రవర్తింపదు.

వివ :— పూర్వోత్తరసాహచర్యమువలననికారసమాసాన్తము యగును. మూలమున శోభనాః అనునది సు అనుదానికి వివరణము. గన్ధాః అనుపదమునకు ద్రవ్యాణి అనునది వివరణము. "గన్ధస్తు సౌరభే నృత్యే గన్ధకేగర్వలేశయోః। సఏవ ద్రవ్యవచనో బహుత్వే పుంసి చ స్మృతః" అనుకోశమువలన పుంలింగము, బహువచనాన్తమునగు గన్ధశబ్దము ద్రవ్యవాచకమగునని తెలియునది.

880. అల్పాఖ్యాయామ్. 5-4-136. (గన్ధస్య. ఇత్)

సూపస్య గన్ధో లేశో యస్మింస్తత్ సూపగన్ధి భోజనమ్। ఘృతగన్ధి। గన్ధో గన్ధక ఆమోదే లేశే సంబన్ధగర్వయోరితి విశ్వః॥

880. అల్పాఖ్యాయామ్ అనుచోటనల్పశబ్దమల్పత్వబోధకము. లేశ వాచకమని యర్థము. లేశార్థకమగు గన్ధశబ్దమునకు బహువ్రీహియందికారమన్తాదేశమగునని సూత్రార్థము. సూపగన్ధి. (సూపస్య గన్ధో యస్మింస్తత్) భోజనము. ఇచట గన్ధశబ్దములేశబోధకమగుటచే నికారమన్తాదేశమగును. అల్పమగు సూపముగల భోజనమని యర్థము. ఘృతగన్ధి (ఘృతస్య గన్ధోయస్మింస్తత్) స్వల్పమగు ఘృతముగలభోజనమని యర్థము. గన్ధశబ్దమల్పవాచకముగనున్నదనువిషయమున విశ్వకోశము ప్రమాణముగజూపబడెను. "గన్ధో గన్ధక ఆమోదే లేశే సంబంధ గర్వయోః.

వివ:— వ్యధికరణములగు సూపగన్ధపదములకు బహువ్రీహియీసూత్రముచే నికారాదేశవిధానమువలన సాధువగును. మూలమున లేశః అనునది గన్ధపద వివరణము.

881. ఉపమానాచ్చ. 5-4-137. ఉపమానాత్, చ। (గన్ధస్య. ఇత్)

పద్మస్యేవ గన్ధోఽస్య పద్మగన్ధిః॥

881. ఉపమానవాచకమగు పూర్వపదముకంటె పరమగు గన్ధశబ్దమునకును బహువ్రీహియందికారమన్తాదేశమగును. పద్మగన్ధిః (పద్మస్యేవగన్ధోఽస్య) పద్మముయొక్క గంధముతో సమానమైనగంధముగలదని యర్థము.

882. పాదస్య లోపోఽ *హస్త్యాదిభ్యః. 5-4-138. పాదస్య, లోపః అహస్త్యాదిభ్యః। (ఉపమానాత్)

హస్త్యాదివర్జితాదుపమానాత్పరస్య పాదశబ్దస్య లోపః స్యాద్బహువ్రీహౌ। స్థానిద్వారేణాఽయం సమాసాన్తః। వ్యాఘ్రస్యేవ పాదావస్య వ్యాఘ్రపాత్। అహస్త్యాదిభ్యః కిమ్। హస్తిపాదః। కుసూలపాదః॥

882. హస్త్యాదిగణపతితములగు హస్తిన్ కుసూల మొదలగు శబ్దములకంటె భిన్నమగునుపమానవాచకముకంటె పరమైన పాదశబ్దమునకు బహువ్రీహియందు లోపమన్తాదేశమగును. ఈలోపము స్థానిద్వారా సమాసాన్తమగును. వ్యాఘ్రపాత్ (వ్యాఘ్రస్యేవ పాదావస్య) పాదశబ్దముయొక్క అకారమునకీసూత్రముచే లోపము. హస్తిపాదః (హస్తిన ఇవ పాదావస్య) కుసూలపాదః (కుసూలస్యేవ పాదావస్య) హస్తికుసూలశబ్దములుపమానవాచకములైనను హస్త్యాదిగణపతితములగుటచేనీలోపము ప్రవర్తించదు.

---

* హస్తిన్ కుద్దాల అశ్వ కుశిక కురుత కటోల కటోలక గణ్డోల గణ్డోలక కణ్డోల కణ్డోలక అజ కపోల జాల గణ్డ మహేలా దాసీ గణికా కుసూల ఇతిహస్త్యాదిః॥

వివ :— 1 లోపమభావాత్మకము. ఇది సమాసమునకన్తావయవమగుట యెట్లు సంభవించునను శంకకు "స్థానిద్వారేణాఽయం సమాసాన్తః" అని సమాధానము చెప్పబడెను. లోపస్థానియగుఅకారము సమాసచరమావయవమగును గాన తత్స్థానమున ప్రవర్తించులోపముగూడ ఔపచారికముగ సమాసాన్తమగునని భావము; లోపము సమాసాన్తమని యవశ్యమంగీకరింపవలయును. లేకున్న "ఆదేః పరస్య" అనుపరిభాషచేపాదశబ్దాదికి లోపము ప్రసక్తమగును. మఱియు వ్యాఘ్రపాత్ మొదలగునవి యను క్తసమాసాన్తములగును గాన "శేషాద్విభాషా" (896) అను సూ. చే వానికంటె కప్రత్యయము ప్రసక్తమగును.

883. ** కుమ్భపదీషు చ. 5-4-139. కుమ్భపదీషు, చ। (పాదస్య, లోపః)

కుమ్భపద్యాదిషు పాదస్య లోపో ఙీప్ చ నిపాత్యతే స్త్రియామ్। పాదః పత్। కుమ్భపదీ। స్త్రియాం కిమ్। కుమ్భపాదః॥

883. కుమ్భపద్యాదిగణమున పఠింపబడిన కుమ్భపదీ ఏకపదీ మొదలగు బహువ్రీహిసమాసములందును పాదశబ్దములోని అకారమునకులోపము (సమాసాన్తము) ఙీప్రత్యయము స్త్రీలింగమున నిపతింపబడెను. కుమ్భపదీ (కుమ్భావివ పాదావస్యాః) "పాదః పత్" (417) సూ. చే పాదశబ్దమునకు పదాదేశము. నిపాతనమువలన లోపము ఙీప్రత్యయములగును. స్త్రీప్రత్యయాన్తములు నిపతింపబడుటవలన పుంలింగమునని విరాము. కుమ్భపాదః (కుమ్భస్యేవ పాదావస్య.)

వివ :— కుమ్భపదీషు అనుచోట బహువచనమువలనను గణపాఠసామర్థ్యమువలనను కుమ్భపద్యాదులను గ్రహింపవలయును. కుమ్భపద్యాదిగణమునను పమానపూర్వము సంఖ్యాపూర్వమునగు స్థలమందు "పాదస్యలోపః" మొదలగు సూత్రములచే లోపము సిద్ధమగుచుండ నీసూత్రము లోపమునుపదెంచి నిత్యముగ ఙీప్రత్యయమునుమాత్రము నిపతించునని గ్రహించునది. కాననీనిపాతనము "పాదోఽన్యతరస్యామ్" (460) సూ. చే ప్రాప్తమగు వైకల్పికఙీప్రత్యయమునకపవాదమగును. కుమ్భపద్యాదిగణమున కుమ్భపదీ ఏకపదీ మొదలగు స్త్రీలింగ

---

** కుమ్భపదీ ఏకపదీ జాలపదీ మునిపదీ శూలపదీ గుణపదీ శతపదీ సూత్రపదీ గోధాపదీ కలశీపదీ విపదీ ద్విపదీ త్రిపదీ షట్పదీ దాసీపదీ తృణపదీ శితపదీ విష్ణుపదీ సుపదీ నిష్పదీ ఆర్ద్రపదీ కుణిపదీ కృష్ణపదీ శుచిపదీ ద్రోణీపదీ ద్రుపదీ సూకరపదీ శకృత్పదీ అష్టాపదీ స్థూణాపదీ అపదీ సూచీపదీ ఇతి కుమ్భపద్యాదిః॥

రూపములే పఠింపబడుటవలననీనిపాతనము స్త్రీలింగమందే ప్రవర్తించునని ఫలితమగును.

884. సంఖ్యాసుపూర్వస్య. 5-4-140. (పాదస్య, లోపః)

పాదస్య లోపః స్యాత్సమాసాన్తో బహువ్రీహౌ। ద్విపాత్। సుపాత్॥

884. సంఖ్యావాచకము సు ఇవి పూర్వమందుగల పాదశబ్దమునకు బహువ్రీహియందు సమాసాన్తమగు లోపమగును. ద్విపాత్ (ద్వౌపాదౌ యస్య) అకారమునకు లోపము. రెండుపాదములుగలవాడని యర్థము. సుపాత్ (శోభనౌ పాదౌ యస్య).

వివ ;— ఉపమానవాచకముకంటె పరముగలేకపోవుటవలన ద్విపాత్ ఇత్యాదులందు "పాదస్య లోపః" సూ. చే లోపమప్రాప్తమగుచుండనీసూత్రమారంభింపబడెను.

885. వయసి దన్తస్య దతృ. 5-4-141. వయసి, దన్తస్య, దతృ। (సంఖ్యాసుపూర్వస్య)

సంఖ్యాసుపూర్వస్య దన్తస్య దతృ ఇత్యాదేశః స్యాద్వయసి। ద్విదన్। చతుర్దన్। షట్ దన్తా అస్య షోడన్। సుదన్। సుదతీ। వయసి కిమ్। ద్విదన్తః కరీ। సుదన్తః॥

885. సంఖ్యావాచకము సు ఇవి పూర్వమందుగల దన్తశబ్దమునకువయస్సు ప్రతీయమానమగునపుడు దతృ అనునాదేశమగును. ద్విదన్ (ద్వౌ దన్తౌ యస్య) దన్తశబ్దమునకు దత్రాదేశము. ఆదేశమున ఋకారమిత్సంజ్ఞకము. ఉగిత్తగుటవలన "ఉగిదచాం సర్వనామస్థానే" (363) సూ. చే నుమాగమము. సులోపసంయోగాన్త లోపములు. సంయోగాన్తలోపమసిద్ధమగుటచే నలోపము రాదు. రెండుదంతములు గలవాడని యర్థము. ఇచట శిశుత్వము గమ్యమానమగుచున్నది. చతుర్దన్ (చత్వారో దన్తా యస్య) దత్రాదేశాదిప్రక్రియనుపూర్వమునకువలెనూహించునది. ఇచటను శిశుత్వమే ప్రతీయమానమగును. షోడన్ (షట్ దన్తా అస్య) దత్రాదేశాదులు. "షష ఉత్వం దతృదశధాసూత్తరపదాదేః" అనువార్తికముచే షత్వోత్వములగును. సుదన్ (శోభనా దన్తా యస్య) దత్రాదేశాదిప్రక్రియ నూహించునది. సుదతీ (శోభనా దన్తా యస్యాః) దత్రాదేశము. స్త్రీలింగమున "ఉగితశ్చ" (458) సూ. చే ఙీప్ప్రత్యయమగును. సూత్రమున వయసి అనునది లేకున్న ద్విదన్తః (ద్వౌ దన్తౌ యస్య) ఏనుగు. ఇచట దన్తశబ్దమునకు దత్రాదేశము ప్రసక్తమగును. ఏనుగునకు రెండుదంతములెల్లపుడునుండును గాన వయోవిశేషమాశబ్దము వలన ప్రతీయమానము గాకుండుటచే దత్రాదేశము రాదు. సుదన్తః అనుచోటను

వయసి అనుటవలననే దత్రాదేశము వారింపబడును. శోభనములైన దంతములు గలవాడని యర్థము. దీనిచేతనో వయోవిశేషము గమ్యమానము గాదు గాన దత్రాదేశము ప్రవర్తింపదు.

వివ :— సుదన్ అనుదానికి బాగుగకలసియున్నదంతములు గలవాడని యర్థమును చెప్పునపుడు బాల్యవయస్సు గమ్యమానమగును.

886. స్త్రియాం సంజ్ఞాయామ్. 5-4-143. స్త్రియామ్, సంజ్ఞాయామ్। (దన్తస్య, దతృ)

దన్తస్య దతృ స్యాత్సమాసాన్తో బహువ్రీహౌ। అయోదతీ। ఫాలదతీ। సంజ్ఞాయామ్ కిమ్। సమదన్తీ॥

886. స్త్రీలింగమున బహువ్రీహియందు సంజ్ఞ గమ్యమానమైనపుడు దన్తశబ్దమునకు దత్రాదేశమగును. అయోదతీ। ఫాలదతీ। ఈ రెండును సంజ్ఞావిశేషములు. కాన దత్రాదేశము ప్రవర్తించును. స్త్రీలింగపగుటవలన "ఉగితశ్చ" సూ. చే జీప్ప్రత్యయమగును. సమదన్తీ (సమాః దన్తాః యస్యాః) ఇది బహువ్రీహియైనను స్త్రీలింగమైనను సంజ్ఞగానందున దత్రాదేశము రాదు. "నాసికోదర" (514) అను సూ. చే జీష్ప్రత్యయమగును. సూత్రమున సంజ్ఞాయామ్ అనునది లేనిచో విట్టిస్థలములందును దత్రాదేశము ప్రసక్తమగును.

887. విభాషా శ్యావారోకాభ్యామ్. 5-4-144. విభాషా, శ్యావారోకాభ్యామ్। (దన్తస్య, దతృ)

దన్తస్య దతృ వా బహువ్రీహౌ। శ్యావదన్। శ్యావదన్తః। అరోకదన్। అరోకదన్తః॥

887. బహువ్రీహియందు శ్యావ అరోక వీనికంటెపరమగు దన్తశబ్దమునకు దత్రాదేశము వికల్పముగనగును. శ్యావదన్-శ్యావదన్తః (శ్యావా దన్తా యస్య) దత్రాదేశాదిప్రక్రియనూహించునది. కపిశవర్ణముగల దంతములుగలవాడని యర్థము. "శ్యావఃస్యాత్కపిశః" అనునమరమువలన శ్యావశబ్దము కపిశపర్యాయమని తెలియును; దత్రాదేశవికల్పమువలన రెండురూపములగును. అరోకదన్-అరోకదన్తః (అరోకా దన్తా యస్య) ఛిద్రరహితములగు దన్తములుగలవాడని యర్థము.

888. అగ్రాన్తశుద్ధశుభ్రవృషవరాహేభ్యశ్చ. 5-4-145. అగ్రాన్త............భ్యః, చ। విభాషా, దన్తస్య, దతృ)

ఏభ్యో దన్తస్య దతృ వా। కుడ్మలాగ్రదన్। కుడ్మలాగ్రదన్తః॥

888. అగ్రశబ్దమంతమందుగలశబ్దము, శుద్ధ శుభ్ర వృష వరాహ శబ్దములు పీనికంటెపరమగు దన్తశబ్దమునకును బహువ్రీహియందు దతృ ఆదేశము వికల్పముగనగును. కుడ్మలాగ్రదన్ (కుడ్మలాగ్రాణీవ దన్తాః యస్య) కుడ్మలాగ్రశబ్దము అగ్రాన్తమగుటచే దన్తశబ్దమునకు దతృ ఆదేశము. ఆదేశము రానిపక్షమున కుడ్మలాగ్రదన్తః అవియగును. మొగ్గలవంటిదంతములుకలవాడని యర్థము. ఇట్లే శుద్ధదన్ – శుద్ధదన్తః, శుభ్రదన్ – శుభ్రదన్తః మొదలగురూపములనూహించునది.

వివ:—అగ్రాన్త అనుచోట అగ్రః=అగ్రశబ్దః అన్తే యస్య అనివిగ్రహమును చెప్పుటవలన అగ్రశబ్దమంతమందుగలశబ్దమను నర్థములభించును.

889. కకుదస్యావస్థాయాం లోపః। 5-4-146. కకుదస్య, అవస్థాయామ్, లోపః॥

అజాతకకుత్। పూర్ణకకుత్॥

889. వయస్సు ప్రతీయమానమగునపుడు కకుదశబ్దమునకు బహువ్రీహియందు సమాసాన్తమగు లోపమగును. అజాతకకుత్ (అజాతం కకుదమస్య) కకుదశబ్దాన్త్యమునకు లోపము. ఉత్పన్నముకానట్టి కకుదముగలదని యర్థము. కకుదశబ్దమునకు వృషభములయొక్క మూపుర మర్థము. అట్టిమూపురములేనిదనుటచే బాల్యావస్థ గమ్యమానమగును. పూర్ణకకుత్ (పూర్ణం కకుదమస్య) యౌవనావస్థ ప్రతీయమానమగును. కకుదము బాల్యముననుద్భూతముగాదు, యౌవనమున నుద్భూతమై సంపూర్ణమగును.

890. త్రికకుత్పర్వతే. 5-4-147. త్రికకుత్, పర్వతే॥

త్రీణి కకుదాన్యస్య త్రికకుత్।సంజ్ఞైషా పర్వతవిశేషస్య।
త్రికకుదోఽన్యః॥

890. పర్వతవిశేషమర్థమగునపుడు త్రికకుత్ అనుసమాసాన్తలోపము చేయబడిన కకుదశబ్దాన్తబహువ్రీహి నిపతింపబడెను. త్రికకుత్ (త్రీణి కకుదాన్యస్య)ఇది పర్వతవిశేషమునకు సంజ్ఞ. సంజ్ఞకానపుడు త్రికకుదః అవియగును. లోపముప్రవర్తింపదు. కకుదమన శిఖరము.

891. ఉద్విభ్యాం కాకుదస్య. 5-4-148. ఉద్విభ్యామ్, కాకుదస్య. (లోపః)

లోపః స్యాత్। ఉత్కాకుత్। వికాకుత్। కాకుదం తాలు॥

891. ఉద్ వి పీనికంటెపరమగు కాకుదశబ్దముయొక్క అకారమునకు బహు-

వ్రీహియందు లోపమగును. ఉత్కాకుత్ (ఉన్నతం కాకుదం యస్య) వికాకుత్ (విగతం కాకుదం యస్య) కాకుదమన తాలుపు.

892. పూర్ణాద్విభాషా. 5-4-149. పూర్ణాత్, విభాషా। (కాకుదస్య లోపః)

పూర్ణకాకుత్। పూర్ణకాకుదః॥

892. పూర్ణశబ్దముకంటెపరమగు కాకుదశబ్దముయొక్క అకారమునకు బహువ్రీహియందు వికల్పముగ లోపమగును. పూర్ణకాకుత్ (పూర్ణంకాకుదం యస్య) లోపములేనపుడు పూర్ణకాకుదః అనియగును.

893. సుహృద్దుర్హృదౌ మిత్రాఽమిత్రయోః 5-4-150. సుహృద్దుర్హృదౌ, మిత్రామిత్రయోః॥

సుదుర్భ్యాం హృదయస్య హృద్భావో నిపాత్యతే। సుహృన్మిత్రమ్। దుర్హృదమిత్రః। అన్యత్ర సుహృదయః దుర్హృదయః॥

893. బహువ్రీహియందు సు దుర్ వీనికంటెపరమగు హృదయశబ్దమునకు క్రమముగ స్నేహితుడు శత్రువు అనునర్థములందు హృదాదేశమునిపతింపబడెను. సుహృత్ (శోభనం హృదయం యస్య) నిపాతనమువలన హృదయశబ్దమునకు హృదాదేశము. మిత్రుడని యర్థము. దుర్హృత్ (దుష్టం హృదయం యస్య) శత్రువు. "మిత్రాఽమిత్రయోః" అనియనుటవలన మిత్రుడు అమిత్రుడు అనునర్థములను విడచి మంచిహృదయముగలవాడు అనుసర్థములను వివక్షించునపుడు హృద్భావము రాదు. సుహృదయః దుర్హృదయః అనియగును.

894. ఉరఃప్రభృతిగణమున పఠింపబడిన ఉరస్ సర్పిస్ మొదలగు శబ్దములంతమందుగల బహువ్రీహికంటె కప్ అనుసమాసాంతప్రత్యయము వచ్చును.

894. * ఉరః ప్రభృతిభ్యః కప్. 5-4-151. ఉరఃప్రభృతిభ్యః, కప్॥

వ్యూఢోరస్కః। ప్రియసర్పిష్కః। ఇహ పుమాన్, అనడ్వాన్, పయః, నౌః, లక్ష్మీరితి ఏకవచనాన్తాని పఠ్యన్తే। ద్వివచనబహువచనాన్తేభ్యస్తు శేషాద్విభాషేతి వికల్పేన కప్। ద్విపుమాన్। ద్విపుంస్కః। గ. సూ:—అర్థాన్నఞః। అనర్థకమ్। నఞః కిమ్। అపార్థమ్। అపార్థకమ్॥

---

* ఉరస్ సర్పిస్ ఉపానహ్ పుమాన్ అనడ్వాన్ పయః నౌః లక్ష్మీః దధి మధు శాలి అర్థాన్నఞః। ఇత్యురఃప్రభృతయః॥

894. ఉరః ప్రభృతిగణమున పఠింపబడిన ఉరస్ సర్పిస్ మొదలగు శబ్దములంతమందుగల బహువ్రీహికంటె కప్ అనుసమాసాన్తప్రత్యయమువచ్చును. కప్ప్రత్యయమున పకారమిత్సంజ్ఞకము. కప్పు తద్ధితముగుటచే కకారమునకిత్సంజ్ఞ రాదు. వ్యూఢోరస్కః (వ్యూఢం ఉరః యస్య) కప్ప్రత్యయము. "సోఽపదాదౌ" (153) సూ. చే విసర్గమునకు సత్వము. విశాలమగు వక్షస్స్థలముగలవాడని యర్థము. ప్రియసర్పిష్కః (ప్రియం సర్పిర్యస్య) కప్ప్రత్యయము. "ఇణఃషః" సూ. చే విసర్గమునకు షత్వము.

ఉరఃప్రభృతిగణమున పుమాన్ అనడ్వాన్ పయః నౌః లక్ష్మీః అను ఏకవచనాన్తములు పఠింపబడినవి. కావననేకవచనాన్తములకే యీసూత్రముచే కప్ ప్రత్యయము ప్రవర్తించును. ద్వివచనాన్తములకంటె బహువచనాన్తములకంటె "శేషాద్విభాషా" (896) సూ. చే వైకల్పికమగు కప్ప్రత్యయమేవచ్చును. ద్విపుమాన్–ద్విపుంస్కః (ద్వౌ పుమాంసౌ యస్య) కప్ప్రత్యయమువచ్చునపుడు "సంపుంకానాం సోవక్తవ్యః" అనువార్తికముచే సత్వము ప్రవర్తించును. ద్విపుంస్కః అనియగును. పక్షమందు ద్విపుమాన్ అనియగును. ఇట్లే పయః నౌః మొదలగుశబ్దములయొక్క ద్వివచనాన్తములకంటె వైకల్పికకప్ప్రత్యయము నూహింపవలయును.

(గ. సూ.) నఞ్ కంటెపరమగు అర్థశబ్దమంతమందుగల బహువ్రీహికంటె కప్ప్రత్యయమగును. అనర్థకమ్ (అవిద్యమానోఽర్థో యస్య) "నఞోఽస్త్యర్థానామ్" అనువార్తికముచే సమాసము. గణసూత్రముచే కప్ప్రత్యయము. అపార్థమ్–అపార్థకమ్ (అపగతః అర్థో యస్మాత్) ఇది అర్థశబ్దాన్తబహువ్రీహియైనను నఞ్ పూర్వకముగాకపోవుటచే నీగణసూత్రమువలననిచట నిత్యమగుకప్ప్రత్యయము రాదు. వైకల్పికకప్ప్రత్యయమగును. గణసూత్రమున నఞః అనుపదములేనిచోనిట్టిస్థలములందును నిత్యకప్ప్రత్యయము ప్రసక్తమగును.

వివ:—ఉరఃప్రభృతిగణమున ఉరస్ సర్పిస్ మొదలగు శబ్దములు విభక్తిరహితములైనవానికే పాఠమగపడుచున్నది. పుమాన్ అనడ్వాన్ పయః నౌః లక్ష్మీః అనునవిమాత్రమేకవచనాన్తములుగ పఠింపబడినవి. మిగిలినవానిని విభక్తిరహితములనుగపఠించి వీనినియేకవచనాన్తములుగ పఠించుటవలన వీని యొక్క ఏకవచనాన్తత్వము వివక్షితమనును. ఏకవచనాన్తములకంటె నిత్యముగ కప్ప్రత్యయమగునని ఫలితార్థమగును.

895. ఇనః స్త్రియామ్. 6–4–152. ఇనః స్త్రియామ్। (కప్)

బహుదణ్డికా నగరీ (ప) అనినస్మన్గ్రహణాన్యర్థవతా చానర్థకేన చ తదన్తవిధిం ప్రయోజయన్తి। బహువాగ్మికా।
స్త్రియాం కిమ్। బహుదణ్డీ। బహుదణ్డికో గ్రామః॥

895. స్త్రీలింగమున ఇన్ప్రత్యయాన్తశబ్దముకంటె బహువ్రీహియందు కప్ప్రత్యయమగును. బహుదణ్డికా (బహవః దణ్డినః యస్యాం) దణ్డిన్ శబ్దమిన్ప్రత్యయాన్తము. ఈసూత్రముచే కప్ప్రత్యయము. అనేకులగు సన్యాసులుగల నగరి యని యర్థము. (ప) అనినస్మన్....యన్తి. ఈపరిభాష (351) సూత్రమున వ్యాఖ్యానముచేయబడెను. బహువాగ్మికా. వాగస్యాస్తి. అనువిగ్రహమున "వాచో గ్మినిః" (5-2-124) సూ. చే గ్మినిప్రత్యయమగును. గ్మినిప్రత్యయమున నకారముమీది ఇకారముచ్చారణార్థము. గ్మినిప్రత్యయము తద్ధితమగుటచే "లశక్వతద్ధితే" (196) సూ. చే గకారమునకిత్సంజ్ఞ ప్రవర్తింపదు. వాచ్+గ్మిన్ అనియుండ చకారమునకు కుత్వము. పిదప జశ్త్వము. వాగ్మి అనియగును. మాటకారి అనియర్థము. బహవో వాగ్మినో యస్యామ్ అనివిగ్రహము. గ్మిన్ప్రత్యయమునఇన్ను అనర్థకమైనను "అనినస్మన్" అనుపరిభాషచే గ్మిన్ప్రత్యయాన్తముకూడ ఇన్ప్రత్యయాన్తముగ గ్రహింపబడును. కాన నీసూత్రముచే కప్ప్రత్యయమగును. బహుదణ్డీ-బహుదణ్డికః (బహవః దణ్డినః యస్మిన్) గ్రామము. సమాసము స్త్రీలింగముగాకపోవుటచే నీసూత్రమువలన కప్ప్రత్యయము రాదు. వైకల్పికకప్ప్రత్యయమగును. స్త్రియామ్ అనునది సూత్రమున లేకున్ననిట్టిచోటులందును నిత్యకప్ప్రత్యయము ప్రసక్తమగును.

896. శేషాద్విభాషా. 5-4-154. శేషాత్, విభాషా, (బహువ్రీహౌ, కప్)

అనుక్తసమాసాన్తాచ్ఛేషాధికారస్థాద్బహువ్రీహేః కప్ వా స్యాత్। మహాయశస్కః। మహాయశాః। అనుక్తేత్యాదికిమ్। వ్యాఘ్రపాత్। సుగన్ధిః। ప్రియసుపథః। శేషాధికారస్థాత్కిమ్। ఉపబహవః। ఉత్తరపూర్వా। సపుత్రః। తస్మాద్వినా శేషశబ్దోఽర్థద్వయపరః॥

896. ఇదివరకువిధింపబడిన సమాసాన్తములతో రహితమయి "శేషో బహువ్రీహిః" అనుశేషాధికారమున విహితమగు బహువ్రీహికంటె కప్ప్రత్యయము వికల్పముగనగును. మహాయశస్కః మహాయశాః (మహత్ యశః యస్య) "అనేకమన్యపదార్థే" సూ. చే సమాసము. "ఆన్మహతః" సూ. చే. నాత్వము. ఈసూత్రముచే కప్ప్రత్యయము. "సోపదాదౌ" (158) సూ. చే విసర్గమునకు సత్వము. కప్ప్రత్యయములేనిపక్షమందు "అత్వసన్తస్యచాధాతోః" సూ. చే దీర్ఘము. మహాయశాః।

1. వ్యాఘ్రపాత్ :— ఇచట "పాదస్యలోపః" సూ. చే సమాసాన్తము లోపము విధింపబడినది. 2. సుగన్ధిః :— ఇచట "గన్ధస్యేదుత్పూతి" సూ. చే ఇకారము (సమాసాన్తము) విధింపబడినది. 3. ప్రియసుపథః :— "ఋక్పూరబ్ధూః" సూ. చే నిచట అప్ప్రత్యయమువిధింపబడినది. ఈసమాసములు సమాసాన్తప్రత్యయములుగలవగుటచే ననుక్తసమాసాన్తములు గానందున నీసూత్రము ప్రవర్తింపదు.

సూత్రమున శేషాత్ అనుపదమునకు అనుక్తసమాసాన్తాత్ అనునర్థమును వివక్షింపకున్న నిట్టిస్థలములందును కప్ప్రత్యయము ప్రసక్తమగును.

1. ఉపబహవః :— "సంఖ్యయాఽవ్యయాసన్నా" సూ. చే విచట బహువ్రీహి. 2. ఉత్తరపూర్వా :— "దిఙ్నామాన్యన్తరాళే" సూ. చే విచట సమాసము. 3. సపుత్రః :— "తేనసహేతి" సూ. చే సమాసము. ఈస్థలములందు శేషాధికారమునజేరనట్టి సూత్రములచే సమాసము విధింపబడినవి. అందుచే నీస్థలములందీసూత్రముచే కప్ప్రత్యయము ప్రవర్తింపదు. శేషాత్ అనుపదమునకు శేషాధికారస్థాత్ (శేషోబహువ్రీహిఃఅనునధికారమునవిహితము) అనునర్థమును వివక్షింపనిచో నిట్టిచోటులందునీసూత్రముచే కప్ ప్రత్యయము ప్రవక్తమగును. సూత్రమున శేషాత్ అనుపదమొకమారుచ్చరింపబడినను తన్త్రాదికముచే అనుక్తసమాసాన్తాత్, శేషాధికారస్థాత్. అనురెండర్థములను బోధించును.

వివ:—శేషమన చెప్పబడినదానికంటెభిన్నము. (ఉక్తాదన్యశ్శేషః) ఇంతకుపూర్వము వేనికంటె సమాసాన్తములు చెప్పబడినవో వానికంటెభిన్నమైనది శేషపదార్థము. ఈరీతిగ శేషాత్ అనుపదమునకు అనుక్తసమాసాన్తాత్ అనునర్థము లభించును. "శేషోబహువ్రీహిః" అనునధికారసూత్రములోని శేషపదము "అనేకమన్యపదార్థే" అనునొక్కసూత్రములోనికేయనువర్తించును. మిగిలినసూత్రములలోనికనువర్తింపదు. కాన "సంఖ్యయా" ఇత్యాదిసూత్రములుశేషాధికారస్థములు గావు.

శేషాత్ అనుపదమునకు శేషాధికారస్థాత్ అనునర్థమునుగూడ వివక్షింపవలయును. ఒకమారుచ్చరింపబడిన శబ్దమువలన రెండర్థములెట్లు సంభవించుననుశంకకు "తన్త్రాదినా శేషశబ్దోఽర్థద్వయపరః" అని సమాధానము చెప్పబడినది. ఆదిశబ్దముచే ఆవృత్తివి గ్రహింపవలయును. అర్థభేదమున్నను శబ్దభేదములేకుండుట తంత్రమనబడును. "శ్వేతోధావతి" ఇత్యాదులందు శ్వా-ఇతః (శ్వేతః) ధావతి (ఇచ్చటనుండి కుక్కపరుగిడుచున్నది) శ్వేతఃధావతి (తెల్లనివాడు పరుగెత్తుచున్నాడు) అనురెండర్థములును శ్వేతః అనునొకపదమువలననే బోధ్యములగుచున్నవి. ఇట్టిచోటులందు తంత్రము. శేషాత్ అనుపదము తంత్రముచే రెండర్థములను బోధించును. అర్థభేదమున్నపుడు శబ్దభేదముండవలెననుట ఆవృత్తి యనబడును. శబ్దము సమానమైనను మనమెన్నియర్థములను వివక్షింపదలచుకొంటిమో అన్నిమారులాశబ్దమునుచ్చరించవలయునని భావము. వక్తతంత్రముచేశబ్దమునుచ్చరించును. బోద్ధకు ఆవృత్తిచేతనే బోధ కల్గును.

897. ఆపోఽన్యతరస్యామ్. 7-4-15. ఆపః, అన్యతరస్యామ్।
(కపి, హ్రస్వః)

కప్యాబన్తస్య హ్రస్వో వా స్యాత్। బహుమాలాకః।
బహుమాలకః। కబభావే బహుమాలః॥

897. కప్ప్రత్యయముపరమగునపుడు ఆబన్తమునకు వికల్పముగ హ్రస్వమగును. బహుమాలకః- బహుమాలాకః (బహ్వ్యః మాలాః యస్య) "స్త్రియాః పుంవత్" సూ. చే పుంవద్భావము. "శేషాద్విభాషా" సూ. చే వికల్పకప్ప్రత్యయము. కప్ప్రత్యయముపరమగునపుడు మాలాశబ్దమాబన్తమగుటవలన నీసూత్రముచే హ్రస్వము ప్రవర్తించును. బహుమాలకః అనియగును. లేనిచో బహుమాలాకః అనియగును. కప్ప్రత్యయము వికల్పముగుటచేనది ప్రవర్తించనపుడు బహుమాలః అనియగును. "నకపి" సూ. చే హ్రస్వనిషేధము ప్రాప్తించుచుండ హ్రస్వవికల్పమునకై యీసూత్రమారంభింపబడెను.

898. న సంజ్ఞాయామ్. 5-4-155. న, సంజ్ఞాయామ్। (కప్)

శేషాదితి ప్రాప్తః కప్ న స్యాత్సంజ్ఞాయామ్। విశ్వే
దేవా అస్య విశ్వదేవః॥

898. "శేషాద్విభాషా" అనుసూత్రముచే ప్రాప్తమగు కప్ప్రత్యయము సంజ్ఞయందు రాదు. విశ్వదేవః (విశ్వే దేవా అస్య) ఇది యొకనికి సంజ్ఞ. కాన నీసూత్రము ప్రవర్తించును.

వివ :— "అనన్తరస్య విధిర్వా భవతి ప్రతిషేధో వా" అనుపరిభాషచే నవ్యవహితమగు "శేషాద్విభాషా" అనుసూత్రముచే విహితమగు కప్ప్రత్యయమునే యీసూత్రము నిషేధించును. వ్యవహితములగు "నద్యృతశ్చ" మొదలగుసూత్రములచే విధింపబడు కప్ప్రత్యయమును నిషేధింపదు.

899. ఈయసశ్చ. 5-4-156. ఈయసః, చ। (న, కప్)

ఈయసన్తోత్తరపదాన్నకప్। బహవః శ్రేయాంసోఽస్య
బహుశ్రేయాన్। గోస్త్రియోరితి హ్రస్వే ప్రాప్తే। (వా)
ఈయసో బహువ్రీహేర్నేతి వాచ్యమ్। బహ్వ్యః శ్రేయ
స్యోఽస్య బహుశ్రేయసీ। బహువ్రీహౌ కిమ్। అతిశ్రేయసిః॥

899. ఈయస్ప్రత్యయాన్తము ఉత్తరపదముగాగల బహువ్రీహికంటె కప్ప్రత్యయము రాదు. బహుశ్రేయాన్. శ్రేయస్శబ్దమీయస్ప్రత్యయాన్తము. బహవః శ్రేయాంసః అస్య అనివిగ్రహము. "శేషాద్విభాషా" సూ. చే ప్రాప్తమగు కప్ప్రత్యయమీసూత్రముచే నిషేధింపబడెను.

"ప్రాతిపదికగ్రహణే లిఙ్గవిశిష్టస్యాఽపి గ్రహణమ్" అనుపరిభాషచే సూత్రముననీయస్ గ్రహణమువలన స్త్రీప్రత్యయాన్తమగునీయసన్తము (శ్రేయసీ) గూడ గ్రహింపబడును. శ్రేయసీశబ్దముతో బహ్వ్యః శ్రేయస్యః అస్య

అనువిగ్రహమున సమాసముచేయునపుడు "గోస్త్రియోరుపసర్జనస్య" (660) సూ. చే హ్రస్వము ప్రాప్తమగుచుండ :— (వా) ఈయసో.... .... వాచ్యమ్। ఈయస్ ప్రత్యయాన్తమగు బహువ్రీహికంటె పరమగు స్త్రీప్రత్యయమునకు హ్రస్వము రావనిచెప్పవలయును. ఈవార్తికముచేనిచట శ్రేయసీశబ్దమునకు హ్రస్వము రాదు. బహుశ్రేయసీ అనియగును. ఇచట "నద్యృతశ్చ" సూ చే ప్రాప్తించు కప్ప్రత్యయమీసూత్రముచేనిషేధింపబడెను. అతిశ్రేయసిరి (శ్రేయసీమతిక్రాన్తః) ఇది తత్పురుషము. వార్తికమున బహువ్రీహేః అనుపదములేనిచోనిట్టిచోటులందును హ్రస్వనిషేధము ప్రసక్తమగును.

వివ :— పూర్వసూత్రమును యీసూత్రమును కలిపి "నసంజ్ఞేయసోః" అని యొకేసూత్రమునుచేయక వేరుయోగమును చేయుటవలన నీసూత్రముచే నిత్యము (నద్యృతశ్చ) వైకల్పికమునగు (శేషాద్విభాషా) కప్ప్రత్యయము నిషేధింపబడునని గ్రహించునది.

900. వన్దితే భ్రాతుః. 5-4-157. వన్దితే, భ్రాతుః। (న, కప్)

పూజితేఽర్థే యో భ్రాతృశబ్దస్తదన్తాన్న కప్ స్యాత్। ప్రశస్తో భ్రాతా యస్య ప్రశస్తభ్రాతా। నపూజనాదితి నిషేధస్తు బహువ్రీహౌ సక్థ్యక్ష్ణోరితి ప్రాగేవేతి వక్ష్యతే। వన్దితే కిమ్। మూర్ఖభ్రాతృకః॥

900. పూజింపబడు సోదరుని బోధించు భ్రాతృశబ్దమంతమందుగల బహువ్రీహికంటె కప్ప్రత్యయము రాదు. ప్రశస్తభ్రాతా (ప్రశస్తో భ్రాతా యస్య) ఉత్తముడైన సోదరుడు గలవాడనియర్థము. "నద్యృతశ్చ" సూ. చే ప్రాప్తమగుకప్ప్రత్యయమీసూత్రముచేనిషేధింపబడినది. "నపూజనాత్" (959) దీనికివ్యాఖ్యానము సమాసాన్తప్రకరణమున చేయబడును) సమాసాన్తనిషేధకమగునీసూత్రము. "బహువ్రీహౌ సక్థ్యక్ష్ణోః" అనుసూత్రమునకు పూర్వమునన్న సూత్రములందే ప్రవర్తించునని చెప్పబడును. కాన "బహువ్రీహౌ సక్థ్యక్ష్ణోః" అనుసూత్రముతరువాతనుండు "నద్యృతశ్చ" సూ. చే విహితమగు కప్ప్రత్యయమును వారించుటకై యీసూత్రమావశ్యకమగును. మూర్ఖభ్రాతృకః (మూర్ఖో భ్రాతా యస్య) "నద్యృతశ్చ" సూ. చే కప్ప్రత్యయము. మూర్ఖుడగుసోదరుడుగలవాడని యర్థము. ఇచటి భ్రాతృశబ్దము పూజితుడగుసోదరుని బోధింపదు. కాన నీసూత్రముచేనిచట కప్ప్రత్యయనిషేధము ప్రవర్తింపదు. వన్దితే అనుపదములేనిచోనిట్టిచోటులందును నిషేధము ప్రసక్తమగును.

901. నాడీతన్త్ర్యోః స్వాఙ్గే. 5-4-159. నాడీతన్త్ర్యోః, స్వాఙ్గే। (న, కప్)

స్వాఙ్గే యో నాడీతన్త్రీశబ్దౌ తదన్తాత్ కప్ న స్యాత్। బహునాడిః కాయః। బహుతన్త్రీర్గ్రీవా। తన్త్రీర్ధమనీ। స్త్రీప్రత్యయాన్తత్వాభావాద్ధ్రస్వో న। స్వాఙ్గే కిమ్। బహునాడీకః స్తమ్భః। బహుతన్త్రీకా వీణా॥

901. స్వాంగవాచకములగు నాడీ తన్త్రీ శబ్దములంతమందుగల బహువ్రీహికంటె కప్ప్రత్యయము రాదు. బహునాడిః (బహ్వ్యః నాడ్యో యస్య) శరీరము. ఇచటినాడీశబ్దమునకు నరమని యర్థము. నరములు ప్రాణిస్థములగుటచే నాడీశబ్దము స్వాంగవాచకమగును. ఈవిషయమును సూచించుటకే కాయః అనువిశేష్యము చూపబడెను. "గోస్త్రియోరుపసర్జనస్య" సూ. చే నాడీశబ్దమునకు హ్రస్వము. "నద్యృతశ్చ" సూ. చే ప్రాప్తమగు కప్ప్రత్యయమీసూత్రముచే నిషేధింపబడెను.

బహుతన్త్రీః। తన్త్రీశబ్దమునకును నరమనియే యర్థము. తన్త్రీశబ్దమిచట స్వాంగవాచకమని సూచించుటకు గ్రీవాశబ్దము ప్రయోగింపబడెను. తన్త్రీశబ్దము వీణయొక్క తీగెయందును ప్రసిద్ధమగుటచేనిచటి తన్త్రీశబ్దమట్టియర్థముగలదికాదని తెల్పుటకు "తన్త్రీర్ధమనీ"అనుసర్థనిర్దేశము చేయబడెను. ఈసూత్రముచే కప్ప్రత్యయమునకు నిషేధము. తన్త్రీశబ్దముకంటె "అవితౄస్తృతన్త్రిభ్య ఈః" అను ఉణాదిసూత్రముచే విధింపబడు ఈ ప్రత్యయమువలన తన్త్రీశబ్దము సిద్ధించెను. తన్త్రీశబ్దము స్త్రీప్రత్యయాన్తము గాకపోవుటవలన "గోస్త్రియోః" సూ. చే హ్రస్వము రాదు.

బహునాడీకః (బహ్వ్యః నాడ్యః యస్య) స్తంభము విశేష్యము. ఇచట నాడులు (గీతలు) ప్రాణిస్థములు గాకపోవుటచేనిచట నాడీశబ్దము స్వాంగవాచకము గాదు. అందుచేనీసూత్రమువలన కబ్నిషేధము ప్రవర్తింపదు. "నద్యృతశ్చ" సూ. చే కప్ప్రత్యయము. బహుతన్త్రీకా (బహ్వ్యః తన్త్ర్యః యస్యాస్సా) వీణ విశేష్యము. ఇచటితన్త్రీశబ్దమునకు తీగలని యర్థము. కాన తన్త్రీశబ్దము స్వాంగవాచకము కానేరదు. ఈసూత్రముచే కప్ప్రత్యయనిషేధము ప్రవర్తింపదు. సూత్రమున స్వాఙ్గే అనుపదములేనిచో బహునాడీకః బహుతన్త్రీకా మొదలగువానికంటె కప్ప్రత్యయనిషేధము ప్రసక్తమగును.

902. నిష్ప్రవాణిశ్చ. 5-4-160. నిష్ప్రవాణిః, చ।

కబభావోఽత్ర నిపాత్యతే। ప్రపూర్వాద్వయతేర్ల్యుట్। ప్రవాణీ తన్తువాయశలాకా। నిర్గతా ప్రవాణ్యస్య నిష్ప్రవాణిః పటః। సమాప్తవానః। నవ ఇత్యర్థః॥

902. నిష్ప్రవాణిః అనుబహువ్రీహిసమాసమున కప్ప్రత్యయాభావము యీసూత్రముచే నిపతింపబడెను. ప్ర అనునుపసర్గము పూర్వమందుగల వేఞ్ (తన్తుసన్తానే) ధాతువుకంటె "ల్యుట్ చ" అస్యామ్" (దీనియందు నేయబడును)

అనువిగ్రహమున ల్యుట్ ప్రత్యయముచే ప్రవాణీఅనురూపము సిద్ధించును: ప్రవాణీ శబ్దమునకు సాలివానినేతకఱ్ఱ అనియర్థము. విగతా ప్రవాణీ అస్య అను విగ్రహమున సమాసము. ఉపసర్జనహ్రస్వము. "నద్యృతశ్చ" సూ.చే ప్రాప్తమగు కప్ ప్రత్యయ మీనిపాతనమువలన నివృత్తమగును. వస్త్రము విశేష్యము. సమాప్తమగు వానము (నేత) గలదని సమాసమునకర్థము. నూతనవస్త్రమనిఫలితమగును.

903. సప్తమీవిశేషణే బహువ్రీహౌ. 2-2-35. సప్తమీవిశేషణే, బహువ్రీహౌ। (పూర్వమ్)

సప్తమ్యన్తం విశేషణం చ బహువ్రీహౌ పూర్వం ప్రయోజ్యమ్। కణ్ఠేకాలః। అతఏవ జ్ఞాపకాద్వ్యధికరణపదో బహువ్రీహిః। చిత్రగుః (వా) సర్వనామసంఖ్యయోరుపసంఖ్యానమ్। సర్వశ్వేతః।ద్విశుక్లః।మిథోఽనయోస్సమాసే సంఖ్యాపూర్వమ్। శబ్దపరవిప్రతిషేధాత్। ద్వ్యన్యః। (వా) సంఖ్యయా అల్పీయస్యాః। ద్విత్రాః। ద్వన్ద్వేఽపి। ద్వాదశ। (వా) వా ప్రియస్య। గుడప్రియః। ప్రియగుడః। (వా) గడ్వాదేః పరా సప్తమీ। గడుకణ్ఠః। క్వచిన్న। వహేగడుః॥

903. బహువ్రీహిసమాసమున సప్తమీవిభక్త్యన్తము, విశేషణవాచకము, పూర్వమందు ప్రయోగింపదగినవి. కణ్ఠేకాలః (కణ్ఠే కాలో యస్య) సప్తమ్యన్తమగు కణ్ఠే అనుదానికి పూర్వనిపాతము. "అమూర్ధమస్తకాత్స్వాఙ్గాదకామే" (975) అను సూ. చే సప్తమికి లుగభావమగును.

సూత్రమున సప్తమీగ్రహణము వ్యధికరణములగు పదములకు కొన్ని చోటులందు బహువ్రీహిసమాసముండుననువిషయమున జ్ఞాపకమగును. వ్యధికరణ పదములకు బహువ్రీహిలేనిచో సమానాధికరణములు ప్రథమాన్తములునగుపదములకే బహువ్రీహియగునుగాన కణ్ఠేకాలః ఇత్యాదులందు బహువ్రీహికి ప్రాప్తియే లేకపోవుటచే సప్తమ్యన్తమునకు బహువ్రీహియందు పూర్వనిపాతముకొఱకు సూత్రమున సప్తమీగ్రహణము వ్యర్థమగును. చిత్రగుః। ఇచటిప్రక్రియయిది వరకు నిరూపింపబడెను. చిత్రపదము విశేషణవాచకమగుటచేనద్దానికి యీసూత్రముచే పూర్వనిపాతము.చిత్రగోశబ్దములు రెండును ప్రథమానిర్దిష్టములగుటవలనగాని విగ్రహమందు నియతభక్తికములగుటవలనగాని రెండిటిలోనేదోయొకదానికి పూర్వనిపాతము ప్రాప్తించుచుండ విశేషణమునకే పూర్వనిపాతముకొఱకు సూత్రమున విశేషణగ్రహణము.

1. వా॥ సర్వనామమునకు సంఖ్యావాచకమునకు బహువ్రీహియందు పూర్వనిపాతమును చెప్పవలయును. సర్వశ్వేతః (సర్వః శ్వేతో యస్య) సర్వ శ్వేతశబ్దములు రెండునుగుణవాచకములగుటచేవిశేష్యవిశేషణభావమును యథేష్టముగ జేసికొనవచ్చును. కాన రెండిటిలోనేదోయొకదానికి సూత్రముచే పూర్వనిపాతము

ప్రాప్తించుచుండనీవార్తికముచే సర్వనామసంజ్ఞగల సర్వశబ్దమునకే పూర్వనిపాత మగును ద్విశుక్లః (ద్వౌ శుక్లౌ యస్య) ఇచట సంఖ్యావాచకమగు ద్విశబ్దమునకు పూర్వనిపాతము ఆలోచింపనిచట ద్విశబ్దమునకు సర్వనామమగుటవలననే పూర్వ నిపాతము సిద్ధించును. అయినను త్రిశుక్లః ఇత్యాదులందు సర్వనామములు కానట్టి సంఖ్యావాచకములకు పూర్వనిపాతమునకై వార్తికమున సంఖ్యాగ్రహణమావశ్య కము. సర్వనామములకు సంఖ్యావాచకములకును పరస్పరము సమాసమగునపుడు సంఖ్యావాచకమునకు పూర్వనిపాతమగును. శబ్దపరవిప్రతిషేధమీవిషయమున హేతువగును. సర్వనామసంఖ్యయోః అనుచోట సంఖ్యాశబ్దము పరమగుటచే "విప్రతిషేధే పరం కార్యమ్" అనుసూత్రమువలన నద్దానికే పూర్వనిపాతమగును. సర్వనామసంఖ్యయోః అనునొకేవార్తికమున సర్వనామసంఖ్యావాచకములు పాఠమురై నను పాఠక్రమమునను సరించి సంఖ్యాశబ్దముపరమగుటచేనీవిధముగ శబ్దపరత్వ మునాశ్రయించి విప్రతిషేధసూత్రము ప్రవర్తించునని యభిప్రాయము. ఉదా: — ద్వ్యన్యః ద్విశబ్దాన్యశబ్దములకు సమాసము. ద్విశబ్దమునకు పూర్వనిపాతము. ఈప్రకారముగ సంఖ్యావాచకమునకు పూర్వనిపాతమునకై శబ్దపరవిప్రతిషేధము లభించుటకొఱకే "సర్వనామసంఖ్యయోః" అనుద్వంద్వసమాసమున సర్వనామ శబ్దసంఖ్యాశబ్దములలో నల్పాచ్కమగు సంఖ్యాశబ్దమునకు పరనిపాతముచేయబడి నది.

2. వా॥ సంఖ్యావాచకములయొక్క సమాసమందు స్వల్పసంఖ్యను బోధించు శబ్దమునకు పూర్వనిపాతమగును. ద్విత్రాః ద్వి త్రిశబ్దములలో ద్వి అను నది యల్పార్థవాచకమగుటచే నద్దానికిపూర్వనిపాతమగును. ఈవార్తికము ద్వంద్వ సమాసమందును ప్రవర్తించును. ద్వాదశ (ద్వౌ చ దశ చ) ద్వంద్వసమాసము. ద్విశబ్దదశన్‌శబ్దములలో నల్పార్థబోధకమగు ద్విశబ్దమునకు పూర్వనిపాతమగును.

3. వా॥ బహువ్రీహియందు ప్రియశబ్దమునకు వికల్పముగ పూర్వనిపా తమగును. గుడప్రియః ప్రియగుడః (గుడః ప్రియః యస్య) పూర్వనిపాతమగు నపుడు ప్రియగుడః అనియు లేనపుడు గుడప్రియః అనియు నగును.

4. వా॥ బహువ్రీహియందు గడు మొదలగుశబ్దములకంటె పరముగ సప్త మ్యంతము ప్రయోగింపదగును. గడుకణ్ఠః (గడుః కణ్ఠే యస్య) "సప్తమీవిశేషణే" సూ. చే సప్తమ్యంతమగు కణ్ఠశబ్దమునకు పూర్వప్రయోగము ప్రాప్తించుచుండ నీవార్తికముచే పరనిపాతమగును. ఈవార్తికము కొన్నిస్థలములందు ప్రవర్తిం పదు. కానవిట్టిచోటులందు సప్తమ్యంతమునకు పూర్వనిపాతమగును. వహేగడుః (వహే గడుః యస్య) సప్తమికి అలుగభావము. పైవార్తికమిచట ప్రవర్తింపదు గానసూత్రముచే పూర్వనిపాతమగును.

904. నిష్ఠా. 2-2-36. (బహువ్రీహౌ పూర్వమ్)

నిష్ఠాన్తం బహువ్రీహౌ పూర్వం స్యాత్। కృతకృత్యః।
(వా) జాతికాలసుఖాదిభ్యః పరా నిష్ఠా వాచ్యా। సారఙ్గజగ్ధీ।
మాసజాతా। సుఖజాతా। ప్రాయికం చేదమ్। కృతకటః।
పీతోదకః॥

904. క్తప్రత్యయ క్తవతుప్రత్యయములు నిష్ఠాసంజ్ఞకములు. ప్రత్యయగ్రహణపరిభాషచే తదన్తము గ్రహింపబడును. నిష్ఠాన్తము బహువ్రీహియందు పూర్వప్రయోగార్హమగునని సూత్రార్థము. కృతకృత్యః (కృతం కృత్యం యేన) కృఞ్ ధాతువునకు క్తప్రత్యయముచేసిన కృతశబ్దము సిద్ధించును. కృతశబ్దకృత్యశబ్దములు రెండును క్రియాశబ్దములగుటచే విశేషణవిశేష్యభావము కామచారముగాన రెండిటిలోనేదోయొకదానికి పూర్వనిపాతము ప్రాప్తించుచుండ నీసూత్రముచే నిష్ఠాన్తమగు కృతశబ్దమునకు పూర్వనిపాతము విధింపబడెను.

(వా) బహువ్రీహియందు జాతివాచకములకంటె కాలవాచకములకంటె సుఖాది శబ్దములకంటెను పరముగ నిష్ఠాన్తము ప్రయోగింపదగును. జాతివాచకమునకుదాహరణము:—సారఙ్గజగ్ధీ (సారఙ్గః జగ్ధో యయా) "అస్వాఙ్గపూర్వపదాద్వా" (512) సూ.చే ఙీష్ప్రత్యయమగును. జగ్ధ అనునది క్తప్రత్యయాన్తము. సారఙ్గశబ్దము జాతివాచకము. కాలవాచకమునకుదాహరణము:—మాసజాతా (మాసో జాతో యస్యాః) సుఖశబ్దమునకుదా:—సుఖజాతా (సుఖం జాతం యస్యాః) ఈవార్తికముసార్వత్రికము గాదు. కానకొన్నిచోటులందు జాతి కాల సుఖాదులకంటె పూర్వమందును నిష్ఠాన్తము ప్రయోగింపడగును. ఉదా:— కృతకటః (కృతః కటో యేన) కటశబ్దము జాతివచనమైనను దానికంటెపూర్వముగనే కృతశబ్దము ప్రయోగింపబడెను. పీతోదకః. ఉదకశబ్దము జాతివాచకమైనను పీతశబ్దమునకు పూర్వనిపాతమయ్యెను.

905. వాఽఽహి * తాగ్న్యాదిషు. 2-2-37. వా, ఆహితాఽగ్న్యాదిషు। (నిష్ఠా, పూర్వమ్)

ఆహితాగ్నిః। అగ్న్యాహితః। ఆకృతిగణోఽయమ్।
(వా) ప్రహరణార్థేభ్యః పరే నిష్ఠాసప్తమ్యౌ। అస్యుద్యతః।
దణ్డపాణిః। క్వచిన్న। వివృతాసిః॥

ఇతి బహువ్రీహిః॥

905. ఆహితాగ్న్యాదిగణమున పఠింపబడిన ఆహితాగ్నిః మొదలగు బహువ్రీహిసమాసములందు నిష్ఠాన్తమునకు వికల్పముగ పూర్వనిపాతమగును. ఆహితాగ్నిః – అగ్న్యాహితః (ఆహితాః అగ్నయః యేన) ఆహిత అనెడినిష్ఠాన్త

---

* ఆహితాగ్నిః జాతపుత్రః జాతదన్తః జాతశ్మశ్రుః తైలపీతః ఘృతపీతః ఊఢభార్యః గతార్థః ఆకృతిగణోఽయమ్। తేన గడుకణ్ఠః అస్యుద్యతః దణ్డపాణిః ఇత్యాదిర్జ్ఞేయమ్। ఇత్యాహితాగ్న్యాదిః॥

మునకు వికల్పముగ పూర్వనిపాతము. ఇట్లే జాతదన్తః—దన్తజాతః మొదలగురూపములనూహింపవలయును. ఆహితాగ్న్యాదిగణమాకృతిగణము.

(వా) బహువ్రీహియందు ఆయుధవాచకములకంటె పరముగనిష్ఠాన్తము, సప్తమ్యన్తము, ప్రయోగింపదగును. అస్యుద్యతః (అసిః ఉద్యతః యేన) అసిశబ్దమునకు కత్తియని యర్థము గాననిది ప్రహరణార్థకమగును. ఈవార్తికముచే ఉద్యత అనుక్తాన్తమునకు పరనిపాతము దణ్డపాణిః (దణ్డః పాణౌ యస్య) దండశబ్దము ప్రహరణార్థకమగుటచే సప్తమ్యన్తమగు పాణిశబ్దమునకీవార్తికముచే పరనిపాతము. కొన్నిస్థలములందీవార్తికముచే విధింపబడు పరనిపాతము ప్రవర్తింపదు. వివృతాऽసిః (వివృతః అసిర్యేన) అసిశబ్దము ప్రహరణార్థకము. వివృతశబ్దము క్తప్రత్యయాన్తము.

శ్రీః శ్రీః శ్రీః॥

బహువ్రీహిప్రకరణము సమాప్తము.



# 19. ద్వన్ద్వప్రకరణము

906. చార్థే ద్వన్ద్వః. 2-2-29. చార్థే, ద్వన్ద్వః। (అనేకమ్, సుప్, సమాసః, విభాషా)

అనేకం సుబన్తం చార్థే వర్తమానం వా సమస్యతే స ద్వన్ద్వః। సముచ్చయాన్వాచయేతరేతరయోగసమాహారాశ్చార్థాః। పరస్పరనిరపేక్షస్యానేకస్యైకస్మిన్నన్వయస్సముచ్చయః। అన్యతరస్యానుషఙ్గికత్వేఽన్వాచయః। మిలితానామన్వయ ఇతరేతరయోగః। సమూహస్సమాహారః। తత్రేశ్వరం గురుం చ భజస్వేతి సముచ్చయే। భిక్షామట గాం చానయేత్యన్వాచయే చ న సమాసోఽసామర్థ్యాత్। ధవఖదిరౌ। సంజ్ఞాపరిభాషమ్। అనేకో హోతృపోతృనేష్టోద్గాతారః। ద్వయోర్ద్వయోర్ద్వన్ద్వం కృత్వా పునర్ద్వన్ద్వే తు హోతాపోతానేష్టోద్గాతారః॥

906. చకారద్యోత్యమగునర్థమున వర్తమానములు ననేకములునగు సుబన్తములు వికల్పముగ సమసించును, అది ద్వన్ద్వసంజ్ఞగలదగును. సముచ్చయము అన్వాచయము ఇతరేతరయోగము సమాహారము ఇవి చకారద్యోత్యములు. ఒకదాని యపేక్షమరియొకదానికి లేనట్టి యనేకార్థములొకొక యర్థమందన్వయమున్నపుడు సముచ్చయము చార్థమగును. పరస్పరనిరపేక్షములనొకటిక్రియ యందన్వయించినపిదప మరియొకటిక్రియావృత్తిచే నాక్రియ యందన్వయించుట. ఈశ్వరం గురుం చ భజస్వ। పరస్పరాపేక్షలేనట్టి యీశ్వరునికి గురువునకును భజనక్రియ యందు కర్మగనన్వయ ముండుటచే నిది సముచ్చయమునకుదాహరణము. రెండువస్తువులలో నొకటిప్రధానమై రెండవది యప్రధానమైనపుడు (అనుషఙ్గికము - అనుద్దేశ్యము) చశబ్దార్థమన్వాచయ మనబడును. భిక్షామట। గాఞ్చానయ। భిక్షాటనము ప్రధానముగుటచే నిది యన్వాచయ మునకుదాహరణము. భిక్షకొరకేగునపుడు మార్గమున గోవుగాన్పించిన తెమ్మ నియు గవానయనము లేకున్నను భిక్షకు తప్పకనేగుమనియు నీవాక్యమునకర్థము. భిక్షకేగునపుడును వెదకి యావును తెచ్చుట యావశ్యకము గానందున గవానయన మానుషఙ్గికము. (అప్రధానము) పరస్పరాపేక్షగలయనేకపదార్థములకు (ఉద్భూతావయవభేదముగలసమూహములకు) ఒకయర్థమందు (ఏకధర్మావచ్ఛిన్నము)

అన్వయమున్నపుడు చార్థమితరేతరయోగమగును. సమూహము (అనుద్భూతావయవభేదముగలది) సమాహారము. లౌకికవిగ్రహములలో సముచ్చయమందు (ఈశ్వరం గురుం చ భజస్వ) అన్వాచయమందును (భిక్షామట గాం చానయ) అనేకసుబన్తములు చార్థమున వర్తమానములుగాకుండుటవలన నేకార్థీభావసామర్థ్యము లేనందున సమాసమురాదు. ఇతరేతరయోగమందు సమాహారమందును నేకసుబన్తములకేకార్థీభావముండుటచే సమాసమగును. "[illegible]" అనుచోటమేలనమన సముదాయము. ఇది సమస్యమానపదార్థములనుగురించి విశేషణమగును. కావుననేయిచట సమాసముకంటె ద్వివచనబహువచనములగును. ఉదా :— ధవఖదిరౌ ఛిన్ధి (సముదాయమునకవయవములగు ధవఖదిరములనుభేదింపుము) సమాహారమున సముదాయము వర్తిపదార్థములనుగురించి విశేష్యమగును. కావున ప్రధానమగుసముదాయమొక్కటే సమాసబోధ్యమగుటవలన నీసమాసముకంటెనెపుడునేకవచనమే వచ్చును. ఉదా :— సంజ్ఞాపరిభాషమ్ (సంజ్ఞాపరిభాషలసమూహము) ఇతరేతరయోగసమాహారములు సమాసముచే నుక్తములగుటవలన సమాసమున చశబ్దమునకు ప్రయోగముండదు. అనేకపదము ననువృత్తిచేసి యనేక సుబన్తములకు ద్వన్ద్వమగుననుటవలన హోతృపోతృ నేష్టృ ఉద్గాతృ శబ్దములకు ద్వన్ద్వము సిద్ధమగును. "ఆనఙ్ ఋతో ద్వన్ద్వే" (926) సూ. చే నుత్తరపదముపరమగునపుడు విధింపఁబడునానఙాదేశము నేష్టృశబ్దమునకే ప్రవర్తించెను. హోతృపోతృశబ్దములకుత్తరపదము పరముగలేనందున నానఙ్ రాదు. ఉత్తరపదమనసమాసచరమావయవము. హోతృపోతృపదములకు, నేష్టృ ఉద్గాతృ శబ్దములకును, వేరువేరుగ ద్వన్ద్వముచేసి యాద్వన్ద్వములకు తిరుగ ద్వన్ద్వముచేసినచో హోతాపోతానేష్టోద్గాతారః అని యగును. మొదటిద్వన్ద్వములందు హోతృనేష్టృశబ్దములకుత్తరపదము పరమగుటచే నానఙ్ ప్రవర్తించును. పిదప ప్రవృత్తమగు ద్వన్ద్వమున నేష్టోద్గాతృశబ్దముత్తరపదమగుటచే పోతృశబ్దమునకునానఙ్ వచ్చును.

907. * రాజదన్తాదిషు పరమ్. 2-2-31. రాజదన్తాదిషుపరమ్॥

---

* రాజదన్తః అగ్రేవణమ్ లిప్తవాసితమ్ నగ్నముషితమ్ సిక్తసంమృష్టమ్ మృష్టలుంచితమ్ అవక్లిన్నపక్వమ్ అర్పితోప్తమ్ ఉప్తగాఢమ్ ఉలూఖలముసలమ్ తండులకిణ్వమ్ దృషదుపలమ్ ఆరగ్వాయనబన్ధకీ చిత్రరథబాహ్లీకమ్ అవన్త్యశ్మకమ్ శూద్రార్యమ్ స్నాతకరాజానౌ విష్వక్సేనార్జునౌ అక్షిభ్రువమ్ దారగవమ్॥ ధర్మాదిషూభయమ్॥ అర్థధర్మౌ ధర్మార్థౌ అర్థశబ్దౌ శబ్దార్థౌ అర్థకామౌ కామార్థౌ వైకారిమతమ్ గోజవాజమ్ గోపాలధానీపూలాసమ్ పూలాసకకురండమ్ స్థూలపూలాసమ్ ఉశీరబీజమ్ సిఞ్జాస్థమ్ చిత్రాస్వాతీ భార్యాపతీ దంపతీ జంపతీ జాయాపతీ పుత్రపతీ పుత్రపశూ కేశశ్మశ్రూ శిరోబీజమ్ శిరోజాను సర్పిర్మధునీ మధుసర్పిషీ ఆద్యన్తౌ అన్తాదీ గుణవృద్ధీ వృద్ధిగుణౌ। ఆకృతిగణోఽయం రాజదన్తాదిః॥

ఏషు పూర్వప్రయోగార్హం పరం స్యాత్। దన్తానాం రాజా రాజదన్తః। ధర్మాదిష్వనియమః। అర్థధర్మౌ। ధర్మార్థౌ। దమ్పతీ। జమ్పతీ। జాయాపతీ। జాయాశబ్దస్య దమ్భావో జమ్భావశ్చ వా నిపాత్యతే। ఆకృతిగణోఽయమ్॥

907. రాజదన్తాదిగణపఠితములందాయాసూత్రములచే పూర్వప్రయోగార్హ మగునది పరమున ప్రయోగింపదగును. "ఉపసర్జనమ్" (658) ఇత్యాదిసూత్ర ములచే ప్రాప్తమగు పూర్వనిపాతమునకిది యపవాదము. రాజదన్తః (దన్తానాం రాజా) ఇచట "సుపసర్జనమ్" సూ. చే దన్తశబ్దమునకు పూర్వనిపాతము ప్రాప్తమగు చున్నది. రాజదన్తాదులందు షష్ఠీతత్పురుషములకు కర్మధారయములకు ద్వన్ద్వము లకును పాఠముండుటవలన నీసూత్రము సర్వసమాసవిషయకమైనను "అర్థధర్మౌ" ఇత్యాదులననుసరించి యీప్రకరణమున నుపన్యసింపబడినదని తెలియునది. ద్వన్ద్వ సమాసమున ధర్మాదిశబ్దములవిషయమై పరనిపాతమగుననునియమము ప్రవర్తిం చదు. ఇదిగణసూత్రము. అర్థధర్మౌ। ధర్మార్థౌ। దమ్పతీ। జమ్పతీ। జాయాపతీ। (జాయా చ పతిశ్చ) జాయాశబ్దమునకు దమ్ జమ్ అనునాదేశములు గణమున నిపతింపబడినవి. అభ్యర్హితమగుటచే పతిశబ్దమునకు పూర్వనిపాతము ప్రాప్తమగు చుండ నీసూత్రముచే పరనిపాతము. రాజదన్తాదిగణమాకృతిగణము.

908. ద్వన్ద్వే ఘి. 2-2-32. ద్వన్ద్వే ఘి। (పూర్వమ్)

ద్వన్ద్వే ఘిసంజ్ఞం పూర్వం స్యాత్। హరశ్చ హరిహరౌ॥ అనేకప్రాప్తావేకత్ర నియమోఽనియమశ్శేషే హరిగురుహరాః। హరిహరగురవః॥

908. ద్వన్ద్వసమాసమున ఘిసంజ్ఞకమునకు పూర్వనిపాతమగును. హరి హరౌ (హరిశ్చహరశ్చ) ద్వన్ద్వమున సమస్యమానపదములన్నియును ప్రథమాన్త ములే యగుటవలననుపసర్జనములగును. కావున పూర్వనిపాతమునకనియమము ప్రాప్తమగుచుండ ఘిసంజ్ఞకమునకే పూర్వనిపాతమగునను నియమమునకై యీసూత్రమారంభింపబడెను. (వా) అనేకములకు పూర్వనిపాతము ప్రాప్తమగు నపుడొకదానికే యీనియమమగును ఇతరములకు లేదు. హరిగురుహరాః। హరిహర గురవః। హరగురుశబ్దములకీనియమము ప్రవర్తించదు.

909. అజాద్యదన్తమ్. 2-2-33. (ద్వన్ద్వే, పూర్వమ్)

ఇదం ద్వన్ద్వే పూర్వం స్యాత్। ఈశకృష్ణౌ। బహుష్వ నియమః। అశ్వరథేన్ద్రాః॥ ఇన్ద్రాశ్వరథాః। ఘ్యన్తాదజాద్యద న్తం విప్రతిషేధేన। ఇన్ద్రాగ్నీ॥

909. అచ్చులాదియందు హ్రస్వాకారమన్తమందుగలది యజాద్యదన్తము। ఇట్టిశబ్దము ద్వన్ద్వమున పూర్వప్రయోగార్హము. ఉదా:—ఈశకృష్ణౌ। అజాద్య

ద్వ్యచ్కములనేకములున్నపుడీనియమము ప్రవర్తింపదు. అశ్వరథేన్ద్రాః। ఇన్ద్రాశ్వరథాః (వా) ఘిసంజ్ఞకమునకును అజాద్యదన్తమునకును ద్వన్ద్వముచేయునపుడు పరమగు "అజాద్యదన్తమ్" అనుసూత్రముచే నజాద్యదన్తమునకే పూర్వనిపాతమగును. ఇన్ద్రాగ్నీ॥

వివ:—"సశోష్ఠసౌదార్యవిశేషశాలినీమ్" అనికారవిప్రయోగించెను. శోష్ఠసౌదార్యయోర్యేవిశేషాస్తచ్ఛాలినీమ్ అని యర్థము. శోష్ఠసౌదార్యమ్మనుద్వన్ద్వమున నీసూత్రముచే సౌదార్యశబ్దమునకు పూర్వనిపాతము ప్రాప్తమగుటచే నీప్రయోగమెట్లు సాధువగుననిన "సముద్రాభ్రాద్ఘః" (4-4-118) "లక్షణహేత్వోః క్రియాయాః" (3-2-126) మొదలగ సౌత్రనిర్దేశములచే నీపూర్వనిపాతప్రకరణమనిత్యమగుటవలన కారవిప్రయోగము సాధువగునని తెలియనగును. సముద్రాభ్రాత్తనుచోటనీసూత్రమును, లక్షణహేత్వోః అనుచోటద్వన్ద్వేఘి అనుసూత్రమునుప్రవర్తింపఁజేయకుండుటచేనీనిర్దేశములకార్థమున జ్ఞాపకమగును.

910. అల్పాచ్తరమ్. 2-2-34. (ద్వన్ద్వే। పూర్వమ్)

శివకేశవౌ। 1 ఋతునక్షత్రాణాం సమాక్షరాణామానుపూర్వ్యేణ. హేమన్తశిశిరవసన్తాః।కృత్తికారోహిణ్యౌ।సమాక్షరాణాం కిమ్। గ్రీష్మవసన్తౌ॥ 2 లఘ్వక్షరం పూర్వమ్॥ కుశకాశమ్॥ 3 అభ్యర్హితం చ॥ తాపసపర్వతౌ॥ 4 వర్ణానామానుపూర్వ్యేణ॥బ్రాహ్మణక్షత్రియవిట్శూద్రాః॥ 5 భ్రాతుర్జ్యాయసః॥ యుధిష్ఠిరార్జునౌ॥

910. ద్వన్ద్వమునందు శబ్దములలో స్వల్పమగునచ్చులుగలది పూర్వప్రయోగార్హమగునని సూత్రార్థము. శివకేశవౌ (అల్పాచ్కములనేకములున్నపుడు నియమములేదు. శఙ్ఖదున్దుభివీణాః। వీణాశఙ్ఖదున్దుభయః) 1 వా॥ సమానమగునచ్చులుగల ఋతువాచకములయొక్కద్వన్ద్వమందు, సమానమగునచ్చులుగల నక్షత్రవాచకములద్వన్ద్వమందును క్రమము(అనుపూర్వ్యము) ననుసరించి పూర్వనిపాతము చెప్పఁదగును. ఋతువులకు క్రమము ప్రాదుర్భావకృతమనియు నక్షత్రములకలది యుదయకృతమనియును గ్రహించునది. ఉదా:—హేమన్తశిశిరవసన్తాః। కృత్తికారోహిణ్యౌ। సమానాచ్కములకనిచెప్పనియెడలగ్రీష్మవసన్తౌ అనుచోటనీసూత్రము ప్రసక్తమగును. 2 వా॥ లఘ్వక్షరములుగలశబ్దము గుర్వక్షరములు గలశబ్దము ద్వన్ద్వమునన్నపుడు లఘ్వక్షరశబ్దము పూర్వప్రయోగార్హమగును. కుశకాశమ్॥ 3 వా॥ ద్వన్ద్వమున శ్రేష్ఠవాచకమునకు పూర్వనిపాతమును చెప్పవలయును. తాపసపర్వతౌ। స్థావరమగు పర్వతముకంటె జ్ఞానియగుతాపసుడు శ్రేష్ఠుడు. 4 వా॥ ద్వన్ద్వమున వర్ణవాచకములు క్రమమునమనుసరించి పూర్వప్రయోగార్హములగును. బ్రాహ్మణక్షత్రియవైశ్య శూద్రులు వర్ణములు. బ్రాహ్మణాదులకు క్రమము వేదా

దులవలన సిద్ధమగును. ఉదా:— బ్రాహ్మణక్షత్రియవిట్శూద్రాః। రి వా॥ జ్యేష్ఠ సోదర వాచకము ద్వన్ద్వమునఁ బూర్వప్రయోగార్హమగును. ఉదా:—యుధిష్ఠిరార్జునౌ॥

వివ:—అల్పాచ్తరమనుచోట తరప్ప్రత్యయమీనిర్దేశమువలన స్వార్థికము గానియతిశయార్థకముగాదని కొందరనిరి. తరబర్థమగునతిశయమిచట వివక్షితమున వివక్షితమను పక్షద్వయము భాష్యమున విచారింపఁబడుటచే పూర్వోక్తవాదము భాష్యవిరుద్ధమని గ్రహించునది. సూత్రమున కత్వఖ్యత్వములయభావముమాత్రము నిపాతనలభ్యమగును. "అజాద్యదన్తమ్"ను సూత్రము పరములగు, అల్పాచ్తరమ్, లఘ్వక్షరమ్ మొదలగు వానిచేబాధింపఁబడును. "వాసుదేవార్జునాభ్యాంవున్" (4-3-98) అనుసూత్రనిర్దేశముచేనన్నిటకంటె నభ్యర్హితము పూర్వప్రయోజ్యమని గ్రహింపవలయును.

911. ద్వన్ద్వశ్చ ప్రాణితూర్యసేనాఙ్గానామ్. 2-4-2. ద్వన్ద్వః చ ప్రాణితూర్యసేనాఙ్గానామ్। (ఏకవచనమ్)

ఏషాం ద్వన్ద్వః ఏకవత్స్యాత్। పాణిపాదమ్। మార్దఙ్గికపాణవికమ్। సమాహారస్యైకత్వాదేకత్వేసిద్ధే నియమార్థమ్ ప్రకరణమ్।ప్రాణ్యఙ్గాదీనాం సమాహార ఏవ యథాస్యాత్॥

911. ప్రాణితూర్యసేనాఙ్గానామ్ = ప్రాణితూర్యసేనాశబ్దములకు ద్వన్ద్వము దీనికఙ్గశబ్దముతో షష్ఠీతత్పురుషము. అఙ్గశబ్దము ప్రాణ్యాదులతో ప్రత్యేకము సంబంధించును. అఙ్గశబ్దము ప్రాణిసేనలవిషయమున నవయవ బోధకము. తూర్యము విషయమున నుపకారకపరము. ప్రాణ్యవయవబోధకమగునొకశబ్దమునకు ద్వన్ద్వము సమ్భవింపదనునితరము ప్రత్యాసత్తిచే ప్రాణ్యవయవమే గ్రహింపదగును. ఇట్లే సేనావయవపరమగు ద్వన్ద్వము నూహించునది. కావుననే ప్రాణ్యఙ్గములకు ప్రాణ్యఙ్గములతోనే సేనాఙ్గములకు సేనాఙ్గములతోనే ద్వన్ద్వముచేయునపుడు ఏకవద్భావమనునర్థము సిద్ధమగును. దీనికి "మార్దఙ్గికాశ్వారోహౌ" అనుచోటనేకవద్భావనివృత్తి ఫలమగును. అనువృత్తమగునేకవచనశబ్దము "ఏకంవక్తి" అనువ్యుత్పత్తిచే నేకత్వజ్ఞ్యగలదానికి బోధకమగును. ఏకవత్తనునది ఫలితార్థము. ప్రాణ్యాద్యవయవములద్వన్ద్వమేకవద్భావమునొందునని సూత్రార్థము. ఇట్టిద్వన్ద్వమేకార్థబోధకపదమువలెనేకవచనాన్తమగునని గ్రహించునది. (సమాహారద్విగువిషయకమగు "ద్విగురేకవచన"మ్మను సూత్రసాహచర్యమువలనవ్యాఖ్యానమువలన నీసూత్రము సమాహార ద్వన్ద్వవిషయకమగునని తెలియదగును) పాణిపాదమ్ (పాణ్యోః పాదయోశ్చ సమాహారః) ఏకవద్భావమువలననేకవచనము, "సనపుంసకమ్" (825) సూ. చే నపుంసకలిఙ్గమునగును. ఇది ప్రాణ్యఙ్గములకుదాహరణము. మార్దఙ్గికపాణవికమ్। మార్దఙ్గికులు = మద్దెలనువాయించుటయందు నేర్పరులు. పాణవికులు = పణవమనువాద్యవిశేషమును వాయించుటయందు నిపుణులు. ఇది తూర్యాఙ్గములకుదాహరణము. రథికాశ్వారోహమ్, రథికులు = రథముచే సంచరిం

చువారు. అశ్వారోహులు = గుఱ్ఱములనెక్కువారు. ఇది సేనాఙ్గములకుదాహరణము. సమాహారమేకరూపమే గాననచట నేకవద్భావము సిద్ధమగుచుండ సమాహారద్వన్ద్వ విషయకమగు నీప్రకరణము నియమార్థమగును, ప్రాణ్యఙ్గాదులకు సమాహారమందే సమాసమగునుగాని యితరేతరయోగమున లేదని నియమస్వరూపము.

వివ :— 1. ఏకవద్భావప్రకరణము విషయవిభాగముకొఱకగును. ప్రాణ్యఙ్గాదులకు సమాహారమందే ద్వన్ద్వము. వృక్షాదులకితరేతరయోగమందే ద్వన్ద్వము శేషించినవానికుభయమందు ద్వన్ద్వమగునవి.

2. సమాహారమందు ప్రాణ్యఙ్గాదులకే యేకవద్భావమనువిపరీతనియమమును శఙ్కింపవలసుపడదు. "తిష్యపునర్వస్వోః" (8?4) అనుసూత్రమున (బహువచనమునకు ద్వివచనము విధించునది) బహువచనగ్రహణమిందు మానము. సమాహారమందేకవచనమునకు (ఇదం తిష్యపునర్వసు = సమాహారద్వన్ద్వము) ద్వివచనమును వారించుటకై బహువచనశబ్దము గ్రహింపబడెను. పై జెప్పఁబడిన విపరీతనియమము స్వీకరింపఁబడినచో తిష్యపునర్వసువులకేకవద్భావము ప్రాప్తము గానందున బహువచనగ్రహణము వ్యర్థము గావలయును. కావున నేతత్ప్రకరణబహిర్భూతములగు వానికిని సమాహారద్వన్ద్వమగును. ఉత్తరసూత్రములు నిత్యైకవద్భావనియామకములని గ్రహించునది.

912. అనువాదే చరణానామ్. 2-4-3. అనువాదే చరణానామ్। (ద్వన్ద్వః, ఏకవచనమ్)

చరణానాం ద్వన్ద్వ ఏకవత్స్యాత్, సిద్ధస్యోపన్యాసే। (వా) స్థేణోర్లుఙీతి వక్తవ్యమ్। ఉదగాత్కఠకాలాపమ్। ప్రత్యష్ఠాత్కఠకౌథుమమ్॥

912. చరణశబ్దము వేదశాఖలనధ్యయనము చేయువారిని బోధించును. ఇతరప్రమాణములచే సిద్ధమగునర్థమును కార్యాన్తరార్థమై యుపన్యసించుట యనువాదమనబడును. శాఖాధ్యేతృవాచకములద్వన్ద్వము సమాసముచే ననువాదము గమ్యమానమగునపుడేకవద్భావమునొందును (వా) లుఙన్తములగు స్థాధాత్విణ్ధాతువుల ప్రయోగమందీసూత్రము ప్రవర్తించునని చెప్పవలయును. ఉదగాత్ కఠకాలాపమ్ (కఠానాం కాలాపానాం చ సమాహారః) కఠప్రోక్తమగు శాఖనధ్యయనము చేయువారు కఠులు, కలాపి ప్రోక్తమగు శాఖనధ్యయనము చేయువారు కాలాపులు. ఉదగాత్తనునది ఇణ్ధాతుప్రకృతికలుఙన్తము. కఠులయొక్క కాలాపుల యొక్క ఉదయమిచట ననువదింపబడెను. ప్రత్యష్ఠాత్కఠకౌథుమమ్ (కఠానాం కౌథుమానాం చ సమాహారః) కఠులయొక్క కౌథుములయొక్క ప్రతిష్ఠ యనువదింపఁబడెను. ప్రత్యష్ఠాత్తనునది స్థాధాతుప్రకృతికలుఙన్తము.

913. అధ్వర్యుక్రతురనపుంసకమ్. 2-4-4. అధ్వర్యుక్రతుః, అనపుంసకమ్॥

యజుర్వేదే విహితో యః క్రతుస్తద్వాచినామనపుంసకలిఙ్గానాం ద్వన్ద్వః ఏకవత్స్యాత్। అర్కాశ్వమేధమ్। అధ్వర్యుక్రతుః కిమ్। ఇషువజ్రౌ సామవేదే విహితౌ। అనపుంసకం కిమ్। రాజసూయవాజపేయే। అర్ధర్చాదీ॥

913. అధ్వర్యుక్రతుః అనుచోట ప్రథమావిభక్తి సంబన్ధార్థకము. అధ్వర్యుశబ్దము లక్షణచే యజుర్వేదమును బోధించును. యజుర్వేదమున విధింపబడు యాగములను బోధించెడి స్త్రీలిఙ్గపుంలిఙ్గముల యొక్క ద్వన్ద్వమేకవద్భావమునొందు నని సూత్రార్థము. అర్కాశ్వమేధమ్ (అర్కస్యచాశ్వమేధస్య చ సమాహారః) అర్కము అశ్వమేధము నివి యజుర్వేదవిహితములగు క్రతువులు. ఇషువజ్రౌ (ఇషుశ్చవజ్రశ్చ) ఇవి సామవేదవిహితక్రతువులు. వీనికేకవద్భావమును వారించుటకై అధ్వర్యుక్రతుః అనునది యావశ్యకము. రాజసూయవాజపేయే (రాజసూయం చ వాజపేయం చ) అర్ధర్చాదిగణపాఠమువలననివి నపుంసకలిఙ్గములయినను. ఇట్టిచోటనేకవద్భావవారణార్థమై అనపుంసకమనునది యావశ్యకము.

914. అధ్యయనతోఽవిప్రకృష్టాఖ్యానామ్. 2-4-5. అధ్యయనతః, అవిప్రకృష్టాఖ్యానామ్॥

అధ్యయనేన ప్రత్యాసన్నా ఆఖ్యా యేషాం తేషాం ద్వన్ద్వ ఏకవత్స్యాత్। పదకక్రమకమ్॥

914. అధ్యయనతః ఇది తృతీయార్థకతసిప్రత్యయాన్తము. అధ్యయనముచే సన్నికృష్టములగువారిని బోధించుశబ్దముల యొక్క ద్వన్ద్వమేకవద్భావము నొందును. పదకక్రమకమ్ (పదకానాం క్రమకాణాం సమాహారః) పదమునధ్యయనము చేయువారు పదకులు. క్రమమునధ్యయనము చేయువారు క్రమకులు. మొదట మన్త్రములను (సంహితను) చదివి పిదప మన్త్రములలోని పదములను పఠించి పిదప నాపదములకు క్రమమును చెప్పుదురు. కావున పదక్రమములకు ప్రత్యాసత్తి (సన్నికర్షము) సిద్ధమగును. వీనిద్వారా పదకక్రమకులకును ప్రత్యాసత్తి లబ్ధమగును.

వివ :— అధ్యయనమునందు ప్రత్యాసత్తి యధ్యేయమందు తద్ద్వారా తదధ్యేతలందునారోపింపబడునని గ్రహించునది. పదక్రమశబ్దములకు తరసూత్రముచే నేకవద్భావము సిద్ధమగుటచే నీసూత్రము తదధ్యేతృపురుషవాచకములందే ప్రవర్తించును.

915. జాతిరప్రాణినామ్. 2-4-6. జాతిః, అప్రాణినామ్॥

ప్రాణివర్జ్యజాతివాచినాం ద్వన్ద్వ ఏకవత్। ధానాశష్కులి। ప్రాణినాం తు విట్శూద్రాః। ద్రవ్యజాతీయానామేవ। నేహ।

రూపరసౌ। గమనాకుఞ్చనే। జాతిప్రాధాన్య ఏవాయమేక
వద్భావః। ద్రవ్యవిశేషవివక్షాయాం తు బదరామలకాని॥

౯౧౬. జాతిః అనుచోట ప్రథమ షష్ఠ్యర్థకము. ప్రాణిభిన్నమగు జాతిని బోధించుశబ్దములయొక్క ద్వన్ద్వమేకవద్భావమునొందును. ఉదా:-ధానాశష్కులి (ధానాశ్చ శష్కుల్యశ్చ తాసాం సమాహారః) విట్శూద్రాః। ఈశబ్దములు ప్రాణివాచకములగుటచేనిచట నేకవద్భావమును వారించుటకై "అప్రాణినామ్" అనునది యావశ్యకము, అప్రాణినామనునది పర్యుదాసము. ప్రాణిభిన్నము ప్రాణిసదృశమునగుదానిని (జాతిని) బోధించును. పర్యుదాసముచే ప్రాణిభిన్నద్రవ్యజాతివాచకములే ఇచట జాతిపదముచే గ్రహింపబడును. ధానాశష్కులీశబ్దములట్టి ద్రవ్యజాతివాచకములు. రూపరసౌ (గుణజాతివాచకములు) గమనాకుఞ్చనే (క్రియాజాతివాచకములు) ఈద్వన్ద్వములందేకవద్భావమునువారించుట కప్రాణినామనుచోట పర్యుదాసాశ్రయణము ఫలము. అప్రాణినామనుపర్యుదాసముచే జాతివాచకములనననుసర్థము లభించుచుండ నతిరిక్తజాతిగ్రహణము జాతిప్రాధాన్యమందే యీ సూత్రమునకు ప్రవృత్తిని బోధించును. వ్యక్తివిశేషమును వివక్షింపక జాత్యాశ్రయ సకలవ్యక్తులను బోధించుట జాతిప్రాధాన్యమనబడును. వ్యక్తివిశేషము వివక్షితమగునపుడీయేకవద్భావము ప్రవర్తించదు. ద్రవ్యవిశేషవివక్షయన నియతమగు ద్రవ్యమును బోధింపనిచ్ఛ. బదరామలకాని (బదరాణ్యామలకాని చ) ఇవి ఫలత్వమను వ్యాప్యజాతివాచకములు. అనేకములగు బదరాదిబోధకములగుటచే నిచట బదరాదిశబ్దములు నియతములగు వ్యక్తులను బోధించును గాని జాత్యాశ్రయములగు సకలవ్యక్తులను బోధింపవు కావున జాతికి ప్రధాన్యములేనందున నేకవద్భావము ప్రవర్తించదు.

౯౧౭. విశిష్టలిఙ్గో నదీ దేశోఽగ్రామాః. 2-4-7. విశిష్టలిఙ్గః. నదీ, దేశః. అగ్రామాః (ద్వన్ద్వః, ఏకవచనమ్)

గ్రామవర్జ్యనదీదేశవాచినాం భిన్నలిఙ్గానాం సమాహారే ద్వన్ద్వ ఏకవత్స్యాత్। ఉద్ధ్యశ్చ ఇరావతీ చ ఉద్ధ్యేరావతి। గఙ్గా చ శోణశ్చ గఙ్గాశోణమ్। కురవశ్చ కురుక్షేత్రం చ కురుకురుక్షేత్రమ్। భిన్నలిఙ్గానాం కిమ్। గఙ్గాయమునే। మద్రకేకయాః। అగ్రామాః కిమ్। జామ్బవం నగరమ్। శాలూకినీ గ్రామః। జామ్బవశాలూకిన్యౌ॥

౯౧౭. విశిష్టలిఙ్గః నదీ దేశః వినిలోనేకవచనముషష్ఠ్యర్థకము బహువ్రీహ్యర్థకముగూడనగును. విశిష్టలిఙ్గః అనునది బహువ్రీహి (విశిష్టం లిఙ్గం యేషాం) విశిష్టమన భిన్నము. విభిన్నలిఙ్గములుగలవని యర్థము. నదీ = నదీవాచకానామ్। దేశః = దేశవాచకానామ్। నదీశబ్దముచే నదములనుగ్రహించను. కావుననిచట భిన్నలిఙ్గకములగుట సమ్భవించును. సూత్రమున రెండువాక్యములనూహింపవలెను.

గ్రామవాచకభిన్నములు భిన్నలిఙ్గకములునగు నదీనదవాచకములద్వన్ద్వమేకవద్భావ మునొందును, గ్రామవాచకభిన్నములు భిన్నలిఙ్గకములునగు దేశవాచకములద్వన్ద్వ మేకవద్భావమునొందునని. దేశశబ్దమునకుమనుష్యవాసయోగ్యములగుస్థలములర్థము. వాక్యభేదమువలన నదీవాచకదేశవాచకములకు సమాహారమే యనెడినియమము లేదని సిద్ధమగును. కావున గఙ్గాకురుక్షేత్రే। అనుచోటనేకవద్భావము ప్రవర్తించదు. నద్యవయవకద్వన్ద్వమునకుదాహరణములు. ఉద్ధ్యైరావతి (ఉద్ధ్యః = నదవిశేషము, ఇరావతీ = నదీవిశేషము) ఇట్లే గఙ్గాశోణమ్। అనుచోటనేకవద్భావము నూహించునది. దేశవాచకద్వన్ద్వమునకుదా :— కురుకురుక్షేత్రమ్ (కురవశ్చ కురుక్షేత్రం చానయోస్సమాహారః) గఙ్గాయమునే। మద్రకేకయాః। ఇవి సమానలిఙ్గకములద్వన్ద్వములు. విశిష్టలిఙ్గః అనువిశేషణములేనిచోనిచటనేకవద్భావము ప్రసక్తమగును. "అగ్రామాః" అనుచోటగ్రామశబ్దమునకు గ్రామావయవకద్వన్ద్వ మని యర్థము. ఈపర్యుదాసములేనిచో జామ్బవశాలూకిన్యౌ (జామ్బవం, నగరమ్ శాలూకినీ, గ్రామః) ఇచ్చోటనేక వద్భావము ప్రసక్తమయ్యెడిని॥

917. క్షుద్రజన్తవః. 2-4-8. (ద్వన్ద్వః, ఏకవచనమ్)

ఏషాం సమాహారే ద్వన్ద్వ ఏకవత్స్యాత్। యూకాలిక్షమ్।
ఆనకులాత్ క్షుద్రజన్తవః॥

917. క్షుద్రజన్తువులననల్పపరిమాణముగల జన్తువులు. క్షుద్రజన్తువాచకములద్వన్ద్వమేకవద్భావమునొందును. యూకాలిక్షమ్ (యూకానాంలిక్షాణాం చ సమాహారః) అల్పపరిమాణముగల దోమమొదలు ముంగిసవరకు క్షుద్రజన్తువులనబడును.

వివ :— క్షుద్రజన్తువులెవ్వి యనువిషయమునమతభేదములు గలవు. ఎముకలులేనివని కొందఱు, అల్పపరిమాణముగలవని కొందఱు, అధికమగు సన్తతి గలవని కొందఱు, ముంగిసయవధిగగల చిన్నజన్తువులనిమరికొందరునుచెప్పిరి (శ్లో॥ క్షుద్రజన్తురనస్థిస్స్యాదథవా క్షుద్ర ఏవయః। శతం వా ప్రసృతా యేషాం కేచిదానకులాదపి) యూకాలిక్షమనునదిసర్వపక్షసాధారణమగునుదాహరణము.

918. యేషాం చ విరోధశ్శాశ్వతికః. 2-4-9. యేషాం, చ, విరోధః, శాశ్వతికః॥

ఏషాం ప్రాగ్వత్। అహినకులమ్। గోవ్యాఘ్రమ్। కాకోలూకమిత్యాదౌ పరత్వాద్విభాషావృక్షమృగేతి ప్రాప్తం చ కారేణ బాధ్యతే॥

918. ఇచట విరోధశబ్దమునకు వైరమని యర్థము. శాశ్వతికమనస్వాభావికము (నిత్యము) స్వాభావికమగు వైరముగలవానిని బోధించుశబ్దములద్వన్ద్వమేక

వద్భావమునొందును. అహినకులమ్ (అహీనాం నకులానాం చ సమాహారః) గోవ్యాఘ్రమ్ (పశుద్వన్ద్వము) కాకోలూకమ్ (శకునిద్వన్ద్వము) ఈ రెండుస్థలములందు పరమగుటచే "విభాషావృక్ష" (921) సూ. చే విహితమగు వికల్పైకవద్భావము ప్రాప్తమగుచున్నది. సూత్రములోని చకారము వాక్యభేదముచే నేకవద్భావమునే తిరుగ విధించును. ఈ పునర్విధానముచే పరమగు వికల్పము బాధింపఁబడును. కావున నుక్తోదాహరణములందు నిత్యైకవద్భావమే ప్రవర్తించును.

వివ :— ఇచట వైరమే విరోధపదార్థమనుటవలన సహానవస్థానరూపమగు విరోధముగల ఛాయాతపముల ద్వన్ద్వమేకవద్భావమునొందదు. ఛాయాతపౌ। వైరము స్వాభావికముగావలయుననుటవలన తాత్కాలిక వైరముగలవానియొక్క ద్వన్ద్వమేకవద్భావమునొందదు. దేవాసురాః। దేవులకు రాక్షసులకునమృతమువిషయమై వైరముగల్గినది గాని సముద్రమథనవేళలో వైరములేదుగదా! కావుననది నిత్యముగాదు.

919. శూద్రాణామనిరవసితానామ్. 2-4-10. శూద్రాణామ్। అనిరవసితానామ్॥

అబహిష్కృతానాం శూద్రాణాం ప్రాగ్వత్। తక్షాయస్కారమ్। పాత్రాద్బహిష్కృతానాం తు చణ్డాలమృతపాః॥

919. నిరవసితులన పాత్రమునుండి బహిష్కృతులు. ఎవరిచే భుజింపఁబడినపాత్రము స్మృతులందు విధింపబడు సంస్కారముచేనైన శుద్ధిగలదికాదో యట్టివారు పాత్రబహిష్కృతులనబడుదురు. చండాలాదులిట్టివారగుదురు. అనిరవసితానామను నిషేధమువలననిచట శూద్రశబ్దము బ్రాహ్మణక్షత్రియవైశ్యులకంటె భిన్నులగుమనుష్యులను బోధించును గాని శూద్రత్వజాతిగలవారిని మాత్రము బోధింపదు. బహిష్కృతులు గానట్టి శూద్రులను బోధించుశబ్దముల ద్వన్ద్వమేకవద్భావము నొందునని సూత్రార్థము. తక్షాయస్కారమ్ (తక్ష్ణాం చాయస్కారాణాం చ సమాహారః) అనిరవసితానామనుటచే పాత్రబహిష్కృతులగు చణ్డాలాదులబోధించు శబ్దములకితరేతరయోగద్వన్ద్వముగూడనగును. చణ్డాలమృతపాః॥

920. * గవాశ్వప్రభృతీని చ. 2-4-11.

---

* గవాశ్వమ్ గవావికమ్ గవైడకమ్ అజావికమ్ అజైడకమ్ కుబ్జవామనమ్ కుబ్జకిరాతమ్ పుత్రపౌత్రమ్ శ్వచణ్డాలమ్ స్త్రీకుమారమ్ దాసీమాణవకమ్ శాటీపిచ్ఛకమ్ శాటీప్రచ్ఛదమ్ శాటీపట్టికమ్ ఉష్ట్రఖరమ్ ఉష్ట్రశశమ్ మూత్రశకృతమ్ మూత్రపురీషమ్ యకృన్మేదః మాంసశోణితమ్ దర్భశరమ్ దర్భపూతీకమ్ అర్జునశిరీషమ్ అర్జునపురుషమ్ తృణోలపమ్ దాసీదాసమ్ కుటీకుటమ్ భాగవతీభాగవతమ్ ఏతే గవాశ్వప్రభృతయః॥

యథోచ్చరితాని సాధూని స్యుః। గవాశ్వమ్। దాసీదాస మిత్యాది॥

920. గవాశ్వప్రభృతీని = గవాశ్వమ్ప్రభృతి యేషాం తానిఅని విగ్రహము. గవాశ్వశబ్దముమొదలుగగల సమాహారద్వన్ద్వములు గణముననేరీతిగ పఠింపఁబడినవో యవియారీతిగనే సాధువులగునని యర్థము. గవాశ్వమ్ (గవామశ్వానాం చ సమాహారః) ఇచట "విభాషావృక్ష" (921) సూ. చే ప్రాప్తమగు వికల్పమును బాధించి నిత్యైకవద్భావము నిపతింపఁబడెను. "యథోచ్చరితాని" అనుటవలనగణమున గవాశ్వమని పఠింపబడుటచే గోశబ్దమునకవజాదేశము వచ్చునపుడే యీసూత్రము ప్రవర్తించును. అవజాదేశాభావపక్షమందుత్తరసూత్రముచే వికల్పమగును. గోశ్వమ్। గోశ్వాః। దాసీదాసమ్। ఈనిపాతనము "పుమాన్ స్త్రియా" (938) సూ. చే ప్రాప్తమగునేకశేషమును బాధించును.

921. విభాషా వృక్షమృగతృణధాన్యవ్యఞ్జనపశుశకున్య శ్వబడబపూర్వాపరాధరోత్తరాణామ్. 2-4-12. (ద్వన్ద్వః)

వృక్షాదీనాం సప్తానాం ద్వన్ద్వః అశ్వబడబేత్యాదిద్వన్ద్వత్రయం చ ప్రాగ్వద్వా। వృక్షాదౌ విశేషాణామేవ గ్రహణమ్। ప్లక్షన్యగ్రోధమ్। ప్లక్షన్యగ్రోధాః। రురుపృషతమ్। రురుపృషతాః। కుశకాశమ్। కుశకాశాః। వ్రీహియవమ్। వ్రీహియవాః। దధిఘృతమ్। దధిఘృతే। గోమహిషమ్। గోమహిషాః। శుకబకమ్। శుకబకాః। అశ్వబడబమ్। అశ్వబడబౌ। పూర్వాపరమ్। పూర్వాపరే। అధరోత్తరమ్। అధరోత్తరే॥ ఫలసేనావనస్పతిమృగశకునిక్షుద్రజన్తుధాన్యతృణానాంబహుప్రకృతిరేవ ద్వన్ద్వ ఏకవదితి వాచ్యమ్॥ బదరాణి చామలకాని చ బదరామలకమ్। "జాతిరప్రాణినామి" త్యేకవద్భావః। నేహ।బదరామలకే। రథికాశ్వారోహౌ।ప్లక్షన్యగ్రోధౌ। ఇత్యాది।విభాషావృక్షేతి సూత్రేయేఽప్రాణిన స్తేషాం గ్రహణం జాతిరప్రాణినామితి నిత్యే ప్రాప్తే వికల్పార్థమ్। పశుగ్రహణం హస్త్యశ్వాదిషు సేనాఙ్గత్వాన్నిత్యే ప్రాప్తే। మృగాణాం మృగై రేవ శకునీనాం తై రేవోభయత్ర ద్వన్ద్వః। అన్యైస్తు సహేతరేతరయోగఏవేతి నియమార్థం మృగశకునిగ్రహణమ్। ఏవం పూర్వాపరమధరోత్తరమిత్యపి। అశ్వబడబగ్రహణం తు పక్షే నపుంసకత్వార్థమ్। అన్యథా పరత్వాత్పూర్వవదశ్వబడబావితి స్యాత్॥

921. వృక్ష మృగ తృణ ధాన్య వ్యఞ్జన పశు శకుని వీనియొక్కద్వన్ద్వము, అశ్వబడబ పూర్వాపర అధరోత్తర ఈద్వన్ద్వత్రయము వైకల్పికైకవద్భావము నొందును. సూత్రమున షష్ఠి విషయభేదముచేభిన్నమగును. వృక్షాదులేడింటి విషయమునవయవావయవిభావము, అశ్వబడబాదివిషయమున తాదాత్మ్యము షష్ఠ్యర్థము. వృక్షాద్యవయవకద్వన్ద్వము అశ్వబడబాదిరూపమగు ద్వన్ద్వముఅనియునర్థము ఫలితమగును. ఇచట వృక్షాదిశబ్దములేడును తత్తద్విశేషములను బోధించును గాని స్వరూపాదులను బోధింపవు. ప్లక్షన్యగ్రోధమ్ అనునది మొదలు శుకబకాః అనునది యన్తమందుగలవి క్రమముగనుదాహరణములు. అశ్వబడబమ్ మొదలగునవి సూత్రోక్తద్వన్ద్వత్రయమునకుదాహరణము. (వా) ఫలసేనా......వాచ్యమ్॥ ఇది యేకవద్భావప్రకరణమునకు నియమమును బోధించువచనము. ఇందలి వనస్పతి శబ్దముకోశోక్తమగు విశేషార్థమును బోధింపక వృక్షములన్నిటిని బోధించును. ఫలము సేనాఙ్గము వృక్షము మృగము శకుని క్షుద్రజన్తువుధాన్యము తృణము వీనిని బోధించుశబ్దములయొక్కద్వన్ద్వము బహువచనాన్తావయవకమగునపుడే, తత్తత్సూత్రములచే విహితమగునేకవద్భావమునొందునని వచనార్థము. ఏకవచనాన్త ద్వివచనాన్తావయవకద్వన్ద్వమునకురాదని ఫలితమగును. బహుప్రకృతిః=బహవః =బహువచనాన్తాః. ప్రకృతిః=కారణం యస్య అనివిగ్రహము ఉదా:— బదరామలకమ్ (బదరాణామామలకానాం చ సమాహారః) "జాతిరప్రాణినామ్॥ (915) సూ. చే నేకవద్భావము. బదరామలకే (బదరం చామలకం చ) మొదలగు చోటులందేకవచనాన్తద్వివచనాన్తములకితరేతరయోగద్వన్ద్వమే ప్రవర్తించును. "విభాషావృక్ష"అనుసూత్రమునన్రప్రాణులగు వృక్షమృగతృణధాన్యవ్యఞ్జనములు "జాతిరప్రాణినామ్"ను సూత్రముచే వీనికి నిత్యైకవద్భావము ప్రాప్తమగుచుండ వికల్పమును విధించుటకు గ్రహింపబడెనని తెలియనగును. హస్త్యశ్వాదులు సేనాఙ్గములగుటచే వానిద్వన్ద్వమందు "ద్వన్ద్వశ్చ" (911) సూ. చే నిత్యైకవద్భావము ప్రాప్తమగుచుండ దానిబాధించి వైకల్పికైకవద్భావమగుటకై యీసూత్రమున పశుపదము గ్రహింపఁబడెను. మృగవాచకములకు శకునివాచకములకును "చార్థేద్వన్ద్వః" సూత్రముచేతనే సమాహారద్వన్ద్వవికల్పము సిద్ధమగుచుండ నీసూత్రమున పశుశకుని గ్రహణమునకేమి ఫలమను శఙ్కకు "మృగాణాంమృగైరేవ....గ్రహణ" మను గ్రన్థముచే సమాధానమునుజెప్పుచున్నారు. అర్థము :— మృగవాచకములకు మృగవాచకములతోనే సమాహారమందునితరేతరయోగమందును ద్వన్ద్వమగును. ఉదా :— గోమహిషమ్। గోమహిషాః। ఇట్లే శకునివాచకములకును శకునివాచకములతోనే సమాహారమందు నితరేతరయోగమందును ద్వన్ద్వమగును. ఉదా :— శుకబకమ్। శుకబకాః। మృగవాచకములకితరములతోగాని శకునివాచకములకన్యములతోగాని యితరేతరయోగద్వన్ద్వమేగాని సమాహారద్వన్ద్వము లేదనునియమము కొరకు సూత్రమునమృగశకునిగ్రహణమని తెలియునది. (రుక్ష శుకాః) పూర్వాపరమ్। అధరోత్తరమ్। వీనియొక్కగ్రహణముగూడ నియమార్థమే. పూర్వశబ్దము

నకపరశబ్దముతోనే యధరశబ్దమునకు త్తరశబ్దముతోనే సమాహారేతరేతరయోగద్వ న్ద్వములు. పూర్వాపరమ్। ఇత్యాదులుదాహరణములు. తదితరములకు నితరేతరయోగ ద్వన్ద్వమే యగును. (పూర్వోత్తరే) అశ్వబడబమనునది పశుద్వన్ద్వమగుటచే వికల్పము సిద్ధమగుచున్నది గానిసమాహారద్వన్ద్వపక్షమున నపుంసకలిఙ్గముకొఱకు సూత్రముననశ్వబడబశబ్దము గ్రహింపఁబడెను. లేనిచో సమాహారమందు "సన పుంసకమ్" (825) సూత్రప్రాప్తమగు నపుంసకత్వమును బాధించి పరమగు "పూర్వవదశ్వబడబౌ" (817) సూత్రముచే పరపదలిఙ్గమే ప్రవర్తించెడిని. అశ్వ బడబగ్రహణసామర్థ్యమువలన "పూర్వవదశ్వబడబౌ" అనునది బాధింపఁబడు ననియు "పూర్వవదశ్వబడబౌ" అనుసూత్రమితరేతరయోగద్వన్ద్వమందు సావకాశ మగుననియును గ్రహించునది.

922. విప్రతిషిద్ధం చానధికరణవాచి. 2-4-13. విప్రతిషిద్ధం, చ, అనధికరణవాచి। (విభాషా)

విరుద్ధార్థానామద్రవ్యవాచినాం ద్వన్ద్వ ఏకవద్వా స్యాత్। శీతోష్ణమ్। శీతోష్ణే। వైకల్పికస్సమాహారద్వన్ద్వశ్చార్థేద్వన్ద్వ ఇతి సూత్రేణ ప్రాప్తః స విరుద్ధార్థానాం యది భవతి తర్హి అద్రవ్యవాచినామేవేతి నియమార్థమిదమ్। తేన ద్రవ్యవాచి నామితరేతరయోగ ఏవ। శీతోష్ణే ఉదకే స్తః। విప్రతిషిద్ధం కిమ్। నన్దకపాఞ్చజన్యౌ। ఇహ పాక్షికస్సమాహారద్వన్ద్వో భవత్యేవ॥

922. విప్రతిషిద్ధమ్=పరస్పరవిరుద్ధమ్। ఇచటసహానవస్థానరూపమగు విరోధమును (కలసియొకచోటనుండకుండుట) గ్రహింపవలయును. అద్రవ్యవాచ కములకట్టి విరోధమే సంభవించును గానివైరరూపమగునది సంభవింపకుండుట యిందు గారణము. అధికరణమన ద్రవ్యము. విరుద్ధార్థప్రతిపాదకములు ద్రవ్య భిన్నవాచకములునగు శబ్దములయొక్క ద్వన్ద్వము వైకల్పికైకవద్భావముగలదగు నని సూత్రార్థము. ఉదా :— శీతోష్ణమ్। శీతోష్ణే। ఇవి గుణవాచకములు. ఇట్టివానికి "చార్థేద్వన్ద్వః" సూత్రముచేతనే సమాహారద్వన్ద్వము వికల్పముగ ప్రవర్తించుట వలననేకవద్భావ వికల్పము ప్రాప్తమగుచుండనీసూత్రము నియమార్థమగును. విరుద్ధార్థకములకు సమాహారద్వన్ద్వమగుచోనద్రవ్యవాచకములకే యగునని నియమ స్వరూపము. ఈనియమమువలన పరస్పరవిరుద్ధములగు ద్రవ్యములను బోధించెడి శబ్దములకితరేతరయోగమే యగును. శీతోష్ణే (ఉదకే) చల్లనినీరు వేడినీరు అని యర్థము. సూత్రమున విప్రతిషిద్ధపదములేనియెడల "చార్థేద్వన్ద్వః" సూ. చే సమాహారేతరేతరయోగములు ప్రవర్తించినచో నద్రవ్యవాచకములకే యగునను నియమము సంభవించును. అట్లయిన "నన్దకపాఞ్చజన్యౌ" అనుచోట నన్దకపాఞ్చ జన్యశబ్దములు ద్రవ్యవాచకములగుటచే సమాహారద్వన్ద్వము లేకపోవును. విప్రతి

షిద్ధగ్రహణమున్నపుడు నియమము విరుద్ధార్థకవిషయకమే యగును గాన నన్దక పాఞ్చజన్యౌ అనుచోట నీనియమము ప్రవర్తించదు. కావుననిచట "చార్థేద్వన్ద్వః" సూ. చే పాక్షికమగు సమాహారద్వన్ద్వముగూడ తప్పక ప్రవర్తించును. (నన్దక పాఞ్చజన్యమ్) విష్ణువుయొక్క ఖడ్గము నన్దకము. విష్ణువుయొక్క శఙ్ఖము పాఞ్చ జన్యము. ఈరెండును విష్ణువునం దుండునవగుటచే వీనికి పైఁజెప్పఁబడిన విరోధము సంభవింపదని తెలియునది.

923. న * దధిపయఆదీని. 2-4-14. న, దధిపయఆదీని। (ఏకవచనమ్)

ఏతాని నైకవత్స్యుః। దధిపయసీ। ఇధ్మాబర్హిషీ। నిపాతనాద్దీర్ఘః। ఋక్సామే। వాఙ్మనసే॥

923. దధిపయఆదీని = ఇది బహువ్రీహి। దధిపయఆదిగణమున పఠితములగువానికేకవద్భావము (సమాహారద్వన్ద్వము) రాదు. దధిపయసీ (దధి చ పయశ్చ) ఇవివ్యఞ్జనవాచకములగుటచే "విభాషావృక్ష" సూత్రప్రాప్తమగు, వైకల్పికైకవద్భావము దీనిచే నిషిద్ధమగును. ఇధ్మాబర్హిషీ (ఇధ్మ చ బర్హిశ్చ) ఇచట నిపాతనము వలన నిధ్మశబ్దమునకు దీర్ఘమగును. ఋక్సామే। వాఙ్మనసే॥ ఈరెండు స్థలములందును "అచతుర" అనుసూత్రముచే నచ్ప్రత్యయము నిపతింపబడినదని తెలియునది.

వివ :— ఈగణమున బ్రహ్మప్రజాపతీ ఇత్యాదులు పఠింపఁబడెను. కావుననీనిషేధము ప్రకరణప్రాప్తమగునేకవద్భావనియమమునకే యగుననుటపలను పరదు. బ్రహ్మప్రజాపతీ అనుచోటనే నియమమునకు ప్రాప్తిలేకుండుట యిందులకుగారణము. ప్రకరణప్రాప్తమగు నియమమునకువలె "చార్థేద్వన్ద్వః" సూత్ర విహితమగు సమాహారమునకును నిషేధమగునని గ్రహించునది. కావున దధిపయ ఆదిగణపఠితములకీసూత్రముచేతను సమాహారద్వన్ద్వము రాదనునర్థము లభించును.

924. అధికరణైతావత్త్వే చ. 2-4-15. (న, ఏకవచనమ్)

ద్రవ్యసఙ్ఖ్యావగమే ఏకదేశేం నియమో న స్యాత్। దశ దన్తోష్ఠాః॥

924. అధికరణైతావత్త్వమ్ = అధికరణమన సమాసార్థమునకాశ్రయము. (వర్తిపదార్థము) ఏతావత్త్వమ్ = పరిమాణనియమము. (సఙ్ఖ్యావిశేషము) ద్రవ్య

* దధిపయసీ సర్పిర్మధునీ మధుసర్పిషీ బ్రహ్మప్రజాపతీ శివవైశ్రవణౌ, స్కన్దవిశాఖౌ పరివ్రాజకకౌశికౌ ప్రవర్గ్యోపసదౌ శుక్లకృష్ణౌ ఇధ్మాబర్హిషీ దీక్షాతపసీ అధ్యయనతపసీ ఉలూఖలముసలే ఆద్యవసానే శ్రద్ధామేధే, ఋక్సామే వాఙ్మనసే ఇతి దధిపయఆదయః॥

సంఖ్య, పదాన్తరసమభివ్యాహారముచే గమ్యమానమగునపుడు సమాహారద్వన్ద్వమే యగునను ప్రకృతినియమము ప్రవర్తించదని సూత్రార్థము. దన్తోష్ఠాః (దన్తాశ్చ ఓష్ఠాశ్చ) ఇచట సమీపోచ్చారితమగు దశపదముచే సమస్యమానపదార్థములగు దన్తోష్ఠములయొక్క సంఖ్య నిశ్చితముగనవగతమగుచున్నందున ప్రాణ్యఙ్గనిమిత్తకమగు నేకవద్భావమునకీనిషేధము ప్రవర్తించును గాననితరేతరయోగద్వన్ద్వమగును.

925. విభాషాసమీపే. 2-4-16. విభాషా, సమీపే। (అధికరణైతావత్త్వే)

అధికరణైతావత్త్వస్య సామీప్యేన పరిచ్ఛేదే సమాహారఏవేత్యేవంరూపో నియమోవాస్యాత్। ఉపదశం దన్తోష్ఠమ్। ఉపదశా దన్తోష్ఠాః॥

925. సమీపశబ్దము లక్షణచే సామీప్యముచేనగుపరిచ్ఛేదమును బోధించును. అధికరణైతావత్త్వే అనునది షష్ఠ్యన్తముగ విపరిణామమునొందును. సమస్యమానపదార్థములసంఖ్యావిశేషము సామీప్యముచే పరిచ్ఛిన్నమగునపుడు సమాహారద్వన్ద్వమే యనునియమము వికల్పముగనగును. (ఇచట సమాహారద్వన్ద్వమునకు వికల్పమనినను దోషములేదు గానిపూర్వసూత్రమున నియమమునకే నిషేధమగుటచే తదనుసారమీసూత్రమందును నియమమునకే వికల్పమని చెప్పఁబడెను.) ఉపదశమ్ దన్తోష్ఠమ్। తొమ్మిదిగాని పదునొకండుగాని దన్తోష్ఠములసమూహములని యర్థము. ఉపదశమనునది సమీపార్థమునవ్యయీభావము. కావుననిచట వర్తిపదార్థసంఖ్య సామీప్యముచే పరిచ్ఛిన్నమగును గానిపూర్వసూత్రోదాహరణమందువలె నిశ్చితముగ నవగతముగాదు. ఉపదశాః దన్తోష్ఠాః। ఉపదశాః అనునది బహువ్రీహి (దశానాం సమీపే యే సన్తి తే) సమాహారద్వన్ద్వమునకువలెనీయితరేతరయోగమునకునర్థమును గ్రహింపవలెను.

వివ :— సమాహారద్వన్ద్వస్థలమున సమానలిఙ్గవచనములుగల యవ్యయీభావమునకే యనుప్రయోగమగును. కావున "ఉపదశం దన్తోష్ఠస్య" అనుప్రయోగము సిద్ధమగును. సమీపమునకు సమీపముగలదానికి నభేదవివక్షచే నిచట సామానాధికరణ్యమునూహించునది. ఇతరేతరయోగమందు సమానలిఙ్గవచనములుగలదగుటచే బహువ్రీహికే యనుప్రయోగమని తెలియదగును.

926. ఆనఙ్ ఋతో ద్వన్ద్వే. 6-3-25. ఆనఙ్ ఋతః, ద్వన్ద్వే (విద్యాయోనిసంబన్ధేభ్యః, ఉత్తరపదే)

విద్యాయోనిసంబన్ధినామృదన్తానాం ద్వన్ద్వే ఆనఙ్ స్యాదుత్తరపదే పరే। హోతాపోతారౌ। హోతృపోతృనేష్టోద్గా

తారః। మాతాపితరౌ। పుత్త్రేఽన్యతరస్యామిత్యతో మణ్డూక
ప్లుత్యా పుత్త్ర ఇత్యస్యానువృత్తేః పితాపుత్త్రౌ॥

వ్యా. విద్యాయోనిసమ్బన్ధేభ్యః అనునది షష్ఠ్యన్తముగ విపరిణామము నొందును. విద్యాసమ్బన్ధవాచకములు యోనిసమ్బన్ధవాచకములునగు ఋదన్తముల ద్వన్ద్వమందుత్తరపదముపరమగునపుడు పూర్వమగు ఋకారమునకు ఆనఙాదేశము (ఆన్) అగును. ఉదా :—హోతాపోతారౌ। హోతృశబ్దమున ఋకారమునకానఙాదేశ నలోపములు ప్రవర్తించెను. హోతృపోతృనేష్టోద్గాతారః। ఇవి విద్యాసంబంధవాచకములకుదాహరణములు. ఉత్తరపదముచేనిచట పూర్వపదమాక్షిప్తము గాదు. ఆక్షిప్తమయినచో హోతాపోతారౌ అనుచోటనే ఆనఙాదేశము సాధువగును గాని మధ్యమపదమున కాదేశము సిద్ధముగాకుండును. ఆక్షేపములేనందున హోతృపోతృనేష్టోద్గాతారః అనుచోట మధ్యమపదమగు నేష్టృశబ్దమున ఋకారమునకునాదేశము సిద్ధమగును. ఈ విషయమును సూచించుటకే నిదియునుదాహరింపబడె నెను. హోత్రాదులకేకయాగమందు విద్యాద్వారకమగు ఋత్విక్కృత సమ్బన్ధముగలదని తెలియదగును. యోనిసంబంధవాచకమునకుదాహరణము :— మాతాపితరౌ। వీరికి పుత్త్రోత్పాదనమందు యోనికృతసమ్బన్ధము కలదు. ఋతః అనునది, యనువృత్త మగుచుండ తిరుగసూత్రమున ఋతః అనునది సమాసములోని పదములన్నియును ఋదన్తములగునపుడే యాదేశమగునని బోధించును. కావుననే పితృపితామహాః ఇత్యాదులందాదేశమురాదు. అట్లయిన పితాపుత్త్రౌ అనురూపమెటుల సాధువగునను శఙ్కకు "పుత్త్రేఽన్యతరస్యాం" మను గ్రన్థముచే సమాధానమును జెప్పుచున్నాడు. "పుత్త్రేఽన్యతరస్యామ్" (885) సూత్రమునుండి మణ్డూకప్లుతిచే నిచటికి పుత్త్ర శబ్దమనువృత్తమగును. మధ్యనుండు సూత్రములందనువర్తింపక తరువాతిసూత్రము లందనువర్తించునపుడు మణ్డూకప్లుతిచేననువృత్తి యనఁబడును. ఋతః అనునది "విభాషా స్వసృపత్యోః" (887) అను మధ్యసూత్రములోనికనువర్తింపకుండుట యిట్లుచెప్పుటకుకారణము. యోనిసమ్బన్ధవాచకములద్వన్ద్వమందు పుత్త్రశబ్దముత్తర పదమగునపుడు పూర్వమగు ఋదన్తమునకానఙాదేశమగునని భిన్నవాక్యముచేనర్థ మును చెప్పవలయును. ఇట్లు చెప్పుటచే పితాపుత్త్రౌ అనుచోటనాదేశము సిద్ధమ గును, తాతపుత్త్రౌ అనుచోటనాదేశము వారికమునగును. పుత్త్రశబ్దముత్తరపదమగు నపుడాదేశమగునని నిచటనాదేశము ప్రసక్తమగును. పితాపుత్త్రులకు యోనికృత సమ్బన్ధము జన్యజనకభావరూపమని తెలియదగును.

వివ :— ఆనఙాదేశమున ఙకారములేకున్న నీసూత్రమున విధిష్టమగు ఋకార మునకే యగును. కాని యుత్తరసూత్రోదాహరణమగు మిత్రావరుణౌ అనుచోట మిత్రశబ్దమునకన్త్యమగునకారమునకే యాదేశమగుటకు ఙకారమావశ్యకమని తెలి యునది.

927. దేవతాద్వన్ద్వే చ. 6-3-26 (ఆనఙ్, ఉత్తరపదే)

ఇహోత్తరపదేపరే ఆనఙ్। మిత్రావరుణౌ॥ వా॥ వాయు శబ్దప్రయోగే ప్రతిషేధః। అగ్నివాయూ। వాయ్వగ్నీ। పునర్ద్వన్ద్వగ్రహణం ప్రసిద్ధసాహచర్యస్య పరిగ్రహార్థమ్। తేన బ్రహ్మప్రజాపతీ ఇత్యాదౌ నానఙ్। ఏతద్ధి నైకహవిర్భాగిత్వేన శ్రుతమ్, నాపి లోకే ప్రసిద్ధం సాహచర్యమ్॥

927. దేవతానాం ద్వన్ద్వః=తస్మిన్=దేవతాద్వన్ద్వే। దేవతాపదమున కిన్ద్రాదిదేవులనియర్థము. దేవతావాచకములద్వన్ద్వసమాసమునను త్తరపదము పరమగునపుడు పూర్వమునసుండు పదమునకానఙాదేశమగును. ఋకారాన్తములుగానందున, విద్యాయోనిసమ్బన్ధవాచకములుగానందునసానఙాదేశమప్రాప్తమగుచుండగ నీసూత్రమారంభింపఁబడెను. ఉదా :— మిత్రావరుణౌ। (వా) వాయుశబ్దముగల ద్వన్ద్వమునసానఙాదేశమునకు నిషేధమును చెప్పవలయును. ఉదా :— అగ్నివాయూ। వాయ్వగ్నీ। ద్వన్ద్వపదమనువృత్తమగుచుండ తిరుగ సూత్రమున ద్వన్ద్వపదమును గ్రహించుటకు ఫలమునుజెప్పుచున్నాడు. "పునర్ద్వన్ద్వగ్రహణం........ పరిగ్రహార్థమ్" వేదమందుగాని లోకముసగాని ప్రసిద్ధమగుసాహిత్యముగల దేవతలను ప్రతిపాదించుశబ్దములయొక్క ద్వన్ద్వమందే యాదేశమగునని యిచటిద్వన్ద్వపదగ్రహణము బోధించును. ఇట్లుచెప్పుటచే బ్రహ్మప్రజాపతీ అనుచోటనాదేశము వారితమగును. వీరికి ఏకహవిర్భాగానుభవరూపమగు సాహచర్యము వేదమున శ్రుతముగాలేదు, లోకప్రసిద్ధమగు సాహచర్యమైనను లేదు.

928. ఈదగ్నేస్సోమవరుణయోః. 6-3-27. ఈత్। అగ్నేః। సోమవరుణయోః। (దేవతాద్వన్ద్వే)

దేవతాద్వన్ద్వే ఇత్యేవ॥

928. దేవతావాచకద్వన్ద్వమున సోమవరుణపదములుత్తరపదములగు నపుడగ్నిశబ్దమునకీకారమాదేశమగును. ఇది పూర్వసూత్రవిహితమగునానఙాదేశమున కపవాదము.

వివ :— దేవతాద్వన్ద్వమందే యీకారమును విధించుటచే అగ్నిసోమౌ (మనుష్యులు) అనుచోట నీకారాదేశము వారింపఁబడును. కాశికాకారాదులనియమ మనుసరించి యిచట దేవతాద్వన్ద్వపదమునకనువృత్తిచేయఁబడెను. ఆశ్వలాయనుడు అదేవతాద్వన్ద్వమందును ఈకారాదేశమును ప్రయోగించెను. "అగ్నీషోమౌ ప్రణేష్యామి" ఇచటనగ్నిసోమశబ్దములు జ్యోతిర్లతాబోధకములు. అర్థమగుటచేనిది సాధువగుననియు దేవతాద్వన్ద్వమందే యీకారాదేశమగుననియుననువృత్తిచేసిన వారియాశయము.

విశేషణమావశ్యకము. (వా) విష్ణుశబ్దము త్తరపదమగునపుడీసూత్రము ప్రవర్తించదని చెప్పవలయును. ఉదా :— ఆగ్నావైష్ణవమ్ (అగ్నిశ్చ విష్ణుశ్చ అగ్నావిష్ణూ తౌ దేవతే అస్య) అగ్నిశబ్దమునందలి యికారమునకికారము రానందున "దేవతా ద్వన్ద్వేచ" (927) సూ. చే నానఙ్ ప్రవర్తించెను.

931. దివో ద్యావా. 6-3-29. దివః, ద్యావా, (దేవతాద్వన్ద్వే, ఉత్తరపదే)

దేవతాద్వన్ద్వే ఉత్తరపదే। ద్యావాభూమీ। ద్యావాక్షమే॥

931. దేవతాద్వన్ద్వమునను త్తరపదముపరమగునపుడు దివ్ శబ్దమునకు ద్యావా అనునది యాదేశమగును. ద్యావాభూమీ। (ద్యౌశ్చ భూమిశ్చ) ద్యావాక్షమే (ద్యౌశ్చ క్షమా చ) క్షమాశబ్దము పృథివీపర్యాయము.

విప :— కొన్నిపుస్తకములందు ద్యావాక్షమా అని యుదాహరణమున్నట్లు శబ్దేన్దుశేఖరప్రతీకమువలన తెలియదగును. అపుడది షష్ఠ్యన్తము. ద్యావాపృథివ్యోః అనియర్థము. ఇది "ద్యావాక్షమా రుక్మో అన్తర్విభాతిదేవాః" అనుఋక్కులోని ప్రయోగము. అచట ద్యావాక్షమాశబ్దముకంటె బరమగు షష్ఠీద్వివచనమునకు "సుపాంసులుక్" (7-1-39) సూ. చే డాదేశమయ్యెను.

932. దివసశ్చ పృథివ్యామ్. 6-3-30. దివసః చ, పృథివ్యామ్। (దివః, దేవతాద్వన్ద్వే)

దివ ఇత్యేవ। చాద్ద్యావా। అదేశే అకారోచ్చారణం సకారస్య రుత్వం మాభూదిత్యేతదర్థమ్। ద్యౌశ్చ, పృథివీ చ దివస్పృథివ్యౌ। ద్యావాపృథివ్యౌ॥ ఛన్దసి దృష్టానువిధిః। ద్యావా చిదస్మై పృథివీ। దివస్పృథివ్యోరరతిరిత్యత్ర పదకారా విసర్గం పఠన్తి॥

932. దేవతాద్వన్ద్వమున పృథివీశబ్దము త్తరపదమగునపుడు దివ్ శబ్దమునకు దివస్ అనునది యాదేశమగును. చకారమువలన ద్యావాదేశముగూడనగునని యర్థము. దివసాదేశమున సకారముపై యకారము (ఇత్సంజ్ఞకము) ఉన్నట్లయినసకారమునకు ఆదేశముగా రాకుండుటచే సకారము శ్రుతమగును. ఈ యకారముచే ప్రయోగమందలి సకారమునకునేయాదేశములు రావని యూహింపవలయును. దివస్పృథివ్యౌ అనుచోట సకారమునకు ప్రాప్తమగు రుత్వమును వారించుట యాదేశములోని అకారోచ్చారణమునకు ప్రయోజనమని ఫలితమగును. దివస్పృథివ్యౌ। ద్యావాపృథివ్యౌ (ద్యౌశ్చ పృథివీ చ) "ఛన్దసి దృష్టానువిధిః" అనుభాష్యవాక్యమును వాక్యమునకు భేదమందగుపడు ప్రయోగమునను సరించి కార్యములన్ని కల్పింప

వలయునని యర్థము. ద్యావా చిదస్మై పృథివీ (వేదవాక్యము) ఇచట దివ్‌శబ్ద పృథివీశబ్దములకు "చిదస్మై" అనుదానిలో వ్యవధానమున్నను సమాసద్యావాదేశములు ప్రవర్తించినవని తెలియదగును. పదకారులు (పదపాఠమును జేయువారు) దివస్పృథివ్యోః అనుచోట (అవగ్రహమందు) విసర్గమును పఠించుచున్నారు. దీని వలన దివసాదేశమున సకారమునకు నిమిత్తమగు విసర్గాభావము లక్ష్యములననుసరించి క్వాచిత్కమని యఙ్గీకరింపవలెనని గ్రహింపదగును.

933. ఉషాసోషసః. 6-3-31. ఉషాసా। ఉషసః। (దేవతాద్వన్ద్వే, ఉత్తరపదే)

ఉషస్శబ్దస్యోషాసాదేశో దేవతాద్వన్ద్వే। ఉషాసాసూర్యమ్॥

933. దేవతాద్వన్ద్వమందు ఉత్తరపదము పరమగునపుడు ఉషస్‌శబ్దమునకు ఉషాసా అనునది యాదేశమగును. ఉషాసాసూర్యమ్ (ఉషాశ్చ సూర్యశ్చ అనయోస్సమాహారః)

934. మాతరపితరావుదీచామ్. 6-3-32. మాతరపితరౌ। ఉదీచామ్॥

మాతరపితరౌ। ఉదీచాం కిమ్। మాతాపితరౌ॥

934. ఉత్తరదేశీయులగు వైయాకరణులమతమున పితృశబ్దముత్తరపదమగునపుడు పూర్వపదమగు మాతృశబ్దమునకు అరజాదేశము నిపాతింపఁబడెను. పితరౌ అనునుత్తరపదము "ఋతోఙి" (276) సూత్రవిహితగుణముచేతన సిద్ధమగుటచేనచట నిపాతనమావశ్యకము గాదు. ఇతర వైయాకరణులమతమున ఆనజాదేశముచే మాతాపితరౌ అనియగును. విశేషము వికల్పముగుటచేనిచట ద్వైరూప్యము సాధువగునని గ్రహించునది.

935. ద్వన్ద్వాచ్చుదషహాన్తాత్సమాహారే. 6-4-106. ద్వన్ద్వాత్। చుదషహాన్తాత్। సమాహారే (టచ్)

చవర్గాన్తాద్దషహాన్తాచ్చ ద్వన్ద్వాట్టచ్ స్యాత్సమాహారే। వాక్చ త్వక్చ వాక్త్వచమ్। త్వక్స్రజమ్। శమీదృషదమ్। వాక్త్విషమ్। ఛత్రోపానహమ్। సమాహారే కిమ్। ప్రావృట్శరదౌ॥

935. చవర్గము దకారము షకారము హకారము ఇవియన్తమందుగల సమాహారద్వన్ద్వముకంటె టచ్‌ప్రత్యయము (సమాసాన్తము) అగును. వాక్త్వచమ్ (వాక్చ త్వక్చ అనయోస్సమాహారః) త్వక్స్రజమ్ (త్వక్చ స్రక్చ అనయోస్సమా

హారః) వర్గగ్రహణమునకు ప్రయోజనమును ప్రదర్శించుటకై ఇదియునుదాహరింపబడెను. దాన్తమునకుదా :— శమీదృషదమ్ (శమీ చ దృషచ్చ అనయోస్సమాహారః) షాన్తమునకుదా :— వాక్త్విషమ్ (వాక్చ త్విట్చ) హాన్తమునకుదా :— ఛత్త్రోపానహమ్। ప్రావృట్శరదౌ. ఇతరేతరయోగద్వన్ద్వమగునిచట సమాసాన్తమును వారించుటకై సమాహారే అనునది యావశ్యకము.

ఇది ద్వన్ద్వప్రకరణము.



# 20. ఏకశేషప్రకరణము

అథైకశేషః॥ మూలము—సరూపాణామ్. రామౌ। రామాః।
(వా) విరూపాణామపి సమానార్థానామ్। వక్రదణ్డశ్చ కుటిల దణ్డశ్చ। వక్రదణ్డౌ। కుటిలదణ్డౌ॥

అర్థము :— ఇటుపై ద్వన్ద్వాపవాదమగు నేకశేషమును వ్యాఖ్యానము జేయుచు సన్దర్భశుద్ధికై వ్యాఖ్యాతపూర్వమగు సరూపసూత్రమును తదుదాహరణములనిచట స్మరించుచున్నాడు. "అథైకశేషః। సరూపాణామ్, రామౌ। రామాః" అని. (వా) ఆనుపూర్వీభేదముగలవైనను సమానార్థకములగు శబ్దములలో నేకమునకు శేషము గల్గును. ఉదా :— వక్రదణ్డౌ। కుటిలదణ్డౌ। (వక్రదణ్డశ్చ కుటిలదణ్డశ్చ)

వివ:—సరూపసూత్రమున రూపశబ్దము, రూప్యతే బోధ్యతే అనువ్యుత్పత్తిచే నర్థపర్యాయమనిజెప్పినయెడల సమానార్థకములకేకశేషమగుననునర్థము సూత్రాక్షరములచేతనే సంపాదింపశక్యమగును గాన "విరూపాణామ్"అనువార్తికమపూర్వము గాదని తెలియదగును.

936. వృద్ధో యూనా తల్లక్షణశ్చేదేవ విశేషః. 1-2-65.
వృద్ధః, యూనా, తల్లక్షణః, చేత్, ఏవ, విశేషః। (శేషః)

యూనా సహోక్తౌ గోత్రం శిష్యతే గోత్రయువప్రత్యయమాత్రకృతంచేత్తయోః కృత్స్నం వైరూప్యం స్యాత్। గార్గ్యశ్చ గార్గ్యాయణశ్చ గార్గ్యౌ। వృద్ధః కిమ్। గర్గగార్గ్యాయణౌ। యూనా కిమ్। గర్గగార్గ్యౌ। తల్లక్షణః కిమ్। భాగవిత్తిభాగవిత్తికౌ। కృత్స్నం కిమ్। గార్గ్యవాత్స్యాయనౌ॥

936. ఇచట వృద్ధశబ్దముచే "అపత్యం పౌత్రప్రభృతి గోత్రమ్" (4-1-162) అనుసూత్రముచే విహితమగు గోత్రమునే గ్రహింపవలయును. యువప్రత్యయాన్తముతో సాహచర్యమిట్టివృద్ధమునకే నమ్భవించుట యిందుగారణము. యువన్‌శబ్దముగూడ "జీవతి తు వంశ్యే యువా" (4-1-163) సూ. చే జెప్పఁబడు యువసంజ్ఞకమును బోధించును. యూనా అనుచోట తృతీయ "సహయుక్తేఽప్రధానే" (567) సూ. చే వచ్చినదగుటచే యూనాసహోక్తౌ అనునర్థము లభించును. తల్లక్షణః అనుచోట తచ్ఛబ్దము వృద్ధప్రత్యయయువప్రత్యయములను

పరామర్శించును. లక్షణశబ్దము నిమిత్తవాచకము. చేచ్ఛబ్దము యద్యర్థకము. విశేష శబ్దము వైరూప్యబోధకము. యువప్రత్యయాన్తముతో సహవచనమున్నపుడు గోత్రప్రత్యయాన్తము మిగులును (యువప్రత్యయాన్తము లోపించును) ఈరెంటికి కృత్స్నమగు వైరూప్యము గోత్రయువప్రత్యయమాత్రనిమిత్తకమయే యుండవలయును గాని తద్భిన్ననిమిత్తకముగాగూడదని సూత్రార్థము. కృత్స్నమనునర్థమే వకారమువలన లభించును. ఉదా:—గార్గ్యౌ (గార్గ్యశ్చ గార్గ్యాయణశ్చ) గార్గ్య శబ్దము గోత్రప్రత్యయాన్తము. గార్గ్యాయణశబ్దము యువప్రత్యయాన్తము. వృద్ధమనునది లేనిచో గర్గగార్గ్యాయణౌ అనుచోట గోత్రప్రత్యయాన్తముకానట్టి గర్గ శబ్దమునకును శేషము ప్రసక్తమగును. గర్గగార్గ్యౌ। ఇచటనే శేషమును వారించుటకై యువప్రత్యయాన్తముతో సహోక్తియుండవలయునని చెప్పవలయును. వీనిలో గార్గ్య శబ్దము గోత్రప్రత్యయాన్తమైనను గర్గ శబ్దమును యువప్రత్యయాన్తము గాదు. తల్లక్షణః కిమ్। వైరూప్యము గోత్రయువప్రత్యయమాత్రకృతమే యేల గావలయునని ప్రశ్నాశయము. భాగవిత్తిభాగవిత్తికౌ। భాగవిత్తస్య గోత్రాపత్యం భాగవిత్తిః। ఇది గోత్రప్రత్యయాన్తము. భాగవిత్తిశబ్దమునకంటె యువాపత్యరూపార్థమందు "వృద్ధాట్ఠక్ సౌవీరేషు బహులమ్" (4-1-148) సూ. చే సౌవీరగోత్రప్రత్యయాన్తమునకంటె నిన్ద గమ్యమానమగునపుడు యువాపత్యార్థమందు విధింపబడిన ఠక్ ప్రత్యయమువలన "భాగవిత్తికః" అగుచున్నది. ఇచట వైరూప్యము యువత్వమాత్రకృతమే గాక నిన్దాకృతముగూడనగుచుండుటచే నిచటనేకశేషవ్యావృత్తికై "తల్లక్షణః" అనునది యావశ్యకమని సమాధానాశయము. కృత్స్నం కిమ్। ఏవకారముచే ప్రకృత్యర్థమునకుగూడ వ్యావృత్తియేలచేయవలయునని శఙ్కాశయము. గార్గ్యవాత్స్యాయనౌ। ఇచటి వైరూప్యము గోత్రయువప్రత్యయమాత్రకృతమే గాక ప్రకృత్యంశకృతముగూడనగుటచే నేకశేషమును వారించుటకై కృత్స్నమనునది యావశ్యకము.

937. స్త్రీపుంవచ్చ. 1-2-66. స్త్రీ, పుంవత్, చ। (శేషః, వృద్ధః, యూనా, తల్లక్షణః, చేత్. ఏవ, విశేషః)

యూనా సహోక్తౌ వృద్ధా స్త్రీ శిష్యతే తదర్థశ్చ పుంవత్। గార్గీ చ గార్గ్యాయణశ్చ గర్గాః। అస్త్రియామిత్యనువర్తమానే యఞఞోశ్చేతి లుక్। దాక్షీ చ, దాక్షాయణశ్చ దాక్షీ॥

937. యువప్రత్యయాన్తముతో సహవచనమున్నపుడు గోత్రప్రత్యయాన్తమగు స్త్రీవాచకమునకు శేషమగును, శిష్టమగు స్త్రీవాచకముయొక్క యర్థము పుంలిఙ్గముగలయర్థముతో సదృశమగును. (స్త్రీలిఙ్గశబ్దము పుంవద్రూపమునొందును.) వానియొక్క వైరూప్యము గోత్రయువప్రత్యయములు లిఙ్గము వీనివలన సిద్ధమైనదే గావలయునని సూత్రార్థము. ఉదా:—గర్గాః। (గార్గీ చ గార్గ్యాయణౌ చ) గార్గీ అనునది గోత్రప్రత్యయాన్తమగు స్త్రీవాచకము, రెండవది యువప్రత్య

యాన్తము. అర్థమునకు పుంవద్భావాతిదేశమునుచేయుటవలన ఫలమును జూపుటకే "గార్గ్యాః యఞౌ" అను ద్వివచనాన్తముతో విగ్రహము చూపఁబడెను. ఇపుడు ఏకశేషము బహువచనాన్తమగును గానిటుల పుంవద్భావాతిదేశమునకు ఫలము స్పష్టమగును. ఏకవచనాన్తమునను విగ్రహమును చెప్పినచో నేకశేషము ద్వివచనాన్తమగును గాన పుంవద్భావము వచ్చినను రాకున్నను "గార్గ్యౌ" అను నొకేవిధమగు రూపమగుటచే పుంవద్భావఫలము స్పష్టముగా నేరదు. "యఞఞోశ్చ" (2-4-64) సూత్రములోనికి "తద్రాజస్య బహుషు" (2-4-62) సూత్రమునుండి అస్త్రియామనునది యనువృత్తమగును. యఞ్ ప్రత్యయమునకు అఞ్ ప్రత్యయమునకును లుక్కు వచ్చును, స్త్రీలిఙ్గమున రాదని తదర్థము. పుంవద్భావమువలననే యిచట యఞ్ ప్రత్యయమునకు లుక్కు గూడ ప్రవర్తించెను. గర్గాః అని యగును. (ద్వితీయా బహువచనమందు "గర్గాన్" అనుచోట నత్వము గూడ పుంవద్భావమునకు ఫలమగును) దాక్షీ (దాక్షీ చ దాక్షాయణశ్చ) దాక్షిశబ్దమునకు శేషము. పుంవద్భావమువలన ఫక్ నివృత్తమగును. దాక్షీ అనునది ద్వివచనాన్తము. "గార్గీ చ వాత్స్యాయనశ్చ" ఇత్యాదులందేకశేషమును వారించుటకై "తల్లక్షణః" ఇత్యాదికమును ననువృత్తి చేయవలయునని తెలియునది.

938. పుమాన్ స్త్రియా. 1-2-67, పుమాన్, స్త్రియా। (శేషః, సరూపాణామ్. తల్లక్షణశ్చేదేవ విశేషః)

స్త్రియాసహోక్తౌ పుమాన్ శిష్యతే తల్లక్షణ ఏవ విశేషశ్చేత్। హంసీ చ హంసశ్చ హంసౌ॥

939. సరూపమగు స్త్రీవాచకముతో సహోక్తియున్నపుడు పుంలిఙ్గశబ్దమునకు శేషమగును, కృత్స్నవైరూప్యము స్త్రీలిఙ్గమాత్రకృతమే యుండవలెను. ఉదా :— హంసౌ (హంసీ చ హంసశ్చ)

వివ :— ఈసూత్రములోనికి సరూపాణామనుదానికనువృత్తి యగుననుటలో "భ్రాతృపుత్రౌ స్వసృదుహితృభ్యామ్" (939) అనుసూత్రము జ్ఞాపకమగును. లేనిచో తదుదాహరణమగు పుత్రౌ (పుత్రశ్చ దుహితా చ) అనుచోట నీసూత్రముచేతనే శేషము సిద్ధమగును, గాననాసూత్రము వ్యర్థమయ్యెడివి. "సరూపాణా"మనుదానికనువృత్తిచేయుటవలన హంసశ్చవరటాచ అనుచోటనేకశేషము వారితమగును. తల్లక్షణః ఇత్యాదికమనువర్తించుటచే ఇన్ద్రశ్చ ఇన్ద్రాణీ చ అనుచోటనేకశేషము వారింపఁబడును. ఇచట వైరూప్యము స్త్రీలిఙ్గమాత్రకృతమేగాక పుంయోగకృతమగును.

939. భ్రాతృపుత్రౌ స్వసృదుహితృభ్యామ్. 1-2-68. భ్రాతృపుత్రౌ, స్వసృదుహితృభ్యామ్ (శేషః)

భ్రాతా చ స్వసా చ, భ్రాతరౌ। పుత్రశ్చ దుహితా చ పుత్రౌ॥

939. స్వసృదుహితృశబ్దములతో సహోక్తియున్నపుడు క్రమముగ భ్రాతృపుత్రశబ్దములు మిగులును. భ్రాతరౌ (భ్రాతా చ స్వసా చ) పుత్రౌ (పుత్రశ్చ దుహితా చ)

940. నపుంసకమనపుంసకేనైకవచ్చాస్యాన్యతరస్యామ్.
1-2-69. నపుంసకమ్, అనపుంసకేన, ఏకవత్, చ, అస్య, అన్యతరస్యామ్ (శేషః, తల్లక్షణః, చేత్, ఏవ, విశేషః)

అక్లీబేనసహోక్తౌ క్లీబం శిష్యతే తచ్చ వా ఏకవత్స్యా త్తల్లక్షణఏవ విశేషశ్చేత్। శుక్లః పటః, శుక్లా శాటీ, శుక్లం వస్త్రమ్, తదిదం శుక్లమ్। తానీమాని శుక్లాని॥

940. అనపుంసకముతోడను అర్థముల శుక్లాదివాచకశబ్దములవలనను అన్యతరస్యామను నది ఏకవత్తనుదానితోనే సమ్బన్ధించును. కావున నేకవద్భావమునకే వికల్పము గాని ఏకశేషమునకు గాదు. పుంస్త్రీలింగశబ్దములతో సహాపదనపుంసకము నకు శేషమగును, శిష్టమగుశబ్దమునకేకవద్భావము (ఏకత్వసఙ్ఖ్యనుగలదగుట) వికల్పముగనగును, కృత్స్నమగునైరూప్యము క్లీబత్వాక్లీబత్వమాత్రకృతమే కావలయు నని సూత్రార్థము. ఉదా :— శుక్లమ్। శుక్లాని (శుక్లః శుక్లా శుక్లమ్) ఏకవద్భా వముదానిపక్షమందు శుక్లాని అనియగును. ఇచట నపుంసకలింగమగు శుక్లశబ్దము నకు శేషమయ్యెను. స్త్రీపున్నపుంసకములగు శుక్లశబ్దములకే విగ్రహము. ఇవి గుణివాచకములనియు విశేష్యనిమ్నములై నందున లింగభేదముగలవనియును బోధిం చుటకు మాత్రము పటాదిశబ్దములు విగ్రహమందుప్రదర్శితములైనవి. లేనిచో "గుణే శుక్లాదయః పుంసి" అనుకోశముచే నన్నియునుపుంలింగములే గావలయునని తెలియునది.

వివ :— అనపుంసకేన అనునది లేనిచో శుక్లంచ శుక్లంచ అనుచోట నేకశేషముఏకవద్భావమును ప్రసక్తములగును. సూత్రమున "అస్య" అనునది లేనన్ననిష్టాపము సాన్నిధ్యమువలననే సిద్ధమగును. కాని అస్యఅనిచెప్పుటవలన నీసూత్రముచే విహితమగునేకశేషమునకే యేకవద్భావమగును గానిసూత్రాన్తరవిహిత మగుదానికేకవద్భావము ప్రవర్తించదనునర్థము సిద్ధమగును. కావుననీసూత్రమే సమాహారద్వంద్వవిషయమున ప్రవర్తించుననియు నితరసూత్రములు సమాహార ద్వన్ద్వవిషయమున ప్రవర్తించవనియును తెలియునది.

941. పితా మాత్రా. 1-2-77. పితా, మాత్రా (శేషః, అన్యతరస్యామ్)

మాత్రా సహోక్తౌ పితా వా శిష్యతే। మాతాచ, పితా చ పితరౌ। మాతాపితరౌ॥

941. మాతృశబ్దముతో సహోక్తియున్నపుడు పితృశబ్దమునకు శేషము వికల్పముగనగును. ఉదా:— పితరౌ। మాతాపితరౌ (మాతా చ పితా చ) "పితుర్దశగుణం మాతా గౌరవేణాతిరిచ్యతే" (తండ్రికంటెతల్లి పదిరెట్లుగౌరవముగలది) అనుస్మృతిచే మాత యభ్యర్హితయగును గాన "అభ్యర్హితంపూర్వ" మనువచనము వలన మాతృశబ్దమునకే పూర్వనిపాతమయ్యెను. మాతాపితరౌ "ఆనఙ్ ఋతో ద్వన్ద్వే" (926) సూ. చే మాతృశబ్దమునకానఙ్ వచ్చెను.

942. శ్వశురః శ్వశ్ర్వా. 1-2-71. శ్వశురః, శ్వశ్ర్వా (శేషః, అన్యతరస్యామ్)

శ్వశ్ర్వా సహోక్తౌ శ్వశురో వా శిష్యతే, తల్లక్షణఏవ విశేషశ్చేత్।శ్వశ్రూశ్చ శ్వశురశ్చ, శ్వశురౌ।శ్వశ్రూశ్వశురౌ॥

942. శ్వశ్రూశబ్దముతోసహోక్తియున్నపుడు శ్వశురశబ్దమునకు శేషము వికల్పముగనగును. ఉదా:—శ్వశురౌ। శ్వశ్రూశ్వశురౌ (శ్వశ్రూశ్చశ్వశురశ్చ) స్వభార్యకు జననియును తనకు మాతవంటిది గానమాతృశబ్దమునవలె శ్వశ్రూశబ్దమునకును పూర్వనిపాతమయ్యెను.

వివ:— "యశ్శిష్యతే స లుప్యమానార్థాభిధాయీ" (శేషించినశబ్దము లుప్తశబ్దములయర్థమునుగూడ ప్రతిపాదించును) అనున్యాయమునుబట్టి నరా శ్వశురా అనునేకశేషవిషయమున లక్షణచే పితృశబ్దమే తల్లిని, శ్వశురశబ్దమే మామను, బోధించును. ఏకశేషములేకున్ననీయర్థము పైరీతిగ సిద్ధమగును గాననీసూత్రద్వయము వ్యర్థము. ఇచట పక్షమున ద్వన్ద్వమునిష్టమగుటచేనేకశేషవిధాయకమగు పూర్వసూత్రసముదాయమువలెనిదియును ద్వన్ద్వవిషయ ప్రతిషేధముననిది యనియు సమాధానము. పితృశ్వశురశబ్దములవలె కేవలమాతృశ్వశ్రూశబ్దములకును ద్విరూపాస్థమందు ప్రయోగమును వారింపనీసూత్రద్వయముపయోగమనిపూర్వార్థమునాడని.

943. త్యదాదీని సర్వైర్నిత్యమ్. 1-2-72. త్యదాదీని, సర్వైః, నిత్యమ్ (శేషః)

సర్వైస్సహోక్తౌ త్యదాదీని నిత్యం శిష్యన్తే। స చ దేవదత్తశ్చ తౌ॥ 1 త్యదాదీనాం మిథస్సహోక్తౌ యత్పరం తచ్ఛిష్యతే। స చ యశ్చ యౌ॥ 2 పూర్వశేషోఽపి దృశ్యతే। ఇతి, భాష్యమ్॥ స చ యశ్చ తౌ। 3 త్యదాదితశ్శేషే పుంనపుంసకతో లిఙ్గవచనాని॥ సా చ దేవదత్తశ్చ తౌ॥ తచ్చ దేవదత్తశ్చ యజ్ఞదత్తా చ తాని। 4 పుంనపుంసకయోస్తు పరత్వాన్నపుంసకం శిష్యతే।తచ్చ దేవదత్తశ్చ తే॥ 5 అద్వన్ద్వతత్పురుషవిశేషణానామితి వక్తవ్యమ్॥ కుక్కుటమయూర్యావిమే। మయూరీకుక్కుటావిమౌ। తచ్చ సా చ అర్ధపిప్పల్యౌ తే॥

943. సర్వశబ్దము సాకల్యార్థకము. త్యదాదులతోఁగాని తద్భిన్నమగునేశబ్దముతోఁగాని సహోక్తియున్నపుడు త్యదాదులు (సర్వాద్యన్తర్గణము) నిత్యముగ శేషమునొందును. సర్వశబ్దములేనియెడల సాన్నిధ్యముపలనత్యదాదులతోనే సహోక్తియున్నపుడనుసర్గము సస్భవించును. ఇట్టియర్థమును నివర్తింపజేయుటకు సర్వపదము గ్రహింపబడెను. ఉదా :— తౌ (స చ దేవదత్తశ్చ) 1 వా॥ త్యదాదులకు త్యదాదులతోనే సహోక్తియున్నపుడు, గణపాఠమునవేది పరమో యయ్యది మిగులును. ఉదా :— యౌ (స చ యశ్చ) 2 పూర్వము పఠింపఁబడినదానికి గూడ శేషముగానిచ్చుచున్నదని భాష్యమందున్నది. ఉదా :—తౌ (స చ యశ్చ) అహం చ భవాఁశ్చ ఆవామనుభాష్యోక్తివలననీసూత్రమున త్యదాదులు ద్విపర్యన్తములేయనునియమమునాశ్రయింపదగదు. 3 వా॥ త్యదాదులకు శేషమువచ్చునపుడు సహవివక్షితములగుపుంనపుంసకములననుసరించి శిష్టములగు స్త్రీలిఙ్గత్యదాదులట్టి లిఙ్గమునుగలవగును. ఉదా :— తౌ (సా చ దేవదత్తశ్చ) తాని (తచ్చ దేవదత్తశ్చ యజ్ఞదత్తా చ) 4 పుంనపుంసకములు సహవివక్షితములగునపుడు "పుంనపుంసకతో లిఙ్గవచనాని" అనువచనమునందలి పర్వతమునాశ్రయించి నపుంసకత్యదాదులకు శేషమగును. ఉదా :— తే (తచ్చ దేవదత్తశ్చ) 5 ద్వన్ద్వవిశేషణములకు తత్పురుషవిశేషణములకును పూర్వోక్తనియమము ప్రవర్తించదని యర్థము, ఇది పూర్వవచనమునకపవాదము. ద్వన్ద్వతత్పురుషములు పరపదలిఙ్గములుగాన తద్విశేషణములు తదధీనలిఙ్గములేయగునని యాశయము. ద్వన్ద్వవిశేషణమునకుదాహరణము. ఇమే (అయం చేయం చ) కుక్కుటమయూర్యౌ। ఇచట పూర్వవచనముచే పుంలిఙ్గేదమ్శబ్దమునకు శేషము నివృత్తమయ్యెను. పరపదలిఙ్గమగు స్త్రీలిఙ్గమే వచ్చెను. ఇమౌ (మయూరీకుక్కుటౌ) ఇది ప్రకృతానుపయుక్తమైనను ప్రసఙ్గవశమున నుదాహృతమయ్యెను. తత్పురుషవిశేషణమునకుదాహరణము. అర్ధపిప్పల్యౌ, తే (తచ్చ=పిప్పల్యర్ధమ్ సా చ=అర్ధపిప్పలీ) ఇచట పూర్వవచనముచే నపుంసకమునకు శేషమురాక స్త్రీలిఙ్గమునకు వచ్చెను. తే అనుద్వివచనము, స్త్రీనపుంసకసాధారణమగుటచే విశేషములేదనిన, తచ్చ తచ్చ సా చ అర్ధపిప్పల్యః తాః, అనునది యుదాహరణమగునని తెలియదగును.

944. గ్రామ్య పశుసఙ్ఘేష్వతరుణేషు స్త్రీ. 1–2–73. గ్రామ్యపశుసఙ్ఘేషు. అతరుణేషు, స్త్రీ (శేషః)

ఏషు సహవివక్షాయాం స్త్రీ శిష్యతే। పుమాన్ స్త్రియేత్యస్యాపవాదః। గావ ఇమాః। గ్రామ్యేతి కిమ్। రురవ ఇమే। పశుగ్రహణమ్ కిమ్। బ్రాహ్మణాః। సఙ్ఘేషు కిమ్। ఏతౌ గావౌ। అతరుణేషు కిమ్। వత్సా ఇమే॥ వా॥ అనేకశఫేష్వితి వాచ్యమ్। అశ్వా ఇమే। ఇహ సర్వత్ర ఏకశేషే కృతేఽనేకసుబన్తాభావాద్ద్వన్ద్వో న। తేన శిరసీ। శిరాంసీత్యాదౌ సమాసస్యేత్యన్తోదాత్తః, ప్రాణ్యఙ్గత్వాదేకపద్భా

వశ్ప న। పన్థానౌ। పన్థానః। ఇత్యాదౌ సహసాన్తో స॥
ఇత్యేకశేషః॥

944. గ్రామమునసుత్పన్నములగు గవాదులు గ్రామ్యపశువులు. సఙ్ఘమున బహువ్యక్తులయొక్క సమూదాయము. తరుణశబ్దము లేగలను బోధించును. తరుణభిన్నములగు గ్రామ్యపశువులసఙ్ఘములు సహవివక్షితములగునపుడు స్త్రీవాచకమునకు శేషమగును, "పుమాన్ స్త్రియా" (938) అను సూ. చే పుంలిఙ్గమునకు శేషము ప్రాప్తమగుచుండ దానికపవాదముగ స్త్రీ లిఙ్గమునకు శేషము చెప్పఁబడెను, ఉదా:— గావ ఇమాః। ఇచట స్త్రీలిఙ్గగోశబ్దమునకు శేషమయ్యెను. గ్రామ్యశబ్దము లేనిచో సరణ్యజన్యపశు సఙ్ఘములు సహవివక్షితములగునపుడను స్త్రీలిఙ్గమునకు శేషము ప్రసక్తమగును. రురవఇమే। రురుశబ్దార్థములగు జింకలు గ్రామ్యములుగావు. పశుశబ్దములేనిచో గ్రామభవులగు బ్రాహ్మణాదులసఙ్ఘములు సహవివక్షితములగునపుడను స్త్రీలిఙ్గమునకు శేషము ప్రసక్తమయ్యెడిని. బ్రాహ్మణాఇమే। సఙ్ఘపదము లేనిచో ఏతౌ గావౌ। అనుచోట స్త్రీలిఙ్గమునకు శేషము ప్రసక్తమయ్యెడిని. అతరుణేషు అనునది, వత్సా ఇమే, అనుచోట స్త్రీలిఙ్గమునకు శేషమును వారించుటకావశ్యకము. (వా) అనేకశఫములుగల గవాదులసఙ్ఘములవిషయమునసే యీసూత్రము ప్రవర్తించునని చెప్పవలయును. శఫశబ్దమునకు పశుపాదమందలి డెక్కయర్థము. గవాదులకు రెండుడెక్కలుండుటచేసవి యుదాహరణములగును. అశ్వములు గ్రామ్యములైననేకశఫములగుటచేసవి ప్రత్యుదాహరణమగును. అశ్వా ఇమే.

ఏకశేషోదాహరణములన్నిటియందును విభక్తినిరపేక్షమగుటవలన సన్తరఙ్గమగునేకశేషము ప్రవర్తించినపిదప ననేకసుబన్తములు లేనందున ద్వన్ద్వము ప్రవర్తించదు. ఇట్లు చెప్పుటచే కృతద్వన్ద్వములకేకశేషము ను భ్రాన్తి నిరస్తమగును. కృతద్వన్ద్వములకేకశేషమగుననిసచో శిరసీ శిరాంసి అనుచోట "సమాసస్య" (6-1-223) సూత్రవిహితమగునన్తోదాత్తము "ద్వన్ద్వశ్చప్రాణి" (911) సూ. చే నేకవద్భావము ప్రసక్తములయ్యెడిని. పన్థానౌ। పన్థానః। అనుచోట "ఋక్పూరబ్" (945) సూ. చే సమాసాన్తము ప్రసక్తమయ్యెడిని ద్వన్ద్వమునకు పూర్వమే యేకశేషముప్రవర్తించును గాన ద్వన్ద్వసంజ్ఞగాని సమాససంజ్ఞగాని యేకశేషమునకు లేకుండుటచే శిరసీ ఇత్యాదులందు పూర్వోక్తదోషప్రసక్తి వారింపబడును. ఏకశేషము ప్రవర్తించినపిగప ద్వన్ద్వమునకు ప్రాప్తిలేనందున సిద్ధమైనచే, "ద్వన్ద్వాపవాదఏకశేషః" అనుప్రవాదమువి గ్రహించునని.

శ్రీః

ఇది ఏకశేషప్రకరణము.

# 21 సర్వసమాసశేషప్రకరణము.



1 సుప్తిఙ్కృత్తద్ధితసమాసైకశేషసనాద్యన్త ధాతురూపాః పఞ్చవృత్తయః। పరార్థాభిధానం వృత్తిః। వృత్త్యర్థావబోధకం వాక్యం విగ్రహః। స ద్వివిధః। లౌకికోఽలౌకికశ్చ। పరినిష్ఠితత్వాత్సాధుర్లౌకికః। ప్రయోగానర్హోఽసాధురలౌకికః। యథా రాజ్ఞః పురుషః। రాజన్ అస్ పురుష సు ఇతి। అవిగ్రహో నిత్యసమాసః, అస్వపదవిగ్రహో వా॥

2 సమాసశ్చతుర్విధ ఇతి తు ప్రాయోవాదః। అవ్యయీభావతత్పురుషబహువ్రీహిద్వన్ద్వాధికారబహిర్భూతానామపి సహసుపేతి సమాసవిధానాత్। పూర్వపదార్థప్రధానోఽవ్యయీభావః। ఉత్తరపదార్థప్రధానస్తత్పురుషః। అన్యపదార్థప్రధానో బహువ్రీహిః। ఉభయపదార్థప్రధానో ద్వన్ద్వః। ఇత్యపి ప్రాచాం ప్రవాదః ప్రాయోభిప్రాయః। సూపప్రతి। ఉన్మత్తగఙ్గమిత్యాద్యవ్యయీభావే, అతిమాలాదౌ తత్పురుషే, ద్విత్రా ఇత్యాదిబహువ్రీహౌ, దన్తోష్ఠమిత్యాదిద్వన్ద్వే చాభావాత్। తత్పురుషవిశేషః కర్మధారయః। తద్విశేషో ద్విగుః। అనేపదత్వం ద్వన్ద్వబహువ్రీహ్యోరేవ। తత్పురుషస్య క్వచిదేవేత్యుక్తమ్॥

3 కిఞ్చ॥ సుపాం సుపా తిఙా, నామ్నా ధాతునాథ తిఙాం తిఙా। సుబన్తేనేతి విజ్ఞేయస్సమాసష్షడ్విధో బుధైః॥ సుపాం సుపా। రాజపురుషః। తిఙా। పర్యభూషయత్। నామ్నా। కుమ్భకారః। ధాతునా। కటప్రూః। అజస్రమ్। తిఙాం తిఙా। పిబతఖాదతా। ఖాదతమోదతా। తిఙాం సుపా। కృన్తవిచక్షణేతి యస్యాం క్రియాయాం సా కృన్తవిచక్షణా। ఏహీడాదయోఽన్యపదార్థే ఇతి మయూరవ్యంసకాదౌ పాఠాత్సమాసః॥

అర్థము:—1 ప్రసఙ్గవశమున వృత్త్యాదిస్వరూపము వివరింపబడుచున్నది. (1) కృదన్తము (కారకః) (2) తద్ధితప్రత్యయముతో గూడుకొనినది. (దాశరథిః, పర్వకః) తద్ధితపదమునకు తద్ధితాన్తమని యర్థము చెప్పినచో బహుచ్ప్రత్యయ విశిష్టమగు బహుపటపః అనునదియు, అకచ్ప్రత్యయవిశిష్టమగు సర్వకః అను నదియును వృత్తులుగాకపోవలసివచ్చును. బహుచ్ప్రత్యయము ప్రాతిపదికమునకు బూర్వావయవమై ప్రవర్తించును. అకచ్ప్రత్యయము ప్రాతిపదికముయొక్క మధ్యను ప్రవర్తించును. (3) సమాసము (అవ్యయీభావాదికము) (4) ఏకశేషము (రామౌ) (5) సనాదిప్రత్యయములు (సన్ క్యచ్ కామ్యచ్ క్యఙ్ క్యష్ ఆచార క్విప్. ణిచ్ యఙ్ యక్ ఆయ ఈయఙ్ ణిఙ్) అన్తమందుగలధాతువులు (పిపఠిష) ఇయైదును వృత్తులనబడును. వృత్తియనఁ బరార్థాభిధానము. ఇచటి పర శబ్దముచే పరశబ్దార్థము బోధితమగును. అర్థపదముచే స్వార్థము బోధితమగును. పరార్థముతో గూడిన స్వార్థము పరార్థమగును. పరార్థసమ్బద్ధమగు స్వార్థముయొక్క యుపస్థితికి కారణము వృత్తియనబడును. దేనిలోనుండు పదములచే నితరపదార్థ ముతో సమ్బన్ధించు స్వార్థమునకే యుపస్థితిగల్గునో యాయ్యది వృత్తియగునని ఫలిత మగును. వృత్తులందవయవశక్తిచే నిర్వాహముగలుగదనియు సముదాయశక్తిని(ఏకార్థీ భావము) అవశ్యముస్వీకరింపవలయుననియును వైయాకరణులసిద్ధాన్తము. రాజపురు షః అనునది సమాసమగుటచే వృత్తియగును, ఇచట రాజపురుష పదములు వాక్యమందువలె ప్రత్యేకము రాజునుమాత్రము పురుషునిమాత్రము బోధింపక సముదాయశక్తిచే రాజసంబన్ధిపురుషునే బోధించును. ఈవృత్తులు పదోద్దేశ్యకవిధు లగుటవలన వీనియందే ఏకార్థీభావరూపసామర్థ్యముండును. ఇది సముదాయశక్తి రూపము. కావున వృత్తులవలన పరస్పరసమ్బద్ధమగునర్థమే యుపస్థితమగును. వృత్త్యర్థమును బోధించు వాక్యము విగ్రహమనబడును. ఇచటి వాక్యశబ్దమునకు సమాసమునందుండు పదములకు పృథక్ప్రయోగరూపమర్థము. లౌకికమనియు నలౌకిక మనియును విగ్రహము రెండువిధములు. వ్యాకరణసంస్కారముగాఁబడగుటచే సాధువగునది లౌకికమగును. లోకమున ప్రయోగార్హమగునదని ఫలితార్థము. ఉదా:—రాజ్ఞఃపురుషః (రాజపురుషః) అనునది లౌకికము. వ్యాకరణసంస్కృతము గానిదగుటచే లోకమున ప్రయోగార్హముగానిది (శాస్త్రప్రక్రియానిర్వాహమునకై శాస్త్రకారులచేఁగల్పితము) అలౌకికము. ఉదా :— రాజన్ + ఙస్, పురుష + సు। అవిగ్రహముగాని యస్వపదవిగ్రహముగాని నిత్య సమాసమనఁబడును. అవిగ్రహ మన లౌకికవిగ్రహములేనిదని యర్థము. నిత్యాధికారి యసమాసమున సమాసమందలి పదములకు వ్యపేక్షారూపసామర్థ్యములేనందున లౌకికవిగ్రహముండదు. సమసించు పదములన్నిటితో గూడిన విగ్రహములేనిది యస్వపదవిగ్రహమనబడును.

2 సమాసము, అవ్యయీభావము తత్పురుషము బహువ్రీహి ద్వన్ద్వము అనునాలుగుభేదములుమాత్రముగలదని ప్రాచీనులుచెప్పిరి. అవ్యయీభావాద్యధి

కారములకు బహిర్భూతములగు "సహసుపా" (652) సూ. చే విహితములగు సమాసములుండుటవలన సమాసము చతుర్విధమను ప్రాచీనుల ప్రవాదము బాహుల్యాభిప్రాయకమని గ్రహించునది. పూర్వపదార్థము ప్రధానముగగలది యవ్యయీభావము. (ఉపకృష్ణమ్) ఉత్తరపదార్థము ప్రధానముగగలది తత్పురుషము. (కృష్ణశ్రితః) అన్యపదార్థము ప్రధానముగగలది బహువ్రీహి (పీతాంబరః) ఉభయపదార్థములకుప్రాధాన్యముగలది ద్వన్ద్వము. (రామకృష్ణౌ) అని యును ప్రాచీనులు చెప్పిరి. సూపప్రతి (అవ్యయీభావము) ఇచటనుత్తరపదార్థము ప్రధానము. ఉన్మత్తగఙ్గమ్ (అవ్యయీభావము) ఇచటనన్యపదార్థము ప్రధానము అతిమాలః (తత్పురుషము) ఇచట పూర్వపదార్థము ప్రధానము. ద్విత్రాః (బహువ్రీహి) ఇచటనుభయపదార్థములకు ప్రాధాన్యము గలదు. దన్తోష్ఠమ్ (ద్వన్ద్వము) ఇచటనుభయపదార్థములకంటెనితరమగు సమాహారమునకు ప్రాధాన్యము. వీనిలో ప్రాచీనులు చెప్పినలక్షణములు లేనందున హరిహరాదుల విషయమునను గూడ బాహుల్యాభిప్రాయకమేయని చెప్పవలయును. వారుచెప్పినలక్షణములుగలవి బహుళముగనుండుటచే వారట్లుఁ జెప్పిరి గాని యన్నిటిలోను వారిలక్షణమునకు ప్రవృత్తిలేదని యూహింపవలయును. తత్పురుషస్సమానాధికరణః కర్మధారయః" అనిచెప్పుటచే కర్మధారయము తత్పురుషమునకొక భేదము "సంఖ్యాపూర్వో ద్విగుః" అనుటచే ద్విగువు కర్మధారయమునకొక భేదము. "అనేకమన్యపదార్థే" అనుబహువ్రీహివిధాయకసూత్రమునందనేక పదముండుటచేతను అనేకమనుదానికి ద్వన్ద్వవిధాయకసూత్రములోనికనువృత్తిచేయుటవలనను ద్వన్ద్వబహువ్రీహులందే యనేకపదము లుండును. తత్పురుషాదులు పదద్వయమునందే యుండును. "ద్వ్యహ్నజాతః" మొదలగు కొన్నితత్పురుషములందుమాత్రమనేకపదములుండును. వైవిధ్యములు భాష్యాదిగ్రన్థములందుఁ జెప్పఁబడియె.

3 సమాసవిభాగమావశ్యకముగుచో నీక్రిందిరీతిననుసరించుటయుక్తము. "సుపాంసుపా" అనుశ్లోకమునకర్థము. సుపాం అనునది అథ అనుదానికి పూర్వముననుండు "సుపా" మొదలగునాల్గింటితోను సమ్బన్ధించును. (1) సుపాం సుపా। సుబన్తములకు సుబన్తముతో సమాసము. ఉదా :— రాజపురుషః। (2) సుపాంతిఙా। సుబన్తములకు తిఙన్తముతో సమాసము. ఉదా :— పర్యభూషయత్। (3) సుపాంనామ్నా। సుబన్తములకు ప్రాతిపదికముతో సమాసము. కుమ్భకారః। (4) సుపాంధాతునా। సుబన్తములకు ధాతువుతో సమాసము. కటప్రూః। ఇచట "క్విబ్వచిప్రచ్ఛ్యాయతస్తుకటప్రుజుశ్రీణాందీర్ఘోఽసంప్రసారణం చ" అను వార్తికముచే కటశబ్దమునకు "ప్రుగతౌ" అనుధాతువుతో సమాసము మొదలగునవి నిపతింపఁబడెను. అజస్రమ్। "నమికమ్ప్యజస" (3-2-167) అనుసూత్రముచే నఞునకు జసధాతువుతో సమాసమునిపతింపఁబడెను. కారికలోని "తిఙామ్" అను పది తిఙా సుబన్తేన అనువానితోసన్వయించును. (5) తిఙాంతిఙా. తిఙన్తములకు

తిఙన్తముతో సమాసము. పిబతఖాదతా। ఖాదతమోదతా। "మయూరవ్యంసకాదయశ్చ" సూ.చే సమాసము. (6) తిఙాం సుపా। తిఙన్తములకు సుబన్తముతో సమాసము. కృన్తవిచక్షణా (కృన్త విచక్షణేతి యస్యాం క్రియాయాం సా) కృన్త (ఛిన్ధి) అనుతిఙన్తమునకు విచక్షణ (సమ్బుద్ధ్యన్తము) అనుసుబన్తముతో మయూరవ్యంసకాదులందు పఠింపఁబడిన "ఏహీడాదయోఽన్యపదార్థే" అనువచనముచే సమాసము. ఈవిధముగ సమాసమారువిధములని గ్రహించునది.

శ్రీః

సర్వసమాసశేషప్రకరణము ముగిసెను.



# 22. సమాసాన్తప్రకరణము

945. ఋక్పూరబ్ధూఃపథామానక్షే. 5-4-74. ఋక్పూరబ్ధూః పథామ్. అ, అనక్షే (సమాసాన్తాః)

అ, అనక్షే, ఇతిచ్ఛేదః। ఋగాద్యన్తస్య సమాసస్య అప్రత్యయోఽన్తావయవస్స్యాత్ అక్షే యా ధూస్తదన్తస్య తు న। అర్ధర్చః॥ అనృచబహ్వృచావధ్యేతర్యేవ నేహ। అనృక్ సామ। బహ్వృక్ సూక్తమ్। విష్ణోః పూః, విష్ణుపురమ్। క్లీబత్వం లోకాత్। విమలాపం సరః॥

945. అనక్షే అనునది అర్థసామర్థ్యమువలన ధూర్‌శబ్దమునకే విశేషణమగును గాని యసంభవమువలన ఋగాదులకు గాదు. అనక్షే అనుచోట సప్తమి సంబన్ధార్థకము. అ అనునది లుప్తప్రథమాన్తము. ఋక్ పుర్ అప్ ధుర్ పథిన్ వీనిలో నేదయిన నన్తమందుగల సమాసమునకన్తావయవమై అకారప్రత్యయమగును, అక్షసంబన్ధముగలధూరమును బోధించు ధూర్‌శబ్దాన్తసమాసమునకీప్రత్యయము రాదని సూత్రార్థము. ఉదా:— అర్ధర్చః (ఋచోఽర్ధమ్) ఋక్‌శబ్దాన్తమునకు అప్రత్యయమయ్యెను. అనృచబహ్వృచశబ్దములు (అప్రత్యయాన్తములు) ఋక్కునధ్యయనముచేయుటకు యోగ్యతగలవానియందే సాధువులగును. అనృచః (అవిద్యమానా ఋచో యస్య) ఋగధ్యయనయోగ్యతగలిగి కేవలయజుర్వేదమును జదివినవాడు. బహ్వృచః (బహవః ఋచో యస్య) ఋక్‌శాఖాధ్యయనముజేసినవాడు. అధ్యేతకంటెభిన్నమగునర్థమునుబోధించు అనృచ్ బహ్వృచ్‌శబ్దములకు సమాసాన్తము రాదు. ఉదా:— అనృక్ (అవిద్యమానాః ఋచో యస్య) సామ। బహ్వృక్, సూక్తము. విష్ణుపురమ్ (విష్ణోః పూః) లిఙ్గము లోకాశ్రయమగుటచే (పండితులువిష్ణుపురశబ్దమునునపుంసకలిఙ్గముగప్రయోగించుటచే) నిచట నపుంసకలిఙ్గము సాధువగును. లిఙ్గమువిషయమున లోకమే ప్రమాణము గానవిష్ణుపురమనునది స్త్రీలిఙ్గపూశ్శబ్దాన్తతత్పురుషమగుటచే స్త్రీలిఙ్గముగావలయునని శఙ్కింప వీలులేదని యాశయము. విమలాపమ్ (విమలా ఆపో యస్మిన్) స్వచ్ఛమగునీరు గలసరస్సు.

అవ:— కృతసమాసాన్తమగునప్‌శబ్దమునకు కార్యవిశేషములను విధించు సూత్రములకు వ్యాఖ్యానముచేయబడినపిదప పూశ్శబ్దపథిన్‌శబ్దాన్తములకు అప్రత్యయాన్తోదాహరణములు జూపబడును.

946. ద్వ్యన్తరుపసర్గేభ్యోఽప ఈత్. 6-3-97. ద్వ్యన్తరుపసర్గేభ్యః అపః, ఈత్॥

అప ఇతి కృతసమాసాన్తస్యానుకరణమ్। షష్ఠ్యర్థే ప్రథమా। ఏభ్యోఽపస్య ఈత్ స్యాత్। ద్విర్గతా ఆపో యస్మిన్నితి ద్వీపమ్। అన్తరీపమ్। ప్రతీపమ్, సమీపమ్। సమాపో దేవయజనమితి తు సమా ఆపో యస్మిన్నితి బోధ్యమ్। కృతసమాసాన్తగ్రహణాన్నేహ। స్వప్। స్వపి (వా) అవర్ణాన్తాద్వా॥ ప్రేపమ్। పరేపమ్। ప్రాపమ్। పరాపమ్॥

946. అపః అనునది అప్రత్యయాన్తమనుకరణము. ఇచటి ప్రథమ షష్ఠ్యర్థకము (అపస్య) ద్వి అన్తర్ ఉపసర్గములు వీనికంటెపరమగు అప్రత్యయాన్తశబ్దముయొక్క అకారమునకు ఈకారమాదేశమగునని సూత్రార్థము. ఉదా:— ద్వీపమ్=ద్వి+అపమ్ (ద్విర్గతా ఆపో యస్మిన్) ఈత్వము. సవర్ణదీర్ఘము. అన్తరీపమ్। అన్తర్+అపమ్ (అన్తర్గతా ఆపో యస్మిన్) ప్రతీపమ్। ప్రతి+అపమ్ (ప్రతికులా ఆపో యస్మిన్) సమీపమ్। సమ్+అపమ్ (సంగతా ఆపో యస్మిన్) "సమాపో దేవయజన" మనుచోట సమశబ్దాపశబ్దములకు సమాసము. (సమా ఆపో యస్మిన్) అపశబ్దముపసర్గాదులకంటె పరముగలేనందున ఈత్వమునకు ప్రాప్తిలేదని గ్రహించునది. దేవయజనశబ్దమునకు యజ్ఞభూమి యర్థము. సమాపశబ్దమిచట లోకమునాశ్రయించి పుంలింగముగ ప్రయుక్తమైనది. అపః అనునది కృతసమాసాన్తమునకనుకరణమనుటచే స్వప్ స్వపీ (శోభనా ఆపో యస్మిన్) అనుచోటనీత్వము వారితమగును. ఇచట "నపూజనాత్" (909) సూ. చే సమాసాన్తము నిషేధింపబడెను. (వా) అవర్ణాన్తమగునుపసర్గముకంటె పరమగునపశబ్దమునకీత్వము వికల్పముగ నగును. ప్రేపమ్। ప్రాపమ్ (ప్ర+అపమ్) పరేపమ్, పరాపమ్ (పరా+అపమ్)

947. ఊదనోర్దేశే. 6-3-98. ఊత్, అనోః, దేశే। (అపః)

అనోః పరస్యాపస్య ఊత్స్యాద్దేశే। అనూపో దేశః। రాజధురా। అక్షే తు। అక్షధూః। దృఢధూరక్షః। సఖిపథః। రమ్యపథో దేశః॥

947. అనుఅనెడియుపసర్గముకంటె పరమగు అపశబ్దము (కృతసమాసాన్తాపశబ్దము) యొక్క ఆద్యాకారమునకు ప్రదేశము సముదాయ బోధ్యమగునపు డూకారమాదేశమగును. ఉదా:— అనూపః (అనుగతా ఆపో యస్మిన్) జలప్రాయమగు ప్రదేశము. రాజధురా (రాజ్ఞో ధూః) అప్రత్యయము. టాప్సవర్ణదీర్ఘములు. ధురమక్షసబ్బన్ధియగునపుడు సమాసాన్తమురాదని పూర్వముచెప్పబడెను. అక్షధూః (అక్షే ధూః) దృఢధూః (దృఢా ధూర్యస్య) అక్షము. సమాసాన్తనిషేధమునకక్షసమ్బన్ధము మాత్రమపేక్షితము. అక్షశబ్దముపూర్వపదముగనుండునపుడు

నిషేధమనిన "దృఢధూః" అనుచోట నిషేధము ప్రవర్తింపకుండును. అక్షమన్య పదార్థమగునపుడు నిషేధమనిన అక్షధూః అనుచోట నిషేధము ప్రవర్తింప కుండును. ఈరెండుచోటులందు ప్రవృత్తికొఱకే యక్షసమ్బన్ధమున్నపుడని వ్యాఖ్యానముచేయబడెను. ఈవిషయమును సూచించుటకీయుదాహరణద్వయము జూపబడె నని తెలియునది. సఖిపథః (సఖ్యుఃపన్థాః) తత్పురుషము. సమాసాన్తము. "భేః" సూ. చే టిలోపము. రమ్యపథః (రమ్యః పన్థా యస్య) బహువ్రీహి। ఉత్తర సూత్రములలోనికి "బహువ్రీహౌసంఖ్యేయే" అనుసూత్రమునుండి బహువ్రీహి పదమనువర్తింపదని సూచించుటకీయుదాహరణద్వయము చూపబడెను. కావుననీ ప్రకరణమున విహితములగు సమాసాన్తములు సర్వసమాసాధారణములగునని గ్రహించునది.

948. అచ్ ప్రత్యన్వవపూర్వాత్సామలోమ్నః. 5-4-75. అచ్, ప్రత్యన్వవపూర్వాత్, సామలోమ్నః॥

ఏతత్పూర్వాత్సామలోమాన్తాత్సమాసాదచ్ స్యాత్। ప్రతిసామమ్। అనుసామమ్ అవసామమ్। ప్రతిలోమమ్। అనులోమమ్। అవలోమమ్॥ వ=కృష్ణోదక్పాణ్డుసఙ్ఖ్యాపూర్వాయా భూమేరజిష్యతే। కృష్ణభూమః। ఉదగ్భూమః। పాణ్డుభూమః। ద్విభూమః ప్రాసాదః। వ॥ సఙ్ఖ్యాయా నదీగోదావరీభ్యాం చ। పఞ్చనదమ్। సప్తగోదావరమ్। అజితియోగవిభాగాదన్యత్రాపి। పద్మనాభః॥

948. ప్రతి అను అవ యివి పూర్వపదముగాగల్గి సామశబ్దముగాని లోమశబ్దముగాని యన్తమందుగల సమాసముకంటెనచ్ప్రత్యయమగును. ఉదా:—ప్రతిసామమ్। అవ్యయీభావము, లేకప్రాదిసమాసము. సమాసాన్తము ప్రవర్తించిన పిదప "నస్తద్ధితే" (6.3) సూ. చే టిలోపము. అనుసామమ్। ఇత్యాదులువిట్లే. వ॥ కృష్ణ ఉదక్ పాణ్డు సఙ్ఖ్యావాచకములు, యివిపూర్వపదములు భూమిశబ్దము త్తరపదముగల నమాసముకంటెనచ్ ప్రత్యయమువచ్చును. కృష్ణభూమః (కృష్ణాభూమిర్యస్య) అచ్ప్రత్యయము. "యస్యేతిచ" సూ. చే నికారలోపము. ఇట్లే ఉదగ్భూమః। మొదలగునవి. ద్విభూమః (ద్వే భూమీ యస్య) ప్రాసాదః= రెండన్తస్థులమేడ. ఈవచనము "సఙ్ఖ్యాయానదీ" అనువచనముగూడనపూర్వములుగావు. సూత్రమున "అచ్" అనుదానిని విభాగముచేయుటవలన సిద్ధములగునవని గ్రహించునది. వ॥ సఙ్ఖ్యావాచకముకంటెపరములగు నదీగోదావరీశబ్దములన్తమందుగల సమాసమునకచ్ప్రత్యయమగును. పఞ్చనదమ్ (పఞ్చానాం నదీనాం సమాహారః) సప్తగోదావరమ్ (సప్తానాం గోదావరీణాం సమాహారః) పద్మనాభః (పద్మాకారా నాభిర్యస్య, యద్వా పద్మం నాభౌ యస్య) సూత్రమున అచ్పదమును విభజించి సమాసమాత్రముకంటె అచ్ప్రత్యయమగునని జెప్పుటచేనిట్టిశిష్టప్రయో

గముఱండిసమాసాన్తము సిద్ధమగును. ఇష్టసిద్ధ్యర్థమే యోగవిభాగము నానసోషా పాదనమునుజేయవీలులేదు.

949. అక్ష్ణోఽదర్శనాత్. 5-4-76. అక్ష్ణః, అదర్శనాత్। (అచ్)

అచక్షుఃపర్యాయాదక్ష్ణోఽచ్ స్యాత్సమాసాన్తః. గవామ క్షీవ గవాక్షః॥

949. అదర్శనమనుచోట దర్శనశబ్దమునకు నేత్రమని యర్థము. నేత్రమును బోధింపని యక్షిశబ్దమన్తమందుగల సమాసముకంటెనచ్ ప్రత్యయమగును అక్షిశబ్దమక్షిసదృశవగు రంధ్రమునుబోధించునపుడీసూత్రము ప్రవర్తించునని ఫలితార్థము. ఉదా :— గవాక్షః (గవామక్షీవ) కిటికి అనియర్థము. గోశబ్దమునకు కిరణములర్థము. అక్షిశబ్దమక్షిసదృశబోధకమని సూచించుటకే విగ్రహవాక్యమున నివశబ్దము ప్రయోగింపబడెను.

950. అచతురవిచతురసుచతురస్త్రీపుంసధేన్వనడుహర్క్సామవాఙ్మనసాక్షిభ్రువదారగవోర్వష్ఠీవపదష్ఠీవనక్తన్దివరాత్రిన్దివాహర్దివసరజసనిఃశ్రేయసపురుషాయుషద్వ్యాయుషత్ర్యాయుషర్గ్యజుషజాతోక్షమహోక్షవృద్ధోక్షోపశునగోష్ఠశ్వాః 5-4-77.

ఏతే పఞ్చవింశతిరజన్తా నిపాత్యన్తే। ఆద్యాస్త్రయో బహువ్రీహయః। అవిద్యమానాని చత్వార్యస్య। అచతురః। విచతురః। సుచతురః॥ వి॥ త్ర్యుపాభ్యాం చతురోఽజిష్యతే। త్రిచతురాః। చతుర్ణాం సమీపే యే సన్తి తేఽపచతురాః। తత ఏకాదశ ద్వన్ద్వాః। స్త్రీపుంసౌ। ధేన్వనడుహౌ। ఋక్సామే। వాఙ్మనసే।అక్షిణీ చ భ్రువౌ చ అక్షిభ్రువమ్।దారాశ్చ గావశ్చ దారగవమ్। ఊరూ చ అష్ఠీవన్తౌ చ ఊర్వష్ఠీవమ్। నిపాతనాట్టిలోపః। పదష్ఠీవమ్। నిపాతనాత్పదశబ్దస్య పద్భావః। నక్తం చ దివా చ నక్తన్దివమ్। రాత్రౌ చ దివా చ రాత్రిన్దివమ్। రాత్రేర్మాన్తత్వం నిపాత్యతే। అహని చ దివా చ అహర్దివమ్। వీప్సాయాం ద్వన్ద్వో నిపాత్యతే। అహన్యహనీత్యర్థః। సరజసమితి సాకల్యేఽవ్యయీభావః। బహువ్రీహౌ తు సరజఃపఙ్కజమ్। నిశ్చితం శ్రేయో నిఃశ్రేయసమ్ తత్పురుష ఏవ। నేహ। నిఃశ్రేయాన్ పురుషః। పురుషస్యాయుః పురుషాయుషమ్। గతో ద్విగుః। ద్వ్యాయుషమ్। త్ర్యాయుషమ్। తతో ద్వన్ద్వః। ఋగ్యజుషమ్। తతస్త్రయః కర్మధారయాః। జాతోక్షః మహోక్షః। వృద్ధోక్షః।

శునస్సమీపముపశునమ్। టిలోపాభావః, సమ్ప్రసారణం చ
నిపాత్యతే। గోష్ఠే శ్వా గోష్ఠశ్వః॥

950. సూత్రమునన చతురాదిశబ్దములకు ద్వన్ద్వము. అచతురః మొదలగు నిరువదియైదుశబ్దములచ్ప్రత్యయాన్తములుగ నిపతింపబడెను. సమాసవిశేషనియమము టిలోపాదికము నిపాతనమునకు ఫలమనితెలియనగును. ఇందు మొదటి మూడును బహువ్రీహిసమాసములే. అచతురః (అవిద్యమానాని చత్వారి యస్య) విద్యమానశబ్దమునకు లోపము. విచతురః (విగతాని చత్వారి యస్య) సుచతురః (శోభనాని చత్వారి యస్య) తత్పురుషమున అచత్వారః విచత్వారః సుచత్వారః అనియే యగును. వ॥ త్రి ఉప పీనికంటెబరమగు చతుర్శబ్దమునకచ్ప్రత్యయము సమాసాన్తమగును. త్రిచతురాః (త్రయశ్చత్వారో వా) ఉపచతురాః (చతుర్ణాం సమీపేయేసన్తి) ఇచట "సఙ్ఖ్యయావ్యయ" (847) సూ. చే బహువ్రీహి।"బహువ్రీహౌ సంఖ్యేయే" సూత్రప్రాప్తమగు డచ్ప్రత్యయమునకిది యపవాదము. స్త్రీపుంసౌ మొదలగు పదునొకండుశబ్దములు ద్వన్ద్వమందే నిపతింపబడినవి. స్త్రీపుంసౌ (స్త్రీ చ పుమాంశ్చ) ద్వన్ద్వమున స్త్రీపుమాంసౌ అనురూపమునకు నివృత్తి నిపాతమునకు ఫలము. ధేన్వనడుహౌ (ధేనుశ్చానడ్వాంశ్చ) "తరేతరయోగద్వన్ద్వమున ధేన్వనడ్వాహౌ అనునది నివృత్తమగును. ఋక్సామే (ఋక్చ సామ చ) ఋక్సామనీ అనునది నివృత్తమగును. వాఙ్మనసే (వాక్చ మనశ్చ) వాఙ్మనసీ అనునది నివృత్తమగును. అక్షిభ్రువమ్ (అక్షిణీ చ భ్రువౌ చ) ప్రాణ్యఙ్గమగుటచే నేకవద్భావము. అక్షిభ్రు అనునది నివృత్తమగును. దారగవమ్ (దారాశ్చ గావశ్చ) సమాహారద్వన్ద్వము. దారగు అనునది నివృత్తమగుగు. ఊర్వష్ఠీవమ్ (ఊరూ చ అష్ఠీవన్తౌ చ) నిపాతనమువలన టిలోపము. అష్ఠీవచ్ఛబ్దమునకు జానువులర్థము. పదష్ఠీవమ్। (పాదౌ చ అష్ఠీవన్తౌ చ) నిపాతనమువలన పాదశబ్దమునకు పదాదేశము. నక్తన్దివమ్ (నక్తం చ దివా చ) ఈరెండు నవ్యయములు. అచ్ప్రత్యయము. యస్యేతిచ సూ. చే నాకారలోపము. అదన్తమగునవ్యయీభావసమాసమందుపలెనిచట ప్రక్రియనూహించునది. రాత్రిన్దివమ్ (రాత్రౌ చ దివా చ) రాత్రిశబ్దమునకు మాన్తత్వమీనిపాతనమువలననగును. అవ్యయీభావసమాసకార్యములగును. అహర్దివమ్ (అహని చ దివా చ) సుప్పునకు లుక్కగుటచే ప్రత్యయలక్షణములేనందున సుప్పుపరముగలేకుండుటచే "రోఽసుపి" (173) సూ. చే అహన్శబ్దములోనినకారమునకురాదేశము. రెండుపదములు సమానార్థకములగుటచే "విరూపాణామపి సమానార్థకానామ్" అనువచనముచే ప్రాప్తమగునేకశేషమును బాధించి యీసూత్రముచే వీప్సయందు ద్వన్ద్వము నిపతింపబడెను. ప్రతిదినమందని యర్థము. సరజసమ్ (రజోఽప్యపరిత్యజ్య) "అవ్యయం విభక్తి" (656) సూ. చే సాకల్యార్థకసహశబ్దమునకు రజశ్శబ్దముతోనవ్యయీభావము. "అవ్యయీభావే చాకాలే" (664) సూ. చే సహశబ్దమునకు సాదేశము. ఈసూత్రముచేనచ్ప్రత్యయము. అవ్యయీభావసమాసమందే యీనిపాతమనుటచే సహశబ్దరజశ్శబ్దములకు

బహువ్రీహి చేయునపుడచ్ప్రత్యయము రాదు. సహ రజోభిః అను విగ్రహమున "తేన సహేతి తుల్యయోగే" (853) సూ. చే సమాసము. "వోపసర్జనస్య" (854) సూ. చే సహశబ్దమునకు సాదేశము. సరజః అనియే యగును. పుష్పాదితో గూడిన పద్మాదికమని యర్థము. ఇట్లుండ "సరజసమపహాయ కేతకీనామ్", "సరజసమకరన్దనిర్భరాసు ప్రసవవిభూతిషు" ఇత్యాదిప్రయోగములు (బహువ్రీహులు) ప్రామాదికములే యని గ్రహించునది. నిశ్శ్రేయసమ్ (నిశ్చితం చ తత్ శ్రేయః) తత్పురుషమందే అచ్ప్రత్యయము. నిశ్చితం శ్రేయో యేన అను విగ్రహముగం నిశ్శ్రేయసాన్ అను బహువ్రీహియందచ్ ప్రత్యయము రాదు. ఈ యుసశ్చ అను విషేధముచే కప్రత్యయము నివృత్తమగును. పురుషాయుషమ్ (పురుషస్యాయుః) షష్ఠీ తత్పురుషమందచ్ప్రత్యయము. ద్వ్యాయుషమ్ (ద్వయోరాయుషోస్సమాహారః) త్ర్యాయుషమ్ (త్రయాణామాయుషాం సమాహారః) ఈ రెండును సమాహారద్విగువులు. ఋగ్యజుషమ్ (ఋచశ్చ యజూంషి చ) ద్వన్ద్వము. జాతోక్ష మహోక్ష వృద్ధోక్ష శబ్దములు కర్మధారయములు. జాతోక్షః (జాతశ్చాసావుక్షా చ) అచ్ప్రత్యయము. ఉక్షన్ శబ్దమున టిలోపము. మహోక్షః (మహాంశ్చాసావుక్షా చ) ఇచట మహచ్ఛబ్దమునకు "ఆన్మహతః" (81) సూ. చే నాత్త్వము. వృద్ధోక్షః (వృద్ధశ్చాసావుక్షా చ) అచ్ప్రత్యయము. టిలోపము. ఉపశునమ్ (శునస్సమీపమ్) అవ్యయీభావము. "నస్తద్ధితే" (663) సూత్రప్రాప్తమగు టిలోపమునకభావము "శ్వయువమఘోనామతద్ధితే" (364) సూ. చే సంప్రాప్తమగు (అతద్ధితే అను పర్యుదాసమువలన) సమ్ప్రసారణమును నిపతింపబడినవి. గోష్ఠశ్వః (గోష్ఠే శ్వా) అచ్ప్రత్యయము. టిలోపము. సప్తమీతత్పురుషయందే నిపాతనము. షష్ఠీతత్పురుషయందు గోష్ఠశ్వా అనియగును.

951. బ్రహ్మహస్తిభ్యాం వర్చసః. 5-4-78. బ్రహ్మహస్తిభ్యాం, వర్చసః। (అచ్)

అచ్ స్యాత్। బ్రహ్మవర్చసమ్। హస్తివర్చసమ్॥ వా॥ పల్యరాజభ్యాంచేతి వక్తవ్యమ్। పల్యవర్చసమ్। రాజవర్చసమ్॥

951. బ్రహ్మహస్తిశబ్దములకంటెబరమగు వర్చశ్శబ్దమంతమందుగల సమాసమునకచ్ప్రత్యయమగును. ఉదా: — బ్రహ్మవర్చసమ్ (బ్రహ్మణో వర్చః) హస్తివర్చసమ్ (హస్తినో వర్చః) (వా) పల్యశబ్దరాజశబ్దములకంటె పరమగు వర్చశ్శబ్దమన్తమందుగల సమాసమునకు నచ్ప్రత్యయమగును. పల్యవర్చసమ్ (పల్యస్య వర్చః) పల్యశబ్దమునకు హంసమును భుజించువాడని యర్థము. రాజవర్చసమ్ (రాజ్ఞో వర్చః)

952. అవసమన్ధేభ్యస్తమసః. 5-4-79. అవసమన్ధేభ్యః। తమసః। (అచ్)

అవతమసమ్। సన్తమసమ్। అన్ధయతీత్యన్ధమ్। పచాద్యచ్। అన్ధం తమః అన్ధతమసమ్॥

952. అవ సమ్ అన్ధ వీనికంటెఁబరమగు తమశ్శబ్దము న్తమందుగలసమాసమునకచ్ప్రత్యయమగును. అవతమసమ్ (అవహీనం తమః) సన్తమసమ్ (సతతం తమః) అన్ధతమసమ్ (అన్ధం తమః) అన్ధయతి యనునర్థమున ణిజన్తమగు నన్ధధాతువునకు పచాద్యచ్చుచేసిననన్ధమను రూపముసిద్ధమగును. పురుషులదృష్టికి ప్రసారములేకుండఁజేయునది. అన్ధశబ్దమునకు గాఢమైనదని ఫలితార్థము. అన్ధతమసమన గాఢమగుచీకటియని యర్థము.

953. శ్వసో వసీయశ్శ్రేయసః. 5-4-80. శ్వసః। వసీయశ్శ్రేయసః (అచ్)

వసుశబ్దః ప్రశస్తవాచీ తత ఈయసుని వసీయః। శ్వస్‌శబ్ద ఉత్తరపదార్థప్రశంసామాశీర్విషయతామాహ। మయూరవ్యంసకాదిత్వాత్సమాసః। శ్వోవసీయసమ్। శ్వశ్శ్రేయసమ్ తే భూయాత్॥

953. శ్వస్‌శబ్దము (అవ్యయము) కంటె పరములగువసీయశ్శ్రేయశ్శబ్దముల న్తమందుగల సమాసమునకచ్ప్రత్యయమగును. ప్రశస్తవాచకమగు వసుశబ్దమునకు అతిశయార్థమున ఈయసున్ప్రత్యయముపలన వసీయః అనునది సిద్ధమగును. ఉత్తరపదార్థమగు ప్రశంసకాశీర్విషయత్వమును శ్వస్ అనునది ద్యోతనజేయును. "మయూరవ్యంసకాదయశ్చ" (758) సూ. చే సమాసము. శ్వోవసీయసమ్। శ్వశ్శ్రేయసమ్। తే భూయాత్। ఆశీర్లిఙన్తప్రయోగముంచే యీరూపములు సాధువులగునని వృత్తికారునియాశయము శ్వశ్శ్రేయసమ్. శ్రేయశ్శబ్దము గూడనీయసున్ప్రత్యయాన్తమే.

వివ :— వృత్తికారువిరీతిననుసరించి శ్వస్‌శబ్దము కాలవిశేషవాచకమైనను శబ్దశక్తిస్వభావమువలన వృత్తియందుపూర్వోక్తార్థద్యోతకమగునని చెప్పెను. ఇచట శ్వస్‌శబ్దమునకర్థమే లేదనుట యుక్తము. లేదా ఉత్తరపదార్థమాత్రబోధకమని చెప్పవచ్చును. ఈవిషయము పాణినీయమతదర్పణమునుగ్రన్థమున చెప్పఁబడెను. "అర్థం పరపదస్యేహ శ్వశ్శబ్దః కాలవాచ్యపి। అభిధత్తే స్వభావేన తేనేమౌ ముఙ్గలార్థకౌ" ఇతి॥ మూలమునఉత్తరపదార్థప్రశంసామాశీర్విషయమాహ అనిగాని ఉత్తరపదార్థప్రశంసాయా ఆశీర్విషయతామాహ అనిగాని పాఠము యుక్తమని గ్రహించునది.

954. అన్వవతప్తాద్రహసః. 5-4-81. అన్వవతప్తాత్, రహసః, (అచ్)

అనురహాసమ్। అవరహాసమ్। తప్తరహాసమ్॥

954. అను అవ తప్త పీనికంటెపరమగు రహశ్శబ్దము న్తమందుగల సమాసమునకచ్ప్రత్యయమగును. అనురహసమ్ (అనుగతం రహః) ప్రాదిసమాసము. ప్రకాశాభావము రహశ్శబ్దార్థము. అవరహసమ్ (అవహీనం రహః) తప్తరహసమ్ (తప్తమివ తప్తమ్, తచ్చ రహః) పరునిచే తెలిసికొనుటకుశక్యముగానిదని యర్థము.

955. ప్రతేరురసస్సప్తమీస్థాత్. 5-4-83. ప్రతేః, ఉరసః, సప్తమీస్థాత్ (అచ్)

ఉరసీతి ప్రత్యురసమ్। విభక్త్యర్థేఽవ్యయీభావః॥

955. సప్తమీస్థాత్, అనుదానికి సప్తమ్యర్థద్యోతకమని యర్థము. ఇట్టి ప్రతి అనునవ్యయముకంటె పరమగునురశ్శబ్దము న్తమందుగల సమాసమునకచ్ప్రత్యయమగును. ప్రత్యురసమ్ (ఉరసి) విభక్త్యర్థద్యోతకమగు ప్రతిశబ్దమునకవ్యయీభావము.

956. అనుగవమాయామే, 5-4-83, అనుగవమ్। ఆయామే॥

ఏతన్నిపాత్యతే దీర్ఘత్వే। అనుగవమ్. యానమ్। యస్య చాయామ ఇతి సమాసః॥

956. ఆయామశబ్దము దీర్ఘపర్యాయము. సమాసముచే దైర్ఘ్యము బోధ్యమగునపుడనుగవమునచ్ప్రత్యయాన్తము నిపతింపఁబడెను. ఉదా:— అనుగవమ్। "యస్య చాయామః" (674) సూ. చే నవ్యయీభావము. గోదైర్ఘ్య సదృశదైర్ఘ్యముగలది యానమని యర్థము. దైర్ఘ్యము ద్యోత్యముగానపుడు అనుగు (గవాం పశ్చాత్) అనియే యుండును.

957. ద్విస్తావా త్రిస్తావా వేదిః. 5-4-84. ద్విస్తావా। త్రిస్తావా। వేదిః॥

అచ్ప్రత్యయష్టిలోపస్సమాసశ్చ నిపాత్యతే। యావతీ ప్రకృతౌ వేదిస్తతో ద్విగుణా త్రిగుణా వా వికృతౌ తత్రేదం నిపాతనమ్। వేదిరితి కిమ్। ద్విస్తావతీ త్రిస్తావతీ రజ్జుః॥

957. వేది (అగ్న్యాధారస్థలవిశేషము) అర్థమగునపుడు ద్విస్తావా త్రిస్తావా యనునచ్ప్రత్యయాన్తములు నిపతింపఁబడెను. ద్విః త్రిః అనునవి సుచ్ప్రత్యయాన్తములగునవ్యయములు. వీనికి తావచ్ఛబ్దముతో సమాసము సమాసమునకచ్ప్రత్యయము టి లోపములు నిపతింపఁబడుటచే పైరూపములు సిద్ధించును. ప్రకృతియాగము

వేది యొక్క పరిమాణ మెంత విధింపఁబడెనో యంతకు రెండురెట్లుగాని మూఁడురెట్లుగాని యధికమగు పరిమాణముగలది వికృతియాగమందలి వేదియనునర్థమున క్రమముగ నీరెండుశబ్దములు నిపతింపఁబడినవి. సమస్తయాగాఙ్గములే యాగమున నుపదేశింపఁబడునో యయ్యది ప్రకృతియాగమగును అగ్నిష్టోమాదులిట్టివగును. ఏయాగమున నఙ్గములతిదేశింపఁబడునో (సర్వాఙ్గోపదేశములేనిది) అది వికృతియాగమగును. అశ్వమేధాదులిట్టివగునని తెలియునది. వేదికంటె నితరమగు రజ్జ్వాద్యర్థమగునపుడు ద్విః తావతీ, త్రిః తావతీ, అని యగును. ఇచట సమాసాదులను వారించుటకు సూత్రమున పేర్గ్రహణ మావశ్యకము.

958. ఉపసర్గాదధ్వనః. 5-4-85. ఉపసర్గాత్। అధ్వనః, (అచ్)
ప్రగతోఽధ్వానం ప్రాధ్వో రథః॥

958. ఉపసర్గపదము ప్రాదులకుపలక్షణము. ప్రాదులకంటె బరమగు నధ్వన్శబ్దమన్తముందుగల సమాసమునకచ్ప్రత్యయమగును. ఉదా :— ప్రాధ్వః (ప్రగతోఽధ్వానమ్) రథము. ప్రాదిసమాసము. అచ్ప్రత్యయము. "నస్తద్ధితే" సూ. చే టిలోపము. ఇట్లే నిరధ్వమ్ ప్రత్యధ్వమ్ మొదలగునవియగును.

959. న పూజనాత్. 5-4-69. న, పూజనాత్॥

పూజనార్థాత్పరేభ్యస్సమాసాన్తా న స్యుః। సురాజా। అతిరాజా॥ స్వతిభ్యామేవ। నేహ। పరమరాజః। పూజనాత్కిమ్। గామతిక్రాన్తోఽతిగవః। బహువ్రీహౌ సక్థ్యక్ష్ణోరిత్యతః ప్రాగేవాయం నిషేధః। నేహ। సుసక్థః। స్వక్షః॥

959. "రాజాహస్సఖిభ్యష్టచ్" ఇత్యాదిసూత్రములచే నేయేశబ్దములకు సమాసాన్తములు విధింపఁబడినవో యాశబ్దములు, పూజావాచకముకంటె బరములగునపుడు సమాసాన్తప్రత్యయములు రావని యర్థము ఉదా :— సురాజా। అతిరాజా (పూజ్యుఁడగురాజు) సు అతి ఇవి పూజార్థకములు. ఇచట "రాజాహస్సఖిభ్యః" సూత్రవిహితమగు టచ్ప్రత్యయము నిషిద్ధమయ్యెను. ఇట్లే సుగౌః, అతిగౌః, ఇత్యాదులుదాహరణములు (వా) పూజానార్థకములలో సు అతి అనువానినే గ్రహింపవలయును. ఇట్లు చెప్పుటచే పరమరాజః అనుచోటనీనిషేధము ప్రవర్తించదు. ఇచట పరమశబ్దము పూజనార్థకము. అతిగవః (గామతిక్రాన్తః) ఇచటనతి అనునది పూజనార్థకము గాదు. పూజనాత్తను పదములేనిచో నిచటనీనిషేధము ప్రసక్తమయ్యెడిని. ఈనిషేధము "బహువ్రీహౌ సక్థ్యక్ష్ణోః" (857) సూత్రమునకు పూర్వము జెప్పఁబడిన సమాసాన్తములకే యని చెప్పవలయును. "ప్రాగ్బహువ్రీహి

గ్రహణం కర్తవ్యమ్" అను వార్తికముచే నీయర్థము సిద్ధమైనది. ఇట్లు చెప్పుటచే సుసక్థః (శోభనే సక్థినీ యస్య) స్వక్షః (శోభనే అక్షిణీ యస్య) ఇత్యాదులందీ నిషేధము ప్రవర్తించదు. బహువ్రీహౌ సక్థ్యక్ష్ణోః" సూ. చే నిచట షచ్ప్రత్యయ మగును.

960. కిమః క్షేపే. 5-4-70. కిమః, క్షేపే (న)

> క్షేపే యః కింశబ్దస్తతః పరం యత్తదన్తాత్సమాసాన్తా
> న స్యుః। కుత్సితో రాజా కింరాజా। కింసఖా। కింగౌః।
> క్షేపే కిమ్। కింరాజః। కింసఖః। కింగవః॥

960. నిన్దాబోధకమగు కింశబ్దముకంటెఁ బరమగు శబ్దము తుదనుండుగల సమాసముకంటె సమాసాన్తములు రావు. ఉదా :— కింరాజా (కుత్సితో రాజా) ప్రజలను రక్షింపని రాజని యర్థము. కింసఖా। కింగౌః। ఇచటను కింశబ్దము నిన్దార్థకము. క్షేపే అనునది లేనియెడల కింరాజః (కస్య రాజా?) కింసఖః। కింగవః ఇత్యాదులందు నీనిషేధము ప్రసక్తమగును. వీనిలో కింశబ్దము ప్రశ్నార్థకము.

961. నఞస్తత్పురుషాత్. 5-4-71. నఞః, తత్పురుషాత్ (న)

> సమాసాన్తో న। అరాజా। అసఖా। తత్పురుషాత్కిమ్।
> అధురం శకటమ్॥

961. నఞః అనునది షష్ఠ్యన్తము. (నఞస్సంబన్ధి) నఞ్పూర్వపదకము గావలయునని ఫలితమగును, నఞ్పూర్వపదకమగు రాజాదిశబ్దాన్త తత్పురుషమునకు సమాసాన్తములు రావు. అరాజా అసఖా ఇవి నఞ్ తత్పురుషములు. తత్పురుషాత్ అనునది లేనిచో అధురమ్ (అవిద్యమానా ధూర్యస్య) అను బహువ్రీహియందు నీనిషేధము ప్రసక్తమయ్యెడిని. అధురమనుదానికి శకటము, విశేష్యము.

962. పథో విభాషా. 5-4-72. పథః విభాషా। (నఞః, తత్పు రుషాత్, న)

> నఞ్పూర్వాత్పథో వా సమాసాన్తః। అపథమ్। అపన్థాః।
> తత్పురుషాదిత్యేవ। అపథో దేశః। అపథం వర్తతే॥ ఇతి
> సమాసాన్తాః॥

962. నఞ్పూర్వపదకము పథిన్శబ్దాన్తమునగు తత్పురుషమునకు సమాసాన్తనిషేధము వికల్పముగనగును. దీనివలన సమాసాన్తము వికల్పముగనగునని ఫలితమగును. ఉదా :— అపథమ్। అపన్థాః (న పన్థాః) "ఋక్పూరబ్" (945) సూ. చే నప్రత్యయమగునపుడు "నస్తద్ధితే" (883) సూ.చే టిలోపము "అపథమ్

నపుంసకమ్" (819) సూ. చే నపుంసకలిఙ్గమునగును. తత్పురుషమునకే సమాసాన్తనిషేధమనుటవలన అపథః (నవిద్యతే పన్థా యస్య=దేశము) అనుబహువ్రీహియందును అపథమ్ (పథోఽభావః) అనునవ్యయీభావమందునీనిషేధము ప్రవర్తించదని గ్రహించునది.

శ్రీః

సర్వసమాససాధారణసమాసాన్తప్రకరణము ముగిసెను.



# 23. అలుక్సమాసప్రకరణము

963. అలుగుత్తరపదే. 6-3-1. అలుక్। ఉత్తరపదే॥

అలుగధికారః ప్రాగానఙః, ఉత్తరపదాధికారస్త్వాపాద సమాప్తేః॥

963. అలుక్, ఉత్తరపదే, ఈ పదములధికృతములగును. అలుక్పదము "ఆనఙ్ ఋతో ద్వన్ద్వే" (6-3-25) సూత్రముపఱకును, ఉత్తరపదే అనునది షష్ఠాధ్యాయతృతీయపాదసమాప్తిపర్యన్తమునధికృతమగును. అలుక్పదమునకు లుగభావము (లుక్కుప్రవర్తింపకుండుట) అర్థము.

964. పఞ్చమ్యాః స్తోకాదిభ్యః. 6-3-2. పఞ్చమ్యాః, స్తోకాదిభ్యః॥

ఏభ్యః పఞ్చమ్యా అలుక్ స్యాదుత్తరపదే। స్తోకాన్ముక్తః। ఏవమన్తికార్థదూరార్థకృచ్ఛ్రేభ్యః। ఉత్తరపదే కిమ్। నిష్క్రాన్తః స్తోకాన్నిస్తోకః॥ వా॥ బ్రాహ్మణాచ్ఛంసిన ఉపసఙ్ఖ్యానమ్। బ్రాహ్మణే విహితాని శస్త్రాణి ఉపచారాద్బ్రాహ్మణాని। తాని శంసతీతి బ్రాహ్మణాచ్ఛంసీ। ఋత్విగ్విశేషః॥ ద్వితీయార్థే పఞ్చమ్యుపసఙ్ఖ్యానాదేషః॥

964. "స్తోకాన్తికదూరార్థకృచ్ఛ్రాణి క్తేన" (2-1-39) అనుసూత్రమున పఠితములగు స్తోకాదులేయీసూత్రమున స్తోకాదిశబ్దముచే గ్రాహ్యములు. పూర్వపద మాక్షిప్తము. పూర్వపదములగు స్తోకాదులకంటెపరమగు పఞ్చమీవిభక్తికి ఉత్తరపదము పరమగునపుడు లుగభావము (సమాసావయవములగువిభక్తులకు "సుపో ధాతు" సూత్రప్రాప్తమగులుక్కునకభావము) అగును. ఉదా:-- స్తోకాన్ముక్తః॥ ఇట్లే అన్తికాదాగతః। దూరాదాగతః ఇత్యాదులనూహింపునది. స్తోకాన్తిసూత్రమున స్తోకాదిపర్యాయములను గ్రహణమని చెప్పంబడెను. కావున వానికంటెం బరమగుపఞ్చమికిని లుగభావమగును. అల్పాన్ముక్తః। సమీపాదాగతః। ఇత్యాదులు. నిస్తోకః (నిష్క్రాన్తః స్తోకాత్) ఇచట లుగభావమునువారించుటకై "ఉత్తరపదే" అనునది యావశ్యకము. (వా) బ్రాహ్మణాచ్ఛంసీ అనుచోట పఞ్చమీలుగభావమును చెప్పవలయును. ఇచట పఞ్చమి ద్వితీయార్థకము. ఇది యావచన సామర్థ్యమువలననే సాధువగును. బ్రాహ్మణమున (మన్త్రవ్యాఖ్యానరూపము) విధిం

పంబడుశస్త్రములు (అప్రగీతమన్త్రసాధ్యగుణినిష్ఠగుణాభిధానములు) లక్షణచే బ్రాహ్మణములగును. ఆశస్త్రములను పఠించు ఋత్విక్కునకు బ్రాహ్మణాచ్ఛంసీ అనివ్యవహారము.

వివ:—స్తోకాన్ముక్తః, ఇత్యాదులు వాక్యములేలగాఁగూడదు. సమాసములని యఙ్గీకరించిలుగభావమునువిధించుటకేమిఫలమనిన, ఏకపదత్వము, సమాసస్వరము, "స్తోకాన్ముక్తస్యాపత్యం స్తౌకాన్ముక్తిః" అనుచోట తద్ధితప్రత్యయనిమిత్తకమగునాదివృద్ధి, మొదలగునవిప్రయోజనమని తెలియనగును. అనభిధానమువలన ద్వివచనబహువచనాన్తములగు స్తోకాదులకు వాక్యమే గానిసమాసము సాధువుగాదు. స్తోకాభ్యాం ముక్తః ఇత్యాదులు.

965. ఓజస్సహోఽమ్భస్తమసస్తృతీయాయాః. 6-3-4.
ఓజస్సహోఽమ్భస్తమసః, తృతీయాయాః॥

ఓజసాకృతమిత్యాది। వా॥ అఞ్జస ఉపసఙ్ఖ్యానమ్। అఞ్జసాకృతమ్। ఆర్జవేన కృతమిత్యర్థః॥ వా॥ పుంసానుజో జనుషాన్ధ ఇతి చ। యస్యాగ్రజః పుమాన్ స పుంసానుజః। జనుషాన్ధో జాత్యన్ధః॥

965. ఓజస్ సహస్ అమ్భస్ తమస్ పూర్వపదములగువీనిపరంబు బరమగుతృతీయావిభక్తికు త్తరపదము పరమగునపుడు లుగభావమగును. ఉదా :— ఓజసాకృతమ్। సహసాకృతమ్ అమ్భసాకృతమ్। తమసాకృతమ్। ఇచట "కర్తృకరణే కృతా" (698) సూ. చే సమాసము. (వా) అఞ్జస్ శబ్దముకంటెపరమగు తృతీయకు లుగభావమును చెప్పవలయును. అఞ్జసాకృతమ్. న్యాయ్యముగ చేయబడినదని యర్థము. (వా) పుంసానుజః, జనుషాన్ధః, అనుచోట తృతీయకు లుగభావమును చెప్పవలయును. పుంసానుజః (పుంసా హేతునానుజః) ఎవనికిముందు పుట్టినవాడు పురుషుడగునో వాడు పుంసానుజుడు. జనుషాన్ధః (జన్మనా హేతునాన్ధః) పుట్టు గ్రుడ్డివాడు. జనుశ్శబ్దమునకు జన్మయర్థము. "తృతీయా తత్కృతార్థేన" అను సూత్రమున "తృతీయా" అనుయోగవిభాగముచే నిచట సమాసమగును.

966. మనసః సంజ్ఞాయామ్. 6-3-4. మనసః, సంజ్ఞాయామ్। (తృతీయాయాః)

మనసాగుప్తా॥

966. మనశ్శబ్దముకంటెఁబరమగు తృతీయకు ఉత్తరపదముపరమగునపుడు సంజ్ఞయందు లుగభావమగును. మనసాగుప్తా (ఒకస్త్రీకిపేరు)

967. ఆజ్ఞాయిని చ. 6-3-5. (మనసః, తృతీయాయాః)

మనస ఇత్యేవ। మనసా ఆజ్ఞాతుం శీలమస్య మనసాజ్ఞాయీ॥

967. మనశ్శబ్దముకంటె పరమగు తృతీయకు ఆజ్ఞాయిన్ శబ్దము పరమగు నపుడు లుగభావమగును. ఆజ్ఞాతుం శీలమస్య అనునర్థమునందు పూర్వకజ్ఞా ధాతువునకు ణిన్ ప్రత్యయమువచ్చిన ఆజ్ఞాయిన్ శబ్దము సిద్ధమగును. మనసాజ్ఞాయీ. సంజ్ఞకానప్పుడు లుగభావముకొరకీసూత్రమని తెలియునది.

968. ఆత్మనశ్చ. 6-3-6. (తృతీయాయాః)

ఆత్మనస్తృతీయాయా అలుక్స్యాత్। వా॥ పూరణ ఇతి వక్తవ్యమ్। పూరణప్రత్యయాన్తే ఉత్తరపదే ఇత్యర్థః। ఆత్మనాపఞ్చమః జనార్దనస్త్వాత్మచతుర్థ ఏవేతి బహువ్రీహిరొప్యర్థ్యః। పూరణే కిమ్। ఆత్మకృతమ్॥

968. ఇచట "పూరణఇతివక్తవ్యమ్" అనువార్తికముగలదు. ఆత్మన్ శబ్దమునకు పూరణార్థకప్రత్యయముపరమగుట యసంభవము గానను త్తరపదాధికారమందును తదన్తబోధకమగును. కావున పూరణశబ్దమునకు పూరణార్థమున విహితమగుప్రత్యయమన్తమందుగలదని యర్థము. "తస్యపూరణేడట్"(5-2-48) ఇత్యాదిసూత్రములచే తద్ధితప్రకరణమున పూరణార్థమందు ప్రత్యయములు విధింపబడినవి. ఆత్మన్ శబ్దముకంటె పరమగుతృతీయకు పూరణార్థకప్రత్యయాన్తము (ఉత్తరపదము) పరమగునపుడు లుగభావమగుననిసూత్రార్థము. ఉదా:— ఆత్మనాపఞ్చమః (తనతో నైదవవాడు) పఞ్చమః అనునది "పఞ్చానాంపూరణః" అను నర్థమునవిహితమగు డట్ ప్రత్యయమన్తమునగలది. జనార్దనస్త్వాత్మచతుర్థఏవ" అనుప్రయోగమున "ఆత్మచతుర్థః" అనునది "ఆత్మా చతుర్థో యస్య" అను విగ్రహముగల బహువ్రీహియగుటచేనిచట నీసూత్రము ప్రవర్తింపదు. చతుర్థః (చతుర్ణాం పూరణః) అనునది పూరణప్రత్యయాన్తము. ఆత్మకృతమ్ (ఆత్మనా కృతమ్) ఇచట తృతీయకు లుగభావమును వారింప పూరణేఅనునది యావశ్యకము.

విశ:—ఆత్మనశ్చ అనునంశముగూడ వార్తికాంశమేగాని ప్రత్యేక సూత్రముగాదని కొందరు చెప్పిరి. అట్లయినచో త్తరసూత్రము (వైయాకరణాఖ్యాయామ్) లోనికి "ఆత్మనః" అనుదానికనువృత్తిలేకపోవును. అపుడు "పరస్య చ" అనుసూత్రము వ్యర్థమగును. కావున ఇట్టివారి భ్రాన్తము గానపిలిచువిప్రాయము గ్రాహ్యముగాదనితెలియునది.

969. వైయాకరణాఖ్యాయాం చతుర్థ్యాః, 6.3-7. వైయాకరణాఖ్యాయాం, చతుర్థ్యాః। (ఆత్మనః)

ఆత్మన ఇత్యేవ। ఆత్మనేపదమ్। ఆత్మనేభాషా। తాదర్థ్యే చతుర్థ్యేషా। చతుర్థీతి యోగవిభాగాత్పమానః॥

969. పూర్వసూత్రమునుండి "ఆత్మనః" అనుపదమనువర్తించును. (వైయాకరణాఖ్యాయామ్ = వ్యాకరణేభవా వైయాకరణీ, సా చాసావాఖ్యాతస్యామ్) వ్యాకరణశాస్త్రమున వ్యవహరింపఁబడు సంజ్ఞయర్థమగునపుడు ఆత్మన్ శబ్దముకంటె పరమగు చతుర్థికి లుగభావమగును. ఉదా:— ఆత్మనేభాషా ఇచట "తాదర్థ్యే చతుర్థీవాచ్యా" అనువార్తికముచే చతుర్థివచ్చెను. ఇచట సమస్యమానపదార్థము లకు ప్రకృతివికృతిభావములేనందున "రన్ధనాయస్థాలీ" అను ప్రయోగమునందువలె "చతుర్థీ తదర్థార్థ" (702) సూ. చే సమాసమప్రాప్తమగుచున్నది. కాని చతుర్థీ అనుదానిని విభాగముచేసి ప్రకృతి వికృతిభావములేకున్నను సమాసమువచ్చునని చెప్పఁబడినచట చతుర్థీతత్పురుషము సాధువగును.

వివ :— ఆత్మనేభాషా, అనునది యష్టాధ్యాయీసూత్రములందువ్యవహరింపఁబడియుండుటలేదు గానిధాతుపాఠమున నీవ్యవహారమగపడుచున్నది. ధాతువులు సూత్రములు గణములు ఉణాదులు వార్తికములు యీయైదింటియొక్క సముదాయరూపమే వ్యాకరణమని స్వీకరింపవలయును. ఆత్మనేపదాత్మనేభాషాశబ్దములు, త ఆతామ్ ఝ థాస్ ఆథామ్ ధ్వమ్ ఇట్ వహి మహి శానచ్ కానచ్, యీప్రత్యయములనుబోధించును.

970. పరస్య చ. 6-3-8. (పూర్వసూత్రమ్)

పరస్మైపదమ్। పరస్మైభాషా॥

970. వైయాకరణసంజ్ఞ బోధ్యమగునపుడు పరశబ్దముకంటెపరమగు చతుర్థికి లుగభావమగును ఉదా :— పరస్మైపదమ్। పరస్మైభాషా.

971. హలదన్తాత్సప్తమ్యాస్సంజ్ఞాయామ్. 6-3-9. హలదన్తాత్, సప్తమ్యాః, సంజ్ఞాయామ్॥

హలన్తాదదన్తాచ్చ సప్తమ్యా అలుక్సంజ్ఞాయామ్। త్వచిసారః॥

971. హలదన్తాత్ = హల్ అత్, వీనికి ద్వన్ద్వము. పిదపదీనికన్తశబ్దముతో బహువ్రీహి. హల్లుగాని హ్రస్వాకారముగాని యన్తమందుగలశబ్దము కంటెపరమగు సప్తమికి సంజ్ఞగమ్యమానమగునపుడు లుగభావమగును. హలన్తమునకుదాహరణము. త్వచిసారః (రః పేరుగలయొకరాజు) యుధిష్ఠిరః (ధర్మరాజు) ఇదియు హలన్తమునకుదాహరణము. స్థిరశబ్దములోని సకారమునకు "సాత్పదాద్యోః" (8-3-111) సూ. చే షత్వనిషేధము ప్రాప్తమగుచుండనుత్తరసూత్రముచే షత్వమును విధించుచున్నాడు. ఉత్తరసూత్రవ్యాఖ్యానసన్దర్భముననీసూత్రసమ్బన్ధియగు సదన్తోదాహరణము చూపఁబడును.

972. గవియుధిభ్యాం స్థిరః. 6-3-95. గవియుధిభ్యామ్. స్థిరః॥

ఆభ్యాం స్థిరస్య సస్య షః స్యాత్। గవిష్ఠిరః। అత్ర గవీతివచనాదేవాలుక్। యుధిష్ఠిరః। అరణ్యేతిలకాః। అత్ర సంజ్ఞాయామితి సప్తమీసమాసః। వా॥ హృద్ద్యుభ్యాం చ॥ హృదిస్పృక్। దివిస్పృక్॥

972. గవి యుధి అనునవి సప్తమ్యన్తములు. వీనికంటెపరముగనుండు స్థిరశబ్దములోని సకారమునకు షత్వమగును. గవిష్ఠిరః। ఈసూత్రముచే గవి అనుదానికంటె పరముగనుండుదానికి షత్వవిధానసామర్థ్యమువలననే యిచటగోశబ్దముకంటెబరమగు సప్తమికి లుగభావమని గ్రహింపదగును. ఉదా :— యుధిష్ఠిరః। పూర్వసూత్రముచేనిచట సప్తమికి లుగభావమయ్యెను. పూర్వసూత్రములోని యుదస్తము నకుదాహరణము :— అరణ్యేతిలకాః। ఇచట "సంజ్ఞాయామ్" (725) సూ చే సమాసము వా॥ హృద్ద్యు శబ్దములకంటెబరమగుసప్తమికిలుగభావమగునని చెప్పునది ఉదా :— హృదిస్పృక్. దివిస్పృక్. వీనికి వరుసగ హృదయం స్పృశతి, దివం స్పృశతి, అని విగ్రహములు. ఇచటనలుగ్విధానసామర్థ్యమువలననే కర్మార్థమున సప్తమివచ్చెనని తెలియునది. ఈసూత్రము "సాత్పదాద్యోః" అను దానికిబాధకము.

973. కారనామ్ని చ ప్రాచాం హలాదౌ. 6-3-10. కారనామ్ని, చ, ప్రాచామ్ హలాదౌ। (హలదన్తాత్, సప్తమ్యాః)

ప్రాచాం దేశే యత్కరనామ తత్రహలాదావుత్తరపదే హలదన్తాత్సప్తమ్యా అలుక్। ముకుటేకార్షాపణమ్। దృషదిమాషకః। పూర్వేణ సిద్ధే నియమార్థమ్। కారనామ్న్యేవ, ప్రాచామేవ, హలాదావేవేతి। కారనామ్ని కిమ్। అభ్యాహితపశుః। కారాదన్యస్యైతద్దేశస్య నామ। ప్రాచామ్ కిమ్। యూథపశుః। హలాదౌ కిమ్। అవికటోరణః। హలదన్తాత్కిమ్। నద్యాం దోహో నదీదోహః॥

973 పశుపాలకులు వ్యవసాయదారులు వీరివలన రాజులచే గ్రాహ్యమగుభాగము కరమనబడును. కార అనునది స్వార్థికాణ్ప్రత్యయాన్తమగుటచే కరకారశబ్దములు సమానార్థకములు. తూర్పుదేశమునరాజగ్రాహ్యభాగము సముదాయముచేబోధితమై సంజ్ఞప్రతీయమానమగునపుడు హలాదియగునుత్తరపదముపరమగునపుడు, హలన్తముకంటె అదన్తముకంటెనుపరమగు సప్తమికి లుగభావమగును. ఉదా :— ముకుటేకార్షాపణమ్। దృషదిమాషకః। ఇవి రాజగ్రాహ్యభాగబోధకములు. ఏతత్ప్రత్యోదాహరణములందు పూర్వసూత్రముచే లుగభావము సిద్ధమగుచుండనీసూత్రము నియమార్థమగును. (1) కరమునకు సంజ్ఞయగునపుడే అనియు (2) ప్రాగ్దేశీయులకరమైనపుడే అనియు (3) ఉత్తరపదము హలాదియగునపుడే అనియును, నియమము మూడువిధములు. అభ్యర్హితపశుః। (రాజున

కీయవగిన యుకరముకంటెనితరమగునట్టియు వస్తువునకుసంజ్ఞ) ఇచట లుగభావమును వారించుటకై "కారనామ్ని" అనునది యావశ్యకము. యూథపశుః (ఉత్తరదేశమందలిరాజగ్రాహ్యభాగమునకుసంజ్ఞ) ఇచట లుగభావమునువారించుటకై ప్రాచామనునది యావశ్యకము. అవికటోరణః (అవికటే+ఉరణః=మేకలమందలోని మేకపోతు, రాజగ్రాహ్యభాగమునకుసంజ్ఞ) ఇచటనుత్తరపదమజాది. ఇచట లుగభావమును వారించుటకై "హలాదౌ" అనునది యావశ్యకము. నదీదోహః (నద్యాం దోహః=నదినిదాటించునపుడిచ్చు కరమునకు సంజ్ఞ) ఇచట లుగభావమును వారించుటకై హలదన్తాత్తనుదానికనువృత్తియావశ్యకము.

వివ:—ఈసూత్రమునకు కాశికావృత్తిననుసరించి నియామకత్వము చెప్పబడెను. పూర్వసూత్రముచే నిత్యముగ లుగభావము సిద్ధమగుచుండ నీసూత్రము వికల్పార్థము. కావున ముకుటేకార్షాపణమ్ ముకుటకార్షాపణమను రూపద్వయము సాధువగునని భాష్యమునజెప్పబడెను. సంజ్ఞాయామనునదియనువర్తించును గాన నీసూత్రమున నామగ్రహణము స్పష్టార్థము. హలి అనిచెప్పినచో యస్మిన్విధిః అనుపరిభాషవలననే తదాదివిధి గల్గును. గానహలాదౌ అనుచోటనాదిగ్రహణము గూడ స్పష్టార్థమగును.

974. మధ్యాద్గురౌ. 5-3-11. మధ్యాత్, గురౌ, (సప్తమ్యాః)
మధ్యేగురుః వా॥ అన్తాచ్చ। అన్తేగురుః॥

974. మధ్యశబ్దములకంటె పరమగు సప్తమికి ఉత్తరపదమగుగురుశబ్దము పరమగునపుడు లుగభావమగును. ఉదా:—మధ్యేగురుః। వా॥ అన్తశబ్దముకంటె పరమగు సప్తమికి గురుశబ్దముత్తరపదమగునపుడు లుగభావమును చెప్పవలయును. అన్తేగురుః। ఈయుదాహరణములందు "సప్తమీ శౌణ్డైః" అనుసూత్రమున విభక్తమగు సప్తమీ అనుదానిచే విధింపబడు సమాసముసిద్ధమగునని తెలియునది.

975. అమూర్ధమస్తకాత్స్వాఙ్గాదకామే. 6-3-12. అమూర్ధమస్తకాత్, స్వాఙ్గాత్, అకామే (సప్తమ్యాః, హలదన్తాత్)

కణ్ఠేకాలః। ఉరసిలోమా। అమూర్ధమస్తకాత్కిమ్। మూర్ధశిఖః। మస్తకశిఖః। అకామే కిమ్। ముఖే కామోఽస్య ముఖకామః॥

**975.** మూర్ధమస్తకశబ్దములకంటెభిన్నమగు హలదన్తస్వాఙ్గవాచకమునకుత్తరమగు సప్తమికి కామశబ్దముకంటెభిన్నమగునుత్తరపదము పరమగునపుడు లుగభావమగును. ఉదా:—కణ్ఠేకాలః। ఉరసిలోమా। మూర్ధశిఖః. మస్తకశిఖః। ఇచట లుగభావమును వారించుటకై అమూర్ధమస్తకాత్తనునది యావశ్యకము. ముఖకామః

(ముఖేకామోఽస్య) ఇచట లుగభావమును వారించుటకై అగామే అనునది యావశ్యకము.

976. బన్ధే చ విభాషా. 6-3-14. బన్ధే, చ, విభాషా। (హలదన్తాత్, సప్తమ్యాః)

హలదన్తాత్సప్తమ్యా అలుక్। హస్తేబన్ధః। హస్తబన్ధః। హలద న్తేతి కిమ్। గుప్తిబన్ధః॥

976. హలన్తముకంటె నదన్తముకంటెపరమగుసప్తమికి బన్ధశబ్దము త్తరపదమగునపుడు లుగభావము వికల్పముగనగును. ఉదా:—హస్తేబన్ధః। హస్తబన్ధః। గుప్తిబన్ధః. అనుచోటనతిప్రసక్తిని వారించుటకై హలదన్తమునది యావశ్యకము.

977. తత్పురుషే కృతి బహులమ్ 6-7-14. తత్పురుషే, కృతి, బహులమ్ (సప్తమ్యాః)

స్తమ్బేరమః। కర్ణేజపః। క్వచిన్న। కురుచరః॥

977. తత్పురుషమున కృదన్తమగు త్తరపదముపరమగునపుడు సప్తమికి లుగభావము బహులముగనగును. స్తమ్బేరమః। స్తమ్బరమః। ఇత్యాదులుదాహరణములు. బహులగ్రహణమువలన కురుచరః అనుచోట సప్తమీలుక్కు. గోషు చర అనుచోటలుగభావముగూడ సిద్ధమగునని తెలియునది.

978. ప్రావృట్శరత్కాలదివాం జే. 6-3-15. ప్రావృట్శరత్కాలదివాం, జే। (సప్తమ్యాః)

ప్రావృషిజః। శరదిజః। కాలేజః, దివిజః। పూర్వస్యాయం ప్రపఞ్చః॥

978. ప్రావృట్ శరత్ కాల దివ్ వీనికంటెను త్తరమగు సప్తమికిజశబ్దము పరమగునపుడు లుగభావమగును. ప్రావృషిజః ఇత్యాదులుదాహరణములు. ఏతత్సూత్రోదాహరణములందు లుగభావము "తత్పురుషే కృతి" సూత్రముచేతనే సిద్ధమగుననిన నాసూత్రమునకుదాహరణములగువానిలో గొన్నిటియందీసూత్రము ప్రవర్తించుననియునందుచేనిది యపూర్వముగవిధాయకముగావనియును గ్రహించునది.

979. విభాషా వర్షక్షరశరవరాత్. 6-3-16. విభాషా, వర్షక్షరశరవరాత్ (సప్తమ్యాః, జే)

ఏభ్యస్సప్తమ్యా అలుక్ జే। వర్షేజః। వర్షజః। క్షరేజః। క్షరజః శరేజః। శరజః। వరేజః। వరజః॥

979. వర్ష క్షర శర వర వీనికంటె పరమగు సప్తమికి జశబ్దము పరమగునపుడు లుగభావము వికల్పముగనగును. వర్షేజః వర్షజః, ఇత్యాదులుదాహరణములు.

980. ఘకాలతనేషు కాలనామ్నః. 6-3-17. ఘకాలతనేషు। కాలనామ్నః (సప్తమ్యాః, హలదన్తాత్, విభాషా)

సప్తమ్యా విభాషాఽలుక్ స్యాత్। ఘే। పూర్వాహ్ణేతరే। పూర్వాహ్ణతరే। పూర్వాహ్ణేతమే। పూర్వాహ్ణతమే। కాలే। పూర్వాహ్ణేకాలే। పూర్వాహ్ణకాలే। తనే। పూర్వాహ్ణేతనే। పూర్వాహ్ణతనే॥

980. ఘకాలతనేషు=ఘశబ్దమునకు తరతమప్రత్యయములర్థము, కాలశబ్దము స్వరూపబోధకము. తన యనునది ప్రత్యయము. ఘ తన, యివి ప్రత్యయములయినను "ఉత్తరపదాధికారే ప్రత్యయగ్రహణే తదన్తగ్రహణం నాస్తి" (ఉత్తరపదే అనుదానికనువృత్తియున్న ప్రకరణమున గ్రహింపబడు ప్రత్యయము తదన్తమును బోధింపదు) అనుపరిభాషచే తదన్తబోధకములు గావు. హలన్తము గాని యదన్తముగానియగు కాలవాచకముకంటె పరమగు సప్తమికి తరతమప్రత్యయములు కాలశబ్దము తనప్రత్యయము యివి పరముగునపుడు లుగభావము వికల్పముగనగును. పూర్వాహ్ణేతరే, పూర్వాహ్ణతరే, ఇత్యాదులుదాహరణములు.

981. శయవాసవాసిష్వకాలాత్. 6-3-18. శయవాసవాసిషు, అకాలాత్ (హలదన్తాత్, సప్తమ్యాః, విభాషా)

ఖేశయః। ఖశయః। గ్రామేవాసః। గ్రామవాసః। గ్రామేవాసీ। గ్రామవాసీ। హలదన్తాదిత్యేవ। భూమిశయః। వా॥ అపోయోనియన్మతుషు॥ అప్సుయోనిరుత్పత్తిర్యస్యసోఽప్సుయోనిః। అప్సుభవోఽప్సవ్యః। అప్సుమన్తావాజ్యభాగౌ॥

981. కాలవాచకముకంటెభిన్నమగు హలదన్తశబ్దముకంటెను తరమగుసప్తమికి, శయ వాస వాసిన్ యివి ఉత్తరపదములగునపుడు లుగభావము వికల్పముగనగును ఖేశయః ఖశయః ఇత్యాదులుదాహరణములు. హలదన్తానుదానికనువృత్తిచేయనియెడల భూమిశయః (భూమ్యాం శయః) అనుచోట లుగభావము ప్రసక్తమగును వా॥ అప్శబ్దముకంటె పరమగు సప్తమికి యోనిశబ్దము యత్ప్రత్యయము మతుప్ప్రత్యయము యివి పరముగనున్నపుడు లుగభావమగును. అప్సుయోనిః (అప్సుయోనిరుత్పత్తిర్యస్య) నీటియందుత్పన్నమైనవాడు. అప్సవ్యః (అప్సుభవః) నీటిలో పుట్టినవాడు. అప్సుభవః అనునర్థమునననప్శబ్దముకంటె యత్ప్రత్యయము. ఈసూత్రముచే సప్తమికి లుగభావమగును. గుణావాదేశములు. అప్సుమన్తౌ। (కార్తీకీష్టియందలి యాజ్యభాగములు) అప్సు అనుశబ్దముగలవను నర్థము

నప్పుశబ్దముకంటె మతుప్ప్రత్యయమునుచేసినఅప్పుమస్తౌఅనునదిపగును. "అప్సు గ్నేసధిష్టవ", "అప్సుమేసోమోఽబ్రవీత్" అనెడి యనువాక్యమందప్సుశబ్దము లుండుటవలననాజ్యభాగములప్పుమత్తులగును.

వివ :—"అపోయోనియన్మతిషు" అనిపఠించి అప్సుమతిః, అని ప్రాచీనులుదాహరించిరనియుసీపాఠము భాష్యముననగపడదనియును మనోరమయందు దీక్షితులు వ్రాసెను. మతిషు అనుపాఠమే యుక్తమని నాగేశుడు వ్రాసెను.

982. నేన్సిద్ధబధ్నాతిషు చ. 6-3-19. న, ఇన్ సిద్ధబధ్నాతిషు, చ, (సప్తమ్యాః)

ఇన్నన్తాదిషు సప్తమ్యా అలుఙ్న। స్థణ్డిలశాయీ। సాఙ్కాశ్యసిద్ధః। చక్రబద్ధః॥

982. సప్తమ్యన్తమునకిన్ప్రత్యయముపరమగుట యసంభవము గాన సూత్రమందలిఇన్పదము తదన్తబోధకమగును హలన్తముకంటెనదన్తముకంటెను పరమగు సప్తమికి, ఇన్నన్తము, సిద్ధశబ్దము బన్ధధాతుప్రకృతికకృదన్తములు పరముగనున్నపుడు లుగభావము ప్రవర్తించదని సూత్రార్థము. వరుసగనుదాహరణములు. స్థణ్డిలశాయీ। సాఙ్కాశ్యసిద్ధః. చక్రబద్ధః॥

వివ :— చక్రబద్ధః (చక్రేబద్ధః) బద్ధః అనునది బన్ధధాతుప్రకృతికక్త ప్రత్యయాన్తము. చక్రబన్ధః అనికొందరుదాహరించిరనియు అచట బన్ధశబ్దము పచాద్యజన్తమనియు, ఘఞన్తముపరమగునపుడు "బన్ధేచ విభాషా" సూత్రము ప్రవర్తించుననియును ఉత్తరసూత్రమునుండి బన్ధేచ విభాషా అనుసూత్రములోనికి తత్పురుషపదమునకపకర్షణ యనియును. శబ్దేన్దుశేఖరమున జెప్పబడినది. ప్రకృతసూత్రములోనికి తత్పురుషే అనుదానికనువృత్తిచేయుటవలన తత్పురుషయందే యీనిషేధము ప్రవర్తించుననియు చక్రబన్ధః అనునది బహువ్రీహియగునపుడు "బన్ధే చ విభాషా" అనుసూత్రము ప్రవర్తించుననియును తత్త్వబోధినియందుచెప్పబడినది.

983. స్థే చ భాషాయామ్. 6-3-20. స్థే, చ, భాషాయామ్ (సప్తమ్యాః, న)

సప్తమ్యా అలుగ్న। సమస్థః। భాషాయాం కిమ్। కృష్ణోఽస్యాఖరేష్ఠః॥

983. హలన్తముకంటెనదన్తముకంటెను పరమగు సప్తమికి స్థశబ్దము పరమగునపుడు లుగభావము లౌకికభాషయందు ప్రవర్తించదు ఉదా ;—సమస్థః। "కృష్ణోఽస్యాఖరేష్ఠః" ఇది వేదవాక్యము. ఇచటనీనిషేధమును వారించుటకై "భాషాయామ"ునది యావశ్యకము.

984. షష్ఠ్యా ఆక్రోశే. 6-3-21. షష్ఠ్యాః, ఆక్రోశే॥

చౌరస్యకులమ్। ఆక్రోశే కిమ్। బ్రాహ్మణకులమ్। వా॥ 1 వాగ్దిక్పశ్యద్భ్యో యుక్తిదణ్డహరేషు। వాచోయుక్తిః। దిశోదణ్డః। పశ్యతోహరః। వా॥ 2 ఆముష్యాయణాముష్య పుత్రికాముష్యకులికేతిచ। అముష్యాపత్యమ్, ఆముష్యాయణః। నడాదిత్వాత్ఫక్। అముష్య పుత్త్రస్య భావః అముష్య పుత్రికా। మనోజ్ఞాదిత్వాద్వుఞ్। ఏవమాముష్యకులికా। వా॥ 3 దేవానాంప్రియ ఇతి చమూర్ఖే। అన్యత్ర దేవప్రియః।వా॥ 4 శేపపుచ్ఛలాఙ్గూలేషు శునః। శునశ్శేపః। శునఃపుచ్ఛః। శునోలాఙ్గూలః। వా॥ 5 దివశ్చ దాసే। దివోదాసః॥

984. నిన్ద గమ్యమానమగుచుండ నుత్తరపదముపరమైనపుడు షష్ఠికి లుగభావమగును ఉదా:— చౌరస్యకులమ్ ఆక్రోశేఅనునదిలేనిచో బ్రాహ్మణకులమనుచోట లుగభావము ప్రసక్తమగును. 1 వా॥ వాక్ దిక్ పశ్యత్ వీనికంటె పరమగుషష్ఠికి క్రమముగ యుక్తిదణ్డహరశబ్దములుపరములగునపుడు లుగభావమగును. ఉదా:— వాచోయుక్తిః దిశోదణ్డః పశ్యతోహరః ఇచట "షష్ఠీ చానాదరే" (638) సూ. చే షష్ఠియగును చూచువానియొక్కసమక్షమందు వానికి తెలియకుండగనేదొంగలించువాడు (స్వర్ణకారుడు) అని యర్థము. 2 వా॥ ఆముష్యాయణః ఆముష్యపుత్త్రికాఆముష్యకులికా వీనియందుషష్ఠికిలుగభావము నిపతింపబడెను. ఆముష్యాయణః. అముష్య అనునది అదశ్శబ్దమునకు షష్ఠ్యన్తము. అముష్యాపత్యమ్మనునర్థమున "నడాదిభ్యః ఫక్" (4-1-99) సూ.చే ఫక్ప్రత్యయము ఆదివృద్ధి. ప్రత్యయమునకాయనాదేశము. అముష్యపుత్త్రికా— అముష్యపుత్రశబ్దముమనోజ్ఞాదిగణమునచేరినదగుటచే అముష్య పుత్త్రస్య భావః అనునర్థమున అముష్యపుత్త్రశబ్దముకంటె "ద్వన్ద్వమనోజ్ఞాదిభ్యశ్చ" (5-1-131) సూ చే వుఞ్ప్రత్యయము. దీనికిఅకాదేశము. ఆదివృద్ధి. టాప్. ఇత్త్వము ఆముష్యకులికా (అముష్య కులస్య భావః) ఆముష్యపుత్త్రికాశబ్దమునకువలె దీనికిని ప్రక్రియనూహించునది. 3 వా॥ మూర్ఖుడనునర్థమున, దేవానాంప్రియః అనియగును. ఇచట షష్ఠికి లుగభావమగునని యాశయము. ఇచట మూర్ఖశబ్దము బ్రహ్మజ్ఞానశూన్యులను బోధించును బ్రహ్మజ్ఞానరహితులు (సంసారులు) యాగాదులనొనర్చియిన్ద్రాదిదేవతలను సన్తోషపెట్టుదురు. కాన దేవతలకువీరుపశువులవలెప్రియులగుదురని గ్రహింపదగును. (దేవశబ్దమునకు మూర్ఖులర్థమనియు మూర్ఖులకు మూర్ఖులేప్రియులగుదురు గానదేవానాం ప్రియః అనుసముదాయమునకును మూర్ఖుడనునర్థము ఫలితమగుననియును కైయటుడు వ్రాసెను) అన్యార్థమందు దేవప్రియః అనియగును. 4 వా॥ శ్వన్శబ్దముకంటెపరమగు షష్ఠికి శేపపుచ్ఛలాఙ్గూలశబ్దములు పరమగునపుడు లుగభావమగును. ఉదా:— శునశ్శేపః (శున ఇవ శేపమస్య) ఇట్లే శునః పుచ్ఛశునోలాఙ్గూలశబ్దములకును బహువ్రీహియందు లుగభావము. ఇవి ఋషి

విశేషులకు సంజ్ఞలు. ఇవిబహ్వృచబ్రాహ్మణాదిగ్రన్థములందు ప్రసిద్ధములై యున్నవి. 5 వా॥ దివ్‌శబ్దముకంటెపరమగుషష్ఠికి దాసశబ్దముపరమగునపుడు లుగభావమగును. ఉదా :— దివోదాసః॥

985. పుత్రేఽన్యతరస్యామ్. 6-3-22. పుత్రే। అన్యతరస్యామ్ (షష్ఠ్యాః। ఆక్రోశే)

షష్ఠ్యాః పుత్రేఽలుగ్వా నిన్దాయామ్। దాస్యాఃపుత్రః। దాసీపుత్రః। నిన్దాయాం కిమ్। బ్రాహ్మణీపుత్రః॥

985. పుత్రశబ్దము త్తరపదమై నిన్ద గమ్యమానమగునపుడు షష్ఠికి లుగభావము వికల్పముగనగును. ఉదా :— దాస్యాఃపుత్రః। దాసీపుత్రః. బ్రాహ్మణీపుత్రః అనుచోట లుగభావమును వారించుటకై ఆక్రోశే అనుపదమునకీ సూత్రము లోనికనువృత్తిచేయవలయును.

986. ఋతో విద్యాయోనిసమ్బన్ధేభ్యః. 6-3-23. ఋతః। విద్యాయోనిసమ్బన్ధేభ్యః (షష్ఠ్యాః)

విద్యాసమ్బన్ధయోనిసమ్బన్ధవాచినఋదన్తాత్ షష్ఠ్యా అలుక్. హోతురన్తేవాసీ। హోతుఃపుత్రః। పితురన్తేవాసీ। పితుః పుత్రః వా॥ విద్యాయోనిసమ్బన్ధేభ్యస్తత్పూర్వోత్తరపదగ్రహణమ్। నేహ. హోతృధనమ్॥

986. విద్యాసమ్బన్ధవాచకములు యోనిసమ్బన్ధవాచకములునగు ఋదన్తములకంటెపరమగు షష్ఠికు త్తరపదముపరమగునపుడులుగభావమగును. ఉదా :— హోతురన్తేవాసీ। యాగమున ఋగ్వేదవిహితములగు మన్త్రములనుపఠించువానికి హోతయని వ్యవహారము. కావున హోతృశబ్దమువిద్యాసమ్బన్ధవాచకమగును. హోతుఃపుత్రః. ఇచట హోతృశబ్దము యోనిసమ్బన్ధవాచకము. పితురన్తేవాసీ। ఇచట పితృశబ్దము విద్యాసంబంధవాచకము. పితుఃపుత్రః పితృశబ్దము యోనిసంబంధవాచకము. (ప్రసిద్ధమైన తండ్రివలన పుట్టినవాడు) వా॥ పూర్వోత్తరపదములు విద్యాసమ్బన్ధవాచకములుగాని యోనిసమ్బన్ధవాచకములుగాని అగునట్టిసమాసమందే యీసూత్రము ప్రవర్తించుననిచెప్పవలయును. కావున హోతృధనమ్. పితృధనమ్. ఇత్యాదులందు త్తరపదము విద్యాయోనిసమ్బన్ధవాచకముగాకుండుటవలన నీసూత్రముప్రవర్తించదు.

987. విభాషా స్వసృపత్యోః. 6-3-24. విభాషా, స్వసృపత్యోః (ఋతః, షష్ఠ్యాః)

ఋదన్తాత్ షష్ఠ్యా అలుగ్వా స్వసృపత్యోః పరయోః॥

987. ఋదన్తశబ్దముకంటెపరమగుషష్ఠికి స్వసృపతిశబ్దములు త్తరపదము లగునపుడు లుగభావము వికల్పముగనగును.

988. మాతుఃపితుర్భ్యామన్యతరస్యామ్. 9–3–85. మాతుః పితుర్భ్యామ్, అన్యతరస్యామ్ (స్వసుః, సః, మూర్ధన్యః, సమాసే)

ఆభ్యాం స్వసుస్సస్య షో వా స్యాత్సమాసే। మాతుః ష్వసా। మాతుఃస్వసా। పితుఃష్వసా। పితుఃస్వసా। లుక్పక్షే తు॥

988. మాతుః పితుః అనుషష్ఠ్యన్తములకంటెపరమగు స్వసృశబ్దములోని సకారమునకు సమాసమందు షకారాదేశము వికల్పముగనగును. ఉదా :— మాతుః ష్వసా। మాతుఃస్వసా. పితుఃష్వసా పితుఃస్వసా। షష్ఠికి లుక్కువచ్చినపక్షమందు నిత్యషత్వమునువిధించుసూత్రము వ్యాఖ్యానముచేయబడుచున్నది.

989. మాతృపితృభ్యాం స్వసా. 8–3–84. మాతృపితృభ్యామ్, స్వసా (సః, మూర్ధన్యః, సమాసే)

ఆభ్యాం పరస్య స్వసుః సస్య షః స్యాత్సమాసే। మాతృష్వసా। పితృష్వసా। అసమాసే తు। మాతుః స్వసా। పితుః స్వసా॥

989. స్వసా అనుచోట ప్రథమ షష్ఠ్యర్థకము. మాతృశబ్దముకంటెగాని పితృశబ్దముకంటెగాని పరమగుస్వసృశబ్దములోని సకారమునకుసమాసమందు షకారాదేశమగును. ఉదా :— మాతృష్వసా। పితృష్వసా। సూత్రద్వయమందును సమాసపదానువృత్తివలన వాక్యమందీషత్వము ప్రవర్తించదు. మాతుః స్వసా। పితుః స్వసా॥

శ్రీః

అలుక్సమాసప్రకరణము సమాప్తినొందెను.



# 24. సమాసాశ్రయవిధిప్రకరణము

990. ఘరూపకల్పచేలడ్బ్రువగోత్రమతహతేషు ఙ్యోఽనేకాచో హ్రస్వః. 6-3-43. ఘరూపకల్పచేలడ్బ్రువగోత్రమతహతేషు, ఙ్యః అనేకాచః, హ్రస్వః, (భాషితపుంస్కాత్)

భాషితపుంస్కాద్యో ఙీ తదన్తస్యానేకాచో హ్రస్వః స్యాత్ ఘరూపకల్పప్రత్యయేషు పరేషు చేలడాదిషు చోత్తరపదేషు। బ్రాహ్మణితరా। బ్రాహ్మణితమా। బ్రాహ్మణిరూపా। బ్రాహ్మణికల్పా। బ్రాహ్మణిచేలీ। బ్రాహ్మణిబ్రువా। బ్రాహ్మణిగోత్రేత్యాది। బ్రూఞః పచాద్యచి వచ్యాదేశగుణయోరభావో నిపాత్యతే। చేలడాదీని వృత్తివిషయే కుత్సనవాచీని। తైః కుత్సితానికుత్సనైరితి సమాసః। ఙ్యః కిమ్। దత్తాతరా। భాషితపుంస్కాత్కిమ్। ఆమలకీతరా। కువలీతరా॥

990. "తరప్తమపౌ ఘః" (1-1-22) అనుసూత్రముచే తరప్తమప్ ప్రత్యయములకు ఘసంజ్ఞవిధింపబడెను. కావుననిచట ఘపదమునకు తరప్తమప్ ప్రత్యయములర్థము. రూప కల్ప అనునవి తద్ధితప్రత్యయములు. తరబాదులు ప్రత్యయములయిననిచట తదన్తబోధకములుకావు. "ఉత్తరపదాధికారే ప్రత్యయగ్రహణే తదన్తగ్రహణం నాస్తి" (ఉత్తరపదే అనుపదమునకనువృత్తిగల ప్రకరణమున గ్రహింపబడుప్రత్యయము తదన్తమునకు బోధకముగాదు. ఉత్తరపదమును విశేష్యముగగైకొని ప్రత్యయము తదంతమును బోధింపదని భావము) అను పరిభాషయే యిట్లుచెప్పుటలో గారణము. చేలట్ అనునది పచాదిగణమునటిత్తుగా పఠింపబడినప్రాతిపదికము. "ఙీ" అనునది ప్రత్యయమగుటవలన (పూర్వపదవిశేష్యకము) తదన్తమును బోధించును. ఉత్తరపదే అనునది యీప్రకరణమున "మిత్రే చర్షౌ" (6-3-130) అనుసూత్రమువరకధికృతమగును. పూర్వపదమాక్షేపలబ్ధము భాషితపుంస్కముకంటెవిహితమగు ఙీప్రత్యయమన్తమందుగల్గి యనేకాచ్చయిన పూర్వపదమునకు తరతమరూపకల్పప్రత్యయములు, చేల బ్రువ గోత్రమత హత అనునుత్తరపదములు, పరమగునపుడు హ్రస్వమగునని సూత్రార్థము. బ్రాహ్మణితరా ఇత్యాదులుదాహరణములు. బ్రాహ్మణశబ్దము పురుషునిగూడ బోధించును గానభాషితపుంస్కము. బ్రాహ్మణీశబ్దము ఙ్యన్తము అనేకాచ్చులుకలది. దీనికి తరతమాదిప్రత్యయములు పరముగనుండుటచే హ్రస్వము ప్రవర్తించెను.

(తసిలాదిష్వాకృత్వసుచః (840) అనుసూత్రముచే ప్రాప్తమగుపుంవద్భావము "జాతేశ్చ" (846) అను సూ. చే నిషేధింపబడినదని తెలియదగును) బ్రాహ్మణీ చేలీ। చేలశబ్దము టిత్తగుటచే జీబన్తము. బ్రాహ్మణీబ్రువా। బ్రువ అనునది బ్రూఞ్ ధాతువునకు పచాదిగణముకంటెవిధింపబడు అచ్ప్రత్యయముచే సిద్ధమగును. అచ్ ప్రత్యయము పరముగనున్నపుడు ప్రవర్తించెడి "బ్రూఞో వచిః" (2-4-53) అను సూ. చే వచ్యాదేశము, "సార్వధాతుకార్ధధాతుకయోః" (7-3-84) అను సూ. చే గుణము, వీనియొక్కయభావము, ఇచటనిపాతనమువలన సిద్ధమైనది. చేల బ్రువాదులుసమాసాదివృత్తివిషయములయినపుడునిన్దాబోధకములు. కావున "కుత్సితాని కుత్సనైః" (736) అను సూ. చే బ్రాహ్మణాదులు చేలాదులతో సమసించును. జ్యన్తమునకు హ్రస్వమగుననుటచే "దత్తాతరా" అనుచోట టాబన్తదత్తా శబ్దమునకు హ్రస్వము వారింపబడును. ఆమలకీతరా। కువలీతరా। ఆమలకీకువలీ శబ్దములు నిత్యస్త్రీలింగములగుటచే భాషితపుంస్కములుకావు. కావుననిచట హ్రస్వమును వారించుటకై భాషితపుంస్కపదమునకనువృత్తి యావశ్యకము.

వివ :— సమాసములందు ప్రవర్తించుకార్యవిశేషములను విధించుటకీ ప్రకరణమారంభింపబడెను. తరతమరూపకల్పప్రత్యయములు అతిశయము ప్రశంసమొదలగునర్థములందువిహితములగుతద్ధితములు. కావున బ్రాహ్మణితరా బ్రాహ్మణితమాశబ్దములు త్తమబ్రాహ్మణస్త్రీబోధకములు. బ్రాహ్మణిరూపాశబ్దముప్రశస్తబ్రాహ్మణస్త్రీబోధకము. బ్రాహ్మణికల్పాశబ్దము బ్రాహ్మణస్త్రీకంటెగుణములచేఁ గొంతతక్కువయినస్త్రీని బోధించును. బ్రాహ్మణిగోత్రాదిశబ్దములు నిందితబ్రాహ్మణ స్త్రీబోధకములు.

991. నద్యాశ్శేషస్యా ఽ న్యతరస్యామ్. 6-3-44. నద్యాః, శేషస్య, అన్యతరస్యామ్। (పూర్వసూత్రము)

అజన్తనద్యా జ్యన్తస్యైకాచశ్చ ఘాదిషు హ్రస్వో వా స్యాత్। బ్రహ్మబన్ధుతరా। బ్రహ్మబన్ధూతరా। స్త్రితరా। స్త్రీతరా। వా॥ కృన్నద్యా న। లక్ష్మీతరా॥

991. శేషపదమునకు పూర్వసూత్రమునజెప్పబడినదానికంటె వితరమని యర్థము. పూర్వసూత్రమునజ్యన్తమునకుననేకాచ్చునకును హ్రస్వమువిధింపబడెను. కావుననీసూత్రమున జ్యన్తముగానట్టి నదీసంజ్ఞకమునకును,జ్యన్తమగునేకాచ్చునకును అనునర్థము లభించును. జ్యన్తభిన్నమగునద్యన్తమునకు ఏకాచ్చగుజ్యన్తమునకును తరబాదులుపరమైనపుడుహ్రస్వము వికల్పముగనగుననిసూత్రార్థము. అజ్యన్తనదికుదాహరణము. బ్రహ్మబన్ధుతరా। బ్రహ్మబన్ధూతరా। జ్యన్తమగునేకాచ్చునకుదాహరణము. స్త్రితరా। స్త్రీతరా। పూర్వసూత్రమందనువృత్తమగు భాషిత పుంస్కశబ్దమునకీసూత్రమున సంబంధములేదు. ఈవిషయమును సూచించుటకు అభాషితపుంస్కముగు

స్త్రీశబ్దమునుదాహరించెను. వా॥ నదీసంజ్ఞకము కృదన్తమైనపుడు హ్రస్వమురాదు. ఉదా:—లక్ష్మితరా లక్ష్మీశబ్దము లక్షధాతుప్రకృతిక కృదన్తము.

992. ఉగితశ్చ. 6-3-45. ఉగితః, చ, (ఘరూపకల్పచేలట్ బ్రువగోత్రమతహతేషు, ఙ్యాః, హ్రస్వః, వా)

ఉగితః పరా యా నదీ తదన్తస్య ఘాదిషు హ్రస్వో వా స్యాత్। విదుషితరా। హ్రస్వాభావపక్షే తు తసిలాదిష్వితి పుంవత్। విద్వత్తరా। వృత్త్యాదిషు విదుషీతరేత్యప్యుదాహృతం, తన్నిర్మూలమ్॥

992. ఉక్తప్రత్యాహారములోనిపర్ణమిత్సంజ్ఞగాగలది ఉగిత్తనబడును. ఉగిత్తుకంటెపరమగు నదీసంజ్ఞకము న్తమందుగలదానికి తరబాదులుపరమైనపుడు హ్రస్వము వికల్పముగనగును. "యూస్త్ర్యాఖ్యౌనదీ" (267) అనుసూత్రమీకారోకారములకును తదన్తములకునుగూడ నదీసంజ్ఞనువిధించును. అందు మొదటిపక్షమును గ్రహించి "ఉగితఃపరాయానదీ" అని వ్యాఖ్యానము చేయబడెను. ఉదా:—విదుషితరా। విదుషీశబ్దము విద్వచ్ఛబ్దమునకు స్త్రీలింగరూపము. విద్వస్ అనునది వసు ప్రత్యయాన్తమగుటచేనుగిత్తగును. దానికిపరమగునీకారము నదీసంజ్ఞకము. విదుషీశబ్దమునకు హ్రస్వమురానిపక్షమున "తసిలాదిష్వాకృత్వసుచః" (840) అను సూ. చే పుంవద్భావమువలన విద్వత్తరా అనియగును. హ్రస్వాభావపక్షమందు విదుషీతరా అనియగునని కాశికావృత్తిమొదలగు గ్రంథములందు చెప్పబడెను. హ్రస్వాభావపక్షమందును పుంవద్భావమును హ్రస్వము బాధించుననుట న్యాయ్యము గానందున వృత్త్యాద్యుక్తము ప్రమాణరహితమగును.

993. హృదయస్య హృల్లేఖయదణ్లాసేషు. 6-3-50. హృదయస్య, హృత్, లేఖయదణ్లాసేషు॥

హృదయం లిఖతీతి హృల్లేఖః। హృదయస్య ప్రియం హృద్యమ్। హృదయస్యేదం హార్దమ్। హృల్లాసః। లేఖేత్యణన్తస్య గ్రహణమ్। ఘఞి తు హృదయలేఖః। లేఖగ్రహణమేవ జ్ఞాపకమ్। ఉత్తరపదాధికారే తదన్తవిధిర్నాస్తీతి॥

993. హృదయశబ్దమునకు, లేఖశబ్దము యత్ప్రత్యయము అణ్ ప్రత్యయము లాసశబ్దము పరమగునపుడు హృద్ అనుఆదేశమగును. లేఖ అనునది లిఖధాతు ప్రకృతికమగునణ్ ప్రత్యయమన్తమందుగలది. ఉదా:—హృల్లేఖః। (హృదయం లిఖతి) హృద్యమ్ "హృదయస్య ప్రియః" (4-4-95)అను సూ.చే హృదయశబ్దముకథాటె యత్ప్రత్యయము. (మనసునకింపయినది) హార్దమ్ "తస్యేదమ్"(4-3-120) అను. సూ. చే హృదయశబ్దమునకణ్ ప్రత్యయము. అణ్ ప్రత్యయముణిత్తగుటచే "తద్ధితేష్వచామాదేః" (7-1-117) అను సూ. చే నాదివృద్ధిమగును. మనసునకు

సంబంధించినదని యర్థము. హృల్లాసః। ఇది లాసశబ్దముపరమగునపుడుదాహరణము. లేఖశబ్దమణ్ప్రత్యయాన్తము యఞ్ప్రత్యయాన్తముగూడగావచ్చును, అణ్ప్రత్యయసాహచర్యమువలననీసూత్రమందు లేఖశబ్దమణ్ప్రత్యయాంతమే నిర్దిష్టమయినదని యూహింపదగును. కావున ఘఞన్తలేఖశబ్దము పరమయినపుడు హృదాదేశమురాదు. హృదయలేఖః. సూత్రములోని అణ్పదము ప్రత్యయగ్రహణ పరిభాషచే తదన్తమును బోధించినచో నణ్ణన్తమగులేఖశబ్దమునుగ్రహించుట వ్యర్థమగును. ఇట్లే లేఖగ్రహణము వ్యర్థమై ఉత్తరపదే అనుపదమధికృతమయినంతవఱకు అనగా షష్ఠాధ్యాయ తృతీయపాదముతుదివరకుగలసూత్రములందుగ్రహింపబడు ప్రత్యయము తదన్తబోధకముగాదనుటలో జ్ఞాపకమగును. (ఉత్తరపదాధికారే ప్రత్యయగ్రహణే తదన్తగ్రహణం నాస్తి) ఘరూపకల్పాదిప్రత్యయములు తదన్తములను గ్రహింపకుండుట యీపరిభాషకు ఫలము. జ్ఞాపనోత్తరమున అణ్ణన్తలేఖశబ్దము పరమగునపుడు హృదాదేశమునకై లేఖగ్రహణము సార్థకమగునుగాన జ్ఞాపకము సుస్థమగును.

994. వా శోకష్యఞ్రోగేషు. 6-3-51. వా, శోకష్యఞ్రోగేషు। (హృదయస్య, హృత్)

హృచ్ఛోకః। హృదయశోకః। సౌహార్ద్యమ్। సౌహృదయ్యమ్। హృద్రోగః। హృదయరోగః। హృదయశబ్దపర్యాయో హృచ్ఛబ్దోఽప్యస్తి।తేన సిద్ధేప్రపఞ్చార్థమిదమ్॥

994. హృదయశబ్దమునకు శోకశబ్దము ష్యఞ్ప్రత్యయము రోగశబ్దము యివిపరమగునపుడు హృదాదేశము వికల్పముగనగును. ఉదా:— హృచ్ఛోకః. హృదయశోకః. సౌహార్ద్యమ్ "గుణవచనబ్రాహ్మణాదిభ్యః కర్మణి చ" (2-1-124) అనుసూత్రము గుణవాచకములకంటెను బ్రాహ్మణాదులకంటెను భావకర్మార్థములందు ష్యఞ్ప్రత్యయమును విధించును. సుహృదయశబ్దము బ్రాహ్మణాదిగణమునసూహింపదగినది. సుహృదయునికర్మలేకభావముఅనునర్థమందు ష్యఞ్ప్రత్యయము. సుహృదయ+య. ప్రకృతసూత్రముచే హృదయశబ్దమునకు హృదాదేశమగును. పిదప "హృద్భగసిన్ధ్వన్తే పూర్వపదస్య చ" (7-3-19) అను సూ. చే పూర్వోత్తరపదములగు సుపదహృత్పదముల మొదటియచ్చునకు వృద్ధి వచ్చును. సౌహృదయ్యమ్. హృదాదేశమురానపుడు "తద్ధితేష్వచామాదేః" (7-2-117) అను సూ. చే సుపదములోనియుకారమునకుమాత్రమే వృద్ధి ప్రవర్తించును. "యస్యేతి చ" సూ. చే నకారలోపమగును. హృదయశబ్దసమానార్థకమగు హృచ్ఛబ్దము గూడ కోశములందున్నది. ఈరెండిటివలన హృచ్ఛోకః హృదయశోకః మొదలగు శబ్దములు సిద్ధమగుచుండనీసూత్రము ప్రపంచార్థమే యనిగ్రహించునది. అనఁగా శోకాదులుపరమగునపుడే హృత్ హృదయశబ్దములకు ప్రయోగమనియు, మిగిలిన

చోట హృదయశబ్దమునకుమాత్రమే ప్రయోగమనియును నియమముకొఱకీసూత్ర మని యాశయము.

995. పాదస్య పదాజ్యాతిగోపహతేషు॥ 6-3-52. పాదస్య, పద, ఆజ్యాతిగోపహతేషు॥

ఏషూత్తరపదేషు పాదస్య పద ఇత్యదన్త ఆదేశస్స్యాత్। పాదాభ్యామజతీతి పదాజః। పదాతిః। అజ్యతిభ్యాం పాదేచేతి ఇణ్ప్రత్యయః. అజేర్వ్యఘఞపో నిపాతనాత్। పదగః। పదోపహతః॥

995. అజి అతి గ ఉపహత, ఇవి యుత్తరపదములగునపుడు పాదశబ్దమునకు పద అనునదన్తమాదేశమగును. ఉత్తరసూత్రముచే పద్ అను నాదేశము విధింపబడుటవలననిచట పద అనునదన్తమే యాదేశమనవలయును. సూత్రమున పద అనునది లుప్తవిభక్త్యన్తము. ఆదేశమదన్తమనుటవలన పదగః మొదలగు రూపములు సిద్ధములగును. ఉదా :— పదాజః। పదాతిః। పాదములచేనడచువాడని యర్థము. ఆజ్యాతిశబ్దములు, అజ అత అనుధాతువులకు "అజ్యతిభ్యాం పాదే చ" అనుఉణాదిసూత్రవిహితమగు ఇణ్ప్రత్యయమువలన సిద్ధములగును. "అజేర్వ్యఘఞపోః" (2-4-56) అను సూ. చే నజధాతువునకు విధింపబడిన వీ అనునాదేశము సూత్రమందలి అజి అనునిపాతనమువలన నివృత్తమయ్యెను.

996. పద్యత్యతదర్థే. 6-3-53. పద్, యతి, అతదర్థే (పాదస్య)

పాదస్య పత్స్యాదతదర్థే యతి పరే। పాదౌ విధ్యన్తి పద్యాశ్శర్కరాః। అతదర్థేకిమ్। పాదార్థముదకమ్ పాద్యమ్। పాదార్ఘాభ్యాం చేతి యత్। వా॥ ఇకేచరతావుపసంఖ్యానమ్। పాదాభ్యాం చరతి పదికః। పర్పాదిత్వాత్ష్ఠన్॥

996. పాదశబ్దమునకు యత్ప్రత్యయముపరమగునపుడు పద్ అనునాదేశమగును, యత్ప్రత్యయము తదర్థమునవిహితముగాకుండవలయునని సూత్రార్థము. ఉదా :— పద్యాః. పాదములకునొప్పినికలుగజేయు గువ్వరాళ్ళని యర్థము. "విధ్యత్యధనుషా" (4-4-83) సూ. చే పాదశబ్దముకంటె యత్ప్రత్యయము విధింపబడెను. పాద్యమ్ ఇచట యత్ప్రత్యయము "పాదార్ఘాభ్యాంచ" (5-4-25) సూ. చే పాదముకొరకైనదనునర్థమున విధింపబడినది. ఇచటనాదేశమునువారింప అతదర్థే అనునదావశ్యకము. వా॥ చరతి అనునర్థమందు విధింపబడు ఇక్ప్రత్యయముపరమగునపుడు పాదశబ్దమునకు పదాదేశమును చెప్పవలయును. ఉదా :— పదికః. పాదశబ్దము పర్పాదిగణముననున్నందున "పర్పాదిభ్యః ష్ఠన్" (4-4-10) అను సూ. చే ష్ఠన్ప్రత్యయమువచ్చును. "ఠస్యేకః" (7-3-50) అను సూ. చే ష్ఠన్ప్రత్యయమునకు ఇకాదేశమగును. ఈవార్తికముచే పదాదేశము. పాదములచే సంచరించువాడనియర్థము.

వివ :— పూర్వసూత్రమున పాదశబ్దము ప్రాణ్యవయవమే గ్రహింపబడు టచే నీసూత్రమందున్న దానినే గ్రహించదగును గాని పరిమాణవచనమును గ్రహింపరాదు. కావున ద్విపాద్యమ్ (ద్వాభ్యాం పాదాభ్యాం క్రీతమ్) అనుచోట పరిమాణ వాచకమగుపాదశబ్దమునకు పదాదేశము ప్రవర్తించదని తెలియునది.

997. హిమకాషిహతిషు చ. 6-3-54. హిమకాషిహతిషు, చ (పాదస్య, పత్)

పద్ధిమమ్. పత్కాషీ. పద్ధతిః॥

997. హిమ కాషిన్ హతి శబ్దములు పరమగునపుడు పాదశబ్దమునకు పదాదేశమగును. ఉదా :— పద్ధిమమ్ (పాద+హిమమ్) పదాదేశము పూర్వ సవర్ణాదేశముచే హకారమునకు దకారమునగును. పత్కాషీ పద్ధతిః.

998. ఋచః శే. 6-3-55. ఋచః, శే, (పాదస్య, పత్)

ఋచః పాదస్య పత్స్యాచ్ఛేపరే। గాయత్రీం పచ్ఛః శంసతి। పాదంపాదమిత్యర్థః। ఋచః కిమ్। పాదశః కార్షాపణం దదాతి॥

998. ఇచటిపాదశబ్దమునకు ఋక్కుయొక్క (ఋగ్వేదమునచందోబద్ధమగుభాగము) చతుర్థాంశమర్థము. శే అనునది తద్ధితప్రత్యయమగు శస్‌యొక్క ఏకదేశమునకనుకరణము. ఋక్పాదభాగమునుబోధించెడి పాదశబ్దమునకు శస్ ప్రత్యయము పరమగునపుడు పదాదేశమగునని సూత్రార్థము. ఉదా :— గాయత్రీం పచ్ఛః శంసతి (పాద+శస్) ఇచట "సంఖ్యైకవచనాచ్చ వీప్సాయామ్" (5-4-43) అను సూ. చే శస్‌ప్రత్యయము విధింపబడెను. నాల్గుపాదములుగల గాయత్రీమంత్రము నొక్కొకపాదము చొప్పునజెప్పుచున్నాడని ఋగర్థము. పాదశః కార్షాపణం దదాతి. ఇచటిపాదశబ్దము పరిమాణవాచకమగుటవలన (ఋక్పాదబోధకముగానందున) నిచట పదాదేశమునువారించుటకై సూత్రమున ఋచః అనువిశేషణమావశ్యకము.

999. వా ఘోషమిశ్రశబ్దేషు. 6-3-56. వా, ఘోషమిశ్రశబ్దేషు (పాదస్య, పత్)

పాదస్య పత్। పద్ఘోషః। పాదఘోషః। పన్మిశ్రః। పాదమిశ్రః। పచ్ఛబ్దః। పాదశబ్దః॥ వా॥ నిష్కేచేతి వాచ్యమ్। పన్నిష్కః। పాదనిష్కః॥

999. పాదశబ్దమునకు ఘోష మిశ్ర శబ్ద శబ్దములుపరముగనున్నపుడు పదాదేశము వికల్పముగానగును. పద్ఘోషః మొదలగునవియుదాహరణములు. వా॥ నిష్కశబ్దము పరమగునపుడుగూడ పాదశబ్దమునకు పదాదేశమగుననిచెప్పవలయును. ఉదా :— పన్నిష్కః। పాదనిష్కః॥

1000. ఉదకస్యోదస్సంజ్ఞాయామ్. 6-3-57. ఉదకస్య, ఉదః, సంజ్ఞాయామ్॥

ఉదమేఘః॥ వా॥ ఉత్తరపదస్య చేతి వక్తవ్యమ్। క్షీరోదః॥

1000. ఉదకశబ్దమునకు త్తరపదమున్నపుడు సముదాయముచే సంజ్ఞబోధింపబడుచుండనుదాదేశమగును. ఉదా :— ఉదమేఘః। ఇది మేఘ విశేషమునకు సంజ్ఞ॥ వా॥ ఉత్తరపదమగునుదకశబ్దమునకుగూడ సంజ్ఞయందు ఉదాదేశమగునని చెప్పవలయును. ఉదా :— క్షీరోదః। సముద్రవిశేషమునకిదిసంజ్ఞ.

విస :— "ప్రసన్నోదకమ్" (నిర్మలమగునుదకముగల సరస్సు) అను చోటనుదాదేశమునువారించుటకు వార్తికమున సంజ్ఞాయామనుదానికి సంబంధము చేయవలయును. కావున ప్రసన్నోదం సరః ఇత్యాదిప్రయోగములసాధువులగును.

1001. పేషంవాసవాహనధిషు చ. 6-3-58. (ఉదకస్య, ఉదః)

ఉదపేషం పినష్టి। ఉదవాసః। ఉదవాహనః। ఉదధిర్ఘటః। సముద్రే తు పూర్వేణ సిద్ధమ్॥

1001. పేషం వాస వాహన ధి ఇవి పరమగునప్పుడు ఉదకశబ్దమున కుదాదేశమగును. ఉదపేషం పినష్టి మొదలగునవి యుదాహరణములు. ఉదపేషమ్ అనునది ఉదకశబ్దపూర్వకపిషధాతుప్రకృతికణములన్తము. పినష్టిఅనునదియను ప్రయోగము. ఉదపేషంపినష్టి అనుసముదాయమునకుదకముచే నూరుచున్నాడని యర్థము. ఉదధిః (ఉదకం ధీయతేఽస్మిన్) నీరుపోసికొనుటకుయోగ్యమగు ఘటాదికమర్థము. సముద్రమునుబోధించునుదధిశబ్దము సంజ్ఞావాచకమగుటచే నచట పూర్వసూత్రముచేతనే ఉదాదేశము సిద్ధమగును.

1002. ఏకహలాదౌ పూరయితవ్యే ఽ న్యతరస్యామ్.
6-3-59. ఏకహలాదౌ, పూరయితవ్యే, అన్యతరస్యామ్, (ఉదకస్య, ఉదః)

ఉదకుంభః। ఉదకకుంభః। ఏకేతి కిమ్। ఉదకస్థాలీ। పూరయితవ్యేతి కిమ్। ఉదకపర్వతః॥

1002. ఏకహలాదౌ అనునది కర్మధారయగర్భితబహువ్రీహి (ఏకాశ్చాసౌ హల్ స ఆదిర్యస్య) ఇచటనేకశబ్దమసహాయార్థకము. సహాయము సమానజాతీయములకేయగును, గాననేకశబ్దము ద్వితీయమగుహల్లుకు వ్యావృత్తమగునట్లు జేయును. ఒకేహల్వర్ణమాదియందుగలదని యర్థము. పూరయితవ్యమన పూరణార్హమగువస్తువని యర్థము. సంయోగాదిగానట్టియు పూరించుటకుయోగ్యమగుకుంభాద్యర్థబోధకములైనట్టియు శబ్దములు పరమగునపుడుదకశబ్దమునకుదాదేశము వికల్పముగ నగునని యర్థము. ఉదా :— ఉదకుంభః. ఉదకకుంభః. ఉదకస్థాలీ అను

చోట స్థాలీ శబ్దము సంయోగాదియగుటచేనాదేశమునువారించుటకు ఏకగ్రహణమావశ్యకము. ఉదకపర్వతః. పర్వతముదకముచేబూరింపయోగ్యమైనదిగానందున నిచటనుదాదేశమును వారించుటకు పూరయితవ్యే అనునదావశ్యకము.

1003. మన్థౌదనసక్తుబిన్దువజ్రభారహారవీవధగాహేషు చ. 6-3-60. (ఉదకస్య, ఉదః)

ఉదమన్థః। ఉదకమన్థః। ఉదౌదనః। ఉదకౌదనః॥

1003. మన్థ ఓదన సక్తు బిన్దు వజ్ర భార హార వీవధ గాహ ఈశబ్దములుత్తరపదములగునపుడు పూర్వపదమగునుదకశబ్దమునకుదాదేశము వికల్పముగ నగును. ఉదా:— ఉదమన్థః. ఉదకమన్థః నీరు నెయ్యి మొదలగు ద్రవద్రవ్యములతోఁగలుపబడినసక్తులు మన్థశబ్దమునకర్థము. ఉదకేన మన్థః అనివిగ్రహము.

1004. ఇకో హ్రస్వోఽఙ్యో గాలవస్య. 6-3-61, ఇకః, హ్రస్వః, అఙ్యః, గాలవస్య (అన్యతరస్యామ్)

ఇగన్తస్యాఙ్యన్తస్య హ్రస్వో వా స్యాదుత్తరపదే। గ్రామణిపుత్రః। గ్రామణీపుత్రః। ఇకః కిమ్। రమాపతిః। అఙ్య ఇతి కిమ్। గౌరీపతిః। గాలవగ్రహణంపూజార్థమ్। అన్యతరస్యామిత్యనువృత్తేః। వా॥ ఇయఙువఙ్భావినామవ్యయానాంచ నేతి వాచ్యమ్। శ్రీమదః। భ్రూభఙ్గః। శుక్లీభావః। వా॥ అభ్రుకుంసాదీనామితి వక్తవ్యమ్। భ్రుకుంసః। భ్రుకుటిః। భ్రూకుంసః। భ్రూకుటిః। అకారోఽనేన విధీయత ఇతి వ్యాఖ్యానాన్తరమ్ భ్రకుంసః। భ్రకుటిః। భ్రువా కుంసో భాషణం శోభా వా యస్య సః స్త్రీవేషధారీ నర్తకః। భ్రువః కుటిః కౌటిల్యమ్॥

1004. ఇకః అఙ్యః అనునవి పూర్వపదమునకు విశేషణములగుటచే తదన్తబోధకములగును. ఇక్ప్రత్యాహారవర్ణమంతమందుగల్గి ఙ్యన్తముగానట్టి పూర్వపదమునకుత్తరపదముపరమగునపుడు హ్రస్వము వికల్పముగనగును. ఉదా :— గ్రామణిపుత్రః. గ్రామణీపుత్రః. గ్రామణీశబ్దము ఙ్యన్తభిన్నమగునిగన్తము. రమాపతిః అనుచోట రమాశబ్దమునకు హ్రస్వమునువారించుటకై ఇకః అనునది యావశ్యకము. గౌరీపతిః. ఇచట హ్రస్వమునువారించుటకు అఙ్యః అనునదావశ్యకము. వికల్పబోధకమగు అన్యతరస్యామ్ అనుపదమీసూత్రమందనువర్తించును. కావున వికల్పమును బోధించుటకై గాలవగ్రహణమనావశ్యకమయి మహర్షి నామస్మరణమువలనగలిగెడి పుణ్యముకొఱకగును. వా॥ ఇయఙువఙాదేశములకు యోగ్యములగు నిగన్తములకు, అవ్యయసంజ్ఞగలనిగన్తములకును హ్రస్వముకాదని చెప్పవలయును. శ్రీమదః. భ్రూమదః. శ్రీభ్రూశబ్దములు క్రమముగ నియఙువఙ్భావులు గాన హ్రస్వ

మునివర్తించును. శుక్లీభావః. శుక్లీశబ్దముచ్విప్రత్యయాన్తమగుటచే "ఊర్యాదిచ్విడాచశ్చ" (766) అను సూ. చే నిపాతసంజ్ఞకమగును. పిదప "స్వరాదినిపాతమవ్యయమ్" (450) అను సూ. చే నవ్యయమగును. వా॥ భ్రుకుంసః భ్రుకుటిః ఇత్యాదిశబ్దములందు హ్రస్వనిషేధము ప్రవర్తింపదనిచెప్పవలయును. వీనిలో భ్రూశబ్దమువఙ్భావియగుటచే విషేధము ప్రాప్తమగుచుండ నీవచనమూరభింపబడెను. "అభ్రుకుంసాదీనా" మనువచనమునకు భ్రుకుంసాదులందలి భ్రూశబ్దముయొక్క ఊకారమునకు అకారమాదేశమగునని గొందరు వ్యాఖ్యానమును జేసిరి. ఈపక్షమున అ, అనునది లుప్తప్రథమాన్తము. ఉదా:— భ్రకుంసః. భ్రకుటిః. కుంసశబ్దమునకు భాషణముగాని, శోభగాని, యర్థము. భ్రుకుంసశబ్దముకనుబొమ్మచే సంభాషణమునుగాని శోభనుగాని గలిగిన స్త్రీవేషధారియగు నర్తకుని బోధించును. కుటిశబ్దము కౌటిల్యార్థకము. భ్రుకుటిశబ్దము కనుబొమ్మయొక్క వక్రతను ప్రతిపాదించును.

వివ:— భ్రుకుంసాదులు హ్రస్వవికల్పముచేతను అకారాదేశవికల్పముచేతను మూడువిధములుగనగును. "భ్రకుంసశ్చ భ్రుకుంసశ్చ భ్రూకుంసశ్చేతి నర్తకః। "తంత్రీ ప్రమిలా భ్రకుటిర్భ్రుకుటిర్భ్రూకుటిః స్త్రియామ్" అనియునమరకోశము.

1005. ఏక తద్ధితే చ. 6-3-62. ఏక, తద్ధితే, చ, (హ్రస్వః)

ఏకశబ్దస్య హ్రస్వః స్యాత్తద్ధితే ఉత్తరపదే చ। ఏకస్యా ఆగతమ్=ఏకరూప్యమ్। ఏకక్షీరమ్॥

1005. ఏకశబ్దము లుప్తషష్ఠీకము. ఏకశబ్దమునకు తద్ధితప్రత్యయముగాని ఉత్తరపదముగాని పరమయినపుడు హ్రస్వము వచ్చును. ఏకశబ్దమునకు పున్నపుంసకములందు విశేషములేదుగాన స్త్రీలిఙ్గమందే హ్రస్వవిధానము సార్థకమగును. ఏకరూప్యమ్ (ఏకస్యా ఆగతమ్) ఏకాశబ్దమునకు రూప్యప్రత్యయము (తద్ధితము) పరమగుటచే హ్రస్వము వచ్చెను. ఏకక్షీరమ్ (ఏకస్యాః క్షీరమ్) ఉత్తరపదము పరమగునపుడు హ్రస్వమునకిదియుదాహరణము.

1006. జ్యాపోస్సంజ్ఞాఛందసోర్బహులమ్. 6-3-63. జ్యాపోః సంజ్ఞాఛన్దసోః, బహులమ్। (హ్రస్వః)

రేవతపుత్రః। అజక్షీరమ్॥

1006. జ్యన్తమునకు ఆబన్తమునకు నుత్తరపదము పరమైనపుడుసంజ్ఞయందు వేదమందును హ్రస్వము బహుళముగనగును. ఉదా:— రేవతిపుత్రః. రేవతీశబ్దము జ్యన్తము. రేవతిపుత్రశబ్దము సంజ్ఞావాచకము. వేదమందాబన్తమునకుదాహరణము. అజక్షీరమ్ (అజాయాః క్షీరమ్) "అజక్షీరేణజుహోతి" అని వేదవాక్యము.

1007. త్వే చ. 6-3-64. (పూర్వసూత్రము హ్రస్వః)

త్వప్రత్యయే జ్యాపోః హ్రస్వః। అజత్వమ్। అజా
త్వమ్। రోహిణిత్వమ్। రోహిణీత్వమ్॥

1007. జ్యన్తాబన్తములకు త్వప్రత్యయము పరముగనున్నపుడు వేదమున హ్రస్వము వికల్పముగనగును. త్వప్రత్యయాన్తము సంజ్ఞావాచకమగుటయసంభవము గాననీసూత్రము వేదమందే ప్రవర్తించుననుట ఫలితమగును. ఉదా :— అజత్వమ్. అజాత్వమ్ (అజాయాః భావః) రోహిణిత్వమ్. రోహిణీత్వమ్ (రోహిణ్యాః భావః) త్వప్రత్యయముత్తరపదముగానందున పూర్వసూత్రమప్రాప్తమగుచుండ నీసూత్రమారంభింపబడెనని గ్రహించునది.

1008. ష్యఙస్సంప్రసారణం పుత్రపత్యోస్తత్పురుషే.
6-1-13. ష్యఙః, సంప్రసారణమ్, పుత్రపత్యోః, తత్పురుషే॥

ష్యఙన్తస్య పూర్వపదస్య సంప్రసారణం స్యాత్పుత్ర
పత్యోరుత్తరపదయోస్తత్పురుషే॥

1008. తత్పురుషపదముచే పూర్వోత్తరపదములాక్షిప్తములగును. ష్యఙః అనునది పూర్వపదమునకువిశేషణమై తదన్తమును బోధించును. ష్యఙాదేశమంతమందుగల పూర్వపదమునకు పుత్రశబ్దపతిశబ్దములుత్తరపదములగుచుండగా తత్పురుషమందు సంప్రసారణమువచ్చును.

1009. సంప్రసారణస్య. 6-3-139. (దీర్ఘః)

సంప్రసారణస్య దీర్ఘః స్యాదుత్తరపదే। కౌముదగ
న్ధ్యాయాః పుత్రః కౌముదగన్ధీపుత్రః। కౌముదగన్ధీపతిః।
వ్యవస్థితవిభాషయా హ్రస్వో న। (వ) స్త్రీప్రత్యయే చానుప
సర్జనే నేతి తదాదినియమప్రతిషేధాత్। పరమకారీషగన్ధీ
పుత్రః। ఉపసర్జనే తు తదాదినియమాన్నేహ। అతికారీష
గన్ధ్యాపుత్రః॥

1009. సంప్రసారణమునకుత్తరపదము పరమయినపుడు దీర్ఘమువచ్చును. ఉదా :— కౌముదగన్ధీపుత్రః (కౌముదగన్ధ్యాయాః పుత్రః) కౌముదగన్ధ్య అనుష్యఙన్తముకంటె స్త్రీలిఙ్గమున చాప్ప్రత్యయముచే కౌముదగన్ధ్యా అనియగును. ఇది పూర్వాన్తవద్భావముచే ష్యఙన్తము. సంప్రసారణముచే యకారమునకికారము. పిదప పూర్వరూపము ప్రవర్తించెను. కౌముదగన్ధిపుత్రః అనియగును. స్థానివద్భావముచేవికారము సంప్రసారణమగుటవలననీసూత్రముచే దీర్ఘము వచ్చును. ఇట్లే కౌముదగన్ధీపతిః। అనుచోట ప్రక్రియనూహించునది. ఇకోహ్రస్వః

(6-3-61) సూత్రము వ్యవస్థితవిభాషయగుటవలన నీయుదాహరణద్వయమందు ప్రవర్తించదు. వ్యవస్థితవిభాషాస్వరూపమును (89) సూత్రమున జూడవలయును. పరమకారీషగన్ధీపుత్రః—"స్త్రీప్రత్యయే చానుపసర్జనే న" అనుపరిభాషచేనను పసర్జనవిషయమున తదాదినియమము నిషేధింపబడుటవలన పరమకారీషగన్ధ్యాశబ్దముగూడ ష్యఙన్తమగును. కావుననిచట సంప్రసారణము ప్రవర్తించును. స్త్రీప్రత్యయపరిభాషార్థమును (294) సూత్రమున జూచునది. అతికారీషగన్ధ్యాపుత్రః (కారీషగంధ్యామతిక్రాన్తా—అతికారీషగంధ్యాతస్యాః పుత్రః) ఉపసర్జనవిషయమున స్త్రీప్రత్యయపరిభాషప్రవర్తింపకుండుటచేనిచట తదాదినియమముండును, ఇచట కారీషగన్ధ్యాఅనునదియే ష్యఙన్తమగును గానిపూర్వపదమగు అతికారీషగన్ధ్యాశబ్దము ష్యఙన్తముగానందున సంప్రసారణము ప్రవర్తించదు.

వివ:—కౌముదగన్ధీపుత్రః. కుముదగన్ధియొక్కఅపత్యము (స్త్రీ) అనునర్థమున కుముదగన్ధిశబ్దముకంటె "తస్యాపత్యమ్" (4-1-92) అను సూ. చే అణ్ ప్రత్యయము. దీనికి "అణిఞోరనార్షయోః" (4-1-78) సూ. చే ష్యఙాదేశము. ష్యఙన్తముకంటె "యఙశ్చాప్" (4-1-74) అను సూ. చే చాప్ప్రత్యయము (స్త్రీప్రత్యయము) కౌముదగన్ధ్యాశబ్దము చాబన్తమయినను పూర్వాన్తవద్భావముచే ష్యఙన్తమగును. సంప్రసారణపూర్వరూపములచే కౌముదగన్ధి అని యగును. పూర్వరూపముప్రవర్తించినపిదప స్థానివద్భావముచేనికారము సంప్రసారణమగును. కానదీర్ఘము ప్రవర్తించును. దీర్ఘమలాశ్రయవిధియైనను దీర్ఘవిధానసామర్థ్యము వలన నిచట ననవ్విధౌ అనునిషేధము ప్రవర్తించదని గ్రహించునది.

1010. బన్ధుని బహువ్రీహౌ. 6-1-14. బన్ధుని, బహువ్రీహౌ, (ష్యఙః, సంప్రసారణమ్)

బన్ధుశబ్దే ఉత్తరపదే ష్యఙః సంప్రసారణం స్యాద్బహువ్రీహౌ. కారీషగంధ్యా బంధురస్యేతి కారీషగన్ధీబంధుః। బహువ్రీహావితి కిమ్। కారీషగంధ్యాయాః బన్ధుః, కారీషగంధ్యాబంధుః। క్లీబనిర్దేశస్తు శబ్దస్వరూపాపేక్షయా। వా॥ మాతచ్ మాతృకమాతృషు వా। కారీషగంధీమాతః। కారీషగంధ్యామాతః। కారీషగంధీమాతృకః। కారీషగంధ్యామాతృకః। కారీషగన్ధీమాతా। కారీషగన్ధ్యామాతా। అస్మాదేవ నిపాతనాన్మాతృశబ్దస్య మాతజాదేశః, కబ్వికల్పశ్చ। బహువ్రీహావేవేదమ్। నేహ। కారీషగన్ధ్యాయాః మాతా—కారీషగన్ధ్యామాతా। చిత్త్వసామర్థ్యాత్చిత్స్వరో బహువ్రీహిస్వరం బాధతే॥

1010. ష్యఙన్తపూర్వపదమునకు బన్ధుశబ్దముత్తరపదమయినపుడు బహువ్రీహియందు సంప్రసారణమగును, ఉదా:—కారీషగన్ధీబన్ధుః (కారీషగన్ధ్యా బన్ధు

రస్య)సంప్రసారణదీర్ఘములు ప్రవర్తించినవి. కారీషగబన్ధుః(కారీషగన్ధ్యాయా బన్ధుః) ఇది తత్పురుషము. ఇచట సంప్రసారణనివృత్తికై సూత్రమున బహువ్రీహిపదమావశ్యకము. సూత్రములోని బన్ధుని అనునది నపుంసకబన్ధుశబ్దమునకు సప్తమ్యన్తము. బన్ధుశబ్దము పుంలిఙ్గముగాన నపుంసకనిర్దేశమెట్లుసాధువగుననిన బన్ధుని అనునది యథ్యాహృతమగు శబ్దస్వరూపమ్ అనుదానికి విశేషణమగుటచే విశేష్యగతమగు నపుంసకలిఙ్గము విశేషణమందుజేయబడుటవలననిర్దేశము సాధువగును. వా॥ వ్యజన్తపూర్వపదమునకు మాత (చ్) మాతృక మాతృశబ్దములు పరమైనపుడు సంప్రసారణము వికల్పముగనగును. కారీషగన్ధీమాతః కారీషగన్ధ్యామాతః (కారీషగన్ధ్యా మాతా యస్య) ఇత్యాదులుదాహరణములు. ఈవార్తికమంలి నిపాతమువలననే మాతృశబ్దమునకు వైకల్పికమాతజాదేశము "నద్యృతశ్చ" (837) సూ. చే నిత్యముగవిధింపబడినకప్ప్రత్యయమునకు వైకల్పికత్వము నూహింపదగును. ఈరెండువికల్పమువలన రూపత్రయము సాధువగును. కారీషగన్ధీమాతః ఇత్యాదులను బహువ్రీహియందే భాష్యకారుడుదాహరించుటవలన నీవచనము బహువ్రీహియందే ప్రవర్తించును. కావున తత్పురుషమందిది ప్రవర్తించదు. కారీషగంన్ధ్యామాతా (కారీషగంన్ధ్యాయా మాతా) కారీషగన్ధీమాతః। ఇచట మాతజాదేశము ఇత్సంజ్ఞకచకారంముగలదిగ విధింపబడుటచేతత్ఫలమగు చిత్స్వరము (అన్తోదాత్తము) బహువ్రీహిస్వరమును (పూర్వపదప్రకృతిస్వరము) బాధించును.

1011. ఇష్టకేషీకామాలానాం చితతూలభారిషు. 6-3-65.

(హ్రస్వః)

ఇష్టకాదీనాం తదన్తానాం చ పూర్వపదానాం చితాదిషు క్రమాదుత్తరపదేషు హ్రస్వః స్యాత్। ఇష్టకచితమ్। పక్వేష్టకచితమ్। ఇషీకతూలమ్, ముంజేషీకతూలమ్। మాలభారి। ఉత్పలమాలభారి॥

1011. అధికారప్రాప్తమగునుత్తరపదముచే పూర్వపదమాక్షిప్తమగును. ఇది ఇష్టకాదులకువిశేష్యమగుటచే తదన్తవిధిగల్గును. పూర్వపదములగు ఇష్టకా ఇషీకా మాలా యాశబ్దములకు, ఇష్టకాద్యన్తపూర్వపదములకు నుత్తరపదములగు చిత, తూల, భారిశబ్దములుపరమగునపుడు హ్రస్వమగునని సూత్రార్థము. ఉదా:—ఇష్టకచితమ్ (ఇష్టకాభిశ్చితమ్) "కర్తృకరణే" (698) అను సూ. చే సమాసము. ఇష్టకాన్తమునకుదాహరణము పక్వేష్టకచితమ్. ఇషీకతూలమ్ మొదలగునుదాహరణములందు ప్రక్రియనిట్లే యూహించునది.

1012. కారే సత్యాగదస్య. 6-3-70. కారే, సత్యాగదస్య।

(ముమ్)

ముమ్ స్యాత్। సత్యఙ్కారః। అగదఙ్కారః। 1 వా॥ అస్తోశ్చేతి వక్తవ్యమ్। అస్తుఙ్కారః। 2 వా॥ ధేనోర్భవ్యాయామ్ ధేనుమ్భవ్యా। 3 లోకస్య పృణే। లోకమ్పృణః। పృణ ఇతి మూలవిభుజాదిత్వాత్కః। 4 వా॥ ఇత్యేఽనభ్యాశస్య। అనభ్యాశమిత్యః। దూరతః పరిహర్తవ్య ఇత్యర్థః। 5 వా॥ భ్రాష్ట్రాగ్న్యోరిన్ధే। భ్రాష్ట్రమిన్ధః। అగ్నిమిన్ధః। 6 వా॥ గిలేఽగిలస్య। తిమింగిలః, అగిలస్య కిమ్। గిలగిలః। 7 వా॥ గిలగిలే చ।తిమింగిలగిలః। 8 వా॥ ఉష్ణభద్రయోః కరణే। ఉష్ణఙ్కరణమ్। భద్రఙ్కరణమ్॥

1012. సత్యాగదస్య అనునది సత్యశబ్దాగదశబ్దములకు సమాహారద్వన్ద్వము. సత్యాగదశబ్దములకు కారశబ్దము పరమయినపుడు ముమ్ (మ్) ఆగమమగును. సత్యఙ్కారః। శపథకరణము శపథకర్తయనర్థము. అగదఙ్కారః (వైద్యుడు) ఉదాహరణద్వయమందునుస్వారపరసవర్ణములగును. 1 వా॥ కారశబ్దము పరమగునపుడు అస్తు అనుదానికిగూడ ముమాగమమగును. అస్తుఙ్కారః (అఙ్గీకారము) అస్తు అనునది తిఙన్తప్రతిరూపకమగునవ్యయము. 2 వా॥ ధేనుశబ్దమునకు భవ్యాశబ్దముపరమగునపుడుముమాగమమగును. ధేనుమ్భవ్యా (ధేనుశ్చాసౌ భవ్యా చ) "మయూరవ్యంసకాదయశ్చ" అను సూ. చే సమాసము. ఆగణమున నిపాతనము వలననే భవ్యాశబ్దమునకు పరనిపాతము. కాగలధేనువనియర్థము. 3 వా॥ లోకశబ్దమునకు పృణశబ్దముపరమయినపుడు ముమాగమమగును. లోకమ్పృణః (లోకం పృణతి) లోకమును సంతసింపజేయువాడని యర్థము. పృణధాతువు మూలవిభుజాదిగణము లోనిదగుటచే "కప్రకరణే మూలవిభుజాదిభ్య ఉపసంఖ్యానమ్" అను వార్తికముచే కప్రత్యయము (అ) వచ్చెను. ఆగణమునజేర్చనియెడల "కర్మణ్యణ్" (3-2-1) అను సూ. చే నణ్ప్రత్యయముప్రాప్తించుటచేలోకమ్పృణః అనురూపముసిద్ధముగాకుండును. 4 వా॥ అనభ్యాసశబ్దమునకు ఇత్యశబ్దము పరమయినపుడు ముమాగమమగును. అనభ్యాసమిత్యః। దూరమునందుంచతగినవాడని యర్థము. 5 వా॥ భ్రాష్ట్రశబ్దాగ్నిశబ్దములకు ఇన్ధశబ్దముపరమగునపుడు ముమాగమమగును. భ్రాష్ట్రమిన్ధః। అగ్నిమిన్ధః। 6 వా॥ గిలశబ్దముత్తరపదమగునపుడు గిలశబ్దముకంటెభిన్నమగు పూర్వపదమునకు ముమాగమమగును. తిమిఙ్గిలః (తిమిం గిలతి) గిలఅనునది మూలవిభుజాదికప్రత్యయాన్తము. అగిలస్య అనుటచే పూర్వపదమగుగిలశబ్దమునకాగమము రాదు. గిలగిలః। 7 వా॥ గిలగిలశబ్దముపరమైనపుడు గూడ గిలశబ్దముకంటెభిన్నమగు పూర్వపదమునకు ముమాగమమగును. తిమిఙ్గిలగిలః (గిలంగిలతీతి గిలగిలః, తిమీనాం గిలగిలః) ఇవి మత్స్యవిశేషవాచకములు. 8 వా॥ ఉష్ణభద్రశబ్దములకు కరణశబ్దముత్తరపదమగునపుడు ముమాగమమగును. ఉష్ణఙ్కరణమ్। భద్రఙ్కరణమ్॥

1013. రాత్రేః కృతి విభాషా. 6-3-72. రాత్రేః। కృతి. విభాషా (ముమ్)

రాత్రిఞ్చరః। రాత్రిచరః। రాత్రిమటః। రాత్ర్యటః। అఖిదర్థమిదం సూత్రమ్। ఖితి తు అరుర్ద్విషదితి నిత్యమేవ వక్ష్యతే। రాత్రిమ్మన్యః॥

1013. ఉత్తరపదాధికారమున గ్రహింపబడుప్రత్యయము తదన్తబోధకము గాదని నిషేధమున్నను రాత్రిశబ్దమునకు కృత్ప్రత్యయముపరమగుటయసంభవము గాననీసూత్రమున తదన్తవిధి గల్గును. రాత్రిశబ్దమునకు కృదన్తముపరమైనపుడు ముమాగమము వికల్పముగనగునని సూత్రార్థము. రాత్రిఞ్చరః ఇత్యాదులుదాహరణములు. కృత్ప్రత్యయములలో గొన్నిఖకారేత్సంజ్ఞకములు. (ఖిత్తులు) కొన్నితద్భిన్నములుగలవు. ఖిత్తులుగానట్టికృత్తులన్తమందుగలయుత్తరపదముపరమైనపుడీ సూత్రము ప్రవర్తించును. చరః అటః ఇవి యఖిదన్తములు. ఖిదన్తముపరమయినపుడు పూర్వవిప్రతిషేధాశ్రయణమువలన "అరుర్ద్విషత్" (6-3-67) అను సూ. చే నిత్యమగుముమాగమమే యగును. రాత్రిమ్మన్యః। "మన్యః" అనునది మనధాతుప్రకృతికఖశ్ ప్రత్యయాన్తము.

1014. సహస్య సః సంజ్ఞాయామ్. 6-3-78. సహస్య, సః, సంజ్ఞాయామ్॥

ఉత్తరపదే। సపలాశమ్। సంజ్ఞాయాం కిమ్। సహయుధ్వా॥

1014. సహశబ్దమునకుత్తరపదము పరమైనపుడు సాదేశమగును. ఉదా:- సపలాశమ్ (సహపలాశమ్) వనవిశేషమునకిది సంజ్ఞ సహయుధ్వా (సహయుధ్యతి) కలసియుద్ధముచేయువాడు. సహశబ్దపూర్వకమగు యుధధాతువుకంటె క్వనిప్ప్రత్యయముచే సిద్ధమైన నకారాన్తశబ్దము. ఇది సంజ్ఞగాదు. ఇచట సాదేశముగు వారించుటకై సంజ్ఞాయామనునది యావశ్యకము.

1015. గ్రన్థాన్తాధికే చ. 6-3-79. (సహస్య. సః)

అనయోరర్థయోస్సహస్య సః స్యాదుత్తరపదే। సముహూర్తం జ్యోతిషమధీతే। సద్రోణా ఖారీ।

1015. గ్రన్థాన్తాపదాధికపదములకు సమాహారద్వంద్వము. గ్రన్థముయొక్క తుదిభాగమును అధికమును ప్రతిపాదించెడి సహశబ్దమునకుత్తరపదముపరమగునపుడు సాదేశమగును. ఉదా :- సముహూర్తం జ్యోతిషమధీతే. జ్యోతిశ్శాస్త్రమును ముహూర్తగ్రన్థపర్యన్తము చదువుచున్నాడనియర్థము. సముహూర్తమను చోట సహముహూర్తపదములకు "అవ్యయం విభక్తి" సూ. చే నన్తవచనమంద

వ్యయీభావము. అధికార్థమునకుదా :— సద్రోణా (ఖారీ=కుంచనముచేనధికమగు పుట్టెడనియర్థము)

వివ :—సముహూర్తమ్। కాలవాచకమగుముహూర్తపదమిచటముహూర్త ప్రతిపాదకగ్రన్థపరమైనను కాలత్వారోపముచే కాలవాచకమగును. అవ్యయీభావమున సహశబ్దమునకు సాదేశమును విధించు "అవ్యయీభావే" అనుసూత్రము కాలవాచకముపరమైనపుడు ప్రవర్తించనందున నీసూత్రమారంభింపబడెను.

1016. ద్వితీయే చానుపాఖ్యే. 6-3-80. దితీయే, చ అను పాఖ్యే (సహస్య, సః)

అనుమేయే ద్వితీయే సహస్య సః స్యాత్। సరాక్షసీకా నిశా। రాక్షసీ సాక్షాదనుపలభ్యమానా నిశయాऽనుమీయతే॥

1016. ద్వితీయశబ్దమప్రధానమగు సహాయుని బోధించును. ఉపాఖ్యమన ప్రత్యక్షము. తద్భిన్నమనుపాఖ్యము. అనుమేయిమని ఫలితార్థము. ప్రత్యక్షముగ గ్రహింపనశక్యమైనందున ననుమానప్రమాణముచే దెలియతగినదని భావము. అనుమేయము అప్రధానమునగుదానిని ప్రతిపాదించు శబ్దముత్తరపదమగునపుడు పూర్వపదమగు సహాశబ్దమునకు సాదేశమగునని సూత్రార్థము. ఉదా :— సరాక్షసీకా (సహ రాక్షస్యా) "తేనసహేతితుల్యయోగే" (853) అను సూ. చే సహాశబ్దమునకు రాక్షసీశబ్దముతో బహువ్రీహి "నద్యృతశ్చ" అను సూ. చే కప్రత్యయము. ఇచటరాత్రిప్రధానమగుటచే రాక్షసి యప్రధానము. రాక్షసి ప్రత్యక్షముగ నగపడదనిదయి రాత్రిచేననుమానింపదగినది. కావున రాక్షసీశబ్దమప్రధానానుమేయవస్తు బోధకమగును.

1017. సమానస్య ఛన్దస్యమూర్ధప్రభృత్యుదర్కేషు. 6-3-84. సమానస్య, ఛన్దసి, అమూర్ధప్రభృత్యుదర్కేషు। (సః)

సమానస్య సః స్యాదుత్తరపదే న తు మూర్ధాదిషు। అనుభ్రాతా, సగర్భ్యః। అనుసఖా, సయూథ్యః। యోనస్సనుత్యః। తత్రభవఇత్యర్థే సగర్భసయూథసనుతాద్యత్। అమూర్ధాదిషు కిమ్। సమానమూర్ధా। సమానప్రభృతయః। సమానోదర్కాః। సమానస్యేతియోగో విభజ్యతే। తేన సపక్షః సాధర్మ్యం, సజాతీయమిత్యాదిసిద్ధమితి కాశికా। అథవా సహాశబ్దస్సదృశవచనోऽప్యస్తి। సదృశస్సఖ్యా ససఖీతి యథా। తేనాయమస్వపదవిగ్రహో బహువ్రీహిః। సమానః పక్షోऽస్యేత్యాది॥

1017. వేదమున సమానశబ్దమునకు మూర్ధన్ ప్రభృతి ఉదర్క వీని కంటెనితరమగు శబ్దముత్తరపదమైనపుడు సాదేశమగును. అనుభ్రాతాసగర్భ్యః (సమానేగర్భేభవః) ఇత్యాదులుదాహరణములు. సగర్భ్యః ఇత్యాదులు వేదములోనివనితెల్పుటకై వాక్యములుదాహరింపబడెను. సగర్భసయూథసనుతశబ్దములు కర్మధారయములు. వీనికంటెభవార్థమందు "సగర్భసయూథసనుతాద్యన్"(4-4-114) అను సూ. చే యన్‌ప్రత్యయమగును. సమానమూర్ధా ఇత్యాదులందు సాదేశనివృత్తికై అమూర్ధప్రభృత్యుదర్కేషు అను ప్రతిషేధమావశ్యకము.

లౌకికభాషయందు సపక్షః సాధర్మ్యమిత్యాదులలో సమానశబ్దమునకు సాదేశముకొఱకు "సమానస్యేతి" త్యాదిగ్రంథముచేనుపాయము ప్రదర్శింపబడుచున్నది. సూత్రమున "సమానస్య" అనుదానిని విభాగముజేసి సమానశబ్దమునకుత్తరపదముపరమైనపుడు సాదేశమగునని చెప్పవలయును. ఈవాక్యముచే సపక్షః (సమానః పక్షో యస్య) సాధర్మ్యమ్(సమానో ధర్మో యస్యతస్య భావః) సజాతీయః (సమానాయాం జాతౌ భవః) ఇత్యాదులలో సాదేశము సిద్ధమగును. యోగవిభాగమిష్టసిద్ధ్యర్థము గావునసతిప్రసక్తిని శఙ్కింపవలనుపడదు. యోగవిభాగముచే వీనిలో సాదేశమగునని కాశికావృత్తిగ్రంథమున జెప్పబడెను. ఈప్రయోజనమపేక్షించియే ఛన్దోవిషయకమగునీసూత్రమిచట వ్యాఖ్యానముచేయబడినదని గ్రహించునది. భాష్యమున నీయోగవిభాగమునగపడనందున నీయుపాయము ప్రామాణికముగాదని తలచి "అథవేత్యా" దిగ్రన్థముచేనుపాయాన్తరము చెప్పబడుచున్నది. సదృశార్థకమగు సహాశబ్దము సనఖి (సదృశః సఖ్యా) మొదలగు నవ్యయీభావములందు ప్రసిద్ధమైయున్నది. సపక్షః ఇత్యాదివృత్తులందు సదృశార్థక సహాశబ్దముకలదని యఙ్గీకరించవలెను. అందుచేనివి "సమానః పక్షోఽస్య" అను రీతిని యస్వపదవిగ్రహముగల బహువ్రీహులగును. కావున వీనిలో సహాశబ్దమునకు "వోపసర్జనస్య" (854) సూ. చే సాదేశము సిద్ధమగునని అథవేత్యాదిసమాధానమునకాశయము.

1018 జ్యోతిర్జనపదరాత్రినాభినామగోత్రరూపస్థానవర్ణ
వయోవచనబన్ధుషు. 6-3-85. (సమానస్య, సః)

ఏషు ద్వాదశసూత్తరపదేషు సమానస్య సః స్యాత్।
సజ్యోతిః। సజనపద ఇత్యాది॥

1018 జ్యోతిః జనపద రాత్రి నాభి నామ గోత్ర రూప స్థాన వర్ణ వయః వచన బన్ధు యీ పదిరెండుశబ్దములకు ద్వంద్వము. ఇవి యుత్తరపదములగు నపుడు సమానశబ్దమునకు సాదేశమగును. సజ్యోతిః (సమానం జ్యోతిర్యస్య) మొదలగులక్ష్యములనూహించునది. లౌకికభాషయందు సాదేశముకొఱకీసూత్రమారంభింపబడెనని తెలియునది.

1019. చరణే బ్రహ్మచారిణి. 6-3-86. చరణే, బ్రహ్మచారిణి (సమానస్య సః)

బ్రహ్మచారిణ్యుత్తరపదే సమానస్య సః స్యాచ్చరణే సమానత్వేన గమ్యమానే। చరణశ్శాఖా। బ్రహ్మ వేదః। తదధ్యయనార్థం వ్రతమపి బ్రహ్మ। తచ్చరతీతి బ్రహ్మచారీ। సమానః సః సబ్రహ్మచారీ॥

1019. బ్రహ్మచారిన్‌శబ్దము త్తరపదమగునపుడు సమానశబ్దమునకు చరణము (వేదశాఖ) సమానమైనదిగ ప్రతీయమానమగునపుడు సాదేశమగును. చరణశబ్దమునకు వేదప్రసిద్ధమగు ఋగాదిశాఖార్థము. బ్రహ్మచారిన్‌శబ్దములోని బ్రహ్మశబ్దమునకు వేదమర్థము. వేదాధ్యయనమునకొఱకగు వ్రతముగూడ లక్షణచే బ్రహ్మశబ్దార్థమగును. ఆవ్రతమునాచరించువాడు బ్రహ్మచారినాబడును. సబ్రహ్మచారి (సమానః బ్రహ్మచారీ) వ్రతము సమానమగుటచే బ్రహ్మచారికి సమానత్వము ఫలితమగునని గ్రహింపదగును. సమానమగు వేదాధ్యయనవ్రతమునాచరించువాడని యర్థము.

1020. తీర్థే యే. 6-3-87. తీర్థే, యే (సమానస్య, సః)

తీర్థే ఉత్తరపదే యాదౌ ప్రత్యయే వివక్షితే సమానస్య సః స్యాత్. సతీర్థ్యః, ఏకగురుకః। సమానతీర్థేవాసీతి యత్ ప్రత్యయః॥

1020. ప్రత్యయే అనుసప్తమ్యన్తమధ్యాహారలబ్ధము. దీనికి "యే" అనునది విశేషణము. యకారాదిప్రత్యయమని యర్థములభించును. సమానశబ్దమునకు తీర్థశబ్దము త్తరపదమగునపుడు యకారాదిప్రత్యయము వివక్షితమగుచుండ సాదేశమగును. ఉదా:—సతీర్థ్యః (సమానే తీర్థే వాసీ) సమానశబ్దమేకపర్యాయము, తీర్థశబ్దమునకు గురువనియర్థము, ఒకేగురువువలన భిన్నకాలములందధ్యయనము చేయువారుపరస్పరము సతీర్థులనబడుదురు. "సమానతీర్థే వాసీ" (4-4-107) అను సూ. చే నిచట యత్ప్రత్యయము.

వివ:—సమానతీర్థశబ్దమునకు సమాసము (తద్ధితార్థోత్తరపద సమాహారే చ) ఉత్తరపదమాత్రవిమిత్తకమగుటచేన న్తరఙ్గము. సమాసముకంటె (సమానతీర్థ) విధింపబడు యత్ప్రత్యయము బహిరఙ్గము. కావున యత్ప్రత్యయాన్తమగు తీర్థశబ్దముపరమగునపుడు సాదేశమగునని యర్థముచేయవీలుగాదు. ఈకారణము చేతనే యాదిప్రత్యయము వివక్షితమగునపుడని యర్థము జెప్పబడెను.

1021. విభాషోదరే. 6-3-88. విభాషా, ఉదరే (సమానస్య, సః, యే)

యాదౌ ప్రత్యయే వివక్షితే ఇత్యేవ। సోదర్యః। సమానోదర్యః॥

1021. సమానశబ్దమునకు ఉదరశబ్దము త్తరపదమగునపుడు యాదిప్రత్యయమువివక్షితమగుచుండ సాదేశము వికల్పముగనగును. సోదర్యః (సమానే ఉదరే శయితః) యప్రత్యయము వివక్షితమగుచుండ (రాక పూర్వమే) సమానోదరశబ్దములకుసమాసము. సమానశబ్దమునకుసాదేశము. సోదరశబ్దముకంటె "సోదరాద్యః" (4-4-109) అను సూ. చే యప్రత్యయము. సాదేశముకానిపక్షమందు "సమానోదరే శయిత ఓ చోదాత్తః" (4-4-108) అను సూ. చే యత్ ప్రత్యయముచే సమానోదర్యః అనియగును.

వివ :— "సమానముదరం యస్య" అనునర్థమున "సమానస్యఛన్దసి" అనుసూత్రమందు అథవేత్యాదిగ్రంథముచే జెప్పబడినరీతిని సాదేశము సిద్ధమగును గానసోదరశబ్దము "వోపసర్జనస్య" అను సూ. చే విహితమగు సాదేశము వికల్పి మగుటవలన సహోదరశబ్దముగూడ సాధువులగునని గ్రహించునది.

1022. దృగ్దృశవతుషు. 6-3-89. (సమానస్య, సః)

సదృక్। సదృశః। వా॥ దృక్షేచేతివక్తవ్యమ్। సదృక్షః। వతురుత్తరార్థః॥

1022. వతుప్రత్యయము యచ్ఛబ్దాదులకంటె విధింపబడుటచే సమానశబ్దమునకు వతుప్రత్యయముపరమగుట సంభవింపదు. కావున సూత్రములోని వతుగ్రహణము త్తరసూత్రములోని కనువృత్త్యర్థమగును. సమానశబ్దమునకు దృక్ దృశశబ్దములు త్తరపదములగునపుడు సాదేశమగును. ఉదా :— సదృక్ సదృశః। వా॥ దృక్షశబ్దముపరమగునపుడును సమానశబ్దమునకు సాదేశమగునని జెప్పవలయును. సదృక్షః॥

వివ :— దృక్షేచ అనువార్తికమునకు "సదృక్షాసః" అనునుదాహరణము భాష్యమున చూపబడెను. వేదములోనిప్రయోగమునుదాహరించుటచేనీవార్తికము వేదవిషయకమనియు, వేదవిషయకమయిననుప్రకరణశుద్ధికొఱకిచట వ్యాఖ్యానము చేయబడినదనియును గ్రహించునది.

1023. ఇదంకిమోరీశ్కీ. 6-3-90. ఇదంకిమోః, ఈశ్కీ (దగ్దృశవతుషు)

దృగ్దృశవతుషు ఇదమః ఈశ్ కిమః కీ స్యాత్। ఈదృక్। ఈదృశః కీదృక్। కీదృశః। వతూదాహరణం వక్ష్యతే। వా॥ దృక్షేచేతి వక్తవ్యమ్। ఈదృక్షః। కీదృక్షః। ఆ

సర్వనామ్నః। వా॥ దృక్షే చ। తాదృక్। తాదృశః। తావాన్। తాదృక్షః। దీర్ఘః। మతోర్వత్వే। అమూదృక్। అమూదృశః। అమూదృక్షః॥

1023. దృక్ దృశ వతు ప్రత్యయము యివి పరమయినపుడిదమ్ శబ్దమునకు ఈశ్ అనునది, కిమ్ శబ్దమునకు కీ అనునదియు నాదేశములగును. ఈశాదేశము శిత్తగుటచే సర్వాదేశమగును. ఈదృక్. ఈదృశః. (ఇదమివదృశ్యతే) వతుప్ ప్రత్యయము పరమగునపుడుదాహరణమగు, ఇయాన్ అనునది తద్ధితప్రకరణమున చెప్పబడును. (వా) దృక్షశబ్దము పరమగునపుడును ఇదమ్ కిమ్ శబ్దములకు క్రమముగ ఈశ్ కీ అను నాదేశములగునని చెప్పవలయును. ఈదృక్షః, కీదృక్షః. "ఆ సర్వనామ్నః" (433) అను సూ. చే దృగాదులు పరమైనపుడు సర్వనామమునకాత్వము విధింపబడెను. వా॥ దృక్షశబ్దము పరమైనపుడును సర్వనామమునకాత్వము ప్రవర్తించునని వార్తికార్థము. ఉదా:— తాదృక్. తాదృశః. తావాన్. తాదృక్షః। మూలమున నీయుదాహరణముతరువాతనున్న "దీర్ఘః" అనునది పూర్వపరోదాహరణములతో నన్వయించును. తాదృక్షః అనుచోట తచ్ఛబ్దము యొక్క దకారమున కాత్వముచేసిన పిమ్మట సవర్ణదీర్ఘమగునని యర్థము. పరములగు నమూదృగాదు లందదశ్శబ్దమునకాత్వము ప్రవర్తించిన పిదప సవర్ణదీర్ఘమగునని యర్థము. తరువాత మతోర్వత్వములు ప్రవర్తించుటచే అమూదృక్ ఇత్యాదులు సిద్ధములగును.

1024. సమాసేఽఙ్గులేః సఙ్గః. 8-3-80. సమాసే। అఙ్గులేః। సఙ్గః। (సః, మూర్ధన్యః)

అఙ్గులిశబ్దాత్సఙ్గస్య సస్య మూర్ధన్యస్స్యాత్సమాసే। అఙ్గులిషఙ్గః। సమాసే కిమ్। అఙ్గులేః సఙ్గః॥

1024. సః మూర్ధన్యః అనుపదములు "నక్షత్రాద్వా" అనుసూత్రము వలనకధికృతములగును. సః అనునది షష్ఠ్యర్థము. సకారమునకు మూర్ధన్యాదేశమగుననిన ఆన్తరతమ్యమువలన షకారాదేశమగునని ఫలితమగును. అఙ్గులిశబ్దముకంటెపరమగు సఙ్గశబ్దముయొక్క సకారమునకు సమాసమందు షకారాదేశమగునని సూత్రార్థము. ఉదా:—అఙ్గులిషఙ్గః (అఙ్గులేః సఙ్గః) అఙ్గులేః సఙ్గః అనువాక్యమున షత్వమును వారించుటకు సమాసపదమావశ్యకము.

1025. భీరోః స్థానమ్. 8-3-8. భీరోః। స్థానమ్॥

భీరుశబ్దాత్ స్థానస్య సస్య మూర్ధన్యః స్యాత్సమాసే। భీరుష్ఠానమ్। అసమాసే తు భీరోఃస్థానమ్॥

1025. సమాసమందు భీరుశబ్దముకంటె పరమగు స్థానశబ్దముయొక్క సకారమునకు షకారాదేశమగును. ఉదా:— భీరుష్ఠానమ్ (భీరోః స్థానమ్) సమాసమందనుటవలన భీరోః స్థానమనువాక్యమందు షత్వము వారితమగును.

1026. జ్యోతిరాయుషః స్తోమః 8-3-83. జ్యోతిరాయుషః, స్తోమః॥

ఆభ్యాం స్తోమస్య సస్య మూర్ధన్యః స్యాత్సమాసే। జ్యోతిష్టోమః। ఆయుష్టోమః। సమాసే కిమ్। జ్యోతిషః స్తోమః॥

1026. జ్యోతిరాయుశ్శబ్దములకు సమాహారద్వన్ద్వము. జ్యోతిరాయుషః అనునది పంచమ్యన్తము. ఈరెండుశబ్దములకంటెపరమగు స్తోమశబ్దముయొక్క సకారమునకుసమాసమున షకారాదేశమగును. ఉదా:— జ్యోతిష్టోమః। ఆయుష్టోమః। "జ్యోతిషః స్తోమః" అనువాక్యమందు షత్వవారణమునకై సమాస గ్రహణమావశ్యకము.

వివ:— అఙ్గులేఃసఙ్గః, భీరోఃస్థానమ్ జ్యోతిషఃస్తోమః ఆయుషః స్తోమః అనునర్థములందు ప్రత్యాసత్తిచేనాయాపదములకు సమాసమగునపుడు సకారమునకు షకారమగునని "సమాసేఽఙ్గులేఃసఙ్గః" మొదలగు మూడుసూత్రములకు గ్రమముగనర్థమును చెప్పవలయును. మూలము ఫలితార్థప్రదర్శకమగును. ఇట్లు చెప్పుటచేనాయాసూత్రములందు ప్రథమానిర్దేశములకౌచితి సంభవించును.

1027. * సుషామాదిషు చ. 8-3-98. (ఇణ్కోః)

సస్య మూర్ధన్యః। శోభనం సామ యస్య సుషామా। సుషన్ధిః॥

1027. సుషామాఅనుశబ్దమాదియందుగల గణములోనిశబ్దములయొక్క ఇణ్కవర్గములకంటెపరమగు సకారమునకు షకారమాదేశమగును. ఉదా:— సుషామా (శోభనం సామ యస్య బ్రాహ్మణస్య)

1028. ఏతి సంజ్ఞాయామగాత్. 8-3-99. ఏతి। సంజ్ఞాయామ్। అగాత్। (ఇణ్కోః)

సస్య మూర్ధన్యః। హరిషేణః ఏతి కిమ్। హరిసక్థమ్। సంజ్ఞాయాం కిమ్। పృథుసేనః। అగకారాత్కిమ్। విష్వక్సేనః। ఇణ్కోరిత్యేవ। సర్వసేనః॥

1028. గకారముకంటెభిన్నమగు ఇణ్కవర్గములకంటెపరమగునట్టియు ఏకారముపరమందుగల్గినట్టియునగు సకారమునకు సంజ్ఞయందు షకారమాదేశ

---

* సుషామా విష్షామా దుఃషామా సుషేధః నిఃషేధః దుఃషేధః సుషన్ధిః నిషన్ధిః దుఃషన్ధిః సుష్ఠు దుష్ఠు గౌరిషక్థః సంజ్ఞాయామ్ ప్రతిష్ణికా జలాషాహమ్ నౌషేచనమ్ దున్దుభిషేవణమ్ ఏతిసంజ్ఞాయామగాత్ హరిషేణః నక్షత్రాద్వా రోహిణీషేణః అకృతిగణోఽయంసుషామాదిః॥

మగును. హరిషేణః. ఈపేరుగలరాజు. హరిసక్థమ్. ఇచట షత్వవారణమునకై ఏకారపరకమగుసకారమునకు షత్వమనవలయును. పృథుసేనః (పృథ్వీ సేనా యస్య) విస్తారమగుసేనగలవాడని యర్థము. ఇది సంజ్ఞగాదు. ఇచట షత్వమును వారించుటకు సంజ్ఞాయామనునది యావశ్యకము. విష్వక్సేనః। ఇచట సకారము గకారముకంటెపరమయినదగుటచే షత్వము వారితమగును. ఇందుకై అగః అనునది యావశ్యకము. షత్వమునుగురించి చ ర్త్వమసిద్ధమగుటవలన గకారముండునని గ్రహింపదగును. "ఇణ్కోః" అనునధికారసూత్రమిచటగూడనధికృతమగును. కావుననే సర్వసేనః అనుచోట షత్వము వారితమగును. ఇచట సకారమిణ్కవర్గములకంటెపరముగాదు.

1029. నక్షత్రాద్వా. 8-3-100. (పూర్వసూత్రము)

ఏతి సస్య సంజ్ఞాయామగకారాన్మూర్ధన్యో వా। రోహిణీషేణః। రోహిణీసేనః। అగకారాత్కిమ్। శతభిషక్సేనః। ఆకృతిగణోఽయమ్॥

1029. గకారముకంటె నితరములగు ఇణ్వర్గములకంటెపరమగునట్టియు నక్షత్రవాచకముకంటెపరమందున్నట్టియు సకారమునకుఏకారము పరమగునపుడు సంజ్ఞయందు షకారాదేశము వికల్పముగనగును. ఉదా:— రోహిణీషేణః, రోహిణీసేనః। ఇది సంజ్ఞావిశేషము. శతభిషక్సేనః। ఇచట సకారము గకారము కంటెపరమైనదగుటవలన షత్వము వారింపబడును. సుషామాదిగణమాకృతిగణము. అనగా వీనితోసదృశములగు శబ్దములనిందు జేర్పవచ్చునని యర్థము.

వివ:— సుషామాదిగణమాకృతిగణమనుటచే "ఏతిసంజ్ఞాయామగాత్" "నక్షత్రాద్వా" అనునవి గణసూత్రములనియు నష్టాధ్యాయీసూత్రములమధ్యను ప్రక్షిప్తములైనవనియును సూచింపబడెనని గ్రహింపునది.

1030. అషష్ఠ్యతృతీయాస్థస్యాఽన్యస్య దుగాశీరాశాస్థాస్థితోత్సుకోతికారకరాగచ్ఛేషు. 6-3-99. అషష్ఠ్యతృతీయాస్థస్య, అన్యస్య, దుక్, ఆశీరాశాస్థాస్థితోత్సుకోతికారకరాగచ్ఛేషు॥

అన్యస్య దుగాగమః స్యాదాశీరాదిషు పరేషు। అన్యదాశీః। అన్యదాశా। అన్యదాస్థా। అన్యదాస్థితః। అన్యదుత్సుకః। అన్యదూతిః। అన్యద్రాగః। అన్యదీయః। అషష్ఠ్యాదికిమ్। అన్యస్యాఽన్యేనవాశీః అన్యాశీః। వా॥ కారకే ఛే చ నాయం నిషేధః। అన్యస్య కారకః, అన్యత్కారకః। అన్యస్యాఽయమన్యదీయః। గహాదేరాకృతిగణత్వాచ్ఛః॥

1030. షష్ఠీతృతీయావిభక్తులకంటెనితరమగు విభక్తికి ప్రకృతియగు అన్య శబ్దమునకు ఆశిస్ ఆశా అస్థా ఆస్థిత ఉత్సుక ఊతి కారక రాగ, ఛ ప్రత్యయము ఇవి పరముగనున్నపుడు దుగాగమము (ద్) అగును. అన్యదాశీః (అన్యా ఆశీః) ఇట్లే అన్యదాశా మొదలగునుదాహరణములనూహించునది. ఇవి కర్మధారయములు. అన్యదీయః అన్యస్యాయమనునర్థమున "గహాదిభ్యశ్ఛః" (4-2-138) అను సూ. చే నన్యశబ్దముకంటె ఛప్రత్యయము. దీనికి ఈయాదేశము. గహాదిగణమా కృతిగణమగుటచే నన్యశబ్దమాగణమున జేర్పదగును. అన్యస్య ఆశీః। అన్యేన ఆశీః। ఇత్యాదులందు దుగాగమవారవారణమునకై "అషష్ఠ్యతృతీయాస్థస్య" అనువిశేషణమావశ్యకము. వా॥ ఈనిషేధము కారకశబ్దఛప్రత్యయములు పరమైనపుడు ప్రవర్తించదు. అత్యత్కారకః (అన్యస్య కారకః) అన్యదీయః (అన్యస్యాఽయమ్) ఇచట షష్ఠ్యన్తమునకును దుగాగమమయ్యెను. ఈవిషయమున మహాభాష్యము ప్రమాణము. సూత్రమందలి నఞ్ద్వయోపాదానము స్పష్టార్థము.

వివ :— కారకశబ్దఛప్రత్యయములు పరమైనపుడు అషష్ఠ్యాది నిషేధము ప్రవర్తించదనుటలో "అషష్ఠ్యతృతీయాస్థస్య" అనుచోట నఞ్ద్వయోపాదానము మానము. "అషష్ఠీతృతీయాస్థస్య" అవిననిష్టార్థసిద్ధియగుచుండ నఞ్ద్వయము నిషేధానిత్యత్వమున జ్ఞాపకమగును. ఇట్టి యనిత్యత్వమూలకమే "కారకే ఛే చ నాయం నిషేధః" అనువచనమని, తత్త్వబోధినీకారునియాశయము.

1031. అర్థే విభాషా. 6-3-100. అర్థే, విభాషా, (అన్యస్య, దుక్)

అన్యదర్థః। అన్యార్థః॥

1031. అర్థశబ్దముపరమైనపుడు, పూర్వసూత్రమునకు విషయమగునట్టి యన్యశబ్దమునకు దుగాగమము వికల్పముగనగును. అన్యదర్థః. అన్యార్థః॥

1032. కోః కత్తత్పురుషేఽచి. 6-3-101. కోః, కద్, తత్పురుషే, అచి (ఉత్తరపదే)

అజాదావుత్తరపదే। కుత్సితోఽశ్వః, కదశ్వః। కదన్నమ్। తత్పురుషే కిమ్। కూష్ట్రో, రాజా॥ వా॥ త్రౌ చ। కుత్సితాస్త్రయః, కత్త్రయః॥

1032. కుత్సితార్థకమగు కుశబ్దమునకజాదియగునుత్తరపదముపరమగునపుడు తత్పురుషమందు కద్ అమనాదేశమగును. కదశ్వః (కుత్సితోఽశ్వః) కదన్నమ్ (కుత్సితమన్నమ్) ఇచట "కుగతిప్రాదయః" (765) అను సూ.చే తత్పురుషము. కూష్ట్రోరాజా (కుత్సితః ఉష్ట్రో యస్య) ఇట్టిబహువ్రీహియందు కదాదేశమును వారించుటకై తత్పురుషే అనువది యావశ్యకము. వా॥ త్రిశబ్దముత్తరపదమైనపు

డును కుశబ్దమునకు కదాదేశమును చెప్పవలయును. కత్త్రయః (కుత్సితాస్త్రయః) త్రిశబ్దము జాదిగానందున నీవచనమారంభింపబడెను.

1033. రథవదయోశ్చ. 6-3-102. (కోః, కద్, తత్పురుషే)
కద్రథః। కద్వదః

1033. రథవదశబ్దములు పరమగునపుడు తత్పురుషమున కుత్సితార్థక కుశబ్దమునకు కదాదేశమగును. కద్రథః (కుత్సితో రథః) కద్వదః (కుత్సితో వదః)

1034. తృణే చ జాతౌ. 6-3-103. తృణే, చ। జాతౌ (కోః కద్)

కత్తృణమ్॥

1034. కుశబ్దమునకు తృణశబ్దము పరమైనపుడు సముదాయముచే జాతి బోధ్యమగుచుండ కదాదేశమగును. కత్తృణమ్. తృణజాతివిశేషమునీశబ్దము బోధించును.

1035. కా పథ్యక్షయోః. 6-3-104. కా, పథ్యక్షయోః (కోః)

కాపథమ్। కాక్షః। అక్షశబ్దేన తత్పురుషః, అక్షిశబ్దేన బహువ్రీహిర్వా॥

1035. పథిన్‌శబ్దము అక్షశబ్దము పరమైనపుడు కుశబ్దమునకు కా అనునాదేశమగును. కాపథః (కుత్సితః పన్థాః) కుశబ్దమునకు పథిన్‌శబ్దముతో "కుగతిప్రాదయః" అను సూ. చే సమాసము "ఋక్పూరబ్ధూః" (945) అను సూ. చే సమాసాన్తప్రత్యయము వచ్చును. కాక్షః (కుత్సితమక్షమ్) నిన్దితమగునిన్ద్రియమని యర్థము. ఇచట "కుగతి" సూ. చే సమాసము. కుత్సితమక్షి యస్య అనువిగ్రహముగల బహువ్రీహియందు "బహువ్రీహౌ సక్థ్యక్ష్ణోః" (857) అను సూ. చే షచ్‌ప్రత్యయమువలన సిద్ధమగునక్షశబ్దము పరమగునపుడునీయాదేశమగును.

1036. ఈషదర్థే. 6-3-105. (కోః, కా)

ఈషజ్జలం, కాజలమ్। అజాదావపి పరత్వాత్కాదేశః। కామ్లః॥

1036. అల్పార్థబోధకమగు కుశబ్దమునకు కాదేశమగును. కాజలమ్ (ఈషజ్జలమ్) "కుగతి" సూ. చే గతిసమాసము. ఇది నిత్యమగుటచే నస్వపద విగ్రహము చూపబడెను. కామ్లః (కుత్సితః అమ్లః) ఇచట "కోఃకత్తత్పురుషేఽచి" అను సూ. చే ప్రాప్తమగు కదాదేశమును, పరమగు నీసూత్రముచే విధింపబడిన కాదేశము బాధించును. అల్పార్థకమగు కుశబ్దమునకు హలాద్యుత్తరపదముగాని యజాద్యుత్తరపదముగాని పరమైనపుడు కాదేశమే వచ్చునని ఫలితమగును.

1037. విభాషా పురుషే. 6-3-106. విభాషా, పురుషే (కోః, కా)

కాపురుషః। కుపురుషః। అప్రాప్తవిభాషేయమ్, ఈష దర్థే హి పూర్వవిప్రతిషేధాన్నిత్యమేవ। ఈషత్పురుషః. కాపురుషః॥

1037. కుశబ్దమునకు పురుషశబ్దముత్తరపదమైనపుడు కాదేశము వికల్పముగనగును. కాపురుషః. కుపురుషః (కుత్సితః పురుషః) ఈసూత్రమప్రాప్తవిభాష. ఈషదర్థక కుశబ్దమునకు పురుషశబ్దముపరమైనపుడు పూర్వవిప్రతిషేధాశ్రయణము వలన "ఈషదర్థే" అను సూ. చే కాదేశము నిత్యముగనే వచ్చును. కాపురుషః (ఈషత్పురుషః) అల్పుడగు పురుషుడని యర్థము.

1038. కవం చోష్ణే. 6-3-107. కవమ్, చ, ఉష్ణే (కా, విభాషా)

ఉష్ణశబ్దే ఉత్తరపదే కోః కవం, కా చ, వా స్యాత్। కవోష్ణమ్, కోష్ణమ్ కదుష్ణమ్॥

1038. కుశబ్దమునకుష్ణశబ్దముత్తరపదమయినపుడు కవాదేశకాదేశములు వికల్పముగనగును. ఈయాదేశద్వయముకానిపక్షమందు "కోః కత్తత్పురుషేఽచి" అను సూ. చే కదాదేశమగును. కవోష్ణమ్. కోష్ణమ్. కదుష్ణమ్॥

1039. * పృషోదరాదీని యథోపదిష్టమ్. 6-3-109. పృషోదరాదీని, యథోపదిష్టమ్॥

పృషోదరప్రకారాణి శిష్టైర్యథోచ్చారితాని తథైవ సాధూని స్యుః। పృషతః ఉదరం, పృషోదరమ్। తలోపః వారివాహకో, బలాహకః। పూర్వపదస్య బః। ఉత్తరపదాదేశ్చ లత్వమ్॥

శ్లో॥ భవేద్వర్ణాగమాద్ధంసః, సింహో వర్ణవిపర్యయాత్।
గూఢోత్మా వర్ణవికృతేః వర్ణనాశాత్పృషోదరమ్॥

1 వా॥ దిక్శబ్దేభ్యస్తీరస్య తారభావో వా॥ దక్షిణతారమ్। దక్షిణతీరమ్। ఉత్తరతారమ్। ఉత్తరతీరమ్। 2 వా॥ దురో దాశనాశదభధ్యేషూత్వముత్తరపదాదేః ష్టుత్వంచ। దుఃఖేన దాశ్యతే దూడాశః। దుఃఖేన నాశ్యతే, దూణాశః। దుఃఖేన దభ్యతే, దూడభః। ఖల్ త్రిభ్యః। దంభేర్హల్లోపో నిపా

* పృషోదర పృషోత్థాన బలాహక జీమూత శ్మశాన ఉలూఖల పిశాచ బృసీ మయూర ఇతి పృషోదరాదిరాకృతిగణః॥

త్యతే। దుఃఖేన ధ్యాయతీతి దూధ్యః। అతశ్చేతి కః। బ్రువ
న్తో౽స్యాం సీదన్తీతి, బృసీ। బ్రువచ్ఛబ్దస్య బృ ఆదేశః।
సదేరధికరణే డట్. ఆకృతిగణో౽యమ్॥

1039. పృషోదరాదీని అనునది (పృషోదరమాదిర్యేషాం తాని) బహు వ్రీహి। శబ్దస్వరూపటి అనునది యధ్యాహారలభ్యము. యథోపదిష్టమనుపదస్యార్థస్య మువలననాగిశబ్దము సాదృశ్యార్థకమని చెప్పవలయును. యథోపదిష్టమనునది యథార్థే అవ్యయీభావము. ఉపదిష్టపదమునకుచ్చరించబడినదని యర్థము. ఉచ్చారణకర్తలెవరనునాకాంక్షవలన శిష్టైః అనునది లభ్యమగును. శిష్టులనశబ్దతత్త్వ సాక్షాత్కారముగలయోగులని (వైయాకరణులు) మహాభాష్యమునజెప్పబడెను. పృషోదరశబ్దముతోసదృశములగు శబ్దములు శిష్టులచేనేరీతిగనుచ్చరింపబడునో యవి యట్లే సాధువులగునని సూత్రార్థము. ఉదా :— పృషోదరమ్ (పృషతః ఉదరమ్) తకారలోపము. గుణము. బలాహకః (వారివాహకః) పూర్వపదమగు వారిశబ్దమునకు బాదేశము. వాశబ్దములోని వకారమునకు లకారమునగును.

శ్లో॥ "భవేద్వర్ణాగమాద్ధంసః.... పృషోదరమ్" 1 భవేద్వర్ణాగమాద్ధంసః = హనధాతువునకచ్ప్రత్యయముపరమైనపుడుదీనిచేసగాగమమగుటవలన హంసః అనురూపము సిద్ధమగును. 2 సింహో వర్ణవిపర్యయాత్ = హింస్ధాతువునకచ్ ప్రత్యయముపరమగునపుడు హకారసకారములకు స్థానవ్యత్యయముగలుటచే సింహః అనురూపము సిద్ధమగును. 3 గూఢోత్మావర్ణవికృతేః = ఆత్మన్శబ్దము యొక్క యకారమునకు ఊకారాదేశమువలన గూఢోత్మా (గూఢః ఆత్మా యస్య) అనునది సిద్ధమగును. 4 పృషచ్ఛబ్దము యొక్కతకారమునకు లోపముచవలనపృషోరదమ్ అనునది సిద్ధమగుననని శ్లోకార్థము.

1 వా॥ దిగ్వాచములకంటెపరమగు తీరశబ్దమునకు తారశబ్దాదేశము వికల్పముగనగును. ఉదా :— దాక్షిణతారమ్. దక్షిణతీరమ్. ఉత్తరతారమ్. ఉత్తర తీరమ్॥ 2. వా॥ దుర్ అనుదానికి దాశ నాశ దభ ధ్య ఇవి పరమగునపుడు దుర్ అనుదానియొక్క రేఫమునకుకారాదేశము దాశాదులయాది వర్ణములకు ష్టుత్వము నగును. ఉదా :— దూడాశః (దుర్+దాశః) రేఫమునకుత్వము. సవర్ణదీర్ఘము. ష్టుత్వముచే దకారమునకు డకారము. దూణాశః (దుర్+నాశః) దూడభః (దుర్ +దభః) అనునవియునిట్లేయగును. కృచ్ఛ్రేణ దాశ్యతే ఇత్యాద్యర్థములందు దుర్ పూర్వకములగు దాశృ (దానే) ణశ (అదర్శనే ణిజన్తమ్) దమ్భు (హింసాయామ్) ధాతువులకంటె "ఈషద్దుఃసుషు కృచ్ఛ్రాకృచ్ఛ్రార్థేషు ఖల్" (3-3-126) అను సూ. చే ఖల్ (అ) ప్రత్యయము వచ్చుటవలన దూడాశః మొదలగునని సిద్ధము లగును. దమ్భుధాతువులోని నకారమునకు లోపము, నలోపవిధాయకశాస్త్రముచే సిద్ధముగానందునవిచట దభఅనునిపాతనమువలననే ప్రవర్తించిసదని గ్రహించు నది. దూధ్యః (దుఃఖేన ధ్యాయతి) దుర్పూర్వకధ్యై (చిన్తాయామ్) ధాతువు

కంటె "ఆతశ్చోపసర్గే" (3-1-136) అను సూ. చే కప్రత్యయము ప్రవర్తించి నచో ధ్య అనురూపమేర్పడును. ప్రకృతవార్తికముచేనుత్వషుత్వములగును. బృసీ (బ్రువన్తోఽస్యాం సీదన్తి) బ్రువత్శబ్దమునకు బృఅనెడియాదేశము సదధాతువున కధికరణరూపార్థమందు డట్ప్రత్యయము ప్రవర్తించును. డట్ప్రత్యయము పర మగునపుడు సద్ధాతువుయొక్క టిసంజ్ఞకమునకు లోపమువలన స అనునది సిద్ధ మగును. పిదప ప్రత్యయమందలి టిత్త్వమువలన "టిడ్ఢాణఞ్" సూ. చే జీపు వచ్చును. పృషోదరాదిగణమాకృతిగణము. కావున పైనిచూపబడిన రూపములును వార్తికములును గణములోనివని యూహింపదగును.

వివ :— నిరుక్తాదిశాస్త్రసిద్ధములగునసమస్తపదములు "ఉణాదయో బహు లమ్" ను సూత్రముచేనీశాస్త్రమున సాధుత్వముగలవగును. కావున సమాసములకు మాత్రమే యీసూత్రము సాధుత్వమును బ్రతిపాదించునని హరదత్తునియాశయము. ప్రాచీనులచే జెప్పబడిన "భవేద్వర్ణాగమాత్" అనుకారికయందు హంసః హింసః మొదలగు నసమస్తపదములుదాహరింపబడుటచేనీసూత్రము సమాసవిషయకమే యగుననుహరదత్తుని యాశయము గ్రాహ్యముగాదని దీక్షితాశయము.

2 పృషోదరాదిగణమాకృతిగణమనిచెప్పబడుటచే గణపఠితములకేగాక తది తరములకును దీనిచేసాధుత్వము సిద్ధమగును. ఎట్లన :—

శ్లో॥ లుమ్పేదవశ్యమః కృత్యే తుంకామమనసోరపి।
సమో వా హితతతయో ర్మాంసస్య పచియుడ్ఘఞోః॥

అర్థము :— అన్త్యమనుపదమునకధ్యాహారము. కృత్యప్రత్యయాన్తముత్తర పదమగునపుడు అవశ్యమనుపూర్వపదముయొక్క అన్త్యమగు మకారము లోపిం చును. ఉదా :— అవశ్యసేవ్యః (అవశ్యమ్ సేవ్యః) కామశబ్దమనశ్శబ్దములుపర మగునపుడు తుమ్ప్రత్యయమున కన్త్యమగు మకారము లోపించును. ఉదా :— గన్తుకామః (గన్తుమ్ కామః) గన్తుమనాః (గన్తుమ్ మనో యస్య) హితతతశబ్ద ములుపరమగునపుడు సమ్మొయొక్క మకారము వికల్పమున లోపించును. ఉదా :- సహితః. సంహితః. సతతమ్. సన్తతమ్। యుట్ప్రత్యయము ఘఞ్ప్రత్యయము పరమందుగల పచధాతువుపరమగునపుడు మాంసశబ్దమునకన్త్యమగు నకారము లోపించును. ఉదా :— మాంస్పచనమ్ మాంస్పాకః॥

1040. సంహితాయామ్. 6-3-114.

అధికారోఽయమ్॥

1040. ఇది యధికారసూత్రము.

వివ :— సంహిత వివక్షితమైనపుడే వక్ష్యమాణసూత్రవిహితములగు కార్యములు ప్రవర్తించును. "ద్వ్యచోతస్తిఙః" (6-3-135) సూత్రము ద్వ్యచ్కమగు తిఙన్తముయొక్క అకారమునకు సంహితవిషయమైనపుడు దీర్ఘాదేశమును విధించును. ఉదా :— "విద్మాహిత్వాసత్పతింశూరగోనామ్" (ఋగ్వేదమన్త్రము) ఇచట విద్మశబ్దమునకు దీర్ఘము ప్రవర్తించెను. "విద్మహిత్వా" అనునవగ్రహసమయమున (వేష్టన) సంహితయుండదు గాన దీర్ఘము రాదు. అధికారమునకిది ఫలమగును. ఈయధికారములోని యితరసూత్రములుత్తరపదాధికారీయములగుట వలన సమాసవిషయకములే యగును. సమాసమందు సంహిత నిత్యమగుటచేనచట నీయధికారమునకు ఫలములేదని గ్రహించునది.

1041. కర్ణే లక్షణస్యావిష్టాష్టపఞ్చమణిభిన్నఛిన్నఛిద్రస్రువస్వస్తికస్య 6-3-115. (దీర్ఘః)

కర్ణశబ్దే పరే లక్షణవాచకస్య దీర్ఘః। ద్విగుణాకర్ణః। లక్షణస్య కిమ్। శోభనకర్ణః। అవిష్టాదీనాం కిమ్। విష్టకర్ణః। అష్టకర్ణః। పఞ్చకర్ణః। మణికర్ణః। భిన్నకర్ణః। ఛిన్నకర్ణః। ఛిద్రకర్ణః। స్రువకర్ణః। స్వస్తికకర్ణః॥

1041. కర్ణశబ్దముత్తరపదమైనపుడు చిహ్నవాచకమునకుదీర్ఘమగును, విష్ట అష్ట పంచ మణి భిన్న ఛిన్న ఛిద్ర స్రువ స్వస్తిక వీనికిమాత్రము దీర్ఘము రాదు. స్వామివిశేషసంబన్ధమును తెల్పుటకై పశువులశరీరమున వేయబడు కొడవలిమొదలగువానియొక్క యాకృతిగల గురుతు యిచట లక్షణశబ్దమునకర్థము. ద్విగుణాకర్ణః (ద్విగుణరేఖా కర్ణౌ యస్య) ద్విగుణశబ్దము చిహ్నవాచకము. శోభనకర్ణః. ఇచట దీర్ఘమును వారించుటకై చిహ్నవాచకమునకు దీర్ఘమనవలెను. విష్టకర్ణః అష్టకర్ణః ఇత్యాదులలో దీర్ఘమును వారించుటకై అవిష్టేత్యాదినిషేధమావశ్యకము. విష్టాదులు లక్షణవాచకములని తెలియునది.

1042. సహివృతివృషివ్యధిరుచిసహితనిషు క్వౌ. 6-3-116. (ఉత్తరపదే, దీర్ఘః)

క్విబన్తేషు ఏషు పరేషు పూర్వపదస్య దీర్ఘః। ఉపానత్। నీవృత్। ప్రావృట్। మర్మావిత్। నీరుక్। అభీరుక్। ఋతీషట్। పరీతత్। క్వావితి కిమ్। పరిణహనమ్। విభాషాపురుష ఇత్యతో మణ్డూకప్లుత్యా విభాషానువర్తతే, సా చ వ్యవస్థితా। తేన గతికారకయోరేవ। నేహ। పటురుక్। తిగ్మరుక్॥

1042. క్విప్ప్రత్యయాన్తములగు నహ (బన్ధనే) వృతు (వర్తనే) వృష (సేచనే) వ్యధ (తాడనే) రుచ (దీప్తౌ) సహ (మర్షణే) తను (విస్తారే) ఈధాతువులుత్తరపదములగునపుడు పూర్వపదమునకు దీర్ఘమగును. ఉదా:—ఉపానత్. ఉపనహ్యతే

అనెడియర్థమున నహధాతువునకు క్విప్ప్రత్యయము. నీవృత్ (నివర్తతే) ప్రావృట్ (ప్రవర్షతి) మర్మావిత్ (మర్మాణివిధ్యతి) నీరుక్ (నిరోచతే) ఋతీషట్ (ఋతిం సంహతే) పరీతత్ (పరితనోతి) పరిణహనమనుచోట నహనమనునది నహధాతువునకు ల్యుట్ప్రత్యయాన్తరూపము. ఇది పరముగనున్నపుడు దీర్ఘమునువారించుటకై క్వౌ అనునదావశ్యకము. "విభాషా పురుషే" అనుసూత్రమునుండి విభాషా పదమనిచటకనువృత్తిచేసి యీసూత్రము వ్యవస్థితవిభాషయని యఙ్గీకరించవలెను. కావున గతిసంజ్ఞకమునకు కారకమునకును మాత్రమీసూత్రముదీర్ఘమును విధించు ననునర్థము లభించును. ఉపానత్ ఇత్యాదులందుపాదులు గతులుగాని కారకములుగాని యగును. ఇట్టివ్యాఖ్యానమువలన పటురుక్ తిగ్మరుక్ మొదలగురూపము లందు దీర్ఘము వారింపబడును. పటుతిగ్మశబ్దములిచట గతులుగాని కారకములుగాని కావని గ్రహించునది.

1043. వనగిర్యోః సంజ్ఞాయాం * కోటర ** కింశులకాదీనామ్. 6-3-117. వనగిర్యోః, సంజ్ఞాయామ్, కోటరకింశులకాదీనామ్, (దీర్ఘః)

కోటరాదీనాం వనేపరే కింశులకాదీనాం గిరౌపరే దీర్ఘః స్యాత్సంజ్ఞాయామ్॥

1043. కోటరాదిగణపఠితములకు వనశబ్దముపరమగునపుడు, కింశులకాది గణపఠితములకు గిరిశబ్దముపరమగునపుడును, సంజ్ఞప్రతీయమానమగునపుడు దీర్ఘమగును. ఉదా:—కోటరావణమ్. కింశులకాగిరిః॥

1044. వనం పురగామిశ్రకాసిధ్రకాసారికాకోటరాగ్రేభ్యః. 8-4-4. వనమ్, పురగా........గ్రేభ్యః। (నః,ణః, పూర్వపదాత్, సంజ్ఞాయామ్)

వనశబ్దస్యోత్తరపదస్య ఏభ్యఏవ ణత్వం, నాన్యేభ్యః। ఇహ కోటరాన్తాః పఞ్చ దీర్ఘవిధౌ కోటరాదయో బోధ్యాః, తేషాం కృతదీర్ఘాణాం ణత్వవిధౌ నిర్దేశో నియమార్థః। అగ్రేశబ్దస్య తు విధ్యర్థః। పురగావణమ్। మిశ్రకావణమ్। సిధ్రకావణమ్। సారికావణమ్। కోటరావణమ్। ఏభ్యఏవేతి కిమ్। అసిపత్రవనమ్। వనస్యాగ్రే అగ్రేవణమ్, రాజదన్తా

* కోటర మిశ్రక సిధ్రక పురగ శారిక ఇతికోటరాదిః॥

** కింశులక శావ నడ అంజన భజన భజన లోహిత కుక్కుట ఇతికింశులకాదిః॥

ధిషు నిపాతనాత్సప్తమ్యా అలుక్। ప్రాతిపదికార్థమాత్రే ప్రథమా। కింశులకాగిరిః॥

1044. వనమ్ అనుచోట ప్రథమ సంబన్ధార్థకము. ఉత్తరపదమగువనశబ్దముయొక్క నకారమునకు, పురగా మిశ్రకా సిధ్రకా సారికా కోటరా అగ్రే వీనికంటె పరమైనపుడే సంజ్ఞప్రతీయమానమగునపుడు ణకారాదేశమగును, పురగాదులకంటెవితరములగువానికంటెపరమగునపుడు ణత్వము రాదని సూత్రార్థము. ఈ సూత్రమున పురగాశబ్దముమొదలుకోటరాన్తములయిదును దీర్ఘవిధాయకమగు "వనగిర్యోః" అనుసూత్రమునకోటరాదులని గ్రహించునది. కృతదీర్ఘములగు పురగాదులకీసూత్రమునగహణము నియమార్థము. అనగా పురగాదిశబ్దములకు సంజ్ఞయందే దీర్ఘమునువిధించుటచేతను యీసూత్రములోనికి "సంజ్ఞాయామ్" అనునదనువృత్తమగుటచేతను సంజ్ఞయందు "పూర్వపదాత్సంజ్ఞాయామగః" (8–4–3) సూ. చే ణత్వము సిద్ధమగుచుండ నీపురగాదిగ్రహణము నియమార్థమగునని యాశయము. అగ్రేవణమ్ అనునది సంజ్ఞగానందున "పూర్వపదాత్" (8–4–3) సూ. చే ణత్వమిచట సిద్ధముగాకుండుటచే అగ్రేశబ్దగ్రహణము విధ్యర్థముగాని నియమార్థము గాదు. పురగావణమ్ ఇత్యాదులందు పూర్వసూత్రముచే దీర్ఘము నీసూత్రముచే ణత్వమునగును. పురగావణాదులయిదును నరకవిశేషమునకు సంజ్ఞలు. నరకవిశేషబోధకమగు అసిపత్రవనమ్ అనుచోట "పూర్వపదాత్" (8–4–3) అను సూ. చే ప్రాప్తమగుణత్వముయొక్క నివృత్తియీనియమమునకుఫలమని గ్రహించునది. రాజదన్తాదిగణమున అగ్రేవణమ్ అని నిపతించుటవలన అగ్రశబ్దముకంటెః పరమగు సప్తమికి లుగభావమగును. అగ్రేవణశబ్దమునకు వనాగ్రమందని యర్థము. అగ్రేవణమనుచోటనగ్రేశబ్దార్థము ప్రధానమగుటచే అగ్రేవణే అని ప్రాప్తమగుచుండ నగ్రేవణమను ప్రథమాన్తమెట్లుసాధువగుననుశఙ్కకు సమాధానమిది. పఞ్చకంప్రాతిపదికార్థః అనుపక్షమున సప్తమ్యర్థముగూడ ప్రాతిపదికార్థాన్తర్భూతమగుటచే "ప్రాతిపదికార్థ" సూ. చే ప్రథమ సాధువగునని. "వనగిర్యోః" అను సూత్రమునజెప్పబడిన కింశులకాదులకుదాహరణములు చూపబడుచున్నవి. కింశులకాగిరిః, అఞ్జనాగిరిః॥

1045. వలే, 6–3–118. (దీర్ఘః, సంజ్ఞాయామ్)

వలప్రత్యయేపరే దీర్ఘః స్యాత్సంజ్ఞాయామ్। కృషీవలః॥

1045. వల (చ్) ప్రత్యయముపరమైనపుడు సంజ్ఞావిషయమున ప్రకృతికి దీర్ఘమగును. ఉదా:—కృషీవలః (కృషి+వలః) వ్యవసాయము గలవాడనునర్థమందు "రజఃకృష్యాసుతిపరిషదోవలచ్" (5–2–112) అను సూ. చే కృషిశబ్దము కలదె మతుబర్థమున వలచ్ప్రత్యయము విధింపబడెను. ఇట్లే ఆసుతీవలః అనునదివిశెలియునది.

వివ :— ఈసూత్రములోనికి యథోపదిష్టమ్ అనుపదమునకనువృత్తిచేయు టవలననిచట వలశబ్దముచే ప్రత్యయమునకే గ్రహణముగాని "వల" అనుధాతువు నకు గ్రహణగలుగదు. సంజ్ఞగానందున షట్త్రవలః ఇత్యాదులలో దీర్ఘము ప్రవర్తించదు.

1046. మతౌ బహ్వచోఽ*నజిరాదీనామ్. 6-3-119. మతౌ, బహ్వచః, అనజిరాదీనామ్, (దీర్ఘః, సంజ్ఞాయామ్)

అమరావతీ। అనజిరాదీనాం కిమ్। అజిరవతీ। బహ్వచః కిమ్। వ్రీహిమతీ। సంజ్ఞాయామిత్యేవ। నేహ। వలయవతీ॥

1046. మతుప్ప్రత్యయముపరమైనపుడు సంజ్ఞావిషయమున అజిరాదుల కంటెభిన్నము బహ్వచ్కమునగు ప్రకృతికి దీర్ఘమగును. ఉదా :— అమరావతీ. స్వర్గమునకుసంజ్ఞ, అమరులుగలదనునర్థమునఅమరశబ్దముకంటె మతుప్ప్రత్యయము. ప్రత్యయములోని మకారమునకు వకారాదేశమగును. అజిరవతీ. ఇచట దీర్ఘవారణమునకై అజిరాదులకు నిషేధమావశ్యకము. వ్రీహిమతీ. వ్రీహిశబ్దము బహ్వచ్కముగానందున దీర్ఘము వారితమగును. సంజ్ఞగానట్టి వలయవతి అనుచోట దీర్ఘనివృత్తికై సంజ్ఞాయామనుదానికి యనువృత్తియావశ్యకము.

1047. ** శరాదీనాం చ. 6-3-120. (దీర్ఘః, మతౌ, సంజ్ఞాయామ్)

శరావతీ॥

1347. శరాదిగణపఠితములకు మతుప్ప్రత్యయముపరమగునపుడు సంజ్ఞావిషయమున దీర్ఘమగును. శరావతి (నదీవిశేషము) బహ్వచ్కముగానట్టిప్రకృతి కని దీర్ఘముకొఱకీసూత్రమారంభింపబడెనని గ్రహించునది.

వివ :— "వలే" మొదలగునీమూడుసూత్రములు సమాసవిషయకములు గాక ప్రత్యయవిషయకములైనను ప్రకరణశుద్ధి (పూర్తి) కొఱకు సమాసాశ్రయ విధిప్రకరణమున వ్యాఖ్యాతములైనవని యూహించునది.

1048. ఇకో వహేఽపీలోః 6-3-121. ఇకః, వహే, అపీలోః॥ (దీర్ఘః)

ఇగన్తస్య దీర్ఘః స్యాద్వహే। ఋషీవహమ్। కపీవహమ్। ఇకః కిమ్। పిణ్డవహమ్। అపీలోః కిమ్। పీలువహమ్। వా॥ అపీల్వాదీనామితి వాచ్యమ్। దారువహమ్॥

---

* అజిర ఖదిర పులిన హంస కారండవ చక్రవాక ఇత్యజిరాదిః॥

** శర వంశ ధూమ అహి కపి మణి ముని శుచి హను ఇతిశరాదిః॥

1048. ఉత్తరపదాధికారమువలన పూర్వపదమునకాక్షేపము గల్గును. పీలుశబ్దముకంటెభిన్నమగు ఇగన్తపూర్వపదమునకు వహశబ్దముత్తరపదమగునపుడు దీర్ఘమగును. ఉదా:— ఋషీవహమ్. కపీవహమ్. పిణ్డవహమనుచోట దీర్ఘనివృత్తికై ఇకఃఅనునదావశ్యకము. అపీలోః అనుటచే పీలువహమనుచోట దీర్ఘము నివృత్తమగును. వా॥ పీలుశబ్దమునేగాక పీల్వాదులకు దీర్ఘనిషేధమును చెప్పవలయును. దారువహమ్. పీల్వాదిగణమాకృతిగణమని తెలియునది.

1049. ఉపసర్గస్య ఘఞ్యమనుష్యే బహులమ్. 6-3-122.
ఉపసర్గస్య, ఘఞి. అమనుష్యే, బహులమ్, (దీర్ఘః)

ఉపసర్గస్య బహులం దీర్ఘః స్యాత్ ఘఞన్తేపరే న తు మనుష్యే। పరీపాకః। పరిపాకః।అమనుష్యేకిమ్।నిషాదః॥

1049. ఉపసర్గమునకు ఘఞ్ప్రత్యయాన్తముపరమగునపుడు బహులముగ దీర్ఘమగును, ఉపసర్గముతోగూడినఘఞన్తము మనుష్యుని ప్రతిపాదించునపుడు దీర్ఘము రాదు. ఉదా:— పరీపాకః, పాకః అనునది, పచ్ధాతువునకుఘఞన్తము. నిషాదః, ఈశబ్దము మనుష్యునిబోధించును గానచిట దీర్ఘనివృత్తికై అమనుష్యే అనునదావశ్యకము.

వివ:— అమనుష్యే అనుటచే ద్వారపాలకునిబోధించెడి ప్రతీహారశబ్దమున దీర్ఘమునకు సాధుత్వమెట్లనిన, ద్వారరూపార్థమున ప్రతీహారశబ్దము సిద్ధమగును గాన "తాత్స్థ్యాత్తాచ్ఛబ్ద్యమ్" (తనయందుండువస్తువుతనునుబోధించెడిశబ్దముచే వ్యవహరింపబడును) అనున్యాయముచే ద్వారమునందుండువానియందునాశబ్దములక్షణచే సాధువగును. ద్వారపాలకునిబోధించునపుడుపసర్గమునకు దీర్ఘము ప్రామాణికముగాదని కొందఱియాశయము.

1050. ఇకః కాశే. 6-3-123. ఇకః, కాశే, (ఉపసర్గస్య, దీర్ఘః)

ఇగన్తస్యోపసర్గస్య దీర్ఘః స్యాత్కాశే। వీకాశః। నీకాశః। ఇకః కిమ్। ప్రకాశః॥

1050. ఇగన్తమగునుపసర్గమునకు కాశశబ్దముపరమైనపుడు దీర్ఘమగును. వీకాశః (వి+కాశః) ప్రకాశః అనుచోట దీర్ఘమునువారించుటకై ఇగన్తమునకే దీర్ఘమనవలయును.

1051. అష్టనస్సంజ్ఞాయామ్. 6-3-125. అష్టనః, సంజ్ఞాయామ్ (దీర్ఘః)

ఉత్తరపదే దీర్ఘః। అష్టాపదమ్। సంజ్ఞాయాం కిమ్। అష్టపుత్రః॥

1051. అష్టన్‌శబ్దమునకు త్తరపదముపరమగునపుడు సంజ్ఞావిషయమున దీర్ఘమగును. ఉదా:— అష్టాపదమ్. ఇది సువర్ణమునకుసంజ్ఞ. అష్టపుత్రః (అష్టౌ పుత్రా యస్య) ఇది సంజ్ఞగానందుననిచట దీర్ఘము నివృత్తమగును.

1052. చితేః కపి 6-3-127, చితేః, కపి, (దీర్ఘః)

ఏకచితీకః॥

1052. చితిశబ్దమునకు కప్ప్రత్యయముపరమగునపుడు దీర్ఘమగును. ఏకచితీకః (ఏకాచితిర్యస్య) ఏకచితిశబ్దముకంటె "శేషాద్విభాషా" అను సూ. చే కప్ప్రత్యయమునుచేసిన, ఏకచితీకః అను సిద్ధమగును.

1053. నరే సంజ్ఞాయామ్. 6-3-129. నరే, సంజ్ఞాయామ్, (విశ్వస్య, దీర్ఘః)

విశ్వానరః॥

1053. విశ్వశబ్దమునకు నరశబ్దము త్తరపదమగునపుడు సంజ్ఞయందు దీర్ఘమగును. విశ్వానరః॥

1054. మిత్రే చర్షౌ. 6-3-130. మిత్రే, చ, ఋషౌ। (విశ్వస్య, దీర్ఘః)

విశ్వామిత్రః। ఋషౌ కిమ్। విశ్వమిత్రో మాణవకః, వా॥ శునో దన్తదంష్ట్రాకర్ణకున్దవరాహపుచ్ఛపదేషు దీర్ఘో వాచ్యః। శ్వాదన్తః ఇత్యాది॥

1054. సముదాయముచే ఋషి బోధ్యుడగుచుండ మిత్రశబ్దము త్తరపదమగునపుడు విశ్వశబ్దమునకు దీర్ఘమగును. ఉదా:— విశ్వామిత్రః. ఈపేరుగల ఋషి. విశ్వమిత్రః. ఈపేరుగలబ్రహ్మచారి. ఇది ఋషిబోధకముగానందునవిచట దీర్ఘమును వారించుటకై సూత్రమున ఋషౌ అనునదావశ్యకము. వా॥ శ్వన్‌శబ్దమునకు దన్త దంష్ట్రా కర్ణ కున్ద వరాహ పుచ్ఛపద ఈశబ్దములు పరమగునపుడు దీర్ఘమును చెప్పవలయును. ఉదా:— శ్వాదన్తః (శునో దన్తః) శ్వాదంష్ట్రా (శునో దంష్ట్రా) శ్వాకర్ణః ఇత్యాదు లూహ్యంబులు.

వివ:— వార్తికమున దంష్ట్రాశబ్దమును దీర్ఘాన్తముగపఠించి తత్పురుషాది సమాసములందు దీర్ఘమగునని కొందఱు చెప్పిరి. మఱికొందఱు వార్తికమున హ్రస్వాన్తమునుపఠించి శ్వాదంష్ట్రః అనుబహువ్రీహిందే దీర్ఘమగునవిచెప్పిరి. బహువ్రీహిలో దంష్ట్రాశబ్దమునకు "గోస్త్రియోః" (660) సూ. చే హ్రస్వమగును.

1055. ప్రనిరన్తఃశరేక్షుప్లక్షామ్రకార్ష్యఖదిరపీయూక్షాభ్యోఽసంజ్ఞాయామపి. 8-4-5. ప్రనిః........క్షాభ్యః, అసంజ్ఞాయామ్, అపి, (వనమ్, రషాభ్యామ్, నః, ణః)

ఏభ్యో వనస్య ణత్వం స్యాత్। ప్రవణమ్। కార్ష్యవణమ్।
ఇహ షాత్పరత్వాణ్ణత్వమ్॥

1055. ప్ర నిర్ అన్తర్ శర ఇక్షు ప్లక్ష ఆమ్ర కార్ష్య ఖదిర పీయూక్షా లీనికంటెపరమగు వనశబ్దముయొక్క నకారమునకు సంజ్ఞయందునసంజ్ఞయందును ణాదేశమగును. ఉదా:—ప్రవణమ్। కార్ష్యవణమ్ అనుచోట నకారము, షకారము కంటె పరమగుటచేణత్వవిమయ్యెను. సూత్రమందు తాలవ్యమగుశవర్ణముతోగూడిన కార్శ్యశబ్దమును కొందఱు పఠించిరి. అపుడు ణత్వనిమిత్తములేనందున ణత్వము రాకుండును. కావున నాపాఠమప్రామాణికము. ఈవిషయమును "ఇహ షాత్పర త్వాణ్ణత్వమ్" అనుగ్రన్థముచే దీక్షితులు సూచించెను. నిర్వణమ్, అన్తర్వణమ్, ఇత్యాదులుదాహరణములు.

విప:—అపిశబ్దముచే నసంజ్ఞయందుసీసూత్రము ప్రవర్తించును. "వనంపు రగా" సూత్రము నియమార్థమగుటచే సంజ్ఞయందు ప్రవణమిత్యాదులతో ణత్వ మప్రాప్తమగుటచేతను, సంజ్ఞాకానపుడు ప్రవణమిత్యాదులలో "పూర్వపదాత్" (౮-4-౩) అను సూ. చే ణత్వమురాకుండుటచేతనీసూత్రము ణత్వముకొఱకారం భించబడెను. శరవణమ్ అనుచోట శరశబ్దమోషధివాచక మగుటచేను త్తరసూత్ర మువలన ణత్వవికల్పము ప్రాప్తమగుచుండ నిత్యణత్వముకొఱకీసూత్రమున శరప దము గ్రహింపబడెను.

1056. విభాషౌషధివనస్పతిభ్యః. 8-4-6. విభాషా, ఓషధి వనస్పతిభ్యః, (వనమ్, రషాభ్యామ్, నః, ణః)

ఏభ్యో వనస్య ణత్వం వా స్యాత్। దూర్వావణమ్। దూర్వావనమ్। శిరీషవణమ్। శిరీషవనమ్। 1 వా॥ ద్వ్యచ్ త్ర్యజ్భ్యామేవ। నేహ, దేవదారువనమ్। 2 వా॥ * ఇరికాదిభ్యః ప్రతిషేధో వక్తవ్యః। నేహ। ఇరికావనమ్। మిరికావనమ్॥

1056. ఇచటనోషధిశబ్దమునకు ఫలపాకాన్తములగు దూర్వాదులర్థము. (ఫలించినతోడనే నశించునవి) వనస్పతిశబ్దమునకిచట వృక్షమాత్రమర్థము. ఓష ధివాచకములకంటె వృక్షవాచకములకంటెను పరమగు వనశబ్దముయొక్క నకార మునకు (రేఫషకారములకంటెపరమయినపుడు) వికల్పముగ ణకారాదేశమగును. ఓషధివాచకములకుదాహరణము. దూర్వావణమ్. దూర్వావనమ్. వనస్పతివాచకములకు, శిరీషవణమ్. శిరీషవనమ్. 1 వా॥ ఓషధివనస్పతివాచకములు రెండచ్చులుగలవిగాని మూడచ్చులుగలవిగాని అయినపుడే యీసూత్రము ప్రవర్తించునని చెప్పవలయును. ఇట్లుచెప్పుటచే దేవదారువనమనుచోట ణత్వము నివృత్తమగును. 2 వా॥ ఇరికాదిగణ

---

* ఇరికా మిరికా తిమిరా ఇతీరికాదిరాకృతిగణః॥

పరితములకంటెపరమగు వనశబ్దములోనినకారమునకు ణత్వనిషేధమును జెప్పవలయును. ఇరికావనమ్. మిరికావనమ్॥

వివ:—ఈసూత్రము వ్యవస్థితవిభాషయనుటవలననిచటవార్తిక ద్వయము సిద్ధమగుననితెలియునది. పుష్పములు ఫలములుగలవి వానస్పత్యములనియు, పుష్పములులేకయే ఫలముగలవి వనస్పతులనియునమరావి కోశములందుజెప్పబడెను. పుష్పములుఫలములుగలదగుటచే శిరీషము వనస్పతిగాదు. శిరీషవణమనునదెట్లు దాహరింపబడెనను శంకకలుగును. కాని "లుపి యుక్తవత్" (1-2-51) సూత్రభాష్యమందు శిరీషము వనస్పతిశబ్దవాచ్యమగునని సూచించుటచే పైశజ్కా నివృత్తమగును. కావుననీసూత్రములోనివనస్పతిశబ్దము వృక్షమాత్రోపలక్షకమగునని గ్రహించునది.

1057. వాహనమాహితాత్. 8-4-8. వాహనమ్, ఆహితాత్।
(రషాభ్యాం, నః, ణః)

ఆరోప్య యదుహ్యతే తద్వాచిస్థాన్నిమిత్తాత్పరస్య వాహననకారస్య ణత్వం స్యాత్। ఇక్షువాహణమ్। ఆహితాత్కిమ్। ఇంద్రవాహనమ్। ఇన్ద్రిస్వామికంవాహనమిత్యర్థః వహతేర్ల్యుటి వృద్ధిరిహైవ సూత్రే నిపాతనాత్॥

1057. ఆహితవాచకమగు పూర్వపదమందుండు రేఫషకారములకంటె పరమగువాహనశబ్దనకారమునకుణకారాదేశమగును శకటాదివాహనమందు స్వయముగ నధిష్ఠించుటకసమర్థమైనదగుటచే నితరులవలన వాహనమందుంచబడునచేతనముగాని తత్సదృశముగాని యగువస్తువు, ఆహితపదవాచ్యమగును. అట్టివస్తువును బోధించునది యాహితవాచకమగును. ఇక్షుశరాదిశబ్దములట్టివియగును. ఉదా:—ఇక్షువాహణమ్। శరవాహణమ్। ఇన్ద్రవాహనమనుచోట ణత్వవారణమునకై ఆహితాత్ అనునదియావశ్యకమగును. ఇన్ద్రునియొక్కవాహనమని ఇన్ద్రవాహనమనుదానికర్థము. వహధాతువుకంటెల్యుట్ప్రత్యయమునుచేసిన, వహనఅని యగును. ఈసూత్రమున వాహనమనునిపాతనమువలన వహనశబ్దమందు వృద్ధియగును. ఇట్లువాహనశబ్దము సాధువగును.

1058. పానం దేశే. 8-4-9. పానమ్, దేశే, (రషాభ్యాం, నః, ణః,)

పూర్వపదస్థాన్నిమిత్తాత్పరస్య పానస్య నస్య ణత్వం స్యాత్ దేశే గమ్యే। క్షీరం పానం యేషాం తే క్షీరపాణాః ఉశీనరాః। సురాపాణాః। ప్రాచ్యాః। పీయతే ఇతిపానమ్। కర్మణి ల్యుట్॥

1058. దేశశబ్దము దేశవాస్తవ్యబోధకము. పూర్వపదమందుండు రేఫష కారములకంటెపరమగు పానశబ్దావయవయనకారమునకు సముదాయముచే, దేశ వాసులు బోధ్యులగుచుండ ణకారదేశమగును. క్షీరపాణాః (క్షీరం పానం యేషాం) క్షీరములు పేయముగగల నుశీరదేశవాసులనియర్థము. సురాపాణాః। ప్రాగ్దేశ వాసులు. పాధాతువుకంటె కర్మార్థమున ల్యుట్ప్రత్యయముచేసిన, పానమను రూపము సిద్ధమగును. "కృత్యల్యుటోబహులమ్" అనుసూత్రమందు బహులగ్రహణ మువలన కర్మార్థకల్యుట్ప్రత్యయమిచట సాధువగును. ఇట్లు పానశబ్దమునకు త్రాగబడువస్తువనునర్థము లభ్యమగును. దాక్షిపానమ్ (దాక్షీణాం పానమ్) ఇచట ణత్వవారణమునకై దేశే అనునదావశ్యకమని గ్రహించునది ఇచటదేశ వాసులు ప్రతీయమానులుగారు.

1059. వా భావకరణయోః. 8-4-10. వా, భావకరణయోః, రషాభ్యాం, నః, ణః)

పానస్యేత్యేవ। క్షీరపానమ్। క్షీరపాణమ్। వా॥ * గిరి నద్యాదీనాం వా। గిరినదీ। గిరిణదీ। చక్రనితమ్బా। చక్రణి తమ్బా॥

1059. భావార్థమునగాని కరణార్థమునగాని విధింపబడు ల్యుట్ప్రత్యయ ముచే సిద్ధమగుపానశబ్దముయొక్క నకారమునకు పూర్వపదమందలి రేఫషకార ములకంటెపరమగునపుడు ణకారాదేశము వికల్పముగనగును. క్షీరపాణమ్. క్షీర పానమ్ (పీయతేఽనేనేతి పానం. క్షీరస్య పానమ్) కరణల్యుడన్తము. భావల్యు డన్తమునకును వ్యుత్పత్తిభేదముచే (పీతిః పానం; క్షీరస్యపానమ్) నిదియుదాహర ణమగును. వా॥ గిరినదీ మొదలగుశబ్దములయొక్క నకారమునకు ణత్వమును వికల్పముగ జెప్పవలయును. సంజ్ఞయందు "పూర్వపదాత్ అను సూ. చే ణత్వము ప్రాప్తమగుచుండ నసంజ్ఞయందప్రాప్తమగుచుండ వికల్పముగణత్వమును విధించు నీవార్తికము ప్రాప్తాప్రాప్తవిభాషయగును. ఉదా:—గిరిణదీ. గిరినదీ। చక్రనితమ్బా। చక్రణితమ్బా॥

1060. ప్రాతిపదికాన్తనుమ్విభక్తిషు చ. 8-4-11. (రషాభ్యాం, నః, ణః, వా)

పూర్వపదస్థాన్నిమిత్తాత్పరస్య ఏషు స్థితస్య నస్య ణో వా స్యాత్। ప్రాతిపదికాన్తే, మాషవాపిణౌ। నుమి, వ్రీహి వాపాణి। విభక్తౌ, మాషవాపేణ। పక్షే మాషవాపినావిత్యాది। ఉత్తరపదం యత్ప్రాతిపదికం తదన్తస్యైవ ణత్వమ్। నేహ।

* గిరినదీ గిరినఖ గిరినద్ధ గిరినితంబ చక్రనదీ చక్రనితంబ తూర్యమాన మాషోన ఆర్గయావ ఇతిగిరి నద్యాదిరాకృతిగణః॥

గర్గాణాం భగినీ గర్గభగినీ। అతఏవ నుమ్గ్రహణం కృతమ్। అఙ్గస్య నుమ్విధానాత్తద్భక్తోహి నుమ్, నతూత్తర పదస్య। కించ ప్రహిణ్వన్నిత్యాదౌ హివేర్నుమో ణత్వార్థ మపి నుమ్గ్రహణమ్। ప్రేన్వనమిత్యాదౌ తు క్షుభ్నాది త్వాన్న। వా॥ యువాదేర్న। రమ్యయూనా। పరిపక్వాని। ఏకాజుత్తరపదే ణః। నిత్యమిత్యుక్తమ్। వృత్రహణౌ। హరిం మానయతీతి హరిమాణీ। నుమి, క్షీరపాణి। విభక్తౌ, క్షీరపేణ। రమ్యవిణా॥

1060. ప్రాతిపదికాన్త నుమ్ విభక్తిశబ్దములకు ద్వన్ద్వము. ఉత్తరపద మనునది యధికారలబ్ధము. పూర్వపదమాక్షేపలబ్ధమగును. పూర్వపదస్థములగు రేఫష కారములకంటెపరమై యుత్తరపదమగుప్రాతిపదికము యొక్కతుదినుండునదిగాని, నుమాగమసంబన్ధిగాని, విభక్తిస్థముగాని యగునకారమునకు ణకారాదేశము వికల్ప ముగనగును. ప్రాతిపదికాన్తణకారమునకుదాహరణము. మాషవాపిణౌ। ఇచట వాపిన్ అనునది యుత్తరపదమగుప్రాతిపదికము. నుమ్సంబన్ధినకారమునకుదాహర ణము. వ్రీహివాపాణి। వ్రీహివాపశబ్దము (నపుంసకము) నకు ప్రథమాబహువచ నాన్తము. "నపుంసకస్య" (315) అను సూ. చే నుమాగమము. విభక్తిస్థనకార మున కుదాహరణము. మాషవాపేణ. మాషవాపశబ్దమునకు తృతీయైకవచనము. (మాషవాప+ఇన) ణత్వాభావపక్షమందు మాషవాపినౌ। ఇత్యాదులగును.

గర్గభగినీ (గర్గాణాం భగినీ) ఇచట ణత్వవారణార్థముత్తరపదముప్రాతి పదికమునకు విశేషణమనవలయును. ఉత్తరపదశబ్దము సమాసచరమావయవమందు రూఢము. ఇచట భగినీశబ్దముత్తరపదమగుప్రాతిపదికము. ఇచట నకారము ప్రాతి పదికాన్తము గాదు. ఇట్లర్థముచెప్పుటలో శిష్టులవ్యాఖ్యానమే శరణము. ఈవిషయ మున ప్రాచీనులుచెప్పిన జ్ఞాపకమును "అతఏవనుమ్గ్రహణంజ్ఞాపక"మ్మనుగ్రన్థ ముచే ప్రదర్శించుచున్నాడు. ఉత్తరపదమనునది ప్రాతిపదికవిశేషణము గనుకనే సూత్రమున నుమ్గ్రహణము సార్థకమగును. వ్రీహివాపాణి అనుచోట ణత్వార్థము నుమ్పదము గ్రహింపబడినది. ప్రాతిపదికము నవిశేషణముగానిచోనిచట "మాష వాపాన్" అనునుమాగమసహితసమాసము ప్రాతిపదికమగును గానప్రాతిపదికాన్త ణకారమగుటచే ణత్వము సిద్ధమగుచుండనీనుమ్గ్రహణమువ్యర్థమగును. ఇట్లు వ్యర్థమై ఉత్తరపదమగుప్రాతిపదికముయొక్క తుదినున్ననకారమునకు ణత్వమగు ననువిషయమున జ్ఞాపకమగును. నుమాగమము అఙ్గమునకు విధింపబడుటచే వఙ్గము నకేయవయవమగును గాని యుత్తరపదమునకు గాదు. ఉత్తరపదమగుప్రాతిపది కము వాప అనునదియే అగును. ఉత్తరపదభూతప్రాతిపదికాన్తమున నకారములేనం దున ణత్వము సిద్ధముగాదు గాననిచట ణత్వార్థము జ్ఞాపనోత్తరమందు నుమ్గ్రహ

ణము సార్థకమగునని ప్రాచీనులయాశయము. "కించేత్యాది" గ్రంథముచే ప్రాచీనులు చెప్పినజ్ఞాపకము సరియైనదిగాదని నిరూపించుచున్నాడు. ప్రహిణ్వన్. ఇది ప్రపూర్వకహివిధాతుప్రకృతికశతృప్రత్యయాన్తము. ధాతువికారేత్సంజ్ఞకమగుటచే నుమాగమమాయెను. ఈయాగమనకారము ప్రాతిపదికాన్తముగానందుననిచట ణత్వార్థమునకును నుమ్గ్రహణమావశ్యకమగును. కావుననీనుమ్గ్రహణము జ్ఞాపకముగా నేరదని దీక్షితాశయము. ప్రేన్వనమ్। ఇది ప్రపూర్వకమగు ఇవిధాతువునకు ల్యుడన్తము. ఇట్టిరూపములను క్షుభ్నాదిగణమున చేర్చుటచే వీనిలో ణత్వము నివృత్తమగును. వా॥ యువాదిగణపఠితములగు శబ్దములనకారమునకు ణత్వప్రతిషేధమును జెప్పవలయును. రమ్యాయూనా. ఇచట నీసూత్రముచే ణత్వము ప్రాప్తమగుచున్నది. పరిపక్వాని. ఇచట "కుమతిచ" (1011) అను సూ.చే ణత్వము ప్రాప్తమగుచున్నది. "ఏకాజుత్తరపదేణః" అను సూత్రమీవరలో వ్యాఖ్యాతమైనను ప్రకరణశుద్ధికై యిచట స్మరింపబడెను. ఈసూత్రము నిత్యణత్వవిధాయకమని యీవరలో చెప్పబడెను. ఈసూత్రమునకుదాహరణములు ప్రదర్శింపబడుచున్నవి. ప్రాతిపదికాన్తనకారమునకు, వృత్రహణౌ (వృత్రం హతవన్తౌ) వృత్రహన్శబ్దము క్విబన్తము. హరిమాణీ। ఇదియును ప్రాతిపదికాన్తణకారమునకే యుదాహరణము. మాన్శబ్దము ణిజన్తమగుమనధాతువునకుక్విబన్తము. హరిశబ్దమునకు మాన్శబ్దముతో సమాసము. పిదపఙీప్ప్రత్యయము.మాన్ అనునదియుత్తరపదమగుటచేణత్వము ప్రవర్తించును. నుమాగమనకారమునకుదాహరణము. క్షీరపాణి. క్షీరపశబ్దమునకు ప్రథమాబహువచనాన్తము. అజన్తలక్షణనుమాగమము. విభక్తిస్థనకారమునకుదా :— క్షీరపేణ. రమ్యవిణా. రమ్యశబ్దమునకు విశబ్దముతో సమాసము. ఇచట "ఆఙోనాస్త్రియామ్" (245) అను సూ. చే నాభావమగుటవలన నకారము విభక్తిస్థమగును.

1061. కుమతి చ. 8-4-13. కుమతి, చ, (రషాభ్యాం, నః, ణః, 1060 సూత్రము)

కవర్గవత్యుత్తరపదే ప్రాగ్వత్। హరికామిణౌ। హరికామాణి। హరికామేణ॥

1061. కవర్గముతోగూడిన యుత్తరపదమందున్నటువంటివి పూర్వపదస్థములగురేఫషకారములకంటె పరమగునట్టివి, ప్రాతిపదికాన్తనుమ్విభక్తిస్థమగునట్టి నకారమునకు ణత్వము నిత్యముగ వచ్చును. క్రమముగనుదాహరణములు. హరికామిణౌ। హరికామిన్శబ్దమునకుప్రథమాద్వివచనాన్తము. హరికామాణి। హరికామశబ్దమునకు నపుంసకమున ప్రథమాబహువచనాన్తము. హరికామేణ। హరికామశబ్దమునకు తృతీయైకవచనాన్తము.

1062. పదవ్యవాయేఽపి. 8-4-38 పదవ్యవాయే, అపి, (నః, ణః)

పదేన వ్యవధానేఽపి ణత్వం న స్యాత్। మాషకుమ్భవాపేన। చతురఙ్గయోగేన। వా॥అతద్ధితఇతి వాచ్యమ్। ఆర్ద్రగోమయేణ. శుష్కగోమయేణ॥

1062. పూర్వపదస్థములగు రేఫషకారములకును, నకారమునకును మధ్య నొకపదముతో వ్యవధానమున్నపుడు నకారమునకు ణత్వము రాదు. మాషకుమ్భవాపేన (మాషాణాం కుమ్భః, తస్య వాపః) ఇచట షకారమునకును విభక్తిస్థనకారమునకును కుమ్భపదము వ్యవధాయకము. చదురఙ్గయోగేన (చత్వార్యఙ్గాన్యస్య చతురఙ్గః తేన యోగశ్చతురఙ్గయోగః, తేన)ఇచట నిమిత్తనిమిత్తులకఙ్గపదము వ్యవధాయకము. "ఉత్తరపదత్వేచ" అనువార్తికముచేనిచటనఙ్గశబ్దమునకు పదసంజ్ఞ చేయునపుడు ప్రత్యయలక్షణములేదనవీలులేదు. ఉత్తరపదమునకు కార్యముచేయునపుడే యానిషేధము ప్రవర్తించుననుటయే యింమలకుగారణము. వా॥ వ్యవధాయకమగుపదమునకు తద్ధితప్రత్యయముపరముగలేనపుడే యీనిషేధము ప్రవర్తించునని చెప్పవలయును. ఆర్ద్రగోమయేణ। శుష్కగోమయేణ। ఇచట గోశబ్దముపదసంజ్ఞకము. దీనికి తద్ధితముగు మయట్ప్రత్యయముపరమగుటవలననిచటనీనిషేధము ప్రవర్తించదు.

1063. కుస్తుమ్బురూణి జాతిః. 6-1-143. కుస్తుమ్బురూణి, జాతిః।

అత్ర సుడ్నిపాత్యతే। కుస్తుమ్బురు ధాన్యాకమ్। క్లీబత్వమతన్త్రమ్। జాతిః కిమ్। కుతుమ్బురూణి। కుత్సితాని తిన్దుకీఫలానీత్యర్థః॥

1063. కుతుమ్బురుశబ్దమున తకారమునకు ధాన్యాకజాతి (ధనియాలు) వాచ్యమగునపుడు సుడాగమమీసూత్రముచే నిపతింపబడును. కుస్తుమ్బురు (కొత్తిమిరి) సూత్రమున నపుంసకలిఙ్గము బహువచనముగూడ వివక్షితముగాదు. కాన పుంలిఙ్గమందు నేకవచనద్వివచనములందును సుడాగమముసాధువగును. కుతుమ్బురూణి. కుత్సితములగుతిన్దుకీఫలములనియర్థము. ధాన్యాకజాతివాచకముగానట్టి యీశబ్దమున సుడాగమనివృత్తికై జాతిః అనునది యావశ్యకము.

1064. అపరస్పరాః క్రియాసాతత్యే 6-1-144. అపరస్పరాః, క్రియాసాతత్యే।

సుణ్ణిపాత్యతే। అపరస్పరాః సార్థా గచ్ఛన్తి। సతత మవిచ్ఛేదేన గచ్ఛన్తీత్యర్థః। క్రియేతి కిమ్। అపరపరా గచ్ఛన్తి। అపరే చ పరే చ సకృదేవ గచ్ఛన్తీత్యర్థః॥

1064. క్రియాసాతత్యే=క్రియాయాః సాతత్యమ్, తస్మిన్. గమనాది క్రియయొక్క, సాతత్యము=ప్రబన్ధము. (విచ్ఛేదములేకుండుట) గమ్యమానమగు నపుడు, అపరస్పరాశబ్దమున సుడాగమము నిపతింపబడుననియర్థము. ఉదా :— అపరస్పరాః (సార్థాగచ్ఛన్తి) అపరులు పరులునెల్లపుడునెడతెగకుండ వెళ్లుచున్నారని యర్థము. అపరపరాః (గచ్ఛన్తి) అపరులు పరులునొక్కమారే వెళ్ళుచున్నారని యర్థము. ఇచట గమనమునకు సాతత్యము ప్రతీయమానము గాదు. కావుననిచట సుడాగమనివృత్తికై సూత్రమున క్రియాసాతత్యే అనునది యావశ్యకమగును.

1065. గోష్పదం సేవితాసేవితప్రమాణేషు. 6-1-145.

గోష్పదమ్, సేవితాసేవితప్రమాణేషు॥

సుట్ సస్య షత్వం చ నిపాత్యతే। గావః పద్యన్తేఽస్మిన్ దేశే స గోభిస్సేవితో గోష్పదః। అసేవితే, అగోష్పదాన్యరణ్యాని। ప్రమాణే, గోష్పదమాత్రం క్షేత్రమ్। సేవితేత్యాది కిమ్। గోః పదమ్, గోపదమ్।

1065. సేవితాసేవితప్రమాణశబ్దములకు ద్వన్ద్వము. సేవింపబడునది సేవింపబడనది ప్రమాణము, ఈయర్థములందు గోపదశబ్దమున పకారమునకు సుడాగమము, దీనికి షత్వము నిపతింపబడునని సూత్రార్థము. క్రమముగనుదాహరణములు. గోష్పదః। ఏప్రదేశమున గోవులు తిరుగుచుండునో యాస్థలము గోవులచే సేవింపబడునదై గోష్పదమనబడును. అసేవితమనునది బహుప్రీహి, గాననేప్రదేశమున గోవులసంచారమొకసారియైననుండదో యట్టిప్రదేశము బోధ్యమగునపుడు సుడాగమషత్వములగును. గోపదశబ్దము. నఞ్పూర్వకమగునపుడే యిట్టియర్థప్రతీతిగల్గును గాన నఞ్పూర్వకమగు గోష్పదశబ్దమే దీనికుదాహరణమగును. అగోష్పదాని. గోసంచారశూన్యములగునరణ్యాదులర్థము. గోష్పదమాత్రమ్ (క్షేత్రము) అల్పప్రమాణముగలభూమి. క్షేత్రమందలి యల్పప్రమాణత్వమీశబ్దముచే బోధింపబడును. కావున క్షేత్రము గోష్పదముకంటెనధికమయినదైననుదోషము లేదు. గోపదమ్ (గోః పదమ్) గోవుయొక్కపాదమనియర్థము. ఇచట సుడాగమవారణమునకై సేవితేత్యాదివిశేషణమావశ్యకము.

1066. ఆస్పదం ప్రతిష్ఠాయామ్. 6-1-114. ఆస్పదమ్, ప్రతిష్ఠాయామ్॥

ఆత్మయాపనాయ స్థానే సుణ్ణిపాత్యతే। ఆస్పదమ్।
ప్రేతి కిమ్। ఆపదాపదమ్॥ (ఆపదమ్)

1066। కాలమునుగడుపుటకగు స్థానము ప్రతిష్ఠాపదమునకర్థము. అట్టి స్థానరూపార్థమున ఆస్పదశబ్దమందు సుడాగమము నిపతింపబడునని సూత్రార్థము. ఆస్పదమ్ (అనేన లబ్ధమ్) కాలమునుగడుపుటకైన స్థానము వీనిచే పొందబడెనని యర్థము ఇట్టియర్థము బోధ్యముగానపుడు ఆపదమనుచోటనాగమనివృత్తికై ప్రతిష్ఠాయామనువిశేషణమావశ్యకము. "ఆపదాపదమ్" అనుపాఠము, చాలపుస్తకములందగపడుచున్నది. అచట ఆపత్, ఆపదమ్ అనిఛేదము. సుడాగమరహితమగు నాపదశబ్దమున కాపత్తని యర్థము. ఆపదమనుపాఠమున, ఆఙ్ఉపసర్గ, పదశబ్దముతో నవ్యయీభావము (ఆ, పదాత్)

1067. ఆశ్చర్యమనిత్యే. 6-1-147. ఆశ్చర్యమ్, అనిత్యే॥

అద్భుతే సుట్। ఆశ్చర్యం యది స భుఞ్జీత। అనిత్యే
కిమ్। ఆచర్యం కర్మ శోభనమ్॥

1067. అనిత్యమనునది యెల్లప్పుడుండునది గానందున నాశ్చర్యమును గలుగజేయును గానననిత్యశబ్దము లక్షణచేనద్భుతార్థమును బోధించును. అద్భుతరూపార్థము గమ్యమానమైనపుడాచర్యశబ్దమందు సుడాగమము నిపతింపబడునని సూత్రార్థము. ఆశ్చర్యమ్ (యది స భుఞ్జీత) వాడు భోజనము చేసినట్లయిననది యద్భుతమనియర్థము. ఆచర్యమ్ (కర్మ శోభనమ్) సత్కార్మచే యదగినదని యర్థము. ఇచట సుడాగమనివృత్తికై అనిత్యమనునది యావశ్యకము.

1068. వర్చస్కేఽవస్కరః. 6-1-148. వర్చస్కే, అవస్కరః॥

కుత్సితం వర్చో వర్చస్కమ్ అన్నమలమ్ తస్మిన్,
సుట్। అవకీర్యత ఇత్యవస్కరః। వర్చస్కే కిమ్। అవకరః॥

1068. వర్చస్కశబ్దము కుత్సితార్థకప్రత్యయాన్తము. వర్చస్కశబ్దమున కన్నమలము (పురీషము) అర్థము. ఇది బోధ్యమైనపుడవకరశబ్దమున సుడాగమము నిపతింపబడును. అవస్కరః। అవపూర్వకకృధాతువునకు కర్మార్థకకృత్ప్రత్యయమువలననవకరః అనురూపమగును. వర్చస్కే అను నదిలేనిచో, పురీషార్థమును బోధింపనట్టి అవకరశబ్దమున సుడాగమము ప్రసక్తమయ్యేడిని.

1069. అపస్కరో రథాఙ్గమ్. 6-1-149. అపస్కరః। రథాఙ్గమ్॥

అపకరోఽన్యః॥

1069. రథాఙ్గమన చక్రము. ఇది యర్థమగునపుడు అపస్కరః అనునది సుడాగమసహితమై నిపతింపబడును. "స్యాద్రథాఙ్గమపస్కరః" అని యమరము. చక్రముకంటెనితరము బోధ్యమగునపుడు అపకరః అని యగును.

1070. విష్కిరశ్శకునిర్వికిరో వా. 6-1-150. విష్కిరః, శకునిః, వికిరః, వా॥

పక్షే వికిరః। వావచనేనైవ సుడ్వికల్పే సిద్ధే వికిరగ్రహణం తస్యాపి శకునేరన్యత్ర ప్రయోగో మాభూదితి వృత్తిస్తన్న। భాష్యవిరోధాత్॥

1070. పక్షియర్థమగునపుడు విష్కిరశబ్దమున సుడాగమము వికల్పముగ నిపతింపబడును. విష్కిరః। పక్షియనునర్థమున సుడాగమము రానపుడు వికిరః అనియగును. "విష్కిరశ్శకునౌ వా" అని సూత్రమునురచించినను పైజెప్పబడిన యర్థము సిద్ధమగుచుండ సూత్రమున వికిరగ్రహణము, పక్షిరూపార్థమందే వికిరపదముగూడ సాధువగుననియు నితరార్థమున నీపదము సాధువగుననియును బోధించునని, కాశికావృత్తియందు చెప్పబడెను. అర్థాన్తరమందును వికిరపదము సాధువగునని మహాభాష్యమువలన స్పష్టమగుటచే వృత్త్యుక్తము భాష్యవిరుద్ధమగును గాననది గ్రాహ్యము గాదు. అర్థాన్తరమందు వికిరశబ్దప్రయోగమగపడుచున్నది. "వికిరం వైశ్వదైవికమ్".

1071. ప్రతిష్కశశ్చ కశేః. 6-1-152. ప్రతిష్కశః. చ, కశేః॥

కశగతిశాసనయోరిత్యస్య ప్రతిపూర్వస్య పచాద్యచి సుణ్ణిపాత్యతే, షత్వఞ్చ। సహాయః పురోయాయీ వా ప్రతిష్కశ ఇత్యుచ్యతే। కశేః కిమ్। ప్రతిగతః కశాం ప్రతికశోఽశ్వః। యద్యపి కశేరేవ కశా, తథాపి కశేరితిధాతోర్గ్రహణముపసర్గస్య ప్రతేర్గ్రహణార్థమ్। తేన ధాత్వన్తరోపసర్గాన్న॥

1071. ప్రతిఅనుఉపసర్గముపూర్వమందుగల కశ (గతిశాసనయోః) ధాతువునకు పచాద్యచ్ప్రత్యయమువలన ప్రతికశః అనురూపమగును. ఇట్లు సిద్ధమగునీ రూపమున సుడాగమషత్వములు నిపతింపబడును. ఈశబ్దమునకు సహాయుడు లేక ముందునడచువాడని యర్థము. ప్రతికశః (ప్రతిగతః కశామ్) దీనికశ్వమర్థము. ఇచట సుడాగమవారణార్థము కశేః, అనునది యావశ్యకము. కశాశబ్దము(కొరడా) గూడ కశధాతువువలన సిద్ధమైనదే, కాని సూత్రగృహీతమగు కశేః అనునది కశ

ధాత్వర్థమును గురించియుపసర్గమగు ప్రతిఅనునది పూర్వముననున్నపుడే సుడాగమమునకు విషయమగునని బోధించును. "యత్క్రియాయుక్తాః ప్రాదయస్తం ప్రత్యేవ గత్యుపసర్గసంజ్ఞాః" అనిచెప్పబడుటచే ప్రతికశః అనుచోట ప్రతి అనునది గమ్ ధాత్వర్థమునుగురించి యుపసర్గమగును, గానికశధాత్వర్థమునుగురించిగాదు. కావున దోషము వారితమగునని సమాధానాశయము.

1072. ప్రస్కణ్వహరిశ్చన్ద్రావృషీ. 6-1-153. ప్రస్కణ్వ హరిశ్చన్ద్రౌ, ఋషీ॥

హరిశ్చన్ద్రగ్రహణమమన్త్రార్థమ్। ఋషిఇతి కిమ్। ప్రకణ్వో దేశః। హరిచంద్రో మాణవకః॥

1072. ఋషిరూపార్థమున ప్రస్కణ్వహరిశ్చంద్రశబ్దములందు సుడాగమము నిపతింపబడును. ప్రస్కణ్వః. హరిశ్చన్ద్రః. ఇవి ఋషులపేరు. "లోకే", "ఛన్దసి" మొదలగుపదములతోరహితములగు సూత్రములు లోకవేదసాధారణములగును గాననీసూత్రము వేదమందును ప్రవర్తించును. కాని యచటిహరిశ్చన్ద్రశబ్దగ్రహణముమాత్రము లోకముకొరకేయనిగ్రహింపవలయును. వేదమున "హ్రస్వాచ్చన్ద్రోత్తరపదే మన్త్రే" (6-1-151) సూ. చే హరిశ్చన్ద్రశబ్దమున సుడాగమము సిద్ధమగుట యిందుగారణము. హ్రస్వముకంటె పరమగునపుడు ఉత్తరపదమగుచన్ద్రశబ్దమునకు వేదమున సుడాగమమగునని పై సూత్రమునకర్థము. ప్రకణ్వః = దేశము, హరిచన్ద్రః = ఈపేరుగలబ్రహ్మచారి. ఈయర్థములందు సుడాగమవారణార్థము "ఋషీ" అనునది యావశ్యకమగును.

1073. మస్కరమస్కరిణౌ వేణుపరివ్రాజకయోః. 6-1-154.

మకరశబ్దోఽవ్యుత్పన్నస్తస్య సుడినిశ్చ నిపాత్యతే। వేణ్వితి కిమ్। మకరో గ్రాహః। మకరీ సముద్రః।

1073. మకరశబ్దమవ్యుత్పన్నము (ప్రకృతిప్రత్యయవిభాగశూన్యము) వేణువు (వెదురుకర్ర) అర్థమగునపుడు మకరశబ్దమందు సుడాగమము, సన్యాసియర్థమగునపుడు మకరపదమందినిప్రత్యయము సుడాగమముగూడ, నిపతింపబడునని సూత్రార్థము. మస్కరః। మస్కరీ। ఇవి క్రమముగనుదాహరణములు, సూత్రమున వేణుపరివ్రాజకయోః అనునది లేనియెడల మకరః = మొసలి, మకరీ = సముద్రము, ఈశబ్దములందును సుడాగమము ప్రసక్తమగును.

1074. కాస్తీరాజస్తున్దే నగరే. 6-1-155. కాస్తీరాజస్తున్దే, నగరే॥

ఈషత్తీరమస్యాస్తీతి కాస్తీరం నామ నగరమ్। అజ
స్యేవ తున్దమస్యేతి అజస్తున్దం నామ నగరమ్। నగరే
కిమ్। కాతీరమ్। అజతున్దమ్॥

1074. నగరమభిధేయమగునపుడు కాస్తీరమ్ అజస్తున్దమ్ అనునవి సుడాగమసహితములై నిపతింపబడును. కాస్తీరమ్ (ఈషత్తీరమస్య) అజస్తున్దమ్ (అజస్యేవ తున్దమస్య) ఈరెండును నగరవిశేషవాచకములు. సూత్రమున "నగరే" అనునదిలేనపుడు, కాతీరమ్ (అల్పమగుతీరము ఈషదర్థకకుశబ్దమునకు "ఈషదర్థే" (1036) సూ. చే కాదేశము) అజతున్దమ్ (మేకయొక్క ఉదరము) ఈయర్థములుగల కాతీరాజతున్దశబ్దములందును సుడాగమము ప్రసక్తమగును.

1075. కారస్కరో వృక్షః. 6-1-156. కారస్కరః, వృక్షః॥

కారం కరోతీతి కారస్కరోవృక్షః। అన్యత్ర కారకరః॥
కేచిత్తు కస్కాదిష్విదం పఠన్తి న సూత్రేషు।

1075. వృక్షమనునర్థమందు కారస్కరః అనుచోట సుడాగమమునిపతింపబడును. అర్థాన్తరమున కారకరః అనియగును. కొందఱు "కారస్కరోవృక్షః" అనువచనమును సూత్రములందు పఠింపక కస్కాదిగణమున పఠించిరి.

వివ :— "కేచిత్తు" అనియనుటచేనీమతము గ్రాహ్యముగాదని సూచింపబడెను. కారస్కరశబ్దము పారస్కరాదిగణమున ప్రత్యక్షముగ గాన్పించుటయు "కస్కాదిషుచ" అనుసూత్రము ప్రకరణవశమున విసర్గస్థానమందే సత్వమును విధించునదగుటయునిందు గారణము. కావుననిదిపారస్కరాద్యన్తర్గణసూత్రమని తెలియదగును. ఈవిషయము కొన్ని పుస్తకములందుమాత్రమేయుండెడి "కస్కాదిష్విదమ్" అనుపాఠమునాశ్రయించి వ్రాయబడెను. కాశికావృత్తిపాఠసంవాదము వలనను, మూలసన్దర్భస్వారస్యమువలనను "పారస్కరాదిష్విదంపఠన్తి" అనునది వాస్తవికపాఠమని గ్రహించునది.

1076. * పారస్కరప్రభృతీని చ సంజ్ఞాయామ్. 6-1-157.
పారస్కరప్రభృతీని, చ, సంజ్ఞాయామ్॥

---

* పారస్కరో దేశే కారస్కరో వృక్షః రథస్యానదీ కిష్కుః ప్రమాణమ్ కిష్కిన్ధాగుహా తద్బృహతోః కరపత్యోశ్చోరదేవతయోః సుట్ తలోపశ్చ ప్రాత్తుంపతౌ గవి కర్తరిచ ప్రాయస్య చిత్తిచిత్తయోః ఇతి పారస్కరాదిరాకృతిగణః॥

ఏతాని సముట్కాని నిపాత్యన్తే నామ్ని। పారస్కరః।
కిష్కిన్ధా।గ.సూ. 1 తద్బృహతోః కరపత్యోశ్చోరదేవతయో
స్సుట్తలోపశ్చ। తాత్పూర్వం చ ర్త్వేన దకారో ఽపి బోధ్యః।
తద్బృహతోర్దకారతకారౌ లుప్యేతే। కరపత్యోస్తు సుట్।
చోరదేవతయోరితి సముదాయోపాధిః। తస్కరః। బృహ
స్పతిః। 2గ.సూ. ప్రాయస్య చిత్తిచిత్తయోః। ప్రాయశ్చిత్తిః।
ప్రాయశ్చిత్తమ్। వనస్పతిరిత్యాది। ఆకృతిగణో ఽయమ్॥
ఇతి సమాసాశ్రయవిధయః॥

1076. సంజ్ఞయందు పారస్కరః మొదలగుశబ్దములు (పారస్కరాదిగణ పఠితములు) సుడాగమసహితములుగ నిపతింపబడెను. పారస్కరః. దేశవిశేషమునకు పేరు. కిష్కిన్ధా. వానరసైన్యమునుధరించు సుగ్రీవునిగుహకు పేరు. పారస్కరాదులవయవార్థశూన్యములగురూఢశబ్దములు. 1తచ్ఛబ్దబృహచ్ఛబ్దములకు క్రమముగ కరశబ్దపతిశబ్దములు పరమగునపుడు చోరుడు దేవత అనునర్థమునందు సుడాగమము, తచ్ఛబ్దబృహచ్ఛబ్దములతుదినుండు దకారతకారములకు లోపమునగును. గణసూత్రమున "తలోపశ్చ" అనుచోట తకారమునకుపూర్వముదకారమున్నదనియు, దానికి చర్త్వమువచ్చినదనియును గ్రహింపదగును. ఇట్లు తలోపశ్చఅనుదానికి దకారతకారములకు లోపమనునర్థముసిద్ధమగును. తస్కరః (తద్+కరః= దొంగవాడు) బృహస్పతిః (బృహత్+పతిః=దేవగురువు) 2 ప్రాయశబ్దమునకు చిత్తిచిత్తశబ్దములు పరమగునపుడు సుడాగమమగును. ప్రాయశ్చిత్తిః। ప్రాయశ్చిత్తమ్। వనస్పతిః మొదలగునవి పారస్కరాదిగణపఠితములగనూహించునది. పారస్కరాదిగణమాకృతిగణము. కావున "పరశ్శతాః" (శతాత్పరాః) మొదలగు రూపములందును సుడాగమము సిద్ధమగును. "అధిశ్రయస్త్రీర్ణశతాః పరశ్శతాః" మాఘకావ్యము. శతాత్పరా అనువిగ్రహమున పఞ్చమీతత్పురుషము. రాజదన్తాదిగణపాఠమువలన శతశబ్దమునకు పరనిపాతము. పరాశబ్దమునకు పుంవద్భావము. ఈ సూత్రముచే సుడాగమము. ఇట్లు పరశ్శతాశబ్దము సిద్ధమగునని గ్రహింపదగును.

ఇది సమాసాశ్రయవిధిప్రకరణము.

శ్రీః॥ శ్రీః॥ శ్రీః॥

గద్య :— శ్రీ శ్రీ శ్రీ పూసపాటివంశపయఃపారావారరాకాసుధాకరులును నవితరసాధారణప్రతిభావిశేషవినిర్జితగీష్పతులును సకలకలాపరిపోషకులునగు శ్రీ శ్రీ శ్రీ విజయనగరసంస్థానాధీశ్వరరాజాధిరాజ శ్రీ విజయరామగజపతిమహారాజవర్య సంవర్ధ్యమానుఁడును, కళాప్రపూర్ణులును విద్వదభిమానులును వదాన్యావతంసులు నగు శ్రీ శ్రీ శ్రీ జయపురసంస్థానాధీశ్వర రాజాధిరాజ శ్రీ విక్రమదేవవర్మమహారాజోత్తములయసాధారణకృపకుఁ బాత్రుఁడును, విద్వత్సార్వభౌమ శ్రీ వేఙ్కటసుబ్బరాయసుధీమణి ప్రసాదాసాదితవిద్యాసమఞ్చితుఁడును, శ్రీమదప్పల్లవంశపయోనిధిశీతకిరణులును శ్రీ ఖాశింకోటసంస్థానాస్థానవిద్వాంసులును అద్వైతవేదాన్తశాస్త్రతత్త్వజ్ఞులును సతతహరినామస్మరణపరిపూతాన్తరఙ్గులును శ్రీ బాలాత్రిపురసున్దరీప్రసాదాసాదితాఖణ్డధీవైభవులును అరున్ధతీసమాన శ్రీ వేఙ్కమామ్బాసమఞ్చితవామభాగులునగు సోమేశ్వరశాస్త్రులవారికాత్మజుఁడును, యజుర్వేదాధ్యయనసంపన్నులును సౌజన్యనిధులును శ్రీబాలాత్రిపురసున్దరీప్రసాదపాత్రులునగు శివానీశఙ్కర శ్రీరామ కామేశ్వరశర్మలకుప్రియసోదరుఁడును, శ్రీమేధాదక్షిణామూర్తిప్రసాదోపలబ్ధప్రజ్ఞాపరికలితుఁడును, వ్యాకరణాలఙ్కారవిద్యాప్రవీణుఁడునగు, జోగన్నశాస్త్రిచేవిరచితంబగు వైయాకరణసిద్ధాన్తకౌముదీశరదాగమమున ద్వితీయభాగము సంపూర్ణము.

